## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ప్రథమాంధ్ర మహాపురాణము

ప్రబంధ కథా మూలము

సిద్ధాంతవ్యాసము

డా. జి.వి.సుబ్రహ్మణ్యం



గ్రంథకర్త

డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం

పురాణపురుషా జ్జాతం
యథేదం జగదద్భుతమ్ ।
తథేదం వాఙ్మయం జాతం
పురాణేభ్యో న సంశయః ॥

—నారదీయమహాపురాణము

తర్కింపంగ నశక్య మైన వితతోద్యద్దీప్తిజాలంబుచే
నర్కుం డెట్లు వెలుంగు నట్ల బహుపుణ్యశ్రేణికావ్యాప్తిసం
పర్కస్ఫూర్తి నఘాంధకారము లడంపంజాలి లోకంబున
న్మార్కండేయపురాణరత్న మమరు న్మాంగళ్యసంపాది యై.

— మారన

# ప్రస్తావన

కొందఱు గురువు లుందురు. వారిగురుత్వము శిష్యపరంపర కపారప్రతిష్ఠాకరమై యుండును. కొందఱు శిష్యు లుందురు. వారిశిష్యత్వము గురువుల కఖండకీర్తికారణమై యలరారుచుండును. అట్టి శిష్యచూడామణులలో శ్రీ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యము గా రగ్రగణ్యులు. వారు కవులు, వ్యాసకర్తలు, విమర్శకులు, వాగ్మిశేఖరులు, అధ్యాపకశిరోమణులు, సర్వలక్షణగ్రంథపారదర్శనులు. వా రాంధ్రకావ్యవీరరసస్వరూపనిరూపక మైన యొకయుత్తమవిమర్శనగ్రంథమును రచించి ఆం. ప్ర. సాహిత్య అకాడమివారి పారితోషికము నందఁజాలినారు. విషయగభీరములు, నిరవద్యహృద్యశైలీవిరాజితములు నైన వారి సారస్వతవ్యాసములసంపుటము విద్వాంసుల ప్రశంసలకు పాత్రమైనది. వారి తిరుపతి వేంకటేశ్వరవిద్యాలయసాహిత్యసమీక్ష మఱొక పిహెచ్.డి., బిరుదమునకుఁ బాత్రము కాఁదగినట్టిది. వారు మార్కండేయపురాణము నధికరించి రచించిన యీసిద్ధాంతవ్యాసమునకు ఉస్మానియావిశ్వవిద్యాలయమే పి హెచ్. డి., బిరుదము నిచ్చి గౌరవించిన దన దాని ప్రశస్తిని గూర్చి వేఱుగాఁ జెప్పవలసిన యక్కఱ లేదు. వినయము, విద్వత్త, ప్రతిభ, నిరంతరపరిశ్రమ, వివిధవిషయపరిజ్ఞానము, సరసగంభీరవాగ్మితావైశారద్యము ఏకత్ర పుంజీభవించిన యా సర్వోపన్యాసకవతంసులు వారు.

శ్రీ సుబ్రహ్మణ్యముగారు తమసిద్ధాంతవ్యాసము నైదుసర్గములుగా విభజించినారు. సాధారణముగా సర్గవిభజనము మహాకావ్యములందే కాననగును. అచ్చట సర్గ మనఁగా కావ్యభాగము, లేక అధ్యాయము అని యర్థము. సర్గమునకు సృష్టి యనునర్థముకూడ నున్నది. పురాణమునకుఁ జెప్పఁబడు పంచలక్షణములలో నిది యాద్యము. ఈగ్రంథము మార్కండేయమహాపురాణమునకు సంబంధించిన దగుటచేతను, పురాణము పంచలక్షణసంపన్న మగుటచేతను దీని నైదుభాగములుగా విభజించుట యుచితమై యున్నది. మఱి యిందలి యధ్యాయము లైదైదే నూతనసృష్టిప్రాయము లగుటచే వీనిని సర్గము లనుటయు సంగతముగనే యున్నది.

ఇందలి ప్రథమసర్గము మహాపురాణములకును సంస్కృతమార్కండేయపురాణమునకును సంబంధించినది. 'పురాణము'లను నధ్యాయమున శ్రీ సుబ్రహ్మణ్యముగారు పురాణశబ్దమునకుఁ గల వివిధనిర్వచనముల నొసంగి, దానికిఁ గల పంచలక్షణములను వివరించి, తత్స్వరూపస్వభావములను వ్యక్తము చేసియున్నారు. గుణత్రయవిభాగము ననుసరించి వారు కావించిన పురాణవర్గీకరణము సముచితముగా నున్నది. పురాణేతిహాస శబ్దములకు వ్యుత్పత్త్యర్థములు భిన్నము లైనను, వానిని సాధారణముగా సమానార్థక

ములుగనే వాడుట పరిపాటి. ఆంగ్లమున రామాయణమహాభారతములను రెండింటిని Epics గానే పరిగణింతురు. ఈఅధ్యాయమున గ్రంథకర్త పురాణేతిహాసశబ్దములకుఁ గల వైలక్షణ్యమును వివరించి, పురాణములకును పాశ్చాత్యుల Myths అను వానికిని గల ముఖ్యములైన సమానలక్షణములను బ్రకటించియున్నారు. పురాణస్వరూపస్వభావము లనుగూర్చి యింతసమగ్రమైన వివరణ మాంధ్రమున నింతకు ముందు జరిగియుండలేదు.

మార్కండేయమహాపురాణము అష్టాదశమహాపురాణములలో నేడవది. 'మద్వయ' మ్మని చెప్పఁబడు రెండింటిలో నిది యొకటి. మార్కండేయుఁడు చిరంజీవి. అతని నామమే యీ పురాణమునకుఁ బెట్టఁబడినది. ఈ పురాణప్రవక్తలలో మార్కండేయుఁ డొకఁడు. జైమినిముని సర్గప్రతిసర్గాదులనుగూర్చి వివరింపుమని ధర్మపక్షులను బ్రార్థింప నవి యావిషయములను మార్కండేయుఁడు క్రోష్టుకి యను మునికిఁ జెప్పినవిధముగా విశదీకరించియుఁడెను. మార్కండేయపురాణమునందలి మొదటి నలువదిరెండుఅధ్యాయములనుగూర్చియు, అందలిశ్లోకములసంఖ్యను గూర్చియు శ్రీసుబ్రహ్మణ్యముగారు గావించిన విమర్శ యుక్తిసహముగా నున్నది. మార్కండేయపురాణము గ్రంథకర్త చెప్పినట్లు మహాభారతప్రశంసతో నారంభించుట యొకవిశేషము. జైమిని మహాభారతమును బఠించి యందలి వివిధార్థములను మననము చేసికొని సమన్వయము కుదురని నాలుగు విషయములను మార్కండేయముని నడిగి తెలిసికొనెను. పంచలక్షణములు నన్నిపురాణములందును గోచరించును. కాని, మార్కండేయమున మఱింత సమగ్రముగాఁ గనిపించును. ఇందలి మన్వంతరములను వివరించునప్పుడు సావర్ణిమన్వంతర కథాకథనసందర్భమున ఆదిశక్తి జన్మస్వరూపస్వభావములను వివరించు దుర్గాసప్తశతి కూర్పఁబడుట యీపురాణముయొక్క ప్రచారమునకును, మహత్త్వమునకును కారణమైనది. మార్కండేయపురాణము వెలసిన కాలమునుగూర్చియు, మార్కండేయ పురాణవైశిష్ట్యమునుగూర్చియు, నందలి త్రిగుణప్రాధాన్యమునుగూర్చియు, గ్రంథకర్త కావించిన వివరణము వారిపరిశోధనపాటవమునకును, గ్రంథపరిశీలన నైపుణ్యమునకును నిదర్శనముగా నున్నది.

ఆంధ్రవాఙ్మయమున అజ్ఞాతయుగముతరువాతి రెండవయుగమును పురాణయుగ మనికాని, అనువాదయుగ మనికాని చెప్పవచ్చును. నిజమున కీయుగమున వెలసిన పురాణము మార్కండేయపురాణ మొక్కటే. బసవపురాణమునకు పురాణ మను పేరున్నను, అది నిజమైన పురాణము కాదు. భారతమును గూడ పురాణ మందురు కాని, దాని నితిహాస మని చెప్పుటయే యుచితతరము. ఈ విధముగా నాంధ్రవాఙ్మయమున వెలసిన ఆద్యపురాణము మార్కండేయపురాణమే యగుచున్నది. దీనిని తిక్కనసోమయాజి శిష్యుఁడైన మారన తెనిఁగించి, కాకతిప్రతాపరుద్రదేవుని సేనానులలో నొకఁడైన గన్నయ కంకితము చేసెను. ద్వితీయసర్గమున శ్రీసుబ్రహ్మణ్యముగారు ఆంధ్రమున మార్కండేయపురాణ మావిర్భవించిన సందర్భమును, మారన కాలమును, సోమయాజికిని, అతనికిని గల గురుశిష్యసంబంధమును చక్కగా వివరించినారు. మారన అనువాద పద్ధతిని విశదీకరించుటలో గ్రంథకర్త చూపిన పరిశోధనపాండిత్యప్రాభవములు అపా

రము లైనవి. కవిత్రయమువారివలెనే మారనయు ననువాదసందర్భమున కొన్నిభాగము లను తగ్గించెను; కొన్నిటిని విడిచివైచెను; రసవత్కథాఘట్టములను, కొన్ని వర్ణనము లను పెంచెను; ఔచిత్యమునకై యమూలకములైన కొన్నివిషయములను క్రొత్తగాఁ గల్పించెను. నన్నయతిక్కనలవలె మారనయు నీతిలోకధర్మాదులను ప్రత్యేకముగా జ్ఞప్తియం దుంచుకొనుటకై పూర్వాపరపద్యములతో సంబంధము లేని పద్యములను స్వతంత్రసూక్తులుగా రచించెను.

మారన మార్కండేయపురాణమునందలి శిల్పసౌందర్యమును వివరించు సందర్భ మున గ్రంథకర్త ఆఖ్యానశిల్పము, ఛందశ్శిల్పము, అలంకారశిల్పము, రసశిల్పము అను వేఱువేఱు శీర్షికలతో నాయాశిల్పసౌందర్యములను చక్కఁగా వివరించియున్నారు. మార్కండేయపురాణమున రమ్యము లైన యుపాఖ్యానములు పెక్కున్నవి. మారన పురాణమును రచించుచున్నను కథాకథన సందర్భమున నపారమైన కౌశలమును ప్రద ర్శించి, తరువాత నాకథలను గ్రహించి ప్రత్యేకప్రబంధములను రచించినవారికి పెక్కు విషయములలో మార్గదర్శకుఁ డయ్యెను. హరిశ్చంద్ర చరిత్ర, స్వారోచిషమనుసంభవము, కువలయాశ్వచరిత్ర అను ఉపాఖ్యానముల నాతఁడు మిక్కిలి నేర్పుతో రచించెను. అందును అతఁడు మనుచరిత్రమును రచించిన విధానమును పెద్దనవంటి ప్రతిభావంతు నికిఁగూడ ప్రతిసన్నివేశమునందును ఒజ్జబంతి కాఁజాలుట అతని రచనాకౌశలమున కొక నిదర్శనము. మారనకవిత్వమును వివరించు సందర్భమున గ్రంథకర్త ఆఖ్యానశిల్పము నకే యెక్కువ ప్రాధాన్యము నొసంగెను. ఇందు సుమారు చిన్నవి, పెద్దవి కలిసి ముప్పదినాలుగు కథాంశము లున్నవి. వానిని తీర్చిదిద్దుటలో మారన ప్రదర్శించిన కౌశ లమును గ్రంథకర్త చాలచక్కఁగా నిరూపించియున్నారు.

క్షేమేంద్రుఁడు వృత్తౌచిత్యమును ప్రదర్శించుచు నెట్టిసన్నివేశముల కెట్టి వృత్తము లుచితతరములుగా నుండునో నిరూపించి యుండెను. మహాకవులు ప్రయత్నపూర్వక ముగా వృత్తముల నెన్నుకొనకపోయినను సహజముగనే అర్థభావముల ననుసరించి వారి నోటివెంట నాయావృత్తము లుచితవిధమున వెలువడుచుండును. మార్కండేయపురాణమున వృత్తౌచిత్య మెట్లు పాటింపఁబడినదో గ్రంథకర్త సోదాహరణముగా నిరూపించియున్నారు. మారన శబ్దాలంకారములకంటె నర్థాలంకారములపైనే యెక్కువ మక్కువ ప్రద ర్శించెను. ఉపమానరూపకోత్ప్రేక్షార్థాంతరన్యాసాలంకారాదుల నాతఁ డెట్లు ప్రయోగించెనో- అలంకారశిల్పమున విశదముగా నిరూపింపఁబడినది. కథావిషయమునవలెనే రసవిషయ మునఁ గూడ మారన తగినంత శ్రద్ధ వహించెను. అతఁ డనువాదవిషయమున భావాను వాదపద్ధతి ననుసరించి, శ్రీనాథపోతనలకు మార్గదర్శకుఁ డయ్యె నని చెప్పవచ్చును. పురాణములకును, ప్రబంధములకును శైలియందు వ్యత్యాస ముండుట సహజము. మారన మార్కండేయపురాణమున నక్లిష్టము, సరళము, భావబంధురము, సుబోధము నైన అచ్చ మైన పురాణశైలిని అనుసరించియుండెను. గ్రంథకర్త యాతనిశైలిని వివరించుచు నత నికి పూర్వులైన నన్నయతిక్కనల పద్యములకు నాతని గ్రంథమునఁ గల సంవాదములను

సోదాహరణముగాఁ బ్రదర్శించియున్నారు; అతఁడు వాడిన లోకోక్తులను, జాతీయములను సేకరించి యొక్కచోఁ జూపియున్నారు.

తృతీయసర్గము 'మార్కండేయపురాణము - కావ్యవస్తుప్రదానము' అనుశీర్షికతోఁ గూడినది. ఇది చాలముఖ్యమైనది. మార్కండేయపురాణమునందలి కొన్నియుపాఖ్యానముల సౌందర్యముచే నాకర్షింపఁబడి పలువురుకవులు తరువాత వానిని ప్రత్యేకప్రబంధములుగా సంతరించిరి. వానిలో మనుచరిత్రము, కువలయాశ్వచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, మదాలసచరిత్ర మున్నగునవి ముఖ్యములైనవి. మూలానుసరణమునుబట్టి గ్రంథకర్త యీకావ్యములను నాలుగువర్గములుగా వింగడించియున్నారు. అందు మనుచరిత్రకువలయాశ్వచరిత్రలు ప్రత్యక్షమూలములు. మనుచరిత్రనుగూర్చి చెప్పునప్పుడు విమర్శకులు సాధారణముగా పెద్దన మారన ననుసరించె నని చెప్పుచుందురు. అది సత్యమే. కాని, అతఁడు సంస్కృతమూలము ననుసరించిన భాగములుకూడ కొన్నియున్నవి. వానిని గ్రంథకర్త చక్కఁగా నిరూపించియున్నారు. మనుచరిత్రమునందలి యాయాసన్నివేశములయు, భావములయు చిత్రణమునకు మారనపురాణమునందలి భాగములెట్లు ప్రేరకము లయ్యెనో వారు నిరూపించియున్నారు. సవరము చిననారాయణ కథాకల్పనమున నపారమైనప్రతిభ ప్రదర్శించె నని విమర్శకుల తలంపు. ఆకల్పనలను అందలి యౌచిత్యానౌచిత్యములను గ్రంథకర్తగారిందు విశదముగా వ్యక్తీకరించియున్నారు. హరిశ్చంద్రచరిత్రవస్తుకము లైన కావ్యములకు మార్కండేయపురాణము పరంపరగా మూలమని చెప్పఁదగి యున్నను నిజమునకు వానికి గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమే ఆధార మని చెప్పుటలో నత్యుక్తి యుండదు. ఆచరిత్ర సంస్కృతపురాణాదులందే సమగ్రరూపము దాల్చి గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమున పరిణతస్వరూపమును బొందినది. అందుచే తరువాతికవులు గౌరనకావ్యమునే యెక్కువగా ననుసరించిరి. గౌరనకూడ కలహకంఠీనక్షత్రకులపాత్రలను స్వయముగాఁ గల్పించినను, కాలకౌశికాదులను చిత్రించుటలో మార్కండేయపురాణమునుగూడ నాధారముగా గ్రహించె నని చెప్పక తప్పదు. ఆధునికు లైన శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు కువలయాశ్వచరిత్ర నెటింగియు, నావస్తువును మఱల గ్రహించి మూలకథలోని దోషములను సవరించి కొన్నినూత్నకల్పనలు చేసి, మదాలసావిలాసమును హృద్యముగా రచించియున్నారు. తక్కెళ్లపాటి లింగనకవి, చంద్రశేఖరుఁడు ఉత్తరహరిశ్చంద్రచరిత్రను ప్రబంధములుగా రచించిరి. వారు హరిశ్చంద్రచరిత్రయందలి పాత్రలప్రవృత్తికి కారణభూతము లైన పూర్వజన్మకథావృత్తాంతములను వివరించియుండిరి. ఒక్కశనైశ్చరునికథమాత్రము మార్కండేయపురాణమునందుకూడ కానవచ్చుచున్నది. ఈఉత్తరహరిశ్చంద్రకథనే శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు పూర్వహరిశ్చంద్రచరిత్ర మను పేర కావ్యముగా రచించియుండిరి. వారి రచనకు శ్రీ కొమాండూరి అనంతాచార్యులవారి గద్యప్రబంధమే ఆధారము. మరుత్తరాట్చరిత్రము, దత్తభాగవతము అనునవి ఆధునికకావ్యములు. వీనికి మార్కండేయపురాణము పాక్షికమూల మని చెప్పవచ్చును.

ఈతృతీయసర్గమున మారనమార్కండేయపురాణము ఆంధ్రవాఙ్మయమున నెన్ని ప్రబంధములకు కారణమైనదో, ఎంతమందికవులకు కావ్యరచనాప్రేరక మైనదో, వా రా పురాణము నెంతవఱ కనుసరించిరో శ్రీ సుబ్రహ్మణ్యముగారు చక్కఁగా విశదీకరించి యున్నారు. నిజమున కీతృతీయసర్గ మొక్కటే పి హెచ్. డి., బిరుదప్రదానమునకు చాలు నని నాయభిప్రాయము.

సంస్కృతమార్కండేయపురాణమును ఆంధ్రీకరించినవారు మఱికొంద ఱున్నారు. పొన్నతోట బాలకవి, మంద కామేశ్వరకవి దానిని చంపూకావ్యములుగా ననువదించి యుండిరి. పందొమ్మిదవశతాబ్దితరువాత పలువురు పండితులు దానిని గద్యరూపమున గూడ ననువదించి యుండిరి. శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఈపద్యగద్యకృతులకును మూల మునకును గల సంబంధమును బరిశీలించి, ఆంధ్రరచయిత లొనరించిన మార్పుచేర్పులను సూచించియున్నారు. మార్కండేయపురాణమునకు సంబంధించిన యీసిద్ధాంతవ్యాసమున వానిని గూర్చికూడ స్పృశింపవలసినయవసరము లేకపోలేదు.

పంచమసర్గముకూడ మార్కండేయపురాణములకు సంబంధించినదే. కాని, యీ పురాణములకును అష్టాదశపురాణాంతర్గత మైన మార్కండేయమునకును నామమందే కాని వస్త్వాదులయం దెట్టి సంబంధమును లేదు. అందుచేతనే ఈసర్గమునకు 'పురాణము కాని పురాణ' మని పేరు పెట్టఁబడినది. ఎల్లకర నృసింహకవి మార్కండేయపురాణమును తొమ్మిదాశ్వాసములతోఁ గూడిన ద్విపదకావ్యముగను, పర్వతమంత్రి లింగనామాత్యుఁ డెనిమిదాశ్వాసములతోఁ గూడిన ద్విపదకావ్యముగను రచించియుండిరి. పోచిరాజు వీరనా మాత్యుఁడు సర్గప్రతిసర్గాదులను విడిచి మార్కండేయముని చరిత్రమును మాత్ర మెత్తు కొని భావనాఋషిచరితమునకుఁ బ్రాధాన్యమును గల్పించి యొక చంపూకావ్యమును నిర్మిం చెను. శిష్టు కృష్ణమూర్తిగారు రచించిన పీఠారణ్యమాహాత్మ్యమున నది మార్కండేయ పురాణమూలక మని చెప్పఁబడియున్నది. ఇందలి మొదటి మూఁడును పద్మసాలీలకు మూలపురుషుఁ డైన భావనాఋషి చరిత్రమును, మాహాత్మ్యమును వివరించుచున్నవి. వీనికిఁగూడ మూలమైన సంస్కృతమార్కండేయపురాణ మొకటి యున్న దని చెప్పుదురు గాని యది యెచ్చటను లభ్యమగుటలేదు. మారన పురాణము ననుసరించి పెక్కుకావ్య ములు వెలసినట్లే నృసింహకవిరచన ననుసరించి తక్కినరచనలును వెలసినట్లు కనిపిం చును. పీఠారణ్యమాహాత్మ్యము మార్కండేయపురాణమున లేదు. ఈకావ్యమునందలి ప్రథమసృష్టివర్ణనముపై మాత్రము మహాపురాణము యొక్క ప్రభావ మించుక కానవచ్చు చున్నది. ఇంతకంటె దీనికిని మార్కండేయపురాణమునకును పెద్దసంబంధము లేదు.

ఇంక నీసిద్ధాంతవ్యాసమునందలి శైలినిగూర్చి యొండు రెండుమాటలు చెప్పి ఈ ప్రస్తావనను ముగించెదను. శ్రీ సుబ్రహ్మణ్యముగారు సంస్కృతాంధ్రముల రెండింట మంచి పండితు లగుటయే కాక, ఉపాధ్యాయులుగా విశేషమైన యనుభవమును సంపాదించినవారు. వారిశైలి అనవసరపదాడంబరము లేక సరళమయ్యు శక్తిమంత మై, సరసమై, సర్వ సుబోధమై, నిర్దుష్టమై యలరారుచున్నది. వారి వివరణము మిక్కిలి నేర్పుతో కూడి

నది యగుటచే గూఢములైన భావములనుగూడ నెల్లరు నవగాహనము చేసికొని యానం దించుటకు వీలుగా నున్నది. వారి పరిశోధనపరిశీలనము సర్వసమగ్రము. అవసరము లైనచోట్ల నెల్ల వా రుదాహరణములను, ప్రమాణములను, ఉటంకించియున్నారు. మార్కండేయపురాణమునుగూర్చి యింతకుపూర్వ మెవ్వరును సమగ్రమైన పరిశీలనము గావింపనిలోపము నీసిద్ధాంతవ్యాసము తీర్చుటయే కాక, అందలి యపూర్వవిషయముల నెన్నిటినో వెలుగునకు దెచ్చి, పఠితలకు దానిపై నభిమానము నావహించుచున్నది. మార్కండేయపురాణ మూలకము లైన ఆంధ్రప్రబంధములనుగూర్చి వారు కావించిన పరి శోధన అమూల్యమును, ఆవశ్యకము నై యున్నది. వా రింకను ఇట్టి విమర్శాత్మకములు, పరిశోధనాత్మక ములు నైన రచనలు కావించి, యాంధ్రభారతియకితి కపూర్వము లైన యలంకారములను సమకూర్తురు గాక! యని యాశీర్వదించుచున్నాను.

హైదరాబాదు,
24-12-1972

దివాకర్ల వేంకటావధాని

# ఈ గ్రంథమునందలి విశేషాంశములు

1. సర్గాది పంచలక్షణవిశిష్టమైన పురాణపర్యాలోచనమును సర్గపంచకముగా వర్గీకరించుట రచనాప్రణాళికకు సంబంధించిన విశేషము.

2. పురాణేతిహాసస్వరూపస్వభావములను తులనాత్మకముగాఁ బరిశీలించుటయు, ప్రాచ్య పాశ్చాత్యసాహిత్యప్రక్రియ లైన పురాణేతిహాసములకును, Myths and Epics కును గల భేద సాదృశ్యములను వివేచించుటయు, పురాణ పంచలక్షణ, దశ లక్షణ, దశాధికలక్షణ పరిణామ వికాసమును సమీక్షించుటయు, 'పురాణము' అను నధ్యాయము నందలి విశేషము.

3. అష్టాదశమహాపురాణములలో సంస్కృతమార్కండేయమున కున్న వైశిష్ట్యమును వివరించుటయు, నాపురాణము త్రిగుణప్రధానమైన దని వివేకించుటయు 'మార్కండేయమహాపురాణ' మను నధ్యాయమునందలి విశేషము.

4. మారన మార్కండేయపురాణము ప్రథమాంధ్రమహాపురాణ మని నిర్దేశించుటయు, కృతిపతి యగు గన్నసేనాని హరిహరాద్వైతభక్తియుక్తుఁ డని స్థాపించుటయు, తిక్కనమారనల గురుశిష్యసంబంధమును సమీక్షించుటయు,-

ప్రథమాంధ్ర మహాపురాణము తిక్కనగారి వైదికమతధర్మాద్వైతప్రచారమహాప్రణాళికలో కాలాంతరమున రూపుగొన్న సాహిత్యప్రక్రియాసాధన మనియు బసవపురాణమువంటి దేశిద్విపదపురాణములకుఁ బ్రతిగా మహాపురాణసంప్రదాయమునకు సంబంధించిన మార్గచంపూపురాణనిర్మాణధ్వజము నెత్తుటకై సాగించిన రచన మనియు, నాటి మతరాజకీయ సాంఘికసాహిత్యప్రయోజనముల నుపలక్షించి, సమకాలీనసాహిత్యప్రక్రియామర్యాదలన్నింటిని తనయందుఁ బ్రతిబింబించుకొనుచు తత్కాలగర్భమునుండి సహజముగా నుదయించిన కావ్యప్రక్రియ యనియు, పురాణ మైనను నన్నయ కథాకథనశిల్పమును, తిక్కన రసవత్కావ్య కళాశిల్పమును సమన్వయించుకొని పుట్టిన విశిష్టరసవత్కథాకావ్య మనియు — 'ప్రథమాంధ్రమహాపురాణ' మను నధ్యాయమున స్థాపింపఁ బడినది. తెలుఁగున నింతవఱకు మారనపురాణ మిట్టిదృక్కోణముతోఁ బరిశీలింపఁబడలేదు. ఈగ్రంథమే అట్టిమార్గమున క్రొత్తవెలుఁగులు ప్రసరించినది.

5. మారన భావానువాదపద్ధతి ననుసరించె నని ప్రతిపాదించుటయు, సంస్కృతపురాణమునుండి యనువదింపక వదలిన భాగముల నుటంకించి, వాని సార్థక్యమును

సాధించుటయు, అనువాదమునందుఁ గాన,వచ్చు విశేషాంశములను విశ్లేషించి వర్గీకరించి, క్రమబద్ధముగా వివరించుటయు – 'మారన అనువాదపద్ధతి' యందలి ప్రత్యేకత !

6. మార్కండేయపురాణమున మారన ప్రదర్శించిన కథాకథన కౌశలమును సూక్ష్మ సూక్ష్మాంశపరిశీలనాత్మకముగా వివరించిన అధ్యాయము 'ఆఖ్యానశిల్పము'. ఇందు హరిశ్చంద్రోపాఖ్యాన, కువలయాశ్వచరిత్ర, స్వారోచిషమనుసంభవ, మరుత్తరాట్చరిత్రములలో మారన నిక్షేపించిన అమూలకమైన అఖ్యానశిల్ప మనల్ప మని మొట్టమొదటిసారి యీగ్రంథమువలన తెలుఁగువారికి తేటతెల్లము కాఁగలదు.

7. అనువాదకావ్యమున కవి తనసొంత మని చెప్పుకొనఁ దగినది ఛందము. అది రసభావవ్యంజక మగుట శిల్పము. తిక్కన శిష్యుఁడైన మారన రచనలో ఛంద మెన్ని సొబగులు, హొయలు, సార్థకముగా సంతరించుకొనినదో నవ్యఛందశ్శిల్ప మార్గము ననుసరించి వివేచించి చూపిన అధ్యాయము 'ఛందశ్శిల్పము'. మారన పురాణ కవితలోని ఛందశ్శిల్పరామణీయకమును మొదటిసారి వెలుఁగునకుఁ దెచ్చినది యీ అధ్యాయము.

8. పురాణరససమన్వయము చేయువిధానమును లాక్షణికసమ్మతమైన మార్గమున వివేచించి, పురాణములు శాంతరసప్రధానము లెట్లగునో వివరించి, దానిని మార్కండేయమున కన్వయించి చెప్పిన అధ్యాయము 'రసశిల్పము'. మారన అలంకార ప్రయోగసార్థక్యమును సాధించునది 'అలంకారశి' ల్పాధ్యాయము.

9. తెలుఁగున చతుర్విధపురాణశైలీపద్ధతులు కల వనియు, నం దొకదానికి మారన మూలపురుషుఁ డనియు తెలుఁగులో మొదటిసారి నిర్దేశించి, నిరూపించిన అధ్యాయము 'మారనశైలి'.

10. మార్కండేయపురాణము తెలుఁగుకావ్యములకు ప్రత్యక్ష, పరోక్ష, పాక్షిక, పరంపరామూలముగా వెలసినవిధమును విశ్లేషించి వివరించినగౌరవము ఈగ్రంథము నందలి తృతీయసర్గమునకు దక్కుచున్నది.

11. పెద్దన మనుచరిత్రలోని కథకును, పద్యరచనకును, పాత్రచిత్రణకును, రస పోషణకును సంస్కృతాంధ్రమార్కండేయపురాణము లెట్లు మార్గదర్శకము లైనవో సూక్ష్మేక్షికతో సమీక్షించిన అధ్యాయము 'మనుచరిత్రము'.

12. కల్పనాశక్తిలో పింగళి సూరనకు దీటైనవాఁ డని ప్రశంసల నందుకొనిన సవరము చిననారాయణకవి కావ్యకల్పనలలోని దోషములను, గుణములను, పురాణప్రభావమును తెలుఁగున మొదటిసారి వెలుఁగునకుఁ దెచ్చినది కువలయాశ్వచరిత్రాధ్యాయము.

13. గౌరనాదుల హరిశ్చంద్రచరిత్రలకును, లింగనాదుల ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానములకును మార్కండేయముయొక్క పరంపరాపరోక్షమూలత్వము నీగ్రంథమునఁ దొలిసారి వివరించుట యైనది.

14. మార్కండేయపురాణ మను పేర వెలసియున్న పద్మసాలీలవంశచరిత్రమును వర్ణించు పురాణములను, వానినుండి పుట్టిన కావ్యములను తెలుఁగున మొదటిసారి సమీక్షించిన గౌరవము ఈ గ్రంథమునందలి పంచమసర్గమునకు దక్కుచున్నది.

15. అల్లమరాజు రామకృష్ణకవి మదాలసాపరిణయము, కంచి వీరశరభకవి ద్విపద హరిశ్చంద్రచరిత్రము, చంద్రశేఖరకవి ఉత్తరహరిశ్చంద్రచరిత్రము, ఎల్లకర నృసింహకవి పర్వతమంత్రి లింగనామాత్యుల మార్కండేయపురాణములు, పోచిరాజు వీరనామాత్యుని భావనాఋషిమాహాత్మ్యము, శిష్టు కృష్ణమూర్తికవి వీక్షారణ్యమాహాత్మ్యము - అను తాళపత్రప్రతులలోని విశేషాంశముల నీగ్రంథమున నాయాసందర్భములందు వెలువరించుటయైనది.

ప్రథమాంధ్రమహాపురాణ ప్రభవ ప్రాభవ ప్రభావములను గూర్చి పరిశోధించి ఫలితాంశములను సప్రమాణముగా ప్రతిపాదించిన ప్రథమాంధ్రసిద్ధాంతవ్యాస మీగ్రంథము।

ఈయంశములు సాహితీతత్త్వ విచక్షణులసమ్మతి వడసినచో గ్రంథకర్తకృషి చరితార్థము। ఈగ్రంథప్రచురణము సార్థకము।

— ప్రకాశకులు.

# రచయిత పరిచయము

క్రీ. శ. 1935 సెప్టెంబరు 1 వతేదీన జన్మము.

ఆదిపూడిలో ప్రాథమికవిద్య; పరుచూరులో ఉన్నతపాఠశాలా జీవితము; హైదరాబాదులోని నిజాంకళాశాలలో పట్టభద్రవిద్య; ఉస్మానియావిశ్వవిద్యాలయములో ఎం. ఏ., పి హెచ్. డి., పట్టములకై చదువు. 1957 లో విశ్వవిద్యాలయ ఎం. ఏ , ప్రథమశ్రేణి విద్యార్థులలో ప్రథమస్థానము., 1969 ఫిబ్రవరిలో పి హెచ్. డి., పట్టపరిగ్రహణము

1958 వ సంవత్సరమునుండి ఉస్మానియావిశ్వవిద్యాలయములో ఆంధ్రోపన్యాసకుడుగా, రీడరుగా ఉద్యోగము. వరంగల్లు, సికిందరాబాదు, నిజాం కళాశాలలో పదవీ నిర్వహణము.

**రచయితగా :**

'ఆంధ్రసాహిత్యములో వీరరసము', తిరుపతి వేంకటకవుల కావ్యసమీక్ష, ప్రథమాంధ్రమహాపురాణము, సారస్వత సౌరభము, నవ్యాలోకము - అను విమర్శగ్రంథముల రచన.

సంక్షిప్తబసవపురాణము, సారస్వతవ్యాససంపుటములు (రెండు), మహాభారత శాంతిపర్వము - వీనికి సంపాదకత్వము.

మహతి, అక్షరార్చన, సూర్యరాయాంధ్ర నిఘంటువు (చివరిసంపుటమునకు) - వీనికి సహసంపాదకత్వము.

రాగమంజరి, జీవనగంగ - నవలలు; పగిలినగోడలు, ఏడునక్షత్రాలు, మానవత్వము, ఏకోదరులు, మెరవనిమేఘము, తోలుబొమ్మలు, మొదలైన నాటికలు; తీరనివాంఛితము, పారితోషికము, కవిసార్వభౌముడు, భువనవిజయము మొదలైన శ్రవ్యనాటికలు, మధురాద్వైతము మొదలైన ఖండకావ్యములు.

**కార్యకర్తగా :**

ఉస్మానియా విశ్వవిద్యాల యాంధ్రభాషాసదస్సు, అభినవభారతి సంస్థల కార్యదర్శిత్వము; ఆంధ్రరచయితలసంఘ సహాయ కార్యదర్శిత్వము. ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీ పరిశోధన సంఘమున అనుబంధ సభ్యత్వము. 'యువభారతి' గౌరవసభ్యత్వము.

చిరునామా : డా. జి. వి. సుబ్రహ్మణ్యం, శ్రీవాణి 1-8-702 / 105, నల్లకుంట, హైదరాబాదు - 500044.

# రచయిత సాహిత్య కృషి విశేషములు

**'వీరరసము':** (1961)

ఆంధ్రసాహిత్యమున వీరరసపోషణమును సమీక్షించిన విమర్శగ్రంథము. ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమీవారి బహుమతినందిన సాహిత్యలక్షణగ్రంథము.

"విశ్వవిద్యాలయములలో పరిశోధనపట్టమును పొందఁదలఁచిన వారు సమర్పించు సిద్ధాంతవ్యాసము (Thesis) ల కోవకు చెందఁదగిన దీరచన......ప్రస్తుతగ్రంథరచయిత యైన సుబ్రహ్మణ్యముగారు విన్నవారయ్యు ధీరచింతకులు, స్వతంత్రాలోచనాపరులు. వీరిమతమున వీరమే సర్వమానసికప్రవృత్తులకును బీజభూతము. వీరమునకు స్థాయి భావము ఉత్సాహము. కామమే మానవుని యెల్లయిచ్ఛాక్రియాశక్తులకు పునాది యని యంగీకరించినవారుకూడ వీరము లేనిదే కామము శోభావిహీన మగు నని యొప్పు కొందురు. కామము ఇచ్ఛారూపమై భావములోనే పర్యవసించును. ఉత్సాహము జ్ఞాన క్రియావ్యాప్తులకు ప్రేరకమై ప్రాణిని క్రియాశీలము చేయుచున్నది: భావముకంటె క్రియాశీలత్వము జీవితసాఫల్యమునకు సన్నిహితప్రవృత్తి యై ప్రత్యక్షోపకారక మగుచున్నది. దానికి మూల మైనది యుత్సాహము. ఉత్సాహపరిణామ మైన వీరరసము రసమూర్ధన్య మనుట హేతుబద్ధముగా నున్నది. ఇట్లు వీరమే 'రసానాం రసః' అన నొప్పియున్నది."

"అచ్యుతరాయలు కనుగొన్న 21 వీరరసభేదములకును బుద్ధిమంతు లైన సుబ్రహ్మణ్యముగారు మఱిమూఁడింటిని చేర్పఁగలిగిరి. అవి : స్వాతంత్ర్యవీరము, యశోవీరము, మానవీరము-వీరరసస్వరూపమును, తద్భేదములను స్థాపించి శ్రీసుబ్రహ్మణ్యముగారు ఆంధ్రవాఙ్మయమునందు వీరరసోల్లాసమును సందర్శించుటకు పూనుకొని విశేషకృషి సల్పిరి. ఆంధ్రమహాభారతరామాయణములలోని ముఖ్యరసము వీరరసాంతర్భావిత మని వీరు సయుక్తికముగ నిరూపించిరి. ఇచ్చట గ్రంథకర్తగారు ప్రశంసనీయ మైన స్వతంత్రాలోచనమును, సాహసనిర్ణయములను జేయు శక్తియు ప్రదర్శించిరి. సంపూర్ణ కావ్యములందు వీరరసవివేచనము చేయుటతో చాలింపక శ్రీ సుబ్రహ్మణ్యముగారు ఆంధ్రలఘుకావ్యములందు, ముక్తకములందు, నవలలు, నాటకములు మున్నగు బహుళసాహిత్యప్రక్రియలయందును వీరరసఘట్టముల ననుసంధించుచు తమ రసనౌకను విహరింపఁజేసినారు."

''ఈగ్రంథము నామూలాగ్రముగ చదివిన తరువాత ఆంధ్రవాఙ్మయము శృంగారప్రధాన మను భావము తొందరపాటుచే కల్గినదే గాని వాస్తవము గాదని నిరూపిత మగును."

**—ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు.**

"బహుగ్రంథ పరిశీలనము, బహువిషయ నిరూపణము శ్రీ సుబ్రహ్మణ్యంగారి పాండిత్యమునకు నిదర్శనములు... విషయవిభాగమే వారిశ్రద్ధకు సాక్ష్యము...రసవిషయము గహనమైనది. దానిని నిరూపించుటకుఁ జేసినప్రయత్నము ప్రశంశనీయము".

**— కవిసమ్రాట్, కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.**

"1961లో 'వీరరసము' అనే డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యంగారిగ్రంథం వచ్చింది. వీరరసస్వరూపస్వభావాలను పరమభావుకతతోను, పటుశాస్త్రజ్ఞతతోను వివరించి మన వివిధవాఙ్మయశాఖలలో దానికి గల ప్రతిపత్తిని నిరూపించి అకాడమీ బహుమతికి సమర్థులయ్యారు గ్రంథకర్త. ఇలా ఒకరససిద్ధాంతాన్ని ఒకవాఙ్మయానికి సమన్వయించి, సరసానుశీలనము, సమ్యగవలోకనము చేయడానికి సమకట్టినగ్రంథాలు మన కెన్నో లేవు. అందులో ఇది అక్షరాలా అగ్రగణ్యము''.

**—ఆచార్య డా. యస్వీ జోగారావుగారు.**

"శ్రీ సుబ్రహ్మణ్యము స్వతంత్ర పరిశీలనాదృష్టి పుష్కలముగాఁ గలవారు. అలంకారశాస్త్ర సిద్ధాంతములను వివరించుటయేకాక నూతన సిద్ధాంతములను యుక్తిసహముగా చేయగలదక్షులు...ప్రాచీనాలంకారికుల సిద్ధాంతములను ఆధారముగా గొని నూతన సిద్ధాంతములు ప్రతిపాదించుట మంచిబాట. ఎప్పటికప్పుడు శాస్త్రకర్త సమన్వయ దృక్పథము నలవఱచుకొనవలయును. అట్టి సమన్వయశక్తి ప్రాచీనులలో నున్నంతగా నవీనులలో ఎంతోమంది యందు కానవచ్చుటలేదు. అట్టి శక్తిగలవారిలో సుబ్రహ్మణ్యముగారు మొగదలయందున్నారు."

**—'భారతి'** (ఫిబ్రవరి 1962)

**సారస్వతిసౌరభము :** (1970) (సారస్వత వ్యాస సంపుటి)

''కళాపూర్ణోదయమునందలి సరస్వతీచతుర్ముఖుల ప్రణయకలహాంశములకు వీరు చెప్పిన నూతనవ్యాఖ్యానము అపూర్వమును, అద్భుతముగా నున్నది.''

**—ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు.**

''కలభాషిణీవృత్తాంతకల్పనకు మూలములైన బీజములు వాణీముఖప్రతిబింబ వర్ణనాఘట్టమున నిక్షిప్తములై యున్నవని అనుమానించి, నిశితముగా పరిశీలించి, వాణీ చతుర్ముఖులముఖబింబములయొక్కయు, మణిస్తంభమునందలి తత్ప్రతిబింబముల యొక్కయు కదలికలయందు కలభాషిణీకథయందలి సర్వకథాంతరములును కదలాడుచున్నట్లు కనిపెట్టెను; సూక్ష్మాతిసూక్ష్మవివరములతో ఆకథాంశములకు మూలములైన బీజములను ఎత్తిచూపెను. కళాపూర్ణోదయపరిశీలనమున సరిక్రొత్తయైన మార్గమును త్రొక్కి అనితరసాధ్యమైన రహస్యమును సాధించి చి॥ సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మఱియొక మెట్టు పై కెక్కించెను.''

**—డా. పాటిబండ మాధవశర్మగారు.**

"ఇందలి యొక్కొక్కవ్యాస మొక్కొక్కవిశిష్టతతోఁ గూడి శ్రీసుబ్రహ్మణ్యము గారి సర్వతోముఖ సామర్థ్యమును జాటుచున్నది."

**ఆచార్య డా. దివాకర్ల వేంకటావధానిగారు.**

"ఈవ్యాసములు చదివినమీదట 'కవికంటె రసజ్ఞుఁ డెఱుఁగు' ననుభావము పాఠకులకు కలుగును. ఇది శ్రీ సుబ్రహ్మణ్యముగారి విమర్శపాటవమునకు గీటురాయి"

**—డా. పల్లా దుర్గయ్యగారు.**

**తిరుపతి వేంకటకవుల కావ్యసమీక్ష :** (1963) (అముద్రితగ్రంథము)

"వారి తిరుపతివేంకటేశ్వరకవిద్వయ సాహిత్యసమీక్ష మఱొక పిహెచ్., డి., బిరుదమునకుఁ బాత్రము కాఁదగినట్టిది."

**— ఆచార్య డా. దివాకర్ల వేంకటావధానిగారు.**

**బసవపురాణ పీఠిక :** (1969)

సాహిత్యఅకాడమీవారు ప్రకటించిన సంక్షిప్తబసవపురాణపీఠికలో బసవపురాణ నిర్మాణముపై జైనపురాణప్రభావము కల దను నూతనసిద్ధాంత మీ రచయితచే ప్రతిపాదింపఁబడినది.

"బసవపురాణ ముంది. ఈకావ్యాన్నిగూర్చిన చర్చలన్నీ సామాన్యంగా దేశికవిత, ద్విపదచ్ఛందస్సు, జానుతెనుఁగు, సాంఘికజీవనచిత్రణం, వీరశైవమతప్రాబల్యం మొదలైన అంశాల చుట్టే చంక్రమణం చేస్తుంటాయి. సుబ్రహ్మణ్యం ఎన్నుకున్న తీరువేరు. బసవపురాణం పురాణమా ? ఎలా ? నిజానికి భారతభాగవతాదులు పురాణాలు. బసవపురాణం పురాణకావ్య సంప్రదాయాన్ని ధిక్కరించిన అచ్చమైన దేశికావ్యం. మరి అది పురాణం ఎలా అయింది ? ఆరంభమైంది ఆలోచనాకదనం; అంతర్మథనం. ఫలితం–బసవపురాణం జైనపురాణప్రభావాన్ని పుక్కిటబట్టుకున్నరచన అని నిగ్గుతేల్చటం. అందుకు ఉపస్కారకంగా సంస్కృతపురాణాల్లోని పంచలక్షణాలకు ప్రతిగా జైనులు తమపురాణాల్లో నిబంధించిన ఉత్సవపంచలక్షణాలను పేర్కొని వాటిని బసవపురాణం పట్ల సమన్వయించి చూపటం".

"డా॥ సుబ్రహ్మణ్యం వివేచన ఉన్న భావుకుఁడు, రసజ్ఞత ఉన్న నిశితవిమర్శకుడు. విద్యావినయాలు సమప్రమాణంలో సంతరించుకున్న యువకుఁడు. ఉపరిశోధనలకంటె పరిశోధనలపట్ల ఆసక్తి ఉన్న సాధకుఁడు. సాహితీవిమర్శనారంగంలో ఇతఁ డెక్కిన తొలిమెట్టు 'వీరరసం'. మలిమెట్టు 'సారస్వతసౌరభం'; మలిమెట్టులోనే దిదృక్షువులకు మిరుమిట్లు గొల్పిన ఈ సాధకునికీ, పరిశోధకునికీ నా అభినందనలు".

**—డా. సి. నారాయణరెడ్డిగారు.**

# నివేదనము

ప్రాచీనభారతీయవిజ్ఞాననిధు లైన పురాణములను చారిత్రకభౌగోళికఖగోళజ్యోతిష తత్త్వాదిశాస్త్రదృక్పథములతో పరిశీలించు విమర్శనపద్ధతి భారతదేశమున వెలసియున్నను సమగ్రపురాణవాఙ్మయపర్యాలోచన మింకను సాధింపవలసియున్నది. తెలుఁగున నట్టిది యత్యంతప్రారంభదశలో నుండుటచే అస్తినాస్తివిచికిత్సకు పాత్ర మగుచున్నది.

పురాణములు శాస్త్రదృష్టు లనియు, రసప్రధానములు కావనియు సాధారణముగా విమర్శకులు భావించుచుండుటచే సంస్కృతపురాణవాఙ్మయము నొకప్రత్యేకసాహిత్య ప్రక్రియగా గుర్తించి, వానిలోని కావ్యశిల్పకళారహస్యములను వెలికిఁదీయుప్రయత్నము జరుగలేదు. అర్థప్రధానము లైన పురాణములలో సైతము సాహిత్యపరమార్థమును దర్శింపఁగల విమర్శనపద్ధతి దేశమున వృద్ధి కావలసియున్నది!

సంస్కృతవాఙ్మయము సర్వతోముఖముగ వికసించిన తరువాత నాంధ్రమున సాహిత్యనిర్మాణ మారంభ మగుటచే తెలుఁగుకవులు సంస్కృతపురాణేతిహాసమహార్థము లనే కాక, మహాకావ్యనిర్మాణశిల్పమునుగూడ కరతలామలకము చేసికొని సరసకావ్య శిల్పసుందరములైన పురాణములను తెలుఁగున వెలయింప యత్నించిరి. సంస్కృతము నుండి ఆంధ్రమున కనువదింపఁబడిన ఇతిహాసమునఁగాని, పురాణమునఁగాని, కావ్య మునఁగాని తెలుఁగుకవులప్రతిభానిష్యంద మని చెప్పకొనఁదగినది కావ్యరసభావశిల్ప సంపత్తియే! తెలుఁగున కావ్యేతిహాసములను రసదృష్టితో విమర్శించుపద్ధతి వ్యాప్తి చెంది నది కాని పురాణవాఙ్మయక్షేత్రమున తెలుఁగుకవులు నిక్షేపించిన కావ్యరసభావసంపదను పరిశోధించు ప్రవృత్తి యింకను ఏర్పడలేదు. తెలుగుపురాణములలో బమ్మెరపోతన భాగవతమును సాహిత్యదృష్టితో విమర్శించుట కొంత కలదు. కాని యదియు నస మగ్రము. ఇఁక మిగిలినపురాణములనుగూర్చి పట్టించుకొనిననాథుఁడు లేఁడు!

ఇట్టితరుణమున ప్రథమాంధ్రమహాపురాణ మగు మారన మార్కండేయపురాణ మునుగూర్చి పర్యాలోచనము చేయుభాగ్యము కలిగిన నేను కృతార్థుఁడను. పరమ పురుషార్థవ్యుత్పత్తిని రసవత్కథాసంపత్తిచే వ్యంజింపఁజేయు నొకవైలక్షణ్య మీపురాణము నకు సహజలక్షణము! నన్నయవలె ప్రసన్నకథాకలితార్థోక్తి గల మారన తిక్కనసోమ యాజి శిష్యుఁడై రసాభ్యుదయోల్లాసముగా కావ్యము నందగింపఁజేయు రచనాశిల్పమును సాధించి మార్కండేయము నొక రసవత్కథాసుధానిధిగా సంతరించెను. మారనవచనశ్రీ వైభవ మాంధ్రపురాణవాఙ్మయరంగమున కొక నూత్నమాధవశ్రీ సాక్షాత్కారము గల్పించి కవికోకిలలకు లలితపురాణకథారసాలపల్లవభిక్ష నర్థించునేర్పుఁ గఱపినది. అట్టి మారనమార్కండేయపురాణరచనామహనీయత్వ మచ్చపడునట్లు సాహిత్యవిమర్శన మింకను తెలుఁగున వెలయకుండుట విచార్యము. ''మత్పురాకృతశుభాధిక్యంబు తా నెట్టిదో'' అట్టిప్రయత్నము చేయు సదవకాశము నాకు లభించినది.

నానావిధశాస్త్రార్థప్రపంచములను తనగర్భకుహరమునందు గుప్తముగా నిలుపుకొనిన ఈపురాణపురుషునియొక్క విరాడ్రూపమంతటిని దర్శించుటకుఁ జేసిన సాహసము కాదిది! కావ్యకథాస్రవంతులకు జన్మస్థాన మైన తత్పురాణసాహిత్యసుందరమూర్తిని యథాశక్తి వాక్పుష్పములతో నారాధించుటకుఁ జేసినప్రయత్నమే యిది! ప్రాచీనార్వాచీనసాహిత్యవిమర్శన మార్గములను మేళవించుకొనుచు మారనపురాణములోని వస్త్వలంకారఛందోరసశిల్పాదులను సమీక్షించుటయే తత్పురాణహృదయావిష్కార మని యిందు భావింపఁబడినది!

మార్కండేయపురాణాంతర్గతకథలను కావ్యవస్తువులుగా గ్రహించిన ఆంధ్ర కవులు మారన రచననే కాక తన్మూల మగు సంస్కృతపురాణమునుగూడ పరిశీలించి, రెండింటియందలి యౌచిత్యమును గ్రహించిరి. కావున కావ్యకథామూలవిచారచర్చ చేయు సందర్భములందు ఉభయపురాణములనుండి కవులు గ్రహించిన కథాంశములఁ బేర్కొని విమర్శించుట యైనది. పురాణప్రత్యక్షప్రభావము గల ప్రబంధకథలనుగూర్చి సవిస్తరముగను, పరోక్షపాక్షికపరంపరాప్రభావము గలవానినిగూర్చి సంగ్రహముగను ప్రపంచించుట యైనది.

ఆంధ్రపురాణములు ధర్మనీతిప్రధానము లయ్యు తెలుఁగుకవుల ప్రతిభావిశేషముచే రసభావసింధువులైన వను సత్యమును ప్రథమాంధ్రమహాపురాణపరముగా నిరూపింపఁ జేసిన యీపరిశోధనము రసజ్ఞుల చిత్తముల కెక్కినచో నేను ధన్యుఁడను!

ఈయంశముపై నేను పరిశోధన చేయుట కంగీకరించి, సిద్ధాంతవ్యాసమును పి హెచ్. డి., పట్టముకొఱకు సమర్పించు నవకాశము కల్పించుటయేకాక, యు. జి. సి. పక్షమున పరిశోధనయాత్ర చేయుటకు నార్థికసహాయము చేయించిన అప్పటి ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యాయులు డాక్టర్ డి. యన్. రెడ్డిగారికి నాకృతజ్ఞతాపూర్వక వందనములు.

తాళపత్రలిఖితగ్రంథపరిశీలనమునకు దయతో నంగీకరించి సదుపాయములు కలిగించిన మదరాసుప్రభుత్వప్రాచ్యలిఖితపుస్తకభాండాగారాధ్యక్షులకును, తిరుపతి శ్రీవేంకటేశ్వరప్రాచ్యలిఖితపుస్తక భాండాగారాధ్యక్షులకును కృతజ్ఞతలు!

ప్రారంభదశలో నాకసంవత్సరకాలము మార్గదర్శకులుగా నుండి పరిశోధన ప్రణాళికను రూపొందించుకొనుటలో నుచితమైన సలహాల నొసంగి ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారికిని, ఆపై నీవ్యాసము నత్యంతాదరాభిమానములతోఁ బర్యవేక్షించిన విద్వన్మణి డాక్టరు పల్లా దుర్గయ్యగారికిని నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

1967 వ సం॥ సెప్టెంబరులో సమర్పించిన ఈ సిద్ధాంతవ్యాసమునకు ఉస్మానియా విశ్వవిద్యాలయము 1969 ఫిబ్రవరిలో పి హెచ్. డి., పట్టమును ప్రకటించినది. ఈ గ్రంథమును ప్రచురించుటకు దయతో నంగీకరించిన ఉస్మానియావిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఉదారహృదయులు నైన శ్రీ యన్. నరోత్తమరెడ్డిగారికిని, సిద్ధాంతవ్యాసము

నకుఁ బరీక్షకులుగా వ్యవహరించిన విద్వన్మణులు ఆచార్య డాక్టర్ జి. యన్. రెడ్డి, డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు గారలకు నా కృతజ్ఞతాభివందనములు!

ఈగ్రంథప్రచురణమున కార్థికముగా కొంత సహాయ మందించి ప్రోత్సహించిన ఆంధ్రప్రదేశప్రభుత్వమువారికి ప్రత్యేకముగా నా కృతజ్ఞతలు!

కవిసమ్రాట్టుల కావ్యములకును, విద్వద్వ్రతంసుల ఉద్గ్రంథములకును కృతిపతిత్వము వహించి, రాజకీయసాహిత్యరంగములలో నజాతశత్రువులై, రవీంద్రకవీంద్రకవితాప్రభావితులై, సమదృష్టితో సాహిత్యశాఖల కాలంబనము కల్పించుచున్న డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు నాగ్రంథస్వీకృతికి అంగీకరించుట నా అదృష్టవిశేషము. ఆంధ్రభారతము వెలసిన నెల్లూరునకును, ఆంధ్రసామ్రాజ్యమహానగరమునకును సాహిత్యబాంధవ్యములు కల్పించి అఖిలాంధ్రవిస్ఫూర్తి వెలయించిన మారనకృతిపై వెలసిన ఈ విమర్శగ్రంథము సాహిత్యబంధువులైన డాక్టర్ గోపాలరెడ్డిగారి కంకిత మగుటలో నౌచిత్యము కలదు. వారికి నా వినయపురస్సరాభివందనములు.

నా కీవిమర్శనాంశమును సూచించినవారు మాగురుదేవులు ఆచార్య డా. దివాకర్ల వేంకటావధానిగారు. నాడు చెళ్లపిళ్లవారికి వలె నేడు దివాకర్లవారికి శిష్యుల మని చెప్పుకొనుటయే తెలుగుదేశమున నొకగొప్ప. వారి శిష్యవాత్సల్యము దాని కదియే సాటి! అమృతహృదయు లైన వా రాశీఃపురస్సరముగా నీగ్రంథమునకు 'ప్రస్తావన' రచించి నాపరిశోధన నభినందించినందులకు వారికి నామనఃపూర్వక నమోవాకముల నర్పించుచున్నాను.

ఆంధ్రప్రదేశసాహిత్యరథసారథులే కాక, సన్నిహితసాహితీమిత్రుల రచనావ్యాసంగములకు సూత్రధారులై, ప్రతిభను గుర్తించి పరిశీలించి పరిపోషించు ప్రజ్ఞాశాలురైన శ్రీదేవులపల్లి రామానుజరావుగారు న న్నాప్తునిగా మన్నించి యెన్నోవిధముల ప్రోత్సహించుచున్నారు. వారికి నేను సర్వదా కృతజ్ఞుఁడను. అట్లే ఛందశ్శిల్పమార్గమునకే కాక, స్వచ్ఛందసాహితీస్నేహశీలమునకు మార్గదర్శకు లైన ఆర్ద్రహృదయులు డా. పాటిబండ మాధవశర్మగారికి నాకృతజ్ఞతలు.

ఈగ్రంథముఖపత్రరచనమున తోడ్పడిన మిత్రులు శ్రీ 'సుధామ'కు, గ్రంథప్రచురణమున విలువైన సలహాల నిచ్చిన మిత్రులు శ్రీ వంగపల్లి విశ్వనాథము, శ్రీ ఇరివెంటి కృష్ణమూర్తి, వై. ఆంజనేయులుగారలకు, ఈగ్రంథముద్రణమును తమ సొంతపనిగా భావించి, స్వల్పకాలములో నందముగా నచ్చొత్తించిన నాగార్జునముద్రణాలయాధిపతులు శ్రీ యన్. వి. నారాయణగారికి, కూర్పరులు శ్రీ వి. గండయ్య, శ్రీ వి. అప్పారావుగారలకు నాకృతజ్ఞతలు! ఈగ్రంథప్రచురణభారమును వహించిన శ్రీమతి చి. సౌ. సుశీలకు, చి. రాధాకృష్ణునికి ఆశీస్సులు!

శ్రీవాణి, హైదరాబాదు,
1-1-1973.

గూడ వెంకట సుబ్రహ్మణ్యం.

# విషయానుక్రమణిక

## ప్రథమసర్గము : మహాపురాణములు - మార్కండేయము


**1. పురాణములు :** 3 - 39

పురాణశబ్దనిరుక్తి 5, పురాణం పంచలక్షణమ్ 8, పురాణస్వరూపము 10, పురాణస్వభావము 16, అష్టాదశ మహాపురాణములు 19, పురాణశ్లోకసంఖ్యలు 23, పురాణవర్గీకరణము 23, పురాణములు-ఉపపురాణములు 27, పురాణము-ఇతిహాసము 28, ఇతిహాసములు - Epics 34, పురాణములు - Myths 36.

**2. మార్కండేయ మహాపురాణము :** 40 - 66

నామవైశిష్ట్యము 40, శ్లోకసంఖ్య 42, మహాభారతప్రశంస 43, పురాణపంచలక్షణములు 49, జడోపాఖ్యానము 50, దుర్గాసప్తశతి 51, మార్కండేయ మహాపురాణము వెలసినకాలము 52, మార్కండేయమహాపురాణ వైశిష్ట్యము 58, మార్కండేయము త్రిగుణప్రధానమైన పురాణము 63, మార్కండేయపురాణ ప్రామాణికత్వము 65, కావ్యకథామూలమైన మార్కండేయము 66.


## ద్వితీయసర్గము : ప్రథమాంధ్ర మహాపురాణము


**1. ప్రథమాంధ్ర మహాపురాణము :** 69 - 89

కృతికర్త : కృతిభర్త : కృతి వెలసినకాలము 69, ప్రథమాంధ్ర మహాపురాణావిర్భావము 76, గురు - శిష్యులు 87.

**2. మారన అనువాదపద్ధతి :** 90 - 144

మారన - భావానువాదపద్ధతి 90, మారన మార్కండేయపురాణమును సంగ్రహించుట 93, ఉపాఖ్యానముల ననువదించిన విధము 96, శాస్త్రార్థముల సంగ్రహీకరణము 99, దేవతాస్తుతుల ననువదించిన విధము 104, కథార్థములను సంగ్రహించుట 110, ప్రకృతివర్ణనలు 121, యుద్ధవర్ణనలు 123, మారన కథారన

పోషణము 131, మారన కల్పించిన కథాంశములు 137, మారన సూక్తులు 139.

3. **ఆఖ్యానశిల్పము :** 145 - 284
ఆఖ్యానశిల్పము 146, ద్రోణనందనచరిత్రము 150, హరిశ్చంద్రో పాఖ్యానము 168, జడోపాఖ్యానము 188, పతివ్రతకథ 191, కువలయాశ్వచరిత్రము 193, అలర్కోపాఖ్యానము 203, స్వారోచిషమనుసంభవము 209, ఉత్తమమనుసంభవము 242, తామస మనుసంభవము 246, చాక్షుషమనుసంభవము 248, వైవస్వత మనువృత్తాంతము 250, సావర్ణిమనుసంభవము 254, రౌచ్యమను సంభవము, భౌత్యమనుసంభవము 257, రాజ్యవర్ధనరాజ చరిత్రము 259, నాభాగునిచరిత్రము 262, వత్సంధ్రచరిత్రము 267, ప్రాంశుప్రాజాత్యాదుల చరిత్రములు 271, ఖనిత్రావేక్షిత మరుత్త రాట్చరిత్రలు 272.

4. **ఛందశ్శిల్పము :** 285 - 354
(అ) విశేషచ్ఛందములు
దండకము 287, స్రగ్విణి 288, ఉపజాతి 290, లయగ్రాహి 290, మానిని 291, కవిరాజవిరాజితము 292, స్రగ్ధర 292, మహాస్రగ్ధర 295, మత్తకోకిల 298, తరలము 299, ఉత్సాహము 302, తరువోజ 304, మాలిని 305.

(ఆ) సామాన్యచ్ఛందములు
శార్దూల విక్రీడితము 308, మత్తేభవిక్రీడితము 313, చంపకమాల 317, ఉత్పలమాల 322, కందము 329, తేటగీతి 340, ఆటవెలఁది 343, సీసము 344, గద్యము 350, ఛందస్సంవాదము 351.

5. **అలంకారశిల్పము :** 355 - 371
ఉపమాలంకారము 356, రూపకాలంకారము 364, అర్థాంతరన్యాసము 369, మఱికొన్ని అర్థాలంకారములు 370, శబ్దాలంకారములు 371.

6. **రసశిల్పము :** 372 - 382

7. **మారనశైలి :** 382 - 400
పురాణశైలి 382, తెలుఁగులోని చతుర్విధపురాణశైలులు 385, మారనశైలి 386, మారన పద్యరచనపై నన్నయతిక్కనల

ప్రభావము 391, మారన ప్రయోగించిన జాతీయములు - లోకోక్తులు 398.

## తృతీయసర్గము : మార్కండేయపురాణము - కావ్యవస్తుప్రదానము

1. **మార్కండేయము మూలమైన తెలుఁగు కావ్యములు :** 403 - 408
కావ్యవర్గీకరణము 404.

2. **మనుచరిత్రము :** 409 - 521
కృష్ణదేవరాయలు - అల్లసానిపెద్దన 409, వస్తువిస్తృతి : మారన పురాణప్రభావము 422 - ఉభయపురాణ ప్రభావము 435, వస్తునిర్మాణము : మారన పురాణప్రభావము 445, ఉభయపురాణ ప్రభావము 460 - పెద్దన స్వయముగాఁ జేసిన కల్పనలు 467, వస్త్వైక్యము 483, పాత్రస్వరూపస్వభావనిరూపణము 488, రసపోషణవిధానము 507, పెద్దన పద్యరచనపై మారన ప్రభావము 513, ఉపసంహారము 520.

3. **కువలయాశ్వచరిత్రము :** 522 - 546
ప్రబంధములోని ప్రధానకథాంశములు పురాణములోనివే 524, పురాణప్రబంధకథల స్వరూపస్వభావములందలి భేదము 525, చిననారాయణకవి చేసినకల్పనలన్నియు సార్థకములు కావు 527, ఉభయపురాణములు కువలయాశ్వచరిత్రపై వైచినప్రభావము 541.

4. **మదాలసాపరిణయము :** 547 - 553
కవి చేసిన మార్పులు 548, వస్తువిస్తృతి - వర్ణనలు 552, మూలమునుండి గ్రహింపని కొన్ని కథార్థములు 553, కావ్యముపై పురాణప్రభావము 553.

5. **మదాలసావిలాసము :** 554 - 557
కువలయాశ్వుని కథకు సర్వాంగసంపూర్ణత్వము కల్పించిన విధము 554.

6. **హరిశ్చంద్ర చరిత్రము :** 558 - 594
గౌరన కావ్యకథామూలము 558, ప్రబంధకల్పనలపై పురాణ ప్రభావము 562, పురాణప్రబంధకథా తారతమ్యములు 587, శంకరకవి హరిశ్చంద్రచరిత్రము 590, శరభకవిపై పురాణ ప్రభావము 592.

7. **ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము :** 594 - 605

తక్కెళ్లపాటి లింగనమంత్రి ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము 594, ఏతత్కావ్యకల్పనలపై మార్కండేయపురాణ ప్రభావము 597, పురాణప్రబంధకల్పనలలోఁ గల తారతమ్యములు 598, చంద్రశేఖరకవి - ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము 601, తిరుపతివేంకటకవులు - పూర్వహరిశ్చంద్ర చరిత్రము 603.

8. **మరుత్తరాట్చరిత్రము :** 606 - 608

9. **శ్రీదత్తభాగవతము :** 609 - 610

## చతుర్థసర్గము : మార్కండేయపురాణము - మఱికొన్ని ఆంధ్రానువాదములు

1. **మార్కండేయపురాణము : మఱికొన్ని ఆంధ్రానువాదములు :** 613 - 620

పొన్నతోట ఔబళకవి యనువాదము 613, మంద కామేశ్వరకవి యనువాదము 614, వచన మార్కండేయపురాణములు 619.

## పంచమసర్గము : పురాణము కాని పురాణము

1. **మహాపురాణము కాని మార్కండేయము :** 623 - 635

ఎల్లకర నృసింహకవి మార్కండేయపురాణము 623, పర్వతమంత్రి లింగనామాత్యుని మార్కండేయము 631, పోచిరాజు వీరనామాత్యుని భావనాఋషి మాహాత్మ్యము 631, శిష్టు కష్ణమూర్తి పీఠారణ్యమాహాత్మ్యము 633.

**ఉపసంహృతి :** 636 - 640

ప్రసక్తగ్రంథసూచిక 637, అనుషక్తగ్రంథసూచిక 640.

**అనుబంధములు :** 641 - 656

# పురాణములు

పురాతత్త్వజిజ్ఞాసువు లైన ఆర్షమనీషులు సర్గ ప్రతిసర్గాది మహావిషయములను శ్రుతిస్మృతి పరమార్థానుసంధానవృత్తు లై భావించి, దర్శించి, వానిని చతుర్వర్గ ఫలోపాత్తము లగునట్లు మిత్రసమ్మితములుగాఁ ప్రపంచించిన సంహితాస్వరూపములు పురాణములు! అనంతకాలస్వరూపుఁ డై సృష్టిస్థితిలయాత్మక మైన విశ్వసంసార పరిభ్రమణమునకు సాక్షీభూతుఁ డగు పురాణపురుషుని పరతత్త్వ ప్రతిపాదనము పరమ ప్రయోజనముగా నెంచుకొని తదర్థమును త్రివిధభాషల నాశ్రయించి వ్యక్తీకరించు సారస్వత మూర్తులు పురాణములు! ఆగమార్థజలసేచనముచే భారతీయహృదయక్షేత్రముల నార్ద్రీకరించి ఆర్షసంస్కృతిసస్యములను బండింప నేర్పఱచిన రసప్రవాహములు పురాణములు! అపారకథానిధులను జూపి మురిపించుచు నమూల్యశాస్త్రవిధులను జెప్పి యొప్పించుచు కవిరసికముముక్షుజనములయొక్క రచనాప్రసంగవ్యాసంగముల నుపలాలించు మాతృమూర్తులు పురాణములు!

భారతీయసంస్కృతికి మూలకంద మైన వేదధర్మమును లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుట కేర్పడిన సులభసాధనములు పురాణములు. అందువలననే నారదీయమహాపురాణము—"వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే ష్వేవ సర్వదా" (II. 24.18)—వేదములు పురాణసుప్రతిష్ఠితము లని యుగ్గడించినది. అది నిస్సంశయ మని స్కాంద మిట్లు నొక్కి వక్కాణించినది:

"వేదవ న్నిశ్చలం మన్యే పురాణార్థం ద్విజోత్తమాః
వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్ర సంశయః ॥" (ప్రభాసఖం. 2.60-61)

ఈసత్యమునే "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అని మహాభారతము (ఆది ప. I. 267) చాటిచెప్పుచున్నది. వేదనిగూఢార్థము లవగతము కావలయు నన్నచో నానాపురాణవిజ్ఞాన మావశ్యకము. దీనినే వాయుపురాణము భంగ్యంతరముగా నిట్లు పేర్కొనియున్నది:

"యో విద్యా చ్చతురో వేదా న్సాంగోపనిషదో ద్విజః
న చే త్పురాణం సంవిద్యా న్నైవ సస్యా ద్విచక్షణః ॥" I. 2. 180

వేదవేదాంగవిజ్ఞానము గలిగియు ద్విజుఁడు పురాణవిజ్ఞానవిరహితుఁ డైనచో విచక్షణుఁడు కా జాలఁ డని దీనితాత్పర్యము.

దేవీభాగవత మీయంశమును పరమోదాత్తముగాఁ బ్రపంచించినది. పరమేశ్వరునకు శ్రుతిస్మృతులు నేత్రములఁట! పురాణము హృదయమఁట!

"శ్రుతిస్మృతీ ఉభేనేత్రే పురాణం హృదయం స్మృతమ్
ఏతత్త్రయోక్త ఏవస్యా ద్ధర్మో నాన్యత్ర కుత్రచిత్ ॥"[1] XI. 1.21

భగవంతుఁడు చక్షురింద్రియములతో సత్య మగు ధర్మమును దర్శించును; హృదయమునఁ దచ్చింతన మొనర్చి ధర్మతత్త్వమును నిశ్చయించును. స్వరూపజ్ఞానమాత్రమునిచ్చు జ్ఞానేంద్రియములకంటె వివేకసహిత మైన యంతరింద్రియము శ్రేష్ఠము. కావున పరమపురుషుని హృదయస్థానములగు పురాణములు ధర్మాధర్మనిశ్చయసమర్థము లని దేవీభాగవతతాత్పర్యము.

వాజసనేయీబ్రాహ్మణోపనిషత్తు- వేదములును, ఇతిహాసపురాణములును పరమేశ్వర నిశ్వాసరూపములని యభివర్ణించెను.

"అస్యమహతోభూతస్య నిశ్శ్వసిత మేతద్య దృగ్వేదో
యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసఃపురాణమ్".

మానవునకు శ్వాసనిశ్వాసలు ప్రాణసంకేతము లైనట్లే భగవంతునకు ప్రాణస్థానములు వేదపురాణేతిహాసములని యుపనిషత్తాత్పర్యము. జీవునకు శ్వాసముతో యావద్ద్రవ్యభావిత్వ మున్నట్లే భగవంతునకు వేదపురాణములతో యావద్ద్రవ్యభావిత్వసంబంధము కలదు. దేవీభాగవతము - వేదము భగవచ్చక్షు వనియు, పురాణము భగవద్ధృదయమనియు వేఱువేఱుగాఁ బేర్కొనియుండగా, ఈ యుపనిషత్తు వేదపురాణములను రెండింటిని సమముగాఁ బరిగణించి భగవత్ప్రాణస్థానము లని యుగ్గడించియున్నది. అనఁగాఁ బ్రాచీనులు పరమధర్మప్రతిపాదనమునందు వేదార్థముల కిచ్చిన యున్నత స్థానమును, ప్రమాణగౌరవమును పురాణముల కిచ్చి గౌరవించి రని స్పష్టమగుచున్నది. అందుల కీఛాందోగ్యోపనిషద్వాక్యములును దార్కాణములే-

"ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మథర్వణమ్
చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేద మితి". VII. 1. 2

ఇం దీయుపనిషత్తు ఇతిహాసపురాణము పంచమవేద మని చాటుచున్నది. పంచమవేదము చతుర్వేదసారము.

నారదీయవాయుపురాణము లింతకంటె మఱియొకయడుగు ముందుకు వైచి పురాణములకు వేదములకంటె నగ్రతాంబూల మిచ్చి గౌరవించినవి. నారదీయమహాపురాణము

1. "ఉభేనేత్రే పరమేశ్వర స్యే త్యర్థః చక్షు ర్వై సత్య మితి శ్రుతేః; పరమేశ్వరేణ శ్రుతిస్మృతిరూప చక్షుర్భ్యాం దృష్టో ధర్మః సత్యః. చక్షుషా దృష్టమేవ మనసి నిశ్చినోతీతి పురాణరూపహృదయే నిశ్చితో ధర్మోఽపి సత్య ఇత్యర్థః."
—నీలకంఠకృత తిలకవ్యాఖ్య.

శ్రుతిస్మృతిపురాణముల కున్న సంబంధమునుగూర్చి చర్చించుచు పురాణప్రాశస్త్యము నిట్లుదాత్తముగఁ గీర్తించెను :

"శ్రుణు మోహిని మద్వాక్యం వేదోఽయం బహుధా స్థితః
యజ్ఞకర్మక్రియావేదః స్మృతి ర్వేదో గృహాశ్రమే॥
స్మృతి ర్వేదః క్రియావేదః పురాణేషు ప్రతిష్ఠితః
పురాణపురుషా జ్జాతం యథేదం జగదద్భుతమ్॥
తథేదం వాఙ్మయం జాతం పురాణేభ్యో న సంశయః
వేదార్థా దధికం మన్యే పురాణార్థం వరాననే ॥" II. 24. 15-17.

వేదము పురాణప్రతిష్ఠిత మనియు, పురాణపురుషునినుండి బ్రహ్మాండ మెట్లుద్భవించినదో సర్వవాఙ్మయజగత్తు పురాణములనుండి యుద్భవించిన దనియు, పురాణార్థము వేదార్థము కంటె నధిక మనియు నారదీయపురాణమతము.

"పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్
అనంతరం చ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిర్గతాః ॥" I. 60-61

అని చాటుచున్న వాయుపురాణము ఇందులకు సాక్ష్యము పలుకుచున్నది. ఆదిదేవుఁడు సర్వశాస్త్రప్రథమమైన పురాణమును స్మరించినయనంతరమే వేదము లతనిముఖవినిర్గతము లైనవఁట! కల్పాంతమున పితామహుఁడు సర్గవ్యాపారారంభశీలుఁ డై యుండునెడ నతనికి స్ఫురించెడిది పురాణపురుషునియందు సంగుప్త మై యున్న పురాకల్పమందలి సర్గవిధానమే. కావున సృష్టికి మూలమైనది పురాణము! అనంతకాలస్వరూపుని ప్రథమనిశ్వాసము పురాణము! అఖండవాఙ్మయసంభూతికి మూలకంద మైనది పురాణము!!

## పురాణ శబ్ద నిరుక్తి :

పురాణశబ్దము వేదకాలమునాటికే ప్రాచీన మను నర్థమున రూఢికెక్కినది. ఋగ్వేదమున పురాణశబ్దము విశేషణముగా వాడఁబడియున్నది. అందు 'పురాతన' మను శబ్దప్రయోగము కానరాదు. తదర్థమునఁ బురాణశబ్దమే యుపయుక్తమైనది. ఆతరువాత నాపదము విశేషణముగానే కాక 'పూర్వగాథ' లేక 'ప్రాచీనకథ' యను నర్థము నిచ్చు విశేష్యముగాఁగూడ వాడఁబడుచునథర్వవేదమునఁ బ్రయోగింపఁబడినది. ఋక్సామములును ఛందస్సులును పురాణమును యజుస్స్తోత్రములతోఁ గలసి పవిత్రసవనోచ్ఛిష్టమునుండి జన్మించిన వనియు, రుద్రుఁడు బృహద్దిశ యగు నీశాన్యమునకుఁ గదలిపోగా నతనివెంట నితిహాసము, పురాణము, గాథలు, నారాశంసలు, కదలిపోయె ననియు నథర్వవేదమునఁ బ్రస్తావింపఁబడి యుండుటచే[2] నావేదకాలమునఁ బురాణ మితిహాసాదులతోపాటు గా

---

2. 'ఋచః సామాని ఛందాంసి పురాణం యజుషా సహ। ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివిశ్రితః॥' —అథర్వ వేద. XI. 7. 24.

సారస్వతప్రక్రియగా గుర్తింపఁబడె ననియు, పురాణములు వేదములవలె నతిప్రాచీనము లనియుఁ దెలియుచున్నది. శతపథబ్రాహ్మణమునందును, ఉపనిషత్తులందును ప్రాచీన గాథలను వర్ణించు గ్రంథములుగాఁ బురాణములు పేర్కొనఁబడినవి.3 పురాణస్మరణానంతరము బ్రహ్మముఖమునుండి వేదము లుదయించె నను వాయుపురాణోక్తవాక్యముల నాధారముగాఁ గొని వేదములకంటె మున్ను పురాణములు పురాతనగాథాలహరులవలె దేశమున వ్యాపించియుండె నని విమర్శకులు భావించుచున్నారు.[4]

నైఘంటికు లొనర్చిన పురాణశబ్దనిరుక్తి యిట్లున్నది :

"పురా భవ మితి పురాణమ్"

"పురా పూర్వస్మిన్ భూత మితి పురాణమ్' –(అమరకోశము– గురుబాలప్రబోధిక)

"పురా భవ మితి పురాణమ్"–(శబ్దకల్పద్రుమము)

"పురా నీయతే ఇతి పురాణమ్"–(వాచస్పత్యము)

"పురా నవం భవతి పురాణమ్"–(యాస్కనిరుక్తము)

"పురా అనక్తి" అను నిరుక్తియు నొండు కలదు.

ఇట్టి నైఘంటిక నిరుక్తుల కాలంబనములు పురాణములందు కలవు.

"యస్మా త్పురా హ్యనక్తీదం పురాణం తేన హి స్మృతమ్
నిరుక్త మస్య యో వేద సర్వపాపైః ప్రముచ్యతే ॥" –వాయుపు. I. 1.200

"పురా పరంపరాం వష్టి పురాణం తేన వై స్మృతమ్" ॥ –పద్మపు. V. 2.53.

"యస్మా త్పురా హ్య భూ చ్చైత త్పురాణం తేన తత్స్మృతమ్"
–బ్రహ్మాండ పురా. I. 1.173.

"పురాతనస్య కల్పస్య పురాణాని విదు ర్బుధాః ॥" –మత్స్య పు. 53.63.

వీనిని బరిశీలింపఁగాఁ బురాణము లనఁ జిరకాలమునఁ బుట్టిన వనియుఁ, ప్రాచీనవిషయములను దమయందు బొందించుకొనిన వనియుఁ, ప్రాచీనకాలమున నవీనములుగా నుండిన

---

'స బృహతీందిశ మనువ్యచలత్ । త మితిహాస శ్చ పురాణం చ గాథాశ్చ నారాశంసీ శ్చానువ్యచలన్ ॥ ఇతిహాసస్య చ వై పురాణస్య చ గాథానాం చ నారాశంసీనాం చ ప్రియం ధామ భవతి । య ఏవం వేద॥' —అథర్వ. XV. 6.10-11.

3. 'మధ్వా హుత యో హ వా ఏతా దేవానాం యదనుశాసనాని విద్యా వాకోవాక్య మితిహాసపురాణం గాథా నారాశంసీ రిత్యహరహః స్వాధ్యాయ మధీతే ॥'
— శతపథబ్రాహ్మణ. XI. 3.5 అధ్యా. 8 బ్రా.

4. "Puranas in the form of legendary lore existed from times of antiquity, even prior to the revelation of the Vedas, and this was handed down to posterity. There was no Purana literature as such in those days of lore
--Studies in the Epics and Puranas. Introduction P. 22.

వనియు, పురావిషయములందు జీవించెడి వనియు, ప్రాక్తనవిషయాభిరతి కలిగిన వనియు, పురాతనకల్పవస్తుకము లనియు నేర్పడుచున్నది.

ఇవియన్నియు నిట్లుండ "పురాఽపి నవమ్ పురాణమ్" అను నిరుక్తి యొకటి ప్రసిద్ధిఁ గాంచినది. దీనినిబట్టి పురాణములం దభివర్ణింపఁబడు వస్తువిశేషములు పురాతనము లయ్యును నవ్యములుగను, నిత్యనూతనములుగను భాసించుచుండు నని తాత్పర్య మేర్పడుచున్నది. పురాణములందలి యీనవ్యతయే వీనికి ఉత్తమసాహిత్యగౌరవము నాపాదించుచున్నది. కొందఱు పురాణములందలి వస్తువు పురాతన మయ్యు నవి రచింపఁబడినకాలమును బట్టి యర్వాచీనములుగాఁ బొడగట్టుచున్నవి కాన నవ్యము లనఁబడుచున్న వని యీనిరుక్తి నన్వయించుచున్నారు. అట్లైనను పురాణ మన నతిప్రాచీన మైన దనెడి పూర్వనిరుక్తులతాత్పర్యమున కెట్టివిప్రతిపత్తియు నేర్పడుట లేదు కాని పురాణములు ప్రప్రథమమునఁ బురాణగాథాస్వరూపము లై యుండినను క్రమముగా వానియం దర్వాచీనము లైన వస్తువిశేషము లెన్నియో చేరుచువచ్చిన వని యీనిరుక్తి స్పష్టముచేయుచున్న దనవచ్చును!

మఱియును మహాపురాణములలో భవిష్యపురాణ మనుపేర నొండుపురాణము కనవచ్చుచున్నది. ఆపురాణనామములోనే పరస్పరవిరుద్ధార్థము లిచ్చు రెండు శబ్దములు కలవు. అందు భవిష్యత్కాలమునఁ బ్రవర్తిల్లు కథార్థములు కూడ పురాణము పేర నిబంధింపఁబడియున్నవి. దీనినిబట్టి కాలక్రమమునఁ బ్రాచీనార్వాచీనవిషయసంఘాతమే కాక భవిష్యత్కథార్థములు కూడ పురాణములందుఁ జేర్పఁబడిన వని విమర్శకులు భావించుచున్నారు.[5] దీని కుపబలకముగా నమరసింహుఁడు తనయమరకోశమున 'పురా' శబ్దార్థము నెఱిఁగించుచు "స్యాత్ప్రబంధే చిరాతీతే నికటాగామికే పురా" అని నానార్థావ్యయవర్గమునందు నిర్దేశించియున్నాఁడు. దీనిని గురుబాలప్రబోధికాకర్త యిట్లు విపరించినాఁడు. "పురా—ఇది వాక్యరచనయందును అనేకకాలమందును, పోయినకాలమునందును, రాఁగలదానియందును వర్తించును. ఉ॥ వాక్యరచనకు "పురాణం", అనేక కాలమునకు "పురాతనం"; అతీతమునకు "పురాగతం", సమీపమునకు "పురాగచ్ఛతి", భవిష్యదర్థమునకు "ఆలోకే తే నిపతతి పురా సా బలివ్యాకులా వా". కొందఱు నిరంతర పాఠమునందును, పూర్వ మనేకకాలము గడచినదానియందును, ఆసన్నభవిష్యదర్థమందును వర్తించు నని చెప్పుదురు. ఉ॥ నిరంతరపాఠమునకు—"ఉపాధ్యాయేన పురాఽధీయతేస్మ", పూర్వ మనేకకాలము గడచినదానికి-"పురాతనం త్వాం పురుషం పురావిదః", ఆసన్నభవిష్యదర్థమునకు "గచ్ఛ శీఘ్రం పురాదేవో వర్షతి". దీనినిబట్టి క్రీ. శ. 4వ శతాబ్దికిఁ బూర్వమే "పురా" శబ్దమున కాసన్నభవిష్యదర్థముకూడ రూఢికెక్కిన దని స్పష్టమగుచున్నది. పురాశబ్దమున కీనానార్థముల నేర్పఱచుటచే నమరసింహుఁడు భవిష్య పురాణ మను సమాసమునందలి యనన్వయమును దొలఁగించి పుణ్యము గట్టుకొనెను.

---

5. History of Dharma Sastra. Vol. V. P. 855.

**పురాణం పంచలక్షణమ్ :**

పురాణవస్తులక్షణములను బరిశీలించి తత్స్వరూప నిర్వచనము చేయ యత్నించిన ప్రాచీనులు పెక్కుమంది కలరు. వారందఱిలో నమరసింహుఁడు "పురాణం పఞ్చ లక్షణ" మ్మని చెప్పిన నిర్వచనము కడుప్రసిద్ధి కెక్కియున్నది.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం[6] చేతి లక్షణానాం తు పఞ్చకమ్॥"

ఈసూత్ర మంతప్రాచుర్య మందుట కాపంచలక్షణముల పరమసార్థక్యమే కారణము. పురాణమునకు సర్గవర్ణనము ప్రథమలక్షణ మని పైసూత్రనిర్దేశము. సర్గమందు బ్రహ్మాండోత్పత్తి చెప్పఁబడును. పురాణము బ్రహ్మాండోత్పత్తినే మొదట ఎందులకుఁ జెప్పవలెను ? అన్నచో తన పురాణనామమును సార్థక మొనర్చుకొనుటకే యని సమాధానము. పురాణ మనఁ బ్రాచీనము, గతము అని యర్థముకదా ! ఆ గతము అద్యతనభూత మనియు అనద్యతనభూత మనియు ద్వివిధము. అందనద్యతనభూతముయొక్క యాదిమదశ పురాణము. అచ్చటినుండి యద్యతనభూతమువఱకుఁ గల గతము చరిత్ర లేక ఇతిహాసము. అనఁగా నొకపురావస్తువుయొక్క యుత్పత్తినిగూర్చియు, తత్సృష్టికారణమునుగూర్చియుఁ జెప్పెడి ప్రాచీనగాథ పురాణ మనఁబడవచ్చును. తద్విస్తరవికాసాదులనుగూర్చి వివరించుగాథ నాతిప్రాచీనము గానిచో నితిహాస మనవచ్చును. అట్లగుచో – పురాతత్త్వజిజ్ఞాసువులైనమనీషులు బ్రహ్మాండముయొక్క పుట్టుపూర్వోత్తరములఁగూర్చి లోకమునకుఁ దెలియఁజెప్పఁగడంగిన గాథావిశేషమే సర్గము. అంతకంటెఁ బ్రాచీనమైన వస్తువు సృష్టియందుఁ గానరాదు. కావునఁ బురాణ మచ్చటినుండి ప్రారంభ మగుటకంటె నౌచిత్యము మఱొండు లేదు. విద్యారణ్యులు ఐతరేయబ్రాహ్మణ భాష్యోపోద్ఘాతమునందు "దేవాసురా స్సంయత్తా ఆసన్" ఇత్యాదయః ఇతిహాసాః। "ఇదంవా అగ్రే నైవ కించిదాసీత్" ఇత్యాదికం జగతఃప్రాగవస్థా ముపక్రమ్య సర్గప్రతిపాదకం వాక్యజాతం పురాణ'[7]మ్మని నిర్దేశించిననిర్వచనము దీని కెంతయో ప్రోద్బలకముగా నున్నది.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము లను పంచలక్షణములు గలిగినవి పురాణము లని యమరకోశము. వంశానుచరితస్థానమున భూమ్యాదేఃసంస్థాన మ్మను పాఠాంతర మొండు కనఁబడుచున్నది. సర్గ మన నాది సృష్టి. ప్రతిసర్గ మనఁ గల్పాంతమున జరుగుపునస్సృష్టి. దీనిని విసర్గ మనియు నందురు. దేవతలయొక్కయు,దేవర్షిబ్రహ్మర్షులయొక్కయు గోత్రానుక్రమము వంశము. మనుప్రకాశక్రమమును, మనువులపరిపాలనకాలమును వర్ణించునవి మన్వంతరములు. వంశానుచరితము లన సూర్యచంద్రాది వంశములందు జన్మించిన చక్రవర్తుల చరిత్రములు. భూమ్యాదిసంస్థాన మనఁగాఁ బ్రపంచభౌగోళికస్థితిగతులనుగూర్చినవర్ణనము. పై

6. వంశ్యానుచరితం-లేక-భూమ్యాదేః సంస్థానం. (పా. భే.)
7. చూడు: కావ్యాలంకారసంగ్రహము. శ్రీ స. సూ, శాస్త్రి. పుట. 268.

పంచలక్షణములు పురాణములం దవశ్య ముండవలసినవి, ఉండఁదగినవి యని యమరసింహునిమతము. ఇట్టియభిప్రాయమును మార్కండేయాగ్నివాయువిష్ణుకూర్మ మత్స్యాదిమహాపురాణములు[8] వ్యక్తము చేసియుండుటయేకాక తమయందు యథావకాశ ముగా నాపంచలక్షములకు సంబంధించిన వస్తుసంజాతమును సంతరించి యుంచినవి. కావున పురాణ ప్రతిపాదితమైన పంచలక్షణసూత్రము నతిప్రామాణ్యబుద్ధితోఁ బ్రాచీనులు గ్రహించియుండి రని భావింప వీలగుచున్నది.

'ప్రతిసర్గము'నందు బ్రహ్మదు లొనరించిన సృష్టివిధానము వివరింపఁబడి యుండును. అందు స్థావరజంగమాత్మక మైన సృష్టివైవిధ్యము విపులముగా వర్ణిత మగును. వంశములందు దేవాసురాదివిభేదోత్పత్తియు, బ్రహ్మర్షివంశకర్తలచరిత్రము లును వర్ణింపఁబడును గావున సృష్టింపఁబడిన జీవరాసులలో నేర్పడిన క్రమబద్ధమైన వికాస మిం దభివర్ణింపఁబడును. మన్వంతరములందు ధర్మశాస్త్రప్రవర్తకులై భువిని శాసించిన పదునలుగురు మనువులయుత్పత్తియు, వారిపరిపాలనకాలమునందలివిశేషము లును వర్ణింపఁబడును. అనగా నీయంశమునందు వేదధర్మమును లోకమున నాచరింపఁ జేయుటకే ర్పడినవిశిష్టసంస్థలవంటి మహావ్యక్తులనుగూర్చినకథలు కీర్తింపఁబడును. వంశానుచరితమున దైవమూలము లైన సూర్యచంద్రవంశములందు జన్మించి ధర్మవీరు లయి ప్రసిద్ధికెక్కిన మహారాజులచరిత్రములు వివరింపఁబడును. సర్గప్రతిసర్గవంశము లలో సృష్ట్యారంభమును, వేదోత్పత్తియు, దేవదానవాదుల యుత్పత్తివికాసములును వర్ణింపఁబడఁగా మన్వంతరవంశానుచరితములందు మానవజాతివ్యవస్థయుఁ దత్పరిపాలన మును, దత్ప్రభువుల విధానమును దెలుపఁబడుచున్నవి. కావున పంచలక్షణవిశిష్టము లైన పురాణములు ప్రపంచోత్పత్తివికాసక్రమమును ప్రదర్శించుటయే కాక, వేదాది ధర్మములు దేవమానవసంఘములం దనుష్ఠితము లగు క్రమమును నిర్దేశించుచు వేదశాస్త్రాదు లలో తమప్రత్యేకతను నిల్పుకొనినవి.

అందువలననే ప్రాచీనులు వేదములవలెఁ బురాణములను బరిగణించిరి; కంఠస్థము చేసిరి; శిష్యులకు బోధించిరి; పర్వదినములలో శ్రోతలకు వినిపించిరి; వ్యాఖ్యానములు వ్రాసిరి; ప్రమాణము లని నమ్మిరి; ప్రాణప్రదముగా రక్షించిరి; భావితరములవారికి నక్షయనిధులుగా నందించిరి।

భారతీయులకు వలెనే బాబిలోనియనులకుఁగూడఁ బురాణసాహిత్య మున్నట్లు తెలియ చున్నది. అలెగ్జాండరునకు సమకాలికుఁడైన యొకచరిత్రకారుఁడు Chaldeans చరిత్ర వ్రాసెనఁట। దాని పూర్వభాగమున నాతఁడు బాబిలోనియనుల ప్రాచీనచరిత్రను వర్ణించుచు నాజాతీయులకు వారిపురాణములపై నున్నశ్రద్ధాభక్తుల నుగ్గడించెను. దాని

---

8. చూడు ; మార్కం. పురా. 134-8; వాయు పురా. I. 4-10-11; విష్ణు పురా. III. 6-24: వరాహ పురా. 2.4; కూర్మ పురా. I. 1.12; భవిష్య పురా. I. 2.4. మఱియు - 'పంచాఙ్గాని పురాణేషు ఆఖ్యానక మితి స్మృతమ్ । సర్గశ్చ...... పురాణం పఞ్చలక్షణమ్ ॥ మత్స్యపురా. 53.65.

వలన బాబిలోనియనుల నూటయెబదివేలసంవత్సరముల ప్రాచీనచరిత్రను దెలుపు లిఖిత గ్రంథములు భద్రముగా దాచఁబడియున్న వనియు, వానియందు స్వర్గాదులయొక్కయు, మహార్ణవములయొక్కయు, ప్రాచీనగాథలు వ్రాయఁబడియున్న వనియు, సర్గప్రతిసర్గ వంశమన్వంతరాదులకుఁ దుల్యములైన లక్షణము లాగ్రంథములందుఁ గానఁబడుచున్న వనియుఁ దెలియవచ్చుచున్నది. అనఁగా బాబిలోనియనులు భారతీయులవలెనే ప్రాచీనములును, పంచలక్షణప్రధానములును నైన పురాణములఁ గలిగియుండి రనుట స్పష్టము.[9] 'పురాణం పంచలక్షణ' మ్మనుసూత్రము ప్రపంచమునందు వెలసిన ప్రాచీనజాతులయొక్క పురాణవాఙ్మయమున కంతటికిని నన్వయించు విశ్వజనీనమైన విశిష్టనిర్వచన మన వచ్చును!

అష్టాదశమహాపురాణములను బరిశీలించినచో వానియందు పంచలక్షణములకు సంబంధించినప్రణాళిక బహుళముగాఁ గానవచ్చుచున్నది. విష్ణుపురాణాదులు తల్లక్షణములకుఁ బూర్తిగా విధేయములై యుండుటయుఁ గానఁబడుచున్నది. కావున భారతీయ పురాణవాఙ్మయమునకు పంచలక్షణసూత్రము ప్రాణాధారమువంటి దని భావింపవచ్చును. పురాణముల ప్రాచీనత్వమున కీపంచలక్షణసూత్రము గీటురాయి వంటిది.

**పురాణ స్వరూపము :**

పురాణములు పంచలక్షణములతో నాగలేదు. భారతీయజిజ్ఞాసువులు తమమనోబుద్ధులు ప్రసరించినంతమేరకు విజ్ఞానమును త్రవ్వి పురాణములందు నింపి, వానిని భారతీయవిజ్ఞానసర్వస్వములుగాఁ దీర్చిదిద్ద యత్నించిరి. హిందూమతము అన్యమతస్థుల దాడులకును హింసాకాండలకును గుఱియై నామరూపములు లేక నశింపకుండ రక్షించుటకై తన్మతసంబంధములైన సమస్తవిజ్ఞానవిషయసముదాయము నేకత్ర సంతరించి సంరక్షింపవలె నను సదుద్దేశముతోఁ బ్రాచీనులు ప్రజాదరణమున కత్యంతపాత్రములగుచున్న పురాణముల నెన్నుకొని వానియందు వీలైనప్పు డెల్ల తమజాతియొక్క సారస్వతధనమును నిధులుగా నిలుపుచు వచ్చిరి. దానవ్రతభక్తియోగాదివిషయములును, వేదాంతము, వైద్యము, సంగీతము, జ్యోతిషము, శిల్పము, గణితము, వ్యాకరణము, ఛందోఽలంకారములు, నాట్యము, రాజనీతి, సాంఘికనీతి మొదలగు బహుశాస్త్రములకు సంబంధించిన యంశములు పురాణచ్ఛత్రముక్రిందఁ దలదాచుకొనినవి. ఇట్లు వరదలుగా వచ్చిపడిన శాస్త్రాచారాది విషయములతోఁ గలసి పురాణములు బృహత్తరసారస్వత గ్రంథములుగా విశ్వరూపము దాల్చినవి. ఇట్లనుటచేఁ బ్రతిపురాణమునందును పైనఁ బేర్కొనిన సర్వవిషయము లుండు నని భావింపరాదు. కొన్నింటియందు కొన్ని యుండును. మఱికొన్నింటియందు మఱికొన్ని యుండును. కాని పురాణవాఙ్మయమును సామూహికముగాఁ బరిశీలించినచో నన్నియు దానియందుఁ గానవచ్చుచుండును.

---

9. The Matsya Purana—A study. Page. 18-19.

పురాణములందు వివిధశాస్త్రాచారాదివిధులకు సంబంధించిన విషయసంఘాత మధికముగాఁ జేరుటవలనఁ బ్రాచీనములైన పంచలక్షణముల కున్న స్థానము నానాటికిఁ గుంచించుకొని పోయినది; కొన్నింట అస్తినాస్తివిచికిత్సకు విషయమైనది. చరిత్రకారుల యభిప్రాయములో మహాపురాణములు క్రీ.శ. 5,6 శతాబ్దులకుఁ బూర్వమే వెలసియున్నవి. మతప్రచారమునకుఁ బురాణము లుత్తమసాధనము లని గుర్తింపఁబడినవి. సర్గాదిపురా విషయవిచారము పురాణముల కప్రధానలక్షణ మైనది. దానికితోడు భారతీయమత క్షేత్రమునఁ దలయెత్తిన శైవవైష్ణవాదిమతము లావేశమూర్తులై తమ కనాదిత్వగౌరవ మాపాదించుకొనుటకును, వేదప్రామాణ్యము సిద్ధింపఁజేసికొనుటకును బ్రత్యేకపురాణములనే వినిర్మింప నారంభించినవి. దానితో మహాపురాణములతోపాటు ఉపపురాణములయుత్ప త్తియు నారంభమైనది. క్రీ.శ. 7 లేక 8 వ శతాబ్దినుండి 13వ శతాబ్దివఱకు నీయుప పురాణము లధికసంఖ్యలో వెలువడినవి. ఇట్లు వెలసినపురాణములు క్రమముగాఁ బ్రాంతీయభాషలయందును ననువదింపఁబడసాగినవి. దేశీయసారస్వతరంగములపైఁ బ్రధానభూమికలను నిర్వహించినవి. "It would be difficult to exagerate the popularity and importance of the religious poems known as Puranas. They are very widely used among the common people both in the original and in numerous vernacular versions and adaptations. Indeed the Epics and Puranas are the real Bible of the common people whether literate or illiterate, and they are the source of half the vernacular literature"[10] అని Farquhar నుడివినపలుకు లిచ్చట స్మరణీయములు.

ఇప్పు డుపలభ్యమానము లగుచున్న పురాణములన్నియు పంచలక్షణమాత్రపరిమి తములై యుండలేదు. కొన్నిపురాణము లీపంచలక్షణముల నభివర్ణించియున్నను వాని యందు వివిధశాస్త్రాచారవిషయములయొక్క విస్తృతి యధికముగాఁ గానవచ్చుచున్నది. కొన్నిపురాణము లీలక్షములను రేఖామాత్రముగా మాత్రము పేర్కొనుచున్నవి. పురాణ వాఙ్మయము నంతటి నేకరాశిగా భావించినచో దానియం దీపంచలక్షణలక్ష్యలక్షితమైన వస్తువు నూటికి దాదాపు మూఁడువంతులు మాత్రమే యుండవచ్చు నని విమర్శకులు భావించుచున్నారు. స్వీయప్రతిపాదితపంచలక్షణసూత్రోల్లంఘనముచేఁ బురాణములకు స్వవచనవ్యాఘాతము వాటిల్లుచున్నది. దీనిని దొలఁగించి పురాణలక్షణసమన్వయ మొనర్చుటకు పురాణములే కొన్నియెడలఁ బ్రయత్నించినవి. అట్టియత్నములే దశలక్షణ సూత్రాదులకు దారి యేర్పఱచినవి.

భాగవతమహాపురాణము - పంచలక్షణసూత్రము ఉపపురాణములకు వర్తించు

10. An outline of the Religious Literature of India. Page 136.

ననియు మహాపురాణము దశలక్షణసమన్వితమై యుండవలె ననియు నొక నూతననిర్వ చనమును ప్రవేశపెట్టినది.

"పురాణలక్షణం బ్రహ్మన్ బ్రహ్మర్షిభి ర్నిరూపితమ్
శ్రుణుష్వ బుద్ధి మాశ్రిత్య వేదశాస్త్రానుసారతః ॥
సర్గోఽస్యాథ విసర్గ శ్చ వృత్తీ రక్షాన్తరాణి చ
వంశో వంశానుచరితం సంస్థా హేతు రపాశ్రయః ॥
దశభి ర్లక్షణై ర్యుక్తం పురాణం తద్విదో విదుః
కేచి త్పంచవిధం బ్రహ్మన్ మహదల్ప వ్యవస్థయా ॥ XII. 7.8-10

సర్గము, విసర్గము, వృత్తి, రక్ష, మన్వంతరములు, వంశము, వంశానుచరితము, సంస్థలు, హేతువు, అపాశ్రయము — అనునవి భాగవతప్రోక్త పురాణదశలక్షణములు. తల్లక్షణస్వరూపము ని ట్లాపురాణము నిరూపించినది - (XII. 7.11-21.)

ప్రధానగుణక్షోభముచే మహత్త్వమువలన నహంకారమునకును దానివలనఁ దన్మాత్రేంద్రియార్థములకును నగుసంభవము సర్గము. బీజమునుండి బీజాంతరోత్పత్తి యగు విధమున నీశ్వరానుగృహీతములగు మహదాదులకుఁ గార్యభూతమై పూర్వకర్మవాసనా ప్రధాన మైన చరాచరప్రాణిరూపప్రవాహము విసర్గము. సామాన్యముగాఁ జరముల కచర ములుగా దత్తత్స్వభావకామచోదనానుగుణముగా జీవకల్పనము వృత్తి. హరి వేదవిరోధుల వధించుటకొఱకై దేవర్షినరతిర్యగవతారములను బ్రతియుగమునందును గ్రహించు చుండుట రక్షణము. మను మనుపుత్త్ర దేవ దేవేంద్ర సప్తర్షి హర్యంశావతారకథనము మన్వంతరము. బ్రహ్మసంభవులై త్రికాలవంశధరు లైన రాజులచరిత్రము వివరించుట వంశము, వంశానుచరితము. నిత్యనైమిత్తికప్రాకృతికాత్యంతికప్రళయ నిరూపణము సంస్థ. అవిద్యచేఁ గర్మకుఁ గర్తయై నిమిత్తమై యవ్యాకృతుఁడై సర్గాదులకు నిమిత్తమైన జీవుఁడు హేతువు. మాయామయము లైన జాగ్రదాద్యవస్థలందు విశ్వతైజసప్రాజ్ఞ సంజ్ఞల నొప్పారి సాక్షిరూపమున నన్వితుఁడై సమాధ్యాదులందు వ్యతిరిక్తుఁ డైన పరమాత్ముఁ డపాశ్రయము.

భాగవతపురాణము పంచలక్షణములతోపాటు వృత్తి, రక్ష, సంస్థ, హేతువు, అపాశ్రయము అను నైదులక్షణములు క్రొత్తగాఁ బ్రతిపాదించెను. భగవత్తత్త్వప్రతిపాదక మైన యీపురాణము దశలక్షణసూత్రమును పరబ్రహ్మానుసంధానదృష్టితో నిర్మించినది. ఘటాదిపదార్థములందు మృదాదిద్రవ్య మెట్లు భాసించునో యట్లే పరమాత్మ రూపనామము లందును ఆజన్మమరణాంతములైన యవస్థలయందును అన్వితానన్వితమై యొప్పుచుండు ననియుఁ, జిత్తము తనంతట తానుగాని యనుష్ఠితయోగమువలనఁగాని వృత్తిత్రయమును బరిహరించి విరతి నొందునప్పుడు సంసారప్రవృత్తినివృత్తుఁడై యతఁ డాత్మసాక్షాత్కా రము గాంచు నను పరమతాత్పర్యము పురాణము బోధింపవలె నని భాగవతమతము. తదనుగుణముగాఁ బైపదిలక్షణముల నాపురాణము నిర్దేశించినది. మన్వంతరవంశ

వంశానుచరితములుకూడ తత్పరమార్థమును ప్రబోధించుచుండవలె నని యాపురాణ తాత్పర్యము కానోపును. ఇతరపురాణములం దీయాధ్యాత్మికసమన్వయ మంతగాఁ గానరాదు. భాగవతమునందలి ప్రధానప్రతిపాద్యవస్తువు ఇతరపురాణములందు కొన్నియెడలఁ బ్రాసంగికవస్తు వగుచున్నది. అట్లగుటచే భాగవతదశలక్షణసూత్రము తదితరమహాపురాణములకు సర్వత్ర వర్తించుట లేదు. అంతియకాక యీసూత్ర మితరమహాపురాణములందుఁ గాననగు ననేకాంశములను లక్షణములుగా గుర్తించియుండమిచే నిది యవ్యాప్తికి గుఱి కావలసి వచ్చుచున్నది.

భాగవతపురాణమువలెనే బ్రహ్మవైవర్తముకూడ పంచలక్షణసూత్ర ముపపురాణములకు మాత్రమే యన్వయించు నని చెప్పుచు మహాపురాణములకు దశాధికలక్షణము లుండు నని నిర్దేశించెను.

"సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం విప్రః పురాణం పఞ్చలక్షణమ్ ॥
ఏత దుపపురాణానాం లక్షణం చ విదు ర్బుధాః
మహతా ఞ్చ పురాణానాం లక్షణం కథయామి తే ॥
సృష్టి శ్చాపి విసృష్టి శ్చ స్థితి స్తేషా ఞ్చ పాలనమ్
కర్మణాం వాసనా వార్తా మనూనా ఞ్చ క్రమేణ చ
వర్ణనం ప్రలయానా ఞ్చ మోక్షస్య చ నిరూపణమ్
ఉత్కీర్తనం హరే రేవ దేవానాం చ పృథక్ పృథక్
దశాధికం లక్షణం చ మహతాం పరికీర్తితమ్ ॥"

—బ్రహ్మవైవర్తే శ్రీకృష్ణజన్మఖండే–132 అధ్యా.

సృష్టి, విసృష్టి, స్థితి, జగత్పాలనము, కర్మవాసన, మనుప్రకాశక్రమము, ప్రళయవర్ణనము, మోక్షనిరూపణము, హరినామసంకీర్తనము, వివిధదేవతలవిశిష్టగుణవర్ణనము మొదలగునవి మహాపురాణలక్షణము లని బ్రహ్మవైవర్తపురాణనిర్దేశము. ఇందు సృష్టి, విసృష్టి, మనుప్రకాశక్రమములు పంచలక్షణసూత్రములందలి సర్గప్రతిసర్గమన్వంతరములతోఁ దుల్యములైనవి. స్థితిజగత్పాలనములు వంశవంశానుచరితములవంటివి. ప్రళయవర్ణనము భాగవతప్రోక్త మగు సంస్థ యను లక్షణమువంటిది. మిగిలినవి యేతత్పురాణముయొక్క ప్రత్యేకతను దెలుపులక్షణములు. వేదచోదితమైన కర్మాచరణమువలనఁ గలుగు స్వర్గాదిఫలములను, తదభావమువలనఁ గలుగు నరకాదిబాధలను బేర్కొనుటయు, ప్రాక్తనజన్మఫలానుభవరూపమైన పునర్జన్మమానవునకు గలుఁగు నని నిరూపించుటయు, పునర్జన్మరహితమైన మోక్షమును సాధించుటకు మార్గము నిర్దేశించిచెప్పుటయు – పురాణలక్షణము లని బ్రహ్మవైవర్తము ప్రత్యేకించి పేర్కొనుచున్నది. అనఁగాఁ బూర్వోత్తరమీమాంసాదివిషయములు పురాణములం దభివర్ణింపఁబడవలె నని యేర్పడుచున్నది. ఈ పురాణము హరినామసంకీర్తనమును, వివిధదేవతాసంస్తోత్రమును బ్రత్యేకలక్షణములుగా

నిర్దేశించుటవలన దైవమాహాత్మ్యప్రతిపాదకము లైన కథలతోపాటు, హరిభక్తిస్ఫోరకము లైన స్తోత్రసంకీర్తనాది విశేషాంశములుకూడ పురాణగ్రంథవిషయములై యుండవలె ననియు సూచించుచున్నది. మొత్తమున కీపురాణము పంచలక్షణములతోపాటు ప్రళయాది వర్ణనలకును, సదాచారప్రబోధమునకును, ముముక్షుజ్ఞానప్రతిపాదనమునకును, భక్తి సూత్రార్థములకును సంబంధించిన అనేకాంశములను దననిర్వచనమునఁ జేర్చి చెప్పెను. భాగవతనిర్వచనమునం దున్న తాత్త్వికసమన్వయము బ్రహ్మవైవర్తమునఁ గానరాదు కాని యీపురాణము భాగవతముకంటెఁ బురాణమును గొంతస్వాభావికదృష్టితో నిర్వ చింపయత్నించిన దని మాత్రము చెప్పవచ్చును. అప్పటికిని పురాణములందుఁ గోకొల్ల లుగాఁ గనవచ్చు వివిధశాస్త్రాదివిషయములసంగతి పేర్కొనలేక సమగ్రనిర్వచనము సంతరింపఁజాలకపోయినది. దాని నావురాణముకూడ గుర్తించినది కాబోలు- చెప్పఁ గలిగినన్నింటినిఁ జెప్పి, దశలక్షణములేకాక దశాధికలక్షణము లుండు నని సంఖ్యా నిర్దేశము సేయక వదలివైచినది.

మత్స్యపురాణప్రోక్తము లైన యీక్రిందిశ్లోకము లిచ్చట గమనింపఁదగినవి.

"పఞ్చాఙ్గాని పురాణేషు ఆఖ్యానక మితి స్మృతమ్।
సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం చైవ పురాణం పఞ్చలక్షణమ్".
"బ్రహ్మ విష్ణ్వర్కరుద్రాణాం మాహాత్మ్యం భువనస్య చ
ససంహారప్రదానాం చ పురాణే పఞ్చవర్ణనే॥"
"ధర్మ శ్చార్థ శ్చ కామ శ్చ మోక్ష శ్చైవాత్ర కీర్త్యతే
సర్వే ష్వపి పురాణేషు తద్విరుద్ధం చ యత్ఫలమ్॥" —మాత్స్య. 53. 65-67

"ఉత్పత్తిం ప్రలయం చైవ వంశాన్ మన్వన్తరాణి చ
వంశ్యానుచరితం చైవ భువనస్య చ విస్తరమ్॥
దాన-ధర్మవిధిం చైవ శ్రాద్ధకల్పం చ శాశ్వతమ్
వర్ణాశ్రమవిభాగం చ తథేష్టాపూర్తసంజ్ఞితమ్॥
దేవతానాం ప్రతిష్ఠాది యచ్చాన్య ద్విద్యతే భువి
తత్సర్వం విస్తరేణ త్వం ధర్మం వ్యాఖ్యాతు మర్హసి॥" —మాత్స్య. 2. 22-24

సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితము లను ప్రసిద్ధపంచలక్షణములేకాక బ్రహ్మవిష్ణ్వర్కరుద్రులమాహాత్మ్యమును, భువనవిస్తారమాహాత్మ్యములును, తత్సంహార ప్రదానములును, పురుషార్థచతుష్టయప్రతిపాదనమును, పురుషార్థసాధనవైముఖ్యము వలని విరుద్ధఫలముల నభివర్ణించుటయును సర్వపురాణవర్ణనీయాంశములుగాఁ బేర్కొనినది మత్స్యపురాణము. మఱియొకచో దానధర్మవిధులు, శ్రాద్ధకల్పవిధులు, వర్ణాశ్రమధర్మ ములు, దేవతావిగ్రహప్రతిష్ఠాపనాదులు— ఇట్టి వెన్నియో తత్పురాణమునఁ దెలుపఁబడు నని సూచింపఁబడినది. ఈయంశములను బరిశీలించినచో భాగవతబ్రహ్మవైవర్తముల

కంటె మాత్స్య మొకవిశిష్టమార్గము ననుసరించినట్లు స్పష్టమగుచున్నది. భాగవతము వలె నిది పంచలక్షణసూత్ర ముపపురాణములకు మాత్రమే పరిమితము చేయలేదు. ఉపపురాణములుకూడ తత్సూత్రమున కొదుగక యున్నవి కావున భాగవతనిర్దేశ మచ్చట కూడ సరిపడుటలే దను నంశమును మాత్స్యము గమనించినట్లు తోచుచున్నది. కావున తాను చెప్పినలక్షణములు సర్వపురాణసామాన్యము లనినది. అంతేకాక మాత్స్యము భాగవతమువలె మహాపురాణలక్షణసంఖ్యానిర్దేశము చేయలేదు, మోక్షైకపరముగా నన్వయింపలేదు. కాని పురాణవస్తువును తటస్థముగా సమీక్షించి, యందలి ముఖ్యాంశములను బేర్కొని, పురుషార్థసాధకుఁ డైన మానవున కవి యె ట్లుపదేశాత్మకములై యుపకరించునో స్పష్టమగునట్లు పురాణలక్షణములను బేర్కొనియున్నది. ఉపదేశప్రధానమైన సారస్వతదృష్టి పురాణములందుఁ బ్రత్యక్షీకరింపవలె నన్నచోఁ బురుషార్థసమన్వయము కంటె వేఱుమార్గము లేదు. ప్రపంచజీవవృత్తియంతయు నర్థచతుష్టయసాధనాత్మకమై యుండ తత్సాధనవిధానపరమార్థమును బోధించు సరససారస్వతాదర్శస్వరూపములు పురాణము లగునని మాత్స్య ముపలక్షించినది. కావున మత్స్యపురాణోక్తలక్షణము సమగ్రము కాకపోయినను సారభూత మైన దని చెప్పుటలో నెట్టివిప్రతిపత్తియును లేదు.

కుమారిలభట్టు తన తంత్రవార్తికమునఁ బురాణప్రశంసఁ జేయుచు నవి పురుషార్థసాధనోపయోగము లని సమన్వయించి ప్రపంచించి యున్నాఁడు. స్మృతులకుఁ బ్రామాణికత్వము పురాణములచేఁ బ్రతిష్ఠాపిత మగును. అందలి ధర్మమోక్షసంబంధమైన యావద్విషయము వేదప్రభవము; అర్థసుఖవిషయమంతయు లోకవ్యవహారపూర్వకము. ఇట్లు స్మృతిస్థము లైన విషయములను వివేకించి తెలియవలెను. ఇదేవిధముగాఁ బురాణేతిహాసములందలి యుపదేశవాక్యముల నెఱుంగవలెను. అందలి యుపాఖ్యానముల నర్థవాదములచే వ్యాఖ్యానింపవచ్చును; కించిద్దర్శనపూర్వకమును, కించిద్వేదమూలము నైన పృథివీవిభాగాదికథనము తద్ధర్మాధర్మసాధనఫలోపభోగప్రదేశవివేకార్థ ముపయోగపడును. దర్శనస్మరణమూలమైన వంశానుక్రమవర్ణనము బ్రాహ్మణక్షత్రియజాతిగోత్రజ్ఞానార్థమును, దర్శనగణితసంప్రదాయానుపూర్వకమైన దేశకాలపరిమాణకథనము లోకజ్యోతిశ్శాస్త్రవ్యవహారసిద్ధ్యర్థమును, వేదమూలమైన భావికథనము అనాదికాలప్రవృత్తయుగస్వభావధర్మాధర్మానుష్ఠానఫలవిపాకవైచిత్ర్యజ్ఞానార్థమును[11] పురాణములం దభివర్ణితము లగు

11. 'తేన సర్వస్మృతీనాం ప్రయోజనవతీ ప్రామాణ్యసిద్ధిః। తత్ర యావద్ధర్మమోక్షసంబన్ధి తద్వేదప్రభవమ్। యత్త్వర్థసుఖవిషయం తల్లోకవ్యవహారపూర్వక మితి వివేక్తవ్యమ్. ఏషైవేతిహాసపురాణయోరప్యుపదేశవాక్యానాం గతిః। ఉపాఖ్యానాని త్వర్థవాదేషు వ్యాఖ్యాతాని। యత్తు పృథివీవ్యాపారకథనం తద్ధర్మాధర్మస్మరణమూలం। దేశకాలపరిమాణ మపి లోకజ్యోతిఃశాస్త్రవ్యవహారసిద్ధ్యర్థం దర్శనగణితసంప్రదాయానుమానపూర్వకమ్। భావికథన మపి త్వనాదికాల ప్రవృత్తయుగస్వభావధర్మాధర్మానుష్ఠానఫలవిపాకవైచిత్ర్యజ్ఞానద్వారేణ వేదమూలమ్......' తంత్రవార్తికము జై. I. 3.1। (ధర్మస్య శబ్దమూలత్వాత్: అశబ్ద మనపేక్షం స్యాత్) (వ్యాఖ్య.)

చుండెనఁట ! ఈసమన్వయమునుబట్టి లోకవేదప్రభవము లైన ధర్మాదుల నభివర్ణించుటచేఁ బురాణములు లోకమునకుఁ బురుషార్థసాధనపరిజ్ఞానము నందించుట కేర్పడిన వని స్పష్టమగుచున్నది.

మానవసర్వజీవితాంశము లెంతవిస్తారము లైనవో వానియందు వ్యాపించియుండు పురుషార్థతాత్పర్యము లంతవిస్తారములై లోకమున భాసించుచుండును. వాని నెల్లను సంతరించి తనయందు భద్రపఱచుకొనుపురాణము లనంతవిరాడ్రూపము లనఁదగి యున్నవి. వానిలక్షణములన్నియు నేకసూత్రమున గుదిగ్రుచ్చి చెప్పవలయునన్నను అలవిమాలినపని కాఁగలదు.

అందువలననే నారదీయమహాపురాణము

"య న్నదృష్టం హి వేదేషు తత్సర్వం లక్ష్యతే స్మృతౌ
ఉభయో ర్య న్నదృష్టం హి తత్పురాణైః ప్రణీయతే॥" II. 24. 20-21

శ్రుతిస్మృతులందుఁ గానరాని సర్వధర్మాదివిషయములను పురాణములు బోధించుచున్న వని వానివస్తువ్యాప్తినిఁ గీర్తించినది. ఆధునికవిమర్శకులుకూడ సమగ్రపురాణలక్షణ సూత్రమును బ్రతిపాదింపఁజాలక చేజారలు సాచి "మానవజీవితసర్వాంశలను స్పృశించు పురాతనవస్తు వేదైనను పురాణ మనఁబడు" నను తీర్మానమునకు వచ్చి నిలిచిరి[12]. కావున పురాణసర్వలక్షణలక్షితమైన నిర్వచనమును సూత్రీకరింపఁ బోవుట యనంతవిశ్వాకృతి నొక్కమణిదర్పణమున దర్శింప నెంచుటవంటిది.

**పురాణస్వభావము :**

పురాణము లిట్లు పురాణపురుషునివలెఁ బరిపూర్ణస్వరూపముతోఁ దేజరిల్లుటకు వాని యందు సంతరింపఁబడు వస్తువుయొక్క విశిష్టగుణసముదాయమే కారణ మని భారతీయులు భావించెదరు. స్వామి దయానందులు "సత్యార్థవివేక" మనుగ్రంథమునఁ జెప్పినయంశముల నాధారముగాఁ గొని యాంధ్రమున "పురాణములు" అనుగ్రంథము రచించిన శ్రీచివుకుల అప్పయ్యశాస్త్రిగారు పురాణవస్తుగుణములను దశవిధములుగా నిరూపించియుండిరి. అవి రేఖామాత్రముగా నిచ్చటఁ బ్రస్తావింపఁబడుచున్నవి.

1. పురాణములందు త్రివిధములైనభాషలు వర్ణింపఁబడును-

"సమాధిభాషా ప్రథమా, లౌకికీతి తథా పరా
తృతీయా పరకీ యేతి, శాస్త్రభాషా త్రిధా స్మృతా॥"

అను పురాణసంహితావాక్యము ననుసరించి సమాధిభాష- లౌకికభాష- పరకీయభాష- యనునవి త్రివిధభాషలు. సమాధిగమ్యములును, అతిగంభీరములు నైన వేదారములను సూత్రప్రాయమైన భాషలోఁ జెప్పుట సమాధిభాష. అతిసూక్ష్మములైన వేదతత్వము

12. Studies in Epics and Puranas -Introduction Xlvii.

లను సర్వజనసుబోధము లగునట్లు లౌకికభావములతోడ్పాటుతో సరసాలంకారబంధుర ముగాఁ జెప్పుట లౌకికభాష. వేదార్థములను దృష్టాంతరూపములైన కథేతిహాసములతో నేర్పఱించి బోధించుట పరకీయభాష. సమాధిభాషను లౌకికభాష సరళము చేయును. సమాధిభాషలోఁ జెప్పఁబడినధర్మమును బరకీయభాష దృఢీకరించును. విష్ణుపురాణప్రథమాధ్యాయమునందలి సృష్టివర్ణనము సమాధిభాష. అదే తత్త్వము దేవీభాగవతశ్రీభాగవతములందు లౌకికభాషలోఁ జెప్పఁబడినది. వేదసమ్మతమైన సత్యధర్మమహిమను స్థాపించుటకై హరిశ్చంద్రోపాఖ్యానాదులు చెప్పుట పరకీయభాష.

2. పురాణములలోఁ బరమాత్మయం దుండు అధ్యాత్మ మాధిదైవ మాధిభూతము లనెడి మూఁడుభావము లభివర్ణితము లగును. "పురాణములలోఁ దొల్తొల్త నుండెడి యధ్యాయములలో బహుప్రదేశములందుఁ బరమాత్మ కారణరూపమును, ప్రపంచము కార్యరూపమును, మఱియుఁ గార్యము కారణముయొక్క విస్తృతిమాత్రమే యైనందునఁ గారణముయొక్క గుణమును భావమును గార్యమునందు వచ్చుచున్నప్పుడు పరమాత్మయందే భావము గలదో యాభావమే ప్రపంచములోని ప్రత్యేకపదార్థమునందుఁ గల దనునది సిద్ధాంతీకరింపఁబడియున్నది. పరమాత్మయం దధ్యాత్మమాధిదైవమాదిభూతము లనెడి యీమూఁడుభావము లున్నవి. వానిలో నధ్యాత్మభావము ప్రకృతికంటెఁ బరమగు నిర్గుణబ్రహ్మమును, నధిదైవభావము మాయాప్రేరకుఁడగు సగుణబ్రహ్మ మనెడి యీశ్వరుఁడును, నధిభూతభావము విరాట్టునై యున్నది. దీనివలనఁ దొలుతఁ జెప్పినట్లు ప్రత్యేకమగునింద్రియములలోను, మనోబుద్ధిచిత్తాహంకారములలోను, తుదకుఁ బ్రత్యేకవస్తువులలోను అధ్యాత్మాధిదైవాధిభూతము లనెడి యీమూఁడుభావము లుండు నని చెప్పఁబడినది. దేనియందు త్రివిధభావములును జూపఁబడియున్నవో యద్దానిని బూర్వదృష్టి యని చెప్పెదరు... వేదములును బురాణములును బూర్ణుండగు భగవంతునినిశ్వాసరూపము లైనప్పుడు పురాణములలోఁ గూడ వేదములమాదిరి త్రివిధభావములయొక్కపూర్ణత కలదని సిద్ధాంత మగును."[13] దీని కుదాహరణములుగా శ్రీమద్భాగవతాదిపురాణములం దభివర్ణితములైన రాసలీల, దేవాసురయుద్ధము, గంగామాహాత్మ్యము మొ॥వానిని గైకొనవచ్చును.

పైఁజెప్పిన త్రివిధభాషలును, త్రివిధభావములును ప్రతిపురాణమునందును ప్రత్యంశప్రతిపాదనావసరమునందును వర్ణితము లగుచుండవు. ఒకతత్త్వము నొకపురాణము సమాధిభాషలో వర్ణింప మఱియొకటి లౌకికభాషలోఁ జెప్పవచ్చును. ఈరీతిగనే యొకపురాణమున నొకతత్త్వము ఆధ్యాత్మికభావమునందును, మఱియొకపురాణమున నాధిదైవికభావమునందును, వేఱొకపురాణములో నాధిభౌతికభావమునందును జెప్పఁబడుచుండవచ్చును.

3. లోకము త్రిగుణాత్మకము. కావున లోకులు గుణప్రధానవివక్షచేఁ ద్రివిధమగుచున్నారు; వారెల్లఱకును మార్గదర్శకము లగు వినిర్మలార్థములను బురాణములు ప్రతి

18. పురాణములు. పుట: 80-81.

పాదించుచుండును. శుద్ధసాత్త్వికు లగు ముముక్షువులకు వైరాగ్యమును, మోక్షజ్ఞానమును, రాజసికు లగు లౌకికులకు సకామకర్మలను, సకామోపాసనమును ఉపదేశించి స్వర్గాది దివ్యభోగముల నుపభోగించుట మొదలుకొని క్రమముగా నున్నతలోకప్రాప్తినిగూర్చిన పరిజ్ఞానమును, ధర్మాధర్మవివేకరహితులైన తామసికులకు నరకాదిఘోరబాధలవలని భయము కలిగించి ధర్మమార్గానుశీలనమును ప్రబోధించి జగద్ధితార్థమును పురాణములు నిర్వహించుచున్నవి.

4. శ్రుతిస్మృతిశాస్త్రగ్రంథములందును, దార్శనికసిద్ధాంతములందును, జెప్పఁబడిన తాత్త్వికవిషయముల నొకక్రమసమన్వయపద్ధతి ననుసరించి సరళమును సుబోధమును నైన శైలిలో సాధారణులకు సైత మందుబాటులో నుండునట్లు చెప్పి పురాణములు జనులలో నొక యాధ్యాత్మికౌన్నత్యమును గలిగించుచున్నవి.

5. 'కర్మోపాసనను జ్ఞానతత్త్వనిర్ణయమును జేయుచు కర్మయోగముయొక్క యాత్మత్యాగమును, జ్ఞానగంభీరిమను, భక్తిమధురిమను పురాణము లభివర్ణించును.' మహాభారతము కర్మప్రధానమైనది; ఉపాసనప్రధానములు భాగవతాది పురాణములు; రామాయణము జ్ఞానప్రధానమైనది- అని విజ్ఞులు పరిగణించెదరు.

6. లోకమునఁ బరమాస్తిక్యబుద్ధినిఁ బరిపోషించునవి పురాణములు. వీనియందు సగుణ నిర్గుణోపాసనము కలదు, అవతారవర్ణనము కలదు. ఋషిదేవపితృరూపములగు నిత్యశక్తులమహిమ యున్నది. చివరకు భూతప్రేతాదుల నికృష్టోపాసనయుఁ గలదు. వీని పఠనమువలననే తరతరములనుండి యాస్తిక్యభావ మమరమై జాతిహృదయమునఁ దరంగిణివలెఁ బ్రవహించుచున్నది.

7. పురాణములందు సర్వవిధచిత్తవృత్తుల కానందము గలిగించెడి యర్థసమూహముల సమావేశము కలదు. బాలురనుండి వృద్ధులవఱ కేవయస్సువా రైనను ఎట్టియవస్థ యందైనను చదివి యాహ్లాదము నొందఁ గలిగెడి విషయము లుండుటచేఁ బురాణవాఙ్మయము మానవజీవితరంగ మంతటిని ఆవరించియున్న విశ్వవిజ్ఞానరూపమై యలరారుచున్నది.

8. ధర్మసంఘర్షణ మేర్పడినప్పుడు మానవు లనుసరింపవలసిన ధర్మసూక్ష్మములఁగూర్చి పురాణములు నిర్దేశించి చెప్పుచున్నవి. ద్వంద్వ(పరస్పర విరుద్ధ) భావములకు సామరస్యమును పురాణములు నిదర్శనాత్మకముగాఁ జూపించుచున్నవి.

9. పురాతనసామాజిక, రాజకీయ, నైతిక, మత, ధార్మికాచారవ్యవహారములను పురాణములు వర్ణించి చెప్పుచున్నవి. శిల్పకావ్యసాహిత్యాలంకారవ్యాకరణాది శాస్త్రములలోని రహస్యములను దెలుపుచున్నవి.

10. కల్పనామధురములైన విచిత్రకథలు, గాథలు, చరిత్రలు, ఉపాఖ్యానములు తామరతంపరలుగా పురాణములందు కానవచ్చును. శుష్కధర్మోపదేశములను కావ్యరసభావములందు రంగరించి సామాజికుల కాస్వాదయోగ్యము లొనర్చి, పురాణము లుత్తమ

సాహిత్యగౌరవ మందుటతోపాటు తదితరకావ్యప్రక్రియలకు వస్తుదానమును, అర్థదానమును, జ్ఞానభిక్షను నొసంగి పోషించుచున్నవి.

## అష్టాదశ మహాపురాణములు :

మహాపురాణము లనియు నుపపురాణము లనియు పురాణములు రెండువిధములుగాఁ గనవచ్చుచున్నవి. బ్రహ్మపురాణాదులగు పదునెనిమిది మహాపురాణములును, సనత్కుమారీయాదులగు నుపపురాణములు పదునెనిమిదియుఁ బ్రసిద్ధములు. అందు మహాపురాణము లివి :

| | |
|---|---|
| 1. బ్రహ్మపురాణము | 10. బ్రహ్మవైవర్తపురాణము |
| 2. పద్మపురాణము | 11. వరాహపురాణము |
| 3. విష్ణుపురాణము | 12. లింగపురాణము |
| 4. వాయుపురాణము | 13. స్కాందపురాణము |
| 5. భాగవతపురాణము | 14. వామనపురాణము |
| 6. నారదీయపురాణము | 15. కూర్మపురాణము |
| 7. మార్కండేయపురాణము | 16. మత్స్యపురాణము |
| 8. అగ్నిపురాణము | 17. గరుడపురాణము |
| 9. భవిష్యపురాణము | 18. బ్రహ్మాండపురాణము |

చాలవఱ కన్నిపురాణములందును నైమహాపురాణనామములు పేర్కొనఁబడియున్నవి. కాని రెండంశములయందు మాత్రము కొంతవ్యత్యాసము కానవచ్చుచున్నది. మత్స్యాగ్నినారదీయపురాణములు వాయుపురాణము నాలుగవదిగాఁ బేర్కొనుచుండ నితరపురాణము లాస్థానమున శివపురాణమును బేర్కొనుచున్నవి. స్కాందపురాణము శివపురాణమును నాలుగవదానిగాఁ బేర్కొనుటయేకాక బ్రహ్మాండపురాణమునకు బదులు వాయవ్యపురాణమును బదునెనిమిదవస్థానమునఁ జెప్పినది. కొన్నింట భాగవతమునకు బదులు దేవీభాగవతము మహాపురాణముగాఁ బరిగణింపఁబడుచున్నది. దేవీభాగవతము అష్టాదశమహాపురాణముల నామాద్యక్షరములను కూటములుగాఁ జేర్చి సూత్రప్రాయమైన యొకచక్కనిశ్లోకమును బ్రసాదించినది.

> "మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ'త్రయం 'వ'చతుష్టయమ్
> 'అ''నా''ప''లింగ' 'కూ''స్కా'ని పురాణాని పృథక్ పృథక్॥. I. 3.2.

పురాణనామకథన మొనర్చునప్పుడెల్ల పండితు లీశ్లోకమును బఠించుచుందురు.

పైశ్లోకమునందు దేవీభాగవతము శివపురాణమును గాక వాయుపురాణమునే పేర్కొనినది. కాని యీమతమును కొన్నిపురాణములు సమర్థించుటలేదు. డాక్టరు ఎ. డి. పుసల్కరుపంటివా రీయంశమునఁ బరిశోధనలు సలిపి వాయుపురాణము కడు ప్రాచీనమైన దనియు, శివపురాణ మధునాతనమైన దనియు భావించి, ప్రాచీనతరమైన

వాయుపురాణమునే మహాపురాణముగాఁ బరిగణింపవలె నని తలంచియుండిరి. ప్రాచీన పురాణములం దుండెడి పంచలక్షణములు వాయుపురాణమునఁ గానవచ్చుచున్నవి. కాని శివపురాణమున వంశమన్వంతరవంశానుచరితాదిలక్షణము లభివర్ణింపఁబడలేదు. సర్గ ప్రతిసర్గము లందు చెప్పఁబడియున్నను వాయుపురాణమునకుఁ బ్రతిబింబములుగాఁ భాసించుచున్నవి. వాయుపురాణమునందలి యానువంశికశ్లోకములు, గాథలు, ప్రాచీన స్తోత్రములు దానిపురాతనత్వమును జాటుచున్నవి. వాయుపురాణమున శివుఁడు కీర్తింపఁబడినను అందు మతావేశ మంతగాఁ గానరాదు. పైపెచ్చు శివకేశవాభేదమును బోధించు నంశములు కొన్నియధ్యాయములందు కలవు. శివపురాణ మట్లు కాదు. అది శైవమతాచారవిధుల కొకనిధివంటిది. శైవమతప్రచారమున కేర్పడిన యొకసాహిత్యసాధనము వంటిది. అందు శివపూజావిధానము, లింగార్చనము, శైవవ్రతదీక్షావివరములు, శివసహస్రాదులు, వర్ణితములై యున్నవి కావున నది వాయుపురాణముకంటె నర్వాచీన మని యూహింప వలనుపడుచున్నది. డాక్టరు కిర్ఫెలు ప్రాచీనపురాణములలో వాయుపురాణ మొక్కటియే నాలుగుభాగములుగా విభజింపఁబడిన దనియు, నట్టిది యొక ప్రాచీనపురాణ లక్షణ మనియుఁ దెలిపియుండెను. అతనిపరిశీలనముకూడ వాయుపురాణప్రాచీనత్వ మును జాటుచున్నది. ఈ యంశముల నాధారముగాఁ జేసికొని విమర్శకు లీక్రిందినిర్ణయ మునకు వచ్చియుండిరి. "The Siva Purana has none of these ancient peculiarities. It can be called Purana only by courtesy a bulky, disconnected and frivolous book. It presupposes the existance of 26 Puranas,[14] has exaggerated discriptions of the heaven and earth and discribes late Tantric Cult. By no stretch of imagination can the Siva Purana be pushed back to the period of ancient Puranas, nor can it be called a Mahapurana. The earliest reference to the Siva Purana seems to be that of Alberuni.[15] Attempts to raise Siva Purana to the status of a Maha Purana were probably due to sectarian zeal,[16] as Saivas wanted a Mahapurana for themselves pleading in evey way for the greatness of Siva and the sober Vayu Purana didnot satisfy their requirements. In the present state of our knowledge it seems safe to conclude that the printed Vayu Purana is a genuine Mahapurana and that the Siva-

---

14. "షడ్వింశతి పురాణానాం..." శివ. V. 14.41.

15. Sachare - Alberuni's India. I. P. 130.

16. cf. Hazra oP. cit. P. 15; Chaudry JBORS XV P. 188.

purana is a late work not fit to be called a Mahapurana, but is only a Upapurana''[17]

శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమసంస్కృతవాఙ్మయచరిత్రలో నీయంశము ను జర్చించి వాయుశివపురాణములు రెండును ఒకటియే యని యిట్లు నిరూపించిరి :-

"'యత్ర తద్వాయవీయం స్యా ద్రుద్రమాహాత్మ్యసంయుతమ్
చతుర్వింశ త్సహస్రాణి పురాణం శైవ ముచ్యతే'॥

అని మత్స్యపురాణవచనమువల్లఁ దెలియవచ్చినది. బొంబాయినగరమున ముద్రితమైన వాయుపురాణములోని గ్రంథసంఖ్య పండ్రెండువేలు మాత్రమే. అందు శైవసంజ్ఞ కనరాదు కాని వ్రాతప్రతులందు —

"ఇతి వాయుపురాణం శివాపరాహ్వయం సమాప్తమ్"

"ఇతి శ్రీవాయూక్త చతుర్వింశతి సాహస్ర్యాం శివసంహితాయా ముత్తరఖండే శ్రీనర్మదామాహాత్మ్యే"—

"ఇతి శ్రీవాయుపురాణే లక్ష్మీసంహితాయా మానందకానన మాహాత్మ్యే"—

"ఇతి శ్రీమహాపురాణే వాయుప్రోక్తే ద్వాదశసాహస్ర్యాం సంహితాయాం బ్రహ్మాండావర్తం సమాప్తమ్".

"పంచదశసహస్రాణి ఖండేఽస్మిన్ మునినా పురా
గ్రంథసంఖ్యా నిగదితా- ఇతి శ్రీవాయుపురాణం శివాపరాహ్వయం సమాప్తమ్".

ఇత్యాదిగా భిన్నభిన్నదేశలిఖితవాయవ్యగ్రంథాంతగద్య లనేకములు కనఁబడుచున్నవి.[18] వీనినిబట్టియు, గ్రంథవిషయవివరణాదులఁ బట్టియుఁ జూడఁగాఁ బూర్వోత్తరఖండములతో ముద్రితమైన వాయుపురాణములోనిగ్రంథసంఖ్య పండ్రెండువేలు మాత్రమే యనియు, తక్కిన పండ్రెండువేలగ్రంథము ముద్రితము కాలేదనియు, తొలుత నిది పదునాలుగు వేలే యైనను మఱిమూఁడువేలగ్రంథ ముత్తరఖండమునఁ బ్రక్షిప్తమైన దనియు, వాయుప్రోక్త మనెడి మాటనుబట్టి యిది వాయు పురాణముగాఁ బ్రసిద్ధిగాంచినది గాని విషయమునుబట్టి యిది శివపురాణమే యనియు, మత్స్యపురాణము చెప్పిన వాయుశైవపురాణములు రెండు నొకటే యనియుఁ దేలినది. కాని కొన్నియుప పురాణములును, 'మాగ్డొనలు' మొదలగు కొందఱు విమర్శకులును వీనిని వేఱుగా గణించుటకు శివపురాణసంజ్ఞ కల మఱియొకపురాణము కనవచ్చుటయే కారణము. ఎట్లయినను అనేకములైన నదీవర్ణములును బహుతీర్థవర్ణనలును ముద్రితవాయు పురాణమున లేక లిఖితపుస్తకములం దుండుటయు, ప్రక్రియాపాదము, అనుషంగ పాదము, ఉపోద్ఘాతపాదము, ఉపసంహారపాదము అనుభాగములు క్రమముగా నుండవలసి నట్లు సర్వత్ర కనవచ్చుచుండ ముద్రితపుస్తక మనుషంగపాదమందలి సృష్టివర్ణనముతో

17. Studies in Epics and Puranas - Page 76-77.

18. లండన్, ఇండియా ఆఫీసుసంస్కృతగ్రంథవిషయవివరణపట్టిక. Vol VI.

సమాప్తి గాంచుటయు వాయవీయసంహిత యను పేర ముప్పది యధ్యాయములగ్రంథము దీని కధికముగా శైవాపరనామమునఁ జేరుటయుఁ జూచినచో ముద్రితగ్రంథ మసంపూర్ణ మనియు, శివాపరాహ్వయవాయుపురాణము తొల్లి యిరువదినాలుగువేలగ్రంథ మనియు తెలియకపోదు." [19]

శ్రీమల్లాదివారి యభిప్రాయమున కుపబలకముగాఁ బదునెనిమిదవశతాబ్ద్యుత్తరార్ధమున వసించిన బలరామభట్టు తన మితాక్షరివ్యాఖ్యానమున 'వాయవీయపురాణము శివపురాణ మనియుఁ బిలువఁబడుచుండె నని తెలిపెను.[20] కావున వాయుశివపురాణము లొక్కటియే యని ధ్రువపడుచున్నది. భాగవతదేవీభాగవతములలో నేది మహాపురాణ మనునంశమును బహుళవివాదమున కాకరమయి- భాగవతమే ప్రాచీనమును, మహాపురాణమును అయినదని పెక్కుమందివిమర్శకులచే భావింపఁబడుచున్నది.[21] కొందఱు బ్రహ్మోత్తరఖండాదులను, సూతసంహితాదులను బ్రత్యేకపురాణములుగాఁ బరిగణించిరి. కాని యవి స్కాందపురాణాంతర్గతము లైన కాశీభీమఖండాదులవంటివే కాని ప్రత్యేక పురాణములు కావు. భవిష్యపురాణము భవిష్యత్పురాణ మనియుఁ బిలువఁబడుచున్నది, ఈరెండు నొకటియే. ఇట్లే బ్రహ్మవైవర్తము ఉత్తరభారతమున వైవర్త మనియు. దక్షిణభారతమున బ్రహ్మకైవర్త మనియుఁ బిలువఁబడుచున్నది. కాని ఈరెండుపురాణములును వేఱు కావు.

అష్టాదశమహాపురాణములు పైన నిర్దేశించిన క్రమముననే సర్వత్ర చెప్పఁబడలేదు. విష్ణుపురాణాదులు బ్రహ్మపురాణము నాదిపురాణముగాఁ బేర్కొనినవి[22]. వాయుదేవీభాగవతపురాణములు మత్స్యపురాణమును మొదట చెప్పుచున్నవి.[23] స్కాందము బ్రహ్మపురాణమును ముందు చెప్పినది.[24] భాగవతము పురాణక్రమమును గొంత మార్చి యిట్లు చెప్పినది :

"బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైఙ్గం స గారుడమ్
నారదీయం భాగవత మాగ్నేయం స్కాంద సంజ్ఞితమ్
భవిష్యం బ్రహ్మవైవర్తం మార్కండేయం స వామనమ్
వారాహం మాత్స్యం కౌర్మం చ బ్రహ్మాండాఖ్య మితి త్రిషట్" XII.7. 23-24

ఇందు వరుస మారినను పారంపర్యముగా వచ్చుచున్న పదునెనిమిదిమహాపురాణములు చెప్పఁబడియున్నవి. ఈపురాణములు అష్టాదశసంఖ్యకు మించియున్న వని పాశ్చాత్యులు కొందఱు భావించియుండిరి. కాని వారిసిద్ధాంతములన్నియు నిరాధారము లని నిరూ

19. సంస్కృతవాఙ్మయచరిత్ర - లౌకికవాఙ్మయము. తృ. అధ్యా. పుట. 74-75.
20. History of Dharma Sastra. Vol. Part II. P. 831. [యాజ్ఞ.స్మృతి, . 3.]
21. ఉదా : చూడు : సంస్కృతవాఙ్మయచరిత్ర. లౌకికవాఙ్మ. పుటలు. 75-77.
22. విష్ణు మహాపురాణము III. 6.18; బ్రహ్మపురాణము 245.4.
23. వాయు మహాపురాణము 104.3; దేవీభాగవతము I. 3.3.
24. స్కాందమహాపురాణము - ప్రభాసఖండము 2.8-9.

పింపఁబడినవి.[25] కావున మహాపురాణము లష్టాదశసంఖ్యాపరిమితము లను ప్రసిద్ధి నిత్యమై నిలచియున్నది.

**పురాణ శ్లోక సంఖ్యలు :**

ఆదిదేవుఁ డగు బ్రహ్మ వేదముల నుచ్చరించుటకుఁ బూర్వము పురాణమును స్మరించె ననియు, నది శతకోటిశ్లోకప్రవిస్తర మనియు, దానిసారమును వేదవ్యాసుఁడు భూలోకమునఁ బ్రతిద్వాపరమునందును నాలుగులక్షలశ్లోకపరిమితి కల యష్టాదశపురాణ సంహితగా సమకూర్చు ననియు, మత్స్యపురాణమునఁ (53.3-11) జెప్పఁబడియున్నది వాయుబ్రహ్మాండ లింగ నారద పద్మపురాణములు కూడ యీయంశమును బేర్కొని యున్నవి. దీనినిబట్టి ప్రస్తుతము మనకుఁ గానవచ్చు పురాణముల కన్నింటికిని మూల మైన నొక్క యాదిపురాణసంహిత కలదని కొందఱు భావించియుండిరి. కాని యది వట్టి యూహాగానమే యనియు, తైత్తిరీయారణ్యకమునఁ గానఁబడు పురాణశబ్దము బహువచన మున నుండుటచే నాగ్రంథము వెలువడునాటికిఁ గొన్ని పురాణములు కలవనియు స్పష్ట మగుచున్నది. కావున నట్టి ప్రాచీనపురాణములే యిప్పటి పురాణములకు మూలములై యుండవచ్చు ననియు శ్రీ కాణే పండితులు భావించియున్నారు.[26]

మత్స్యాగ్నిస్కాందనారదీయమహాపురాణములు తమయం దష్టాదశమహాపురాణ నామనిర్దేశము చేయుటయే కాక వానియందు నిబంధింపఁబడిన వస్త్వంశములను సూచికా ప్రాయముగా గుదిగ్రుచ్చియుంచినవి. ఆసందర్భముననే బ్రహ్మాదిమహాపురాణములశ్లోక సంఖ్యాపరిమాణములను సైతము నిర్దేశించియున్నవి. కాని వానియందు ఏకవాక్యత కాన రాదు. ఆయాకాలములం దనేకకారణములచే వానియందు చేరినప్రక్షిప్తభాగములే దానికి కారణములై యుండవచ్చును.

**పురాణ వర్గీకరణము :**

అష్టాదశమహాపురాణములను పురాణములును, పురాణవిమర్శకులును వివిధ దృక్కోణములతో దర్శించి వర్గీకరించిరి. అందు మొదట పేర్కొనఁదగినది పురాణము లొనర్చిన వర్గీకరణము. గుణత్రయవిభాగము ననుసరించి పద్మపురాణ మీక్రిందివిధ ముగా పురాణములను వర్గీకరించెను. (ఉత్తరఖండ. 263.81-84).

1. సాత్త్వికపురాణములు : శ్రీమన్నారాయణునిఁగీర్తించునవి. ఇవి మోక్షప్రద

25. "However, in order to accommodate these conflicting views, Pargiter takes their number to be 19, by including both Siva and Vayu and Farquhar further increases the number by including the Harivamsa in addition. But there is absolutely no support for increasing the traditional number."
—Studies in Epics and Puranas. Intro. P. 25

26. History of Dharma Sastra - Vol. V. Part II. Page 829.

ములు. 1. వైష్ణవము. 2. నారదీయము. 3. భాగవతము. 4. గారుడము. 5. పాద్మము. 6. వారాహము.

2. రాజస పురాణములు : సరస్వతీచతుర్ముఖ కృశానులను స్తుతించునవి. ఇవి స్వర్గప్రదములు. 1 బ్రహ్మాండము. 2. బ్రహ్మవైవర్తము. 3. మార్కండేయము. 4. భవిష్యము. 5. వామనము. 6. బ్రాహ్మము.

3. తామసపురాణములు : శివలింగ విఘ్నేశకుమారులను, దుర్గను గీర్తించునవి. ఇవి పఠనీయములు కావని పారాశర్యోపపురాణము నిర్దేశించినది. అవి 1. మాత్స్యము. 2. కౌర్మము. 3. లైంగము. 4. శైవము. 5. స్కాందము. 6. ఆగ్నేయము.

పద్మపురాణ మొక్కొక్కగుణమున కాఱుపురాణములచొప్పున సమముగాఁ బంచి చూపినది. స్కాందపురాణ మీవిభాగము నంగీకరింపక యిట్లు విభజించినది.

"అష్టాదశపురాణేషు దశభి ర్గీయతే శివః ।
చతుర్భి ర్భగవాన్ బ్రహ్మా ద్వాభ్యాం దేవీ తథా హరిః ॥"

(కేదార ఖం. 1)

వైష్ణవములకంటె శైవములైన పురాణములే యధికముగ నున్న వని నిరూపించుటకంటె స్కాందముయొక్క ప్రయోజన మేముండును ?

ఇఁక సాత్త్వికాది పురాణము లేయేదైవములను గీర్తించుననుటలో నభిప్రాయ భేదములు కానవచ్చుచున్నవి. మాత్స్యము - హరిమాహాత్మ్యప్రతిపాదకములు సాత్త్వికములనియు, బ్రహ్మాగ్నిమహిమాభివర్ణితములు రాజసము లనియు, శివవిభూతిఁ గీర్తించునవి తామసికము లనియుఁ జేర్కొనుటతో నాగక సరస్వతియొక్కయు, పితృదేవతల యొక్కయు మహిమల నభివర్ణించునవి సంకీర్ణము లగు నని మఱియొకవిభాగ మొనరించి తనప్రత్యేకతను జాటుకొనెను.[27]

మొదట త్రిగుణములతోడను, ఆపైఁ ద్రిమూర్తులతోడను ముడిపెట్టి మహాపురాణములను వర్గీకరించుట జరిగినను, పురాణములందుఁ గీర్తింపఁబడిన దేవత లాముువ్వురతోడనే యాగలేదు. కావునఁ దరువాత నాత్రిగుణాత్మకములైన పురాణములలోఁ ద్రిమూర్తులకంటె భిన్నులగు సూర్యాగ్న్యాదులు వర్ణింపఁబడినవానినిగూడ ప్రత్యేకముగాఁ జేర్కొని వర్గీకరింపవలసివచ్చినది.

ఇట్లు పురాణములందుఁ జేయఁబడియున్న వర్గీకరణమును బర్యాలోకించియు, తమిళభాషయందుఁ బరివర్తితములైన పురాణముల నవలోకించియు శ్రీ వి. రామచంద్ర

27. "సాత్త్వికేషు పురాణేషు మాహాత్మ్య మధికం హరేః ।
రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః ॥
తద్వదగ్నే శ్చ మాహాత్మ్యం తామసేషు శివస్య చ ।
సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాం చ నిగద్యతే ॥" మత్స్య పు. 53. 68-69.

దీక్షితారుగారు పురాణముల నైదువిధములుగా పునర్వర్గీకరించిరి.[28] వారివిభాగమున అష్టాదశపురాణములు బ్రహ్మసూర్యాగ్నిశివవిష్ణువుల స్తుతించునవిగాఁ జేర్కొనఁబడినవి : అవి-

1. బ్రహ్మదేవుని స్తుతించునవి — బ్రాహ్మము, పాద్మము.
2. సూర్య ,, ,, — బ్రహ్మవైవర్తము.
3. అగ్ని ,, ,, — ఆగ్నేయము.
4. శివ ,, ,, — శైవము, స్కాందము, లైంగము. కౌర్మము, వామనము, వారాహము, భవిష్యము, మాత్స్యము, మార్కండేయము, బ్రహ్మాండము
5. విష్ణు ,, ,, — నారదీయము, భాగవతము, గారుడము, వైష్ణవీయము.

ఇఁక శ్రీయుతులు హరప్రసాదశాస్త్రి, పుసల్కర్, కాణేవంటి పండితులు పురాణములను వానియందు ప్రధానముగాఁ గానవచ్చు వస్త్వంశములనుబట్టి వర్గీకరింప యత్నించిరి. శ్రీపుసల్కర్ పురాణములను బ్రాచీనము లనియు, నవ్యము లనియు రెండు విధములుగ వర్గీకరించెను. అమరసింహునిపంచలక్షణసూత్రమునకు సన్నిహితములై యుండి ప్రక్షిప్తములు తక్కువగాఁ జేరిన పురాణములు ప్రాచీనము లనియు, పంచలక్షణ లక్షితమైన వస్తువుకంటె భిన్నమైన విషయబాహుళ్యముతో నొప్పారుపురాణములు నవ్యము లనియు భావించెను; వాయు, బ్రహ్మాండ, మత్స్య, విష్ణుపురాణము లతిప్రాచీనము లనియు, మిగిలినవి నవ్యము లనియు నాతఁడు నిర్దేశించెను.[29]

శ్రీ హరప్రసాదశాస్త్రి పురాణములందలి విషయసంఘాతమును నిశితముగాఁ బరిశీలించి వాని నాలువిధములుగా వర్గీకరించెను.[30] వీ రొనరించిన విభాగము విమర్శకుల మన్ననల నందుకొనినది. నేఁ డదియే యుత్తమవర్గీకరణ మని భావింపఁబడుచున్నది.

1. విజ్ఞానసర్వస్వములవంటి పురాణములు :

   1. గారుడము, 2. ఆగ్నేయము, 3. నారదీయము. ఈ పురాణములందు వైద్యవ్యాకరణనాట్యసంగీతసాహిత్యజ్యోతిషాదిశాస్త్రములకు సంబంధించిన వివిధాంశములు సంతరింపఁబడుటయేకాక వివిధాగమశాస్త్రాదిగ్రంథముల సారాంశము లెన్నియో విస్తృతముగాఁ జేర్పఁబడియున్నవి.

2. తీర్థవ్రతమాహాత్మ్యాదుల నధికముగా వర్ణించు పురాణములు :

   1. పాద్మము, 2. స్కాందము, 3. భవిష్యము. ఈ పురాణములందుఁ జేరిన వివిధతీర్థవ్రతమాహాత్మ్యకథనాదివిషయబాహుళ్యముచే నాపురాణ సహజవస్తువు అతిస్వల్పమై అస్తినాస్తివిచికిత్సకు లోనగుచున్నది.

---

28. Indian Historical Quarterly - Culcutta - Vol. VIII. Page 766.
29. Studies in the Epics and Puranas - Introduction - Page 26
30 Journal of the Behar (and Orissa) Research Society XIV P. 330-7.

3. పూర్వోత్తర భాగములందు ప్రక్షిప్తములు చేరి పెరిగిన పురాణములు :

1. బ్రాహ్మము, 2. భాగవతము, 3. బ్రహ్మవైవర్తము. ఈపురాణములలోఁ బ్రాచీనములును పురాణసహజములునైనవస్తువులకుఁ బూర్వోత్తరభాగము లందు విస్తృతములైనప్రక్షిప్తములు జేర్పఁబడియుండును.

4. చారిత్రాంశముల బాహుళ్యము గల పురాణములు :

1. బ్రహ్మాండపురాణము, 2. వాయుపురాణము. హరప్రసాదశాస్త్రి ప్రస్తుత ముపలభ్యమాన మగుచున్న వాయుపురాణముయొక్క ఉత్తరార్ధమునందలి కొంతభాగముతప్ప ఆపురాణమంతయు బ్రహ్మాండపురాణసంజాత మని భావించుచున్నారు. ఇప్పటి వాయవీయము ప్రాచీనపురాణము కాదని వారి యభిప్రాయము. దీనిని చాలమంది విమర్శకు లంగీకరించుచున్నారు.

5. మతప్రాధాన్యము గల పురాణములు :

1. లైంగము. 2. వామనము. 3. మార్కండేయము. లింగ పురాణము లింగపూజావిధివిధానమును శైవమతమును బ్రతిపాదించును. వామనము శివమతశాఖావిషయసర్వస్వమువంటిది. మార్కండేయము శాక్తేయమతప్రాధాన్యము నుగ్గడించును.

6. విష్ణ్వవతారనామముల నధికరించి పెట్టఁబడిన పేళ్లుగల పురాణములు :

1. మాత్స్యము. 2. కౌర్మము. 3. వారాహము. ఈపురాణనామ ములు వినినంతనే ఆయాపురాణములం దాయాయవతారమహిమాభివర్ణ నము మాత్రమే యుండునని స్ఫురించును. కాని మాత్స్యమునం దాయవ తారగాథ మూడవవంతు మాత్రము కలదు. అట్లే కౌర్మమున నెనిమిదవ పాలును, వారాహమున సగఁబాలును ఆయాయవతారమహిమాభివర్ణమున కలదు. శ్రీకాణేపండితుఁడుకూడ స్థూలముగా నీవర్గీకరణము నంగీక రించెను.

పై వర్గీకరణమంతయు నిర్దుష్టమైన దని చెప్పఁజాలము కాని పురాణవిమర్శకు లిప్పటివఱకుఁ బ్రతిపాదించినవర్గీకరణములలో నిది యెక్కువసహజముగను, సముచిత ముగను నున్నది. ఈవర్గీకరణమునకుఁ బ్రస్తుత ముపలభ్యమానము లగుచున్న పురాణ ములే ప్రమాణములు. అట్లగుటచే వానియందలి ప్రధానప్రతిపాద్యవస్తువునుబట్టి యీవింగ డింపు జరుగలేదు. అందువలననే మార్కండేయ మహాపురాణము దేవీమాహాత్మ్యప్రతి పాదనప్రధాన మని చెప్పబడినది. కాని యందలి సప్తశతి ప్రక్షిప్త మనియు, తత్పు రాణసహజలక్షణమున కది విరుద్ధమైన దనియు విమర్శకులు భావించుచున్నారు. అది నిజముగాఁ బ్రక్షిప్తమైనచో నాపురాణము దేవీమాహాత్మ్యమును జెప్పుటకు పుట్టలేదు. అది యెట్టిప్రత్యేకమతప్రమేయము లేని విశుద్ధప్రాచీనపురాణ మని పరిగణింపఁబడినది. హరప్రసాదశాస్త్రి పురాణములలోని ప్రక్షిప్తాంశములను, ప్రాచీననవీనాంశములను దృష్టి

యం దుంచుకొని వర్గీకరించలేదు. ఒకవేళ అట్లు పూనుకొనినచోఁ దేలెడిపనియు కాదు. కావున నతఁడాశ్రయించినమార్గమే విమర్శకుల కనుసరణీయ మైనది.

## మహాపురాణములు - ఉపపురాణములు :

అష్టాదశమహాపురాణములవలెనే యష్టాదశోపపురాణములు కలవని పారంపర్యముగాఁ జెప్పఁబడుచున్నది. అవి :

| | |
|---|---|
| 1. సనత్కుమారీయము | 10. మానవము |
| 2. నారసింహము | 11. వారుణము |
| 3. నాందము | 12. కల్కి |
| 4. శివధర్మము | 13. మాహేశ్వరము |
| 5. దౌర్వాసము | 14 సాంబము |
| 6. నారదీయము | 15. సౌరము |
| 7. కాపిలము | 16. పారాశరము |
| 8. వామనము | 17. మారీచము |
| 9. ఔశనసము | 18. భార్గవము |

ఈయుపపురాణసంఖ్యనుగాని, వానిక్రమమును గాని తెలిపెడి పురాణములం దేకవాక్యత లేమిచే వీని సంఖ్యాక్రమనిర్దేశము దుష్కరమగుచున్నది.

ఉపపురాణములప్రశంస మత్స్యాదిమహాపురాణములందును గానవచ్చుచున్నది. మాత్స్యము నారసింహనంద్యాదిత్యసాంబపురాణములను నాలుగింటిని ఉపపురాణములుగాఁ బేర్కొనెను. కూర్మపద్మదేవీభాగవతాదులు అష్టాదశోపపురాణములను బేర్కొనియున్నవి కాని, వానియందు నామసామ్యము గనవచ్చుటలేదు. అట్లగుటచే నాపురాణవాక్యము లన్నింటినిఁ గ్రోడీకరించి చూచినచో నవి యష్టాదశాధికము లని బోధపడుచున్నవి. స్కాంద ముపపురాణము లొకలక్ష కలవని తెల్పినది. ఉపపురాణములపైఁ బరిశోధనలు సలిపి, విలువైన వ్యాసములను, "Studies in Upapuranas" అనుగ్రంథమును రచించిన ప్రొఫెసరు హాజ్రా ఉపపురాణముల నొకనూఱింటిని బేర్కొనెను. వీనిలోఁ జాలవఱకు తాళపత్రగ్రంథములే. ప్రచురితములై ప్రసిద్ధికెక్కినవి చాల తక్కువ. ఏమైనను, పురాణవాఙ్మయ మసంఖ్యాకములుగా వెలసిన యుపపురాణములతో ననంతవిస్తృతిఁ గాంచె ననుట తథ్యము.

ముద్రితోపపురాణములను బరిశీలింపఁగా వానియందు మహాపురాణములలోని యనేకాంశములు యథాతథముగా నెక్కింపఁబడినట్లు తెలియుచున్నది. భాగవతాదులు పేర్కొనినట్లు పంచలక్షణసూత్ర మీయుపపురాణముల కన్వయించునేమో యని చూడ నదియుఁ గానవచ్చుట లేదు. కొన్నియుపపురాణములు మహాపురాణములనామములతోడనే వెలసినవి. స్కాందము, వామనము, నారదీయము మొదలైన పట్టివి. వీనిలో శైవవైష్ణవమతప్రతిపాదకములే కాక సౌరశాక్తగాణాపత్యాదిమతప్రబోధములైనవికూడ కలవు. ఉప

పురాణములు స్కాందాదిమహాపురాణములం దభివర్ణితములైన దానవ్రతతీర్థమహాత్మ్యాదిక ములనే ప్రధానముగాఁ గైకొని వర్ణించినవి. కాని వానికంటె వినూత్నములైన కొన్ని గాథలను గూడ కల్పించి పెంచినవి.

ఉపపురాణములు మహాపురాణములయొక్క యుపభేదము లనియు, వాని యందుఁ జెప్పక విడిచిన ధర్మాదు లిందుఁ బ్రవర్తిల్లుచున్న వనియు మాత్స్యము చెప్పు చున్నది.[31] ద్విజులు కొంద ఱాయాకాలములందు మహాపురాణములను బఠించి, తత్సార సంగ్రహరూపములుగా నుపపురాణములను గల్పించి రని కూర్మపురాణ మనుచున్నది.[32] ఇవి మహాముని విరచితము లనుటచే వ్యాసప్రోక్తములు కావని తెలియుచున్నది. అందు వలననే మహాపురాణశ్లోకసంఖ్యలో వీనిశ్లోకసంఖ్య గణింపఁబడలేదు. ఉపపురాణమైన సౌరపురాణము ఉపపురాణములను ఖిలము లని గర్హించుటచే[33] నుపపురాణములకు మహా పురాణముల కున్న ప్రామాణ్య మున్నట్లు కానరాదు. ఆదియందు బ్రహ్మచే స్మృతము లైన పురాణములలో నుపపురాణములు కొన్ని యుండవచ్చు నని కొందఱు భావించిరి. కాని చారిత్రకదృష్టితో నుపపురాణోత్పత్తివికాసములను బరిశీలించిన విమర్శకు లివి క్రీ. శ. 8 లేక 9వ శతాబ్దితరువాత రచింపఁబడియుండు నని తలంచుచున్నారు.

## పురాణము - ఇతిహాసము :

పురాణేతిహాసముల కత్యంతసాన్నిహిత్యము కలదు. వేదకాలమునుండియు నట్టి సంబంధము వానియందుఁ గానవచ్చుచున్నది. వేదబ్రాహ్మణములందు పురాణేతిహాసములు విడివిడిగాఁ బేర్కొనఁబడియున్నను, 'ఇతిహాసపురాణ' మను నేకపదద్వంద్వసమాసములు శతపథబ్రాహ్మణాదులలోఁ బ్రయోగింపబడి యున్నవి. సామాన్యముగా నిట్టిద్వంద్వ మవినాభావసంబంధముగాని, అజన్మవిరోధముగాని కల రెండువస్తువులను గలిపిచెప్పు నపుడు ప్రయోగింపఁబడుచుండును కావునఁ బురాణేతిహాసముల నిచ్చట యవినాభావ సంబంధము గల ద్వంద్వముగా నట్టిసమాసప్రయోగము సూచించుచున్నది.

పురాణేతిహాసముల స్పష్టమైన పరిగణన మథర్వవేదమునఁ దెలియవచ్చుచున్నది. వానితోపాటు గాథలు, నారాశంసలు, వాకోవాక్యములు అనువానినిగూడ ఆవేదము తెలుపు చున్నది. విద్యారణ్యసాయణాచార్యులు వేదభాష్యములందుఁ బైవానిస్వరూపములనుగూర్చి యిట్లు పేర్కొనియున్నారు. "దేవాసురా స్సంయత్తా ఆసన్"- అని యిట్లు పూర్వము జరిగిన దఁట యనునట్లు పూర్వప్రసిద్ధవృత్తములను దెలుపునది యితిహాస మనియు, "ఇదంవా అగ్రే నైవ కించి దాసీత్ "- ఇత్యాదిక మగు జగత్ప్రాగవస్థ నుపక్రమించి చెప్పెడి వాక్యజాతము పురాణ మనియు విద్యారణ్యులు నిరూపించి యుండిరి. సాయణా చార్యులు గాథాదుల నిట్లు నిర్వచించెను:[34]

31. మాత్స్యము 53. 58-59 & 63. 32. కూర్మ పురా. I. 1.16. 33. సౌర పురా. 9.8.
34. చూడు: అథర్వవేద. XV. 6. 10-11 వ్యాఖ్య.

"మహోహి మివ హ్రదాత్"-35 ఇత్యాదయో మంత్రాః గాథాః॥

"నరాః మనుష్యాః తత్ప్రశంసాపాదకాః శ్లోకాః నారాశంస్యః గాథాః।
సమాసాన్సదముక్షంతి"-36 ఇత్యాదికాః మనుష్యప్రశంసాపరాః నారాశంసాః॥

"స వై గౌతమస్య పుత్ర వృతో జనం ధావయేత్"-37 ఇతి ఉక్తిప్రత్యుక్తిరూపమ్
బ్రాహ్మణం (ప్రకరణం) వాకోవాక్యమ్॥"

పై వివరణమున గమనింపఁదగినయంశ మొండు గానవచ్చుచున్నది. ఇతిహాసాదులను వివేకించుచు వ్యాఖ్యాతలు వేదవాక్యములనే దృష్టాంతములుగా నిచ్చియుండిరి. అనఁగా వేదవాక్యములలోనే జగత్ప్రాగవస్థనుగూర్చి చెప్పెడివాక్యములు పురాణములు-అనియు, దేవదానవయుద్ధాదిప్రసిద్ధవిషయములను జెప్పు వాక్యసముదాయము లితిహాసము లనియు, దైవప్రశంసాత్మకములైన మంత్రవాక్యములు గాథ లనియు, నరప్రశంసారూపము లైన వాక్యములు నారాశంస లనియు, ఉక్తిప్రత్యుక్తిరూపము లైనవి వాకోవాక్యము లనియు, స్పష్టమగుచున్నది. దీనినిబట్టి వేదవాక్యములందే పురాణేతిహాసస్వరూపకల్పన మొనర్పఁబడిన దని భావింపవచ్చును. మఱియు సర్గప్రతిసర్గలక్షణాత్మకమైనది పురాణ మనియు, దేవదానవవంశములకు సంబంధించిన కథన మితిహాస మనియు నథర్వవేదకాలమున భావింపఁబడుచుండె ననియు గ్రహింపవచ్చును.

బ్రాహ్మణారణ్యకోపనిషత్తులలో నీపురాణేతిహాసములప్రసక్తి కలదు. ఆకాలమున నశ్వమేధాది యజ్ఞములందు నిర్దిష్టములైన దినములలో నవి వినిపింపఁబడుచుండెను. వేదకాలమునుండియు నవి క్రమాభివృద్ధి నందుచు కాలాంతరమునఁ బ్రత్యేకప్రతిపత్తిని గడించి పర్వసమయములందు పౌరాణికైతిహాసికులచేఁ బరిషత్తులందు వినిపింపఁబడుచుండెడి వని తెలియుచున్నది.

పురాణము లనఁ బంచలక్షణసమన్వితము లని ప్రాచీనములైన పురాణములే చెప్పుచున్నవి. నైఘంటికు లొనర్చినపురాణశబ్దనిరుక్తియు వాని కుపబలకముగా నున్నది. అట్లే యితిహాసస్వరూపమును భావించుటకు నైఘంటిక నిరుక్తులు కొంత తోడుపడఁగలవు. "ఇతిహాసం పురావృత్త" మ్మని అమరసింహుఁడు. 'ఇతిహాసః- ఇతిహ పారంపర్యోపదేశ ఆస్తే అస్మిన్ ఆస ఆధారే ఘఞ్. ధర్మార్థకామమోక్షాణాం ఉపదేశసమన్వితమ్। పూర్వోయుక్తకథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥ ఇత్యుక్తలక్షణే పురావృత్తప్రకాశకే భారతాది గ్రంథే"- అని శబ్దకల్పద్రుమము. వీనినిబట్టి యితిహాస మన పురావృత్త మని స్థూలముగాఁ జెప్పవచ్చును. అది 'యిట్లు జరిగిన' దని పారంపర్యముగాఁ జెప్పుకొనుచున్న కథయై యుండవలెను. అనఁగా నది చారిత్రకసత్యమై యుండవలెను. ఆకథ వట్టివార్తగా నుండరాదు. చతుర్వర్గోపదేశసమన్వితమైన యుజ్జ్వలకథారూపమున నుండవలెను. కావున నితిహాసము పూర్వచరిత్రనిబంధనప్రాయమైనట్టియు, నుజ్జ్వలోపదేశాత్మక మైనట్టియు కథయై యుండవలె నని- యేర్పడుచున్నది.

---

35. అథర్వ. XI. 5.5-8. 36. అథర్వ. XI. 5.5.18. 37. అథర్వ. XI. 4.1.7.

అభినవగుప్తపాదులు నాట్యశాస్త్రవ్యాఖ్యానమునఁ గర్మఫలసంబంధస్వభావములై యాగమికార్థము లెందు ప్రత్యక్షపరిదృశ్యమానము లగుచుండునో యది యితిహాస మ పేర్కొనిరి.[38] అనఁగా నాగమములందు ఆయాపుణ్యపాపకర్మాదుల కాయాఫలము లభించు నని చెప్పఁబడిన వాక్యతాత్పర్యములు ప్రత్యక్షపరిదృశ్యమాన మగునట్లు ఐ హాసికేతివృత్తము లుండవలె నని నిర్దేశింపఁబడిన దనవచ్చును.

పైనైపుంటికోక్తులను బరామర్శించినచోఁ బురాణములకును ఇతిహాసములకు నడుమ కొట్టవచ్చినట్లు కానవచ్చెడి సామ్యము పురావస్తుసంబంధము. కాని, తత్సామ్యమ నందును బురాణేతిహాసముల స్వరూపతారతమ్యమును విశ్లేషించి చూపించినారు విద రణ్యులు. జగత్ప్రాగవస్థనుండి యారంభ మగునది పురాణ మనియు, దేవాసురులగాథఁ చెప్పునది యితిహాస మనియుఁ జెప్పుటలోనే యాభేదము కలదు. అనఁగాఁ బురా మత్యంతప్రాచీన మగు వృత్తమును జెప్పుచుండ నితిహాస మిది యిట్లని చూచి చెప్పినవా నుండి పరంపరగాఁ జెప్పఁబడుచు వచ్చెడి పురాతనచారిత్రకవృత్తమును జెప్పు నని తాత ర్యము. సంస్కృతభాషలో భూతకాలికక్రియలకు లఙ్ లుఙ్ లిట్ అను త్రివిధలకారముఁ చేర్చి అద్యతనానద్యతనానంత భూతకాలికార్థములను దెలుపుచుండుట కలదు. అనఁగ భూతమును బ్రాచీనులు ముత్తెరఁగుగా భావించి రని స్పష్టపడుచున్నది. అమరసింహుఁడ పురాశబ్దమునకు చిరాతీతనికటాగామికార్థములు కలవని పేర్కొనుటయు దీని కుపబల ముగా నున్నది. ఇట్టి విభాగమునం దొక సామంజస్యము కలదు. లౌకికానుభవదృష్టిత వివేకించినను ఇది సరిపడును. మనకు ప్రస్తుతము వర్తమానము. అది ప్రత్యక్షమ కొలదికాలము జరిగిన తరువాత నా విషయము వార్త యనఁబడును. మఁ కొంతకాలము గడచునరికి అది పరంపరాకథనరూపమున వెలసి చారిత్రకవృత్త మనఁబడును. అదియే చిరకాలమైన తరువాతఁ జెప్పఁబడినచో దాని చారిత్రకత్వమ కంటె పురాతనత్వమే యధికముగా భాసించి పురావృత్త మనఁబడును. దీనిని జగత్కథ కన్వయించుచో సర్గాదిపురాలక్షణవిశిష్టమైన వస్తువు నేఁడు పురాణవస్తు వనుటలో నెట్టి విప్రతిపత్తి లేదు. ప్రాచీనప్రసిద్ధరాజచరిత్రము లితిహాసము లని గ్రహించుటలో నెట్టి సంకోచమును లేదు. అమరసింహుని మాటలలోఁ జెప్పినచో- చిరభూతార్థము పురాణము అతీతభూతార్థము ఇతిహాసము. ఈ సత్యమును గుర్తించి భోజుఁడు "అతీతార్థప్రాధాన్యా దితిహాసః"[39] అని నిర్దేశించియుండెను.

---

38. నాట్యశాస్త్ర 1.15 శ్లో. లోని "సేతిహాసమ్" అనుపదమున కొనర్చిన వ్యాఖ్యానము :
"ఇతిః = ఏవమర్థే ప్రత్యక్షనిర్దేశం ద్యోతయతి । హః = ఇహశబ్ద ఆగమః ॥ ఆసనం = ఆసః, ఏవంప్రకారాః ప్రత్యక్షపరిదృశ్యమానాః ఆగమికార్థాః కర్మఫలసంబంధస్వభావాః యత్ర ఆసతే తేన ఇతిహాసేన - సహేతిపాఠే మత్వర్థీయో అకారః । ఇతిః జ్ఞానమ్ తస్య హాసో హర్షపూర్వకో వికాసో యతః ఇతి కేచిత్-ఇతిహాసశ్చ-తల్లక్షణం ఇద్ధం కిల ఆసనం యస్త్ర రూపకభేదానాం భజ్యతే (దృశ్యతే) ॥"

39. సరస్వతీకంఠాభరణము, 2. 368 శ్లో. వ.

చతుర్విధ పురుషార్థప్రబోధము నితిహాసములవలెనే పురాణములుకూడ నిర్వహించు చున్నవి. కాని పురాణము లాయర్థములను ద్రివిధభాషలలో యథానుకూలముగాఁ జెప్ప వచ్చును. ఇతిహాసములు తదర్థబోధ మైతిహాసికకథాముఖమున నిర్వహింపవలసి యుండును. ఈభావమునే మఱియొకవిధముగాఁ జెప్పినచోఁ గర్మఫలరూపములైన యాగమికార్థములు ప్రత్యక్షపరిదృశ్యమానము లగునట్లు చెప్పవలె నన్న నియమము పురాణములం దానుషంగికముగాను, ఇతిహాసములం దవశ్యముగాను బాటింపఁబడు నని భావము. ఇతిహాసమునఁ జతుర్వర్గసాధకులైన ప్రసిద్ధపురుషుల జీవితవృత్తములు వర్ణింపఁ బడును. అందు వారు వారిలక్ష్యసిద్ధికై యొనర్చుప్రయత్నాదులగూర్చియుఁ, దత్ఫలసిద్ధిని గూర్చియు వివరముగా వర్ణింపఁబడును. వారిజీవితవృత్తములు కర్మఫలరూపములైన యాగమికార్థములకు దృష్టాంతరూపములుగా నుండును. ఇట్టి కథార్థములచే వ్యంజిత మగునది చతుర్విధపురుషార్థప్రబోధము. పురాణమున నిట్టి ప్రబోధము చారిత్రకసత్యమైన మహాపురుషజీవితకథావర్ణన ముఖముననే నిర్వహింపవలసినయవసరము లేదు. కల్పిత కథలద్వారమునగాని, ప్రతీకాత్మకగాథలవలనఁగాని, సమాధిలౌకికభాషలద్వారమునగాని ప్రబోధింపవచ్చును. కావునఁ బురాణేతిహాసములు చతుర్వర్గప్రబోధైకదృష్టి కలవయ్యు భిన్నమార్గముల ననుసరించుచున్న వనవచ్చును:

క్రీ. పూ. 4 వశతాబ్దిప్రాంతమున వెలసిన కౌటిల్యునియర్థశాస్త్రమున నితిహాస స్వరూపము తెలువఁబడియున్నది. రాజుయొక్క దినచర్యను నిర్దేశించి చెప్పుచుఁ గౌటి ల్యుఁడు- ప్రభువు పూర్వాహర్భాగమున హస్త్యశ్వప్రహరణవిద్యాభ్యాసమునుఁ, బశ్చిమాహ ర్భాగమున నితిహాసశ్రవణమును జేయవలె నని నిర్దేశించి, "పురాణ మితివృత్త మాఖ్యాయి కోదాహరణం ధర్మశాస్త్ర మర్థశాస్త్రం చేతిహాసః-[40] అని యితిహాసస్వరూపమును బేర్కొ నెను. ఈమాటలవలన నితిహాసమునందు కొంత పురాణము ప్రవర్తిల్లు ననియుఁ, గార్య కారణసంబద్ధమైన ప్రఖ్యాతవృత్తము నిబంధింపఁబడి యుండు ననియు, నాయకనాయకే తరులచేఁ జెప్పఁబడు నాఖ్యాయికలు కొన్నియు, దృష్టాంతరూపములైన కొన్నిగాథలును, ధర్మార్థశాస్త్రవిషయములును సంతరింపఁబడియుండు ననియు స్పష్టమగుచున్నది. ఈ లక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. మహాభారతారంభమున సర్గాది లక్షణయుక్తమైన వస్తువు కలదు. దేవదానవవిభేదకథనము కలదు. తత్తదంశములచే సంభూతులైన రాజులును, వారివంశములును బేర్కొనఁబడినవి. చంద్రవంశప్రసిద్ధ చక్రవర్తులచరిత్రములు కీర్తింపఁబడినవి. అందును పాండవకౌరవులవృత్త మాధికారిక వస్తువుగా విస్తరింపఁబడినది; వాసుదేవమాహాత్మ్య మాకథయందు వర్ణితమైనది. ప్రసక్తాను వశమున వివిధోపాఖ్యానములును, ధర్మార్థనీతిమోక్షశాస్త్రాదివిషయములును అందు పొందుపఱుపఁబడియున్నవి. మహాభారతము మోక్షశాస్త్ర మనియు, నర్థశాస్త్ర మనియు, నీతిశాస్త్ర మనియుఁ, బురాణ మనియు, మహాకావ్య మనియుఁ గీర్తింపఁబడుచున్నది. ఈ యంశములను క్రోడీకరించి చూచినచోఁ గౌటిల్యుఁడు వాచ్యముగాఁ జెప్పకపోయినను

40. అర్థశాస్త్రము I. 5. పుట 10.

మహాభారతము నుపలక్షించియే యితిహాసస్వరూపము నట్లు నిరూపించె నని భావింప వలనుపడుచున్నది.

రాజశేఖరుఁడు పురాణము శాస్త్ర మనియు, నందు వేదములలోఁ జెప్పఁబడిన యాఖ్యానము లుపనిబద్ధములై యుండు ననియు, నది పంచలక్షణమండిత మనియుఁ దెలిపి, పురాణములలోని యొకవిధమైనభేదమే యితిహాసమని పేర్కొనెను. అట్టియితిహాసగతి పరిక్రియాపురాకల్పములని రెండువిధము లనియు, నందుఁ బరిక్రియ యేకనాయక మనియుఁ, బురాకల్పము బహునాయక మనియు నిర్దేశించెను ![41] వానికిఁ గ్రమముగా రామాయణమహాభారతముల నుదాహరణములుగా నిచ్చెను. ఇందు రాజశేఖరుఁడు ఇతిహాసము పురాణాంతర్గతమైన దని భావించుట గమనింపఁదగినది. సృష్ట్యాదినుండి కలియుగరాజవంశములవఱకు వ్యాపించియున్న మానవజాతియొక్క సమగ్రచరిత్రమును బురాణవాఙ్మయము సమీక్షించుచున్న ట్లగుచున్నదికదా ! అప్పుడు అతీతార్థప్రధాన మగు నితిహాసము పురాణాంతర్భాగమే— వంశవంశానుచరితాంతర్గతమే-యగుచున్నదికదా ! కావున నితిహాసము పురాణైకదేశ మని భావించుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. ఇఁక రామాయణ మహాభారతము లందు ఫలభాక్కు లగు నాయకులు వరుసగా రాముఁడును, పంచపాండవులును అగుటచే వానిని రాజశేఖరుఁడు పరిక్రియాపురాకల్పము లని భావించియుండును. రాజశేఖరుఁ డీశబ్దములను దార్శనికుల పరిభాషనుండి గ్రహించినట్లున్నాఁడు ! దార్శనికులు పరక్రియాపురాకల్పము లనునవి యర్థవాదములుగాఁ బేర్కొని యుండిరి. అర్థవాదములు వస్తుతః నిందా- ప్రశంసా- పరకృతి- పరాకల్ప భేదములచే నాలుగువిధములు. అందు మహాపురుషుఁ డొకడు పూర్వ మొనర్చిన యొకయంశమును బ్రమాణముగాఁ జూపించుట పరకృతి యనఁబడును. "అగ్ని యనువాఁడు సర్వభక్షకుఁడు కాఁగోరి అగ్ని నారాధించెను. సర్వభక్షకుఁ డయ్యెను"[42] అను పూర్వప్రవర్తి తైతిహ్యమును బ్రమాణముగాఁ జూపించుట పరకృతి. పూర్వ మొకనికి జెప్పఁబడినయర్థమును బ్రతిపాదించునది పురాకల్పము. పూర్వ మగ్ని హోమములు మోయ నిష్టము లేక నీటిలో దాగెను. దేవత లగ్ని నన్వేషించుచుండిరి. లగ్ని నీటియందు దాగియుండె నని చేపలు చెప్పినవి. అగ్ని తనరహస్యమును బయలుపఱచినందుల కాగ్రహించి చేపలను- 'లోకులు మిమ్ముల నిష్టము వచ్చినట్లెల్లఁ జంపెదరు గాక !' యని శపించెను-[43] అను పరవక్తృకార్థ ప్రతిపాదనము పురాకల్పము. ఇవి చెప్పఁబడినవిధము గమనించినచోఁ బరక్రియ యేకవక్తృక మనియు, పురాకల్పము బహువక్తృక మనియు నేర్పడుచున్నది. ఒకవిధముగా నీరెండును అతీతార్థప్రధానములే. కాని పరకృతి యద్యతనభూతార్థము; పురాకల్ప మనద్యతన

41. "పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్వివిధా ।
స్యా దేకనాయకా పూర్వా ద్వితీయా బహునాయకా ॥". కావ్యమీమాంస. 2 అధ్యా.

42. తైత్తిరీయ బ్రాహ్మణము III. 1. iv. 1.

43. తైత్తిరీయ సూత్రము II. vi. vi. 1.
ఇవి కృష్ణయజ్వ— 'మీమాంసాపరిభాష' యను గ్రంథమునుండి గ్రహింపఁబడినవి.

ఘూతార్థము. పరకృతియందు ప్రాచీనోదంతము ప్రథమముగా నొకవక్తచేఁ జెప్పఁబడినది; పురాకల్పము పారంపర్యకథనముగా బహువక్తలచేతఁ జెప్పఁబడినది. మీమాంసకులు చెప్పెడి యీయర్థవాదభేదములను రాజశేఖరుఁడు బహుశః గ్రహించి తనకావ్యమీమాంసయందు స్థాపించియుండవచ్చును. కాని, వానిసహజగుణము లగు నేకవక్తృబహువక్తృకత్వములను మార్చి యేకనాయక బహునాయకత్వములుగా నాతఁడు నిబంధించి యుండవచ్చును. 'పరక్రియా'శబ్దమును 'పరిక్రియ'గా మార్చియుండవచ్చును. ఇతిహాసము పారంపర్యోపదిష్టమైనదే కావున మీమాంసకులమతము తద్విరుద్ధము కాదు.

సామాన్యముగా లాక్షణికులు వాఙ్మయమును శాస్త్రేతిహాసకావ్యము లని మూఁడు విధములుగా విభజించెదరు. అందు శాస్త్రము శబ్దప్రధాన మనియు, నితిహాస మర్థప్రధాన మనియు, కావ్య ముక్తిప్రధాన మనియుఁ బరిగణించెదరు. అగ్నిపురాణము ఇతిహాసమునకు నిష్ఠత ముఖ్య మని పేర్కొనినది.[44] అతీతార్థప్రధాన మగుటచే నితిహాసమునకు సత్యప్రతిపాదనము సహజలక్షణ మగుచున్నది. అది యర్థప్రధాన మగుటచే వేదాదులవలెఁ బ్రభుసమ్మితముగాఁ గాక కావ్యమువలె కాంతాసమ్మితముగాఁ గాక హితునివలె మిత్రసమ్మితముగాఁ బ్రబోధము నిర్వహించుచున్నది. ధ్వన్యాలోకమున ఆనందవర్ధనాచార్యులు ఇతిహాసమగు మహాభారతమును "శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయిని" యని పేర్కొనెను. ఈవాక్యమువలన శాస్త్రకావ్యమధ్యవర్తి యగు నితిహాసమునందు కొంత శాస్త్రరూపమును, కొంత కావ్యచ్ఛాయయును అన్వయించియుండు నని యేర్పడుచున్నది. అనఁగా నితిహాసము శాస్త్రకావ్యచ్ఛాయల కొకవిధమైన సంగమస్థానము. శాస్త్ర మనఁగాఁ జతుర్వర్గవ్యుత్పత్తి. కావ్య మనఁగా రసభావసమన్వితోక్తి. ఇతిహాసమునకు సహజలక్షణము అతీతార్థప్రధాన మైన సత్యవస్తుకథనము.[45] ఇతిహాసమునకు శాస్త్రరూపకావ్యచ్ఛాయలు సమకూడినచో నుపదేశోపరంజకత్వములు సిద్ధించి, యొకనిండుదనము కలుగుచున్నది. సత్య-శివ-సుందరస్వరూప మగుచున్నది.

పురాణము లితిహాసములవలెనే అర్థప్రధానములు, మిత్రసమ్మితములు. ఈరెండును వేదార్థములనే యుపదేశించును. పురాణమున శాస్త్రవిషయ మధికముగాఁ జెప్పఁబడుచు, దృష్టాంతరూపమున వివిధేతిహాసకథాగాథాదులు పేర్కొనఁబడుచుండును. ఇతిహాసమున శాస్త్రము సామాన్యముగా కథాగతి కొదిగియుండును. ఇతిహాసకథాకథనమునఁ బ్రధానవృత్తమునందు మందమయ్యును నొకయవిచ్ఛిన్నత భాసించును. దానియం దొకవస్త్వైక్యము గోచరించును. పురాణకథాకథనమునందు సామాన్యముగా వస్త్వైక్య ముండని కారణమున నవిచ్ఛిన్నతకు మాఱుగా ననుసంధాన మొండు భాసించును. అం దైక్యతకు బదు లేకవాక్యత శోభించును.

పురాణము లితిహాసములకంటె నధికముగా దైవలీలలను వర్ణించును. ఋషిదేవ

44. "శాస్త్రే శబ్దప్రధానత్వం – ఇతిహాసేషు నిష్ఠతా ।
అభిధాయాః ప్రధానత్వాత్ - కావ్యం తాభ్యాం విభిద్యతే" – అగ్నిపురా.

45. "అతీతార్థప్రాధాన్యా దితిహాసః" – భోజుని సరస్వతీకంఠాభరణము. 2.368 శ్లో. వ.

పితృగణములవృత్తములు, శాస్త్రవ్రతాదినియమములు, స్వర్గనరకాద్యనుభవవర్ణనములు, పుణ్యపాపఫలనిరూపణములు, పుణ్యతీర్థక్షేత్రమాహాత్మ్యములు, వివిధశాస్త్రార్థసారసంగ్రహములు పురాణములందు స్వేచ్ఛగా వర్ణింపఁబడును. ఇతిహాసములం దివి సందర్భవశమున నౌచిత్యవంతముగాఁ జెప్పఁబడుచుండును.

సంస్కృతమున వెలసిన యితిహాసములు రామాయణమహాభారతములు. ఇందు రామాయణ మాదికావ్య మను ప్రశస్తిఁ గాంచి మహాకావ్యగౌరవము నందుకొనినది. మహాభారత మితిహాస మని ప్రసిద్ధిగాంచినది. పైనఁ బేర్కొనఁబడిన యితిహాసలక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. పురాణములవలెనే యదియును పంచమవేదఖ్యాతి వడసి భారతీయవిజ్ఞానమణిదర్పణమువలె విరాజిల్లుచున్నది.

పురాణేతిహాసములు మాతాపుత్రికలవంటివి. కావున వానిరెండింటికినిఁ గొన్ని పోలిక లున్నవి. పరిణతయైనపుత్రిక మాతవలె గౌరవప్రపత్తులను లోకమున సంపాదించుకొనును. పురాణపురంధ్రి పండినవిజ్ఞానకల్పకము. తత్పుత్రిక తల్లక్షణములు కొన్ని ముద్రించుకొనిన మహితమాకందమూర్తి. వారిగుణములందును, లక్ష్యములందును సామ్యము లుండును: కాని యవస్థలయందును, వ్యవస్థలయందును భేదముండక తప్పదు:

## ఇతిహాస పురాణములు - Epics & Myths :

భారతీయసాహిత్యములం దితిహాసపురాణము లెట్లు ప్రసిద్ధిఁ జెందియున్నవో పాశ్చాత్యవాఙ్మయములందు Epics, Myths అట్లు విఖ్యాతిఁ బడసియున్నవి. వీని పుట్టుపూర్వోత్తరములకును, వికాసక్రమమునకును, స్వరూపనిర్మాణసంవిధానములకును వానికిని సంబంధప్రభావములు చాలతక్కువ. కాని, సాహిత్యప్రక్రియలుగా వానికిని వీనికిని సాజాత్యము కొన్నింటఁ గానవచ్చుచున్నది. పాశ్చాత్యవిమర్శకులు ప్రాచ్యపాశ్చాత్యసాహిత్యప్రక్రియా పర్యాలోచనము సేయుచు భారతీయము లైన యితిహాసపురాణములను గ్రమముగా Epics, Myths గాఁ బరిగణించుట జరిగినది.

## ఇతిహాసములు - Epics :

Epic Poem సామాన్యముగా నొకసుదీర్ఘకథావృత్తము గల కావ్యమై యుండును. మహాసంగ్రామమువంటి యుద్వేగచైతన్యభావముచే నుత్తేజితమైన జాతియొక్క జీవితవృత్తమునుండి గైకొనఁబడిన యుజ్జ్వలములును, ప్రసిద్ధములును నైన సన్నివేశములతో నది నిర్మింపఁబడును. దానియందలిపాత్రలును, సన్నివేశములును మానవుని యౌదార్యౌన్నత్యములయందును, మహోన్నతలక్ష్యసాధనశక్తియందును సామాజికులకు విశ్వాసము నినుమడింపఁజేసి విశిష్టానందము నొసఁగూర్పఁగలుగునట్లు చిత్రింపఁబడును.[46] 'ఎపిక్ పోయెము' లో నితివృత్తమున కధికప్రాముఖ్యము కలదు అంపలికథ రసభరితమై

46. From Virgil to Milton By C. M. Bowra., Page 1.

యుండవలెను. అందు మానవజీవితానుభవముల కతీతములు గాని సంఘటనలు వర్ణింపఁబడుచు, వానిపైఁ బ్రభావము వేయుచున్న విధిప్రాబల్యము నెఱుకఁబఱుపఁబడుచుండును. దానివలన నొక మహాప్రబోధము గాని, మహాప్రయోజనము గాని సాధింపఁబడవలెను. అట్టి యుదాత్తవస్తువున కుచితమును, ఛందోఽలంకారబంధురమును నైన కవిత్వశైలి దాని యందు నిబంధింపఁబడును[47]. ఇట్టిలక్షణములతో నొప్పారు Epic స్వరూపస్వభావములచే నితిహాసమునకన్న భిన్నమయ్యుఁ గొన్నియంశములందు సాధర్మ్యము నంతరించుకొను చున్నది. సుదీర్ఘకథాకథనము, ఉజ్జ్వలమైన జీవితవృత్తములు గల పాత్రలు, చారిత్రక సత్యనిష్ఠ, పురుషార్థసాధనామయమైన యున్నతజీవితలక్ష్యము, రసాత్మకమును, ఉపదేశాత్మకమునునైన యితివృత్తనిర్వహణము, కర్మఫలసంబంధనిరూపణాత్మకములైన యాగమికార్థములు ప్రత్యక్షపరిదృశ్యమానము లగునట్లు చేయుట, ప్రసన్నగంభీరమైన శైలి - అను లక్షణములు ఇతిహాసమునందును గానఁబడుచున్నవి. కాని భారతీయుల యితిహాసములు పాశ్చాత్యుల Epic Poems కంటె నుత్తము లైనవి. వీనియందుఁ గానఁబడు భారతీయతాశ్త్రీవికౌన్నత్యమును, సార్వకాలికవిజ్ఞాననిధిత్వమును, పంచమవేదము లనఁబడు ప్రామాణికత్వమును వానియందుఁ దత్సాహిత్యరంగమునఁ గానరావు. పాశ్చాత్యుల Epic లక్షణములు భారతీయుల మహాకావ్యలక్షణముల కత్యంతసన్నిహిత మై యున్నవి. కాని యితిహాససమగ్రస్వరూపలక్షణముల నవి ప్రతిబింబించుకొనలేదు.

పాశ్చాత్యవిమర్శకులు Epic ను Authentic Epic అనియు, Literary Epic అనియు ద్వివిధాకరించిరి. Authentic Epic ను Primary Epic అనియు, Epic of growth అనియు, Oral Epic అనియుఁ బిలిచెదరు. Literary Epic ను Secondary Epic అనియు, Epic of Art అనియు, Written Epic అనియు వ్యవహరించెదరు. విమర్శకులు వీనినిగుఱించి వివరించినవాక్యములను గ్రోడీకరించుకొనినచో వాని స్వరూప స్వభావముల నీక్రిందివిధముగా భావింపవచ్చును.

భట్టులవంటివారైన కథకులు సమకాలీన మైన యొకసత్త్వరప్రయోజన ముప లక్షించి వివిధకాలములందుఁ జెప్పఁబడుచుఁ బారంపర్యముగా వచ్చుచున్న కథలనుగాని, ప్రత్యక్షలోకానుభవమునఁ గనిన యద్భుతవీరగాథలనుగాని గానముచేయుచు వినిపించు చుండ వాని నొకచోట సంపుటీకరణము చేసినచో నది Authentic Epic అనఁబడును. అది సామాన్యముగా నాశువుగా నుండుటచే వక్తృభేదము ననుసరించి యనేకనూతనాంశము లందుఁ జేరుట కవకాశము కలదు. అది సాధారణముగా ననేకవీరుల సహసగాథలను వర్ణించుచుండుటచే బహునాయకమై యుండును. అందలిపాత్రలు గుణదోషమిశ్రమూర్తు లైన మానవు లయి యుందురు. అందుఁ బ్రబోధము నిర్వహింపవలె ననెడి యాదర్శదృష్టికంటె వాస్తవికతను బ్రతిబింబింపఁజేయవలె ననెడి యాసక్తి యధికముగాఁ గానఁబడును. అందలికవితాశైలి సరళమును, శక్తిమంతమును, ధారాళము నై నిరాడంబరముగా నొప్పారుచుండును.

47. The Epic - By L. Eber Crombe - Page 51.

ఒకమహాకవి మహాకవిత్వదీక్షావిధి నంది తా నొకయితిహాసమును రచింప సంకల్పించి ప్రయత్నపూర్వకముగా నందు కావ్యశిల్పాదులను సంతరించి రచించిన కవితా గ్రంథవిశేషము Literary Epic. సామాన్యముగా నొకమహాసంఘటనము గాని, ఒక యుజ్జ్వలచరిత్రాధ్యాయము గాని ముగిసినవెంటనే వెలసిన యొకమహాకవి యద్యతన భూతమైన యాచరిత్రను సమగ్రముగా సమీక్షించి, యొకతాత్త్వికసమన్వయముతో వస్త్వైక్యమును సంతరించి, యాలంకారికమైన ప్రౌఢకవిత్వమున నొకమహాకావ్యముగా నిర్మించుచుండును. అది సార్వకాలీనమైన సాహిత్యప్రయోజనము నుపలక్షించి పఠన పాఠనముల కుపయోగపడునట్లు రచింపఁబడును. సాధారణముగా నిది యేకనాయక ముగా నుండును. ఆనాయకుఁడు స్వయంసమర్థుఁడును, దివ్యాదివ్యుఁడును నయి యుండు నట్లే కాక యొక్కొకసారి యొకజాతికిని, ఒకసంస్కృతికిని ప్రతీకగా, లేక, ప్రతినిధిగా నిర్మింపఁబడవచ్చును. ఆనందముతోపాటు ఉపదేశమునుగూడ సామాజికుల కందించుట దీనిప్రధాన లక్ష్యము.

సంస్కృతమున వెలసిన యితిహాసముల కీవిభాగము సమగ్రముగా నన్వయింపదు. కాని స్థూలదృష్టితోఁ బరిగణించినచో మహాభారతము Authentic Epic అనియు, రామా యణము Literary Epic అనియు భావింపవచ్చును.

## పురాణములు - Myths :

Myth అనుపద మిప్పుడు అభూతకల్పన మను నర్థమున నిత్యవ్యవహారమున వాడఁబడుచున్నది. ఈపదము ప్రాచీనగ్రీకుభాషలో 'నోటితో నుచ్చరింపఁబడినది' యను నర్థము నిచ్చు Mythos అను పదమునుండి జన్మించినది. ఆపద మాభాషలోనే కాలక్రమ మున దైవములకును, అద్భుతావహములగు దైవలీలలకును సంబంధించినగాథ లను నర్థ మునఁ బ్రసిద్ధి కెక్కినది. అది క్రమముగా నమాయకులకులను మోసగించుటకై కల్పిం పఁబడిన యద్భుతగాథ యను నర్థమున రూఢికెక్కినది.

పాశ్చాత్యవిమర్శకులు Myth అనునది యనాదిమానవుఁడు భగవదారాధనారూప మైన పవిత్రకర్మతంత్రము నాచరించునప్పు డుచ్చరించిన వాక్యసముదాయమునుండి మొదట పుట్టియుండవచ్చు ననియు, నదియే క్రమముగాఁ దత్కర్మల నాచరించినవ్యక్తుల యొక్కయు, దైవములయొక్కయు మహిమాన్వితము లైన గాథలతో విస్తరించియుండ వచ్చుననియు భావించుచున్నారు. ప్రాచీనులు ప్రకృతిశక్తులను, పితృదేవతలను, సురా సురప్రవృత్తులను, వన్యమృగాదులను, ఆదర్శప్రభువులను, మాంత్రికులను, ఐంద్రజాలి కులను, దైవములుగా రూపకల్పనము గావించి, వారియందు మానవాతీతశక్తుల నారోపించి, యద్భుతకథలుగా వర్ణించి యుందు రని యూహించుచున్నారు.[48] మొత్తముమీద Myths చారిత్రకసత్యములు కావనియు, మానవాతీతశక్తులకు సంబంధించిన యద్భుతచర్యలకు సంబంధించిన కల్పితగాథ లనియుఁ జాలమంది విమర్శకులు విశ్వసించుచున్నారు. ఇట్టి

48. The outlines of Mythology - Lewis Spence - Page 25.

కథ లభూతకల్పనలుగా నిప్పుడు కానవచ్చుచున్నను ప్రాచీను లాకథలు గాథలు పురాతన కాలమునం దెప్పుడో యొకప్పుడు జరిగియుండునను విశ్వాసముతో నుండి రని ప్రొఫెసర్ మాలినౌస్కి వంటి విమర్శకు లంగీకరించుచున్నారు. ఆగాథలయం దవి యెట్టి పురాతనవాతావరణములందుఁ బుట్టినవో, వానియందుఁ బ్రపంచిత మయ్యెడి ప్రాచీన విశ్వాసాదు లెట్టివో తెలుపునంశములు భద్రపఱచుట జరిగిన దనియుఁ, దత్కథాకథనమున శ్రోతలు వానియందలిశబ్దములను, భావములను, వివరములను ప్రమాణబుద్ధితో గ్రహించి వానిపట్ల నెట్టి మార్పుచేర్పుల నొనర్చుటకును సుముఖులై యుండెడివారు కారనియుఁ దెలుపుచున్నారు.

Myth లలో దైవలీలలేకాక, సర్గప్రతిసర్గాదులవంటి విషయములును, ఖగోళరహస్య విషయములును, స్వర్గనరకాదిపరలోక విషయములును, పుణ్యాపాపఫలానుభవవిశేషములును, నరు లొనర్చు ఆముష్మికపుణ్యకర్మలకు దేవతలు తృప్తులై లోకమునకు వారొనర్చు ప్రత్యక్షప్రత్యుపకారాదులును, అట్లే దేవతల యాగ్రహచర్యలును వర్ణింపఁబడి యున్నవి. అతిప్రాచీనవిషయములయొక్క విస్పష్టోత్పత్తివికాసాదుల నెఱిఁగింప యత్నించు కథలలోఁ గొన్నింట స్థానికగాథలే పురాణగాథలుగాఁ బరివర్తనము చెందుటయుఁ గానఁబడుచున్నది. Myth లలో నభివర్ణితులైన దేవతలలో సూర్యున కధికోన్నత స్థానము కలదు. ఒకవిధముగా సర్వప్రపంచపురాణవాఙ్మయము (Mythologies) సూర్యునిచుట్టు తిరుగుచున్న దని చెప్పినను ఆశ్చర్యము లే దని విమర్శకులు భావించుచున్నారు. [49]

Myth యొక్క వైశిష్ట్యమును ప్రొఫెసరు మాలినౌస్కి యీక్రిందివాక్యములలోఁ బ్రతిభావంతముగా నుడివియున్నాఁడు :

'ఒకజాతియొక్క సంప్రదాయములను బలపఱచుటకు Myth పుట్టును. చరిత్ర కందని పురావృత్తమును సముజ్జ్వలాధ్యాత్మికదృష్టితో సముద్ధరించి, వ్యాఖ్యానించి, జాతియొక్క గౌరవప్రతిష్ఠల నినుమడింపఁజేయుట 'మైథాలజీ'లక్ష్యము. 'మైథాలజీ' సర్వవాఙ్మయమునకు మూలభూతమైనది. అందుండియే - ఇతిహాసము, కావ్యము, నాటకము- సర్వము జనించును. 'మైథాలజీ' మానవసంఘవ్యవస్థను శాసించును; ధర్మమును బోధించును; న్యాయమును సూచించును; శిల్పసుందరమైన కళయును, జ్ఞానబంధురమైన శాస్త్రమును దానివాక్కున భాసించును. కావున మానవుని యనుభూతులకును, ఆవేశములకును, ఆశలకును, ఆశయములకును, అంతరంగమునకును, అన్వేషణమునకును, 'మైథాలజీ' యొకమణిదర్పణము.'[50]

పాశ్చాత్యులు భారతీయుల వేదపురాణేతిహాసములను గలిపి యుమ్మడిగా Myths అని గుర్తించియున్నారు. కాని భారతీయులు శ్రుతిస్మృతులను శాస్త్రములుగను, పురాణేతిహాసములను శాస్త్రములకంటె భిన్నమైనసారస్వతప్రక్రియలుగాను బరిగణించుట

49. The outlines of Mythology - Pages 71 - 72.
50. చూడు : Mythology - Ency. Britanica.

ప్రసిద్ధము. కావునఁ బాశ్చాత్యులు చెప్పిన Myth యొక్క స్వరూపస్వభావములలో భారతీయుల వేదముల కేవి వర్తించునో పురాణేతిహాసముల కేవి వర్తించునో వివేకింపవలసి యున్నది.

పురుషార్థసాధకుఁ డైన మానవునిధర్మకర్మాచరణమును విధిరూపమున నిర్దేశించునవి వేదాదు లగుటచే నవి శాసించునవి శాస్త్రము లనియు, నవి శబ్దప్రధానము లైనవనియుఁ జెప్పఁబడుచున్న వికదా ! అట్టి శబ్దప్రధానములైన కర్మతంత్రవిధులు Mythలలోఁ గల వని పాశ్చాత్యులు చెప్పుచున్నారు. వానియం దుపయుక్తము లైన శబ్దములకు మారుగా నదేయర్థము నిచ్చు నన్యశబ్దములను వాడినచో శ్రోతలు గర్హింతు రనుటయు దాని కుపబలకముగా నున్నది. వేదశాస్త్రములందలి ఋక్సూత్రములకు నిట్టినియమము ప్రసిద్ధము కావునఁ గర్మతంత్రముల (Rites) నభివర్ణించు Myth వేదతుల్యమైనది. తత్స్వరూపస్వభావములను నిర్దేశించు వాక్యసముదాయము స్మృతిగ్రంథ సదృశమైనది. మఱియు—వేదమున మంత్రబ్రాహ్మణములు కలవు. మంత్రము దైవస్వరూపమును శబ్దరూపమున వాచ్యము చేయు బీజాక్షరసంపుటి. బ్రాహ్మణము విధి - అర్థవాద - అనువాద భేదముచేఁ ద్రివిధము. ఇట్టివానినే "Myth is, in the strict sense of the term the description of a rite, its story, the narrative linked with it" అని Lewis Spence భావించియుండును.

Mythology లోఁ గానఁబడు నిట్టివిధివాక్యములు గాక మిగిలిన లక్షణములు కొన్ని పురాణముల కన్వయించుచున్నవి. సర్గప్రతిసర్గములు, పుణ్యాపాపఫలరూపము లైన స్వర్గనరకభోగవర్ణనాదులు, భగవల్లీలలు, పితృదేవతామహిమలు, ప్రకృతిశక్తులు పాత్రలుగాఁ గలకథలు, సూర్యమహిమాభివర్ణనాత్మకము లగుకథలు, పురాణములందును వర్ణింపఁబడుచున్నవి. మఱియును— పురాణములు వేదార్థోపబృంహితము లగుటచే Myths లో వలె rites కు సంబంధించిన విషయములు పురాణములం దుండు ననుటలో వైరుధ్యము లేదు. పురాణములు వేదతుల్యము లనియు భారతీయులు భావించుచున్నారు. కావునఁ బాశ్చాత్యుల Mythology కిని, పురాణవాఙ్మయమునకును గొంతసాజాత్యమున్నదనుటలో విప్రతిపత్తి లేదు.

ప్రతిపాద్యాంశములనుబట్టి Myths - Explanatory myths అనియు, Aesthetic myths అనియు రెండువిధము లగు నని C. M. Gayley ప్రతిపాదించెను.[51] విశ్వవిశ్వాంతరాళములలోని మహాద్భుతవిషయములనుగూర్చియు, జీవితవిశేషానుభవములను గూర్చియు, విస్మృతమతసాంఘికాచారములఁగూర్చియు, పురావిషయములసార్థకచరిత్ర నిరూపణముగూర్చియు, ననాదిమానవుల కున్న యాసక్తినిఁ దీర్చుటకై సత్యాన్వేషణపరు లైన కొంద ఱొనరించిన యూహాపోహలలో రూపులు దిద్దుకొనిన కథలు Explanatory myths. వానియందుఁ బ్రపంచసృష్టి, మానవసృష్టిస్థితివికాసములు, దేవాసుర

51. చూడు : The classic Myth - Pages 431.

ప్రవృత్తులు, మృత్యువు, పరలోకములు, ఆచారవ్యవహారములు, పండుగపబ్బములు - ఇట్టివానినిగూర్చిన జిజ్ఞాసయే కథలుగా గాథలుగా నల్లుకొని కానఁబడుచుండును.

ఆహ్లాదమే పరమప్రయోజనముగా నిర్మింపఁబడిన యపూర్వకల్పనామహనీయగాథా ప్రపంచమును Aesthetic myths అని యందురు. ఈకథలయందపూర్వవిజ్ఞానవిశేషము లెన్నియో చెప్పఁబడును. కాని వానివలన నాహ్లాదముకంటె వేఱొకప్రయోజనము కానరాదు. అందలిపాత్రలును, వానిమనోభావములును, సన్నివేశములును మానవసహజానుభవములకు దూరమై యున్నను అవి భావనామధురములై యాబాలగోపాలమును జవులూరించును. పఠితలు వానివలనఁ బొందెడి యఖండానందమున కాకథామాధుర్యమే పరమ కారణము.

Aesthetic myths లో చారిత్రకాంశము లాధారముగా వెలసినవి కొన్నియుఁ, గేవలకల్పనాకథలు కొన్నియుఁ గానవచ్చుచుండును. ఇట్టిభేదమును బురస్కరించుకొని C. M. Gayley - Aesthetic mythsను - Historical myths అనియు, Romantic myths అనియు రెండువిధములుగా విభజించెను. చారిత్రకాంశము నొకదాని నాధారముగా గొని దాని కొక దివ్యవాతావరణమును, సాహసాత్మకకథాస్వభావములు, భావనాబంధురములును, సంభావ్యతాగుణవిశిష్టములునైన కల్పనలను జోడించి, యొకమిశ్రకథామూర్తిగా రూపొందింపఁబడినది Historical myth అనఁబడును. దీనియందు బలీయమైన విధిప్రభావము సర్వకథాజీవితమును శాసించుచున్నట్లు చిత్రింపఁబడుట గమనింపఁదగిన ముఖ్యాంశము. Romantic myth ఒకమహావీరుని యుజ్జ్వలచరిత్రము నభివర్ణించుకథ. అందు సన్నివేశములకంటె కథానాయకపాత్రచిత్రణమునకే ప్రాముఖ్య మీయఁబడుచుండును. అతని యాలోచనముల యొక్కయు, ఆచరణములయొక్కయు, నిర్ణయముల యొక్కయు గతి ననుసరించి సర్వకథాప్రవృత్తి పరిభ్రమించుచుండుట యీకథలలోని ప్రత్యేకత।

పాశ్చాత్యులు Myths ను విభజించినవిధమును పురాణకథల కన్వయింపఁ జేసినచో వానిలోని సర్గప్రతిసర్గవృత్తాంతములు Explanatory myths అనియు, మన్వంతరవంశవంశానుచరితములు Aesthetic myths అనియు స్థూలముగా నేర్పఱుపవచ్చును. అందు వంశానుచరితములందలి ఐతిహాసికమహాపురుషులచరిత్రలు Historical myths అనియు, మన్వంతరగాథాదులును, అవతారమహిమలును Romantic myths అనియు భావింపవచ్చును. కాని యిట్టిదృష్టితోఁ బురాణకథలను విభజించినట్లు కానరాదు, కాని నవ్యులు పాశ్చాత్యవిమర్శనాపద్ధతుల ననుసరించి పురాణకథల నిట్లు వర్గీకరించుచున్నారు.

పాశ్చాత్యులు రామాయణమహాభారతములను Myths గాను, Epics గాను గుర్తించిరి. వానిని Epics గనే గుర్తించుట సమంజసము. కాని వారి Epic భావనకును, మన యితిహాసస్వరూపసంభావనమునకును మౌలికమైన కొన్నిభేదము లుండుటవలననే యిట్టి చిక్కేర్పడినది. అది యట్లయినను - పురాణములకును Myths కును స్వరూపస్వభావములందుఁ గొన్ని సమానలక్షణము లున్నవనుట తథ్యము;

# మార్కండేయమహాపురాణము

అష్టాదశమహాపురాణములలో మార్కండేయము సప్తమ మని పారంపర్యముగాఁ జెప్పఁబడుచున్నది. మహాపురాణములుగా భాగవతవాయుపురాణములఁ బరిగణించుటలో నున్నవివాదము లీమహాపురాణవిషయమునఁ గానరావు. కావున మార్కండేయముయొక్క మహాపురాణత్వము నిర్వివాదాంశము.

## నామ వైశిష్ట్యము :

మార్కండేయమహాముని యమృతాఖ్యము నధికరించి యీపురాణనామ ముంచఁబడినది. మార్కండేయమహర్షి యీపురాణప్రవక్తలలో నొకఁడు. ఆయంశ మీపురాణమునందలి 42 వ యధ్యాయమునఁ జెప్పఁబడియున్నది. జైమినిముని సర్గప్రతిసర్గ వంశమన్వంతరవంశానుచరితాదులను విస్తరింపుఁ డని ధర్మపక్షులను బ్రార్థించెను. అప్పులుగులు తద్విషయములను మును మార్కండేయమహర్షి క్రోష్టుకి యను మునివరునకుఁ జెప్పినవిధముగా వివరించెను.[1]

అష్టాదశమహాపురాణములు వ్యాసవిరచితము లనియుఁ, బురాణములకన్నింటికిని మూలమైనది బ్రహ్మనిర్మితమైన పురాణసంహిత మనియుఁ బరంపరాగతమైన కథనము కలదు. ఏతత్పురాణకథార్థముల నారంభించుచు మార్కండేయమహర్షి చతుర్ముఖుఁ డవ్యక్తమువలన నావిర్భవించినవెంటనే యతనిముఖకమలములనుండి పురాణసంహితయు, వేదములును నుద్భవిల్లె ననియు, వానిని బ్రహ్మ తన మానసపుత్త్రు లగు సప్తర్షుల కెఱిఁగించె ననియు, వారిలో భృగుమహర్షి చ్యవనునునకుఁ బురాణసంజాతమును జెప్పె ననియు, నాతరువాత నప్పురాణార్థములను జ్యవనుఁడు కొందఱమునుల కెఱిఁగించె ననియు, వారు దక్షునకును, దక్షుఁడు మార్కండేయునకును గ్రమముగా నుపదేశించి రనియు స్పష్టపఱచెను.[2] కావున మార్కండేయపురాణము బ్రహ్మదేవునినుండి పారంపర్యోపదేశక్రమమున మార్కండేయ మహర్షికి లభించినది. అతఁడు క్రోష్టుకి యను ముని కుపదేశించెను. ఆవిషయము జ్ఞానపక్షులు జైమినిమునికిఁ జెప్పెను. కాని, జ్ఞానపక్షుల కాపురాణము నెవ రుప

1. మార్కం. మహాపు. 42 అధ్యా. 16–18 (వేం. ప్ర.); 40. 16–18 (తరం. ప్ర.)
2. మార్కం. మహాపు. 42. 20–26. (వే . ప్ర.); 40. 20–26 (తరం. ప్ర.)

దేశించి రను నంశ మీపురాణమున స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. పక్షులు జ్ఞానదృష్టులు కావున దివ్యదృష్టితో వానిని గ్రహించి రని చెప్పుకొనవలెను.

వేదశాస్త్రవిజ్ఞానమునం దవ్యాహతమతు లైన ఖగశ్రేష్ఠులు[3] క్రాంతదర్శులైన జ్ఞానపిపాసువులకుఁ బ్రతీకలు. వారి కాగతానాగతార్థసంగ్రహణ వివేకము సహజలక్షణము. వారు మార్కండేయమహర్షి క్రోష్టుకిమునికిఁ దెలిపినపురాణమును జ్ఞానదృష్టి వలన గ్రహించిరి. తత్పూర్వ మాపురాణము బ్రహ్మప్రోక్త మని వారికిఁ దెలియును. కాని మార్కండేయమునివాగ్వ్యాప్తి నాశ్రయించి యాపురాణములు పుష్టిమంతములైనవి కావునఁ బక్షు లావాక్యములను బునశ్చరణము చేసినవి. మహర్షివాక్యములు స్థిరములై జగత్ప్రసిద్ధము లైనవి. పారంపర్యోపదేశ మాతనితో నాగినది. తొల్లి మార్కండేయ ముని క్రోష్టుకికిఁ జెప్పినట్లు చెప్పుకొనుట లోకమునఁ బరిపాటియైపోయినది. అది మార్కండేయపురాణ మనుట రూఢికెక్కినది.

ప్రస్తుత ముపలభ్యమున మగుచున్న మార్కండేయపురాణమునందు మొదటి 42 అధ్యాయములును బ్రధానపురాణమున కుపక్రమణికవలె నున్నవి. అందు ధర్మపక్షుల జన్మవృత్తాంతమును మార్కండేయమహర్షియే జైమినిమునికి మొదటిమూఁడధ్యాయములలోఁ జెప్పినాఁడు. ఆపైన మహాభారతకథార్థములలో జైమినిమునికిఁ గలిగిన సంశయములకుఁ బక్షులు సమాధానములు జెప్పినవి. అవి యాఅధ్యాయములు పట్టినవి. ఆ తరువాతఁ బక్షులు జడోపాఖ్యానమును చెప్పినవి. అది యిఱువదిరెండధ్యాయముల విస్తృతి గలిగినది. జడోపాఖ్యానము పితాపుత్త్రసంభాషణరూపము, జడప్రోక్తము, పూర్వపురాణప్రసిద్ధము. అట్లగుటచేఁ బక్షులచేఁ బ్రత్యక్షముగాఁ జెప్పఁబడినభాగ మీపురాణమున నాఅధ్యాయములు మాత్రమే. మార్కండేయుఁడు చెప్పినది దాదాపు 103 అధ్యాయములభాగము. జడోపాఖ్యానాదులును సందర్భశుద్ధితో నిందుఁ జోటుచేసికొని ధర్మపక్షులచేఁ జెప్పఁబడినవి. ఇట్లు మార్కండేయప్రోక్తములును, ధర్మపక్షిప్రోక్తములును దదితరములును నైన పురాణార్థములును తరువాత బహుశః ఒకానొకపౌరాణికునిచే సంకలనము చేయఁబడియుండవచ్చును. అతఁడు వ్యాసమహర్షి యని పారంపర్యము చెప్పుచున్నది. ఈయంశములనన్నింటినిఁ గ్రోడీకరించినచో నీపురాణమునఁ బ్రధానభాగమంతయు మార్కండేయమహర్షిచేఁ జెప్పఁబడి లోకమున వ్యాప్తిఁజెందియుండుటచే నీపురాణ మా మహర్షినామముతోఁ బిలువఁబడుచున్న దని స్పష్టమగుచున్నది.

మార్కండేయుఁడు పురాణప్రవక్త యగు నొకబ్రహ్మర్షి మృత్యుంజయదయామృత వృష్టిచేఁ జిరంజీవియై వెలసిన మహనీయుఁడు! అట్టి బ్రహ్మర్షినామమున నీపురాణము ప్రసిద్ధ మైనది. ఇట్లొకబ్రహ్మర్షినామమునఁ బ్రసిద్ధ మైన పురాణ మష్టాదశమహాపురాణములలో మఱొక్కటి లేదు! అది యీపురాణనామమున కున్న వైశిష్ట్యము.

---

3. మార్కం. మహాపు. 1. 21-22 (వేం. ప్ర.); 1. 25-26 (తరం. ప్ర.)

**శ్లోక సంఖ్య :**

మార్కండేయపురాణము నవసహస్రశ్లోకమండిత మని మత్స్యనారదవాయుపురాణములు వాకొనుచున్నవి. కాని, ప్రస్తుత ముపలభ్యమానము లగుచున్న మార్కండేయ పురాణప్రతులలో రమారమి 6900 శ్లోకములు మాత్రము కానవచ్చుచున్నవి. మార్కండేయము స్వయముగాఁ జెప్పుకొనిన తనశ్లోకసంఖ్య కిది సరిపోలుచున్నది.[4] మత్స్యనారదాదిపురాణములు పురాణశ్లోకసంఖ్యతోపాటు పురాణవిషయసూచికలనుగూడ వర్ణించినవి. వానియందుఁ జెప్పఁబడినయంశములతోఁ జాలవఱకు మార్కండేయపురాణమునందు వర్ణితములైన యంశములు సరిపడుచున్నవి. ప్రస్తుత ముపలభ్యము లగుచున్న మార్కండేయపురాణప్రతు లన్నియు సూర్యవంశానుచరితమున నరిష్యంతచరిత్రమువఱకు వర్ణించి ముగియుచున్నవి. కాని నరిష్యంత చరిత్రానంతరము మార్కండేయమున నిక్ష్వాకు చరిత్రయు, తులసీచరిత్రయు, రామచంద్రకథయు, కుశవంశచరిత్రయు, వర్ణితము లయ్యెననియు, నాతరువాత సోమవంశానుకీర్తనమునఁ బురూరవ, నహుష, యయాతిచరిత్రలును, యదువంశానుకీర్తనమున శ్రీకృష్ణబాలలీలాభివర్ణనమును, మధురాద్వారకా చరిత్రములును, అవతారకథలును, తదుపరి సాంఖ్యకథయుఁ బ్రపంచతత్త్వకీర్తనమును, మార్కండేయ మహర్షిచరితమును వర్ణింపఁబడియున్న వనియు నారదీయ మహాపురాణము పేర్కొని యున్నది[5].

ఈకథాంశములు గల మార్కండేయ పురాణభాగము నేఁడు కానవచ్చుట లేదు. కావున నాభాగమునందలికథ లితరపురాణములందుఁ గలసిపోవుటయో లేక శిథిలము లగుటయో జరిగియుండవచ్చును. ఇప్పటి మార్కండేయముయొక్క ముగింపు కొంత స్వభావవిరుద్ధముగా నున్నది. ఇనవంశకథాక్రమమును జెప్పుచు మధ్యలో నకస్మాత్తుగా నాపివేయఁబడినది. కొందఱు విమర్శకు లీవిధమైనముగింపు తత్పురాణప్రాచీనత్వమును దెలుపుచున్న దని

---

4. "పురాణాక్షరసంఖ్యా చ ప్రఖ్యాతా తత్త్వబుద్ధినా
శ్లోకానాం షట్సహస్రాణి తథా చాష్టశతాని చ ॥
శ్లోకా స్తత్ర నవాశీతి రేకాదశసమాహితాః
కథితా మునినా పూర్వం మార్కణ్డేయేన ధీమతా ॥"

—మార్కం. 184. 88-89 (వేం. ప్ర.)

5. "నరిష్యన్తస్యచరితం ఇక్ష్వాకుచరితం తతః
తులస్యాశ్చరితం పశ్చా ద్రామచన్ద్రస్య సత్కథా
కుశవంశసమాఖ్యానం సోమవంశానుకీర్తనమ్ ॥
పురూరవఃకథా పుణ్యా నహుషస్య కథాద్భుతా
యయాతిచరితం పుణ్యం యదువంశానుకీర్తనమ్ ॥
శ్రీకృష్ణబాలచరితం మాథురం చరితం తతః
ద్వారకాచరితం చాఽథ కథా సర్వావతారజా ॥
తతః సంఖ్యాసముద్దేశః ప్రపంచా సత్త్వకీర్తనమ్
మార్కండేయస్యచరితం పురాణశ్రవణేఫలమ్ ॥

—నారదీయపురాణము.

భావించినను, బరితకు మాత్ర మీ పురాణ మసంపూర్ణముగనే భాసించుచుండును. ఈ యంశమున కుపబలకముగా నీష్టిండియాకంపెనీ గ్రంథాలయమున నున్న నొకతాళపత్ర ప్రతిలోఁ బ్రస్తుతమార్కండేయపురాణము తత్పురాణప్రథమఖండ మని వ్రాయఁబడియున్న దఁట [6] ; కావున నీపురాణద్వితీయఖండ – మసలు వ్రాయఁబడియున్నచో – ఖిలమైపోయిన దని భావింపవలసియున్నది. ఉపలబ్ధ మార్కండేయపురాణమున కాఖండమును జేర్చినచో నారదీయపురాణోక్తి ననుసరించి నవసహస్రశ్లోకపరిమాణమేర్పడవచ్చు నని యూహింప వలసియున్నది. [7]

**మహాభారత ప్రశంస :**

మార్కండేయమహాపురాణము మహాభారతప్రశంసతో నారంభ మగుట యొక విశేషము. వ్యాసమహర్షిశిష్యుఁడైన జైమినిముని పరమనిష్ఠావరుఁడైన మార్కండేయ మహర్షిని దర్శించి, యతనివలన మహాభారతాఖ్యానమునందలి గూఢతరములైనయర్థము లను గొన్నింటిని యడిగి తెలిసికొనవలె నని సంకల్పించి తద్గ్రంథమహత్వము నిట్లు ప్రశంసించెను :—

శ్లో॥ భగవన్ ! భారతాఖ్యానం వ్యాసేనోక్తం మహాత్మనా
పూర్ణమ స్తమలై శ్శుభ్రై ర్నానాశాస్త్రసముచ్చయైః ॥
జాతిశుద్ధిసమాయుక్తం సాధుశబ్దోపశోభితమ్
పూర్వపక్షోక్తిసిద్ధాన్తపరినిష్ఠాసమన్వితమ్ ॥
త్రిదశానాం యథా విష్ణు ర్ద్విపదాం బ్రాహ్మణో యథా
భూషణానాం చ సర్వేషాం యథా చూడామణి ర్వరః ॥
యథాయుధానాం కులిశ మిన్ద్రియాణాం యథా మనః
తథే హ సర్వశాస్త్రాణాం మహాభారత ముత్తమమ్ ॥
అత్రార్థ శ్చైవ ధర్మశ్చ కామో మోక్ష శ్చ వర్ణ్యతే
పరస్పరానుబన్ధా శ్చ సానుబన్ధా శ్చ తే పృథక్ ॥
ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ మర్థశాస్త్ర మిదం పరమ్
కామశాస్త్ర మిదం చాగ్ర్యం మోక్షశాస్త్రం తథోత్తమమ్ ॥
చతురాశ్రమధర్మాణా మాచారస్థితిసాధనమ్
ప్రోక్త మేత న్మహాభాగ వేదవ్యాసేన ధీమతా ।
తథా తాతకృతం హ్యేత ద్వ్యాసే నోదారకర్మణా
యథా వ్యాప్తం మహాశాస్త్రం విరోధై ర్నాభిభూయతే ।
వ్యాసవాక్యజలౌఘేన కుతర్కతరుహారిణా
వేదశైలావతీర్ణేన నిరజస్కా మహీకృతా ॥

6. Preface to - VISHNUPURANA — H. H. Wilson Page 33.
7. పురాణతత్త్వమీమాంసా (హిందీ) – శ్రీకృష్ణమణిత్రిపాఠీ. పుట. 175.

కలశబ్ద మహాహంసం మహాఖ్యానవరాంబుజమ్
కథావిస్తీర్ణసలిలం కార్ష్ణంవేదమహాహ్రదమ్ ॥

1. 2-11; (వేం.ప్ర.); 1. 6-15. (తరం. ప్ర.).

సర్వనిగమార్థయుతమును, చతుర్వర్గసాధనమును, సర్వశాస్త్రకలితమును నైన వ్యాస మహాభారతము సర్వవాఙ్మయశిరోభూషణ మని జైమినియభిప్రాయము. దానిని తత్త్వ దృష్టితో నుపాసించినచో జ్ఞానసిద్ధి వడయవచ్చు నని యతనివిశ్వాసము. అతఁడు నిష్ఠతో భారతమును బఠించెను. అందలి వివిధకథార్థములను సమన్వయించుకొనెను. కాని, యతని కన్వయముగాని గాఢవిషయములు నాలుగు మిగిలిపోయెను. వానితత్త్వ మరయ వలె ననెడి జిజ్ఞాసతో వానిని మార్కండేయమునికి నివేదించెను. అవి :

1. నిఖిలభువనోత్పత్తిస్థితిలయకారణుఁడును, త్రిగుణరహితుఁడును, సర్వవ్యాపకుఁడును నైన పురుషోత్తముఁ డేమినిమిత్తమున మనుష్యత్వము నొందెను ?
2. పరమపుణ్యులైన పాండవు లేవురకు ద్రౌపది యొక్కతె యెట్లగ్రమహిషి యయ్యెను ?
3. మహాబలుఁ డైన బలభద్రునకుఁ దీర్థమున కరుగునవసరమున బ్రహ్మహత్య యెట్లు వాటిల్లెను ? దాని కతఁడు ప్రాయశ్చిత్త మెత్తెఱఁగునఁ జేసికొనెను ?
4. పాండవనందను లైన ద్రౌపదేయులు కృతదారపరిగ్రహులు గాక యనాథులవలె నేల మృతిఁబొందిరి ?

ఈనాలుగు ప్రశ్నలును భిన్నములైన నాలుగంశములకు సంబంధించినవి మొదటి ప్రశ్న తాత్త్వికమైనది. మహాభారతమునం దభివర్ణితమైన వాసుదేవవిభూతియొక్క మూలహేతువునుగూర్చినది. అది తెలిసినచో భారతమునందలి వాసుదేవతత్త్వము తెలిసి నట్లే. 'కార్ష్ణవేదమహాహ్రదము'యొక్క లోతు తెలిఁగినట్లే : కావున నీమొదటిప్రశ్న మహాభారతముయొక్క గుండెకాయవంటిది.

రెండవది సాంఘికధర్మమునకు సంబంధించినది. ద్రౌపది పంచభర్తృక యయ్యుఁ బరమపతివ్రతలలో నొక్కతెగాఁ కీర్తింపఁబడుచున్నది. లోకసామాన్యధర్మము ననుసరించి యట్టివనిత బంధకి యనఁబడును. కావున నెట్టి విశిష్టధర్మము నాశ్రయించి ద్రౌపది పతివ్రత యైనదో తెలియవలయునని జైమినియభిలాష. అది తెలిసినచో మహాభారతేతిహాసమున నాయికానాయకుల నిర్దుష్టచరిత్రము భాసింపఁగలదు.

ఇఁక మూఁడవప్రశ్న. అది యపరాధప్రాయశ్చిత్తకాండలకు సంబంధించినది నారాయణాంశసంభవుఁ డగు బలరాముఁడు ప్రమాదవశమున బ్రహ్మహత్యాపాప మొనరించుటయుఁ, దన్నివారణార్థము తీర్థయాత్రలు చేయుటయు నందలికథ. ప్రమాదవశమునఁ జేసినపాపము ప్రాయశ్చిత్తముచే నుపశమించు ననెడి యుపదేశముచే నుదుర్వృత్తులు పశ్చాత్తప్తులై సద్వృత్తు లయ్యెడి మార్గము కలదు కావున దాని నన్వేషించుట యీప్రశ్న తాత్పర్యము.

నాలుగవప్రశ్న భౌతికధర్మమునకును, పూర్వకర్మఫలానుభవమునకును సంబంధించినది. ఉపపాండవులు కృతదారపరిగ్రహులు గాక చనిపోవుటలోఁ జిన్నలు పెద్దలకంటె ముందు చనిపోవు భౌతికధర్మ వైపరీత్యము కలదు. దాని కేదైన కర్మఫలరూపమైన హేతు వుండవలెను. కావునఁ దద్విచారముచేఁ గార్యకారణసంబంధరూపమైన యైహికాముష్మికవృత్తపరిజ్ఞాన మేర్పడును.

ఈప్రశ్నలలో మొదటిరెండుప్రశ్న లొకయెత్తు; చివరిరెండుప్రశ్న లొకయెత్తు. మొదటిజంట కథాప్రవృత్తికి వెనుక నున్న తత్త్వమును బయటపెట్టును. రెండవజంట కథార్థసమన్వయమున కవసరమైన ప్రసన్నతను బ్రసాదించును.

ఇట్టిప్రశ్నలు జైమినిముని మార్కండేయుని నడుగఁగా నాతఁడు వానికి సమాధానములు చెప్పవలెనన్నఁ బెద్దతడ వగును గావున స్వీయతపోనియమనిష్ఠల కంతరాయము వాటిల్లు నని పలికి వింధ్యవాసులగు జ్ఞానపక్షుల నాశ్రయించినచో నాయర్థములు తేఁటతెల్లములు కాఁగల వని యాదేశించెను. పులుగులకు వాక్సిద్ధియు, విమలజ్ఞానమును నెట్లబ్బె నని జైమిని ప్రశ్నించెను. మార్కండేయుఁ డాపక్షులు శాపగ్రస్తులై యున్న మునికుమారు లని చెప్పి, వారిపూర్వవృత్తాంతములను వివరించెను. జైమిని సంతుష్టుఁడై మార్కండేయాదేశానుసారము పక్షుల నాశ్రయించి తనసంశయముల కుచితసమాధానములను బొంది పరమానందభరితుఁ డయ్యెను.

ధర్మపక్షులు మొదటిప్రశ్న కుత్తరముగా శ్రీనారాయణవ్యూహచతుష్టయమును వివరించి చెప్పెను. నారాయణుఁడు సగుణనిర్గుణస్వరూపుఁడై వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న నారాయణాభిధానము లగు నాలుగుమూర్తులతో విరాజిల్లుచుండును. వర్ణరూపనామవిరహితుఁడై సంపూర్ణుఁడై త్రిగుణరహితుఁడై యుండు నాదిమూర్తి వాసుదేవాఖ్యతోఁ బిలువఁబడుచుండును. ఆదిశేషుఁడై సహస్రఫణములపై భూభారము వహించి తపశ్శక్తితో భాసించు సంకర్షణాఖ్యమూర్తి రెండవది. ధరణిపాలనభారము వహించి బహువిధధర్మోద్ధరణరతిచే నత్యున్నతిఁ బరఁగు ప్రద్యుమ్నాఖ్యమూర్తి మూఁడవది. బహుళజలమధ్యమున శేషతల్పశాయియై రజశ్శక్తిఁ గైకొని పవ్వళించి నిఖిలలోకములను లీలామాత్రముగఁ గల్పించు నారాయణాఖ్యమూర్తి నాలుగవది. ఈనాలుగుమూర్తులలోను బ్రద్యుమ్నమూర్తియైన దేవుఁడు పరమసాత్త్వికుఁడును, సకలధర్మకుశలుఁడును, భక్తజనలోలుఁడును, జగదవనశీలుఁడును, అపారకృపావిశాలుఁడును నగుటచే సురగణరంజనమును, అసురగణభంజనమును, నిగమనికరరక్షాఖేలనమును, ధర్మపరిపాలనమును గావించుచు నొక్కమాటు వరాహనారసింహవామనాదిరూపములు గైకొని ధరణి ధరియించి, హిరణ్యాక్షుని సంహరించి, హిరణ్యకశిపుని హరించి, బలి నణచి జగముల యలజడి నణచుచుండును. మఱియు దేవమనుష్య తిర్యగ్యోనులయందు ఉపేంద్రరామతిమికమఠరూపములనావిర్భవించి లోకరక్షణోపాయపరాయణుఁడై వర్తించుట కారణముగా భూభారోపసంహారార్థము మనుష్యత్వము నొందె నని పక్షులు తెలియఁజెప్పెను. కావున నిర్గుణుఁడైన నారాయణుఁడు సగుణాకృతి గల ప్రద్యుమ్నమూర్తిగా శ్రీకృష్ణరూపము ధరించి, దుష్టశిక్షణ

మును శిష్టరక్షణమును నిర్వహించినట్లు మహాభారతకథార్థములపట్ల అన్వయించుకొనవలెను. మహాభారత మీచతుర్వ్యూహములను క్షేత్రజ్ఞజీవమనోఽహంకారములుగా వ్యాఖ్యానించి చెప్పినది.

శ్లో॥ "యో వాసుదేవో భగవాన్ క్షేత్రజ్ఞో నిర్గుణాత్మకః
జ్ఞేయః స ఏవ భగవాన్ జీవః సంకర్షణః ప్రభుః॥
సంకర్షణా చ్చ ప్రద్యుమ్నో మహాభూతః స ఉచ్యతే
ప్రద్యుమ్నాద్యోఽనిరుద్ధస్తు సోఽహంకారో మహేశ్వరః॥"

—శాంతిపర్వ. 326. 38-39

ద్రౌపది భర్తృపంచకమున కెట్లు పట్టమహిషి యయ్యెననుశంకకు సమాధానముగా మహాభారతమునం దాదిపర్వమునఁ బంచేంద్రోపాఖ్యానము చెప్పఁబడియున్నది. ఆకథవలనఁ బంచపాండవులు ఇంద్రపంచకముయొక్క అంశలతో జన్మించి రనెడియర్థము నిరూపింపఁబడియున్నది. శివుఁడు కాశీరాజకన్య జన్మాంతరమున నైదుగురుభర్తలకు సతియగునట్లును, అట్టియెడ నామెయందు ధర్మభంగము కాకుండునట్లును వర మొసంగెను. ఆపైన నామెను గంగాతీరమునం దున్న నింద్రునిఁ దనయొద్దకుఁ బిలుచుకొని రమ్మని యాజ్ఞాపించెను. ఆమె గంగాతీరమున నింద్రునిఁ గానక తన్నదీజలమున దిగి విలపింపఁ దొడఁగెను. ఆమెకన్నీటిబొట్లు హేమకమలములై వికసింపఁ దొడఁగెను. ఇంద్రుఁ డది కాంచి విస్మితుఁడై యామెదరి కేగెను. ఆమెనుగూర్చి ప్రశ్నించెను. ఆమె తననుగూర్చి తెలియఁదలచినచో నతనిని దనవెంట రమ్మని తాను ముందు నడచి పోసాగెను. ఇంద్రుఁ డామె ననుసరించెను. ఆమె హిమనగగుహాంతరమున వరుణరూపధారియై యొకతరుణితో జూద మాడుచున్న పరమేశ్వరుని యెదుట కాతనినిఁ గొంపోయెను. ఇంద్రుఁ డాతఁడు వరుణుఁ డని భ్రమించి తనయెదుట నట్లు నిర్భయముగాఁ గ్రీడించుచున్నందులకు కోపించెను. అందులకు రుద్రుఁడు మండిపడి యింద్రుఁడు భూలోకమున జన్మించునట్లు శపించెను. ఇంద్రునివంటి యింద్రులను మఱినలుగురను తత్పర్వతగుహయందుఁ దన మహిమచేఁ గన్పఱచెను; వారినిగూడ భూతలమున జన్మింప నాజ్ఞాపించెను. అ ట్లేర్పడిన యింద్రపంచకము ధర్మానిలశక్రాశ్వను లాధారకర్తలుగా ధర్మజభీమార్జుననకులసహదేవులుగాఁ బుట్టి రని భారతము చెప్పుచున్నది. మహాభారతమున నీకథ యుండగా నాఋషి యీవిషయమును గూర్చి యెందులకు ప్రశ్నించెనో కారణము తెలియరాకున్నది. తద్ధేతువులను రెండువిధములుగా నూహింప వీలున్నది. 1. మహాభారతమునఁ బంచేంద్రోపాఖ్యానము జైమినికాలమునాఁటికి లేదని భావించుట యొకవిధము. 2. ఉన్నను ఆకథార్థ మామునికి సంతృప్తి నీయకపోవుటచే నంతకంటె నౌచిత్యము గల మఱియొక గాథకొఱకు కతఁ డన్వేషించుచుండె నని భావించుట మఱియొకవిధము. వీనిలో మొదటిదానికంటె రెండవయూహయే సమంజసమైనది. దానిని వివరించుటకుఁ బూర్వము మార్కండేయ పురాణమున నీప్రశ్నకు సమాధానము చెప్పఁబడిన కథాంశములను దెలియవలెను.

ఇంద్రుఁడు విశ్వకర్మసుతుని సంహరించెను. దానికి విశ్వకర్మ కోపించి, తన తపోబలముచే జటనుండి వృత్రాసురుని సృజించి యింద్రునిపైఁ బగసాధింప నియోగించెను. అతఁడు దానవసేనాబలముతో నింద్రుని జయింప నెంచి, దానవులను భూలోకమున ననేకపార్థివవంశములందుఁ దమతమయంశములతో నవతరింప నియోగించెను. ఇంద్రుఁ డహల్యాజారుఁ డగుటచేతను, బ్రహ్మహత్యాదోషమువలనను దత్సమయమున నిజతేజమును గొంత కోల్పోయియుండెను. అట్టితరుణమున నాదివిజపతిని భూదేవి నిజభారమును దొలగింప బ్రార్థించెను. ఆమెప్రార్థన నంగీకరించి యమరపతి స్వీయతేజము నైదంశములుగాఁ జేసి, ధూమరుజ్జలశిఖినభములశక్తు లాది భీమార్జుననకులసహదేవరూపులుగాఁ గుంతీమాద్రులం దుదయింపఁ జేసెను. ఇట్లింద్రుఁడు బహురూపములు తాల్చియు తాత్పర్యమున నొక్కఁడై భాసించుటచే ద్రౌపదికి భర్త లేవురయ్యు తత్త్వమున నొక్కఁడే యగుటయు, నామె యేకభర్తృక యగుటయు సంభవించుచున్నది.

ఈకథార్థములను బరిశీలించినచో మహాభారతకథయందలి యింద్రు లాకృతులందు భిన్నులు. వారు భిన్నభిన్నరూపములుగా భువి నవతరించి రని వర్ణించుటలో నాకారభేదముతోపాటు ఇంద్రతేజమునందును భిన్నత్వము చెప్పఁబడుచున్నది. మార్కండేయపురాణమున నింద్రతేజ మొక్కటిగనే నిరూపింపఁబడుటచే భారతకథలోని లోపము నేర్పుగాఁ బరిహరింపఁబడుచున్నది. కావున భారతిపంచేంద్రోపాఖ్యానమునకు మెఱుఁగులు దిద్దిన రూపమే మార్కండేయపురాణమునందలి కథ. ఆకథ లేకపోయినను ఈపురాణకథ పుట్టవచ్చును. కాని పురాణకథ వెలసినతరువాతమాత్రము భారతకథ పుట్టఁజాలదు. కావున భారతకథార్థములలోని దురన్వయమును, అనౌచిత్యమును దొలగించి యేకవాక్యత ననుసంధించుటకై యీపురాణకథ వెలసిన దని భావింపవచ్చును. అట్టిసమన్వయము నుపలక్షించి యడిగినదే జైమిని మహర్షి రెండవప్రశ్న.

కౌరవపాండవులు కురుక్షేత్రమునఁ దలపడ నున్నా రని తెలిసి, బలదేవుఁడు ఖిన్నుఁడై బంధుగులు తమలో తాము పోరుట చూడలేమి తీర్థయాత్రలు చేయఁబోయిన కథార్థములు భారతోద్యోగపర్వమునఁ జెప్పఁబడియున్నవి. బలభద్రతీర్థాటనవిశేషములును, దత్తీర్థమాహాత్మ్యములును శల్యపర్వమున నభివర్ణింపఁబడినవి. కాని వానియందు బలరాముని బ్రహ్మహత్యాప్రసక్తి చేయఁబడలేదు. జైమినిముని బలరాముఁడు తీర్థమున కరుగఁబోవునెడ బ్రహ్మహత్య యెట్లు వాటిల్లెనో వివరింపుఁడని ధర్మపక్షులను బ్రార్థించెను. అతనిప్రశ్నలోనే - బలరాముఁడు తీర్థయాత్రలు సేయ నిశ్చయించుకొనిన తరువాత, ప్రయాణమునకు పూర్వము ఈబ్రహ్మహత్య ప్రమాదవశమునఁ బాటిల్లెనను నంశము స్పష్టమగుచున్నది. మార్కండేయపురాణమున దదనుగుణముగాఁ గథార్థములు చెప్పఁబడినవి. బలదేవుఁడు తననిర్ణయమును బాండవులచెంత నున్న గోవిందున కెఱిఁగించి ద్వారవతికిఁ దిరిగివచ్చి మరునాఁడు తీర్థముల కేగ నిశ్చయించుకొని, యానాఁడు మధుపానమత్తుఁడై కాంతాజనము తనను బరివేష్టించి సేవించుచుండ రైవతశైలసానురమ్యవనమునందు బ్రవేశించి, తద్వనవసంతశోభను వీక్షించుచు విహరించుచుండ నొకచోట నాతనికి

మునిగణములకు బహుపురాణకథ లర్థి వినిపించుచున్న సూతుఁడను పౌరాణికుఁడు కానఁబడెను పానలోలుఁడైన బలదేవునిఁ గాంచి, యచ్చటిమును లెల్లరు భయపడి దిగ్గనలేచి యతని కాతిథ్య మిచ్చిరి. సూతుఁడుమాత్ర మున్నతాసనము దిగలేదు. అందులకు బలరాముఁడు కోపించి యతనినిఁ దనచేతిగుదియతో మోదెను. అయ్యాఘాతమునకుఁ బౌరాణికుఁడు గతప్రాణుఁడై బ్రహ్మపదము నందెను. మునులు భీతిల్లి దూరముగాఁ దొలఁగిపోయిరి. బలదేవున కొడలు తెలిసెను. తాను ప్రమాదవశమునఁ జేసిన బ్రహ్మహత్య కెంతయో పరితపించెను. తత్పాపపరిహారార్థము ప్రాయశ్చిత్తముగా ద్వాదశవర్షవ్రతమును బూని తీర్థయాత్రలు చేయ నిశ్చయించి రేవతీప్రభృతియువతీజనములను వీడ్కొల్పి, విధ్యుక్త ప్రకారము ప్రతిలోమముగా సరస్వతీపుణ్యతీర్థము లాడఁ జనెను.

ఈకథలో బలరాముఁడు మొదట యుద్ధమునుండి తప్పుకొనుట కొకమిషగాఁ దీర్థయాత్రలు చేయఁబూనెను. కాని తరువాత నవి పాపప్రాయశ్చిత్తార్థ మవశ్యకర్తవ్యములుగాఁ దారసిల్లెను: మార్కండేయపురాణాంతర్గత మైన యీకథ నీతిబోధక మైనది. కావున భాగవతపురాణముకూడ దీనిని గ్రహించి బలదేవుఁడు తీర్థయాత్రలు చేయుచు నైమిశారణ్యమున సూతవధ యొనర్చె నని యించుక మార్చి ప్రపంచించినది.

ఉపపాండవులు కృతదారపరిగ్రహులు గాక యనాథులవలె మృతి నొందుటకు మార్కండేయ మొకవిచిత్రమైన హేతువును జూపించుచున్నది. అది హరిశ్చంద్రకథా సంబంధియైనది. కౌశికుఁడు హరిశ్చంద్రునిరాజ్య మపహరించి భార్యాపుత్రులతో నామహారాజును నగరమునుండి వెడలనడిపించెను. అయ్యవసరమున నామహారాజుదీనావస్థను గాంచి ప్రజ లెలుగెత్తి విలపించిరి. రాజువెంట తామును వచ్చెద మని యతనిపాదములపైఁ బడి ప్రార్థించిరి. 'ప్రజలవాక్యనిచయశృంఖలలఁ దవిలి' రాజు కొంతవడి నిలుచుండెను. అందులకుఁ గౌశికుఁడు మండిపడి ప్రజలయండదండలు చూచుకొని రాజ్యము తిరిగి హరింప యత్నించుచున్నాఁ డని నేరము మోపి, రాజును నిందించెను. వేవేగ నాతనిభార్యచేయి గ్రహించి యేగుచున్నరాజు నదలించుచు, కోమలాంగియగు శైబ్యను తనచేతి ప్రచండదండముతోఁ బ్రహరించెను. శాంతమూర్తి యగు హరిశ్చంద్రుఁ డందులకు మారుమాటాడలేదు. కాని కౌశికునికాఠిన్యమును గన్నులారఁ గాంచుచున్న విశ్వేదేవత లైదుగురు మునివర్తనమును గర్హించిరి. కౌశికుఁ డందులకు మండిపడి, దేవతలయ్యు మానవపక్షపాతమునఁ దనను ధిక్కరించుటచే వారిని మానవు లగునట్లు శపించెను. విశ్వాఖ్యదేవత లామునిని శాంతింపు మని ప్రార్థించిరి. అందుల కాతఁడు ప్రసన్నుఁడై వారికి సంతాన ముర్వియందుఁ గలుగకుండ నుండునట్లుగను, వారు బ్రహ్మచారులై కామక్రోధలోభమదమోహమత్సరములఁ బొరయక యల్పకాలముననే శరీరములు విడిచి దేవభావము నొందునట్లును గరుణించెను. తన్మునిశాపానుభవరూపమున విశ్వేదేవత లైదుగురును ద్రౌపదీగర్భమున నుపపాండవులై జన్మించి యల్పకాలము జీవించి మఱల దేవభావము నొందిరి. ఈశాపవృత్తాంతము మహాభారతమున లేదు. కర్మఫలరూపమైన మానవజన్మకు మూలమైనహేతువు నెఱుఁగఁజెప్పుట పురాణకథల కొక విశిష్టలక్ష

ణము: పౌరాణికులతాత్త్వికదృష్టి కది యొకనిదర్శనము. మహాభారతకథార్థము లన్నిటిని నట్టితాత్త్వికదృష్టితో వివేకించి, తెలియుటయే జైమినిముని యాశయము. అందులకే యతఁడు

శ్లో॥ "తదిదం భారతాఖ్యానం బహ్వర్థం శ్రుతివిస్తరమ్
తత్త్వతో జ్ఞాతు కామోఽహం భగవం స్త్వా ముపస్థితః ॥[8]

అని పేర్కొనియున్నాఁడు:

జైమినిముని మార్కండేయమునఁ బృచ్ఛకుఁడును, శ్రోతయు నై యున్నాఁడు. అతనిసంశయములు తీర్చుటకే యీపురాణార్థములు చెప్పఁబడినవి. జైమినిమునివలన మహాభారతార్థములలో కొన్నింటికిఁ దాత్త్వికమైన సమన్వయము బయలువెడలినది. ఇట్లు పంచమవేదమైన భారతాఖ్యానమున కధికప్రాముఖ్య మిచ్చి, తత్కథార్థముల కన్వయము చెప్పి, తద్విమలేతిహాసమున కనుబంధప్రాయముగాఁ దనప్రథమభాగమును దీర్చిదిద్దికొనినగౌరవము మార్కండేయమహాపురాణమునకు దక్కుచున్నది.

దీనివలన మార్కండేయపురాణము మహాభారతరచనానంతరమే వెలసిన దని భావింపవలసివచ్చుచున్నది. కాని వ్యాసభగవానుఁడు వేదవిభజనానంతర మష్టాదశ మహాపురాణములను రచించి, తరువాత మహాభారతేతిహాసమును రచించినట్లు లోకప్రసిద్ధి కలదు. మార్కండేయమునందలి యీభాగము దాని కపవాద మగుచున్నది. ఈయంశమునుగూర్చి ముందు మఱికొంత చర్చింపఁబడును.

**పురాణ పంచలక్షణములు :**

మార్కండేయమహాపురాణమున మార్కండేయమహర్షి క్రోష్టుకిమునికిఁ జెప్పిన భాగమంతయుఁ బ్రధానముగాఁ బంచలక్షణసూత్రలక్షితమై ప్రవర్తిల్లుచుండుట మఱియొక ముఖ్యవిశేషము. దీనివలన నాపురాణప్రాచీనత్వము ధ్రువపడుచున్నది.

జైమునిముని జడోపాఖ్యానము వినిన తరువాత ధర్మపక్షుల నీక్రిందిప్రశ్నల నడిగెను.

1. స్థావరజంగమాత్మకమైన యీజగమంతయుఁ బూర్వ మెట్లు పుట్టెను ?
2. కాలాంతరమున నది యెట్లు లయ మందును ?
3. సురలును, సంయములును, పితరులును, రాజులును, నెట్లు జన్మించిరి ?
4. మన్వంతరములక్రమ మెట్టిది ?
5. వంశవంశానుచరితము లెట్టివి ?
6. సృష్టివిలయసంఖ్య యెంత ?
7. కల్పవిభాగక్రమ మెద్ది ?
8. భూమియొక్కయునికి యెట్టిది ? తత్పరిమాణ మెంత ?

8. మార్కం. మహాపు. 1.12 (వేం.ప్ర.); 1.16 (తరం.ప్ర.)

9. నదీపర్వతారణ్యవార్నిధుల ప్రకార మెట్టిది?
10. భూర్లోకాదిసమస్తలోకము లేక్రమమున నున్నవి?
11. రవిచంద్రాది గ్రహనక్షత్రజ్యోతిర్గణముల గతిప్రకారము లెట్టివి?
12. సృష్టియంతయు నుపసంహృతమైన తుది శేషించియుండునది యెద్ది?

పక్షివరు లీప్రశ్నలకు సమాధానములు స్వీయవచనములందుఁ జెప్పక తొల్లి మార్కండేయమహర్షి క్రోష్టుకికిఁ జెప్పినవిధముగాఁ జెప్పి యమ్మహర్షివాక్యలను పునశ్చరణ మొనర్చిరి. అనఁగాఁ గ్రోష్టుకి యడిగిన ప్రశ్నలుకూడ జైమినిప్రశ్నలవంటివే యని స్పష్టమగుచున్నది. మఱియు నీప్రశ్నపరంపర పంచలక్షణవిశిష్టములైన పురాణార్థముల నుపలక్షించి యడిగిన వనియు, పురాణశ్రోతల ప్రశ్నలన్నియు నిట్లే సజాతీయములై యుండు ననియు భావింప వీలగుచున్నది. జైమిని యడిగిన ప్రశ్నలక్రమముననే సమాధానములక్రమ మీపురాణమునఁ బొందుపఱుపఁబడియుండలేదు. కాని తదంశములలోఁ బెక్కింటిని స్వేచ్ఛానుక్రమమునఁ జెప్పిన మార్కండేయోక్తులు యథాతథముగాఁ జెప్పఁబడినవి.

పైప్రశ్నలలో మొదటియైదును బురాణపంచలక్షణములనుగూర్చిన వని వాచ్యముగాఁ దెలియుచున్నది. మిగిలినవానిలో 6, 7, 12 ప్రశ్నలకు సర్గవర్ణనావసరముననను, 8, 9 ప్రశ్నలకు స్వాయంభువమనూత్పత్తికథనానంతరమును సమాధానము లీపురాణమునఁ జెప్పఁబడినవి. భువనకోశము - లేక - భూగోళవర్ణనము - పురాణద్వితీయలక్షణమగు ప్రతిసర్గమునం దంతర్భాగముగాఁ బరిగణించుటయుఁ గొన్నియెడలఁ గలదు. కావునఁ బైప్రశ్నలన్నియుఁ బంచలక్షణములపరిధిలో నొదిగియున్న వనుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు.

జైమిని యడిగిన ప్రశ్నల కన్నింటికిని గ్రోష్టుకికి మార్కండేయుఁడు చెప్పిన పురాణార్థములందు సమగ్రములైన సమాధానములు లభించినవా యని పరిశీలించినచో- దేవర్షిబ్రహర్షివంశముల నభివర్ణించెడి వంశలక్షణ మీపురాణమునందుఁ గానరాదు. 10, 11వ ప్రశ్నలకును నిందు సమాధానము లిచ్చుట జరుగలేదు. ఈస్వల్పాంశములలోపముఁ గప్పిపుచ్చఁగలుగునట్లు నాఽన్యతోలభ్యములగు విశేషములతో మిగిలిన పురాణాంగముల నతివిపులముగా నిం దభివర్ణించుట జరిగినది. మన్వంతరాదికథలను, దుస్సహాదుల వృత్తాంతములను, సూర్యవంశజులైన రాజులయొక్క చరిత్రములయం దపూర్వవివరములను దెల్పుటలో నీపురాణమునకుఁ బ్రత్యేకస్థానము కలదు. ఈయంశము ముందు వివరింపఁబడును. మొత్తమునకుఁ బురాణపంచలక్షణలక్షితమైన ప్రధానవస్తువు గలిగిన యీపురాణ మతిప్రాచీనపురాణములలో నొకటి యని కీర్తింపఁబడుచున్నది.

**జడోపాఖ్యానము :**

చతుర్వర్గ వ్యుత్పత్తిప్రబోధప్రధానమైన జడోపాఖ్యాన మీపురాణమునందు నిబంధింపఁబడుట మఱియొకవిశేషము. జైమినిముని మహాభారతాఖ్యానమునందలి సంశయార్థ

ములకు సమాధానములను బొంది భూతవర్గసంభూతి స్థితి ప్రళయాదులనుగూర్చి తెలిసికొనుట కాపక్షులను కొన్నిప్రశ్న లడిగెను. అవి :

1. భూతవర్గముయొక్కసంభూతిస్థితిప్రళయము లెట్టివి ?
2. జంతువు తల్లియుదరములో నంగబాధ నొందుచు నెట్లుండును ?
3. తల్లి భుజించు గురుతరభోజ్యనిచయమెల్ల జీర్ణంబుగా నెట్లాప్రాణి గ్రాఁగఁడు?
4. ప్రాణి పుట్టి యెట్లు వృద్ధిఁ బొందును ?
5. చచ్చునెడ నిజజ్ఞానము నెట్లు దొఱఁగును ?
6. చచ్చి యెచ్చటనుండి యహీనపుణ్యాపాపములు గుడుచును ?

ఈప్రశ్నలు ప్రధానముగా మానవునిజననమరణములకు సంబంధించినవి. వీనిని వివరించుచుఁ బక్షులు భార్గవాఖ్యుఁ డగు విప్రుఁడు జడుఁడని ప్రసిద్ధిఁ గాంచిన స్వీయ పుత్త్రునివలన విన్న విశిష్టవిజ్ఞానాంశములను జెప్పిరి. పితాపుత్త్ర సంభాషణరూపమైన నాయుపాఖ్యానమున నుత్క్రాంతివిధమును, మనుజశుభాశుభకర్మభోగవివరణమును, జంతూత్పత్తిప్రకారమును, రౌరవాదినరకవర్ణనమును, మహాపాతకు లనుభవించు వివిధ నరకబాధావిశేషములును, జంతువులకు జన్మాంతరపాపములకుఁ దగుజన్మములవివరణములును, కర్మమార్గోపదేశమును, వర్ణాశ్రమధర్మనిరూపణమును, శ్రాద్ధవిధివిధానవివరణమును, సదాచార ప్రకారమును, అష్టాంగయోగవిధానమును, యోగిధర్మములును, మరణసూచకములగు స్వప్నాద్యరిష్టములును, బ్రహ్మప్రాప్త్యుపాయబోధనమును, లెస్సగా నిరూపింపఁబడినవి. సందర్భానుసారముగా నీయుపాఖ్యానమున నంతర్గాథ లుపదేశాత్మకములుగా నిబంధింపఁబడియున్నవి. అట్టివానిలో జనకయమకింకరసంవాదమును, పతివ్రతకథయు, దత్తాత్రేయమహాత్మ్యమును, కువలయాశ్వచరిత్రమును, అలర్కచరిత్రమును, ముఖ్యములైనవి. ఇట్టియుపాఖ్యానమున శాస్త్రవిచారవిషయములును, రసోదంచితకథార్థములును, తిలతండులన్యాయమున సొంపారుచున్నవి. జైమిని యడిగిన ప్రశ్నలు కొన్ని జీవితవిశేషములకు మాత్రమే పరిమితమైయున్నను-అడుగకున్నను ఆకొన్న శిశువున కన్నియుఁ బెట్టి లాలించుమాతవలె జ్ఞానపక్షులు-అడిగిన ప్రశ్నలకే కాక చతుర్వర్గవ్యుత్పత్తి నిచ్చెడి అనేకాంశముల కుత్తరము లీయఁగలయుపాఖ్యానమును వినిపించి, తమపురాణవిజ్ఞానప్రాభవమును బ్రకటించిరి. పిండోత్పత్తి మొదలు బ్రహ్మసాయుజ్యము వఱకు వ్యాపించియున్న ఈకథార్థములు పురుషార్థసాధకుల కవశ్యోపాస్యములై యున్నవి.

## సప్తశతి :

మార్కండేయమహాపురాణమున సావర్ణికమన్వంతరకథాకథనావసరమునందు దుర్గాసప్తశతి కూర్పఁబడియుండుట మఱియొకవిశేషము. సప్తశతియందు మహామాయాస్వరూపిణి యగు శక్తియొక్కజన్మస్వరూపస్వభావచరిత్రములు సవిస్తరముగా నభివర్ణితములై యున్నవి. తామసమూర్తియైన యోగనిద్రాదేవి బ్రహ్మప్రార్థనమున మధుకైటభుల నావేశించి, విష్ణువుచే వారిని సంహరింపఁజేయుటయు, హరిహరాదుల తేజఃపుంజమున

జండిక యుద్ధవించి మహిషాసురుని సంహరించుటయు, దేవతలు హిమవంతమున కరిగి దేవినిఁ బ్రస్తుతింప గౌరివచనంబునఁ దచ్ఛరీరమునుండి కౌశికి యనుదేవి యావిర్భవించి ధూమ్రలోచన రక్తబీజ చండముండాసురులను వధించుటయు, నామెయే సప్తమాతృకా స్వరూపిణియై రాక్షససైన్యమును జెండాడుటయు, నాపైన శుంభనిశుంభుల వధించుటయు, నిందలి ప్రధానకథావృత్తము. దైవాసురప్రవృత్తులమధ్య జరిగిన భీకరపోరాట మిందు రౌద్రరసప్రధానముగా వర్ణింపఁబడినది. చండీభక్తులచేతను, శాక్తేయులచేతను సప్తశతి యతిపవిత్రమతగ్రంథముగాఁ బరిగణింపఁబడుచున్నది. బంగాళారాష్ట్రమున దీని కధిక ప్రచారగౌరవము లున్నవి. అచ్చట దేవీపూజాదినములందును, శుభాశుభసమయము లందును, ప్రత్యేకముగాఁ జైత్రాశ్వయుజమాసములందును గృహాంగణదేవీమందిరముల యందు పూజాపారాయణముల నొనర్చుట నేటికినిఁ జూచుచున్నాము. సంస్కృతపురాణ ప్రతులలోఁగొన్నింట సప్తశతికిఁ బూర్వాంగముగా మంత్రాదులు, అంగన్యాసకరన్యాసాదులు, స్తుతులు, ధ్యానకవచాదులు, పారాయణక్రమసూచికలును రచింపఁబడి యుండుట దాని పారాయణగ్రంథాధికారమును జాటిచెప్పుచున్నది. ఈసప్తశతియందలి మహిషాసురమర్దనాదిగాథలే దేవీభాగవతమున విస్తృతములై విరాజిల్లుచున్నవి. కావున సప్తశతి యీపురాణమునకు -భగవద్గీత మహాభారతమునకుఁబోలె- ఒక దివ్యాలంకారము. భగవద్గీతకువలె దీనికినిఁ బఠనపాఠనపారాయణాదులేకాక వ్యాఖ్యానములును, తాత్త్విక సమన్వయములును వెలసినవి. మేధస్సను ముని సురథసమాధులకుఁ జెప్పిన యీ వృత్తాంతము మహామాయాప్రభావవర్ణనప్రధానమై విస్తృతిఁ జెంచి యీపురాణమున మన్వంతరకథాకథనప్రవాహవేగమునకుఁ గొంత యవరోధమై నిలుచుచున్నది. విమర్శకులు సప్తశతి యీపురాణమునఁ బ్రక్షిప్త మని భావించుచున్నారు. ఆయంశము ముందు వివరింపఁబడును.

## మార్కండేయ మహాపురాణము వెలసిన కాలము :

మార్కండేయమహాపురాణరచన మెప్పు డెట్లు జరిగినదో తెలిపెడి ప్రత్యక్షనిదర్శనము లెచ్చటను గానరావు. సంస్కృతసాహిత్యమునందలి యనేకకావ్యములకువలెనే పురాణములకుఁగూడ రచనాకాలనిర్ణయము చేయుట యొకసమస్యయే. అందును బురాణ రచనము కావ్యరచనముకంటె భిన్నమైనది. కావ్యము సామాన్యముగా నొకకవిచే రచింపఁబడును. పురాణ మట్లు కాదు. మొట్టమొదట యొకకవిచే నొకపురాణము రచింపఁబడినను, కాలక్రమమున ననేకు లనేకాంశములను యథేచ్ఛగా దానియందుఁ జేర్చుచుండుట జరుగుచుండును. చివర కాపురాణము బహుకర్తృకాంశములతో బృహత్సంహితా రూపమును దాల్చును. కావ్యమునం దుండవలసిన వస్త్వైక్యాదులు, రసభావాదులు పురాణములం దప్రధానము లగుటచే మతధర్మనీతిశాస్త్రాదివిషయబాహుళ్యము వాని యందుఁ జేరుచుండును. వీని నన్నింటిని సామూహికముగాఁ బరిశీలించినచో నొకటి యేటికి లాగుచుండ మఱియొకటి కాటికి లాగుచుండును. కావునఁ బురాణాంశములలో

నేవి ప్రాచీనము లైనవి? యేవి నవీనము లైనవి? యనునిర్ణయము ముందు చేయ వలెను. దానికి దేశముయొక్క మతరాజకీయసాంఘికభౌగోళికవైజ్ఞానికశాస్త్రవాఙ్మయ చరిత్ర లెంతయో తోడుపడఁగలవు. కాని ప్రాచీనభారతీయశాస్త్రేతిహాసాదులు ఇప్పటి చారిత్రకదృష్టితో నిర్మింపఁబడియుండమిచేఁ బురాణకాలనిర్ణయసమస్య క్లిష్టతర మగు చున్నది. ఇట్టిపరిస్థితులలో నుపలభ్యమానములగుచున్న చారిత్రకాంశములను గ్రోడీక రించుకొనుటవలనను, ఇతరగ్రంథములందుఁ జెప్పఁబడియున్న యంశములను సమన్వ యించుకొనుటవలనను, పురాణములందుఁ గూర్పఁబడియున్న - లేక - చేర్పఁబడియున్న వివిధాంశములను బహిరంతర్నిదర్శనముల నాధారముగాఁ గొని చారిత్రకదృష్టితోఁ బరిశీలించుటవలనను పురాణకాలనిర్ణయము చేయవలసియున్నది. మార్కండేయమహా పురాణము వెలసినకాలము నీదృష్టితోఁ నిర్ణయింపవలెను.

మార్కండేయపురాణమును సులభముగా నైదుభాగములక్రింద విభజింపవచ్చును.[9]

1. పురాణారంభమునుండి మహాభారతసంశయార్థములనుగూర్చి జైమినిముని యడిగిన ప్రశ్నలకుఁ బక్షులు ప్రత్యుత్తరము లిచ్చినంతవఱకు గల వస్తువు ప్రథమభాగము. అనఁగా 1వ అధ్యా. నుండి 9వ అధ్యా.వఱకు.[10]
2. పితాపుత్రసంవాదరూపమైన జడోపాఖ్యానకథనము ద్వితీయభాగము. అనఁగా 10వఅధ్యా.నుండి 41వఅధ్యా.వఱకు.
3. సర్గాదివర్ణనముమొదలు సావర్ణికమన్వంతరముపఱకుఁ గల కథార్థములు తృతీయభాగము. అనఁగా 42వ అధ్యా. మొదలు 77వ అధ్యా.వఱకు.
4. సప్తశతికథనము చతుర్థభాగము. అనఁగా 78 అధ్యా.మొదలు 90వ అధ్యా. వఱకు.
5. రౌచ్యమన్వంతరకథనమునుండి పురాణఫలశ్రుతివఱకుఁ గలకథార్థములు పంచమభాగము. అనఁగా 91అధ్యా.మొదలు 134వ అధ్యా.వఱకు.

ఈయైదుభాగములలో సప్తశతి కొకప్రత్యేకప్రతిపత్తి కలదు. శాక్తేయుల మత గ్రంథముగా నది ప్రసిద్ధి వహించియుండుటచే దానికి ననేక ప్రతులు భారతదేశ మంత టను గానఁబడుచున్నవి. నేపాల్‌రాయల్‌లైబ్రరీలో క్రీ.శ. 998వ సం॥ప్రాంతమున వ్రాయఁబడిన యొకసప్తశతిగ్రంథపుత్రిక కలదని మహామహోపాధ్యాయ హరప్రసాద శాస్త్రిగారు సిద్ధముచేసిన యాగ్రంథాలయపుకేటలాగువలనఁ దెలియుచున్నది. దీనినిబట్టి యూహించినచో దుర్గాపూజకుఁ బ్రసిద్ధిగల బెంగాలుప్రాంతమున వెలసియుండుట కవకాశ మున్న సప్తశతి నేపాలుప్రాంతమున కెగఁబ్రాకి యుండుటకొక శతాబ్దికాలము పట్టియుండ వచ్చును. కావున నీమార్కండేయపురాణాంతర్గతసప్తశతిభాగము సుమారు 9వ శతాబ్ది నాటికే వెలసియుండియుండవచ్చు నని పరిశోధకులు భావించుచున్నారు.

---

9. ఈవిభాగము డా. K.M. బెనర్జియా తనమార్కండేయపురాణపీఠికలో సూచించెను.
10. ఈఅధ్యాయసంఖ్యలు వేం.ప్రె.ప్రతి ననుసరించి యీయఁబడినవి.

సప్తశతియందుఁ గానఁబడు "సర్వమంగళమాంగళ్యే..." అను శ్లోకము జోధపూరుమండలమునఁ గనుఁగొనఁబడిన దధిమతిమాతశాసనమునందుఁ బేర్కొనఁబడియున్నదనియు, నాశాసనము వేయించినకాలము క్రీ. శ. 7వ శతాబ్దికంటె ముందే యగుననియు కాణేపండితుఁడు పేర్కొని మార్కండేయముకూడ క్రీ. శ. 7వ శతాబ్దికిఁ బూర్వమే రచింపఁబడియుండవచ్చు నని భావించెను.[11]

మహాపురాణములు వెలసినకాలనిర్ణయమునుగూర్చి పర్యాలోచించిన విమర్శకులు - అవియన్నియు క్రీ.శ. 5,6 శతాబ్దులనాటికే వెలసియున్నట్లు చెప్పుచున్నారు. కావున మార్కండేయపురాణముకూడ నప్పటికి వెలసియుండవలెను. అట్లనుటకుఁ బురాణాంతర్గతములైన నిదర్శనములు కొన్ని కానఁబడుచున్నవి. అందు మొదటిది ప్రధానపురాణభాగమునందలి వస్తులక్షణము. ప్రాచీనపంచలక్షణసూత్ర మీపురాణమునందలి 3, 5భాగముల కచ్చుగ్రుద్దినట్లు సరిపడుచున్నది. సర్గప్రతిసర్గాదిలక్షణలక్షిత మైన పురాణములు యాజ్ఞవల్క్యస్మృతికాలమునాటికే వెలసియున్నట్లు వెనుకటియధ్యాయమునఁ దెలుపఁబడియున్నది. కావున నీపురాణమునందు ప్రధానభాగ మనఁదగు 3,5విభాగములవస్తువు ప్రాచీన మనఁదగియున్నది. అది క్రీ.శ. 3 వ శతాబ్దికి పూర్వమే వెలసియుండవచ్చు నని భావింప వీలగుచున్నది. పురాణగ్రంథస్వభావమునుబట్టి చూచినను ఈభాగ మొకపురాణకర్త యొకేవిధమైన కథనపద్ధతి నాశ్రయించి యామూలాగ్రము క్రమానుగుణముగాఁ బ్రవచించినట్లు గుర్తింపవచ్చును. ఇందు దాదాపు80అధ్యాయములు సర్గప్రతిసర్గాదివివరణమున కుపయోగింపఁబడియున్నవి. అవి దాని ప్రాచీనతను, ప్రత్యేకతను జాటుచున్నవి.

మార్కండేయపురాణప్రధానభాగము నితరపురాణములతోఁ బోల్చిచూచినచో నందెట్టిప్రక్షిప్తములు చేరినట్లు కానరాదు. చేరినను గుర్తించుటకు వీలులేనంత స్వల్పముగాఁ జేరియుండవచ్చును. మార్కండేయుఁడు క్రోష్టుకిమునికిఁ జెప్పినభాగమును తూచ తప్పక పక్షులు చెప్పుటయును, దానియందు పక్షులు స్వయముగాఁ గల్పించి చెప్పినయంశము లెక్కడను లేకపోవుటయుఁ బై యభిప్రాయమును బలపఱచుచున్నవి. ఈభాగమున నీపురాణము ప్రాచీనమయ్యుఁ గాలప్రవాహమున నెట్టిపరిణామములు చెందక తనయాథార్థ్యమును, మౌలికత్వమును బరిరక్షించుకొనిన దనుటలో విప్రతిపత్తి లేదు.

ఈపురాణమునందు శైవవైష్ణవాది ప్రత్యేకమతశాఖాసిద్ధాంతము లెవ్వియుఁ బ్రపంచింపఁబడకపోవుటవలన దీనియత్యంతప్రాచీనత్వము వెల్లడియగుచున్నది. F. E పర్గిట రీపురాణమునఁ గీర్తింపఁబడిన దేతలనుబట్టియు దీనిప్రాచీనత్వము నిర్ణయించినాఁడు.[12] మార్కండేయమునఁ గీర్తింపఁబడినదేవతలలో మొదట నెన్నఁదగినవారు ఇంద్రపద్మాసనులు. ఆతరువాతఁ బేర్కొనఁదగినవారు హరిహరులు. ఆపైన సూర్యాగ్నులు. చివర కెన్నఁదగినవారు ధర్మాదులు. వీరిలో నింద్రునిప్రశస్తి ప్రథమపంచమభాగములందును, బ్రహ్మప్రశస్తి తృతీయపంచమభాగములందును గానఁబడును. హరిహరుల

11. History of Dharma Sastra Vol. V. Part I. Page 901. అథన్సూచిక.

12. Markandeya Purana, (Tra). Introduction. Pages xv & xvi.

ప్రభావ మెరనెరఁ బురాణమంతటఁ జెప్పఁబడినది. దేవీసప్తశతిని గణింపక విడిచినచో నీపురాణమున నత్యధికముగాఁ గీర్తింపఁబడినవాఁడు సూర్యుఁడు. ఇతనిచరిత్రము 77-78 అధ్యాయములలో మొదట సంగ్రహముగను, ఆపైన 102-110 అధ్యాయములలో విశద ముగను రెండుసార్లు విశేషముగా వర్ణింపఁబడినది. సూర్యునితోపాటు 99-100 అధ్యాయ ములం దగ్నియుఁ గీర్తింపఁబడియున్నాఁడు. వేదములందుఁ గీర్తింపఁబడియున్న ఇంద్ర బ్రహ్మసూర్యాగ్ను లను బ్రాచీనదేవతల కీపురాణ మధికప్రాధాన్య మిచ్చియుండుటవలనను,

"ఉత్పన్నమాత్రస్య పురా బ్రహ్మణోఽవ్యక్తజన్మనః
పురాణ మేత ద్వేదా శ్చ ముఖేభ్యోఽనువినిర్గతాః ॥
పురాణసంహితా శ్చక్రుః బహులాః పరమర్షయః ॥"

అని వేదములతోఁ గలసియే బ్రహ్మముఖమునుండి యీపురాణ ముద్భవించిన దని చెప్పఁ బడియుండుటవలనను మార్కండేయపురాణముయొక్క యత్యంతప్రాచీనత్వము సుస్థాపిత మగుచున్న దని పర్గిటరు భావించియున్నాఁడు.

ఈపురాణము ప్రాచీనమైన దని నిరూపించుట కంతస్సాక్ష్యముగా F. E. పర్గిటరు మఱికొన్ని భౌగోళికచారిత్రకాంశములను జూపియున్నాఁడు. ఈపురాణమునందలి భువన కోశవర్ణనమున 54, 55వ అధ్యాయములలోఁ బూర్వమధ్యయుగములలోని భారతవర్షము నందలి దేశములయొక్కయు, జాతులయొక్కయు, వంశములయొక్కయు సమగ్రస్వరూ పము నందించెడిదృష్టితో వానిపే ర్లొకచోట గుదిగ్రుచ్చి చెప్పఁబడినవి. సామూహిక ముగాఁ జెప్పఁబడిన ఆయంశము లస్పష్టముగా నుండుటచే వాని నాధారములుగాఁ గొని యిదమిత్థ మని యెట్టిచారిత్రకాంశములను నిర్ణయించుటకు వీలుగాకున్నది. అయినను నిందు భారతవర్షమునం దుత్తరభాగమున నివసించినజాతుల పేళ్ళను జెప్పుచుఁ జీనులుగాఁ బేర్కొనఁబడిన హూణులయొక్కప్రసక్తి ననుసరించి యీపురాణము క్రీ.శ.3వశతాబ్ది యుత్తరభాగమునగాని 4వశతాబ్దిప్రథమభాగమునగాని రచింపఁబడియుండవచ్చు నని పర్గిటరు భావించెను.[13]

మార్కండేయము అదే యధ్యాయమునఁ దూర్పుభాగమున నున్నదేశములను బేర్కొనుచు నందు ప్రాగ్జ్యోతిషజనపద మొకటియున్న యని పేర్కొనెను. ప్రాగ్జ్యోతిష మతి ప్రాచీనరాజ్యము. అది యిప్పటి బంగాళరాష్ట్రముయొక్క పూర్వోత్తరభాగములందు వ్యాపించియుండెను. అది కాలక్రమమున క్షీణించుచుఁ దూర్పుబంగాళమునఁ గలసిపోయి నది. దానిస్థానమున కామరూపరాజ్యము తలయెత్తినది. మహాభారతరామాయణములందు కామరూపరాజ్యము పేర్కొనఁబడియుండలేదు. మార్కండేయముననే రాజ్యవర్ధనమహా రాజచరిత్రమున (108 అధ్యా.) కామరూపపర్వత మొకటి పేర్కొనఁబడియున్నది. కాని, దానికిని బ్రాగ్జ్యోతిషమునకు నెట్టిసంబంధ మున్నట్లు కానరాదు. కావునఁ బ్రాగ్జ్యోతిషరాజ్య

13. Markandeya Purana. Introduction, Pages xiv—xx.

పతనాత్పూర్వమే యీపురాణము రచింపఁబడిన దని ధ్రువపడుచున్నది. ఇది యీపురాణ మతిప్రాచీన మనుటకు మఱియొక నిదర్శన మని పర్గిటరు పేర్కొనియుండెను.

మొదటిభాగము ప్రధానపురాణభాగము వెలసినతరువాత దాని కుపక్రమణికగా ననుసంధింపఁబడిన దని భావింప వలనుపడుచున్నది. ఇప్పు డుపలభ్యమాన మగుచున్న భారతమంతయు క్రీ. శ. 3వశతాబ్దినాఁటికే కూర్పఁబడియుండవచ్చు నని విమర్శకులు భావించుచున్నారు. మహాభారతసంశయనివారక మగు నీభాగ మాతరువాత కొంతకాలము నకు రచింపఁబడి యుండవచ్చునని తలంపవచ్చును. డాక్టరు హెనర్జియా మార్కండేయ పురాణప్రోక్త వాసుదేవతత్త్వమునందు నారదపాంచరాత్రసిద్ధాంతప్రభావము కల దని గుర్తించెను. ఆసిద్ధాంతమును శంకరాచార్యులు బ్రహ్మసూత్రభాష్యమున విపులముగాఁ దర్కించి సమాధాన మిచ్చి యుండెను. కావున నీయంశము శంకరులకాలము (క్రీ.శ.8వ శతాబ్దము)కంటెఁ బూర్వము వెలసియుండవచ్చు నని తలంచెను. ఈ సిద్ధాంతచ్ఛాయలు 3,5భాగములలోఁ గానరామిచే నవి యీభాగముకంటెఁ బ్రాచీనము లనియు నూహించెను. దీనినిబట్టి యీభాగము క్రీ.శ.3వశతాబ్దికిని 8వశతాబ్దికిని మధ్యకాలమున రచింపఁబడి యుండవచ్చు నని నిశ్చయింపవచ్చును.

దీని కుపబలకముగా హరిశ్చంద్రోపాఖ్యానరచనమును గ్రహింపవచ్చును. ఋగ్వేద మున హరిశ్చంద్రునికథ కలదు. మార్కండేయమునగూడ ఆమహారాజుచరిత్రము కలదు. కాని దానికిని దీనికిని నెట్టిసంబంధము లేదు. క్రీ.శ.7వశతాబ్ది యుత్తరార్ధమున రచింపఁబడిన దని చెప్పఁబడెడి దేవీభాగవతమును, క్రీ.శ.9వశతాబ్దికిఁ బూర్వమే వెలసియుండ వచ్చు నని తలంపఁబడుచున్న భాగవతపురాణమును ఋగ్వేదకథను, మార్కండేయ పురాణకథను జోడించి హరిశ్చంద్రచరిత్రమును నిర్మించియున్నవి. కావున నీభాగము కనీసము క్రీ.శ.7వశతాబ్దికిఁబూర్వమే యీపురాణమున వెలసె నని భావించుటకు వీలగు చున్నది. ఇది యిట్లుండ రెండవభాగముయొక్క రచనాకాలనిర్ణయ మీపురాణభాగకాల నిర్ణయమునకుఁ గొంత దోహదకారి యగుచున్నది.

ప్రొఫెసర్ R. C. హజ్రా యీభాగము వెలసినకాలమును నిశితపరిశోధనాంతరము నిర్ణయించియుండిరి. ఆయన Studies in the Puranic Records on Hindu Rites and Customs అను గ్రంథమున నీపురాణమునుగుఱించి వ్రాయుచుఁ బేర్కొనినయంశ ముల నిచ్చట పొందుపఱుచుట జరుగుచున్నది. ఈపురాణమునందలి జడోపాఖ్యానము మహాభారతశాంతిపర్వమునందుఁ గల - మేధావి యనుబ్రాహ్మణకుమారుఁడు తండ్రితోఁ జేసిన సంవాదరూప మగు కథాభాగమునకు విస్తృతరూప మని పేర్కొనవచ్చును. ఈ రెండును సంవాదరూపము లై యుండుటయు, సమాంతరవిషయములు గలిగియుండు టయు, నీభావమున కెంతయో బలము చేకూర్చుచున్నవి. మార్కండేయపురాణమునందు 31 వ అధ్యాయమునఁ బేర్కొనబడియున్న సదాచారప్రకారము మహాభారతానుశాసనిక పర్వమునందలి 104 వ అధ్యాయమునఁ జెప్పబడియున్న యంశముల నచ్చముగాఁ

బోలియున్నది.[14] మహాభారత మీభాగమునఁ బెక్కుశ్లోకపంక్తులను మనుధర్మశాస్త్రము నుండి గ్రహించినది. మార్కండేయపురాణ మాగ్రంథమువలెఁ గాక కొన్నిపంక్తులను కొద్దిగా మార్చి కొంతప్రత్యేకత సంతరించుకొనినది. అయినను మహాభారతానుసరణ మీభాగమున స్పష్టముగాఁ గనవచ్చుచున్నది. వీనినిబట్టి జడోపాఖ్యానముపై మహాభారత ప్రభావ మధికముగాఁ గల దనియు, నది యేతదితిహాసరచనానంతరమే వెలసె ననియుఁ గావున నీభాగము క్రీ.శ. 3వ శతాబ్దిప్రాంతమునఁ గల్పింపఁబడి యిందుఁ జేర్పఁబడి యుండు ననియు హజ్రా భావించియుండెను.

మార్కండేయమున 30 అధ్యా. 8వ శ్లోకమునుండి వర్ణింపఁబడిన భాగమునఁ గృత్తికానక్షత్రముతో నారంభించియున్న అష్టవింశతి నక్షత్రములందు శ్రాద్ధవిధుల నాచరించువిధము క్రమముగాఁ జెప్పఁబడియున్నది. నక్షత్రములను గృత్తికనుండి లెక్కించు పద్ధతి క్రీ. శ. 3వ శతాబ్దమున వెలసియుండవచ్చు ననియు, అశ్వినితో లెక్కించుపద్ధతి యాఱవ శతాబ్ది మధ్యమున నున్న వరాహమిహిరుని కాలమునాటికిఁ బ్రసిద్ధిలోనికి వచ్చె ననియు హజ్రా పేర్కొనుచు, నీభాగ మైదవశతాబ్ద్యుత్తరభాగమున నీపురాణమునఁ జేర్పఁబడియుండవచ్చు నని భావించెను. ఇందలి వర్ణాశ్రమధర్మములును, నిత్యనైమిత్తికశ్రాద్ధవిధాన కథనములును (25వ అధ్యా. నుండి 30వ అధ్యా. 7 శ్లో. ఎఱకు) క్రీ.శ.5వ శతాబ్ది ప్రారంభకాలమునాటికే వెలసియుండవచ్చు నని తలంచెను. ఇట్లీజడోపాఖ్యానమునందలి వివిధాంశములు వివిధకాలములలో నీపురాణమునఁ జేర్పఁబడె నని ప్రొఫెసర్ హజ్రా యభిప్రాయపడెను.[15]

ఈపురాణమునందలి ప్రథమద్వితీయభాగములలోఁ బ్రథమభాగమే ముందుగా వెలసియుండుటకు వీలున్నది. ఆతరువాత దాని కనుబంధముగా జడోపాఖ్యానము కూర్పఁబడియుండవచ్చును. ఇట్లు భావించుటకుఁ జక్కనిహేతు వొండు కలదు. పైరెండు భాగములకును మహాభారతకథతో సంబంధ ముండియున్నది. మొదటిభాగమున భారతార్థ సమన్వయము కలదు. రెండవభాగమున భారతార్థసంగ్రహణము కలదు. మొదటిది మహాభారతమున లేని కొన్నిక్రొత్తకల్పనలు చేసినది. రెండవది భారతమునందలి యొక యుపాఖ్యానమును బెంచి చెప్పినది. కావున నీరెండింటిలో సారవంతమైనది మొదటిది. దానియం దొకగ్రంథము నారంభించుటలో నుండు సహజకథాశిల్పము కలదు. రెండవది తదనుబంధతుల్యమైనది మాత్రమే. అందుచుఁ బూర్వార్ధ మపరార్ధముకంటె బ్రాచీనమైనది. ఇట్లేర్పడిన యీభాగమంతయు మార్కండేయపురాణప్రధానభాగమున కెట్లతుకఁ

14. హజ్రాగ్రంథము నందలి 10వ పుటలోని అధస్సూచిక :-

Cf. Mahabharata XII. 104. Verses 16,20b-21,23,37,41,48a,51b-52a, 59a etc., with Markadeya Purana 34 Verses 17,61b,-63a,21,48b,50b. 52b-53b,24b etc.

15. వివరములకు హజ్రాగారి St. in Pur. Rec on Hind. Rit. & Cust. Chapter II, Pages 9-12.

బడిన దనునంశము పర్యాలోచింపఁదగినది. నిర్మాణదృష్టితోఁ బరిశీలించిన నీరెండు భాగములందును గొంతసామ్యము కానవచ్చుచున్నది. మఱియు నవి ప్రత్యక్షముగనో పరోక్షముగనో మహాభారతమునకు ముడిపడియున్నవి. కావున నీరెండుభాగములు కలిసి మొదట యొకప్రత్యేకసంకలనముగా వెలసియుండవచ్చును. ఆతరువాత వానికిఁ బురాణ గౌరవము కల్పింపఁబడుటకు మార్కండేయమునఁ బొందుపఱుపఁబడియుండవచ్చును. వెనుకఁ జర్చింపఁబడిన కాలనిర్ణయముల నిచ్చట సమన్వయించుకొనినచో మొదటి భాగమును, రెండవభాగమందలి పూర్వార్ధమును క్రీ.శ.3,4 శతాబ్దులనడిమికాలమునఁ జేర్పఁబడియుండవచ్చు ననియు, జైమినిముని ప్రశ్నలపరిధికంటె మించియున్నభాగము 5వ శతాబ్ద్యుత్తరార్ధమునఁ జేర్పఁబడియుండవచ్చు ననియు భావింప వలనుపడుచున్నది.

ఈపురాణమునం దన్నిటికంటె నాలస్యముగాఁ జేరినభాగము దేవీసప్తశతి. ఇది క్రీ.శ. 7వ శతాబ్దినాటికే రచింపఁబడి యుండవలె నని కొన్నిసాక్ష్యము లిది వఱకే చూపఁబడినవి. పర్గిట రీయంశమును బరిశోధించి యీభాగము క్రీ.శ. 5వ శతాబ్దమున వెలసి యుండవచ్చు నని సూచించెను. సంస్కృతమహాభారతమున దుర్గాదేవి- కాళి యనియు, మహాకాళి యనియు, భద్రకాళి యనియు, చండ యనియు, చండి యనియు, పిలువఁబడి యున్నది. పేళ్ళు వేరైనను భారతమున దేవి యేకస్వరూపిణిగాఁ జెప్పఁబడినది. సప్తశతి యందు చాముండ, చండిక యనునామములతోఁ బిలువఁబడియున్నది. చాముండ భయంకరస్వరూపిణి. ఆమెపూజావిధానమున నరబలి ప్రసిద్ధమై యున్నది. అట్టిపూజావిధానము భవభూతిమహాకవి విరచిత మాలతీమాధవనాటకమున నభివర్ణితమై యున్నది. కావున నీసప్తశతి భవభూతినాటకముకంటెఁ బూర్వము వెలసిన దనియు, దుర్గాదేవియొక్క చాముండానామమును, చండికాస్వరూపమును మొట్టమొదట సప్తశతియందే పేర్కొనఁబడిన వనియు నందువలన సప్తశతి సుమారు 5వ శతాబ్దమునందు వెలసియుండవచ్చు ననియు పర్గిటరు భావించియుండెను.[16]

పై పర్యాలోచనమువలనఁ దేలిన సారాంశ మిది:- మార్కండేయపురాణమూల స్వరూప మగు 3,5 భాగములు క్రీ.శ. 3వ శతాబ్దినాటికే రచింపఁబడి యుండె ననియు, నాపైన 1,2 భాగములు క్రమముగా నైదవశతాబ్దము ముగియునాఁటి కాపురాణమునఁ జేర్పఁబడియుండు ననియు, సప్తశతి క్రీ. తరువాత సుమా రైదాఱు శతాబ్దములమధ్య రచింపఁబడి పురాణమునఁ బొందుపఱుపఁబడియుండవచ్చు ననియు నిర్ణయింప వీలగుచున్నది.

## మార్కండేయ మహాపురాణ వైశిష్ట్యము :

అష్టాదశ మహాపురాణములలో మార్కండేయపురాణమున కొకప్రత్యేకత కలదు. దానిని గూర్చి ప్రొఫెసరు విల్సను విష్ణుపురాణానువాద పీఠికలో బేర్కొనినవాక్యములు

16. Markandeya Purana-Introduction, Pages xii;xx,

స్మరింపఁదగియున్నవి.[17] మార్కండేయపురాణము మిగిలినపురాణము లన్నింటికంటె విలక్షణమైన యొకస్వభావముతో నొప్పారుచున్నది. అది యెట్టి ప్రత్యేకమతశాఖా సంప్రదాయములను బోధించుప్రయోజనముతో నిర్మింపఁబడలేదు. అందు మతచర్చలుకాని, వివాదములు గాని, పరమతఖండనాదులు గాని లేవు. ఆం దేప్రత్యేకదైవమును గూర్చిన విస్తరస్తోత్రకీర్తనాదులు కానరావు. సూర్యాదిదేవాతాస్తు లెడనెడ నున్నను అవి సంఖ్యలో నతిస్వల్పములై సంగ్రహములును, సార్థకములు నయి యున్నవి. దీనియందు నీతిసూత్రములును, ఆచారాదివిధివిధానములును, ధర్మప్రబోధములును బరిమితప్రమాణమునఁ గలవు.

ఈ పురాణమునకుఁ గథాకథనము ప్రధానలక్షణము. ఎడతెగని కథాస్రవంతి యీ పురాణక్షేత్రమునఁ బ్రవహించి దానిని రసార్ద్రి మొనర్చుచున్నది. అందలికథలు ప్రాచీనము లయ్యును నవ్యవాతావరణబంధురము లై కల్పనామహనీయములై మతసంప్రదాయప్రబోధ దృష్టులు గాక, శిల్పరమణీయములై భాసిల్లుచున్నవి. ఆకథాకల్పనలవెనుక నెట్టి నిర్దిష్టప్రయోజనాపేక్ష యున్నట్లు తెలియవచ్చుట లేదు. కావునఁ గళానిష్ఠ మైన పౌరాణికభావనాశక్తియే యీపురాణకథానిర్మాణమున కాధారమైనది. కథలలోఁ జాల వానికి మూలము లిదమిత్థ మని తెలియకపోవుటచే నవి నూతనకల్పన లనియే భావింప వలసియున్నది. కథానిర్మాణమునందును, కథాకథనమునందును, కల్పనమునందును, శైలియందును, పాత్రపోషణాదులయందును స్వతంత్రమును విలక్షణమునైన పురాణకర్త యొక్క వ్యక్తిత్వము కొట్టవచ్చినట్లు కనఁబడుచున్నది. ఇట్టి కథాకల్పమున నొకభాగవతము తప్ప మార్కండేయమును మించఁగల పురాణము మఱియొకటి లేదు.

పురాణవాఙ్మయ పరిశీలకు లందఱును ప్రొఫెసరు విల్సనుగారి పైఅభిప్రాయము నేకగ్రీవముగా నంగీకరింపఁగలరు. మార్కండేయపురాణమునందు కొన్నిపురాణములలో విస్తరముగాఁ గానఁబడు వ్రతతీర్థమాహాత్మ్యములును, వైద్యసంగీతశిల్పగణితవ్యాకరణ

---

17. "The (Markandeya) Purana has a character different from that of all the others; It has nothing of a sectarial spirit, little of a religious tone, rarely inserting prayers and invocations to any deity; and such as are inserted are brief and moderate. It deals little in precepts, ceremonial or moral. Its leading feature is narrative; and it presents an uninterrupted sucession of legends, most of which when ancient are embellished with new circumstances and when new part take so for of the spirit of the old, that they are disinterested creations of the imagination, having no perticular motive, being designed to recommend no special doctrine or observance. Whether they are derived from any other source or whether they are original inventions, it is not possible to ascertain. They are most probably, for the greater part at least, original and the whole has been narrated in the compilar's own manner; a manner superior to that of Puranas in general, with the exception of the Bhagavata."

—Vishnupurana-Preface; Page 34-35

ఛందోఽలంకారాదిశాస్త్రవిషయవివరణములును మచ్చునకైనను బ్రపంచింపఁబడకుండుట దాని ప్రత్యేకతను దెలియఁబఱచుచున్నది. అట్లని శాస్త్రవిషయము లిం దనలు లేవని కాదు. జడోపాఖ్యానాదులందు శాస్త్రాచారవిధులుకొన్ని చెప్పఁబడినవి; దేవీసప్తశతియందు స్తోత్రాదులు కలవు. కాని యవియన్నియుఁ బ్రధానపురాణస్వభావమునకుఁ సహజములుగా నుండమిచేఁ బక్షిప్తము లని విమర్శకులు భావించుచున్నా రని వెనుక నిరూపింపఁబడి యున్నది. ఒకవేళ నీయంశముల నన్నింటిని యథాతథములుగా గ్రహించినను మార్కండేయపురాణమున శాస్త్రాదివిషయములు పరిమితముగాఁ జెప్పఁబడిన వని భావింప వలను పడుచున్నది. ఇందుఁ జెప్పఁబడిన వర్ణాశ్రమధర్మములును, శ్రాద్ధవిధి, నరకవివరములును, కర్మపరిపాక, సదాచారయోగవిషయములును గథానుబంధములై యుండుటయు గమనింపఁదగిన విశేషము. మార్కండేయమున వెలసిన కథార్థములు చాలవఱకు పురాణపంచలక్షణముల సహజవిస్తరణమున కంగభూతములై యున్నవి; మిగిలినవి యితిహాస కథార్థములకన్వయరూపములుగను, పురాణప్రసిద్ధవ్యక్తుల మహిమాభివర్ణనాత్మకములుగను వెలసినవి. ఇందు శాస్త్రార్థవిషయము లంగభూతములే కాని ప్రధానప్రతిపాద్యాంశములు కావు. కొన్నిపురాణములు శాస్త్రార్థవిషయబోధలకే పుట్టినవి కలవు. కొన్ని శాస్త్రమునఁ గథలు ప్రవర్తింపఁజేసినవి కలవు. కొన్నికథాకథనమున శాస్త్రమును బోధించినవి కలవు. మార్కండేయ మందులో మూఁడవవిధమునకుఁ జెందినది. పురాణములలోఁ గొన్ని ప్రత్యేకమతాభినివేశము గలిగి యున్నవి. అట్టివానియందుఁ బ్రతిపాదింపఁబడు హరిహరశక్త్యాదిభగవత్తత్త్వములలో నొకదానివిభూతి సర్వకథాంశములలోను వివిధరూపములుగా వర్ణింపఁబడుచుండును. మార్కండేయ మట్టిపురాణము కాదు. అందు మానవుఁడు స్వీయధర్మకర్మఫలరూపముగాఁ బొందు నైహికాముష్మికసుఖాదుల నభివర్ణించుకథార్థములు విశేషముగాఁ గలవు. మానవప్రకృతులలోని విశిష్టవిచిత్రభేదములు ప్రతిబింబించు వ్యక్తులచరిత్రలు పెక్కులు కలవు. మానవజీవితముపై విధిప్రభావమును నిరూపించునట్టియు, ధర్మసాధకులకు దైవయత్నము సమకూరు నను తాత్పర్యము బోధించునట్టియు, కర్మాచరణము జ్ఞానైకలక్షిత మనియు, జ్ఞానసిద్ధి మోక్షహేతు వనియుఁ దెల్పెడికల్పనలు పెక్కు కలవు. కావున నీపురాణగాథలు మానవజీవితముయొక్క గాంభీర్యౌన్నత్యములను బఠితలకుఁ బ్రదర్శించి పురుషార్థవ్యుత్పత్తిని మిత్రసమ్మితముగా నుపదేశించుటకేర్పడిన వని గ్రహింపవలెను. ఇట్టిగాథలకలిమిచే నీమార్కండేయ మొకరసవత్తర పురాణకథాసంహితవలెఁ బఠితలయొక్క యాదరాభిమానములను జూఱఁగొనుచున్నది.

మార్కండేయపురాణమునందలి పంచలక్షణలక్షితమైనవస్తువును మూఁడువిధములుగా వింగడింపవచ్చును. 1. సర్గప్రతిసర్గవంశములు వర్ణింపఁబడిన వస్తువు. 2. మన్వంతర గాథలు. 3. వంశానుచరితము. వీనిలో మన్వంతరగాథలు పారంపర్యముగాఁ బ్రసిద్ధములైనవి. వంశానుచరితములు ఐతిహాసికప్రాధాన్యము గలవి. ఇఁక మిగిలిన సర్గప్రతిసర్గ వంశములు ప్రాచీనదార్శనికసిద్ధాంతమూలము లైనవి. కావున నీమూఁడింటియందును వస్తుతః కొంతవ్యాఖ్యాన ముండు నవకాశము కలదు.

సర్గప్రతిసర్గవంశములు అష్టాదశపురాణసామాన్యలక్షణముగా వానియందు కాన వచ్చుచున్నను, వానిసర్వాంశములందును నేకవాక్యత కనుపట్టుట లేదు. ఇట్టి వైవిధ్యమునకు విమర్శకు లనేకకారణముల నూహించుచున్నారు. సర్గాదులగూర్చి వేదములందును గీర్తింపఁబడియున్నది. ఋగ్వేదమునందలి పురుషసూక్త మందుల కొక యుదాహరణము పురుషసూక్తమున సహస్రశీర్షుఁ డైన పురుషుఁడు విశ్వమూర్తిగా, విశ్వకారణుఁడుగా భావింపఁబడినాఁడు. ఋగ్వేదముననే ప్రజాపతియు, హిరణ్యగర్భుఁడు నగు బ్రహ్మ యొక్క యుత్పత్తివిధము చెప్పఁబడినది. ప్రజాపతి సర్గము నిర్వహించెడి గాథలు అథర్వవేదముననను, ఉపనిషత్తులలోను గానఁబడుచున్నవి. అపైన బ్రాహ్మణములందిసర్గాదులనుగూర్చిన ప్రశంసలు కనఁబడుచున్నవి. అందు శతపథబ్రాహ్మణప్రోక్తమైనది ముఖ్యము. ఆదిభూత మైన జలమునుండి బ్రహ్మాండము జనించుటయు, నందుండి ప్రజాపతి యుదయించుటయు, నతఁ డుచ్చరించిన "భూర్భువస్సువః" అనుశబ్దముల నుండి క్రమముగా భూమివాయ్వాకాశము లుదయించుటయు - నాపై నాతఁడు శబ్దములచే దేవతలను సృజించుటయు, ననునవి యాబ్రాహ్మణవర్ణనాంశములలోఁ బ్రధానమైనవి. ఆతరువాత వెలసిన యారణ్యకాద్యుపనిషత్తులలో నీసర్గవిధానము బహువిధములుగా వర్ణింపఁబడి యున్నది. ఉపనిషత్తులలో వెలసిన షడ్దర్శనసిద్ధాంతసూత్రములే యీవర్ణనా వైవిధ్యమునకు హేతువు లైనవి. కాలక్రమమున సాంఖ్యదర్శనసిద్ధాంతముపై నాధారపడియున్న సర్గాదికథనము ప్రఖ్యాతి నొందినది. మనుస్మృత్యాది ధర్మశాస్త్రగ్రంథములందును, మహాభారతేతిహాసమునందును, బురాణవాఙ్మయమునందును సాంఖ్యదర్శన సిద్ధాంతములచే ప్రభావితమైన సర్గకథనము బహుళముగా వర్ణితమై యున్నది. కాని పురాణము లొక్కకాలమున నిర్మింపఁబడకపోయి యుండుటచే నాయాకాలములందు వెలసిన నాయాపురాణములం దాయాసర్గవిధానముల నభివర్ణించియుండిరి. చారిత్రకదృష్టితో నీయంశమును బరిశీలించిన విమర్శకులు విష్ణు, బ్రహ్మ, బ్రహ్మాండ, వాయు, గరుడ, పద్మ, వరాహపురాణములు ప్రధానముగా బ్రాహ్మణోక్త మగు బ్రహ్మాండోత్పత్తి కథనమును జెప్పుచు, సప్తర్షులను బేర్కొనుచుండుటచే వానియందు వర్ణితమై యున్న సర్గము ప్రాచీనతమమై యుండవచ్చు నని భావించిరి. మార్కండేయకూర్మాదిపురాణముల లోని సర్గకథనములు బ్రాహ్మణోక్తసర్గవిధముల పరిణామదశను దెలుపుచున్న వనియు, మాత్స్యాదులు తత్పరిణతస్థితినిఁ దెలుపుచున్న వనియుఁ దలంచిరి.[18] బ్రాహ్మణములకును, సాంఖ్యదర్శనములకును మధ్యేమార్గమున నడచిన మార్కండేయమునందలి సర్గాదికథనమును విష్ణ్వాదిపురాణాంశములతోఁ బోల్చిచూచినచో నాతివిపులముగను. నాతిసంగ్రహముగను జేయఁబడిన దని తెలిసికొనవచ్చును.

అష్టాదశమహాపురాణములలో మన్వంతరకథనమున మార్కండేయమున కొక యున్నతస్థానము కలదు. మన్వంతరగాథలతో నీపురాణ మిచ్చినన్ని వివరములుగాని, యొనర్చిన కల్పనలుగాని, చెప్పిన కథాకథనపద్ధతి కాని, తత్కథలను భావించి

18. Studies in the Epics and Puranas-Page 60-61.

గ్రంథించిన నైపుణ్యముగాని యేయితరపురాణములందును గానరాదు. మార్కండేయము తప్ప చాలపఱ కన్నిపురాణములును మన్వంతరములను సూత్రప్రాయముగఁ జెప్పి విడిచినవి; చతుర్దశమనుక్రమమును, మన్వంతరములందు వెలసియుండు నింద్రాద్యధికారపురుషవివరణమును, నామనిర్దేశమాత్రముగా గుదిగ్రుచ్చి చెప్పినవి. భవిష్యత్బ్రహ్మవైవర్తవామనలింగపురాణము లీయంశము నత్యంతసూక్ష్మముగా స్పృశించి యూరకున్నవి. బ్రహ్మపద్మవాయునారదవరాహకూర్మమత్స్యపురాణము లొక్కొక్కయధ్యాయమునకు మించని సంగ్రహకథన మొనర్చినవి. బ్రహ్మాండాగ్నిపురాణములు కొంత విపులముగా నుగ్గడింప యత్నించినవి. గరుడవిష్ణుభాగవతపురాణము లీయంశమును మూఁడునాలుగధ్యాయములందు వివరించినవి. అట్లైనను 134అధ్యాయములలో 47 అధ్యాయములు మన్వంతరగాథాకథనమునకు వినియోగించిన మార్కండేయపురాణముతోఁ బోల్చిచూచినచో నవి యన్నియు సంగ్రహాతిసంగ్రహము లని తోపక మానవు.

సామాన్యముగాఁ జతుర్దశమనుచరిత్రములలో స్వాయంభువమన్వంతరమునందు తన్మనుసంతతి విస్తరముగా వర్ణింపఁబడుచుండును. స్వాయంభువమనుపుత్త్రులు ప్రియవ్రతోత్తానపాదులు; పుత్త్రికలు ప్రసూత్యాకూతులు. అక్కన్యలను గ్రమముగా దక్షుఁడును రుచియును బెండ్లాడిరి. పురాణములన్నియు సామాన్యముగా నీనలుగురి సంతతులను జెప్పుచుండును. కొన్నిపురాణములు కొందఱి చరితములను విస్తరించినవి. స్వాయంభువమనుసంతతివలె మిగిలినమనువులసంతతులు పురాణములందు విస్తరముగా వర్ణింపఁబడియుండలేదు. మార్కండేయపురాణము స్వాయంభువమనూత్పత్తిని, అతని సంతతిక్రమమును బట్టికారూపమునఁ జెప్పియు, నధర్మునిసంతానమైన దుస్సహుని యొక్కయుఁ, దత్సంతతియొక్కయు చరిత్రమును గొంతవిపులముగాఁ జెప్పెను. ధర్మవిరహితులైన మానవులజీవితములలో నేర్పడు దురాచారసముదాయమునకు రూపకల్పన మొనరించి ప్రపంచిన కథావిశేషము దుస్సహసంతానోపాఖ్యానము. ఈయుపాఖ్యానము మార్కండేయపురాణముయొక్క ప్రత్యేకతను జాటుచున్నది.

స్వారోచిషమన్వాదిగా నున్న మన్వంతరగాథలు మార్కండేయపురాణైకకల్పితములు. ఈపురాణము ననుసరించియే గరుడపురాణము రౌచ్యమనూత్పత్తిగాథను మూఁడధ్యాయములలో (88-90) వివరించి చెప్పినది. విష్ణుపురాణము సావర్ణిమనూత్పత్తిని వర్ణించి చెప్పినది. సూర్యభగవానుని పుత్త్రుఁడైన సావర్ణికథ మార్కండేయము విష్ణుపురాణముకంటె నభినివేశముతో నిర్మించినది. భాగవతపురాణము మన్వంతరములందు విష్ణుమహిమాభివర్ణితములైన కథలను నిబంధించుట యొకవిశేషము. చతుర్థమను వగు తామసుని కాలమునందు హరి గజరాజును గ్రాహబాధనుండి మోక్షణ మొనర్చి రక్షించె నని చెప్పు గజేంద్రమోక్షణకథయు, ఆఱవమను వగు చాక్షుషునికాలమున హరి కూర్మమూర్తి రూపముఁ దాల్చి మందరగిరిని వహించె నని చెప్పెడి క్షీరసాగరమథనకథయు భాగవతమునఁ జెప్పఁబడియున్నవి. కాని, మార్కండేయపురాణమువలె భాగవతము మనూత్పత్తి

గాథలను వివరించియుండలేదు. దానివలన మన్వంతరకథలన్నియు మార్కండేయపురాణ కల్పితము లనియు, వానిలోఁ గొన్ని గారుడాదిపురాణములచే గ్రహింపఁబడిన వనియు భాగవతము మనూత్పత్తిగాథలను వర్ణించుపద్ధతి మాని, మనువులకాలమున విష్ణుమహిమను జాటుకథలను జెప్పె ననియు, స్పష్టమగుచున్నది. ఇందు మార్కండేయపురాణ సంప్రదాయము ప్రాచీనపురాణసంప్రదాయము. భాగవతసంప్రదాయము దానికంటె నర్వాచీనము మొదటిదానియందు మతప్రబోధదృష్టి కానరాకపోవుటయు, రెండవదానియందుఁ గానవచ్చుచుండుటయు దానికి నిదర్శనము.

మహాపురాణములు సామాన్యముగా వంశానుచరితములలో సూర్యచంద్రవంశములను వర్ణించియున్నవి. భవిష్యాదులందు కలియుగరాజచరిత్రములుకూడఁ జెప్పఁబడియున్నవి. కాని మార్కండేయపురాణమున సూర్యవంశచరిత్ర మాత్రమే యభివర్ణితమై యున్నది. అందును ప్రసిద్ధులగు వృషధ్ర, నాభాగ, వత్సంధ్ర ఖనిత్ర, కరంధ, మావేక్షిత, మరుత్త, నరిష్యంతచక్రవర్తులకథలు విస్తరించి చెప్పఁబడినవి. ఈవృత్తాంతములో నీపురాణము ప్రపంచించిన విషయవివరములుగాని, విశేషములుగాని మిగిలినపురాణములం దంతగాఁ బొడకట్టుట లేదు. కావున నేతత్కథాకథనగౌరవముకూడ మార్కండేయమునకే దక్కుచున్నది. ఈవిధముగాఁ బంచలక్షణములకుఁ బరిమితమైన వస్తువులం దితరపురాణములచే స్పృశింపఁబడని యనేకకథావృత్తాంతముల నీమార్కండేయము స్వతంత్రప్రతిపత్తితో వర్ణించి నూతన కథావిస్తారమై పురాణవాఙ్మయమున నొక యున్నతస్థానము నాక్రమించుకొని యున్నది.

## మార్కండేయము త్రిగుణ ప్రధానమైన పురాణము

త్రిమూర్తులఁగీర్తించుటనుబట్టి పురాణములు క్రమముగా సాత్త్వికరాజసతామసికములగు నని పద్మపురాణము వర్గీకరించినది. అందు మార్కండేయపురాణము సరస్వతీ చతుర్ముఖకృశానులను గీర్తించును గావున రాజస మనియు నది స్వర్గప్రద మనియు, బేర్కొనినది. స్కాందపురాణము మార్కండేయమును శివస్తుతిప్రధాన మని బేర్కొనినది. హరప్రసాదశాస్త్రి మార్కండేయము దుర్గామాహాత్మ్యప్రతిపాదన మని గణించెను. ఇట్లీ పురాణమునుగూర్చి తల కొకవిధముగాఁ దలపోసిరి. వారి పరిగణనమునం దేకవాక్యత కానరామిచే నీయంశమును బునఃపరిశీలనము గావింపవలసియున్నది.

మహాపురాణములు మార్కండేయమును సాత్త్వికపురాణముగాఁ బరిగణింపలే దని పైవాక్యములవలన స్పష్టమగుచున్నది. విష్ణుమహిమను గొనియాడు పురాణములే సాత్త్వికము లని పద్మపురాణమతము. శివునిఁ గీర్తించుపురాణములే యుత్తమము లని స్కాందపురాణమతము. పద్మపురాణము ననుసరించి శైవములైనపురాణములు తామసికములు. శివుఁడు తమోగుణప్రధానుఁ డని పరిగణింపఁబడును గావున స్కాందపరిగణనము ననుసరించి మార్కండేయము తామసపురాణ మగును; పాద్మము దీనిని రాజసముగా గణించెను. అట్లగుచో మార్కండేయమున శివసరస్వతీచతుర్ముఖకృశానులు

మాత్రమే కీర్తింపఁబడుచుండి రని భావింపవలసువడుచున్నది. కాని యీపురాణమున సూర్యనారాయణులును, దేవియుఁ గీర్తింపఁబడుచున్నారు. ఆయంశమును పై పురాణము గుర్తించలేదు. కావున పద్మస్కాందములపరిగణనము సమగ్రము కాకపోవుచున్నది.

మార్కండేయపురాణప్రధానభాగమునఁ గీర్తింపఁబడు దేవతలలో బ్రహ్మసూర్యాగ్నులు ముఖ్యులు. పూర్వభాగమున హరిహరులు ముఖ్యులు. సప్తశతియందు దేవి ప్రధానదైవము. అట్లగుటచే నీపురాణమున భాగవతాదులవలె నేయొక్క దైవముయొక్క ప్రాధాన్య ముగ్గడింపఁబడలేదు. కాగా నిందుఁ గీర్తింపఁబడు దైవములు గుణత్రయమునకుఁ జెందినవారు. కావున నీపురాణమును రాజస మనికాని, తామస మనికాని, యనుటకంటె గుణత్రయప్రాధాన్యము గల విశిష్టమహాపురాణ మని పరిగణించుట సమంజసము కాఁగల దని తోఁచుచున్నది

మార్కండేయము మహాభారతప్రశంసతో నారంభించుచుండుటయు, నందును త్రిదశులలో నారాయణుఁడు శ్రేష్ఠుఁడైనట్లు మహాభారతము సర్వశాస్త్రములందు శ్రేష్ఠ మని యభివర్ణించుటయు, నారాయణవ్యూహచతుష్టయమునుగూర్చిన ప్రశ్నను జైమిని మొట్ట మొదటనే యడుగుటయు, విష్ణ్వంశసంభూతుఁడైన బలరాముని వృత్తాంతమునుగూర్చి ప్రశ్నించుటయు, కాశికాక్షేత్రమునఁ గాటికాపరియై బహుదుఃఖము లనుభవించి తుదకుఁ బుత్త్రునిచితిపైఁ బడుటకు సిద్ధమైన హరిశ్చంద్రనృపతి కాశీపతి యైన విశ్వేశ్వరునిగాక పీతాంబరునిఁ గీర్తించినట్లు వర్ణించుటయు, అనసూయాసతిసుతులలో విష్ణ్వంశసంభూతుఁడైన దత్తాత్రేయుని మహిమాభివర్ణన మత్యంతవిపులముగా నొనర్చుటయు, సప్తశతిపూర్వభాగమున విష్ణువు మధుకైటభులసంహార మొనర్చినగాథ చెప్పఁబడియుండుటయు—విష్ణుప్రాముఖ్యమును దెలుపు పురాణార్థములకు నిదర్శనములు.

అత్రిపుత్త్రుఁడైన చంద్రుఁడు బ్రహ్మాంశసంభూతుఁడై జన్మించినకథ వర్ణింపఁబడుటవలనను, సర్గప్రతిసర్గవర్ణనమున బ్రహ్మోత్పత్తియు, తత్కృతసృష్టియు నభివర్ణితమై యుండుటవలనను, చాక్షుషునకు మన్వధికారము వరరూపముగాఁ బ్రసాదించిన వివరము తెలుపుటవలనను, బ్రహ్మయనుగ్రహమున దితికి మహిషాసురుఁడు జన్మించుటయు, బ్రహ్మ రుచికి వరము లిచ్చుటయు, బ్రహ్మ సూర్యునిఁ బ్రార్థించుటయు, బ్రహ్మకృతసురాసురనరతిర్యగాదిసృష్టిప్రకారము- మొదలైన కథార్థములు చెప్పఁబడియుండుటవలనను బ్రహ్మప్రాముఖ్యము తేటతెల్ల మగుచున్నది.

అనసూయాగర్భమున రుద్రాంశమున దుర్వాసుఁడు జన్మించుటయు, నశ్వతరుఁడు శివుని మెప్పించి మదాలసను పుత్త్రికగాఁ బడయుటయు, రుద్రసర్గాభివర్ణన మొనర్పఁబడుటయు, హరిహరాదుల తేజఃపుంజములవలన దేవి యావిర్భవించిన ఘట్టమును వర్ణించియుండుటయు, రుద్రుఁడు సుద్యుమ్నునిఁ బొలఁతి యగునట్లు శపించుగాథయు నీపురాణమున శివమహత్త్వమునుఁ జాటుచున్నవి.

మార్కండేయమున వైవస్వతసావర్ణిమన్వంతరకథావర్ణనావసరమునను, సూర్యవంశారంభసందర్భమునను సూర్యమహిమ విశేషముగాఁ గీర్తింపఁబడియున్నది. సంగ్రహ

ములును సారవంతములును నైన సూర్యస్తుతులు ఈపురాణమునఁ గలవు. అతఁడు త్రిగుణాత్మకుఁ డనియు, త్రిమూర్త్యాకృతి యనియు, సాక్షాద్బ్రహ్మైకరూపుఁ డనియు నాదిత్యుఁ డిందుఁ గీర్తింపఁబడినాఁడు. సూర్యునితరువాతఁ బేర్కొనఁదగినవాఁ డగ్ని. కర్మ ప్రధానమైన కథా పపంచమం దెల్ల నగ్నియే కీర్తింపఁబడుచుండుట సహజము. స్వారోచిషమనుసంభవవృత్తాంతమందును, భౌత్యమనుజన్మప్రకారకథనమందును, అగ్నిదేవుని మహిమ వర్ణితమై యున్నది. వీనియం దగ్నిస్తుతులు గలదు.

స్వర్గసంబంధ మున్న కథలయందు సామాన్యముగా నింద్రప్రసక్తి రాకమానదు. ఈపురాణమున నాదియందలి జ్ఞానపక్షులపూర్వవృత్తాంతమునందును, హరిశ్చంద్రభూవిభునకు సశరీరస్వర్గప్రదానము చేసినఘట్టమునను, జడోపాఖ్యానమునందలి వైదేహరాజు వృత్తాంతమునందును, గర్గకార్తవీర్యసంవాదమునందును, ఖనిత్రచరిత్రమునందును, ఇంద్రునిప్రశస్తి కానఁబడును. ఇట్లే కువలయాశ్వచరిత్రమున సరస్వతీదేవియు, హరిశ్చంద్రోపాఖ్యానమున ధర్మవిఘ్నేశ్వరులును మనకుఁ బ్రత్యక్షమగుచున్నారు. సప్తశతి వైష్ణవీశక్తిని, శివశక్తిని వర్ణించుచున్నది.

పైవివరములను బరిశీలించినచో మార్కండేయపురాణము వస్తుతః ఎట్టి ప్రత్యేక దైవము నధికరించి చెప్పుట లేదనియు, త్రిమూర్తులను, వైదికదైవములను సమదృష్టితోఁ గీర్తించె ననియు నేర్పడుచున్నది. కావున దీనిని త్రిగుణప్రధానమైన మహాపురాణ మనుటలో విప్రతిపత్తి లేదు.

మార్కండేయము వివిధనామరూపధారులైన దైవములను గీర్తించినను, తత్త్వతః వారినందఱను బరబ్రహ్మముగనే భావించినది. "ఏకం సత్ విప్రా బహుధా వదన్తి" యను మహదాశయము నీ మహాపురాణము చాటుచున్నది. అదియే వేదహృదయము ! మదాలసోపాఖ్యానమున నమ్మాతృశ్రీముఖమునఁ "బురుషుల సార్థకనామమునఁ బిలుచుట సాధ్యము కాదని" చెప్పుచు, "కల్పనేయం మహారాజకృతా సా వ్యావహారికీ। త్వత్కృతానాం తథా నామ్నాం శృణు భూప నిరర్థతాం। వదన్తి పురుషాః ప్రాజ్ఞా వ్యాపినం పురుషం సతః॥" అని ప్రబోధించు నీపురాణము నామరూపరహితమైన పరబ్రహ్మ మొక్కటియే యను పరమజ్ఞానమును ధ్వనించుచున్నది. మాఱన యన్నట్లీపురాణము పరమవిజ్ఞానాశ్రయ మనుట నిస్సంశయము !

## మార్కండేయ పురాణ ప్రామాణికత్వము :

మార్కండేయపురాణోక్తములైన కొన్ని ధర్మశాస్త్రవిషయములు మనుస్మృతి నుండియు, మహాభారతమునుండియు, గ్రహింపఁబడియున్నవి. అంతియకాక ప్రామాణికములైన పెక్కుస్మృతిశాస్త్రవిషయముల నీపురాణము తనకుఁ దానుగాఁ జెప్పుచున్నది. ఈయంశమునుగూర్చి పరిశోధనలు సలిపిన ప్రొఫెసరు R. C. హజ్రా మార్కండేయ పురాణములనుండి కొంచఱు ధర్మశాస్త్రకర్తలును, వ్యాఖ్యాతలును ప్రమాణబుద్ధితోఁ ననేకాంశములను గ్రహించి తమగ్రంథములం దుదాహరించియుండిరని నిరూపించి

యుండిరి.[19] అట్టివారిలో యాజ్ఞవల్క్యస్మృతివ్యాఖ్యాత- అపరార్కుఁడును, అభూత సాగరదానసాగరకర్త- భల్లాలసేనుఁడును, హారలతాకర్త - అనిరుద్ధభట్టును, స్మృతి చంద్రికాకర్త- దేవనభట్టును, చాతుర్వర్ణ్యచింతామణికర్త- హేమాద్రియును, కృత్యాచార కర్త-శ్రీదత్తోపాధ్యాయుఁడును, మదనపారిజాతకర్త యగు మదనపాలుఁడును, కల్పతరు వ్యాఖ్యాతయు, ముఖ్యులు. దీనినిబట్టి గమనించినచో మార్కండేయ మహాపురాణము స్మృతిశాస్త్రకర్తలచే నతిప్రామాణికమైన పురాణముగాఁ బరిగణింపఁబడిన దని నిశ్చ యింపవచ్చును.

కార్తవీర్యార్జునుఁడు దత్తాత్రేయమునివలనఁ బొందిన వరసిద్ధినిగూర్చిన ప్రసక్తి మాత్స్య(43.15), బ్రాహ్మ(13.60), బ్రహ్మాండ, నారదీయపురాణములందుఁ గానఁబడు చున్నది. భాగవతపురాణము భగవంతుని యేకవింశత్యవతారములలో నాఱవయవతార ముగా దత్తాత్రేయునిఁ బేర్కొనుటయే కాక అతఁ డలర్కప్రహ్లాదుల కన్వీక్షకి యను నాధ్యాత్మికవిద్యను బోధించె ననియుఁ దెలుపుచున్నది. ఇట్లు వివిధపురాణములలో సంగ్ర హముగాఁ బేర్కొనినయంశము లన్నియు నీపురాణాంతర్గత దత్తాత్రేయోపాఖ్యానమున లభించుచున్నవి

**కావ్య కథార్థమూలమైన మార్కండేయము :**

సప్తశతి దేవీమాహాత్మ్యప్రతిపాదకములైన కథలకు మూలాధార మనఁదగినది. దేవీమాహాత్మ్యము క్షేమంకర్యాఖ్యానముగాఁ బద్మపురాణమునందును, వైష్ణవీమాహాత్మ్య ముగా వారాహపురాణమునందును, మహిషాసురసంహారగాథగా వామనపురాణమునందును, లలితోపాఖ్యానముగా బ్రహ్మాండపురాణమునందును వర్ణింపఁబడియున్నది. సప్తశతికథ దేవీభాగవతకథార్థములకు మూలమై యొప్పారుచున్నది. ఇట్లు సప్తశతీగ్రంథసంపత్తిచే మార్కండేయ మహాపురాణ మొక ప్రసిద్ధపురాణమునకు వస్తుసంప్రదానము చేయుశక్తి గడింపఁగలిగినది.

ఈ పురాణమునందలి హరిశ్చంద్రమహారాజచరిత్రమును, వశిష్ఠవిశ్వామిత్రసంఘర్షణ రూపమైన ఆడిబకయుద్ధవృత్తాంతమును నేతత్పురాణస్వతంత్రకల్పనలు. ఋగ్వేద హరిశ్చంద్రచరిత్రముకంటె నీపురాణకథ విలక్షణమైనది; సత్యధర్మవ్రతాచరణనిష్ఠా గరిష్ఠుఁడైన హరిశ్చంద్రుని ధర్మపేరునిగా లోకమునఁ గందించినది మార్కండేయ పురాణమే. భాగవతదేవీభాగవతాది పురాణము లీపురాణకథను తమయందుఁ గొంతవఱ కనుసరించియున్నవి. ఈపురాణహరిశ్చంద్రవృత్తాంతమే సంస్కృతమునఁ జండకౌశిక నాటకముగా సంతరింపఁబడినది. దేశీయభాషాసాహిత్యములలో నీమహారాజుచరిత్రము సత్యవ్రతమున కెత్తిన కీర్తిపతాకముగా నిలచి ప్రజాదరణమును జూరగొనుచున్నది. ఇట్లీమార్కండేయపురాణము పురాణములకేకాక, కావ్యములకుఁగూడ కథావస్తువును బ్రసాదించిన ప్రసిద్ధిని గాంచియున్నది.

19. చూ : Studies in the Puranic Records on Hindu Rites and Customs: chap. II P. 13; and Appendix No. I. Pages 266-269.

# ప్రథమాంధ్రమహాపురాణము

తెలుఁగున ననువదింపఁబడిన గీర్వాణమహాపురాణములలో మార్కండేయము మొదటిది. మారనమహాకవి యీపురాణము నాంధ్రీకరించి కాకతిప్రతాపరుద్రదేవుని కటకపాలుఁడైన నాగయ్యగన్నసేనానికిఁ గృతి నొసంగెను.

**కృతికర్త : కృతిభర్త : కృతి వెలసిన కాలము :**

ఈప్రథమాంధ్రమహాపురాణకర్త కవిబ్రహ్మతిక్కనసోమయాజిశిష్యుఁడు; తిక్కనామాత్యపుత్త్రుఁడు. వినయగుణవిరాజితుఁడైన మారన తననుగూర్చి యింతకంటె మఱి యేవివరములను దనగ్రంథమునందుఁ జేర్కొనలేదు; కాని కృతిభర్తవంశావళి నభినివేశముతో వర్ణించెను. నాగయ్యగన్నసేనాని రెండవప్రతాపరుద్రదేవునిసేనానులలోఁ బ్రసిద్ధి నొందినవాఁడు. ఇతని తాతతండ్రులు కాకతీయప్రభువుల నచంచలభక్తివిశ్వాసములతోఁ గొలిచియుండిరి. ఇతనితండ్రి యగు నాగసేనాని కాకతిరుద్రమదేవి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై పాకనాటిసీమ కధిపతి యయ్యె నని చారిత్రకులు చెప్పుచున్నారు.[1] ఇతనితల్లి గణపతిదేవచక్రవర్తి యనుంగుతలవరి యగు మేచయనాయకుని పుత్త్రిక - మల్లమాంబ. ఇతనికి మేరుసమధీరులైన తమ్ము లిరువురు గలరు. అందుఁ బెద్దవాఁ డగు నెల్లయసేనాని యరిభయంకరుఁడు. రెండవవాఁ డగు మేచయనాయకుఁడు సేనానియు, మహాధికారియు నై ప్రతాపరుద్రునిచే నాప్తునిగాఁ బరిగణింపఁబడెను. గన్నసేనాని యోరుగల్లుపురపాలకుఁడుఁగా సుస్థిరమైన కీర్తిని గడించుటయేకాక పెక్కుయుద్ధములందు విజయములను సాధించి విభునిచే రాజ్యచిహ్నములను, నాయకత్వమును బడసెను. ఇట్టివీరనాయకమణులు వంశపారంపర్యముగాఁ బ్రభుభక్తి వెలార్చి తమ చతుర్థవంశమున కెనలేనికీర్తినిఁ దెచ్చిపెట్టిరి.

గన్నసేనాని మహావీరుఁడు, నీతికుశలుఁడే కాక గొప్పపండితుఁడు; సరసుఁడుఁ హరిహరులను సమబుద్ధితో సేవించిన మహాభక్తుఁడు. అతనికిఁ బురాణసాహిత్య మన; బుట్టెడుప్రీతి. వివిధపురాణప్రవీణు లైన పౌరాణికులవలనఁ బురాణముల నెన్నింటినో యాతఁడు చవులూర వినుచుండెను. కాని మార్కండేయమహాపురాణమువలె నాతని చిత్తమునకు మఱియేపురాణమును హత్తుకొనలేదు.

1. కాకతీయ సంచిక - పుట 60.

శా. "పాండిత్యం బమరం బురాణముల ము న్పౌరాణికుల్ సెప్పఁగాఁ
విందు న్వింతలు కావు నూతనకథావిస్తార మై యోగ్య మై
చండాఘోత్కరహారి యై పరమవిజ్ఞానాశ్రయం బైన మా
ర్కండేయాఖ్య మహాపురాణము వినం గౌతూహలం బయ్యెడున్."

—మారన మార్క. అవ. 14.

అని యాసేనాని ముచ్చటపడిచెప్పినాఁడు. కుతూహలపరుఁడై పునఃపునః శ్రవణానంద సౌఖ్యమును గల్పించుకొనినాఁడు. అందలి నూతనకథారసామృతమును దనివితీరఁ గ్రోలినాఁడు; పరమవిజ్ఞానము నుపాసించి పునీతుఁడై నాఁడు! అంతటితో నాతఁ డాగ లేదు. తనవలెనే తెలుఁగుప్రజ లందఱును దత్పురాణస్వారస్యము నాస్వాదింపవలె నని స్వాంతమున నువ్విళ్లూరినాఁడు. ఆంధ్రమున దాని ననువదింపఁగల వచోవిభవమును మారనమహాకవియందు దర్శించినాఁడు. వినయముతో నాకవి కిట్లు విన్నవించుకొనినాఁడు:

శా. "తర్కింపంగ నశక్య మైన వితతోద్యద్దీప్తిజాలంబుచే
నర్కుం డెట్లు వెలుంగు నట్లు బహుపుణ్యశ్రేణికావ్యాప్తి సం
పర్కస్ఫూర్తి నఘాంధకారము లడంపంజాలి లోకంబున
న్మార్కండేయపురాణరత్న మమరు న్మాంగళ్యసంపాది యై.

ఉ. కావునఁ దత్పురాణము ప్రకాశితసారకథామృతం బొగిం
ద్రావి జగజ్జనంబు లలర న్రచియింపు తెనుంగున న్వచః
శ్రీవిభవంబుపెంపు విలసిల్లఁగఁ గోవిదు లిచ్చ మెచ్చి సం
భావనసేయఁ జారుగుణభాస్వర! మారయసత్కవీశ్వరా!

—మారన మార్క. అవ. 16-17.

జగద్ధితార్థ మైన గన్నయసేనానిసంకల్పము మారనచే నాంధ్రమహాపురాణరచనకు శ్రీకారము చుట్టించినది.

చారిత్రకదృష్టితోఁ బరిశీలించినచో మారనమార్కండేయపురాణరచనము క్రీ. శ. పదునాలుగవశతాబ్ది తొలియుషస్సులలో సాగిన దని నిశ్చయింపవచ్చును. రెండవప్రతాప రుద్రుని పరిపాలనకాలము క్రీ.శ. 1296 నుండి 1323 వఱకు వ్యాపించియున్నది. కాని, క్రీ. శ. 1290 నుండియు కాకతిప్రతాపరుద్రదేవుఁడు రుద్రమదేవిపాలనమున యువ రాజుగా నుండి రాజకీయధురంధరుఁడై పెక్కువిజయములను సాధించి కీర్తిగడించె ననియు, మహారాజ్ఞిమరణానంతర మాతఁడు సింహాసన మధిష్ఠించె ననియుఁ జారిత్రకాధా రములవలనఁ దెలియవచ్చుచున్నది. గన్నయసేనాని ప్రతాపరుద్రుఁడు సింహాసనమునకు వచ్చిన తరువాతనే యతనిని సేవించియు, మెప్పించియు రాజ్యచిహ్నములను, నాయకత్వ మును బడసినట్లు మారనరచనవలనఁ దెలియవచ్చుచున్నది. ప్రతాపరుద్రుఁడు రాజ్యము నకు వచ్చిన తరువాత దాదాపైదాఱుసంవత్సరములు దేశము ప్రశాంతముగనే యున్నట్లు

తెలియుచున్నది. నెల్లూరుప్రాంతమున క్రీ.శ 1296-98 మధ్య మనుమగండ భూపాలుఁడను సామంతుఁడు తిరుగుబాటు చేసినను ఆదిదమ్మ యను కాకతీయసేనాని యావిప్లవము నణచె నని తెలియుచున్నది. ఇంతకంటె నాకాలమునఁ జెప్పుకొనఁదగిన పెద్ద యలజడులేవియుఁ గానరావు. కాని క్రీ. శ. 1302వ సం॥ మొదలుకొని ప్రతాపరుద్ర భూపతి వరుసగా మహమ్మదీయులదండయాత్రల నెదుర్కొనవలసివచ్చెను. క్రీ. శ. 1303వ సం॥ర ప్రాంతమున ఢిల్లీపాలకుఁ డైన అల్లాయుద్దీనుఖిల్జీ ఫకూరుద్దీన్‌జూనా, మలిక్, చజ్జూలనాయకత్వముక్రింద నపారసైన్యము నోరుగల్లుపైకిఁ బంపెను. చారులచే నీవార్త నెఱింగిన ప్రతాపరుద్రుఁడు సమర్థు లైన సేనానులసాయముతో యవనసేనలను గోదావరియుత్తరతీరముననే యెదిరించి విజయము సాధించెను. ఈయుద్ధమున గన్నయ సేనాని యనుఁగుఁదమ్ముఁడు మేచయసేనాని ప్రభువునకుఁ గుడిభుజమై నిలచెను. ఆతరువాత గండికోటదుర్గప్రాంతములందు సామంతు లైన త్రిపురాంతకాంబదేవులు తిరుగుబాటు చేసిరి. వారినిఁగూడ ప్రతాపరుద్రుఁడు సేనానులసాయముతో నణఁచెను. క్రీ.శ. 1309లో ఢిల్లీసులతాను మాలిక్‌కాఫరునాయకత్వమున నొకవిపులసేనావాహినిని దక్షిణాపథముపైఁ బంపించెను. కప్పము కట్టుటమాని స్వతంత్రించిన దేవగిరి యాదవులను మాలిక్‌కాఫరు శిక్షించెను. అంతటితోఁ దృప్తిఁజెందక యతఁ డోరుగల్లుకోటను ముట్టడించెను. ప్రతాపరుద్రునిసేనలు శత్రువులపై విజృంభించి పోరినవి. కాని, యాంధ్రులకుఁ బోరు భారమైనది. ప్రతాపరుద్రుఁ డానమయమున (క్రీ. శ. 1310 సం॥ మార్చి నెల 16వ తేదీన) మాలిక్‌కాఫరున కశేషధనరాసుల నర్పించి, ఢిల్లీప్రభువునకుఁ గప్పము కట్టునట్లొడఁబడి సామ్రాజ్యమును రక్షించుకొనెను. ఈయదను కనిపెట్టి క్రీ.శ. 1311లో దక్షిణమునఁ బాండ్యులు కాంచీపురముపై దండెత్తి కాకతీయులసామంతుఁ డగు వీరగండ గోపాలునిఁ దరిమి యానగరము నాక్రమించుకొనిరి. ప్రతాపరుద్రుఁడు ఎఱ్ఱదాచానాయకుఁ డను సేనానిని కాంచీపురముపై నంపి, పాండ్యుల నోడించెను. ఇట్లు క్రీ. శ. 1313వ సం॥ నాటికి దేశమున నలజడు లుడిగి దాదాపు పదిసంవత్సరములకాలము శాంతిసౌఖ్యములు విలసిల్లెను. క్రీ. శ. 1321లో మరల మహమ్మదీయులదాడి జరిగినది. గయాజుద్దీనుతుగ్లక్ తనకుమారుఁ డగు ఉలూగ్‌ఖాను (ఫకూరుద్దీనుజూనా) నోరుగల్లుపైఁ బంపెను. ఆంధ్రులకును యవనులకును ఘోరయుద్ధము జరిగెను. అందు మహమ్మదీయులకు పరాజయము వాటిల్లెను. ఓరుగల్లుప్రభువు తమకుఁ గలిగిన యీవిజయమున కుబ్బి యుద్ధప్రయత్నములందు కొంత విశ్రాంతిని బ్రకటించెను. తురుష్కులు తలవని తలంపుగా క్రీ. శ. 1323 లో నపారసేనావాహినితో నోరుగల్లుపైఁ బడిరి. అచిరకాలము క్రిందనే పరాజితులైన మహమ్మదీయు లంతత్వరలో మరల రణోన్ముఖు లయ్యెద రని యాంధ్రులు భావించియుండలేదు. దానికిఁదోడు ప్రతాపరుద్రసేనానులలోని వెలమ-రెడ్డి కులజులైన సేనానులమధ్య నాంతరములైన స్పర్థలు పెరిగెను. జైనమతస్థులుకూడ ప్రభువున కెగ్గుచేయఁ దలపెట్టుచుండిరి. ఇట్టి పెక్కియోకారణములు కలసి యాసంవత్సరమునఁ బ్రతాపరుద్రుని ప్రతాపభానుఁ డస్తమించునట్లు చేసినవి.

ప్రతాపరుద్రభూపతి పరిపాలనకాలమున జరిగినవైనంఘటనలను బరిశీలించినచో క్రీ. శ. 1313 వ సంవత్సరమునుండి 1320 వ సంవత్సరము వఱకు నోరుగల్లు ప్రశాంతముగా నుండె నని యూహింప వీలగుచున్నది. మహావిద్వాంసుఁ డైన ప్రతాపరుద్రుఁ డీకాలమునందు సాహిత్యమునకును, శాస్త్రములకును, లలితకళలకును, జేయూఁత నిచ్చి పోషించెను. సంస్కృతాంధ్రకవు లాతనియాస్థానమును దర్శించి సత్కారము లందియుండిరి. ప్రభువువలెనే ఓరుగంటివాస్తవ్యు లగు సేనానులు కొందఱు సమరాంగణమునందే కాక సాహిత్యరంగమునందుఁ గూడ నసమానశ్రద్ధాభక్తులను గనుపఱచియుండిరి. వారిలో సుప్రసిద్ధులు నాగయగన్నసేనానియు, ప్రతాపరుద్రదేవుని యశ్వసైన్యాధ్యక్షుఁడు సాహిణిమారడును. అందు నాగయగన్నసేనాని మారన మార్కండేయపురాణమును గృతిగొనెను. సాహిణిమారఁడు హుళక్కిభాస్కరుని రామాయణము నంకితముగా గ్రహించెను. ఒకమహాపురాణమును, ఒకమహాకావ్యమును నాంధ్రమున ననువదింపఁబడుట కీప్రశాంతవాతావరణ మెంతయుఁ దోడ్పడియుండును. ప్రతాపరుద్రుఁడు సింహాసనమునకు వచ్చిన మొదటియైదాఱు సంవత్సరములుకూడ రాజ్యము ప్రశాంతముగనే యున్నది. కాని, మారన తనపురాణమున వర్ణించినట్లు మేచయసేనాని మహాధికారియు, రాజున కాప్తుఁడును నగుటకుగాని, నాగయగన్నసేనాని "శౌర్యలీల రిపుకోటి రణావనిఁ గీటడంచి" రాజును గొలిచి రాజ్యచిహ్నములు వడయుటకు గాని కొంతవ్యవధానము, అవకాశము కావలయును గావున నామహాకవి పురాణరచనమునకుఁ బూనునాటికి ప్రథమ తురుష్కదండయాత్రాధ్యాయము పూర్తియై యుండవలయును. కావున మార్కండేయపురాణరచనము క్రీ, శ. 1313వసంవత్సర ప్రాంతమున నారంభ మయి 1320 వ సంవత్సరమునకుఁ బూర్వమే ముగిసి యుండు నని నిశ్చయింపవచ్చును. దీనికి మఱియొక యంశముకూడ దోహద మొనర్చుచున్నది. ప్రతాపరుద్రదేవుఁ డీకాలమున పుణ్యక్షేత్ర సందర్శనాభిలాషతో శ్రీశైలత్రిపురాంతకములను, శ్రీరంగజంబుకేశ్వరములను, కాంచిని, శివగంగపర్వతమును దర్శింప నేగె నని తెలియుచున్నది. 'కోయిలొలుగు' అను ద్రవిడకావ్యమునం దీకాలమున (అనఁగా 1314-15 ప్రాంతమున) నొరిస్సాపాలకుఁ డగు కపిలేంద్రగజపతి యాంధ్రదేశముపై దాడి చేసి, యోరుగంటిని ముట్టడించినట్లు తెలియుచున్నది. కాని, రాజభక్తియుక్తులును, శూరాగ్రేసరులు నైన సేనాను లాతని నోడించి తరుమగొట్టి రాజధానిని రక్షించి రనియు తెలియుచున్నది.[2] ప్రభువు రాజధానియందు లేనప్పుడు నగరరక్షణభారము సమర్థుఁ డైన సేనానిపై నుంచఁబడును. అట్టి పురరక్షకుఁడు గన్నసేనాని కావున పైవిజయమునం దాతఁడు ప్రముఖపాత్రను నిర్వహించియుండవచ్చును. ఇచ్చట మఱియొకవిషయము గమనింపఁ దగియున్నది. ఓరుగల్లు సమతలప్రదేశమున నిర్మింపఁబడిన భూమిదుర్గము. శత్రువు లాదుర్గము నవలీలగాఁ జుట్టుముట్టుట కవకాశ మున్నది. గిరిజలదుర్గముల కున్న సహజరక్షణ దీనికి లేదు. కావునఁ బురరక్షణోద్యోగము సామ్రాజ్యప్రాణరక్షణము వంటిది. అందుననను బ్రతాపరుద్రదేవ

2. కాకతీయ సంచిక-పుట 74.

భూపతి రాజ్యమునకు వచ్చినతరువాత శత్రువులను జయించుటకై పెక్కుసారు లోరుగల్లునుండి సైన్యములను గొనిదూరదూరప్రాంతములకు వెళ్లినట్లు తెలియుచున్నది. అట్టిపట్టులందును పురరక్షణభార మతిప్రాధాన్యము వహించును. కావునఁ బురరక్షకుఁ డైన గన్నసేనాని గొప్పబాధ్యత కలిగిన యుద్యోగమును రాజుమనసున కెక్కునట్లు పరాక్రమనీతిచాతుర్యములతో నిర్వర్తించె నని స్పష్టమగుచున్నది. అందువలననే యతఁడు ప్రతాపరుద్రునియంతఃపురమును, పురమును, మండలమును రక్షించిన సేనానిగా, నీతియుగంధరునిగా మారనచేఁ గీర్తింపఁ బడియున్నాఁడు.

"సురపురసదృశ కాకతినరపాల కటకపాలన స్థిరశౌర్యా!". (7. 286)
"కాకతిక్షితీశ్వర పురపాలన ప్రకటశౌర్యవిశేషణ!". (8. 288)
"శ్రీకాకతి నృపరాజ్యప్రాకారాయిత భుజాపరాక్రమగణ్యా!". (6. 1)
"శ్రీమత్ప్రతాపరుద్ర మహామండలనాథమండలావనదక్షా!". (2. 1)

అనుసంబోధనలు గన్నసేనాని బహుముఖపరాక్రమమును జాటుచు నాతఁ డోరుగల్లున నుచ్చస్థితియం దున్నట్లు తెలుపుచున్నవి. కావున మారన యాతని నట్టిసమయమున దర్శించుటయు, మార్కండేయపురాణమును గృతి నొసంగుటయు, జరిగియుండు నని భావింప వీలగుచున్నది.

ప్రతాపరుద్రభానుఁడు యవనసైన్యరాహుగ్రస్తుఁ డయిన తరువాత గన్నసేనాని చరిత్రమునుగూర్చి చారిత్రకులలో రెండుభిన్న మైన యభిప్రాయములు గలవు. ఇందు మొదటిది:-యవనులు ప్రతాపరుద్రదేవునితోఁబాటు పెక్కురుసేనానులను, దొరలను, నాయకులను బందీలుగా ఢిల్లీనగరమునకుఁ గొంపోయిరి. వారిలో గన్నసేనానియు కలఁడు; ప్రతాపరుద్రభూపతి తనదుఃస్థితికి దుఃఖించి మార్గమధ్యముననే మృతినొందెను గన్నసేనాని మహమ్మదీయమతమును బుచ్చుకొని ఢిల్లీపాదుషా కొలువునఁ జేరెను. ఆంధ్రసేనానిగా నతని జీవితాధ్యాయ మంతటితో ముగిసి యవనసేనానిగా నొకనూతనాధ్యాయ మారంభ మైనది. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగా రతని యీజీవితాధ్యాయమును గూర్చి యిట్లు పేర్కొనియుండిరి :

"సుల్తాను ఘయాజుద్దీను మృతినొందగా ఉలూమ్‌ఖానుఁడు ఢిల్లీసింహాసనము నెక్కి సుల్తాను మహమ్మదు అనుపేరుతో రాజ్యము చేయ నారంభించెను. ఇతనికి గన్నయసేనాని యన్న నెక్కువయభిమానము. మహమ్మదీయమతము నవలంబించిన పిమ్మట యతనికి మల్లిక్ మక్బూల్ అనునామకరణము చేసి, సుల్తాను అతనిని తన యాస్థానమున నుంచుకొనెను. అటుపిదప జరిగిన కిష్లుఖానునిపితూరి నణచివేసి సుల్తాను మక్బూలును ముల్తానుకు అధిపతిగా నియమించెను. మక్బూలు సుల్తానుమన్ననకుఁ బాత్రుఁ డాయెను. క్రీ.శ. 1334 వ సంవత్సరముప్రాంతమున దక్షిణాపథమున ఢిల్లీసామ్రాజ్యమునకుఁ జెందిన రాష్ట్రము లన్నియు తిరుగుబాటు చేసెను. అందు ముఖ్యముగా మధురయందు కొత్వాలుగా సయ్యదు జలా లనువాఁడు అచ్చట ప్రభుత్వము చేయుచున్న

రాష్ట్రపాలుని, అతనియనుయాయులను గృత్రిమముగా వధించి జలాలుద్దీను హసన్‌షా అనుబిరుదముతో స్వతంత్రుఁడాయెను. వానిని దరుమకొట్టి మధురయందు మఱల స్వాధికారమును పునఃప్రతిష్ఠించుటకై సుల్తాను గొప్పసైన్యముతో దేవగిరిమార్గమున వచ్చి వరంగలు పట్టణము చేరెను. నెలరోజులపర్యంతము అచ్చట నాగి సుల్తానుమహమ్మదు యుద్ధమునకు వలయుసన్నాహములు చేయుచుండఁగా నోరుగంటియం దప్పుడు విజృంభించియుండిన ప్లేగుజాడ్యము అతనిసైన్యమునఁగూడ వ్యాపించి దానిలో మూఁడువంతులు నాశనము చేసెను. సుల్తానుకుఁగూడ ప్లేగు తగిలెను. అతఁడు మృతినొందెనన్న కింవదంతి రాజ్యమునం దంతటను వ్యాపించెను. ఆవార్త తెలిసి పెక్కుస్థలములయం దున్న సర్దారులు అధికారులకు లొంగక తిరుగుబాటు చేసిరి. ఇట్టిపరిస్థితియందు సుల్తాను మధురదండయాత్రను చాలించి దేవగిరికి డోలిలోఁ దిరిగి వెళ్ళిపోయెను. పోవునప్పుడు దేశమునం దున్న కలవరమును శాంతింపఁజేయుటకు తగువాఁడని తలఁచి కాఁబోలు మక్బూలును తెలంగానాకు పాలకునిగా నియమించెను. కాని, మక్బూలు జన్మతః ఆంధ్రుఁడయ్యు, దేశమున పూర్వము చక్కనిపలుకుబడికలవాఁ డయ్యు అన్యమతావలంబనము చేసినకారణమునఁ బ్రజ లాతనికి లొంగరైరి. అతఁడు తనయధికారమును నెగ్గించుకొనఁజాలకపోయెను. కావున సుల్తాను ఢిల్లికి పోయిన కొద్దికాలమునకే ఆంధ్రనాయకుఁడగు కాపయనాయకుని ప్రతాపమున కోర్చుకొనలేక ఓరుగంటిని ఆంధ్రరాజ్యముతోసహా అతని కర్పించి, మక్బూలు ఢిల్లికి పారిపోయెను. అప్పటికిని నతఁడు సుల్తానుఅనుగ్రహమును కోల్పోవలేదు. వెంటనే సుల్తాను అతనిని గుజరాతుకు పాలకునిగా నియమించి, అచ్చటికి బంపెను. సుల్తాను కడపటిరోజుల వఱకును అతఁ డచ్చటనే యుండెను. సుల్తాను తఘి అను పితూరీదారును వెంబడించి సింధుదేశమునకు పోవునప్పుడు అతఁడు రాజ్యసంరక్షణకై ఢిల్లియందు ఏర్పరచిన మంత్రాంగసభయందు మక్బూలు నొకనిగ నియమించెను. సుల్తాను దగ్ధపట్టణమునందు మృతినొందినప్పుడు మక్బూలు ఢిల్లి పట్టణమునం దుండెను. సుల్తాను మహమ్మదుముఖ్యమంత్రి యగు ఖ్వాజాహాను సుల్తాను మహమ్మదుకుమారుని సింహాసనము నెక్కించగా సైన్యాధిపతులు తమసుల్తానుగా ఎన్నుకొన్న ఫిరోజిషాపక్షము నవలంబించి మక్బూలు పట్టణము వదలి సైన్యములతో ఢిల్లిపై వచ్చుచున్న ఫిరోజిషాను గలసికొనెను. అతఁడు మక్బూలును మిక్కిలి గౌరవించి తన రాజ్యాభిషేకానంతరము అతనికి ఖానిజహా నన్న బిరుదు నిచ్చి అతనిని తనప్రధానిగా ఏర్పరచుకొనెను. అదిమొదలు తనమరణముపఱకును ఖానిజహాను ఆపదవియందే యుండి ఢిల్లిసామ్రాజ్యమును కడుజాగరూకతతో కాపాడెను. ఇతఁడు రాజనీతిజ్ఞుఁడు. రాజు పట్టణము విడిచి దూరదేశములకు యుద్ధమునకు బోవునప్పుడు ఈతనియందుఁగల నమ్మకముచేత సుల్తాను ఫిరోజిషారాజ్యము నతని కప్పజెప్పి పోవువాఁడు ఖానిజహాను అఖండ వైభవము ననుభవించి పుత్రపౌత్రులను బడసి వృద్ధుఁ డయినవెనుక తనయధికారమును తనకుమారుని కప్పగించి క్రీ.శ. 1372-73లో మృతినందెను." [3] ఈవిధముగా

3. భారతి-బహుధాన్య మాఘము.

గన్నయ మతాంతరుఁడైనపిదపఁగూడ పురరక్షకుఁడుగను, రాజ్యరక్షకుఁడుగను యవన భూపతులచే మన్ననలను, బిరుదావళులను గడించి నీతిచతురుఁడైన వీరసేనానిగా జీవితము గడిపెను.

డా. మారేమండ రామారావుగారు ప్రతాపరుద్రదేవుఁడు క్రీ. శ. 1323 వసం॥-1327వ సం॥ల మధ్య ఆంధ్రపాలకుఁడుగా నున్నట్లు శాసనాధారము లున్నవని చెప్పుచు, అకుంఠితరాజభక్తియుక్తు లగు నాంధ్రసేనానులయవక్రపరాక్ర మాయాంధ్రభూజానిని యవనులబారినుండి రక్షించియుండు నని భావించియున్నారు. ఏక్రవర్తిసేనానులలో నొకఁ డగు రేచర్ల సింగమనాయునికి "రాయబంబీవిమోచక" యను బిరు దుండె ననియు, నాగయగన్నసేనాని "నీతియుగంధరుఁ" డని మారనచేఁ గీర్తింపఁబడి యుండె ననియు, వీరిరువురి నీతిచాతుర్యమే యాంధ్రప్రభువును మఱల నోరుగంటికి సురక్షిత ముగాఁ దెచ్చియుండు ననియు, ప్రతాపరుద్రుని యుగంధరమంత్రి ఢిల్లీచక్రవర్తిచెరనుండి తప్పించినవిధముపై నాంధ్రదేశమున వ్యాపించియున్నకథలో కొంత సత్య ముండవచ్చు ననియుఁ దలఁచియున్నారు.[4] ఈయంశము తగినన్నిచారిత్రకాధారములతో నిరూపింపఁ బడుచో గన్నయసేనాని ప్రభుభక్తికిని నీతివైశారద్యమునకు ఉజ్జ్వలనీరాజనము కాఁగలదు. మొత్తమున కాసేనాని యాంధ్రదేశమునకు, ఆంధ్రప్రభువునకును జేసినసేవ నేటికిని స్పష్టముగాఁ దెలియవచ్చుట లేదు. కాని ఆంధ్రసాహిత్యమునకును, ఆంధ్రకవి వతంసమునకును ఒనర్చిన యుదార మైనసేవ యక్షయ మై రసజగత్తున విహరించు చున్నది.

మారనమహాకవి గన్నయసేనాని ప్రతాపరుద్రకటకపాలునిగా మాత్రమే కాక సుందరాకారునిగను, భామినీచిత్తచోరునిగను నిరహంకారునిగను, కళాచతురునిగను, నయాభిజ్ఞునిగను, బుధబంధువుగను పేర్కొనెను. ఇవియన్నియు నొకయెత్తు. అతనిని దానకర్ణునిగను, హరిహరాద్వైతభక్తిభావునిగను వర్ణించుట మఱియొకయెత్తు. "గన్న" యనుపదము "కర్ణ" యను పదమునకు వికృతిరూప మని సూచించి, మారన "నాగయ కర్ణా !" (3.1) "కలియుగకర్ణా !" (6.262) అని గన్నయను గీర్తించియున్నాఁడు. కవి పండితకల్పభూజము కావుననే మహాకవుల కాశ్రయకల్పుఁ డైనాఁడు. గన్నయ దాన కర్ణుఁ డగుటవలన మాత్రమే మారన యతని నాశ్రయించినట్లు కానరాదు. హరిహరనాథ భక్తుఁ డగు తిక్కనసోమయాజికి శిష్యుఁ డగు మారన హరిహరపాదసేవనవశంవద చిత్తుఁ డైన యుత్తముఁ డనియే గన్నయసేనానిసాన్నిహిత్యము నభిలషించె నని భావింప వలనుపడుచున్నది. మారన గన్నయసేనానిలోని యీభక్తిభావాంశమునే విపులముగా నాశ్వాసాంతపద్యములందు నిబంధించి కీర్తించియున్నాఁడు.

"విష్ణుభక్తిపరిగ్రహా !" (2.343)
"నితాంతభక్తినముపాసితరుద్ర !" (3.393)

4. కాకతీయసంచిక - పుట 79.

"గాఢభజన సుప్రసన్నగరుడవృషాంకా !" (3.394)
"శ్రీకంఠరుచిరచరణాబ్జాకరసంతతవిహారహారి
మరాళాలోకస్తుత్యసుశీలా !" (4.1)
"హృత్కమల స్ఫురద్భవా !" (6.262)
"హరిపదనిహితాత్మా !" (6.264)
"భావస్ఫురితభవానీ శ్రీవనితాధీశ !" (7.1)
"శ్రీకంఠాకుంఠికకరుణాకల్పలతాప్రభూతనానార్థఫల
స్వీకారధన్య !" (8.1)
"శ్రీకంఠశ్రీశభృత్య !" (8.289)

అను సీసంబుద్ధుల క్రమపరిశీలనమువలన గన్నయసేనానిచిత్తపరిపాక పరిణామదశలు స్పష్ట మగుచున్నవి. భక్తిపరిగ్రహణము, నితాంతభక్తిభావనము, గాఢభజనము, భావసమాధి, దైవప్రసన్నము, భక్తిఫలసిద్ధి - అనునవి గన్నయమంత్రి క్రమముగా సాధించిన భక్తాధికారములు. శ్రీకంఠశ్రీశభృత్యుఁ డయి అద్వైతసిద్ధి వడయుట యతనిచిత్తపరిపాకమునకు చిట్టచివఱి సోపానము. అట్టి యుత్తమాధికారి యగు గన్నయసేనానియే మారనమహాకవి నాకర్షించియుండును. అతనిచేత మార్కండేయమును వినిపించుకొనియుండును !

## ప్రథమాంధ్రమహాపురాణావిర్భావము :

మార్కండేయపురాణ మాంధ్రీకరింపఁబడుటకుఁ గృతికర్తకృతిభర్తలయిచ్ఛయే కాక సమాకాలీనసాంఘికమతసాహిత్యపరిస్థితులును బలమైన కారణము లైనవి. ఒకవిధముగాఁ బ్రాచీన ప్రసిద్ధాంధ్రకావ్యము లన్నియు నవి వెలయునప్పటి వైన యేవేని సాంఘికమతాదిప్రయోజనములను సాధించుటకొఱకై సంలక్షింపఁబడినవే. వానియందలి శాశ్వతములును విశ్వజనీనములు నైన రసభావాదులవలన నవి సహృదయోపాస్యము లై తత్కాలప్రయోజనములు సాధించుటయే కాక కలకాలము బ్రదుకుచు సార్వకాలీనప్రయోజనములుకూడ సాధించుచున్నవి.

పదునాలుగవశతాబ్ది యుదయించుటకు దాదా పొకటిరెండుదశాబ్దుల పూర్వమే తిక్కయజ్వ మహాభారతమునందలి విరాటపర్వ మాదిగాఁ బదునేనుపర్వము లాంధ్రీకరించి, నన్నయ చేపట్టిన యుద్యమమును గొనసాగించెను. తాను రచించినభాగములు హరిహరనాథదేవున కంకిత మొనరించెను. నాటిమతపరిస్థితులను దర్శించుట కీరెండు సంఘటనలును విశిష్టవాతాయనములవలెఁ దోడుపడుచున్నవి.

తిక్కన మహాభారతరచనకుఁ బూర్వము-
"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా
పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్

కిం కాలకూటః కిము వా యశోదా
స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే".

అని భగవంతునిఁ బ్రశ్నించుచు నొక శ్లోకము విరచించె నఁట! దానిని భగవంతుఁడు గాథాచరముతో వినినాఁడఁట! తాను హరి యనియో, హరుఁ డనియో తేల్చిచెప్పక హరి హరనాథమూర్తి యై తిక్కనకు స్వప్నమున సాక్షాత్కరించినాఁడఁట; కృతి నభ్యర్థించి నాఁడఁట! తిక్కన తనపుట్టువు కృతార్థత వడసినట్లు భావించి కావ్యము రచించి యా దేవున కంకిత మిచ్చినాఁడు. విరాటపర్వారంభమున నాదేవునిఁ బరతత్త్వముగా నిట్లు కీర్తించినాఁడు:

"శ్రీ యన గౌరి నాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తి యై హరిహరం బగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమ శ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వము గొల్చెద నిష్టసిద్ధికిన్"[5]

ఇందు మొదటిశ్లోక మాంధ్రదేశమున వీరవైష్ణవమతస్థులు "పరివాదాస్పదవాదమోద మదిరాపానంబుచే మత్తులై హరి మే లంచుహరుండు మే లనుచు[6]" గ్రుద్దులాడుకొను విషాదసన్నివేశములను గన్నులారఁ గాంచి, క్షుభితుఁడై తిక్కన నిర్వేదముతోఁ బర మాత్మకు నివేదించుకొనినది. రెండవపద్యము సమకాలీనసాంఘికమతపరిస్థితుల నన్నింటి పైఁ గొంతయధికారము సంపాదించి, సంఘమును తనవాక్కుచేఁ బ్రభావితము చేయఁగల యౌన్నత్యము గడించి విశ్వశ్రేయోరూప మైన వైదికమార్గము నొక విశిష్టధర్మాద్వైత దృష్టితోఁ బ్రతిపాదించిన యుపదేశవాక్యము. ఈరెండును వెలసిన కాలముల స్వరూప స్వభావముల నవియే వ్యంగ్యముగాఁ జెప్పుచున్నవి. అం దొక స్పష్టమైన పరిణామము కానఁబడుచున్నది. ఆపరిణామమును దర్శించినవాఁడు, దానికై కృషి సలిపినవాఁడు తిక్కన. పదుమూఁడవశతాబ్ది యుత్తరార్ధమున సాంఘికమతసాహిత్యరంగములం దపూర్వ ప్రభావమును వైచి దేశమును వైదికమతాభిముఖముగా నడిపించిన మనీషి, తత్త్వవేత్త ఆకవిబ్రహ్మ. అతనిప్రభావము మార్కండేయపురాణావతారరంగస్థల మైన యోరుగల్లుపైఁ గూడఁ గలదు. అది యివ్వు డిచ్చట ప్రస్తుత మగుచున్నది.

కాకతిగణపతిదేవునకుఁ దిక్కన సమకాలికుఁడు; నెల్లూరు నేలు మనుమసిద్ధి భూపాలుని మహామంత్రి. తనప్రభువుచేత "మామా" యని పిలిపించుకొని, కావ్యకన్యకొఱ కడిగించుకొని, నిర్వచనోత్తరరామాయణకావ్యము నతని కంకిత మిచ్చిన యుదారుఁడు. అక్కనబయ్యన లను దాయాదులు మనుమసిద్ధిని మోసగించి సింహాసనము నాక్ర మించి, యతనిని రాజ్యభ్రష్టునిగా నొనర్చినప్పుడు నీతికౌశల్యము వెలయున ట్లోరుగల్లు నకు వెడలి తనపాండిత్యప్రాభవముచే గణపతిదేవుని మెప్పించి, యతనిసాయమున

5. ఆంధ్రమహాభారతము - విరాటపర్వ. 1.
6. ఉత్తరహరివంశము - అశ్వా. 2. పద్య. 68.

నెల్లూరును సాధించి, పగతుర నడంచి. ప్రభునకు ప్రభుత్వ మిప్పించిన నీతిధురంధరుఁడు తిక్కన: అపారశిష్యసంతానమునకు జ్ఞానభిక్ష పెట్టుచు కవికుమారులకు మహాకవిత్వ దీక్షల నుపదేశించుచు, వైదికమార్గనిష్ఠ మగు వర్తనము నొప్పిదముగా నిర్వహించుచు హరిహరభేదము లేని యద్వైతభక్తిఁ జిత్తతమునఁ బండించి, సోమయాజి యై పంచమ వేదము నాంధ్రావళి మోదముం బొరయునట్లు తెనుఁగుబాస వినిర్మించిన యుభయకవి మిత్రుఁడుతిక్కన్న. అతఁ డొకమహామంత్రిగనే గాక, ఒక యాధ్యాత్మికసంస్థగా నాకాల మునఁ దేజరిల్లి వైదికమతము నాంధ్రమునఁ బ్రకాశింపజేసిన మహాజ్యోతి:

నన్నయ మహాభారతరచనము చేపట్టునాటికి వేంగిదేశమున జైనబౌద్ధమతముల ప్రాబల్యము తగ్గిపోయినది. బౌద్ధులు ప్రాచీనమైన హీనయానమును విస్మరించి, మూర్తి పూజాబహుళమైన మహాయానము నాశ్రయించి, గౌతమబుద్ధుని వైష్ణవదశావతారములలో నొకనిగాఁ బరిగణింప నారంభించిన హిందూమతమునందుఁ గ్రమముగా లీనము గాఁజొచ్చిరి. కాని, కన్నడదేశమునందును తెలంగాణమునందును జైనమతప్రాబల్య మంతగా నడలలేదు. అందులకు ఆప్రాంతముల నేలురాజులు తూర్పుచాళుక్యులవలె వైదికమతావలంబులు కాకపోవుటయే ప్రధానకారణము. అనుమకొండలోఁ గాకతీయ సామ్రాజ్యస్థాపనము సుమారు పదునొకండవశతాబ్ద్యారంభముననే మొదటిబేతరాజు చేసి యుండెను. అతఁడు జైనమతావలంబిగాఁ గనవచ్చుచున్నాఁడు. అతనితరువాతివాఁ డగు మొదటిప్రోలరాజు జైనుఁడే. కాకతీయప్రభువులలో మొట్టమొదట శైవము నవలంబించిన వాఁడు రెండవబేతరాజు. అతఁడు పరమమాహేశ్వరుఁ డని కీర్తింపఁబడినాఁడు. అతఁడు 11వశతాబ్దిచరమపాదమునఁ బాలనకు వచ్చినాఁడు. అప్పటినుండియు నోరుగల్లునందు శైవమున కధికప్రాబల్య మేర్పడినది. అది శైవజైనమతములసంఘర్షణకు దారితీసినది. గణపతిదేవచక్రవర్తి వీరశైవాచారదీక్షావ్రతుఁ డగుటచే జైనులను, వారిమతమును గ్రూరముగ హింసించినట్లు తెలియుచున్నది. తిక్కన యోరుగల్లు దర్శించినప్పుడు ఆరాజు జైనబౌద్ధులతో సోమయాజిని వాదు చేయించెనఁట: తిక్కన వారి నోడించి వైదికమత మును స్థాపించెనఁట: అప్పుడు గణపతిదేవుఁడు ''జినసమయార్థుల శిరములం దునిమె'' ననియు, 'విద్వేషబౌద్ధుల విలుమాడె' ననియు సిద్ధేశ్వరచరిత్రవలనఁ దెలియుచున్నది. ఓరుగల్లుపతనమునకు జైనమతస్థుల పగయు నొకకారణ మని చారిత్రకులు భావించు చున్నారు. ఇట్లు కాకతీయులపాలనమున నోరుగల్లులో రాజమతముగా దాదా పొకశతాబ్ది వెలసిన జైనము తనపూర్వగౌరవము నిలుపుకొనుటకొఱకు మఱియొకటిన్నరశతాబ్దుల కాలము శైవమతముతో హోరాహోరిగాఁ బోరుచు సంతరించిన దని భావింపవచ్చును. అందును తిక్కనసోమయాజి గణపతిదేవునిసభలో జైనబౌద్ధముల నోడించుటతో నామతముల కోరుగల్లులో నడుము విరిగి మఱల లేవలేనిదైన్యావస్థ యేర్పడె ననునంశము ముఖ్యముగా నిచ్చట గమనింపఁ దగినది.

అవైదికము లైన జైనబౌద్ధములస్థానములను శైవవైష్ణవము లాక్రమించినవి. బసవేశ్వరప్రోక్త మైన శైవము కన్నడదేశమునుండియు, రామానుజప్రోక్త మగు వైష్ణ

వము దక్షిణదేశమునుండియు వచ్చి యాంధ్రమున వ్యాపించి యాధిపత్యమునకై పరస్ప రము ప్రయత్నించినవి. ఈరెండుమతములకును భక్తి మూలాధారము. శైవులు శివుఁడు దైవ మనియు, వైష్ణవులు విష్ణువే దైవ మనియు భావించి, అన్యదేవతాశ్రవణదర్శనాదుల నుజ్జగించి, అన్యమతావలంబులను గర్హించి, స్వీయమతచిహ్నము లైన లింగధారణ, ముద్రాధారణాదులవంటి బాహ్యాచారములం దధికప్రామాణ్యభావము నుంచి లింగము దాల్చిన జంగముని, ఊర్ధ్వపుండ్రము దాల్చిన భాగవతుని భగవంతునిజంగమాత్మక రూపముగా భావించి, పూజించి స్వీయమతాభినివేశమును బ్రకటించిరి. బ్రాహ్మణమతమునం దున్న చాతుర్వర్ణ్యవ్యవస్థను వీరు స్వీకరింపక వర్ణభేదనిర్మూలనమునకు కృషిచేసిరి. అందువలన వీరిమత మనతికాలములోఁ బ్రజాదరణఁ బొందఁ జాలినది. ప్రజాబాహుళ్య సంపాదనార్థము శైవవైష్ణవమతములు జ్ఞానవిశిష్టమైన భక్తికంటె మూఢమైన భక్తినే ప్రధానముగాఁ బ్రతిపాదించినవి. దానివలన శివకేశవభేదదృష్టి ప్రబలి పరస్పరవివాదము లకు దారితీసినది. దీనికిఁ బల్నాటియుద్ధము ప్రబలతార్కాణము,

శైవము వైష్ణవముకంటె నావేశప్రధాన మైన మతము. శైవేతరులను శైవులు భవు లని పిలిచి. వారి దర్శనస్పర్శనాదులను బరిహరించిరి. ఆత్మరక్షణార్థమై శైవులు ఖడ్గములను ధరించిరి. శివునియనుగ్రహము సంపాదించుటకై యొడలు నరకుకొనుట, నేత్రోత్పాటనము చేసికొనుట, మొదలైన సాహసకార్యముల నొనర్చి తమభక్తిభావము లను బ్రకటించుచుండిరి. శివాపరాధి యైన సుతుఁ డైనను క్షంతవ్యుఁడు కాఁడు. అపరాధ మిసుమంత యైనను మరణమే దండనము. ఇంతటి తీవ్రమతము శైవము. శైవమునకుఁ బ్రత్యర్థిగా నిలచినవైష్ణవము కూడ కొన్ని తీవ్రలక్షణముల నలవఱచుకొనుట తప్పినది కాదు. వీరిరువురు తమలో తాము దైవము పేరిట తగవులాడెడివారు. వీరిరువురు కలసి బ్రాహ్మణులను దూయఁబట్టెడివారు. తిక్కన యీమతములలోని వైదికమతాచార విలువ్తిని, భేదదృష్టిని, మూఢభక్తిని గర్హించెను. వేదముల పరమప్రామాణ్యభావము నకుఁ బ్రాధాన్య మిచ్చెను. వైదికమార్గనిష్ఠ మగు వర్తనమువలన హరిహరాభేదరూప మగు భక్తి కుదురు నని ప్రబోధించెను. సాకారస్వరూపముల వెనుక నిర్గుణమై అద్వి తీయమై భాసించు పరతత్త్వము నెఱుంగు జ్ఞానమే భేదము లేని భక్తి యని చాటిచెప్పెను. హరిహరభేదదృష్టి జ్ఞానమువలన నశించును; జ్ఞానవిరహితమైన మూఢభక్తి భేదరూప మైన కాలుష్యమును హృదయమునఁ బెంచును; తత్కాలుష్యపరిక్షాళనమువలన మాత్రమే చిత్తమునందు నిర్మలవృత్తి యేర్పడును. దానివలన భక్తుఁడు భగవత్పాదనిరంతర స్మరణతత్పరభావము పొందఁగలఁడు. అది యాత్మానందసంధాయకము కాఁగలదు. ఇట్టి జ్ఞానమార్గము నాశ్రయించి తిక్కన, భేదదృష్టిని వరించి పెనగులాడుచున్న శైవ వైష్ణవములకెదురు నిలిచెను. కాని, వారిపై విజృంభింపలేదు. నయకోవిదుఁడై వారిభేద దృష్టికి విరుగుడు పెట్టెను. హరిహరాత్మక మైన పరతత్త్వమును జూపి, వారికి జ్ఞానదృష్టి ప్రసాదించెను. పంచమవేద మైన మహాభారతము ననువదించి వేదహృదయమును సుహృత్సమ్మితముగా లోకమునకు బోధించెను. ఆవేగముతో నురుకులెత్తు రెండుమత

వాహినులకు నేర్పుగా జ్ఞానవారధి కట్టి, వానిని వేదక్షేత్రముల వైపు మళ్ళించెను మహాభారతరచన చేపట్టుటవలనను, హరిహరనాథదేవుని( గల్పించుట వలనను తిక్కన యీశాంతివిప్లవమును దేశమున సాధింప(గలిగెను.

తిక్కనగారి జ్ఞానప్రధానమైన భక్తిమార్గ మోరుగల్లుప్రభువులకును, దండనాథులకును, పండితవర్గమునకును నూతనోత్తేజమును గల్గించె నని భావింప వీలగుచున్నది. గణపతిదేవు(డు జైనబౌద్ధములను హింసించినప్రశంస కానవచ్చుచున్నది. కాని, తాను శైవు(డై యుండి వైష్ణవమతస్థులను హింసించినట్లు కానరాదు. రుద్రమదేవియు, ప్రతాపరుద్రప్రభువును పరమతసహనము నపూర్వముగా నవలంబించియుండిరి. వీరికాలములలో వీరశైవమతాభినివేశము గల పాలకురికి సోమనాథునివంటి కవులు, మహిమాన్వితులైన యుపాసకు లనేకులు ప్రజావాహినిని దమశక్తియుక్తులచే నాకర్షించి, యెడనెడ ప్రభువులచే( బూజల నందియున్నను కాకతీయప్రభువులను వీరశైవమతాభివివేశులనుగా మాత్రము మార్ప(జాలకపోయిరి. అది యాప్రభువుల విజ్ఞతకును, వివేకమునకును దార్కాణము కాకతీయదండనాథులలో గన్నసేనాని వైదికమార్గము ననుసరించి అష్టాదశమహాపురాణాదుల నెన్నింటినో చదివెను. పండితులచే వానికి వ్యాఖ్యానములు చెప్పించుకొనెను. సాహిణిమార(డు రామాయణకావ్యనిర్మాణమునకు దోహదము కల్పించెను. ఇందులూరి అన్నయమంత్రి పాల్కురికి సోమనాథుని గౌరవించి, ప్రోత్సహించెను. సామంతు( డగు గోన బుద్ధారెడ్డి ద్విపదరామాయణకావ్యరచనకు( గారకు( డయ్యెను. ప్రతాపరుద్రు(డు వీరియత్నములను గాదనలేదు. పైపెచ్చు శ్రీకంఠశ్రీశభృత్యు( డైన గన్నయ్యకు పురపాలకత్వము నిచ్చెను. అతనితమ్ముని( దనకుడిభుజముగా నిలుపుకొనెను. కాకతీయ రాజ్యపతనానంతరము స్వతంత్రించిన రెడ్డిప్రభువులుకూడ మతసహనమును బ్రకటించి, కవిత్రయములోని యెఱ్ఱనను గౌరవించిరి. మహాభారతభాగమైన హరివంశమును గృతి( గొనిరి. ఆపైన శ్రీనాథుని నాదరించిరి. ప్రభువు లేమతస్థులైనను హరిహరాద్వైతమతదృష్టి నలవఱచుకొని పరిపాలనము సాగించిన విజ్ఞతయు, మతాచార్యులయందును, ప్రజాసామాన్యమునందును గాన(బడు నావేశప్రధానమును మూఢమునైన భక్తిభావము ప్రభువుల నావేశింపకుండినవివేకమును తిక్కన యాయుగమున వెదజల్లినవిజ్ఞానసౌరభములకు ఫలములే యనుట సత్యదూరము కా(జాలదు.

అట్టిమహనీయు( డైన తిక్కనకు శిష్యు(డు మారన. కర్మమార్గమును, భక్తిమార్గమును జ్ఞానఫలోన్ముఖముగా ననుసంధించుట నీశిష్యు(డు గురువర్యునియొద్ద నేర్చెను. గన్నయసేనాని మారన నందువలననే యభిమానించెను. అతనిని( "బరమవిజ్ఞానాశ్రయంబైన మార్కండేయాఖ్యపురాణమును దెను(గుసేయు మని వేడెను. అసంఖ్యాకములైన పురాణములలో మార్కండేయము పరమవిజ్ఞానప్రద మగుటచే గన్నయ నాకర్షించెను. అట్టి జ్ఞానతృష్ణ గన్నయకు( దిక్కనశిష్యుని సాహచర్యమువలన లభించియుండును. గన్నయతలంపు అతిసూక్ష్మ మనియు, నతినిర్మల మనియు, నతిహిత మనియు, అత్యంత

ధర్మార్థసంగత మనియుఁ గీర్తించి, తత్పురాణరత్నము సెప్పుటచే తనజన్మ ఫలించె నని మారన తలంచెను. సజాతీయభావప్రవాహములు గల కోవిదులు కావున వారిరువురి తలంపు లోకమహాప్రయోజనము వైపు కలసి సాగినవి. దీనినిబట్టి ఓరుగల్లులో సోమయాజి నాటిపోయిన వైదికధర్మోద్ధరణోద్యమవృక్షము ప్రతాపరుద్రునికాలము నాటికి వేరూని పెరుగుటయేగాక తచ్ఛిష్యాదుల దోహదములచేఁ బుష్పించి ఫలించిన దని స్పష్ట మగుచున్నది.

తిక్కన మహాభారతరచనాప్రభావ మాతరువాతి వాఙ్మయజగత్తుపై సుస్పష్టముగాఁ గానవచ్చుచున్నది. తిక్కనప్రశస్తి యతనిసమకాలీనసాహిత్యమునందే వినవచ్చినది. అతరువాత తెనుఁగునఁ గవిత్వము వ్రాయనేర్చిన ప్రతికవియు నాసోమయాజిభారతికి నమస్కరించినాఁడు. తిక్కనప్రభావము సాహిత్యముపైఁ బహుముఖములుగాఁ వ్యాపించినది.

తిక్కన వైదికమతావలంబమును జతుర్విధపురుషార్థజ్ఞానప్రదమును నైన పంచమ వేదము ననన్యశేముషీభాగంధర్యముతో ననువదించుటచే నెఱ్ఱాప్రెగ్గడ—

మ. "తనకావించినసృష్టి తక్కొరులచేతంగాదు నా, నేముఖం
బునఁ దా బల్కినవల్కు లాగమము లై పొల్పొందు నావాణి న
త్తను నీతం డొకరుండు నాఁ జను మహత్త్వ ప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం గవి తిక్కయజ్వ నిఖిలోర్వీదేవతాభ్యర్చితున్."

అని హరివంశపీఠికలో నుతించినాఁడు. నన్నయగారి ప్రసన్నకథాకలితార్థయుక్తియు, నన్నెచోడుని ప్రౌఢప్రబంధవర్ణనానైపుణ్యమును మేళవించి కవితాశిల్పదృష్టికిఁ బుష్టిఁ గల్పించి భారతము నపూర్వప్రబంధమండలిగా నిబంధించినాఁడు తిక్కనసోమయాజి. చంపూలక్షణవిశిష్టమైన మార్గకవిత్వములో నత్యున్నతకవితాశిఖరముల నందుకొనినాఁడు. మేరుశిఖరతుల్యుఁడైన తిక్కనకు నాటికిని నేటికిని దీటగుమహాకవి వెలసియుండలేదు. కావుననే యతఁడు చేపట్టి పూర్తిచేసిన మహాభారతమున కాంధ్రసాహిత్యమున నద్వితీయ స్థాన మేర్పడినది. తెలుఁగుదేశము భారతమునే వేదముగాఁ బఠించినది. తిక్కనగా రందు నిబంధించిన హరిహరాద్వైతము నాస్వాదించినది.

మహాభారత మిట్లు మతదృష్టితోడను, కావ్యకళాదృష్టితోడను దేశము నాకర్షించు చుండుట గమనించి కాబోలును అథర్వణాచార్యులు తానును మహాభారతరచనోత్సాహియై విరాటోద్యోగభీష్మపర్వముల ననువదించెను. అతఁడు జైనాచార్యుఁ డని కొందఱును, బ్రాహ్మణుఁ డని కొందఱును జెప్పుచున్నారు. తిక్కనగా రోరుగల్లులో జైనము నోడించెను. అతఁడు మహాభారతమును గైకొని వైదికమతమును వ్యాపింపఁజేయ సంకల్పించెను. దీనిని గమనించిన అథర్వణుఁడు కన్నడమునఁ బంపాదులు నిర్మించినట్లు జైన మతాభిముఖముగా భారతమును నిర్మింపఁబూని యుండవచ్చునేమో! అట్లయినచో తిక్కన

చూపిన వేదప్రామాణ్యము నంగీకరించు నాంధ్రదేశము అవైదికమైన జైనముతోపాటు తద్రచనమునుగూడ సాదరముగా గ్రహింపకపోయి యుండవచ్చును.

తిక్కన భారతాంధ్రీకరణము సంస్కృతకావ్యనాటకములను రచించిన కొందఱు సమకాలీనాంధ్రకవులనుగూడ ప్రేరేచి మహాభారతేతివృత్తములు గల కృతులను జేపట్టునట్లు చేసినట్లు కానఁబడుచున్నది. అగస్త్యుఁడు (అమరచంద్రకవి) అనుకవి బాలభారతమును రచించెను. సిద్ధనాథుని తనయుఁడైన గంగాధరకవి మహాభారతమును నాటకరూపమున రచించెను. ఇతఁడు మహావిద్వాంసుఁడనియు, అపరవ్యాసుఁడనియు కాదంబరీనాటకకర్త యైన నరసింహకవియు, మధురావిజయకవయిత్రి గంగాదేవియుఁ గీర్తించియుండిరి. గంగాధరుని పుత్త్రుఁడైన విశ్వనాథకవిమాతులుఁడగు నని యాతనిసౌగంధికాపహరణమువలనఁ దెలియనగుచున్నది. అగస్త్యుఁడే విద్యానాథుఁడనియుఁ భావించుచున్నారు. ఇట్టిపండితవంశమువారు రెండవప్రతాపరుద్రదేవునికి సమకాలీనులై తమ కావ్యరచనము గావించినవారే. కావున నీకాలమున మహాభారతేతివృత్తమునుగాని, దానితో నెట్టిసంబధమైనను గల వృత్తమునుగాని గైకొని కావ్యరచనము చేయవలె నని సంస్కృతాంధ్రకవులలోఁ గొందఱు భావించుచుండి రనియుఁ దలంపవచ్చును. ఆంధ్రకవులలో నెఱ్ఱాప్రెగ్గడయు, నాచనసోముఁడును హరివంశానువాదమునకుఁ బూనుకొనుటయు నొకవిధముగాఁ దిక్కనప్రభావమునకు లోఁబడియే యనుట సత్యదూరము కాఁజాలదు.

తిక్కనసోమయాజిశిష్యులలో మహాకవిగాఁ బ్రసిద్ధి చెందినవాఁడు మారన. అతఁడు మార్కండేయమహాపురాణరచనము చేపట్టుటకుఁగూడ పైనజెప్పిన తిక్కనప్రభావమే దోహదమై యుండవచ్చును: మహాభారతప్రశస్తితో నారంభించి, యందలిశంకాపంచకనివారణముతో నుపక్రమించి, శాంతిపర్వములోని మేధావ్యుపాఖ్యానమునకు విస్తృతరూపమైన జడోపాఖ్యానము ననుసంధించుకొని ముందుకుసాగిన మార్కండేయపురాణము మహాభారతప్రశస్తికి పతాకప్రాయ మని వెనుక నిరూపింపఁబడినది. తిక్కనశిష్యుఁ డట్టి పురాణము చేపట్టినప్పుడే యౌచిత్యము కలదు. మఱేపురాణము చేపట్టినను మారన గురుఋణము తీర్చియుండెడివాఁడు కాఁడు.

మారన మార్కండేయపురాణము చేపట్టుటకు మఱికొన్నికారణములు కూడ చెప్పవచ్చును. ఒకటి: వేదధర్మప్రతిపాదకము లైన ప్రాచీనసంస్కృతసాహిత్యప్రక్రియల నాంధ్రమునం దనువదించుటవలన వైదికమతప్రాబల్యమును దేశమున వ్యాపింపఁజేయవచ్చునను నుద్యమము. రెండు: పాలకురికి సోమనాథుఁడు నిర్మించిన వీరశైవబసవపురాణము అనాద్యము, అప్రమాణము నను వైదికమతస్థుల యభిమతమున కనువుగాఁ బ్రాచీనమును, ఆర్షమును, జ్ఞానప్రధానము నైన పురాణము ననువదించి మహాపురాణసంప్రదాయమును సంస్థాపింపఁదలంచుట. మూఁడు: ద్విపదచ్ఛందమున కావ్యరచనము సాగించుచున్న శైవవైష్ణవకవుల శుద్ధదేశిమార్గమును బరిత్యజించి, నన్నయచే నారంభింపఁబడి, తిక్కనచేఁ బుష్టిమంత మొనర్పఁబడిన చంపూకావ్యరచనమున కధికప్రాబల్యము కల్పించి, మార్గకవిత్వమునకుఁ బ్రాచుర్యము కల్పింపఁ బూనుట. నాలుగు: ప్రత్యేక

దేవతాకమైన మహాపురాణమును జేపట్టక హరిహరాద్యనేకదేవతలకు సమప్రాధాన్య మిచ్చిన పురాణమును జేపట్టి తిక్కన ప్రారంభించిన హరిహరాద్వైతరూప మగు వేద ధర్మప్రబోధమునకుఁ బ్రాచుర్యము కల్పింపఁబూనుట. ఐదు : సమకాలీనసాహిత్యరంగమున నున్న కావ్యరచనాప్రక్రియల నన్నింటిని దనయందు నిమిడ్చుకొనియున్న గ్రంథమును గ్రహించి తెలుఁగునఁ బ్రథమమహాపురాణమును దీర్చిదిద్దవలె ననెడి విశిష్ట ప్రయత్నము.

వేదార్థోపబృంహితము లైన స్మృతిపురాణేతిహాసములలో నన్నయతిక్కనలు ఇతిహాసముల ననువదించుటకు మార్గము వైచిరి. మహాభారతమునే పురాణాదులకంటె మున్నుగా నెన్నుకొనుటకు తిక్కన తద్గ్రంథప్రామాణ్యమునే హేతువుగాఁ జూపించెను.

కం. వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వా దైన చోటులను దా
మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.[7]

చతుర్వర్గసంబంధము లైన ధర్మసూక్ష్మములను, ధర్మసమన్వయములను బ్రతిపాదించునది మహాభారతము. అవి వేదతాత్పర్యోపబలకములుగునే యుండును. వేదధర్మార్థములను భారతమేకాక స్మృతిపురాణములుగూడ బ్రతిపాదించుచున్నవి. కాని, యవి శాస్త్రగ్రంథములు. దానియం దున్న రసభావసంపత్తి వానియందు లేదు. నన్నయతిక్కనలు రసదృష్టులు. కావున వారిని శాస్త్రకావ్యమైన భారత మాకర్షించినది. అయినను భారతరచనాప్రయోజనము సంపూర్ణముగా సాధింపఁబడవలె నన్నను, వైదికధర్మసంస్థాపనము సుస్థిరము కావలయు నన్నను సంస్కృతసారస్వతమునందు వెలసియున్న స్మృతిశాస్త్రములు, పురాణములుకూడ తెలుఁగున రావలెను. తిక్కనమనీషి యీయంశమును గుర్తించి తనకు సన్నిహితు లై యున్న కవికుమారులచే నాయుద్యమములు వ్యాపింపఁ జేయ సంకల్పించి యుండవచ్చును. విచిత్ర మేమన- తిక్కనకు దశకుమారచరిత్రను కృతి నిచ్చిన మూలఘటిక కేతన విజ్ఞానేశ్వరీయ మను ధర్మశాస్త్రగ్రంథమును రచించెను. అది యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యాగ్రంథ మగు మితాక్షరి కాంధ్రానువాదము. తిక్కనశిష్యుఁడైన మారన మార్కండేయపురాణము నాంధ్రీకరించెను. వీ రిరువురును దిక్కనకు సన్నిహితులు కావున వారిశాస్త్రపురాణరచనలు తిక్కనగారి వైదికమత ప్రచారమహాప్రణాళికలోఁ గాలాంతరమున రూపుగొన్న సాహిత్యప్రక్రియా సాధనములని యూహింప వలనుపడుచున్నది. మఱియును, "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభే త్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి" అను సాంప్రదాయార్థములుకూడ వేదార్థాన్వయమున కితిహాసపురాణపరిజ్ఞాన మవసర మని చెప్పుచున్నవి.

---

7. ఆంధ్రమహాభారతము - విరాటపర్వ. ప్ర. 4.

కావున పురాణవిజ్ఞానము నాంధ్రజాతి కనువదించి చెప్ప మొదలిడిన మారన నన్నయ తిక్కనలవలెనే వైదికమతోద్ధరణమునకుఁ గృషిచేసిన మహనీయుఁ డగుచున్నాఁడు.

సంస్కృత మహాపురాణములు వైదికమతమునకుఁ బట్టుకొమ్మలై అన్యమత ఝంఝామారుతముల కెదురొడ్డి నిలిచినవి. జైనబౌద్ధాదిమతస్థులీవాఙ్మయమున కున్న ప్రజాదరణమును గమనించి తమతమమతములందును నిట్టిపురాణవాఙ్మయమును దేశీయ భాషలలో నిర్మింపఁదొడఁగిరి. అవి మతప్రచారమున కత్యంతసులభోపకరణములుగాఁ దోడుపడినవి. ఈమార్గమునే యాతరువాత శైవవైష్ణవమతస్థులును అనుసరించిరి. తెలుఁగున వెలసిన మొదటివీరశైవపురాణము "బసవపురాణము". తత్కర్త పాలకురికి సోమనాథుఁడు. ఇతఁడు కాకతీయప్రభువులైన మొదటిప్రతాపరుద్రుని సమకాలీనుఁ డని కొందఱును, రెండవప్రతాపరుద్రునికి సమకాలికుఁ డని మఱికొందఱును భావించుచున్నారు. వీరిలో రెండవప్రతాపరుద్రునికాలముననే నీమహాకవి నివసించియుండె నని అనేకులు విశ్వసించుచున్నారు. ఎట్లయినను బసవపురాణము మార్కండేయముకంటె ముందు రచింపఁబడినదే యగుచున్నది. శైవు లాపురాణమును మహాపురాణములవలె దేవాలయములలోఁ జదువుచుండిరి.

"ఒకనాడు శివభక్తు లోరగంటను స్వయం
భూదేవు మండపమున వసించి,
బసవపురాణంబు పాటించి వినువేళ
హరునిఁ గొల్వ ప్రతాపుఁ డచటి కేగి
ఆసంభ్రమం బేమి యనుడు భక్తులు బస
వనిపురాణం బర్థి వినెద రనిన
విని యాపురాణంబువిధ మెట్లొకో యన్న
ధూర్తవిప్రుఁ డొకండు భర్తఁ జేరి
పాలకురికి సోమపతితుఁ డీనడుమను
పెనచె మధ్యవఖ్ల పెట్టి ద్విపద
యప్రమాణం బిది యనాద్యంబు పద మన్న
నరిగె రాజు"

—(పిడపర్తి సోమనాథుని బసవపురాణము)

పిడపర్తి సోమన రచించిన యీపద్యము ననుసరించి యోరుగల్లులో బ్రసవపురాణము వైదికమతస్థులచే సమాదరింపఁబడ లేదని స్పష్టమగుచున్నది. విప్రులు దాని నప్రమాణ మనియు, అనాద్య మనియు గర్హించిరి. వేదార్థబృంహితము కాదు కావునను, జ్ఞానప్రధానముకాని భక్తికి ప్రాధాన్య మిచ్చిన దగుటచేతను, ద్విపదచ్ఛందోనిబంధనమున కవిస్వాతంత్ర్యము వహించియుండుటచేతను నాపురాణ మప్రమాణ మని త్రోచిపుచ్చిరి. అందు వర్ణింపఁబడినవృత్త మతిప్రాచీనము కాకపోవుటచేతను, సర్గప్రతిసర్గాదిపురాణ

లక్షణవిశిష్టము కాకపోవుటచేతను, అది యార్షము కాకపోవుటచేతను, దేవభాషయందుఁ దొలుతఁ జెప్పఁబడమిచేతను అది యనాద్య మని తృణీకరించిరి. బసవపురాణము నిట్లు వ్యతిరేకించినవిప్రులు శైవులకు ధూర్తులే కావచ్చును గాని ప్రతాపరుద్రునికిమాత్రము విశ్వాసపాత్రు లని యతఁడు తత్పురాణమును వినక వెడలిపోవుటయే చెప్పక చెప్పు చున్నది. అనఁగాఁ బ్రతాపుఁడు శైవుఁ డయ్యును అర్షమును, వేదప్రమాణజన్యమును, జ్ఞానప్రధానమును నైన వైదికమతమును గౌరవించుచుండె ననియు నట్టి వైదికమత మోరుగల్లురాజకుటుంబమున సుస్థిరస్థానము నాక్రమించి యున్న దనియు స్పష్ట మగు చున్నది.

వైదికమతావలంబ మైన మార్కండేయపురాణావిర్భావ మోరుగల్లుప్రభువుల చిత్తములకు విరుద్ధము కాదు. రాజమతానుకూల మనినను సత్యదూరము కాదు. పరిపాల కులయభిమతములే సేనానుల యభిరుచులయందుఁ బ్రతిబింబించుట సహజముకదా! కావున వీరశైవులపురాణము లధునాతనము లనియు, నప్రమాణము లనియు వెక్కిరించుట కెత్తిన పురాణధ్వజ మిది. ద్విపదచ్ఛందమును వీడి నన్నయతిక్కనలు తీర్చిదిద్దిన చంపూకావ్యపద్ధతిలో గద్యపద్యాత్మకముగాఁ జెప్పిన పురాణ మిది. మారన యిట్లు పూరించిన మహాపురాణశంఖారావము తరువాతితరములవారికి పురాణానువాదస్వీకారోత్సా హమును రేకెత్తింపఁజేసినది. భాగవతాదిమహాపురాణము లోరుగంటిరంగస్థలమున వెల యుట గమనింపఁదగినయంశము! కాని, వీరశైవపురాణరచనము పాలకురికి సోమ నాథునితరువాత మందగించినది. పిడపర్తి సోమనాథాదులు ద్విపదపురాణములనే మఱల చంపువులుగా వ్రాసికొనవలసివచ్చెను. దీనినిబట్టి చూడ దేశీయచ్ఛందమునందు విరచింపఁ బడిన వీరశైవపురాణవాఙ్మయమునకుఁ బ్రతిగా మార్గకవిత్వమున వైదికపురాణము ననువదించుటయే మారనపురాణరచనోద్యోగ పరమతాత్పర్యము!

మారన మహాపురాణములలో మార్కండేయమునే యేల ఎన్నుకొనెను! - అను ప్రశ్న యుదయించును. మార్కండేయ మాంధ్రుల కభిమానగ్రంథ మైన మహాభారతము యొక్క తత్త్వానుశీలనముతో ప్రారంభ మగుచున్నది. తిక్కనగారిభారతము చదివి, తన్మహత్త్వప్రతిపాదక మైన యీపురాణము నెత్తుకొనుటకు జాతి యుత్సాహము ప్రకటించును. అందువలన మారన మార్కండేయము నెత్తుకొనెను. అంతేకాదు, మార్కండేయము బ్రహర్షినామముపై వెలసిన యేకైకమహాపురాణము. దానియం దేప్రత్యేకదైవమున కధికప్రాధాన్య మీయఁబడలేదు. హరిహరచతురాననార్కాగ్నిదుర్గావనజాసరస్వత్యాదుల మాహాత్మ్యములు యథావకాశముగా నం దభివర్ణింపఁబడియున్నవి. కావున నీపురాణము చేపట్టుటవలన తిక్కన హరిహరాద్వైతమున కపారబలము సేకూరినది. చాతుర్వర్ణ్య సిద్ధాంతము, సదాచారవిధానము, పుణ్యపాపఫలవివేకము, వేదవిహితకర్మాచరణము, అష్టాంగయోగాదివిధులు, బ్రహ్మజ్ఞానసాధనము, దార్శనికమతానుగుణమైన సృష్టివిధా నము, ధర్మశాస్త్రనిర్మాత లైన మనువులచరిత్రములు, ప్రజాహితతత్పరులును ధర్మాను రక్తులు నైన సూర్యవంశచక్రవర్తులచరిత్రములు — ఇవియన్నియు వైదికమతప్రబోధ

నాత్మకములే. వర్ణవ్యవస్థలను నిర్మూలించి ధర్మశాస్త్రవిహితము లైన వైదికాచారములను, కర్మకాండను సంఘమునందు సమయింపఁ జేయుచున్న వీరశైవాదిమతములనుండి జనుల నుద్ధరింపఁ దోడుపడెడి పురాణార్థములే యివి. మఱియును కాకతీయులకాలమున దుర్గాపూజయుఁ గొంత ప్రాముఖ్యము వహించియుండుటచే సప్తశతియు దేవ్యుపాసకుల నాకర్షించుట కుపకరించె నని భావింప వీలగుచున్నది. ఇట్టిమార్కండేయపురాణమా 14వ శతాబ్దితొలిపాదమునందలి యోరుగంటిమతసాంఘికపరిస్థితులను వైదికమతాభిముఖముగా నుద్ధరింప సమర్థమై యుండుటచేతను, తిక్కనయభిమతమున కది యవిరుద్ధమగుటచేతను మారన యాపురాణమునే ప్రత్యేకించి యనువదింపఁ జేపట్టె నని భావింపవలనుపడుచున్నది.

మారన సమకాలీనసాహిత్యప్రక్రియలను సూక్ష్మదృష్టితోఁ బరిశీలించి వానిలక్షణములలోఁ బెక్కింటిని ప్రతిబింబించుకొనఁగలిగిన పురాణము నెన్నుకొనుటకు సంకల్పించి మార్కండేయమును జేపట్టినట్లు కానఁబడుచున్నది. ఈమహాకవికాలమునాటికి తెలుఁగున మహాభారతేతిహాసము, రామాయణాదిమహాకావ్యములు, కుమారసంభవాది వస్తుకావ్యములు, దశకుమారచరిత్రాది కథాకావ్యములు, సర్వేశ్వరసుమతీశతకాదులు, విజ్ఞానేశ్వరీయాది ధర్మశాస్త్రములు, పురుషార్థసారాదులవంటి రాజనీతిశాస్త్రములు, శైవకవులపురాణములు, భక్తచరిత్రములు, స్తవములు, ప్రసిద్ధసాహిత్యప్రక్రియలుగా నున్నవి. వీనిలక్షణము లీమహాపురాణమునం దీక్రిందివిధముగాఁ బ్రతిబింబితము లయ్యె నని చెప్పవచ్చును. ఇతిహాసము పురాణాంతర్భాగము. సూర్యవంశచరిత్ర మితిహాస మనఁబడును. హరిశ్చంద్ర కువలయాశ్వచరిత్రములను బ్రత్యేకముగాఁ బరిగణించినచో స్వయంసమృద్ధము లైన కావ్యముల వలె భాసింపఁగలవు. కుమారసంభవాదికథల వలె మనూత్పత్తిగాథ లీపురాణమునందు విపులముగా వర్ణింపఁబడియున్నవి. మార్కండేయపురాణము నంతటిని స్థూలముగా గమనించినచో నొకరసవత్కథాహారమువలె శోభించుచున్న దని వెనుక చెప్పఁబడినది. కావున కథాకావ్యలక్షణము లిందు సహజముగా భాసించుచున్నవి. ఇఁక మకుటవిశిష్టము లైన స్తుతులు, స్తోత్రములు, దండకములు, నీతిమతరాజకీయాదులకు సంబంధించినసూక్తులు, దత్తాత్రేయుఁడు, శివకేశవులు, సూర్యాగ్నులు, దుర్గాసరస్వతులు మొ.దేవతలను సేవించి తరించిన భక్తులచరిత్రములు - ఇవియన్నియు మార్కండేయమునఁ గలవు. కావున నీపురాణము హరిహరాద్వైతసమన్వయదృష్టితోడనే గాక తత్కాలసర్వవాఙ్మయప్రక్రియాసమన్వయదృష్టితోడను విశిష్టప్రాముఖ్యమును వహించుచు పురాణపురుషునియందు బ్రహ్మాండమువలెఁ బురాణమునందు సాహిత్యప్రక్రియా జగత్తంతయు నిమిడియుండఁగల దను తత్త్వమున కాదర్శప్రాయ మైనది.

మారన మార్కండేయపురాణము నిట్లెన్నియో ప్రయోజనముల నుపలక్షించి యనువదించెను. పురాణపీఠికలో "సరససాహిత్యసౌరభసంవాసితం బగు" తదీయ "హృదయపయోరుహంబునం దపూర్వకావ్యరచనాకుతూహల మధులిహంబు విహరించుచుండ" మార్కండేయము ననువదించె నని చెప్పుట గమనించినచో నీపురాణరచనా

ప్రక్రియ తెలుఁగునఁ బూర్వము లేదనియు, నూత్నమును, నమోఘమును నైన దనియు కవియే గుర్తించి చిత్తశుద్ధితో నుపక్రమించి నిర్మించె నని స్పష్టము కాఁగలదు.

ఇట్లు ప్రథమాంధ్రమహాపురాణరచన మారన చేపట్టి సమర్థముగా నిర్వహించుటచే సమకాలీనకవుల కీతఁ డాదర్శప్రాయుఁ డైనాఁడు. క్రీ. శ. 14వ శతాబ్దియందు వెలసిన కమలనాభామాత్యుఁడు (శ్రీనాథునిపితామహుఁడు) పద్మపురాణసంగ్రహమును, ఆతరు వాత మడికి సింగన పద్మపురాణోత్తరఖండమును, భాగవత దశమస్కంధమును దెనిఁ గించిరి. పశుపతినాగనాథుఁ డనుకవి విష్ణుపురాణము నీశతాబ్దమునం దనువదించె నని తెలియుచున్నది.[8] మారనకు చివరిరోజులలో సమకాలికుఁ డైన యెఱ్ఱాప్రెగ్గడ హరి వంశమును, నృసింహపురాణమును అనువదించెను. ఇట్లు మారన శ్రీకారము చుట్టిన పురాణవాఙ్మయరచనోద్యమము అనతికాలములోనే యత్యంతప్రాచుర్యము చెంది ప్రథ మాంధ్రమహాపురాణకర్తయొక్క గౌరవము నినుమడింపఁజేసినది.

## గురు - శిష్యులు :

మారనమహాకవియొక్క తండ్రియును, గురువును సనామధేయు లగుట యొక విశేషము. తిక్కనామాత్యపుత్త్రుఁడ నని మారన చెప్పుకొనుటచేఁ గొంద ఱితఁడు మనుమ సిద్ధిభూపాలుని ప్రధానామాత్యుఁడును, ఆస్థానకవియు నై గణుతి కెక్కిన తిక్కన యొక్క పుత్త్రుఁడే యని తలంచిరి. కాని, యమాత్యశబ్దము నియోగిబ్రాహ్మణకులవాచక ముగాఁ బేర్కొనుప్రసిద్ధి తెలుఁగునాటఁ గలదు కావున మారనతండ్రి నియోగిబ్రాహ్మణుఁ డని మాత్రమే యాబిరుదవాచకమున కర్థము గ్రహింపవలె నని విమర్శకులు భావించు చున్నారు.[9]

గురువగు తిక్కనను 'ఉభయకవిమిత్రుఁ' డనియు, 'సోమయాజి' యనియు మారన కీర్తించెను.

కం. అభినుతుఁడు మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుం డై తా
నుభయకవిమిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రి తిక్కఁడు దాల్చెన్.[10]

అని మూలఘటిక కేతన చెప్పినాఁడు. దశకుమారచరిత్ర కృతిగొనునాటికి తిక్కన సోమయాజి కాలేదు. ఆకావ్యమునందు తిక్కన మహాకవిగను, మహానైష్ఠికుఁడుగను, మహా మంత్రిగను, దండనాథుఁడుగను గీర్తింపఁబడినాఁడు. తిక్కన మనుమసిద్ధిభూపాలుఁడు దివంగతుఁ డైన తరువాత మంత్రిపదవి నుజ్జగించి సోమయాజి యై మహాభారతరచనా

8. ఆంధ్రకవితరంగిణి - 4 సంపు. పుట 147.
9 ఆంధ్రకవితరంగిణి - 3 సంపు. పుట 163.
10. దశకుమారచరిత్ర - పీఠిక. 92 పద్య.

వ్యాసంగమున జీవితశేషమును గడపినట్లు తెలియుచున్నది. నిర్వచనోత్తరరామాయణ కావ్యగద్యలో "బుధారాధనవిధేయ తిక్కననామధేయ" యనియు, భారతగద్యలో "బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి" యనియుఁ బేర్కొనఁబడియుండుటచే మహాభారత రచనాకాలమునఁ దిక్కనకు "సోమయాజి" బిరుద మన్వర్థమై యున్న దనియు స్పష్టమగుచున్నది. మారన మహాకవి మార్కండేయపురాణపీఠికలోఁ దిక్కన నిట్లు స్తుతించెను :

"చ. ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలు సంవిహితాధ్వరక్రియా
ప్రభు బుధబంధు భూరిగుణబంధురు భారతసంహితాకథా
విభుఁ బరతత్త్వబోధను నవీనపరాశరసూను సంతత
త్రిభువనకీర్తనీయయశుఁ దిక్కకవీంద్రునిఁ గొల్తు నర్థితోన్."

(అవతారిక. ప. 10)

ఇందును తిక్కనగారి సంస్కృతాంధ్రోభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలత్వమును మారన మొదట కీర్తించెను. ఉభయకవిత్వము లనఁగా మార్గదేశికవిత్వము లనియు, పద్యచంపూ కవిత్వము లనియు భావించెడివా రున్నారు. అధ్వరక్రియాప్రభు వనుటచే నతని సోమయాజిత్వము నావైన ధ్వనింపఁ జేసినాఁడు మారన. బుధబంధు వనుటచే మారనవంటి పండిత కవుల నవ్యాజవాత్సల్యముతో దరికిఁ దీసి యభిమానము నొలుకఁబోసినాఁ డని తెలియుచున్నది. భూరిగుణబంధురుఁ డగుటచే 'గుణాః పూజాస్థాన' మ్మనున్యాయమునఁ బూజ్యకక్ష్యకుఁ జెందిన పవిత్రమూర్తి యనియు, భారతసంహితాకథావిభుఁ డనుటచే నాతఁడు భారతానువాదము ముగించె ననియు, పరతత్త్వబోధనుఁ డనుటచే విరాటపర్వారంభమునఁ జెప్పిన హరిహరాత్మకమైన పరతత్త్వమును భారతగ్రంథమునఁ జెప్పఁబడిన మోక్షజ్ఞానమును బోధించుటయం దత్యంతాసక్తిఁ జూపువాఁ డనియు, నవీనపరాశరసూనుఁ డనుటచే మహర్షితుల్యుఁ డనియు, నారాయణసన్నిభుఁ డనియు ధ్వనింపఁజేసి, త్రిభువనకీర్తనీయ యశుఁ డనుటచే నాతనిమహిమౌన్నత్యము నుగ్గడించి, తిక్కనకవీంద్రుఁ డనిచెప్పుటచే నక్షరజగత్తున నతనిమహాకవిమూర్తిని స్మరించి మారన యర్థితో నమస్కరించినాఁడు.

మారన తిక్కనను గీర్తించినవిధమును బరిశీలించినచో వారిరువురికి నున్న గురుశిష్య సంబంధము నూహించుటకుఁ గొంత వీలుపడుచున్నది. తిక్కన యుభయకవిమిత్రుఁడై మనుమసిద్ధిసభలో నుజ్జ్వలుఁడై ప్రకాశించుచున్నసమయముననే మారన తిక్కన నెఱుంగును. బహుశః తిక్కన గణపతిదేవునిసాయమున మనుమసిద్ధిని నెల్లూరిగద్దెపై పునః ప్రతిష్ఠించిన తరుణమున మారన తిక్కనశిష్యత్వము స్వీకరించియుండవచ్చును. మారన తనవైదుష్యముచేతను వైదికసదాచారసంపత్తిచేతను తిక్కనహృదయమున కెక్కి యతని వాత్సల్యమునకుఁ బాత్రుఁడై యుండును. తిక్కన సోమయాజి యైనప్పుడును, భారత సంహితాకథావిభుఁ డైనప్పుడును మారన యతని సన్నిధానమునందే వసించి తన్ముఖ వినిర్గతపరతత్త్వబోధామృతమును దమిమీఱఁ గ్రోలుచు నతనినే యపరవ్యాసావతార మని

యెంచి సేవించి కృతార్థుఁడై యుండును. తిక్కన పరమపదించినతరువాత స్వీయ కుటుంబపోషణార్థమై యాంధ్రమహానగర మైన యోరుగంటి కేగి యచ్చట స్థిరనివాస మేర్పఱచుకొని యుండవచ్చును.

మారన తాను తిక్కనసోమయాజిప్రసాదలబ్ధ సరస్వతీపాత్రుఁడ నని చెప్పుకొనెను. కాని, దానిని వివరించి చెప్పలేదు. సరస్వతి వాగధిదేవత. కావ్యరచమున దానిని కవి వాగ్వృత్తి యనవచ్చును. అట్టిదానిని తిక్కననుండి మారన పొందఁగలిగెను. మారన మార్కండేయపురాణపీఠికలో సరస్వతి నిట్లు కీర్తించినాఁడు.

"ఉ. ఆరయ నొక్కభంగిన రహస్యపుఁజోటను రాజసన్నిధిన్
సూరిసభాంతరంబులను జొన్పడి తప్పక గద్యపద్యముల్
దొరలు పేర్చినట్లు మదిఁ దోపఁగఁ జేయుట సంతతంబు నా
భారమె కాదె వీని కను భారతి మాకుఁ బ్రసన్న మయ్యెడున్."

(అవతారిక. ప. 5)

ఈపద్యమువలన భారతి మారనమహాకవికి నిత్యప్రసన్న యై యున్నట్లు స్పష్టమగుచున్నది. అతఁడు బ్రాహ్మీదత్తకవిత్వశక్తియుక్తుఁడనియు, నిరర్గళధారామధుర మైన కవిత్వము చెప్పఁగలఁడనియుఁ దేఁటపడుచున్నది. బంగారమునకుఁ దావి యబ్బినట్లు సహజకవి యైన మారనకు తిక్కనశిష్యత్వము ప్రాప్తించినది. ఏకాంతమునందును, రాజసభలయందును, పండితపరిషత్తులయందును గద్యపద్యములు దొరలు పేర్చినట్లుగాఁ జెప్పనేర్చెడిశక్తియు, నవకాశములును లభించినవి తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణమునందు నిర్వచనకవిత్వము వెలయించినను మహాభారతరచనావసరమున గద్యపద్య రచనాశీలి యైనాఁడు. పాండిత్యప్రకర్షకంటె కవిత్వపరమార్థమే ముఖ్య మని తిక్కన భావించినాఁడు. మారనయుఁ దిక్కననుండి యీయంశమును గ్రహించినాఁడు. అంతటితో నాగక సోమయాజినుండి కవిత్వశిల్పకళారహస్యముల నెన్నింటినో గ్రహించి పుక్కిట పట్టినాఁడు. ఇదియే తిక్కననుండి యీతనికి లభించిన సారస్వతాంశము. దానితో నాశువునఁగాని, లేఖినితోఁగాని నిరాఘాటముగాఁ గవిత్వము చెప్పినాఁడు. పైపద్యములోఁ బేర్కొనిన రాజసన్నిధానము, సూరిసభలు నెల్లూరివేకాక, ఆపైన నోరుగంటివికూడ కావచ్చును. హుళక్కి భాస్కరాదులవలె మారనయు ప్రతాపరుద్రుని మెప్పించియుండ వచ్చును. ప్రభువును, సేనాపతులును జరిపించు విద్యాగోష్ఠులలోఁ బాల్గొనియుండ వచ్చును! నానాపురాణవిజ్ఞానసౌరభము నాయాసభలయందు గుబాళింపఁజేసియుండ వచ్చును. పురాణవాఙ్మయసుధాపిపాసి యైన గన్నసేనానిహృదయము నాకర్షించి యుండ వచ్చును! దీని కంతటికిని మూలము తిక్కన్నగారియంతేవాసిత్వమున నేర్చిన కావ్య కళారహస్యములు! పరతత్త్వబోధనలు! కృతజ్ఞతాబంధురుఁడైన మారన యీవిషయ మును గద్యయందు నిబంధించి చెప్పుకొని యౌచిత్యమును కృతజ్ఞతను బ్రకటించు కొనినాఁడు.

# మారన అనువాదపద్ధతి

ప్రాచీనాంధ్రకావ్యకర్తలు సంస్కృతకావ్యములను దెలుఁగుసేయునెడఁ బ్రధానముగా మూఁడువిధము లైన యనువాదపద్ధతుల ననుసరించినట్లు విమర్శకులు గుర్తించుచున్నారు. "అం దొకటి కథానువాదపద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలగ్రంథమునందలి కథను గ్రహించి, యందలి వివిధసన్నివేశములను విడువకుండ వర్ణనాదులను రసపోషణమును దన యిచ్చవచ్చిన ట్లొనరించుచు రచన సాగించును. ఇందు మూలమునకును అనువాదమునకును గథావిధానమున మాత్రమే సన్నిహితసంబంధము కానిపించును. మిగిలిన రసభావవర్ణనాదులం దించుక మూలకర్త యాత్మీయత కంటె ననువాదకర్త యాత్మీయతయే యధికముగా గోచరించును. అందుచే నిది నామమున కనువాదమయ్యును స్వభావమున స్వతంత్రగ్రంథమువలెనే కానవచ్చును. రెండవది భావానువాదపద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలమునందలి కథనే కాక భావములను గూడ సన్నిహితముగా ననుసరించును. ఇందు మూలకర్త వెలువరించినభావముల నుచితమైనభాషలో సుందరమైన శైలిలో స్పష్టముగా వ్యక్తముచేయుటయందే యనువాదకర్త నైపుణ్యము గోచరించును. ఈపద్ధతియందుఁ గథాఘట్టములు కాక భావములు లేక వానిని వెలువరించు వివిధశ్లోకాదులు ప్రమాణముగా (unit) స్వీకరింపఁబడును. ఇది యంత యతిస్వతంత్రమును అతివిధేయమును గాని మధ్యస్థపద్ధతి. ఇందు మూలకర్తభావములన్నియు సమగ్రముగా వ్యక్తముచేయఁబడినను అతఁడు వాడిన పదము లన్నిటికిని బర్యాయపదములు కనఁబడకపోవచ్చును. మూఁడవది పదానువాదపద్ధతి. ఇందు మూలమునందలి కథాభావములే కాక పదములుకూడ బ్రమాణములుగా గ్రహింపఁబడును. మూలస్థపదములన్నియు నిం దనువదింపఁబడును ఇది మూలమున కతివిధేయమైన పద్ధతి. ఇందు మూలమునందలి పదమునకుఁ బదము వేయుటకంటె భాషాంతరీకర్త స్వాతంత్రత యేమియు గోచరింపదు. ఆంధ్రవాఙ్మయమునఁ బై మూఁడుపద్ధతులకును ఉదాహరణములు గోచరించుచున్నవి. కవిత్రయమువారిపద్ధతి కథానువాదమునకును, శ్రీనాథాదులది భావానువాదమునకును, ఆధునికనాటకానువాదకులది పదానువాదమునకును నిదర్శనములని చెప్పవచ్చును."[1]

మారనమహాకవి మార్కండేయపురాణమును భావానువాదపద్ధతి ననుసరించి తెనుఁగుసేసెను. అట్లు చేయుట కాయనువాదపద్ధతి పురాణరచనమున కనుకూల మైన

1 నన్నయభారతము - డా. దివాకర్ల వేంకటావధానిగారు. పుట. 52౩.

దని మారనయభిప్రాయము కావచ్చును! అసలు నేర్పుగలకవి వస్తుతత్త్వమునుబట్టి యనువాదమార్గమును నిర్మించుకొనును. కవిత్రయమువారును మహాభారతము గథానువాదపద్ధతిలో ననువదించిరి. సంస్కృతభారత మితిహాసము. అందు శాస్త్రవిషయములు బహుళముగాఁ బ్రవర్తిల్లినను, ఏకరసాభిముఖ్యము గల విస్తృతేతివృత్తము కలదు. కవిత్రయమువారు రసదృష్టులు. వారు సంస్కృతభారతముయొక్క కావ్యత్వమునకుఁ బ్రాధాన్యము గల్పించి, శాస్త్రత్వమును దాని కుపాంగముగా భావించిరి. మూలమున విస్తృతము లైయున్న శాస్త్రాదివిషయములను గుదించి, సారవివక్షతో గ్రహించుచు, రసభావాదిప్రపంచనమున స్వీయప్రతిభావిశేషములఁ జూపించుచు భారతమును రసబంధురముగా నిర్మించిరి. మహాకవులకావ్యశిల్పము లనంతముగా నుపజీవింపఁగల సారపద్వృత్తము గల కావ్యకల్పకము మహాభారతము! కావున నన్నయాదులు దానినిఁ గథానువాదపద్ధతి ననుసరించి తెలుఁగుచేసిరి. పురాణ మితిహాసమువలెఁ గాదు. అం దేకరసాభిముఖ్యము గల బృహద్వస్తువు కానరాదు. బహుధా పరిచ్ఛిన్నమైనవస్తువు పురాణమునఁ బొడకట్టుచుండును. అందును హృదయాకర్షకములైన యుపాఖ్యానములసందడి యధికముగా నుండును. కాని, యవియన్నియుఁ బ్రాయికముగా నాయాధర్మోపదేశలక్ష్యలక్షితములై పురాణపరమప్రయోజన మగు బహుశాస్త్రవ్యుత్పత్తి కుపాంగములై యొప్పారుచుండును. పురాణము శాస్త్రీకదృష్టి. అందు రస మానుషంగికము. మారన చేపట్టినది పురాణము. అం దుపాఖ్యానములు కోకొల్లలుగాఁ గలవు. శాస్త్రార్థములు సుసంపన్నములుగా నున్నవి. నిజమునకు మారన యారెండింటిని సమదృష్టితో ననువదింపవలెను. కాని, యతఁ డట్లు చేయలేదు. శాస్త్రము కథవలెఁ బఠితకు ఆస్వాదసౌఖ్యము నీయదు అందువలననే నన్నయాదులు అనువాదముచేయుపట్ల మూలమునందలి శాస్త్రభాగమును బాగుగా తగ్గించుచు వచ్చిరి. మారనయు నామార్గము ననుసరించి మార్కండేయమున శాస్త్రాంశములను సాధ్యమైనంత తగ్గించెను. కాని, యుపాఖ్యానములలోని రసభావములను మాత్ర మెచ్చటను విడిచియుండలేదు. వీలున్నచో వివేకముతోఁ గథార్థములను బోషించియో, పెంచియో, క్రమబద్ధ మొనర్చియో, మధురతర మొనర్చియో పఠితలహృదయముల నాకర్షించి రమింపఁజేయుటకు మారన తనకవితాశక్తిని వినియోగించెను. పురాణారామమునందు శాస్త్రోపదేశసౌరభము చెడకుండ కథాశిల్పసుమవైభవమును సంరక్షింపవలె నన్న మారనకు భావానువాదపద్ధతియే యుపాదేయమైనది.

మూలమున సంస్కృతభాషలోఁ దద్భాషాసంప్రదాయానుకూలమైన వాక్యాదిరచనావిన్యాసములతోఁ దత్కర్తృవ్యక్తిత్వ ముట్టిపడునట్లు భావములు ప్రపంచింపఁబడియుండ ననువాదమునఁ దెలుఁగుపలుకుబడి కనువైన రచనామర్యాదతో, ఛందోవైవిధ్యముతోఁ దత్కర్తవ్యక్తిత్వ ముట్టిపడునట్లు రమణీయమైన శైలిలో నవేభావములు పునర్వ్యక్తీకరింపఁబడుట భావానువాదప్రధానలక్షణము! మూలమునందును, అనువాదమునందును బొదగట్టుభావము లొక్కటే యయ్యును నవి యావిష్కరింపఁబడువిధమున రెంటింటిమధ్య భేదము కొట్టవచ్చినట్లు కనఁబడుచుండును. ఉదా:

శ్లో. 'అన్యై రపి సురై ర్దేవీ భూషణై రాయుధై స్తథా
సమ్మానితా ననాదోచ్చైః సాట్టహాసం ముహుర్ముహుః॥' 79.31

అను శ్లోకమును మారన యనువదించిన విధము :

''మ. సురదత్తాయుధ రత్నభూషణ పరిస్ఫూర్జత్ప్రభాజాలవి
స్ఫురదుద్యద్భుజదివ్యదేహ నిబిడాంశు ల్పర్వి భూదిఙ్నభోం
తర మెల్ల న్వెలిగింప నత్యధికరౌద్రస్ఫూర్తి నద్దేవి ని
ష్ఠురహాసోద్భటసింహనాదము జగత్క్షోభంబుగాఁ జేసినన్॥." 6.78

దుర్గాదేవి రౌద్రాట్టహాస మొనర్చెనను భావము రెండింటను సమానమే. కాని యాభావము నావిష్కరించిన విధమున మాత్రము భేదము కలదు. అది మొట్టమొదట శైలియందుఁ గలదు. అనువాదమునందలి యోజోగుణభూయిష్ఠమైన రచనము రసభావోద్దీపకమైనది. పరుషసరళస్థిరాకారముల సంయోజనము, ఉష్మాక్షరసన్నివేశము, సరళరేఫాక్షరప్రాసము హాససింహనాదముల సరళపారుష్యములను వ్యంజింపఁజేయుచుఁ బఠితృహృదయనేత్రమునకు విభావవిస్ఫూర్తిఁ బ్రత్యక్షీకరించుచున్నది. భావ మనువాదకున కాలంబనప్రాయమైనది. మఱియుఁ నూతగొని యాటవికవీరుఁడు కుప్పించి సెలయేళ్ళను దాటునట్లు అనువాదకర్త మూలమునందలి భావముల నాధారముగాఁ గొని స్వీయప్రతిభతో రసజగత్తులను దరించుచుండును. మూలమున రేఖామాత్రముగా నున్నభావ మనువాదమునఁ గవి వాగ్వ్యుత్పత్తిచేఁ బుష్టిమంతమై పరిపూర్ణస్వరూపమునఁ బ్రత్యక్షమగుచుండును. మారన రచనమున సర్వత్ర యిట్టిలక్షణము కలదు. దానిని మారన యీపురాణపీఠికలోని 17వ పద్యమున సూచించియున్నాఁడు. "వచియింపు తెనుంగున న్వచఃశ్రీవిభవంబు పెంపు విలసిల్లఁగ" నని గన్నసేనాని మారనమహాకవి విశిష్టవాగ్వ్యుత్పత్తినిఁ బ్రత్యేకముగాఁ బ్రశంసించుటలోఁ దత్కృవిరచనలో మధురమైన శైలి కున్న ప్రాధాన్యము వ్యంజింపఁబడుచున్నది. దానివలన జగజ్జనములు ప్రకాశితసారకథామృత మొగిఁ ద్రావి యలరుటయుఁ, గోవిదులిచ్చమెచ్చి సంభావన సేయుటయు జరుగుచున్నవి. 'కథామృత'మను రూపకసమాస ప్రయోగముచే నాస్వాదమధురమైన కథాసముదాయ మీపురాణమునఁ గల దనియుఁ, 'ప్రకాశిత' మను విశేషణముచే మూలమునందు నిగూఢముగా నున్న రసభావాదిసంపద యనువాదమున సుప్రసన్న మొనర్పఁబడిన దనియుఁ, 'నొగిం ద్రావ' ననుటచే నది సంలక్ష్యాసంలక్ష్యక్రమవ్యంగ్యముచే వ్యంజింపఁబడి యాలోచనామృతమై యనుభూత మగు ననియు మారన తెలియఁజెప్పినాఁడు. మఱియు 'చారుగుణభాస్వర' యను సంబుద్ధియందు మారనరచనలోని గుణప్రాధాన్యము వ్యంజిత మగుచున్నది. మూలాతిశయములైన వృత్తులు, శయ్యలు, గుణములు రసానుకూలములై మారనరచనమునఁ గూర్పఁబడుటచేఁ గావ్యమర్మజ్ఞులైన పండితు లాతనిని సంభావనసేయుదురు: కావున భావానువాదకుని మహిమ భావసంగ్రహణమునందుఁ గాక భావావిష్కారపరిపోషణములందే పరినిష్ఠిత మగునని తాత్పర్యము :

కవిత్రయమువారిది కథానువాదపద్ధతి యంటిమి! మారనకు నన్నయతిక్కనలు పూర్వులు, గురుతుల్యులు. వారియనువాదపద్ధతి నంతటిని దనపురాణమునఁ బట్టించు కొనకపోయినను వారియనువాదకళయందలి పెక్కు మెళకువలను మాత్రము మారన గ్రహించి యున్నాఁడు. కాగా భావానువాదపద్ధతి కాచార్యపీఠ మని విమర్శకులచేఁ గీర్తింపఁబడు శ్రీనాథుఁడు హర్షనైషధకావ్యమును- "అశేషమనీషిహృదయంగమంబుగా శబ్దంబు ననుసరించియు, నభిప్రాయంబు గుర్తించియు, భావం బుపలక్షించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబుఁ బరిహరించియు, మాతృకానుసారంబుగా" ననువదించె నని చెప్పుకొనెను. కావున శ్రీనాథుఁడు చెప్పినవన్నియు భావానువాదపద్ధతియందుఁ బాటించు నంశము లని గ్రహించుటలో విప్రతిపత్తి లేదు. మారనయనువాదపద్ధతియందునుఁ బై యంశములు కానఁబడుచున్నవి.

ఒకకవి యొకయనువాదపద్ధతి ననుసరించి యొకకావ్యము ననువదించె ననఁగా నది ప్రాధాన్యవివక్షతోఁ జెప్పినమాటయే యగును. కథానువాదపద్ధతి నాశ్రయించిన కవిత్రయమువారి రచనలందును భావశబ్దానువాదముల కుదాహరణములు కోకొల్లలుగా విమర్శకులు చూపుచున్నారు. కావున, మారన భావానువాదపద్ధతి ననుసరించె ననఁగా నీపురాణమున నాపద్ధతి ప్రధానముగా ననుసరింపఁబడిన దనియే తాత్పర్యము! మూలాతిశయముగా వర్ణనాదులను రసభావాదులను బెంచి స్వతంత్రరచనమువలె శిల్పసుందరముగా రచించినఘట్టము లీపురాణమున లేకపోలేదు. కాని, యవి పరిమితముగానే కానఁబడు చున్నవి. ధర్మనీతిశాస్త్రాదులకు సంబంధించినభాగములందుఁ గొన్నింట శబ్దానువాద పద్ధతికూడ కనఁబడుచున్నది. అయినను గ్రంథవ్యాపిగాఁ బొడకట్టునది భావానువాద పద్ధతి!

మారన సంస్కృతమార్కండేయపురాణమును దెలుఁగులో సాధ్యమైనంతవఱకు సగ్రహముగను, సారవంతముగను, గావ్యకళాసుందరముగను జెప్ప బ్రయత్నము చేసి నాఁడు. సంస్కృతపురాణకర్తలు ధర్మనీతిశాస్త్రాద్యర్థబోధనైకదృష్టితో వినిర్మించిన కథార్థముల నుపదేశదృష్టితోడనే కాక కావ్యకళాదృష్టితోడను దర్శించి, విమర్శించి, పునర్నిర్మించుపద్ధతి మారనకుఁ దిక్కనశిష్యత్వమువలన నలవాటుపడినది. అందువలన సంస్కృతమున నర్థప్రధానమైన పురాణఘట్టములను మారన స్వీయకవితాశక్తితో శబ్దార్థోభయప్రధానముగా నిర్మింపఁగలిగెను. స్వారోచిషమనుసంభవ, హరిశ్చంద్ర కువలయాశ్వమరుత్తరాట్చరిత్రాదు లటువంటివి. అవి తరువాతి ప్రబంధకవులదృష్టి నాక ర్షించినవి. మహాకావ్యములుగాఁ గాలాంతరమున నవతరించినవి. అట్లు మార్కండేయ పురాణాంతర్గతకథావైభవము తెలుఁగుసాహిత్యలోకమున వెలయింపఁ జేయుటకు మారన మహాకవియనువాదము ప్రముఖపాత్ర వహించిన దనుటలో విప్రతిపత్తి లేదు.

సంస్కృతాంధ్రమార్కండేయపురాణ స్వరూపపరిమాణములను స్థూలముగాఁ బరిశీ లించినచో నాంధ్రానువాదముమూలముకంటె సుమారైదింట నొకవంతు తగ్గింపఁబడినట్లు స్పష్టము కాఁగలదు.

| మారన అనువాదము | | సంస్కృత మార్కండేయపురాణము | | |
|---|---|---|---|---|
| ఆశ్వాస సం. | పద్యగద్యములు | శ్లోకములు | అధ్యాయములు | వివరములు |
| 1 | 285 | 686 | 8 | 1 నుండి 8 వఱకు |
| 2 | 341 | 800 | 11 | 9 నుండి 19 వఱకు |
| 3 | 391 | 1111 | 22 | 22 నుండి 41 వఱకు |
| 4 | 253 | 922 | 17 | 42 నుండి 58 వఱకు |
| 5 | 371 | 832 | 19 | 59 నుండి 77 వఱకు |
| 6 | 260 | 665 | 13 | 78 నుండి 90 వఱకు |
| 7 | 283 | 828 | 23 | 91 నుండి 113 వఱకు |
| 8 | 286 | 773 | 21 | 114 నుండి 134 వఱకు |
| మొత్తము | 2,470 | 6,617 | 134 | |
| పీఠిక | 46 | | | |
| ఆశ్వాసారంభాంత్యపద్య. | 31 | | | |
| మొత్తము | 2,547 | | | |

పైసంఖ్యలనుబట్టి చూచినచో నాంధ్రానువాదము సంస్కృతగ్రంథమునకు దాదాపు మూడవవంతు ఉన్నట్లు తోచును. కాని, భావానువాదకుఁడు ఒక్కొకసారి మూలము నందలి యొక్కొకశ్లోకమునుగాని, కొన్నిశ్లోకములనుగాని యొకప్రమాణముగా (Unit)గా గైకొని దాని నొకపద్యముగానో గద్యముగనో రచించుట పరిపాటి కావునను, గద్యపద్యములు ఆకృతిలోఁ బెద్దవయి పెక్కుశ్లోకములభావమును దమయందిమిడ్చుకొనఁగలిగి యుండుటవలనను, తెలుఁగుపద్యములు సంఖ్యయం దల్పములయ్యు వానికంటె రెండింతలు మూఁడింతలు సంఖ్యలు గల యనుష్టుప్పాది శ్లోకములభావమును వ్యక్తీకరింపఁగలవు. మఱియును సంస్కృతపురాణస్థములైన శ్లోకములు మహాకావ్యస్థశ్లోకములవలెఁ బ్రతిపదప్రయోగసార్థక్యము నభిలషింపక భావప్రధానములై ప్రాయికముగా విరళబంధములై యుండుటచే ననువాదకుఁడు వానిని ప్రౌఢరచనాబద్ధ మొనర్చి సంగ్రహీకరించుచుండును. మారనయు నట్లే యీపురాణమున రెండున్నరవేలపద్యగద్యములలో నైదున్నరవేలకుఁ బైఁబడిన సంస్కృతశ్లోకములను క్రోడీకరింపఁగలిగినాఁడు! సుమా రొకవేయిశ్లోకముల నాతఁ డనువాదమున నౌచిత్యభంగము కాకుండ వదలినాఁడు. ఇట్లు తెలుఁగుపురాణగ్రంథము సంస్కృతముకంటె సంగ్రహమై సాక్షాత్కరించుచున్నది.

మారన యనువదింపక వదలిన భాగములలో మొదట పేర్కొనఁదగినవి నరిష్యంతదమచరిత్రములు. ఇవి సంస్కృతపురాణమున 129వ అధ్యాయమునుండి యైదధ్యాయములలో 187శ్లోకములలో- రచింపఁబడియున్నవి. నరిష్యంత దమచరిత్రము లీపురాణమున వర్ణింపఁబడిన సూర్యవంశరాజచరితములలోఁ జివరివి. ప్రస్తుత ముపలభ్యమానమగుచున్న సంస్కృతపురాణ మీమహారాజులచరితములతోడనే ముగియుచున్నది. మారన యీకథల ననువదింపకుండుటకుఁ గల హేతువు నరయవలసియున్నది.

సంస్కృత పురాణము దమచరితముతో ముగియుచుండుట కొక హేతువు నూహింపవచ్చును. మార్కండేయమహర్షి భార్గవుఁడు. అతనికి భృగురామునిచరిత్రమున సహమైన యభినివేశ ముండుటలో నాశ్చర్యము లేదు. భార్గవరామునిచరిత్రము నీపురాణమున వర్ణించుట ప్రస్తుతము కాదు. కాని భార్గవచరిత్రమువలె భాసించు నొకమహారాజుచరిత్రము చెప్పి తనయాశయమును గూఢముగా సాధించుకొనవచ్చును. ఇచ్చట భార్గవచరితమునకును దమచరితమునకును సామ్యము కానవచ్చుచున్నది. కన్నతండ్రిమృతికి కారకుఁడైన క్షత్రియుని ఘోరరణమున నిర్జించి రౌద్రస్ఫూర్తితో నాతనినిఁ జంపిఁ, యతనికవోష్ణరక్తధారలతో, బితృదేవతలకుఁ దర్పణము లిచ్చి పితౄణమును దీర్చుకొనుటలో దమచక్రవర్తి భార్గవరామసదృశుఁడే! అతఁ డంతటితో నాగక నిహతుఁడైన వపుష్మంతుని మాంసపిండముల నాసురులగు బ్రాహ్మణులకుఁ గుడువఁబెట్టిగాని సంతృప్తిపడలేదు! ఇట్టి యుద్ధతునిచరిత్రము భార్గవులకుఁ బ్రీతిపాత్ర మగుటలో నాశ్చర్యము లేదు! అందువలననే మార్కండేయర్షి పురాణభరతవాక్యముగా నీకథ నాలపించినాఁడు!

మారనకు మార్కండేయమహర్షి కుండిన నిగూఢాభినివేశ మాకథయం దుండవలసిన యవసరము లేదు. ఆయన ఆంధ్రమార్కండేయమును నిర్వహించుటలో స్వీయోపజ్ఞఁ బ్రదర్శింప నెంచెను. మారన మరుత్తరాట్చరిత్రముతోఁ బురాణమును ముగించెను. కావ్యకళాదృష్టితో నాముగింపున కొక యౌచిత్యము కలదు! ఆర్తత్రాణపరాయణము, దుష్టశిక్షణము- అనెడు రెండు ధర్మములు స్వీయధర్మనిర్వహణమునకై తండ్రికొడుకులరూపమున సంఘర్షణపడి ప్రళయరూపము దాల్పఁబోయి యద్భుతావహముగా శాంతించి లోకకల్యాణప్రదము లైనట్లువర్ణింపఁబడిన యమలగాథ మరుత్తునిచరిత్రము. ధర్మైకమూల మగు విశుద్ధవీరము అద్భుత మంగముగా వెలసిన విశిష్టగాథ యిది. వీరావతారులును, ధర్మమూర్తులు నయిన సూర్యవంశచరిత మారాజచరిత్రముతో ముగింపఁబడుట యొకవిలక్షణమైనపద్ధతి! ఇఁక దమచరిత్రమా రౌద్రప్రధానమైనది! శత్రురక్తముచేఁ బితృదేవతలకుఁ దర్పణము లిచ్చి మాంసపిండములను భోక్తల కిడుటలో బీభత్సము భాసించుచున్నది! మంగళాంతముగాఁ గావ్యనిర్వహణము చేయఁదలఁచెడి కవి కీముగింపు రుచింపదు. కావున మారన దమవృత్తాంతమును గైకొనకపోయి యుండవచ్చును!

మారన మార్కండేయపురాణమున నరిష్యంతదమచక్రవర్తులకథలను దప్ప మఱియేయుపాఖ్యానమును బూర్తిగా ననువదింపక వదలలేదు. కాని, పునరుక్తము లైన

కథలలోని తుల్యకథాభాగములను జర్విత చర్వణము సేయక వదలి యౌచిత్యమును బోషించిన ఘట్టములు రెండు సప్తమాశ్వాసములోని సవితృచరిత్రమునఁ బొడకట్టు చున్నవి. మార్కండేయమున మార్తాండచరిత్రము పంచమాశ్వాసమున వైవస్వతమన్వంతరకథావసరమున నొకసారి చెప్పఁబడియున్నది. దానినే మఱల నొకపరి వంశాను చరితమునఁ జెప్పవలసివచ్చినది. మూలమున నీరెండుసార్లుకూడ దివాకరవృత్తాంత మాద్యంతము చెప్పఁబడియున్నది. కాని, మారన రెండవసారి చెప్పునెడ రెండింటను దుల్యముగా నున్న కథాభాగములను-(అనఁగా 103 అధ్యా. 4వ శ్లో. నుండి-34వ శ్లో. వఱకును, 105 అధ్యా. 11వశ్లో. నుండి 28వ శ్లో. వఱకును) అనువదింపక వదలి వైచెను. పైరెండుకథలలో సూర్యుఁడు విశ్వకర్మయొద్ద కువచ్చి సంజ్ఞాదేవిని గూర్చి ప్రశ్నించిన కథాఘట్టమునఁ గొంతవ్యత్యాసము కనఁబడుచున్నది. మారన దానిని మాత్రము మార్చక యథాతథముగా ననువదించినాఁడు.[2]

## I

మారన యుపాఖ్యానముల ననువదించునెడ కథార్థముల కుపబలకములుగా లేని సన్నివేశములను, గథాఘట్టములను, గథాంశవివరణములను అనువదింపక వదలి కథా సంవిధానసార్థక్యమును బోషించినస్థలము లీపురాణమునఁ బెక్కు కలవు. ఉదాహరణము నకుఁ గొన్నింటి నిచ్చటఁ బేర్కొనుట జరుగుచున్నది.

(1) హరిశ్చంద్రోపాఖ్యానమును ముగించుచు సంస్కృతపురాణకర్త రాక్షసగురు వగు శుక్రాచార్యుఁడు హరిశ్చంద్రునిమహత్వమును, తత్కథాశ్రవణఫలమును వేనోళ్ళఁ గీర్తించినవిధమును వర్ణించెను.[3] ఆపైన ధర్మపక్షులచేతఁగూడ ఫలశ్రుతిఁ బలికించెను.[4] హరిశ్చంద్రకథార్థములందు శుక్రాచార్యప్రస్తావనమున కెట్టియవసరమును గానరాదు. పైగా దానివలన ఫలశ్రుతియందుఁ బునరుక్తితోఁగూడిన విస్తృతి యేర్పడఁగలదు. కావున మారన శుక్రాచార్యకథితవాక్యసముదాయము ననువదింపక వదలినాఁడు.

(2) దత్తాత్రేయమాహాత్మ్యప్రతిపాదక మగు కార్తవీర్యార్జునవృత్తాంతమున నతని పట్టాభిషేకవర్ణనమును మారన యనువదింపక వదలెను.[5] కార్తవీర్యునిపట్టాభిషేకమునకు గంధర్వాప్సరోగణములును, వసిష్ఠాదిమునిగణములును, సుమేర్వాదిపర్వతసమూహమును, గంగానదీసంఘమును, సమస్తసముద్రములును, ప్లక్షాదివృక్షసంతతియు, నింద్రాదిదేవతా గణమును, వాసుక్యాదులగు నాగవరులును, గరుడాదిపక్షిగణమును, నగరపురవాసజన మును, దత్తాత్రేయప్రసాదమువలన సర్వసంభారములు సిద్ధముచేసిరి. బ్రహ్మాదిదేవతలు హోమకార్యము నిర్వహించిరి. దత్తాత్రేయస్వరూపుఁ డగు నారాయణుఁ డభిషేకము చేసెను. తరువాత మునులును, నదీసముద్రములును రాజు నభిషేకించి హైహయరాజ్యము

2. మారన మార్క. 5. 352-353 ; 7.113-115.

3. మార్కం. మహా పు. 8. 267-283; 4. మార్కం. మహాపు. 8. 284-285;

5. మార్కం. మహాపు. 17. 21-26.

సుస్థిరమై వర్ధిల్లుగాత ! యని యాశీర్వదించిరి. మూలమున నున్న మహోత్సవవివరము లిటువంటివి. కార్తవీర్యుఁడు లౌకికుఁడైన చక్రవర్తి. దత్తాత్రేయునిచే నపూర్వములైన వరములను బొంది యజేయచక్రవర్తిత్వము వడసెను. దీనికిఁ బ్రధానముగా సంతసింప వలసినది సామ్రాజ్యప్రజ కాని దేవతావర్గము కాదు. అయినను సంస్కృతపురాణకర్త కార్తవీర్యుని దేవసమ్మానితునిగాఁ జిత్రించినాఁడు : మారన లోకసంభావితునిగాఁ బ్రదర్శించినాఁడు. కథలోఁ గార్తవీర్యార్జునుఁడు ప్రజాపరిపాలనసామర్థ్యము పొందుటయే పరమఫలము : తత్ఫలానుగుణములైన కథావివరములనుమాత్రము గ్రహించి మిగిలిన వానిని వదలుట మారనయభిమతము !

(౩) కువలయాశ్వచరిత్రమున బ్రాహ్మణకుమారవేషధారులైన నాగకుమారులు తండ్రిపంపున ఋతధ్వజునిఁ దమగృహమునకు రమ్మని పిలువ నారాజకుమారుఁడు వారితో నన్న యీక్రిందిమాటలను మారన యనువదింపక యౌచిత్యమును బోషించి నాఁడు.

శ్లో. తావాహ నృపపుత్రోసౌ నన్విదం భవతోర్గృహమ్
ధనవాహనవస్త్రాది యన్మదీయం తదేవవామ్ ॥

యద్యస్తి వాంఛితం దాతుం ధనం రత్న మథాపి వా
తద్దీయతాం ద్విజసుతౌ ఽఽదివాం ప్రణయోమయి ॥

ఏతావతాహం దైత్యేన వంచితోఽస్మి దురాత్మనా
యద్భవద్భ్యాం మమత్వం నో మదీయే క్రియతాం గృహే ॥

యది వాం మే ప్రియం కార్య మనుగ్రాహ్యోఽస్మి వా యది
తద్ధనే మమగేహే చ మమత్వ మనుకల్ప్యతామ్ ॥

యువయో ర్య న్మదీయం త న్మామకం యువయోః స్వయమ్
ఏత త్సర్వం విజానీతం యువాం ప్రాణా బహిశ్చరాః ॥

పునర్నైవం విభిన్నార్థం వక్తవ్యం ద్విజసత్తమౌ
మత్ప్రసాదపరౌ ప్రీత్యా శాపితౌ హృదయేన మే ॥

తతః స్నేహార్ద్రవదనౌ తౌ వుభౌ నాగనందనౌ
ప్రోచతు ర్నృపతేః పుత్రం కించిత్ప్రణయకోపితమ్ ॥ (తా)

ఋతధ్వజ నసందేహో యథైవాహ భవా నిదమ్
తథైవ చాస్మి న్మనసి నాత్ర చిన్త్య మతోఽన్యథా ॥ 21.81-88.

మారన యీశ్లోకములలోని సారభూతమైనభావమునుమాత్రము గ్రహించి తెలుఁగున కందపద్యోత్తరభాగమున నిలిపెను.

క. శ్రీయుత నీవు ప్రియమున
న్మాయింటికి రాఁగవలయు నావుడు - మాయి

లక్ష్మియిల్లని వేఱడ మిటు
సేయుదురే యిది సఖిత్వశీలము తెఱఁగే ? (3.60)

మూలమునందలి కువలయాశ్వునిపలుకులలో నిబ్బరము కొఱవడినది. అతఁడు నాగ కుమారుల తెచ్చుట తనవలన ననాదరము జరిగెనో, దానికి వా రెక్కడ నొచ్చుకొని పోయిరో యని లోలోన వింతభయము ననుభవించుచున్నట్లు కానఁబడును. మిత్రు లమితాదరమున నాహ్వానించుచుండ నాతఁ డట్లగుట యెందులకో బోధపడదు. అది కథార్థములకుఁగాని, పాత్రశీలపోషణమునకుఁగాని యుపకరించునది కాదు.

మారన యీలోపములను దెలుఁగునఁ గడుచాకచక్యముగా నివారించినాఁడు. "మాయి లక్ష్మియిల్లని వేఱడ మిటు సేయుదురే ? యిది సఖిత్వశీలము తెఱఁగే ?" యను వాక్యము చతురవచోనిధి యైన వ్యక్తిగాని సద్యఃస్ఫూర్తిగా ననఁజాలఁడు: అం దెంతయో వివేకము, గడుసరితనము, నైష్కల్యము, ఋజుశీలము పొదకట్టుచున్నవి. మొదటి వాక్యములో రాజకుమారుఁడు 'త్వమేవాఽహ' మ్మనెడి స్నేహప్రవృత్తినిఁ బ్రకటించి, తా నంతవఱకు మిత్రులయింటికిఁ దానంతట తానే పోనిహేతువును గడుసరిగా సమర్థించు కొనినాఁడు. మా మీభేదము లేదనుటలోఁ దనయింట నున్నఁ దన కెంతమోదమో మిత్రుల యింటికిఁ బోయినను అంతసమ్మదము సమకూరకల దని సూచించిన ట్లయినది. తెలుఁగున మూలమున నున్న యా స్తిపాస్తుల ప్రసక్తులు లేవు. అనుమానముల కాస్కార ములు లేవు. ఆహ్వానము నర్థాంతరమునఁ గాదన్నచాయలు కానరావు : 'సఖిత్వశీల' ప్రసక్తి తెచ్చిన మారన కువలయాశ్వపాత్రశీలపరిపోషణమునం దప్రమత్తుఁడై యున్నాఁ డని గ్రహించుట సులభము : ఈయంశము మఱొకనిదర్శనమువలన బలపడుచున్నది.

నాగకుమారులు తమతండ్రి కువలయాశ్వునిఁ జూడఁ గోరుచున్నాఁ డని చెప్పిరి. వెంటనే యతఁడు "యథాహతాతః" అని యనుచు స్వీయజనకాజ్ఞను గౌరవించినట్లే పుడమిపై జాగిలిమ్రొక్కి నాగకుమారుల తండ్రిని గౌరవించె నని మూలమునఁ గలదు. (21-90). "యథాజ్ఞాపయతి తాతః" అనునట్టి వాక్యరచనము సంస్కృతభాషకు సహజ మైన జాతీయము. తెలుఁగున నిట్టిపలుకుఁబడి కానరాదు. కావున మారన యీభావగౌరవ మును దెలుఁగునఁ దెచ్చుట కొక కందపద్యమును వినిర్మించినాఁడు !

క. మీ తండ్రియ మాతండ్రి వి
నీతిని మీయట్ల నేను నెమ్మి నతనికి
న్బ్రీతి యొనరింపఁ దగుదును
పీతకళంకాత్ములార ! వేయును నేలా ? (3.64)

మిత్రభావమున 'మీ''మా' భేదము పరిహరించిన కువలయాశ్వుఁడు గృహవిషయమునేకాక, గురువులవిషయమునఁగూడ నట్టి స్థిరభావమునే ప్రదర్శించినట్లు రచించుట మారనయుద్దే శము ! తుల్యభావములకుఁ దోడునీడలైన పద్యముల నీపాత్రసంభాషణమునం దాద్యం తములందు నిబంధించుట శిల్పమర్యాద !

(4) మార్కండేయపురాణ చతుర్థాశ్వాసమున వర్ణింపఁబడిన దుస్సహవృత్తాంతములో బ్రహ్మ దుస్సహున కాహారాదుల నేర్పఱచు ఘట్టమునందును, దుస్సహుఁడు సౌరరానితావులు నిర్దేశించునవసరమునందును మూలమునం దున్న అనేకవివరములను మారన యనువదింపక వదలినాఁడు.6 అట్లే దుస్సహసంతానమునకు జనించిన ముప్పదితొమ్మండ్రుగురుబిడ్డలను, వారిగుణగణములను మూలకర్త డెబ్బదినాలుగుశ్లోకములతో7 నతివిపులముగా వర్ణించియుండ వారిపేళ్ళను మాత్ర మొకవచనమునఁ8 బేర్కొని యితర వివరముల నన్నింటిని వదలివైచెను. జగత్కంటకు లైన దుస్సహవంశజులచరిత్రములు సహజముగా భయంకరములు; కొన్నియెడల జుగుప్సావహములు. కాని, మానవులందు దురాచారభీతియు, సదాచారప్రీతియు నెలకొల్పుటకై పౌరాణికు లీపాత్రలకు రూపకల్పనము చేసిరి. నైతికదృష్టితోఁ బురాణకల్పన మనల్పమైనదే. కాని, పఠిత యుత్కంఠను దృష్టియందుంచుకొని కథాకథనశిల్పమును వెలార్చుకవికి మూలమునందలి వివరణము లన్నియు ముచ్చట గొలుపఁజాలవు. కావున, మారన వానినన్నింటిని గ్రహింపకుండుటలో నాశ్చర్యము లేదు.

(5) జడోపాఖ్యానమున విపశ్చిదాహ్వయుఁ డగు జనకరాజవంశజుఁడు నరకలోకముల దర్శించి, యచ్చట వారివారికర్మలకు ఫలరూపములైన నరకబాధల ననుభవించుచున్న జీవులఁ గాంచిన యుపాఖ్యానము ననువదించు నవసరమున మారన మూలమునందున్న విపులదుఃఖవర్ణనల9 నన్నింటిని తెలుఁగుసేయక "ఘోర"10 మను నొక్కవిశేషణముతోఁ దద్విపులార్థస్ఫూర్తినిఁ గల్పింప యత్నించెను.

రౌరవాదివివిధనరకవర్ణనములను వేఱువేఱుగాఁజదివి తదనుభావనిష్ఠులైన పఠితలకు మఱల నీరాజుచే విపులనరకవర్ణనాత్మక మగు ప్రశ్నాదిక మడిగించినచో విసువు జనించు నని మారన యభిమతము కానోపును.

ఈయుపాఖ్యానమునందే యమకింకరుఁడు వైదేహరాజునకు వేర్వేఱుగ నారకులం జూపి వారిదుఃఖానుభవములను, తద్ధేతువులను వివరించి చెప్పునెడ దాదాపు పదిశ్లోకములలో (14.75-85) నున్నవివరములను మారన యనువదింపక విడచి పఠితలకు కథార్థములందు విసువు జనింపకుండున ట్లొనరించెను.

# II

కథాగమనవేగమును బోషించుటకై వివిధశాస్త్రార్థాదులవివరముల ననువదింపక వదలిన ఘట్టములు మారనరచనలోఁ జాల కానఁబడుచున్నవి. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్నియుదాహరణము లిచ్చట నీయఁబడుచున్నవి.

---

6. మార్కం. మహాపు. 47. 49-54; 69-72; 74-80; 89-96.
7. మార్కం. మహాపు. 48. 50-123.
8. మారన మార్క. 3. 108.
9. మార్కం. మహాపు. 14. 9-14.
10. మారన మార్క. 2.83.

(1) అలర్కునకు దత్తాత్రేయుఁడు యోగమార్గ ముపదేశించుఘట్టమున ''గటుకో దయంబులైన ప్రాతిభశ్రావణదైవభ్రమావర్తంబు లను పంచవిధోపసర్గంబులు పరిహరించి నియతాహారుండును, జితేంద్రియుండును, బ్రహ్మప్రవణమనస్కుండునై యోగి సూక్ష్మం బగు ధారణాసప్తకంబు ధరియించునది'' (3.332) అని మారన రచించియుండెను. మూలమున నీసందర్భమునందు పంచవిధోపసర్గములయొక్క స్వరూపలక్షణాదులు పది శ్లోకములలో (37. 6-15) వివరింపఁబడియున్నవి. మారన వానిని గ్రహింపలేదు.

(2) అదేఘట్టమునందు యోగి ''సప్తధారణాభ్యాసంబునఁ జేసి పృథివ్యాదుల గంధాదిసూక్ష్మగుణంబులం దొఱంగి శుద్ధాత్ముం డగు యోగసిద్ధుం డణిమాద్యష్టైశ్వర్య సిద్ధిసంపన్నుండును యోగాగ్నిదగ్ధదోషుండునునై యనలం బనలంబునందును జలంబు నందును నొందు చందనంబునం దాను పరమాత్మైకత్వంబునం బొందు'' (3.334) నని మారన రచించినచోట మూలమునందుఁ గల యష్టైశ్వర్యసిద్ధులస్వరూపవర్ణనము (37. 30-34) వదలఁబడినది.

శ్లో. యథాహి కానకంఖండ మపద్రవ్యవ దగ్నినా
దగ్ధదోషం ద్వితీయేన ఖండే నైక్యం వ్రజే న్నృప ॥ (37.38)

అనునట్టి యలంకృతవచనములుకూడ విడువఁబడినవి. ఇట్లే ప్రాణాయామాదిలక్షణ ములఁ దెలుపుచు ధ్వస్తి, ప్రాప్తి, సంవిత్ప్రసాదము లను చతురవస్థలప్రకారము మూల మున శ్లోకసప్తకమున (36. 20-26) వివరింపఁబడియుండ మారన తద్వివరణమును దెలుఁగుసేయలేదు.

(3) ఈకథాఘట్టమునందే దత్తాత్రేయుఁ డలర్కునకు యోగి విశ్వాత్మకుఁడైన పరమాత్మునిఁ బొందుటకు ప్రణవోపాసనము సేయవలె నని చెప్పుచు, నోంకారస్వరూపా దులను దాదాపు పదునాలుగు (39. 3-16) శ్లోకములలో వివరించియున్నట్లు మూలమున గలదు. మారన తద్వివరములను బేర్కొనక—

కం. అని యోంకారస్వరూప
మ్మును సగుణత్వాగుణత్వములు తద్ధ్యాన
మ్మును నుచ్చారణవిధమును
నొనరంగాఁ జెప్పి వెండియును నిట్లనియెన్. (3. 343)

అని మూలమునందలి విషయవిభాగమునుమాత్రము పేర్కొని యూరకుండెను.

ఈయంశములను గమనించినచో మారన మూలమునందలి యోగాదిశాస్త్రవిషయ ములను బూర్తిగా వదలక లోకమందు బహుళముగా వ్యాపించి సుపరిచితములైయున్న శాస్త్రాంశములవివరణమును వదలుచు మూలతాత్పర్యమునకు భంగము వాటిల్లకుండ సంగ్రహమైన రచనమును గావించె నని భావించుటలో విప్రతిపత్తి లేదు. శాస్త్రీకవిషయ కథనము సుదీర్ఘముగా సాగునెడ నిట్టిపద్ధతి ననుసరించుట మారనయుచితజ్ఞతకుఁ దార్కాణము.

(4) ద్వితీయాశ్వాసమున వైదేహుఁ డడిగిన ప్రశ్నకు యమకింకరుఁ డిచ్చు ప్రత్యుత్తరమునందు జీవులు తా మొనర్చినపుణ్యాపాపఫలముల కుచితమైన సుఖదుఃఖము లనుభవింపక తీర దను తాత్పర్యమును జెప్పుటకై విరళముగాఁ బదునాఱుశ్లోకములు రచింపఁబడియుండ (14.22-38) మారన తత్సారమునంతయు నొక కందపద్యమున వడియకట్టించెను.

క. ఎంతెంత సేసెఁ బుణ్యం
బంతంతయె సుఖము నిచ్చు నరునకుఁ దా
నెంతెంత సేసెఁ బాపం
బంతంతయ దుఃఖ మిచ్చు నది తలితోడన్. (2.88)

విరళబంధములైన పదిశ్లోకములకంటె రసగుళికవంటి యొకకందము మేలు. మాకందమువలెఁ బఠితకు రుచ్యమగును. పైకందము సారార్థబంధుర మగుటయే కాక పాదాదిముక్త పదగ్రస్తాఖ్య శబ్దాలంకారసుందరమై పఠితచిత్తము నాకర్షించుచున్నది. సరితూకముతో బింబప్రతిబింబరూపములుగా భాసించు పూర్వోత్తరార్ధములు పఠితను మురిపించి పద్యమును గంఠస్థము చేయుటకుఁ బ్రోత్సహించును. పదలాలిత్యముతో పఠిత నాకర్షించి పరమార్థ ప్రబోధము నిర్వహించుట మారన సూక్తిమయపద్యశిల్పము!

(5) కువలయాశ్వచరిత్రమున సరస్వతీదేవి కంబళాశ్వతరులతపమునకు మెచ్చి సంగీతవిద్యావిశారదత్వము వారికిఁ బ్రసాదించె నను ఘట్టమున సంగీతశాస్త్రసంబంధమైన పరిభాష మూలమున వాడఁబడినది.

శ్లో. సప్తస్వరా గ్రామరాగా స్సప్త పన్నగసత్తమ!
గీతకాని చ సప్తైవ తావ త్య శ్చాపి మూర్ఛనాః॥
తానా శ్చైకోనపంచాశ త్తథా గ్రామత్రయం చ యత్
ఏత త్సర్వం భవా న్వేత్తా కంబల శ్చైవ తే సఖా।
జ్ఞాస్యతే మత్ప్రసాదేన భుజంగేంద్ర పరం తథా
చతుర్విధపదం తాళం త్రిప్రకారం లయత్రయమ్॥
[11]యతిత్రయం తథా తోద్యం మయాదత్తం చతుర్విధమ్॥ (21.52-55)

ఇది తెలుఁగున రాలేదు. "సప్తస్వరమహితమధురగీతవిద్యావిశారదత్వంబు ప్రసాదింప వలయు ననిన వాగ్దేవి యవ్వరం బొసంగి" (3.52) యని మాత్రమే కలదు. మారనకు సంగీతశాస్త్రమునం దంత యభినివేశము లేక యీభాగమును వదలె నందుమా యాతని కవిత్వధార రాగరంజితమై శోభిల్లుచున్నది. కావున శుష్కశాస్త్రపరిభాషాకథనవైముఖ్యమే యీవివరముల ననువదింపకుండుటకుఁ గారణము కానోపును!

(6) మదాలస యలర్కునకుఁ గర్మమార్గము నుపదేశించుచు సౌర్ధ్వదైహికమైన

11. "గతిత్రయం తథా తాలం మయాదత్తం చతుర్విధమ్" అని పాఠాంతరము. (వేం.ప్రె.ప్ర.)

యేకోద్దిష్టశ్రాద్ధవిధమును జెప్పునెడ పదునేను శ్లోకములను[12] మారన యనువదింపక వద లెను. శ్రాద్ధాచరణవిధులనుగూర్చి విపులముగా 28వ అధ్యాయమున వర్ణితమైయుండుట చేతను, దానినిఁ జాలవఱకు మారన తెలుఁగుచేసియుండుటచేతను[13] ఇచ్చట నీవివరము లను వదలియుండవచ్చును.

శ్రాద్ధాచరణవిధుల ననువదించు నవసరమునందును సూక్ష్మాతిసూక్ష్ములైన వివరములజోలికిఁ బోవక మారన నేర్పుగా రచనము గావించెను. ఉదాహరణమునకు :

ఆ. ఇష్టభోజనము లిడి కర్త సిద్ధార్థ
ములును దిలలు నచటఁ గలయఁ జల్లి
దైత్యహారిమంత్రతత్పరుఁడై తత్త
దుచితవిధుల నెల్ల నొనర సలిపి. (3.190)

యనుపద్యమునఁ "దత్తదుచితవిధుల" నన్నచోట మూలమున నెనిమిది శ్లోకముల వివరణ మున్నది (28.47-55). కర్మాచరణవిధిబోధనైకదృష్టి మూలకర్త కున్నంత మారనకు లేకుండుటయే దానిని వదలుటకుఁ గారణము.

(7) సంస్కృతమార్కండేయపురాణమున 31వ అధ్యాయమునందు 121 శ్లోక ములలో సదాచారప్రకారము వివరింపఁబడియున్నది. మారన దీనియందు రమారమి నలుబదిశ్లోకముల ననువదింపక వదలినాఁడు. కథార్థములయం దాచారాదివిధులు నాతి దీర్ఘములై యుండి కథాగతి కుపబలకములుగా నుండవలె నను మారననదాశయ మిందు లకు ప్రధానహేతువై యుండవచ్చును. మారన యిప్పట్టున యనువదించినవిధానమును బరిశీలించినచో మూలమున వివరణాత్మకములును, బునరుక్తిప్రాయములును నైన యంశ ములనే గైకొనక వదలినట్లు గ్రహింపవచ్చును. ఉదాహరణమునకు :

శ్లో. త్రివర్గసాధనే యత్నః కర్తవ్యో గృహమేధినా
తత్సంసిద్ధౌ గృహస్థస్య సిద్ధి రత్ర పరత్ర చ॥ (31.10)

అను శ్లోకమును దెనుఁగుచేసిన (3.224) మారన యీక్రిందివివరములను గ్రహింపక మానినాఁడు.

శ్లో. పాదేనార్థస్య పారత్ర్యం కుర్యా త్సంచయ మాత్మవాన్
అర్ధేన చాత్మభరణం నిత్యనై మిత్తికాన్వితమ్॥
పాదం చాత్మార్థమాయస్య మూలభూతం వివర్ధయేత్
ఏవ మాచరతః పుత్ర అర్థః సాఫల్య మృచ్ఛతి॥
తద్వ త్పాప నిషేధార్థం ధర్మః కామో విపశ్చితా
పరత్రార్థం తథా చాన్యః కామ్యో త్రైవ ఫలప్రదః॥

12. మార్కం. మహాపు. 27. 8-11; 13-17; 19-25.

13. మారన మార్క. 3. 185-197.

ప్రత్యవాయ భయాత్కామ స్తథాన్య శ్చావిరోధవాన్
ద్విధా కామో నిగదిత స్త్రివర్గోఽస్య విరోధతః॥.
పరస్పరానుబంధాం శ్చ సర్వా నేతా న్విచింతయేత్
విపరీతానుబంధాం శ్చ ధర్మాదీం స్తా ఞ్ఛృణుష్వ మే॥
ధర్మో ధర్మానుబంధార్థో ధర్మో నాత్మార్థబాధకః
ఉభాభ్యాం చ ద్విధాకామ స్తేన తౌ చ ద్విధా పునః॥ 31.11-16.

ఇష్టే గృహమేధి హుతవహు నాహుతులఁ బూజించుటయు, గృహబలి యాచరించుటయు, వైశ్వదేవ మొనరించుటయు, దేవతాబలుల నిచ్చుటయు మొదలగు నాచారవిశేషములఁ గూర్చి మూలమున నున్న వివరములను (31.96-112) మారన యనువదింపక వదలివైచెను.

(8) 132 వ అధ్యాయమునఁ జాత్రాదిశుద్ధియు, స్త్రీధర్మములును, బ్రాహ్మణాదుల యశౌచప్రకారములును, సంస్కృతమున 97 శ్లోకములలోఁ జెప్పఁబడియున్నవి. సదాచారధర్మములకంటెఁ గొంతనిస్సారములైన యీయంశములలో మారన యనువదిశ్లోకములకుఁ బైగా ననువదించుట మాని యీభాగమును క్లుప్తపఱచెను. ఇందలి స్త్రీధర్మబోధ వేంకటేశ్వర (బొంబాయి) ప్రెస్‌ప్రతిలోఁ బ్రక్షిప్తభాగముక్రింద గుర్తింపఁబడియున్నది. బహుశః మారన యనుసరించిన మూలప్రతియం దాభాగము (32. 43-60) లేకుండియుండ వచ్చును. మారన యాశౌచాదులలో నతిముఖ్యమైనవానిని మాత్రమే పేర్కొని, గర్భపాతాద్యశౌచాదివివరములను (32. 61-73) వదలివైచెను. ఈయధ్యాయమునఁ జెప్పఁబడిన నిత్యకర్మకలాపవిధులు చాలవఱకితఃపూర్వమే గార్హస్థ్యాదిధర్మప్రవచన సందర్భమునఁ బేర్కొనఁబడియుండుటచే మారన వానిని మఱల యనువదింపక వదలియుండ వచ్చును.

నీరసములైన యిట్టిఘట్టములందు మణిపూసలవంటి నీతిపద్యములును, అనుభవసారములవంటి సూక్తులును మారన యనువాదమున హృదయాకర్షకముగా నిర్మింపఁబడియున్నవి. ఉదాహరణమునకు :

శ్లో. పరదారా నగన్తవ్యాః పురుషేణ విపశ్చితా॥
ఇష్టాపూర్తాయుషాం హన్త్రీ పరదారగతి ర్నృణామ్
నహీదృశ మనాయుష్యం లోకే కించ న విద్యతే॥
యాదృశం పురుష స్యేహ పరదారాభిమర్శనమ్॥ (31. 62-64)

మ. పరదారాగమనంబునం గలుగుపాపం బెక్కు డత్యంతదు
స్తర మాయుఃక్షయ మాచరించు నయుతేష్టాపూర్తము ల్సేసిన
న్హరియించు న్పరలోకము న్యశము నిత్యైశ్వర్యము న్గావున
న్నరుఁ డన్యాంగనపొంతఁ బోవమి గడు న్ధర్మంబు ధర్మాత్మకా! (3.237)

ప్రసన్నధారామధురమైన యీపద్యము చిత్తముల నలరించుచు హితమును బథ్య మొన రించుచున్నది.

శ్లో. ఋణప్రతాతా వైద్య శ్చ శ్రోత్రియః సజలా నదీ
జితామిత్రో నృపో యత్ర బలవాన్ ధర్మతత్పరః॥
తత్ర నిత్యం వసే త్ప్రాజ్ఞః కుతః కునృపతః సుఖమ్। (31. 116-117)

క. ఎచ్చట శ్రోత్రియుఁడును ధన
మిచ్చునతఁడు నీరు గలుగు నేఱును వెజ్జు
న్మచ్చికయును లేకుండును
నచ్చట వసియింప వలవ దభినుతచరితా!

క. జితశత్రుఁడు బలవంతుఁడు
నతిధర్మపరుండు నైన యవనీశుకడ
న్మతిమంతుల కుండఁదగుఁ గు
పతికడ వసియించునతఁడు వడయునె సుఖముల్? (3. 248, 249)

ఈపద్యములు సుమతీశతకకర్తపద్యములను స్మృతికిఁ దెప్పించుచున్నవి.

## III

సంస్కృతమార్కండేయపురాణాంతర్గతము లైన దేవతాస్తవములను గొన్నిటిని ననువదింపక వదలియుఁ, గొన్నింటి నతిసంగ్రహముగాఁ గుదించియుఁ, గొన్నింటిని మూలశ్లోకతాత్పర్యమును ఛాయామాత్రముగా నుంచుకొని స్వీయకల్పనలు జోడించియు మారనకవి తనస్వాతంత్ర్యమును బ్రకటించుకొనెను. (A) మూలమునుండి గ్రహింపక వదలినస్తుతుల కుదాహరణములు:

(1) సంస్కృతమార్కండేయమున దత్తాత్రేయమాహాత్మ్యము చెప్పఁబడు నవసరమునఁ బురాణకర్త యొకవిచిత్రమైనపద్ధతి ననుసరించెను. ఆకథలో బృహస్పతి యమరులకును, గర్గుఁడు కార్తవీర్యునకును, జడుఁడు తనతండ్రికిని నమ్మహర్షి మాహాత్మ్యమును జెప్పుచు భక్త్యావేశముతో నతనినిఁ గీర్తించెదరు. దత్తాత్రేయమాహాత్మ్య మనుభవమునకు వచ్చిన కథకున కట్టియావేశ ముండుట సహజము. కావున మారన దేవగురువైన బృహస్పతిచేత మాత్రము గుణకీర్తనము చేయించి (2. 222), మిగిలినవారిచే నట్టిప్రసక్తి చేయించుట మానివైచెను. దానివలనఁ బదిశ్లోకముల (16. 180-182; 17. 37-43) భావము తెలుఁగున రాలేదు. మూలకర్త పురుషోత్తమసంకీర్తనపారవశ్యము నాశింప ననువాదకర్త పునరుక్తినివారణమంత్రమును జపించెను.

(2) సంస్కృతమార్కండేయమున రౌచ్యమనుజన్మప్రకారము చెప్పఁబడిన సందర్భమున రుచి బ్రహ్మానుశాసనమునఁ బితృదేవతలప్రసాదముకొఱకు తప మూని వారిని వివిధస్తవములఁ గీర్తించినట్లు 93వ అధ్యాయమున వర్ణింపఁబడియున్నది.

(93. 13-42). మఱియు రుచికిఁ బితృదేవతలు ప్రత్యక్షమైనప్పుడు వారి నతఁడు స్తుతించినట్లు 94 అధ్యాయమున మొదటిపదునాఱుశ్లోకములందుఁ జెప్పఁబడినది. మారన 93వ అధ్యాయమునందలి పదిశ్లోకములనుమాత్ర మనువదించినాఁడు.[14] మిగిలినవి వదలినాఁడు. మఱల రెండవసారి రుచి "యనేకప్రకారంబులఁ బ్రస్తుతించె" (7.31) నని మాత్రము పేర్కొనెనేకాని స్తుతి ననువదింపలేదు. ఉపాఖ్యానపరిమితికి మించినస్తుతినిఁ జేపట్టుట మారనయభిమతము కాదని యిచ్చట మనము గ్రహింపవచ్చును.

(3) మహారాజవంశవర్ణనమున సూర్యజననప్రకారమును దెలుపుచు - నదితి సూర్యునిగూర్చి 23 శ్లోకములలో (101. 16-38) స్తుతి యొనర్చినట్లు సంస్కృతపురాణమున వర్ణింపఁబడియుండ మారన వానిలో నైదుశ్లోకములనుమాత్ర మనువదించెను.[15] సంగ్రహస్తోత్రరచనాప్రీతియే మారనచే నిట్లు చేయించిన దనవచ్చును.

(4) అర్కమాహాత్మ్యప్రతిపాదకమైన రాజవర్ధనరాజచరిత్రమున బ్రాహ్మణబృందము రాజున కాయుర్వృద్ధి గలుగుటకై సూర్యునిగూర్చి తప మాచరించుచు నద్దేవుని స్తుతించినవిధము సంస్కృతమున 14 శ్లోకములలో[16] వర్ణింపఁబడియుండ మారన యెనిమిదిశ్లోకములనుమాత్ర మనువదించెను.[17] స్తుతిబాహుళ్యము నరికట్టి కథార్థముల కత్యంతప్రాధాన్య మిచ్చుటకై మారన యీపద్ధతి ననుసరించె నని యూహింపవచ్చును.

**(B)** మూలమున విస్తారములై యున్న స్తుతులను సంగ్రహించినయట్టివాని కుదాహరణము లొండురెండు క్రింద నీయఁబడుచున్నవి :

(1) కువలయాశ్వచరిత్రమున నశ్వతరుఁ డొనర్చిన సరస్వతీస్తవమును మారన సంగ్రహ మొనరించెను. మూలము :-

శ్లో. జగద్ధాత్రీం మహాదేవీ మారిరాధయిషుః శుభామ్
స్తోష్యే ప్రణమ్య శిరసా బ్రహ్మయోనిం సరస్వతీమ్ ॥
సదసద్దేవి యత్కించి న్మోక్షబంధార్థవత్పదమ్
తత్సర్వం త్వయ్యసంయోగం యోగవ ద్దేవి సంస్థితమ్ ॥
త్వ మక్షరం పదం దేవి యత్ర సర్వం ప్రతిష్ఠితమ్
(అక్షరం పరమం దేవి సంస్థితం పరమాణువత్ ॥) (తరం. పె. ప్రతి)
అక్షరం పరమం బ్రహ్మ జగచ్చైత త్క్షరాత్మకమ్
దారుణ్యవస్థితో వహ్ని ర్భౌమా శ్చ పరమాణవః ॥
తథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేద మశేషతః
ఓంకారాక్షర సంస్థానం య త్తే దేవి స్థిరం స్థితమ్ ॥ (స్థిరాస్థిరమ్)

---

14. మార్కం. మహాపు. 93. 13, 14, 16, 20, 32, 31, 33, 36, 41, 42.
15. మార్కం. మహాపు. 101.16-20 = మారనమార్క. 7.90-94.
16. మార్కం. మహాపు. 106. 62-74 & 78.
17. మార్కం. మహాపు. 106. 62-69 = మారనమార్క. 7. 156-159.

తత్ర మాత్రాత్రయం సర్వ మస్తి యద్దేవి నాస్తి చ
త్రయోలోకా స్త్రయో వేదా స్త్రైవిద్యం పావకాస్త్రయః ॥
త్రీణి జ్యోతీంషి వర్ణా శ్చ త్రయోధర్మా దయ స్తథా
త్రయోగుణా స్త్రయశ్శబ్దా స్త్రయో దేవా స్తథా శ్రమాః ॥
త్రయః కాలా స్తథావస్థాః పితరోఽహ ర్నిశాదయః
ఏత న్మాత్రాత్రయం దేవి తవరూపం సరస్వతి ॥
విభిన్నదర్శనా మాయా బ్రహ్మణో హి సనాతనీ
సోమ సంస్థా హవి స్సంస్థా పాకసంస్థా శ్చ సప్తయాః ॥
తా స్త్వదుచ్చారణా ద్దేవి ప్రాప్య న్తే బ్రహ్మవాదిభిః
అనిర్దేశ్యం తథాచాన్య ద్దర్ధమాత్రాశ్రితం పరమ్ ॥
నచాస్యేనన త జ్జిహ్వా తాల్వోష్ఠాదిభి రుచ్యతే
ఇంద్రోపి వసవో బ్రహ్మ చంద్రార్కౌ జ్యోతి రేవచ ॥
విశ్వావాసం విశ్వరూపం విశ్వేశం పరమేశ్వరమ్
సాంఖ్యవేదా న్తవేదోక్తం బహుశాఖా స్థిరీకృతమ్ ॥
అనాదిమధ్యనిధనం సదసన్న సదేవతు
ఏకం త్వనేకం నాప్యేకం భవభేదై స్సమాశ్రితమ్ ॥
అనాఖ్యం షడ్గుణాఖ్యం చ వర్గాఖ్యం త్రిగుణాశ్రయమ్
నానాశక్తిమతా మేకం శక్తి వైభావికం పరమ్ ॥
సుఖాసుఖం మహాసౌఖ్య రూపం త్వయి విభావ్యతే
ఏవం దేవి త్వయావ్యాప్తం సకలం నిష్కలం చ యత్ ॥
అద్వైతావస్థితం బ్రహ్మ యచ్చ ద్వైతే వ్యవస్థితమ్॥
యేఽర్థా నిత్యా యే వినశ్యన్తి చాన్యే
యే వా స్థూలా యే చ సూక్ష్మా శ్చ సూక్ష్మాః।
యేవా భూమౌ యే న్తరి క్షేన్యతో వా
తేషాం సత్యం త్వత్త ఏ వోపలబ్ధిః ॥
యచ్చామూర్తం యచ్చ మూర్తం సమస్తం
యద్వాభూతే ష్వేక మేకం చ కించిత్
యద్దేవ్యస్తి క్ష్మాతలే ఖేఽన్యతో వా
తత్సంబద్ధం తత్స్వరై వ్యఞ్జనై శ్చ ॥ (21.31-48)

**మారన యనువాదము :**

క. దారువునం దనలంబును
ధారుణిఁ బరమాణువులును దద్దయు నున్న

ట్లారాధనీయమూర్తివి
భారతి ! నీయందు నుండు బ్రహ్మము జగమున్.

క. అరయ నీనెల వగు నోం
కారము మాత్రాత్రయమునఁ గాదే యుండు
న్భారతి ! సదసన్మయ మగు
సారాసారద్వయంబు సంపన్నంబై.

వ. దేవీ ! యనిర్దేశ్య స్వభావంబును బ్రణవార్థమాత్రాశ్రితంబును వికారరహితంబును దాలుదంతోష్ఠపుటజిహ్వావ్యాపారదూరంబును సాంఖ్యవేదాంతోక్తంబును నాది మధ్యాంతరహితంబును నై వెలుంగు పరంజ్యోతి నీస్వరూపం బిట్టి దని నిరూపింప నెవరికి శక్యంబు నిత్యంబులు ననిత్యంబులు స్థూలంబులు సూక్ష్మంబులు నైన బహువిధపదార్థంబులు నీవలన నుద్భవిల్లు నీస్వరవ్యంజనంబులం జేసి సమస్తంబు సంవ్యాప్తంబై యుండు నీమహామహిమ యవాఙ్మానసగోచరం బని యనేక ప్రకారంబులం బ్రస్తుతించినఁ బ్రసన్నయై సరస్వతి...... (3. 50-52)

అశ్వతరుఁడు వాగ్దేవిని మెప్పించి సంగీతవిద్యావిశారదత్వమును బొంది దానిచేఁ బరమేశ్వరుని మెప్పించి యాదేవునిప్రసాదమువలన మదాలసను బుత్త్రికగాఁ బడసెను. కావునఁ గథలో వాణీపరమేశ్వరులకు సమానప్రాధాన్యము కలదు. మూలమున వాణీస్తుతి యతివిపులముగను, శివస్తుతి ప్రస్తావనమాత్రముగను రచింపఁబడినవి. అవి కథాప్రయోజనానుకూలముగా లేవని మారన గమనించి, వాణీస్తుతిని సంగ్రహించియుఁ శివస్తుతిని విస్తరించియుఁ గథార్థములకు సార్థక్యము గల్పించినాడు. కావున, నిది యతనిరచనాశిల్పభాగమై యౌచిత్యపోషక మగుచున్నది.

(2) దుర్గాసప్తశతియందు శుంభనిశుంభదానవసంహారార్థము సురలు దేవినిగూర్చి యొనరించిన స్తవమును మారన సంగ్రహముగా ననువదించెను.[18] ఉదాహరణమునకు : "నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమోనమః" - అను మకుటముతోఁ గీర్తింపఁబడిన యిరువదియొక్క శ్లోకములను (82.15-35) మారన యొక సీసపద్యమునందు (6.133) గుదించివైచెను.

(c) మారన మూలభావముల నూఁతగాఁ గొని స్వీయప్రతిభాశక్తితో స్వతంత్రకల్పములైన స్తోత్రములు రచించిన ఘట్టము లీపురాణమునఁ గలవు. మారన యట్టివాని పట్ల ప్రత్యేకాభినివేశము ప్రకటించియున్నాఁడు. మచ్చున కొండురెండుదాహరణ లీయఁబడుచున్నవి:

(1) వైవస్వత మన్వంతరగాథలో దేవదేవర్షిగణములు తపనుని స్తుతించిన విధము మూలమున 12 శ్లోకములలో (75.2-13) వర్ణింపఁబడియున్నది. మారన వాని

18. మార్క. పు. సహ. 82. 7. 40 = మారనమార్క. 6. 130-134.

నన్నింటి ననువదింపవలె నని తలంపక స్వతంత్రములును, ధారామధురములును సరళ సుందరములు నైన పద్యములలో నుతించెను. ఉదా:

ఉ. నా కివియేల నాక విని నవ్వక నిచ్చలు నీవె యర్ఘ్యముల్
గైకొనుమాడ్కి మానుతులు గైకొను నీకరుణావిలోకన
శ్రీకి నివాసమై వెలయఁజేయుము మమ్ము సమస్తలోకశో
భాకర! యోదివాకర! ప్రభాకర! భక్తజనప్రభాకరా!

చ. సలిలము లాదిగాఁ గలుగు సర్వపదార్థములు న్బవత్కరం
బులు వెడ సోకినం గరము పూతతఁ బొందుఁ ద్రిలోకవర్తనం
బులును సమస్తకర్మములు పొల్పుగ నీ వుదయింపకుండినన్
నిలుచుఁ జరాచరాత్ముఁడవు నీవు దివాకర! భక్తశంకరా! (5.355-356)

తియ్యని తెలుఁగు పలుకుబడియును, మనసును గఱఁగించు విన్నపంపు ధోరణియును, చవులూరించు నాశుకవిత్వధారయును, సరసశతకకవిత్వశిల్పమును బుణికిపుచ్చుకొనిన యీపద్యములు మారనస్తుతిరచనాపాటవమునకు గీటురాళ్ళు!

(2) సప్తమాశ్వాసమున విశ్వకర్మ సూర్యతేజశ్శాత మొనర్చుచుఁ జేసిన దివాకర స్తుతి మూలమునఁ బదునొకండుశ్లోకములలో (104.1-11) నొనర్పఁబడియున్నది. మారన వానిలో మూఁడింటిని మాత్రమే గ్రహించి వానిలోనిభావములను చికిలిపెట్టి విశిష్ట వ్యక్తిత్వము గల పద్యబంధములను మూఁడింటిని నిర్మించెను.

శ్లో. క్షణ ముదయాచలమౌళిమణిః సురగణమహితహితో జగతః
త్వ మురుమయూఖసహస్రవపు ర్జగతి విభాసి తమాంసి నుదన్। (104.6)

చ. కనదరుణాంబుజాతనవకాంతి నుదంచితచారుకాం
చనరుచిఁ దప్తతామ్రవిలసద్ద్యుతి నూత్నలసత్ప్రవాళదీ
ప్తి నిజతనూద్గతాంశుతతి దిక్కులఁ బర్వి వెలుంగ నొప్పు నీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. (7.112)

శ్లో. రథ మధిరుహ్య సమావయవం చారువికంపిత మురురుచిరమ్
సతత మఖిన్నహయైః భగవం శ్చరసి జగద్ధితాయ వితతమ్. (104.8)

చ. అనుపమవేగసత్త్వసముదంచితవాహనవాహ్యమానకాం
చనరథచక్రసంకషణచారుసుమేరునగేంద్రసానుసం
జనితసువర్ణరేణుచయసంతతభూషితదీప్తి యైన యీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్॥. (7. 124)

మూలశ్లోకభావములకు మించిన యూహాసంపదయు, భావసమున్నతికిఁ దగిన శయ్యా

సౌభాగ్యమును, నాయకమణివోలె భాసించు మకుటప్రభయుఁ జేరి పైపద్యములు మారన శైలీముద్రతో గంభీరములై భాసించుచున్నవి.

శ్లో. భవతిమిరాసవపానమదా ద్భవతి విలోహితవిగ్రహతా
మిహిర విభాసి యతః సుతరాం త్రిభువనభావనభానికరైః ॥ (104. 7)

చ. ఘననిశిడాంధకారరిపుఖండనచండమయూఖరాజిచే
ననుదినము న్నభాతములయం దమృతాంశుమరీచివేఁడిగా
వనజము లుల్లసిల్లఁగఁ దొవల్ మొగుడ న్నభమాద్రిఁ బొల్చు నీ
దినమణికి న్నభోమణికి దేవశిరోమణి కేను మ్రొక్కెదన్. (7. 123)

సూర్యునియరుణిమకు తిమిరాసవపానమత్తతను హేతువుగా భావించి చమత్కరించినాఁడు మూలకర్త. జగత్సాక్షిని మదిరాపానమత్తునిగా భావింపఁజాలకపోయినాఁడు మారన. తిమిరరాక్షససంహారవీరునిగా రౌద్రమూర్తిగా నాదిత్యుని భావించి చండమయూఖము లాతని యనుభావములుగా నిబంధించి వర్ణించినాఁడు. స్వజనరక్షణ విజనశిక్షణస్ఫూర్తి వనజముల నుల్లసిల్లఁ జేయుటలోను, కలువలను ముకుళింపఁజేయుటలోను సూర్యనారాయణుఁడు ప్రకటించుచుండె నని మారన యొకవిశేషార్థమును వ్యంజింపఁజేసెను.

(3) దుర్గాసప్తశతియందు సుర లొనరించిన మహిషాసురమర్దనీస్తుతి 23 శ్లోకములలో (81. 3-25) రచింపఁబడియుండ మారన దాని నంతయు గ్రహింపక దాదాపు 10 శ్లోకములభావమును మాత్రము గ్రహించి యనువదించెను. ఈస్తుతియం దెడనెడ స్వతంత్రచ్ఛాయలు కానవచ్చుచున్నను, భావానువాదమునకుఁ జక్కనియుదాహరణములనఁదగు పద్యముల నైఁదింటిని (6. 117-118; 121-123) పంచరత్నములవలె నిర్మించియుండెను. వానిలో మచ్చునకు

శ్లో. దృష్ట్వాతు దేవి కుపితభ్రుకుటీకరాల
ముద్యచ్ఛశాంకసదృశచ్ఛవి యన్నసద్యః ।
ప్రాణా న్ముమోచ మహిష స్తదతీవ చిత్రం
కైర్జీవ్యతే హి కుపితాంతకదర్శనేన ॥ (81. 13)

ఉ. భూరి సముద్యదిందురుచిఁ బొల్చి పటుభ్రుకుటీకరాళమై
దారుణకోపతీవ్ర మగు తావకవక్త్రము చూచినప్డ యా
సైరిభదానవుండు వెసఁ జావమి చోద్యముగాదె భైరవీ!
యేరికిఁ బ్రాణముల్ నిలుచునే కుపితాంతకదర్శనంబునన్. (6. 121)

శ్లో. యాశ్రీః స్వయం సుకృతినాం భవనే ష్వలక్ష్మీః
పాపాత్మనాం కృతధియాం హృదయేషు బుద్ధిః ।
శ్రద్ధా సతాం కులజనప్రభవస్య లజ్జా
తాం త్వా నతాః స్మ పరిపాలయ దేవి విశ్వమ్ ॥ (81.5)

చ. సుజనులయందు లక్ష్మి యయి, సూరిజనంబులయందు బుద్ధి యై
కుజనులయం దలక్ష్మి యయి, గోత్రపవిత్రులయందు లజ్జ యై
ద్విజవరులందు శాంతి యయి, విస్ఫురణం జెలువొందుదేవి కే
ము జయజయధ్వను ల్సెలఁగ మ్రొక్కెద మర్థిఁ ద్రిలోకరక్షకై. (6.122)

ప్రజాసృష్టి, భూగోళవివరణాధ్యాయములందు మారన మనుష్యదంపతుల వర్ణగుణ క్రియాదులను వర్ణించునవసరమునఁ బదునైదుశ్లోకములను (46. 19-33), పట్టణగ్రామ ఘోషపరిమాణములు సెప్పునెడ ప్రమాణ (కొలతల) వివరములు తెల్పెడి యైదుశ్లోకములను (46. 36-40), గంగావతరణఘట్టమున నాఱుశ్లోకములను (53. 21-26), విడిచి యుండెను. కూర్మసంస్థానవర్ణనమున దాదాపు ముప్పదిశ్లోకములభావ మొక్కసీసమునఁ గుదించి రచించెను.[19] కావున భౌగోళికాద్యంశవివరణమునందును మారన సంగ్రహాత్మకమైన కథనపద్ధతినే యవలంబించినాఁ డని స్పష్టమగుచున్నది. సర్గాదికథార్థములు వస్తుతః అద్భుతైకరసముద్రితములు. వానియందు వివరణాత్మకములును, నీరసములునైన వానిని తగ్గించి మారన యౌచిత్యము పాటించెను.

## IV

మారనమహాకవి మార్కండేయపురాణకథార్థములను సంగ్రహించుటయం దౌచిత్యము నవధిగా నుంచుకొని సార్థకమైనరచన మొనర్చుటకు యత్నించెను. ఈక్రింద నీయఁబడుచున్న యుదాహరణము లాకవి వివిధకథాసందర్భములందుఁ బ్రకటించిన ప్రతిభావివేకములఁ జాటుచున్నవి.

(1) మార్కండేయపురాణారంభమున జైమినిముని యొనరించిన మహాభారతప్రశంస పదునొకండుశ్లోకములలో విరచింపఁబడియున్నది. మారన వానిలో నాఱింటిని[20] దెనుఁగుచేసి, మిగిలినవానిని[21] వదలివైచెను. అనువదింపని శ్లోకములు చాలవఱకు శేషశ్లోకములతాత్పర్యమునకు వివరణప్రాయములును, పునరుక్తిప్రాయములునై యున్నవి. మారన 1 అధ్యా. 2వ శ్లో.ము ననువదించుచు—

చ. వినుము మునీంద్ర! వేదనిధి విష్ణునిభుండు పరాశరాత్మజుం
డనఘయశుండు సర్వనిగమార్థయుతంబును సర్వధర్మసా
ధనమును సర్వశాస్త్రకలితంబును సర్వకథాభిశోభితం
బును నగు భారతంబు కృతపుణ్యుఁ డొనర్చె సవిస్తరంబుగన్. (1.4)

అని విస్తరించి చెప్పిన తెనుఁగుపద్యమునందు పైశ్లోకముల తాత్పర్యము గతార్థ మగుచున్నది. మఱియును ఆంధ్రమహాభారతాదిపర్వమునఁ బైశ్లోకార్థములు చెప్పఁబడి

19. మార్కం. మహాపు. 55. 4, 32 = మారనమార్క. 4.185.
20. మార్కం. మహాపు. 1. 2, 4, 5, 10, 11, 12.
21. మార్కం. మహాపు. 1. 3, 6, 7, 8, 9.

యున్నవి. వానిని "చతుర్వర్గ వర్గానుబంధబంధుర కథేతిహాసంబులును, చతుర్వర్ణా శ్రమధర్మకర్మంబులును".[22] "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని..."[23] యనెడి గద్యపద్యభాగములం దనుసరించియున్నాఁడు. నన్నయయనువాదము నెఱిఁగినవాఁ డగుటచే మారన లనపురాణము 'సర్వకథాభిశోభిత' మని యమూలకమైన విశేషణముచేఁ గీర్తించియున్నాఁడు. మిగిలినవి తెలుఁగుభారతమునఁ జెప్పఁబడిన వని కాఁబోలు వదలి నాఁడు. మారన గైకొన్న శ్లోకములను గూడ గుడ్డిగా ననువదింపలేదు.

శ్లో॥ త్రిదశానాం యథా విష్ణు ర్ద్విపదాం బ్రాహ్మణో యథా
భూషణానాం చ సర్వేషాం యథా చూడామణి ర్వరః॥

యథాయుధానాం కులిశ మింద్రియాణాం యథా మనః
తథేహ సర్వశాస్త్రాణాం మహాభారత ముత్తమమ్॥ (1.4-5)

వీనిని 1.5పద్యముగా ననువదించుచు భూషణములలో వరచూడామణివలె, నాయుధము లలోఁ గులిశమువలె నను ఉపమానములను మారన యనువదింపక వదలినాఁడు. మిగిలిన వానిలో నింద్రియములలో మనస్సువలె ననుఉపమానము నాదియం దుంచినాఁడు. భార తము సర్వశాస్త్రములలో నుత్తమ మైన దని మూలమున నుండ- "ఎక్కుఁడై భారతంబు వెలయు సకలదివ్యపురాణవితతిలోన"యని మార్చినాఁడు. మారన వ్రాయుచున్నది మహా పురాణము. అయ్యది మహాభారత ప్రశస్తితో నారంభించుచున్నది. భారతము పౌరాణి కులచే వివిధపురాణసముచ్చయ మని కీర్తించిబడుచున్నది. కావున మారన దానిని దివ్యపురాణశ్రేష్ఠ మని కీర్తించియుండవచ్చును.

(2) మార్కండేయుఁడు జైమినిమునికిఁ జెప్పిన ద్రోణచరిత్రమునందు నారద మహర్షి దేవేంద్రునియెదుట రంభామేనకాదులలో నృత్యపాండిత్యమునం దెవ్వతె మిన్న యను సంశమునకు సమాధానము చెప్పుచు :

శ్లో. గుణరూపవిహీనాయా స్సిద్ధి ర్నాట్యస్య నాస్తి వై
చార్వధిష్ఠానవన్నృత్యం నృత్య మన్య ద్విడంబనమ్॥ (1.36)

అని పేర్కొనినట్లు మూలమునఁ గలదు. ఇది శాస్త్రార్థవిషయ మని కాబోలు మారన యనువదింపలేదు. ఉపాఖ్యానములందు సూక్ష్మాంశవివరణము సేయకుండుట నన్నయ యనువాదపద్ధతిలోఁ గాననగును. మారన యామార్గము ననుసరించెను

(3) శమీకమహర్షి కురుక్షేత్రమున గజఘంటానిలయమున నున్న ధర్మపక్షుల నాదరించి నకులశ్యేనమార్జాలమూషకాదులవలనిభయము లేకుండ నతిప్రయత్నమున నిజాశ్రమమున రక్షింప శిష్యుల కుద్బోధించుచుఁ బలికిన యీక్రిందిమాటలను మారన యనువదింపలేదు

22. ఆంధ్ర మహాభార. ఆదిపర్వ. 1.31. 23. ఆంధ్ర మహాభార. ఆదిపర్వ. 1.32.

శ్లో. ద్విజాః కింవాతి యత్నేన మార్యంతే కర్మభిః స్వకైః
రక్ష్యంతే చాఖిలా జీవా య థైతే పక్షిబాలకాః ॥

తథాపి యత్నః కర్తవ్యో నరైః సర్వేషు కర్మసు
కుర్వ న్పురుషకారన్తు వాచ్యతాం యాతినో సతామ్ ॥ (2.62-63)

ఆవంత యవకాశము దొఱికినఁ జాలు - అమోఘమైన యుపదేశవాక్యముల నుచ్చరింపఁ జేయుట ఋషియైన మూలకర్త స్వభావము. లౌకికుఁడైన కవి వాని కథార్థసార్థక్యమును గణించి యనువదించుకొనును. శమీకమహర్షి శిష్యులతో "నొయ్యన నెత్తికొని రం"డని పనిచెను. ఆతనిచిత్తమున నాపక్షిసంతానమును సాధ్యమైనంతత్వరలో సురక్షితప్రాంతమునకుఁ జేర్పింపవలయుననెడి యాత్రము గోచరించుచున్నది. వేగవృత్తి గల చిత్తము దీర్ఘసంభాషణము సేయ నిచ్చగింపదు కావున మారన పైవాక్యముల ననువదింపక విడచి శమీకమునిచిత్తవృత్తిని సహజముగాఁ జిత్రింప యత్నించెను.

(4) ధర్మపక్షులు శమీకమహర్షికి స్వీయపూర్వజన్మవృత్తాంతము నెఱిఁగించుచు- సుకృశుఁడు పక్షిరూపమున నున్న ఇంద్రునికిఁ దనశరీరము నాహారముగా సమర్పించుచు నీక్రిందిమాట లనినట్లు మూలము :

శ్లో. ఏతావ దేవ విప్రస్య బ్రాహ్మణత్వం ప్రచక్ష్యతే
యావత్పతగజాత్యగ్ర్య స్వ సత్యపరిపాలనమ్ ॥

నయజ్ఞై ర్దక్షిణావ ద్భి స్తత్పుణ్యం ప్రాప్యతే మహత్
కర్మణాన్యేన వా విప్రై ర్య త్సత్యపరిపాలనాత్ ॥ (3.47-48)

ఇందు స్వీయసత్యవ్రతప్రాశస్త్యమును దానే పొగడుకొనుచుండుటచే సుకృశునకు వికత్థనత్వదోష మేర్పడవచ్చు నని మారన యేతద్వాక్యములను దొలఁగించి పాత్రపోషణము గావించెను. హరిశ్చంద్రోపాఖ్యానాదులలో సత్యవ్రతమాహాత్మ్యము విశదముగా వర్ణింపఁ బడియుండుటచే నిచ్చట నేతన్మాత్రశ్లోకతాత్పర్యము వలనఁ బురాణోపదేశగౌరవమునకు లాఘవ మేర్పడ దని మారన యభిప్రాయమై యుండవచ్చును.

(5) జైమినిముని ధర్మపక్షులను దర్శించి భారతార్థములను బ్రశ్నించుఘట్టము మూలమున నిఱువదియైదుశ్లోకములలో నుండ మారన యందు దాదాపు సగముభాగము ననువదింపక వదలెను. జైమిని ధర్మపక్షులకు స్వస్తివచనపూర్వకముగాఁ దన నెఱింగించుకొని పితృశాపదుఃఖము నుపశమింపఁ జేయు సాంత్వనవచనములచే వారి నాశ్వాసించెను.

శ్లో. మన్యు ర్నఖలు కర్తవ్యో యత్పిత్రాతీవ మన్యునా
శప్తాః ఖగత్వ మాపన్నా సర్వథా దిష్టమేవ తత్ ॥

స్ఫీతద్రవ్యే కులే కేచి జ్జాతాః కిల తపస్వినః
ద్రవ్యనాశే ద్విజేన్ద్రాస్తే శబరేణ సుసాన్త్వితాః ॥

దత్వా యాచన్తి పురుషా హత్వా వధ్యన్తి చాఽపరే
పాతయిత్వా చ పాత్యన్తే త ఏవ తపసః క్షయాత్ ॥
ఏతద్దృష్టం సుబహుశో విపరీతం తథా మయా
భావాభావ సముచ్ఛేదై రజస్రం వ్యాకులం జగత్ ॥
ఇతి సంచిన్త్య మనసా నశోకం కర్తు మర్హథ
జ్ఞానస్యఫల మేతావ చ్ఛోక హర్షై రధృష్యతా ॥ (4.10-14)

ఈ జైమిని వాక్యములను మారన యనువదింపక వదలెను. పరమజ్ఞానులైన ద్రోణనందనుల కీయుపదేశ మనవసర మను తలంపున మారన వదలెనేమో కాని జైమినిముని యీవాక్యములలోఁ బక్షులఁ బరామర్శించుట యెంతయో యుచితముగాఁ గానుపించుచున్నది. మారన యీవాక్యములను వదలియు - మూలమునందలి 4.18 శ్లోకము ననువదించుచు-

క. మాయొడళులలో నుండెడు
నాయతపితృకోపవహ్నియంతయు నడఁగెన్
శ్రీయుత ! భవద్విలోకన
తోయంబులఁ జేసి సకలదుఃఖచ్యుతిగాన్. (1.104)

అనుపక్షులమాటలను యథాతథముగాఁ బేర్కొనెను. జైమినిపరామర్శ కీవాక్యములు సమాధానములుగా నున్నచో నాంధ్రమున మఱియు శోభించియుండెడివి.

మూలమున ధర్మపక్షులు జైమినిముని నడిగిన కుశలప్రశ్నలు తెలుఁగున రాలేదు.

శ్లో. కచ్చి త్తే కుశలం బ్రహ్మ న్నాశ్రమే మృగపక్షిషు
వృక్షే ష్వథ లతాగుల్మ త్వక్సార తృణజాతిషు ॥
అథవా నైత దుక్తం వై సమ్య గస్మాభి రాదృతైః
భవతాం సంగమో యేషాం తేషా మకుశలం కుతః ॥ (4. 19-20)

"అథవా నైత దుక్తం వై" అనుచునే యీప్రశ్నల నడిగించుట యేల యని మారన వదలియుండవచ్చును. ప్రాయికముగా నిట్టి కుశలప్రశ్న లడుగుట ఋషిమర్యాదవలెఁ గానుపించుచున్నది. అట్టి లాంఛనమే కాకపోయినచో అందు విశేష మేమియుఁ గానరాదు. కావున మారనదృష్టి నాకర్షించియుండియుండును!

జైమిని మార్కండేయమహర్షి నడిగిన భారతార్థసంశయములనే ధర్మపక్షుల నడిగెను. మూలమున నాప్రశ్నలు రెండుతావులందును నైదేసిశ్లోకములలో వివరింపఁబడియున్నవి. మారన యేతత్పునరుక్తి నివారించి యీఘట్టమున "నతఁడు మార్కండేయు నడిగినయట్టుల నన్నియర్థంబులు నడుగుటయు" నని మాత్రము రచించెను.

(6) పాంచాలీభర్తృపంచకకథాంశవివరణము సేయునెడ ధర్మపక్షులు ద్రౌపది శచీదేవ్యంశమున జన్మించె నని చెప్పినట్లు తరంగిణీప్రెస్ (మద్రాసు) ప్రతిలోఁ బేర్కొనఁబడియున్నది.

శ్లో. పంచధా భగవా న్నిత్య మవతీర్ణ శ్శతక్రతుః
పౌలోమీ యాహి సంభూతా సాత్వియం ద్రుపదాత్మజా ॥
పంచానాం మహిషీ చైషాఽ భూ ద్విప్రాంశావతారి(ణీ) ణాం
ద్రుపదస్యగృహేజాతా పౌలోమీ సా పతివ్రతా ।
జాతస్య పంచధా జిష్ణోః ప్రీణనాయ మహీతలే
తస్యోత్పన్నా మహాభాగా పత్నీ కృష్ణా హుతాశనాత్ ॥
శక్ర స్యైకస్య సా పత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్ ॥ (5.26-29)

ఈశ్లోకములలో 'తస్యోత్పన్నా మహాభాగా...' అను శ్లోకపాదమునకు ముందున్నభాగము వేంకటేశ్వరప్రెస్ (బొంబాయి) ప్రతిలోఁ గానరాదు. పర్గిటరువంటి పురాణపరిష్కర్త లీశ్లోకములను గ్రహించినారు. మహాభారతమునందు ద్రౌపది లక్ష్మీదేవ్యంశమున జన్మించె నని చెప్పఁబడుటవలనఁ గలిగిన కథార్థవైరుధ్యమును మార్కండేయపురాణము తొలగించుచున్న దనియు వారు భావించుచున్నారు.[24] మారన దీని ననువదింపలే దనఁగా నాతఁ డనుసరించిన సంస్కృతపురాణప్రతియందును నీయంశము లేదనియే భావించుట యుచితము కాఁగలదు.

(7) శైబ్య దుఃఖితుఁడైన హరిశ్చంద్రునితో సత్యవాక్యపాలనప్రభావమును

శ్లో. నాఽతః పరతరం ధర్మం వద న్తి పురుషస్య తు
యాదృశం పురుషవ్యాఘ్ర స్వసత్యపరిపాలనమ్ ॥ (8.18)

అని తెలిపి, యంతటితో నాగక తదుపబలకముగా నీక్రింది రెండుశ్లోకములనుగూడ ప్రతిపాదించినది.

శ్లో. అగ్నిహోత్ర మధీతం వా దానాద్యాశ్చాఖిలాః క్రియాః
భజన్తే తస్యవైఫల్యం యస్యవాక్య మకారణమ్ ॥
సత్య మత్యంత ముదితం ధర్మశాస్త్రేషు ధీమతామ్
తారణాయానృతం తద్వ త్పాతనాయా కృతాత్మనామ్ ॥ (8.19-20)

మారన "అధిప ! మేటిధర్మంబు సత్యంబ యండ్రు" అను ప్రధానతాత్పర్యమును మాత్రము సూత్రప్రాయముగా వెలువరించి, గతానుగతికములైన యీరెండుశ్లోకములను స్పృశింపక వదలియుండును !

(8) ఆడిబకయుద్ధవృత్తాంతమున వసిష్ఠుఁడు విశ్వామిత్రుని శపించుటకుఁ గల హేతువును వివరించి చెప్పినట్లు మూలమునఁ గలదు.

---

24. "The Mahabharata, however, presented a further difficulty, for why should Lakshmi have become incornate to be the wife of incornations of Indra ? The birds alter this, declaring (again at variance with Mahabharata) that it was Indra's wife who became incornate as Draupadi".
—Markandeya Purana - Intro. by F.E. Pargiter. P. xviii.

శ్లో. శ్రుత్వా నరాధిప మిమం స్వరాజ్యా దవరోహితమ్
మహాత్మానం మహాభాగం దేవబ్రాహ్మణపూజకమ్ ॥
యస్మా త్స సత్యవా క్ఛాన్త శ్శత్రా వపి విమత్సరః
అనాగా శ్చాపి ధర్మాత్మా హ్యప్రమత్తో మదాశ్రయః ॥
సపత్నీపుత్రభృత్య స్తు ప్రాపితోఽన్త్యాం దశాం యతః
స రాజ్యా చ్చ్యావితోఽనేన బహుశ శ్చ ఖిలీకృతః ॥
తస్మా ద్దురాత్మా బ్రహ్మ ద్వి ట్ప్రాజ్ఞానా మవరోధకః
మచ్ఛాపోపహతో మూఢ స్సబకత్వ మవాప్స్యసి॥ (9.6-9)

ఇందు చివరశ్లోకముయొక్క యుత్తరార్ధము తప్ప మిగిలినశ్లోకములన్నియుఁ దెలుఁగున ననువదింపఁబడలేదు. పైశ్లోకములందలి హరిశ్చంద్రగుణకీర్తనము వసిష్ఠశిష్యవాత్సల్యమును, విశ్వామిత్రనిందను, తద్గలమత్సరభావమును వ్యక్తపఱచుచున్నవి. అయినను హరిశ్చంద్రవిశ్వామిత్రపాత్రలగుణశీలములు హరిశ్చంద్రోపాఖ్యానపఠనముచేఁ బఠిత గ్రహించియుండును. కావునఁ దత్పునరుక్తి యనవసర మని భావించి మారన యాభాగమును వదలియుండవచ్చును.

ఈయుపాఖ్యానమునందే యాడిబక యుద్ధమువలనఁ గలిగిన ప్రాణిక్షయమును దేవతలు పితామహునకు విన్నవింప నాబ్రహ్మ యాయుద్ధము మాన్పుటకై భూలోకమునకు వచ్చె నని కలదు. మారన దేవతలవేడికోలుభాగము ననువదింపక వదలివైచెను.

(9) మదాలస యలర్కున కుపదేశించిన రాజనీతి మార్కండేయపురాణమున నిఱువదినాల్గవయధ్యాయమున ముప్పదినాలుగుశ్లోకములలో వర్ణితమై యున్నది. వానిలోని నిఱువదియేడుశ్లోకములను మారన యనువదించి, యీక్రిందిశ్లోకములను వదలెను :

శ్లో. జ్ఞేయాగ్ని విస్ఫులింగానాం, బీజచేష్టా చ శాల్మలేః
చంద్రసూర్యస్వరూప శ్చ నీత్యర్థే పృథివీక్షితా ॥
బంధకీ పద్మ శరభ శూలికా గుర్విణీ స్తనాత్
ఏవం సామ్నా చ భేదేన ప్రదానేన చ పార్థివ ॥
దండేన చ ప్రకుర్వీత నీత్యర్థం పృథివీక్షితా
ప్రజ్ఞా నృపేణ వాదేయా తథా చండాలయోషితః॥ (24.20-22)

సూర్యచంద్రాదులరూపములను రాజు తాల్పవలె నని 23వ శ్లోకమునఁ జెప్పఁబడియుండుటవలనను, బంధక్యాద్యుపమానము లుదాత్తములు కాకుండుటచేతను మారన యీమూఁడింటిని వదలియుండును. 23వ శ్లోకములో శక్రార్కయమసోమరూపములను దాల్పవలె నని సూత్రప్రాయముగాఁ జెప్పి తరువాతిశ్లోకములలో రా జాయారూపములఁ దాల్చి సాధించుప్రయోజనములను గ్రమముగా మూలకర్త వివరించియుండెను. వానిలో మారన చంద్రపవనరూపములుగా రా జెట్లు భాసించునో చెప్పెడి మూలశ్లోకములను అనువదింపలేదు. అవి :

శ్లో. పూర్ణేందు మాలోక్య యథా ప్రీతిమాన్ జాయతే నరః
ఏవం యత్ర ప్రజాః సర్వా నిర్వృతా స్తచ్ఛశివ్రతమ్ ॥
మారుతః సర్వభూతేషు నిగూఢశ్చ రతే యథా
ఏవం చరే న్నృప శ్చారైః పౌరామాత్యారిబంధుషు ॥
నలోభార్థేన కామార్థే నార్థార్థే యస్య మానసమ్
పరార్థే కృష్యతే ధర్మా త్సరాజా స్వర్గ మేష్యతి ॥ (24.27-29)

మారన యీశ్లోకములనుగూడ యనువదించియుండినచో మూలతాత్పర్యము విశదమయి యుండెడిది.

(10) అత్రిమహర్షిప్రోక్త మైన యతిథిపూజావిధానమునందు మాంసాన్నశాకాదు లతిథుల కర్పింపవలె నని యుండ నచ్చోట మారన ఫలమూలాన్నశాకములను జెప్పెను.[25] మాంసభక్షణము పాపహేతు వని నమ్ము దక్షిణభారతవాసి యగు బ్రాహ్మణుఁడు కదా మారన! పైపెచ్చు సోమయాజిశిష్యుఁడు!

(11) స్వారోచిషమనుసంభవకథయందు విప్రుఁడు హిమనగముపైఁ దిరుగుచు పాదౌషధమును గోల్పోయి విచారించెడిసందర్భమున మూలమునం దీశ్లోకములు కలవు :-

శ్లో. ప్రయాస్యామి క్రియాహాని మగ్నిశుశ్రూషణాదికమ్
కథ మత్ర కరిష్యామి సంకటం మహదాగతమ్॥
ఇదం పర మిదం రమ్య మిత్యస్మి న్వరపర్వతే
సక్తదృష్టి రహం తృప్తిం నయాస్యే ఉబ్దశతై రపి ॥
కిన్నరాణాం కలాలాపాః సమస్తా చ్ఛ్రోత్రహారిణః
ప్రపుల్లతరుగంధాం శ్చ ఘ్రాణ మత్యంత మృచ్ఛతి॥
సుఖస్పర్శ స్తథా వాయుః ఫలాని రసవన్తి చ
హరన్తి ప్రసభం చేతో మనోజ్ఞాని సరాంసి చ॥
ఏవం గతే తు పశ్యేయం యదికం చి త్తపోధనమ్
సమమోపదిశే న్మార్గం గమనాయ గృహంప్రతి॥ (58. 29-33)

మారన యీభాగమున మొదటిచివరిశ్లోకములను మాత్రము గ్రహించి యొకపద్యము వ్రాసెను. మిగిలినవానిని వదలెను. పాదలేపనము కఱిగిపోయినతరువాత విప్రునిచిత్తము నందు నిత్యనైమిత్తికకర్మలనుగూర్చియు, నిలు సేరునుపాయమునుగూర్చియు మాత్రమే విచారము తీవ్రముగా జనింపఁజేసి, హిమవద్గిరిసౌందర్యదర్శనమునందు వైముఖ్యము కలిగిన దని సూచించుట మారనయభిమతము. ఆసన్నివేశమునం దిట్లు చిత్రించినచో పాత్రమనోగతభావచిత్రణమునం దత్యంతసహజత్వము భాసింపఁగలదు. మారన చూపిన యీబాటయే అల్లసాని పెద్దనకుఁ గూడ అనుసరణీయమైనది !

25. మార్కం. మహాపు. 26.28 = మారనమార్క. 3.169.

(12) హిమనగసానువులపై నొంటరిగా నున్న వరూథినిఁ గాంచి విప్రుఁడు పలికిన వాక్యములు :

శ్లో. కా త్వం కమలగర్భాభే కస్య కింవానుతిష్ఠసి ?
బ్రాహ్మణోఽహ మిహాయాతో నగరా దరుణాస్పదాత్ ॥
పాదలేపో ఽత్ర మే ధ్వస్తో విలీనో హిమవారిణా
యస్యానుభావా దత్రాహ మాగతో మదిరేక్షణే॥ (58. 44-45)

మారన దీని ననువదించుచు "నీ వెవ్వతె ? విచట నేకతంబ యేల యున్నదాన" వని విప్రునిచే నడిగించి యాపైనఁ 'దనతెఱంగంతయు నెఱింగించిన' (4.235)నని పూర్వకథా పునరుక్తిని వారించెను. మారన యీఘట్టమును సంగ్రహ మొనరించి యొక యౌచిత్యమును బాటింపఁగా పెద్దన యీభావములను మలచి యొక రసవత్తరమైన పద్యశిల్పమును నిర్మించెను.[26]

(13) వరూథిని విప్రునిపైఁ దనకుఁ గలిగిన వలపును వ్యక్తముచేసినప్పు డతఁ డామెతో నన్నమాటలలోఁ గొన్నింటిని మారన గ్రహింపలేదు.

శ్లో. ప్రశస్య తేన ప్రవాసో బ్రాహ్మణానాం కదాచన
అపరాధ్యతి మే భీరు దేశదర్శనకౌతుకమ్॥
సతో గృహే ద్విజాగ్రస్య నిష్పత్తిః సర్వకర్మణాం
నిత్యనైమిత్తికానాం చ హాని రేవం ప్రవాసినః॥
సా త్వం కిం బహునోక్తేన తథా కురు యశస్విని
యథా నాస్తంగతే సూర్యే పశ్యామి నిజమాలయమ్॥ (58. 50-52)

బ్రాహ్మణునకుఁ బ్రవాసము దోషము. సర్వదా గృహవాసము విధి. ప్రవాసమువలన నిత్యనైమిత్తికకర్మహాని వాటిల్లు ననెడి ప్రాచీనార్షనియమములయందు మారనకాలమునాఁటికే వచ్చిన కొంతసడలింపు ఈవాక్యముల నాతఁడు గ్రహింపకుండ చేసియుండవచ్చును :

(14) మనోరమావిభావరీకలావతులతోఁ గలసి విహరించు స్వరోచినిగుఱించి కలహంసీచక్రవాకపక్షులు జరిపినసంవాదమునందుఁ గలహంసి మాటలను కొన్ని మారన యనువదింపక వదలెను.

శ్లో బహుపత్నీ పతి ర్లోకః శరణం పుణ్యపాపయోః
గృహాశనాసనా ద్యైశ్చ భూషణై శ్చ సహాగమైః॥
విషమైః క్రియమాణే హి యుజ్యతే మహదేన సా
జ్యేష్ఠాంకనీయో భావేన కనిష్ఠాం జ్యేష్ఠతాం నయేత్।
గురవేతు వరం దత్త్వా హుత్వాన్యాం సమిధం యథా
ఊఢయా సహ సర్తవ్యా నిత్యనైమిత్తికీః క్రియాః॥
జగాదాధాన్యభావేన పాపీయా జ్ఞాయతే నరః॥ (62.19-22)

26. మనుచరిత్రము 2.39.

మారన యీభాగము ననువదించునెడ నీవాక్యములు వదలి పాత్రోచితసంభాషణవిరచనా కౌశల్యమును బ్రకటించెను. చక్రవాకి స్వరోచిబహుభార్యాత్వమును నిరసించుచు నేకపత్నీ వ్రతమును సమర్థించినది. "ఒక్కని మన మొక్కతెయందు నొకతె మన మొక్కని యందు నిలుచుఁ దిర మయి" యను మానసికతత్త్వమును జెప్పుటయే యిచ్చట పరమ తాత్పర్యము: మానవులయందుఁ గానఁబడు నిష్టిసంఘనీతి పశుపక్ష్యాదులందు కానరాదు కాని కలహంసీచక్రవాకములలోఁ జక్రవాకము విలక్షణమైనది; తనజాతిసహజలక్షణ మైన విశృంఖలకామమును త్యజించి, యుత్తమత్వమును గడించినది. కావునఁ దనకంటె నుత్తమజన్ముఁ డయ్యు వర్తనమునఁ దనకంటె హీనుఁడైన స్వరోచిని విమర్శించినది. వలపునకు సంబంధించినంతవఱకు ఈసన్నివేశము సహజముగానే కనుపట్టును. కాని, యాచక్రవాకమే పుణ్యపాపచర్చలకుఁ గాని నిత్యనైమిత్తికక్రియావిధినిర్ణయములకుఁ గాని దిగినచో నది యసహజ మని పఠితకు వెంటనే స్ఫురింపఁగలదు. అయిన ధర్మ పక్షులు పక్షులు కావా? వానికి జ్ఞానస్ఫూర్తి లేదా? యనవచ్చును. కాని వానికథ వేఱు; వీనికథ వేఱు. కావునఁ కథానుకూలములును, పాత్రచిత్తవృత్తులకు సహజములును. నైన వాక్యసముదాయముల నెన్నుకొని మిగిలినవానినిఁ ద్యజించుటలో మారన యౌచిత్య దృష్టి స్పష్టమగుచున్నది:

(15) ఉత్తమమన్వంతర మహిమాభివర్ణనమునందు విప్రుఁ డొకఁడు రాక్షసా పహృత మగు నిజధర్మపత్నినిఁ దెచ్చియిమ్మని యుత్తమునిఁ గోరుచు గార్హస్థ్యధర్మమున భర్తకు భార్య రక్షణీయ యని చెప్పెడి సందర్భమున నతఁడు పలికిన కొన్నిమాట లను వదింపఁబడలేదు. అవి:

> శ్లో. అనుజ్ఞాయ గురుం రాజ న్దత్త్వాన్యాం జాతవేదసే॥
> సమిధం తు మయాభార్యా వృతేయం కర్కశాయతః
> కథ మేతాం విహాయాన్య భార్యయా సహ సంచరే॥
> గృహ్యా ధర్మో యతో బ్రహ్మ ప్రాప్యతే శాశ్వతం నరైః
> పూర్వోఢయా తు ధర్మేణ గృహీ కుర్వ న్నసీదతి॥
> త్యక్త్వా తాం చ క్రియాం కుర్వ న్నైవకర్మఫలం లభేత్
> అగ్నినా సహయానూనం సా జగామ గృహం శుభా॥
> ధర్మస్య గ్రహణే సా తు పూర్వోఢైవ ప్రశస్యతే
> శఠాయా దారణా త్తస్యా జాయతే వర్ణసంకరః॥ (66.38-42)

అగ్నిసాక్షిగా వివాహమాడినభార్యను భర్త విడనాడరా దను ధర్మమును బోధించు నీ వాక్యములు 66.35-37; 43-45 శ్లోకభావముల కుపబలకములే కాని విశేషాంశప్రతి పాదకములు కామిచే మారన వీనిని యనువదింపకపోయియుండవచ్చును. లేక వేంకటేశ్వరప్రెస్‌ప్రతిలో నీ శ్లోకములు ప్రక్షిప్తము లని భావింపఁబడుచున్నవి కావున మారన యనుసరించిన ప్రతిలో నివి యుండియుండకపోవచ్చును.

(16) రాజ్యవర్ధనమహారాజుచరిత్రమునఁ బౌరులు తా మాదిత్యునివలనఁ బడసిన వరమును ప్రభువున కెఱిఁగింప -

క. మానుగఁ జెప్పిన విని య
మ్మానిని యానంద మొందె మానవనాథుం
డాననము వంచి యొకవడిఁ
దా నూరక పలుకకుండెఁ దద్దయు చింతన్.

క. చింతాక్రాంతుం డగు నృప
కాంతున కక్కాంత యేమికారణ మధిపా!
సంతోషవేళ వికల
స్వాంతుఁడ వై యిట్టు లున్నవాఁడ ?...... (7.167-168)

వని పలుకరించినది. ఈఘట్టమునఁ బై రెండుపద్యములనడుమ మూలమునందలి యీక్రిందిశ్లోకములభావ మనువదింపఁబడలేదు.

శ్లో. తతః సా మానినీ భూపం హర్షపూరితమానసా
దిష్ట్యాఽఽయుషా మహీపాల వర్ధస్వేత్యాహ తం పతిమ్ ॥
తథా తయా ముదా భర్తా మానిన్యాథ స భాషితః
నాహ కించి న్మహీపాల శ్చిన్తాజడమనా ద్విజ ॥
సా పునః ప్రాహ భర్తారం చిన్తయాన మధోముఖమ్
కస్మా న్న హర్ష మభ్యేషి పరమాభ్యుదయే నృప ॥
దశవర్షసహస్రాణి నీరుజః స్థిరయౌవనః
భావీత్వ మద్యప్రభృతి కిం తథాపి న హృష్యసే ॥ (107. 8-11)

ఈకథాంశవివరణమువలనఁ బ్రస్తుతకథలో సాధింపఁబడు విశేషప్రయోజన మెట్టిదియుఁ గానరామిచే మారన వదలి యుపాఖ్యానమును సంగ్రహించియుండవచ్చును.

(17) వృషధ్రుఁడు బాభ్రవ్యమునిజనకుఁ డగు అగ్నిశాలియొక్క ధేనువును బ్రమాదవశమునఁ జంపెను. అందుల కామునితనయుఁడు క్రుద్ధుఁడై యారాజును శూద్రుఁడవు కమ్మని శపించెను. ఆరాజు క్రుద్ధుఁడై బాభ్రవ్యునకుఁ బ్రతిశాప మిచ్చెను. అందులకు బాభ్రవ్యుఁడు మండిపడి యారాజును బొలయింపఁ బోయెను. అప్పుడు తజ్జనకుఁ డైన యగ్నిశాలి తనపుత్త్రుని వారించి, సహనమును బోధించెను (7.202.) మూలమున నామహర్షి - క్రోధమువలనఁ గలుగు ననర్థములను నాలుగుశ్లోకములలోఁ (109. 13-16) జెప్పినట్లు కలదు. మారన సంగ్రహీకరణదృష్టితో వాని ననువదింపక వదలివైచెను.

(18) కరంధముఁడు భార్యాప్రేరితుఁడై శత్రురాజులచే బంధితుఁడైన యవేక్షితుని విడిపించి విశాలునిపాలికిఁ గొంపోయెను. విశాలుఁడు స్వయంవరవత్త యైన తనకన్యను వివాహమాడు మని యడుగఁగా నవేక్షితుఁ డిట్లనెను :

ఉ. ఈనళినాక్షి చూడ నని నెంతయు వైరుల కోడి యే నిసీ!
దీని వరింతునే మగుడ; దీనినె కాదు వరింపనొల్ల నిం
కేనెలఁత; న్నిజం బిది; యహీనపరాక్రముఁ డైన వానికిం
దీని నరేంద్ర! యి మ్మిదియు నెమ్మి వరింపఁగ నిమ్ము తద్విభున్. (8.124)

మూలమున నీపాత్ర మఱియు నీక్రిందివాక్యము లనినట్లు కలదు:

శ్లో. పరైః పరాజితోఽహం యత్కాతరేయం యథాఽబలా
కి మత్ర మానుషత్వం మే నైతస్యా మమ చాన్తరమ్॥
స్వతంత్రతా మనుష్యాణాం పరతంత్రా సదాఽబలా
నరోఽపి పరతంత్రోఽయ స్తస్య కీదృ ఙ్మనుష్యతా॥
సోఽహ మస్యాముఖం భూయో దృష్టం దర్శయితా కథమ్
యోఽహ మస్యాః పురోభూమౌ పరై ర్భూపైః ఖిలీయతే॥ (121.28-30)

ధీరోదాత్తుఁడును, మహాభిమానియు నైన యవేక్షితుఁడు శత్రువుల కోడి యాకన్యకుఁ దగ నని మాత్రమే చెప్పుకొనుట యొప్పును. కాని, పరాధీనతచే నబలాతుల్యుఁడ నైతి నని తెలపడు నవసరము లేదు. కావున మారన పైవాక్యములను గ్రహింపక పాత్రశీల పోషణము గావించెను.

(19) కిమిచ్ఛకవ్రతావసరమునఁ గరంధముఁ డవేక్షితునిఁ బౌత్రముఖదర్శన వరముఁ గోరి, పుత్త్రునితో "నకారణబ్రహ్మచర్యంబు పాపహేతువు; దానిఁ బరిత్యజింపు" (8.154) మని బోధించినతరువాత నాంధ్రమున రాని కొంతమూలభాగము కనవచ్చు చున్నది. అది:-

అవీక్షిదువాచ:

శ్లో. విషయం స్యా న్మహారాజ యదన్య త్తత్సమాదిశ
వైరాగ్యేణ మయాత్యక్తః స్త్రీసంభోగ స్తథా స్తు సః॥

రాజోవాచ:

శ్లో. బహుభి ర్యుద్ధ్యమానానాం దృష్టో వై వైరిణాం జయః
తత్రాపి యది వైరాగ్య ముపైషి తదపండితః॥
మాతు స్త్వ మిచ్ఛయా వక్త్రం పౌత్రస్య మమ దర్శయ॥

మార్కండేయ ఉవాచ:

శ్లో. యదా స బహుశస్తేన ప్రోక్తః పుత్రేణ పార్థివః
నాన్య త్ప్రార్థయతే కించి త్తదా పుత్రోఽబ్రవీ త్పునః॥ (122.26-29)

ఈ శ్లోకములలో నవేక్షితుఁ డొనర్చిన వైరాగ్యప్రసక్తి కథార్థముల కుపబలకముగా లేదు. స్వాభిమానపోషణార్థమై బ్రహ్మచర్యము పూనెనే కాని యవేక్షితుఁడు విరాగి కాలేదు. వైరాగ్యశబ్దార్థశక్తి ప్రాపంచికసర్వసంగత్యాగమును వ్యంజింపఁజేయుచున్నది. అవేక్షితుఁ డట్లగుట యానంతరకథార్థములకు విరుద్ధము కావునఁ బూర్వాపరకావ్యార్థపర్యాలోచనసమర్థుఁడైన మారన దురన్వయార్థములను వదలి రచనాశిల్పమును రక్షించెను.

(20) మరుత్తరాట్చరిత్రలో వీరమహాదేవి మనుమునికిఁ బంపిన సందేశమునందు (126.21-39) సారవంతములును, సందర్భోచితములును నైన వాక్యములను మాత్రము గ్రహించి మిగిలినవానిని (126.28-32) మారన యనువదింపక యౌచిత్యమును బ్రకటించెను.

మారన పురాణమును రచించుచున్నను విరళబంధముల నిర్మించి నిబ్బరములేక నడచినవాఁడు కాఁడు. శిల్పివలె ననువాదమును చికిలిపెట్టి మెఱుఁగులు దిద్దినాఁడు.

## V

మారన స్వభావముచే రసలుబ్ధుఁడు. శాస్త్రాదివిషయములందు సంగ్రహమైనరచన మొనర్చియు, రసభావోద్దీపన కుపస్కారకము లగు విషయములను విస్తరించి వర్ణించి స్వతంత్రప్రతిభాపాటవమును బ్రదర్శించిన ఘట్టము లాతనిరచనలోఁ బెక్కులు కలవు. మచ్చున కొకకొన్ని యంశము లీక్రింద నుదాహరింపఁబడుచున్నవి.

### ప్రకృతి వర్ణనలు :

కావ్యమునందు ప్రకృతివర్ణన లుద్దీపనవిభావము లయి, యాలంబన విభావో ద్దీపన కుపబలకములై భాసించుచుండును. ప్రకృతిగతమైన చంద్రమలయానిలవృక్ష లతాగుల్మాదులయథాస్థితినిఁ బ్రత్యక్షీకరింపఁ జేయుటలో సామాన్యముగాఁ గవి తన కున్న వర్ణనాపటిమను వ్యర్థముచేయుచుండును. కాని శిల్పదృష్టి కల కవి యావర్ణనలు కథార్థ ములకుఁ గాని, పాత్రలమనోభావములకుఁ గాని పోషకములుగా నుండునట్లు చిత్రించి, సార్థకమైన రచనమును వెలార్చుచుండును. మారనకు శిల్పదృష్టి సహజముగా నుండు టచేఁ బ్రకృతివర్ణనలను మూలానుసారిగా నొనర్పవలె ననెడి పరిమితదృష్టితో కాక కథార్థరామణీయకమును దృష్టియం దుంచుకొని యొనర్చిన ట్లీక్రింది యుదాహరణముల వలన స్పష్టము కాఁగలదు.

1. మార్కండేయపురాణప్రథమపాదమున వింధ్యపర్వతవర్ణనము కలదు. అవి పురాణప్రవర్తకులైన ధర్మపక్షులపవిత్రనివాసము. జైమినిమహర్షి మార్కండేయమహర్షి ప్రోక్త ద్రోణపుత్త్రచరిత్రము విని యాజ్ఞానపక్షులు నివసించు నచ్చోటును గనవలెనను ఉత్కంఠతో వింధ్యనగము చేరినాఁడు. మూలకర్త యాభాగమున "జగ్మః శిఖరిణాం శ్రేష్ఠం విన్ధ్యం ద్రుమలతాయుతమ్" (3.84) అని వర్ణించినాఁడు. ఇందు శిఖరిశబ్దముచేతఁ బర్వతౌన్నత్యమును, శ్రేష్ఠశబ్దముచేత దాని మహాత్మ్యమును, ద్రుమలతాయుత మనుటచే నారణ్యసంపదయు మూలకర్త వ్యంజింపఁజేయుచున్నాఁడు. మారన వింధ్యము నింత సంగ్రహముగా వర్ణించి యూరుకొనఁజాలకపోయినాఁడు. అంబరచుంబి యైన వింధ్యౌన్న త్యము నలంకారసుందరముగా నావిష్కరించినాఁడు.

తే. పద్మరాగఘనశోణమణిప్రభలు మెఱయఁ
జంద్రకాంతచంద్రద్యుతిజాల మెసఁగ

బహులతరవజ్రనక్షత్రపంక్తి వెలుఁగ
నంబరస్పర్థి యైన వింధ్యంబుఁ గనిరి. (1.95)

రూపకాలంకారబంధురముగా రత్నద్యుతి సూర్యచంద్రనక్షత్రకాంతిగాఁ జెప్పి తత్పర్వతౌజ్జ్వల్యసాతత్యమును మారన వ్యంజింపఁజేసెను. అంబరస్పర్ధిత్వమున వింధ్యనగస్వభావమును దేటపఱచెను. అపూర్వవస్తుదర్శనముచేత జైమినికిని, అపూర్వవస్తువర్ణనముచేతఁ బఠితకును మారన యబ్బురపాటు కల్పించి తద్భావమును "తదీయరామణీయకంబున కచ్చెరువందు" యనుటలో సూచించి, తత్పర్వతశోభను విపులముగా వర్ణించి తత్పోషణము కావించెను. ఆవర్ణనయందును అంబరస్పర్థిత్వకల్పనానుస్మృతి యనుస్యూతముగా వచ్చునట్లు నిబంధించెను.

సీ. సురకరి యీయద్రిఁ జరియించు నేనుంగుఁ
గొదమలఁ గ్రీడబద్ధకొదమ యొక్కొ !
నవకల్పలతిక లీనగముశృంగంబుల
యందొత్తిపాఱిన యంబులొక్కొ !
హరశిరోరత్న మీయచలంబుమణులపెం
ప్రోవుల కడపటి పొల్ల యొక్కొ !
పరమేష్ఠియంచ యీగిరికొలంకుల యంచ
పిండులోఁ దప్పిన పిల్లయొక్కొ !
తే. యని నుతింపుచుఁ జేరి సంయమికుమార
పఠ్యమాన నానాగమాభ్యసన చతుర
కీరనికరోల్లస త్సహకారవన వి
రాజితం బైన తత్కందరంబునందు. (1.97)

ఉత్ప్రేక్షాలంకారోల్లాసితమైన యీపద్యము జైమినిమునిహృదయవర్ధిష్యమాణాద్భుతభావావిష్కారమునకు మణిదర్పణమువంటిది. సురకరి, కల్పలత, హరశిరోరత్నము (చంద్రకళ), చతుర్ముఖవాహనము - ఇవన్నియు స్వర్గవస్తువులే. అంబరస్పర్థియైన వింధ్యము వానికంటె శ్రేష్ఠములైన వస్తువులను దనయందమర్చుకొనె ననుట యలంకారప్రయోగసార్థక్యము ! పైనాలుగుచరణములక్రమవికాసము విచారించినచో నామునివరుఁడు కొండచఱియలను, శృంగములను గ్రమముగా నధిరోహించి, నగశిఖరమణిద్యుతి దర్శించి, తపోవననికటభూములయం దుండు సరోవరములఁ బొడగాంచె ననెడి యన్వయము స్పష్టము కాఁగలదు. ధర్మపక్షులు వసించు నాశ్రమము కణ్వాశ్రమము వలె ఋషికుమారులవేదాధ్యయనముతోడను, నానాగమాభ్యాసచతురములైన కీరాదుల కలస్వనములతోడను, సహకారవృక్షసంతతితోడను రాణించె ననుటవలన ద్రోణనందనమాహాత్మ్యము వ్యంగ్యముగాఁ దెలుపఁబడుచున్నది. వేదార్థోపబృంహితము లైన పురాణాగమాదులు వేదగానాధ్యయనకలధ్వనిచేఁ బ్రతిధ్వనిత మగురంగమున జనించె ననుటలో శిల్పసార్థక్యము కల దని మారనవర్ణనలోఁ గల పరమతాత్పర్యము.

(2) సన్నివేశమున కుచితమైనట్టియు, సంగ్రహమైనట్టియు వర్ణనము సేయునేర్పు మారన రైవతోద్యానవనవర్ణనమునందుఁ బ్రకటించెను. మూలమునఁ బదునైదుశ్లోకములలో నవ్వనవర్ణన మున్నది :— (6. 9-23)

అందు వివిధవృక్షఫలపుష్పపక్షిజంతుసంతానశోభితమైనవనము మనకన్నుల ముందు ప్రత్యక్ష మగును. సంస్కృతపురాణకర్త యీవర్ణనము సేయునెడ వివిధవృక్షాదులనామములను దెలుపుపట్టీలను జతకూర్చి, శ్లోకముల నల్లి తనవ్యుత్పత్తినిఁ బ్రకటించినాఁడు. మారన యీవివరణము పెట్టుకొనలేదు. పాత్రచిత్తావస్థానుకూల మైన ప్రకృతిసౌందర్యమునే బలరామునిచేత దర్శింపఁజేసినాఁడు. శిల్పియైన కవి యట్లుచేయును. బలరాముఁడు "సమదలీల మదాంధగంధగజంబుచాడ్పునన్" రైవతశైలసానువనరమ్యతలమునఁ గ్రీడ సల్పుచుండెనఁట! మత్తవిలాసినీక్రీడాసక్తుఁడైన బలరాముఁడు తద్వనమున 'మిథున' పరంపరలనే కనుఁగొనఁజాలెను. 'వానినే నర్థిఁ జూచుచు' నల్లనల్లన నేగెను. ఆలంబనవిభావానుపోషకమైన యుద్దీపనవిభావపుష్టి మూలమునందుకంటె నిందు సార్థకముగాఁ గనవచ్చుచున్నది.

సీ. ఎనసి యొండొంటితో ననఁగి పెనంగెడు
నవలతాతరుమిథునములసొబఁగు
సహకారపల్లవాస్వాదనక్రీడలు
సలుపు కోకిల దంపతులబెడంగు
పొలయలుకలను దెల్పుచు నటించుచుఁ
గ్రాలు విటకులటాకులవిలసనంబు
సరసదాడిమఫలాస్వాదనలీలలఁ
గర మొప్పు శుకవధూవరులచెన్ను
తే. హంసవరటామనోజ్ఞవిహారవిభ్ర
మములఁ గొమరారు కమలషండములభాతి
నర్థిఁ జూచుచు హలధరుం డల్లనల్ల
నేగి యొక్కెడ నొకపొదరింటిలోన. (1.134)

(3) స్వారోచిషమనుసంభవ వృత్తాంతమునఁ బ్రవరుఁడు దర్శించిన హిమత్పర్వతమును మారన మూలానుసారిగా గాక కథానుకూలముగా వర్ణించి శిల్పసౌందర్యమును బోషించెను. ఈయంశ మాఖ్యానశిల్పాధ్యాయమున వివరింపఁబడి యున్నది.

## యుద్ధ వర్ణనలు :

యుద్ధవర్ణనలు చేయునెడ మారన మూలమునం దున్న భావములను గ్రహించి వానిని స్వయంసమగ్రములుగా నుండునట్లు పెంచి, యొకసంపూర్ణతను ఘటించు సన్నివేశములుగాఁ దీర్చిదిద్దును. ఉదాహరణమునకు :— విశాలాస్వయంవరమునఁ బరాజితులైనరాజులు చతురంగబలసమేతులై అవేక్షితునితోఁ దలపడిరి. అవేక్షితుఁ డేకవీరుఁడై

వారిసైన్యమును బీసుఁగువెంటలు గావించెను. మూలకర్త యేకవీరపరాక్రమప్రదర్శనము నీక్రిందిశ్లోకములలో వర్ణించెను.

శ్లో. కస్యచి చ్ఛిచ్ఛిదే బాహూ మన్యస్య చ శిరోధరామ్
హృది వివ్యాధ చై వాన్య మన్యం వక్షస్యతాడయత్ ॥
కరశ్ఛిచ్ఛేద కరిణ స్తురగస్య తథా శిరః
రథస్యేషా స్తథైవాశ్వా న్రథ స్యాన్యస్య సారథిమ్ ॥ (120. 5-6)

వీనియందుఁ గాల్బలములను వధించినవిధముమాత్రము కొంతవిపులముగాఁ జెప్పఁబడి కరితురగసంహారము సంగ్రహపఱుపఁబడినది. రచనలో సరితూకము కుదురలేదు. మారన దానిని గమనించి యిట్లు పెంచి రచించెను.

సీ. కంఠదోరంతరకరపాదఖండన
క్రీడఁ గాల్బలముల గీఁటడంచి,
దంతకుంభాస్యహస్తప్రవిదారణ
కేళి నేనుంగుల నేలఁ గలిపి,
పదముఖకంధరాపార్శ్వవిపాటన
పరిణతి హయముల బారిసమరి,
రథ్యసారథికేతురథికాంగనిర్దళ
నప్రౌఢిఁ దేరుల నజ్జు సేసి,
ఆ. రక్తనదుల మాంసరాసుల మస్తిష్క
కర్దమముల భూతకలలములను
ఘోరమైనసమరధారుణిఁ బొలుపారె
నేకవీరుఁ డై యవేక్షింతుండు. (8. 104)

చతురంగబలవిదళనక్రీడాక్రమమును సీసము నాల్గుచరణములయందు నిబంధించుటయుఁ తత్సంగ్రామఫలరూపమైన శోణనదాదుల నాటవెలఁదియందుఁ జెప్పి వీరునివీరవిహారములను వ్యంజింపఁజేసి పద్యము ముగించుటయు మారన యిచ్చట చూపిననేర్పు. మూలమున లేని సర్వాంగపరిణతి తెలుఁగుపద్యమునఁ జెప్పకయ తెలియుచున్నది.

మార్కండేయపురాణమునందు మొత్తము పదునైదు యుద్ధఘట్టములు విపులముగా వర్ణింపఁబడినవి. అవి :—

| క్రమసంఖ్య | యుద్ధఘట్టములు | మూలము | అనువాదము |
|---|---|---|---|
| 1. | కందరవిద్యుద్రూపుల యుద్ధము. | 2.18-27 | 1. 36- 39 |
| 2. | ఆడిబక యుద్ధము. | 9.14-18 | 2. 10. 15 |
| 3. | కువలయాశ్వుఁడు పాతాళకేతుని దునుముట. | 19.80-89 | 2.329-337 |
| 4. | విష్ణువు మధుకైటభుల వధించుట. | 78.70-77 | 6. 50- 57 |

| క్రమసంఖ్య | యుద్ధఘట్టములు | మూలము | అనువాదము |
|---|---|---|---|
| 5. | దేవి మహిషాసుర సేనాపతులఁ దునుముట. | 79.39-80.20 | 6. 84-103 |
| 6. | దేవి మహిషాసురుని వధించుట. | 80.21-40 | 6.104-114 |
| 7. | దేవి ధూమ్రలోచనునిఁ జంపుట. | 83. 9-16 | 6.115-156 |
| 8. | దేవి చండముండులఁ గడతేర్చుట. | 84.1-26 | 6.161-164 |
| 9. | సప్తమాతృకలు శుంభనిశుంభాదులను వధించుట. | 85.30-87.28 | 6.174-218 |
| 10. | నాభాగుఁడు సైన్యమును దునుమాడుట. | 110.26-28 | 7.215-216 |
| 11. | విధూరదనందనులు కుజంభునితోఁ బోరుట. | 113.34-37 | 7.264-265 |
| 12. | వత్సంధ్రుఁడు కుజంభుని వధించుట. | 113.48-58 | 7.269-275 |
| 13. | అవేక్షితుఁడు రాజసమూహముతోఁ బోరుట. | 120. 3-20 | 8.101-110 |
| 14. | అవేక్షితుఁడు దృఢకేశుని వధించుట. | 123.17-25 | 8.166-170 |
| 15. | మరుత్తావేక్షితుల యుద్ధము | 128. 4-30 | 8.252-267 |

ఈఘట్టము లన్నింటియందును మారన మూలాతిశాయిగా రచనాశిల్పమును వెలార్చియున్నాఁడు. మచ్చునకు :—

(1) ఆడిబక యుద్ధమును వర్ణించుమూలశ్లోకము :—

శ్లో. తౌతు పక్షప్రహారాభ్యా మన్యోన్య స్యోరువిక్రమౌ
ప్రహరన్తౌ భయం తీవ్రం ప్రజానాం చక్రతు స్తదా. (9. 14)

మూలమునందు సంగ్రహముగాఁ జెప్పఁబడిన యీభావమును మారన తన యనువాదమునఁ బుష్టిమంతమును, విపులతరమును నొనర్చి తదుచితమైన ఛందమున దాని నావిష్కరించెను.

స్రగ్ధర : పత్త్రప్రోద్ధూతవాతప్రబలరయమున న్బర్వతశ్రేణి దూలన్
గాత్రోద్యత్సాంద్రదీప్తు ల్గగనము దిశలు న్గప్పుచుండంగఁ జంచ
న్నేత్రప్రాతంబులం దగ్నికణము లురల న్వీఁక నొండొంటిఁ దాఁకె
న్బత్రిద్వంద్వంబు లోకప్రకరము దలరన్ భైరవాటోపలీలన్. (2.10)

ఆద్యంతాక్షరగురువులును, సర్వలఘువైన నగణమున కిఱువంకల గురుబహుళమైన శాఖాద్వయమును గల పాదచతుష్టయము పక్షిద్వంద్వముయొక్క పత్త్రదైర్ఘ్యమును

వ్యజించుచున్నది. పద్యచరణము విలంబితగతితో నారంభమై, ద్రుతగతి మధ్యమున భాసించి, మఱల పాదాంతమువఱకు విలంబితగతితో నడచుచుండుటచే రంగమధ్యమునఁ బక్షులు చండవేగమున ఢీకొనుచున్నస్ఫూర్తి కలుగుచున్నది. రేఫాక్షరసంయుక్తపరుషాక్షరప్రాసము భైరవాటోపలీలను వ్యంజింపఁజేయుచున్నది. ఈరచనాశిల్ప మమూలకమైన సన్నివేశసాక్షాత్కారము కలిగించుచున్న దనుటలో విప్రతిపత్తి లేదు.

ఈపురాణమునందలి యుద్ధవర్ణనలను పాత్రలజాతిగుణాదివివక్షచే విభజించినచో నీక్రిందివిధముగాఁ బరిగణింపవచ్చును :—

| | | | |
|---|---|---|---|
| 1. | విహంగయుద్ధము | 1. | (2) |
| 2. | దేవదానవయుద్ధములు | 7. | (1, 4, 5, 6, 7. 8, 9) |
| 3. | నరదానవయుద్ధములు | 4. | (3, 11, 12, 14) |
| 4. | నరవీరులయుద్ధములు | 3. | (10, 13, 15) |

ఇందు మొదటివిధమున యుద్ధము తిర్యగాశ్రయ మగుటచే దానియందు రససిద్ధి లేదు. దేవదానవయుద్ధములందు మానవాతీతశక్తులమధ్య నేర్పడెడిసంఘర్షణ లధికముగా నుండును. కావున వానియందు రౌద్రాదిరసములు చాలవఱ కద్భుతానుప్రాణితములై యుండును. ఇఁక మిగిలిన యుద్ధభేదములలోఁ బురుషయత్నమున కధికావకాశ ముండును. కావున వీరాదిరసములు పుష్టిగాఁ బోషింపఁబడుచుండును. ఈతారతమ్యము మారనరచనయందు స్పష్టము కాఁగలదు ఉదా :—

**1. విహంగయుద్ధమునకు - ఆడిబకయుద్ధము :**

సీ. తామ్రలోచనసముద్ధత విస్ఫులింగపా
తములును దమముఖాగ్రములు గమర
సునిసితచండచంచుప్రహారములఁ బ
రస్పరపృథులపార్శ్వములు వ్రయ్య
నతిదీర్ఘదృఢచరణాహననముల న
న్యోన్యశిరస్థ్సలు లగలి పగుల
ఘనతరపక్షతాడనముల నితరేత
రస్థిరాంగములు జర్జరితములుగ
తే. ధరణిధరములు గూలఁగ ధరణి వణఁక
జలధు లుప్పొంగి కడవ గర్వులను సకల
భువనసంక్షోభముగఁ జలంబును బలంబు
డిగక నలువుమైఁ బోరె నాడియు బకంబు. (2. 12)

ఈపద్యము మూలమునందలి మూఁడుశ్లోకములకు (9. 15-17) భావానువాదము. ప్రచండద్వంద్వయుద్ధము క్రియాప్రధానముగా వర్ణింపఁబడి యున్నను, రసదీప్తి కనువైన విభావసిద్ధి లేమిచే నిది యుత్తమజాతికిఁ జెందినయుద్ధము కాజాలదు. అందువలననే కాఁబోలు మార్కండేయపురాణమున నిట్టియుద్ధ మొక్కటిమాత్రము వర్ణితమై యున్నది.

విహంగవీరునకును దానవవీరునకును మధ్య జరిగిన కందరవిద్యుద్రూపద్వంద్వ యుద్ధము మిశ్రజాతియుద్ధ మనవచ్చును. అది పైయుద్ధములకంటె గుణమున మిన్నయైనది. తద్వర్ణనావిశేషము లాఖ్యానశిల్పాధ్యాయమునఁ దెలుపఁబడినవి. దేవికిని మహిషాసురునకును మధ్య జరిగినయుద్ధ మీకోవకుఁ జెందినదయ్యుఁ గామరూపధారి యగుఁ దానవుఁడు మానవాదిరూపములను ధరించి రణము నిర్వహించెను గావున దానిని దేవదానవ యుద్ధభేదముగా గణించుట యుచితము.

**2. దేవదానవయుద్ధము:** దేవి రక్తబీజుని సంహరించుట:

ఉ. రక్కసుఘోరదేహమున రక్తకణౌఘము గ్రమ్మి చూడఁగా
నక్కజమై ధరం దొరిఁగె నందు జనించి యనేకదైత్యులే
దిక్కునఁ దారయై జగము దీటుకొనం గడు నిండఁ బర్విన
న్వెక్కసమంది యెంతయును విహ్వలు లైరి నిలింపు లందఱున్.

(అంత)—

ఉ. కాళి కరాళమైన ముఖగహ్వరము న్గడు విచ్చి యిట్టులా
ఖిలత రక్తబీజుమెయిఁ బెల్లుగఁ గ్రమ్మిన రక్త మంతయు
న్గ్రోలఁగ దేవి వెండియును గ్రూరతరాయుధరాజిఁ గ్రమ్మిన
న్గూలె నరక్తదేహుఁ డయి కుంభిని నద్దనుజుండు భూవరా!

(6. 182, 185)

ఈపద్యములందు వర్ణింపఁబడిన రక్తబీజునిరాక్షసమాయయు, తత్సంహారమున దేవి చూపిన దైవీశక్తియు నద్భుతావహములే. ఇందు లోకసహజమైన పౌరుషముకంటె లోకాతీతమైన యపూర్వశక్తియే భాసించుచున్నది. కాని, యీపురాణమున దేవదానవయుద్ధము లన్నియు నిట్లే మాయాసమరములై యుండలేదు. ఒక్కొక్కచో దానవు లపూర్వపాశవికబలసమన్వితులై దేవతలకుఁ దీరని సమస్య లగుటయు, వారిని సురలు దైవబలముతో గెలుచుచుండుటయు కానవచ్చుచుండును. శుంభనిశుంభ చండముండధూమ్రలోచన చక్షురాదులతోడి దేవి మొనర్చిన యుద్ధము లీకోవకుఁ జెందినవి.

**3. నరదానవయుద్ధము:** కువలయాశ్వుఁడు పాతాళకేతువును సంహరించుట:— మూలమున నీభాగము పదిశ్లోకములలో (19. 80-89) రచింపఁబడినది. మారన దానిని తొమ్మిదిగద్యపద్యములలో ననువదించెను. మూలముతోఁ బోల్చి చూచినచో మారన విపులరచన మొనరించె నని స్పష్టము కాఁగలదు.

శా. ధీరోదాత్తుఁడు శత్రుజిత్తనయుఁ డద్దివ్యాశ్వమున్ దాను నా
నీరేజాక్షియు నెక్కి యయ్యతలము న్నిశ్శంకత న్వెల్వడం
బ్రారంభించినఁ గాంచి కొంచ యసుర ల్పాతాళకేతుండు పెం
పారం దెచ్చిన కన్య వీఁ డొకఁడు శౌర్యస్ఫూర్తిఁ గొం చేఁగెడున్.

క. అని యాక్రోశించుచు వెసఁ
జని చెప్పిన దనుజవిభుఁడు సంధ్యారుణలో
చన దంతతాడనోగ్రా
స్యనితాంతామర్షభీషణాకారుం డై.

వ. రయంబున వెలువడి,

చ. చెలఁగుచు దైత్యసేనలు విశృంఖలవిక్రమలీల నేచి యు
జ్జ్వలవివిధాస్త్రశస్త్రరుచిజాలము పర్వఁ గడుంగడంక ముం
గల నడువంగ దానవుఁ డకంపితుఁ డై చనురాజనందను
న్నిలునిలు మంచుఁ గూడఁ జని నిష్ఠురనాద మెలర్ప నార్చున్.

ఆ. చుట్టుముట్టి వివిధసునిశితాస్త్రములు పైఁ
గురిసెఁ గదిసి యసురకోటియును ర
యమునఁ దీవ్రసాయకాసిగదాశూల
తతుల నన్నరేంద్రుతనయుఁ గప్పె.

ఆ. అట్లు దనుజవీరు లరవాయి గొనక త
న్మూరిశస్త్రవృష్టిఁ బొదువుటయును
నలతినగవుతోడి యలుకమోమున కొక
చెలు వొనర్ప శత్రుజిత్సుతుండు.

వ. గుణంబు సారించి మార్గణంబులు నిగిడించి,

శా. దైతేయప్రవిముక్తదారుణగదాదండాసినానాయుధ
వ్రాతంబు ల్విలసత్తదాభరణవర్మశ్రేణియుం జూర్ణ మై
పాతాళైకనికేతనాంతరమునం బర్వంగఁ జేసెన్ వెసన్
జాతామర్షత నక్కుమారుఁడు రణోత్సాహంబు దీపింపఁగన్.

సీ. చేసి సముల్లాసహాసభాసురతర
వక్త్రుఁడై యుజ్జ్వలత్త్వాష్ట్రబాణ
మసురవీరులమీఁద నతఁ డేసె నేసినఁ
దజ్జాతదారుణదహనశిఖలఁ
గాలి చర్మాస్థికపాలముల్ చటచట
ధ్వనులతో నెంతయు వ్రస్సి తొరఁగఁ
గపిలమునీశ్వరువిపులకోపాగ్ని సా
గరులు రయంబున గ్రాఁగినట్లు

తే. దగ్ధ లయిరి దానవులు పాతాళకేతుఁ
డాదిగా నొక్కవ్రేల్మిడి నంత విజయ

లక్ష్మిఁ గైకొని యమ్మహాలసయు దాను
దనపురంబున కరిగె ఋతధ్వజుండు. (2.329-337)

ఈఘట్టము ననువదించుచు మారన మూలాతిశాయి యైన రచనాశిల్పము వెలార్చెను. అది పాత్రస్వభావములను, భావానుభావములను, విశదీకరించుటలోను, సార్థకశబ్ద ప్రయోగ మొనర్చుటలోను గానవచ్చుచున్నది. ఈఘట్టమును 'ధీరోదాత్తుఁ' దని ప్రారంభించి, 'ఋతధ్వజుం' దని ముగించుట యొక చమత్కారము. శృంగారవీరము లందుఁ బ్రయోగింపఁ దగిన నాయకుఁడు ధీరోదాత్తుఁడు. కావ్యశాస్త్రానుసారముగా మారన ఋతధ్వజుఁ డెట్టినాయకుఁడో చెప్పినాఁడు. ఆదియం దిది చెప్పఁబడుటచే నీఘట్టము నాస్వాదించుటయందుఁ బఠిత కున్ముఖీకరణము గలిగింపఁబడినది. నాయకుఁడు ధీరోదాత్తుఁ డైనచోఁ బ్రతినాయకుఁడు సాధారణముగా ధీరోద్ధతుఁ డగుచుండును. ఇచ్చటఁ బాతాళకేతుఁడు ఉద్ధతుఁడే కాని ధీరుఁడు కాఁడు. ఇంతకుఁ బూర్వమే ఋతధ్వజబాణా హతికి బెదరి పాతాళమునకుఁ బరుగెత్తిన ఘనుఁ డాతఁడు. అందువలన మారన దానవుని ధీరోద్ధతుఁ డనలేదు. మఱియు 'దనుజవిభుండు సంధ్యారుణలోచనదంతతాడనోగ్రాస్య నితాంతామర్షభీషణాకారుండై' కువలయాశ్వునిపై లంఘించె నని వర్ణించుటలో 'నితాంతామర్ష'మును చెప్పి, స్థాయిరసపుష్టిలేని సంచారిభావ మాతనియందు నిబంధించి ధీరోద్ధతుని కుచితమైన రౌద్రరసస్ఫూర్తి యతనిలో లే దని వ్యంగ్యముగా సూచించెను. ఋతధ్వజుఁడు కూడ నమర్షభావమును బొందినట్లు 336వపద్యమునఁ జెప్పఁబడినది. కాని యది రణోత్సాహమును దీపించుచున్నదఁట; అనఁగా నాయకయుద్ధవీరమున కంగమై, పరిపోషకమైన దని కవిహృదయము; రసభావముల ననుభావములచేత వ్యక్తీకరించుటలో మారన యిచ్చట కృతకృత్యుఁడయ్యెను. అసురుఁ డరుణలోచన, దంత తాడన, ఉగ్రాస్యములచేత నమర్షభావమును, కువలయాశ్వుఁడు 'అలఁతినగవుతోడి యలుకమోము, సముల్లాసహాసభాసురతరవక్త్రము, అమర్షభావము'- అనునవి ప్రకటించి రణోత్సాహమును ప్రదర్శించెను. శౌర్యమున దానవుఁడు రాజకుమారునితోఁ దుల్యుఁడు కాఁడు. ఒకసారి యొంటిగా నోడి బలము విఱిగి పాఱినశత్రువు తన బలగము నండగాఁ గొని పునర్విజృంభణము సేయుచుండ ఋతధ్వజుఁ డెలనవ్వు నవ్వుట సహజము. తన యుద్యమమునకు భగ్నము కల్గింపయత్నించినందులకును, మునియాగమున కెగ్గు తల పెట్టినందులకును దానవునిపైఁ గినుక జనించుట నైజము. విజయలబ్ధిపై విశ్వాస మున్న యతఁడు సముల్లాసభాసురవక్త్రుఁ డగుట యౌచిత్యము; మూలమున నిట్టి స్పష్టమైన యమరిక లేదు.

ఈ భాగమున ఋతధ్వజుఁడు కర్తగాఁ గల వాక్యములు కొన్ని కలవు; దానవ భర్త కర్తగాఁ గల వాక్యములు కొన్ని కలవు. వీనిలో ఋతధ్వజపదమునుఁ గర్తగా నిరూపించునప్పుడు శత్రుజిత్సుతుఁడు, కుమారుఁడు, అను పదములను, కర్మగాఁ జేర్కొనునపుడు రాజతనయ, నరేంద్రతనయ శబ్దములను సార్థకముగా వాడుట యొక

విశేషము. 329 లో వాడిన శత్రుజిత్తనయ యనుసమాసము మదాలసాకరగ్రహణోత్సుకుఁడైన ఋతధ్వజుని యాభిజాత్యమును వ్యంజించుచున్నది. 334వ పద్యము చివర నుపయోగించిన తత్సమాసము భావినాయకరణవిజయమును సూచించుచున్నది. 336లోని కుమారశబ్దము సురసేనానిసామ్యమును వ్యంజించుచున్నది. రాజనందనశబ్దము పర్యాయముగాఁ బ్రయోగించుటవలన దానవు లాతనిని సామాన్యరాజపుత్రునిగా దలంచి రనియు, రాజతనయ, ఇంద్రతనయ శబ్దార్థములయందు గూఢముగా భాసించు బుధజయంత్యర్థములచే వారికి సైజముగా నుండు సురద్వేషము నీతనిపైఁ గ్రక్కుచుండి రనియుఁ దలంప వీలగుచున్నది. రాక్షసులపై నుజ్జ్వలత్వాష్ట్ర బాణ మనుసంధించె ననుటలో శత్రువుల మొరటుతనమును, దదుచితప్రతీకారమును కవి వ్యంజింపఁజేసెను. దానవులు శరాగ్నిచేఁ జిటికలో దగ్ధమైన సన్నివేశమును బ్రసిద్ధోపమానబలమునఁ బఠితకు స్ఫురింపఁజేయుట రచనాశిల్పము! ద్రుతగతితో రాజకుమారునిఁ జుట్టుముట్టిన రక్కసులదాడి లఘ్వాది యైన చంపకమాలావృత్తముచేతను, నాయకప్రతినాయకరణవిహారము లాటవెలఁదిపద్యములచేతను, గుణంబు సారించె నని చెప్పి గుర్వాది యైన శార్దూలము నెత్తుకొనుటయందును, శత్రుసంహారోన్ముఖమైన సన్నివేశమును నాయకచిత్తవృత్తిస్ఫోరక మగునట్లు సీసమున రచించుటయందును మారన కృతకృత్యుఁడై ఛందశ్శిల్పమును బోషించెను. 332, 336వ పద్యములలోఁ బ్రకటించిన వివరములును, శైలీసౌభాగ్యమును మారనసొత్తులే! ఇట్లీనరదానవయుద్ధమున రసదీప్తి కలుగునట్లు రచనాశిల్పము నిర్వహించిన మారన కవి ప్రశంసనీయుఁడు!

త్రిగుణాత్మకవిభాగము ననుసరించి పైనిఁ జేర్కొనఁబడిన యుద్ధములలోఁ గందరవిద్యుద్రూపులయొక్కయు, ఆడిబకములయొక్కయు యుద్ధములు తమోగుణప్రధానములనియు, షష్ఠాశ్వాసమునందలి యుద్ధములు సత్త్వతమస్సంఘర్షణాత్మకము లనియు, ధృతనాభాగులయొక్కయు, మరుత్తావేక్షితులయొక్కయు యుద్ధములు రజోగుణప్రధానము లనియు, మిగిలినవి రజస్తమోగుణసంఘర్షణాత్మకము లనియు విభజింపవచ్చును. నిర్వహణముల ననుసరించి 2, 10, 13, 15 సంఖ్యలు గల యుద్ధములు శాంతపర్యవసానము లనియు, మిగిలినవి శత్రుసంహారపర్యవసానము లనియుఁ బరిగణింపవచ్చును. నిర్మాణవిధానమునుబట్టి క్రియాబహుళము లనియుఁ, వాగ్వివాదప్రధానము లనియు, మిశ్రము లనియు లేక ఉభయము లనియు మూఁడువిధములుగా విభజింపవచ్చును. క్రియాబహుళములైన యుద్ధములు సంభాషణాదులప్రసక్తి లేకయే శస్త్రాస్త్రసంధానాదియుద్ధక్రియాప్రధానములై యొప్పుచుండును. దీనికి 3, 5, 6, 8, 10, 11, 12, 13 ఉదాహరణములు. పౌరుషవంతులగు వీరుల పరస్పరాధిక్షేపాదులుగాని, ప్రతిజ్ఞాదికములుగాని సంవాదరూపమున విపులముగా వర్ణింపఁబడిన యుద్ధములు 1, 15. మిగిలినవి యుభయములు. ఇట్టివిభాగముల కుదాహరణములు పురాణపఠనావసరమునఁ దెలియుట సులభము.

# VI

మారన కథార్థములందును రసపుష్టి కనువైన విస్తరణము గావించినఘట్టము లీపురాణమున ననేకములు కలవు. ఉదాహరణమున కొండురెం డిచ్చట పేర్కొనఁబడు చున్నవి :

(1) శ్మశానస్థలి మూర్ఛితుఁ డైన హరిశ్చంద్రునిఁ గాంచి, శైబ్య దుఃఖించినవిధము భావానువాదమునకుఁ జక్కని యుదాహరణము :

మూలము :-

శ్లో. యస్యాగ్రే వ్రజతః పూర్వం రాజానో భృత్యతాం గతాః
స్వోత్తరీయైః ప్రకుర్వన్తి నీరజస్కం మహీతలమ్ ॥
సోయం కపాలసంలగ్న ఘటీఘట నిరన్తరే
మృతనిర్మాల్య సూత్రాన్త ర్లగ్నకేశే సుదారుణే ॥
వసానిష్యంద సంశుష్క మహీపుట కమణ్డితే
భస్మాఙ్గారార్ధదగ్ధాస్థి మజ్జా సఙ్ఘట్టభీషణే ॥
గృధ్రగోమాయునాదార్త నష్టక్షుద్ర విహఙ్గమే
చితాధూమాయ తిరుచా నీలీకృత దిగన్తరే ॥
కుణపాస్వాదన ముదా సమ్ప్రహృష్ట నిశాచరే
చరత్య మేధ్యే రాజేన్ద్ర శ్మశానే దుఃఖపీడితః ॥ (8.211-215)

మారన యాంధ్రానువాదము :

సీ. రవి దాఁచి చూడంగ నవునట్టి నీమేన
నొదుగుమాలిన్యంబు గదిరియుండ.
శత్రుభీకరమైన శాతాసి నమరు నీ
కేల నీచపుఁబరికోల యుఁడ
లలితమకుటదీప్తిఁ బొలుచు నీశిరమున
శవసమర్పితమాల్యసమితి యుండ
విమలదివ్యాంబరావృతి నొప్పు నీకటిఁ
గుత్సితం బగు బొంతకోక యుండ

తే. చేసెనే దైవ మానతక్షితిపశేఖ
రప్రభాజాలసతతవిరాజమాన
చరణకమలసుందర ! హరిశ్చంద్ర ! సకల
బుధమనఃకైరవాకరపూర్ణచంద్ర !

క. విలసితమణిహర్మ్యస్థల
ములఁ దగ విహరించు నీకు భూతపిశాచా

కులశవధూపన్నృతాంబర
తల మగు ప్రేతాలయంబు ధామం బయ్యెన్. (1.261-262)

హరిశ్చంద్రుని పూర్వాపరస్థితుల తుల్యపరిశీలనమువలనఁ గలిగిన దుఃఖము మూలమునందు కంటె ననువాదమునఁ గ్రమబద్ధ మొనర్పఁబడియున్నది; అమూలకము లైన రమణీయభావ ములుకొన్ని చేర్పఁబడియున్నవి. 'విద్వజ్జనమనశ్చన్ద్రో హరిశ్చన్ద్రో నసంశయః' అను శ్లోక పాదము నచ్చట వదలి మారన యిచ్చట ఎత్తుగీతిచివరిపాదమునఁ బొందుపఱచి శైబ్య దుఃఖాతిశయమును, హరిశ్చంద్రదీనదశను విశేషముగా స్ఫురింపఁజేసెను. దీనిని బట్టి మారన తనయనువాదమును పూర్వాపరసమన్వయ దృష్టితో నొనర్చె నని స్పష్ట మగుచున్నది. మూలమున శైబ్య హరిశ్చంద్రుని 8. 202 శ్లోకమున గుర్తించినట్లు కలదు. ఆంధ్రమున నంతకుఁబూర్వమే 1. 250 వ పద్యమున గుర్తించినట్లు వ్రాయఁబడి నది. దీనివలన విభావపుష్టి యేర్పడి శోకము దీప్త మగుట కవకాశ మేర్పడుచున్నది. దీనినిబట్టి మారన మూలము నక్షరశః అనువదించువిధానమును బాటింపలే దనియు, కథారసదృష్టితో నుచితములైన సవరింపులు చేసి యనువాదముగా గాక పునస్సృష్టిగా భాసించున ట్లొనర్చె ననియు స్పష్టమగుచున్నది.

(2) రసపోషణార్థమై మారన కౌశికునివిరహవర్ణనమును విస్తరించి రచించెను.

మూలము :

శ్లో. ప్రాహ భార్యాం నయస్వేతి త్వం మాం తస్యానివేశనమ్
సా యా వేశ్యా మయాదృష్టా రాజమార్గే గృహోషితా॥
తాం మాం ప్రాపయ ధర్మజ్ఞే సైవ మే హృది వర్తతే
దృష్టా సూర్యోదయే బాలా రాత్రిశ్చోయ ముపాగతా॥
దర్శనానన్తరం సా మే హృదయా న్నాపసర్పతి
యది సా చారుసర్వాంగీ పీనశ్రోణిపయోధరా॥
నోపగూహతి తన్వంగీ తం మాం ద్రక్ష్యసి వై మృతమ్
వామఃకామో మనుష్యాణాం బహుభిః ప్రార్థ్యతే చ సా॥ (16.20-23)

అనువాదము :

క. ఏ నొక గణికారత్నము
మానుగఁ గనుఁగొంటి రాజమార్గంబున సా
ధ్వీ ! నేఁడు వేడ్క యడరెడు
దానిగృహంబునకు నన్నుఁ దగఁ గొనిపొమ్మా !

ఉ. ఆనగుమోముచెన్ను శశియందును బంకరుహంబునందు లే
దానయనప్రభాతి మదనాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనికాంతి లతికావలియందుఁ బసిండియందు లే
దానలినాయతాక్షి లలితాకృతి నామదిఁ బాయనేర్చునే.

సీ. మెఱుఁగారు లేఁదీగ మెచ్చని యత్తన్వి
తనులతచెల్వంబు గనుఁగొనంగఁ
గలకంఠములయెలుంగులయేపు దీపించు
నలపొత్తి ముద్దుఁబల్కులు వినంగఁ
గనకకుంభంబులకాంతి గైకొనని యా
కాంతచన్గవ బిగ్గ గౌఁగిలింపఁ
జిగురుటాకులనునుజిగిసొంపు దెగడు న
చ్చపలాక్షికెమ్మోవి చవిగొనంగఁ
ఆ. జిత్త మొదవు తివుటఁ జిడిముడి పడియెడు
నీవు ధర్మతత్త్వనిపుణహృదయ
వాలతాంగి నన్ను ననురక్తిమైఁ గూర్పు
మన్మథాగ్ని నేను గ్రమ్మందకుండ.

క. ఇనుఁ డస్తమించెఁ జీఁకటి
యును మొగులును నడ్డగించె నుగ్మలి నాకుం
జన శక్తి లేదు దర్పకు
ననర్గళాస్త్రములు నెఱఁకులాడెడుఁ దోడ్తోన్. (2. 160-163)

మూలముకంటె మారన విప్రునిమాటలను గ్రమవికాసబంధురశిల్పమర్యాద ననుసరించి నిర్మించెను. ఇందుఁ బ్రత్యక్షరరామణీయకత్వ ముట్టిపడుచున్నది. ఎత్తుగడలోనే యెంతయో యందమున్నది! మూలమున లేని రూపకసమాసము నొకదానిని గల్పించి ''గణికారత్న'' మని వేశ్య నభివర్ణించినాఁడు! 'రత్నహారీతు పార్థివ' యనున్యాయమున కనువుగా నామె రాజమార్గమున నుండుటయు, రాజు లామెను భోగించుటయు సహజము. విప్రుఁ డయ్యు నీతఁడు కూడ ''రాజమార్గము''నందలి వేశ్యారత్నముపై వలపుగొనినాఁడనుట చమత్కారము. విప్రుఁడు సాధ్వి యని భార్యను సంబోధించి తనభార్యయందున్న గౌరవభావమును వ్యక్తముచేసినాఁడు. తనపాపచింతను జెప్పికొనుటకు ఆమెను బ్రసన్నురాలిని చేసికొనినాఁడు! తన కానాఁ డామెపైఁ గోర్కె జనించినది కావున దానిగృహమునకుఁ గొంపోవ వేడుకొనినాఁడు. ''తగన్'' గొనిపొమ్మా!' యనుటలో లోకులకుఁ దెలియకుండ గోప్యముగాఁ గార్యము ముగింపు మని వ్యంగ్యము! మూలమున విప్రుఁ డావేశ్యను సూర్యోదయసమయమునఁ గాంచితి నని చెప్పినట్లు కలదు. ఇది కథలో సంభావ్యము కాదు. కుష్ఠరోగపీడితుఁడైన విప్రుఁడు కదలలేని మెదలలేని స్థితిలో నుండి భార్యను మోసికొని పొమ్మని ప్రార్థించుచున్నాఁడు. ఉదయ మాతఁడు రాజవీథిలో నెట్లు తిరిగి యుండును. అది పొసగనివిషయము. ఈయంశమును గనిపెట్టి మారన దానిప్రసక్తి వదలినాఁడు. ఎప్పుడో చూచినాఁడు. నే డామెను గోరుచున్నాఁడు. ఈ నదీభికాలమున తద్వేశ్యాసమాగమాకాంక్షియై కొన్నాళ్ల మన్మథావస్థ ననుభవించినాఁడు

కోరిక బలీయమై యతనిచే నతనిభార్యనే యడిగించినది—అని మారన తెలుఁగునఁ దెలిపినాఁడు. మూలమునం దున్న యస్వాభావికత తెలుఁగున రాలేదు.

'ఆనగుమో' మను ఉత్పలమాలావృత్తమును మారన యపూర్వకళాకౌశలములతో నిర్మించినాఁడు. పాదములయొక్క ఆద్యంతములయందు ప్రాణముల నను ప్రాసగా నిలుపుటయు, పాదత్రయమున ప్రాసస్థానమున నక్షుల్సామ్యము పాటించుటయు ఛందశ్శిల్పము. పైకందపద్యమున గణికను రత్నమని చెప్పుటచేఁ దద్గుణమైన కాంతిని గ్రహించి యీపద్యమున విస్తరించుట భావశిల్పము: మోముచెన్ను, నయనప్రభాతి, మేనికాంతి-ఆరత్నమున కున్న మూఁడువన్నెలు: రత్నశబ్దము శ్లేషవాచకముగా వాడుట నర్థవంతమొనర్చుటకై మారన యతిశయోక్త్యలంకారము నిందు నిబంధించుట: "శశిపంకేరుహముల" నుపమానద్రవ్యములుగా గ్రహించుటచే నావేశ్య రాత్రింబవళ్లెల్లప్పుడును మందహాససుందరవదనయై యుండునని వ్యంగ్యము. మూలమునందలి ''సైవ మే హృది వర్తతే'' "సా మే హృదయా న్నాపసర్పతి"- యనుభావ మీపద్యమున సహేతుకముగా వివరింపఁబడి స్థాపింపఁబడినది.

మూలకర్త వేశ్యావర్ణనము సేయుచు చారుసర్వాంగి యనియు, పీనశ్రోణిపయోధర యనియు, తన్వంగి యనియుఁ జెప్పినాఁడు. తద్విశేషణములచే విభావస్ఫూర్తి కొంత కలుగవచ్చును గాని తద్వర్ణనము చేయు పాత్రయొక్క మనోగతభావవ్యక్తీకరణము కలుగుటలేదు. మారన యాకృతి కెంత ప్రాధాన్య మిచ్చెనో భావమున కంత ప్రాధాన్య మిచ్చెను. విటుఁడు నాయిక నుపభోగించునప్పుడు మొదట తనులతచెల్వంబు గనుఁగొని యాకృష్టుఁ డగును. ఆపైన ముద్దుపలుకుల మాధుర్యము చవిచూడ నెంచును. ఆతరువాత నామె నెదురొత్తి వక్షమున బిగికౌఁగిటఁ జేర్చుకొనును. ముగ్ధయగు నప్పలాక్షి కెమ్మోవి నాపై నాస్వాదించును. కావున, మారన సీసపద్యపాదరచనమున విప్రహృదయగతమైన వేశ్యాసమాగమాకాంక్షయొక్క క్రమవికాసస్ఫూర్తిని నిగూఢముగా నిబంధించి రసభావశిల్పి యనిపించుకొనినాఁడు:

మూలమునందలి ''ధర్మజ్ఞే" యను సంబుద్ధిలోనిసార్థక్యము గమనించి మారన "నీవు ధర్మశాస్త్రనిపుణహృదయవు'' అని తెలుఁగున ననిపించినాఁడు. సతిధర్మము పతిహితాచరణము. దానిని శాస్త్రవిరుద్ధము గాకుండ నిపుణముగా నిర్వహించుటయం దామె నేర్పరి. వేశ్యాసంగమము భర్తృప్రాణదాయకము. అది యామెకు దుఃఖహేతువు కావచ్చును: కాని, యామె తనభర్తను 'అనురక్తితో' వేశ్యకడకుఁ బంపవలెను. ఇట్లు గూఢముగా నాయిల్లాలి ధర్మప్రవణత్వము నాసటగాఁగొని ధూర్తుఁ డగు విప్రుఁడు తన యాగడమును సాగించుకొనుచున్నాఁడు.

''రాత్రి శ్చేయ ముపాగతా'' యనుభావమును మారన చివరిపద్యమున నమర్చినాఁడు. మూలమున లేని మేఘములను గల్పించినాఁడు. నక్షత్రకాంతి ప్రసరింపని చిమ్మచీఁకటిలో నెవ్వనికంటఁ బడకుండ లోకముకన్నుఁ గప్పవలె నని యావిప్రునిగూఢవాంఛ. స్వయముగా వెడలుశక్తి లేమిచే నతనిని మన్మథుఁడు మఱియు బాణములు వైచి బాధించు

చున్నాఁ డనుట గడుసరితనమునకుఁ దార్కాణము! చనుశక్తియే తనకున్నచో మదనునియాటలు సాగెడివి కావనియు, నిల్లాలిని బ్రతిమిలాడవలసిన పని లేదనియు నతనినిష్ఠూరము! మారన యీభావము నిట్లు చిత్రించి విప్రుని ధూర్తత్వమును, గడుసరితనమును, వాఙ్నైపుణ్యమును, కామాతురత్వమును ప్రదర్శించుటయేకాక రసభావక్రమ విన్యాసమును విజ్ఞతతోఁ బోషింపఁ గలిగెను.

(3) దేవతలు మహిషాసురదౌర్జన్యములఁగూర్చి శివకేశవులకు విన్నవించుకొనిన విధమును మారన విస్తరించి రచించెను. మూలకర్త "త్రిదశాః కథయామాసు ర్దేవాభిభవ విస్తర" మ్మని చెప్పియు మూఁడుశ్లోకములలో వారిమొర ముగించివైచెను. మారన మూలకర్త సూచించిన విస్తరశబ్దమును సార్థకపఱచెను. మహిషాసురదుర్ణయకథనము క్రమముగా శివకేశవాగ్రహమునకును, దేవ్యావిర్భావమునకును మూలహేతు వగుచున్నది. కావున గథార్థముల కది యాయుస్స్థాన మగుచున్నది. మారన తత్ప్రాణమునకు బలము చేకూర్చెను.

మూలము :-

శ్లో. సూర్యేంద్రాగ్న్యనిలేందూనాం యమస్య వరుణస్య చ
అన్యేషాం చాధికారా న్స స్వయమే వాధితిష్ఠతి ।
స్వర్గా న్నిరాకృతాః సర్వే తేన దేవగణా భువి
విచరన్తి యథా మర్త్యా మహిషేణ దురాత్మనా ॥
ఏత ద్వః కథితం సర్వ మమరారివిచేష్టితమ్
శరణం వః ప్రపన్నాః స్మో వధ స్తస్య విచిన్త్యతామ్ ॥ (79.5-7)

అనువాదము :-

తే. అవధరింపుఁడు నిఖిలలోకాధినాథు
లార! మావిన్నపము బలోదారుఁ డైన
మహిషుఁ డెప్పుడు మదమున మసరుకవిసి
కలఁచుచున్నాఁడు త్రిభువనకమలవనము.

క. మహిషుని కుచ్చితమును బర
మహిషులఁ జెఱపట్టుటయును మత్తిల్లి మరు
న్మహిజములు గూల్చుటయుఁ జే
ర్చి హరిం దోలుటయు వానిఁ జెప్పము మీకున్ ॥

శా. తేజస్స్ఫూర్తి దివాధినాథుఁ డయి కాంతిం జందురుం డై ప్రతా
పాజేయత్వమునం గృశానుఁ డయి ఘోరైశ్వర్య శౌర్యోన్నతిం
దా జిష్ణుం డయి దర్ప మొప్పఁ గొనియెం దత్తత్పదమ్ముల్ బల
భ్రాజిష్ణుం డసురేశ్వరుం డసురు లుబ్బన్ లోకసంహారుఁడై.

వ. మఱియును-

సీ. అవలీల నంతకు నతిదీనుఁ గావించి
బలిమిఁ గోణాధిపు భంగపెట్టి,
పరిగొని వరుణునిఁ బరిభూతి నొందించి
కడిమిమైఁ బవనుని గాసి చేసి,
మత్తిల్లి విత్తేశుమానం బడంగించి
గండున నీశానుఁ గష్టపఱిచి,
యేఁచి గంధర్వేశు హీనదశకుఁ దెచ్చి
యలుకమై సాధ్యవుఁ దలఁగఁ ద్రోచి
తే. యప్పురంబులు వడిఁ దాన యాక్రమించి
గరుడసిద్ధవిద్యాధరఖచరనాగ
వరుల నుద్వృత్తి సతతంబుఁ బఱపి పనుల
గొనుచునున్నాఁడు మహిషుండు క్రొవ్వు మిగిలి.

చ. అలఘుపరాక్రముండును దురాత్ముఁడునై మహిషాసురుండు దో
ర్బలమున నాకముం గొనినఁ బాఱిపోయి ధరిత్రి నిప్డు మ
ర్త్యులక్రియ నున్నవారము సురోత్తములార ! భవత్పదాంబుజ
మ్ములు శరణంబుఁ జొచ్చితిమి బుద్ధిఁ దలంపుఁడు దైత్యనాశమున్.
(6.67-72)

మారన యొనర్చిన విస్తరణమునందుఁ జక్కని ప్రణాళిక కనవచ్చుచున్నది. మొదటిరెండుపద్యము లమూలకము లైనవి. మహిషుఁడు మనరుకవిని త్రిభువనకమల వనమును గలఁచుచున్నాఁ డనుటలోఁ బ్రదర్శించిన రూపకాలంకార మర్థబంధురము. అతని పశుస్వభావ మారూపకమువలన స్పష్టమగుచున్నది. ఒకయంశము నుపన్యసింపఁ బోవునప్పుడు వక్త సామాన్యముగాఁ బ్రతిపాద్యాంశమును సూత్రప్రాయముగా ముందు పేర్కొనునట్లు దేవతలు తమమనవియొక్క పరమార్థమును మొదట పేర్కొనినా రనుట యిచ్చటి సంభాషణ శిల్పము ।

మహిషుఁ డొనర్చిన దుశ్చర్య లనంతములుగా నున్నవి. వాని నన్నింటిని సురలు చెప్పఁబోవుట లేదు. కాని వారు చెప్పక విడచుచున్న విషయములయొక్క స్వరూపస్వభావములను, అం దిమిడియున్నదారుణత్వమును శివకేశవులకు స్ఫురించునట్లు చెప్పినారు. "వానిఁ జెప్పము మీకున్" అని వాక్యమును ముగించుటలో నున్న గడుసరితనమే తదర్థస్ఫూర్తికి మూల మగుచున్నది. మూలమున మహిషుఁడు సూర్యాదుల యధికారములను గైకొనె నని యున్నది.కాని, వాని నేయేగుణముల ప్రాధాన్యమువలన గ్రహించెనో వివరింపఁబడియుండలేదు. మారన యాయంశమును బూరించి శైశార్దూలవృత్తము నలంకారసుందరముగా నిర్మించెను. సీసపద్య మాతఁడు దిక్పాలకులను, దేవగణములను హింసించిన విధమును విస్తరించుట కేర్పఱుపఁబడినది. 'అలఘుపరాక్రముండును, దురాత్ముఁడునై'

యని పైచర్యలకు మూలమైన దానవగుణవిభాగము నేర్పఱచుచు చివరి చంపకమాల నెత్తుకొనుటలో నొక ప్రతిపాద్యాంశమును ముగించునప్పుడు వక్త పూర్వోక్తాంశముల తాత్పర్యము చెప్పి సమాప్తిచేయు సంభాషణశిల్పము కానవచ్చుచున్నది.

## VII

పురాణకథానువాదసందర్భమున మారన యౌచిత్య మెఱిఁగి యమూలకమైన యంశములను బెక్కింటిని కల్పించి తనరచనమునఁ బొందుపఱచెను. విస్తరభీతిచే నట్టి వానిలోఁ గొన్నింటిని మాత్రమే యిచ్చట నుదాహరణములుగా నిచ్చుట జరుగుచున్నది.

(1) ఆంధ్రమార్కండేయపురాణకథారంభమునందలి తపోవనవర్ణన (1.1) మమూలకము. అనుప్రాసాదిశబ్దాలంకారబహుళమును, దీర్ఘసంస్కృతసమాసభూయిష్ఠమును, సంగ్రహము నైన యివ్వర్ణనము కావ్యారంభగంభీరశిల్పమున కుదాహరణము. నానావిధమహీరుహములచేతను, పక్షిగణకలశబ్దములచేతను, బహువిధమహాధ్వరోత్సవసమాగతశతమఖాదినిఖిలనిలింపసభలచేతను, మునికుమారసమిత్కుశకుసుమాహరణసంరంభములచేతను, శాస్త్రపురాణేతిహాసకథాకథనచతురపరిషత్తులచేతను శోభిల్లు తపోవనము నన్నయాదులు వర్ణించిన కణ్వాదిమహర్షి తపోవనములఁ దలఁపించుచు, పురాణవక్త యగు మార్కండేయమహర్షికి మహనీయనివాసస్థలముగా రాణించుచున్నది. రాజనాయకములైన కావ్యములు నగరవర్ణనముతో నారంభించుట యెట్టిశిల్పమో, ఋషిప్రోక్తమును, జ్ఞానప్రధానమునైన పురాణము తపోవనవర్ణనముతో నారంభమగుట యట్టిశిల్పము!

(2) పతివ్రతకథలోని నగరవర్ణనమును, సూర్యోదయవర్ణనమును - అమూలకములే.

> ఉ. దానగజేంద్రభూధరకదంబతురంగతరంగసంఘకాం
> తానికురంబరత్నమహితం బయి లక్ష్మికిఁ బుట్టినిల్లనం
> గా నభిరామమై భువనగౌరవవైభవయుక్తమై ప్రతి
> ష్ఠానపురంబు వొల్చు విలసన్మహిమ న్జలరాశిచాడ్పునన్. (2.153)

ఇందలిరూపకాలంకారము మారనకవిప్రతిభావిలసితము. అప్పట్టణము "కాంతానికురంబరత్నమహిత" మని చెప్పుట ప్రధానతాత్పర్యము. చెప్పఁబోవునది మహాపతివ్రతకథ! ఆమె నివసించునది ప్రతిష్ఠానపురి. కావున నాపురియందుఁ గాంతారత్నములు కల రనుటలో సార్థక్య మున్నది. మారన యీరత్నోపమానమును జాగరూకతతోఁ గథనంతటఁ బఱచినాఁడు. ఆనగరవాసిని యగు వేశ్య గణికారత్నమఁట! (2. 160). కౌశికుని భార్య సూర్యుఁ డుదయింపకుండుగాక యని శపించు నవసరమున 'వనితామణి' యై (2. 169) తేజరిల్లినదఁట! అనసూయ యావిప్రభార్యను దర్శింపఁబోవుచు 'పతివ్రతారత్న' (2. 175) మని తలంచినదఁట! "ఈభూవలయంబునం సతులు పోలరు నిన్నుఁ బతివ్రతామణీ!" (2. 180) యని యామెను పొగడినదఁట! సూర్యోదయ మగువేళ భర్త నేల్ల కొఱుగకుండ పఱ్ఱడు నాసాధ్వి "వనితామణి" యఁట! ఉపాఖ్యానమునందుఁ

గానఁబడు నిట్టిరత్నసంచయమును వ్యంజించుటకు రత్నాకరౌపమ్యము నెన్నుకొనుటయు, దాని నుపమేయమైన నగరముతో నభేదము పాటించుటయు మారనరచనాశిల్పము।

సూర్యోదయవర్ణనము :

సీ. చుక్కలదీప్తి విస్ఫురణంబు చవిగొని
మిన్ను లేఁగెంపున మెఱుఁగు వెట్టి,
ఘనతమఃపుంజంబు గనుకనిఁ ఖోఁదోలి
దిక్కులఁ దేజంబు దీటుకొల్పి,
కైరవాకరములగర్వంబు కబళించి
కమలషండములకుఁ గాంతి యొసఁగి
తలకొన్నతుహినంబు దర్పమడంగించి
చక్రవాకముల కుత్సవ మొనర్చి
తే. తనసముజ్జ్వలదీప్తివితాన మడరి
యఖిలజనులకు ననురాగ మావహింప
నెలమి ననసూయ మహితార్ఘ్య మెత్తి మ్రొక్క
నుదయగిరిశిఖరంబున నొప్పె నినుఁడు. (2. 189)

సూర్యోదయకాలప్రకృతిశోభాపరిణామప్రభావముల వర్ణించు నీపద్యము సహజోక్త్యలంకారసుందరమై శోభించుచున్నది.

(3) సందర్భౌచిత్యమును భావించి మూలమున లేని దైవస్తుతులను సంగ్రహముగా మారన నిర్వహించెను. అందుల కశ్వతరుని పరమేశ్వరస్తుతియు (3.53) దేవతలును, విశ్వకర్మయు సూర్యునిగూర్చి యొనర్చినస్తుతులును (7. 109; 126) నిందులకుదాహరణములు.

(4) మారన యమూలకములైన వర్ణనాంశములను, సూక్తులను, అలంకారములనుగూడ నెడనెడఁ జొప్పించుచు రచనమున స్వీయప్రతిభను ప్రదర్శించెను. మచ్చునకుఁ గొన్ని యుదాహరణములు :

(అ) శమీకముని ధర్మపక్షులను గురుక్షేత్రమునఁ గాంచినప్పుడు :— 'తే. అమరు రేయెండపిండుల కవయవములు—మొలచినట్లు తేజస్ఫూర్తి వెలుఁగుచున్న' (1.50) విహగశిశువులను గాంచె నని మారన చేసిన వర్ణన మమూలకము.

(ఆ) రైవతాద్రిపైఁ జరించు బలరాముని వర్ణించుచు "సమదలీల మదాంధగజంబు చాడ్పునన్, రైవతశైలసానువనరమ్యతలంబునఁ గ్రీడ సల్పె" నని సార్థకోపమానము ననుసంధించెను. (1. 133)

(ఇ) విశ్వామిత్రుఁడు శైబ్యను బ్రచండదండ మెత్తి కొట్టుటను "ఇభము దొండమెత్తి మదజృంభితమైలత వ్రేయు చాడ్పునన్" అని యపూర్వముగా మారన వర్ణించెను. (1. 184)

(ఈ) హరిశ్చంద్రుఁడు మృతసుతునిఁ గాంచి దుఃఖించుచు—

క. నీ విటుగాఁ జూచియు నా
జీవ మెడల దున్నయవుడ చిత్తమ్మున మో
హావేశము తండ్రులకు స్వ
భావమును మ్మిట్లు సుతులపై సుగుణనిధీ! (1. 255)

అని పల్కినట్లు రచించి సందర్భోచితసంభాషణవైచిత్రి ప్రకటించెను.

(ఉ) ఏకాదశరుద్రసర్గకథనావసరమున బ్రహ్మ స్త్రీపుంసమిశ్రరూపము దాల్చె నని మూలమునఁ జెప్పఁబడియుండఁ, దదాకారవర్ణనము మారన కల్పించి చమత్కారము సాధించెను.

క. తెలిగన్ను కవిలకన్నును
వలిచన్నును దృఢవిశాలవక్షము నెఱివే
నలి కెంజడలును గలిగిన
వెలఁదియు మగవాఁడు నైన వేల్పు నిల్చెన్. (4. 53)

(ఊ) ఖనపతనయుఁ డగు 'వీరుఁ డుదయించె' నని చెప్పుచు — "అతఁ డతులిత ప్రతాపానలచ్ఛటాదహ్యమానవైరిరాజ్యసైన్యకాంతారచయుఁడు" (8. 46) అని యమూలకవర్ణన మొనరించెను.

(ఋ) శత్రురాజుల డీకొను నవేక్షితుని "కరికలభంబులపయిం గవియు కేసరి కిశోరంబునుం బోలె" (8. 103) నని పాత్రపౌరుషస్ఫూర్తిఁ గలిగించు నుపమానము ననుసంధించెను. ఇచ్చటి సింహోపమానసార్థక్యమునుగూర్చి యాఖ్యానశిల్పాధ్యాయమునఁ జెప్పఁబడినది.

(ౠ) బ్రహ్మ దుస్సహున కాహారము నేర్పఱచు ఘట్టమున—

క. శ్రుతిశాస్త్రపురాణవినిం
దితకర్మము లాచరించు ధీరహితుని దు
ష్కృతఫలముల నొదుస్సహ!
సతతంబును దృప్తి నీకు సంపాద్య మగున్. (4. 73)

అని విశేషించి రచించి తన శ్రుతిశాస్త్రపురాణాభిమానమును మారన చాటుకొనినాఁడు.

## VIII

మారన మార్కండేయమహాపురాణాంతర్గతములైన లోకధర్మములను, నీతులను, ధర్మములను సూక్తులవలె నొక్కొక్కపద్యమునం దొక్కొక్కరమణీయోపదేశమును నిబంధించి రచించి నన్నయతిక్కనలమార్గము ననుసరించినాఁడు. ధర్మప్రబోధదృష్టి గల మూలకర్త యిట్టిసూక్తుల ననంతముగాఁ బేర్కొనెను. మారన వానిని జాలవఱకు

తెలుఁగుచేసినను కొన్నింటిని వదలక మానలేదు. కొన్ని తాను కల్పింపక విడువలేదు. మారన తెలుఁగుపద్యములు నీతిశతకములయందలి పద్యములవలె చదువరులకు చవులూరించుచుఁ గంఠస్థము సేయవలెనను ప్రీతినిఁ గలిగించును. ఉదాహరణములుగా నీక్రింది యనువాదములను గ్రహింపవచ్చును :—

లోకధర్మములు :

1\. శ్లో. ధన్యా స్తే తనయా యేషాం సర్వలోకాభిసమ్మతాః
పరోపకారిణః శాన్తాః సాధుకర్మ హ్యనువ్రతాః॥ (72. 10)

క. అనఘులు పరహితచరితులు
జనసంభావ్యులును బుణ్యచరితులు నగు నం
దనులను బడయుదు రెవ్వరు
దనరఁగ వా రిందునందు ధన్యులుగారే ? (5.265)

2\. శ్లో. అభీష్టా కస్యచి త్కాంతా కాన్తః కస్యాశ్చి దీప్సితః
పరస్పరానురాగాఢ్యం దాంపత్య మతిదుర్లభమ్॥ (62. 10)

ఆ. మగఁడు గలసెనేని మగువ దాఁ గలయదు
మగువ గలసెనేని మగఁడు గలయఁ
డెలమి నొండొరువుల నిరువురమనములఁ
గలుపుఁ బూర్వసుకృతఫలము సుమ్ము ! (5. 72)

3 శ్లో. యోజనానాం సహస్రాణి యాతి గచ్ఛ న్పిపీలికః
అగచ్ఛ న్వైనతేయోఽపి పదమేకం న గచ్ఛతి ॥
క్వ భూతలం క్వ చ ధ్రౌవ్యం స్థానం యత్ప్రాప్తవాన్ ధ్రువః
ఉత్తానపాదనృపతేః పుత్రఃసద్భూమిగోచరః ॥ (18. 38-40)

ఆ. అరుగకుండెనేని గరుడఁడైనను నొక్క
యడుగు నరుగలేఁడు కడఁగి చీమ
యైన నరుగఁదొడఁగెనేని యనేకస
హస్రయోజనమ్ము లరుగుచుండు.

క. భువి యెక్కడ దివి యెక్కడ ?
ధ్రువుఁ డీభువినుండి కాదె ధ్రువపదమున్
దివిఁ బడసెం గావున న
ద్వ్యవసాయికిఁ బడయరానిదియును గలదే ? (2. 277-289)

4\. శ్లో. అపుత్రతా మనుష్యాణాం శ్రేయసే న కుపుత్రతా
కుపుత్రో హృదయాయాసం సర్వదా కురుతే పితుః (72. 7)

క. పుత్త్రుఁడు పుట్టమి మేలు కు
పుత్త్రుఁడు జన్మించుకంటెఁ బురుషునకును దు
ష్పుత్త్రుఁడు దహించు నిజచా
రిత్రాగ్నినిఁ దండ్రిమనము రేయును బగలున్ (5. 263)

5. శ్లో. యే తు బాల్యాత్ప్రభృ త్యేవ వినా పిత్రా కుటుంబినః
తే సుఖాస్వాదవిభ్రంశా న్మన్యే ధాత్రైవ వంచితాః॥ (22. 11)

చ. జనకభుజావనీజముల చల్లనినీడ వసించియుండు నం
దనులు జగంబున న్సుఖులు తండ్రి మృతుండయి చన్నఁ బిన్ననాఁ
డ నిజకుటుంబభారము గడంగి వహించుచుఁ దీవ్రదుఃఖవే
దనఁబడు వా రపుణ్యులు విధాతృనిచేత (భుజంగమేశ్వరా!) (3. 77)

6. శ్లో. హోమకాలే యథా వహ్ని రాజ్యపాత మవేక్షతే
ఋతౌ ప్రజాపతి స్తద్వ ద్బీజపాత మవేక్షతే॥ (14. 5)

క. ఋతుకాలంబున విను కుల
సతికిం బతివలన శుక్లసంప్రాప్తి ప్రజా
పతి గోరు హోమకాలా
హుతి యతిసంప్రీతిఁ గోరు హుతవహుమాడ్కిన్. (2. 80)

**దాంపత్యధర్మము** :- మూలమునఁ గుండల మదాలసాకువలయాశ్వలవివాహసందర్భమునఁ జెప్పిన హితవు పదిశ్లోకములందుఁ గలదు-(19. 69-78). దానిని మారన యొక సీసపద్యమున రచించెను :-

సీ. పతి ప్రయత్నంబుతో భార్య భరించుచు
గీ డొందకుండ రక్షింపవలయు
నవి రోధవృత్తి ధర్మాధర్మములు భా
ర్యానుకూలతఁ బతి కతిశయిల్లు
భార్యావిహీనతఁ బతికి వర్గత్రిత
యంబులో నొక్కటి యయిన లేదు
దేవపితతిథిపూజావిధు లొనరింప
భార్యయ పతికి నుపాశ్రయంబు
తే. మగఁడు వెలిగాఁగ సతికి ధర్మంబు ధనము
గామమును మున్న లభ్యము గ్లావు గాన
దంపతులు పరస్పరవశతాప్రమోద
మగ్నమానసులై కూడి మనుట యొప్పు. (2.325)

**సతీధర్మము :**

శ్లో. నాస్తి స్త్రీణాం పృథ గ్యజ్ఞో న శ్రాద్ధం నా ప్యుపోషితమ్
భర్తుః శుశ్రూషయై వైతా లోకా నిష్టాన్ జయంతి హి॥ (16.62-63)

తే. స్త్రీజనంబుల కుపవాసతీర్థదాన
దేవపూజావ్రతాదులతెరువు వలదు
పతిసమారాధనవ్రతపరతఁ జేసి
సుగతి వారికి తంగేటిజున్ను సుమ్ము. (2.179)

**గార్హస్థ్యాశ్రమధర్మము :**

మూలమునందలి 25అధ్యా. 19-23 శ్లోకముల భావ మీక్రిందిపద్యము

శా. దారస్వీకృతియు న్దయాభిరతియు న్ధర్మార్జితార్థక్రియా
స్ఫారత్వంబును దేవపిత్రతిథిపూజాస్థైర్యము న్దీనదా
సేరాజీసుతబాంధవాతురజనశ్రేణీసమృద్ధాన్నస
త్కారోదారతయు న్గణింప గృహికి న్ధర్మంబు లుద్యన్మతిన్. (3.145)

ఇట్లే మారన 3.146 పద్యమున వానప్రస్థాశ్రమధర్మమును, 3.147లో యత్యాశ్రమ ధర్మమును, 3.335లో యోగిధర్మమును రమణీయముగ నిరూపించెను.

**వివిధనీతులు :**

(1) క. పరదూషణములు సేయక
పరిభవ లగువారియందు దయ గలిగి విప
త్పరిపీడితులకు దిక్కై
పరగెడు పురుషుండు సుగుణబంధురుఁ డెందున్. (3.73)

ఇది 21.111, 112 శ్లోకములకు ఛాయానువాదము.

(2) శ్లో. అష్టా వాత్మగుణా యే హి తేషా మాదౌ దయా ద్విజ॥ (58.66)

అను శ్లోకపాదమును మారన పెంచి యిట్లు రచించెను :

క. దయఁ బోల వధ్వరంబులు
దయఁ బోలవు వివిధభూరిదానచయంబు
ల్దయఁ బోలవు జపతపములు
దయ తలపోయఁగ విశిష్టతమధర్మ మిలన్. (4.246)

(3) శ్లో. ధిక్తస్య జీవితం పుంసః శరణార్థిన మాగతమ్
యోనార్త మనుగృహ్ణాతి వైరిపక్ష మపి ధ్రువమ్॥ (128.25)

క అతిభీతుఁ డైన శరణా
గతు నార్తుని శత్రువైనఁ గడుకొని కరుణా

న్వితుఁ డై రక్షింపని దు
ర్మతి యగు కుత్సితుని బ్రతుకు బ్రతుకే తలఁపన్. (8.263)

(4) శ్లో. సత్యం శౌచ మహింసా చ అనసూయా తథా క్షమా
ఆనృశంస్య మకార్పణ్యం సంతోష శ్చాష్టమో గుణః॥ (25.32)

క. క్షమయు నకార్పణ్యము శౌ
చము ననసూయయును నాశంస్యము సంతో
షమును నహింసయు విను స
త్యము నెనిమిది వలయుగుణము లఖిలజనములకున్. (3.149)

(5) శ్లో. సంగః సర్వాత్మనా త్యాజ్యః సచే త్త్యక్తుం న శక్యతే
ససద్భిః సహ కర్తవ్యః సతాం సంగో హి భేషజమ్॥ (34.23)

క. సంగంబు విడువవలయును
సంగము విడువంగఁ గడునశక్య మయినఁ జే
యంగవలయు సత్సంగము
సంగరుజకు నౌషధంబు సద్భజన మిలన్. (3.286)

(6) శ్లో. కామః సర్వాత్మనా హేయో హాతుం చే చ్ఛక్యతే న సః
ముముక్షాం ప్రతి తత్కార్యం సైవ తస్యాఽపి భేషజమ్ ॥ (34.24)

క. కామము హేయము విడువం
గా మదికిని శక్య మెట్లు గా కున్న ముము
క్షామతి వలయుం గలవే
కామవ్యాధికి ముముక్షఁ గడచిన మందుల్. (3.287)

(7) శ్లో. నిష్పత్తిః కర్మణాం దైవే పౌరుషే చ వ్యవస్థితా
తస్మా దహం తథా యత్నం కరిష్యే పుత్ర కార్యతః ॥ (21.28)

క. తన పౌరుషంబు వదలక
మనుజుఁడు కార్యం బొనర్ప మానుగ దైవం
బునయందుఁ బౌరుషమునం
దును దత్ఫలసిద్ధి దోఁచుఁ దుల్యస్థితితోన్. (3.48)

(8) శ్లో. సత్యే నార్కః ప్రతపతి సత్యే తిష్ఠతి మేదినీ
సత్యం చోక్తం పరో ధర్మః స్వర్గః సత్యే ప్రతిష్ఠితః ॥ (8.41)

క. సత్యమున నున్న దీధర
సత్యమున వెలుంగుఁ ధరణి సత్యముననె తా

నిత్య మయి స్వర్గ మమరును
సత్యము ధర్మములలోఁ బ్రశస్తం బనఘా ! (1.207)

నైతికప్రబోధమునకు ప్రధానోపకరణములైన సూక్తులను ముక్తావళిగా మూలకర్తయే ఆవిష్కరించుటకు యత్నించును. అట్టి సారవద్వాక్యసముదాయమును అనువాదకర్త సన్నిహితముగా ననుసరింపక తప్పదు. కావున నీతిబోధకములైన సూక్తులందుఁ గొన్ని యెడల శబ్దానువాద మవశ్య ముపాదేయ మగుచున్నది. మారన యిప్పట్టున మూలము నందలి రమణీయశబ్దమునుగాని, భావమునుగాని వదలక గ్రహించుటయందుఁ దగిన శ్రద్ధఁ గైకొనుటయేకాక సూక్తిసౌందర్యపోషకమగు కల్పనను, రచనాశిల్పమును జోడించి యనువాదము నపూర్వసామర్థ్యముతో నిర్వహించెను.

ఈపరిశీలనమువలన మారన మార్కండేయపురాణమును భావానువాదపద్ధతి ననుసరించి యనువదించె ననియు, నంతకుఁ బూర్వమే నన్నయతిక్కనలు మహాభారతమును గథానువాదపద్ధతి ననుసరించి యనువదించియున్నను, మారన పురాణానువాదమున భావానువాదమే యుపాదేయ మని భావించి, మొట్టమొదటిసారి తెలుఁగున నాపద్ధతిలో మహాపురాణమును రచించి చూపినాఁ డనియు, పురాణఖండములను, కథలను అనువదింపఁబూనిన యనంతరయుగకవులకు మారన మార్గదర్శకుఁ డయ్యె ననియుఁ దలంప వీలగుచున్నది.

మారన మార్కండేయపురాణమును సాధ్యమైనంతవఱకు తగ్గించి సంగ్రహముగా రచించెను. శాస్త్రకావ్యార్థములలో మారన శాస్త్రార్థముల నధికముగా తగ్గించెను. రస భావముల కాకరములైన కథార్థములను మారన సంగ్రహమొనరింపక పోగా నౌచిత్య మెఱిఁగి క్రమబద్ధముగను, సర్వాంగపుష్టముగను వివరించెను. శృంగారవీరరౌద్రకరుణ శాంతరసపోషణమునందు మారన యభినివేశమును బ్రకటించెను. పాత్రశీలపోషణము, సన్నివేశకల్పనము, సంభాషణశిల్పము మొదలైనయంశములను బూర్వాపరకథార్థ సమన్వయదృష్టితో నిర్మించెను. మూలాతిశాయియైన శైలీసౌభాగ్యము, సార్థకశబ్దార్థాలంకారఛందఃప్రయోగనైపుణ్యమును మారనరచనకు సహజాలంకారములు ! మధురముగాఁ జెప్పుటయు, గంభీరముగా నావిష్కరించుటయుఁ, గుశలముగాఁ బొందుపఱచుటయు, మితముగా విస్తరించుటయు, లోతుగా నవలోకించుటయు, ముక్తకములవలె సూక్తులను గ్రథించుటయు మారనమహాకవివాగ్వ్యుత్పత్తికి నైజగుణములు !

ఈయధ్యాయమున మారనయనువాదపద్ధతి పరిశీలింపఁబడినది. ఇంకను దీనికంటె విలక్షణమైన వివిధకావ్యరచనాంశములు ప్రత్యేకముగాఁ బరిశీలింపఁదగియున్నవి. వానిలో ఆఖ్యానశిల్పము, కవితాశిల్పము అనునవి ముఖ్యముగాఁ బేర్కొనఁదగినవి. పురాణమంతయు ననువాదరూపమే కావున వానియందును గొన్నియెడల ననువాదనైపుణ్యమునుగూర్చినప్రశంసలు వచ్చుచుండును. వానినిగూడ పరిశీలించినచో మారనమహాకవి పురాణానువాదమున సాధించిన సమగ్రకావ్యార్థఫలసంపత్తి సాక్షాత్కారము కాఁగలదు !

# ఆఖ్యానశిల్పము

మార్కండేయపురాణ మొక యుజ్జ్వలకథారత్నహారము. ఆ హారము నలంకరించిన కథారత్నము లివి :—

1. ద్రోణనందనచరిత్రము-లేక ధర్మపక్షులచరిత్రము.
2. హరిశ్చంద్రోపాఖ్యానము.
3. ఆడిబకయుద్ధకథ.
4. జడోపాఖ్యానము.
5. మహారౌరవాదినరకాఖ్యానకథ.
6. పతివ్రతకథ.
7. దత్తాత్రేయకథ.
8. కార్తవీర్యార్జునవృత్తాంతము.
9. కువలయాశ్వచరిత్రము.
10. అలర్కచరిత్రము.
11. బ్రహ్మోత్పత్తికథనము.
12. దుస్సహవృత్తాంతము.
13. స్వారోచిషమనుసంభవము.
14. ఉత్తమమనుజననము.
15. తామసమనుజననము.
16. రైవతమనుజననము.
17. చాక్షుషమనుజననము.
18. వైవస్వతమనుచరిత్రము.
19. సావర్ణిమనుజననము-లేక దేవీసప్తశతి.
20. రౌచ్యమనుజననము.
21. భౌత్యమనుజననము.
22. మార్తాండచరిత్రము.
23. రాజ్యవర్ధనరాజచరిత్రము.
24. ఇలచరిత్రము.
25. వృషధ్రశాపవృత్తాంతము.
26. నాభాగునిచరిత్రము.
27. వత్సంధ్రచరిత్రము.
28. ప్రాంశప్రాజాత్యాదులచరిత్రములు.
29. ఖనిత్రచరిత్రము.
30. క్షుపచరిత్రము.
31. వివింశపుత్త్రుఁ డగు ఖనిత్రుని చరిత్రము.
32. కరంధమ (బాలాశ్వ) చరిత్రము.
33. అవేక్షితచరిత్రము.
34. మరుత్తరాట్చరిత్రము.

ఈకథలతోపాటు వివరణాత్మకములును, వర్ణనాత్మకములు నైన కొన్నియంశము లీపురాణమునఁ గలవు. వానిలోఁ బ్రధానములైనవి యీక్రిందఁ బేర్కొనబడుచున్నవి :—

1. శ్రీనారాయణవ్యూహచతుష్టయ వివరణము.
2. పాంచాలీభర్తృపంచక వివరణము.
3. బలరామబ్రహ్మహత్యాప్రాయశ్చిత్త ప్రకారము.
4. జంతూత్పత్తిప్రకారము.
5. లక్ష్మీనివాసస్థానఫలవివరణము.

6. కర్మమార్గోపదేశము.
7. యోగమార్గవివరణము.
8. ప్రజలయుత్పత్తిప్రకారము.
9. మనుద్వీపవర్షాధిపతులవర్ణనము.
10. మన్వంతరములందలి దేవేంద్రాదుల వివరణము.

వేదార్థములను మిత్రసమ్మితముగాఁ బ్రతిపాదించుపురాణములలోఁ గథల కత్యంత ప్రాముఖ్య ముండును. అర్థవాదములవంటి పురాణకథలు నిర్దిష్టప్రయోజనసిద్ధికొఱకు భావింపఁబడి, ప్రపంచింపఁబడుచుండును. అందు కొన్నిశాస్త్రార్థములును చోటు చేసి కొనును. కొన్నియెడల నవి కథకంటె నధికముగాఁ బెరిగిపోవుచుండును. ఇట్టివాని యొక్క సమిష్టిరూపము పురాణము.

**ఆఖ్యానశిల్పము :**

మత్స్యపురాణము పురాణముయొక్క పంచలక్షణవిశిష్ట మైన వస్తువును "ఆఖ్యానక" మని పిలిచినది.

"పంచాంగాని పురాణేషు ఆఖ్యానక మితి స్మృతమ్". (2.22)

దీనినిబట్టి మారనమార్కండేయమునందును చతుర్థాశ్వాసము మొదలుకొని చివరివఱకుఁ గల వస్తువు "ఆఖ్యానకము" అని యనవచ్చును. కాని, "స్వయం దృష్టార్థకథనం ప్రాహు రాఖ్యానకం బుధాః" అని తాను స్వయముగాఁ జూచినదానిని జెప్పుట యాఖ్యాన మని విష్ణుపురాణటీకాకారుఁ డైన శ్రీధరస్వామి చెప్పియున్నాఁడు.[1] అమరకోశకర్త "ఆఖ్యాయి కోపలబ్ధార్థా" అని పేర్కొనినాఁడు. "ఆఖ్యాయతే నాయకచరిత మనయా ఆఖ్యాయికాఖ్యా ప్రకథనే అనియు; కేనాప్యుపాయేన ఉపలబ్ధః అర్థః యస్యా స్సా ఉపలబ్ధార్థా" అని సత్యచరిత్ర మనునర్థమున గురుబాలప్రబోధిక వివరించెను. ఆనంద వర్ధనాచార్యులు ధ్వన్యాలోకమున ఆఖ్యాయికా, కథాలక్షణములను దెలుపుచు — ఉచ్ఛ్వాసాదివిభాగములు గలిగి నడుమనడుమ నితరులపద్యములు గల గద్యప్రబంధము ఆఖ్యాయిక యనియు, అవాంతరవిభాగములు లేకయుఁ బద్యములు లేకయు నున్న గద్యప్రబంధము కథ యనియు నిర్వచించెను. కాని, దండి యాఖ్యాయికకును, కథకును భేదము లే దని చెప్పెను. "శివతత్త్వరత్నాకరమున కల్పితవృత్తాంతము కలది కథ యనియు సత్యవృత్తాంతము కలది ఆఖ్యాయిక యనియును దెలుపఁబడెను. మఱియు "వృత్త మాఖ్యాయతే యస్యాం నాయకేన స్వచేష్టితమ్" నాయకుఁడే స్వయముగా నెందుఁ దనవృత్తాంతమును దెలుపునో యది 'యాఖ్యాయిక' యని మఱొకలక్షణము కూడ కన పడుచున్నది."[2]

పైనిర్వచనాదులలో మత్స్యపురాణవ్యాఖ్యాతనిర్వచనము పురాణహృదయమునకు దగ్గఱగా నున్నది. మిగిలిన లాక్షణికు లొనర్చిన నిర్వచనములు చాలవఱకు హర్షచరిత్ర

1. చూడు: కావ్యాలంకారసంగ్రహము - పుట. 262.
2. చూడు: కావ్యాలంకారసంగ్రహము - పుట. 266.

వంటి లౌకికకావ్యములను దృష్టియం దిడుకొని యొనర్పఁబడిన ట్లగుపడుచున్నవి. లాక్షణికులు పద్యకావ్యభేదము నాఖ్యానక మనిరి; గద్యకావ్యభేదము నాఖ్యాయికయనిరి. సంస్కృత పురాణములు ప్రాయికముగా శ్లోకబద్ధములే యగుట నాఖ్యానకము లన్నను, తత్త్వతః లాక్షణికుల యాఖ్యానాఖ్యాయికల నిర్వచనములకు భేదము కానరాదు. సత్యవృత్తాంతము ఆఖ్యాన మనుట నిర్వివాదాంశము, పంచలక్షణవిశిష్టమైన పురాణము సత్యవృత్తాంత కథన మగునా యని యిచ్చట ప్రశ్న: సత్యము-స్వయముగాఁ జూచినదే కావచ్చును; అనుభవించినవాఁడు స్వయముగాఁ జెప్పినదే కావచ్చును; లేక అమరకోశకర్త చెప్పినట్లు ఏయుపాయముచేత నైన నుపలబ్ధ మైన కథార్థము కావచ్చును. అట్లగుచో పురాణ సంహిత బ్రహ్మప్రోక్త మనియు, ప్రాచీనఋషిదర్శన, ప్రవచనాదులు నిత్యము లనియు నమ్మెడిపురాణకర్తలకును, పురాణశ్రోతలకును పౌరాణికకథార్థములు సత్యము లగుటలో సంశయము లేదు. కావున లాక్షణికమతానుసారము పురాణము- ''ఆఖ్యానకము'' అనుటలో వైరుధ్యము లేదు. లాక్షణికులకు సర్గాదివిభాగములు గలకావ్య మాఖ్యానకము కావచ్చును; పౌరాణికులకు పంచలక్షణ మైన పురాణము ఆఖ్యానక మగును.

మాత్స్యపురాణోక్తి ననుసరించి పంచలక్షణములు గల పురాణ మాఖ్యానకము. కాని, పురాణములు పంచలక్షణములతో నాగిపోలేదు. దశ, దశాధిక లక్షణములతో పెరిగిపోయినవి. అట్టియెడ నప్పురాణార్థముల నన్నింటిని ఆఖ్యాన మనుట సమంజస మగును. ఉదాహరణమునకు మార్కండేయమున మొదటి మూఁడాశ్వాసములును, షష్ఠాశ్వాసము నందలి దేవీసప్తశతియు పంచలక్షణావధిని దాటియున్నను పురాణస్థములై నేడు కానఁబడుచున్నవి. ఇవియన్నియుఁ గలసియే మార్కండేయపురాణ మనఁబడుచున్నది. కావున నేతత్పురాణాద్యంతకథనము ఆఖ్యాన మనుట లెస్స! ఈదృష్టితో మారనమహాకవి మార్కండేయపురాణరచనాసర్వస్వమును "ఆఖ్యానక''ముగా లేక "ఆఖ్యానము''గా గైకొని, అందు ఆమహాకవి చూపించిన శిల్పసంపదను గొంత పరిశీలింప నీయధ్యాయమునఁ బ్రయత్నము చేయఁబడినది. అందుచే దీనికి ''ఆఖ్యానశిల్ప'' మను పే రుంచఁబడినది.

ఆఖ్యానమునఁ దత్తత్పురాణప్రధానతాత్పర్యము వ్యంగ్యముగా ప్రతిపాదింపఁబడును. తత్ప్రతిపాదనమునఁ బెక్కుకథ లుదాహృతము లగుచుండును. అందు మొదటి తెగకుచెందినవి- పురాణప్రవక్తలే స్వీయప్రతిపాదితాంశముల కుపబలకములుగా నితరులచేఁ జెప్పఁబడినవానిని గైకొని చెప్పినకథలు. మార్కండేయమున నిట్టివానికి జడోపాఖ్యానమును, సప్తశతియు నుదాహరణము లగును. వీనిలోఁ బైనపేర్కొనఁబడిన 4,5,6-10; 19సంఖ్యలును: (4)-(7)అనుఅంశములును ఇమిడియున్నవి. వీనిని 'ఉపాఖ్యానము' లనుట యుచితమగును. 'శ్రుతస్యార్థస్యకథన ముపాఖ్యానం ప్రచక్షతే'[3] అను శ్రీధరస్వామినిర్వచనము వీనిపట్ల అన్వయింపఁగలదు. కాని, ఉపాఖ్యానమున కిచ్చిన యీనిర్వచనము సమగ్రముకాదు. పురాణమున ప్రధానకథాంశ మైన ఆఖ్యానమున కుపాంగ మై

3. చూడు. కావ్యాలంకారసంగ్రహము - పుట. 262.

యుండు కథార్థములన్నియు నుపాఖ్యానములుగాఁ గైకొనుట యుచిత మని తోచుచున్నది. అట్లైనచో నుపపాండవోత్పత్తిహేతు వను ప్రధానతాత్పర్యమును బ్రతిపాదించుటతో నాగక సమగ్రకథా స్వరూపమును దాల్చిన హరిశ్చంద్రచరిత్రము ఉపాఖ్యాన మనఁబడును. అట్లే ఆడిబక యుద్ధవృత్తాంతముకూడ. ఇట్లు భావించుట పురాణహృదయమునకును, లోక ప్రసిద్ధికిని విరుద్ధము కాదు. తెలుఁగులో ''హరిశ్చంద్రచరిత్ర'' కావ్యముగా రచింపఁబడినను సర్వసామాన్యముగా దానిని హరిశ్చంద్రోపాఖ్యాన మని పిలుచుటయే కానఁబడుచున్నది. అది పురాణమున నుపాఖ్యానముగా నుండునుగాని, గౌరనాదుల హరిశ్చంద్రచరిత్రలలోఁ బ్రధానవస్తువే కదా ! మార్కండేయమున హరిశ్చంద్రచరిత్రము ప్రత్యేకమైన యుపాఖ్యానముగా పురాణకర్తచే నిర్మింపఁబడిన దనుటకు దానికిఁ బ్రత్యేకఫలశ్రుతియుండుటయే ప్రబలసాక్ష్యము. ఆడిబకయుద్ధము కూడ నిట్టిదే.

శ్రీధరస్వామినిర్వచనమునుబట్టి చూచినచో ధర్మపక్షులు చెప్పిన ప్రధానపురాణ భాగమంతయు మార్కండేయమహర్షి క్రోష్టుకికిఁ జెప్పినదే కావున నుపాఖ్యాన మనఁదగి యున్నది. కాని, య ట్లనుటకు వీలులేదు. అందువలన నీనిర్వచనము సర్వత్ర విచక్షణా విరహితముగాఁ బ్రయోగింప వీలుగా కున్నది. అనఁగా నిది యుపాఖ్యానసమగ్రస్వరూప మును నిరూపించుట లే దని భావము.

ఆఖ్యానములందుగాని, ఉపాఖ్యానములందుఁగాని యవాంతరకథలు లేక ఆరంభోప సంహార విశిష్టమైన కథ కథ. ''పితృపృథ్వీప్రభృతిగీతయః'' అను శ్రీధరస్వామి వాక్యము ననుసరించి పితృ, దేవ, భూగోళ, దానవీరాదుల వర్ణన లన్నియు గాథ లగు చున్నవి. పురాణకథలలో గాథ లుండవచ్చును; కథలోని పాత్రలచేఁ జెప్పఁబడిన యవాంతరకథ లుండవచ్చును. ఇట్టివానిని ఉపకథ లనవచ్చును. ఇట్లు భావించుట లక్షణవిరుద్ధము కాదు. పురాణాఖ్యానోపాఖ్యానశిల్పవిమర్శనావసరమున వీనిస్వరూపము లను, శిల్పసార్థక్యములను బరామర్శించుట జరిగినది.

ఇంతేకాక పురాణకథలకు మఱికొన్ని విశేషలక్షణములు కలవు. పురాణమూలము నుండి యారంభించి కథను చెప్పుట, చెప్పుటలో వస్తు, నాయక, రసశిల్పములను బ్రపంచించుటవంటి విందులో ముఖ్యము లైనవి.

మారనమహాకవి మార్కండేయపురాణమును బహువిధాఖ్యానశిల్పసుందరముగాఁ దీర్చిదిద్దినాఁడు. అతఁ డపూర్వకథాసంవిధానచతురుఁడై యుండుటచే నాతనికావ్యమున సహజసుందర మైన శిల్పసంపద వెల్లివిరిసినది. కృతికర్తచిత్తవృత్తి కనుకూలుఁడు కృతిభర్త. అతనికి మార్కండేయమహాపురాణము విను కుతూహలము జనించుట కయ్యది 'నూతనకథావిస్తారమై'[4] ప్రవర్తిల్లుటయే ప్రధానకారణమట ! అతఁడు మారనను 'తత్పురాణప్రకాశితసారకథామృతం బొగింద్రావి జగజ్జనంబు లలర న్వచియింపు మని'[5]

4. మారన మార్క., పీఠి. 14. 5. మారన మార్క. పీఠి. 17.

మనసార కోరినాఁడు. మారనయుఁ దా నట్లు చెప్పఁ గల్గుట జన్మ సాఫల్య మని[6] సంతసించినాఁడు. అతని కాపురాణము 'నానాఖ్యాన కదంబతరంగనాద'[7] బంధుర మైన సుధాసింధువువలె 'సారకథాసాంద్రచంద్రికాసంపద'[8] నొప్పారు 'పూర్ణేందుబింబము' వలె స్ఫురించినది. అతఁ డాసముద్రమును బుద్ధిబాహువిక్రమమున మథించినాఁడు; ప్రతిభా నైపుణ్యము చేత సుధాసారమును తరంగపంక్తులపైఁ దెట్టలు కట్టించినాఁడు.

మారన తా నీపురాణమున కథాశిల్పములను సంతరించినట్లు వాచ్యముగాఁ జెప్ప లేదు. కాని, తా నట్టిప్రక్రియలఁ బాటించుచున్న ట్లన్యాపదేశముగా నచ్చటచ్చట వ్యపదే శించినాఁడు. పురాణారంభగద్యముననే మారన యమూలకమైన తపోవనవర్ణనము చేయుచు నది "శాస్త్రపురాణేతిహాసకథాకథన చతురతాపసోత్తమ పరిషదభిరామ"[9] మని పేర్కొని నాఁడు. జైమినిమునిముఖమున భారతేతిహాసప్రశస్తి చేయుచు నది 'సర్వకథాభిశోభిత'[10] మని యమూలకమైన విశేషణము నుగ్గడించినాఁడు. జడుఁడు పూర్వజన్మమున బహువిధ శాస్త్రములను, శిల్పములను జదివినట్లు మూలమున[11] నుండ మారన యాతఁడు బహు విధాఖ్యానశిల్పముల[12] నభ్యసించినట్లు ప్రత్యేకించి చెప్పినాఁడు. బలరాముఁడు సురాపాన మత్తుఁడై విలాసినీపరివేష్టితుఁడై రైవతోద్యానమునఁ బ్రవేశించి, అందు సూతునివలన బహుపురాణకథ లర్థి వినుచున్న మహర్షిమండలిని గాంచె[13] నన్నవిషయము మారన వదలివేయక తెలుఁగుచేసినాఁడు. మార్కండేయుఁడు క్రోష్టుకికి సర్గాదిమహావిషయము లన్నియుఁ జెప్పి చివరకు "నేలత్పురాణకథ లాకర్ణించితే?"[14] అని ప్రశ్నించుచు కథా ప్రాధాన్యము నుగ్గడించినట్లు మారన స్పష్టము చేసినాఁడు. వీనిలో నన్నింటను మారన కథాకథనశిల్పపక్షపాతము నిగూఢరమణీయముగఁ బ్రపంచించుట స్పష్ట మగుచున్నది.

మారన కిట్టిమార్గమును జూపిన మహనీయులు నన్నయతిక్కనలు. 'ఆంధ్రకవితా గురుఁ'డైన నన్నయ 'సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా నారఁగఁ గ్రోలుచు న్జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా భారతసంహిత'[15] యందు పర్వత్రయము నెప్పె ననియు, 'ఉభయకవిత్వతత్త్వవిభవోజ్జ్వలుఁ డైన తిక్కన 'భారతసంహితాకథా విభుఁ'[16] డనియు మారన స్తుతి చేసియుండెను. కావున భారతమున నన్నయయొక్క సారకథారససిద్ధియు, తిక్కనయొక్క భారతకథానిర్వహణసార్వభౌమత్వమును మారన హృదయము నాకర్షించె ననియు, వానిని దనకావ్యమునఁ బ్రతిష్ఠింప నాతఁడు యత్నించి సఫలీకృతుఁ డయ్యె ననియు భావింప వీలగుచున్నది.

మారనమహాకవి మార్కండేయమహాపురాణమున నిక్షేపించిన శిల్పసంపదనంతటిని

---

6. మారన మార్క. పీఠి. 18.
7. మారన మార్క. పీఠి. 20.
8. మారన మార్క. పీఠి. 22.
9. మారన మార్క. 1.1.
10. మారన మార్క. 1.4.
11. మార్కం. మహాపు. 10 16.
12. మారన మార్క. 2.25.
13. మారన మార్క. 1.135.
14. మారన మార్క. 8.280.
15. మారన మార్క. పీఠి. 9.
16. మారన మార్క. 10 3.

గొల్లకొట్టుట సాధ్యమైనపని కాదు. కావున తత్పురాణకథలను గొన్నిటిని గైకొని వాని యందు మారన ప్రపంచించిన ఆఖ్యానశిల్పసౌందర్యమును స్థాలీపులాకన్యాయముగా నిందుఁ బరిశీలించుట యగుచున్నది.

## ద్రోణనందనచరిత్రము :

మార్కండేయపురాణ కథాప్రవంతికి విష్ణుపదస్థానీయ మైనది ద్రోణనందన చరిత్రము. ఏతత్పురాణప్రవక్తలు చతుర్ముఖసదృశులైన ద్రోణసుతులు. వారు పరమ జ్ఞానచక్షువులైన పక్షులు; పింగాక్షవిరాటవ్పుత్రసుముఖనామధేయులు; దృఢాగమపండితులు, ప్రవిమలజ్ఞానవంతులు, పరమశాంతులు, అఖిలభాషావిశారదులు, అమితతేజులు, సతత సమాధిరతులు, సకలశాస్త్రపురాణార్థనిశ్చయసమర్థులు! వారిచరిత్రమును మార్కండేయ మహర్షి జైమినిమునికిఁ జెప్పెను. సాక్షాన్మార్కండేయముఖవినిర్గగ మగుటచే నీకథ మిగిలినవాని కంటె వైలక్షణ్యముతో భాసించుచున్నది.

శ్రోతృసంశయార్థములను బరిశీలించి, వానిని జ్ఞానసంపన్నము లొనర్చు కథార్థము లను సంతరించి, శంకాపేత మగు మార్గము ననుసరించి, కథాపురాణమూలము నారంభించి, యక్షీణప్రీతిజనకముగాఁ బౌరాణికులు ప్రపంచించునవి పురాణకథలు. పక్షులకు నిర్మల వాక్సిద్ధియు, జ్ఞానమును, మహిమయు నెట్లు కలిగె నని జైమినిప్రథమసంశయము. మార్కండేయుఁడు భారతకథార్థరహస్యము నెఱిఁగింపఁ బక్షులు సమర్థు లని చెప్పిన వాక్యముపైఁ జప్పున గలిగిన మొదటిసంశయమాన మది! మహర్షి పక్షులు ద్రోణసుతు లని పరిచయము చేసెను. దానితో నతనికి నట్టిజ్ఞానులను బడసిన ద్రోణునియొక్క మాహా త్మ్యమును, అతఁడు వారినిఁ బడసినవిధమును దెలియ నుత్కంఠ కలిగినది. జైమిని వెంటనే 'ద్రోణుఁ డన నెవ్వఁడు? అట్టిపుత్త్రుల నమ్మహాత్ముఁ డెట్లు వడసెను? అని ప్రశ్నించెను! (1.15)

జైమినిముని యడిగినప్రశ్నలకు యథాక్రమముగా మార్కండేయుఁడు సమాధాన మీయలేదు. పైగా విపరీతక్రమము నాశ్రయించి కథార్థముల ననుసంధించి చెప్పినాఁడు. జైమిని శంకలు ప్రస్తుతమునుండి పురాతనమున కెగఁబ్రాకినవి. మార్కండేయప్రోక్త కథార్థములు పురాతనకథామూలమునుండి ప్రస్తుతమునకుఁ దీగలుసాగినవి. అట్లు చెప్పుటవలనఁ గథాగమనమునకు శంకాపేతమైన మార్గ మేర్పడినది!

జ్ఞానపక్షుల కన్నతండ్రియైన ద్రోణుఁడు పరమమునియైన మందపాలుని చతుర్థ తనయుఁడు. అతఁ డుద్ధురగుణుఁడు. మదనికాకందరులపుత్త్రి యగు తార్క్షినిఁ బెండ్లాడి యామెవలన జ్ఞానపక్షులఁ బడసెను. కాని, కన్నబిడ్డలఁ గన్నార చూచుకొనుభాగ్య మాతఁడు నోచుకొనలేదు. పుత్త్రులకుఁ బుట్టుక నిచ్చుచు తార్క్షి దేహము చాలించి స్వర్గమున కరిగినది. పక్షులు కురుక్షేత్రరణరంగమధ్యమునఁ బుట్టి కరుణాళుఁడైన శమీకునిచే రక్షింపఁబడి వర్ధిల్లినవి. అట్లగుటచేఁ గథలో ద్రోణునిప్రాధాన్య మేమియుఁ గానవచ్చుట లేదు. అసలు దుర్వాసనుకృశమహర్షుంశాపము బు ధర్మపక్షుంసవిత్రజన్మ హేతువులు. అవి

భువిలోఁ బ్రవర్తిల్లుటకు నిమిత్తమాత్రుఁడు ద్రోణుఁడు. అదియే యతని మహత్త్వము ; ఆయర్థము స్పష్ట మగునట్లు మహర్షి కథ నడిపించెను.

ద్రోణనందనచరిత్రమును ప్రధానముగా నాలుగుభాగములుగా విభజింపవచ్చును. అందు మొదటిది : వపువనునచ్చర దుర్వాసమహర్షిచేఁ బక్షియై జన్మించునట్లు శపింపఁబడినకథ. వపువు తార్క్షియై పుట్టుటకు హేతుభూతులైన మదనికాకందరులకథ రెండవది. ద్రోణనందనులైన పక్షులు శమీకమహర్షిచే రక్షింపఁబడి పోషింపఁబడిన కథాభాగము మూఁడవది. జ్ఞానపక్షుల జన్మహేతు వైన సుకృశశాపవృత్తాంతము నాలుగవది. ఈనాలుగుభాగములమధ్య నేర్పడియున్న కార్యకారణసంబంధమును బ్రపంచించి జన్మాంతరకర్మఫల మవశ్య మనుభోక్తవ్య మను పరమార్థము ప్రబోధించినాఁడు మహర్షి.

## వపుశాపవృత్తాంతము :

ఈభాగము చక్కనిరెండురంగములతో నొప్పారు రూపకాంకమువలె నొప్పారుచున్నది. ఒకటి : నందనవనదృశ్యమున జరిగినది. రెండు : హిమవన్నగ సానువనాంతరమున జరిగినది. ఈరెండుదృశ్యములందును బ్రధానభూమిక వపువు. తత్పాత్రచిత్రణ మీ కథకు జీవము ;

మూలకర్త వపుపాత్రగుణశీలములను దెలుపు శబ్దార్థములను గథయం దెల్లెడల సందర్భవశమున యథేచ్ఛగాఁ బఱచి చెప్పినాఁడు. మారన వానిని బాగుగాఁ బరిశీలించి నిగ్గు దేల్చి సార్థకములైనవానిని విశిష్టక్రమమున ననుసంధించినాఁడు. దానివలనఁ బాత్రనర్థముచేసికొనుటకుఁ జక్కనిమార్గము లేర్పడుటయేకాక యన్వయకాఠిన్యము తొలఁగి రసభావభావనమున కెంతయో సౌలభ్య మేర్పడినది.

వపువు 'మునిక్షోభణగర్వితి' యనియు, 'అప్సరశ్రేష్ఠ' యనియు, 'బాల', 'రుచిరస్వన' యనియు, 'చారుసర్వాంగి' యనియు, 'మానిని' యనియు, 'తరలతరతరంగాంగ' యనియు మూలకర్త పేర్కొనుచుఁ గ్రుద్ధుఁడైన దుర్వాసునిముఖమున 'మదోన్మత్త' యనియు, 'దుష్ప్రజ్ఞ' యనియు, 'అధమాప్సరస' యనియు నిందింపఁజేసెను. మారన తనయనువాదమున మానిని, మదవతి, అబ్జాక్షి, రూపగుణగర్వోన్మత్తచిత్త అని వర్ణించి, దుర్వాసునిచే నామెను 'పుంశ్చలీ' యని మాత్ర మనిపించి యూరకుండెను.

ఈకథాభాగమున మొట్టమొదట వపువును బఠితకుఁ బరిచయము చేయుచు మూలకర్త "తత్రాప్సరా వపుర్నామ మునిక్షోభణగర్వితా। సత్యవాచానుయాస్యామి యత్రాసౌ సంస్థితో మునిః" (1.42) యని పేర్కొని యామె యన్నమాటలుగా నీక్రింది వానిని రచించెను.

శ్లో. అద్యతం దేహయన్తారం ప్రయుక్తేన్ద్రియవాజినమ్
స్మరశస్త్రగళద్రశ్మిం కరిష్యామి కుసారథిమ్ ॥
బ్రహ్మా జనార్దనోవాపి యదివా నీలలోహితః।
తమప్యద్య కరిష్యామి కామబాణక్షతాన్తరమ్ ॥ (1.43-44)

వీనిని మారన యి ట్లనువదించెను :

క. తా నిట్లను వపు వను నొక
మానిని మునివంకఁ గాంచి మదవతి యగుటన్.

చ. పలుకులు వేయునేల మునిపాలక ! నాదగురూపమంజువా
గ్విలసనలీల నమ్మునివివేక మడంచెదఁ దాల్మిఁ జించెదన్
గలఁచెద డెందముం దపము గర్వము మాన్పెద నే మనంబునం
దలఁచిన రుద్రు నైన ఘటదాసునిఁ జేయుదుఁ గామునింటికిన్.

మ. అని గర్వోక్తులు వేడ్కఁ బల్కి.............. (1.20-22)

మూలకర్త నానామునిశ్రేష్ఠులతపములను భగ్నమొనర్చిన ప్రౌఢగను, దుర్వార గర్వితగను, వపువును మొదట పరిచయము చేసినాఁడు కాని తరువాత దుర్వాసుని కన్నులముందు 'బాల'గాఁ గనుపఱచినాఁడు. "తద్గీతధ్వని మాకర్ణ్యముని ర్విస్మిత మానసః । జగామ తత్ర యత్రాస్తే సా బాలా రుచిరస్వనా" (1.47) యని మూలము. ఈరెండుస్వభావచిత్రములు పరస్పరవిరుద్ధము లైనవి. ఈవైరుధ్యము తొలఁగించి పాత్ర శీలమును స్పష్టముచేయుటకై మారన 'మానిని' 'మదవతి' యనుపదము లుపయోగించెను. 'మాన శ్చిత్తసమున్నతిః' యని యమరము. నేను శూరుఁడను, నేను అర్థవంతుఁడను- అనువిధముగాఁ బరులకంటె నుత్కర్షభావమును బ్రకటించుచిత్తవృత్తి మానము. మద మనఁగా గర్వము. "రూపధనవిద్యాది ప్రయుక్తోత్కర్షజ్ఞానాధీనపరావహేలనం గర్వ" మ్మని లాక్షణికోక్తి. మానము రూపాదులయందలి యుత్కర్షజ్ఞానమై యుండఁగా, మదము-లేక-గర్వము తదధీనమైన పరావహేళనరూప మగు చిత్తవికార మగును. ఈరెండింటికినిఁ గారణకార్యసంబంధము నూహించుట సులభము. ఈయర్థమును మారన "మానిని ముని వంకఁ గాంచి మదవతి యగుటన్" అను పద్యపాదములోని యతిమైత్రిసంధానమున వ్యంజించినాఁడు. "మానిని" యనుపదము మూలకర్తయు స్థలాంతరమున వాడినాఁడు.

శ్లో. ఇతి వచన మసహ్యం కోపసంరక్తదృష్టి
శ్చలకలవలయాస్తాం మానినీం శ్రావయిత్వా ।
తరలతరతరఙ్గాంగాం పరిత్యజ్య విప్రః
ప్రథితగుణగణౌఘాం సమ్ప్రియాతః ఖగఙ్గామ్ ॥ (1.54)

ఇది యొకవిధముగా నీఘట్టముయొక్క ముగింపుశ్లోకము. ఇచ్చట మానినీశబ్దప్రయోగ మునకు సార్థక్యము లేదు. మూలకర్త పాదపీఠియందు పొదిగిన రత్నమును దీసి, మారన మకుటస్థానమున నలంకరించెను. దానితోఁ గథార్థమున కొకనూత్నకాంతి వచ్చెను.

వపు వనిన మాటలలోని మొదటిమూఁడుపాదములం దామె యాత్మాభిమానమును, జివరిపాదమం దామెగర్వాతిశయమును గొట్టవచ్చినట్లు కనవచ్చుచున్నవి. మూలము నందలి "మునిక్షోభణగర్వితా" యను విశేషణప్రయోగమునఁ కథలో నేర్పడిన ప్రత్యేక ప్రయోజనము లేదు; స్వభావపరిణామప్రక్రమసూచనము లేదు. మారన తెలుఁగున నట్టి

లోపము పూరించుటయే కాక వపు వన్నమాటలలోఁ గొన్నిశబ్దార్థశిల్పములు సంత రించినాఁడు.

కథాకథనమున మారన వస్తుసూక్ష్మాంగశిల్పముల నతిజాగరూకతతోఁ దీర్చిదిద్దు 'ననుటకు "రూపమంజువాగ్విలసనలీల" యనుసమాసము చక్కనియుదాహరణము. ఈమాట నారదునకుఁ దగిలివచ్చునట్లు వపు వన్నది. నారదుఁ డిదివరలో- "మంచుమల మీఁద దపము గావించుచున్న యనఘుదుర్వాసమునిపుంగవునిఁ గలపఁజాలు నేయింతి దనవిలాసప్రశస్తి నదియెపో యెక్కఁడు" (1.19)అని గడుసుగాఁ బలికినాఁడు. ఆమహర్షి వశీకృతవాక్కు. భావుకులకుఁ దనమాటలలోనే భావ్యర్థములు వ్యంజింపఁజేయఁగల సమర్థుఁడు. పైమాటలలో 'మునిపుంగవునిఁ గలఁపఁ జాలున్ + ఏయింతి' యను నన్వయము మొదట స్ఫురించినను, 'గలఁపఁజాలునే + యింతి' యను విభాగము కూడ నుపలక్షిత మగుచున్నది. అది భావికథార్థవ్యంజక మగుచున్నది.

నారదుఁడు 'విలాస'పదముపై నూనిక యిచ్చి మాటలాడినాఁడు. దానికిఁ దిరుగు జవాబుగా వపువు "రూపమంజువాగ్విలసనలీల"లఁ బ్రసక్తిఁ దెచ్చినది. అప్సరసలలో రూపవాగ్విలసనములఁ' దానే యుత్కృష్ట యని భావించు తత్పాత్ర నిగూఢగర్వవ్యక్తి కామాట చక్కఁగా నతికినది. మారన యిట్టిశిల్పముచేత నిచ్చట నొకస్వభావరూపకల్ప నము చేసి, యనంతరకథాఘట్టమునఁ దానినిఁ బోషించి యైక్యత సాధించినాఁడు. దూర్వా సుఁడు రయంబున వచ్చి 'రూపగుణగర్వోన్మత్తచిత్తయైన' వపువునే దర్శించెనఁట! మూలకర్త యప్పట్టున 'చారుసర్వాంగి' యని పేర్కొనెను. మారనశబ్దప్రయోగమున సార్థక్యము కలదు! దుర్వాసునిఁ దనగానముచేఁ గలఁగింపఁ జేసి తపస్సమాధికి స్వస్తి చెప్పించి,తనవైపునకు రయమునఁ దెప్పించుకొనుచుంటిని కదా యనుభ్రాంతితో గర్వోద్ధతి నొందిన యామెచిత్తమును మారన సహజముగఁ బ్రదర్శించినాఁడు. ఆమె గర్వోన్మత్త తయే దుర్వాసుని కోపోద్దిక్తతకు హేతువైనది. చారుసర్వాంగిని గాంచి మునీంద్రుఁడు శాపవజ్రాయుధము నెత్తెననుట సహజవిరుద్ధముకదా! కావున మూలకర్తకంటె మారన దుర్వాసునికోపహేతువును జికిలిపెట్టి తీర్చిదిద్దినాఁడు. దానితోఁ గథయందొక పూర్వాపర విరుద్ధవిరహిత మైన కథాశిల్పము సమకూరినది.

వపువు 1.43 వ శ్లోకమున సాలంకారసంభాషణ మొనర్చినట్లు మూలము. మారన దానినిఁ దెనుఁగు సేయలేదు. దానికి ప్రథమకారణ మాపాత్ర మట్లు మాటలాడుటయం దౌచిత్యము లేదని తలంచియుండుట. రెండవది: నిష్ఫలము లయ్యెడు నప్సరఃప్రగల్భముల కలంకారశోభ యనవసర మని భావించుట! మూఁడవది: నారదుని వక్రసంభాషణము నకు విసుగెత్తి యున్న వపువు స్వీయగర్వావేశమును వేగముగను, ధారాళముగను, సహజముగను, సరళముగను, జాతీయముగను వ్యక్తము చేసినట్లు చిత్రింపఁదలఁచుట. చివరిది: ఆశ్లోకమందలి రూపకము సావయవము కాకపోవుట!

శరీర మనెడు రథమునకుఁ బూన్పఁబడిన యింద్రియకంఖాణములకుఁ గట్టఁబడి యున్న వివేక మనెడి పగ్గమును స్మరశస్త్రముచేఁ ద్రెంపి, బుద్ధి యనుసారథి నణఁచెనని

యుండవలసినసావయవరూపకమునందు పగ్గములకును, సారథికిని నుపమానములు చెప్పఁబడలేదు. ఒకవేళ చెప్పఁబడియున్నను దపోభగ్నమును రథభగ్నముగా రూపించుట వీరపురుషోచిత మగును గాని యప్సరః పాత్రోచితము కాఁజాలదు. అందువలన మారన మూలమునందలి పిండితార్థము గ్రహించి, "వివేక మడంచెద" "తాల్మి చించెదన్" "కలఁచెద డెందమున్" "తపముగర్వము మాన్పెద" నన్నట్లు రచించెను. నారదుఁడు "మునిపుంగవుని గలఁపఁజాలు నేయింతి" యని కదా యన్నది. దానికి సమాధానము "కలఁచెద డెందమున్" అనువాక్యము. మనస్సునకుఁ దాల్మి కవచము· వివేకము శక్తి, తపోగర్వము గుణము. వపువు రూపసౌందర్యమునకు ముని ముగ్ధుఁడై వివేకము గోల్పోవును, ఆమెవచోనైపుణ్యమునకుఁ దాల్మిఁ గోల్పోయి, విలాసవిభ్రమములకు మనమునఁ గలఁతఁ జెందును. చివర కామెకు వశుఁడై తపోగర్వమును గోల్పోవును. ఇట్టి చక్కని భావక్రమ మావాక్యసంధానమున గమ్యమాన మగుచున్నది. ఇచ్చట మారన చూపిన యలంకారధ్వని ప్రశంసనీయము!

బ్రహ్మజనార్దననీలలోహితులను సైతము కామబాణక్షతాంతరుల నొనర్చెద నని వపువు ప్రగల్భమాడినట్లు మూలము. దానిని మారన సంగ్రహముగను, సారవంతముగను ననువదించి కొన్నిసొగసులు చూపించినాఁడు. "నే మనంబునం దలఁచిన రుద్రునైన ఘటదాసునిఁ జేయుదుఁ గామునింటికిన్" - ఇది తెలుఁగుజాతీయ ముట్టిపడెడు పలుకుబడి. మూలమున నున్న త్రిమూర్తులలో నొక్కరుద్రునిమాత్రము చెప్పుట విశేషము! త్రిమూర్తులలోఁ గామదహనుఁడు రుద్రుఁడు. అతని నొంచుటలోనే ప్రత్యేకత కలదు. పద్మాసనపద్మాక్షులఁ గలఁచుట యంత ఘనకార్యము కాదు! అంతియకాక బ్రహ్మ నారదునితండ్రి, విష్ణు వాతనియుపాస్యదైవము. కావున వారిపేళ్లు ఎదలుటవలన వపువపూర్వలౌకికప్రజ్ఞ నాలుకపోసిన ట్లగును. "ఐనన్" అనుటచేత బ్రహ్మాదులను గతార్థము చేయుట పలుకుబడిలోని గడుసరితనము. అదియుఁ బాత్రకు వన్నెఁదెచ్చుగుణమే. ఇచ్చట రుద్రశబ్దప్రయోగము సార్థకము. కామహరునియందు భాసించెడిది రుద్రాంశ కాని, నీలలోహితాంశ కాదు. అది యొకసార్థక్యము. దత్తాత్రేయోపాఖ్యానమున దుర్వాసుఁడు రుద్రాంశసంభూతుఁ డని చెప్పఁబడియున్నది. రుద్రునే ఘటదాసునిఁ జేయుదు ననుటలోఁ దదంశసంభూతుఁ డైనదుర్వాసుఁ డెంత యనెడు నిర్లక్ష్యభావము సంలక్షిత మగుచున్నది. రుద్రశబ్దమును కోపనుఁ డను రూఢ్యర్థమున గైకొనినచో దుర్వాసుఁడు ప్రచండకోపసంజ్వలితుఁ డైనను సరియే యాతనిఁ దనవచోవిలాసములచేఁ గ్రమముగాఁ గాని కామదాసునిఁ జేయఁగలుగుదు ననెడి సాహసము నాయచ్చర ప్రదర్శించుచున్నట్లు తెలియవచ్చును. ఈయర్థసంపత్తి మారనవచశ్శ్రీ సమాశ్రితమైనదే!

ఇంద్రుఁ డప్సరసలలో నెవ్వతె నృత్య మింపుగొల్పు నని నారదునిఁ బ్రశ్నించి నప్పుడు- "ఏత చ్ఛ్రుత్వా ద్విజశ్రేష్ఠో వాక్యం శక్రస్య నారదః విచిన్త్యాప్సరసః ప్రాహ వినయావనతాః స్థితాః" (1.34) అనుశ్లోకము మూలమునఁ గలదు. మారన 'వినయావనత' శబ్దము నాసందర్భమున ననువదింపలేదు. కాని, దుర్వాసముని నామశ్రవణమాత్ర

మునసే రంభాదుల కుదయించిన భయాదిభావములను, అనుభావములను వర్ణించుచో "నానతముఖలై యొకపలు కైనను బలుకంగ నోడి యంద" రున్నట్లు పేర్కొనెను. ఆ సందర్భమున మూలమున ని ట్లున్నది:

శ్లో. తస్య తద్వచనం శ్రుత్వా సర్వా వేపితకన్ధరాః
అశక్య మేత దస్మాక మితి తా శ్చక్రి రేకథాః॥ (1.41)

మూలకర్త రంభాదులు భయము నాక్రందనరూపమున వక్తపఱచి రని చెప్పెను. మారన వారియందు భయము నొకవైపును దుర్వాసునితపోభంగ మసాధ్య మను భావమువలనఁ గలిగిన లజ్జాతిశయము మఱియొకవైపును జోడించి యంతవఱకును రూపాతిశయమున నహమహమికలతో వాదులాడుచు సద్దుచేయుచున్న యచ్చరలమధ్య ననుభావముగా నిశ్శబ్దము నిలిపినాఁడు; సౌందర్యగర్వములతో నిక్కుచున్న వారిమొగముల నవనతము లొనర్చినాఁడు. మూలముకంటె మారన సన్నివేశము నతిసహజముగను, సంశ్లిష్టసంచారి భావవ్యంజకముగను జిత్రింపఁగలిగెను.

శైలకాననవన వర్ణనములందు మారన కభినివేశము మెండు. వపువు హిమాలయ సందర్శనము చేసినఘట్టము మారన మూలముకంటె రమణీయముగా ననువదించెను.

శ్లో. ఇ త్యుక్త్వా ప్రజగా మాథ ప్రాలేయాద్రిం వపు స్తదా
మునే స్తపఃప్రభావేన ప్రశా న్తశ్వాపదాశ్రయమ్॥ (1 45)

అని మూలము. దుర్వాసునితపఃప్రభావమునఁ బ్రశాంతము లైన వ్యాఘ్రాదిక్రూరమృగములతో నొప్పారు హిమాద్రిని సంస్కృతపురాణకర్త సృష్టించినాఁడు. తపోవనముల నట్లు చిత్రించుట మహాకవిసంప్రదాయముగా వెలసినది. కాని, మారన దీనిని మఱియొక దృక్కోణముతో దర్శించి నిర్మించెను. వపువు వియత్తలమునుండి క్రమముగా హిమవన్నగముపై దిగుచు మొదట తద్విస్తృతస్వరూపమును దర్శించినట్లును, తరువాత నామె యొకసుందరకందరమున గల వనమునందుఁ బ్రవేశించినట్లును వర్ణించెను. గగనపథగాములు భువి కవతరించునప్పు డిట్టివర్ణనము చేయుటయుఁ గూడ పూర్వకావ్యప్రసిద్ధమే. దాని నాశ్రయించి మారన గిరివనవర్ణన మాచరించి యొకవైశిష్ట్యమును వెలార్చెను.

మ. అని గర్వోక్తులు వేడ్కఁ బల్కి చెస నయ్యబ్జాక్షి దృగ్దీధితుల్
దనుకంగాఁ జని కాంచె నంత హిమవంతంబున్ లసన్నూత్నర
త్ననితాంతద్యుతిపుంజరంజితదిగంతంబున్ లతాంతోల్లస
ద్ఘనరేఖాంచితసానుమంతము మరుద్దంతిస్ఫురత్ప్రాంతమున్.

వ. కని తదీయసుందరకందరంబునందు

క. మలయానిలమృదులీలా
చలితతరులతాప్రసూనసౌరభమాలా
కలితమధుమత్తమధుకర
విలసనమున నొప్పు వనము వెలఁదుక సొచ్చెన్. (1. 22-24)

మొదటిపద్యమున మారన హిమవంతమును మూఁడుదీర్ఘసమాసములలో వర్ణించినాఁడు. వపువు స్వర్గపుఁబొలిమేరలలో నుండగనే హిమవన్నగనూత్నరత్నకాంతి నభోమార్గమున వ్యాపించియుండుటఁ గాంచి దిగ్భ్రాంతి చెందినది. ఆమె కవ్వు దగ్గిరియొక వెలుఁగులకుప్పవోలెఁ గనుపట్టినది. ఆమె పర్వతమును సమీపించినది. ఆసానుమంత స్వరూపరేఖలు స్పష్టమైనవి. ఆమె హిమవంతముపైఁ గాలూనినది. మరుద్దంతిస్ఫురత్ప్రాంతము గోచరించినది. ఇట్లు చెప్పుటవలన నప్సరస స్వర్గావరోహణక్రమమును, హిమనగమహత్వమును వ్యంజింపఁబడుచున్నవి. దీర్ఘాక్షరబాహుళ్యముచేతను, బిందుపూర్వకపరుషసరళాక్షరప్రయోగమువలనను నప్పర్వతము సుదీర్ఘమైన దనియు, పరుషశిలామయమయ్యును హిమాచ్ఛన్నమైన దనియు, కాంతిమంతమైన దనియు, లలితలతాపుష్పాదులతో మృదులమై పక్షిగణనాదసంభరితమై యొప్పుచున్న దనియు నర్థగాంభీర్యమేర్పడుచున్నది. దీనికిఁదోడు పర్వతవర్ణనలక్షణము లచ్చుపడియుండునట్లు తీర్చిదిద్దుట మారన రచనాసామర్థ్యమునకుఁ దార్కాణము!

ఇఁక రెండవపద్యము వనవర్ణనము. అందు మధుమత్తమధుకరముల క్రీడలను వర్ణించినాఁడు మారన. మందమలయానిలచలితనూత్నప్రసూనములందు మధువు గ్రోలుచుండుటచేఁ బుప్పొడులు మేనుల కంటి సౌరభమాలాకలితములై విలాసపురుషులవలె శోభిల్లు మధుకరము లిందుఁ జిత్రింపఁబడినవి. ఈవర్ణనము శృంగారరసానుకూలమై యుండుటచే శాంతరసానుకూలమైన మూలతాత్పర్యమునకు భిన్నమైనట్లు స్పష్టమగుచున్నది. అందలి సార్థక్యము నరయవలసియున్నది. దుర్వాసుఁడు రౌద్రరసమూర్తి యని ప్రసిద్ధి గనినవాఁడు. అతనిని శాంతైకతపఃప్రభావమహితాత్మునిగాఁ జిత్రించుటవలన గథలో సహజత్వము కొంత సడలకలదు. కావున ఋషితపఃప్రభావముద్రితమైన శైలవనమును మారన భావింపలేదు. కాగా హిమవంతమునకు లతాంతసౌరభసంపద సహజమైనట్లు పూర్వపద్యమువలన వ్యక్తమొనర్చినాఁడు. ఆకొండలో నేకోనకు వెళ్ళినను నట్టిదృశ్యములే కానఁబడుచుండును. కావున నట్టివన మాగిరికందరమున సహజసిద్ధమై యున్నట్లు మారన కల్పించినాఁడు. మూలమున 'ప్రశాంతశ్వాపదాశ్రయ' మైన పర్వతము చెప్పఁబడినది. అనఁగా ఋషితపఃప్రభావముచేఁ బ్రాలేయాద్రియంతయుఁ బ్రశాంతభావముద్రను వహించియున్న దని భావము. మారన యిచ్చట భావికథార్థములను భావించి యిట్టితపఃప్రభావవర్ణనము చేయుటవలన నెట్టిప్రత్యేకప్రయోజనము సాధింపఁబడ దని తలంచి యుండవచ్చును. వపుశాపఘట్టమున నతిరుద్రుఁడై వెలుఁగవలసిన దుర్వాసుని శమదమగరిష్ఠునిగాఁ జిత్రించినచోఁ బౌర్వాపర్యకథార్థములు దెబ్బతినును. కావున మారన 'ప్రశాంతశ్వాపదాశ్రయ' మని హిమనగమును వర్ణింపలేదు.

హిమగిరివర్ణనావసరమున మూలకర్త మహర్షి యగు దుర్వాసుని కనుగుణమైన తటస్థవిభావములను గల్పింప మారన వపుపాత్ర కనుకూలము లగువానిగాఁ దీర్చిదిద్దినాఁడు. దానివలనఁ గొన్నిప్రయోజనములు సాధింపఁబడినవి. వపువు దుర్వాసుని చిత్తము కలఁచుటకు వచ్చినది. ప్రకృతి యామెయత్నమున కనుకూలించినది. ఆలం

బనవిభావ మైన నయ్యచ్చర కుద్దీపనవిభావ మగు నామెగానమును తటస్థవిభావము లగు శైలవనాదులును గలసి విభావపుష్టిని సిద్ధింపఁజేసినవి. ఇంత యట్టహాసముతో నున్న వపువు తనకార్యమును అనాయాసముగా నిర్వర్తించుకొనునేమో యనుభ్రాంతి పఠిత కేర్పడును. చివరకు దుర్వాసశాపాగ్ని కెరయై పోయినప్పుడు పఠితకు ఆశ్చర్యము కలుగుటతోపాటు నాయచ్చరపై నపారసానుభూతి జనించును. ధర్మపక్షుల మాతృస్థానమైన యచ్చరపైఁ బఠితలకు సానుభూతిఁ గలిగించుట మారనలక్ష్యము: అది సమంజసము కూడ.

పుంస్కోకిలకంఠమాధుర్యముతో వపువు గాన మాలపించిన దని మూలము. "వట్టి మ్రాకులు చివుళులు వెట్టు" నట్లు పాడె నని మారన. అనువాదమున తెలుఁగుజాతీయ ముట్టిపడునట్టి పలుకుబడి కుదిరినది. అంత మహత్త్వామెపాటకుఁ గలదు కావుననే స్థిర సమాధిగతుఁడైన మహర్షి పులకించి కనుదెరువఁ గలిగెనను వ్యంగ్య మేర్పడుచున్నది.

మారన వపుపాత్రనిర్మాణమున నెంతశ్రద్ధ వహించెనో యంతటి శ్రద్ధను దుర్వాసర్షి పాత్రచిత్రణమునందును గనఁబఱచెను. దుర్వాసహృదయోద్భూత మగు క్రోధమును గ్రమపరిణామబద్ధముగాఁ బ్రదర్శించుటయందు మారన కృతకృత్యుఁ డయ్యెను. దుర్వాసుఁడు క్రుద్ధుఁడై "గీర్వాణాధిపుతోడఁ బూనితి" వనుమాట యనిన ట్లమూలముకముగా మారన రచించినాఁడు. దానివలన కథార్థముల కొక శిల్పసౌందర్యము సమకూరినది. మూలమున దుర్వాసుఁడు దుర్వారకోపముతో వపువును శపించి, తచ్ఛాపపర్యవసానమును గూడ నిర్దేశించి దివ్యగంగకు విచ్చేసె నని కలదు. సామాన్యముగా నొకమహర్షి యొక దోషిపైఁ గోపించి శాప మిచ్చునప్పుడు అతనిని దాక్షిణ్యరహితునిగనే చిత్రించుట కానఁ బడును. శాపగ్రస్తుఁడు దీనవదనుఁడై శాపావసానమును దైన్యముగా నభ్యర్థించినచో నామునియంతఃకరణము ప్రసన్నమై దానినిఁ బ్రసాదించుటయుఁ గనఁబడును. కాని యీకథలో శాపమును, తరణోపాయమును నొక్కగ్రుక్కలో మహర్షి వెళ్ళగ్రక్కినాఁడు. ఇట్టిపట్టున మన ముత్తములకోపము క్షణిక మని సమాధానపఱచుకొనవచ్చును. కాని, యంతకంటెను - ఋషిహృదయమున వపువుపైఁ గొంత నాంతరంగికమైన సానుభూతి యేర్పడియున్నట్లు కథార్థములందు ధ్వనింపఁజేసినచో నాశాపవాక్యరచనాశిల్పము మఱింత సార్థకము కాఁగలదు. అట్టిపని మారన చేసెను. అతని దృష్టిలో నాయచ్చర యత్నమున కామెగర్వ మొక్కటియే పరమహేతువు కాదు. దాని నెగద్రోసి పురిపెట్టిన నారదునికలహశీల మొక్కటియే కాదు. ఆయిఱువుర కారెండుగుణములు సహజములు. కాగాఁ గథ యింతదూరము వచ్చుటకు నింద్రునినిర్లిప్తతయే కారణ మని యతనియూహ: సురపతి వపువును వారించినచో నింతపని యయ్యెడిది కాదు. అట్లు చేయక మహర్షి తపోభంగమునకు బాధ్యుఁ డయ్యెను. ఇంద్రుఁడు మిన్నకుండటకు దుర్వాసునితపోభంగము వలన నాకసింహాసనమున కేర్పడు కీడు తొలఁగుననిగూఢమైన సంతృప్తి కారణమై యుండవచ్చును. అట్లే యైనచో దేవేంద్రునియొక్క నిగూఢలక్ష్యసిద్ధికి మానినియైన యీయబల యుపకరణమై స్వీయనాశనము గొనితెచ్చుకొన్నట్లగును. కావున దుర్వాసుని కోపదృష్టి దేవేంద్రునిపైఁ గూడ ప్రసరించినది. కాని, యతని నేమియుఁ జేయుటకు

వీలులేదు. అట్లని యాయబలను గఠినముగా శిక్షింప లేఁడు. ఇట్టి మునిచిత్తవృత్తిని మారన ఛందఃప్రయోగమున వ్యంజింపఁజేసినాఁడు. కోపవిస్ఫురితవక్త్రుఁడై వపువును విహగాకారము పొందు మని శపించుపరుషవాక్యములు శార్దూలవిక్రీడితమున నిబంధించుటయు, నాపైన నామె ప్రార్థింపకపూర్వమే తనంతట తాను శాపమోక్షము సూచించుటలోఁ దేటఁబఱచిన గూఢకారుణ్యభావమును తేఁటగీతిలోఁ జెప్పుటయు, ఋషిసహజమైన దయాభావముచే హృదయము మఱియు నార్ద్రము కాకపూర్వమే, వపు వాతని కాళ్ళవ్రేళ్లఁ బడకపూర్వమే గుండె చిక్కఁబట్టుకొని 'నావచన మమోఘం' బని పలుకుచు దిగ్గన లేచి పోయినఘట్టము కందమునఁ గూర్చుటయు, మారనఛందశ్శిల్పదృష్టిని దెలుపుచున్నవి. ఇట్టిరచనమువలన శ్రోత కాయచ్చరయొక్క తరువాతివృత్తాంతము వినవలెననెడి యుత్కంఠ జనించినది. వపువుమీఁదఁ బఱిత కపారసానుభూతి యేర్పనది; మారన కథాకథనశిల్పము సార్థక మైనది!

## మదనికాకందరుల వృత్తాంతము :

మారనమహాకవి యౌచిత్యపోషణమున కీకథాఘట్ట మొక యమూల్యోదాహరణము. పాత్రోచితమైనసంభాషణలు కూర్చుటచేతను, అనుచితములగు కథార్థములను మార్చుటచేతను, శబ్దాలంకారప్రయోగమున నౌచిత్య మెఱిఁగి రచనము సేయుటచేతను, పాత్రల స్వభావములను ప్రకరణగౌరవానుకూలముగాఁ దీర్చిదిద్దుటచేతను మారన యీకథలో నౌచిత్యము సాధించెను. దానివలన మూలముకంటె ననువాద మెంతయో రమణీయముగ శోభిల్లుచున్నది.

కంకుఁడు పక్షీంద్రుఁడు. అతనితమ్ముఁడు కందరుఁడు. కంకుఁడు చంపఁబడిన తరువాత భ్రాతృభక్తియుక్తుఁడైన కందరుఁడు విద్యుద్రూపునిపైఁ బగసాధించి యతనిని బోరిలోఁ జంపివేసెను. విద్యుద్రూపునిభార్య మేనకాత్మజయైన మదనిక. ఆమె భర్తృమరణానంతరము భీతిచేఁ గందరునిభార్య యగుట కొడఁబడి పక్షిరూపముఁ దాల్చి యతనిని సేవించుచు గర్భవతి యయ్యెను. ఆమెకు వపువు పుత్త్రికయై పుట్టెను. దానికిఁ గందరుఁడు తార్క్షి యని పేరుపెట్టెను. ఆమెను మంధపాలసుతుఁడైన ద్రోణుఁడు పెండ్లాడెను.

ఈకథలో ముఖ్యపాత్రలు మదనికాకందరులు. కందరునిపాత్ర మూలమునందే స్పష్టముగ నున్నది. దానిని యథాతథముగాఁ జిత్రించినాఁడు మారన. అతఁడు గొప్ప యభిమానము, భ్రాతృభక్తి, పౌరుషము, పరాక్రమము కలవాఁడు. అతనినిబట్టి యతని యన్నయైన కంకునిపాత్రను మారన చిత్రించెను. అతని కన్నపై నంతభక్తియుఁ, శ్రద్ధయుఁ గుదురుటకుఁ దగిన యోగ్యుఁడైన అన్న యుండవలెను. ఆంధ్రమునఁ గంకుఁడు చాలసాధువు. అతఁ డొకనాఁడు మధుపానమత్తుఁడై రజతాద్రిసానువులపై నొకరమణీయశిలాతలమున భార్యతో విహరించుచుండెను. మూలమునఁ గంకునికిఁ బెండ్లి

పెటాకు లైన ట్లేమియుఁ దెలియదు. కైలాసమున కందువలననే యొంటిగా వెళ్ళినాఁడు. మారన యతనికనుకూలవతి యగు భార్య నంటఁగట్టినాఁడు.

విద్యుద్రూపుఁ డను రాక్షసుఁడు సఖీసమేతుఁడై కైలాసమున కరుదెంచెను. కాంతతో నేకాంతమున నున్న కంకునిఁ గాంచియు లజ్జావిహీనుఁడై యాతని దరి కేగెను, కంకుని కది హేయముగాఁ దోచెను. ఎట్టియధముఁడైనను నట్లు సతీపతు లేకాంతమున నుండ సమీపింప నొల్లఁ డని యారక్కసుని మందలింప యత్నించెను. అతని కదియే మహాపరాధ మైనది. క్రుద్ధుఁడై గిరివనాదులు నీయొక్కనిసొమ్మైనట్లు ప్రేలెద వేల యని నిష్కారణముగా నాతనికుత్తుకను గత్తితోఁ గోసి తనరాక్షసత్వము ప్రదర్శించెను.

మూలమునందలి కథ వేఱు. అచ్చట భార్యాసమేతుఁడై రజతాద్రికూటమున నున్నది విద్యుద్రూపుఁడు. వా రేకాంతమున నుండ దరిఁ జేరినది కంకుఁడు. దూర ముగా వెళ్లు మని మందలించినది రాక్షసుఁడు. గిరివనాదులయందలి స్వేచ్ఛనుగూర్చి ప్రశ్నించినది పక్షీంద్రుఁడు. చివరకు కంకునిఁ జంపినది మాత్రము విద్యుద్రూపుఁడు. మూలమునఁ గంకుఁడు ఉదాత్తుఁడు కాఁడు. అతనిచావు పఠితకు న్యాయమే యని పించును. రాక్షసుఁడైన విద్యుద్రూపునిమీఁద పఠితకు సానుభూతి కలుగును. అట్టియెడఁ గంకుని సమర్థించు కందరునిపై గౌరవ మెట్లు కలుగును? కావున, కంకునికథ మార వలెను. అతనితోపాటు విద్యుద్రూపుఁడు మారవలెను. అనఁగా నారెండుపాత్రలను మూలముకంటె విపరీతకల్పనము చేసి వర్ణింపవలె నని భావము. మారన యట్లే చేసెను.

మారన చిత్రించిన విద్యుద్రూపుఁడు కర్కోటకుఁ డైన రక్కసుఁడు; శుష్క హృదయుఁడైన నిరంకుశుఁడు. మేనకతనయయైన మదనిక యర్ధాంగియై యుండి యతని ప్రక్కన వెన్నంటి వచ్చుచున్నను నతనిలో నెట్టిమార్దవము కనుపట్టదు. తనచర్యలను గూర్చి భార్య యేమని తలంచునో యని కూడ గమనిం పాతనికి లేదు. అస లామెను మక్కువతో మన్నించుసంస్కార మతనిలో లేదు. అతఁడు రాగవిరహితుఁడైన పాషాణ హృదయుఁడు. అట్టిస్వభావ మీకథలో రెండుసన్నివేశములవలన గుర్తింప వీలగు చున్నది.

కందరుఁడు వల దని వారించుచున్నను లజ్జావిహీనుఁడై పరదంపతు లేకాంతమున నున్నచోటికిఁ జొచ్చుకొనిపోయినాఁడు. అతనియం దేమాత్రము గృహస్థసంస్కార మున్నను అట్లు చేయఁడు. అతఁ డట్లు నీచముగా వర్తించుచున్నను నతనిభార్య కిమ్మ నదు. ఎందువలన? ఎదురు మాట్లాడినచో నతనిచేతులలోఁ జచ్చుటయే ప్రతిఫలము. అందువలన నతనియొద్ద చెప్పుక్రింది తేలువలెఁ బ్రాణములు గుప్పిటపట్టి సంసారము చేయుచున్నది. ఈమహార్థ మంతయు నతనికాంత యతనిమరణానంతరము కందరుని భార్యాత్వ మంగీకరించుటలో నిమిడియున్నది. భర్తృవిహీన యైన కంకునిభార్య విద్యు ద్రూపునిఁ జేర లే దెందువలన? ఆమెకు భర్తయే పంచప్రాణములు. మదనిక యట్టిది కాదు. సతిమనస్సును రంజింపలేని విద్యుద్రూపునిరాక్షసప్రవృత్తియే యామె యట్లగుటకు

కారణము. అతనిస్వభావము నట్లు చిత్రించుటవలన కథ ప్రసన్నమై మూలమునందలి యన్వయక్లేశము తొలఁగుచున్నది. ఇది మారనసామర్థ్య మని యొప్పుకొనక తప్పదు.

కంకుని మరణవృత్తాంతము వినిన కందరుఁడు విద్యుద్రూపునిపై నమితక్రోధము దాల్చెను. అప్పట్టున మూలకర్త "క్రోధామర్ష వివృత్తాక్షో నాగేంద్ర ఇవ నిశ్వసన్" (2.11) అని వర్ణించెను. మారన "మహోగ్రకోపశిఖి చిత్తమున న్నెగయంగ" (1.35) నని యనువదించెను. వివృత్తాక్షు లనెడి యనుభావముతో నమర్షమును సూచించుట సంస్కృతపురాణశిల్పము. ఉదయించినకోపమును భగ్గున మండిన యగ్నితోఁ బోల్చి రూపకాలంకారశోభ కల్పించుట తెలుఁగుశిల్పము. కందకరునిగుండెలోఁ గోపశిఖి యెగసినది. విద్యుద్రూపవధార్థమై కందరుఁ డాకసమున కెగసెను. కార్యకారణసముత్పత్తి యేకకాలజనిత మగునట్లు మారన రమణీయముగా వర్ణించెను.

మూలమునందలి "నాగేంద్ర ఇవ నిస్వనన్" అను భావమును మారన గ్రహింపలేదు. అట్లుచేయుటయం దొక యౌచిత్యము కలదు. మూలకర్త కందరవిద్యుద్రూపుల ద్వంద్వయుద్ధమును వర్ణించుచు:

శ్లో. తతః పతగరాజస్య యక్షాధిపభటస్య చ
బభూవ యుద్ధ మతులం యథా గరుడశక్రయోః ॥ (2.23)

అని గరుడశక్రులయుద్ధముతోఁ బోల్చి చెప్పెను. విద్యుద్రూపుఁ డొక యుగ్రఖడ్గమును గందరునిపై విసరెను. దాని నాతఁడు చంచూగ్రశక్తిచే గరుడఁ డురగంబుఁ బట్టిన కరణి పట్టె నని వర్ణించెను.[17] ఇట్లు భావికథార్థములందు కందరునిపట్ల గరుఁడౌపమ్యము సాధించి యతనిపరాక్రమాతిశాయిత్వమును వ్యంజింపఁజేయుచు నిచ్చట పన్నగౌపమ్యము నిబంధించుట శిల్పవిరుద్ధము. సారకథార్థచర్వణపరాయణు లగు సామాజికుల కది రసభంగస్ఫూర్తిఁ గలిగింపఁగలదు. కావున మారన దానిని వదలి యౌచిత్యము పోషించెను.

కందరుఁడు విద్యుద్రూపుని నన్వేషించి యొక్కచోఁ గనుఁగొనె నని మారన చెప్పెనే కాని మూలమునందుఁ గల తత్కాలనిశాచరావస్థావర్ణన మనువదింప లేదు.

శ్లో. పానాసక్త మతిం తత్ర సన్దదర్శ నిశాచరమ్
అతామ్రవక్త్రనయనం హేమపర్యఙ్క మాశ్రితమ్ ॥
స్రగ్దామపూరితశిఖం హరిచన్దనభూషితమ్
కేతకీపత్ర గర్భాభై ర్దన్తై ర్ఘోరతరాననమ్ ॥
వామోరు మాశ్రితాం చాస్య దద ర్శాయతలోచనామ్
పత్నీం మదనికాం నామ్నా పుంస్కోకిలకలస్వనామ్ ॥ (2.14-16)

ఈపంక్తులను తెలుఁగు సేయక మారన రసౌచిత్యము పాటించెను. ఈకథాభాగము రౌద్రరసప్రధాన మైనది. అధర్మమూలక మైన విద్యుద్రూపుని రౌద్రమువలనఁ గంకమరణజన్యమైన కరుణ ముదయించినది. విద్యుద్రూపుఁడు విభావముగాఁ గంధరునియందు

17. "వక్త్రేణ జగ్రాహ తదా గరుడః పన్నగం యథా" మార్కం. మహాపు. 2.25.

క్రోధోద్దీప్తి కలిగినది. అది ధర్మమూలక మగుటచే రససిద్ధిసామర్థ్యము సంతరించుకొనినది; విద్యుద్రూపతిరస్కారముచే నది పుష్టిఁ జెందినది; శత్రుసంహారముతో రససిద్ధియు, ఫలసిద్ధియుఁ బడసినది. ఇట్టి రౌద్రరసపరివృద్ధిక్రమ ద్యోతమానము లగు కథార్థముల మధ్య విద్యుద్రూపవిలాససన్నివేశవర్ణనము రసపోషకము గాకపోగా రసదీప్తికి మాంద్యము నేర్పఱుపఁగలదు; కావున మారన దానిని వదలెను.

మారన విద్యుద్రూపపాత్రను జిత్రింపఁ దలచిన విధముకూడ నతనిచే నీవర్ణనముఁ జేపట్టనీయలేదు. మూలమున విద్యుద్రూపుఁడు కాంతారక్తుఁడు, విలాసమత్తుఁడు. అతఁడు కంకుఁడు చూచినప్పు డెట్లుండెనో కందరుఁడు చూచినప్పుడు నట్లే యుండెను. మారన యాతనిని కాంతాసక్తునిగాఁ దీర్చిదిద్దలేదు; రాగవిదూరుఁ డైన క్రూరునిగా మార్చెను. అందువలన నతని తత్కాలవిలాసావస్థ తెలుఁగునఁ బాత్రపోషణసమర్థము కాదుకావున వదలఁబడినది.

రౌద్రమూర్తు లైన కందరవిద్యుద్రూపులచిత్తవృత్తులను వ్యంజింపఁజేయుటకై కవిరాజవిరాజితము - మానినియను వృత్తములను గ్రహించుట (2-36, 37) మారన ప్రకటించిన ఛందశ్శిల్పము. కవిరాజవిరాజితమందలి యాదిలఘుద్వయము నొక గురువుగా మార్చినచో మానినీవృత్త మగును. నగణముతో నారంభమై జగణవిస్ఫూర్తితో నడచి వగణముతో ముగియు చరణచతుష్టయము గల వృత్తము కవిరాజవిరాజితము. ఒక్కొకపాదమున నేడు భగణములమీఁద నొకలఘువు నిలిచియుండు నది మానిని. జగణబాహుళ్యముచేఁ గవిరాజవిరాజిత ముత్ప్లుత మైన గతి గలిగినది; జ్వలితములైన లేక దీప్తములైన క్రోధాదిభావముల నది సమర్థముగా వ్యంజింపఁగలదు. భగణబహుళ మైన మానిని యవరోహణగతి కలిగి యుండును. మారన కవిరాజవిరాజితమునందలి మొదటి మూఁడుచరణములు కందరునిమాటలు. నాల్గవచరణమున 'ఆజ్యము వోసిన చిచ్చుక్రియ' న్నుండిన విద్యుద్రూపునిక్రోధవర్ణనము అమూలకము. మానినిలోని మొదటిరెండు చరణములును విద్యుద్రూపుని గర్వోక్తులు.[1] చివరి రెండును ద్వంద్వయుద్ధవర్ణనము. ఇట్లు మారన వాక్క్రియారూపము లైన యనుభావవర్ణనము చేసి విభావస్ఫూర్తిని గల్పించెను. జగణబాహుళ్యముచే మొదటివృత్తమున నుత్ప్లుతాకారుఁ డైన కందరుని యుత్ప్లుతియు, భగణబాహుళ్యముచే రెండవవృత్తమున తరంగభంగికమును, అవరోహణాత్మకము నైన విద్యుద్రూపుని యుద్ధోత్సాహమును మారన వ్యంజింపఁజేసెను. వృత్తగతియందే కందరునివిజయస్ఫూర్తి వ్యంజించుట యిచ్చటి శిల్పము.

విద్యుద్రూపుఁడు "ప్రాణము లిప్పుడు వ్రాలెద" ననుటలో గండమును సూచించుట మారన వాక్శిల్పము. "శక్రసుపర్ణుల కయ్యము కైవడిన్"(1.37) "గరుఁడు డురగంబుఁ బట్టినకరణిఁబట్టి" (1.38) యను నుపమాలంకారములవలనఁ గందరుని పరాక్రమాతిశయము సంలక్షిత మగుచున్నది. "పక్షిపక్షంబు వీక్షించి రాక్షసుండు...(1.38) అను పద్యమున బ్రయోగించిన వృత్త్యనుప్రాసాలంకారమునందు పరుషోష్మాక్షరసంయోజనము చేత విద్యుద్రూపునకు ద్వంద్వయుద్ధ మాయాసజనక మైన దని వ్యంగ్యము. కందరునిపై

ఖడ్గము విసరివైచుటయు, అది భగ్నమగుటతోఁ గుప్పకూలిపోవుటయు దానిని స్ఫుట పఱచుచున్నవి.

మదనిక మేనకాత్మజ యని తెలుపుటలో మూలముకంటె ననువాద ముచితవిధము ననుసరించినది. విద్యుద్రూపవధానంతర మతనిభార్య మేనకాత్మజ యైన మదనిక భయాతిశయమునఁ గందరుని శరణువేడి యాతనిభార్య యగుటకు సిద్ధమైనది. మేనక దేవవేశ్య. ఆమెపుత్త్రిక మదనిక. తల్లిగుణములు కొన్ని పిల్లకు సంక్రమించుట సహజము. కావుననే పతిప్రాణ మటు పోయెనో లేదో యిటు క్రొత్తపెండ్లికూతు రైనది. ఆమెపేరు కంటె ముం దామెచరిత్రము తెలియునట్లు విశేషణముగా 'మేనకాత్మజ' శబ్దము కూర్చి నాఁడు మారన. మూలమున నిజేచ్ఛానురూపధారిణి యైన యప్సరిత పులుగైనట్లు చెప్పు నెడ 'మేనకాతనయ' యని తెల్పఁబడినది. అచ్చట యనువాదమునఁ గల సార్థక్యము కనవచ్చుటలేదు.

ఇట్టిఘట్టమున మారన యౌచిత్యప్రధానదృష్టితోఁ బహువిధములైన రచనాశిల్ప ములను సంతరించి పెట్టినాఁడు.

## ద్రోణనందనుల చరిత్రము :

శమీకమునిసంవర్ధితు లైన ద్రోణనందనులచరిత్రము తెలుపు కథాఘట్టము మూఁడ వది. ఇది యీపురాణప్రవక్తల జీవితగాథ యగుటచే నీయాఖ్యానమునకు గుండెకాయ వంటిది. దీనిలో విధిప్రాధాన్య ముగ్గడింపఁబడినది. దానినిఁ జెప్పుటకై సర్వకథార్థ ములు తదనుగుణముగాఁ దీర్చిదిద్దఁబడినవి. విధివిధాన మిట్టి దని నిరూపించుటకు వీలు కాదు. అది యపూర్వమును, అలౌకికమును, అబోధము నై భాసించుచుండును. తద్విధానపరిజ్ఞానమువలన సామాజికులకు విస్మయము కలుగును. అపూర్వవస్తు సందర్శనమువలనఁ గలుగు చిత్తవిస్తారము విస్మయ మని లాక్షణికమతము. కథానన్ని వేశములవలనఁ బఠిత కద్భుత మాస్వాద్య మగునట్లు చిత్రించుటయే యీకథానిర్మాణ మర్మము !

పులుగులైన ద్రోణనందనులు జ్ఞానవంతులును, విమలవాక్కులు నై యుండి రను టయే జైమిని కద్భుతము కలిగించినది. అద్భుతారంభ మైన యీకథాఘట్టము నిరంత రాద్భుతవ్యంజకమై అపూర్వదైవఘటనావైచిత్రినిఁ దెలుపుచున్నది.

మహాభారతయుద్ధము ప్రవర్తిల్లుచున్నసమయమున గర్భవతి యగు తార్క్షి కురు క్షేత్రముపై నెగురుచుండెను. కిరీటి భగదత్తునిపై వైచిన పటుభల్ల మొకటి యాపక్షికిఁ దాకినది. ఆమెగర్భము తెగినది. తోడనే తార్క్షికి శాపవిముక్తి కలిగి దివ్యత్వము సిద్ధించినది. గర్భస్థము లైన నాలుగండములు నేలపై జారిపడినవి. అవి పడినచోటు రక్తసిక్తమైన పంకముతో దూదిపరుపువలె మెత్తగా నుండుటచేఁ బగులక నిలచినవి. అవి నేలపైఁబడిన మరుక్షణమే భగదత్తుని సుప్రతీకాఖ్యగజముయొక్క పార్శ్వమునఁ గట్టఁ బడిన మహాఘంట యొకటి యూడి రయమున వచ్చి వానినిఁ గప్పునట్లు పడినది. వానికి

భద్రమైన భవన మేర్పఱచినట్లయినది. అందే యండములు పిండము లైనవి; జిలిబిలి యెలుఁగులు పలుక నేర్చినవి.

భారతాజి ముగిసినది. భీష్ముఁ డంపశయ్యపై నుండెను. అతఁడు ధర్మజునకు బోధించు సకలధర్మములు వినవలె నను గుతూహలముతో శమీకముని శిష్యసమేతుఁడై యామార్గమున వెళ్లుచుండెను. ఘంటానిలయములో నెలుఁగు లాతనికి వినవచ్చినవి. అచ్చెరువుపడి గంట నెత్తి చూచినాఁడు. రేయెండపిండుల కవయవములు మొలచినట్లు తేజస్ఫూర్తితో నొప్పారు ద్రోణపుత్రులు ప్రత్యక్షమైనారు. వారివిజ్ఞానవిమలమతిని గాంచి శమీకుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. స్థలమా సమరతలము. అవియా యండజములు. అవి పడుట, పగులకుండుట, వానికి ఘంట భవనముగా నేర్పడుట, అందవి పిండము లగుట, అయి యింతకాలము గంటలో శ్వానమార్జాలమూషకాదులబారిఁ బడకుండ భద్రముగ నుండుట—ఇవియన్నియుఁ గలసి యామునిచిత్తమును విస్మయాంబుధిలో ముంచి తేల్చినవి. వీని కన్నింటికి మూలకారణమైన విధినిర్ణయమును భావించి ముని విస్తుపోయినాఁడు. తొల్లి శుక్రాచార్యులు విధిప్రాధాన్యమునుగూర్చి చెప్పిన వాక్యార్థములను స్మరించి శిష్యులకుఁ జెప్పినాఁడు. పక్షులను దనయాశ్రమమునకుఁ దెచ్చి, యుచితభద్రస్థానమునఁ బెట్టి, పయఃఫలాదివివిధాహారముల నిడి వానినిఁ బోషించినాఁడు.

మాసత్రయ మగుసప్పటికి ద్రోణసుతు లపారసత్త్వసంపన్ను లైరి. ఒకనాఁ డద్రులు చలించునట్లు రవిలోకము నతిక్రమించి యెగసిరి. మఱల భువికి దిగి తమ కేడుగడయై రక్షించి పోషించిన శమీకునిపాదముల కెఱఁగిరి. అతనివాత్సల్యమును వేనోళ్లఁ బొగడిరి. శమీకున కాపులుగు లనంతశక్తితో నంబరమున విహరించుటయు, ప్రస్ఫుటవాక్యవిన్యాసముతోఁ బలుకుచుండుటయు, ద్విగుణీకృతాశ్చర్యము గలిగించినవి. అతఁడు వారి నట్టి యాకారవికృతి యెట్లు పొందిరో తెల్పు డని ప్రశ్నించెను. వారు తమ పూర్వజన్మగాథను చెప్ప నారంభించిరి.

మారన యీభాగమును జాలవఱకు మూలానుసారిగా రచించుచు, కథాతాత్పర్యమును స్పష్టపఱచునర్థముల కత్యంతప్రాధాన్యము నిచ్చి యనువదించెను. ''దైవానుకూలతా లోకే మహాభాగ్యప్రదర్శినీ'' అను శమీకమహర్షివాక్యము ద్రోణనందనచరిత్రకుఁ దత్త్వరూప మైన వ్యాఖ్యానమువంటిది. శమీకుఁడు శుక్రవాక్యములయర్థము తేటపఱచిన తరువాత నీవాక్య మనినట్లు మూలమున నుండ మారన గంటలో నున్న పక్కివిల్లలఁ గాంచినంతనే యాశ్చర్యము వ్యక్తముచేయుచు నీమాట లనినట్లు వ్రాసినాఁడు :

క. అక్కట యీసమరతలం
బెక్కడ ? నీయండజంబు లెక్కడ ? నీపా
టెక్కడ ? నీఘంటాశ్రయ
మెక్కడ ? దైవంబుఘటన యేమనవచ్చున్ ? (1.51)

ముని తన వ్యాఖ్యానమునకుఁ బురాణప్రామాణ్యముఁ గల్పించి శిష్యహృదయములం దాయర్థములను స్థాపించుటకై యత్నించినట్లు తెలుఁగున రచనాశిల్ప మేర్పడుచున్నది.

అది మారనతాత్పర్యవ్యక్తీకరణనిష్ఠను దెల్పుచున్నది. శుక్రాచార్యవాక్యరచనావసరము నందును మారన యిట్టివిధమునే యనుసరించెను. ప్రతిపాద్యవస్తువును సూక్తులవలెఁ దెలుఁగున ఛందములందు వెలార్చి సామాజికుల జిహ్వాగ్రములందుఁ గలకాలము వసించు నట్లు సరళసుందరముగా నావిష్కరించుట యిందు మారన చూపిన ప్రత్యేకత (1.54, 57)

ధర్మపక్షులు ప్రథమగగనప్రస్థాన మొనర్చినఘట్టమును మహాస్రగ్ధరావృత్తమున వర్ణించి మారన కథార్థములను ప్రసన్నతర మొనర్చెను.

మహాస్రగ్ధర :

"జవసత్త్వస్ఫూర్తి లొప్ప న్సకలమునిజనాశ్చర్యసంపాదలీలా
ప్రవణంబై పక్షిజాలప్రవరము లెగసె న్పర్వతంబు ల్చలింపన్
రవిలోకాద్యూర్ధ్వలోకప్రతతిఁ గడవ సంరంభ మేపారఁగా ని
య్యవనీచక్రంబు సూక్ష్మం బయి తమకు రథాంగాకృతిం దోఁచుచుండన్" (1.59)

ఇందలి వర్ణ్యవస్తువు పక్షు లాకసమున కెగయుట. ఆ యెగయుటయు రవిలోకాద్యూర్ధ్వ లోకములు గడచునంతదూరము ! అట్టి దీర్ఘోర్ధ్వగమనవ్యంజకమైన వృత్తగతి మహాకవి యెన్నుకొనెను. 'సతతనసరరగ-' గణములు చేరి యొక్కొకమహాస్రగ్ధరాచరణ మగును. ప్రతిచరణమునందును 9,16 యక్షరములపై విశ్రాంతి యుండును. గురువులు లఘువులు సమానసంఖ్యలో నుండును. నగణముతో నారంభమై రగణద్వయానంతరగురువుతో నంత మగు నిపద్యపాద మూర్ధ్వగతిస్ఫోరక మగుచున్నది. పక్షు లంచెలంచెలుగాఁ బై కెగయు భావస్ఫూర్తియు గణవిన్యాసమున వ్యంజింపఁబడినది. సగణమందలి యారోహణక్రమము వలనను, తగణద్వయమందలి గురుద్వయవిస్తరణమువలనను పక్షు లెగసినప్రథమావస్థ తెలియఁగలదు. ఆమీఁద నగణముపై సగణము నిలుచుటవలన నేర్పడెడి లఘుబాహుళ్య ముచే నూర్ధ్వముఖమైన ద్రుతగతి స్ఫురింపఁగలదు. రగణద్వయముమీఁది గుర్వక్షరము వలన నున్నతాకాశప్రదేశము లందుకొని గురుపక్షవిస్తారులై విహరించుటయందలి విలంబితగతి భాసింపఁగలదు. పక్షిచతుష్టయముయొక్క యిట్టియవస్థ పాదచతుష్టయమున వ్యంజించిన మారన ఛందశ్శిల్పము విభావస్ఫూర్తివ్యంజకమై కథార్థములను రసబంధుర మొనర్చుచున్నది.

ధర్మపక్షులు శమీకముని కరుణాతిశయమును గీర్తించుఘట్టమును మారన రస స్ఫోరకముగా రచించినాఁడు.

ఉ. ''ఎన్నఁడు వృద్ధిఁబొందు నివి యెన్నఁడు రూపు వహించుఁ బొల్చు నిం
కెన్నఁడు నల్లడం జెలఁగి యేడ్తెరఁ బాఱుచునుండు నామెయిం
చెన్నుగ నెన్న డాటమెయిఁ జెందిన ఱెక్కలధూళి నించునే
నెన్నఁడు చూడఁ గాంతు నాకా యీతరుశాఖలఁ గేళి సల్పఁగాన్.'' (1.63)

అని పక్షిశాబకముల బాల్యచేష్టలఁ గాంచి మురిసిపో నెంచిన మహర్షిజీవకారుణ్యమును, పెంపుడుతండ్రివాత్సల్యమును గణనీయములు. వానిఱెక్కలధూళి తనమేనిపై నెన్నఁడు పడునోగదా ! యని యువ్విళ్లూరిన యామునీంద్రుఁడు వానిని నిజసంతానముకంటె నధిక ముగా భావించె ననుటలో నాశ్చర్యము లేదు :

శ్లో. ''ఆలక్ష్య దన్తముకుళా ననిమిత్తహాసై
రవ్యక్తవర్ణరమణీయవచఃప్రవృత్తీన్
అంకాశ్రయప్రణయిన స్తనయా న్వహన్తో
ధన్యా స్తదఙ్గరజసా మలినీ భవన్తి."[18]

అను కాళిదాసోక్తి శమీకునిపట్ల సత్య మగుచున్నది. ఈఘట్టమంతయు శమీకమహర్షి వత్సలభావముచే నార్ద్రమై, ధర్మపక్షులపరాక్రమవినయోన్నతిచే స్వాదువై రాణించు చున్నది.

## ధర్మపక్షుల పూర్వజన్మవృత్తాంతము :

ఇఁక నాలుగవభాగము ధర్మపక్షులపూర్వజన్మవృత్తాంతము. దాని నాపక్షులే స్వీయచరిత్రమువలెఁ జెప్పుకొనినవి. ప్రాణదాతయును, త్రాతయును నైన శమీక మునీంద్రులకుఁ గృతజ్ఞతలు తెలుపుమాటలు పులుగులనోట వెలువడుటయు, నామఱుక్షణ మున స్వీయచరిత్రకథన మొనర్చుటయుఁ జూడ కవి వస్తుధ్వని నాశ్రయించి ప్రకృత జన్మమునందు ప్రబుద్ధమైయున్నవారివివేకమును, పూర్వజన్మజ్ఞానమును గ్రమముగా వ్యంజింపఁజేయుచున్నాఁ డని స్పష్టపడఁగలదు.

ఈకథాభాగమునఁ బౌరాణికుఁడు జ్ఞానప్రాధాన్యనిరూపణమును ప్రధానప్రతి పాద్యాంశముగా భావించినాఁడు. సామాన్యముగా లోకమున నొకవస్తువుయొక్క శ్రేష్ఠ త్వము న్యూనవస్తువుతోఁ బోల్చినపుడు స్పష్టపడుచుండును. ఈకథయం దట్టిపద్ధతి ననుసరించి, జ్ఞానమునకును మోహమునకును సంఘర్షణము సృష్టించి జ్ఞానముచే మోహ మును దాడింపఁజేసి వ్యంగ్యముగా జ్ఞానప్రాధాన్యమును బౌరాణికుఁడు స్థాపించినాఁడు.

విపులమహర్షి జ్యేష్ఠపుత్త్రుఁడు సుకృశుఁడు. అతఁ డనంతతపోధనుఁడు. సత్యనిష్ఠ యాతని జన్మవ్రతము. అట్టిమహితాత్మునకు నలుగురుకొడుకు లుదయించినారు. వారు తండ్రియొద్దనే పరమజ్ఞానము నుపాసించినారు. అతని నేమరక సేవించినారు.

ఇంద్రుఁ డొకసారి సుకృశునిసత్యవ్రతదీక్షను బరీక్షింప నెంచి వృద్ధవిహగాకారము ధరించి జఠరాగ్నిపీడితునివలె పరిశ్రాంతుఁడై యాతనియెదుటఁ దోచెను ; ఆహారము నభ్యర్థించెను. సుకృశుఁ డతని కాహారతృప్తిఁ జేయుట కంగీకరించి యెట్టియాహారము కావలె నని ప్రశ్నించెను. సురేంద్రుఁడు నరమాంసము నభ్యర్థించెను. సుకృశుఁ డామాట విని కటకట పడెను. వృద్ధులు శమైకచిత్తులు కావలదా యని పులుగుఱేనిని మంద

18. అభిజ్ఞానశాకుంతలమ్. సప్తమోఽఙ్కః - 17వ శ్లో.

లించెను. హింసార్జితాహారము వర్జ్య మని బోధించెను. దుష్టాత్ముల కెట్టివయస్సునను శమసిద్ధి యేర్పడ దని వెక్కసపడెను. అర్థి యెట్టివాఁడైనను వాగ్దత్తమైన యాహారము నిచ్చుటకు నిశ్చయించుకొనెను. సుకృశుఁడు ధర్మహానియు, సత్యనిష్ఠావిరతియు సహింప లేఁడు.

వృద్ధవిహంగము నరమాంసము కోరినది. హింసార్జితమైన యాహారము నాముని తేలేడు. తానే యాపక్షి కామెత కావచ్చును. పొల్లయొడలిపై నాతనికి వ్యామోహ మంత లేదు. కాని యాతండ్రిచిత్తమున నొకవింతయూహ పొడమినది. సుకృశునకుఁ జెట్టంత కొడుకులు నలుగు రున్నారు. 'పుత్రా దిచ్ఛే త్పరాజయ' మ్మను నార్యోక్తి ననుసరించి తనకంటె తనపుత్త్రు లతిథిపూజ కాత్మబలిదాన మొసంగినచో వారిపరమవివేకము రాణింపఁ గలదు. తనకు సార్థకసంతానసిద్ధి సమకూరఁగలదు. అట్లు చింతించి, కొడుకులఁ బిలిపించి, ''పరమపూజ్యుఁడు తండ్రియు గురుఁడుగాని యొరుఁడు గాఁ డని తలఁపు మీ కొదవెనేని'' యీపక్షి కాహారము కం డని కోరెను.

తండ్రిమాటలను బుత్త్రు లేవగించుకొనిరి. తండ్రి క్షుద్రుఁ డనియు, దుష్టుఁ డనియు, నిష్ఠురుఁ డనియు నిందించిరి. స్వీయదేహమును బరులదేహముకొఱకు బలిపెట్టుట ధర్మ విరుద్ధ మని వాదించిరి. ఋణత్రయము తీర్చి, భక్తితోఁ బరిచర్యలు చేయుచుఁ దండ్రి దయవలన బ్రతికియుండువాఁడే తనయుఁ డనఁబడు నని ధర్మపన్నములు చదివిరి. ప్రాణసహితమైన తనువు ధర్మసాధన మగునుగాన దానిని రక్షించుకొనుట పరమధర్మ మనెడి ధార్మికులవాదము నుటంకించి తమయభిమతమును సమర్థించుకొనిరి.

సుకృశుఁడు తాను పుత్త్రులకు నూరిపోసినజ్ఞానమంతయు బూదిలోఁ బోసిన పన్నీ రయ్యె నని లోలోనఁ గ్రుంగిపోయెను. పొల్లయొడలికై పాలుపడి సత్యనిష్ఠను దిరస్కరించిన పుత్త్రులపై మండిపడి, వారు విహంగములై పుట్టునట్లు శపించెను. వృద్ధవిహంగమునకుఁ దనబడుగుదేహమును బలివైచెను. కాని, ఇంతలో నామాయదారి ముదుసలిపక్కి యోగ బలమున జీవు నెడలించినదేహమునుగాని ముట్ట నని ముట్టె బిగదీసినది. సుకృశుఁ డందులకు సిద్ధపడి యోగారూఢుఁ డయ్యెను. పురుహూతుఁ డాతనివ్రతనియతికి నొడలెల్ల పులకించిపోయెను. నిజరూపముతో నాతనియెదుట నిలచి, 'యైంద్రజ్ఞాన'మును వర ప్రసాదముగా నిచ్చి, తపోధర్మమునం దెట్టివిఘ్నములు వాటిల్లకుండ నాశీర్వదించి యంతర్ధానుఁ డయ్యెను.

సుకృశునిసత్యనిరతియు, దేహాభిమానరాహిత్యమును, జ్ఞానసిద్ధియుఁ బుత్త్రులకుఁ గను విప్పుఁ గలిగించెను. వారు దోసము తెలుసుకొని కన్నతండ్రి యడుగుఁదమ్ములపైఁ బడి కన్నీట నభిషేకించినారు. మరణాపాయభయమును, ఒడలిపై వ్యామోహమును మాకన్నులు గప్పుటచే మోసపోతి మని వాపోయినారు. లోక మరిషడ్వర్గములబారిఁ బడి మోహసాగర మున మునుఁగుట సహజ మని వేర్కొని శాపము క్రమ్మరింపఁ దండ్రిని వేడినారు.

అమ్మహాత్ముఁడు వారియందుఁ బ్రసన్నుఁడై పెడనవ్వు నవ్వి 'నావచన మమో ఘము, దైవకృతము మానుషహతము కా' దని చెప్పి వారు పక్షిజన్మమునందును నిర్మల

బోధయు, మనుష్యవాక్ప్రభావమును గలిగియుండునట్లు వరము ప్రసాదించెను. తత్ప్రభావముచే ధర్మపక్షులు జ్ఞానచక్షులై పురాణప్రవర్తకులు కాఁగలిగినవి.

ఈకథాఘట్టములందుఁ బౌరాణికుఁడు సుకృశశాపప్రదానహేతునిరూపణమునందు కౌశలము చూపినాఁడు. పురుహూతుని వృద్ధవిహంగరూపమునఁ బ్రవేశపెట్టినాఁడు. కాటికిఁ గాళ్ళు సాచిన యప్పులుగు శరీరపోషణార్థమై హింసార్జితాహార మడుగుటకు సైతము వెనుకాడ లేదు. సుకృశపుత్త్రులు జ్ఞానవంతులయ్యు మోహావృతచిత్తులై తనువులఁ గాపాడుకొనుటకుఁ గన్నతండ్రియాజ్ఞఁ దిరస్కరించిరి. పులుగునకు లేనిజ్ఞానము పుత్త్రులయందు దర్శింపఁదలఁచినాఁడు మహర్షి. పుత్త్రులును బొల్లయొడలికై ప్రాకులాడుచుండిరి. తద్గుణసామ్యమువలన వారినిఁ గూడ దుఃఖావహమైన విహంగజన్మ మెత్తుఁడని శపించెను. కార్యకారణసంవిధాన మీకథాఘట్టమునఁ బ్రశంసనీయము ః

సుకృశనందనదీనభావమును మారన మూలాతిశాయిగా వర్ణించెను :

మూలము :

శ్లో. ప్రణమ్య శిరసాస్మాభి రిద ముక్తో మహామునిః
బిభ్యతాం మరణా త్త్రాత త్వ మస్మాకం మహామతే
క్షన్తు మర్హసి దీనానాం జీవితప్రియతా హి నః ॥ (3.56)

అనువాదము :

మ. శిరము ల్వ్రాలఁగ మ్రొక్కి నెన్నుదురుల న్జేతు ల్మోగిం జేర్చి దై
న్యరసం బాస్యములందు వెల్లిగొన సర్వాంగంబులుం గంపమున్
బొరయం గుత్తుక లెండ నీరెలుఁగులం బుణ్యాత్మ ః మ మ్మీయెడ
న్మరణాపాయభయంబు మన్నికొనియె న్మాతప్పు సైరింపవే ॥ (1.84)

"దుఃఖదారిద్ర్యాపరాధాదిజనితః స్వాపకర్షభాషణాది హేతు శ్చిత్తవృత్తి విశేషో దైన్య" మ్మని లాక్షణికోక్తి. (రసగంగాధరము). ఈపద్యమున నపరాధజనితమైన దైన్యము వర్ణితము. స్వాపకర్షవాక్యములు నాల్గవచరణమున గూర్పఁబడినవి. వానికి హేతువులై చిత్తవృత్తివ్యంజకములైన విభావానుభావసాత్త్వికభావములు విపులముగాఁ బైమూఁడు చరణములందులు బేర్కొనఁబడినవి. పుత్త్రులు తండ్రికి మ్రొక్కుటయు, చేతులు నుదుటియందు ఘటించి నిలువఁబడుటయు, అనుభావములు. ముఖములు దైన్యభావముద్రితములగునట్లు చేయుటయు, సర్వాంగకంపమును, కుత్తుక లెండుటయు, నీరెలుంగుల మాటలాడుటయుఁ గ్రమముగా వైవర్ణ్యకంపగాద్గద్యము లను సాత్త్వికభావములు. సర్వాంగసమృద్ధమైన దైన్యభావ మిందు పరిపుష్ట మగుటచే మారన దైన్యరసశబ్దము వాడినాఁడు. దైన్యము సుకృశనందనులకు వివేకప్రదాయిని. అది క్రమముగా జ్ఞానఫలదాయిని కానున్నది కావున నీభావమును రసతత్త్వజ్ఞుఁడైన మారన పోషించి కథాశిల్పమును గాపాడెను.

జ్ఞానపక్షులముఖమున స్వీయచరిత్ర నిబంధించుటయు, నాకథావసానమున మహా మోహస్వభావనిరూపణము సేయించుటయు, సాభిప్రాయముగా నీపురాణమునఁ గూర్పఁబడినవి. భావిపురాణవక్తలయందు విశిష్టపౌరాణికశిల్పసంస్కారములు సహజసిద్ధము లని ప్రపంచించుట దానిప్రయోజనము. పౌరాణికులు పురాణములందు మూఁడువిధములైన భాషలు వాడెదరు. అవి సమాధిలౌకికపరకీయభాషలు. వానిని సార్థకముగాఁ బ్రయోగించు నేర్పు వారికథాకథనమునఁ బ్రదర్శించిన ట్లీపురాణమునఁ జెప్పఁబడినది. ''చర్మమాంస శల్యసంఘాతమై రక్తపూరపూర్ణమైన పొల్లయొడలియందుఁ జేయువేడ్క యనఘ! యకర్తవ్యము'' అనువాక్యమునందు సమాధిభాషయు, ఆత్మను రాజుగను, దేహమును గోటగను, కామాదులను శత్రువులుగను, రూపించి లౌకికసామ్యముచేఁ బరమార్థమును నిరూపించినఘట్టమున లౌకికభాషయు, తమకథను తామే ''దైవకృతంబు మానుషహతంబు గా'' దను పరమతాత్పర్యమును వ్యంజించుట కుదాహరణముగాఁ జెప్పుటలోఁ బరకీయభాషయు ద్యోతమానము లగుచున్నవి.

ధర్మపక్షులశాపవృత్తాంత మీయుపాఖ్యానమునఁ గాలక్రమము ననుసరించి చెప్పఁబడలేదు. కాని, దానివలనఁ బఠితకు కథయం 'దక్షిణప్రీతి' జనించుచున్నది. తార్క్షి వృత్తాంతమును దెలిపి, వెంటనే ధర్మపక్షులపూర్వవృత్తాంతము చెప్పి, యాపైన శమీక మహర్షి పక్షులఁ బెంచినకథ చెప్పినచో నీయుపాఖ్యానమున కింత బిగువు రాదు. శమీక మహర్షి యాశ్చర్యముగ్ధుఁడై పులుగులపూర్వవృత్తాంత మడుగుట కంతసార్థక్య మేర్పడదు. శమీకమహర్షి వలెనే పఠితయు వారిశరీరవికృతిహేతువు తెలియ నుత్కంఠ వహించియున్నప్పుడు కథార్థములం దాప్రస్తావనఁ దెప్పించి కార్యకారణపద్ధతి ననుసరించి కథ చెప్పుటచే నీయుపాఖ్యాననిర్మాణము శిల్పసంభరిత మగుచున్నది.

### హరిశ్చంద్రోపాఖ్యానము :

హరిశ్చంద్రచరిత్రము వేదవాఙ్మయమునందును, లౌకికవాఙ్మయమునందును ననేక విధములుగాఁ గీర్తింపఁబడియున్నది. కాని, మార్కండేయపురాణమునందువలె ద్రౌపదేయ కథామూలముగా నెచ్చటను గీర్తింపఁబడియుండలేదు. అది యాపురాణగాథ కేర్పడిన ప్రత్యేకత !

విశ్వాఖ్యదేవతలు విశ్వామిత్రమహర్షిశాపముచే నుపపాండవులుగా జన్మించిరి. ఈయుదంతమును బౌరణికుఁ డీయుపాఖ్యానమునఁ జక్కఁగా బొందుపఱచినాఁడు. విశ్వామిత్రుఁడు కపటోపాయమున హరిశ్చంద్రునిసామ్రాజ్యసంపద హరించి, యతనిని రాజ్యమునుండి బహిష్కరించెను. ధర్మబుద్ధి యైన యాచక్రవర్తి నారచీరలు ధరించి భార్యాపుత్త్రసమేతముగ నగరు వెడలిపోవునెడ రాజసూయాధ్వరదక్షిణలకుఁ బ్రతిశ్రుతము చేసిన యర్థము నామహర్షి కోరెను. విత్తహీనుఁడైన యానరవరుఁ డామునివర్తనమున కెంతయో సంకటపడెను. కాని, యతఁడు సత్యవ్రతగరిష్ఠుఁ డగుటచే నొకమాసమున నాయర్థము నిచ్చెద నని మాటయిచ్చెను. ముని యందులకు సంతసించి, యతనిని దీవించి

పంపెను. హరిశ్చంద్రుఁడు వల్కలాజినధారియై పాదచారియై యిల్లువెడలి, నగరు వెడలి నగరము వీడిపోవుచుండ పౌరు లాతనిదైన్యమును గాంచి యపారదుఃఖవారాశిలో మునిఁగిరి. హరిశ్చంద్రునితోడిదే తమబ్రతుకని యార్చుచు నతనియడుగులపైఁ బడి యతనియడుగులు ముందుకు సాగనట్లు చేసిరి. అది యమ్మహర్షి కొకమహాపరాధ మైనది. భగ్గుమని మండిపడినాఁడు. జనసమూహము నండగాఁ గొని తన కిచ్చిన రాజ్యమును మఱల కబళింప హరిశ్చంద్రుఁడు యత్నించుచుండెనని యతనిపై నభాండము వైచి నిందించినాఁడు. అంతటితో నాగక కోమలియైన శైబ్యను దనప్రచండహస్తదండముతోఁ దాడింప నారంభించినాఁడు. క్షమామూర్తి యైన హరిశ్చంద్రుఁడు మాఱుపలుకలేదు. భయభ్రాంతులైన ప్రజలు కిమ్మన లేదు. విశ్వాఖ్యదేవతల కాదృశ్యము హృదయవిదారకమై పొడగట్టినది. అప్పుణ్యసాధ్వి నవ్విధముగా బాధించుచు నన్నరేశ్వరుని నవ్విధముగ వేధించు నమ్మహర్షికిఁ బుణ్యలోకము లుండ వని వా రావేశముతో బిగ్గరగాఁ బలికిరి. విశ్వామిత్రుని కగ్గిలో నాజ్యము పోసినట్లైనది. మనుష్యపక్షపాతముచేఁ దనను గర్హించినందుల కావిశ్వాఖ్యదేవతలు మనుష్యులై జన్మించునట్లు శపించెను. వెంటనే ప్రసన్నుఁడై వారు మానవులై పుట్టినను బ్రహ్మచారులై కామక్రోధలోభమోహమదమత్సరములకు లోనుగాక యల్పకాలముననె శరీరములు విడిచి దేవభావము పొందునట్లు శాపమోక్షము ప్రసాదించెను. వారే ద్రౌపదీగర్భమున నుపపాండవులై జన్మించి, కృతదారపరిగ్రహులు గాక యనాథులవలె మృతినొందిరి. ఇట్లు ద్రౌపదేయకథామూల మగు వస్తుగౌరవ మీపురాణమున హరిశ్చంద్రోపాఖ్యానమునకు దక్కుచున్నది.

ఈసన్నివేశము సత్యమే కావచ్చును. లేక పౌరాణికప్రతిభాజన్యమైన కల్పనావిశేషము కావచ్చును. ఎట్లైనను నిచ్చట హరిశ్చంద్రకథారహస్యవ్యంజకమును, తత్కథాసంవిధానవివేకదాయకమును నగు నీకథార్థము సార్థక మనుటలో విప్రతిపత్తి లేదు.

హరిశ్చంద్రునివృత్తాంతము చదువువారికిఁ జివరివఱకు నొకశంక మనమున నిలిచియుండును. అది విశ్వామిత్రవిచిత్రప్రవృత్తికి సంబంధించినది. సత్యధర్మనిరతుఁడైన హరిశ్చంద్రుని నామహర్షి నిష్కారణముగా నిడుమలఁ బాలుచేయుచుండెను. అతని కచ్చెకు బలీయమైన లౌకికహేతువు లేదు. పైకిఁ జూచినచో హరిశ్చంద్రుని సత్యధర్మనియతిని బరీక్షింప నాఋషి యత్నించెనని మాత్రము స్ఫురించును. కాని, లోనారసి చూచినచో హరిశ్చంద్రుని యవశ్యభోక్తవ్య మైన దుఃఖము నుపభోగింపఁజేయుటకై విధిప్రేరితుఁడై విశ్వామిత్రుఁడు వ్యవహరించెనని స్పష్టమగును. ఈయర్థమును గథాంతమున యమధర్మరాజు హరిశ్చంద్రునకుఁ దెలియఁజెప్పినాఁడు. "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మని యార్యోక్తి. రాజగు ప్రతివాఁడును నారకబాధల ననుభవింపక తప్పదని వేదప్రామాణ్యముతో భారతమున ధర్ముఁడు తెలిపియున్నాఁడు.[19] అందువలననే

19. క. 'విను మొక్కటి సెప్పెద రా, జనువానికి నెల్లఁ దవ్వు దవనీశ్వర యె
ట్లును నారకస్థలంబుం, గనుఁగొనవలయు టిది వేదకథితము సుమ్మీ!
ఆం. మ. భా. స్వర్గా. ప. ౩౭.

ధర్మజుఁడు, లవణుఁడు మొదలగుచక్రవర్తులు సశరీరనరకబాధ లనుభవించియుండుట. ధర్మజుఁడు సశరీరుఁడై నరకదర్శనము చేసినాఁడు. హరిశ్చంద్రుఁడు చండాలస్వరూప ధారియైన యమధర్మరాజుసేవలు సేయుచు శ్మశానమున నరకబాధలకుఁ దుల్యమైన దుఃఖములను బండ్రెండునెల లనుభవించెను. లవణరా జైంద్రజాలికమాయాకల్పితమైన స్వప్నమునఁ జండాలాంగనాసంపర్కజన్యములైన యమయాతన లెన్నిటినో భరించి నాఁడు. హరిశ్చంద్రుఁడును స్వప్నగతములైన ద్వాదశవర్షనారకబాధలను సత్యము లైన ట్లనుభవించినాఁడు. వీని కన్నింటికిని "అవశ్యభావి యైన దుఃఖము భోక్తవ్యం బగుట" (1.276) కారణ మని ధర్మని వ్యాఖ్యానము. అనఁగాఁ బునర్జన్మరహితశాశ్వత దివ్యలోకావాసము సేయఁబోవు హరిశ్చంద్రునకు సర్వసార్వభౌమసహజమైన నారక బాధలు తజ్జీవితకాలముననందే యనుభవింపఁజేసి పాపక్షయ మొనర్పఁజేయ విధి కల్పించిన విధానమే యిక్కథారహస్య మని భావము. హరిశ్చంద్రుని వాక్ఛ్రానము నావేశించిన విఘ్ననాయకుఁడును, ఉద్యద్వైశ్వానరమూర్తియై విజృంభించిన విశ్వామిత్రుఁడును, చండాలవేషధారియై వారణాసీశ్మశానవాటికాధ్యక్షుఁ డైన ధర్మదేవతయు, విధిప్రేరిత మైన యీమహానాటకమును నిర్వహింప భూమికలు దాల్చిన దివ్యనటశేఖరులు. హరిశ్చంద్రుని కేర్పడిన యిక్కట్టులు తాత్కాలికముగా నాతనికి దుఃఖహేతువు లైనను పర్యంతమున శాశ్వతదివ్యభోగప్రదములై రాణించుచుండుట యీకథలోని దివ్యరహస్యము. దివ్యచక్షువు లైన విశ్వాఖ్యదేవత లాదివ్యరహస్యము గమనింపక తనను గర్హించుటచే విశ్వామిత్రుఁ డుగ్రుఁడైనాఁడు. వారు మనుష్యపక్షపాతు లైరని శపించినాఁడు. అతఁడు ప్రయోగించిన 'మనుష్యపక్షపాత' మను శబ్దము పఠితదృష్టి నీకథయం దంతర్లీనమై భాసించు మానవాతీతమైన దైవశక్తివైపు మరలించును. అప్పుడు కథ ప్రసన్న మగును. అందలి గాంభీర్యమును పఠిత యూహింపఁగలుగును. ఇదియే ద్రౌపదేయకథాప్రసక్తి వలన హరిశ్చంద్రోపాఖ్యానమునకుఁ గలుగు పరమప్రయోజనము :

హరిశ్చంద్రోపాఖ్యానము కాలక్రమపద్ధతి ననుసరించి చెప్పఁబడినది. కాని, యేతత్కథాజీవితపరమరహస్యము నిర్వహణసంధియందు గాని బోధపడుటలేదు. దాని నీకథాబీజమునందు నిబంధింపక ఫలాగమమునందు ప్రతిష్ఠించి కథకుఁ డీకథయందుఁ గౌశల్యము ప్రదర్శించెను. అట్లు చేయుటవలన రెండు ప్రయోజనములు కలుగుచున్నవి. ఒకటి : పఠితహృదయమున నుత్కంఠ పరిపోషింపఁబడి కథాపరిణామక్రమముపై నాతని కెడతెగని ప్రీతి జనించుట. రెండు : తత్తత్సన్నివేశములందు హరిశ్చంద్రాది పాత్రములచే నభివ్యక్తము చేయఁబడిన దుఃఖాదిభావములు సహజములై భాసించి రస ప్రతీతి కానుకూల్య మేర్పడుట. ఈప్రయోజనములు ఫలవంతము లగుటకై పౌరాణికుఁడు సర్వకథార్థములను ఫలాభిగమ్యములుగా ననుసంధించు రచనాశిల్పము నీకథయందుఁ బ్రపంచించినాఁడు.

కథాంతమున నింద్రుఁడు హరిశ్చంద్రుని సత్యధర్మనిరతికి మెచ్చి యాతనికి సశరీరస్వర్గసౌఖ్యములు ప్రసాదించెను. హరిశ్చంద్రుఁ డొంటిగా నాసుఖముల ననుభవిం

చుట కిచ్చగింపలేదు. తనప్రజాకుటుంబమునకు లేని యాయాత్మసుఖముకంటె నారక దుఃఖమే మేలని భావించెను.

క. నాతోడఁగూడ సురపురి
కేతెంతురు పౌరు లొండె నేఁగుదుఁ బౌర
వ్రాతముతో నేనొండె సు
ఖేతర మగు నరకమున కహీనచరిత్రా! (1.280)

ఈమాటలలో నామహితాత్ముఁ డతనిసామ్రాజ్యపౌరుల నెంతగాఢముగాఁ బ్రేమించుచుండెనో స్పష్టమగుచున్నది. రాజు ప్రజలను బ్రేమించుటయు, ప్రజలు రాజును సమాదరించుటయు పరస్పరాశ్రితములైన విషయములు. ఇరువురును ఉదాత్తులై యున్నప్పుడే యట్టివిశిష్ట సమన్వయము సమకూరుట కవకాశ మేర్పడును. హరిశ్చంద్రుఁడు ప్రకటించిన ప్రజాను రాగమున కనుకూలమైన కథార్థములును, ప్రజాహృదయరంజకుఁ డైన హరిశ్చంద్రుని మహత్త్వమును ప్రతిపాదించు కథార్థములును ఈకథానిర్వహణమున కనుకూలములైన ప్రాతిపదికలై యీయుపాఖ్యానమున రాణింపవలసియుండుట యవసరమును, సహజ మును, సార్థకమును గాఁగలదు. ఈవిషయమును గమనించిన మారన యట్టి కథార్థము లమ జాగరూకతతోఁ బూర్వకథాభాగమున సంతరించి యుత్తరకథార్థసమన్వయమున కెంతయో కృషిచేసినాఁడు. మూలమునందు రేఖామాత్రముగను, సంగ్రహముగను నున్న కథాంశముల నాదృష్టితో మారన పెంపుచేసియుఁ, గల్పనలు జోడించియు, వివర ములు తేటపఱచియు, రసభావములఁ బోషించియు, విభావసంపద నుద్దీప్త మొనర్చియు సరసప్రబంధకథాంగబంధురముగా నీయుపాఖ్యానమును దీర్చిదిద్దెను. అట్టిమారన శిల్ప వైభవ మిచ్చట కొంత పరామర్శింపఁబడును.

ఉపాఖ్యానారంభమున నాయకవర్ణన ముదాత్తముగా నొనర్చి మారన కథాశిల్ప లక్ష్మికి నుజ్జ్వలశిరోరత్నము నలంకరించినాఁడు.

శ్లో. హరిశ్చంద్రేతి రాజర్షి రాసీ త్త్రేతాయుగే పురా
ధర్మాత్మా పృథివీపాలః ప్రోల్లసత్కీర్తి రుత్తమః ॥
న దుర్భిక్షం న చ వ్యాధి ర్నాకాలే మరణం నృణామ్
నాధర్మరుచయః పౌరా స్తస్మి న్ప్రశాసతి పార్థివే ॥
బభూవు ర్నత థోన్మత్తా ధనవీర్యతపోమదైః
నా జాయన్త స్త్రియః శ్చైవకాశ్చి దప్రాప్తయౌవనః ॥ (7. 1-3)

మారన యనువాదము :

"తొల్లి త్రేతాయుగంబునందు—
సీ. ఎవ్వని మాహాత్మ్య మెప్పుడు వేదము
ల్చెలఁగి సుస్తోత్రము ల్సేయుచుండు;
ఎవ్వనిశాసనం బేడుదీవుల రాజు

లకు శిరోభూషణలక్ష్మి నొందు;
నెవ్వనిరక్ష మహేంద్రాదిసురలకుఁ
బెట్టనికోటయై పెంపుఁ దాల్చు;
నెవ్వని సత్కీర్తి యీయజాండం బెంత
యంతయుఁ దానయై యతిశయిల్లు;
తే. నట్టి మహితగుణాభరణాభిరామ
మూర్తి; ప్రత్యర్థినృపసమవర్తి; పరమ
పూజ్యసామ్రాజ్యవైభవస్ఫూర్తి నిత్య
సత్యవర్తి హరిశ్చంద్రచక్రవర్తి.

మ. ధరణీచక్ర మవక్రవిక్రమకళాదర్పం బెలర్పంగ నే
ర్పరి యై నిర్మలసత్యధర్మనియతిం బాలించె దుర్భిక్షదం
బరదుఃఖంబులు జారచోరభయ మున్మాదజ్వరవ్యాధిదు
ర్మరణాదు ల్ప్రభవింపకుండఁ బ్రజ ధర్మప్రీతి వర్తింపఁగన్.

క. ధనరూపబలంబుల న
త్యనుపమవిద్యాతపోమహత్త్వంబుల భూ
జనులకు నొదవదు మద మ
జ్జననాయకు సత్యధర్మశాసన మహిమన్.

వ. ఇట్లు సత్యవ్రతగరిష్ఠుండును, ధర్మకర్మవరిష్ఠుడును నైన యారాజర్షి ప్రజాపాలనంబు సేయుచు. (1. 142–145)

మూలమునందలి మూఁడుశ్లోకములను మూఁడుపద్యములుగా మారన యనువదించినాఁడు. మూలమందలి సర్వాంశములను గ్రహించుటయేకాక వానిని వస్తుతత్త్వమున కనుగుణముగాఁ బెంచి ప్రపంచించినాఁడు. మారన ప్రయోగించిన 'సత్యధర్మనియతి' యనుసమాస మందులకుఁ జక్కని యుదాహరణము. మూలమందు ధర్మాత్ముఁ డని చెప్పఁబడియున్నది కాని, సత్యధర్మనిష్ఠుఁ డని స్పష్టపఱుపఁబడలేదు. ఈయుపాఖ్యానమున హరిశ్చంద్రుని సత్యనిష్ఠమైనధర్మవీరము పోషింపఁబడినది. దానివలన నతనికి 'సత్యహరిశ్చంద్రా'ఖ్య సార్థకమైనది. ఈకథలోని ప్రతిపాత్రయు సత్యవ్రతప్రాధాన్యము నుగ్గడించుచు నాయకసత్యధర్మమును బోషించెను. హరిశ్చంద్రుని ధర్మపత్నియగు శైబ్య పతిని సత్యపాలనమునకుఁ బురికొల్పుచు— 'మేటిధర్మంబు సత్యంబ యండ్రు' (1.195) 'బొంకుకంటెను జావైనఁ బొంక మనఘ!' (1.198) యని ప్రబోధించి సహధర్మచారిణి యనిపించుకొనినది. విశ్వామిత్రుఁడుసైత మారాజును 'సత్యనిష్ఠఁ బొందు' (1.206) మని యాశీర్వదించినాఁడు.

క. సత్యమున నున్న దీధర
సత్యమున వెలుంగుఁ దరణి సత్యముననె గా

నిత్య మయి స్వర్గ మమరును
సత్యము ధర్మములలోఁ బ్రశస్తం బనఘా!

తే. వినుము తుల నిడి యెత్తుచో వేయితురగ
మేధములకంటె సత్యంబు మిగులఁ దూఁగెఁ
గాన సత్యయుక్తుండవు గమ్ము......" (1. 207-208)

అని హెచ్చరించినాఁడు. మచ్చరమున గల్లబొల్లిమాట లెన్ని యన్నను సత్యమునుగూర్చి సత్యము పలికినాఁ డామహర్షి! విశ్వామిత్రుఁడు సాధ్వియైన శైబ్యను చేతికోలతోఁ దాడించుచున్నందులకే కాక 'సత్యనిష్ఠం బెంపెక్కిన' (1.186) హరిశ్చంద్రునిఁ గాసి పెట్టుచున్నందులకును విశ్వాఖ్యదేవత లామునివరునిపై నక్కటికము తాల్చి రని మారన వర్ణించెను. మూలమున యజ్ఞకర్త యైన హరిశ్చంద్రుని బాధించుచున్నందులకు వారికి జాలి కలిగెనని చెప్పఁబడియున్నది. యజ్ఞయాగాదులచే దేవతలఁ దృప్తిపఱచిన రాజుపై సురలు జాలి ప్రకటించి రని మూలకర్త. హరిశ్చంద్రునిసత్యనిష్ఠయే యతనికిఁ గష్టములఁ దెచ్చి పెట్టినందులకు దేవతలు జాలిపడినట్లు మారన రచించెను. ఈకథయందు నాయకుని సత్య నిష్ఠకు ప్రాధాన్య మిచ్చుట యుచిత మని మారన నిష్కర్ష!

మారన కాశీనగరప్రవేశము చేయు హరిశ్చంద్రుని వర్ణించుచుఁ 'దొలఁగనిసత్య ధర్మములు తోడుగఁ దాలిమి యూది' దుఃఖములఁ దరించుచుండె నని పేర్కొనెను. అనఁగా నారాజునకు సత్యధర్మము లంగరక్ష లనియు, ఓరిమియే పూనిక యనియు కవిభావము. కథాంతమున నమరేంద్రుఁడు హరిశ్చంద్రునిగూర్చి చెప్పినమాటలు :

చ. నరుల కగమ్యమై వెలుఁగునాకము నీ కభిగమ్య మయ్యె నీ
నిరుపమసత్యధర్మమహనీయత శాశ్వతదివ్యభోగముల్
దొరకొనియె న్నరేశ్వర! సుతుండును భార్యయు నీవు నూత్నర
త్నరుచిరసద్విమానము ముదమ్మున నెక్కుఁడు రండు— (1.274)

శాశ్వతదివ్యభోగములకు సత్యధర్మమహనీయత హేతు వని సురేంద్రుఁడు పల్కినట్లు మారన. పురాకృతసుకృతకర్మఫలముగా నాకభోగములు దొరకుచున్న వనినట్లుమూలము. (8.248). మూలమునం దనువాదమున నున్నసార్థక్యము కానరాదు. ఇట్లు కథారంభగర్భ నిర్వహణములయందు, షడ్లింగములచేఁ బ్రధానప్రతిపాద్యవస్తువును ధ్వనింపఁజేయుట మారనశిల్పము!

కథారంభమున నాయకగుణకీర్తనమువలన నాయకాంతర్వ్యక్తిత్వమును వ్యంజింపఁ జేసినాఁడు మారన. మొదటిపద్యమున హరిశ్చంద్రునిచక్రవర్తిత్వమును, రెండవపద్యమున నతనిధర్మపరిపాలనసామర్థ్యమును, మూడవదానియం దాతఁడు సామ్రాజ్యపౌరులఁ దీర్చి దిద్దినవిధమును వర్ణించి తాత్పర్యమున నతని ధీరోదాత్తనాయకత్వమును స్థాపించినాఁడు. మఱియు, కులీనత్వాది నాయకసామాన్యగుణములను కవి యిందు నిరూపించెను. వేదము

లతని మహాత్మ్యమును గీర్తించుచున్న వనుటచే నతఁ డుత్తమశ్లోకుఁ డనియు, సప్తద్వీప వసుంధరావలయ నూతనిశాసనము శిరమునఁ దాల్చుచున్న దనుటచే నాతఁడు విశ్వంభరాధిపత్య మను మహాభాగ్యముచే నొప్పారెడు వాఁ డనియు, మహేంద్రాదిసురల కాతని రక్ష పెట్టనికోట యని చెప్పుటచే నాతఁడు త్రిలోకరక్షాదక్షుఁడైన ప్రతాపుఁ డనియు, బ్రహ్మాండమంతయు వ్యాపించిన సత్కీర్తి కలవాఁ డనుటచే దిగంతవిశ్రాంతకీర్తి యనియు, మహితగుణాభిరామమూర్తి యనుటచే నౌజ్జ్వల్యము, ఔదార్యము, తేజస్విత, ధార్మికత్వము, వైదగ్ధ్యము, ఆర్తావనత్వము, గావ్యగీతప్రియత్వము మొదలగుసుగుణముల కాకరమైన వాఁ డనియుఁ, బ్రత్యర్థిసమవర్తి యనుటచే శత్రుభయంకరుఁ డనియుఁ, బరమపూజ్యసామ్రాజ్యవైభవస్ఫూర్తి యనుటచే వివిధాధ్వరనిర్మలధర్మకర్మల నెల్లవేళల నాచరించుటచేతఁ బ్రకటీకృతపూజ్యసామ్రాజ్యవైభవము గలవాఁ డనియు స్పష్టమగుచున్నది. అతని సామ్రాజ్యమున నీతిబాధలు లేక ప్రజలు సుఖించుచుండిరి. రాజు విక్రమకళాకుశలుఁడై దేశమును రక్షించుచుండుటయు, సత్యధర్మనియతాత్ముఁడై పుణ్యవర్తనుఁడై దేశమును రక్షించుచుండుటయు, 'యథారాజా తథాప్రజా' యను న్యాయము ననుసరించి ప్రజలయందు ధర్మప్రీతి వర్తించుటయు నందులకుఁ గారణములు. ఆమహారాజు ధర్మశాసనము ననుసరించుచు నారాజ్యప్రజలు ధనరూపబలవిద్యాతపోమహత్త్వసంపన్ను లయ్యును మదాంధులు కాక వినయవివేకవంతులై వెలయుచుండిరి. ఇట్లు వర్ణించుటచే రాజు పరమధార్మికుఁ డైన మహాత్ముఁ డనియుఁ బ్రజారంజకుఁ డైన పరిపాలకుఁ డనియు, రాజర్షి యనియు నేర్పడుచున్నది.

శ్లో. అధ్యాక్రాన్తా వసతి రమునాఽప్యాశ్రయే సర్వభోగ్యే
రక్షా యోగాదయ మపి తపః ప్రత్యహం సఞ్చినోతి
అద్యాపి ద్యాం స్పృశతి వశిన శ్చారణద్వంద్వగీతః
పుణ్యశ్శబ్దో ముని రితి ముహుః కేవలం రాజపూర్వః ॥[20]

అను కాళిదాసశ్లోకతాత్పర్యమును దనవర్ణనాతాత్పర్యమున వ్యంజింపఁజేయుటయే మారన హరిశ్చంద్రస్వరూపచిత్రణమందలి రహస్యము. మూలమునం దాదింపం దున్న రాజర్షి శబ్దమును ఫలితాంశముగా వర్ణనాంతమునందు నిలిపి మారన యీభావమును సూచించుచున్నాఁడు.

ఈయుపాఖ్యానమున సత్యవీర మంగిరసము. దాని కాలంబనము హరిశ్చంద్రుఁడు. వీరమునకు స్థాయి యుత్సాహము. అది ధర్మప్రధానమై యుండవలెను. 'తతోఽర్థకామయో ర్ధర్మమూలకత్వాత్ ధర్మప్రధానో వీరః'' అని యభినవగుప్తపాదులు. వీరము ధర్మైకస్వరూపమయ్యును నిమిత్తభేదముచే భిన్నరూపము లయి భాసించుచుండును. రాగద్వేషరహితులైన విద్వాంసులహృదయములచే నభ్యనుజ్ఞాత మగునది ధర్మము.[21]

20. అభిజ్ఞానశాకున్తలమ్. 2 అం. 14 శ్లో.

21. "విద్వద్భి స్సేవిత సద్భిః నిత్య మద్వేషరాగిభిః ।
హృదయేనాఽభ్యనుజ్ఞాతో ధర్మః......"—మనుస్మృతి.

అది దశలక్షణము.[22] అహింసాదులు తత్సాధనములు.[23] అది ప్రవృత్తినివృత్తి భేదముచే ద్వివిధము.[24] దశవిధధర్మలక్షణములలో సత్య మొకటి యైనను అది ధర్మ శ్రేష్ఠ మని పురాణములు చాటుచున్నవి.[25] హరిశ్చంద్రుఁడు దశవిధలక్షణాత్మక మగు ధర్మమును నిర్వహించుచునే సత్యనిష్ఠచేఁ బ్రదీప్తమైన యుత్సాహస్ఫూర్తినిఁ బ్రకటించు చున్నాఁడు. సత్యవ్రతసిద్ధికై సర్వధర్మసంచయమును దాని కంగసముచ్చయముగా నను సంధించుచున్నాఁడు. కావున నిందు సత్యవీర మంగి యగుచున్నది. కథలో ధర్మ తాత్పర్యము సత్యనిష్ఠగాఁ బరిణమించినక్రమము గమనించినచో నీతాత్పర్యము స్పష్ట పడఁగలదు.

హరిశ్చంద్రుఁ డొకనాఁడు మృగయావినోదమునఁ దగిలి యొకవనమునఁ గ్రుమ్మరుచుండెను. ఒకచోట నాతనికి 'రక్షింపుఁడు రక్షింపుఁ' డను నాడుకూయి విన వచ్చెను. ఆరాజశేఖరుఁ డప్పుడు శిష్టదయాళుత్వమును, దుష్టదమనకౌతుకత్వమును మెఱయ వేఁటఁ జాలించి, యోడ కోడకుఁ డని యభయ మిచ్చి 'ఏనుండ మిమ్ముల నన్యాయవృత్తి నెవ్వఁ డలంపఁ గలఁ' డని యిట్లు గర్జించెను :

చ. వెలుఁగు మహాప్రతాపశిఖివేడిమి దిక్కులఁ నించుచున్న నా
కొలఁది యెఱుంగ కెవ్వఁ డొకొ ఘోరవుఁజి చ్చిటు చీరఁ గట్టెడి
న్దలరక యిట్టిదుర్మదు నధర్మపరు న్దురితాత్ముఁ జండదోః
కలితధనుర్విముక్తపటుకాండవిఖండితగాత్రుఁ జేసెదన్. (1.152)

ములుకులవంటి యీపలుకులకు విశ్వామిత్రుఁ డలిగి, వైశ్వానరసదృశుఁ డయ్యెను. నిజ మప్పటికిఁ గాని తేఁటపడలే దారాజునకు. పూర్వము వినవచ్చిన స్త్రీరోదనములు ముని తపోగ్నితప్తవిద్యాక్రందనములు. మునితపము చెదరినంతనే విద్యలకు మోక్షము కలిగి నది. వానియావేదన లుడిగినవి. రాజు విద్యాక్రందనములు స్త్రీరోదనము లని భ్రమించి క్షత్త్రియసహజమైన యార్తజనరక్షణోత్సాహమును బ్రదర్శించి, శిష్టజనాపకారియైన ధూర్తు నిపై రౌద్రముఁ బ్రకటించినాఁడు. ధూర్తునకు బదు లారాజునెదుట దుర్వారకోపమూర్తి యగు కౌశికుఁడు ప్రత్యక్ష మైనాఁడు. ఇందు హరిశ్చంద్రునివర్తనము దోషకలితము కాక ధర్మబద్ధమై యున్నది. దాని నాతఁడే మునికి సవినయముగా విన్నవించుకొనినాఁడు :

చ. అలుగకుమయ్య ! యోమునిజనాగ్రణి ! త ప్పొకయింత లేదు నా
వలన నరేంద్రధర్మ మగు వాక్యమ పల్కితిఁ జిత్తగింపు మ

22. "ధృతిః క్షమా దయాఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః ।
హ్రీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్ ॥" —మహాభారతము.

23. "అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియనిగ్రహః
దానం దమో దయా క్షాన్తిః సర్వేషాం ధర్మసాధనమ్ ।" —యాజ్ఞవల్క్యస్మృతి.

24. "వేదోక్తో హి ద్వివిధో ధర్మః ధర్మప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణ శ్చ ॥"
—శాంకరగీతాభాష్యము.

25. మార్కం. మహాపు. 8.18.

స్ఖలితము గాఁగ నిచ్చుటయుఁ గాచుటయు న్విలుచేతఁ బట్టి ని
శ్చలత రణంబు సేయుటయు శాస్త్రమతస్థితి రాజ్యధర్మముల్. (1.157)

హరిశ్చంద్రునిశాసనమహిమచే నాతనిసామ్రాజ్యపౌరులెల్లరు ధర్మప్రీతులును, మదవిరహితులు నై యుండి రని వెనుక తెలుపఁబడినది. అట్టిప్రజలు గల యాదేశమున నట్టి విరుద్ధవర్తనము విన్నను, కన్నను ఆరాజు మండిపడుటలో నాశ్చర్యము లేదు. ఆర్తత్రాణపరాయణధర్మనిర్వహణమునం దాతఁడు విధివిరుద్ధముగా వ్యవహరింపలేదు. కావునఁ గౌశికుఁడు నిరుత్తరుఁ డైనాఁడు. కాని, విశ్వామిత్రుఁడు రౌద్రమూర్తి యైనాఁడు. రౌద్రమర్థప్రధాన మైనది. అర్థసాధనమున ధర్మ మానుషంగికము. కావున నాముని యర్థసాధనపరుఁడై వక్రమార్గము ననుసరించినాఁడు. "ఎవ్వరికి నిత్తు? గాతు వీ వెట్టివారి? రాజ! యెవ్వరితో బవరంబు సేయుదు?" వని ప్రశ్నించినాఁడు. "విప్రుల కిత్తు, భయార్తజనులఁ గాతు, శత్త్రులతోడ సంగర మొనర్తు" నని రాజు ప్రత్యుత్తర మిచ్చినాఁడు.

మ. అనినం గాధితనూజుఁ డీవిహితధర్మాచారము ల్సల్పుదే
ని నరేంద్రోత్తమ! యేను బ్రాహ్మణుఁడఁ గానే రాజసూయాధ్వరం
బునకుం జాలినయంత సొమ్మొసఁగుమా భూదేవతాకోటికి
న్దనియ న్దక్షిణ లిచ్చి యజ్ఞ మమరేంద్రప్రీతిగాఁ జేసెదన్. (1.180)

అని యడిగినాఁడు. ముని భయార్తుఁడును, శత్రుకోటిలోనివాఁడును గాకపోవుటచే రాజు నుండి రక్షణనుగాని, యుద్ధమును గాని కోరలేదు. మిగిలిన దానమునుగూడ తాను విప్రుఁడైనచో నడుగవచ్చును. తాను రాజర్షియై బ్రహ్మర్షి కాఁదలఁచినవాఁడు. తనను బ్రహర్షిగా నంగీకరింపని వసిష్ఠునిఁ బుత్త్రశోకవార్నిధియందు ముంచినవాఁడు. "ఏను బ్రాహ్మణుఁడగానే?" యని ప్రశ్నించుటయందు మూలమున లేని వాగ్వక్రత తెలుఁగునఁ గానవచ్చుచున్నది. అడుగుటకుఁ గౌశికుఁడు తనను బాపఁ డని లెక్కవేసికొనినను అడిగినది క్షత్రియోచితమైనది— రాజసూయయాగ మొనర్చుటకు వలయుధనము. అదియును భూదేవతాతతికి దక్షిణ లిచ్చుటకు. నూరన విశ్వామిత్రునిఁ గడుగడుసరిగాఁ జిత్రించినాఁ డాంధ్రమున. మూలమున "యష్టు మిచ్ఛామి విప్రోహం దీయతా మిష్ట దక్షిణా" అనుచు నచ్చమైన విప్రునిగా యాచించు విశ్వామిత్రునిలోఁ దెలుఁగుపలుకుల లోని కాకుస్వరవ్యంగ్యముగాని, కమనీయవక్రతకాని, సమయోచితాడంబరము గాని పొడకట్టదు. రా జీమాట వినుటతోడనే చచ్చి బ్రతికినట్లు తేరికొనినాఁడు. ఆనందభక్త్యావేశముతోఁ దనయాస్తిసర్వస్వమును మునీంద్రునికాళ్ళముం దుంచినాఁడు. అందు సిరిసంపదలును, రాజ్యాధికారమును, ధాత్రియును, ధనరాసులును, భార్యయును, బుత్త్రుఁడును, తానును గలరు. మూలమున లేని "ధర్మచయము"కూడ తెలుఁగునఁ జేర్పఁబడినది. ధర్మనిష్ఠిత మగు నాయకునిచిత్తవృత్తి యామాట యనకుండ నుండఁ జాల దని మారన నిష్కర్ష. విశ్వామిత్రుఁడు కోరినది రాజసూయాధ్వరమునకుఁ దగినంత ధనమై యుండఁగా హరిశ్చంద్రుఁడు తనసర్వస్వము నిచ్చుచున్నాఁడు. ఇచ్చుచు వినయసూచక

ముగా "దక్షిణకు విత్తము చాలినయంత మున్న యిచ్చినదిగా నెఱుంగుము'' అని పేర్కొనినాఁడు. అందు ''మున్న యిచ్చిన" దనుమాటకుఁ గౌశికుఁడు వక్రముగా వ్యాఖ్యానించినాఁడు. అది హరిశ్చంద్రునియభిప్రాయమునకు సాక్షాద్విరుద్ధ మైనది. రాజు నాగరికమర్యాద ననుసరించి ''నాసంపదయంతయు మీదే; మీదక్షిణను మీ రడుగక పూర్వమే నే నిచ్చి నట్లు భావించి నాయందు చనువు చూపి, యీవస్తువులలో మీ కిష్టమై నది దక్షిణకు బదులుగా నెన్నుకొనుఁ డను భావము వచ్చునట్లు మాటలాడినాఁడు. విశ్వామిత్రుఁడు రంధ్రాన్వేషివలె వ్యవహరించి వెన్నలో వెంట్రుకలు తీసినాఁడు. ''మున్న యిచ్చినది'' యనఁగా హరిశ్చంద్రుఁడు తనసర్వసంపదను దనముం దుంచక పూర్వమే యిచ్చిన దని నిశ్చయించినాఁడు. అది లెక్కవేసికొనకయే హరిశ్చంద్రుని సర్వసామ్రాజ్యమును దానముగాఁ బుచ్చుకొనినాఁడు. ఇట్లు ద్వంద్వార్థము వచ్చునట్లు రాజు మాట్లాడుటయే యిచ్చట జరిగినపొరపాటు. విశ్వామిత్రుఁడు సర్వరాజ్యమును గైకొని హరిశ్చంద్రుని నగరు వెడల నాజ్ఞాపించి, యతఁడు నారచీరలు కట్టి భార్యాపుత్ర సమేతుడై నిష్క్రమించుసమయమునఁ బూర్వదత్త మైన యజ్ఞదక్షిణనుగూర్చి ప్రశ్నించు నంతవఱకు నాచక్రవర్తి కాపొరపాటు తెలియలేదు. తెలిసి పశ్చాత్తాపపడి యప్పుడు లాభము లేకపోయినది. అన్నమాట నిలువఁబెట్టుకొనుటకు భార్యాపుత్త్రులనే కాక చివరకుఁ దననే యమ్ముకొనవలసి వచ్చినది. మాటతప్పని యామానధనుఁడు మానమును సైత మమ్ముకొని సత్యమును గాపాడుకొనెను. హరిశ్చంద్రునివాక్యరచనలోని 'గండ' మను నొక్కరూపకాంగము నాధారము చేసికొని కథ పూర్వభాగమునుండి యుత్తరభాగమున కల్లుకొనిపోవుట యిచ్చటి కథానిర్మాణశిల్పము. ఏతత్కథాపరిణామానుసారియై నాయ కుని ధర్మోత్సాహము క్రమముగా సత్యపరిపాలన మనెడి నిమిత్తము నూతగాఁ గొని యుత్కట మగుచున్నది. ఇట్టిసత్యవీరము జన్యరస మైన యద్భుతము నంగముగాఁ గొని నిర్వహణమున సంపూర్ణసాఫల్యముఁ గాంచుచున్నది.

ఈయుపాఖ్యానమున సత్యవీరము క్రోధ, కరుణాదిరసభావములచేఁ బరిపుష్టమై నది. ఇందుఁ బ్రతినాయకుఁడు కౌశికుడు. అతనిసహాయకుఁడు ధర్ముఁడు. కౌశికుఁడు రౌద్రరసమూర్తి. అతని 'రౌద్రవృత్తి'ని మారన 1.189వ పద్యమున సూచించియే యున్నాఁడు. విశ్వామిత్రుని క్రోధ మర్థప్రధానముగా నామూలాగ్రముఁ బోషింపఁబడినది. హరిశ్చంద్రునిఁ గడగండ్ల పాలుసేయుటలో నాతఁ డనుసరించిన క్రూరమార్గ మాతని యౌద్ధత్యమును జెప్పక చెప్పుచున్నది. అతనిరౌద్రమువలన శైబ్యయందును, హరిశ్చంద్రునియందును పుత్త్రవియోగజనితకరుణము కలుగుట కవకాశము కలిగి జనక జన్యరసనిష్పత్తి కనువైన విధ మేర్పడినది. హరిశ్చంద్రుఁడు కాటికాపరి యగుటచే నాతనియౌజ్జ్వల్య మొక్కింత మాటుపడినదే కాని యట్టిదైన్యావస్థయందును నతనిచిత్తమున సడలని సత్యదీక్షయు, కదలని స్థైర్యమును బొడగాంచినచో నాతనితేజస్వితమఱింత యౌజ్జ్వల్యము దాల్చిన దని స్పష్టపడకపోదు. తనను తా నమ్ముకొనియును ఋషిఋణము తీర్చి చండాలదాస్యమున కొదిగి యున్న రను హరిశ్చంద్రుని సత్యధర్మతేజముముందు

విశ్వామిత్రునిరౌద్రదీప్తి వెలవెలపోయినది. మాయాచండాలుని కటికబుద్ధి హరిశ్చంద్రుని కఠోరధర్మదీక్షముందు స్తంభించిపోయినది. విశ్వామిత్రువలని శాపభీతియు, చండాల సేవావిధియు హరిశ్చంద్రుని దుఃఖార్ణవమున ముంచినవి, పరితాపాగ్నిలోఁ గాల్చినవి. కాని, యతనినిష్కళంక సత్యవ్రతదీక్షమాత్రము తాలిమి నూది తరుణముకొఱకు ప్రతీక్షించినది. ప్రాణతుల్యుఁడైన పుత్త్రునిమృతి యాతని కేర్పడిన చివరియగ్నిపరీక్ష. విధి పెట్టిన యాపరీక్షను ద్రిప్పి విధిముఖముననే కొట్టి యారాజు చితిపై నెక్కి శ్రీకాంతుని స్మరించినాఁడు. దేవదుందుభులు మ్రోసినవి; పూలవానలు కురిసినవి; అమృతపుజల్లులు వ్రాలినవి; పుత్త్రునిప్రాణములు వచ్చినవి; శాశ్వతదివ్యభోగము లెదుట నిలిచినవి. ఇవియన్నియు 'సత్యధర్మమహనీయత' కు మెచ్చి యిచ్చిన బహుమానము లని మహేంద్రుఁడు స్పష్టముగాఁ జెప్పివైచినాఁడు. ధర్మకౌశికులకపటనాటకమును విప్పిచెప్పినాఁడు. దానితో జిజ్ఞాసువులహృదయమునందు విశ్వామిత్రునిరౌద్ర మాభాస ముగా స్ఫురింపవచ్చునుగాక, ధర్మునియౌద్ధత్యము మాయామూలక మని మనసు కెక్కకపోవుగాక: సత్యపాలనకై యప్పటికే యమయాతనల ననుభవించియు, ప్రజా కుటుంబముకొఱకు నారకదుఃఖము లైనను వరించి స్వర్గసౌఖ్యముల త్యజింప నుత్సహించి యాశ్రితావనధర్మము నారాధించిన హరిశ్చంద్రుని యుత్కటోత్సాహముమాత్రము పఠిత హృదయమున రససిద్ధి కలిగింపక మానదు.

కథాకథనకుశలుఁడైన మారన హరిశ్చంద్రోపాఖ్యానమున బహువిధాంతశ్శిల్ప ములఁ గూర్చి, దాని నొక కళామందిరముగాఁ దీర్చిదిద్దెను. అట్టివానిలో ముఖ్యమైన వానినిఁ గొన్నింటినిఁ బరిశీలించుటవలనఁ గవిశిల్పనైపుణ్యము కొంత తేటపడఁగలదు.

1. హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునకు సమస్తసామ్రాజ్యసంపదలను దత్తము చేసి, మేనిపై ధరించినయాభరణాదులఁ బరిత్యజించి వల్కలాజినధారియై నగరువీడి నగరిలో ప్రవేశించుఘట్టమున మారనకవి యమూలకములైన మూఁడు సీసపద్యములను రచించి ప్రకరణోచితమైన రసవద్వర్ణనము సేయునేర్పును బ్రకటించెను. అందు మొదటి పద్యమున రాచనగరులో హరిశ్చంద్రుఁడు వర్జితానేకవిశేషభూషణుఁ డగునప్పుడు బంధు జనులకుఁ దోచినవిధము వర్ణితము :

సీ. సురుచిరకిరణవిస్ఫురణంబు డింది యెం
        తయు మాఁగుపడినమార్తాండు పగిది,
    భాసుర రత్నసత్ప్రభలు వాసిన విన్న
        నౌ రోహణశిలోచ్చయంబుమాడ్కి,
    విలసితతారకవిభవంబు చెడి కడుఁ
        బాడఱి యున్న నభంబు కరణి,
    ప్రవిమలకుసుమసంపద యెల్ల నుడిపోయి
        యూపు దక్కిన మహీరుహముభంగి,

తే. నొందఁ గోటీరహారకేయూరకంక
ణాదిమణిభూషణోత్కర మపనయించి
యెప్పు పొలివోయి దీనత నుండె బంధు
జనుల చూడ్కులు కమర నజ్జనవిభుండు. (1.169)

హరిశ్చంద్రుఁడు కిరీటమును, హారములను, భుజకీర్తులను, కంకణాదిమణిభూషణోత్కరమును అపనయించినప్పుడు పొలివోయి దీనత నొప్పిన యతని స్వరూపావస్థలను యథాసంఖ్యోపమాలంకారశోభితముగా సీసమున మారన వర్ణించినాఁడు. ఈ పద్యమునఁ బ్రతి చరణమును సార్థకమై రసానుకూలభావసమర్పక మగుట గమనింపఁదగి యున్నది.

ఉజ్జ్వలరత్నకిరణప్రసారసుందరమైన కిరీటము నపనయించినతోడనే చక్రవర్తి కాంతి దక్కి సురుచిరకిరణవిస్ఫురణము డింది యెంతయు మాఁగుపడిన మార్తాండునివలె దైన్యము నొందినాఁడు. మృతమైన జగత్తును బునరుజ్జీవింపఁజేయువాఁడు మార్తాండుఁడు. అట్లే సామ్రాజ్యప్రజలను క్షయమునుండి కాపాడువాఁడు హరిశ్చంద్రుఁడు. అట్టియుత్తమ ధర్మమునకుఁ బ్రతీక యతఁడు శిరమున ధరించినకిరీటము. అది యూడుటతోడనే యతని నుండి ప్రభుత్వమును, పరిపాలనధర్మమును, కాంతిమత్వమును వేరువడిన వను భావ మాయౌపమ్యమువలన మారన వ్యంజింపఁజేసెను.

కంఠసీమయందును, ఉరఃప్రదేశమునందును వెలుగొందు రత్నహారములఁ దీసి వైచిన హరిశ్చంద్రుఁడు భాసురరత్నప్రభలు వాసి విన్ననౌ రోహణశిలోచ్చయము మాడ్కి వైవర్ణ్యము దాల్చినాఁడు. రత్నరాసులు పర్వతమునకు సహజసంపదలు. అట్లే చక్రవర్తికి రత్నహారములు సహజసంపదలు. శిలోచ్చయశబ్దము హరిశ్చంద్రునిదృఢ శరీరమును, విపులవక్షోరఃప్రదేశమును వ్యంజించుచున్నది. రత్నహారము లొక్కసారిగా వీడుటచే నాతనియురము వివర్ణమై విన్నబోయిన దని యలంకారతాత్పర్యము.

కేయూరవిరహితుఁ డైన హరిశ్చంద్రుఁడు తారకావైభవము చెడి కడుఁబాడటి యున్న నభమువలె నుండెనఁట! ''మేఘై ర్న భాతీతి నభః'' అని గురుబాలప్రబోధిక. మేఘాచ్ఛన్నమైన యాకసమువోలె భుజకీర్తులు కోల్పోయిన రాజుపై నైల్యము వ్యాపించి చిన్నబోయిన యనుభావము కానఁబడె నని తాత్పర్యము: ఇందలి తారకావైభవము కేయూరమణివైభవమున కుపమాస్థానము.

కంకణాదివివిధమణిభూషణోత్కరము నపనయించిన మహారాజు ప్రవిమలకుసుమ సంపద యెల్ల నుడివోయిన మహీరుహముభంగి రూపుసెడి యుండెనఁట! ఈయుపమాన బలముచే పూలు రాలిన చెట్టు ఫలసిద్ధి కెట్లు దూర మగుచున్నదో యట్లే మణిభూష ణోత్కర మంతవఱ కాతని నాశ్రయించి యున్నను నతని కెట్టి ఫలసిద్ధిని గల్పింపకయే దూర మై పోయె నని కవి వ్యంజింపఁజేసినాఁడు.

మారన సార్థకాలంకారముతోపాటు సార్థకశబ్దప్రయోగమునుగూడ నొనర్చి యొక క్రమపరిణామశిల్పమును సంతరించినాఁడు. వైసీసపద్యమున హరిశ్చంద్రుఁ డాహార్య

సంపదఁ గోల్పోయి కాంతిహీనుఁ డయ్యె నని తాత్పర్యము. కాంతిఁ గోల్పోవుటచే గుర్తించుటకే వీలులేనంత మారిపోయినాఁ డని మారన నిరూపింపఁదలఁచినాఁడు. అందు వలననే- మొదట సురుచిరకిరణవిస్ఫురణంబు డింది మాఁగుపడుటయు, నాపైఁ గ్రమముగా సత్ప్రభలు వాసి విన్ననగుటయు, విభవంబు చెడి పాడఱుటయు, సంపద యెల్ల నుడిపోయి రూపు దక్కుటయుఁ జేర్కొనినాఁడు. అనఁగా హరిశ్చంద్రుఁడు మొదట స్వయంప్రభాకిరణజాలముచే లోకమును వెలిఁగింపఁజేయుమహత్త్వము గోల్పోయె ననియు, నాపై నిజప్రభలు తనను బాయుటచే స్వయంప్రభను గోల్పోయి వివర్ణుఁ డయ్యె ననియు, నాపై సంపదవలనఁ గలుగు వైభవ మనెడి యనుభవవిశేషము కనుమఱుఁ గగుటచే నాతఁడు పాడుబడిన ట్లయ్యె ననియుఁ, జివరకు సర్వసంపద లుడిగిపోవుటచే రూపవికృతి యేర్పడిన ట్లయ్యె ననియు మారన వర్ణించినక్రమమువలనఁ దెలియుచున్నది. ఇట్టి దైన్యావస్థకు గురియైన హరిశ్చంద్రునిరూపుఁ గాంచిన బంధుజనులచూడ్కులు కమరిపోయిన వనుటలో నాశ్చర్యము లేదు. అందును భావించినకొలఁది వ్యంగ్యవైభవము స్ఫురింపఁ గలదు. హరిశ్చంద్రుఁడు రాజ్యభోగములు తా ననుభవించుటయే కాక తనబంధుకోటినిఁ గూడ అనుభవింపఁజేసినవాఁడు. కావున తమవైభవస్ఫూర్తి కేమహితాత్మునిదీప్తి కారణమైనదో అది తమకన్నులయెదుట నంతరించుచుండుటఁ గాంచి బంధుగులు సురసుర గ్రుక్కినా రనుట సార్థకము!

పురవీథులవెంట పాదచారియై వచ్చుచున్న హరిశ్చంద్రునిఁ గాంచి పౌరులు మిన్ను విఱిగి మీఁదఁ గూలినవిధముగా గుండె లవిసి కళవళించి యిట్లని వాపోయిరి.

సీ. కాంచనాలంకృతిఁ గర మొప్పి నీమ్రోల
  నేతెంచుగజఘట లెందుఁ బోయెఁ?
గనకకింకిణులచెల్వునఁ గ్రాలు తురగంబు
  లేల నీకెలఁకుల నేఁగుదేవు?
రత్నోజ్జ్వలము లైన రథములు నీవజ్జ
  వడిఁ జనుదేర కెక్కడ నడంగె?
వివిధాయుధస్ఫూర్తి వెలుఁగు కాల్వురమొత్త
  మేల నీతో రాక యేమి యయ్యె?
తే. రమ్యభూషణదివ్యాంబరములు దొఱఁగి
నారచీరలు గట్టి యనాథవృత్తి
నాలుఁ గొడుకును వెంట రా నరుగునట్టి
యెదరు వాటిల్లెనే మేదినీశ! నీకు.

సీ. పొలుచు నీరాజ్యవిభూతి వ్రేఁ గయ్యెనే
  దైవంబుకంటికి ధరణినాథ!

చక్రంబు పనిసేయ సడిసన్న నీపెంపు
బూర్జబొట్టయ్యెనే భూరికీర్తి!
యాదిగర్భేశ్వరి యగు నీమహాదేవి
యింతకు నోచెనే యిద్ధచరిత!
గోమునఁ బెరిఁగిన యీముద్దుపట్టి భా
గ్యం బిట్టి దయ్యెనే యధికపుణ్య!
తే. హా! మహారాజ! రాజసూయాధ్వరేశ!
హా! హరిశ్చంద్ర! నిత్యసత్యాభిరామ!
హా! దృఢైశ్వర్య! శౌర్యజితారిలోక!
హా! సమస్తలోకేశ! దయారమేశ! (1.175,177)

మొదటిపద్యమునందుఁ బ్రజలు రాజలాంఛనములు లేక యనాథవృత్తి సకుటుంబి యై వచ్చు మహారాజును జూచి విలపించిరి. కాంచనాలంకారభూషితము లైన గజ సమూహములును, కనకకింకిణీనిక్వాణమండితము లైన తురంగములును, రత్నోజ్జ్వలము లైన రథసమూహములును, ఆయుధపాణు లైన భటులును - అనఁగాఁ జతురంగబల ములు - వెంట రాగా రమ్యభూషణదివ్యాంబరములు ధరించి పురమున నూరేగవెడలు రాజున కానాఁడు కలిగిన యెదరునుగూర్చి ప్రస్తావించిరి. రెండవపద్యమునఁ బురి వెడలిపోవుచున్న హరిశ్చంద్రునిఁ గాంచు ప్రజలయెడందలలో శోకానలము కార్చిచ్చువలె నంటుకొని యాక్రందనల కుపక్రమింపఁజేసినది. వారు పిలిచిన ప్రతిపిలుపులోను, వారు వాడిన ప్రతిసంబుద్ధిలోను, సార్థక్యమును, సాదరమును నుట్టిపడుచున్నవి. దైవమునకే కన్నుగుట్టునంత రాజ్యవిభూతి కలవాఁ డగుటచే నాతఁడు ధరణినాథుఁ డైనాఁడు. సప్తాంగచక్రమును సమర్థముగాఁ బనిచేయించుటచే నాతని కపారకీర్తియు నభ్యుదయ మును గలిగినవి కాన భూరికీర్తి యనఁబడినాఁడు. ఆదిగర్భేశ్వరి యగు నామహాదేవినిఁ జేపట్టుటచే నాతఁ డిద్ధచరిత్రుఁ డైనాఁడు. పుణ్యాలరాశి యైన పుత్త్రునిఁ గాంచుటచే నాతఁ డధికపుణ్యుఁ డైనాఁడు. రాజసూయాధ్వరప్రవర్తకుఁ డగుటచేతనే యాతనికి మహా రాజపదము సార్థకమైనది. నిత్యసత్యాభిరాముఁ డన్న విశేషణమునకును హరిశ్చంద్రుఁ డన్న విశేష్యమునకును విడదీయఁజాలని యనుబంధ మున్నది. అతఁడు శౌర్యజితారి లోకుఁ డగుటచే దృఢైశ్వర్యుఁడును, విష్ణ్వంశ గల మహారాజును అగుటచే దయా రమేశుఁడును, సమస్తలోకేశుఁడును అగుచున్నాఁడు. మారనచేతిలో నాపౌరు లుచితపద ప్రయోగశిల్పకుశలులవలె సృజియింపఁబడినారు.

ప్రజ లారాజచంద్రునియేలుబడిలోఁ జల్లఁగా జీవించుచుండిరి కష్టమన్నది కాని, కన్నీ రన్నదికాని వారికిఁ గలుగకుండఁ జూచిన పెన్నిధివంటివాఁ డాప్రభువు. అతనిపై దుర్విధి కసిపూనినది. దానిని వివేకముతో భావించి ప్రజలు దుఃఖావేశముతో నెలుఁగెత్తి విలపింతురేకాని ప్రత్యక్షదుర్విధి యైన విశ్వామిత్రునిఁ బల్లెత్తుమాటయైనను అనరు. ఆ మహారాజు వారి కిచ్చిన శిక్షణ యటువంటిది. మదవిరహితమైన చిత్తవృత్తి సత్యధర్మ

శాసనమహిమచే నారాజ్యమునఁ బ్రజాహృదయములందు వసించిన దని యిచ్చట వస్తుధ్వనిచే మారన వ్యంజింపఁజేసినాఁడు. కథానిర్వహణమున హరిశ్చంద్రునితోపాటు దివ్యవిమానములందు పాద ముంచుటకుఁ దగినయర్హతను బ్రజలయందు సమాయత్తపఱచి మారన కథార్థములను సారవంత మొనర్చినాఁడు.

2. మార్కండేయపురాణమందలి యీహరిశ్చంద్రోపాఖ్యాన మొక విచిత్రమార్గము ననుసరించి చెప్పఁబడినది. అస లాకథ మారన ఫలశ్రుతిలోఁ జెప్పినట్లు "హరిశ్చంద్రు నుత్తమచారిత్రము" మాత్రము చెప్పుటకే పుట్టినట్లున్నది. ఆమహారాజునకు సంబంధించిన వివరములనుమాత్రము పౌరాణికుఁడు సవిస్తరముగాఁ జెప్పుచుండును కాని యేమాత్రమైనను అడుగు ప్రక్కకు వైచి యితరవివరములను బట్టించుకొనఁడు. కనీస మామహారాజుగారి పట్టమహిషిపేరునుగూడ పేర్కొనకపోవుటయే యందులకు సాక్షి. ఇఁక చండాలునిపేరునుగూర్చియు, శైబ్యను విలిచిన బ్రాహ్మణునినామమునుగూర్చియు వేఱుగాఁ జెప్పవలయునా? కథార్థములలో బ్రాహ్మణసేవలో శైబ్య పడినయగచాట్లుగాని, యామె భర్తనుగూర్చి పొందినపరితాపముగాని, పుత్త్రునికిఁ బాము కఱచుటకుఁ గల హేతువునుగాని యినుమంత బైటపెట్టఁడు కథకుఁడు. కాని, నాయకుఁడైన హరిశ్చంద్రుని చరిత్రచిత్రణమున మాత్రము సర్వసూక్ష్మాంశములను శ్రద్ధతోఁ బరిశీలించి సంతరించినట్లు స్పష్టముగాఁ గనవచ్చుచున్నది.

3. మారన హరిశ్చంద్రుని చిత్తవృత్తినిఁ దీర్చిదిద్దుటలోఁ గొంతసామర్థ్యమును బ్రకటించినాఁడు. ఆ నేర్పంతయు ధీరోదాత్తుఁడును, ధర్మవీరుఁడు నైన నాయకుని యందు కరుణరసదీప్తి కనువైన మనోవృత్తిని స్థాపించి యది యతని ధీరత్వమునకును, ఔదార్యమునకును, ఉత్సాహశీలమునకును భంగము వాటిల్లకుండ తీర్చిదిద్దుటయందే కేంద్రీకరింపఁబడినది. ఇచ్చటఁ గొంతవివరణ మవసరము.

సామాన్యముగా వీరు లగు నాయకులు సాధకు లనియు, సిద్ధు లనియు రెండు తెఱఁగులు. అపూర్వకార్యసాధనోత్సాహులై యడ్డంకుల నధిరోహించి పురోగమించి యారబ్ధకార్యసిద్ధినిఁ గాంచు కార్యశీలురు సాధకులైన వీరులు. క్రియాబహుళములైన యుద్ధాదులయం దట్టినాయకులు కానఁబడెదరు. దానసత్యాదివీరములయందు సిద్ధులైన వీరులు నాయకులుగా వర్ణింపఁబడుచుందురు. అందు వారు తమసిద్ధులఁ బరీక్షింప నేర్పడిన క్లిష్టపరిస్థితులమధ్య నలిగియు, కలఁగియు తాలిమిచే ధృతి వహించి తమసిద్ధిబలముచే కార్యసిద్ధి వడసెదరు. సాధకునిచిత్తవృత్తి - వార్షుకతరంగిణి పొంగిపొరలుచు కొండలను గుట్టలను సైతము తనప్రవాహవేగముచేఁ గోసియైనను తనగమ్యస్థలము చేరెడివిధమునఁ బ్రగతిశీలమై యుండు ననియు, సిద్ధునిచిత్తవృత్తి - వర్షకాలనదీప్రవాహగర్భమున నున్న స్థిరమైనగిరిరాజువలె క్షమాప్రధానమై యుండు ననియు భావింపవచ్చును. హరిశ్చంద్రుఁడు సత్యధర్మాచరణమున సాధకకక్ష్యను దాటిన సిద్ధుఁడు. తద్ధర్మమునందు గిరివలె స్థిరుఁడు. కౌశికరోషసంజనితక్రోధముచే నుప్పొంగిన దుఃఖతరంగిణి యతనిని కలఁచి వైచినను, వేదనాదవాగ్నిశిఖ లాపాదశిఖరము దహించినను అతఁడు క్షమామూర్తియై నిలిచియుండెను.

చితిపై నెక్కినప్పుడుకూడ "నగియును నే నెన్నండు బొంకు పలుక; నా కిదియ నిశ్చయం" బని నిశ్శంకగాఁ బలికిన దృఢవ్రతుఁడు. పుటము వెట్టిన బంగారమువలె నతనియందలి వీరము దీప్తమై రాణించెను. ఈపద్ధతి ననుసరించి మారన హరిశ్చంద్రునిచిత్తవృత్తిని వీర రసానుగుణముగాఁ బోషించెను.

వీరమునకుఁ గరుణము విరోధ మని లాక్షణికులు చెప్పలేదు కాని పోషకరస మని మాత్రము గణింపలేదు. కరుణమునకు స్థాయిభావ మగు శోకమును లాక్షణికు లిట్లు నిర్వచించిరి :

'ఇష్టజనవినాశాత్ శాపాత్ క్లేశా చ్చ బంధనా ద్వ్యసనాత్ । ఏతై రర్థవిశేషైః కరుణాఖ్యరస స్సముద్భవతి' —నాట్యశాస్త్రము.

'పుత్త్రాదివియోగమరణాదిజన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః' —రసగంగాధరము.

అట్టిశోకము ఉత్సాహభంజక మగును కావున వీరమున కది పోషకము కాదని వారి మతము. ఇది స్థూలమైన దృష్టి. సూక్ష్మముగా నాలోచించినచో వీరరసప్రతీతిలోఁ గరుణ మున కొకకొంత యవకాశము కలదు. లోకమునఁ బెక్కుకావ్యములందు ధీరోదాత్తాది నాయకు లపూర్వకార్యసాధకు లయ్యు నెడనెడ బంధుజనవియోగదుఃఖాదుల ననుభవించుట కాంచుచున్నాము. శివాజీ తానాజీవియోగమున దుఃఖించెను; అర్జునుఁ డభిమన్యునిమరణ వార్త విని శోకించెను. కాని, వారిరువురును వీరవర్యు లగుటచే వారియందు తత్కాల దుఃఖము తరువాత నపూర్వకార్యసాధనోత్సాహమునకు హేతు వయినది కాని వీరరస భంజకము కాలేదు. పైపెచ్చు కరుణము వీరరసజ్యోతికి స్నేహతుల్య మై భాసించినది. అట్టివిధము కథార్థములపైనను, కవిసామర్థ్యముమీఁదను అధారపడియుండును. కావున నిష్టజనవియోగమువలనఁ గలుగు శోకము వీరునిహృదయమున నుత్సాహస్ఫూర్తినిఁ బోషింపఁ గల్గినచోట వీరమున కంగముగాఁ గరుణము వర్ణిత మైనను దోషము కాదు. హరిశ్చంద్రునిచరిత్రమున వీరరసపోషకమైన కరుణము భాసించుట చమత్కారము. వనవాసాజ్ఞాతవాసములందు స్వీయదైన్యావస్థనుగూర్చి చింతించుచు నోరిమితోడఁ దమ ధర్మోత్సాహమును బరిపోషించుకొనిన ధర్మరాజువలె హరిశ్చంద్రుఁడును విశ్వామిత్ర క్రోధసంజనితము లైన దుఃఖముల నెన్నింటినైనను భరించి తనసత్యధర్మనిష్ఠను గాపాడు కొనినాఁడు. అతఁ డనుభవించిన ప్రతిదుఃఖానుభూతియు నతనిధర్మవీరప్రగతి కేర్పడిన యొక్కొక్కదృఢసోపానమువలెనే యీయుపాఖ్యానమునఁ జిత్రింపఁబడినది.

హరిశ్చంద్రుని చిత్తవృత్తిని నిందు రెండుభాగములుగా నెంచవలయును. ఒకటి : యాతనియందు సముద్రగాంభీర్యము దాల్చి స్థాయిగా నున్న మనోవృత్తి; రెండు : తత్కాలోచితముగా నుద్విగ్నమై సముద్రతరంగములవలె లేచి యణగారు చిత్తవృత్తి. అందు మొదటిది జన్మవ్రతరూప మైన ధర్మము నాశ్రయించినది; రెండవది దేహధర్మము నాశ్రయించినది. సత్యధర్మవ్రతదీక్ష హరిశ్చంద్రుని జన్మవ్రతము. పురజన, గురుజన,

"దురితాత్మ!" (1.152) డని పేర్కొనెను. దానికిఁ బ్రతిగా నారాజు కంటఁబడి నంతనే యాముని "ఓరి దురాత్మక" (1.156) యని మాటకుమాట వడ్డించినాఁడు. ఆరాజు వినయముతో మ్రొక్కి "మునిజనాగ్రణి" (1.157) యని యతనిని గౌరవించి మాట్లాడినాఁడు. దానికి దీటుగా నామునియు నాతనిని "నరేంద్రోత్తమ" (1.160) యని యాశ్వాసించినాఁడు. దాన మడుగఁబోవుచు నారాజును "వీరాగ్రణీ!" (1.163) యని పిలిచి యతని సార్వభౌమత్వమును గ్రహింపనెంచె నని సూచించెను. రాజ్యాపహరణా నంతరము 'రాజా! పార్థివముఖ్యా!' (1.165) యను సంబుద్ధులచే నాతని సామాన్య క్షత్రియత్వమునే గుర్తించినట్లు మాటలాడెను. కాశీనగరమున హరిశ్చంద్రునితో విశ్వామిత్రుఁడు సంభాషించుచు ననలు సంబోధనలే చేయక యాతనియం దత్యంత అనాదర భావమును బ్రకటించెను. ఆపాత్రను తత్సంభాషణములను నంతజాగరూకతతో రచించిన మారన యేలనో 1.192, 205, 206, 207, 209 వ పద్యములలో విశ్వామిత్రుఁడు మహీతలేశ, నృప, ధరణీనాథ, అనఘా, భూవరా! అను సంబోధనలు చేసినట్లు రచించినాఁడు. దీనినిబట్టి యీకవి యాశిల్పమును దనరచనమున నుద్దేశపూర్వకముగాఁ జేసినది కా దని యూహింపవలసివచ్చుచున్నది. అయినను కథాకథనక్రమావిష్కారమున దొరలిన కొన్నిశిల్పము లసంపూర్ణము లైనను మహాకవిప్రతిభాశక్తిపై నున్న విశ్వాసము వలన వానిని గౌరవించుటలో దోసములేదు.

8. భావస్పష్టీకరణముకొఱకు స్వీయకల్పనావిలసితము లైన యలంకారముల నాయాస్థలములందుఁ జొప్పించి మారనకథార్థముల నాస్వాదమధురములుగా నొనర్చెను. ఉదాహరణమునకు :

(1) ఉపమాలంకారము :

చ. అనినఁ జలించుచు న్నృపతి యంగనకే లొకచేఁ దెమల్చి వే
చనఁ జన నేమి చెప్ప మునిచందము? చేతిప్రచండదండ మె
త్తి నయ మొకింత లేక సుదతీతిలకంబు కృశాంగవల్లి నే
సె సిభము దొండ మెత్తి మదజృంభితమై లత వ్రేయుచాడ్పునన్.(1.184)

(2) రూపకాలంకారము :

క. ......చేతో, వననిధి పిండఁలి పిండుగ
ఘనచింతామంధరంబు గలఁపఁగ మదిలోన్. (1.193)

(3) అర్థాంతరన్యాసము :

(అ) తే.గీ. వెడలిపొమ్మల మాటలు వేయు? రాజ్య
మేకముఖము గాకున్న మా కెట్లు చెల్లు?
వినుము రాజ! సూదికి రెండు మొనలు గలవె? (1.166)

ఉ. మాలఁడు వొంగి యమ్మునికి మానుగ నర్థన మిచ్చి పట్టి భూ
పాలుని నంటఁగట్టి యకృపామతిఁ గొంకక చేతికోలఁ బై

తో లెగయంగ ద్రవేసి వెనఁ దోడ్కొని పల్లెకుఁ బోయె నేరికిం
**గాలవశంబునం గలుగు కర్మఫలంబులు దప్పనేర్చునే?** (1.231)

9. మూలమునందలి సన్నివేశముల నొకించుక మార్చి, కథార్థపుష్టికి పాటుపడినాఁడు. మూలమున హరిశ్చంద్రునిభార్య కాటికాపరిగా నున్న తనభర్తను బుత్రదుఃఖాతిశయముచే నతఁడు మూర్ఛితుఁ డగునంతవఱకును గుర్తింపలే దని చెప్పఁబడియుండఁగా మారన దాని నొకింత మార్చి వా రిరువురును బ్రథమవీక్షణమునందే పరస్పరము గుర్తించుకొనినట్లు వ్రాసినాఁడు. ఈమార్పువలన శైబ్య హరిశ్చంద్రుని దైన్యస్థితిని వర్ణించుచు దుఃఖించుట కవకాశ మధికముగా నేర్పడుటవలన రసప్రయోజనమును, నాయకదశాపరిణామవర్ణనమును బ్రక్కనున్న మఱియొకపాత్రచేఁ జేయించు కావ్యప్రక్రియాప్రయోజనమును సాధింపఁబడినవి.

శైబ్యాహరిశ్చంద్రసంభాషణమున స్వప్నవృత్తాంత ప్రస్తావనమును మారన చమత్కారముగాఁ బ్రవేశపెట్టి (1.263) కథయొక్క నిర్వహణోన్ముఖావస్థను వ్యంగ్యముగా నిర్వహించినాఁడు.

10. పుత్త్రశోకాతిశయముచేఁ బ్రాణత్యాగమున కుద్యుక్తుఁడైన హరిశ్చంద్రుని సంభాషణమును నిగ్రహముతో మూలమునం దున్న క్లుప్తీకరించి మారన యౌచిత్యము పాటించెను. మూలము:

శ్లో. "నరకే నిపతిష్యామి కీటకః క్రిమిభోజనః
వైతరణ్యాం మహాపూయవసాసృక్స్నాయుపిచ్ఛితే ॥
అసిపత్రవనం ప్రాప్య ఛేదం ప్రాప్స్యామి దారుణమ్
తాపం ప్రాప్స్యామి వా ప్రాప్య మహారౌరవరౌరవౌ ॥
మగ్నస్య దుఃఖజలధౌ పారం ప్రాణవియోజనమ్
ఏకోఽపి బాలకో యోఽయ మాసీ ద్వంశకర స్సుతః ॥
మమ దైవానుయోగేన మృత శ్చాపి బలీయసా
కథం ప్రాణా న్విముఞ్చామి పరయత్తోఽస్మి దుర్గతిః ॥
అథవానార్తి సఙ్క్లిష్టో నరః పాప మవేక్షతే
తిర్యక్త్వే నాస్తి తద్దుఃఖం నాసిపత్ర వనే తథా ॥
వైతరణ్యాం కుతస్తాదృ గ్యాదృశం పుత్రవిప్లవే
సోఽహం సుతశరీరేణ దీప్యమానే హుతాశనే ॥
నిపతిష్యామి తన్వంగి క్షన్తవ్యం కుకృతం మమ
అనుజ్ఞాతానుగచ్ఛ త్వం విప్రవేశ్మ శుచిస్మితే ॥
మమవాక్యం చ తన్వంగి నిబోధాదృతమానసా
యది దత్తం యది హుతం గురవో యది తోషితాః ॥
పరలోకే సంగమో మే భూయాత్పుత్రేణ చ త్వయా
ఇహలోకే కుతస్త్వేత ద్భవిష్యతి మమేప్సితమ్ ॥

త్వయాసహ మమ శ్రేయోగమనం పుత్రమార్గణే
యన్మయా హసతా కించి ద్రహస్యేవా శుచిస్మితే ॥
అశ్లీల ముక్తం తత్సర్వం క్షన్తవ్యం మమ యాచతః
రాజపత్నీతి గర్వేణ నావజ్ఞేయ స్సతే ద్విజః
సర్వయత్నేన తోష్యో హి స్వామీ దైవతవ చ్ఛుభే ॥ (8.226-236)

ధీరుఁడును, మితభాషియు నైన హరిశ్చంద్రుఁడు నిబ్బరము లేక సామాన్యునివలె రోదనము చేసినట్లు కాక మారన మొదటియాఋశ్లోకములలోని వివిధనరకబాధలను బ్రత్యేకించి పేర్కొనక రాజుచేత "నీదుర్మరణంబునం జేసి యనేకఘోరనరకంబు లైనను ననుభవించెద" (1.264) నని యనిపించుటయందు వ్యంజింపఁజేసెను. 8.232, 233, 234 శ్లోకములతాత్పర్యము "దానయజనయాజనగురుపూజ లొనరించిన వాఁడ నైతినేని పరలోకంబున నైన మన మెప్పటియట్ల కూడియుండెదము-'' అనువాక్యమునఁ గుదించెను. 235,236 శ్లోకములందలి మొదటిచరణముల ననువదింపక వదలెను. వానికిబదులు- ''వినుము ! నగియును నే నెన్నండును బొంకుపలుక నా కిదియ నిశ్చయంబు'' అను ముత్యమువంటిమాట యొకటి నాయకునివాక్కు నలంకరించునట్లు మారన రచించెను. శైబ్యయందు గర్వలేశము నెచ్చటఁ గానరాకుండఁ జిత్రించి యుండుటచేఁ గాఁబోలు "రాజపత్నీతి గర్వేణ నావజ్ఞేయ స్సతే ద్విజః" అను హెచ్చరిక నామె కీయ నవసరము లేదనియే మారన వదలినాఁడు. "నీ వరిగి యమ్మహీదేవుని దేవునిఁబోలె నారాధింపు" మనుటలో హరిశ్చంద్రుని ధర్మనిష్ఠను వ్యంగ్యముగా స్థాపించినాఁడు. ప్రతిపద సార్థకమైన సంగ్రహరచన మి ట్లీ వచనమునందే కాక, రచనమునం దెల్లెడల వెల యించుట మారనయౌచిత్యదృష్టికి నికషోపలము !

**జడోపాఖ్యానము :**

మార్కండేయమహాపురాణ కథారత్నహారమునందు జడోపాఖ్యానము నాయకమణి. 'బహుళతరాజ్ఞానతుహిననిర్వాపణప్రౌఢి నర్కప్రభాభాతిఁ'' దాల్చు తేజస్సంపద యీపురాణమున కీయుపాఖ్యానమువలననే యేర్పడుచున్న దనినను సత్యదూరము కాదు. జడోపాఖ్యానము నాయకమణి యనుటచే దానియందు మిగిలినయుపాఖ్యానములకు లేనిగౌరవమును, ఔజ్జ్వల్యమును నారోపింపఁబడుచున్నవి. కథావిస్తృతివలనను, ప్రతిపాదితవస్తుతత్త్వమువలనను ఉపాఖ్యానమునకు గౌరవ మేర్పడును. ఈరెండుగుణములును దీనియందు సహజసిద్ధములై యున్నవి.

ఏతత్పురాణమునందలి యుపాఖ్యానములన్నింటికంటెను విస్తృతియం దిదియే కడుంగడు పెద్దది. సంస్కృతమున 1878 శ్లోకములమొత్తము గల 32 అధ్యాయములందును, ఆంధ్రమున 714 గద్యపద్యములు గల దాదాపు రెండాశ్వాసములందును వ్యాపించియుండుట దానికి నిదర్శనము !

ఇందుఁ బ్రతిపాదింపఁబడిన వస్తువు ప్రధానముగా శాస్త్రవిషయము. పిండోత్పత్తి నుండి బ్రహ్మసాయుజ్యమువఱకు ననేకవిషయము లిందుఁ బ్రసక్తములై యున్నవి. శుష్కములైన శాస్త్రవిషయము లచ్చముగాఁ జెప్పినచో సహృదయాస్వాదనస్వాదువులు కాఁజాలవు కావున నవి రసార్ద్రములైన యుపగాథలతోఁ బరిపుష్టమొనర్పఁబడి, యాస్వాద్యమానములుగా నొనర్పఁబడినవి. దానివలన నీయుపాఖ్యానమునకు శాస్త్రకావ్య గౌరవము లభించుచున్నది. వస్తునిర్మాణశిల్పము ఉపాఖ్యానమున కౌజ్జ్వల్యముఁ గల్పించు లావణ్యసారము. అట్టిది కవిప్రతిభాశక్తిచేఁ గథ కేర్పడును. మారన యీయుపాఖ్యాన మునకు సహజమై రాణించు నౌజ్జ్వల్యమును దనశిల్పశక్తితో దీప్తిమంత మొనర్చెను.

ధర్మపక్షులు జైమినిసంశయార్థములకు సమాధానముగా జడోపాఖ్యాన మారంభించి చెప్పెను. అట్లు చెప్పుటలో రెండుపౌరాణికమర్యాదలు పాటింపఁబడినవి. ఒకటి : పౌరాణికుఁడు శ్రోతృప్రశ్నాదికముల కనుగుణమైన యుత్తరమును స్వీయప్రతిపాదిత మైనట్లు చెప్పక, ప్రాజ్ఞులగు పూర్వమనీషులచే నొకసారిచెప్పఁబడి ప్రసిద్ధమై యున్న పురాణవస్తువునే పునఃప్రతిపాదన మొనర్చి చెప్పుట. దీనివలన శ్రోత కాయంశమునఁ బ్రామాణికత్వ మేర్పడుట కెంతయో తోడుపడును. రెండవది : పృచ్ఛకుఁ డడిగినయర్థక్రమమున సమాధానము నీయక సర్వాంశతాత్పర్యమును బోధించు కథార్థములను మిశ్రసమ్మిత ముగాఁ బ్రతిపాదించుట. దీనివలన శ్రోతయందు శ్రవణమననాదికమైన జిజ్ఞాస యేర్పడి యాలోచనామృతసిద్ధి కలుగును. భారతకథార్థవివరణమునందు సంశయార్థములు క్రమానుగుణముగాఁ బ్రసంచించు విధము ననుసరించిన ధర్మపక్షు లిచ్చటఁ దదన్యమైన విధానము ననుసరించి వైవిధ్యమును సాధించిరి.

జడుఁడు భార్గవాఖ్యుఁ డగు బ్రాహ్మణునిపుత్త్రుఁడు. అతఁడు పూర్వజన్మమున బ్రహ్మవేత్తయై శిష్యులకు పరమజ్ఞానము నుపదేశించినగురుమూర్తి. అతఁ డొకసారి యేకాంతశీలుఁడై యున్నయెడఁ బ్రమాదవశమున సజ్ఞానాకృష్టభావుఁడై యకాలమరణము నకు గురియయ్యెను. మఱుపుట్టుకలో భార్గవాత్మజుఁ డయ్యెను. కాని, పూర్వజన్మమున నతఁడు శిష్యులకుఁ బరమజ్ఞానదానము చేసియుండుటచేఁ దత్ఫలముగాఁ బ్రయాధర్మ ములఁ బడయరాని జాతిస్మరణజ్ఞాన మాజన్మమునందుఁ బొందియుండెను. దానిప్రభావ ముచేఁ దండ్రిసంశయార్థము లన్నిటిని నివారించి పితౄణము దీర్చుకొనినాఁడు. భార్గవ జైమినులసంశయార్థములు సజాతీయము లగుటచే ధర్మపక్షులు జడప్రోక్తములైన కథార్థ ముల నెన్నుకొనుట సార్థకమగుచున్నది.

జడప్రోక్తములైన మహార్థములను ద్వివిధముగా విభజింపవచ్చును. అందు మొదటి విధము సంసారపరివర్తన మెల్ల నెఱుకఁబఱచినది. ఇందు ఉత్క్రాంతివిధము, మనుజ శుభాశుభకర్మభోగవివరణము, రౌరవనరకవర్ణనము, జంతూత్పత్తిప్రకారము, నానావిధ నరకవర్ణనము, విదేహయమకింకరసంవాదము, జంతువులకు జన్మాంతరపాపములకుఁ దగుజన్మములవివరణము మొదలగునంశములు కలవు. ఇఁక రెండవభాగము దత్తాత్రేయుఁ డలర్కున కుపదేశించినయుత్తమమైన యాత్మయోగమును జడుఁడు తండ్రికి వివరించిన

విధము. ఇందు దత్తాత్రేయజన్మమాహాత్మ్యములఁ దెలుపుకథలును, అలర్కునిజన్మమును, అతఁడు రాజర్షియైనవిధమును దెలుపుకథలును గలవు. పూర్వభాగశ్రవణమువలన భార్గవునకు సంసారముపై నేవగింపు కలిగినది. ఉత్తరభాగశ్రవణములన నిర్మలినాత్మయోగనిష్ఠ కుదిరినది. జడోపాఖ్యానపూర్వార్ధశ్రవణమువలనే జైమినిమహర్షిసంశయార్థము లుత్తరింపఁబడుచున్నవి. ఉత్తరార్ధ మాసంయమికి పరమాత్మయోగార్థచర్వణము గల్పించి, పరమానందానుభూతి నందించినది. ముని యడిగినది యావం తైనను ధర్మపక్షులవలన నాతని కనంతమైన జ్ఞానభిక్ష లభించినది. అయాచితమైన జ్ఞానసంపత్తిని జైమినిముని కందించు జ్ఞానపక్షుల పరమతాత్పర్యము- జడునివలెఁ దామును పరమజ్ఞానదానము వలనఁ బరజన్మమునఁగూడ జాతిస్మరణజ్ఞానము నొంది యుండవలె నను పవిత్ర సంకల్పమేమో !

పంచలక్షణలక్షిత మైనదియును, మార్కండేయ మహర్షిచేఁ బూర్వము క్రోష్టుకికిఁ జెప్పఁబడినదియును నైన పురాణప్రధానభాగమునకు జడోపాఖ్యాన మొకవిధమైన పూర్వరంగముగఁ బొడగట్టుచున్నది. సంసారచక్రభ్రమణ రహస్యమును, ఆత్మయోగవిధానము నెఱిఁగిన తాత్త్వికవేత్తగాని సర్గప్రతిసర్గాదికమైన ప్రపంచసృష్టిస్థితిలయాత్మక చరిత్రమును దత్త్వదృష్టితో నీక్షింపఁజాలఁడు. అట్టి సమగ్రదృష్టినిఁ బ్రసాదించు ప్రరోచన మీజడోపాఖ్యానమున నంతరింపఁబడియున్నది. నరుఁడు జన్మాంతరపుణ్యాపాపముల ననుభవించువిధమును, ఇహలోకమునం దొనర్చు పాపపుణ్యములకు ఫలముగాఁ బరలోకమునందు నరుఁ డనుభవించు నరకనాకాదిభోగములును, ధర్మాధర్మస్వరూపపరిజ్ఞానమును, ప్రవృత్తినివృత్తికర్మద్వయఫణితులును బఠిత కీయుపాఖ్యానపఠనమువలనఁ గరతలామలకము లగుచున్నవి. ఏతత్సంస్కారము భావిపురాణకావ్యార్థనిర్ణయసామర్థ్యమును బఠితకందించును.

జడోపాఖ్యాననిర్మాణము సంశ్లిష్ట మైనది. జడుఁడు తండ్రికి నాత్మయోగము బోధించునెడ దత్తాత్రేయాలర్కోపాఖ్యానముల నెన్నుకొనినాఁ డని తెలుపఁబడినది. ఇందు ప్రధానప్రతిపాద్యవస్తువు యోగబోధమాత్రమే. దానినే చెప్పి యూరకున్నచో నుద్దిష్టఫల మేర్పడుట కెట్టియిబ్బందియు నేర్పడదు. కాని, పురాతత్త్వజిజ్ఞాసువు లైన పౌరాణికులు కథామూలము నెత్తుకొని చెప్పుట పరిపాటి. ఇచ్చటఁగూడ నట్టిమర్యాదయే పాటింపఁబడినది. దత్తాత్రేయుఁడు గురువు. అలర్కుఁడు శిష్యుఁడు. అతఁ డతనికి బోధించినది యాత్మయోగము. పురాణమునం దిట్టివస్తువు గైకొనఁబడినప్పుడు మొదటఁ దద్గురుజన్మహేతువును, అతనియాత్మోన్నత్యమును, మహిమయును వర్ణించుటయు, నాపై నాతని యుపదేశమును గ్రహించెడి శిష్యునిపుట్టుపూర్వోత్తరములను, అతనియధికారమును, అతఁ డట్టియుపదేశము నొందుటకుఁ గారణములైన సన్నివేశములను, ఉపదేశవిధివిధానాదులను, దదాచరణఫలాదులను వర్ణించుట కానఁబడును. ఇట్లావిషయముయొక్కకార్యకారణరూపమైన సర్వపురాణకథార్థములను బరిశీలించుట పురాణకథాలక్షణము. దీనివలన జడోపాఖ్యానమున నీక్రిందికథలు చోటుచేసికొనినవి. అవి :

| కథ | ప్రయోజనము |
|---|---|
| 1. పతివ్రతకథ. | — దత్తాత్రేయజన్మమునకు మూలహేతువులను నిరూపించుట. |
| 2. అనసూయాపాతివ్రత్యమాహాత్మ్యము. | — దత్తాత్రేయజన్మము. |
| 3. దత్తాత్రేయతపశ్చర్య. | — దత్తాత్రేయుని యోగాచార్యాధికారనిరూపణము. |
| 4. కార్తవీర్యచరిత్రము | — దత్తాత్రేయమాహాత్మ్యము. |
| (i) జంభాసురవధ. (అంతర్గాథ) | — దత్తాత్రేయమాహాత్మ్యము. |
| 5. కువలయాశ్వచరిత్రము. | — అలర్కునిజన్మహేతువు. |
| 6. మదాలసామాతృత్వము-ధర్మప్రబోధము. | — అలర్కునియందు ప్రవృత్తి నివృత్తి ధర్మాచరణవ్యుత్పత్తి స్థాపనము. |
| 7. అలర్కపట్టాభిషేకము | — ధర్మనిష్ఠ. |
| (i) కాశీరాజదండయాత్ర. | — అలర్కునిర్వేదహేతువు. |
| 8. దత్తాత్రేయాలర్కసంవాదము | — ఆత్మయోగబోధ- అలర్కుఁడు యోగసిద్ధిఁ బొందుట. |

అంతర్గాథాబాహుళ్యముచే జడోపాఖ్యానోత్తరభాగ మతిసంశ్లిష్టమై యున్నది. అయినను ఉపాఖ్యానములన్నియు రసవంతములును, విజ్ఞానప్రదములును నై యొప్పుచుండుటచేఁ బఠిత కిసుమంతయు విసువు జనింపనీయని యాసక్తి కలిగించునట్టివై యున్నవి. వానిలోఁ బసిద్ధికెక్కిన యుపాఖ్యానములందలి యాఖ్యానశిల్పవైభవమునుగూర్చి యిచ్చటఁ గొంత ముచ్చటింపఁబడును.

**పతివ్రతకథ :**

పతిసేవామహత్త్వమును బ్రతిపాదించెడి ఈపతివ్రతకథ జగత్ప్రసిద్ధిఁ గాంచినది. పేరులేనిపేరంటాలుగా నీపురాణమున నున్న యీసాధ్వీమణి సుమత్యాదినామములతో బహుపురాణములందుఁ గీర్తింపఁబడినది.

మారన యీయుపకథను మూలకర్తకంటె సామర్థ్యముతో నిర్వహించెను. ఈకథలోనిప్రాణము కౌశికసతిని పతివ్రతామతల్లిగా నిరూపించుటయందును, దానిని వ్యంగ్యమార్గమున నిర్వహించుటయందునుఁ గలదు. మారన యాకథాప్రాణమును బట్టెను; దానిని మూలాతిశాయిగాఁ బ్రపంచించెను.

కౌశికసతి పుణ్యప్రదమైన నడవడికఁ గలది; సుగుణవతి; సద్వంశసంజాత, ప్రతివ్రతాచరణకోవిద; సౌందర్యరాశి, నిర్మలినలతాంగి; ఆత్మవిభుని దైవముగా నెంచునది. అమె భర్తపట్ల పచరించు నిత్యభక్తిప్రపత్తులకు జనులెల్ల జూమెను జూచి ముచ్చటపడుచుందురు (2 156). ఇట్లు వర్ణించుటచే మారన యప్పతివ్రత నట్లుతీర్చిదిద్దినహేతువుల

నెన్నింటనో పరిచయము చేసెను. ఆమె తనసాంసారికజీవితమును సంతతానందసుందర ముగా నొనర్చుట కెన్నివ్రతములు చేసినదో ఎంతసదాచారసంపత్తిని గడించినదో ' పుణ్య చరిత్ర ' యనుటలో మారన పొదివిపెట్టినాఁడు. సంతతసదాచారపారీణత్వ మామెయందు సద్గుణసముదాయమును స్థాపించినది. అందుచే నామెను సాధ్వి యని పేర్కొనినాఁడు. అట్టిసదాచారమును నిట్టిసద్గుణసంపదయు నొక్కసారి యూడిపడునవికావు. ఆమె పుట్టి పెరిగినస్థలమునం దట్టిసంస్కృతివాతావరణము వెల్లివిరియవలెను. ఆకుటుంబము పతి వ్రతామతల్లుల కాటపట్టయి యుండవలెను. దానిని ' సత్కులజ ' యను విశేషణప్రయో గముచే మారన సూచించెను. అపైన మారన వాడిన ' పతివ్రతాచరణకోవిద ' యను విశేషణ మత్యంతప్రధానమైనది. అది పూర్వవిశేషణములన్నింటికిని ఫలరూపమైనది. పతిని దైవముగా భావించి చేయునర్చనాదికము పతివ్రతము. దానిని నిర్వహించు పద్ధతు లనుగూర్చిన సర్వవిషయము లామెకుఁ గరతలామకములు. అట్లగుటచేఁ బతిదైవమును వివిధావస్థలయందును బ్రసన్నునిఁ జేసికొనునేర్పామె కథ్యానసిద్ధము. ఆమె భారతీయ సతీపదమున కమూల్యోదాహరణము. ఆమె సుందరియు, నిర్మలినలతాంగియు నై పతి యనురాగమునకుఁ బాత్రురా లగుచున్నది. రూపవతియైన యానిర్మలాంగి హేయరసము మూర్తి కట్టిన ట్లున్న భర్తను దైవముగా భావించి భక్తినిఁ బ్రచురించు సచ్ఛీలము గలిగి యుండుటచేతనే జను లామె యన్న యలవిమాలిన యభిమానము చూపుచుండిరి. లోకము మెచ్చినపాతివ్రత్య మామెది ! అదియే ధర్మశీలమునకు గీటురాయి. అనసూయ మొదలుకొని ఆదిదేవునివఱ కామెపాతివ్రత్యమహిమను మెచ్చుకొనుసన్నివేశమును గల్పింపఁబోవు మారన యి ట్లీమెను పతివ్రతాచరణకోవిదగను, జనస్తుత్యగను జిత్రించి భావికథను బ్రసన్నము చేసియున్నాఁడు.

మారన మూలము ననుసరించినట్లే యనుసరించెను. అచ్చటచ్చట రమణీయార్థ ప్రతిపాదకములైన పదముల ననర్ఘరత్నములవలెఁ దాపెను. అవి కథార్థములపై నపూర్వరుచిని వర్షించెను. 2.157,158 పద్యములలో నట్టివైలక్షణ్య మున్నది. ప్రాణ నాథునిఁ బ్రీతునిగాఁ జేయుటకై యవ్వనిత శ్రమ యనుకొనకసర్వవిధములైన సేవలు చేసి నది. చేయుటలో నెట్లోచేయుట ప్రధానము కాదు. కోమలముగాఁ జేయుటలో నున్నది మెళ కువ. వ్యాధిపీడితుఁడైన భర్తపట్ల అది యత్యవసరము అది యొకకళగా బ్రాచీనులు భావించిరి. భక్తియుక్తురాలై పరిచర్యలుచేయు నాసాధ్వి తత్సేవావిధానములోని మార్ద ముచేఁ బతిచిత్తము నలరించిన దనువ్యంగ్యము 'కోమలి' యను పదమున మారన సాధించినాఁడు. కౌశికుఁడు కోపస్వభావుఁడై కుశికవంశమర్యాదను నిలిపినాఁడు ! ఆమె యెంత చేసినను రక్తికిని రాణింపునకును రాలేదు. ఐనను నామె త్రికరణశుద్ధిగాఁ బతిసేవ చేసెను. ఆమె మనసునఁ గోపపడదఁట ! నోట మాటాడదఁట ! వినయముతో నెల్లప్పుడు నానతయై మెలఁగునఁట ! మూలమున లేని యావైశిష్ట్యము ననువాదమున మారన సాభి ప్రాయముగా సాధించినాఁడు. దీనిసార్థక్యమును సూర్యోదయము కాకుండునట్లు నప్పతి వ్రత శాసించిన పద్యమున వ్యజింపఁజేసినాఁడు.

చ. అని ముని శాప మిచ్చుటయు నావనితామణి శోకతప్తయై
యినుఁ డుదయింప మత్పతికి నెగ్గు ఘటిల్లెడు నట్లయేని న
య్యినుఁ డుదయింపకుండు నిఁక నేను బతివ్రత నైన నన్న న
య్యినుఁ డుదయింప నోడె విను మిట్టివ సుమ్ము సతీప్రభావముల్.(2.169)

ఈపద్యమునఁ గౌశికసతి 'నేను పతివ్రతనైనచో నినుఁ డుదయింపకుండుగాక!' యనెడు శపథము - అమూలకము. త్రికరణశుద్ధిగాఁ బతిని సేవించిన సాధ్వికాని క్లిష్టసమయము లం దిట్టి గట్టిప్రతినలు పట్టఁజాలదు. ఈరహస్యమును కవి మఱల ననసూయాదేవిప్రతిన యందుఁ దేటపఱచినాఁడు.

తే. మనముఁ బలుకును జెయ్వు సమత్వ మొందఁ
బతికి శుశ్రూష సతతంబు భక్తిఁ జేయు
దాన నే నైతినేని యీధరణిసురుఁడు
ప్రాణయుతుఁడు గావుత మని పల్కుటయును. (2.196)

మూలమున నిచ్చట త్రికరణశుద్ధినిగూర్చిన ప్రసక్తి కలదు. త్రికరణశుద్ధితోఁ జేసిన పతిసేవలే పాతివ్రత్యసిద్ధికి బరమసోపానములు. మూలకర్త యిచ్చట నిక్షిప్త మొనర్చిన రహస్యము కథాప్రాణము. కావుననే మారన దీనిని కథాకథనశిల్పాంగముగా గ్రహించి యొకవిశిష్టసమన్వయసౌలభ్యమును సంతరించినాఁడు. ''ఇట్టివసుమ్ము సతీప్రభావముల్'' అను నర్థాంతరన్యాసముచే మారన పతివ్రతలయందు సర్వసాధారణముగా ధర్మతేజో రూపమున వెలుఁగొందు సతీప్రభావము ప్రదీప్తమగున ట్లొనర్చి కథను కాంతిమంత మొనర్చినాఁడు.

**కువలయాశ్వచరిత్రము :**

మిత్రసమ్మితమైన పురాణమున మిత్రధర్మప్రబోధాత్మకమైన యీ యుపాఖ్యానము చెప్పఁబడియుండుట కడుసమంజసముగా నున్నది. ఉత్తములును, ఉత్సాహవంతులును నైన మిత్రులను బడయుటవలన మానవుఁడు పొందెడు విశేషలాభముల నిందు పురాణకర్త ప్రశంసనీయముగా వర్ణించినాఁడు. మిత్రధర్మమును చిత్తశుద్ధితో నిర్వహించిన ధర్మవీరుఁడు సర్వధర్మాచరణసమర్థుఁ డగుటయే కాక దైవప్రసాదలబ్ధిని గూడ పడయగలఁ డనియు నిందు నిరూపించినాఁడు.

ఋతధ్వజుఁ డిందు కథానాయకుఁడు. అతఁడు భూతలరసాతలవాసు లైన సకల విప్రవైశ్యక్షత్రియనాగకుమారుల నెల్లరఁ జేర్చుకొని గొప్ప మిత్రమండలి నిర్మించెను. అందతఁడు దివాకరునివలె వెలుఁగొందెను. అతనిమిత్రులలో నెన్నఁదగినవా రశ్వతరాత్మజులైన నాగకుమారులు. తాళకేతుని మాయవలన నకాలమృతిఁ బొందిన మదాలసను గూర్చి పరితపించు ఋతధ్వజునిచరిత్రమును వారు తండ్రి కెఱిఁగించిరి. అశ్వతరుఁడు మిత్రధర్మము మూర్తికట్టిన మహితాత్ముఁడు. మదాలసను బ్రతికింతు నని ప్రతినఁబూని,

యతఁడు సరస్వతీదేవి నుపాసించి సంగీతవిద్యను సాధించెను. దానితోఁ బరమశివుని మెప్పించి మదాలసను బుత్త్రికగాఁ బడసెను. తనపుత్త్రిలపట్ల పచరించిన ఋతధ్వజుని మిత్రకృతి కుపకృతిగా నామె నాతనికి సమర్పించి సంతుష్టిపడెను. అశ్వతరుఁడు మదాలస జాతిస్మరయుఁ, బరమయోగినియు, యోగిమాతయు నగునట్లు పరమశివుని వలన వరము వడసెను. ఆవరసిద్ధియే యలర్కునివంటి రాజర్షి యుదయించుట కుపపత్తి యైనది. ఇట్టియుపాఖ్యాన మలర్కోపాఖ్యానమునకు బీజభూత మైనది.

ఋతధ్వజుఁడు మైత్రీధర్మనిష్ఠాపరుఁడై భార్యావియోగమువలనఁ గలిగిన గార్హస్థ్య ధర్మవిరతినుండి తనను తాను రక్షించుకొని సాఫల్యమునొందఁ గలిగె నని యీ కథ యందలి సారభూతమైన తాత్పర్యము. అతని గార్హస్థ్యధర్మమును పునఃప్రతిష్ఠించినది యశ్వతరుఁడు; అతనికి యోగినియు, యోగిమాతయు నగునట్టి మదాలసను గని యిచ్చినది యశ్వతరుఁడు; అతని నంతటి యదాత్తకార్యసాధనమునకుఁ బ్రేరేచినది ఋతధ్వజునిమైత్రీధర్మము. కావున ఋతధ్వజునిధర్మమూర్తిని సర్వాంగసుందరముగాఁ జిత్రించుట యాకథాశిల్పమున ముఖ్యాంశ మగుచున్నది.

ఋతధ్వజుని పుణ్యచరిత్రము ధర్మత్రయమునకు సంగమస్థలమై ప్రయాగవలెఁ బవిత్రమై రాణించుచున్నది. మిత్రధర్మము, రాజధర్మమ, ఆశ్రమధర్మము- అనునవి యతనిలో రసమూర్తు లయిన మూఁడుధర్మములు. వీనిసమగ్రస్వరూపసంవిధానమే ఋతధ్వజ ధర్మమూర్తిసాక్షాత్కారము.

ఋతధ్వజునియందు మైత్రీధర్మము స్వభావసిద్ధ మైనది; రాజధర్మము పరంపరా గత మైనది; ఆశ్రమధర్మము వయోనుగుణ మైనది. వీనియందు స్థాయిత్వము మైత్రికిఁ గలదు. తదితరముల కంగత్వ ముపగమ్యమానము. ఈయర్థము తేఁటపడునట్లు కథార్థ ములు సంధించుట కథనశిల్ప మనఁబడును.

ఋతధ్వజుని మైత్రీగుణాభివర్ణనముతోడనే యీయుపాఖ్యాన మారంభ మగు చున్నది. సమానవయోగుణయోగ్యులైన మిత్రులతో నారంభమైన యాతనిచెలిమి నాగ కుమారుల సాహచర్యమునఁ బరిణతిఁజెంది ఋతధ్వజుని కధికప్రమోదతత్పరత్వమును గల్పించిన దని వర్ణించి మారన నాయకచిత్తవృత్తిపరిపాకమును బ్రతిష్ఠించినాఁడు. నాగ కుమారులతో నతఁడు స్నేహభావోద్దీపితుఁడై విహరించినవిధము నభినివేశముతోఁ గీర్తించినాఁడు.

చ. కొలువుగ మజ్జనాంబరవిభూషణచందనమాల్యభోజనా
దిలలితభోగలీలల నుదీర్ణరసాన్వితగీతవాద్యవి
ద్యల బహుకావ్యనాటకకటాక్షవినోదములన్ గజాశ్వశి
క్షల వివిధాస్త్రశస్త్రనయశాస్త్రపరిశ్రమనై పుణంబులన్.

క. పరిహాసవచనరచనల
సరసకళావ్యసనముల నజస్రము మైత్రీ

పరిణతి వెలయఁగను ఫణీ
శ్వరతనయులతోడఁ గూడి వారనివేడ్కన్.

తే. తగిలి ప్రొద్దులు పుచ్చుచు ధరణినాథ
తనయుఁ డధికప్రమోదతత్పరత నొందె... (2.261-263)

మూలమున నీభావములు వివిధరాజకుమారులతోడను, నాగకుమారులతోడను గలసి విహరించుపట్ల పంచి రచింపఁబడియున్నవి. (16.4,5,11,12). మారన- ఋతధ్వజుఁడు రాచకొమరులతోఁ గలసి బహువిధవిహరణములు చేసెననిమాత్రమే పేర్కొని, నాగకుమారులతోడి యతని మైత్రిని విపులముగా వర్ణించెను. మైత్రియందు క్రమపరిణామభావమును బ్రదర్శింపఁదలఁచుటచే మారన యీమార్పు చేసి, సార్థక్యము సాధింపఁగలిగెను. "భోగలీలలు" అనుపదమునఁ గృతకబ్రాహ్మణవేషధారులైన నాగకుమారులఫణివిలాసములు వ్యంజింపఁజేసెను. 'ఫణీశ్వర'తనయులతోఁ బరిహాసవచనరచన లొనర్చె ననుటచే శబ్దశాస్త్రపారగుఁడైన యాదిశేషునివంశజులతో శాబ్దికచమత్కారములు చేసెనను విశేషార్థము కలిగించెను. ఇట్టివి మారనరచనలోని జిలుగుశిల్పములు!

ఈయుపాఖ్యానమున ఋతధ్వజుఁడు కువలయాశ్వుఁడైనవిధమును మదాలసాద్వితీయుఁడైన విధమును, మదాలసావియోగదుఃఖము ననుభవించినవిధమును, క్రమముగా నాగకుమారులు అశ్వతరున కెఱిఁగించినట్లు చిత్రించుట మఱియొక కథనశిల్పము. దీనివలనఁ గథ కాలక్రమమును గాక కథాకార్యకారణక్రమము ననుసరించి నిర్మింపఁబడిన దని స్పష్టమగుచున్నది. ఈభాగమున గాలవాశ్రమసంరక్షణమునందు ధర్మవీరమును, పాతాళకేతుసంహారమున యుద్ధవీరమును, మదాలసావివాహమున లలితశృంగారమును ఋతధ్వజుఁడు ప్రదర్శించి, తాళకేతునిమాయచే భార్యను గోల్పోయి, దుఃఖించియు ధైర్య మూని మఱియొకపెండ్లి చేసికొనక నియతుఁడై యుండుటయందు ధర్మనిష్ఠను జూపించిన ఘట్టములు కలవు. ఋతధ్వజమైత్రీనైపుణ్యమున కలరి యతని కుపకృతిఁ జేయ నుత్సహించుచున్న నాగకుమారులముఖమున నతనిస్నేహాతిశయము కీర్తింపఁబడుటవలన వారితండ్రి యైన యశ్వతరునియందు మదాలసాపునరుజ్జీవనయత్నమున కనువైన యాదరోత్సాహములు కలుగుట కవకాశము సహజముగా నేర్పడినది. అంతియకాక ప్రధానోపాఖ్యానమున నీభాగ ముపకథావిస్ఫూర్తితోఁ దోచి మైత్రీధర్మప్రదీప్తి కెంతయుఁ దోడ్పడి కథాఫలమున కనుకూలమైనమార్గము నావిష్కరించుచున్నది.

ఈభాగమును నాగకుమారులచేఁ జెప్పించుటకుఁ బూర్వము రసాతలమున నీప్రసక్తిఁ దెప్పించుట కేర్పఱిచిన పూర్వరంగ మపూర్వకథాశిల్పరంగముగా శోభించుచున్నది. అది నాయకసుగుణప్రభ కెత్తిన కీర్తిపతాక యగుటయే కాక, భావికథాశ్రవణమునకై పతితలయొక్క హృదయాంతరాళములనుండి యుత్కంఠ నుబికించు నైంద్రజాలికయంత్రమువలె భాసించుచున్నది. పగలంతయు ఋతధ్వజునిసాంగత్యమునఁ గడపి

నాగకుమారులు రాత్రివేళలుమాత్రమే రసాతలమునఁ గడపుచుండిరి. ఒకనాఁడు తండ్రి పుత్త్రులనుఁ గనుఁగొని భూతలమున నెవ్వరితోఁ గలసి తిరుగుచుండిరో జెప్పు డని ప్రశ్నించెను. ఆకుమారులు తమప్రాణమిత్త్రుఁడైన రాజకుమారునిగుణకీర్తన మొనర్చిరి. అయ్యాహికులేశ్వరునకు ఋతధ్వజునిపై ననురాగము పొంగిపొరలునట్లు మాటలాడిరి. వారిమాటలు వినిన యశ్వతరుఁ డబ్బురపడి యాశత్రుజిత్తనయుని నిట్లు ప్రశంసించెను.

క. అరయఁగ నెవ్వనిపుత్త్రుఁడు
పరోక్షమున నిట్లు పొగడఁబడు సతతము స
త్పురుషులచే నమితగుణో
త్తరుఁడై యాతండు ధన్యతముఁడు తలంపన్.

తే. చెలులుఁ బగతురు నెవ్వనిచెలితనంబు
కలిమితనము గీర్తింతురు కడఁగి యెపుడు
నట్టిపుత్త్రునిచే సుగుణాఢ్యులార!
పుత్రవంతుఁడు నాఁ బెంపుఁ బొందుఁ దండ్రి.

క. ఉపకారపరుఁడు మైత్రీ
నిపుణుఁడు గుణయుతుఁడునైన నృపతనయునకున్
విపులతరప్రీతి న్బ్రి
త్యుపకారోత్సవము మీరు నొనరించితిరే?

చ. మనసదనంబునం గల సమంచితకాంచనరత్నవస్తువా
హనము లశంకత న్నృపవరాత్మజుచిత్త మెలర్పఁగాఁ దగం
గొని చని యుండు జీవితము కుచ్చితమై చను బుత్త్రులార! నె
మ్మి నుపకృతిప్రవీణుఁ దగు మిత్త్రునకుం బ్రియ మాచరింపమిన్.

(2. 268-271)

ఇట్లావేశముతోఁ బుత్త్రులకుఁ బ్రబోధించినాఁడు. మైత్రి యన్నచో మేనికండలు తటిగిపెట్టు నుత్సాహమూర్తి యశ్వతరుఁడు. నాగకుమారులు ఋతధ్వజుఁడు కృతార్థుఁ డనియు, జ్ఞాని యనియు, నతనికిఁ దా మీయఁజాలిన వస్తు వేమియు లేదనియుఁ జెప్పుచు, జేసిపెట్టఁ దగిన కార్య మొక్కటి కల దనియు, నది హరిహరహిరణ్యగర్భాదులకుఁ దక్క దక్కిన వారి క సాధ్య మనియుఁ బేర్కొనిరి. అశ్వతరునిచెవులకు 'అసాధ్య' మను మాట వినఁబడరాదు. సమధికతమవిహితోద్యోగమున మానవుఁడు సాధింపలేని సిద్ధి లేదని యతని గాఢవిశ్వాసము. త్రిమూర్తులకు మాత్రమే సాధ్య మనియు, నితరుల కసాధ్య మదియుఁ, జేతులు ముడుచుకొనియున్న పుత్త్రులను జూచి సహింపలేకపోయినాఁడు. తనమేనిలో తురంగలించుచున్న యుత్సాహదీప్తిని దివ్యసందేశముగా నుచ్చరించినాఁడు.

క. ఇది సాధ్య మగు నసాధ్యం
బిది యనఁగా నేల కార్య మీడితధిషణా
స్పదు లై తగ నొనరించిన
నది సిద్ధిం బొందు నిశ్చలారంభునకున్.

క. అమరత్వం బమరేశ
త్వ మమరపూజ్యత్వ మను పదంబులు వరుస
న్సమధికతమవిహితోద్యో
గమునన యవి తమ్ముఁ బొందఁ గాంతురు మనుజుల్.

ఆ. అరుగకుండెనేని గరుడఁ డైనను నొక్క
యిడుగు నరుగలేఁడు కడఁగి చీమ
యైన నరుగఁ దొడఁగె నేని యనేకస
హస్రయోజనమ్ము లరుగుచుండు.

క. భువి యెక్కడ దివి యెక్కడ
ధ్రువుఁ డీభువినుండి కాడె ధ్రువ మగుపదమున్
దివిఁ బడసెం గావున స
ద్వ్యవసాయికిఁ బడయరానియదియును గలదే?

వ. అని యశ్వతరుం డక్కుమారులకుం జేయవలయు నసాధ్యకార్యం బెయ్యది దాని నెఱిఁగింపు (డనెను). (2. 275-279)

కార్యసిద్ధికి నిశ్చలాభరంభము కావలెను. దాని కీడితధిషణాన్విత మైన సమధికోద్యోగము తోడుపడవలెను. అప్పుడు మానవుల కసాధ్య మనునది లేకపోగా నమరపూజ్య పదము సైత మవలీలగా లభించును. యత్నహీనుఁడు నిష్ఫలుఁ డగును. యత్నశీలి కాని గరుత్మంతుఁ డైనను ఒక్కయడుగు వేయఁజాలఁడు. కాని, యత్నశీలి యైన చీమ వేయియామడ ప్రాకఁగలుగుట యందులకు దృష్టాంతము. ధ్రువుఁడు సద్వ్యవసాయము వలననే నక్షత్రమండలమున నధివసింపఁ గలిగెను. ఇట్టి యశ్వతరునిప్రబోధము హేతుక్రమబద్ధమై నిదర్శనాత్మకముగా నుండి హృదయాకర్షక మగుచున్నది. ఈభాగము చదువుటతోడనే పఠితహృదయమున కయ్యసాధ్యకార్యస్వరూపముఁ దెలిసికొనవలయు ననియు, స్వరూపస్వభావములఁ దెలికయే యసాధ్యకార్యమును సాధింపఁ దలఁచిన యశ్వతరునికార్యసాధనపాటవమును నెఱుఁగవలె ననెడి యుద్వేగము విద్యుత్తువలెఁ జెలరేగును. దానితోఁ గథ ముగియునంతవఱకు పఠిత యూపిరి త్రిప్పుకొనఁజాలఁడు. కళాపూర్ణోదయకావ్యారంభము చేయుటకుఁ బూర్వము పింగళి సూరన యిచ్చట గుంటయో నమఃలు దిద్దుకొని యుండవచ్చునేమో?

నాగకుమారప్రోక్తమైన కథాభాగమునఁ బాత్రములు ఋతధ్వజకీర్తనము చేయు ఘట్టములను మార్కన సాభినివేశముగాఁ దెలుఁగుసేయుట గమనార్హము. ఈకథలోని

యితరాంశములతోఁ బోల్చిచూచినచో మూలముతోఁ దులఁదూగునట్లుగనో లేక విపులముగనో రచించిన కథాభాగములు ఋతధ్వజవర్ణనాఘట్టములే. మిగిలినవానిని మారన సంగ్రహముగాఁ గుదించివైచెను. ఋతధ్వజకీర్తన మొనర్చిన యవసరము లీకథలో నైదు కలవు.

1. ఆకాశవాణి గాలవునకుఁ గువలయాశ్వము నధిరోహింప నర్హుఁడు ఋతధ్వజుఁ డని చెప్పుట.
2. పాతాళకేతునితో యుద్ధము చేయునవసరమున నతనియందు దీపించిన రణోత్సాహ వర్ణనము.
3. మదాలసాద్వితీయుఁడై విజయలక్ష్మిని సాధించిన ఋతధ్వజుని శత్రుజిత్తు కీర్తించుట.
4. పుత్త్రమరణవార్త వినిన రాజదంపతులు ఋతధ్వజుని వీరగుణములను గీర్తించుట.
5. ఋతధ్వజుఁడు పునర్వివాహ మాడ నని ప్రతినఁబట్టుట.

వీనియం దన్నిటను వర్ణించిన నాయకగుణము లన్నియు వెరసి, యతనిసమగ్రవ్యక్తిత్వము ను బ్రతిపాదించుచున్నవి.

ఉ. 'నెట్టన సన్మునీశ్వరులు నిర్భయభావముఁ బొంద దైత్యులం
గిట్టి వధించి ధర్మమును గీర్తియు శౌర్యముఁ దేజము న్మొగుల్
ముట్టఁగఁజేసి వంశము వెలుంగ జగంబులఁ బేరు గన్న ని
యట్టిసుపుత్త్రుఁ గాంచుటఁ గృతార్థుఁడ నైతిఁ గుమార యెంతయున్:' (2.339)

అని కన్నతండ్రిచేఁ బ్రశంస లందుకొనిన ఋతధ్వజునిజన్మము సార్థక మనుటలో సంశయము లేదు.

నాగకుమారులు చెప్పిన కథ వినిన యశ్వతరునకు మదాలసను బ్రతికించుట యవశ్యకర్తవ్య మని తేటపడినది. దానిని సాధించుట సాధువులైన యాపుత్త్రుల కశక్యమైనది కాని ధీరుఁడైన యాతండ్రికి మాత్రము సుసాధ్యమే యనిపించినది. కథారంభమునఁ బొడకట్టిన యుత్సాహ మిసుమంతయు నతనియందు కనుగంద లేదు. అవేశముతో మఱల నిట్లనినాఁడు :

తే. జనులు మున్నకై పెక్కు యశక్య మని మ
నంబులోపల గ్రుక్కి కార్యంబునందుఁ
బూని యుద్యోగ మొనరింపరేని యెట్లు
దాని సఫలతాఫలతలు దారు గంద్రు.

క. తన పౌరుషంబు వదలక
మనుజుఁడు కార్యం బొనర్ప మానుగ దైవం

బునయందుఁ బౌరుషమునం
దును దత్ఫలసిద్ధి దోఁచుఁ దుల్యస్థితితోన్. (3.47-48)

అని పలికి తత్కార్యసాధనకు నడుము బిగించినాఁడు. అతఁడు కార్యశీలియే కాని గర్వోన్మత్తుఁడు కాఁడు. కావుననే "తత్కార్యంబునకు యత్నంబు సేసెద" నని వినయముతోఁ బలికినాఁడు. అతఁడు వజ్రసంకల్పుఁడు. సదాశివుని మెప్పించి మదాలసను బుత్త్రికగాఁ బడసికాని తిరిగి పుత్త్రిలముఖము చూడలేదు. ఆపైనఁ గువలయాశ్వునిఁ దనమందిరమునకుఁ బిలిపించినాఁడు. అంతవఱ కాతనిమొగ మెట్టిదో చూడలేదాపన్నగపతి. అట్టి యపరిచితమిత్రునికొఱ కట్టియసాధ్యఫలమును సాధించి యుంచినాఁ డా పరహితార్థబుద్ధి. న్యాస ముంచిన ధనమువలె మదాలస నాతనికిఁ దిరిగి యిచ్చివేయునంతవఱ కాతనికి నిద్దురపట్టలేదు. గడపలో నడుగు పెట్టిన ఋతధ్వజుని బిగికౌఁగిట జేర్చినాఁడు; మూర్ధము నాఘ్రాణించినాఁడు. ఉచితాసన మిచ్చి యతనియౌన్నత్యమును గీర్తించినాఁడు. అనుపమమైన వర మిచ్చెద వేడుకొను మని యాప్యాయత యచ్చుపడునట్లు మఱిమఱి యడిగినాఁడు. ధర్మనిష్ఠుఁడైన ఋతధ్వజుఁడు నిర్మలధర్మతత్పరత తనయందు నిత్యమై యుండునట్లు ప్రసాదింప కోరుకొనినాఁడు. అడుగుటతోడనే యహిపతి దాని ననుగ్రహించినాఁడు. మేదినియందుఁ బడయరానిది మఱి యొండేదైనఁ గోరు మని యడిగినాఁ డశ్వతరుఁడు. కువలయాశ్వునిహృదయమున మదాలస మెదలినది. అతఁడు సూటిగాఁ జెప్పలేక నాగకుమారులమొగములు చూచినాఁడు. వా రాతనియింగితము తండ్రికి నివేదించినాఁరు. ఇచ్చుట కింటికిఁ బిలిపించియు నడిగించుకొని కన్నెనిచ్చి మామగౌరవము నిలువఁబెట్టుకొనవలె నని యావృద్ధసర్పేంద్రుని యుబలాటము. మాయబొమ్మ యని మదాలసను ముందుఁ బెట్టినాఁడు. ముట్టుకొనినచో యాయమగు నని రాజకుమారునికిఁ గట్టడిచేసినాఁడు. ఋతధ్వజుఁడు మోహావేశుఁడై మూర్ఛపోయినాఁడు. అచ్చమైన యతనియనురాగ మాయురగపతి కవగత మైనది. మూర్ఛనుండి తేర్చి ముద్దుమురిపెము నడిపినాఁడు. తపములవంటియైన తన తనయను ఋతధ్వజునివామపార్శ్వమునఁ బ్రతిష్ఠించినాఁడు. కర్తవ్యసిద్ధి యైన దని కన్నులయం దానందాశ్రువుల నింపినాఁడు. "జీవితము కుచ్చితమై చనుఁ బుత్త్రులార! నెమ్మి నుపకృతిప్రవీణుఁ డగు మిత్త్రునకుం బ్రియమాచరింపమిన్" అని ప్రతిధ్వనించెడి యశ్వతరుని యంతరాత్మ పఠితయంతరంగమునఁ బ్రతిస్పందించి కథాతాత్పర్యము నుజ్జ్వలతర మొనర్చును. సర్వధర్మము లామైత్రీధర్మమునకు నీరాజనము పట్టును.

నాగకుమారులు కథ నారంభింపక పూర్వము అశ్వతరునివాక్యములం దసాధ్యకార్యసాధనోత్సాహమును బ్రకటించి, మఱల తత్కథాంతమునందును నట్టివాక్యములనే రచించి యతని నంతతోత్సాహచిత్తవృత్తిని వ్యంజింపఁజేయుట యిచ్చటి కథనశిల్పము. ప్రథమోపన్యాసమున వైనతేయాదుల నుదాహరణముగాఁ బేర్కొనుటయు, ద్వితీయోపన్యాసమున నుదాహరణములఁ బ్రత్యేకించి చెప్పక స్వీయవర్తనమే దృష్టాంత మగునట్లు ధ్వనింపఁజేయుటయు నావాక్యరచనాశిల్పమునందలి చమత్కారము.

మారన ఋతధ్వజవర్ణనావసరములందుఁ దప్ప మిగిలినకథ నంతటిని సాధ్యమై నంతవఱకు సంగ్రహముగా రచింపయత్నించె నని పేర్కొనఁబడినది. అందును మారన యౌచిత్యము వీడలేదు. కథాగతమైన యొకపరమప్రయోజనము సాధించుటకొఱకు మారన కొన్నిచోట్ల సంగ్రహరచన కుపక్రమించుట కానఁబడును. అశ్వతరుఁడు సరస్వతీసాంబశివులఁ గూర్చి యొనర్చినస్తుతుల ననువదించినవిధ మిందులకుఁ జక్కని యుదాహరణము. మూలమున సరస్వతీస్తుతి పదునెనిమిదిశ్లోకములలో (21. 31-48) నొనర్పఁబడియుండ దానిలోనిసారార్థములను మాత్రమే గైకొని మారన రెండుకంద పద్యములందును, ఒకవచనమునందును (3. 50-52) గుదించి వ్రాసెను. కాని, యశ్వతరునిశివస్తుతి మూలమున నొకశ్లోకపాదమున మాత్రమే యుండ, దానిని స్రగ్ధరావృత్తమునం దభినివేశముతో వర్ణించెను. ఇట్లు రచించుటలో నొకసామంజస్య మున్నది. అశ్వతరుఁడు సరస్వతీదేవినిఁ బ్రార్థించి సంగీతవిద్య సాధించినాఁడు; దానిచే శివుని మెప్పించి మదాలసను బడసినాఁడు. కథాప్రయోజనదృష్టితోఁ గాంచినచో సంగీతలబ్ధి పరమేశ్వరప్రసాదలబ్ధికి నుపాంగమే కాఁగలదు. అంగికంటె నంగము నధికముగా వర్ణింపరా దను న్యాయము ననుసరించి వాణీస్తోత్రమును సంగ్రహపఱచియు, శివస్తోత్రమును బెంచియు రెండింటికిని సమానగౌరవము మారన కల్పించి యౌచిత్యము పాటించినాఁ డని చెప్పవచ్చును.

రసభావవివరణములపట్ల మారన సంగ్రహరచనము నాశ్రయింపలేదు. శృంగారరసపోషణదృష్టితో మారన ఋతధ్వజదర్శనమున మదాలస పొందిన మదనవికారముల వర్ణనము మూలాతిశాయిగా నొనరించెను.

మూలము :

శ్లో. ఉత్తస్థౌ చ మహాభాగా చిత్తక్షోభ మవాపసా
లజ్జావిస్మయదైన్యానాం సద్య స్తన్వీ వశంగతా। (19. 21)

అనువాదము :

చ. అమరకుమారసంభవుని నా నృపనందను బిట్టు గాంచి సం
భ్రమము భయంబు విస్మయము రాగము లజ్జయు నొక్కమాఱు చి
త్తము గబళించినం దలరి తల్పము దిగ్గన డిగ్గి పోయి ప
ద్మముఖి మనోజుఁ డార్వ సఖిమాటున నిల్చెఁ బ్రకంపితాంగి యై.

చ. నిలిచి కుమారుమూర్తిపయి నెక్కొనుచూడ్కులఁ గ్రమ్మఱింపఁ వే
డ్కలు గురిపింపఁ గోర్కు లాగిఁ గప్పిన నేరక చిక్కుపాటునం
దలరి మనంబులోన ధృతి దర్పకవీరునియేయుపువ్వుఁదూఁ
పులఁ బొరివోయినం గలఁగి పొల్తుక యొంతయు వీతలజ్జ యై.

తే. తనవిలోచనమధుకరద్వయము గరము
దమకమున నక్కుమారుసౌందర్యమధువుఁ

గ్రోలికొనఁగ మెచ్చులు మదిఁ గీలుకొనఁగ
నంబుజాస్య శిరఃకంప మావహిల్ల. (2.297-299)

మూలమున లజ్జావిస్మయదైన్యాదిభావములచేఁ జిత్తక్షోభ కలిగిన దని మాత్రము పేర్కొనఁబడియున్నది. సంచారిభావనామనిర్దేశమాత్రమునఁ బఠితకుఁ దత్పాత్రచేష్టాదికములును, తద్వ్యంజితము లగు రసభావాదులును స్పష్టము కావు కావున మారన భావనామనిర్దేశముతో నాగక యనుభావాదివర్ణన మొనర్చి సహృదయునకు చైతన్యవంత మగు విభావమును ప్రత్యక్షీకరింపఁ జేసినాఁడు. ఇందు కవి మూలమున లేని శిల్పసౌందర్యము నెంతయో కల్పించినాఁడు. ఋతధ్వజదర్శనముచే మదాలసయం దుదయించిన రసభావానుభావాదులను మూలమునకంటె నొక క్రమవికాసపరిణామనిర్దేశక మగు విధముగా సంధాన మొనర్చెను.

మూలమున నున్న క్రమ మిది: లజ్జ ⟶ విస్మయము ⟶ దైన్యము ⟶ వితర్కము ⟶ వెచ్చనూర్చుట (అనుభా.) ⟶ మూర్ఛ (అవస్థ).

తెలుఁగున నున్న క్రమ మిది: సంభ్రమము (అనుభా.) ⟶ భయము ⟶ విస్మయము ⟶ రాగము (రతి) ⟶ లజ్జ ⟶ అవహిత్థ (ఇవియన్నియు నొక్కమాఱుగాఁ జిత్తమును గబళించినవి-ఆపైన) ⟶ సంతోషము (మదము) ⟶ ఔత్సుక్యము ⟶ రతి ⟶ దైన్యము ⟶ చింత ⟶ ధృతి ⟶ రూపాలోకనము (అవస్థ) ⟶ మెచ్చుకోలు ⟶ శిరఃకంపము (అనుభా.) ⟶ వితర్కము ⟶ వెచ్చనూర్చుట ⟶ మూర్ఛ (అవస్థ).

నాయిక మూర్ఛావస్థ నందుకొనుటకుఁ బూర్వము వర్ణితమైన సంచారిభావపరిణామము, శృంగారానుభావాద్యవస్థానుసంధానము మూలమునందుకంటెఁ దెలుఁగున శాస్త్రసమ్మతముగను, అనుభవసహజముగను నున్నది. లజ్జ యను భావ ముదయించిన తరువాత విస్మయము కలిగిన దనుట కంటె విస్మయానంతరము లజ్జ కలిగిన దనుట యుచితము. విస్మయానంతరము లజ్జ కలుగుటకు మధ్య రాగోదయమత్యావశ్యకము. రాగము వినా శృంగారలజ్జోదయము లేదు. 'బిట్టు' చూచుటచేఁ గలుగునది సంభ్రమము. అకస్మాత్సన్నివేశఘటనమువలన భయము, అపూర్వసుందరాకారదర్శనమున విస్మయము, నాయకునిపొందుఁ గోరుటచే రాగము జనించును. కన్యకు సహజమైన రాగోదయచిహ్నము లజ్జ. ఆపైన నవహిత్థ. అవియన్నియు సంచారులై రత్యుదయమునకును, దత్పుష్టికిని హేతుభూతము లగుచున్నవి. నాయికావిలోచనమధుకరద్వయము నాయకసౌందర్యమధువుఁ గ్రోలిన దనిన రూపకాలంకారము వస్తురామణీయకమును బోషించుటయే కాక శృంగారరసచర్వణోన్ముఖ మైన పఠితహృదయమునకు వ్యంగ్యార్థప్రదానము చేయుచున్నది. నాయికామూర్ఛావస్థకుఁ దగిన పూర్వరంగము తెలుఁగున సుష్ఠుగా సృజింపఁబడినది. మారన రచనాశిల్పము ఈసన్నివేశమునకు రసభిక్ష పెట్టినది.

ఈయుపాఖ్యానరచనావసరమున శంపాలతలవలెఁ ధళుక్కున మెఱసి హృదయ

మునకు వెలుఁగును బ్రసాదించు శిల్పవిశేషములను బురాణకర్త నిక్షేపించినాఁడు. మచ్చున కొకటిరెం డిచ్చట చూపింపఁబడుచున్నవి.

(1) కథారంభమున శత్రుజిన్మహారాజు "శక్రుఁ డెవ్వఁడు చేయు యజ్ఞముల సోమపాన మొనరించి సంతోషభరితుఁ డయ్యె నట్టి శత్రుజిన్నామ ధరాధినాథుఁ" డని వర్ణింపఁబడెను. ఆరాజుతనూజుఁడే ఋతధ్వజుఁడు. శత్రుజిత్తు దేవతల కర్పించిన హవిర్భాగములకుఁ జిత్త మలరి వా రాతనికి వరరూపముగా నిచ్చిన పూర్ణఫల మాఋతధ్వజుఁడు. దేవతలకును ఆకుటుంబమునకును నట్టి సంబంధ మున్నది. లేనిచో గాలవ మహర్షియెదుట నాకాశవాణి నిలిచి కువలయాశ్వమును జూపి—

క. ఘనుఁ డైన శత్రుజిన్నృపు
తనయుండు ఋతధ్వజుండు తడయక దీని
న్గాని చని విక్రమతేజో
ధనుఁ డగు నాతనికి నిమ్ము తద్దయు నెమ్మిన్. (2.283)

అని ప్రత్యేకించి చెప్పుటకును, సురభి మదాలసాకన్యను గువలయాశ్వుఁడు వివాహమాడు నని పలుకుటకును, అశ్వతరుఁడు శివునిమ్రోల 'కువలయాశ్వకుమారుని కులప్రమద'ను బ్రతికింపు మని వేడగనే దేవదేవుఁ డెట్టివిలంబనము సేయక వర మిచ్చుటకును మూలమైన పరమకారణము మఱొండు లేదు. సుమనసులసౌముఖ్యమునకు శత్రుజిత్తుని సవనదీక్షయే ప్రధానకారణ మని వ్యంజింపఁజేయుటయే తద్వర్ణనతోఁ గథ ప్రారంభించుటలోని శిల్పరహస్యము.

(2) మూలమున నీయుపాఖ్యానారంభమునందలి రెండవశ్లోకము వేంకటేశ్వర ప్రెస్ (బొంబాయి) ప్రతిలో నిట్లు కలదు

శ్లో. తస్యాత్మజో మహావీర్యో బభూ వారివిదారణః
నామ్నా ఋతధ్వజఖ్యాతః సర్వలక్షణసంయుతః. (18.2)

ఈశ్లోకమందలి రెండవచరణము వంగవాసిప్రెస్ (బెంగాల్) ప్రతిలోను, తరంగిణీప్రెస్ (మద్రాసు) ప్రతిలోను కానరాదు. మారనయనువాదమునందును, మంద కామేశ్వరకవి యనువాదమునందును ఋతధ్వజనామ మిచ్చట చెప్పఁబడ లేదు. కావున వేంకటేశ్వర ప్రెస్ ప్రతి యందలి యీశ్లోకచరణము ప్రక్షిప్త మని యూహింపవచ్చును. ఇట్లూహించుట కొకహేతువు కలదు. ఋతధ్వజనామము 8.20వ శ్లోకమునఁ గాని చెప్పఁబడలేదు. కావున కథారంభమున నతనిపేరు తెలిపి విషయము స్పష్టపఱచినచో బాగుండు నని పరిష్కర్తలు భావించి, యీపంక్తి నిందుఁ జొప్పించియుండవచ్చును. కాని, యట్లు చేయుట కవిహృదయమునకు విరుద్ధ మని స్ఫురించుచున్నది. నాయకునిగుణకీర్తనము చేయుచు నతనినామధేయమును బేర్కొనక కథ నడిపి, యతనిప్రియమిత్రు లైన నాగకుమారులనోట దానిని ముచ్చటతీర పలికించి, యశ్వతరునివలె నుత్కంఠఁ దాల్చియున్న పఠితను రంజింపఁ జేయవలె నని పురాణకర్త భావించి యీశిల్పచమత్కృతి చేసె నని

తలంచినచో నిచ్చట నుచితముగా నుండు నని తోచుచున్నది. ఇది ప్రక్షిప్తము కాదని భావించినచో నట్టిశిల్పచమత్కారము చేసిన గౌరవము మారన కొక్కనికే దక్కఁగలదు. మూఁడుసంస్కృతప్రతులలో రెండింట లేనట్టియు, నాంధ్రానువాదములందును గానరానట్టియు, నీచరణమును ప్రక్షిప్త మని భావించి మూలకర్త కేతద్గౌరవము కల్పించుట న్యాయము. అట్లయినచో నది యఖ్యానశిల్పవిశేషముగా రాణింపఁగలదు.

ఇట్లు కథాశిల్పబంధురమై హృదయాహ్లాదకరముగా నున్న యీయుపాఖ్యానము నందు చంద్రునియందు మచ్చలవలెఁ గొన్నిలోపములు లేకపోలేదు. అవి :

1. మదాలసాద్వితీయుఁడైన ఋతధ్వజుఁడు పాతాళమునుండి తిరిగివచ్చుచు శమీక మునిని దర్శింపకుండుట.
2. తాళకేతుసంహారము జరుగకుండుట.
3. మదాలస పునర్భవ యైన తరువాత జాతిస్మరయై యుండియు, విరహమునుగాని, భర్తృపునస్సమాగమాభిలాషకాని ప్రకటింపకుండుట.

ఈమూఁడంశములు చిత్రింపఁబడినచోఁ గథార్థముల కొకనిండుదనము వచ్చియుండెడిది. మొదటియంశము ఋతధ్వజుని గురుభక్తియుక్తిని బోషించియుండెడిది. శత్రుశేషము నుంచకుండ లోకమును నిష్కంటక మొనర్చినగౌరవము తాళకేతుసంహారము వలనఁ గలిగియుండెడిది. మూఁడవయంశము మదాలసజాతిస్మరజ్ఞానమును వ్యక్త మొనర్చియుండెడిది. కాని, యీయంశము నొకవిధముగా సమర్థింపవచ్చును. మదాలస పునర్జన్మమున రూపమదాలస కాదు; యోగిమాత కుచితమైన శమదమాదిగుణముల కాలవాలము, విజ్ఞాననిధి. కావున నామె విరహాదు లనుభవింపకపోయినను దోషము లేదు. కాని, భర్తృపునస్సమాగమాకాంక్ష వ్యక్త మొనర్చియుండినచో నతిసహజముగా నుండెడిదనుటలో నెట్టిసంశయము లేదు.

ఈయుపాఖ్యానమునఁ గంబళవృత్తాంతము నిరర్థక మని కొందఱు భావింపవచ్చును. మృతులైనవ్యక్తులు దైవప్రసాదమునఁ బునరుజ్జీవితు లగుట కవకాశ మున్న దను నంశమును మదాలహాపునరుద్భవఘట్టమునకుఁ బూర్వము కంబళవృత్తాంతముద్వారమున పురాణకర్త వ్యక్తముచేసినాఁ డని గ్రహింప వీలున్నది. కావున నదియుకథార్థపోషకమే యగుచున్నది.

నెరసులు కొన్ని కానవచ్చుచున్నను ఈయుపాఖ్యానదీప్తి కేమియు లోపము కలుగ లేదు. పూర్ణచంద్రునియం దేణాంకము లున్నను పున్నమివెన్నెల కెట్టికొదువ యుండును ?

## అలర్కోపాఖ్యానము :

యోగినియు, యోగిమాతయు నైన మదాలస ఋతధ్వజునికోర్కెపై నలర్కుని గర్మఠునిగాఁ దీర్చిదిద్దినది. ఆతఁడు రాజ్యభారవహనదక్షుఁడై చక్రవర్తిత్వము చేపట్టినాఁడు. ధర్మక్షేత్రమునందు సత్సంతతిని బడసినాఁడు. వయోవృద్ధుఁడైన ఋతధ్వ

జూఁడు మదాలసాద్వితీయుఁడై వానప్రస్థాశ్రమమును గైకొని వనముల కేగినాఁడు. మదాలస పతివెంటఁ బోవుచుఁ దనకొమరున కొక యపరంజియుంగర మిచ్చి -

చ. 'అనఘ ! మమత్వబుద్ధుఁడు గృహస్థుఁడు సంతతసర్వదుఃఖభా
జన మటు గాన నెప్పుడు విషాదము బంధువియోగవిత్తనా
శనరిపుపీడలం గడునసహ్యతరం బగునేని నవ్వు డీ
కనకమయాంగుళీయకము గ్రక్కున నేర్పడఁ బాపి యిందులోన్.

వ. సూక్ష్మాక్షరంబుల నేను లిఖించి యిడిన కనకమయశాసనపట్టిక పుచ్చుకొని చదువుకొనునది' యని యాదేశించి యతని నుచితాశీర్వాదంబుల నభినందించె.' (3.272-273)

ఈపద్య మీయుపాఖ్యానమునకు నాందివంటిది. ఇం దాశీర్నిబంధనముతోపాటు భావికథార్థసూచనయు నిమిడియుండుటచే మంగళారంభశ్లోకగౌరవము నొందుచున్నది. అలర్కుఁడు పురుషార్థత్రయసిద్ధిని సాధించిన వుడమిఱేడు. అతనికి సామ్రాజ్యము సకల కుటుంబము. అతఁడు స్వీయదర్పాహంకారములచే దానిని శాసించి యశము వడయుచుండెను. సంసారము దుఃఖమయ మని యోగిమాతప్రబోధము. రాజ్యసంసారము బంధువియోగవిత్తనాశనరిపుపీడలచే కలఁగి యసహ్యదుఃఖహేతు వైనప్పుడు ఆయుంగరము తెరవు మని మాతయాదేశము. భావికథలో సుబాహుకాశీపతులదండయాత్రవలన నలర్కుఁడు పొందఁబోవు నపారదుఃఖ మామాత్రుమూర్తివచనములలో వ్యంజింపఁబడుచున్నది. శాసనపట్టికలోనియర్థము లాతనికి శుభములు చేకూర్చి కథ సుఖాంత మగునను సూచనయు నిందు కలదు. ఇది కథ కేర్పడిన యుత్కృష్టారంభము !

సుబాహుఁ డలర్కుని పెద్దయన్న. అతఁడు తనతమ్ముఁడు తత్త్వమూఢుఁడై సంసారభోగసంగతుఁడై పోవుచున్నాఁ డని "తెరువు నడచు సార్థమున నొక్కరుని కొకటియైన సహచరులు వగచినట్లు'' చిత్తమున నెల్లప్పుడును విచారపడెడివాఁడు. తమ్మునికి నీతిఁ గఱపి యోగమార్గమునఁ బెట్టవలె నని యన్నయుబలాటము! దాని కొకచక్కని పథకము పన్నినాఁడు సుబాహుఁడు. కాశీరాజు నాశ్రయించినాఁడు. తమ్మునిపై నతనికిఁ గొండెములు చెప్పినాఁడు. బెదరింపురాయబారము పంపినాఁడు. అభిమానియైన యలర్కుఁడు పంపిన సమాధానమున క్రుద్ధుఁడైనాఁడు. చతురంగబలములఁ గూర్చి యలర్కునిపట్టణమును జుట్టిముట్టినాఁడు. అతని సంపదలను, బలమును ధ్వంసము చేసినాఁడు. అలర్కుఁ డపారదుఃఖసముద్రమున మునిఁగినాఁడు. తల్లి యిచ్చిన యుంగరము తెరచినాఁడు.

క. సంగంబు విడువ వలయును
సంగము విడువంగఁ గడు నశక్య మయినఁ జే
యంగవలయు సత్సంగము
సంగరుజకు నౌషధంబు సద్భజన మిలన్.

క. కామము హేయము విడువం
గా మదికిని శక్యమెట్లు గాకున్న ముము
క్షామతి వలయుం గలవే
కామవ్యాధికి ముముక్షఁ గడచిన మందుల్. (3.286-287)

అను పద్యములు కనఁబడినవి. అతనిలోని విపులవిషాదమునుండి విచారము జనించినది. అది వివేకము నాశ్రయించి దత్తాత్రేయునిసన్నిధికి నడిపించినది. రాజ్యసంసారము తనది యను నహంకారముతో మమకారమును, సంగత్వమును, దానిపైఁ బెంచుకొనినాఁ డలర్కుఁడు. తనకంటె భిన్నుఁడై శత్రువు తనసొత్తును అపహరించుచుండె నని యతని దుఃఖము. భగవంతుఁ డైన దత్తాత్రేయుఁ డతనికి నాత్మబోధ చేసినాఁడు. బింబప్రతిబింబ రూపమున నున్న పరబ్రహ్మజీవాత్మల నెఱుకపఱచి యద్వైతము నుపదేశించినాఁడు. అలర్కుఁ డాత్మవివేకియై—

తే. ఆకసం బొక్కటియ యె ట్లనేకఘటము
లందుఁ బెక్కయి తోఁచుఁ దా నట్ల యాత్మఁ
డొకఁడ సకలంబునందును నొగి వెలుంగుఁ
గానఁ గాశీపతియు నేను గాము వేఱు. (3.297)

అను జ్ఞానదృష్టిని సాధించినాఁడు. అవధూత యైన దత్తాత్రేయుఁ డానందపడినాఁడు. జ్ఞానబోధతోపా టనుభూతి నందించినాఁడు, యోగసాధనము నెఱుకపఱచినాఁడు. నిస్సంగియై జీవితశేషము సాగించుట కనుమతి యిచ్చినాఁడు. అలర్కుఁ డజ్ఞానతిమిరమును జీల్చిన సూర్యభగవానుని వలెఁ దేజోవంతుఁడై రణరంగమునకు వచ్చినాఁడు. కాశీరాజును బిలిచి రాజ్య మిచ్చివేయుటకు సిద్ధమైనాఁడు. కాశీపతి నతని నవహేళనము చేసినాఁడు. అలర్కుఁ డతనికిఁ దనదివ్యబోధను దేటపఱచినాఁడు. తమ్మునివైరాగ్యము కన్నులారఁ గాంచిన సుబాహుఁ డుబ్బి, తాను వచ్చినపని యైన దని కాశీరాజును సెలవువేడినాఁడు. అతఁ డబ్బురపడి యసలుసంగతి చెప్ప నతని వేడినాఁడు. సుబాహుఁ డి ట్లనినాఁడు:

చ. ఘనతరదుఃఖహేతు వెదఁ గల్గినఁగాని విరక్తి పుట్ట దీ
తని కని నిశ్చయించి యుచితంబుగ నే నిను నట్టు లాశ్రయిం
చిన నృపవర్య! యుద్యమము చేసితి వెంతయు నిట్లు నీకతం
బున బ్రతికె న్ప్రబోధమును భూతవిరక్తియుఁ గల్గి యీతఁడున్. (3.378)

తమ్మునిని కాత్మవివేకము కలుగుటకొఱ కారాజుతో నింతయత్నము చేయించినాఁడు సుబాహుఁడు. అన్న యన్న అతఁడే యన్న! అలర్కునియున్నతిఁ గాంచిన కాశీపతి సుబాహునిపాదముల నంటి జ్ఞానభిక్ష నభ్యర్థించి, కృతార్థుఁడై వారణాసిఁ జేరుకొనినాఁడు. సుబాహుఁడు తపోవనమునఁ బ్రవేశించినాఁడు. అలర్కుఁడు జ్యేష్ఠపుత్త్రునిఁ బట్టాభిషిక్తునిఁ జేసి వనముల కరిగి తపోదీక్షఁ బూనినాఁడు. యోగానందపారవశ్యములో గొంతెత్తి యిట్లు లోకమునఁ బ్రకటించినాఁడు:

తే. '' అకట ! యింతకాలము రాజ్య మర్థితోడ
నింపుతోఁ జేసితినె యిసీ యిట్టికీడు
గలదు నా కిప్పు డింతయుఁ గానఁబడియె
యోగసుఖమునకంటె లే దొండుసుఖము. (8.389)

ఇది యీయుపాఖ్యానమునకు భరతవాక్యము. సంసారసాగరనిర్మగ్నుల నుద్ధరించు దివ్యనౌక యీసందేశము- ఇది సర్వలోకమంగళాకాంక్షి.

యోగసాధనప్రధానమైన యీకథయందు సగము మేరకు శాస్త్రభాగ మాక్రమించి యున్నను కథను బిగువుతో నట్టిపెట్టఁ గలిగినకీలకము లీకథలోఁ గొన్ని కలవు. వానిని నిర్వహించినవిధమే యీకథాఘట్టములోని యాఖ్యానశిల్పము. మదాలసప్రబోధ మీకథకు గుండెకాయ. దానిని నుపాఖ్యానారంభమున సూచించియుఁ గథాగర్భమునఁ గాని తేట పఱుపలేదు. సుబాహుని సత్ప్రియత్నము ఈకథలోని క్రియాశక్తి. అలర్కుని వివేక వికాసక్రమవిన్యాస మీకథజీవితము. 'యోగసుఖమునకంటె లే దొండుసుఖ' మను నలర్కునిప్రకటమే యిక్కథాఫలసిద్ధి. కథార్థసూచనలతో భావి నుపలక్షింపఁజేసి దానినిఁ బ్రత్యక్షీకరించుటలో వైవిధ్యము, వైశిష్ట్యము, పూర్వాపరసంయోజనము, చిత్తవృత్తి పరిణామ వికాసవ్యంజనము మొదలగు శిల్పగుణములు భాసించునట్లు చేయుటయే అలర్కో పాఖ్యానసంవిధానస్వరూపము.

జడోపాఖ్యానమునందలి యంతర్గాథలయొక్క నిర్మాణవిధానము వ్యష్టిగాఁ గొంత పరిశీలింపఁబడినది. ఇఁక నా కథల సంయోజనమువలన సమిష్టిగా నేర్పడు నుపాఖ్యాన సౌందర్యమునుగుఱించి కొంతపర్యాలోచనము చేయఁబడుచున్నది.

దత్తాత్రేయుఁ డలర్కున కాత్మయోగము బోధించినవిధమును దెలుపుట యీకథల పరమతాత్పర్యము. గురుశిష్యులయుత్పత్తివికాసపరిపాకావస్థలను సహేతుకముగాఁ జిత్రిం చుటయే యీకథాసంయోజనమందలి సౌందర్యము. కౌశికోపాఖ్యానము దత్తాత్రేయోత్ప త్తికి మూలమైనది. మునికుమారులసాహచర్యము దత్తాత్రేయునియం దవధూతవృత్తినిఁ బేరేచినది. జంభాసురవృత్తాంతము దత్తాత్రేయుని యాశ్రితవాత్సల్యమును స్పష్టపఱచి నది. కార్తవీర్యార్జునునిగాథ దత్తాత్రేయునియోగవిభూతిని, సర్వకామ్యార్థప్రదాతృత్వ మును స్థాపించినది. కువలయాశ్వమదాలసావృత్తాంతము అలర్కునియందు నైజముగా నిక్షేపింపఁబడిన రాజర్షిసంస్కారమునకు మూలాధారమై నిలిచినది. ఋతధ్వజునిక్షాత్ర ధర్మమును, మదాలసయొక్కపరమయోగినీధర్మమును కలసి నూత్నముగా వెలసిన యపూర్వసమన్వయశక్తి యలర్కుఁడు. అతనియందలిక్షాత్రధర్మ మతనినిఁ బైతృక మైన మహాసామ్రాజ్యమునకు సమ్రాట్టు నొనర్చినది. మదాలస యొనర్చిన ధర్మకర్మ ప్రబోధ మాతనిసార్వభౌమత్వమునకు సౌరభ్య మబ్బించినది. సుబాహునివివేక మలర్కుని యందు నిర్వేదము పుట్టించినది. మదాలస హేమశాసన మతనియందు ముముక్షుభావము మేల్కొల్పినది. దత్తాత్రేయప్రసాదము మోక్షసాధక మగు నాత్మయోగ మతనికి సిద్ధింపఁ

జేసినది. ఇట్లీ యుపాఖ్యానమునఁ గార్యకారణసంబంధ మతిసహజముగాఁ జిత్రింపఁబడి యున్నది.

స్థూలమైన యీసంవిధానశిల్పముతో పాటు సూక్ష్మములైన సమాంతరోపాంగ విన్యాస మమరియుండుటచే నీయుపాఖ్యానమునకు సజాతీయకథార్థసమాధానసౌందర్య-మబ్బుచున్నది. అట్టివానిలోఁ బ్రస్ఫుటముగాఁ గనవచ్చు కొన్నియంశములు మాత్ర మిచ్చట పేర్కొనఁబడుచున్నవి.

(1) పై కథలయందు నలుగురు పతివ్రతలు ప్రస్తావింపఁబడిరి. వారిచిత్తవృత్తులను వరుసగాఁ బురుషార్థచతుష్టయప్రధానము లగునట్లు చిత్రించుట యొకవిశేషము. కౌశికునిభార్య యొకపతివ్రత. ఆమెయందు ధర్మైకచిత్తవృత్తి వర్ణింపఁబడినది. పతిశుశ్రూషలు త్రికరణశుద్ధిగాఁ జేయుటయే యామెజీవితలక్ష్యము. అనసూయాదేవి యామె నందులకే యిట్లు ప్రశంసించినది :

ఉ. "నీ పతిధన్యురాలవు వినీతవు పుణ్యచరిత్ర వెంతయు
 నైవముకంటె నెక్కుడుగఁ దత్పరతం బతి గారవింతు పూ
 జావినయోపచారముల సంతతముం బరితుష్టుఁ జేయు దీ
 భూవలయంబున న్సతులు పోలరు నిన్నుఁ బతివ్రతామణీ ! (2.180)

అనసూయ తపస్వినియైన పతివ్రత. ఆమె పాతివ్రత్యము లోకకల్యాణసాధనకును, పరమ యోగ్యులైన పుత్రులఁ బడయుటకును ఉపయుక్తమై యర్థసాధనప్రవణమైనది. కువలయాశ్వునిజనని మఱియొకపతివ్రత. ఆమెకు వీరమాత కావలయు ననెడి గాఢవాంఛ కలదు. వీరమరణము నొందిన పుత్త్రుఁ డామె కాగౌరవము కలిగించినాఁ డని తలఁచి యామె గర్వించినది.

ఆ. "ఉగ్రవైరివిజయి యొండె మృతుఁ డొండె
 నాజిభూమి నెప్పు డగుఁ దనూజుఁ
 డపుడు గర్భదుఃఖ మతివకు సఫలతఁ
 బొందు నని తలంతు భూపవర్య !" (3.33)

అనుతత్త్వ మామెది. పాతివ్రత్యమునకు ఫలము పరమయోగ్యమైనసంతానము. భార్యగాఁ బతిని సేవించుట యెంతముఖ్యమో మాతగా భర్తృప్రతిబింబమైన పుత్త్రునిఁ దదాశయానుగుణముగాఁ దీర్చిదిద్దుటయు సతి కంతధర్మము. అత్రిమహర్షి సంతానమైన దత్తాత్రేయుఁడు మహాయోగి యైనాఁడు. శత్రుజిన్మహారాజుపుత్త్రుఁడు ఋతధ్వజుఁడు ధర్మవీరుఁ డైనాఁడు. వా రట్లగుటకుఁ బతివ్రత లైన వారిమాతృమూర్తులయాశయములే కారణములు. అట్లే పరమయోగినియైన మదాలస మగనియానతి ననుసరించి యలర్కునిఁ గర్మఠునిగాఁ దీర్చిదిద్దినది. అహంకారప్రధానమైన యధికారముతోఁ గూడినరాజ్యకర్మ దుఃఖదాయకమని గుర్తించిన యాపతివ్రత పుత్త్రుని కుచితసమయమున హేమశాసనముఖమునఁ దత్త్వమార్గోపదేశము చేసినది. పతిమృతివార్త విని నంతమాత్రముననే విగతప్రాణయైన మహా

పతివ్రత మదాలస. ఆమె యజరామర మైన యాత్మజ్ఞానసిద్ధిని పుత్త్రులకుఁ బ్రసాదించినది; మోక్షపదవి నందించినది. ఇట్లు పతివ్రతాచతుష్టయపవిత్రచరిత్రము పురుషార్థచతుష్టయప్రబోధసమర్థముగా ననుసంధించుట యిందలిసంవిధానసౌందర్యము.

(2) దత్తాత్రేయాలర్కుల మాతృమూర్తులను యోగిమాతలుగాఁ జిత్రించినవిధమునందు వైవిధ్యము పాటించియుండుట యిందలి యొకవిశేషము. అనసూయ యత్రిమహర్షి భార్య. ఆమె పుత్త్రుఁడు విష్ణ్వంశసంభూతుఁడైన యవధూత. అతఁ డాజన్మయోగసిద్ధుఁడు. అతఁడు పుట్టుకతోడనే పరిపక్వమైనఫలమువంటివాఁడు. అతనిజన్మము వలననే యనసూయ యోగమాత యైనది. అనసూయ కౌశికసతివంటి పతివ్రతలకుఁ బతివ్రతాధర్మములను బోధించినది కాని స్వీయపుత్త్రులకు పరమయోగిధర్మములు బోధింపలేదు. ఆమె పతివ్రతామతల్లులకు గురుస్థానము. మహాయోగులకు జన్మస్థానము. మదాలస ధర్మగరిష్ఠుఁడైన చక్రవర్తికిఁ బట్టమహిషి. ఆమెయొక్క గార్హస్థ్యధర్మవృక్షము కాసిన సంతానఫలములలోఁ గట్టకడపటిది యలర్కాఖ్యము. అలర్కునకుఁ బూర్వమే విక్రాంతి సుబాహుశత్రుమర్దను లామెకుఁ బుత్త్రులై జన్మించి యామెప్రబోధమాహాత్మ్యముచే జ్ఞానులై నిస్సంగవృత్తిని స్వీకరించిరి. విక్రాంతాదు లాజన్మయోగసిద్ధులు కారు. కాని, యసమాన సాధకులు. మాతృబోధముచే ప్రబుద్ధు లైన యోగసిద్ధిని సాధించిన బుద్ధిమంతులు. అట్లే యలర్కుఁడును. మదాలస పతివ్రతలకు ధర్మములు బోధించినగురుస్థానము కాదు. మహాయోగులకుఁ బ్రబోధము నిర్వహించిన యాచార్యపీఠము. పతివ్రతాధర్మైకపరాయణమైన యీపతివ్రతాద్వయమునందు వృత్తివైవిధ్యమును బ్రదర్శించి యుపాఖ్యానపూర్వోత్తరఖండములందు అద్వైత మగు ద్వైతమును బ్రదర్శించినాఁడు పురాణకర్త.

(3) మృతులు సజీవు లగు వృత్తాంతము లిందు రెండు కలవు. దత్తాత్రేయుని జన్మగాథలోఁ గౌశికునియొక్కయు, అలర్కునిజన్మగాథలో మదాలసయొక్కయు వృత్తాంతము లట్టివి. ఈకథయందు మృతుఁడైన కౌశికుఁడు జగత్క్షోభము నివారింపఁ బడుటకై బ్రతికింపఁబడెను. మృత యైన మదాలస ధర్మక్షోభము కాకుండుటకై బ్రతికింపఁబడెను. కౌశికుఁడు కుష్ఠవ్యాధిపీడితుఁడై మూర్తి కట్టిన హేయరసమువలె నున్నప్పుడు చనిపోయి విగతామయునిగను, నవయౌవనునిగను, తేజోవిభవాధికునిగను, అతిసుందరునిగను, సురసన్నిభునిగను పునరుజ్జీవితుఁ డయ్యెను. మదాలస యసమానసౌకుమార్యోల్లసితమృదుతనూలతావిలాసమదభరాలసయైన మహారాణిగాఁ జనిపోయి తద్వయోరూపకాంతివిలసనమ్ములతోఁ గూడిన పరమయోగినిగాఁ బునరుద్భవించినది. కౌశికుని ప్రాణములు పరమతపస్వినియిచ్ఛాశక్తి వలనఁ బునస్థాపితమైనవి. మదాలసప్రాణములు తపఃకర్మనిష్ఠుఁడైన పాతాళపతిసంకల్పసమాధియందు ఫణమధ్యమున జన్మించిన పాంచభౌతికకాయము నాశ్రయించి నిలిచినవి. నిస్సార మైనట్టియు, నిరర్థకమైనట్టియు నవస్థను త్యజించి జీవుఁడు సారవంత మైనట్టియు, సార్థక మైనట్టియు నూతనావస్థ నాశ్రయించి పరమపురుషార్థసాధనోన్ముఖమైన సంస్కారమును వేలార్చుటయే పునర్జీవన మనఁబడు నట్లు కథార్థములను జిత్రించుటయే యిందలి పరమార్థము.

(4) ఈయుపాఖ్యానమున నిరువురాచార్యులు చిత్రింపఁబడిరి. మొదటివాఁడు సాక్షాద్విష్ణ్వంశసంభూతుఁడైన దత్తాత్రేయయోగి. అతఁడు త్రైలోక్యసామ్రాజ్యలక్ష్మిని రాక్షసులబారినుండి తప్పించి వాసవున కప్పగించిన మహానుభావుఁడు; కార్తవీర్యుఁడు కోరిన యపూర్వవరములను బ్రసాదించిన సిద్ధపరమేశ్వరుఁడు; అలర్కునకు నిర్గుణపరబ్రహ్మైక్యయోగము నుపదేశించిన పరమయోగీంద్రుఁడు. ఇతఁడే యుపాఖ్యానమునఁ బ్రసక్తుఁడయ్యెడి ప్రధానపురుషుఁడు. ఇఁక రెండవయాచార్యుఁడు సుబాహుఁడు. అతఁడు కాశీపతికి మోక్షమార్గ ముపదేశించిన జ్ఞాని. అతనియందలి జ్ఞానము మదాలస యుగ్గుపాలతో రంగరించి పెట్టినది. అవతారమూర్తులైన యవధూతలేకాక ప్రబోధాఖ్యానసిద్ధులైన యోగవిద్యావిదగ్ధులును పరమగురుపీఠ మధిష్ఠింప నర్హు లగుదు రని వ్యంగ్యముగాఁ దెల్పుటయే యిందలి తాత్పర్యము.

(5) దత్తాత్రేయుని సేవించిన భక్తులు ముగ్గు రీకథలయందు వర్ణింపఁబడిరి. ముప్వురును ధర్మైకచిత్తవృత్తులై యుండుట వారియందు సమానముగా నున్నగుణము. కాగా వారు క్రమముగా నర్థకామమోక్షసాధకులై రాణించుట యిందలి విశేషము. ఇంద్రుఁడు త్రివిష్టపసామ్రాజ్యమును గోరి దత్తాత్రేయుని సేవించుటచే నర్థకామి యనఁబడుచున్నాఁడు. కార్తవీర్యుఁడు భువహనమహనీయ సామర్థ్యమును బ్రసాదించు ననేకవరములఁ గోరి యతని కామపరత్వమును వ్యక్తము చేసికొనినాడు. అలర్కుఁడు నిర్గుణబ్రహ్మైక్యము నొందించు యోగము నుపదేశము నొంది సాధించినముముక్షువు. ధర్మభిత్తికపైఁ జిత్రింపఁబడిన త్రివర్ణచిత్రము లీదత్తాత్రేయశిష్యులమూర్తులు.

(6) ముఖత్రయముతో ముగ్ధమోహనమూర్తియై విరాజిల్లు దత్తాత్రేయుని దివ్యమాహాత్మ్యము కీర్తింపఁబడిన యీయుపాఖ్యానమునఁ ద్రిమూర్తులు కథాగతికిఁ దోడుపడుచుండుట యొకచమత్కారము. ప్రభాకరోదయము లేక కాలములు సిక్కువడి లోకములు సంక్షోభించునపుడు పరమపతివ్రతయైన యనసూయ యక్కార్యము చక్కఁబెట్టఁ గలదని సూచించినది విరించి; మదాలసాప్రాణప్రదాన మొనరించినది మహేశ్వరుఁడు; అలర్కునికి బ్రహ్మజ్ఞానోపదేశ మొనరించినది విష్ణ్వంశసంభూతుఁడైన దత్తాత్రేయుఁడు. త్రిమూర్తులు కుమారత్రయముగా ననసూయకు జన్మించుటయు నిందు వర్ణింపఁబడినది. త్రిగుణాత్మకమైన దైవప్రవృత్తులలో సత్త్వగుణప్రాధాన్యమును బ్రకటించుట యీసంగ శిల్పముయొక్క సారభూతమైనతాత్పర్యము.

**స్వారోచిష మనుసంభవము :**

మార్కండేయపురాణాంతర్గతములైన మనుచరిత్రలలో స్వారోచిషమను వృత్తాంతము రసోదంచితమైనది. మారన మహాకవి యీకథను తనరచనాశిల్పకౌశలమంతయు వెలార్చి తీర్చిదిద్దెను. కావున నీకథ మనుకథలలో నాయకమణి యనఁదగియున్నది.

స్వారోచిషమనుసంభవ మనఁగనే తెలుఁగువారికి చప్పున స్ఫురించునది వరూథినీ ప్రవరులవృత్తాంతము. ఈరెండుపాత్రలు తెలుఁగువారి కతిసన్నిహితములై చిరంజీవులై యున్నవనుటలో నతిశయోక్తిలేదు. వరూథిని తనంతట తాను ప్రవరుని వలచి, యాతనిచేఁ దిరస్కరింపఁబడిన అప్సరోంగన. దివ్యవనితాపరిష్వంగసౌఖ్యము నలవోకగా త్రోసిరాజనిన శమగుణాన్విత విప్రుఁడు ప్రవరుఁడు. తెలుఁగునాఁట నేడు పరస్త్రీపరాఙ్ముఁ డను నర్థమున "ప్రవర" శబ్దమును జాతీయముగాఁ ప్రయోగించుట కలదు. ఈ పాత్రసృష్టి తెలుఁగువారిపై నంతప్రభావము వైచినది.

ప్రవరాఖ్యను విప్రునకు మొట్టమొదట పెట్టినవాఁడు మారనమహాకవి. ఆమధురక్షణ మెంతయుదాత్తమైనదో కాని ప్రవరనామధేయము తెలుఁగువారి కమృతప్రాయమై వారి యాదరాభిమానములను జూరగొనినది.

మూలమున :

శ్లో. "కశ్చి ద్ద్విజాతిప్రవరః పురేఽభూ దరుణాస్పదే
వరుణాయా స్తటే విప్రో రూపేణాత్యశ్వినా వపి." (58.5)

అని యున్నది. ఈ శ్లోకమున సంస్కృతపురాణకర్త అశ్వినీదేవతలకంటె రూపవంతుఁడైన విప్రు నొకనిఁగూర్చి తెలుపుచు నతఁడు నివసించిన నగరనామమును, దానిసమీపమున నున్న నదిపేరును ప్రత్యేకించి చెప్పియు, ద్విజాతిప్రవరుఁడైన యామహనీయుని యుజ్జ్వలనామమును మాత్రము చెప్పక వదలివైచినాఁడు. ప్రవరుఁ డన్నది యతని నామమే యైనట్లు అందు నిబంధించినచో శ్లోకనిర్మాణ మొక సమగ్రశిల్పము నాశ్రయించి యుండెడిది. శిల్పమర్మజ్ఞుఁడైన మారన యీయాంతర్యమును గ్రహించి, ద్విజాతిప్రవర సమాసమందలి శ్రేష్ఠవాచకమును సంజ్ఞగా మార్చివైచెను. దానితో అనామకుఁడైన ప్రవరుఁడు ప్రసిద్ధాఖ్యుఁ డయ్యెను.

మారన ద్విజాతిప్రవరునకు నామకరణము చేసె ననుటకు వీలులేకుండ తరంగిణీ ముద్రాక్షరశాలయందు తెలుఁగులిపిలో ముద్రింపఁబడిన సంస్కృతమార్కండేయము పైశ్లోకమున "కశ్చి ద్విజాతిః ప్రవరః" అని చెప్పుచున్నది. దానితో మారనకు రావలసిన గౌరవము మూలకర్త కబ్బుచున్నది. పరిశీలించిచూడఁగా "ద్విజాతిఃప్రవరః" అను పాఠము తత్పురాణపరిష్కర్తలు కల్పించినట్లు తోచుచున్నది. తరంగిణీప్రెస్ప్రతిలోని పాఠము ఉత్తరాదిప్రతులలో కానరాదు. నేను స్వయముగా బొంబాయి, కలకత్తాప్రతులను చూచినాను. వానియందు లేదు. మార్కండేయపురాణము నాంగ్లమున ననువదించిన పర్గిటరు తనయనువాదమున నావిప్రుఁడు ప్రవరాఖ్యుఁ డని చెప్పలేదు.[26] అతఁడును పెక్కుప్రతులను జూచి యనువాదమును నిర్వహించితి నని పీఠికలోఁ జెప్పుకొనియున్నాఁడు. ఇన్నిప్రతులలో లేనిది యీతెలుఁగులిపి ప్రతిలో నెట్లు చేరిన దని ప్రశ్న. మదరాసుప్రతిని

26. "There lived a certain brahman eminent among the dvijas in the town Arunaspada......"— See - Pargitar's M.P. Page 392; Chap. Lxi శ్లో. 5.6.

పరిష్కరించినవారు తెలుఁగువారు. వారిపై మారనయనువాదముయొక్కయు, పెద్దన ప్రబంధముయొక్కయు ప్రభావము తప్పక యుండును. అందువలననే మూలమున "ద్విజాతిః" అని దిద్దినారు. అంతటితో నాగలేదు. వరూథినీ ప్రవరసంభాషణమున "బ్రాహ్మణ ఉవాచ" అన్న వాక్యములకు బదులు "ప్రవరః" (ఉవాచ) అని మార్చినారు. పైపెచ్చు మూలమున శ్లోకములం దెచ్చట కానరాని "సిద్ధ"శబ్దమును మంత్రవిదుఁడైన బ్రాహ్మణునికి (ఔషధసిద్ధునికి) బదులు వాడినారు. నానాదేశానీతప్రతులను జూచితి మని పురాణమంతటను పాఠాంతరముల నిచ్చిన యాపరిష్కర్తలు పైనఁజెప్పిన వానికిఁ బాఠాంతరము లున్నను పేర్కొనుట మానివైచిరి. ఏతత్కారణములచే నీపాఠము నవ్యమనియు, కల్పితమనియు, స్పష్టమగుచున్నది. మారనకు ప్రవరాఖ్యకల్పనగౌరవము నిల్చుచున్నది :

మారన స్వారోచిషమన్వంతరకథ నీక్రిందిపద్యముతో నారంభించెను.

క. వరుణాతటినీతటమున
నరుణాస్పద మను పురంబునం దతులగుణో
త్తరుఁడు గలఁ డొక్క ధరణీ
సురవరుఁ డశ్వినులకంటె సుందరుఁ డెందున్. (4.213)

వరుణాతటినీతటమున నరుణాస్పదపురము కల దనుటచే నానగరము సమశీతోష్ణాది సౌఖ్యములతో సర్వ (ఋతు) కాలనివాసయోగ్యమై రాణించు నని భావము. అట్టిపురమున ధరణీసురవరుఁ డొకఁడు కలఁ డని తెలుపుచు నతఁడు - అతులగుణోత్తరుఁ డనియు, నశ్వినులకంటె సుందరుఁ డైనవాఁ డనియు మారన వర్ణించెను. దానిచేఁ బ్రవరాఖ్యుని యందు దేవాంగన యగు వరూథినిచే వరింపఁబడునంతటి లోకోత్తరసౌందర్యముతోపాటు దేవతలయందును గానరాని విషయవైముఖ్య మనెడి విశిష్టగుణమును గలదని చెప్పి, యతనిలోకోత్తరగుణప్రశస్తి చేసి యుత్తమనాయకత్వ మతనియందుఁ గల దని వ్యంగ్యముగా సూచించియున్నాఁడు. సుకుమారమూర్తి యనుటచే నాతఁడు మృదుస్వభావుఁ డనియు, నెదుటివారిమనస్సు నొవ్వకుండ మాడలాడు చతురుఁ డనియు, నుదాత్తుఁ డనుటచే ధీరోదాత్తుని కుండఁదగు నవికత్థనత్వము, క్షమ, గాంభీర్యము, దృఢవ్రతము మొదలగు సహజగుణములచే నొప్పారువాఁ డనియుఁ దేఁటపడుచున్నది. మూలము నందలి 'సద్వృత్తః' అనువిశేషణమును మారన యనువదింపక వదలి యాతని జీవిత సద్వృత్తివర్ణనముచేతనే దానిని వ్యంజింపఁ జేసినాఁడు. ప్రవరుఁడు గుణోత్తరుఁ డనియు, నుదాత్తుఁ డనియు మూలాతిశాయిగా వర్ణించి మారన యతనిగుణరూపచిత్రమున కొకవైశిష్ట్యము నాపాదించెను.

ప్రవరునియందుఁ బ్రధానముగాఁ గానవచ్చునవి రెండుప్రత్యేకలక్షణములు. 1. అతిథిజనార్చనాభిరతి, 2. సకలావనీతలవిశేషసందర్శనాభిలాష. ఈరెండింటిని మారన మూలముకంటె శిల్పరమణీయముగ నుండునట్లు తెలుఁగు చేసినాఁడు.

చ. అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుఁ డుదాత్తుఁడు వేదపారగుం
డతిథిజనార్చనాభిరతుఁడై చరియించుచు, శైలకాననాం
చితసకలావనీతలవిశేషములెల్లను బ్రీతిఁ గన్గొన
న్మతిఁ గడుఁ గోరుచుండ'............... (4.214)

మూలమున నతఁడు సదా అతిథిప్రియుఁ డనియు, రాత్రులయం దరుదెంచిన యతిథులకు సైత మాశ్రయ మిచ్చువాఁ డనియు, (58.6) అతిరమ్యవనోద్యాననానానగరశోభిత మైన వసుంధరను దర్శింప వలెనను కోర్కె కలవాఁ డనియు (58.7) వర్ణింపఁబడినది మారన యర్ధరాత్రివేళ వచ్చిన యతిథులకుసైతము నాతిథ్య మిచ్చెడివాఁ డనుమాటను వదలెను. కాని, తత్తాత్పర్యస్ఫోరక మగు "అతిథిజనార్చనాభిరతి" యను సార్థకమైన సమాసమును గల్పించెను. ఈకథలో నర్ధరాత్రివేళ నతిథుల నాదరించిన సన్నివేశ మేదియుఁ గానరాకపోవుటచే దానికిని కథార్థములకును బ్రత్యక్షసంబంధము లేదనియు మారన భావించియుండవచ్చును! మూలమునందు వనోద్యాననగరశోభితమైన వసుంధరను గన్గొన నిచ్ఛ కలదని వర్ణింపఁబడినది. కాని, పాదలేపధారణానంతరము ప్రప్రథమముగాఁ బ్రవరుఁడు హిమవన్నగవిభవవిలసనాలోకనకుతూహలి యైనట్లు చెప్పఁబడినది. ఆకుతూహలమున కనుగుణముగా లే దీయభిలాష. అందులకై 'శైలకాననాంచితసకలావనీతలవిశేషము లెల్లను బ్రీతిఁ గన్గొనన్ తన్మతిఁ గడుఁ గోరుచుండున్' నని పేర్కొనినాఁడు. శైలవనమును సమాసశిఖరమున స్థాపించుటయందుమ, "అవనీతలవిశేషసందర్శనాభిలాషి" యనుటయందును, ''మతిన్ గడుఁ గోరుచుండు'' నని పేర్కొనుటయందును - బ్రవరుని హిమాలయగమనము, తన్నగవిశేషసందర్శనము, తన్మూలమైన పాదలేపసంపాదనము - అనుకథార్థములకు నాంతరములైన హేతువులను శిల్పవిశిష్టముగాఁ గల్పించునైపుణ్యమును కవి ప్రదర్శించినాఁడు.

ఒకనాఁ డొక యౌషధసిద్ధుఁడు ప్రవరునియింటికి వచ్చెను (4.214). మూలమున నతఁ డౌషధప్రభావజ్ఞుఁ డనియు, మంత్రవిద్యావిశారదుఁ డనియు (58.8), మంత్రవిద్యంత్రసాధకుఁ డనియు, (తరం.ప్రె.) వర్ణింపఁబడియుండఁగా నాతనివ్యక్తిత్వమంతయుఁ బ్రతిబింబించునట్లును, మంత్రౌషధిప్రభావముచే నాకాశగమనసిద్ధిని సాధించిన సిద్ధభావము స్ఫురించునట్లును ఔషధసిద్ధుఁ డనుసమాసము సంఘటించి మారన సారవ ద్రచన మొనర్చినాఁడు.

ఔషధసిద్ధుఁడు ప్రవరునకుఁ బాదలేపము ప్రసాదించినఘట్టమును మారన కడు ప్రసన్నముగాఁ దీర్చిదిద్దినాఁడు. తనయింటి కరుదెంచిన సిద్ధుని నాగృహస్థుఁడు వందన పూజలచే హృష్టచిత్తునిగాఁ జెచ్చెరఁ జేసె నని మారన రచించెను. 'అభ్యాగతస్స్వయం విష్ణుః' అని భావించుట హైందవగార్హస్థసంప్రదాయము. దేవునికి వలెనే యతిథికిని షోడశోపచారాదిపూజనములు సలుపుట భారతీయుల యాచారము. మార్కండేయపురాణమున మదాలస యలర్కునకు బోధించినకర్మపద్ధతియందు గార్హస్థ్యధర్మమునం దతిథిపూజావిధి

కున్న ప్రాధాన్య ముగ్గడింపఁబడినది (శ్లో.156-160). అతిథిని భక్తితో శక్తి కొలఁదిఁ బూజించుటయు, మృష్టాన్నసంకలనముచేఁ గాని, శక్తిలేనిచోఁ జివరకు నంబుశాకదానముచే నైనను నతనిఁ బ్రముదితాత్ము నొనర్పుటయు ధర్మ మని యందు వక్కాణింపఁబడి యున్నది. ప్రవరుఁడు 'వందనపూజల హృష్టచిత్తుగాఁ జెచ్చెరఁ జేసె' (4.215) ననుటలో నాయాతిథ్యధర్మమంతయుఁ బాటించె నని వ్యంజింపఁబడినది. వందనాదికమైన పూజతో నతిథి ప్రసన్నుఁ డయ్యె ననియు, ఉచితాహారనివేదనమునఁ బ్రహృష్టచిత్తుఁ డయ్యె ననియు నిందలితాత్పర్యము. 'చెచ్చెరన్' అనుటచే నాతనిపూజావిధానమునందు భక్తి, వినయము, అప్రమత్తత, తత్తరపాటు, ఆతురత, అభిరతి యను - భావానుభావములు వ్యంజింపఁబడుచున్నవి.

'ఇమ్మహిఁ జూచిన విశేషపుఁ జోద్యములఁ' గుఱించి చెప్పు మని ప్రవరుఁడు సిద్ధునిఁ బ్రత్యేకించి యడిగెను (4. 215). మూలమున నభ్యర్థించె నని మాత్రమే కలదు (58. 9). మారన ప్రవరుఁ డవనీతలవిశేషములఁ గన్గొనఁ గడుఁగోరుచుండువాఁ డని వెనుక తెలిపియుండుటచే- నతనిమనోభావము తేటపడున ట్లిచ్చట విశేషపుఁజోద్యములఁ గూర్చినప్రశ్నాదికము నడిగించినాఁడు. చప్పని సామాన్యవిషయములు విని సంతృప్తి పడెడుసామాన్యుఁడు కాఁడు ప్రవరుఁడు; అచ్చెరువు గొలుపు నద్భుతవిశేషములు విని భావలయసందర్శనాభిరతిని విస్తరించుకొను వివేకి. అతనిమాటలు అతనిజిజ్ఞాసకు వ్యాఖ్యానములు. "అచ్చుగఁ జెప్పవే" యని వేడుట యతనిసత్యాన్వేషణపరత్వమున కచ్చమైన తార్కాణము!

మూలమున సిద్ధుఁడు తాను గాంచినదేశములఁగూర్చియు, రమ్యములైన నగరములను గూర్చియు, నదీవనశైలపుణ్యాయతనములగూర్చియుఁ దెల్పె నని వర్ణింపఁబడి యుండ మారన యాతఁ డనేకదేశములఁ ద్రిమ్మరి వానియం దొగిఁ బెక్కుచోద్యములు గాంచినట్లు పేర్కొనెను.[27] అనఁగా నాంధ్రమున నగరనదీవనశైలాదులు దర్శించినట్లు ప్రత్యేకముగాఁ జెప్పలే దని తాత్పర్యము. ఇట్లు రచించుటకుఁ గల హేతువు బహుశః మూలకర్తయు, మారనయు ననంతరప్రవరపాత్రానుభావవర్ణనానుకూలముగ సిద్ధుని వాక్యములను సమకూర్ప యత్నించుట యనియే తోచుచున్నది. సిద్ధునివాక్యములు విని ప్రవరుఁడు విస్మయావిష్టుఁ డయ్యెనని మూలము (58. 10); వెటకారవునవ్వు నవ్వె నని మారన (4. 216). ఆయవహేళనము మారన చేసిన కల్పన. మూలమున విషయమును విభజించి వేఱుగాఁ జెప్పుటచే శ్రోతయందు విస్మయము పొడసూపినది. ఆంధ్రమున "ననేకదేశముల్" "క్రచ్చర" "ద్రిమ్మరితి" "కాంచితి పెక్కుచోద్యముల్" అనుపదములఁ బ్రయోగించుటచే వ్యంగ్యముగా భాసించు సిద్ధునిదాంభికత్వమును, ప్రగల్భతయుఁ శ్రోతయం దవిశ్వాసపూర్వకప్రహాసము జనింపఁ జేసినవి

సంస్కృతపురాణమునఁ బ్రవరునియాశ్చర్యము వ్యక్తమగునట్లుగను, ఆంధ్రమున

27. చూడు: మార్కం. మహాపు. 58. 9-10 = మారన మార్క. 4. 215.

నతనియవిశ్వాస మచ్చుపడునట్లును పలుకులు పొందుపఱుపఁబడియుండుట గమనింపఁ దగినది.

మూలము :

శ్లో॥ అనేకదేశ దర్శిత్వే నాతిశ్రమసమన్వితః
త్వం నాతివృద్ధో వయసా నాతివృత్తశ్చ యౌవనాత్
కథ మల్పేనకాలేన పృథివీ మటసి ద్విజ॥ (58.11)

ఆంధ్రము :

ఉ. వాయపురజ్జులేల మునివల్లభ ! వృద్ధుఁడ వొందెఁగావు లేఁ
బ్రాయపువాఁడ వద్రివనరమ్యము లైన యనేకదేశము
ల్ధీయుత ! యల్పకాలమునఁ ద్రిమ్మఁర శక్యమె ? నీకు నెమ్మెయి
న్వేయును నేల నమ్మ నెద నీపలుకన్న మునీంద్రుఁ డిట్లనున్. (4.217)

ఈ రెండింటినిఁ బోల్చి చూచినచో మారన మూలముకంటె ''వాయపురజ్జులేల మునివల్లభ !'' ''ధీయుత'' ''వేయును నేల నమ్మ నెద నీపలుకు''– అనుపదముల నధికముగా వాడి ప్రవరునివాక్కులనుఁ దత్కాలావస్థ కనుగుణముగాఁ దీర్చిదిద్దినాఁ డని స్పష్టపడఁగలదు. ప్రవరుఁ డుదాత్తుఁ డగుటచే నాత్మస్తుతివిముఖుఁడు. సిద్ధునిమాటలలో నాత్మప్రత్యయము, దాంభికత్వము గుప్పున వాసనకొట్టుచున్నవి. దాని నాతఁడు విని సహింపలేకపోయినాఁడు. సిద్ధునివాలకము గాంచినచో లేఁబ్రాయపువానివలెఁ గానవచ్చుచున్నాఁడు. అది మఱియు నతని కుడుకెక్కించినది. వ్యర్థములైన యాత్మస్తుతులేలనయా ! యాగు మని వారించినాఁడు మొదట. మునివల్లభ ! యని గడుసరిగా గౌరవమును మఱుగుక్కలో నాలకపోసినాఁడు. మూలమున సిద్ధునిపట్ల ద్విజశబ్దము మాత్రమే వాడఁబడినది. మారన యతనిని మునివల్లభుని, మునీంద్రుని, మునిపాలకునిఁ జేసివైచినాఁడు. దానివలనఁ బ్రవరుఁ డాతనిని వయోవృద్ధునిగాఁ గాక జ్ఞానవృద్ధునిగా గౌరవించుచున్నాఁ డని తెలియనగును. ''ధీయుత !'' యనుసంబుద్ధి యాభావమును స్థిరీకరించుచున్నది. మూలమున ననేకదేశము లని మాత్రముండ మారన యవి యద్రివనరమ్యము లని విశేషించి ప్రవరునిచిత్తవృత్తిని వ్యంజింపఁజేసినాఁడు. ''అనేకదేశముల్'' అనుసమాసమును బద్యపాదాంతమునందు సంధించి, పూర్వపద్యమునందలి సిద్ధవాక్యములకుఁ బ్రతిబింబభావమును గల్పించి, పద్యరచనమున సరితూకము నేర్పఱచుటయే కాక సిద్ధుని మాటలతోనే యాతని నెత్తిపొడుచుచున్నట్లు చిత్రించెను. 'త్రిమ్మఁరశక్యమె ?' యను ప్రశ్నయును నిట్లు కూర్పఁబడినదే. 'ధీయుత!' యనుటలోఁ దెలుఁగున "బుద్ధిమంతుఁడా!" యనెడు నొకానొక వెటకారపు స్ఫూర్తిని మారన పొదిగియుంచినాఁడు. "నీకు నెమ్మెయిన్ శక్యమె ?'' ''వేయును నేల నమ్మ నెద నీపలుకున్" అను వాక్యములందుఁ బ్రవరుని యవిశ్వాసమును స్ఫుటీకరించినాఁడు. లేఁబ్రాయపువాఁడైన యౌషధసిద్ధునిపై సమాన వయస్కుఁడైన ప్రవరుఁడు వయోనుగుణమైన కించిత్ప్రౌఢిమతో నిట్లొకవిసురు విసిరి

నట్లు మారన చిత్రించుటలోఁ గథాప్రయోజనము మఱియొకటి సాధింపఁబడుచున్నది. భూవలయవిశేషములు గన్గొన నెమ్మెయి నేరికి శక్యముకాదని ఘంటాపథముగాఁ జెప్పు యువప్రవరునకు నొక్కయాకుపసరుతో నొక్కపగలింటిలో యోజనసహస్రము యానము చేయువచ్చు నను విషయము తెలిసినచో నత్యాశ్చర్యజనకము కాఁగలదు. అప్పుడు సిద్ధుల మహిమలు ప్రాకృతులప్రపంచానుభవములకంటె మిన్నలైన యపూర్వవిశేషము లని ప్రవరుఁడును, తన్ముఖమునఁ బఠితయు నెఱుఁగఁగలరు. అప్పు డాయౌషధసిద్ధునిపైఁ గలుగు గౌరవభావమునకు మేర లుండవు. ఇట్లు పూర్వాపరసన్నివేశపరిశీలనమువలన నీసన్నివేశము రమణీయార్థస్ఫోరక మగుచున్నది.

ప్రవరునిశంకకు సిద్ధుఁ డిచ్చిన సమాధానము తెనుఁగున నతిరమణీయముగా రచింపఁబడినది.

ఉ. ఏ నొక సిద్ధుఁడ న్వినుమ మహీసురశేఖర! ధాత్రియంతయు
న్మానుగఁ బాదలేప మను మందుప్రభావమునం జరించితి
న్దానిఁ బదంబులందుఁ దగఁ దాల్చిన నెంతయు నిర్జితశ్రముం
డై నరుఁ డేఁగు యోజనసహస్రము నాపగలింటిలోపలన్. (4.218)

ఈపద్యపుబెత్తుగడయే గంభీరముగా నున్నది. సిద్ధుఁడు తననుగూర్చి సగర్వముగాఁ దెల్పుకొనిన యీవాక్య మమూలకము: మారన పాత్రోచితసంభాషణరచనానైపుణ్యమున కొక నిదర్శనము. సిద్ధునియీమాట ప్రవరునియనుమానమూలకమైన యపహాస్యమున కేర్పఱచిన యడ్డుకట్ట. దానివలన శ్రోత నాశ్చర్యమగ్ను నొనర్చి, యాతఁ డణిమాద్యష్టసిద్ధులచే నొప్పారువాఁ డను సపూర్వగురుభావము కలిగింపఁజేయును. ఆంగికాభినయముతో సిద్ధుఁ డాపదము నుచ్చరించునప్పుడు దెబ్బతినిన యతనియాత్మాభిమానము గౌరవసంరక్షణార్థము కదలికెరటమువోలె మేనువిఱుచుకొనుచు మిన్నంట లేచినట్లు తోపఁగలదు. ప్రవరుఁడు సిద్ధునివయస్థితినిగూర్చి ప్రకటించిన యనుమానమునకు వ్యంగ్యమధురమైన సమాధాన మందుఁ గలదు. సిద్ధులకు జరారుజాదిబాధ లుండవు. దానివలన వారు వయస్స్తంభనసిద్ధులై యుందురు. కావున నీకథలోనిసిద్ధుఁడు వయోవృద్ధుఁడైనను తేఁ బ్రాయపువానివలెఁ గానవచ్చుచుండె నను భావము "ఏ నొక సిద్ధుఁడన్" అనువాక్యమున వ్యంజింపఁబడుచున్నది. దీనిని అల్లసాని పెద్దన తనకావ్యమున గ్రహించి ప్రపంచించుటయే దానికిఁ బ్రబలతార్కాణము. "విను" అను విధ్యర్థకక్రియాపదమున సిద్ధుఁడు తాను ముందుఁ జెప్పఁబోవువాక్యములలోఁ దనమహత్త్వము వెల్లడియగు నన్న విశ్వాసముతోఁ గూడినధార్ష్ట్యమును వ్యక్తపఱచినాఁడు. 'మహీసురశేఖర' యనుసంబుద్ధి పూర్వపద్యమునఁ బ్రవరుఁడు వాడిన "మునివల్లభ" యనుపదమునకు దీటువచ్చుటకై వాడినది. ప్రవరునిసంబుద్ధి యతనివెటకారమును వ్యంజింపఁజేయుచుండగా, నీసంబుద్ధి సిద్ధునివిజయగర్వమును విశదపఱచుచున్నది. మూలమునఁ బాదలేప మను మంత్రౌషధి నాను మిప్పట్టునఁ జెప్పఁబడక, ప్రవరుఁడు పాదములకుఁ బూసికొనుచోటఁ జెప్పఁబడి

నది. మారన యౌచిత్య మెఱిఁగి యుచితస్థలమున నాయౌషధినామము నుచ్చరించినాఁడు. ''దానిఁ బదంబులందుఁ దగఁ దాల్చిన నెంతయు నిర్జితశ్రముండై నరుఁ డేగు యోజన సహస్రము నాపగలింటిలోపలన్'' అనువాక్యములను సిద్ధుఁ డాత్మపరముగాఁ జెప్పకొనినట్లు కాక సర్వసామాన్యవిషయముగాఁ బ్రతిపాదించినట్లు రచించుట మారన మూలాధికముగాఁ బ్రదర్శించిన శిల్పచాతుర్యము. దానిచే నాయౌషధి సర్వజనోపయోగ్యమైనదనునంశము తేటపడి ప్రవరుఁడు తదవకాశమును జూఱగొనుటకై యాత్రముపడుటకొక చక్కనిత్రోవ యేర్పడుచున్నది. ''పగలింటిలోపలన్'' అనుటలోఁ జివరనున్న ఏవార్థకస్ఫూర్తి నిశాసమయసంచారము నిషిద్ధ మని సూచించుచున్నట్లు తోచుచున్నది.

ఔషధసిద్ధనిప్రత్యుత్తరము ప్రవరున కత్యంతప్రీతికరమైనది. ప్రతినరుఁడును పాదలేపపరమౌషధధారణమునకు యోగ్యుఁడను సిద్ధసూచన మాబ్రాహ్మణుఁడు ప్రత్యేకముగా గమనించినాఁడు. దానిని ''ఊది'' యనుక్రియాపదమున మారన సూచించినాఁడు. సిద్ధుఁడు పాదలేపపరమౌషధప్రభావముచే ధాత్రియంతయు మానుగఁ జరించుప్రవృత్తి కలవాఁడు. ప్రవరుఁడు తనకు నట్టియిచ్ఛయే కల దని తెల్పుచు ధరఁ జూచు వేడ్క ''నాకున్'' హృదయంబునఁ బాయ దని గడుసరిగాఁ బలికి సముచ్చయార్థకవ్యంగ్యము నాశ్రయించి సిద్ధునితో సజాతీయసంకల్పసంబంధమును గలియఁబోసికొనినాఁడు (4.219). అట్టి పరమౌషధము నిచ్చి కృతార్థు నొనర్పు మని వేడుకొనినాఁడు; పరిహాసములు వీడి పాదార్చనలకు దిగినాఁడు. ఉదారచిత్తుఁడైన సిద్ధుఁ డతనికి పాదలేపము నిచ్చినాఁడు. అతఁడు దానినిఁ బాదమునఁ దాల్చి సంకల్పమాత్రముననే పవనరయమున హిమనగమునకు వెడలినాఁడు (4.220).

ప్రవరుఁడు పయన మగుచు మానసమున నిట్లు వితర్కించుకొనినట్లు మూలము :

శ్లో. సహస్రం యోజనానాం హి దినార్ధేన వ్రజామి యత్
ఆయాస్యా మీతి సంచింత్య తదర్ధే నాపరేణ హి ॥ (58.17)
(సంప్రాప్తో హిమవత్పృష్ఠం నాతిశ్రాంత తనుర్ద్విజ.......)

ఈశ్లోకభావమును మారన తెలుఁగుసేయక వదలెను. ఇది సంస్కృతప్రతు లన్నింటియందుఁ గానఁబడుచుండుటచేఁ బ్రక్షిప్త మనలేము. ఈశ్లోకము కథార్థములం దతుకుట లేదు. హిమవన్నగమునకుఁ బూర్వదినార్ధమున వెడలి యపరార్ధమునఁ దిరిగివచ్చుటకుఁ బ్రవరుఁడు సంకల్పించె నని యిందుఁ జెప్పఁబడినది. ఇట్లనినచో నిచ్చట కథలోఁ గాలైక్యము కుదురుట కష్టము. సిద్ధుఁడు ప్రవరునింటికి నతిథు లేతేరుసమయమున వచ్చి యుండవలెను. సామాన్యముగాఁ గర్మఠులైన గృహస్థులయం దపరాహ్ణమునఁ గాని భోజనములు కావు. ఆపై వారిరువురిసంభాషణ నడువవలెను. ఔషధి పాదములకుఁ బూసినవెంటనే ప్రవరుఁడు పయనమై వెడలినట్లు వర్ణితమైయున్నది. ఈలెక్కన నసలు బయలుదేరుటయే దినపశ్చిమార్ధమున జరుగుచుండగాఁ బోవుటకును, వచ్చుటకును, అచ్చటివిశేషములు దర్శించుటకును సమయము చాలదు. కావున నిట్టిచిక్కులతోఁ గూడిన

యీయంశమును వదలినచో కాలదూర పరిమాణములను గూర్చిన తకరారు లేకుండపోవు నని మారన భావించియుండియుండవచ్చును.

పైశ్లోకము ననువదింపక మానినను మారన యాఘట్టమునఁ బ్రవరుఁడు కాంచిన హిమవన్నగము నొకకందమునఁ బ్రత్యేకముగా వర్ణించెను. మూలమున నాపర్వతము నానాప్రస్రవణాన్విత మని మాత్రము పేర్కొనఁబడియుండ మారన సెలయేళ్లయూసులే యెత్తుకొనక—

క. చని బహులతుహినమహితం
బును నానారత్నరశ్మిపుంజస్ఫురితం
బును సిద్ధసాధ్యదివిజాం
గనాస్పదము నైన యన్నగమువిలసనమున్. (4.221)

వర్ణించెను. ఈవర్ణనమున మారన పరమౌచిత్యము పాటించెను. హిమవన్నగప్రసక్తి వచ్చినప్పుడు మొదటఁ దన్నగహిమమహత్త్వ మెన్నకుండుట నిజముగా నొకలోపమే కాఁగలదు. హిమనగముయొక్క మహితత్వము, స్ఫూర్తిమత్త్వము, దివిజాంగనాస్పదత్వము, నను మూఁడుగుణము లిందు వర్ణింపఁబడినవి. హిమముచే నగౌన్నత్యమును, రత్నదీప్తిచేఁ బర్వతేంద్రైశ్వర్యమును, దివిజాంగనాస్పదమనుటచే దివిజనివాసమహనీయత్వమును మారన వ్యక్తీకరించినాఁడు. దివిజాంగనాప్రసక్తి చేసియుండుటచే భావికథలో వరూథినీప్రవేశమునకుఁ బూర్వరంగముగా నీవర్ణనాంశమును మారన ప్రయోగించె నని యూహింప వీలగుచున్నది.

ప్రవరుఁడు హిమనగవిలసనములఁ బ్రీతితో నత్యంతకుతూహలమతియై కాంచుచు విహరించుచుండ నతనిపాదములకుఁ బూయఁబడిన పాదలేపము తుహినజలముచేఁ గరఁగిపోయెను. అతనిశీఘ్రగమనము చెడెను. కాని, యతఁ డద్దానిని గిరివిభవవిలాసాలోకనకుతూహలపారవశ్యమున గమనింప లేదు. అతనియం దంతకౌతూహలము పరిపోషింపఁ గలిగిన హిమన్నగవిలసనవర్ణనము మారన యాకర్షణీయముగ రచించి ప్రకరణోచితకావ్యార్థవర్ణనగౌరవమును గాపాడినాఁడు.

మూలము :

శ్లో. దద ర్శాతిమనోజ్ఞాని సానూని హిమభూభృతః ॥
సిద్ధగంధర్వజుష్టాని కిన్నరాభిరతాని చ
క్రీడావిహారరమ్యాణి దేవాదీనా మిత స్తతః ॥
దివ్యాప్సరోగణశతై రాకీర్ణా న్యవలోకయన్
నాతృప్యత ద్విజశ్రేష్ఠః ప్రోద్భూతపులకో మునే ॥
దృష్ట్వా చైతం ద్విజసులో హిమవంతం మహాచలమ్
శ్వో ద్రష్టా మీతి సంచిన్త్య మతిం చక్రే గృహం ప్రతి ॥
(58. 20-22; 26)

అనువాదము :

సీ. సురసిద్ధసాధ్యకిన్నరమనోహరకేళి
విలసితకందరవిభ్రమములు,
కలకంఠకులకంఠకలరవరంజిత
వివిధతరూద్యానవిలసనములు,
హంసరథాంగవిహారోల్లసన్నవ
నీరజాకరరామణీయకములు,
త్రిదివనితంబినీక్రీడాభిరమ్యల
తాగృహమహితసౌందర్యములును,

ఆ. దగిలి చూచి చూచి తలయూఁచి తలయూఁచి
మెచ్చి మెచ్చి విప్రుఁ డిచ్చఁ దనివి
చనక యింక నెల్లి చనుదెంచి యేర్పడఁ
జూతు నిన్నగంపుసొంపుఁబెంపు. (4.224)

ఈనగవర్ణనము శైలకాననాంచితసకలావనీతలవిశేషదిదృక్షువైన ప్రవరునిచిత్తవృత్తి కనుకూలమై యున్నది. అతఁడు హిమాచలము వెళ్లినది పుణ్యక్షేత్రసందర్శనమునకుఁ గాదు, కాలగకురహస్యవిహారపుణ్యప్రదేశములను జూచివచ్చుటకుఁ గాదు. వట్టి పర్వతరామణీయకము దర్శించుటకే. ప్రకృతిసౌందర్యరసపిపాసి ప్రవరుఁడు. కావున నతని కన్నులయెదుట పర్వతకాననకమనీయదృశ్యములే ప్రత్యక్షము లైనవి. కందరములు - ఉద్యానవనములు - నీరజాకరములు - లతాగృహములు - అచ్చటిగిరివన సంపదలు. సురసిద్ధసాధ్యకిన్నరమనోహరకేళులచేతను, త్రిదివనితంబినీక్రీడావిలాసములచేతను ఆకొండ యెల్లవేళలయందును సంకులమై శోభిల్లుచుండును. ' త్రిదివనితంబినీ క్రీడాభిరమ్యలతాగృహమహితసౌందర్యము ' లతఁ డప్పర్వతముపైఁ జిట్టచివర కనుగొన్నవిశేషము. ఇది భావివరూథినీసందర్శనసన్నివేశమునకు సహజపరిసరవాతావరణము గల్పించు సరసశిల్పము.

హిమవన్నగవిశేషసందర్శనకుతూహల మతిశయింపఁ బ్రవరుఁడు వీని నన్నింటిని గాంచినాఁడు. ''చూచిచూచి'' యను నామ్రేడితప్రయోగమున నాతనికుతూహలాతిశయము స్పష్టమగుచున్నది. తలయూఁచి, తలయూఁచి మెచ్చి మెచ్చి యనుటచే నపూర్వాభీష్టార్థవస్తు దర్శనావసరమునం దతఁడు ప్రదర్శించిన ప్రీతిని, పారవశ్యమును, మెప్పుకోలును, బ్రవరుని రసికహృదయమును వ్యక్తమగుచున్నవి. పద్యారంభమున నంకురావస్థలో నున్న కుతూహలము గిరిదర్శనముచేఁ బరిణతిఁ జెంది పద్యాంతమునఁ దనివితీరనియతనిలో జనించినపునర్దిదృక్షకు దోహదము కల్పించి సఫలమైనది. కుతూహలభావపరిణామవాహికగాఁ బద్యమును జిత్రించుట మారనరచనాశిల్పము.

హిమవారిఁ బెరసి పాదలేపము కరఁగిపోయిన దని తెలిసికొనిన ప్రవరునియందుఁ గలిగిన భావక్రమమును మారన సున్నితముగాఁ బ్రపంచించెను. పదములు జడభావ

మందుటచే నావిప్రునియందు మొదటఁ దోచినది భయము. అవిధ మేమియొకో యని వితర్కించుచు సదౌషధముకూడ కరఁగిపోయినందుల కాతని కాపై నాశ్చర్య ముకురించెను. గమనరయ ముడిగినందులకు దుఃఖము పొంగివచ్చెను. ఏల దైవ మీ ట్లిగ్గిరిభ్రమమునకుఁ దెచ్చెను ? ఇంటి కెవ్విధమున నేగుదు ? ఏమి చేయువాఁడ నేది తెరువు ? అనుమాటలలో నాదుఃఖము విపులరూపము తాల్చినది. నిత్యనైమిత్తికకర్మల కాఱడి పుట్టెనని యాతఁ డావేగ పడెను. ఇంటికిఁ జనునుపాయము దెలుపు నొకతపోధనుఁడైనను గానరాడా యనువితర్కముతోఁ గూడిన ప్రత్యాశను బ్రకటించెను. మూలమున నీభావములన్నియు నిట్లు స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడిలేవు. రసజ్ఞుఁడైన మారన కథార్థముల కనుగుణముగా నాభావములఁ దీర్చిదిద్దెను.

పాదలేప పదప్రయోగమునందు మారన యొనర్చిన చమత్కార మిచ్చట తప్పక చెప్పవలెను. సిద్ధునకుఁ బాదలేప మధీనమై యుండుటచే దానియం దాతనికి విశేషగౌరవ ముండదు. అతఁ డెప్పుడు దానిప్రస్తావన చేసినను 'మందు' అని మాత్రమే తేల్చి పలుకుచుండును. ప్రవరున కామహిమాన్వితమైనమందు అపూర్వమును, దివ్యమునై తోచినది. కావున ధానియం దతని కత్యంతగౌరవ మేర్పడినది. ఎప్పుడు దానిప్రసక్తి వచ్చినను 'పరమౌషధ' మనియో, 'దివ్యౌషధ' మనియో, 'సదౌషధ' మనియో విశిష్టార్థవిశేషణసహితముగనే పేర్కొనును. మారన యిట్లు రచించి పాత్రచిత్తవృత్తులను వ్యంగ్యసుందరములుగాఁ జిత్రించినాఁడు. హిమవారిఁ గరఁగిన పాదలేపమును 'మం' దని సామాన్యముగా వర్ణించినాఁడు. కాని ప్రవరుఁడు మాత్రము ఆదివ్యౌషధము మంచునీటికిఁ గరఁగిపోయెనా యని యబ్బురపడినట్లు పేర్కొనినాఁడు. అమోఘమహిమాన్వితమయ్యుఁ బాదలేపము పసరే, నీటఁ బెట్టినఁ గరఁగిపోవుట దానినైజగుణమే. యథార్థదృష్టి కిది యవలీలగా స్ఫురించును. కాని, ప్రవరుఁ డాపసరునందు దివ్యత్వారోపణము చేసి భావించినాఁడు కావున, నాతఁడు పసరు కరఁగిపోవు నని ముందు జాగరూకత వహింపలేదు. కవి రససిద్ధుఁ డగుటచే సందర్భశుద్ధి గలిగిన పదప్రయోగము చేసి పఠితకుఁ దదర్థస్ఫూర్తిఁ గలిగించి కృతార్థుఁ డైనాఁడు.

మూలమునందలి హిమవన్నగవర్ణనము నంతటినిఁ దెలుఁగునఁ గొనిరాకుండ మారన యొకచమత్కారము చేసినాఁడు. మూలకర్త హిమవంతమును నానాప్రస్రవణాన్వితముగాఁ బేర్కొనినాఁడు. (58.23-25). ఆమాటను పోషించుటకొఱకై గిరివనసంపదతోపాటు, గిరిఝరీసంపదనుగూడ కొంత వర్ణించుచు నొకచో రమణీయజలపాతమును, దత్తరంగనాదమునకు నృత్య మొనర్చు నెమిళ్లగుంపును బ్రవరునిచే దర్శింపఁజేసినాఁడు. కాని, మారన హిమనగప్రస్రవణత్వ మసలు వర్ణింపక వదలినాఁడు. దీని కొకకారణ మున్నది. అది మూలకర్తకంటె మారన యొక స్థిరమైనట్టియు, నిర్దుష్టమైనట్టియు కథాకథనమార్గము ననుసరించియుండుటయే. మూలమునఁ బ్రవరుఁడు కాననోపవనోద్యాననానానగరశోభితమైన వసుంధరను జూడ నభిలషించినాఁ డని తెలిపి, నానాప్రస్రవణాన్వితమైన హిమవంతమును గాంచ నేఁగె నని రచించుటలోఁ బూర్వాపరసమన్వయము

కొంఱవడుచున్నది. జీవనదీతటాంచలవాసి యైన ప్రవరుఁడు ఝరులను దర్శింప నేఁగినాఁడనుటకంటె గిరివనదర్శనార్థము నగరాజమున కేగినాఁ డనుటలో నౌచిత్య ముండు నని మారన యోచించి ప్రవరునిచిత్తమునందును, కన్నులముందును గిరివనసుందరప్రకృతినే స్ఫురింపఁజేసినాఁడు. హిమనగప్రస్రవణత్వమును వర్ణింపక వదలినంతమాత్రమున గథాగమనమున కెట్టిలోపము వాటింపకుండుటయు దాని నసువదింపక విడుచుటకు మఱియొక హేతువై యుండవచ్చును.

స్వారోచిషమనుసంభవకథలో రమణీయఘట్టము వరూథినీప్రవరుల సమావేశము. దీని యౌత్కృష్ట్యమును గుర్తించి మారన శిల్పసుందరముగాఁ దీర్చిదిద్దినాఁడు. ఇందలి శిల్పము విభావానుభావవర్ణనమునందును, సంభాషణలు తీర్చిదిద్దుటయందునుఁ బ్రత్యేకముగాఁ గలదు. ఇచ్చటఁ బఠితకు వరూథినీప్రవరు లాలంబనవిభావములు; వారిహావభావము లుద్దీపనవిభావములు, వారిచుట్టు నున్న గిరివనసుందరప్రకృతి తటస్థవిభావము. వీనిని రసానుకూలముగాఁ జిత్రించుట యిచ్చటి కథాకథనశిల్పము.

సిద్ధుని పాదలేపరసమాహాత్మ్యమువలన హిమగిరిశిఖరము నల్పశ్రమమునఁ జేరిన ప్రవరుఁడు ఔషధహీనుఁడై తపోధనుఁ డెవఁడైన కానఁబడునేమో యని వెదకుచుండుట చాలసహజము. దేవతాత్మయైన యప్పర్వతసానువులపై దేవర్షులును, మహర్షులును సమాధిగతులై యుండుట సర్వసామాన్యము. కాని, ప్రవరుఁడు కాళ్లరుగున గొంతదూరము తిరిగినను ఒక్కజడదారికూడ కానవచ్చినట్లు వర్ణింపఁబడలేదు. హిమవత్పర్వతమంతయుఁ ద్రిదివనితంబినీవిహారరమణీయముగనే పేర్కొనఁబడినదికదా! అట్టిచోటఁ దపోధనుఁడు కనవచ్చునా? కనవచ్చినచో నాతఁ డేపుకయోగీంద్రుఁడో కావలె నని పఠిత యుత్కంఠ వహించి యుండును.

ఇట్టిసమయమున వరూథినియను నప్సరోంగనను రంగముపైఁ బ్రవేశపెట్టుట సన్నివేశసంవిధానశిల్పదృష్టితోఁ గడుప్రశంసనీయము. వరూథిని లలితాంగకాంతిజితకాంచన, విభ్రమచంచదబ్జలోచన, కలహంసయాన (4.229). త్రివిష్టపవనితలకు సహజమైన మేనికాంతియు, భూలోకప్రకృతిసౌందర్యదిదృక్షాజాగృతములైన విశాలనేత్రములును, ప్రతిపదవిశేషవైభవమహనీయము లగు హిమవన్నగ విచిత్రవిలాసములను దర్శించుటచేఁ గలుగు పారవశ్యమును బ్రదర్శించు మందమగు నంచనడకయు నామెయందు సందర్భశుద్ధినిఁ గల్పించుచున్నవి. ఆపర్వతశిఖరములపై దట్టముగా నమరియున్న లతామంటపములందు నాకవనితలు విహార మొనర్చుచుండుట ప్రవరుఁ డాసక్తితో నిదివఱకే చూచి తలయూపినాఁడు. అట్టిదివిజాంగనలలో వరూథిని యొకతె. ఆమెయునికికిఁ బూర్వరంగము సిద్ధపఱచియే సహజముగాఁ బ్రవేశపెట్టినాఁడు పురాణకర్త.

వరూథిని ప్రవరునిఁ గాంచినది. సురవనితాసంకులమైన యాకోనలోఁ దపోధనునన్వేషించు నాబాపఁ డిప్పుడు దివ్యవనితామండలిని దర్శించుధోరణిలో లేఁడు. కావున, నప్సరోంగనయే యాతనిని ముందుగాఁ జూచిన దనుట యత్యంతసహజము. ఇట్లు ఘూచుటవలనఁ గథార్థములకు మఱికొన్ని ప్రయోజనములు సమకూరుచున్నవి. వరూథిని

ప్రవరుని వరింపనున్నది. కాని, యతఁ డామెకోర్కెను మన్నింపఁడు. ఇట్టి భావికథలో రతిభావము వరూథినియందే పుష్టము కావలెను. దానియందు పాత్రమనఃప్రవృత్తి ప్రతిబింబింపవలెను. వరూథిని స్నిగ్ధమును, ఆవేశసుందరమును నైన చిత్తవృత్తి కలది. అది యామె యనుభావములందు వ్యంగ్యరమణీయముగాఁ బ్రదర్శింపఁబడవలెను. మారన యిట్టికథాకథనమార్గము ననుసరించి యీసన్నివేశమును మలచెను.

వరూథిని విప్రుని, మకరాంకసన్నిభునిఁ, జూచి సంచలితాంతరంగ యైన దని మారన ! ఇందు ప్రవరునికి వాడినవిశేషణములు సాభిప్రాయములు. వరూథిని యతని యందు ప్రప్రథమమున విప్రత్వమును దర్శించినది. "విశేషేణ పాపేభ్యః ఆత్మానం పరం చ పాతీతి విప్రః'' అని గురుబాలప్రబోధిక. ప్రవరునియందలి యిట్టిలక్షణము కథతోఁ బ్రత్యక్షముగా ముడివడియున్నది. అతఁడు తాను పరస్త్రీసమాగమదోషము నుండి తప్పుకొనుటయే కాక - అన్యపురుషసంగమపాపమునుండి వరూథినిఁగూడ రక్షించెడి వాఁ డగుటచే నాతనియందు విప్రలక్షణము సార్థకమగుచున్నది. అతనియందలి రెండవగుణము మకరాంకసదృశత్వము. రత్యుద్దీపనశక్తియుక్తమగు నతనిమదనసౌందర్యదీప్తి దానియందు వ్యంజిత మగుచున్నది. మదనుఁడు మకరకేతనుఁడు. అతని కిది కాక పెక్కుపేళ్లు కలవు. వానినన్నింటిని వదలి మకరాంకాఖ్యము నిచ్చుట చెప్పుట కవి ప్రత్యేకత. మకరము నవనిధులలో నొకదానికిని, జలజంతువైన మొసలికిని పేరు. మకరనిధికి "మకర ఇవ గ్రహీతు మశక్యత్వాత్'' — ఆ పేరు వచ్చెనఁట ! ''మాయాం కరోతీతి మకరః'' అని మకరశబ్దవ్యుత్పత్తి. అంక మనఁగా సంజ్ఞ. భావికథలో వరూథిని నిధివలెఁ బ్రవరునిఁ బొందుట యశక్య మగును. కాని, చివరకు మాయాప్రవరునిఁ బొందును. దానిచే నామె యభీప్సితసిద్ధిఁ గాంచుచున్నది. అట్టియర్థము నన్యపదార్థప్రధానమైన బహువ్రీహిసమాసప్రయోగమున వ్యంజింపఁబడుచున్నది. పైకిఁ జూచివచో నీవిశేషణములు బ్రాహ్మణుఁడు, సుందరుఁడు ననుసామాన్యమైన యర్థము నిచ్చుచున్నను, లోఁగాంచినచో నింతసార్థకమైన యర్థసంజాతము నిముడ్చుకొని యున్నట్లు స్పష్టముకాఁగలదు. "సంచలితాంతరంగ'' యనుటచే సత్త్వసంపన్నమైన వరూథిని హృదయమున విక్రియారూపమైన రతిభావ ముత్పన్నమైన దను రసపరమైనయన్వయ మేర్పడుచున్నది. అంతేకాక ఇఁక పైన రసభావప్రతీతి వర్ణింపనున్నా నని కవి యిచ్చెడి సున్నితమైన సూచన మిది. ఇట్టిశిల్పసంపదయంతయు నమూలకము; మారన ప్రతిభాకల్పితము.

వరూథిని ప్రవరునిఁ గాంచి యిట్లు వితర్కించెను :

ఉ. ఈసుకుమారుఁ డెవ్వఁడొకొ యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజితభావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మొప్పఁ గడులాలసుఁడై ననుఁ జూచె నేని నేఁ
జేసినపుణ్య మెవ్వరును జేయరు కాముని దక్క నేలుదున్.

వ. అని మఱియును

ఉ. వీని సురూపవిభ్రమము వీని తనూద్గతచారుకాంతియు
న్వీని మృదూల్లసద్గతియు వీని వినిర్మలదృగ్విలాసము
న్వీని ముఖాంబుజద్యుతియు వేడ్కఁ గనుంగొన నింత యొప్పునే?
మానవదేవకిన్నరకుమారులఁ జూడనె? వారు నిట్టిరే?

గీ. ఈకుమారునిమీఁద నాహృదయ మిప్పు
డధికరాగరసోద్రిక్త మైనమాడ్కి
నితనిమనమును నాయందు నతులరాగ
లలిత మగునేని యది జన్మఫలము కాదె? (4.230-233)

ప్రవరుఁడు సుకుమారమూర్తి (4.214). అతఁడు దీనుఁడై కొండరాళ్ళలోఁబడి తిరుగుచున్నాఁడు. వరూథిని కాతనియం దాప్యాయతతోఁ గూడిన జాలి కలిగినది; అతని యపూర్వసౌకుమార్యమున కచ్చెరువు పొడసూపినది. త్రిదివనితంబినీక్రీడాభిరమ్యలతాగృహమహితమైన యాకోన కాతఁ డెందుఁడి వచ్చెనో యని యద్భుతము తోచినది. సమాధానము నపేక్షించుచు నామెయం దెన్నియో సంశయసంఘాతములు పుట్టుకొనివచ్చినవి. ఆమెచిత్తవృత్తి రత్యావేశమధురమైనది. తత్పారవశ్యమున విభావచర్వణము చేయుచు తజ్జనితభావపంక్తినే సమాధానతోరణములుగా నల్లుకొని మనోవీథి నలంకరించుకొనినది. ఆసుకుమారుఁ డెవ్వఁడు?—దీనికి ప్రవరాఖ్యుఁ డని ప్రత్యుత్తరము. ఆమె కావిషయము తెలియదు. కాని, యతఁడు రూపముచేతను, కాంతిచేతను భావజచంద్రులను జయించినవాఁ డని యామె తద్దర్శనమువలనఁ దెలిసికొనినది. ఆమె కాప్రాతిభాసిక, ఆలంకారికరూపచిత్రణమే వాస్తవికవిభావము నలౌకికరసమూర్తిగాఁ బ్రత్యక్షీకరింపఁ జేయుచున్నది. వరూథినీప్రథమదర్శనక్షణమున ప్రవరుఁడు "మకరాంక సన్నిభుఁడు". వితర్కావసరమున నతఁడు 'భాసురరూపకాంతిజితభావజచంద్రుఁ' డయ్యెను. ఇచ్చట మన్మథచంద్రాదులకంటె నాధిక్యము భావింపఁబడుటలో వరూథినీరత్యుద్దీపనము వ్యంజింపఁబడుచున్నది. 'రాగలీలాసరస్వత మొప్పఁ గడులాలసుఁడై నను జూచెనేని యనుటలో స్వీయావస్థకుఁ దుల్యమైన యవస్థ నెదుటివానియందుఁ గలుగునట్లు కోరెడి యావేశమును, "చూచెనేని" యనుటచేఁ బ్రియతమములైన వస్తువులవలనఁ గలుగు స్వల్పఫలమునకుఁగూడ సంతృప్తిపడెడు నల్పసంతోషమును వ్యక్తము లగుచున్నవి.

ప్రవరుఁ డెందులనుండి వచ్చెనో యనుసందేహముతోపాటు- ఎందులకు వచ్చెనో యను సంశయముకూడ వెంటనే స్ఫురింపక మానదు. సురగంధర్వాప్సరోంగనాసంకులమైన యగ్గిరిసానువులయం దతఁ డెవ్వతె నైనవలచి వచ్చెనేమో యని స్ఫురించుట సహజవిరుద్ధము కాదు. అప్పుడు స్త్రీసహజమైనయీర్ష్యాదులు వరూథినికిఁ గలుగుటయు సహజము. అట్టియెడ నాతఁ డామెపై వు రాగలీలాసరసత్వ మొప్పఁ గాంచినచో నది పుణ్యవిశేష మని భావించుట యుచితమే యగును. కాముని దక్కనేలుదు ననెడి గర్వోహర్షో

తత్కర్షయు యోగ్యమే యగును. కావున, వాగ్వృత్తిచేఁ జిత్తవృత్తిని వ్యంజించుశిల్ప మీ వాక్యములందు మారన పొదివినట్లు స్పష్టమగుచున్నది.

అచ్చమైన యాశ్చర్యభావము నొక్కపద్యమంతటఁ బఱచి మారన ప్రపంచించుటచేఁ బ్రవరునియపూర్వసౌందర్యము వ్యంగ్యసుందరముగాఁ జిత్రింపఁబడినది. ప్రవరుని సురూపవిభ్రమమును, దనూద్గతచారుకాంతియు, మృదూల్లసద్గతియు, వినిర్మలదృగ్విలాసమును, ముఖాంబుజద్యుతియు- క్రమముగాఁ బేర్కొనుటయం దొకసార్థక్యము కలదు. మందగమనమున వరూథినీసమీపభూమికి వచ్చుచున్న ప్రవరునిస్వరూపము నామె వివిధభంగిమలలోఁ జూచినవిధము భాసింపఁజేయుట పైశిల్పప్రయోజనము. వరూథినీ ప్రథమవీక్షణము ప్రవరస్వరూపముపై వ్రాలినప్పు డాతఁడు కొంతదవ్వుననే యున్నాఁడు. అతఁ డొకకాంతి సంఘాతమువలెఁ గనుపట్టినాఁడు. తదర్థస్ఫూర్తికే 'సురూపవిభ్రమ' మను సమాసము వాడుట. అందు రూపశబ్దముచేత నతని యాకారమును, శరీరవర్ణ విషయమును, సౌందర్యమును, విభ్రమశబ్దముచే నాతనియాకృతికి వస్త్రభూషణాదులవలన నేర్పడు కాంతివిశేషమును నిరూపించుట యొకప్రయోజనము. సురూపవిభ్రమ మను సమాసమునందలి వ్యంగ్యార్థశక్తివలన నాతనియందు వేదోక్తకర్మాచరణనిష్ఠచే నావరించి యున్న హుతవహదీప్తి యతనినిఁ గాంచిన వరూధినికి- రూపుకట్టినయగ్నియా యను భ్రాంతినిఁ గలిగించుట మఱియొకప్రయోజనము. వరూథిని యీపలుకు లనుచున్నప్పుడు ప్రవరుని యాకృతియందలి కాంతి యనుగుణము తనూద్గత మైనదా ? వస్త్రభూషణాద్యలంకారసంభూత మైనదా ? యను నంశమున విస్పష్టమైనతెలివిడి లేదు. తెలియుటకు వీలు లేనంతదూరమున నతఁ డుండుటయే దానికిఁ గారణము. "వీనితనూద్గతచారుకాంతియున్" అని పల్కెడువేళకుఁ బ్రవరుఁడు మఱికొంత సమీపమునకు వచ్చెనని స్పష్టపడుచున్నది. అందువలననే తత్సురూపవిభ్రమమునకు హేతువు తత్తనూద్గతచారుకాంతి యని స్పష్టమైనది. అతనియందు మొదట స్ఫురించినయగ్నిగుణము మనోహరముగా భాసించిన దగుటచే నామెమనం దంకురించిన ''వేడ్క'' ''రతి'' భావముగాఁ బరిణమించు క్రమము సూచింపఁబడుచున్నది. సుకుమారమూర్తి యగు ప్రవరుఁడు పర్వతమార్గమున సంచరించుచుండుటలో నడుగడుగునఁ బొడగట్టు సౌకుమార్య మతఁడు మఱికొంత సమీపస్థుఁ డైనప్పుడు స్పష్టమైనది. సిగపువ్వువాడక బ్రతికిన సుకుమారుఁ డాశైల వనాంతరమున నడువలేక నడచుచుండుటలో నతిశయించు తనూవిలాసభంగిమలచారుత్వము చూచి జాలిపడు వరూథినియందు రత్యుద్దీపితమైన యాదరమును, అభిమానమును, రక్తియు, సహానుభూతియు వ్యక్తపడుచున్నవి. "వినిర్మలదృగ్విలాసము'' లతని నిష్కాపట్యమును, సారళ్యమును, సాత్త్వికగుణసంపదను నొకవైపు తేటపఱచుచునే జన్మసిద్ధమై యున్న రసికహృదయమును బట్టియిచ్చుచున్నవి. తపోధనునికొఱ కన్వేషించుసౌత్సుక్యమున నిమగ్నమైయున్న యతనిస్వచ్ఛమైనచూపులసొంపులు విలాసబంధురము లగుటచే వరూథిని యతఁ డన్యకాంతాసక్తుఁడై వచ్చినవాఁడు కాఁడనియు, భోగతృష్ణతో నతనిదృక్కులు పరిభ్రమించుచున్న వనియుఁ, దద్వీక్షణములకుఁ బాత్ర మగుటచేఁ దాను

కృతార్థ యగు ననియు భావించుట కవకాశము కలిగినది. వరూథినికిఁ బ్రవరుని 'ముఖాంబుజద్యుతి' కనవచ్చు నప్పటి కాతఁ డామె కతిసన్నిహితుఁ డయ్యెను; పద్మ సాదృశ్యముచే నుత్తమత్వకోమలత్వాదులు వ్యంగ్యము లగుచున్నవి. 'ముఖద్యుతి' బ్రహ్మ తేజస్సునకు సంకేతము. ప్రవరునియందు సర్వవిశిష్టాంశము లపూర్వముగ నేకత్ర సమన్వయము పొందియుండుటచే "నింత యొప్పునే" యని వరూథిని యాశ్చర్యము ప్రకటించినది. నరదేవకుమారులకంటె మిన్న యగుటచేఁ బ్రవరునిసౌందర్యాతిశయ మతి లోకరమణీయ మని వ్యంగ్యము.

వరూథిని ప్రవరునిరూపకాంతులను గాంచి, యతనిని మోహించి కామించినట్లు చెప్పుట యీసన్నివేశసార్థక్యము. అట్టితాత్పర్యమును దెలుపుట కిచ్చట వాడినరూపకాంతి శబ్దములు శక్తిమంతములు. ''రోపయతి విమోహాయ తీతి రూపం'' రుపు విమోహనే. ఇది మోహింపఁజేయునది కావున రూపము. "కామ్యత ఇతి కాంతిః. ఇ. సీ. కము కాంతౌ_ ఇది కోరఁబడుచున్నది కావున కాంతి" అని గురుబాలప్రబోధిక. ఈ శబ్దముల కింత ప్రాధాన్యము గల్పించి రచించుటలోనే మారనశిల్పశక్తి యిమిడియున్నది. కాంతిమత్త్వము దేవవనితాభోగార్హత నతనికిఁ బ్రసాదించినది. సురూపము వరూథినీహృదయాకర్షక మైనది. రూపమునకు మోహపెట్టుగుణము సహజము. దానిచే నరుఁ డింద్రియలోలుఁ డగు చున్నాఁడు. తచ్చిద్ధివలనఁ గలుగునది యింద్రియసుఖము. కాంతికిఁ గోర్కెఁ గలిగించు లక్షణము సహజము. కామ్యసిద్ధిచేఁ గలుగునది యాత్మసంతృప్తి. ఈ కథయందు వరూథిని కింద్రియసుఖము కలిగించినది మాయాప్రవరుఁడు. కామ్యసిద్ధినిఁ బ్రసాదించి నది. ప్రవరునిదహనశిఖావిస్ఫురితశరీరకాంతి. సహజస్ఫోరకమైన ప్రవరునిదేహకాంతి యతనిశరీరమునందు సన్నిహితుఁడైన యగ్నిదేవుఁడు స్వయప్రభామండలమును బరివేష ముగా నునిచినప్పుడు విశేషముగా స్ఫురించి యాకృతిఁగొన్న యగ్నితేజమువలె రాణించిన దని భావికథలో స్పష్టము కాఁగలదు. సహజోద్బుద్ధమైన ప్రవరపావకతేజస్సంపదను వరూథినీహృదయమున భావింపఁజేయుటచే నతనితేజోంశమై యామెకు జన్మించు స్వరోచియందు రోచిస్సు జన్మసిద్ధమై భాసించుటకుఁ గథార్థములందు సహజహేతువును గలిగించు పరమప్రయోజనము సాధింపఁబడుచున్నది. మోహప్రధానమైనరూపముఁ దాల్చిన గంధర్వుఁ డవివేక మను నాంధ్యము గల్పించి వరూధిని నుపభోగించును. తన్మూలమున స్వరోచికిఁ బాంచభౌతికమైనశరీరము కల్పితమైనది. అనఁగా స్వరోచి యందలి రూపకాంతులు క్రమముగా మాయాప్రవరసత్యప్రవరదత్తము లని భావము. ఇట్టి భావిగంభీరకథార్థములకు మూలములుగాఁ బ్రవరునిరూపకాంతులను వర్ణించుట యిచ్చటి శిల్పతాత్పర్యము.

ప్రవరసుందరమూర్తిని కన్నులార చూచి, మనసార కోరుకొనినది వరూథిని. ఆమె యతనిని ముందుఁ జూచుటవలనఁ గలిగిన ఫల మది. ఆమె విభావచర్వణముచే రసోద్దీప్తహృదయ యైనది. దర్శనమాత్రముననే యుద్దీప్త మగు స్వభావము వరూథినిది. ప్రవరుఁడును దనను గాంచి తనవలె నతులరాగ రసోద్దీప్తుఁడు కాకపోయినను రాగ

లలితుఁ డైనను చాలనుకొని కోరుకొనినది. అట్లు జరిగినచో నది జన్మఫల మని యెంచినది. అపరిచితుని కలయ పెరుంగని యబల యెంతవఱ కూహించి యెంతభవితవ్యమునకు వదలఁగలదో చక్కఁగా భావించి సహజత్వమున కెచ్చట లోపము రాకుండ కవి పల్కించిన మాట లివి :

వరూథిని తనకభిముఖముగా వచ్చుచున్న ప్రవరునిసౌందర్యము దర్శించినకొలఁది రత్యుద్రేకముతోఁ గూడిన పారవశ్యమును బొందినది. ఆయవస్థను "మనసిజశరనికరదళితమానస" యైన దని వర్ణించి కవి చెప్పినాఁడు. అటుపైన వరూథిని రత్నపుత్త్రిక వోలె విప్రునిముందు నిల్చినదఁట! (4.234). మూలమున "ఆత్మానం దర్శయామాస కమనీయతరాకృతిమ్"- అని (58.42) తనను తాను కనఁబఱచుకొనిన దని మాత్రమే యుండ మారన వరూథిని ఆవేశస్వభావమును వ్యంజింపఁజేయుటకై యాతనియెట్టయెదుట బొమ్మవలె నిలువఁబెట్టినాఁడు. ''రాగసాగరమగ్నయై- కదిసి, భూసురవరుఁ జక్కఁ గౌఁగిలించి'' పైఁబడు సాహసమునకును, సన్నివేశమునకును నిది ప్రాతిపదిక; ప్రథమ సోపానము.

ప్రవరుఁడు వరూథినిని సమీపించి 'నీ వెవ్వతెవు? ఇచట నేకతంబ యేల యున్నదానవు?' అనిప్రశ్నించెను (4.235). 'ఏకతంబ' యనుపద మమూలకము. దానివలనఁ బ్రవరునిపలుకునకు గడుసుఁదనమును, అనుద్దిష్టమైనను నర్మగర్భవాక్యప్రాగల్భ్యమును గలిగి రాగరసోద్రిక్తమైన వరూథినీచిత్తవృత్తికిఁ బోషకమై పరిఢవిల్లును. ప్రవరుఁడు వరూథినిప్రత్యుత్తరము వినకయే స్వీయచరిత్రము చెప్పుకొనినాఁడు. అతనియావేదన యతనిది. ఎదుటివా రెంతమహాత్ము లైనను వారిచరిత్రవిశేషములు వినునోపికయు, సమయమును నాతనికి లేవు. అందువలనఁ దనహిమాచలయాత్రావిశేషములను నివేదించి నాఁడు. వరూథిని 'ఏకతంబ' యేల యున్నదాన వనుప్రశ్నలో వ్యంగ్యముగా స్ఫురించునది ప్రవరునిరసికహృదయ మని భావించి తనమనోభీష్టమునకు శుభశకున మైన దని యెంతయు సంతసించి, యతఁడు తన తెఱఁగంతయుఁ జెప్పుటలో వ్యక్తముచేయుచున్న స్నేహవిశ్వాసముల నెంచి తానును జనవుతో మాటలాడి మనసును మాటమాత్రముగా నందించినచో నతఁడు గ్రహించు నని భ్రమపడినది.

'మునితనయా! నేను వరూథిని యను నచ్చరలేమను. అనుపమబహురత్ననితాంతకాంతిసంపద నొనరిన యిగ్గిరిఁ జరించుచుందును. సుందరమూర్తీ! నీవిలసనంబు గనుఁగొని భావజునలరంపవెల్లి పాల్పడితిని. నన్ను రక్షింపుము'' (4.236-237) అని పలికినది. మారన యీవాక్యరచనమున శిల్పపాండిత్యమును బ్రదర్శించినాఁడు. మూలమున వరూథిని రమణీయ మగు హిమాచలమున సంచరించుచున్నా నని మాత్ర మనెను. తెలుఁగున బహురత్నకాంతిసంపద నొప్పారు గిరివైభవమును గాంచుచు సంచరించుచున్నట్లు చెప్పఁబడినది. ప్రస్రవణాన్వితమైన శోభను వదలి నానారత్నరశ్మిపుంజస్ఫురితమైన గిరిసౌందర్యమును మారన యొకపద్యమున వర్ణించినాఁడు. (4.221)

పూర్వాపరకథార్థవైరుధ్యము లేకుండున ట్లీమార్పు తోడ్పడినది. 4.237వ పద్యము నందలి వరూథినీవాక్చాతుర్యము మారన ప్రతిభాజన్యమే.

మూలము :

శ్లో. సాహం త్వద్దర్శనా ద్విప్ర ! కామవైక్లబ్యతాం గతా
ప్రశాధియ న్మయాకార్యం త్వదధీనాస్మి సాంప్రతమ్॥ (58.47)

మూలమున 'నీదర్శనము'వలన ననియుండఁ దెలుఁగున 'నీవిలసనంబు' గనుఁగొనుట వలన యని మార్పఁబడినది. విలసనశబ్దముచేత నాతనియందలి రూపజితమకరాంకత్వ మును, దృగ్విలాసములను, నర్మగర్భవాక్చాతుర్యములను గాంచి వరూథిని భావించిన తెలుఁగు స్పష్టమగుచున్నది. 'నీవిలసనము గాంచి మన్మథునిబాణములవెల్లువలోఁ బడి నాను. రక్షింపు' మనుటలోఁ జక్కనిగడుసుఁదనము కలదు. 'నాదారిన నేను పోవు చుండ నీవు కనఁబడుటయే దోసమైనది. నిన్నుఁ గాంచుటవలన నే నిట్టిమన్మథావస్థకుఁ బాల్పడవలసివచ్చినది. నీట ముంచినవాఁడవు నీవే. మఱలఁ దేల్పవలసినవాఁడవును నీవే !' యని చమత్కరించి యతనిసౌందర్యాతిశయమును వ్యంగ్యముగాఁ గీర్తించినది. 'సుందరమూర్తీ ! ' యనుసంబుద్ధి వాక్యాంతమున నిబంధించుటవలన వరూథిని పొందెడు వివశత్వదైన్యత్వాదులు వ్యజ్యమానము లగుచున్నవి.

దీనికిఁ బ్రవరుఁ డిచ్చినప్రత్యుత్తరము మఱియుఁ జమత్కారముగా రచింపఁబడి నది. ఇంతగా వరూథిని పెట్టుకొనినయర్జీ వినఁబడినట్లైనను కనఁబడఁ డాబ్రాహ్మణ ప్రవరుఁడు. "ఇందువదన ! నిత్యకృత్యము ల్సలుపఁగా నే నిపుడ నిజగృహంబున కరుగ వలయును. చనునుపాయ మేయది ? చెప్పి నన్ను సముద్ధరింపుము. నిత్యక్రియాహాని పెంపు నణచును"- అని తనగోడవయే తాను వెళ్ళఁబోసుకొనెను. వరూథిని ప్రవరునిఁ గాంచి యంపవెల్లిలోఁ బడినదఁట ! ఆమెను రక్షింపవలెనఁట ! ఆమె యాత్మరక్షణ నర్థ్యర్థించి నది. అతఁడును ఎత్తుకుఁ బైయెత్తు వైచినట్లు నిజగృహమునకుఁ జనునుపాయము సెప్పి, సముద్ధరింపు మని యడిగినాఁడు. కాయకు కాయ చెల్లు. కాని, యీమాటలలో నొకగూఢా ర్థము కలదు. "నన్ను చూచుటవలననే నీ కింత యిక్కట్టు వచ్చినది. ఇంక నాతోడి సంభాషణమువలన నీ కెంతవిపత్తు రానున్నదో కావున నన్నీగిరితటమునుండి పంపి, నిన్ను నీవు రక్షించుకొనుము. నాకును నింటియొద్ద నిత్యకర్మలు కలవు. "ఇట్లిద్దఱము విడిపడుటచే నిద్దఱకును నిత్యక్రియాహాని జరుగదు. నిజమునకు నిత్యక్రియాహాని పెంపు నడఁచు" నని తెలిపినట్లు తాత్పర్యశక్తివలన స్ఫురించుచున్నది. ఇదియే యిందలి చమత్కారము.

నిత్యకర్మానురక్తిచే నింటి కేగఁ ద్వరపడుప్రవరునకు భోగానక్తినిఁ జూపి, వరూ థిని తనతో భోగింప వేడినది :

మ. ధరణీదేవకుమార ! యి ట్లనకు ముద్యత్ప్రీతి నన్నాని నీ
కరుగంగాఁ దగునెట్లు ? మేలె యతిరమ్యం బై వసింపంగ ని

గ్గిరికంటె న్భవదీయగేహ; మెలమి న్గ్రీడింపు నాతో మనో
హరకేళీగతి; నెందుఁ బోకుము సుహృద్వ్యామోహ ముప్పొంగఁగాన్.
(4. 240)

'ధరణీదేవకుమార!' యని సంబోధించుటలోఁ బ్రవరుఁడు భూమియం దవతరించిన దేవకుమారునివలె నుండె ననియు, నాతఁడు సురలోకనివాసయోగ్యుఁ డనియు, సురవనితానుభోగయోగ్యుఁ డనియు వరూథిని భావించుచుండుట స్పష్టము. 'ఇట్లనకు' మని వారించుచుఁ బ్రవరుని నిజగృహగమనప్రసంగము - అతనికిఁ బ్రీతిపాత్ర మగున ట్లామెకుఁ గా దని సూచించినది. 'నన్ బాసి' యని పేర్కొనుటలో నతనిదృష్టికి దయనీయమైన తన యవస్థను తేటపఱచి ప్రసన్నునిఁ జేసికొనవలె ననియు, నత్యంతదుర్లభ మైన యప్సరోంగనాసంగమము నింతసులభముగాఁ బ్రసాదించు తనమంచితనమును బ్రదర్శింపవలె ననియు భావించినది. సిరి రా మోకా లొడ్డుట తగనిపని యని యౌచిత్యవిచారచర్చ చేసినది. అతిరమ్యమైన పర్వతరామణీయకమును జూపి, యతనిగృహానురక్తిని విఘుపయత్నించినది. మనోహరకేళీగతి నామెతోఁ బ్రీతిఁ గ్రీడింపఁ గోరినది. మనోహరకేళీగతి యనుటలో నామె యాతనిని భర్తగా భావించి దివ్యసంసారభోగముల నందింపఁగల దనియు సూచించినది. ప్రవరుని గృహోన్ముఖునిఁ జేయుచున్నది యతని సుహృద్వ్యామోహ మని నిరూపించినది. అట్టివ్యామోహమును జయించి తనపై మోహము పెంచుకొను మని వేడుకొనినది. ''ఎందుఁబోకు'' మని లాలించుటలో నామె యాతనివియోగమును భరింపలే దను భావమును సూచించినది. హిమవన్నగసానుతలమున వరూథిని తనదివ్యమహిమచేఁ గల్పింపఁబడు దివ్యభోగములను దరువాతిపద్యమున (4.241) వివరించినది. 'భవదీయమందిరమున నిట్టి దివ్యభోగములు కలుగునే?'' యని ప్రశ్నించినది. అతనినిశ్చలపై ఖరి యామెకు వెఱ్ఱి యెక్కించినది. ఉద్వేగ్నస్వభావ యగు నామెయందు సహజముగాఁ బొంగుచున్నరాగము నామె యదుపులోఁ బెట్టుకొనఁజాలకపోయినది. 'రాగసాగరమగ్నయై రాజవదన కదిసి భూసురవరుఁ జక్కఁ గౌఁగిలించినది. 'రాగసాగర' మను రూపకసమాసబలముచే నామెయందు నీట మునిఁగిన యాపన్నతరణోపాయము నపేక్షించి యెదుట కనఁబడిన యాదరువును జేతఁబట్టెడి సహజలోకవృత్తానుకృతి భాసించుచున్నది. దానిచేఁ బతిత కాపాత్రయందు సాదరభావ మేర్పడఁగలదు. ఇచ్చట వరూథిని ప్రవరునిఁ గౌఁగిలించుసన్నివేశమును గల్పించుటలోఁ బురాణకర్త కొంతత్వరపడె నని సామాన్యదృష్టి కనిపింపవచ్చును. కాని, యది యసహజము కానట్లు మారన జాగ్రత్త వహించినాఁడు. వరూథిని నిర్ఝరిణివలె వేగప్రవృత్తి కలది. ప్రవరుఁ డచంచలమును, శిలాప్రాయమును నైన ధీరప్రవృత్తి కలవాఁడు. నిర్ఝరిణి తనకల్లోలతరంగహస్తములతో గండశిలను గౌఁగిలించుట సహజము. తీవ్రములైన రెండువిరుద్ధప్రవృత్తులసంఘర్షణమును జిత్రించుటలో సామాన్యముగాఁ బ్రబంధములందుఁ గనఁబడు క్రమవికాసపరిణామచిత్రణమార్గముకంటె హఠాత్పరిణామచిత్రణమే యెక్కువ ప్రయోజనకారి కాఁగలదు. దానివలన నొక యపూర్వత భాసించును.

కాని, యట్టిపట్టునను దగినంత విభావాదిపోషణము జరుగకపోయినచో నది దోషమే యగును. మారన ప్రవరునిరూపవిభావచర్వణముచే నుద్విగ్నయైన వరూథిని నాతని గృహోన్ముఖభావచర్వణముచే నుద్వేగవతిగా మార్చి, రతిభావసంసిద్ధికై యావేశపడినట్లు స్పష్టముగను, సామర్థ్యముతోడను నిర్వహించియుండుటచే నీసన్నివేశమున నిర్మాణ శిల్పము దెబ్బతినలేదు. పైగాఁ బాత్రస్వభావవ్యంజకమై రాణించినది.

గాఢాలింగనము చేయు నయ్యంగనను గాంచి, ప్రవరుఁడు మృగాక్షి! నన్నంట కంటకు మని వారించి, నీకు సదృశుఁడగు వాని నన్యుని వెదకుకొను మని బోధించి, నిన్ను నొకటి యడుగంగ నీవు వేఱయొకటి గోరి నన్నొంద నుచిత మగునె? యని గర్హించినాఁడు. అనలునియందు రేపుమాపులు వ్రేల్వగాఁబడు హవ్యములచేఁ బుణ్యలోక ముల నవలీలగాఁ బడయవచ్చు ననియు జగత్త్రయము హవ్యప్రతిష్ఠిత మనియుఁ జెప్పి, స్వీయనిత్యనైమిత్తికకర్మప్రాశస్త్యము నుగ్గడించినాఁడు; మూలమునఁ బ్రవరుఁడు వరూ థినిని "దుష్టే! మూఢే"! యని సంబోధించెను. కాని మారన యామాటలు వాడక, మృగాక్షి! పౌలఁతి! యను సంబుద్ధులనే వాడి ప్రవరుని సౌకుమార్యమును మాటల యందును బోషించినాఁడు. ప్రవరుఁడు "నీకు సదృశుఁ డగు వాని నన్యుని" వెదకుకొను మనుటలోఁ బరస్త్రీవైముఖ్యమును బ్రదర్శించుటతోపాటు వరూథినియొక్క లజ్జావిరహిత మోహావేశమును గర్హించుచు సజాతీయస్వభావుఁ డగు నన్యుని నెన్నుకొను మని నిర్దేశించి నాఁడు. "దివ్యభోగములు మీయింటఁగలవా?" యని యవహేళనము చేసిన వరూథిని మొగము వాడునట్లు "నీ వెరుగవు" అని యామెయజ్ఞానము నెత్తిచూపుచు, నిత్యాగ్ని కార్యమువలనఁ బరమపుణ్యలోకములు సులభసాధ్యము లగునని యుపన్యసించినాఁడు. భోగైకప్రధానమైన స్వర్గముకంటె మిన్నయైన సత్యాదిలోకములందలి నిత్యవాసము భూలోకమున ముముక్షువులచేఁ గోరఁబడుచున్నది. భోగజీవులగు దేవతల కాతత్త్వ మవగతము కాదు. మోక్షము జిజ్ఞాసువైన మానవుని మహాధనము. దేవతల కది లేదు. అందువలననే ప్రవరునియాలోచనధారయు, వాదాంశపరంపరయు వరూథిని కవగతము కావు. అతనిమాటల కామె విస్తుపోయి "నాయందు నిగ్గిరియందును నీకుఁ బ్రియ మేల నెలవుకొనదు? విద్యాధరులను విడిచి మనుష్యుల కడ కేల యరుగంగఁ గడఁగెదు" వని ప్రశ్నించెను. ప్రవరుఁడు "నీ నెఱుఁగ" వనిన మాట సార్థకము చేసి సహజధోరణిలో మానవులపొత్తుకంటె విద్యాధరసాంగత్యము మిన్న యని ప్రతిపాదించినది. ప్రవరుఁడు వరూథినీసంస్కారమును గమనించి తనహృదయమును విస్పష్టముగను, సూటిగను వ్యాఖ్యానింప నెంచినాఁడు. 'విను' మని యామెను హెచ్చరించినాఁడు. "ధర్భలు, నరణులు, వేదికలును, అగ్నులును నాకుఁ గరముప్రియం బొనర్చు గాని యొండందుఁ బ్రియ మెదఁ గలుగ" దని తేల్చిచెప్పినాఁడు. ఈమాటలలో వ్యంగ్యముగాఁ బ్రవరుఁడు గృహస్థుఁడైన బ్రాహ్మణునిధర్మము నిర్వచించినాఁడు. ఆగమోదితకర్మజాతనైష్ఠికత్వము గార్హస్థ్యము. రేపును మాపును ననలునియందు హవ్యము లుంచుట గృహస్థుని కర్మనిష్ఠ. అది యతనికి శాశ్వతపుణ్యలోకావాసఫలప్రదమగుచున్నది. పరమపురుషార్థబుద్ధియైన ప్రవరునిజీవిత

వర్తనమున కుపకరణములై తోడ్పడుచున్నవి దర్పలు మొదలైనవి. కావున నవియే యతనిగృహమున నతనికిఁ బ్రీతిపాత్రము లగుచున్నవి. అన్యము లగుట లేదు. అతఁడు గృహమున కేగునది మానవులను బిలుముకొనుటకుఁ గాదు, హవ్యప్రసాధనముకొఱకు. ఈభావమును పైవాక్యములందు వ్యంజింపఁజేసినాఁడు ప్రవరుఁడు.

గార్హస్థ్యధర్మనిష్ఠామయమూర్తియై యెదుట నిలిచియున్న ప్రవరుఁడు హిమనగశిఖరముకంటె నెత్తుగాఁ గనఁబడినాఁ డావరూథినికి. అతనిధర్మధాటి కామె నిలువలేక పోయినది. మార్గాంతరము లేక దీనయై దయాభిక్ష నభ్యర్థించినది. సకలధర్మగుణసంఘాతమునందు దయ కున్నతస్థానము కల దని పేర్కొనినది.

ఆ. అఖిలధర్మవేది వైన నీనుగుణాష్ట
కంబు ముఖ్యగుణము గాదె కరుణ
దానిఁ బూనవలదె తథ్యము నాయందు
దయకు సరియె యొండుధర్మ మనఘ !

క. దయఁ బోల వధ్వరంబులు
దయఁ బోలవు వివిధభూరిదానచయంబు
ల్దయఁ బోలవు జపతపములు
దయ తలపోయఁగ విశిష్టతమధర్మ మిలన్. 4.245-246

ఇందు మొదటిపద్యపు చివరిపాదమును, రెండవపద్యమంతయును మారన స్వీయకల్పితములే. అట్లు కల్పింపఁబడిన వరూథినివాక్కులయందు గూఢమైన చమత్కారమొండు కలదు. ప్రవరుఁడు బుద్ధివాది. వరూథిని హృదయవాది. బుద్ధి నిత్యకర్మాచరణప్రాశస్త్యమును వివేకముచే గుర్తించుచున్నది. హృదయము ధర్మాధర్మవిచక్షణారహితమైన భోగైకసిద్ధిని గోరుచున్నది. హృదయవాది తనయభిమతమును ధర్మబద్ధ మని నిరూపించి బుద్ధివాదికి నచ్చఁజెప్పవలెను; బుద్ధిని హృదయముచే నార్ద్రము చేయవలెను. ఇట్టిప్రయత్నము వరూథినిమాటలయందుఁ గానఁబడుచున్నది. ''దయ ధర్మశ్రేష్ఠము. అది జపతపదానాధ్వరక్రియాదులకంటె మిన్న"- అని దయకు ధర్మశ్రేష్ఠత్వము చెప్పుట జరిగినది. ఆపైన ''నిను బాసి యసువుల నిలుపఁజాల'' నని తెలుపుచు "ననుఁ బ్రీతి వరింపు కరుణ నాన్పు మనంబున్'' అని వేడుకొనినది. ఈచివరివాక్యమున నతని ధర్మవాదమునకు హృదయవాదము నూత నిచ్చుట స్పష్టమగుచున్నదికదా ! ఇంతయత్నము చేసియు, దనపూనిక ఫలింప దని యెంచి కాఁబోలు వరూథిని చిట్టచివరకు బేరము పెట్టినది. చచ్చెడివాని పెండ్లికి వచ్చినదే దక్కుడల ! "నీకు గృహంబునకు నవశ్యంబు నరుగవలయునేని కొండొకకాలంబు నాతోడ నిష్టోపభోగంబు లనుభవించి మఱి యరుగు'' మని యామె చివరికోర్కె. సన్నివేశమునుబట్టి చూచినచో నీయభ్యర్థన మత్యంతసహజమును, వరూథినీపాత్రయందుఁ బతిత కపారసానుభూతిఁ గలిగించునట్టిదియును నై యొప్పారుచున్నది.

వరూథిని భోగప్రసక్తి తెచ్చుటచేఁ బ్రవరుఁ డిహపరభోగవిభజనము చేసి, బ్రాహ్మణుఁ డిహమున భోగతృష్ణ లేక పరమున సుఖము పొందు నని నిరూపించెను. దానికి సమాధానముగా వరూథిని తనపొం దిహపరభోగము లీడేర్చునది యని చెప్పినది. అతనిచే నిరాకృత యైనచో విగతజీవ యగుదు నని మానవవనితవలె మాటలాడి యది యాతనికిఁ బాపహేతు వగు ననియు నదలించినది. ప్రవరుఁ డింక విషయము ముదుర నీయలేదు. మెల్లగాఁ గట్టె విరిచినట్లు మాట్లాడినాఁడు.

క. పరవనితారతి కీ డని
గురు లెఱిఁగింతు రటుగానఁ గోమలి! మది నా
కు రతి జనింపదు నీదెస
నిరతము నాదెస భజింపు నీవును విరతిన్. (4.251)

ఈ పద్య మతని పరమశమప్రవృత్తికిఁ బరాకాష్ఠ!

ప్రవరుఁడు తపస్విని వెదుకఁబోగాఁ దన్వంగి యెదురైనది. ఊరు చేరు నుపాయము నభ్యర్థింపఁగా గాఢోపగూహనము ప్రసాదించినది. కంటిమేరలో జడదారి యెవ్వఁడును గానరాలేదు. ముందు కడుగు వైచినచో నింకెందఱు వరూథినులు వెంటఁబడెదరో యని భయము వైచినది. ఇనుఁడు పశ్చిమగిరిశిఖరముపై వాలుచుండెను. ఇఁక గార్హపత్యాగ్ని కన్న గత్యంతరము తోచలేదు. వెంటనే యాచమన మొనర్చి హవ్యవాహనుని, త్రేతాగ్నినిఁ గీర్తించినాఁడు. వరూథినీముఖవిధానము చేసినట్లు-

క. పరనారీపరధనరతి
పరత్వ మెన్నఁడును నాకుఁ బాటిల్లని యా
స్థిరసత్యమహిమ నతిస
త్వరితగమనసిద్ధి గలుగవలయు హుతవహా! (4.253)

యని ప్రార్థన చేసినాఁడు. అగ్నిదేవుఁ డతనిశరీరమునందు సన్నిహితుఁడైనాఁడు. ప్రవరుఁడు తత్ప్రభామండలమధ్యగతుఁడై మూర్తిమంతుఁడైన హుతవహునివలె శోభిల్లుచు నగ్నిప్రసాదలబ్ధ మైన శీఘ్రగమనశక్తివలన నిజగృహమున కరిగినాఁడు. ప్రవరుని హిమాలయప్రవేశనిర్గమముల నాశ్చర్యకరముగాఁ జిత్రించుట యిందలి యపూర్వత!

మారన యీసన్నివేశమున విభావపోషణముతోపాటు సంభాషణసంవిధాననైపుణ్యమును, రసానుకూల పాత్రావస్థాభివర్ణన సామర్థ్యమునుగూడ ప్రదర్శించెను. కథలో వరూథినియందు శృంగార మభివర్ణితము కావలెను. నాయికయొక్క రతిభావము అంకుర, పల్లవ, కోరక, పుష్ప, ఫలావస్థలను బొంది, క్రమముగా దశావస్థలుగాఁ బరిణమించి రాణించుచుండు నని లక్షణశాస్త్రమర్యాద; వీనిలోఁ బెక్కింటిని నీఘట్టమున సందర్భశుద్ధి నెఱిఁగి వర్ణించుట మారననైపుణ్యము. మకరాంకసన్నిభుఁ డగు ప్రవరుని గాంచి సంచలితాంతరంగ యై వరూథిని చక్షుఃప్రీతి, మనస్సంగమము అనునవస్థలను బొంధి

నది ఆమెయందు రత్యంకురము భాసించినది. ప్రవరుఁడు రాగలీలాసరసత్వ మొప్పఁ దనను గాంచినచోఁ గామునిఁ దక్క నేలుదు నని వరూథిని భావించినప్పు డామెయందు రతి పల్లవావస్థఁ జెంది సంకల్పావస్థను భాసింపఁ జేసినది. ప్రవరసురూపకాంతులను, ముఖదృగ్విలాసములను గాంచి కీర్తించుటయం దామెలో రతి కుట్మలావస్థ నంది గుణ వినుతి యను మన్మథావస్థకు కారణ మైనది. తత్కుమారరాగలాలిత్యము నభిలషించుట యందు తాపమును, రత్నపుత్రికవోలె నతనియెట్టదుట నిలుచుటయందును, అతనిపైఁ దనకుఁ గల రత్యతిశయమును దానే ముందు వాచ్యముచేయుటయందును, పుష్పావస్థయు, హ్రీత్యాగమును నాయిక వ్యక్తము చేయుచున్నది. రాగసాగరమగ్నయై ప్రవరుని బిగి కౌఁగిటఁ బట్టినప్పుడు రత్యున్మాదము వ్యజ్యమాన మగుచున్నది. ప్రవరునిపొందు లభింప నిచోఁ బంచత్వ మొందెద నని పలుకుటచే మరణోన్ముఖత్వము సూచింపఁబడినది. అరతి, మూర్ఛాదులు వియోగసంజనకము లగుశృంగారావస్థ లగుటచే నిచ్చట పేర్కొనకుండు టయు సందర్భశుద్ధి గలిగించుచున్నది. సంగ్రహరచన మయ్యు రససామగ్రిని పరిత్య జింపక సారసుందరముగను, వ్యంగ్యరమణీయముగను జిత్రించుట మారనశిల్పము. ఇచ్చట లక్షణశాస్త్రమర్యాదకొఱకు కాక సహజరామణీయకమును గల్పించుటకై వానిని మలచి ప్రపంచించుట కుపయోగించిన మారనప్రతిభ ప్రశంసనీయము!

వరూథినీప్రవరులు సాక్షాద్భిన్నప్రవృత్తులు. ఆమె యెంతభోగైకశీలయో యాతఁ డంత సంయమనశీలి. అతనియందు నిత్యకర్మానురక్తియు, శమైకవృత్తితోఁ గూడిన ధృతియు నిప్పట్టున సమర్థముగాఁ బోషింపఁబడినవి. ప్రవరునిధీరగుణమును మారన భంగికాచతుష్టయమున భాసింపఁజేసినాఁడు. వరూథిని 'సుందరమూర్తి! నన్ను మన్మ థునియంపవెల్లినుండి రక్షింపు' మని వేడినప్పుడు ప్రవరుఁడు నిత్యక్రియాహాని వెంపు నడఁచు ననియు, గృహమునకు వేగ నేగవలె ననియుఁ బల్కి, ప్రత్యుత్తరమును విష యాంతరమునకు లాగి తనవిషయసుఖవైముఖ్యమును వ్యంజింపఁజేసి నిత్యకర్మప్రాశస్త్యము నుగ్గడించి తనధృతినిఁ బ్రతిపాదించినాఁడు. 'దర్భలు, అరణులు, వేదికలు, నగ్నులు ప్రీతిపాత్రము లైనంతగా నితరములు కావని చెప్పుటలో ధృతినిఁ బ్రతిష్ఠించినాఁడు. విప్రవర్యులు భోగబాహ్యు లని యుగ్గడించుటలో ధృతిని బ్రపంచించినాఁడు. తమ కముతోఁ బైఁబడువరూథినిని నిరాకరించి పరనారీపరధనరతిపరుఁడను గానిచో నాకు త్వరితగమనసిద్ధిఁ బ్రసాదింపు మని హుతవహునిముందుఁ బ్రతిన సేయునప్పుడును, అగ్నిమహిమచే గృహమున కరిగినప్పుడును శమనిష్ఠాపరాకాష్ఠను బ్రదర్శించినాఁడు. ఇట్లు ప్రతిపాదన, ప్రతిష్ఠాపన, ప్రపంచన, ప్రదర్శనాత్మకమైన ధృతి ప్రవరునియందు వర్ణించుటచేఁ బాత్రగుణశీలపోషణమున కొక క్రమవికాస మహిమాన్వితమైన శిల్పగౌరవ మబ్బుచున్నది.

ప్రవరవియోగతప్త యగు వరూథినీవిరహావస్థను విపులముగా వర్ణించుటయుఁ గథాశిల్పమున కెనలేనిశక్తి నిచ్చుచున్నది. అగ్నిసన్నిహితుఁ డైన ప్రవరుని 'చారుదివ్యా కృతి' యామెహృదయమునఁ జెదరక నిలిచినది. తద్రూపవిభావచర్వణము చేయుచు,

దత్సిద్ధినిఁ బొందఁజాలనందులకుఁ బరితపించినది. ఈసన్నివేశమున విరహము సంశ్లిష్ట భావబంధుర మైనది. సామన్యముగాఁ గావ్యములందు నాయికానాయకులప్రథమ వీక్షణానంతరము కలుగు నయోగవిప్రలంభమునందుఁ బరస్పరరతిభావము సుసంపన్నమై సమాగమాకాంక్షియై యుండును. ఇచ్చటనో యట్లు కాదు. నాయికానాయకులప్రథమ సన్నివేశము కల్పింపఁబడినది. అం దేకత్రానురాగమే వ్యక్తము చేయఁబడినది. విరక్తుఁడైన నాయకుఁడు రంగమునుండి యదృశ్యుఁడైనాఁడు. నాయిక విరహాతురయై వియోగదుఃఖము ననుభవించునప్పుడు పతిత యది పునస్సమాగమసిద్ధిఁ బొందునా? లేక నిష్ఫలమగునా యను శంకచేఁ బరిపీడితుఁ డగుచుండును. నాయికయును బునస్సమాగమును గూర్చి శంకించుచుండుటచే దీనియం దయోగకరుణవిప్రలంభముల సంకీర్ణచ్ఛాయలు ప్రతిబింబిత మగుచు సన్నివేశమును సాంద్రమధుర మొనర్చుచు మాయాప్రవరప్రవేశమునం దద్భుతసిద్ధి కలుగుటకుఁ బూర్వరంగమై భాసించుచున్నవి.

వరూథినీవిరహవేదనఘట్టము రసశిల్పసుందరము. విభావానుభావవర్ణనము చేసి రసభావములను వ్యంజింపఁజేయు మారనకవి యిప్పట్టున రసపక్షపాతమును బ్రదర్శించెను. ప్రవరునిచారుదివ్యవిగ్రహమును స్మరించుటచేత నామెకుఁ బ్రీతియు వగయుఁ బెనఁగొని యగ్గలించినవి; మనసు చీకాకుపడినది. మదనబాణముల నెదుర్కొని నిలచు ధృతి సన్నగిల్లినది. నిజదైన్యస్థితి నితాంతవేదనాసంజనక మైనది. కంపము జనించినది; దీర్ఘనిశ్వాసలు వెలువడినవి. దిక్కుతోచక వరూథిని గిరికందరములు కలయఁ దిరుగుచుఁ గంటికి మంటికి నేకధారగా నేడ్చినది. అలసి సొలసినది. విప్రుఁ డరిగిన వలనికిఁ జూడ్కులు పొరిపొరి నిగుడించినది. 'అకట! మందభాగ్య నైతి' నని తన దురదృష్టమునకు దురపిల్లినది. 'నా కెమ్మెయి గలుగు నక్కుమారునిఁ గలయు పుణ్య' మని నైరాశ్యముఁ బూనినది. 'ఏమి సేయుదాన?' నని యనిశ్చితస్థితిని, 'ఈకామతాపమే నెట్లు నిస్తరింతు?' నని యశక్తతను, 'ఎందుఁ జొత్తు' నని యెలుగెత్తి యుత్తలపడుచుఁ జాపల్యమును బ్రకటించినది. విప్రలంభనాయికయందు స్మృతి, నిర్వేదము, మదము, చింత, శ్రమము, గ్లాని, ఆవేగము, త్రాసము, చాపలము - మొదలగుసంచారులను వ్యక్తము చేయఁగల యనుభావసాత్త్వికభావసంపదను వర్ణించుట యిచ్చటివిశేషము.

వరూథిని యాదినశేషము నెట్లో గడపినది. ఆరేయి వేదనాభరమునఁ దెల్లవారించినది. మఱునాఁ డక్కుమారుఁ డెప్పటియట్ల యరుదెంచునేమో యను కుతూహలమున గిరికందరోద్యానవనమున నెదురుతెన్నులు కాచినది. సుందరరోద్యానము శృంగారాంగసంపద్భరితము; మదనవస్తుసంభారగంభీరము. విరిగుత్తులపై గురువులు వాలుచు చుంబించుచు ఝుంకారములు చేయు నలికదంబములు, చిగురుజొంపములతోఁ జిట్టుముట్టాడుచు, గెరలుచునున్న కోకిలలసమూహములు, ఎలమావిలతలపైఁ గలఁ గొనఁ దారుచు, కల్కిపలుకులు వలుకు చిలుకలు, పుష్పసౌంగంధ్యబంధురమై సుడిసెడి మందమలయానిలము, కెందమ్మికొలఁకులందుఁ గేళి యొనరించు జక్కవజంటలు, సహజస్థిర

విభావములై వరూథినీవిరహాగ్నినిఁ బ్రజ్వలింప పవనకదంబములై పరిఢవిల్లినవి. ఇట్టి వర్ణనముచే రత్యుద్దీపకము లైన తటస్థవిభావములు పోషింపఁ బడినవి.

వరూథినీవాచికాభినయమున క్రిందిపద్యములు చక్కని యుదాహరణములు.

తే. గీ. అడవిఁగాచినవెన్నెల యయ్యె నాదు
జవ్వనం బక్కుమారుతో సరసలీల
భావజోపభోగంబులఁ బడయ నైతి
నీనితాంతతాపంబు న న్నేల నైఁచు?

ఉ. ఎక్కడినుండి వచ్చె నతఁ డీతుహినాద్రికి? వేడ్క నూని యే
నక్కట! యక్కుమారరుచిరాకృతి యాదట నేల చూచితిన్?
మక్కువ యేల నాటె మది? మన్మథుఁ డేల సహించు నన్ను? వాఁ
డెక్కడ వచ్చు నింక? నది యేల పొసంగు? దురాశ యేటికిన్!

(5. 8-9)

ఇట్టివితర్కములవలన వరూథిని విరహాతుర యైనది. ఉద్దీపనవిభావపరిపుష్టి జరిగినది. ప్రవరునితో నుపభోగింపఁజాలని తనయౌవనము నిష్ఫల మని వాకుచ్చుటలో నామెకు స్వీయసౌందర్యయౌవనవిలాసములపైఁ గల యభిమానమును, ప్రవరనిరాకరణముచేఁ గలిగిన యవమానమును, వాంఛితార్థసిద్ధిఁ బడయనందులకు నొందు ననుతాపమును, 'సరసలీల' యనుటచేఁ బ్రవరుని విరసత్వముపైఁ గల్గిన గూఢామర్షమును, అతని పొందు నొందకపోయినచోఁ దనయౌవనము నిరుపయోగ మగుననుటలో నన్యవిషయములపై నేర్పడిన యరతియు, వ్యజ్యమానము లగుచున్నవి. 'ఈనితాంతతాపంబు నన్నేల నైఁచు' ననుటలోఁ దాను వలచినవరునిఁ గవయలేకపోతినే యను గూఢామర్షసంజాతమగు తాపమును, రత్యుద్దీపకములైన విభావములవలనఁ గలిగిన తాపమును, స్మృత్యాది సంచారులచేఁ దనయందుఁ బుష్టమైన రతితాపమును,—ఆమె సూచించుచున్నది. 'నితాంత' మను మాటచే నామె వియోగతాపముచే క్షణ మొకయుగముగా భావించుచుండె నని వ్యంజిపఁబడుచున్నది.

మహాకవులు తమకావ్యములం దొకరమణీయఘట్టమును విపులముగా రచించి, యుపక్రమవిస్తరణాదులతోపాటు నుపసంహారమును నిర్వహింపఁ దలఁచి పూర్వప్రవర్తిత కథాప్రథానాంశప్రస్తావనము చేయుట యొకకథాశిల్పమర్యాద! మారన యట్టిమర్యాదను బాటించి, ''ఎక్కడినుండి వచ్చె'' ననుపద్యము రచించి వరూథినీప్రవరసన్నివేశమునకు రమణీయోపసంహారమును గల్పించినాఁడు. అది ప్రవరగాథకు భరతవాక్యము, మాయాప్రవరసన్నివేశమునకు నాందీవాక్యము!

కలి యను గంధర్వకుమారుఁ డంతకుఁ బూర్వము వరూథినిని వరించి, యామెచే నిరాకృతుఁడై, మదనశరపీడితుఁడై వేగుచుండెను. అతఁడు ప్రస్తుత మామె యున్న స్థితినిఁ గాంచి, దివ్యజ్ఞానముచేఁ గలరూ పెఱింగి లోలోనఁ బొంగిపోయినాఁడు.

క. తను నేఁ గోరిన నొల్లక
మనసిజశరనికరదళితమానసుఁ జేసె
న్నను విప్రుఁగూర్చి కమలా
నన యక్కట! యిట్లు నేఁడు నావలె నుండెన్. (5.11)

నూతనపాత్ర రంగమునఁ బ్రవేశించుచుఁ దనను దాఁ బరిచయము చేసికొనువిధ మిచ్చటఁ బ్రత్యేకముగాఁ బ్రశంసింపఁదగియున్నది. 'తను' అను లఘుద్వయ శబ్ద ప్రయోగముచే నామె యాతని నొల్లక యొకసారియు, బరుని కోరి భంగపడుటవలన నొక సారియు లాఘవమునకుఁ బాలుపడె నని యవహేళనము స్ఫురించు చున్నది. ''నే'' నని యాత్మార్థకేకాక్షరసర్వనామము వాడుకొని తన గౌరవమును బ్రదర్శించుకొనుటయేకాక మాయాప్రవరుఁడు మదనావస్థయందలి యుభయసామ్యమును సమమాత్రాశబ్దప్రయోగ ముచే వ్యంజింపఁజేసినాఁడు. 'మనసిజశరనికరదళితమానసు' లయినట్లు మారన వరూథినీ గంధర్వులయవస్థలను తుల్యముగా వర్ణించుట సార్థకరచనము;[28] ''ఇట్లు నేఁడు నావలె నుండెన్'' అని గంధర్వుఁ డనుటలో స్థలకాలావస్థాదులయం దిరువు రొక్కరీతిగా నుండి రని వ్యంగ్యము. వరూథినీమదనావస్థను విపులముగా వర్ణించి, గంధర్వకుమారుని విరహము తత్తుల్య మని చెప్పుటతో పునరుక్తి లేని యనల్పార్థసంపద నల్పపదములతో సూచించి నట్లయినది.

గంధర్వకుమారుఁడు విప్రరూప మొప్పారఁ దాల్చె నని మారన. ప్రవరునిరూప కాంతులయందు రూపమును మాత్రము తాల్చెనని చెప్పి కాంతినిఁ జెప్పకుండుట యిచ్చట కవిమర్మము. ప్రవరుని యగ్నితేజ మతనిజీవనసంపుటికిని, నిత్యకర్మానుష్ఠానమునకును, సంబంధించినది. అది వంచనాపరుఁడైన గంధర్వునిచే సంగ్రహింపఁబడకుండుటయే యుచితము. సురతసమయమున నామె చిత్తమున నిండియుండునదియు, గర్భమునఁ బ్రతిబింబించునదియుఁ బ్రవరునితేజము (కాంతి). పూర్వాపరకథార్థసమన్వయసహిత మైన రచన మన్న నిట్లుండును.

గంధర్వుఁ డమ్మృగాక్షితో భోగింపఁ దలఁచెను. మారన వరూథిని నాకర్ణాంత విశాలలోచనగా మొదటినుండియుఁ జిత్రించుట కాననగును. ఆమె ''విభ్రమచంచదబ్జ లోచన''గా మొదట మనకన్నులయెదుటఁ బ్రత్యక్షమైనది. ప్రవరుఁడు తనపైఁ గవయు వరూథినిని ''మృగాక్షి'' యంట కంటకు మని యనుటయు, అంతలేసికన్నులున్నవి నీకు సదృశుఁడైనవాని నన్యుని వెదకుకొను మని యామె కన్నులసొబగు నీసడించు కొనుటయుఁ గాంచినాము. ఇచ్చట గంధర్వకుమారుఁడును వరూథినికన్నుగవసొరును గాంచియే యామెను వరించినట్లు ''మృగాక్షి'' యనియే సంభావించినాఁడు. ప్రవరవేష మున సంచరించుచున్న నాగంధర్వునిదరికి నవ్వనిత ''విలోచనద్యుతివితానవిరాజితవక్త్ర

---

28. ప్రవరునిఁ గాంచినప్పుడు వరూథిని ''మనసిజశరదళితమానస'' యయ్యె నని మారన 4.284 పద్యమున వర్ణించెను.

పద్మయై" యరిగిన దని మారన. "మత్త్వైక ధర్మశీలివి గమ్మీ!" యని మదనభిక్ష నభ్యర్థించిన తరుణి నక్కపటవిప్రుఁడు "తరళాక్షి" యనియే సంబోధించినాఁడు. అతని నియమముగూడ సంభోగసమయమున 'నిమీలితాక్షి' యై యుండవలె నని కన్నులకు సంబంధించినదే. ఇట్లు వరూథినీసౌందర్యచైతన్యప్రతీకములైన యామె కన్నులను వేయికన్నులతోఁ బొదివి రక్షించినాఁడు మారన. ఇది యతనియాఖ్యానశిల్పములోని జిలుగుపని.

వరూథినీగంధర్వకుమారుల విహారవర్ణనము సార్థకముగను, పాత్రతత్త్వానుశీలన క్రమముగను, సహజసుందరముగను మూలముకంటె నతిరమణీయముగా నొనర్పఁబడి యున్నది.

మూలము :

శ్లో. తతః సహతయా సోథ రరామ గిరిసానుషు
ఫుల్లకాననహృద్యేషు మనోజ్ఞేషు సరస్సు చ ॥
కందరేషు చ రమ్యేషు నిమ్నగాపులినేషు చ
మనోజ్ఞేషు తథాన్యేషు దేశేషు ముదితో ద్విజ ॥ (60. 1-2)

అనువాదము :

శా. ఆగంధర్వుఁడు నప్సరోంగనయు నత్యాసక్తిమైఁ గూడి హై
మాగస్ఫారదరీగృహాంతరలతాంతాగారభాస్వత్తటీ
భాగీరథ్యురుసైకతస్థలజలప్రాంతప్రదేశంబుల
నోభ్గింపంగఁ దొడంగి రంగజసుఖాంభోరాశినిర్మగ్ను లై. (5.18)

గంధర్వాప్సరస్స్వభావానుకూలమైన మదనవిహారవర్ణన మిది. "సౌరభం గన్ధం అర్వన్తి గన్ధర్వాః" (అర్వ గతౌ)- సువాసనను బొందువారు గంధర్వు లని శబ్దవ్యుత్పత్తి. "అద్భ్య స్సరన్తీతి అప్సరసః" నీటివలనఁ బుట్టినవారు కావున నప్సరశ్శబ్ద మన్వర్థమైనది వారికి. సువాసన నధికముగా రమించు గంధర్వకుమారుని కొఱకు దరీగృహాంతరలతాంతాగారములును, జలక్రీడాసక్త యగు నప్సరోవనితకొఱకు భాగీరథీసైకతస్థలజలప్రాంతప్రదేశములును గల్పింపఁబడినవి. ఏతత్కల్పనకు బీజము "ఫుల్లకానన...సరస్సుచ" అను చరణమున సంస్కృతమునఁ గలదు. మూలమునందలి నిమ్నగ తెలుఁగున భాగీరథి యైనది. ఇట్లు మూలముకంటె మారన వర్ణనమును క్రమబద్ధ మొనర్చుటయేకాక వృత్తశయ్యయందును, ఎత్తుగడలోను, దీర్ఘాక్షరప్రయోగబాహుళ్యమునందును రచనాసామర్థ్యమును బ్రకటించినాఁడు. ఇదంతయు నొకయెత్తు, చివర రూపకసమాససంధాన మొకయెత్తు. మన్మథసుఖ మనెడిసముద్రమున మునిఁగిన వా రని దానిభావము. ఇందొక శ్లేషచమత్కారమును గలదు. ఆసమాసమునకే శరీరములనుండి జన్మించెడి (రతిసుఖపారవశ్యాదికములందు జనించెడు) స్వేదజలరాశియందు మునిఁగిన వా రైరి యనియు భావము చెప్పుకొనవచ్చును. దివ్యసుగంధబంధురములైన శరీరములనుండి జనించు స్వేదము

సుఖపారవశ్యము దెల్పుచుండుటయు, అంగజగంధరసములు, గాంధర్వాప్సరసఃప్రకృతినిఁ బ్రకటించుచుండుటయు నందలివిశేషము. ఇచ్చట మారనరచన మూలాతిశాయి యనుటలో విప్రతిపత్తి యుండదు. ఈవృత్తరచనాసౌభాగ్యమున కలరిన యాంధ్రరసికులు తమ జిహ్వాగ్రములను దీనిచే నలంకరించుకొనుట కాంచుచున్నాము.

సురతసమయమున వరూథినీచిత్తస్థితిని మారన సామర్థ్యముతో సృష్టించినాఁడు :

క. సురతసమయమున నాసుం
దరి నయనాబ్జములు మోడ్చి దహనశిఖావి
స్ఫురితశరీరుం డగు నా
ధరణీసురకుమారు నాత్మఁ దలఁచెను నెమ్మిన్. (5.20)

ఇందు "దహనశిఖా ... నాత్మఁ దలఁచెను నెమ్మిన్"-అనువాక్యమంతయుఁ బ్రత్యక్షరసార్థకము. పంచమాశ్వాసారంభమున వరూథినీవిప్రలంభవర్ణనకు శ్రీకారము చుట్టుచు-"ఆ కమలాక్షిచిత్తమున నాద్విజరాజకుమారు చారుదివ్యాకృతి నిల్చె" నని మారన పేర్కొనుట గమనింపఁదగినది. విప్రరూపగంధర్వుఁ డామె నుపభోగించుసమయమున నామె కన్నులు విచ్చి చూడరా దను నియమము కలదుకదా ! అందుచే నామె కాతని స్పర్శాదికములు త్వగింద్రియశక్తిచే రత్యుపశాంతికిమాత్ర ముపకరించినవి. అతనిరూపు చక్షురింద్రియశక్తిచేఁ జిత్తమునఁ బ్రతిబింబించుట లేదు. భౌతికముగా నింద్రియసుఖము నందించుచున్న పురుషాకృతి నంతరింద్రియ సహాయమున నంతస్సాక్షాత్కృతి నొందించుకొనినది. చిత్తమున నిలిచినరూపము సత్యప్రవరునిది. అందును శిఖావిస్ఫురిత శరీరి యగు నాతనిమూర్తిది. ప్రవరతేజస్సౌందర్యమున కది పరాకాష్ఠ. గంధర్వాకృతి యామెపైఁ దద్రూపమును మరుగుపఱచునంతటిప్రభావము వేయలేదు. అట్లగుట కామె సురతకాలమునఁ గన్నుఁగవ మూయుట ప్రధానకారణ మైనను అతఁడు కోరినంతమాత్రముననే కోర్కెఁ దీర్ప నందడించి పలుచన యగుటయు నొక ముఖ్యకారణ మని చెప్పకతప్పదు. వరూథినీగంధర్వసంభాషణ మతిస్వల్పముగా రచించుటలోని వ్యంగ్యశిల్ప మదియే.

సంగమసమయమున గంధర్వుఁడు ప్రవరరూపము ధరించియున్నను అతనియాత్మ ప్రవరునిది కాదని యతని చర్యలే చెప్పుచున్నవి. ఆత్మ పూర్వభవసంస్కారవాసనా సంవలితమై శరీరమున జీవసంపుటిగా భాసించుచు మానవచిత్తవృత్తిని శాసించుచుండును. అగ్నిశిఖావిస్ఫురితశరీరుఁ డగు ప్రవరునిచిత్తవృత్తి నిత్యవైదికకర్మాచరణనిష్ఠానిర్నిద్ర మైనది. గంధర్వునిది భోగవాంఛాసంతప్తమైనది. వరూథిని ప్రవరజీవసంపుటివలన భాసించునుజ్జ్వలమూర్తిని భావించినది. అట్టిభావ మగ్నిశిఖావిస్ఫురితశరీరుం డగు "నాధరణీసురకుమారు నాత్మ" నన్న సమాసమును షష్ఠీతత్పురుషముగా నన్వయించుకొనినచో స్ఫురించును. అంతియకాక ధరణీసురకుమారుని నాత్మయందుఁ దలంచె నని యన్వయము చెప్పుకొనునప్పుడు "కుమార" శబ్దశక్తిచే ప్రవరలక్షణవిశిష్టమైనసంతానవాంఛయు

వరూథినికిఁ గలదనియు, ''ధరణిసురకుమారు'' నను తన్నామసాధ్యసమానసంఘటనముచే నది సాధ్య మగు ననియు, 'ఆత్మన్' అనుటచే నట్టి సంకల్పము జీవసంస్కారప్రేరిత మైన దనియు వ్యంగ్యముగ ననుగమ్యమానమై భావికథార్థసూచనశిల్పము సాధింపఁబడినది.

స్వారోచిషమనుసంభవకథారంగమున కిది పూర్వరంగము. కవి ఫలశ్రుతిలో- 'స్వరోచిజన్మంబును, వర్తనంబుల్, స్వారోచిషాద్యప్రభవంబు విన్నన్-' అని పేర్కొని యుండుటచే నింతవఱకు జరిగినకథయంతయు స్వరోచిజన్మమునకు హేతువైనది కావున నిచ్చట చెప్పఁబడిన దని స్పష్టమైనది. దానిఫలము సర్వోచిసృష్టి. అతనివర్తన మాతని జీవసంస్కారచైతన్యరూపము. అట్టిసంస్కారములందు మాతాపితరులయొక్క తత్సృష్టి కాలమునందలిజ్ఞానేచ్ఛాక్రియాశక్తిచైతన్యయుక్తమైన యంతఃకరణము ప్రతిబింబించె ననుట పూర్వకథయందలి వస్తుధ్వని. సృష్టి యిచ్ఛాప్రధాన మైనది. అట్టియిచ్ఛ గంధర్వునియందు లేదు. వరూథినియందు గూఢముగాఁ గల దని కవి వ్యంజింపఁజేసెను. గంధర్వుఁడు వరూథినిహృదయము నాకర్షింపలేక మాయారూపమున నామెను జేరి భోగించెను. ఆమెకు గంధర్వునినిజరూపము తెలియదు. మాయావి యైన యతఁడు సత్యస్వరూపజ్ఞానసాధనమైన యామెదృష్టి నవరోధించెను. మోహాంధ యగు వరూథిని యట్టియాంధ్యమున కొడఁబడెను. వారిరువురియందును బలీయమగు కామేచ్ఛాశక్తి మాయామోహితమై తదనుగుణక్రియాశీలమును దాల్చె నని బోధపడఁగలదు. ఇది యిట్లుండ వరూథినియందు భోగేచ్ఛవెనుక గాఢమైన సృజనేచ్ఛ కలదు. దానిచే ధరణీదేవకుమారు నాత్మఁ దలచినది. శమదమాన్వితమైన ప్రవరుని స్మరించు వరూథినియందు దైవప్రేరితమైన జ్ఞానశక్తి గూఢమై భాసించినది. అనఁగా స్వరోచిసృష్టికిఁ గారకు లైన వరూథినీగంధర్వులయందిచ్ఛాక్రియాక్రియాశక్తులు మాయామోహసమన్వితములై యుండుటచేత జ్ఞానశక్తి గుప్తమై పోయె నని తాత్పర్యము. ఇట్టి సంస్కారవిశేషమే స్వరోచిచిత్తవృత్తియందుఁ బ్రతిబింబించినట్లు చిత్రింపఁబడినది. స్వరోచి భోగైకచిత్తుఁడై మనోరమావిభావరీకళావతులతోఁ గ్రీడించుచున్నప్పుడు రథాంగవనితయు, హరిణేంద్రుఁడును, హరిణీరూపయైన వనదేవతయు నాతనిజ్ఞానవృత్తిని జ్ఞప్తి చేసినను నది జ్ఞాపితము కాకపోవుట దానిఫలమే. గంధర్వ (మాయా) విముక్త యైన వరూథిని (ఇచ్ఛ) నిజప్రవరతేజోరూపము (జ్ఞానము) నుపాసించుచు స్వరోచికి (తేజస్సునకు) జన్మ మిచ్చెను. మాయామూలకమైన మృగీరూపము వీడి నిజరూపము దాల్చి దైవప్రేరితయై మనుసృజనేచ్ఛాపరాధీనయైన వనదేవత స్వరోచిభోగదృష్టిని హరించినది. అతఁడు మోహవిముక్తుఁడై (పరమ)హంసప్రబోధమున జ్ఞానశక్తిని తేజోవంత మొనర్చుకొనినాఁడు. స్వరోచియందలి ప్రవరతేజోదత్త మైన స్వీయ జ్ఞానవృత్తి మాయావిరహితమై సత్యజ్ఞానేచ్ఛాప్రధానయైన వనదేవత కల్పించిన పాంచభౌతికశరీరమునందు వసించి, మనుశ్రేష్ఠునిగా స్వారోచిషుని సృజించినది. ప్రవరప్రేరితమై, వరూథినియందు సంకల్పమాత్రమున భాసించి, స్వరోచియందు సాధనావస్థలో నుండి, స్వారోచిషునియందు మనుతేజము పరిపక్వము నందినది. ఇట్టితాత్పర్యమును వ్యంజింపఁజేయు భావికథాఘట్టములను మారన కడుసామర్థ్యముతో నిర్వహించెను.

స్వరోచిర్జననమునకు హిమవంతము రంగస్థలము. అతనివర్తనమునకు మందర నగము రంగము. రెండవరంగమున స్వరోచి యౌవనోజ్జ్వలుఁడుగాఁ బ్రవేశింప వలెను. ఈరెండురంగములమధ్య నున్నకథను భూతకథాంశముగా సూచించి, ప్రస్తుతకథాంశ మును ప్రారంభించుచున్నట్లు మారన క్త్వార్థక్రియాప్రయోగము చేయుచు రెండు పద్య ముల నొకేఛందమున నడపెను. అవి :

చ. స్వరుచిసముద్గమస్ఫురణ సర్వదిగంతరము ల్వెలుంగ భా
సురతరమూర్తి యై వెలయుసూర్యునిమాడ్కి సుతుండు ప్రీతి న
త్తరుణికి నుద్భవించి సముదాత్తతనుద్యుతిజాలసంపద
న్సురుచిరుఁ డై స్వరోచి యను సుందరనామము దాల్చి యెంతయున్.

చ. కళ లభివృద్ధి బొందు శశికైవడిఁ దద్దయు సద్గుణంబుల
న్వెలుఁగుచు నాఁడునాఁటి కభివృద్ధి వహించి మనోజ్ఞయౌవనో
జ్జ్వలుఁడును నస్త్రవిద్యను విశారదుఁడు న్బలభాసితుండు నై
పొలుపుగ మందరాద్రితటభూముల నాతఁడు కేలిసల్పుచున్. (5.22-23)

మారన యిచ్చట వాక్యనిర్మాణమున సొగసులు చూపించెను. ఇంతవఱకును వరూ థినిప్రసక్తి వచ్చినపుడెల్ల నామెనే కర్తగాఁ జెప్పుచు వచ్చినను నిక్కడ వరూథిని పుత్త్రునిఁ గనె నని చెప్పక, పుత్త్రుఁ డామె కుదయించి స్వరోచి యను నామముఁ దాల్చె నని రచిం చుట యొకచమత్కారము. దానివలన వరూథినీ పాత్రమున కింక కథలో నెట్టి కర్తృత్వము నుండబో దనియు, స్వరోచి స్వరుచిప్రసిద్ధుఁడై సర్వతంత్రస్వతంత్రుఁ డగుననియు, వ్యంజింపఁబడుచున్నది. వరూథిని కుదయించిన స్వరోచి యుదయభానునివలె స్వీయప్రభా సమన్వితుఁ డని యుపమించుటచే నాతనిసంతతతేజస్వితయు, "సర్వదిగంతరము ల్వెలుంగ భాసురతరమూర్తి" యను నుపమానలక్షణబలముచేతను 'సముదాత్తతనుద్యుతి జాలసంపద న్సురుచిరుఁ' డను నుపమేయ సహజగుణవిశేషముచేతను ఉజ్జ్వలతయు, షోడశకళాప్రపూర్ణుఁ డగు చంద్రునివలె గుణసమృద్ధి వహించినాఁ డనుటచే నతని గుణాఢ్యత్వమును, "వహించి" యను క్రియాశక్తిచే భూభరణయోగ్యతయును మనోజ్ఞ యౌవనోజ్జ్వలుఁ డనుటచే[29] శృంగారసకథాకావ్యనాయకగుణపరిష్ఠతయు, 'అస్త్రవిద్యా విశారదుఁడు, బలభాసితుఁ' డనుటచే నాతనిధైర్యవైశారద్యములును వ్యంజితములై యుదాత్తనాయకగుణస్వరూపములు స్వరోచియందుఁ బ్రత్యక్ష మగుచున్నవి. సూర్య చంద్రోపమానము లేకత్ర నిబంధించుటచే స్వరోచి రోచిష్ణుతకు దివారాత్రములందు సమమై యుండు 'సాతత్య' మను గుణము స్ఫురింపఁజేయుచున్నది. ఉదయమునఁ దనుద్యుతిచేత సురుచిరుఁడై, బాల్యమున గుణప్రకాశముచేత వెలుఁగొంది, యౌవనమున మనోజ్ఞత్వముచే నుజ్జ్వలుఁడై, మంత్రసహిత మైన ధనుర్వేదముచేఁ బలభాసితుఁ డయ్యె ననుటతో నాబాల్య

29. శృంగార శ్శుచి రుజ్జ్వలః - అమరము.

యౌవనదశాపరిణామసుందరమై యౌజ్జ్వల్య మభివర్ణిత మైనది. సాలంకారసార్థకనాయక వర్ణనమున కీరెండువృత్తము లమూల్యోదాహరణములు.

స్వారోచివర్తనము నభివర్ణించు నీకథాభాగము విచిత్రసన్నివేశరచనాబంధురమై పఠిత కత్యంతోత్కంఠాపాదకమై యామూలాగ్ర మేకైకధారణలోఁ బఠింప నుత్సాహము గల్పించుచున్నది. ఇందుఁ బాత్రలను బ్రవేశపెట్టెడి విధమును, వానిచరిత్రలు వానిచేతనే చెప్పించెడివిధమును, పశుపక్ష్యాదు లన్యాపదేశముగను, సూటిగను నాయకునకుఁ బ్రబోధము నిర్వహించిన తెఱఁగును, మానవాతీత మైన దైవసంకల్ప మొండు పరోక్షముగా నుండి నాయకునివర్తనమును దీర్చిదిద్దుచు, స్వారోచిషమనుసృష్టికార్యము నిర్వహింపఁ జేసినట్లు మార్మికవాతావరణమును గల్పించినవిధమును గథానిర్మాణశిల్పదృష్టికిఁ గన వచ్చు ముఖ్యాంశములు. ధర్మవర్తనమునకును మానవచిత్తవృత్తికిని మధ్య జరుగు సంఘర్షణ మిందుఁ గొన్నిపట్టులఁ జిత్రింపఁబడియుండుటచే హృదయవికాసవిద్రుతుల కుచితప్రాధాన్యము కలిగి రసాభ్యుదయోల్లాసము నిర్వహింపఁబడినది.

మనోరమాప్రవేశము - ఈకథయందలి ప్రథమసన్నివేశము. ఆతరళాక్షి భయార్తయై ''రక్షింపు'' మని వేఁడుచు స్వారోచిని శరణు వేడినది. ఆర్తజనావనుఁ డగు స్వారోచి కారణ మడుగకయే యామె కథయప్రదాన మొనర్చెను. దీర్ఘనిశ్వాసములతోడను, గద్గదకంఠముతోడను, నామె తనకథ నారంభించెను. మనోరమావిభావరీకళావతులు ముని నవహసించి పొందినశాపములనుగూర్చి చెప్పినది. దినత్రయముగా వెన్నంటి తరుముచు నామెను బట్ట నుంకించెడు రాక్షసునిగూర్చి యప్పుడు బైటపెట్టినది. అసురుఁడు రంగమునఁ బ్రవేశింపకపూర్వమే యామె యాతని కస్త్రహృదయవిద్య నుపదేశించినది. అది పరమేశ్వరునినుండి స్వాయంభువమనువు ద్వారమునఁ బరంపరాగతముగా నామెకు సిద్ధించిన మహామంత్రము. అంతలోఁ గాఱుమేఘము వలె గర్జించుచు నిందీవరాక్షుఁడు రాక్షసాకృతితో వచ్చి మనోరమను మ్రింగ నుద్యమించుచు నామెను బట్టెను. ఆదారుణ దృశ్యము గాంచిన స్వరోచి రౌద్రమూర్తి యయ్యెను. ప్రచండబాణమున నారక్కసుని మేను నొవ్పించెను.

ఇందీవరాక్షుఁ డాయబ్జలోచనను విడిచి స్వీయశాపవృత్తాంతమును జెప్పెను. బ్రహ్మదత్తునియొద్దఁ గపటియై రహస్యముగా విద్యను గ్రహించి గురువు నవహేళనము జేసినందులకు ఫలముగా సప్తరాత్రములు రాక్షసాకృతి నొందినాఁ డిందీవరాక్షుఁ డను గంధర్వరాజు. ఆశాపము స్వారోచివలన నుపసంహృత మగు నని బ్రహ్మదత్తునిశాసనము. ఇందీవరాక్షుఁడు నిజదివ్యాకృతిఁ దాల్చి కానుకగాఁ దనపుత్త్రిక యైన మనోరమను ఆయుర్వేద సహితముగా స్వారోచి కీయ నిచ్చగించెను. మనోరమ ప్రథమవీక్షణముననే స్వారోచిని వరించినది. కాని యామె చెలులైన విభావరీకళావతులు కుష్ఠక్షయరోగపీడితులై యుండుటచే నామె వివాహమున కిచ్ఛగింపలేదు. ఇందీవరాక్షదత్త మైన యాయుర్వేదముతో వారి రుగ్ణతను నివారింతు నని స్వారోచి ప్రతినఁ బట్టెను. మనోరమ సంతసించి, యాతనిఁ బెండ్లాడెను. అతఁ డాయుర్వేదవిధానమున వారి నారోగ్యవతుల నొనర్చెను. విభావరి

తనకృతజ్ఞతఁ దెలియఁబఱచుటకై సర్వభూతభాషాజ్ఞానము నిచ్చు నొకదివ్యవిద్యతో పాటు తననుగూడ నాతనికి సమర్పించుకొనెను. కళావతి తనజన్మవృత్తాంతమును దెలిపి, పార్వతీదత్తమైన పద్మినీవిద్య నిచ్చుచుఁ దద్దేవినిర్దేశానుసార మాతనినే వివాహ మాడెను. ఈముగ్గురను స్వరోచి పరిణయమాడి మందరగిరిసానువులపై వారితో సుఖించుచు విహరించుచుండెను.

ఇందుఁ బ్రతిసన్నివేశమును గార్యకారణక్రమమునఁ జెప్పఁబడినది. కార్యారంభము లైన కథలు కారణప్రతిపాదన పర్యవసానములుగాఁ జిత్రించుటచేఁ గథాంతమువఱ కత్యంతప్రీతిఁ గలిగించుచున్నవి. వీని వెనుక భిత్తికవలె వ్యాపించి యున్న బలీయమగు దైవికశక్తి యాశ్చర్యమును గలిగించుచున్నది. ఎట్లనఁగా—మనోరమ రాక్షసుని బారిఁ బడుటకును, ఇందీవరాక్షుఁడు రాక్షసాకృతిలోఁ గూతుని మ్రింగఁ బోవుటకును ముని శాపములు కారణము లగుచున్నను నవి స్వరోచివలన నివృత్తములగు నని పూర్వమే నిర్దేశింపఁబడియుండుట యాశ్చర్యము! అంబికాదేవి కళావతి నాత్మహననోద్యోగము నుండి మాన్పి "భర్త తేజోనిధి యాస్వరోచి యగుఁ జుమ్ము"—అని నిర్దేశించి చెప్పినది. మనోరమ లేనిచో విభావరీకళావతుల కట్లు వివాహ మయ్యెడిది కాదు. కావునఁ గథలోని తొలిపూసనుండి కొసపూసవఱకుఁ గలిపి ముడివేయుచున్నది దైవసూత్ర మనుట నిస్సంశయము.

కథ యింతటితో నాగలేదు. పద్మినీవిద్యామహిమచే సర్వభోగములు కల్పించుకొని భార్యాసహితుఁడై స్వరోచి విహరించుచుండ నొక కమలాకరమున నొకహంసికిని జక్రవాకికిని జరిగిన సంభాషణ మాతఁడు వినుట తటస్థించెను. హంసి వారియనుంగు దాంపత్యమును శ్లాఘించెను; చక్రవాకి విమర్శించెను. ఒక్కఁడు పెక్కురు వనితలతోఁ గూడియుండుటయును, వనిత తనభర్త యన్యవనితతో విహరించుటఁ గాంచి ప్రాణములు విడువకుండుటయు నొకచోఁ గల్గెనేని యది నిక్కువమైన దాంపత్యానురాగము కాదని చక్రవాకి నిర్ధరించెను.

క. పరిజనులయందు విభునకు
నరయంగ వినోదమాత్ర మనురాగ మెద
న్బొరసినయట్టులఁ బలువురు
తరుణులయెడ రాగ మొకఁడు దాల్చుట తరుణీ! (5.76)

అని యామె నిశ్చయము. ఈమాటలు విన్న స్వరోచి లజ్జాన్వితుఁ డయ్యు నచ్చోటు వాసి చని రమణులఁ గూడి నూఱేండ్లు సుఖించెను,

మఱియొకనాఁడు మృగీకదంబపరివేష్టితమైన యొకమృగమును స్వరోచి కాంచెను. ఆమృగము స్వీయకాంతలను గాంచి

ఆ. ఏ స్వరోచిఁ గా; నొకింతయు నే లజ్జ
విడువ; నట్టితోవ విడుతు వినుఁడు!

లజ్జ మాకుఁ గడుఁ దొలంగుఁడు తొలఁగుఁడు
విగతలజ్జమతులవెనుకఁ జనుఁడు.

క. పలువురు లలనలు దనకుం
గలుగుట భోగేచ్ఛ ధర్మకర్మము లెల్ల
న్నొలిసెను వీనికి ధనములు
లలనావర్గంబు కామలంపటుఁ డగుటన్.

అ. ఇట్టి యితనిమాడ్కి నెవ్వఁడు వర్తించు
నతఁడు పుణ్యలోకగతుఁడు గాఁడు
గాన నిట్టివానిఁ గామింపఁ డేను స్వ
రోచినడచునట్టి త్రోవ నడువ. (5. 83-85)

అని పల్కినది. ఈమాటలు స్వరోచియందుఁ దాత్కాలికముగా సన్న్యాసస్వీకారభావమును గల్పించినవి కాని యతఁ డెప్పటియట్ల మనోభవాధీనుఁడై నూఱేండ్లు మఱల విషయలోలుఁడై మసలెను. కళత్రత్రయమునందు సుతత్రయమును గాంచి పద్మినీవిద్యామహిమచేఁ వారికిఁ బురత్రయమును నిర్మించి యందు వారినిఁ బ్రతిష్ఠించెను.

మఱియొకనాఁ డాతఁడు మృగయావినోదార్థియై వనమున కరిగి, యొక్క వరాహము వెంటఁబడి సుదూర మేగఁగా మార్గమధ్యమున నొకమృగాంగన నిలిచి తనను వధింపు మని వేడెను. అతఁ డామృగముయొక్క యాత్మహననోద్యోగమునకుఁ గారణ మడిగెను. అన్యాంగనాసక్తుని వరించుటచే మరణమే శరణ్య మగుచున్న దని యామృగి సమాధానము చెప్పెను. అది వలచినది స్వరోచినే యని స్పష్టపఱచెను. అతఁడు మానవునకును మృగమునకును బొం దెట్లు కుదురు నని శంకించెను. అది యాతని యాలింగనము మాత్ర మభ్యర్థించెను. అతఁ డట్లు చేసెను. హరిణి వనదేవతయై యెదుట నిలిచెను. దేవప్రేరితయై మనూత్పత్తి నతనివలన సాధించుటకు వచ్చితి నని తెలిపెను. అతఁ డందుల కియ్యకొని యామెయందు సుతు నొక్కనిఁ బడసెను. అప్పుడు దేవదుందుభులు మ్రోసెను; పుష్పవృష్టి కురిసెను. పుత్త్రుని తనుద్యుతి కత్యద్భుత మంది స్వరోచి యతనికి "ద్యుతిమ" న్నామ మొసంగెను. అతఁడు స్వారోచిషుఁ డని ప్రసిద్ధిఁ గాంచెను.

ఒకనాఁడు స్వరోచి యొకహంసమిథునముఁ గాంచెను. హంసి భోగాభిలాషి. హంస విషయసుఖవిముఖ. అవి రెండును పరస్పరము వాదించుకొనుచుండెను. హంస సంసారసక్తులు బహులపంకపతితవనగజములమాడ్కి కదలలేక పొలియుదు రని చెప్పి యుదాహరణముగా స్వరోచినిఁ బేర్కొనెను. దానిని విని స్వరోచి విరక్తుఁడై భార్యాసహితముగాఁ గాననమున కేఁగి ఘోరతప మొనరించి యమరలోకమున కరిగెను.

ఇందు చక్రవాకి బహుభార్యాసక్తత దాంపత్యానురాగచిహ్నము కాదనినప్పుడు స్వరోచికి లజ్జ జనించినది. మృగము బహుభార్యాత్వము కామలంపటత్వ మనియు, నది పుణ్యలోకప్రాప్తి కవరోధ మనియు బోధించునప్పుడు తాత్కాలికమైన విరక్తి జనించినది.

బహుసతీసక్తుని వరించుట కంటె మరణము మేలని యొకవైపు గర్హించుచునే—మఱియొక వైపు దైవకార్య మని పుత్త్రునికొఱ కతనినిఁ గవిసిన వనదేవతను జూచిన స్వరోచియందు నిర్లిప్తతతోఁ గూడిన కర్తవ్యనిష్ఠ పొడగట్టుచున్నది. హంసవాక్యము లతనినిఁ దపోవనమున కంపినవి. ఇందలి స్వరోచివర్తనము క్రమక్రమాభివృద్ధి నందినది. అట్లగుట కతనియందలి జీవసంస్కార పరిపాకమే కారణ మని పూర్వము నిరూపింపఁబడినది.

వరూథినీగంధర్వుల యిచ్ఛాక్రియాశక్తు లతనిలోఁ గామపరత్వము కల్పించినవి. వరూథినీజ్ఞానేచ్ఛాశక్తి యితనియందుఁ బ్రవరుని బ్రహ్మతేజమును బ్రసాదించినది తమోగుణప్రధానమైన హరిణినిఁ గౌఁగిలించుటయం దతని మోహము వ్యక్త మైనది. హరిణి వనదేవతారూపము తాల్చుటలో నామోహము విచ్చిపోయినది. మనుసృష్టియందు లగ్నమైన యతనిమనస్సు సమాహితమై భోగైకదృష్టినుండి మరలినది. పుత్త్రప్రాప్తితోఁ బురుషునిజన్మ ఫలవంత మైనది. హంసప్రబోధము భవాంబుధి దాటుమార్గము చూపించినది. సాధనాత్మకమైన జ్ఞానదృష్టి స్వరోచికి లభించినది; అతనిని సముద్ధరించినది. ఈకథాభాగమందును దైవసంకల్ప మఖండ మైన పాత్రను నిర్వహించినది. మనుజన్మ మగునంతవఱకు స్వరోచి విరక్తుఁడు కారాదు. కాని, యతనియందు "మను" ధాతు మూలమైన జ్ఞానము జాగృతి నొందవలెను. ఇది దైవసంకల్పము. ఇది కథాంతమునఁ గాని మనకుఁ దెలియదు. అప్పుడు పతిత వరుణానదీతీరమునఁ బ్రవరుఁడు పుట్టుటవద్ద నుండి మనూత్పత్తి యగునంతవఱకుఁ గథను నడిపిన మూలసూత్ర మేది? యని ప్రశ్నించుకొని క్రియారూపమైన సర్వజగద్వ్యాపారమునకు మూలమగు హేతువును స్మరించి యాశ్చర్యమగ్నుఁ డగును. అట్టి యద్భుతముకంటెఁ బురాణకథానిర్వహణమున కేమి కావలెను?

**ఉత్తమ మనుసంభవము :**

ఉత్తమమనుజననగాథ సతీపాలనధర్మప్రబోధప్రధాన మైనది. గృహస్థునకు భార్యారక్షణము కర్మాధికారము కలిగించును. కర్మాచరణమువలన ధర్మము నిలుచును. ''భర్తకు భార్య రక్షణీయ. ఆమెయందు భర్త ప్రజారూపంబునం బ్రభవించును. ప్రజారక్షణం బతనికిఁ దన్నుఁ దాను రక్షించుకొనుట" యని వేదోక్తి. భార్య యన్యాక్రాంత యైనచో వర్ణసంకరము. సంకరదోషమున స్వర్గంబువలనం జాసి పితృవర్గ మధోగతిం బడును.

ఉ. ఆరయ సర్వకర్మముల కర్హులు గారు తలంచిచూడఁగా
దారవిహీను లైన వసుధాసురభూవరవైశ్యశూద్రు ల
న్వారలు పత్నికి న్పతి నవశ్యముఁ బాయఁగరానియట్లు వి
స్ఫారయశోవరేణ్య! సతిఁ బాయఁగరాదు తదీయభర్తకున్.
తే. కారణము పత్ని ధర్మార్థకామములకు ......" (5.184)

ఇట్టి ధర్మమును రమణీయకథాశిల్పమునఁ బ్రపంచించుటయే యీయుపాఖ్యానఫలము.

ఇందు నాయకుఁ డన్వర్థనామధేయుఁ డగు "సుత్తముఁడు". అతఁడు సూర్యునివలె లోకబంధువై, చంద్రునివలె జనహృదయాహ్లాదకరుఁడై, యమునివలె భువనావనధర్మకళా ప్రవీణుఁడై, శత్రుమిత్రులచేఁ బొగడ్తలందుచు వెలిగినప్రభువు. పురందరుఁడు శచీదేవిని పరిణయమైన ట్లాతఁడు బహుళాదేవిని వివాహ మయి, చంద్రుఁడు రోహిణియం దను రక్తుఁ డైన ట్లామెయం దాసక్తుఁడై ప్రభూతరాగాన్వితుఁ డై మెలఁగుచుండెను. కాని, యతఁ డామెపట్ల ఎంతయనుకూలుఁడో యామె యాతనిపట్ల అంత ప్రతికూల. ఎడమొగము పెడ మొగ మై భార్య తన నవమానించుచున్నను సుత్తముఁ డెంతయో సహించి, తా నామె నిసుమంతయు నొప్పింపక కాలము పుచ్చుచుండెను. ఒకదినమున బంధుమిత్రపరివార వారవనితాసంకులమైన వినోదసభయం దుత్తముఁడు ప్రీతితో మధుపాత్ర నందింప నామదవతి బాహాటముగా నిరాకరించెను. అతనికి నలుగురిలోఁ దలఁ దీసినంత పని యయ్యెను. అతఁడు క్రుద్ధుఁ డై భార్య నడవుల కంపించెను. ఆమె యాదండనము పరమాను గ్రహముగాఁ దలఁచి సంతసిల్లెను. కాని, యుత్తముఁడు మాత్రము భార్యావియోగముచేఁ జిత్తమున నుత్తలపడుచుండెను. మనసార వలచి గౌరవించు భర్తను ప్రేమించలేని భార్య పరిత్యక్త యైనను పాపము లేదని యుత్తముఁడు భావించెను.

ఉత్తమునికథకుఁ బూర్తిగా విరుద్ధ మైనది సుశర్మ యను విప్రునిగాథ. ఆబాపని కొక వయసుమళ్లిన పెండ్లము కలదు. ఆమెయాకార మొకవికారము. శీల మొక హృదయ శల్యము.

తే. గీ. నిడుదహొడువును మిడిగ్రుడ్లు బడువుటొడలు
గుంతమోమును గుబ్బకేలుఁ గుండకడుపు
మిట్టపండ్లును నెంతయుఁ బెట్టిదంపుఁ
బలుకులును దురాచారంబు బరికెతలయు, (5.141)

గల యామెయాకృతి పగలు చూచిన రాత్రి కలలోనికి వచ్చును. సుశర్మ వేదవిజ్ఞానము నందును, సవనకర్మలయందును, మంత్రశాస్త్రమునందును, పరమనిష్ణాతుఁడు : గొప్ప కర్మఠుఁడు. సతీపాలనధర్మమర్మజ్ఞుఁడు. భార్య కురూపి యైనను ధర్మైకబుద్ధియై యామెను జక్కఁగా నేలుకొనుచుండెను. ఒకనాఁటిరాత్రి వేసినయింటితలుపులు వేసినట్లే యుండ నతనిభార్య నెవఁడో హరించెను. ఆతనికి భార్యావియోగమువలనఁ గర్మలుప్తి యేర్పడినది. అతఁ డుత్తమునియొద్ద కేఁగి తనభార్యను వెదకి యిమ్మని వేఁడుకొనెను. షడ్భాగభోక్త యగు రాజు ప్రజారక్షణము చేయుట విహితధర్మ మని హెచ్చరించెను : "కురూపియు, దుశ్శీలయు నైన యామెతోఁ గాపురము చేసినదానికంటెఁ గ్రొత్తపెండ్ల మును వివాహమాడుట మే" లని రాజు సూచింపఁగా సుశర్మ యది మహాపాప మని చెవులుమూసుకొని పైనఁ జెప్పిన వేదవాక్యమును బఠించెను :

ఒక మహారాజు సుందరి యయ్యు దుశ్శీల యగు భార్యను బరిత్యజించుట ధర్మ మని భావింప, నొకపేదబాపఁడు కురూపియు దుశ్శీలయు నైన భార్యను సైతము కడఁగి

రక్షించుట పురుషధర్మ మని ప్రతిపాదించినాఁడు. నాయకుఁడు వైదికధర్మపరిజ్ఞానము లేని సాధకుఁడు. అతనికి ధర్మప్రబోధకుఁడు విప్రుఁడు. కథలో వీరిరువురిజీవితములను విరుద్ధభూమికలయందు నిలిపి కథన మారంభించుట కథలోనిశిల్పము. దుశ్శీలయైనభార్యను త్యజించినరాజు-ప్రభుధర్మమును బాటించి దుశ్శీల యైన బ్రాహ్మణభార్యను అసురునిబారి నుండి రక్షించి యొకసంసారము నిలుపుటకుఁ బూనుట యిందలి చమత్కారము. పరధర్మరక్షణోద్యోగమున స్వీయధర్మజ్ఞానమును బొంది తత్సిద్ధికిఁ దీవ్రయత్న మొనర్చి ఫలసిద్ధిని బొందిన ఉత్తముఁ డుత్తమసాధకుఁ డైన ధర్మవీరుఁ డనఁబడుచున్నాఁడు.

సాధకుఁ డైన నాయకునిజీవితవృత్తము వర్ణించుపద్ధతి వేఱు. సిద్ధుఁ డైన నాయకుని వృత్తమును జెప్పుపద్ధతి వేఱు. సిద్ధుఁడు పరిపక్వదశావిస్ఫురితుఁడును, స్వీయధర్మనిష్ఠాతుఁడు నయి విరుద్ధధర్మముతో ఘర్షణపడి స్వీయశక్తితో ధర్మగ్లానినుండి సద్ధర్మమును రక్షించును. సాధకుఁడు సుసంస్కారియై యుండియుఁ దెలిసియో తెలియకయో యొక ధర్మలుప్తికిఁ బాల్పడి, ధర్మవిషయములతోఁ దార్కొనినప్పుడు తనతప్పు తాను తెలిసికొని పరితాపముచే నాత్మశుద్ధి చేసికొని, ధర్మలోపమును దీవ్రయత్నముతోఁ బూరించుకొనును. అనఁగా ధర్మసాధకుల జీవితవృత్తమును వర్ణించుకథలో నాయకునియందు పరితాపాగ్ని రగుల్చు ఘట్టములకును, ధర్మసిద్ధి కాతఁ డొనర్చుయత్నముల రూపొందించు ఘట్టములకును అధికప్రాధాన్య ముండు నని తాత్పర్యము. వానిని సుసంబద్ధములుగాఁ గూర్చుటయే యేతత్కథా నిర్మాణశిల్పము.

ఉత్తముఁడు భార్య నడవుల కంపుట దోస మని మొదట యెఱుఁగఁడు. సుశర్మ దానినిఁ దెలియఁ జెప్పెను. భార్యావిరహితుఁడు కర్మదూరుఁడై విజ్ఞులచే నిందింపఁబడు నను విషయము బ్రాహ్మణునివలన సూచింపఁబడినదే కాని యనుభవమునకు రాలేదు. శ్రుతమైన ధర్మముకంటె దృష్టమైనకర్మాచరణము మానవునిపై నధికప్రభావము వేయును. విప్రునిచే రగుల్పఁబడిన వివేకజ్యోతి యుత్తమునిచిత్తమున మునిదర్శనముతోఁ తేజోవంత మైనది. ఆముని స్వాయంభువమనుకులవర్ధనుఁ డైన యుత్తముని కతిథిపూజలు నేయకపోగా ధర్మలుప్తిచే నంటరానివాఁ డయ్యె ననియు, రాజే ధర్మము పాటింపనప్పుడు శిక్షించు వాఁ డెవ్వఁ డనియు, మొగమువాయునట్లు సున్నితముగా నిందించి యవమానించెను. అతనిమాటల కుత్తముఁడు సిగ్గుతో నుత్తమాంగమును వంచినాఁడు. దోసము నెత్తి చూపినచో సహృదయముతో స్వీకరించెడి యుత్తమగుణుఁ డాతఁడు.

బలాకాసురునితోడి సమావేశ ముత్తమునియందుఁ బరితాపాగ్నినిఁ బ్రజ్వలింపఁ జేసినది. నరులకుఁ గర్మవైకల్య మేర్పడినపుడు వారిసద్గుణములను హరించి జీవించు స్వభావము కలవాఁడు బలాకుఁడు. విప్రునిభార్యను హరించుటచే నాతనికిఁ గర్మవైకల్య మేర్పడినది. దానివలన నతని మహాసురనాశకరోగ్రమంత్రప్రభావము నిస్తేజమైనది. ఇది వినిన ఉత్తముఁడు విషణ్ణుఁడై యంతర్గతమున "విప్రుని కర్మవైకల్యం బుగ్గడించి వీఁడు నన్ను నిందించుచున్నవాఁ డమ్మునిపతియు నర్ఘ్యంబునకు నర్హుఁడవు కావని గర్హించె నపత్నీకత్వంబున నింత నికృష్టుఁడ నగుదునే?" యని వగచినాఁడు. "ఏమి

చేయుదు ? భార్య నే నేల విడిచితి - ఎక్కడ కాంతు ?...నిం కేదితెఱఁగు ?" అని యెలుగెత్తి విలపించినాఁడు. ఇది యీకథలోని పతాకసన్నివేశము.

సతీపునస్సమాగమకుతూహలుఁ డైన యుత్తముఁడు త్రికాలజ్ఞునకు మోకరిల్లి బహుళావృత్తాంతము నెఱిఁగింప వేడినాఁడు. సాలపోతకుఁ డగు సర్పరాజుచే రసాతలము నకుఁ గొంపోఁబడి, తత్తనయ యగు నందచే శీలసంరక్షిత యై, తనభార్య క్షేమముగా నున్న దని విని సంతసించినాఁడు. ప్రత్యుపకారబుద్ధి యైన సుశర్మప్రేరణవలన మిత్ర వింద మొనర్చి భార్యాహృదయమున మైత్రీభావము గల్పించినాఁడు. బలాకాసురసహాయ ముచే భార్యను రసాతలమునుండి తెప్పించుకొనినాఁడు. అనుకూలవతి యైన భార్యను గాంచి యమందానంద మందినాఁడు. బహుళాశీలసంరక్షణయత్నమునఁ బితృకోపమునకు గురియై మూకత్వము నొందిన నందకు సారస్వతేష్టిఫలము ధారపోసి మాటలు తెప్పించి నాఁడు. నందాకుమారి వరప్రభావమున నుత్తమమనువును బుత్త్రునిగాఁ బొందినాఁడు. ఇట్లీ కథలోఁ బరితాప, ప్రయత్నపోషకము లైన కథార్థములు చక్కఁగాఁ బొదుగఁబడి యుండుట సువ్యక్తమగుచున్నది.

నాయికాదుష్టస్వభావమును వర్ణించియు, నది యామెకు సహజసిద్ధమైనది కాక వివాహసమయగ్రహవీక్షణఫల మని నిరూపించి, నాయకునితోపాటు పతితకును నాపాత్రపై సానుభూతి కలుగునట్లు చిత్రించుటలోఁ గల్పనానైపుణ్యము కలదు. బహుళాదేవి యంద చందములు రాజుహృదయము నాకర్షించినవి. అతఁ డామెను గుండెలలోఁ బెట్టుకొని గౌర వించినాఁడు. ఆమె కాభర్తపై నిసుమంత కనికరము లేదు; కటాక్షములు విసరవలసిన నాథునిపై కఠినదృక్కులను రువ్వినది; అతనిని అవమానముల పాల్జేసినది. పతికి దూర మగుటయదృష్టవిశేషముగాఁ దలపోసినది. ఇట్టిస్వభావమునకు హేతు వేదియో రాజునకు వలెఁ బఠితకును జాలసేపటివఱకును దెలియదు. అందువలన నామెయెడ వైముఖ్యము కలుగుట సహజము. త్రికాలజ్ఞుఁ డగు ముని యామెవైముఖ్యమునకు గారణము రాజుతో నిట్లుచెప్పెను.

చ. పరిణయవేళ నిన్ను రవిభౌమశనైశ్చరులు న్భవత్సతిన్
సురగురు దైత్యమంత్రులును జూచుటఁజేసి నరేంద్ర ! నీకు న
త్తరుణిమనోహరాకృతి ముదం బొనరించుచునుండెఁ జూడ్కి క
త్తరుణికి నీదుమూర్తి ప్రమదం బొనరింపమి నట్టిదయ్యెడిన్. (5.194)

దీనివలన బహుళాదేవి స్వభావసిద్ధముగా దుశ్శీల కాదనియు, వివాహకాలగ్రహవీక్షణ ఫల ముచే నామె యట్లయ్యె ననియు స్పష్టమగుసరికి యాపాత్రపై పఠితకు ద్విగుణీకృతసాను భూతి కలుగును. భూపతిభార్యవంటిది కాదు భూదేవసతి. ఆమెకు భర్త నెగ్గులాడుదుర్గు ణము సహజముగా నేర్పడినదే. కాని, భర్తను వీడిపోవునుద్దేశ మామెకు లేదు. పతివియోగ మామెకుఁ గడువంతఁ జేకూర్చినది. పరమసాధువైన భర్తను పరుషవర్తనముచే నొప్పించి నను, తద్వియోగమున నతనితోడిపునస్సమాగమము నభిలషించి దుఃఖించుటచే నామె

యందును బతితకు సానుభూతి కలుగుచున్నది. ఇట్లు విరుద్ధభూమికలైన వీరిరువురి యందును పురాణకర్త పతితలయొక్క సానుభూతి కనువైన స్వభావమును జిత్రించుట ప్రశంసనీయము.

పురుషకారదైవానుకూల్యముల కీకథయందుఁ గల్పించిన సమప్రాధాన్యము ప్రశంసనీయము. భూపతి భూసురునిసతిని సంపాదించినవిధ మతిసహజమై పతిత కుత్సాహోద్రేకములఁ గల్పించుచున్నది. భూపతి స్వీయభార్యను బొందినవిధ మత్యంతాశ్చర్యకరము. ఇట్లగుట కీకథయందు మూఁడుశక్తులు కారణములు. త్రికాలజ్ఞుఁడైన ముని తన దివ్యదృష్టితో నాగతానాగతకథార్థములన్నియు సుగమముల నొనర్చుట యొకదివ్యశక్తి. నరులలోని సుగుణదుర్గుణభక్షణశక్తియు, నెట్టిదుర్ఘటమైనకార్యము నైనను సాధించు నాసురీశక్తియుఁ గల బలాకుఁడు రెండవశక్తి. వివిధసవనవిధివిధాన మర్మజ్ఞుఁడై బహుళ యందు మైత్రిని, మూక యైన నందయందు వాక్శక్తిని స్థాపింపఁగలిగిన భూసురమంత్ర శక్తి మూఁడవశక్తి. ఈశక్తిత్రయమును గథలోఁ బ్రవేశపెట్టుటవలన నసహజత్వ మేర్పడిన దని చెప్పవీలులేదు. ప్రాచీనభారతీయతపోమంత్రశక్తు లభూతకల్పనలు కావు. కావున నట్టివాని నొకచోఁ గూర్చుటవలన నపూర్వత యేర్పడి పతిత నాశ్చర్యముగ్ధనిగా నొనర్చుచున్న దనుట సత్యము. ఆసురీశక్తి స్వయంనాయక మైనప్పుడు సుగుణభంజకము కావచ్చును. కాని వివేకవంతుఁడైన పురుషుని కధీనమై యున్నచో సత్కార్యసాధనోపకరణ మగు నని బలాకవృత్తాంతము చెప్పుచున్నది. అంతియకాక దైవము మంత్రాధీనము, తపస్సాధ్యము. తపోమంత్రధనులైన మహనీయులు వక్రమైన దుర్విధిని గర్మమాహాత్మ్యముచే నధిరోహింపఁ గల రను యథార్థమును గథకుఁడు పురుషకారదైవానుకూల్యములతో విశిష్టముగా మేళవించి వ్యక్తీకరించియున్నాఁడు.

ఈకథలోఁ బతిత నాకర్షించుమఱియొక యంశము- ఉపకారప్రత్యుపకారధర్మము. విప్రునికి జేడు మేలుచేసెను. అతఁడు ప్రత్యుపకృతిగా జేనికి సతిని గూర్చెను. బహుళాదేవియుఁ దనశీలరక్షణ మొనర్చిన నందకుఁ బ్రత్యుపకారము భర్తచేఁ జేయించెను. నంద తదుపకారధర్మము వమ్ముకాకుండ మను వగు పుత్త్రునిఁ బ్రసాదించెను. ఉపకారధర్మపరాయణులైన యుత్తములు సాధింపని సద్గతి లే దను నంశ మీకథార్థముల వలనఁ దేటపడుచున్నది.

ఇందలిపాత్రలు ధర్మాధర్మవిశిష్టశీలములవలెఁ గాక ధర్మాధర్మములచే కల్పించిన రూపకల్పనల వలె భాసించుచుండుటయు, జ్యోతిశ్శాస్త్ర, మంత్రశాస్త్ర, సవన కర్మల ప్రాశస్త్యము కథార్థములయందు నిబంధించుటయు నీయుపాఖ్యానమునందలి మఱికొన్ని విశేషములు. కథ కార్యకారణక్రమమునఁ జెప్పఁబడుటచే ననంతప్రీతిసంజనకమైనది.

## తామసమనుసంభవము :

తామసమనుజననగాథ విచిత్రకల్పనామహనీయ మైనది. సురాష్ట్రుఁ డను రాజున కతనిమంత్రుల సూర్యోపాసనమువలన దీర్ఘాయువు కలిగెను. అతని కైన్నాళ్ళును

మృత్యువు రాలేదు. కాని, యతని నూర్గురు భార్యలు, మంత్రులు, బంధువులు, ప్రజలు మొదలైనవారంద ఱాతనిని విషాదసాగరమున ముంచిపోయిరి. అతనికి సంతానము లేదు. జీవితము భారమై తోచినది. అదను కనిపెట్టి శత్రువులు రాజ్యము నాక్రమించిరి. అతఁడు వితస్తానదీతీరమున ఘోరతప మాచరింప మొదలిడెను. వర్షర్తువున నొకనాఁడు కుంభవృష్టి కురిసినది. నీటివెల్లువ లోకమును ముంచెత్తినది. అతఁ డేటిలో గొట్టుకొని పోయెను. ఆప్రవాహమున నాగాఢాంధకారములో నాతని కొకమృగీపుచ్ఛ మాధారముగా లభించెను. ఆమృగ మాతని నొడ్డునకుఁ జేర్చెను. అతఁ డెంతటికిని దానితోఁక వీఁడ డయ్యెను. అది యొకవనమునఁ బ్రవేశించెను. అతనికిఁ గామ ముదయించి దాని పుచ్ఛ మూలము నిచ్చతోఁ గరస్పర్శము చేయ మొదలిడెను. మృగి మానవభాషణమున నాతని వారించి-వారిరువురిసంగమమునకు లోలుఁ డను మహామహుఁ డడ్డము నిలిచె నని చెప్పెను. సురాష్ట్రుఁ డామృగికి మాటలాడుశక్తి యెట్లు కలిగెననియు, లోలుఁ డను వాఁ డెట్లు వారి సంగమమున కడ్డుపడె ననియుఁ బ్రశ్నించెను. మృగి తన పూర్వజన్మగాథను దెలిపెను.

పూర్వ మామృగి యారాజుపట్టమహిషి యైన యుత్పలావతి. ఆమె తనబాల్యమున సుతపుం డను మునిపుంగవుఁడు మృగాకృతి ధరించి యొకహరిణితోఁ గ్రీడించుచుండ నాయాడులేడిని నెలఁదీఁగతో నదలించెను. దానితోఁ గ్రీడాభంగ మయ్యెను. అందుల కాముని కోపించి యాకన్యను మృగివిఁ గమ్మని శపింపఁబోయెను. ఆమె తనయజ్ఞాన నమునకు క్షమాభిక్ష వేడెను. ఆమె తనను వరించినచో శాప మీయ నని ముని చిత్ర ముగాఁ బల్కెను. దాని కామె 'మృగవేషధారికి మృగవనితలు దొరుకుట దుర్లభమా?' యని మేలమాడెను. దాని కతఁడు కోపించి నిజాకృతిఁ దాల్చి యామె మృగి యగునట్లు శపించెను. ఆమె తనబాల్యచాపల్యమునకు క్షమింపు మని మునిని వేఁడెను. పితృదత్తము కానిదే వివాహమాడఁ జాలక యట్లంటి నని చెప్పెను. సుతపుఁ డందులకుఁ గొంత నార్ద్రుఁడై తనపలు కమోఘ మని పల్కుచు, నామె కాహరిణీరూపము జన్మాంతరమున నిబంధించెను. అందు జాతిస్మరణము ప్రసాదించెను. ఆమెగర్భమున లోలుఁ డను ముని కుమారుఁడు నిలిచినప్పు డామెకు మనుష్యభాషణ మబ్బు ననియు, తజ్జననముతో నామెకు శాపనివృత్తి యగుననియుఁ దెల్పెను. అతని వచనమాహాత్మ్యముచే సురాష్ట్రుని కర స్పర్శప్రభావమున మృగి గర్భవతియై పుత్త్రునిఁ గాంచెను. ఘనతమము జగములఁ గప్పి యున్నవేళలోఁ దామసయోనియం దావిర్భవించెఁ గావున నతనికిఁ దామసుఁ డను నామము మును లుంచిరి. అతఁడు జనకుఁడు పెంపఁగా వృద్ధి చెంది శత్రువులను జయించి పైతృకరాజ్య మాక్రమించి, జగత్తును జయించి మనువై ప్రకాశించెను

సురాష్ట్రునిదీర్ఘాయువు జన్మాంతరమున మృగీజన్మ మెత్తిన యతని పట్టమహి షియం దొక విశిష్టసంతానము వడయుటకుఁ దోడ్పడుటచే నది సార్థక మైనది. వృద్ధుఁడును, దపోకృశుఁడును నైన రాజున కావర్షసమయమున మృగసంగమేచ్ఛ జనించుట విధిప్రేరణము, తామసగుణవిశిష్టము. కరస్పర్శచే మృగికి గర్భమగుట సృష్ట్యున్ముఖమైన మృగీసంకల్పశక్తిప్రభావము. జన్మజన్మాంతరసంబంధసంవిధాన

స్వరూపమైన సంసారము వార్షుకనదీసంకులప్రవాహస్వరూపము. జ్ఞానలుప్తమైన పాశవికకామము తామసము. తత్కామవశులైన నరుఁడును, మృగియును సమానాధికారులే. తామసవృత్తియందును సృష్ట్యున్ముఖమైన యిచ్ఛ యున్నచో నదియును నుత్పత్తికి మూలమగును. అట్టిజన్మమూలము కలవాఁడు తామసమనువు. కాని, సురాష్ట్రునియందు భాసించు బ్రాహ్మణదత్తమైన సూర్యతేజము తామసమనువునందలి జన్మసంస్కారగతమైన తమస్సును జీర్ణింపఁజేసెను. అతఁడును దివాకరుని నుపాసించినాఁడు. దివ్యతేజము సంపాదించినాఁడు!

అపూర్వసిద్ధియే నాయకున కత్యంతవిషాదహేతువై, చివర కత్యంతశుభదాయకమై రాణించినవిధ మనుక్షణప్రీతివర్ధకముగాఁ గార్యకారణక్రమమున వినిర్మింపఁబడిన యీ తామసమనుసంభవవృత్తాంత మత్యంతరమణీయము.

**చాక్షుషమనుసంభవము :**

చాక్షుషమనుజన్మవృత్తాంత మేకపాత్రప్రధానమైన కథ. బ్రహ్మచక్షువునుండి జన్మించిన చాక్షువు శరీరము విడిచి మర్త్యభువనమున జాతిస్మరుఁడైన శిశువుగా నొక పుణ్యకాంతకు జనించెను. అతనికిఁ బూర్వజన్మయందలి జ్ఞానసిద్ధి జాగృతమై నిలచియుండెను. శరీరావస్థకు మించిన యాత్మసంస్కార మాతనియందు భాసించుటచే నాతఁడు పురిటింటనే తల్లికిఁ బుత్రవ్యామోహము వల దని బోధించెను. ఆమె కాజ్ఞానిబోధను గ్రహించుశక్తి లేదు. మాతృవాత్సల్యమునే నిరాకరించు నాశిశువు నాతల్లి పరిత్యజించినది. పురిటింట సమయము కొఱకు వేచియున్న జాతహారిణి యాశిశువుసు గొనిపోయి, విక్రాంతుఁ డను రాజుయొక్క పడతిపురిటింటిసెజ్జపై నుంచి, యామెపుత్త్రుని మఱియొక విప్రుని యింటఁ బెట్టి, మూఁడవశిశువును భక్షించెను. ''ఆనందుఁ'' డనుపేర- నృపతనూజుఁడుగాఁ జాక్షువు పెరిగిపెద్దవాఁడై యుపనయనసంస్కారస్వీకారార్హుఁ డయ్యెను. విక్రాంతుఁ డాతని కాసంస్కార మొనర్చెను. గురువు తల్లికి నమస్కరింప నాతని నియోగించెను. అప్పు డతఁడు నవ్వి "కన్నతల్లికా పెంచినతల్లికా నతుల నిడునది?'' యని ప్రశ్నించెను. గురుఁ డాశ్చర్యపడి యతనిజన్మక్రమము నేర్పడఁ జెప్పవేఁడెను అతఁడు జరిగినదంతయుఁ జెప్పి- చివరకు-

సీ. ఎవ్వఁ డెవ్వని పుత్రుఁ, డెవ్వఁ డెవ్వనిబంధుఁ
డేల యీభ్రమ? సన్మునీంద్ర చెపుమ!
జన్మంబు జనులకు సంబంధ మింతియ
యదియు మృత్యువుచేత నడఁగిపోవు
జన్మించునతనికి సకలబాంధవులతోఁ
బాయంగరాని సంబంధ మొకటి
సతతంబు గలుగు నాసంబంధ మాద్యిగా
సర్వంబు దేహావసానమైనఁ

తే. బొలియుఁ గావున సంసారమున జనించు
వారి కెవ్వరు బంధులు లేరు బుద్ధి
భ్రమయ నీ కేల ? నాకు నీభవమునందుఁ
దండ్రు లిరువురై రిరువురు తల్లు లైరి.

తే. అన్యదేహసంబంధమునందు వేఱ
జనకజనయిత్రు లగుట కాశ్చర్య మేమి ?
యట్టి యే నింక నిం దుండ కేఁగి తపము
విపినమున నాచరించెద విప్రవర్య ! (5.318, 319)

అని గంభీరోపన్యాసము చేసెను. విక్రాంతున కతనిమాటలలోని పుత్త్రవ్యామోహ రాహిత్యమునుగూర్చినప్రబోధము నర్థము చేసికొను సంస్కారము కలదు. కావున నతని తపోవనగమనమున కంగీకరించెను. ఆనందుఁడు ఘోరతప మొనరించెను. బ్రహ్మ ప్రత్యక్షమై తప మెందులకు జేయుచుంటి వని యతనినిఁ బ్రశ్నించెను. కర్మపాశబంధ ములు తెగిపడునట్టి యాత్మశుద్ధిని గోరి తపమాచరించుచుంటి నని యతఁడు విన్నవించు కొనెను. కర్మఠుఁడు మోక్షార్హుఁడు కాఁడు కావున నతనిని మనువుగా వర్తింప బ్రహ్మ యాజ్ఞాపించెను. అపై నాతఁడు చాక్షుషనామముతోఁ బ్రసిద్ధుఁడై విదర్భాద్వితీయుఁడై యాఱవమనువుపదము నలంకరించెను.

చతుర్ముఖదృగ్జాతుఁడై, బ్రహ్మవంశమునఁ బుట్టి, వెంటనే మెట్టి, రాజకులైక భూషణుఁడై కర్మాచరణార్హతను దాల్చి, బాల్యముననే తపశ్శీలియై, యౌవనపదముతో పాటు మనుపదమును గూడ నేకకాలమున నధిష్ఠించి, కమలాసనుని కరుణార్ద్రదృష్టికిఁ బాత్రుఁడైన చాక్షువు కారణజన్ముఁ డనుటలో నెట్టిసంశయము లేదు. అతఁడు తన సిద్ధికి తనబ్రతుకును సాధనముగా మలచుకొన్నసాధకుఁడు, బోధకుఁడు, రాజర్షి. ఇతని చరిత్రలో నితరపాత్రము లన్నియు నితనిజీవితపరమార్థమునకు నిమిత్తమాత్రములై యుండుటచే నీకథ యేకపాత్రప్రధానమైన కథాశిల్పముచే రాణించుచుఁ జాక్షుషుని యద్వితీయత్వమును బ్రతిపాదించుచున్నది.

పరిమాణమున నీకథచిన్నదయ్యు శక్తిమంతమైన సంభాషణశిల్పముచే నీకథ మహ త్తర మైనది. ఇందు వైరాగ్యము వాత్సల్యముతో సంఘర్షణపడినది. అమర్షాగ్ని ప్రజ్వరిల్లి నది. వత్సల్యభావ మాభాస మైనది. దానివలన వైరాగ్యమునకుఁ బుష్టి చేకూరినది. చాక్షు షుని వైరాగ్యదృష్టి పురిటింట పొటమరించి, ఉపనయనకాలమున నిచ్చిన యుపన్యాసమునఁ బ్రస్ఫుటమంది, తపోదీక్షలోఁ బరిణతిఁ జెంది, బ్రహ్మవరమున ఫలవంత మైనది. ఇట్టి క్రమోన్మీలనమును భావసంఘర్షణద్వారమున భావనామయ మొనర్చి జిజ్ఞాసను రేకెత్తిం చెడుగంభీరాంతరశిల్పరచనము నీయుపాఖ్యానమునఁ బురాణకర్త ప్రపంచించెను.

## వైవస్వత మను వృత్తాంతము :

మన్వంతరగాథలలో వైవస్వతమనుచరిత్రమున కొక వైలక్షణ్యము కలదు. స్వాయంభువాదుల కథలు మనుసంభవవృత్తాంతములు. ఆపరిపాటినిబట్టి వైవస్వతమన్వంతర కథయందును దన్మనుసంభవవృత్తాంతమే వర్ణితమై యుండవలెను. కాని, యీకథ మను సంభవానంతరమే యారంభ మగుచున్నది. అయినను దానియందు మనుమాతాపితరుల చరిత్రము వర్ణింపఁబడియున్నది. ఈకథలో వైవస్వతునకుఁ బ్రత్యక్షప్రవేశము లేదు. కాని, యిం దొకచమత్కారము కలదు. సూర్యవంశప్రవర్తకుఁడైన మార్తాండుఁడు వైవస్వతు నత్యంతగౌరవముతో మనమున నాదరించుచుండెను. ఆసత్య మతఁ డాత నిని మనువుగా నియమించినపుడు ప్రకటితమయ్యెను. తత్పూర్వమును గొన్నిసందర్భ ములం దది వ్యంగ్యముగా భాసించెను. తత్ప్రతిపాదనమే యిందలిప్రత్యేకత!

మారన యీకథయందు పాత్రలక్రియాబాహుళ్యమును వర్ణించుటచే వానిస్వరూప స్వభావములఁ దేటపఱచు శిల్పమార్గము ననుసరించెను. అందును నన్నిపాత్రలస్వభావ ములను వ్యంజింపఁజేయుట యొకయెత్తుగను, వైవస్వతునివ్యక్తిత్వమును వ్యంజింపఁ జేయుట మఱియొకయెత్తుగను భావించెను.

సూర్యునివేడిమికిఁ దాకఁజాలక సంజ్ఞాదేవి ఛాయాదేవిని సృష్టించి, తనస్థానమున దనకు మాఱుగా నిలిపి పుట్టినింటి కేఁగెను. పెద్దకాలము సతులకుఁ బుట్టినింట నుండుట పాడి కాదని తండ్రిచే ననిపించుకొని యుత్తరకురుభూముల కేఁగి తనభర్త సౌమ్య మూర్తియై వచ్చి తనను బొందవలయునను తలఁపుతోఁ దపము చేయుచుండెను. ఛాయా దేవి సూర్యునివలన సంతానవతి యయ్యెను. తనబిడ్డలను సవతిబిడ్డలకంటె నాదర ముగాఁ జూచుచుండెను. అది సంజ్ఞాదేవిపుత్త్రులకుఁ గంటక మయ్యెను. ఇచ్చోట మారన రచన యిట్లున్నది :

క. మను వది యెఱిఁగియు నేమియు
ననక ప్రశాంతిమెయి నుండ, యముఁ డుత్కటకో
పనుఁడై యాసతిఁ దన్నఁగఁ
దనపాదం బెత్తి మానెఁ దద్దయు శాంతిన్. (5.342)

వైవస్వతుని ప్రశాంతగుణమును, యముని యుగ్రస్వభావమును వారిక్రియాభివర్ణనము వలన నీపద్యమున వ్యంజింపఁబడుచున్నవి. పద మెత్తియుఁ దన్నక మానినతమ్మునిపై నన్నగారిప్రభావ మఖండము! లక్ష్మణునిపై రాముఁడును, భీమునిపై ధర్మరాజును నిట్టిప్రభావమే కలిగియుండుట ప్రసిద్ధము. ఆతమ్మునికన్నపై నున్నగురుభావముకూడ నిచ్చట ప్రశంసింపఁదగి యున్నది.

కథలో నింకొకయడుగు ముందుకు వైచితిమా మఱియొక విచిత్రము కలదు. ఛాయాదేవి యమునియవినయవర్తనమునకుఁ గోపించి, యాయెత్తినపాదము తెగి ధరపైఁ

బడు నట్లు శపించెను. యముఁడు భయకంపితుఁడై తండ్రియొద్ద కేఁగి, యిట్లు మొఱ పెట్టుకొనెను :

తే. గీ. తండ్రి ! యిదియొక యత్యద్భుతంబు వినుము !
దయ యొకింతయు లేక యుదగ్రవృత్తి
శాప మిచ్చె; నెక్కడ నైన జనని ప్రజల
కింత కీ డొనరింపఁగ నెత్తికొనునె ?

తే. గీ. నాకు నిది తల్లి గా దని నాకు మనువు
చెప్పుచున్నాఁడు..................... (5. 346-347)

యముఁడు తాను చెప్పఁబోవునది యత్యద్భుత మని చెప్పి, సావధానశ్రవణమును హెచ్చరించెను. దానితో వివస్వంతునితో పాటు పఠితయు సావధానచిత్తుఁ డగును. రెండవవాక్యము ''దయ యొకింతయు లేక యుదగ్రవృత్తి శాప మిచ్చె'' ననునది. ఇందు శాప మిచ్చినది తల్లియని స్పష్టము చేయలేదు. నిజమున కావాక్యమున "నుదగ్రవృత్తి''యే కర్త. యముని కామెనామోచ్చారణమునైతము సహింపరాని దయ్యో నని యందలి వ్యంగ్యము. మూఁడవవాక్యమునందలి జననిశబ్ద మర్థాంతరన్యాసాంతర్గత మగుటచే లోక సామాన్యముగా వాడఁబడెన దగుచున్నది. 'ఎత్తికొను' క్రియాప్రయోగము సాభిప్రాయము. ఆక్రియకుఁ బ్రకృతార్థము పూనుకొనుట యని. లాలించుట, చంకనెత్తుకొనుట యను నర్థములును భావింపవచ్చును. జనని శిశువును జంకనెత్తుకొని గోరుముద్దలు తినిపించును, ముద్దుమురిపెములు చెల్లించును. కాని, ఛాయాదేవి సవతికొడుకుల నెత్తుకొనుటలో నచ్చ మైన వాత్సల్యము కానరాదు. పైపెచ్చు వారి కెగ్గు తలపెట్టి పయోముఖవిషకుంభమువలె వ్యవహరించుచున్న దని యమునిభావము. ఇన్నిమాటలు యముఁడు మాట లాడినను సూర్యుని కావేశపరుఁ డైన యతనిపై నమ్మకము కుదుర దని యతనికిఁ దెలియును. అందువలనఁ బ్రత్యేకించి యతని కామె తల్లి కాదని మనువు చెప్పె నని పేర్కొనినాఁడు. మనువాక్యము సత్యధర్మనిష్ఠమై యుండును. అతనియోగ్యతపైఁ దండ్రి కంత విశ్వాసము. అది యావాక్యార్థశక్తివలనఁ గలుగువ్యంగ్యము. ''నాకున్'' అను సముచ్చయార్థక ప్రయోగముచే ''నాకుకూడ''–అనునర్థ మేర్పడి మనవున కంతకుఁ బూర్వమే యామె తల్లికా దనునిశ్చయజ్ఞానము కల దను సూచన యేర్పడుచున్నది. నాకు మనువు చెప్పు చున్నాఁ డను వాక్య మిచ్చుట జీవతుల్య మైనది. ఛాయాదేవి చూపిన పక్షపాతమునకు మనువుకూడ బాధపడినాఁ డని పైవాక్యమువలన స్పష్టము. కాని పై కనలేదు. అంతర్య ముగాఁ దమ్మునితో మాత్ర మనినాఁడు. యముఁ డావేశపరుఁడు. మహాజ్ఞాని యైన యన్నను దల్లివర్తనముగూర్చి ప్రశ్నించి యుండును. అతఁడు తమ్మునకు నిజము చెప్పి యుండును. అట్లు చెప్పుటలో మనుహృదయమున గూఢమైన యొకమహాప్రయత్నము కలదు. తమ్మునకుఁ బురియెక్కించినచో నాతఁడు తల్లి నెదిరించును. అది తండ్రికిఁ దెలియును. అతఁడు యమునిఁ బ్రశ్నించును ఆవేశపరుఁడైన యముఁ డసలుసంగతి

బైట పెట్టును. సంజ్ఞాదేవిని గూర్చినయాలోచన మప్పుడు కలుగును. ఛాయాదేవికి వరాభవ మగును. తండ్రి తల్లిని గైకొనును. మాతాపితరులకుఁ బునస్సమాగమము కలుగును. పట్టమహిషి యైన కన్నతల్లిచల్లనివాత్సల్యసౌఖ్యమును మఱల పొందవచ్చును. అందులకై వైవస్వతుఁ డీమాట యముని చెవులో నూదెను; సూక్ష్మముగాఁ గథాఫలసిద్ధికి బలమైన హేతువును గల్పించి ఫలభాక్కుగ కన్నతండ్రియొక్క దయకుఁ బాత్రుఁ డయ్యెను: భావి ప్రపంచధర్మప్రవర్తకుఁడైన మనువును పరమవిజ్ఞానిగను, ప్రశాంతునిగను, ఫలాగమనమునందుఁ గాని తనసూక్ష్మయత్నము నెఱుక పడనీయనంత నీతిచతురునిగను, కార్యసాధనోపాయకుశలునిగను, మితహితసత్యవాదిగను బై క్రియాభివర్ణనాశిల్పమునఁ బురాణకర్త ధ్వనింపఁజేసినాఁడు.

సంజ్ఞావివస్వంతులస్వభావములను దెలిపినపద్ధతి మఱియొకమార్గమునఁ బడినది. సూర్యునికి వేఁడిమి సహజగుణము. వేఁడిమి యనఁగా నుసుకుఁదనము; తీవ్రస్వభావము; ఎప్పుడు నిప్పులుగ్రక్కుచుండెడి ప్రవృత్తి; అల్పవిషయములకు నైత మధికముగాఁ గోపించెడి స్వభావము. సూర్యగ్రహమునందు మానవస్వభావము నదుకవలెను. అట్టి ప్రయత్నమును మారన 'వేడిమి' యను శబ్దప్రయోగమునఁ గనఁబఱచెను. సంజ్ఞ యుద్విగ్నహృదయ. మగనివేఁడిమికి తాళలేదు. పతిని, బరిత్యజింపను లేదు. అందుచే నామెయం దంతర్వ్యక్తిత్వ మొకటియు, బహిర్వ్యక్తిత్వ మొకటియు నేర్పడినవి. అంతరంగము పతిసుఖము నభిలషించినది. సంకల్పబలముచే ఛాయాసృష్టి నొనర్చి తనకు మాఱుగా భర్తకొఱ కామెను నియోగించినది. బాహిరమైన వ్యక్తిత్వము భర్తకు దూరముగా నుండ వాంఛించినది. కాని, యెన్నటికైనను సౌమ్యాకృతి యైన భర్తను బొందనాకాంక్షించినది. చివరకుఁ దపస్సునకైనను సిద్ధమైనది. సంజ్ఞ సూర్యుని వీడుటకు సూర్యుఁడే కారణము. దానిని మారన మొదటిమూడుపద్యములందును లోకసహజముగా సూచించెను. సూర్యుఁడు విశ్వకర్మతనయయైన సంజ్ఞను బెండ్లియాడిన క్రొత్తలలో నిరువురు నెట్టి పొరపులు లేక యమితానురాగమూర్తులై మసలి, వంశవర్ధనుఁడైన వైవస్వతునిఁ గనిరి. అతఁ డనుపమవిజ్ఞాననిధియును, నిర్మలయశోధనుఁడు నయి మనుపదవీనిర్వహణసామర్థ్యము సాధించెను. అనవరతసంయోగభోగజీవితము దంపతులకుఁ గొంతకాలమునకు విసువుఁ గలిగించును. అప్పు డల్పములైన యంతశ్శల్యము లేర్పడును. ఇట్టిది లోకమున సహజము. అట్లే సూర్యునికి భార్యపైఁ గ్రొత్తలో నున్నవలపు తగ్గినది. ఆమె కన్నులు మూసిన తప్పు, తెరచిన తప్పు – దానికి చిడిముడి కోపము. అది శాపములవఱకు వెళ్లుట. భార్యాభర్తలవైమనస్యములు శిశువుల కపకారకము లగుట తటస్థించినది. ఇట్లు శప్తులై జన్మించినవారే యమయమునలు. సూర్యునికోపము తాత్కాలికమైనదే. కాని, యది భార్య కసహ్యమైనది. అట్టిసమయమున భార్యాభర్తలు వేఱగుట కొంత యుపకరింపఁగలదు. సూర్యునికి వియోగావశ్యకత లేదు. కాని, సంజ్ఞకుఁ గలదు. అతఁ డామె విలాసములను గోరునంతగా నామె మనస్సును గోరుటలేదు. ఆమె యతని సౌమ్యగుణసౌందర్యమును వరించినది. దాని నతనియందుఁ బొందలేనప్పు డామె యతనినిక్షి

దూరమైనది. అతనిలో మార్పు రావలె నని కారడవులఁబడి తపస్సుచేసినది. ఛాయాదేవి వలన సూర్యుఁ డీవిషయమును దెలిసికొనినాఁడు. పొంగివచ్చు వేడ్కతో విశ్వకర్మ యింటి కతిరయమునఁ బోయినాఁడు. మామ చేసిన సపర్యలకు సంతుష్టుఁ డైనాఁడు. తన మీఁద మామగారింట గౌరవము చెడకుండ కాపాడినందులకు సంజ్ఞాదేవియౌదార్యమును లోలోన భావించి యుప్పొంగినాఁడు.

చ. ఇనుఁడు మహాత్మ ! నీతనయ యెయ్యది ? యన్న నతండు దేవ ! నీ
యనుమతితోడ వచ్చితిఁ బ్రియంబునఁ దా నని చెప్పి మద్గృహం
బున వసియింప నే వలదు పొమ్మని యంపఁగ నేఁగుదెంచె న
వ్వనజదళాక్షి నావుడు దివాకరుఁ డప్డు ప్రబుద్ధచిత్తుఁడై.

వ. ఉత్తరకురుభూములందు బడబారూపధారిణియై సంజ్ఞాదేవి తనమనంబున నాభర్త సౌమ్యమూర్తియై వచ్చి నన్నుఁ బొందవలయు నని తపంబుసేయుచుండుట యెఱింగెను. (5.352-353)

పైపద్యమున 'వనజదళాక్షి' యను పదము సాభిప్రాయముగను, శక్తిమంతముగను వాడఁబడినది. దానివలన విశ్వకర్మహృదయ మిట్లు వ్యంజింపఁబడుచున్నది: పుత్త్రిక పుట్టినింటినుండిపోయి చాలనాళ్లైనది. కాని, మెట్టినింటికిఁ జేరలేదు. సతీపతుల మధ్య కలఁత లున్న ట్లామె యెన్నడును జెప్పలేదు. అట్టిబాధయుఁ గనుబఱుప లేదు. పుట్టినింట సతు లెక్కువకాల ముండకూడ దని యంపివైచినప్పుడును మాటమాత్ర మైన ననలేదు. ఆమె యిప్పు డెచ్చట నున్నదో తండ్రికిఁ దెలియదు. సూర్యుఁడు నీతనయ యెయ్యది ? యనుటలో నామె యేదియో కోపము వచ్చి మెట్టినింటినుండి లేచివచ్చిన దని తెలిసికొనినాఁడు. అట్టిసమయమున కూతుఁగూర్చి "వనజాక్షి" యని చెప్పుటవలనఁ గవి సమయము ననుసరించి పద్మార్కుల ప్రణయమును వ్యంజింపఁజేసె, పుట్టినింట నున్నను ఆమె యెల్లప్పుడును పతిరూపదిదృక్షువై జీవించియుండె నని సూర్యునకుఁ దెలిపినాఁడు. ఆశబ్దశక్తి స్వీయప్రభావిశేషముచే సతి కనుదమ్ములు నిమీలితము లైనట్టియు, శాపభీతిచే తరళము లైనట్టియు సన్నివేశములను సూర్యునకు జ్ఞప్తికిఁ దేఁగలిగినది. తత్స్మృతిచే నాతనియందు సతీనయనకమలసంకోచహేతు వగు స్వీయవర్తనముపై వెగటుజనించినది. దివ్యదృష్టితో సతీహృదయమును దెలిసికొనినాఁడు. స్వీయతేజశ్శాతనమున కుద్యమించి నాఁడు. వ్యంగార్థరమణీయ మైన యేతత్కథాంశసంజాతమునంతయు నలతియలతిశబ్దములచే వ్యంజింపఁజేయు మారనరచనము ప్రశంసనీయము !

విశ్వకర్మ ధర్మనిరతుఁడు. పుత్త్రికకు సతీధర్మము నుద్బోధించి ఋజువర్తనముఁ బ్రకటించెను. సూర్యతేజశ్శాత మొనరించి వెలుఁగుపొడితో దివ్యాస్త్రములు సృష్టింపఁ గలిగినమహాశిల్పి యతఁడు. ఛాయ సంజ్ఞాదేవిమనస్సృష్టి. ఆమె ప్రతిజ్ఞాపాలన మనెడి యుత్తమధర్మము నిర్వహించినను, సపత్నీసహజమైన యీర్ష్యకు లోనయ్యెను. సహజస్వభావగంభీరములైన యీపాత్రలగుణశీలములు వాచ్యములు కాకుండ చిత్రించుట మారన కథాకథనశిల్పము !

**సావర్ణి మనుసంభవము :**

సూర్యుని కిరుపురుభార్యలు. ఆభార్యలయందతఁడు గాంచినసంతానములోఁ బ్రథములు మనువు లైరి. సంజ్ఞాసంతతిలోఁ బెద్దవాఁడు– వైవస్వతుఁడు. అతఁడు సూర్యసంకల్పబలముచేత మనుత్వార్హత నొందినాఁడు. ఛాయాసుతులలోఁ బ్రథముఁడు సావర్ణి. అతఁడు పూర్వజన్మకర్మపరిపాకఫలముగా మన్వధికారము వడసెను. ఇట్లగుటచే వైవస్వత సావర్ణమనువృత్తాంతకథనములందు భేద మేర్పడుచున్నది. వివస్వతుఁడు వైవస్వతునిపైఁ బచరించు విశేషాదరాభిమానములఁ బ్రపంచించుటయే, మొదటివాని కథలోఁ బ్రధానము కాగా, రెండవవానికథలో నాతఁడు వివస్వతునికుమారునిగాఁ బుట్టి మనువగుటకుఁ గల హేతువులను నిరూపించుట ముఖ్యమగుచున్నది.

సావర్ణి పూర్వజన్మమున సురథుఁ డనురాజు; ప్రజలను కన్నబిడ్డలుగా నెంచి పాలించిన చల్లనిప్రభువు. అతని నొకసారి కాలావిధ్వంసు లను శత్రువు లోడించి రాజ్యభ్రష్టు నొనర్చిరి. దానితో నతఁ డడవులపా లయ్యెను; చనిచని మేధ యను తపోధనుని యాశ్రమము చేరి, బంధుపుత్త్రాదులవియోగమువలన గలిగిన దురంతచింతతోఁ గుములుచుఁ బ్రొద్దులు పుచ్చుచుండెను. అతని కొకనాఁ డావనమున సమాధి యను వైశ్యుఁ డొకఁడు కనఁబడెను. అతఁడును బుత్త్రులచే బహిష్కృతుఁ డయ్యుఁ దీరని మోహముతో వారినిఁగూర్చి దుఃఖించుచుఁ గ్రుమ్మరుచుండెను. సురథుఁడు సమాధిచరిత్ర నెఱిఁగి తమ యిరువురి సంసారమోహమునకుఁ గారణము తెలియఁగోరి మేధ నాశ్రయించెను. అతఁడు మాయాస్వరూపస్వభావమాహాత్మ్యముల నిరూపించెను; విష్ణుమాయాశక్తి నుపాసింప నాదేశించెను. సురథసమాధులు శక్తినిగూర్చి తప మాచరించిరి. ఆమె వారికిఁ బ్రత్యక్షమై వరము వేడుకొను మనెను. సమాధి నిస్సంగాత్మక మైన నిర్మలజ్ఞానమును గోరెను. సురథుఁడు రాజ్యమును, వైరిజయమును, మీఁదటిభవనమున శాశ్వతమోక్షమును గోరుకొనెను. ఆమె యావరముల నిచ్చుచు సురథునిఁ బైజన్మమున రవిసుతునిగను, మనువుగను నగునట్లు నిర్దేశించెను. సంగ్రహముగా సావర్ణిమనుజన్మవృత్తాంత మిది.

సావర్ణియందలి మనుత్వార్హత పూర్వజన్మతపఃఫలరూప మని చెప్పుట యీకథా తాత్పర్యము. సురథుఁడు రాజ్యమోహము కలవాఁ డగుటచేఁ దద్భోగవిలుప్తి యతనికి దుఃఖము కలిగించినది. మోహస్వరూపస్వభావములఁ గూర్చిన హితబోధ యతనిలో మోహము నుపశమింపజేసి చిత్తశుద్ధిఁ గలిగించినది. శుద్ధమైనచిత్తము సమాహితమై గురుబోధ ననుసరించి తపమున కుద్యుక్తమైనది. తపఃఫలముగాఁ బునర్జన్మరహితమైన మోక్షమును, రాజ్యభోగభుక్తిని నభిలషించినది. ఈయభిలాషలో ముముక్షుభావము సంస్కారాత్మకమై జ్ఞానవృత్తియందు భాసింపఁ, బ్రవృత్తిభోగతృష్ణ యిచ్ఛావృత్తియందుఁ దళుకొత్తినది. క్రియావృత్తి ధర్మాధిష్ఠిత మైనది. మనుచిత్తవృత్తి యిట్లే యుండవలెను. అప్పుడే చతుర్వర్గప్రాప్తి కనుగుణమైన శాసన మతఁడు చేయఁగలఁడు. దానిని సురథుఁడు జీవితఫలముగా సాధించెను. సావర్ణి పూర్వజన్మాధికారముగాఁ బొందెను.

ఈకథయందు సమాధిపాత్రప్రయోగము సాభిప్రాయమును, సార్థకము నైయున్నది. సమాధి పతాకనాయకుఁడు. స్వీయప్రయోజనము సాధించుకొనుచునే నాయకుని యభ్యున్నతికిఁ గారణమైనవాఁడు. అతఁడు సురథునియందు జిజ్ఞాస రేకెత్తుటకుఁ గారణమైనవాఁడు. తద్వ్యథ మీకథలో రమణీయముగాఁ జిత్రింపఁబడినది. మేధ నడిగిన ప్రశ్నలో నాతనిచిత్తవృత్తి స్పష్టముగాఁ గానఁబడుచున్నది.

సీ. అర్థి నే నొకటి ని న్నడిగెద నాకు నీ
    వెఱిఁగింపవయ్య ! మునీంద్రవర్య !
యపగతరాజ్యుండ నయ్యు నభిజ్ఞుండ
    నైన నా కిప్పు డజ్ఞాని కట్లు
రాజ్యాంగములయందు రమణమమత్వంబు
    ప్రబలమై పాటునఁ బడఁగనీక
డెందంబు నెవ్వగఁ గొందల పెట్టెడు
    నకట ! యీవైభ్యండు నాలుసుతులు
తె. చెలులుచుట్టలు దను విడిచినను దాను
వారి విడువంగఁజాలక వగచుచున్న
వాఁడు నెయ్యంబు మనమున వాట మైన
దివ్విధం బింతయును నిది యేమి యొక్కొ !

క. అలఘుతరజ్ఞానసమే
తుల మయ్యును మేము దుష్టమతులమున్
బలవదవివేకతిమిరాం
ధులము నగుట యిది యేమి దురితధ్వంసీ ! (6. 22, 24)

మేధ మహావిజ్ఞాని, పరతత్త్వప్రతిపాదనవిధానమర్మజ్ఞుఁడు. అతఁడు మోహస్వరూపమును లౌకికోపమానముచే నిరూపించిన విధ మత్యంతరసబంధురము !

చ. పులుగులఁ జూడమే యెదఁద బోధము గల్గియు మోహ మెట్టిదో
సొలయక యాఁకట న్నలియుచు న్గని మేఁ పొగిఁ దెచ్చి తెచ్చి చం
చులు వెడలించి పిల్లలకుఁ జొన్పెడు మక్కువ నింత కెక్కువాఁ
దలఁపఁగఁ బుత్త్రులందు వసుధావర ! మోహము మర్త్యకోటికిన్.

వ. పుత్త్రమోహంబు ప్రత్యుపకారార్థంబు గా దది సహజంబ యె ట్లనిన సంసారస్థితికారిణి యైన మహామాయప్రభావంబునం జేసి మమతావర్తం బగు మోహజలగర్తంబున నెల్లవారునుం బడినవారు గావున దీని కింత విస్మయం బందవలదు.''
(6. 30-31)

మేధ దేవీమాహాత్మ్యప్రబోధ మొనర్చుటకు హేతువు సురథుని జిజ్ఞాస. అతనియందు జిజ్ఞాస కలుగుటకు హేతువు సమాధి. సమాధికి జ్ఞానలబ్ధియే ఫలము. సురథునకు

మనోరథసిద్ధియే ఫలము. వీరిని కారణకార్యసంబంధమున నిబంధించి నిర్వహించుట యిచ్చటిశిల్పము.

దేవీమాహాత్మ్యకథనమున నిర్మాణమర్మ మొండు కలదు. కథలో నీకథాశ్రోతలు సురథసమాధులు. వీరు భిన్నప్రవృత్తులు. ఒకఁడు రాజసవృత్తి, మఱియొకఁడు సాత్త్వికవృత్తి. ఒకఁడు క్షత్రియుఁడు, ఒకఁడు వైశ్యుఁడు. చెప్పఁబడినకథ రౌద్రాద్భుతరసవిస్తారము. సురరక్షావ్రత యగు దేవి భిన్నభిన్నాకృతులతో నుద్భవించి, యసురగర్వోన్నతి నణఁచి సుపర్వసౌఖ్యసంపాదనము సేయుట యిందలికథ। ఈకథకు విపులమైన ఫలశ్రుతియుఁ గలదు. దాని నంతయుఁ జెప్పి, మేధ ముగింపువాక్యముగా నన్న పద్య మిది :

క. మానుగ సంపదయును వి
జ్ఞానము దయసేయు దేవి సద్భక్తి మది
న్నూని తనుఁ గొలిచి కోరిన
మానవులకుఁ బ్రీతితోఁడ మానవనాథా। (6. 246)

ఇందు క్షత్రియుఁడు సంపదను కోరినాఁడు. వైశ్యుఁడు విజ్ఞానము కోరినాఁడు. వీరిరువురిలోఁ గథానాయకుఁ డగు సురథునికోర్కె ప్రధానము. అతఁ డట్టికోర్కె కోరుటకుఁ దోడ్పడినయంశములు రెండు. ఒకటి: కథలో నశక్తులైన సురలు శక్తి నాశ్రయించి శత్రువుల నిర్జించుట. రెండు : ఆదిశక్తి ధర్మవిరోధు లైన శాత్రవనికాయమును సంహరించి ధర్మరక్షణము చేయుట పరమధర్మ మని భావించుట. దేవతలును దదర్థజాతముతోడనే దేవిని స్తుతించుచు నిట్లనిరి :

ఉ. ధర్మవిరోధు లైన బహుదైత్యులఁ జంప ననేకరూపము
ల్పేర్మిమెయి న్ధరించి యిటు భీమరణం బొనరించి గెల్చి తీ
నిర్మలభూతిమై నెగడ నేర్చరి యెవ్వతె నీవు దక్క దుః
ఖోర్మికరాళసంసృతిపయోనిధిబాడబమూర్తి ! యంబికా। (6. 225)

ఈపద్యమునందలిభావము సురథునియందు సుప్తయై యున్న శత్రుసంహారయత్నమును మేల్కొల్పినది. అస లీకథ కదియే పరమప్రయోజనము. మహిషశుంభనిశుంభాది ప్రధానదైత్యులతోడి యుద్ధములే కాక తత్సహాయులతోడియుద్ధములను సైతము విరివిగా వర్ణించు నీకథాభాగము సుక్షత్రియునందు విజయాసక్తినిఁ బుట్టింపక, విరాగస్ఫూర్తిని వెలిఁగించునా? కథాఫలమును గుర్తెరింగి కథార్థసంవిధాన మొనరించుట యిచ్చటిశిల్పము.

ఈకథలోని పాత్రలపేళ్లు సార్థకములు. మేధ- సమాధి- సురథుఁడు- ఈ మూఁడును నించుమించుగాఁ జిత్తావస్థలను సూచించెడిపేళ్లే. "ధీ ర్ధారణావతీ మేధా" యని యమరము. ధారణాశక్తి గలబుద్ధి త్రిగుణాతీత మగు శక్తిని స్మరింపఁగలదు; వ్యాఖ్యానింపఁగలదు; ప్రపంచింపఁగలదు; దర్శింపఁగలదు; అనుభవింపఁగలదు. అట్టిశక్తి దేవీకథాప్రవక్తయందుఁ గల దని చెప్పుట మేధానామసార్థక్యము. సమాధిశబ్దము శంకాపరి

హారమునకును, ఇంద్రియనిగ్రహమునకును పేరు. మఱియు- "సమాధి ర్హృదయైకాగ్ర్యే వైశ్యభేద ప్రకారయోః" ఇతిశేషః. మోహశంకాపరిహారానంతరము ఇంద్రియనిగ్రహముచేఁ జిత్తైకాగ్రరూప మగు తపమును సాధించిన వైశ్యవరిష్ఠుని కానామ మన్వర్థము. "సురథ" శబ్దములోని రథమునకు- "రమన్తేఽత్ర రథః" రముక్రీడాయాం- అని అన్వయము. క్రీడార్థవ్యంజకమును, స్యందనార్థస్ఫోరకమును నైన యానామ మాక్షత్రియునియందలి ప్రవృత్తిరసికతను, యుద్ధస్థిరత్వమును వ్యంజింపఁజేయుచున్నది. సమాధిచేఁ బ్రేరితమై, మేధచే నీరితమై, సురథునియందు వాసవాత్మకమై వసించిన సంస్కారము ధ్వనింపఁబడుట ఏతత్కథాశిల్పరహస్యము.

**రౌచ్యమనుసంభవము :**

రుచి యను రాజర్షికి మాలినియందు జన్మించినవాఁడు రౌచ్యుఁడు. ఇతనిజన్మము పితృదేవతలచే సంకల్పింపఁబడినది. సతతశమాఢ్యుఁడును, అనంగుఁడును నైన రుచిని వారు ప్రేరేపించుటయు, నతఁడు వారిదయచే మాలినిని భార్యగాఁ బడసి యామెయందు మను వగు పుత్త్రునిఁ గాంచుటయు నిందలికథ. విధిప్రేరిత మైన పితృసంకల్పము రుచిని రౌచ్యమనూత్పత్తికి హేతు వగునట్లు చేసిన విధమును జిత్రించుటయే యీకథాకథనమందలి శిల్పము.

**భౌత్యమనుసంభవము :**

భౌత్యమను వగ్నిప్రసాదసంజనితుఁడు. భూతి యనుమహర్షికి ననలుఁడు పుత్త్రునిఁ బ్రసాదించినకథ యీమనుగాథయందుఁ జెప్పఁబడినది. దానివలన నగ్నిమహిమ వ్యంజింపఁబడుచున్నది.

అంగిరశ్శిష్యుఁ డగు భూతి యత్యంతకోపస్వభావుఁడు. అమ్మహాత్ముని తీవ్రకోపాగ్నికి జంకి పవనార్కశశాంకేంద్రు లతని కెల్లవేళల సుఖానుసంధాన మొనర్చుచుండిరి. భూతి సంతానము లేమికి దుఃఖించి శీతాతపవాతపీడితుఁ డగుచుఁ దపము చేయ సంకల్పించెను. కాని, పవనాదు లాతని నొంప నోడుటచే నతఁడు తపోయత్నమును, సుతేచ్ఛను వదలి మిన్నకుండెను. ఒకనాఁ డతని సహోదరుఁ డైన సువర్చసుఁడు వచ్చి యతనిని యజ్ఞనిమంత్రితునిఁ గావించెను. భూతి యాసవనమునకు వెళ్ళుచు శాంతి యను శిష్యునిఁ బిలిచిఁ తననిత్యాగ్నికార్యాదివిధులను యథావిధిగా నిర్వర్తింప నియోగించెను. శాంతియు భక్తిశ్రద్ధలతో నాశ్రమమున నగ్నిరక్షణము సేయుచున్నను ఆశ్చర్యకరముగా నగ్నికుండమున నగ్ని చల్లారెను. శాంతి గురుశాపభీతుఁడై, త్రిలోకవరదుఁ డైన యగ్నిని స్తుతించెను. అగ్నిభట్టారకుఁడు ప్రసన్నుఁడై యతనిని వరము వేడుకొను మనెను. అతఁడు మొదట నంతర్హితమైన హోమాగ్ని యథాపూర్వముగా వెలుఁగునట్లు కోరెను. ఆపైన భూతి కొక పుత్త్రరత్నమును బ్రసాదింప వేడెను. ఆసంయమిచిత్తము శాంతియందును సర్వభూతములందును నార్ద్రి మగునట్లు ప్రార్థించెను. అనలుఁ డాతని కావరము లిచ్చెను

మఱియు శాంతి యొనర్చినయగ్నిస్తుతిఁ బఠించినవారల కీప్సితార్థములు సిద్ధించునట్లు ప్రసాదించి, యంతర్ధాన మయ్యెను. భూతి యనుజయాగము ముగించి యాశ్రమమునకుఁ దిరిగివచ్చి, శాంతి యొనర్చు పూజలు గైకొని, తనచిత్తము సర్వభూతములయం దార్ద్రమై యుండుట కాశ్చర్యపడి, శాంతిని దానిహేతువునుగూర్చి ప్రశ్నించెను. అతఁడు జరిగిన కథయెల్లఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను. భూతి పొందిన యానందమునకు మేర లేదు. అతఁడు శిష్యునిఁ బులకాంకురములతోఁ గౌఁగిలించుకొనెను. ఆదర మొప్ప సాంగవేద విభవోజ్జ్వలునిగా నొనర్చెను. కొంతకాలమునకు హుతాశనవరప్రసాదమునఁ జేసి భూతికిఁ బ్రభూతవిభూతిప్రభావభుజబలస్ఫీతుఁ డగు భౌత్యుఁ డుదయించి మనువై విలసిల్లెను.

పైకథయందు కథనశిల్పచమత్కార మొండు కలదు. ఉగ్రకోపుఁడైన భూతినిఁ గాంచి పవనార్కహరిశశాంకులు వెరచి రని చెప్పుచు నగ్నినిఁ జెప్పకుండుట యొక చమత్కారము. భూతి తపము చేయుచు శీతాతపవాతపీడితుఁ డగుటకు మాత్రము సిద్ధ మయ్యెను గాని పంచాగ్నితప్తుఁ డగుటకు సంకల్పింప కుండుట మఱియొకచమత్కారము. వీనివలన భూతియొక్క నిత్యాగ్నిహోత్రదీక్షావిధియు, విధిధృష్టహవ్యభుక్తిచే నగ్ని తేజస్సంపన్నుఁడై యుండుటయు, భూతియం దగ్ని కున్న సౌముఖ్యమును వ్యంజింపఁ జేయుచున్నవి.

అగ్నికుండమునం దనల మారినతోడనే శాంతికి రెండుతెఱగులుగా భయ మేర్పడెను. శమితానల మైన సదనమునఁ ధర్మవిరతి యేర్పడును. గురుశాపమున కది హేతు వగును. ఒకచో నగ్ని యారి మఱియొకచోఁ బ్రజ్జ్వలించును. ఈరెండును శాంతి కశాంతిహేతువు లగును. కావున నవి యతనిభయకారణము లయ్యెను.

అనలాయనల మారుటకు మూల మగ్నిదేవునిసంకల్పము. అది యొకదైవనిర్మిత మైన సంఘటనము. దానిని మనమున నెఱింగినవాఁడు శాంతి. కావుననే యతనిని మారన 'అనుపమానబుద్ధి' యనినాఁడు. శాంతి "త్రిలోకవరదు నగ్నిదేవు శరణుఁ జొత్తు" ననుటలో సర్వభూతములయందు నిఁకముందు సార్ద్రభావమును భూతి యగ్నిదేవుని మహామహిమవలనఁ బొందనున్నాఁ డను నర్థమును గావ్యార్థసూచనమున నిమిడ్చిపెట్టి నాఁడు. శాంతి యొనర్చిన అగ్నిభట్టారకస్తుతియందును నట్టిసూచన కలదు.

శా. భూతాధారుఁడ వై మహాధ్వరకళాపూజ్యుండ వై యాగమ
వ్రాతస్తుత్యుఁడ వై సురార్చితుఁడ వై బ్రహ్మణ్యదేవుండ వై
శ్రౌతస్మార్తశుభక్రియాధిపతి వై శాంతాంతరంగోజ్జ్వల
జ్యోతీరూపుఁడ వై వెలుంగు నిను సంస్తోత్రం బొనర్తున్ శిఖీ! (7.50)

'శాంతాంతరంగోజ్జ్వలజ్యోతీరూపుఁడ వై వెలుంగు' నగ్నిని స్తుతించుటలో శాంతి యగ్ని భట్టారకుని బ్రహ్మభిన్నునిగా భావించుచుండె ననుటతోపాటు కథానిర్వహణముకూడ వ్యంజింపఁబడినది. అగ్ని ప్రత్యక్షమై 'జలదనినదగంభీరస్వరము'న శాంతితోఁ బలికె ననుటయం దాయర్చిష్మంతుని సార్ద్రమూర్తి స్ఫురింపఁబడుచున్నది. "మానవులందు

క్రోధరూపమున''(7.54) భాసించు నాయగ్ని జలధరార్ద్రుఁ డయ్యె ననుటచే భూతియందలి క్రోధాగ్నియు శాంతపడఁ గల దను కథార్థస్ఫూర్తి యేర్పడుచున్నది.

అగ్నివరములచే సంహృష్టచిత్తుఁడైన శాంతి గురుగృహంబున వెలుగుచున్న ననలుఁ జూచి హర్షామృతము పొంగు బూర్ణచంద్రునివలె భాసించెనఁట! ఈయుపమాన బలముచే నాతఁడు గురుహృదయాహ్లాదకరుఁ డౌ ననియు, గురుహితమహనీయమైన యితనిచరిత్ర మమృతమాధుర్యధుర్యమై కీర్తిఁ గాంచు ననియుఁ దెలియుచున్నది. అతని పూతచరిత్రము హర్షపులకావృతమైన గురుపరిష్వంగమున ధన్యమైనది. అగ్నిభట్టారకుని యంతరంగసంగుప్తమైన దయ భూతిపైఁ బ్రసరించుటకు సాధనమై సార్థకత నందినది; పదునాల్గవమనువు మొలకెత్తుటకు బీజమై రాణించినది. ఇట్లీ వృత్తాంతమున శాంతి చరిత్రము పతాకస్థానమై ఫలసాధనోపయోగి యనుట యొక చమత్కారము.

కథాకథనమున ఫలానుమేయకథార్థముల ననుసంధించుట యుత్తమశిల్పము. అది యీకథయందుఁ బుష్కలముగాఁ గలదు.

## రాజ్యవర్ధన రాజ చరిత్రము :

రాజ్యవర్ధనరాజచరిత్ర మర్కమాహాత్మ్యప్రతిపాదక మైనకథ. సూర్యుని భక్తిమై గొలిచినవారికి నాయురారోగ్యసత్త్వమహత్త్వములు సిద్ధించు నని యీకథాతాత్పర్యము. ప్రధానప్రతిపాద్యాంశ మగు దేవమాహాత్మ్యముతోపాటు క్షేత్రమాహాత్మ్యము తెలుపుట యిందలి యవాంతరప్రయోజనము. ఈకథలో సుదాముఁ డను గంధర్వుఁడు పరమ హితముఁ గోరి ప్రజలకుఁ జెప్పిన వాక్యములు క్షేత్రమాహాత్మ్యప్రతిపాదకములు; అవి "నగరువిశాలంబను నామంబునం బ్రసిద్ధంబైన వనంబు సిద్ధనిషేవితం బగుచు నుల్లసిల్లు నవ్వనంబునం గామరూపం బను మహాపర్వతంబు గల దందుఁ జని భానుని నారాధించిన మనోరథంబు సఫలం బగు'' నగరువిశాల వనాంతర్గత మగు కామరూపము సూర్యక్షేత్రము.

దేవక్షేత్రమాహాత్మ్యప్రతిపాదనమున కనువైనకథార్థముల ననుసంధించుటయందును, బ్రపంచించుటయందును బురాణకర్త చూపిన ప్రతిభ యనన్యసామాన్యము. అర్కతనయుఁ డైన యమునికుమారుఁడు రాజ్యవర్ధనుఁడు. అతఁ డన్వర్థనామధేయుఁడు. అతని యేలుఁబడిలోఁ బ్రజ ఈతిబాధలకుఁ లోనుగాక సుఖవంతులై నివసించిరి. ఆప్రజల కామహారాజన్నఁ బ్రాణాధికము. రాజ్యవర్ధనునిభార్య మానిని యన్నింట భర్తకుఁ దగిన యిల్లాలు. ఒకనాఁడు మానిని మగని కభ్యంగనము చేయించువేళ నతని శిరోజములలో నొక్కపలితకేశమును గాంచెను. ఆమె కనంతదుఃఖము ముంచుకొని వచ్చి యశ్రుధారల నతని నభిషిక్తుఁ జేసెను. రాజామెదుఃఖమునకుఁ గారణ మడిగెను. ఆమె—

చ. నరవర! నీదుమస్తకమున న్నరదోఁచిన దింతకంటె నా
కరయ విషాదహేతు వగునట్టిది యెయ్యది? యంచు బాష్పము

ద్దొరఁగఁగ గద్గదం బడర దుఃఖిత యైన లతాంగిఁ జూచి తా
దరహసితాననుం డయి ముదంబున నమ్మనుజేంద్రుఁ డిట్లనున్.

ఆ. సకలజంతువులకు జన్మవర్ధనపరి
ణామగుణచయంబు నైజ మగుట
యెఱిఁగి యెఱిఁగి యింత యేటికి శోకింప?........(7. 139; 141)

నని సమాధానపఱచెను.

పలితాంకురదర్శనము మానవున కత్యంతదుఃఖద మైన వార్ధక్యమునకు ప్రతీక. వార్ధకము మృత్యుముఖప్రవేశచిహ్నము. ఈయంశమును మానిని యెంతగాఢముగా భావించినదో రాజ్యవర్ధనమహారాజుకూడ నంతగాఢముగానే భావించెను. కాని, యబల యైన భార్యవలె నాతఁడు దుఃఖింపక ధీరుఁడై యామెకు ధైర్యము చెప్పెను. అంతటితో నాఁగక తత్కాలోచితమైన వానప్రస్థాశ్రమస్వీకారమునకుఁ దగిన సంభారములు సిద్ధము చేయించుఁ డని మంత్రిపురోహితాదుల నిర్దేశించెను. మంత్రుల కప్పటికిఁగాని పలితాంకుర ప్రాముఖ్య మవగతము కాలేదు. రాజవియోగము వారి కత్యంతదుఃఖహేతు వైనది. వారినిఁ గాంచి రాజ్యవర్ధనుఁడు—

క. జనులార! మచ్చిరంబున
జనియించిన యీపలితము సమవర్తికిఁ గ
ట్టనుఁ గైన దూతగా మదిఁ
గనుఁగొనుఁ డట్లగుట నిజముగాదె తలంపన్. (7.146)

అని హెచ్చరించెను. ఈమాటలు పౌరులలో గాఢమైన యాలోచనలను రేకెత్తించినవి. పరిమితమైన ఆయుఃపరిధిలో మానవుఁడు వలచినన్నాళ్లు సుఖియై వర్తింపలేఁ డను సత్యము వారికిఁ దేటతెల్లమైనది.

రాజు దైవజ్ఞులను బిలిచి పుత్త్రునిఁ బట్టాభిషిక్తు నొనర్ప సుముహూర్తము నిశ్చయింపఁ గోరెను. వా రారాజహృదయమును గమనించి కడుదుఃఖించిరి; ప్రభువు నానిర్ణయమును మార్చుకొనఁ బ్రార్థించిరి. రాజ్యవర్ధనుఁడు తనసంకల్పము నుపసంహరింప లేదు. ప్రజల కింక గత్యంతరము తోచలేదు. అట్లని తమపట్టును వీడలేదు. పట్టుపట్టి సూర్యు నుపాసించి యతనివలన రాజ్యవర్ధనుఁడు ముదిమి నొందక సంతతవిజయాస్పదుఁడై సుఖలీలలఁ దేలుచుఁ బదివేలసంవత్సరములు భువిపై బ్రతుకవలయు నని వరమును సాధించిరి. ఆప్రజలయుత్సాహదీప్తి యటువంటిది. అదేవునికరుణార్ద్రదృష్టి యటువంటిది.

దివాకరుని కరుణావిశేషముచే రాజునకు దీర్ఘాయువు లభించిన దని ప్రజలును, మానినియుఁ బొందిన సంతోషమునకు మేరలు లేవు. కాని, రాజ్యవర్ధనుని హృదయము మాత్ర మావార్తకు వికలమైపోయినది. కథలో నీసన్నివేశము పతాకస్థాయి నందుకొనినది. పఠిత కథలోని యితరపాత్రలవలెనే యుక్కిరిబిక్కిరై భావికథార్థ

చర్వణౌత్సుక్యమునఁ బరవశ్లఁ ద్రొక్కెను. రాజ్యవర్ధనుఁడు తన కొక్కనికిఁ గలిగిన దీర్ఘాయువు తనకు దుఃఖదాయక మగు నని పేర్కొనుచు, భార్యాబంధుప్రజావియోగము వలన బ్రతుకు భార మగునని ప్రజలకుఁ దెలియఁజెప్పెను. జరిగినపొరపాటు ప్రజలకుఁ దెలిసివచ్చినది; భార్యయుఁ బరిస్థితులను భావింపఁ గలిగెను. పరమభక్తియుక్తులగు ప్రజలఁ గాంచిన యామహారాజు పరమోపకారధర్మైకమూర్తి! ఆశ్చర్యమగ్నులైన ప్రజలకుఁ దననిర్ణయమును దెలిపి మఱింతయాశ్చర్యమున ముంచినాఁడు. అతని మాట లివి:

క. ''పౌరులు భృత్యులు నా కుప
కారం బొనరించి యుండఁగా నక్కట! నే
వారలకు మే లొనర్పక
యూరక భోగములఁ దగిలియుండం దగునే?

సీ. కావున నిప్పుడ కదలి యే నమ్మహీ
ధరమున కరిగి యత్యంతభక్తి
భానునిగుఱిచి తపం బాచరింపఁగ
నతఁడు ప్రసన్నుఁడై యరుగుదెంచి
మానిని! నీకును మనభృత్యతతికిఁ బౌ
రులకును బుత్త్రపౌత్రులకుఁగూడ
బదివేలువర్షముల్ బ్రదుకంగ వరము నా
కిచ్చినయట్టుల యిచ్చె నేని

ఆ. నింపుసొంపు మిగుల నిందఱతోఁ గూడ
నఖిలరాజ్యసుఖము లనుభవింతు
నట్లు గాక యున్న నచ్చోన నిలిచి య
య్యుగ్రకిరణుఁ గొలుతు నుగ్రనియతి. (7. 172-173)

వైపద్యములందలి యుపకారధర్మైకప్రవణమైన యుత్కటోత్సాహము రసస్థితి నందినది. వరుసగా నుదయించిన హర్షము, వితర్కము, దైన్యము, ఉత్సాహము, శంక, ఔత్సుక్యము, ధృతి యనుసంచారిభావములచేఁ బుష్టమైన యుత్సాహదీప్తి రసానందకంద మగు చున్నది. "ఉగ్రకిరణుఁ గొల్తు నుగ్రనియతి" యనుటలో నుగ్రతపోవ్రతోత్సాహము రాజ్యవర్ధనుని సహజగుణముగా భాసించుచున్నది. మను వగు నాతనిమనుమని ప్రవృత్తియు నట్టిదే. అతఁడును ఘోరతపస్సు చేసి దివాకరునికరుణ సాధించినాఁడు. తాతపోలికలు మనుమనికి వచ్చినట్లు కథలో శిల్పమార్గమునఁ జెప్పి మారన వాక్చతురుఁ డైనాఁడు!

ఈకథలోఁ జిత్రింపఁబడిన రాజు, రాణి, ప్రజలు — అందఱును ఆవేశపరులే. అస్థూలమైనసామ్యములో నొకసూక్ష్మ మైన భేదమును గలదు. మానిని యుద్విగ్న హృదయ యైన యబల; ఆమెకు విషయపరిజ్ఞాన మున్నంత వివేకసిద్ధి లేదు. ప్రజ

లుద్వేగాత్మకకథక్రియుక్తులు; కార్యశూరులు; వీరి కుత్సాహాతిశయ మున్నంత వివేకౌన్నత్యము లేదు. రాజ్యవర్ధనుఁడు పరిపూర్ణధర్మవీకరనమూర్తి; వివేకౌచిత్యముల కేర్పడిన కుదురు; ప్రజాకుటుంబి; సతీహృదయాధిదేవుఁడు; ధీరోదాత్తుఁడు.

సూక్ష్మమైన బీజము నాటి వటవృక్షమువంటి మహాతరువును సృజించి ఫలింపఁ జేసినాఁ డీకథలోఁ బౌరాణికుఁడు. ఈకథకు మహత్త్వము కలిగినది మార్కాండునివలన; మహత్త్వరసత్వములసమన్వయసిద్ధి చేకూరినది మహాకవికథాకథనశిల్పశక్తివలన:

## నాభాగునిచరిత్రము :

నాభాగునిచరిత్రము పురుషార్థత్రయసాధనామహనీయ మైనది. ఈకథానిర్మాణ మత్యంతాశ్చర్యకరము. కాలక్రమమునఁ గాక కార్యకారణక్రమమునఁ జెప్పుటయు, నడుగడుగున నుత్కంఠావహము లైన హేతువులను గల్పించి వాని నద్భుతపర్యవసితములుగా విస్తరించుటయు, కథారచనమున నుక్తివిశేషములఁ జొన్పి కథార్థములను గాంతిమంతము లొనర్చుటయు నిందుఁ గాననగు విశేషములు.

నాభాగుఁడు ప్రేమకొఱకు సామ్రాజ్యమును బరిత్యజించిన త్యాగి; యాదర్శప్రేమికుఁడు. నాభాగుఁడు మనుతనయుఁ డైన ధృష్టున కేకైకతనయుఁడు, సమాచరితజనానురాగుఁడు, నూత్నయౌవనోల్లాసభాసమానుఁడు, వివిధవిహారపరాయణుఁడు. అతఁ డొకసారి యనన్యసామాన్యరూపాభిశోభిత యైన యొకవణిక్కన్యను గాంచి యామెయం దనురక్తుఁడై విరహతప్తుఁ డయ్యెను. ఒకనాఁ డేకాంతమున నాకాంతగృహమున కేఁగి తజ్జనకునితోఁ దనయభిప్రాయము వెల్లడించెను. యుక్తిపరుఁ డగు నావణిగ్వర్యుఁడు-భూరమణు లైన మహారాజులకును పేదవాఁ డగు వైశ్యునకును సంబంధ మెట్లమరు నని సందేహము వెల్లడించెను. నాభాగుఁ డతని యాంతర్యము గ్రహించి—

క. కలవారు పేదవా రనఁ
గలదే భోగముల సరియ కాక తలఁప దే
హుల కెల్ల నేల చెప్పెదు
వల దని పరిహార మిట్లు వైశ్యవరేణ్యా! (7.209)

అని నేర్పుగా సమాధానము చెప్పెను. ఆకోమటి మాటవరుస మార్చి, మఱియొక మడత పేచీ పెట్టెను. మహారా జొకఁ డుండ నతనియనుమతి లేనిదే కన్య నిచ్చుటకు నేను స్వతంత్రుఁడను గాను; కొనుటకు నీవు స్వతంత్రుఁడవు కావు కావున మహారాజసమ్మతిని గొనివచ్చి కన్యఁ బరిగ్రహింపు మని యతఁడు పేర్కొనెను. అభిమానధనుఁ డైన నాభాగుఁడు తనకుఁ దానుగాఁ దండ్రి కాసంగతి నెఱుకపఱచుట కంగీకరింపలేదు. "ఈపని గురున కే నేమని చెప్పుదు? మానుము నీవెతమాట!" లనుచు వణిజుని మందలించెను. ఆబేహారి యడకత్తెరలోఁ బడెను. రాజునకుఁ దెలుపక పెండ్లిచేయుట పాడి కాదు; యువరాజు మోహము నడ్డును పాయము లేదు. చేయునది లేక అతఁడే ధృష్టునికొలువున కేఁగి

యీసంగతి విన్నవించెను. రాజు నిజతనయునివర్తనమునకు బాధపడి, యతనికి నీతిఁ గరపుటకై భూసురులఁ గొందఱ నంపెను. వారిబోధ లానాభాగుని కగ్గియందు గుగ్గిలము చల్లిన ట్లయ్యెను. తరుణికై యాతఁడు తండ్రిని ధిక్కరించెను.

మ. అని విప్రు ల్దగ నాడిన న్గనలి నేత్రాంతంబులం గెంపు గ
ప్ప నిశాతాసి కరంబున న్వెలుఁగ నాభాగుండు న వ్వైశ్యనం
దన కెంగేలు దెమల్చి యెవ్వఁ డయిన న్దప్పించిన న్మాన్పఁ జ
య్యన రాని మ్మిదె యేను రాక్షసవివాహస్ఫూర్తి మై నేఁగెదన్. (7.212)

అని పలికి యవ్వనితారత్నముఁ దోడ్కొని యరిగెను.

చ. మదగజహస్తలగ్నలతమాడ్కిఁ గుమారునిచే గృహీత యై
న దళితపద్మపత్త్రినయనం దననందనఁ జూచి వైశ్యుఁ డా
ర్తి దనుకఁ జయ్యనం జని పతిం గని యంతయుఁ జెప్పెఁ జెప్పినం
తఁ దనతురంగమాదిపృతనాతతిఁ బంపె నతం డుదగ్రుఁడై. (7 214)

తండ్రికొడుకుల నడుమ పోరు ఘోరమైనది. ధృష్టుఁడు నాభాగునిముందు నిలువలేక పోయెను.

చ. జనకుఁడు పుత్త్రిబాహుబలసంపదకున్ వెఱఁగంది యుండ స
న్మని యొకరుండు భూవరునిముందటికిన్ దివినుండి వచ్చి యి
ట్లనియె నరేంద్ర వీఁ డతిదురాత్ముఁడు కయ్యము నీవు మాను వై
శ్యనితనయ న్వరించినయశోధనుఁ డీతఁడు నీకు యోగ్యుఁడే?

వ. బ్రాహ్మణక్షత్త్రియవైశ్యులు నిజవర్ణంబుల కన్నియల మున్ను పరిగ్రహించి మఱి తమతమ దిగువకులంబులయంగనల వరియించుట శాస్త్రచోదితం బట్లు గాక తొలుత హీనజాతి యగునాతిం బెండ్లి యయిన యుత్తమవర్ణుం డాహీనజాతి యగుం గావున నిప్పు డింకను వైశ్యావరిగ్రహంబునం జేసి వణిజుం డయ్యె శుద్ధక్షత్రియుండ వైన నీ కతనితోడియుద్ధం బనర్హం బని యమ్మునివరుం డరుగుటయు. (7.217-218)

విభుఁడు తనయునితో సంగరమున వినివర్తితుఁ డయ్యెను. నాభాగుఁడు కోమటికన్నె ననురక్తితోఁ బెండ్లియాడెను.

ఈకథలో నిదియొక రమణీయఘట్టము. కవి కథానాయకునిగుణశీలములను మొదట స్పష్టపఱచెను. తదనుగుణముగా నతనిస్థిరధీరవర్తనమును జిత్రించెను. వైశ్యువిపాత్రపోషణము కడుసహజముగా నుండునట్లు తీర్చిదిద్దెను. ప్రజాధర్మరక్షణవ్యగ్రుఁ డైన ధృష్టచక్రవర్తిపాత్రను గంభీరముగా నిర్మించెను. ఇన్నివిషయము లిట్లు స్పష్టము చేసినాఁడు వణిక్కన్యాహృదయమును మాత్రము కవి యెక్కడను వ్యక్తము చేయలేదు. కాని, వ్యంగ్యసుందరముగా రచనాచమత్కారమున సూచించినాఁడు. వణిగ్వరుఁడు తనయింటిలోఁ బండశాలనుఁడు. క్షత్త్రియుఁడు ప్రథమసతిగా నన్యకులజను బరిగ్రహించుట

నాచారవిరుద్ధ మని యెఱింగినవాఁడు. కావున నీవిషయము పుత్త్రికవఱకు పోనీయలేదు. కాని, కరవాలము చేతఁబూని కన్యను గొనిపోవుచున్న రాజకుమారుని గాంచి చేయునది లేక రాజసభ కేఁగి మొఱఁబెట్టుకొనెను. నాభాగునిపై వణిక్కన్యకనురక్తి కలదు. ఈమాట సూటిగాఁ జెప్పఁడు కవి. కాని, నాభాగుఁడు రాక్షసవివాహవిధిచే నామెను గ్రహించె ననుటలో నాయంశమును గొంత వ్యంగ్య మొనర్చెను. రాక్షసవివాహమున బంధువుల యసమ్మతియు, కన్యసమ్మతియు ముఖ్యలక్షణము లై యున్నవి. నాభాగుఁ డాకన్యను గొంపోవుదృశ్యము వర్ణించుచు కవి యామె "మత్తగజహస్తలగ్నలతమాడ్కిఁ గుమారునిచే గృహీతయై" న దని చెప్పుటలో నొకగడుసుఁదనము చూపినాఁడు. అదియంతయు "హస్తలగ్న" అనుసమాసమునఁగలదు; అందు లగ్నశబ్దమువాడుట కన్యాహృదయసౌముఖ్యము వ్యంజింపఁజేయుట కొఱకే. అంతటితో నాగక "దళితపద్మపత్రనయనం దననందనఁ జూచి వైశ్యుఁ డార్తి దనుకఁ జయ్యన" రాజమందిరమున కరిగె ననుట యొకవిశేషము. "దళిత" శబ్దప్రయోగమును సాభిప్రాయముగఁ జేసినాఁడు కవి. దళిత మనుశబ్దము ఖండింపఁబడినది, ఖేదింపఁబడినది, యనియే కాక 'వికసించినది' యనునర్థమునఁ గూడ వాడఁబడును. ఇచ్చట నేయర్థము నన్వయించినను దండ్రికి దుఃఖహేతువే యగును; తనమాటకు విరుద్ధముగా రాజకుమారుఁడు పుత్త్రికను గొంపోయె నను దుఃఖమే కాక పుత్త్రికయు నతనితోఁ బ్రీతిగా నేఁగిన దని యర్థ మేర్పడి యతని కత్యంతఖేదహేతువయ్యె నని పఠితకు స్ఫురించి కథయం దొక ప్రసన్నత భాసించును; దీనికిఁ గథార్థములు కొన్ని తోడుపడుచున్నవి. రాజకుమారుఁడు బలవంతముగా నామెను గ్రహించినచో రా జామె నాతనిబారినుండి యెప్పటిన నైన తప్పించి తెచ్చి తండ్రి కీయవలసినబాధ్యత కలదు. దివినుండి భువికి దిగివచ్చిన యొక్కరుని వాక్యములు విని యూరకుండిన రాజు వణిగ్వరుని యభియోగ మేగంగపాలు చేసినట్లగును? క్షత్రియుఁడు సుక్షత్రియునితోడనే యుద్ధము చేయవలె నను సమరధర్మము పాటించి మానె ననుకొన్నను, ఆశ్రితరక్షణధర్మము వదలుట పాడి యెట్లగును? అప్పుడు పఠిత పైఁజెప్పఁబడిన "వికసించిన" యనునర్థమునే యన్వయమునకుఁ దెచ్చుకొనవలసియుండును. మారన చివరకు "అనురక్తిం బెండ్లియయ్యె" ననుటలో (7.219) వధూహృదయమును మఱింత స్పష్టమొనర్చె నని చెప్పవచ్చును. రమణీహృదయవ్యంజనసందర్భమున నిట్టిరమణీయరచనాశిల్పమార్గము ననుసరించుట కథాకథన మర్మజ్ఞుఁడైన కవి చేయుపని!

దివినుండి దిగివచ్చిన పాత్రను కవి ప్రవేశపెట్టుటవలనఁ దండ్రికొడుకులమధ్య పోరు శాంతించు కథాప్రయోజనము సాధింపఁబడినను, తత్పాత్రప్రవేశమునకు వెనుక నున్న కారణమును కవి నిరూపింపకపోవుటచేఁ బఠితహృదయమున నత్యంతసాంద్రమగు నుత్కంఠ రేకెత్తఁగలదు. దానికిఁదోడు కవి యాపాత్రముఖమున నిబంధించిన వాక్యములతీరుకూడ నొక చమత్కారము గలిగించుచున్నది. సమర్థుఁ డైన పుత్త్రుఁడు ధర్మముకొఱకు పోరుసల్పుచున్న తండ్రి నెదిరించుచుండగాఁ నాదివిజవరుఁడు కామర్థుని వారింపక తండ్రిని వారించెను. ఇది యొకవిశేషము. తండ్రియెదుటఁ బుత్త్రుని

దూలనాడుచు నొకపరి ''అతిదుష్టాత్ము(" డనియు, నొకసారి ''యశోధను("డనియు( బేర్కొనుట (7.217) మఱియొకవిశేషము. వీనినిబట్టి పఠిత యుద్ధనివారణము దేవ సమ్మత మనియు(, బ్రస్తుతము లోకదృష్టికి దురాత్మునివలె( గనవచ్చు నాభాగు(డు నవైశ్యకన్యాపాణిగ్రహణమువలన భావికాలమున యశోధను( డగుననియు నిట్లగుట కొకదేవరహస్యము కల దనియు నూహించి తదర్థప్రకాశమున కువ్విళ్లూరుచుండును. ఇట్లు కవి సార్థకశబ్దప్రయోగనైపుణ్యముచే( గథకు( బుష్టిమంతమగు పురోగమనసౌలభ్య మును గల్పించుట యొకశిల్పవిశేషము !

ఇట్టివే మఱియొకటిరెండింటిని స్థాలీపులాకన్యాయమున నిచ్చట పరిశీలించుట జరుగుచున్నది :

నాభాగు(డు వైశ్యకన్యను బెండ్లాడి తండ్రియాజ్ఞానుసారము బాభ్రవ్యాదిమునీంద్ర నిర్ణయానుసారము వైశ్యవృత్తి ననుసరించి జీవించుచుండగా-

తే. అతని కుదయించె లోకవిశ్రుతు(డు శౌర్య
ఖని భనందాఖ్యు( డాపుత్త్రు జనని పిలిచి
నీవు గోపాలు(డవు గమ్ము నెమ్మితో(డ
ననిన( దల్లికి( బ్రణమిల్లి యాత( డరిగె. (7.221)

భనందుని( దల్లి గోపాలు(డవు కమ్మని ప్రేరేచుటకు హేతువు చెప్ప(బడలేదు. గోపాలన మన(గా బశుపాలనము. అది వైశ్యవృత్తి. ఆమె కుమారునకు వైశ్యవృత్తిని( బ్రత్యేకముగా బోధింపవలెనా ? 'గో' శబ్దమునకు భూమియను నర్థము కలదు కావున క్షత్రియవృత్తి నామె పుత్త్రునకు నిర్దేశించిన దని యూహింపవచ్చును. అది తరువాతికథలో( గాని స్పష్టము కాదు. శ్లేషార్థగంభీరమైన శబ్దము నాయుస్థానమునందు( బ్రయోగించి పఠిత నుత్కంఠభరితు నొనర్చుటయే యిచ్చటి తాత్పర్యము. ఈవాక్యములవలన( బఠితయందు వణిక్కన్యాగుణవిషయకమైన వితర్కము కలుగ(గలదు. వైశ్యవనిత పుత్త్రుని క్షత్త్రియు( డవు కమ్మని దీవించుట జాతిలక్షణవిరుద్ధము కా(గలదు. ఇట్టివిరుద్ధగుణాధాన మాపాత్ర యందు( గవి యేప్రయోజన మభిలషించి, యొనర్చినా(డో తెలియుటకై పఠిత యాత్ర పడును. దానితో( గథ సత్త్వము చేకూర్చుకొని పాకమున( బడును.

భనందు(డు హిమనగమున( దపము సేయుచున్ననీపు( డను రాజర్షిప్రసాదముచే నస్త్రవిద్య లన్నిటిని సాంగముగా నేర్చి, పైతృకరాజ్యము జయించి, విజయోత్సాహ ముతో మరలివచ్చి తల్లిదండ్రులకు మ్రొక్కి సర్వరాజ్యమును నాభాగునిపాదముల ముం దుంచెను. అత(డు గుర్వాజ్ఞచే వైశ్యవృత్తి నవలంబించియుండుటచే నారాజ్యమును బరిగ్ర హింప నని పల్కెను.

క. అను పతిపలుకులు సుప్రభ
విని నవ్వుచు నతని కనియె విను వైశ్యత్వం

బుసఁ బొంద వీవు వైశ్యుని
తనయను గా నేను నివ్విధం బెట్లన్నన్. (7.230)

అనినట్లు కథయందుఁ జెప్పఁబడినది. ఇచ్చట కథ పతాకస్థాయి నందుకొనినది. పఠిత యాశ్చర్యమగ్నుఁడై నిర్విణ్ణుఁ డగును. దానికిఁ గారణములు : ఒకటి:-ఇంతవఱకా వైశ్యాంగనానామ మెఱుఁగని పఠిత "సుప్రభా" ఖిధ యని మొదటిసారి తెలిసికొనుట. కాంతిమంత మైన యాపేరు పఠిత నుజ్జ్వలాత్మునిఁగా నొనర్పఁగలదు. రెండు : నీవు వైశ్యత్వంబు బొందవు-అనుమాటలచే నామెయు వైశ్యకన్య కాదను భావ మేర్పడుట. "వైశ్యుని తనయఁ గా'' ననుటలో నది స్పష్టమైనది. మూఁడు : ఇన్నియంశములు స్పష్ట మైనను నింకఁ దెలియనివి రెండు కలవు. వైశ్యునితనయఁ గాననుటలో వైశ్యున కాత్మజఁ గాననియా ? లేక వైశ్యుఁడు తత్కులజుఁడు కాఁడనియా ? శాపగ్రస్థుఁ డనియా ?- తెలియదు. వీని కన్నిటికి మించి- యీవిషయ మామెకు వివాహసమయమందే తెలిసి యున్నచో నప్పుడే చెప్పి నాభాగుని సుక్షత్రియత్వమును గాపాడి సామ్రాజ్యమునకుఁ బట్టమహిషి యై యుండవలసినదేకదా ! ఆమె యీమాట లిప్పు డెట్లనఁగలుగుచున్నది ? -ఇట్టి శంకలు పఠితకుఁ గలుగక మానవు. వానివన్నింటికిని గ్రమముగా సుప్రభ విడ మరచి చెప్పుటతోఁ గథ సమాప్త మగును. కథార్థసంగోపనమువలనఁ గథలో జిగి హెచ్చును. కథార్థములను విస్తరించుటయందుకంటె సంగోపనమునందు కవిశిల్పశక్తి విశిష్టముగా రాణింపఁగలదు.

సుదేవుఁ డనురాజు ప్రమతి యను మునివరునిశాపమునకు గురియై మఱుజన్మమున నీకథయందలి వైశ్యుఁడై పుట్టెను. అతనిపుత్త్రికను క్షత్త్రియుఁ డొక్కఁడు బలిమిని గ్రహించినప్పుడు వైశ్యత్వమును బాసి సుక్షత్త్రియుఁ డగునట్లు ముని నిర్ణయము. దానిచే నతఁడు సుప్రభావివాహానంతరము సుక్షత్త్రియుఁడై వరలినాఁడు. కాని, యావిషయము తెలియు జాతిస్మరణ మాతనికి లేదు.

సుప్రభ పూర్వజన్మమున కృపావతి యను పేరఁ బరగిన సురథరాజర్షి పుత్త్రిక. జాతాగస్త్యశాపముచే నామె యీజన్మమున వైశ్యకులమునందు జన్మించి పుత్త్రునికి గోపాలననియోగము చేయుసమయమున శాపము పర్యవసాన మొందుటచే జాతిస్మరత్వము బొంది నిజవృత్తాంతమునంతయు నెఱిఁగి మంచిసమయమున దానిని బయటపెట్టినది. నాయకుఁ డధర్మవర్తనుఁ డయ్యె ననియు, ధృష్టుఁడు వైశ్యపుత్త్రికను రక్షింపలేకపోయె ననియు, దివినుండి యొకవ్యక్తి దిగివచ్చుటకుఁ గల హేతు వెయ్యది యనియు, వైశ్యాంగన పుత్త్రునికి గోపాలనము నియోగించుటయందలి యంతరార్థ మెయ్యది యనియు, నేర్పడిన కథాసందేహములన్నియు చివరివాక్యమువఱకుఁ బోషింపఁబడి, యద్భుతపర్యవసానమున నవి యన్నియు మంచుతెరలవలె విచ్చి పోవునట్లు చిత్రించి పురాణకర్త కథను శిల్ప సుందరముగను శక్తిమంతముగను నిర్వహించినాఁడు.

**వత్సంధ్రచరిత్రము :**

వత్సంధ్రచరిత్రము ముప్పదిగద్యములలో ముచ్చటగాఁ జెప్పఁబడిన వీరరసాత్మక గాథ. విదూరథపుత్త్రి యగు ముదావతిని గుజంభుఁ డను దానవుఁడు పట్టుకొని చనిన, వత్సంధ్రుఁ డద్దనుజునిఁ దెగటార్చి యక్కన్యను వరించినవృత్తాంత మిందలివస్తువు.

కథ సరళసుందరమును, సారమధురము నై యుండుటచేఁ బఠిత కామూలాగ్రము ప్రీతిసంజనక మగుచున్నది. కథలోని సహజశక్తికి మారన యుక్తిచమత్కృతిని జోడించి కథను మఱియు కాంతిమంత మొనర్చెను. సంగ్రహ మైన యీకథయందుఁ గాననగు కొన్నిశిల్పవిశేషము లిచ్చట పేర్కొనఁబడుచున్నవి.

సువ్రతునిపలుకులలోఁ గథార్థసూచనము నిక్షేపించుట యొకశిల్పము. కుజంభుఁడు స్వర్గమర్త్యలోకములందుఁ గల భూరివస్తుచయము నాహరించు నుద్యోగమున విశ్వకర్మనిర్మితమై మహిమాన్విత మగు ముసలము నొకదానిఁ గొని పాతాళమునుండి భూమికి వివరములఁ దొలుచుచుండెను. అట్టిబిలము నొకదాని నతఁడు విదూరథునిరాజ్యమున నొనర్చెను. విదూరథుఁడు మృగయార్థ మచ్చోటి కరుదెంచి యాబిలమును గాంచి, తత్సమీపమునఁ దప మొనరించుచున్న సువ్రతుఁ డను మునీంద్రుని నది యేమని ప్రశ్నించెను. అతఁడు కుజంభునివృత్తాంతము చెప్పి యంతటితో నాగక యి ట్లతనికి హితవు సెప్పెను.

క. క్రతువిధ్వంసియుఁ ద్రిదశ
స్థితినాశకరుండు నైన దితిజుని ముసలా
న్వితహస్తుని ఖండింపక
క్షితివర ! భూరాజ్య మెట్లు చేసెదు చెపుమా ? (7.258)

ఆ. అతలమునకు వరిగి యమ్ముసలాయుధు
నతులశౌర్యధుర్యు నతిరయమున
నాజి నోర్చి యేలు మఖిలంబు నీపర
మేశ్వరత్వ మెల్ల నెఱుకపడఁగ. (7.259)

ఈవాక్యములందు దానవసంహరణోద్యమము నత్వరకర్తవ్య మనుహితువు చెప్పుట పరమ తాత్పర్యము. దానినిఁ బ్రతిపాదించుటలో సంయమి ప్రకటించుశిల్పము కవిసంభావితము. ఆశిల్ప మారాక్షసుని సంహారయోగ్యునిగా నిరూపించుటయందుఁ గొంత కలదు. రాజు ధర్మఘ్నులను శిక్షించి ధర్మమును గాపాడును; రాజ్యము నీతిబాధలనుండి రక్షించును. క్రతువు ధర్మమూలము. అట్టిక్రతువులను ధ్వంసము చేయుటచే ధర్మగ్లాని యేర్పడును. దేవతల కామెతలు చెల్లక సకాలవర్షాదుల నీయరు. దేశము దుర్భిక్ష మగును. ప్రజానాశ మగును. వీని కన్నిటికిఁ గారకుఁడు రక్కసుఁడు. కావున నవశ్యవధ్యుఁ డతఁడు. అతని వధించుటలో నొక కష్ట మున్నది. అతనియొద్ద విశ్వకర్మప్రసాదదత్త మైనది యును, అనితరసాధ్య మైనదియును నైన ముసల మొకఁడు కలదు. అతనియాయుధ

సంపదయు, మాయాశక్తిసంపదయు నొకయెత్తు. అతని ముసల మొక్కటి యొక్కయెత్తు. మహత్త్వమునందుఁ బూర్వముకంటె పరమే గొప్పది. అదియే యాతనిగర్వోద్ధతికి మూల కారణము. అట్లగుటచే మునలాన్వితహస్తుని భంజింపక, క్షితివర! భూరాజ్య మెట్లు చేసెదు? అను మునివాక్యములు సాభిప్రాయము లగుచున్నవి. వీనియందు విదూరథు నకు భావికాలమున రానున్న విపత్తు వ్యంజింపఁబడుచున్నది.

కుజంభుఁడు విచిత్రప్రవృత్తి కలవాఁడు. ఆతనికి భూలోకముకాని, దేవలోకము గాని యాక్రమించి పాలింపవలె ననుకోర్కె లేదు. కాని యాలోకములం దున్న భూరిసు వస్తువు లాహరించి తనపట్టణమున నిల్పుకొనవలె నను వ్యామోహము కలదు. అందులకై యప్పుడప్పు డతఁ డాబిలము వెలువడి బందిపోటుదొంగవలె భూలోకమునఁ గల సువస్తు వుల నపహరించి వెడలిపోవుచుండుట పరిపాటియైనది. అట్టిమహావస్తువులలో హవిర్భాగ ములు పేర్కొనఁదగినవి. వానిని దొంగిలించుటవలన భూదేవకర్మలు నశించును. సురలు హవిర్భాగహీనులై దుస్థితిపాలౌదురు. రాజ్యము లరాజకములు కాఁగలవు. విదూరథుని రాజ్యమున నాతఁడు క్రొత్తగా నొకపాతాళబిలమును ద్రవ్వెను. దానివలన విదూరథు నికి రాజ్యపాలనము దుర్భర మగు నొకవిపత్తు వాటిల్లు నని యాత్రికాలజ్ఞుని వాక్కు. ఋషులవాక్కులవెంట నర్థములు పరుగెత్తు నని కదా మహాకవి భవభూతి నిర్దేశము!

ఆతరువాతిపద్య మట్లు రచించుటలో నొకవైశిష్ట్య మున్నది. పైపద్యమున ముని వాక్కులోని గండముచే రాజునకుఁ గీఁడు వాటిల్లినను, చివరకు మహాయుద్ధమున ముసలా యుధహస్తుఁడు మృతిఁ బొందు ననియు, దానివలన నిష్కంటకమైన చక్రవర్తిత్వ మతని కబ్బుననియుఁ గథార్థసూచనము కలదు. మునీంద్రుఁ డంతటితో నాగక వరదత్త మైన ముసలాయుధము నిర్వీర్యమగు దేవరహస్య మారాజునకుఁ జెప్పెను. నిజముగా నాసువ్ర తునివిశ్వశ్రేయోభిలాష శ్లాఘనీయము!

కథార్థసూచనమువలనఁ గథాఫలరూపము లైన కొన్నియర్థములు బుద్ధికుశలు లూహింపఁగలుగుదురు. అవి కార్యరూపములుగ భాసించి తత్కారణశ్రవణకౌతూహలము రేకెత్తించును. అప్పుడు కథాగమనముపైఁ బఠిత మన స్సధికముగా లగ్నమగును. మారన యట్టిప్రయోజనమును సువ్రతునిపలుకులవలన సాధించినాఁడు.

ఈకథలో నాయికానాయకులు ముదావతీవత్సంధ్రులు. వీరిస్వభావనిరూపణము చేయుటయందు మారన వ్యంగ్యమర్యాదాశ్రితమైన కథాకథనశిల్పమార్గము నాశ్రయిం చెను. ఈకథలో సమస్య పుట్టుటకు నాయిక నిమిత్తము; ప్రతినాయకుఁడు హేతువు. నాయకుఁడు సమస్యాపరిష్కర్త; ఫలభాక్కు. నాయకునిఫలసాధనోద్యోగమున నాయిక పరోక్షముగా సహాయపడెను. అట్లు జరుగుట దైవికమైన సంఘటన. అది ఋషివాక్కు లలో వ్యంజింపఁబడెను. అది భౌతికముగా భువిపైఁ బ్రవర్తిల్లెను. ప్రవర్తిల్లినవిధమును వివరించుటలోఁ బాత్రస్వభావమును వ్యంజింపఁజేయుట యిచ్చటి కథాశిల్పము!

సువ్రతునివలన విదూరథుఁడు కుజంభునివిధ మంతయు నెఱిఁగి పుర మేఁగి మంత్రులఁ బిలిచి రాక్షసునివర్తనమును, ముసలప్రభావమును వారి కెఱిఁగించెను.

ఆచెప్పునప్పుడు ముదావతి తండ్రిచెంత నుండి యావిషయములను గ్రహించెను. కొంత కాలమునకుఁ గుజంభుఁడు సఖీసమేతయై యారామవిహార మొనర్చు ముదావతి నపహరించి తనయంతఃపురమున నుంచెను. హవిర్వాహనునియం దుంచు హవిస్సుల నపహరించు దనుఁజుఁ డీవనితను హరించెను. తుల్యపరిశీలనముచే నాకన్య శుద్ధవర్తనమును, ఆమెను బెండ్లాడునాయకుని తేజోగుణమును కథకుఁ డిందు వ్యంజింపఁజేయుచున్నట్లు గ్రహించుట సులభము: ముదావతి పూజావ్యాజమున నక్షతగంధపుష్పధూపార్చితమై యొప్పు ముసలాయుధమును బ్రతిదినమును స్పృశించి దానినిఁ గ్రమముగా నిర్వీర్య మొనర్చుచుండెను. స్త్రీకరస్పర్శచే నయ్యాయుధము నిర్వీర్య మగునని రక్కసుఁ డెఱుఁగఁ డని సుబ్రతుఁడు రాజునకుఁ జెప్పెను. అది ముదావతిచెవినఁ బడినది. అమె గుప్తముగా రాక్షసప్రతిక్రియ యొనర్చినది.

కథలో నింతకీలక మైన స్థానము నాక్రమించియున్న యీపాత్ర యొక్కమాట నోరు విప్పి మాటలాడదు. అట్లాపాత్రను చిత్రించుట యొకశిల్పవిశేషము. మహామంత్రుల సమావేశమున రాజుప్రక్కన రాజకుమారి యుండెనఁట. సామాన్యముగా లోకమున నట్లుండుట జరుగదు. రాజకుమారులకే లేని యీగౌరవము రాజకుమారి కిచ్చుట యీకథలోని చమత్కారము. రాజకుమారి యచ్చోట నుండుటవలన రాజునకుఁ గాని మంత్రులకుగాని యెట్టియభ్యంతరమును గలుగ లేదు. దాని కామెపై వారి కున్న యభిమానాదరాదులు కారణములు. ఆదరాదులు గుణాశ్రితములు 'గుణాః పూజాస్థానం గుణిషు న చ లింగం న చ వయః'- అని న్యాయము. ఆమెయందలి యట్టి విశిష్టగుణ మెద్ది? సమాధానము కథలో వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. దానిని నిరూపింపవలసినచోఁ గుజంభుఁ డామె నపహరించుటయే ప్రథమదృష్టాంతము కాఁగలదు. లోకమునందలి 'భూరివస్తువు' లాహరించు నారక్కసుఁడు విదూరథసర్వసామ్రాజ్యవైభవాదులను వదలి యాతనికూతురిని మాత్రము దొంగిలించెను. అట్లగుటచే నామె త్రిలోకైకసౌందర్యాదిగుణవిశిష్ట యని తాత్పర్య మేర్పడుచున్నది. మహామంత్రుల మంతనములను స్త్రీసహజమైన చంచలమనఃప్రవృత్తిని వీడి సుస్పష్టసమాహితచిత్తముతోఁ దెలియఁ గలిగిన దనుటచే నామె వివేకవైదగ్ధ్యములు వ్యక్తము లైనవి. అసురునియంతఃపురమును జేరియుఁ బూజావిధి నెపమున నతనికి దూరముగనే త న్నుంచుకొని మానరక్షణము చేసికొనిన ధీర యామె. తనకరస్పర్శచే నాయుధమును నిర్వీర్యము చేయుటయం దామె చూపిన ముందుదృష్టి, ప్రదర్శించిన లోకజ్ఞత యపూర్వము. ఒకపాత్రయొక్క క్రియాశీలమునుమాత్రము ప్రకటించి తత్స్వభావవ్యంజన మొనర్చు మార్గ మిట్టిది. అంతియకాక యితరపాత్రలయొక్క వాక్క్రియాశీలవర్ణనలచే నొకపాత్రస్వభావమును వ్యంజింపఁజేయుట మఱియొకపద్ధతి. ఇం దీరెండవ మార్గముకూడ సార్థకముగాఁ బ్రయుక్తమై యున్నది అపహృతయైన పుత్త్రికనుగూర్చి విదూరథుఁడు పొందిన విచారమువలనను, ఆమెను కుజంభునిబారినుండి రక్షించుట కతఁ డొనర్చినయత్నమువలనను ముదావతి రాజునకు బహిఃప్రాణ మని ప్రకటిత మైనది.

క. దనుజుఁ దునిమి యెవ్వఁడు నా
తనయుల విడిపించు నట్టి ధరణీశ్వరనం
దనునకు నిచ్చెద నాసుత
నని పురిలోఁ జాటఁ బనిచె నతఁ డార్తుం డై. (7.266)

రాజకుమారులు సోదరిని రక్షింపఁబోయి రాక్షసునిచే బంధితు లైరి. పుత్త్రికతోపాటు పుత్త్రులను రాక్షసునిపాలఁ బడుటచే రాజునకు రెండురెక్కలు విరిగినట్లయ్యెను. తా నా రాక్షసుని నిర్జింపలేఁడు, తనసంతానమును రక్షించుకొనలేఁడు. ఎదుటివానిశక్తి తెలిసియు సాహసించి సమయుట నీతిమంతునిలక్షణము కాదు. ఇఁక గత్యంతరము లేక తనపుత్త్రికను రణశుల్కముగా నిర్దేశించి చాటఁబంచినాఁడు. అది యతని దైన్యావస్థకుఁ బరాకాష్ఠ. "నాసుత నిచ్చెద" ననుమాట నతఁ డార్తుఁడై" చాటఁబనిచె ననుటలో నొకవిశేషము కలదు. తనసుత నవ్విధముగా నొరుల కిచ్చుచున్నందుల కావిచారము. ఇచ్చట మన కొక యనుమానము కలుగవచ్చును. విదూరథుఁడు తనయుల విడిపించిన రాజకుమారునకు రాజ్యభాగ మిత్తు నని చెప్పవచ్చునుగదా ! అట్లు చెప్పినచోఁ బౌరాణికుఁ డుద్దేశించిన కథాప్రయోజనము సిద్ధింపదు. ఎట్లనఁగా సుతవియోగ దుఃఖితుఁడై దుర్బలుఁడై యున్న రాజు నేవీరుఁ డైన జయించి రాజ్యమంతయుఁ గబళింపఁగలఁడు. అట్లు కబళించినను అతఁడు కుజంభు నెదుర్కొనక తప్పదు. కోరికోరి యెవరు కొరవితోఁ దలఁ గోకు కొందురు ? అందువలన రాజ్యలోభులై యెవ్వరును రాజునకు సాయము చేయువా రుండరు. ఇఁక పోగా నాతఁడు తనయ నిత్తు నన్నచో నెవ్వఁ డైన సాహసించును. దానికిఁ గారణ మామె సౌందర్యాతిశయాదుల కున్న ప్రతిష్ఠయే యని యూహించుట సులభము.

వత్సంధ్రుఁడు కుజంభవధోన్ముఖుఁ డగుటయందును నిట్టినాయికాగుణౌన్నత్యమును గవి గూఢముగా వ్యంజింపఁజేయుచు నాయకుని గుణప్రౌఢునిగాఁ జిత్రించినాఁడు. విదూరథునిచాటింపు విని, కథనంతయు నెఱిఁగి వత్సంధ్రుఁ డతనియొద్ద కేఁగి "ఏ నద్దానవు నిర్జించి నీకొడుకులం గూతుం దెచ్చెద నన్నుఁ బనుపు" మని కోరినాఁడు. ఆయనచే సర్వ మాయత్తపఱచుకొని దనుజునిపై దాడి వెడలినాఁడు. విదూరథుఁడు "తనయుల విడిపించునట్టి" వానికిఁ దనయ నిత్తు నని పల్కెనుగదా ! "తనయుల"లోఁ దనయయు, తనయులును గలరు. వత్సంధ్రుఁ డాయొక్కమాటను రెండుగాఁ జేసి, "కొడుకులం గూతుం దెచ్చెద" నని స్పష్టపఱచి పలుకుటయందు ప్రౌఢత కలదు. అప్రౌఢుఁ డైనచో "తనయులఁ దెచ్చి తనయం గొనియెద" ననెడివాఁడే. వత్సంధ్రుఁడు గడుసువాఁడు, వాక్కౌశల్యము కలవాఁడు. దానవుని సంహరించి కృతప్రతిజ్ఞుఁడై మరలివచ్చి విదూరథునితో నన్నమాటలలోను గవి యట్టి చాతుర్యమును బొదివి పెట్టినాఁడు.

క. జనవల్లభ ! భవదాజ్ఞఁ
జని యద్దానవునిఁ దునిమి శౌర్య మెసఁగ నీ

తనయురఁ గూఁతుం దెచ్చితి
నొనరింపుము ప్రీతి యెద్దియుచితము దానిన్. (7.278)

''జనవల్లభ'' యని సంబోధించి రాక్షససంహారమువలన నేర్పడినయతని సుస్థిరప్రభుత్వ మును వ్యంజింపఁ జేసినాఁడు. ''భవదాజ్ఞన్ జని'' యనుటచే నాతని పూర్వకృతప్రతిజ్ఞను జ్ఞాపకమొనర్చినాఁడు. "అద్దానవుని" ననుటలోని త్రికసంధిశక్తివలన నతనికి దానవుని వలన నేర్పడిన క్లేశభారమును జ్ఞప్తికిఁ దెచ్చినాఁడు. ''శౌర్య మెసఁగన్'' అని రాక్షసు నితో నైన భీకరయుద్ధమును, దానియం దతఁడు స్వీయదోర్బలముచే సాధించినవిజయ మును స్ఫురింపఁజేసి, గూఢాహంకారమును గ్రుమ్మరించినాఁడు. ''తనయురఁ గూతుం దెచ్చిచి" ననుటలో నాత్మప్రతిజ్ఞానిర్వహణగర్వమును గంభీరముగాఁ బ్రదర్శించినాఁడు. ఇతఁ డాడిన యిన్నిమాట లొకయెత్తు : చివరివాక్య మొకయెత్తు. ''ఒనరింపుము ప్రీతి యెద్ది యుచితము దానిన్''- అనుట ముదావతీపాణిగ్రహణ కౌతూహలభావవ్యంజనము నకుఁ బరమావధి ! ఔచిత్యపోషణమునకుఁ బరాకాష్ఠ !

మొదట విదూరథునిచరిత్రము వలె నారంభించి, క్రమముగా నది వత్సంధ్రచరిత్ర ముగా మలచి పూర్వార్ధము నుత్తరార్ధమున కంగముగా భాసించునట్లు ముగించుటయే యిందలి కథాకథనశిల్పము !

## ప్రాంశప్రజాత్యాదులచరిత్రములు :

వత్సంధ్రమహీపతిసంతతిలోఁ బ్రాంశుఁడు, ప్రజాతి, తత్సుతుఁ డైన ఖనిత్రుఁడు, క్షుపుఁడు, వివింశుఁడుఁ దగు ఖనిత్రుఁడు, కరంధముఁడు ఆవేక్షితుఁడు, మరుత్తు- అనుచక్రవర్తులు ప్రసిద్ధులు. వీరిచరిత్రము లన్నియు అష్టమాశ్వాసమున వర్ణింపఁబడి యున్నవి. పురాణకర్త యీకథలను నిర్మించు చక్రవర్తుల సమగ్రజీవితము చిత్రింప యత్నింపలేదు. కాని యాయాచక్రవర్తుల ప్రశస్తికి మూలహేతువులైన రసవత్సన్ని వేశములను మాత్రమే పేర్కొనెను. వాని యం దాచక్రవర్తులధర్మనిర్వహణైకదీక్షామహ నీయత్వమును బ్రతిపాదించెను.

పైన బేర్కొనిన చక్రవర్తుల జీవితము లన్నియు నేకవిధముగా సాగినవి కావు. కొందఱు సుఖశాంతులతో రాజ్యమును బాలించుచు సవనకర్మదీక్షితులై తమకాలము చల్లగా వెళ్ళఁబుచ్చిరి. కొందఱు ధర్మనిర్వహణమునందు సంక్లిష్టమగు సంఘర్షణలలోఁ జిక్కుకొని స్వీయధర్మైకదీక్షతో వానినిఁ దరించి మించినవారును గలరు. అందువలన మొదటితరగతికిఁ జెందిన రాజులకథలు చాలసంగ్రహమైనవిగాను, రెండవవిధమునకుఁ జెందినవానినిఁ దగినంత విపులములుగను పురాణకర్త రచించెను.

ప్రాంశ, ప్రజాతి, క్షుప, వివింశచక్రవర్తుల చరిత్రము లతిసంగ్రహములై యున్నవి. ప్రాంశుఁడు శతసహస్రసంఖ్యలలో యజ్ఞము లాచరించెను. వానిని లెక్కింప నెవ్వని కిని శక్యము కాదు. అన్నియజ్ఞము లాతఁడు దేవతలమెప్పు గోరి చేసినట్లు కానరాదు. తనయతులవైభవంబు మెరయంగ నుద్దేశించి చేసినట్లే తోచుచున్నది. కావుననే దేవత

లతని యజ్ఞభాగములు భోగించినట్లు మారన ప్రత్యేకించి చెప్పలేదు. 'భక్తికలుగు కూడు' కదా భగవంతునికైనను గావలసినది ! ఒకసంపన్నత్తుఁడు కీర్తికాముఁడై సత్కార్యము లందు ధనము వెచ్చించు వైఖరియే ప్రాంశచక్రవర్తివర్తనమునఁ గానఁబడుచున్నది. ఇది ధార్మికమైనదే కాని యుదాత్తమును మహనీయము నైనది కాదు.

ప్రజాతి యజ్ఞములను దేవహితార్థ మొనర్చెను. అతనియజ్ఞభాగములు భుజించి యింద్రాదులు దైత్యులను నిర్జింపఁగల శౌర్యదీప్తిని సాధించిరి. ప్రజాతియందు ఫలాభిసంధిరహితమైన కర్మాచరణానురక్తి కానఁబడుటచే నతని ధర్మవర్తన ముదాత్తరమణీయమై భాసించుచున్నది.

వంశపరంపరాదత్త మగు సవనకర్మదీక్షను వివింశచక్రవర్తియు వహించెను. దానికిఁదోడు శిష్టజనరక్షణమును దుష్టజనశిక్షణమును జీవితవ్రతముగాఁ గైకొనెను. ఇతని యజ్ఞభాగములను గైకొని తృప్తిఁగాంచిన దేవగణము ప్రజాహితైకతత్పరులయి సకాల వర్షాదులను, బుష్టికరమైన సస్యసంపదను జనులకుఁ బ్రసాదించుచుండిరి. రసపుష్టి జనులకు శక్తి నిచ్చుచుండ నది మదముగాఁ బరిణమింపకుండ వివింశుఁడు ధర్మనియతిచే జగమును శాసించెను. చివర కాతఁడు వైరివీరుల నిగ్రహించుచు రణరంగమున వీర మరణము నొంది స్వర్గము నలంకరించెను.

పై ముగ్గురి ధర్మవర్తనమునందును నొకరమణీయపరిణామక్రమము కలదు. సవనదీక్షావిధి యైహికదృష్టితో నారంభమై, ఆముష్మికదృష్టితో నభివృద్ధి చెంది, యైహికాముష్మికసుఖఫలరూపమై పరిణమించినది. యజ్ఞకర్మవలన మానవుఁడు త్రిపురుషార్థములను సాధించును. దానిని వత్సంధ్రసంతతిలోని చక్రవర్తులు క్రమముగా నర్థమును, ధర్మమును, గామమును, (కోర్కెలీడేర్చుకొనుట) మూఁడుతరములకాలమున సాధించి రని చెప్పుటయే యీకథాశిల్పముయొక్క పరమతాత్పర్యము !

## ఖనిత్రావేష్టిత మరుత్తరాట్చరిత్రలు :

ఖనిత్రావేష్టితమత్తరాట్చరిత్రములు విస్తృతములైన కథలు. ఇవి వస్తుతత్త్వముచే భిన్నము లయ్యు నిర్మాణశిల్పమునందుఁ బాటింపఁబడిన యొకసమానలక్షణముచే తుల్యరూపములై యొప్పారుచున్నవి.

పైనలుగురుచక్రవర్తులలో నిరువురు ఖనిత్రనామధేయులు కలరు. మొదటివాఁడు ప్రజాతిపుత్త్రుఁడు; రెండవవాఁడు వివింశపుత్త్రుఁడు. స్వభావముచే వీ రిరువురును భిన్నులు. ఒకఁడు జ్ఞాని. మఱియొకఁడు కర్మఠుఁడు. ఒకఁడు నిష్కాముఁడు; మఱియొకఁడు పుత్త్రికాముఁడు. వీరిరువురును బరిణతు లైన ధర్మవీరు లైనను ఒకనిచిత్తవృత్తి నివృత్తిధర్మమును, మఱియొకని చిత్తవృత్తి ప్రవృత్తిధర్మమును నాశ్రయించి యున్నవి. ఇట్లగుటచే వారిచరిత్రములు వైవిధ్యమును సంతరించుకొనినవి.

వివంశపుత్త్రుఁడైన ఖనిత్రునియొక్క బలీయమైన పుత్త్రివాంఛను వర్ణించి నిరూపించుటయే యాతనికథలోని తాత్పర్యము. దీనిని మూఁడవస్థలలోఁ గవి నిరూపించెను.

మొదటిది : ఖనిత్రుఁ డసంఖ్యాకములైన యజ్ఞముల నాచరించియుఁ బుత్త్రినిఁ బడయఁ జాలక దుఃఖించుట. రెండవది : ఆత్మజార్థము మృగమాంసమున బిత్ఋయాగము సేయఁ దలపెట్టి వేటకై వనమున కేఁగి సంతానహీనయు, నధికసంతానయుతయు నైన మృగీ ద్వయమును గాంచి వానిదుఃఖములను విని పుత్త్రార్థముగా జీవవధ చేయ నని నిశ్చ యించుకొనుట. మూఁడవది : పుత్త్రార్థ ముగ్రతప మాచరించి యింద్రవరప్రసాదముచే నుత్తముఁడైన పుత్త్రుని బడయుట :

ఈమూఁడవస్థలయందును లాక్షణికప్రోక్తమైన నాయకావస్థాపంచకము స్ఫురించు చున్నది. పుత్త్రేచ్ఛ నాయకునిసంకల్పము. సవనకర్మలు ఆరంభము. పిత్ఋయజ్ఞ ప్రయత్నము ప్రయత్నము. జంతుసంవాదము వినిన తరువాత నేర్పడిన వితర్కము ప్రాప్త్యాశ. తపోనియతి నియతాప్తి. పుత్త్రప్రాప్తి ఫలాగమము. ఇం దర్థప్రకృతులు సుష్ఠుగాఁ గల్పింపఁబడకపోవుటచేఁ బంచసంధులు ప్రకటముగా భాసించుట లేదు కాని, గర్భసంధినిర్వహణము మాత్ర మతిమాత్రమై సార్థక మగుచుఁ గథార్థమును సమర్థించు చున్నది.

సంఘర్షణమును సృష్టించుట యొకకథానిర్మాణశిల్పము. ఈశిల్పము ఖనిత్రచరిత్ర ద్వయమునందునుఁ బాటింపఁబడినది. మొదటికథలోఁ బ్రతినాయకుని యంతస్సంఘర్ష ణయు, రెండవకథలో నాయకునియం దంతస్సంఘర్షణయు సృష్టింపఁబడినవి. కథా ప్రవృత్తినిబట్టి భిన్నభిన్నపాత్రలను, సన్నివేశములను ఆశ్రయించియున్నను సంఘర్షణ కల్పనాశిల్పము ఈరెండుకథలలో నాయకచిత్తవృత్తి నుద్దీప్త మొనర్చుట కొకేవిధ ముగాఁ బ్రవేశపెట్టఁబడినది. దీనివలన మొదటికథలో నివృత్తిధర్మాశ్రితమైనశాంతమును, రెండవకథలోఁ బ్రవృత్తిధర్మాశ్రితమైన ధర్మవీరమును ప్రఫుల్లము లగుచున్నవి.

## అవేక్షితమరుత్తరాట్చరిత్రములు :

ఆంధ్ర మార్కండేయపురాణకథామూర్తికిఁ బాదద్వయ మనఁదగిన కథాద్వయి అవేక్షితమరుత్తరాట్చరిత్రములు. ఇవి రెండును శక్తిమంతములైన కథలు. నాయకులను బట్టి చూచినచో నివిరెండును నొకేపెద్దకథగా భాసించును. అవేక్షితమరుత్తులు పరమ ధర్మైకతత్పరులు. ఆధర్మనిష్ఠ పైతృకమైన సంపద. కరంధముఁడు అపూర్వధర్మ ప్రభావమును బ్రకటించిన మహనీయుఁడు. అతఁడు రాజ్యమునకు వచ్చిన కొన్ని యేండ్లకు దాయాదు లతనిపై మత్సరము పూని ససైన్యులై యతని నగరము ముట్టడించిరి. కరంధముఁడు దీనుఁడై చేయునది లేక హస్తము నాస్యమునఁ జేర్చి వారిని శరణు వేఁడెను. అంతలో నాతనికరమునుండి యసంఖ్యాకమైన చతురంగబల ముద్భవించెను. దాని కతఁ డుప్పొంగి శత్రువులను మర్దించెను. కరయుగధమనమున నరివరవీరనిరాస నోగ్రబలము గలుగుటచే బలాశ్వనామధేయుఁ డగు నాతనికిఁ గరంధముఁ డను సార్థక నామము చెల్లుబడి యయ్యెను.

ఆ. అమలధర్మనియతుఁ డైన యన్నరపతి
యట్టు లార్తుఁ డైన నరివినాశ
కారి యైన బలముఁ గల్పించె నతనిధ
ర్మంబు దాని దాన మగుడఁ గడఁగె. (8.89)

అని పురాణకర్త నిర్దేశము. స్వీయధర్మమే యేడుగడగా బ్రతికిన మహాత్ముఁడు కరంధముఁడు తండ్రియు, తాతయునై అవేక్షితమరుత్తరాట్టులయొక్క ధర్మైకజీవితములకు నాంది నాలపించినాఁడు. వీరికథ కీ మహాపురుషుని చరిత్ర మొకయుత్కృష్టారంభము; కథానాయకుల జీవసంపుటులయందు భాసించుసంస్కార స్రవంతులకు జన్మస్థానము.

అవేక్షితమరుత్తరాట్చరిత్రలు శక్తిమంతము లగుటకుఁ గారణములు రెండు: ఒకటి- ఇందుఁ బూర్వపూర్వసన్నివేశములందు ఆనంతరసన్నివేశములందలి కథార్థములకు బీజముల నీక్షేపించి, కథాగతియందు కార్యకారణత్వము ననుసంధించుట. రెండు : సన్నివేశములను గథోన్మీలనక్రమమున కుచిత మగునట్లు సంధించియు బఠిత కాసన్నివేశ కల్పనమునం దాశ్చర్యము జనించున ట్లేర్పఱచుట. ఈరెండింటివలనఁ బురాణకర్త కథకు సమగ్రతయు సార్థక్యమును గల్పించినాఁడు.

అవేక్షితుఁడు సౌందర్యమున నశ్వినులను, కాంతిమత్త్వమునఁ జంద్రునిఁ, దేజమున సూర్యుని, ధైర్యమున మేరువును, బుద్ధియందు బృహస్పతిని మించినవాఁడు. అతని ననేకరాజకన్యలు స్వయంవరములందు వరించి వివాహమాడిరి. అతఁడును అనేక స్వయంవరసభలందు మూగినరాజలోకమును జయించి, వీరభోజ్యములుగా రాకన్నెలను గ్రహించి వివాహమాడెను. బలసౌందర్యములం దాతనికి సముఁడైనవాఁడు భూతలమున లేకపోవుటచే స్వయంవరసభలయం దతనిదే పైచేయి యగుచుండెను. ఇది సాటివారగు క్షత్రియులలోఁ గొంత కలవరము రేపెను. ఒకపరి విదిశానగరాధీశుఁ డగు విశాల భూపాలుఁడు విశాల యను తనపుత్త్రికి స్వయంవరము చాటెను. ఎప్పటివలెనే రాజులు విచ్చేసిరి. అలవాటుచొప్పున నవేక్షితుఁడు వారిఁ బరాజితులఁ గావించి కన్యను గైకొనెను. సదస్సున నున్న రాజులకుఁ గడుపు మండినది. అందఱు నొక్కటై యతనిపైఁ బడి తుములయుద్ధ మొనర్చి యధర్మమార్గమున నతని నోడించి బంధించిరి.

కరంధముని తల్లి వీరాఖ్య యగు వీరమాత. ఆమె పుత్త్రుని పరాక్రమమును, శత్రువుల యధర్మయుద్ధవిధమును విని క్రుద్ధయై భర్తను శత్రుసంహారార్థ మనికిఁ బంపినది. కరంధముఁ డుజ్జ్వలపరాక్రమము నెరపి శత్రువుల నోడించి పుత్త్రుని విడిపించెను. విశాలుఁ డాజనపతిఁ బూజించి తనకన్య నాతనిపుత్త్రున కిచ్చి వివాహ మొనర్పఁ బ్రార్థించెను. అవేక్షితుఁడు స్వయంవరరాజలోకమువలన నావనితయెదుటఁ దాఁబడిన యవమానమును స్మరించి, కన్యాపరిగ్రహణము మాని, యాజన్మబ్రహచర్యదీక్షఁ దాల్చెను. విశాలమాత్ర మాతని శౌర్యగుణాదులఁ గీర్తించి, యాతనిని మనసార వరించుటచే నన్యుని వివాహమాడ నని కృతనిశ్చయురా లయ్యెను. కరంధమవిశాల

నృపతు లిరువురకు సాయశక్తులఁ జెప్పిచూచిరి. కాని, లాభము లేకపోయెను. ఆతరు వాత నవేక్షితుఁడు తండ్రితో నిజనగరము చేరెను. వైశాలి వైరాగ్య మూని నిరాహార వ్రతము గైకొని దారుణతప మాచరించుటకు వనముల కేగెను.

అవేక్షితుఁ డకుంఠితాభిమానధనుఁడు. అతని స్వయంవరకన్యాబలవత్పరిగ్రహ ణాహంకారము వైశాలిముందు జరిగిన పరాభవమువలన దెబ్బతినినది. శత్రువు లధర్మ యుద్ధమున నతని నోడించినను ఓటమి యనుమాట యతనికి బ్రదుకులో నేదియో తీరని లోటుగాఁ బొడకట్టినది. బహువరరాజకన్యాపరిగ్రహణశీలి యైన యతఁ డొక్కసారిగా నాజన్మబ్రహ్మచర్యము తాల్చినాఁడు. అతఁ డెంతయభిమానియో అంతతీవ్రస్వభావుఁడు. అతనిచిత్తవృత్తి ననుసరించి కథాగతి సాగుచున్నది. ఎత్తుపల్లముల నెక్కి దిగుచు నడు గడుగున నద్భుతమును గ్రుమ్మరించుచున్నది.

అవేక్షితునకుఁ దగినయిల్లాలు విశాలభూవరతనూజ. ఆమె మనసార వలచిన వరు నిచేఁ బరిత్యక్తయై భయంకరతప మాచరించి యపరగిరిజాదేవి యనిపించుకొనినది. ఎంత కాలమునకును బతియనురాగము లభింపమిచే విసిగి తనువు పరిత్యజింప యత్నించెను. అప్పుడు దేవదూత యొకఁ డామె యెదుటకు వచ్చి, యామె నాత్మప్రాణహననప్రయత్నము నుండి మాన్పి, యామె త్వరలో సప్తద్వీపశోభితావనీచక్రసంవహనసమర్థుఁ డగు చక్ర వర్తికిఁ దల్లి యగు నని దీవించి యాశ్వాసించెను. ఆమె యాదేవదూతమాటల కచ్చెరు వంది యి ట్లడిగినది :

చ. తరణినిభుం డవేక్షితుఁడు దక్కఁగ నే విను మీభవంబున
న్వరుని వరింప నింక నని పట్టితి తండ్రికడం బ్రతిజ్ఞ యా
పురుషవరుండునుం బ్రతిన పూనినవాఁడు కరంధమక్షితీ
శ్వరుకడ నన్వరింప నని సంతతి యెమ్మెయి నాకుఁ గల్గెడిన్. (8.144)

ఈమాటలు పతితహృదయముతోఁ జక్కగా సంవాద మొందుచున్నవి. ఆమె కేర్పడిన యనుమానమే పతిత కేర్పడి యుక్కిరిబిక్కిరి యొనర్చును. ప్రత్యుత్తరముకొఱకు మన శ్రవణేంద్రియము లుగ్గబట్టి యుండుసమయమున

ఆ. ......దేవదూతుఁ డను నీబహూక్తు లే
మిటికి నీకుఁ జెపుమ మీననేత్ర!
తనయుఁ డుద్భవించుఁ దపము పెంపున సమ
స్తమును సిద్ధిఁబొందు దైవయుక్తి. (8.145)

అని యసలుగుట్టు బైటపెట్టక పతితను, విశాలను సందిగ్ధములోఁ బెట్టి యతఁ డంతర్ధాన మందెను. దానితో కథ రసకందాయమునఁ బడినది.

విశాలావేక్షితప్రతిజ్ఞలు పరస్పరవిరుద్ధములు. ఆవైరుధ్యము దేవదూతవాక్యమునను గలదు. అది ప్రచురితము కాలేదు. కాని, వైశాలితపముపెంపున సర్వము సిద్ధించునని మాత్రము తెలిసినది. అది యతిసహజముగను, పాత్రశీలవ్యంజకముగను నమర్చుట కవి

శిల్పము. నాయికానాయకులవిచిత్రస్వభావములే వారిజీవితములను వేఱుచేయుచుండ ననుద్దిష్టమైన నాయికాప్రయత్న ముద్దిష్టకార్యసాఫల్యమునకు హేతు వగు చున్న దని నిరూపించి భావికథాపఠనకౌతూహలమును పఠితయందు ముప్పిరికొనునట్లు చేయుటయే కథనశక్తి. సాధారణుఁ డైన కథకుఁ డైనచో దేవదూతముఖమునఁ బుత్త్రోత్పత్తిపర్యంతము కథ చెప్పించెడివాఁడే. దానితో కథలోని బిగువు పోయెడిది. కథ చర్వితచర్వణ మయ్యెడిది :

ఇది యిట్లుండ నవేక్షితునితల్లి భర్తృనానతి గైకొని కిమిచ్ఛకవ్రతదీక్షఁ బూనినది. అవేక్షితుఁడు బ్రహ్మచర్యదీక్షఁ బూనిననాటినుండియు నామె విచారగ్రస్థయై వంశక్షతినిఁ గూర్చి చింతించుచు వివిక్తస్థలములలోఁ బ్రొద్దులు పుచ్చుచుండెను. అటుభర్త - యిటు పుత్త్రుఁడు, అటు పౌత్రముఖదర్శనమునకైన పరితాపము - ఇటు భర్తృబ్రహ్మచర్యదీక్షావ్రతముచే భిన్నములైన కోండంద్రయంతఃపురములు - ఇవియన్నియు నావీరమాత హృదయమును క్షోభపెట్టినవి. ఆమె యొకచక్కనియుపాయము పన్నినది. దుష్కరమైన కిమిచ్ఛకవ్రతమును సంకల్పించినది. వ్రత మెందులకు పట్టినదో యెవ్వ రెఱుఁగరు; ఆ వృద్ధపతి కేమి చెప్పి యొప్పించినదో తెలియరాదు. ఆవ్రతోద్యాపనసమయమున నర్థికి నాస్తి యనరాదు. ఈభార మాతల్లి పుత్త్రునిపై నుంచినది. ధర్మోత్సాహి యైన నవేక్షితుఁడు మాతృప్రాణమును దీర్ప ముందుకు వచ్చినాఁడు.

ఆ. అస్మదీయజనని యర్థిఁ గిమిచ్ఛక
వ్రతము సల్పుచున్న దతిశయముగఁ
బ్రీతి నడుగుఁ డెవ్వరికి నేమి యిచ్చ మీ
రర్థులార ! యిత్తు నదియె నేను. (8.150)

అని ప్రతినఁ బలికినాఁడు. శాశ్వతపితృలోకసుఖాకాంక్షి యయి వంశాభివృద్ధి నభిలషించు వృద్ధనృపతి హర్షము పొంగిపార నదియ సమయ మని గుర్తించి "మనుమని సుందరాననము మానుగఁ జూపుము నాకుఁ బుత్త్రకా !" యని యర్థించినాఁడు. పూర్వాపరప్రతిజ్ఞలు పరస్పరవిరుద్ధము లగుటచే నవేక్షితుఁడు ధర్మసంఘర్షణమునఁ బడినాఁడు. అకారణ బ్రహ్మచర్యము పాపహేతు వను ధర్మసూక్ష్మము తలంచి తండ్రికోర్కెను మన్నించినాఁడు.

తే. స్వీకృతప్రతిజ్ఞుఁడ నగు నాకు నధిప !
యిపుడు నీకు నభీప్సితం బీ నవశ్య
మగుట సంకటప్రాప్తుండ నైతి సత్య
సంగిఁ గానఁ జేసెద దారసంగ్రహంబు.

వ. తండ్రీ ! యేను నీచేతఁ సత్యపాశబద్ధుండ నైతి నీచెప్పినయట్ల చేసెద నని తల్లి వ్రతంబు సగుణంబు గావించె. (8.155-156)

వీరాదేవి వ్రతదీక్ష గైకొనుట వైశాలితపోమహిమ వలననే యని తెలియుట సులభము. అందవేక్షితుఁడు దారస్వీకారమున కిచ్ఛగించునట్లు కథ నడపుట చమత్కారము.

అపుత్త్రకుఁ డగు సుతునిఁ గాంచి యతని గార్హస్థ్యధర్మపునరుద్ధరణముకొఱకు మాతాపితరులు సర్వదాయత్నించుట సహజము. సహజత్వమును కోలుపోవని కల్పన యిది :

నాయికానాయకుల పునస్సమాగమమునకు మార్గ మేర్పడినది. కాని తత్సన్నివేశ మెప్పు డెట్లు సిద్ధించునో యనెడు నుత్కంఠ మిగిలియున్నది. దానినిఁ దెలియఁజెప్పుట తరువాతియంశము కావలెను. కావున నవేక్షితుఁడు వేటకు వెళ్లుట తటస్థించినది. అవ్వనమునందు వైశాలితో నాతఁడు కలిసినవిధము రమణీయముగఁ జిత్రింపఁబడినది. దేవదూత సూచన ననుసరించి వైశాలి కృశించిన తనశరీరమును రుచిరాహారములచేఁ బరిపుష్ట మొనర్చుకొని కాంతారమున వసించుచుండెను. ఒకనాఁడు దృఢకేశుఁ డను రక్కసుఁ డామెను గామించి బలాత్కరింప నామె 'కరంధమసుతుసతిని నన్నుఁ రక్షింపుఁ' డని యాక్రందన మొనర్చెను. అప్పలుకు లావనమున మృగయావినోదియై యున్న యవేక్షితుఁడు విని, తనభార్య యవ్వనమున కెట్లు వచ్చె నని యచ్చెరు వంది దనుజమాయ యని సమాధానపడి, వైశాలిని రక్షింప నుద్యోగించి రాక్షసునితో ఘోరయుద్ధము చేసి, శౌర్యమతిశయింప నతనిని వధించెను. దేవత లతనికిఁ బ్రత్యక్షమై వరము వేడికొను మనిరి. అతఁ డత్యద్భుతశౌర్యవీర్యఘనుఁ డైన పుత్త్రునిఁ గోరుకొనెను. సురలు కరుణించి యతని కక్కన్యయం దట్టి పుత్త్రుఁడు జనించి చక్రవర్తి యగు నని చెప్పిరి. అవేక్షితుఁడు వైశాలి నిశ్చయమును స్మరించి, తా నామెను దప్ప నన్యను బరిగ్రహింప నొల్ల నని పేర్కొనెను. దేవత లాతని యెదుటనే యున్న వైశాలినిఁ జూపి యతని కాశ్చర్యము కలిగించిరి. ఇట్లిరువురును దైవసంఘటనముచే నరణ్యమధ్యమున బునస్సమాగతు లైరి.

ఈ సన్నివేశము కథను బ్రసన్నము చేయుటకుఁ గల్పింపఁబడినది. వేటకు వచ్చిన యవేక్షితుఁ డేవిశ్రాంతిసమయమునతో వనమధ్యమున వసించు వైశాలిని గాంచి యామెను బొందినట్లు చిత్రింపవచ్చును కాని, యట్లు చేయుటవలనఁ గథలోని కొన్ని సూక్ష్మాంశములు ప్రసన్నములు కావు. అవేక్షితుఁడు వైశాలి వివాహ మాడుటకు ప్రధానకారణ మామెయెదుట నాతనికిఁ గలిగిన వైరివీరులవలని పరాజయము. మఱల నతని నామెతోఁ బునస్సమాగమ మొనర్చునపుడు పుత్త్రైకవాంఛతోఁ గవిసినట్లు చెప్పినచో నాతనియందు నైజమై భాసించు నభిమానమును జంపినట్లగును. అది నిష్కల్మషమైన హృదయముల యొక్క సమావేశము కాకపోవును. కావున, దృఢకేశునిబలాత్కారమువలన వైశాలి సతీవ్రతదీక్ష యవేక్షితున కవగత మగుట కవకాశము కల్పింపఁబడినది. దృఢకేశునిపై సాధించిన విజయము వైశాలి వీరభోజ్య యను సంతృప్తి యతనికిఁ గల్పించినది. పుత్త్రలబ్ధికి సురల యాశీర్వాదము లభించినది. దేవతలసమ్ముఖమున నవేక్షితుఁడు వైశాలిపైఁ దన కున్న యనురాగమును వ్యక్తము చేసినాఁడు. ఇరువురు నెదుటబడి హృదయములు కలయఁబోసికొనినారు. వైశాలి యి ట్లనినది :-

క. నాకుఁ బ్రసన్నుఁడ వగుము గు
ణాకర ! వరియింపు నన్ను నతులభుజబల

శ్రీకరకమనీయత నిల
నీ కెన నృపసుతుఁడు లేఁడు నిక్కం బరయన్. (8.183)

అక్కన్య యీమాటలు దైన్య ముట్టిపడఁ బలికినది. ప్రసన్నుఁడవు కమ్మని వేడుకొనినది. నాఁడు స్వయంవరసమయమున నాతఁడు నిర్దయుఁడై స్వీయాభిమానరక్షణార్థము తనను వివాహమాడ నొల్ల ననిన కఠినవర్తనము నెంచి యనినమాట లవి. 'గుణాకర! వరియింపు నన్ను'' అని ప్రాధేయపడినది. 'గుణగ్రహణపారీణుఁడ వైనచో నీకొఱకు నాపడినపాట్ల నెంచి, నాపై దయఁజూడు' మని తెల్పి స్వీయావస్థ నెఱుక పఱచినది. భుజబలమున నీయంతటివాఁడు వేఱొకఁడు లేఁ డనుట సాభిప్రాయమైన వాక్యము. స్వయంవరకాలమునఁ జెప్పిన యభిప్రాయమే యిచ్చట పునరుద్ఘాటించినది. అది యామె యచంచలనిశ్చయమును దెలుపు ననుట యొక ప్రయోజనము. అంతియకాక అవేక్షితుని హృదయమున నున్న లజ్జాపంకిలము నిది ప్రక్షాళన మొనర్చుచున్నది. నీబలముచే నెప్పుడైన నన్ను గ్రహింపఁగలవాఁడవు; అప్పటి యోటమి యధర్మయుద్ధఫల మని జ్ఞప్తికిఁ దెచ్చినది. ఆమె మాటలలోని యంతరార్థ మాతనిచిత్తముపైఁ బ్రభావము వైచినది. అతఁడును తన మనస్థితిని మరుగుపఱుపక విప్పి చెప్పినాఁడు.

ఆ. సానురాగహృదయ వైన ని న్నపుడు నే
రిపుజితుండ నై పరిత్యజించి
నాఁడ నిపుడు శత్రునాశావసరమునఁ
బ్రాప్త వైతి సేయుభాతి యేది? (8.185)

అతనిమాటలలో సానురాగహృదయ యైన యామెపై జాలి వ్యక్తమైనది. ఆనాడు శత్రుజితుఁడై స్వయంవరమునఁ బాణిగ్రహణము సేయని యాయభిమానికి రాక్షసునిఁ జంపి రాజకన్యను గ్రహించుచుంటి నని యంతరాత్మ సంతృప్తి పడుట స్పష్టముగాఁ దెలియుచున్నది. వివాహానంతరమైనను ఏభావ మాతనికి హృదయశల్యమై బాధింపఁగలదో దానిని దత్పూర్వమే సమూలముగాఁ దొలఁగించుట జరిగినది. దానితో స్వయంవరకాలముకంటె నిప్పటి వీరిరువురి సంగమ మెంతయో యుదాత్తమై, నిష్కల్మషమై, పరితలసానుభూతి కాస్పదమై యొప్పుచున్నది. అది యహంకారప్రేరితమును, భోగైకలక్షితమును, విలాసపర్యంతమునై యుండెడి భౌతికసమావేశము; ఇది ధర్మైకప్రేరితము, శమైకలక్షితము, పుత్త్రప్రాప్తి పర్యంతమునై భాసించిన యొకయాధ్యాత్మికసమావేశము. అప్పుడు నాయికానాయకు లొకరినొకరెఱుఁగని యౌవనారూఢులైన యువతీయువకులు. ఇప్పుడు కఠోరవ్రతదీక్షాతప్తులై తమతమ యచంచలానురాగమును పరస్పర మవగతము చేసుకొనిన దివ్యతేజస్వులు. వీరిపునస్సమాగమము పరస్పరహృదయావగాహనముచే నుద్దీపిత మగుచున్నది. దానికి రాక్షసప్రవేశ మత్యంతము తోడ్పడినది. కావున నీసన్నివేశము సహజము, సార్థకమును.

నాయికానాయకుల పునస్సమాగమముతోఁ గథ ముగియవలసినది. కాని, వైశాలి

తా నావనమున నుండుటకుఁ గారణము వివరించి, నాగలోకవృత్తాంతము నొకదానినిఁ జెప్పెను. అది భావికథకు బీజము. శాఖోపశాఖావిరాజితమై పెరుగువృక్షరాజమువలె కథ యభివృద్ధియగుట నిచ్చటఁ గాంచవచ్చును.

ఒకనా డామె గంగయందు స్నాన మాడుచుండ నొకవృద్ధనాగేంద్రుఁడు రసాతలమున కామెను గొనిపోయెను. ఆమెను నాగలోక మంతయు గౌరవించి, యొకవిన్నపము నందఁజేసినది.

క. నీపుత్త్రిన కపరాధం
బీపవనాశను లొనర్తు రిందఱఁ గ్రుద్ధుం
డై పొరిగొనకుండఁగ నీ
వాపురుషవరేణ్యు మాన్పవమ్మ కడుఁ గృపన్. (8.180)

ఆవిన్నప మాలకించి యామె వారికి మాట యిచ్చినది. దాని నామె తాశికట్టకపూర్వమే ధవునకు నివేదించినది. నాయికానాయకులకు జన్మించు పుత్త్రినికంటె నతనిజాతకము ముందు పుట్టినది. నాటకమున నంకావతారమువలె నీయంశము మరుత్తరాట్చరిత్రలోని ప్రధానవృత్తమును వ్యంజింపఁజేయుచున్నది. అందు వైశాలి నిర్వహింపఁబోవు కీలకస్థానము స్పష్టమగుచున్నది. ఇట్లు కథలోని యుత్తరభాగమును బూర్వభాగమున జొనుపుట మహాకవులు పాటించు కథాకథనశిల్పములలో నొకటి!

వనాంతరమున వివాహమాడు మని యావనజాక్షి యవేక్షితునిఁ గోరుకొనినది. అతఁడు విధియుక్తముగాఁ బెండ్లాడవలె నని తలంచినాఁడు. అంతలో ననేకగంధర్వాప్సరఃపరివృతుఁడైన గంధర్వరాజు రంగమున దిగినాఁడు. వైశాలి పూర్వజన్మమునఁ దన గూతు రనియు, శాపావసరమున భూలోకమున జనించె ననియు దెలిపి, యందఱ నాశ్చర్యమున ముంచి, చక్రవర్తి యగు సుతుఁడు కలుగుగాక యని వధూవరుల దీవించి, తుంబురుఁడు హోతగాఁ బాణిగ్రహణమహోత్సవమును నేత్రోత్సవముగా జరిపించినాఁడు; కూతునల్లుని గైకొని గంధర్వనగర మేగినాఁడు. అచ్చట వైశాలియం దవేక్షితుఁడు పుత్త్రునిఁ బడసెను. మహనీయతేజోవీర్యధనుఁ డైన యబ్బాలునికిఁ దుంబురుఁడు జాతకర్మహోమాదిసముచిత క్రియాకలాపములు నిర్వర్తించి మరుత్తు లాతనికి బలము నొసంగుదురుగాత యని దీవించెను. ఆకాశవాణి యతనికి మరుత్తుఁడని నామకరణము చేసెను. అటుపైఁ గొన్నినాళ్ల కవేక్షితుఁడు సతీసుతసమేతుఁడై నిజవాసమున కరుదెంచి తండ్రికిఁ బౌత్రముఖదర్శనసుఖమును గల్పించి కృతకృత్యుఁడై కీర్తిమంతుఁ డయ్యెను.

గంధర్వరాజప్రవేశ ఘట్టమువలన వైశాలి గంధర్వాంశసంజాత యని తేటతెల్లమయి మరుత్తునిజన్మస్థానమున కొకమహనీయగౌరవము గల్పింపఁబడుచున్నది. అవేక్షితుఁడు గుప్తముగా వివాహితుఁడై తండ్రికిఁ బ్రకటముగాఁ బౌత్రముఖదర్శనము చేయించుట కవకాశము సిద్ధించినది. సశరీరగంధర్వనగరగమనము నాయికానాయకుల భౌతికకాయములకు దివ్యభోగమయత్వ మబ్బించినది. దేవదూత చెప్పిన దైవయుక్తికి

వ్యాఖ్యానము లభించినది. అవేక్షితుని ప్రతిజ్ఞ ప్రత్యక్షరము ప్రవర్తింపఁబడినది. ఇన్ని ప్రయోజనములు గల యీ సన్నివేశ మాశ్చర్యజనకముగాఁ బ్రవేశపెట్టి సహజసార్థక శిల్పములను గల్పించి కథాగతికి రమణీయత్వము నాపాదించినాఁడు కవి.

పౌత్రముఖదర్శనముతోఁ గరంధముని బ్రదుకు ఫలించినది. అతఁడు భార్యాసహితుఁడై వానప్రస్థాశ్రమస్వీకార మొనర్ప నిశ్చయించి పుత్త్రుఁడైన యవేక్షితునికి రాజ్యమప్పగింప నిచ్చగించెను. అవేక్షితుఁడు రాజ్యపదవి నంగీకరింపలేదు. దాని కతఁడు చూపిన కారణ మత్యంతాశ్చర్యకరము; అభిమానగుణప్రదీపకము.

ఉ. అనతవక్త్రుఁడై యనియె నాతఁడు రాజ్యము సేయనొల్లఁ దం
డ్రీ ! నెఱ నాడియున్నయది యీధర కన్య నొనర్పు రాజుగా
హీనత నొంది నీకతన నేఁ జెఱఁ బాసిన యప్డ పౌరుష
శ్రీ నను బాసెఁ బౌరుషగరిష్ఠుఁడు గాక ధరిత్రి యేలునే? (8.215)

అను నతని పల్కులం దాత్మాభిమానము గొట్టవచ్చినట్లు కానఁబడుచున్నది. తండ్రి కొమరుని సమాధానపఱుప యత్నించుచుఁ 'గొడుకునకుఁ దండ్రి తండ్రికిఁ బుత్త్రుఁడు వేఱుగా దనియు నది పరమార్థ' మనియుఁ జెప్పి చూచెను. కాని సుతుఁడు మెత్తపడుటకు బదులు గట్టితేలెను, "నీచెప్పినది నిక్క మగు నైనను నామన సొడఁబడ దే నీచే వినిమోక్షితుఁ డగుట నాకు వ్రీడన సేయున్" అని తననిశ్చయము తెలుపుటతో నాగక—

తే. ఒనరఁ దండ్రిచే లక్ష్మిఁ గైకొను నతండు
తండ్రిచేఁ గ్లేశములఁ బాసి తనరునతఁడు
తండ్రిచేతన వెలయు నతఁడు మదీయ
కులమునందును లేకుండవలయుఁ దండ్రి ! (8.220)

అని బడబాగ్నివలె గూఢముగా నతనియందు దహించుచున్నయవమానాగ్నిని వెళ్ళగ్రక్కినాఁడు. "మానవీరము"న కీయవేక్షితుని జీవితవృత్తము సమ్యగోదాహరణము. అందీ వాక్యములు రసస్థితి నందుకొనిన యుత్తమలక్ష్యములు!

అవేక్షితుఁడు స్వయముగా నోడుట యొకదోస మైనది. అతనిని తండ్రి విడిపించుట యిప్పు డొకదోస మైనది. ఈయవమాన మతనిమనస్సులో నుండె నని యెక్కడ పొక్కకుండ వర్తించిన గంభీరుఁ డాయవేక్షితుఁడు. సమయమునకు బైట పెట్టి సమస్యను గల్పించినాఁడు. అట్లయినప్పుడే కథ రక్తి కట్టును. లేనిచో నీయనుమానము తండ్రితో బ్రహ్మచర్యదీక్ష గైకొనిన మరుక్షణముననే చెప్పియుండవచ్చును. అప్పుడు కరంధమనృపతికిఁ బౌత్రులు లే రనెడి దుఃఖముతోపాటు మఱియొక దుఃఖము తోడయ్యెడిది. ప్రజ లాయువరాజునందు వైముఖ్యము ప్రకటించెడివారు. కాని, యిప్పు డవేక్షితుఁ డా మాట ననుటలో రెండు ప్రయోజనములు సాధింపఁబడుచున్నవి. వంశమున నొకయుత్తమాచార మేర్పఱచుట యనునది యొకటి; అధికారియైన పౌత్రునిఁ జూపించి తనయభిమానమును గాపాడుకొని వృద్ధనృపతికి విచారము కలుగకుండగను, కథాగతి

కుంటుపడకుండగను జూచుట మఱియొకటి, ఇట్టిప్రయోజనములు గల యీసన్నివేశము నకు బీజము కరంధమపుత్త్రిబంధవిమోచనఘట్టమునఁ గల దని దెలిసికొనిన పఠిత యాశ్చర్యాంబుధిలో మునుఁగకపోఁడు. కథారంభమున వేయఁబడిన సూక్ష్మమగుబీజము అదృష్టముగా మొలకెత్తి నాదిగియొదిగి ప్రాకుచు వ్యాపించి, యిచ్చట గుమ్మడియంత ఫల మందించినది. ఇట్టి నిగ్రహాత్మకరచనమే యుత్తమశిల్పలక్షణము!

కరంధముఁడు భార్యాసహితుఁడై వానప్రస్థమున కరిగెను. మరుత్తుఁడు చక్రవర్తియై బహువిధసవనము లాచరించి, దేవతల మెప్పించి, భువిని సామర్థ్యముతోఁ బాలించుచుండెను. కరంధమనృపతి తనువు చాలించెను. అతనిపత్ని యౌర్వాశ్రమమున నిలిచి, తప మాచరించుచుండెను. అచ్చట యొకనాఁ డొకఘోరము జరిగెను. దుష్టులైన యురగులు కొందఱు పాతాళమునుండి వెలువడి వచ్చి, తప మాచరించుకొనుచున్న ఋషుల నేడుగురను గాటంది మృతుల నొనర్చిరి. అచ్చటి నిర్మలజలాశయములను నిజస్వేద మూత్రపురీషదూషితము లొనర్చెను. ఈధర్మగ్లానిని ప్రభువైన మనుమనికి గబురంపిన దావృద్ధరాణి. స్వీయవంశజులైన చక్రవర్తులపాలనమునందు ధర్మము నాలుగుపాదము లతో నడువవలె ననెడి యామె యుదాత్తాశయము శ్లాఘ్యము. అట్టిమాతృమూర్తులు తీర్చి దిద్దిన పురుషమూర్తులు కావుననే తద్వంశజులు ధర్మమూర్తు లయి వాసికెక్కినారు. ఋషుల కేర్పడిన కీడు వారే వారితపోమహిమవలనఁ దీర్చికొందురు కాని భూనాథుఁడు దుష్టశిక్షణశిష్టరక్షణధర్మైకవ్రతుఁడై వారిని రక్షించుభారము వహింపవలె నని యామె యభిమతము. మూర్ధాభిషిక్తుఁడైన ప్రభువు చారచక్షువై సర్వవిషయములను జాగ రూకుఁడై గ్రహింపవలె నని యామె యభిలాష. మనుమని పాలనలో నేర్పడిన యీదురా చారమును జూచి యామె మౌనముగా నుండలేకపోయినది. పరుషముగా మందలించుచు సందేశ మంపినది. (8.232-236)

అధర్మయుద్ధమునందు సాహసోపేతుఁడైన పుత్త్రుఁడవమానము పొందినప్పు డతని శౌర్యమును గుర్తించి కీర్తించిన వీరమాత, ధర్మరక్షణమునం దేమరుపాటు చూపిన మను మనికి నీతులుసెప్పుట పాత్రసహజస్వభావమును వ్యక్తము చేయుచున్నది. నిష్కళంకమైన వంశచరిత్రమున నెచ్చట మచ్చపడునో యని వృద్ధమాతభయము. ఆమె కున్న వంశాభి మానము, ఆత్మాభిమానము, ధర్మనిరతి, ధర్మపరిజ్ఞానము - అంతయుత్కృష్టమైనవి!

మరుత్తుఁ డామె సందేశము విని లజ్జాయత్తచిత్తుఁ డయ్యెను. దివ్యాస్త్రములు చేతఁ గొని యౌర్వాశ్రమునకుఁ దక్షణమే తరలెను. ఉరగులయౌద్ధత్యమునకు మండిపడెను.

ఉ. పాములచేతఁ జచ్చి భువిఁ బడ్డ మునీంద్రులఁ గాంచి పార్థివ
గ్రామణి యుల్ల ముమ్మలికఁ గాలఁగఁ బల్మఱుఁ దన్ను దిట్టికొం
చేమఁటి యింతపాపమున కే నెలవైతినె? దుష్టపన్నగ
స్తోమము నాభుజాబలముసొంపునఁ బెంపును నేఁ డడంచెదన్.

చ. అని పటుకోపపావకశిఖారుణితాంబకదీప్తవక్త్రుఁడై
యనిమిషయక్షకిన్నరవియచ్చరమానవులార! చూడుఁడీ
యనుపమపుణ్యమూర్తుల మహాత్ముల నిమ్మునులన్ విషాగ్నిఁ గ్రుం
చినయహికోటి నెల్ల నెటు చేసెదనో భుజవీర్యసంపదన్. (8.238, 239)

అని విజృంభించి, మరుత్తుఁడు సర్పకులము నాశన మగునట్లు సంవర్తకమహాస్త్రము ప్రయోగించెను. అహిలోకమున నగ్ని రగుల్కొనినది. సర్పశ్రేష్ఠులు పోయి వైశాలిపాదముల మీఁద పడి శరణువేడిరి. ఆమె యిదివఱకే మాట యిచ్చియుండుటచే సర్పకులమును రక్షింప నపరజరాత్కారువువలె నుద్యమించినది. పుత్త్రప్రయత్నము నుపసంహరింపఁ జేయ నవేక్షితునిఁ బ్రార్థించి యొప్పించినది. అతఁ డెప్పటికైనను తనమాటయే నెగ్గవలె ననెడి యభిమాని –

క. తరుణీ! యే నీపంపున
మరుత్తు వారింతుఁ గాతు మానుగ సర్పో
త్కరము నవశ్యమ్మును విను
శరణాగతులం ద్యజింపఁ జన దెవ్వరికిన్.

క. విను నావచనంబున నీ
తనయుం డత్యుగ్ర మైన తనయస్త్రము చ
య్యన సంహరింపకున్నను
ఘనదివ్యాస్త్రహతి దానిఁ గ్రాతుం దరుణీ! (8.248-249)

సుతుఁడు సౌమ్యముగాఁ దనమాట విననిచో దెబ్బకు దెబ్బ తీయు నుద్దేశమునఁ గదలినాఁ డవేక్షితుఁడు. అతనివెంట వైశాలియుఁ గదలి యౌర్వాశ్రమము చేరెను. తండ్రి పుత్త్రు నస్త్రము నుపసంహరింపు మని కోరెను. మరుత్తునకుఁ దండ్రియాదేశ మాశ్చర్యము కలిగించినది.

శా. ఏమీ యస్త్రము సంహరింపఁదగు నంచే తండ్రి! మద్వీర్యము
న్సామర్థ్యంబు తృణీకరించి యిటు లీనసర్పుల న్సభ్యుల
న్సామర్షాత్మకులై యకారణమ యీవ్యాళాధముల్ గ్రూరు లు
ద్దామక్రోధులు చంపి యుండఁగను నీత ప్పేనుసైరింతునే? (8.254)

అని బాణోపసంహారాజ్ఞను దిరస్కరించెను. తండ్రికిఁ దగిన కొమరుఁ డాతఁడు. తండ్రి యార్తత్రాణపరాయణధర్మమును బాలింప కోదండము పట్టినాఁడు. పుత్త్రుఁడు దుష్టజనశిక్షణార్థము దండము చేపట్టి యెదురునిలచినాఁడు. రెండుధర్మములకు సంఘర్షణ మేర్పడినది.

క. కను నీవొండె శరానల
మున నీఱుగఁ జేసి సర్పములఁ ద్రుంపు వెస

న్నిను నే నొందె శరానల
మున నీఱుగఁ జేసి సర్పములఁ గాతు వెసన్.

క. అతిభీతుఁ డైన శరణా
గతు నార్తుని శత్రు నైనఁ గడుకొని కరుణా
న్వితుఁడై రక్షింపని దు
ర్మతి యగు కుత్సితుని బ్రతుకు బ్రతుకే తలఁపన్.

ఆ. క్షత్రియుండ నాకు శరణాగతాతురో
రగ వితాన మది దురాత్మ! శరప
కారకారి వీవు కావున వధ్యుండ
వనినఁ దండ్రి కిట్టు లనియెఁ గొడుకు.

క. తన బాంధవుండు మిత్రుఁడు
జనకుఁడు గురుఁ డనక కడఁగి చంపవలయు భూ
జనపరిరక్షావిఘ్నుం
బొనరించిన నీతి యూఁది యుర్వీజనకున్.

క. కావున నిన్ను వధించెద
నీవలుగకుమీ నరేంద్ర! నృపధర్మం బేఁ
గావించెదఁ గాని యమ
ర్షావేశము లే దొకింత యైనను నాకున్. (8.262-266)

అని యిట్లు తండ్రికొడుకులు ఒండొరుల జంపుతెంపుసొంపునఁ బ్రచండమూర్తు లైరి. ఔర్వాశ్రమమునిగణ మదరిపోయినది. అతిసంభ్రమమునఁ బితాపుత్త్రుల మధ్య నిలిచి వారిని రణసంరంభమునుండి వారించినది. ఇరువురును దమతమధర్మములను బేర్కొని తమయందు దోసము లేదని యుగ్గడించి నిలచిరి. భుజంగులకుఁ దల తిరిగినది. మృతు లైన మునులను బునరుజ్జీవితుల నొనర్చెద మని చెప్పి కాళ్లవ్రేళ్లఁ బడిరి. మునులు బ్రతికిరి. సమస్య శాంతియుతముగాఁ బరిష్కారమైనది. తండ్రియును సుతుఁడును దమ తమ దివ్యబాణముల నుపసంహరించిరి. లోకమున శాంతి వెలసినది. వృద్ధరాజమాత తన మనుమనిపాలనమున ధర్మము బ్రతికినందులకు సంతసించినది; వైశాలి తన సత్యవ్రతము నిలిచిన దని యుప్పొంగినది. అవేక్షితుఁడు క్షత్రియధర్మమును కాపాడితి నని సంతసించెను. మరుత్తుఁడు ప్రభుధర్మము నిర్వహించితి నని యానందమందెను.

ప్రళయము ముంచుకొనివచ్చి చప్పున తేలిపోయినట్లు ముగించుటలోనే కథానిర్వహణనైపుణ్య మున్నది. అప్పుడే యద్భుతము పోషింపఁబడునది! కథలో నచ్చటచ్చట పలుపఁబడిన బీజము లన్నింటిని నిర్వహణమున నేకత్ర సమకూర్చి ఫలమును సాధించుట యిచ్చట గమనింపఁదగిన విశేషము. కథయందు బ్రతికియున్న ప్రధానపాత్రలన్నియు నిర్వహణఘట్టమున నేకత్ర తారసిల్లి స్వీయధర్మనిర్వహణపరాయణు లై సంఘర్షణము

నుండి శాంతినిఁ బుట్టించినారు. మరుత్తుని జీవితములో నేర్పడిన యీయుదాత్తసన్నివేశమునకు - నతఁడు పుట్టుటకుఁ బూర్వమునుండియే ప్రాతిపదికలు వేయఁబడినవి. తల్లిదండ్రులకు వివాహాత్పూర్వమే యిట్టిఘట్ట మొకటి జరుగు నని తెలియును; కాని, యెట్లు ప్రవర్తిల్లునో తెలియదు. శిల్పవిషయములందు సార్థక్యము లేనిది యొక్కఁకథార్థము చెప్పఁబడదు. అదియును స్థలకాలపాత్రౌచిత్యములు పాటించి ప్రయుక్తమగును. దానివలనఁ గథనకళ శిల్పసుందర మగును. అట్టిదానికి కథాకథన మంతయు నుదాహరణమే.

ఖనిత్రచరిత్రములందువలెనే యిక్కథలయందును సంఘర్షణమే శక్తినిఁ జేకూర్చినది. అవేక్షితుఁడు స్వయంవరరాజలోకముతోఁ బోరుటయందు బాహ్యసంఘర్షణము కల్పింపఁబడినది. అది యతనియందు స్వభావవిశిష్టమైన యంతస్సంఘర్షణకు దారితీసినది. తండ్రి కిచ్చిన వాగ్దాననిర్వహణమున నది ధర్మసంఘర్షణముగాఁ బరిణమించినది. అది ధర్మసూక్ష్మమున వారింపఁబడినది. రాజ్యస్వీకారనిరాకరణమున స్వీయధర్మమునకు నుపుత్త్రధర్మమునకు ఘర్షణ మేర్పడినది. ఇవియన్నియు పాత్రలవ్యక్తిత్వములకు మించిన సంఘర్షణములు గావు. చివరకుఁ బితాపుత్త్రులకు జరిగిన యుద్ధము విరుద్ధవిభిన్నధర్మముల కేర్పడిన విశిష్టసంఘర్షణము. ఇందు వ్యక్తులకంటె మించి ధర్మములు వెలుగొందినవి. కావున, వాని కన్నింటికంటె నిది పరమోత్తమముగాఁ బరిగణింపఁబడినది. కథోన్మీలనము ననుసరించి సంఘర్షణమునందలి సాంద్రతయు హెచ్చి కథలోని యంతశ్శక్తిని పరిణతి నొందించినది.

ఈ ధర్మవీరచరిత్రద్వయము మార్కండేయమహాపురాణమూర్తికి పాదద్వయిగా నిలిపి పురుషార్థధర్మప్రబోధప్రధానమగు పురాణవ్యక్తిత్వమునకు సుస్థిరస్థితినిఁ గల్పించినాఁడు మారనమహాకవి.

ఇట్లు మారన సంస్కృతమార్కండేయపురాణకథలను తెలుఁగున శిల్పసుందరములుగాఁ దీర్చిదిద్దినాఁడు. సంస్కృతపురాణకర్తకు కథాతాత్పర్యమును, ధర్మార్థప్రబోధమును లోకమున కందించుటయే ముఖ్యము. అందుల కాతఁడపూర్వకల్పనాశక్తితో కథలను భావించెను; ప్రపంచించెను. కాని, తత్కథాకథనమున సుందరములును, సాభిప్రాయములు నైన శబ్దార్థములతో సారవంతముగఁ జెప్పవలెనని యత్నించుటకంటె సర్వజనసులభగ్రాహ్యమును, ప్రవాహవేగతుల్యమును నైన సరళశైలిలోఁ జెప్పవలె నని యత్నించెను. అట్లు చెప్పుట సంస్కృతపురాణవాఙ్మయమునందుఁ గానఁబడు సర్వసాధారణలక్షణము. మారన యట్టి పురాణకథలను కావ్యరచనామయమైన ప్రతిభతో సమాధిగతమైన బుద్ధితోఁ బఠించి, భావించి, వివేకించి, మధురతర మొనర్చి, ప్రత్యంశసార్థకదృష్టితో మథించి, సమగ్రకథార్థములం దొక యేకత్వమును, అఖండత్వమును, పరిపూర్ణత్వమును దర్శించి, రసోదంచిత మైన శైలిలో వానినిఁ బునర్వ్యక్తీకరింప యత్నించెను. పురాణకథార్థములు పురాణము లయ్యును మారన పునస్సృష్టిలో నవ్యశిల్పసుందరములై పునర్భవించెను. అట్లుద్భవించిన కథలలోని విశేషసౌందర్యము మారన విశిష్టసృష్టి: దానినీ యధ్యాయమునఁ బరిశీలించుట యైనది.

# ఛందశ్శిల్పము

సంస్కృతభాషనుండి యనువదింపఁబడిన యితిహాసపురాణకావ్యములందు తెలుఁగు కవులు తమసొంత మని ప్రధానముగాఁ జెప్పుకొనఁగలిగినది ఛందము. అట్లే మార్కండేయపురాణానువాదమున వెలయించిన ఛందస్సంపదయంతయు మారనప్రతిభాసంపాదితము :

కావ్యమునకు ఛందము గుండె వంటిది. గుండె రక్తప్రసారకేంద్రము. లయబద్ధమైన చైతన్యస్పందనము దానికి సహజలక్షణము. తాను చైతన్యరూపమై దేహమును చైతన్యవంతముగా నుంచుశక్తి దానికిఁ గలదు. చిత్తావస్థల కనుగుణముగ గుండె స్పందించును. క్రోధోత్సాహాదులందు దానిస్పందనము ద్రుతముగ నుండును; రతిహాసాదులందు మధ్యముగ నుండును; శోకదైన్యాదులందు విలంబితమై యుండును. అట్లే కావ్యమున కవిపాత్రాదులచిత్తావస్థలను వ్యంజించునట్లు ఛందోగతి వెలయుచుండును. శబ్దార్థములు కావ్యశరీరము; తచ్ఛరీరచైతన్యహేతు వగు రక్తప్రసారమునకు కేంద్రము ఛందము. ''ఛందోహీనో న శబ్దోఽస్తి, న చ్ఛందః శబ్దవర్జితమ్''[1] అను భరతోక్తి కిదియే పరమతాత్పర్యము. శరీరమునకును,హృదయచైతన్యమునకును మూలశక్తి యాత్మ. అట్లే శబ్దార్థములకును, ఛందమునకును మూలశక్తి రసము. తద్వ్యంజనమే వాని పరమార్థము :

ఛందము కావ్యరసవ్యంజక మనుటలో విమర్శకులకు భిన్నమైన యభిప్రాయములు కలవు. చంపకశార్దూలాదివృత్తములు లాక్షణికప్రోక్తము లైన రసభావములందే కాక వివిధరసభావములందును వాడఁబడుచున్నవి కావున రసభావప్రకటనమునకును, ఛందఃప్రయోగమునకును సంబంధ మంతగా లేదని కొందఱిమతము. ఛందోనామములు వానిస్వభావములను వ్యంజించుచుండు ననియు, కొన్నికొన్నివృత్తములు కొన్నికొన్ని రసములందుమాత్రమే ప్రయోగింప నర్హము లైన వనియు కొందఱిమతము. ఇందు రెండవది ప్రాచీనలాక్షణికసమ్మతము. ఈమధ్య డా. పాటిబండ మాధవశర్మగారు 'మహాభారతమునందలి ఛందశ్శిల్ప' మను తమసిద్ధాంతవ్యాసమున సంస్కృతాంధ్రాంగ్లచ్ఛందస్సిద్ధాంతములను, శరీరజీవమనస్తత్త్వశాస్త్రసిద్ధాంతములను సమన్వయించి ఛందోరససంబంధమును నిరూపించిరి. వారిమాటలలో-

1. భరతుని నాట్యశాస్త్రము - 14 అధ్యా. 44 శ్లో.

''ఛంద మనఁగా ఇచ్ఛ. అది సృజనాత్మకమైన చైతన్యస్పందము. వక్తృచైతన్యస్పందమే వాక్యోత్పత్తికిఁ గారణము. కారణగుణములు కార్యమున లక్షింపఁబడును. వాక్యము వక్త్రిచ్ఛాపరతంత్రము గనుక వక్తృచ్ఛందమే వాక్యచ్ఛందము. ఛందమందలి యక్షరములు, వానిగౌరవలాఘవములు, వానిసంఖ్యాక్రమములు – సర్వము వక్తృచిత్తవృత్తివివర్తములు. కనుకనే తచ్చిత్తవృత్తివ్యాప్తము లై తద్వ్యంజకము లగుచున్నవి. వాక్యమందలి సర్వాంగములు విశిష్టధర్మములు గల పదార్థములు. వానిచే వ్యంజింపఁబడు వక్తృచిత్తవృత్తియే పరమార్థము''.

''ఛందము శ్రవ్యము కావవచ్చును, అశ్రవ్యము కావచ్చును. గాయత్రము కావచ్చును. కాకపోవచ్చును. వక్తృచైతన్యవృత్తిని వ్యంజించుట మాత్రము దాని పరమధర్మము. ఆధర్మమును నిర్వహించుటకే దానికి కావ్యాంగతాగౌరవ మొసఁగఁబడినది. ఛందఃకర్మయందు కవి చేయు శిల్పమంతయు శ్రవ్యతామాత్రసిద్ధికొఱకుఁ గాదు. కావ్యచైతన్యవర్తనము వ్యజించుటకొఱకు. వాక్యార్థాభినయము ఛందముయొక్క కర్తవ్యము. కావ్యార్థభావనాపరతంత్రుఁ డై కవి ఛందములు శిల్పించును. కవి యన్మయుఁడో అతని ఛందములు తన్మయములు. కనుక వాక్యచ్ఛందమున దర్శింప వలసినపరమార్థము వక్తృచ్ఛందము. స్వచ్ఛందానురోధముగ వక్త వాక్యార్థము నాచ్ఛాదించును. ఆచ్ఛాదించుటయందలి గోపన, దీపనాహ్లాదనాదిప్రయోజనములు వక్త్రిచ్ఛాధీనములు. బహుముఖప్రయోజన మైన ఛందమును కవి యథారుచి, యథాశక్తి, యథౌచిత్యము కావ్యమునఁ బ్రయోగించును.''[2]

''ఒక్కొక్కరసము పోషింపఁబడు దశాంతరములందు వేలువేలు వ్యభిచారిభావములచే సంకర మగుచుండును. రసమునకు రసాంతరములు అంగము లగుచుండును. విరుద్ధావిరుద్ధభావముల నిమజ్జనోన్మజ్జనాది దశాంతరములందు రసస్థితి యనంతవిధములుగా నుండును. మధురములైన భావములందు దీప్తములు, పరుషములునైన భావాంతరములు సంక్రమించినప్పుడు, సుకుమారములు, ఆర్ద్రములు నైన భావములు సంక్రమించినప్పుడు హృదయవర్తనము భిన్నభిన్నముగా నుండును. ఉద్బుద్ధమైన స్థాయి విరుద్ధావిరుద్ధసంచారిభావములచే సంకరమై పర్యంతమున రసత్వము పొందుటకు అనంతములైన దశాంతరములను బ్రాపించును.''

''రసవ్యవహార మింత క్లిష్ట మైనప్పుడు ఈరసమునకు ఈవృత్తము అనుకూలము అని నిర్దేశించుట యసాధ్యము. కనుక ఛందములయొక్క వస్తురసభావాదివ్యంజకతాసామర్థ్యము వృత్తనామేతర మైన ఛందోధర్మము నాశ్రయించి యుండు ననుట యుచితము. ఆధర్మము ఛందోవృత్తి యనియు, నానావిధములైన చందోవృత్తులు నానావిధములైన ఛందోగుణములచే సంక్రాంతములై నానారసభావవ్యంజనాసమర్థము లగు ననియు భావించుట సమంజసము.'' [3]

2. ఆం. మ. భా. ఛం. శిల్పము. పుట. 29-30.

3. ఆం. మ. భా. ఛం. శి. పుట. 138-139.

"నానారసభావముల నానావస్థాంతరములను సుష్ఠుగా వ్యంజించుటకుఁ దగిన యంగప్రత్యంగనిర్మాణసౌష్ఠవము ఛందములకు సమకూర్చుటకు కవి ఛందోఽంగపరిజ్ఞాన సౌష్ఠవము గలిగియుండవలయును. అంగప్రత్యంగముల సముచితసన్నివేశముచే స్వధర్మ నిర్వహణదక్షము లగునట్లు ఛందములను నిర్మించుటయే కవియొక్క ఛందఃశిల్పము." 4

శ్రీశర్మగారు ప్రతిపాదించిన ఈవిశిష్టమార్గముచే మహాకవులు రచించిన ఛంద ములయొక్క ప్రయోగసార్థక్యమును విమర్శించుట కొకనూతనపద్ధతి లభించినది. ఛందమును గణములు లెక్కించి చేయు స్థూలమైనవిమర్శకు స్వస్తిచెప్పుటకు వీలు కలిగినది. ఛందమునఁ బ్రయోగింపఁబడిన వర్ణాదివృత్తపర్యంతమైన ఛందోంగములచే వ్యంజింపఁబడు రసభావప్రపంచమును దర్శించు నవకాశము లభించినది. అక్షరాశ్రితగణ విభాగముకంటె మిన్నయైన పదవాక్యగతసహజవిరామాశ్రితమైనగణవిభాగ సందర్శనము చేసి, వాని యారోహణావరోహణగతులను, ద్రుత, మధ్యమవిలంబితగతులను వివేకించి, వానివెనుక నున్న కవికావ్యపాత్రాదులచిత్తవృత్తులను భావించి ఛందశ్శిల్పవిమర్శనము చేయు నొకపద్ధతి యావిష్కరింపఁబడినది.

తిక్కనశిష్యత్వమున మారన ఛందశ్శిల్పతత్త్వము దర్శింపఁగల ద్రష్ట యైనాఁడు. మార్కండేయమున స్వీయప్రతిభావివేకములచే రసభావవ్యంజకములుగా ఛందములను నిర్మింపఁ గల ద్రష్ట యైనాఁడు. అతని ఛందశ్శిల్పమందలి పరమౌచి త్యము భావించుటయే యీయధ్యాయతాత్పర్యము !

## విశేషచ్ఛందములు :

### 1. దండకము :

ఆంధ్రమహాభారతమునందు వలెనే మార్కండేయపురాణమునందును దండక మొకటి మాత్రమే కలదు. అందు మాయాకిరాతరూప ముజ్జగించి పరమేశ్వరుఁడు ప్రత్యక్షము కాగా పాశుపతాస్త్రార్థియైన పార్థుఁ డాదేవదేవుని స్తుతించినఘట్టమున రచింపఁబడఁగా నిందు శుంభనిశుంభవధానంతరము వైష్ణవశక్తిరూపిణి యైన దుర్గను ఇంద్రాదిదేవతలు కీర్తించుసందర్భమున రచింపఁబడియున్నది. స్తుతిహేతువు లేవైనను స్తుతిప్రయోజనము మాత్రము దైవప్రసాదమే. అందీరెండుదండకములకును సామ్యము కలదు.

నన్నయభట్టారకుఁడు సంస్కృతలాక్షణికప్రోక్తము లైన దండకలక్షణముల ననుసరించుటలోఁ గొంత స్వాతంత్ర్యమును బ్రకటించి నూటముప్పదియాఱు తగణము లపై నొకగురువును నిలిపి, దండకమును విరచించెను. నన్నయపద్ధతి నాంధ్రకవిలా క్షణికులు ప్రమాణముగా గ్రహించిరి. మారన మహాకవియు నన్నయవలెనే తగణదండ కమును రచించెను. అందు 268 తగణములును, ఒకగురువును గలవు. అందలి తగణబహువారావృత్తి సురముఖ్యుల చిత్తవృత్తిని వ్యక్తము చేయుచున్నది.

4. ఆం. మ. భా. ఛం. శి. పు. 39.

విద్వేషవిధ్వంసనమువలన సురలహృదయములందు హర్షము వికాసరూపమున వ్యాపించి తనువులకుఁ జారవశ్యము గలిగించుచున్నది. తద్ధేతువైన దేవిపై వారికి భక్తి భావము పొంగులువారినది. రౌద్రరూపిణియై యున్న దేవిని ప్రసన్నగా నొనర్ప కౌతూహలము వారికిఁ బొటమరించినది. హర్షభక్తిభావములు విలంబితమధురవృత్తులు. కుతూహలము ద్రుతగతి. ఈవృత్తిక్రమము నక్షరత్రయమున ముద్రించుకొనినది తగణము. కావున మారన తగణావృత్తిగల దండకమును నిర్మించి శిల్పమర్యాదను బాటించెను.

భగవద్గుణకీర్తనప్రధానమైన దండకమును మారన భక్తిరసానుకూలముగా నలంకరించెను. భక్తిరసభావములకు శతకములు, స్తుతులు మొదలగునవి యాటపట్టులు. వాని యందు మకుటము పాటించుట సర్వసాధారణము. మారన యాలక్షణమును దండకమునఁ బ్రవేశపెట్టి రక్తిఁగట్టించెను. "నారాయణీదేవి! మ్రొక్కెద న్నెకొమ్ము" అనునది యీదండకమునందు బహువార మావృత్తమైన మకుటము. అది దేవిచిత్తమునందలి రౌద్రోద్రేకమును బ్రశమింపఁజేసి ప్రసాదసుఖమయచిత్తవృత్తిని గలిగింపఁజేయుశక్తిఁ గల భక్తిభావసమ్మోహనాస్త్రము! తగణచతుష్టయవ్యాపియైన మకుటము సురగణచిత్తము లందలి సుస్థాపితభక్తిభావమునకు మకుటప్రాయము!

దేవతలహృదయములందలి క్రమవికాసరూపమున వ్యాపించెడి భక్తిభావమును మారన అష్ట, దశ, ద్వాదశ, త్రయోదశ, షోడశాష్టాదశ ద్వావింశద్గణపరిమాణ వాక్య సముదాయములచే దండకమున వ్యంజింపఁజేసెను.

## 2. స్రగ్విణి :

రగణచతుష్టయవిశిష్టమైన పాదచతుష్టయము గల వృత్తము స్రగ్విణి. "రగణైక నిర్మితమైన స్రగ్విణి అఖండతరంగమాలాడోలనమును బోలిన ధీరవిలంబనగతి కలది. డోలాగతివలె నిద్రపుచ్చులక్షణము కలది. ఉద్విగ్నచిత్తమును మందీకరించి ప్రసన్నము చేయునది ...... ఏకగణకృతమైన వృత్తమున గతిసామ్యము స్వతస్సిద్ధము. సమగతియైన వాక్యశ్రవణము శ్రోతచిత్తమున సమతను బ్రతిష్ఠింప సమర్థమగును. సమస్పందియైన హృదయము ధీమహత్వసంధాయకము"[5] అని ఛందోమర్మజ్ఞుల యభిప్రాయము.

మార్కండేయపురాణమున మహాభారతమునందువలె రెండు స్రగ్విణీవృత్తములు రచింపఁబడినవి. అం దొకటి తృతీయాశ్వాసమున మదాసల యలర్కునకుఁ గర్మమార్గ ముపదేశించు సందర్భమున రాజధర్మప్రబోధమున కేర్పడినది.

స్రగ్విణి : స్థానవృద్ధిక్షయజ్ఞానసంపన్నుఁడు
స్థానషాడ్గుణ్యమంత్రప్రవీణుండు నై
మానవేంద్రుండు గామ్యవ్యపేతాత్మకుం
డైన నిర్జించు ఘోరాజి వీరారులన్. (3.129)

5. మహా. భార. ఛంద. శిల్ప. పుట. 307.

రెండవది పంచమాశ్వాసమున బలాకుఁ డను రక్కసుఁడు ఉత్తముని దనయింటి కాహ్వానించుచుఁ బలికిన స్వాగతవచనములు కలది :

స్రగ్విణి : నీవు నాయింటికి న్నేమ్మి నేతెంచుటన్
దేవ ! ధన్యుండ నైతి న్నను న్భృత్యునిం
గా విచారింపు మేకార్య మైనం దగన్
భూవరా ! పంపు మేఁ బొల్పుగాఁ జేసెదన్. (5.164)

ఇందు మొదటిపద్య ముపదేశవాక్యము; రెండవది స్వాగతవాక్యము : మదాలసాబలాకుల చిత్తములు రెండును తత్కాలమునందు ధీరవిలంబిత మధురవృత్తులై భాసించుచున్నవి. కావున స్రగ్విణీవృత్తములు విభావచిత్తవృత్తివ్యంజకము లగుచున్నవి. పైరెండును ఏక జాతివృత్తము లై యున్నను, వానిగతియందు స్పష్టమైన భేదము కానవచ్చుచున్నది. అది ప్రకరణోచితసార్థక్యముకొఱకు మారన కల్పించిన గతివిధానము :

మొదటిపద్యమునఁ బూర్వార్ధము సమాసఘటితము. తృతీయచరణము పాదమధ్య విరామము. చివరిపాద మలఁతియలఁతిపదములకూర్పు. మఱియును మొదటిపాదమునం దర్థాశ్రితపదవిరామముచే గల, గగ, లగ, గల, గగలగ లును, మిగిలినపాదములందు తగణబహువారస్ఫూర్తియును గలవు. వానివలన మదాలసచిత్తవృత్తియందలి క్రమోన్మీలితహర్షోత్సాహములను మారన వ్యంజింపఁజేసెను. మొదటిమూఁడుపాదములందును సంయోగపూర్వగుర్వక్షరములను, అంతమున దీర్ఘాక్షరములను నిబంధించుటచే రాజునకు జ్ఞానసంపత్తియు, మంత్రప్రావీణ్యమును, కామ్యవ్యపేతాత్మకత్వమును సాధించుట దుష్కరమనియు, తత్సిద్ధివడసినవానికి వీరారులను ఘోరాజులందు జయించుట సులభ మనియు సూచింపఁబడినది. వాయునిరోధాత్మకములైన హల్మైత్రియతులను త్రిపాదముల యందు సంధించి, యంతమున నిరాటంకవాయుప్రసారజన్యమైన అచ్మైత్రిని పాటించి మారన పైయంశమును దృఢతర మొనరించెను. ఇట్టిపద్యరచనము మదాలసాలర్కుల చిత్తవృత్తుల కుచితముగా నుండుటయే కాక ప్రతిపాద్యవస్తుస్వరూపసందర్శకముగా నుండుట విశేషము :

బలాకునియత్యంతహర్షోత్సాహములకుఁ బ్రతిబింబము ద్వితీయస్రగ్విణీవృత్తము. ఉత్తముఁ డనిన బలాకున కత్యంతభక్తి. ఆభక్తిభావ ముత్తరంగిత మై వెల్లివిరిసినట్లు పద్యగతికి సహజమైన రగణబహువారావృత్తిని మారన పోషించెను. బిందుపూర్వకవర్ణ బహుళప్రయోగము, అనునాసిక మగు నకార మధికముగా ననుసంధింపఁ బడుటయు నాదానవుని హృదయమందలి హర్షతరంగనాదములను బద్యబంధమున వ్యంజించుచున్నవి. సమపాదములు రెండును సంబుద్ధితో నారంభమగుట యొకవిశేషము. అతిథిగా విచ్చేసిన ఉత్తముని "దేవ !" యని సంబోధించి "అతిథి దేవో భవ" యను న్యాయమును, "భూవరా !" యని పిలిచి ప్రభుమర్యాదను బలాకుఁడు ప్రపంచించినాఁడు; షోడశరగణావృత్తి రూపమైన ఛందముతో నతఁడు షోడశోపచారపూజను ఛందస్సుందరముగా నిర్వహించినాఁడు !

### 3. ఉపజాతి :

ఉపజాతి మిశ్రవృత్తజాతికిఁ జెందినది. తిక్కన మహాభారతమునం దొక్క యుపజాతివృత్తమును రచించెను. అందు ప్రథమతృతీయపాదము లుపేంద్రవజ్రాసంబంధులు; ద్వితీయచతుర్థపాదము లింద్రవజ్రాసంబంధులు. ఇట్టియుపజాతివృత్తమును సంస్కృత లాక్షణికులు "విపరీతాఖ్యానకి" యని పిలిచిరి. మారనమహాకవి తిక్కనసోమయాజివలెనే యుపజాతి నొకదానిని రచించెను. కాని, తిక్కనవలె నిర్వేద మను వ్యభిచారిభావ వ్యంజకముగా గాక యుపాఖ్యానఫలశ్రుతిగా మారన నిబంధించెను.

ఉపజాతి : స్వరోచిజన్మంబును వర్తనంబున్
స్వారోచిషాద్యప్రభవంబు విన్నన్
నరుండు నిత్యోన్నతి నవ్యకీర్తి
శ్రీరమ్యుఁ డై ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కున్. (5.105)

ఇది స్వారోచిషమనుసంభవకథాశ్రవణఫలశ్రుతి. ఫలశ్రుతియందు రసభావములకు తావు లేదు. కాని, మారన ఉపజాతివృత్తము నీయుపాఖ్యానపాదపీఠిగా నిలిపి, యుపాఖ్యాన స్వభావమును వ్యంజింపఁజేయఁ దలపెట్టెను. ఉపజాతి మిశ్రజాతి. విభిన్నజాతిలక్షణ ములకు విశ్రాంతిస్థాన మైన స్వారోచిషమనువుకథయొక్క ఫలశ్రుతి మారన తుల్యస్వభావము గల వృత్తమున రచించి ఛందశ్శిల్పమును బోషించెను.

### 4. లయగ్రాహి :

నన్నయ తిక్కనలు శృంగారకరుణాదులగు మధురరసముల యభివ్యక్తిని లయగ్రాహివృత్తములను మహాభారతమున వాడియున్నను మారనమహాకవి మార్కండేయ పురాణమున నీవృత్తమును రౌద్రరసానుగుణముగా రచించి యుండెను. ఎఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వశేషమాశ్వాసమునఁ గుంభకర్ణుఁడు రామలక్ష్మణులపై యుద్ధమున కేగుట నీవృత్తమునందు నిబంధించి యుండుటచే నీవృత్తము కవి యిచ్ఛ ననుసరించి యెట్టి రసమునందైన నుపయోగింప నర్హ మైనదిగా గ్రహింపవచ్చును.

తాళలయాన్వితమైన గతివిశేషముచే నిది లయగ్రాహి యని పిలువఁబడుచుండుట ప్రసిద్ధము. లయశబ్దమునకుఁ బ్రళయార్థముకూడ ప్రసిద్ధము కావున యుద్ధాదులందు శత్రుసంహారసందర్భమున రౌద్రరసానుగుణముగా నీవృత్తము వాడవచ్చు నని మారన ప్రయోగమువలనఁ దెలియ నగుచున్నది. మార్కండేయ పురాణషష్ఠాశ్వాసమునందు రక్తబీజదనుజతనువిదళత్కీలాలమునుండి జనించిన యసురవ్రాతమును కాళి కరాళ ముఖగహ్వరము తెరచి మ్రింగెడి సన్నివేశ మీవృత్తమున నిబంధింపఁబడియున్నది.

లయగ్రాహి : స్థూలతనుకాళిమ విశాలలయకాలఘన
నీలరుచిజాలముల నాలిగొన నేత్ర
జ్వాలలను శూలకరవాలఘృణిమాలికలు
నోలిఁ దనమ్రోల శిఖిపోలిక వెలుంగన్

దూలి పదతాలహతిఁ జాల దివి గూలఁ గడు
వాలి మదలీల నవలీల విగళత్క-
లాల మొగిఁ గ్రోలుచుఁ గరాలగతిఁ గ్రాలుచును
గాళి దనుజాళి వెస నాలమున గ్రింగెన్. (6.184)

కాళికాదేవిరౌద్రవృత్తి వృత్తగత మైన దీర్ఘాక్షరజన్యమైన విలంబనగతినియతియందును, అసురతనువిగళత్క-లాలజాలమును గ్రోలెడియాత్రము లఘుబాహుళ్యమునందును వ్యంజింపఁబడుచున్నవి. సంయుక్తమహాప్రాణాదుల నీరౌద్రవృత్తియందు బహుళముగా వాడకుండుటచే మారన నిపుణముగా స్త్రైణమైనరౌద్రములో మిళితమైయుండెడి సహజ సౌకుమార్యమును స్ఫురింపఁజేసినాఁడు. యణ్ణులలోని లాక్షర-ప్రాసానువృత్తిచే ఛందము నలంకరించి దేవియొక్క-యంతస్థసారమును స్ఫుటీకరించినాఁడు. అఖిలదనుజరుధిరపానో ద్రిక్తయై విజృంభించిన దేవియాకృతిని విపులవృత్తము సూచించుచున్నది. ''పదతాళ హతి" నెఱపు దేవిరణక్రీడావిన్యాసమును వృత్తగతలయ పట్టియిచ్చుచున్నది. ''విశాల'' "కరాల'' వంటి జగణములవలన దేవి యుద్వేగవృత్తి స్పష్టమగుచున్నది. "ఆలమున గ్రింగెన్'' అనుపదముల యాద్యక్షరోచ్చారణగతము లగు ముఖవివరణసంవృతములను గ్రమముగాఁ గూర్చి గ్రింగెడిక్రియాకర్మను సూచించి వృత్తమును ముగించుట యొక శిల్పము. లయకాలఘనమేఘరూపిణి యైన దేవి శిఖిమాలికలవంటి మెఱుపులను వెదఁ జల్లుచు దివి నేలఁ గూలునట్లు వర్షించి లోకమునఁ బ్రళయజలముల ముంచి, లయింపఁజేసి నట్లు ముఖబిలమున రక్కసుల గ్రింగివైచె నను అర్థవిశేషమున నలంకారధ్వని కలదు:

## 5. మానిని:

భగణసప్తకముపై నొకగురువు గల మానినీవృత్తపాదము లవరోహణగతి నొప్పారుచుండును. మార్కండేయపురాణమున మారన యీవృత్తమును మూఁడుసార్లు వాడెను.

1. కందరవిద్యుద్రూపయుద్ధవర్ణనము. (1.37)
2. యమకింకరుఁడు వైదేహునకు- ఒక్కనిచేత నిమంత్రితుఁ డై మఱియొక్కని శ్రాద్ధమునందు భుజించిన పాపియు, సాధుజనుల మర్మముల దూఱనాడినపాపియు ననుభవించు నారకబాధలను నిర్దేశించి చెప్పుట. (2.94)
3. మదాలస యలర్కునకు ఎట్టివిప్రుని శ్రాద్ధభోక్తగా నిమంత్రితునిఁ జేయవలెనో నిరూపించి చెప్పుట. (3.186)

పైమూడుచోటులందును మారన మానినీవృత్తమును గ్రమముగా రౌద్రరసపోషణమున కును, బీభత్సదృశ్యవర్ణనమునకును, ధర్మోపదేశమునకును ఉపలక్షించి ప్రయోగించె నని స్పష్టమగుచున్నది. ఇందలి ప్రథమపద్యమునుగూర్చి ఆఖ్యానశిల్పాధ్యాయమున (పు.161) ముచ్చటింపఁబడినది.

పై రెండవమానినీవృత్తమునందు నారకబాధలను వర్ణించిచెప్పు యమకింకరుని యందు భాసించు చిత్తగతియొక్క యవరోహణావస్థ భగణబహువారావృత్తిచే వ్యక్తమగు చున్నది. ''భుజించి'' ''ఖగంబు'' ''జనంబు'' అను జగణములందు వాక్స్ఫూర్తిచే నా పాపులయం దావక్త కున్న ఏహ్యాభావము వ్యక్తమగుచున్నది. పరుషాక్షరద్విరుక్తప్రాస మానరకబాధలోని పారుష్యమును బట్టిచూపుచున్నది.

పూర్వనియుక్తుఁడైనభోక్త నియతినిఁ బాటింపమిచే యజమానిహృదయమునందు కాననగు విషాదోద్వేగములను గుర్వాదియు లఘుబహుళయు నగు భగణ బహువారావృత్తిచే యోగిమాత వ్యక్తముచేయుట పైమూడవపద్యమందలి చమత్కారము. చివరిరెండుపద్యము లందును శ్రాద్ధనిమంత్రణవిధిసామ్య ముండుటచే ఛందస్సామ్యము పాటించుట ఛందస్సం వాదశిల్పము.

మానినీవృత్తమున 6, 12, 18 అక్షరములపై యతి పాటింపవలె నను నియమము కొందఱులాక్షణికులు చెప్పియున్నను, భారతకవులు ప్రధానముగా 12వ అక్షరముపై నున్నయతినే పాటించిరి. తిక్కన యొకచో మూఁడింటిని పాటించెను. అట్లు మూడింటిని పాటించి ఛందస్సు నలంకరించి రసభావపోషణము చేయుట కవిస్వేచ్ఛపై నాధారపడి యుండునుగాని, 6, 18 అక్షరములపై నుండుయతులు నియతములు కావని కొందఱు ఛందశ్శాస్త్రజ్ఞులు భావించుచున్నారు. మారన దాని కనుగుణముగా నన్నిటియందును 12వ యక్షరముమీఁదియతినిఁ బాటించెను. తిక్కన భారతభాగమునందువలె మూఁడు మానినులనే పురాణమున విరచించి, మారన తిక్కనశిష్యుఁ డనిపించుకొనెను.

## 6. కవిరాజవిరాజితము :

మానినీవృత్తపాదములందలి మొదటిగురువును రెండుహ్రస్వములుగా మార్చినచోఁ గవిరాజవిరాజితవృత్త మగును. మారన కవిరాజవిరాజితము నొండు రచించినను, ప్రథమా శ్వాసమునఁ గందరవిద్యుద్రూపయుద్ధవర్ణనావసరమున సజాతీయములైన కవిరాజవిరాజిత మానినీవృత్తముల నొక్కచో నిబంధించి రౌద్రరసపోషణమును నిర్వహించెను. నన్నయ మహాభారతమునందు కణ్వాశ్రమవర్ణనావసరమున మానినీ, కవిరాజవిరాజితములను వెంటవెంటనే రచించి శృంగారశాంతరసానుకూల తటస్థవిభావములను వర్ణించియుండెను. మారన నన్నయక్రమమును విపరీత మొనరించి పరుషరసములను వ్యంజించెను. గరుడ వంశజుఁడైన కందరుఁ డను పక్షిరాజుయొక్క యుత్పత్తి కవిరాజ (పక్షిరాజ) విరాజిత వృత్తమున జగణస్ఫూర్తితో వివరించుట యుచితము. ఈయంశము ఆఖ్యానశిల్పాధ్యాయ మునఁ గొంత వివరింపఁబడినది. (పుట 161).

## 7. స్రగ్ధర :

మ-ర-భ-న-య-య-య- అనుగణములు ప్రతిపాదమునందునుఁ గల యీ వృత్త మాద్యంతములందు విలంబితగతియు, మధ్యమున ద్రుతిగతియుఁ గలిగి భరతాది

లాక్షణికులచే శృంగారకరుణబీభత్సవీరరౌద్రరసములందు ప్రయోగించుట కుపలక్షింపఁబడి యున్నది. మారనమహాకవి యీవృత్తమును వీరరౌద్రరసములందు మాత్రము ప్రయోగించెను. మార్కండేయమున వాడఁబడినస్రగ్ధరలు మూఁడు. అవి :-

(1) మార్తాండావిర్భావమునుగూర్చి చెప్పినయాకాశవాణివాక్యములను విని దేవత లుత్సాహమున దానవులతోఁ బోరికిఁ దలపడుట.

"ఆనందం బంతరంగం బయి మనముల నిండార నింద్రాదిదివ్యుల్
నానాసైన్యస్ఫురద్దానవుల ననికి సన్నద్ధులై విల్చి రా దై
త్యానీకంబు న్మహోత్సాహమున వెడలె దేవాసురశ్రేణి కయ్యెం
దా నంతం గయ్య ముద్యత్పటుతరశరజాతప్రభ ల్మింటఁ బర్వన్." (7.107)

(2) బలాశ్వుఁడు (కరంధముఁడు) ససైన్యుఁడై శత్రూత్కరముపై దాడి వెడలుట :-

"ఉత్సాహాడంబరం బత్యుపచితముగ శత్రూత్కరప్రాజ్యరాజ్యా
దిత్సావిష్టాంతరంగ ద్విగుణితరణ ముద్వీస్ఫురద్వీరశృంగా
రోత్సేకానాసవక్త్రం బుదితసకలచంద్రోపమశ్రీ వహింపం
దత్సైన్యశ్రేణితో నుద్ధతిఁ బురి వెడలె న్ధారుణీనాథుఁ డంతన్." (8.86)

పరిశీలించినచోఁ బైరెండుసన్నివేశములందును అసామాన్యసంఘటనమువలనఁ గలిగిన యసామాన్యోత్సాహము తుల్యముగా గోచరించుచున్నది కావున నీరెండుఘట్టము లందును స్రగ్ధరావృత్తమును నిబంధించుట జరిగిన దని సులభముగా నూహింపవచ్చును.

మొదటిపద్యమున బిందుపూర్వకవర్ణబాహుళ్యము, దీర్ఘాక్షరసమావేశము, రెండవ పద్యమున ఆగ్నేయమైన రకారముతో కూడిన సంయుక్తముల బాహువారప్రయోగము, సంయుక్తాక్షరపూర్వగురునిర్దేశము, బిందుపూర్వకవర్ణసమావేశము విభావచిత్తవృత్తుల కనుగుణమై శోభించుచున్నవి. వీరరసవ్యంజకమైన యోజోగుణ మీవృత్తద్వయమున భాసించుచున్నను పద్యబంధములు మొదటిదానియందు విరళముగా నారంభమై క్రమముగా గాఢబంధ మగుటయు, రెండవదానియం దుద్ధతముగా నారంభించి గంభీరముగా గమించి విరళాంత మగుటయుఁ గాంచ నగును. ఇం దొకశిల్పమర్మము నుపలక్షింపవచ్చును. ఆనందాతిశయమున నలవోకగా నాడుచు పాడుచు రణరంగమునకు వెడలిన దేవతలను దానవులు మహోత్సాహముతో డీకొనిరి. సురాసురులమధ్య పోరు ఘోరమైనది. పంతమునకు దిగి యిరువాగులవారును శరపరంపలు కురిపించుకొనిరి. కావున నీపట్టునందు క్రమోన్మీలితగాఢబంధమే యుచిత మగుచున్నది. ఇఁకఁ గరంధమునివక్షమున దీనికి విపరీతము. బలము చేకూరినంతనే యతనియందు నంగుప్తములై యున్న శత్రుగత మత్సరాదులు పురివిప్పి లేచినవి. ఆడంబరముగా సగర్వముగా నాదిత్సతో వెడలినాఁడు. అంబరమంతయు నిండి క్రిక్కిరిసియున్నబలమువలన నాతని కాత్మప్రత్యయ మేర్పడినది. విజయ మతని కనాయాసలభ్య మనిపించినది. అతఁ డలవోకగా శత్రువులమీఁదకు దాడి

వెడలినాఁడు. ఇట్టి భావక్రమమును పద్యబంధమునఁ బ్రచురించుటకు ఉత్తరార్ధవిరళబంధమే యోగ్యము కాఁగలదు. మారన విభావచిత్తవృత్తివ్యంజక మైన పద్యబంధరచనా నైపుణ్యము నిచ్చట ప్రదర్శించె ననుటలో విప్రతిపత్తి లేదు.

3. మారన యాడిబకయుద్ధవర్ణనావసరమున రౌద్రరసస్ఫూర్తి కనువుగా స్రగ్ధరావృత్తమును రచించెను.

''పత్రప్రోద్ధూతవాతప్రబలరయమున న్బర్వతశ్రేణి దూలన్
గాత్రోద్యత్సాంద్రదీప్తు ల్గగనము దిశలు న్గప్పుచుండంగఁ జంచ
న్నేత్రప్రాంతంబులం దగ్నికణము లురల న్వీఁక నొండొంటిఁ దాఁకె
న్బత్రిద్వంద్వంబు లోకప్రకరము దలర న్భైరవాటోపలీలన్.'' (2.10)

"వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్''[6] అని కాత్యాయనోక్తిగా అభినవగుప్తులు చెప్పినలక్షణము ననుసరించి, వీరభుజదండవర్ణనమునందు స్రగ్ధరావృత్తము ప్రయోగింపఁ దగినది. ఇచ్చట వసిష్ఠవిశ్వామిత్రమహర్షు లమర్షావేశావిష్టులై యాడిబకరూపములను దాలిచి పోరునకుఁ దలపడినదృశ్యము వర్ణ్యవస్తువు. ఇందు పత్త్రిద్వంద్వము విభావము. "పత్త్రి'' యనుటచే నాపక్షులపక్షదైర్ఘ్యపాటవములు సూచితములు. పద్యము "పత్త్రిప్రోద్ధూత వాత" వర్ణనముతోడనే ప్రారంభ మగుట దాని కుపబలకము. స్రగ్ధరావృత్తనిర్మాణమునకును, పక్షిస్వరూపనిర్మాణమునకును సామ్యము కలదు. ఆద్యంతములు దీర్ఘాక్షరబహుళమై మధ్యమున లఘుబహుళ మగు నీవృత్తము బాహుతుల్యములైన దీర్ఘపత్త్రములతో నొప్పారు పత్త్రిద్వంద్వస్వరూపసాక్షాత్కారమును గల్పింప సమర్థ మగుచున్నది.

పరుషతకారరకారసంయుక్తమైనదుష్కరప్రాసము పత్త్రిద్వంద్వరణకర్కశత్వమును, రౌద్రోద్రేకమును వ్యంజించుచున్నది. ప్రతిపాదపూర్వార్ధమునందును బునరావృత్త మగుచున్న రకార సంయుక్తాక్షరము లాప్రాసశక్తిని బోషించుచున్నవి. వృత్తపాదములందు పదునాల్గవయక్షరము మీఁద నుంచఁబడిన యతులన్నియు విరామశోభితము లయ్యు ద్రుతసంశ్లేషాక్షరము లగుటచే నాపక్షిద్వయమునందు ద్రుతమువలె జారిపోఁదగిన క్రోధాదులు లోపింపక అన్యభావములచే సంశ్లిష్టములై ద్విగుణీకృతము లగుచున్నవని మారన వ్యంజింపఁజేసెను. ప్రథమతృతీయపాదములందును ద్వితీయచతుర్థపాదములందును ద్విప్రాస నిబంధింపఁ బడుట యీవృత్తమునందలి మఱియొక విశేషము. ఇందలి వ్యతిక్రమము పత్త్రిద్వయచిత్తవృత్తివ్యతికరమును వ్యజించుచున్నది. పక్షియుద్ధమునందు వినఁబడెడి నాదప్రతినాదములు బిందుపూర్వాక్షరవిన్యాసముచే సూచింపఁబడుచున్నవి. పాదచతుయమునందు తుల్యపదబంధనివేశన మొనర్పఁబడి యుండుటచేఁ బత్త్రిద్వంద్వమునందు సమముగా దీపించుచున్న రౌద్రోద్రేకము వ్యంగ్య మగుచున్నది. "రౌద్రే స్రగ్ధరాదయః"[7] అను భోజరాజమతమున కీవృత్తము లక్ష్యభూత మగుచున్నది.

---

6. నాట్యశాస్త్రము, xiv. పుట 246.

7. కావ్యానుశాసనమున ఉదాహృతము. పుట 336.

క్షేమేంద్రుఁడు "సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా"⁸ అని చెప్పిన నియమము ననుసరించి సావేగచిత్తవృత్తిని గాని, పవనాదిపంచభూతవిజృంభణమును గాని వర్ణించునవసరమున స్రగ్ధర ప్రయోగింపఁ దగు నని స్పష్టమగుచున్నది. మారన యీ వృత్తమున రౌద్రోద్వేగచిత్తవృత్తులను వ్యంజించుటయే కాక పత్రవాతోద్ధూతవాతరయమున మహాపర్వతశ్రేణి తూలుటయు, గాత్రకాంతిచ్ఛటలు దిశాభాగములఁ గప్పుటయు, నేత్రములనుండి యగ్నికణము లురలుటయుఁ బేర్కొని లోకప్రకరములు సంక్షోభపడినవని వర్ణించెను. క్షేమేంద్రమతానుసారము ఈవర్ణ్యవస్తువునకు స్రగ్ధరయే తగినవృత్తమని గమనించుట సులభము ।

## 8. మహాస్రగ్ధర :

స్రగ్ధరావృత్తపాదప్రథమగుర్వక్షరములను రెండులఘువులచొప్పున మార్చినచో మహాస్రగ్ధర యగును. కావున పద్యగతియందు రెండింటను బెద్దవ్యత్యాసము కానరాదు. కావున మహాస్రగ్ధరయు, స్రగ్ధరవలెనే వీరరౌద్రాదిరసవ్యంజకమై యొప్పుననుట తాత్పర్యము ।

మారన మార్కండేయమున నీవృత్తముల నాఱింటిని వాడెను. ఉత్సాహామర్ష హర్షోద్వేగాదులను వ్యంజించుట కావృత్తములను బ్రయోగించెను.

1. హర్షోత్సాహములు.
   - (i) ధర్మపక్షు లాకసమున కెగయుట. (1.59)
   - (ii) వత్సంధ్రునిచేఁ గుజంభుఁడు నిహతుఁ డగుటకు దేవతలు హర్షించుట. (7.275)
   - (iii) మరుత్తుఁడు విజయోత్సాహమునఁ బురి నూరేగుట. (8.275)
2. ఉత్సాహము :
   - (i) అదితి నియతితో నాదిత్యునిగూర్చి తప మొనరించుట. (7.90)
3. ఉద్వేగోత్సాహహర్షములు :
   - (i) అశ్వతరుఁడు శివునిఁ గాంచుట. (3.52)
4. రౌద్రోద్రేకము :
   - శుంభనిశుంభులు దేవిపై విజృంభించుట. (6.192)

ధర్మపక్షులు మార్కండేయపురాణప్రవక్తలు. శమీకమహామునిదయాప్రవర్ధితులైన యాపక్షులు మాసత్రయానంతరము నిజజవసత్వస్ఫూర్తులు వెలయ నాకసమున కెగసిన ఘట్టము మొదటిపద్యము. ఇందు పక్షులహర్షోత్సాహములు వ్యంజింపఁబడుచున్నవి. ఏతద్వివరణము ఆఖ్యానశిల్పాధ్యాయమునఁ జేయఁబడినది. (పుట. 164)

"సవిత్రుం దేజోభిరాము న్సకలమునిజనస్తవ్యుఁ బ్రత్యక్షమూర్తిన్
దివిజేంద్రారాధనీయు న్దినకరుఁ ద్రిజగద్దీపకు న్విశ్వవంద్యున్

8. సువృత్తతిలకము. 3.22

రవి నారాధింపఁ జొచ్చె న్మతి నదితి ప్రయత్నంబుతోడ న్నిరాహా
రవిధిస్వీకారనానావ్రతనియమధురారమ్య యై సంతతంబున్." (7.90)

దానవులచే నపహృతరాజ్యు లైన నిజసుతుల కభ్యున్నతి సాధింపఁ దలఁచి యదితి దివాకరునిఁగూర్చి తప మొనరించినది. సుతదైన్యావస్థకు మాతృహృదయము దుఃఖితమును ఉద్వేగవంతమును నైనది; పైగా సవితృదేవతాప్రార్థనాదికమునందు భక్తిభావమును, నియతవ్రతదీక్షయం దుత్సాహమును భాసించి, యామెచిత్తవృత్తియందు మధురవిలంబితవృత్తితోఁ గూడిన ద్రుతదీప్తి కనుపించుచున్నది. దానిని మారన మధ్యమగతి గలదియు, గురులఘుసమనివేశితపాదములు కలదియు నైన మహాస్రగ్ధరయందు వర్ణింప సమకట్టుట సమంజసము. రౌద్రాదులయందు భాసించు విశుద్ధోజోగుణదీప్తిని మందీకరించి వృత్తపూర్వార్ధమున సూర్యగుణకీర్తనరూపభక్త్యుత్సాహమును వ్యంజింపఁ జేసెను. ఉత్తరార్ధమున నలఁతియలఁతిపదములతో ప్రారంభమై దీర్ఘసమాసబంధురముగాఁ బరిణమించిన వృత్తపాదములు స్వప్రయత్నకృత తపశ్చర్యాదికమును, సంతతవ్రతనిష్ఠాశీలమును గ్రమముగా వ్యంజింపఁజేయుచున్నవి. స్త్రీవృత్తిసహజమైన మాధుర్యమును – "నిరాహారవిధిస్వీకారనానావ్రతనియమధురారమ్యయై" యను సమాసమునందలి కర్తనశీలము లైన రవర్ణములతో ననునాసికము లైన నమవర్ణములనుఁ జేర్చుట వలననే కాక నియమధురా "రమ్యమై" యని వర్ణించియు మారన వ్యక్తీకరించెను.

ప్రత్యక్షమూర్తి యైన సవితను నారాధించుటయందలి అదితి భక్త్యుత్సాహోద్వేగము లిచ్చుట మహాస్రగ్ధర యైనట్లే కువలయాశ్వోపాఖ్యానమున మదాలసను బునరుజ్జీవితగాఁ బొంద సమకట్టి వాణీప్రసాదలబ్ధసంగీతసాహిత్యప్రాభవముతో మహేశ్వరుని భజించి మెప్పించి కామితార్థము సాధింపఁదలఁచిన యశ్వతరునిచిత్తవృత్తియందలి భక్త్యుత్సాహోద్వేగము లతనిచే దర్శింపఁబడిన శివమూర్తిని వర్ణించుటలో మహాస్రగ్ధరావృత్త మైనవి.

" శ్రుతికాంతావక్త్రపద్మస్ఫురితబహువిధస్తోత్రసవ్యార్థజాతో
ద్గతవైచిత్రీనిమగ్నాత్మకు సురమునిగంధర్వవిద్యాధరేంద్రా
ర్చితపాదాంభోజుఁ గాంతిశ్రితృదశశతదృక్పతిబ్రహ్మసేవా
సతతప్రేమాత్మచేతోజనితఘనదయాశాలిఁ జంద్రార్ధమౌళిన్." (3.53)

సావేగ మైన చిత్తవృత్తి మహాస్రగ్ధరయందు వర్ణింపఁబడుట క్షేమేంద్రమతము. అమూలక మైన యీపరమేశ్వరవర్ణనము ఉదాత్తవస్తువర్ణనాత్మక మై విస్తృతవిశేషవృత్త మహత్వమును జాటుచున్నను, తద్వర్ణనమునం దశ్వతరుని చిత్తవృత్తి వ్యంజించుటయే మారనయభిమతము. విగతజీవ యైన మదాలసను బ్రతికించుట యసాధ్య మైన విషయము. అసాధ్యకార్యసాధనమున నశ్వతరునిచిత్త ముత్సాహముతో నిబిడమై యున్నది. పరమేశ్వరదయాలబ్ధినిగూర్చి చిత్తము సావేగమై యున్నది. శివదర్శనమున నుత్సాహము నధికరించిన యావేగము భాసించుట సహజము. మారన తచ్చిత్తవృత్తివ్యంజకముగా నిర్విరామచ్ఛేద మగు ఛందమ్మున ఛందమ్మును నిర్మించెను. "స్రగ్ధర అసంఖ్యాతవిశ్రామ

మైనచో శోభించు నని క్షేమేంద్రుఁ డనెను. ఏదేనియక్షరములకు స్ఫుటమైన విచ్ఛేద ముండినచో స్రగ్ధరయొక్కగతి స్పష్టముగా నుండు ననుట సత్యము. కాని, విచ్ఛేదనియతి తెలుఁగున లేదు. విశేషించి వృత్తమును స్వస్వరూపముతోఁ బ్రదర్శించుటయందు శిల్పము లేదు. దానిని రసోచితమైన తీరున భిన్నగతుల నడిపించుటయందే కవినైపుణ్య మున్నది. విచ్ఛిన్నములైన ఖండములను కలిపి కుట్టి యఖండపాదముగా నిర్మించుటయు వ్యంజ కతాదృష్టిచే నిర్మాణశిల్పమే'' యనెడి డా. పాటిబండ మాధవశర్మగారి వచనము లిచ్చట స్మరింపఁదగినవి.

ఉరగహతు లైన మునులను సజీవు లగునట్లు తన ప్రతాపమహిమను వెలయించి మరుత్తుఁడు లబ్ధయశస్వి యై రాజధానీనగరమునకు హర్షోత్సాహదీప్తితో తిరిగివచ్చి, తన వైభవ మెల్ల నుల్లసిల్ల, వనిత లక్షతప్రకరములు సల్ల రాజవీథి నుత్సవమున వెడలుట యీక్రిందిమహాస్రగ్ధరావృత్తమున వర్ణితము.

"భవనప్రాసాదహర్మ్యోపరితలవిలసద్బాలికాలోచనోద్య
ద్ధవళాంశుశ్రేణితోడ న్దనపయి సితముక్తాసమేతాక్షత ల్ప
ర్వ వరిష్ఠుం డామరుత్తావనిపతి చనియె న్వైభవ ముల్లసిల్ల
న్వివిధాలంకారశోభావిభవవిరచనావిస్ఫురద్రాజవీథిన్''. (8.275)

ఇందు విజయోత్సవము వస్తువు. మహావీరగౌరవరూపమైన పురజనహర్షోత్సాహ సంరంభము వర్ణ్యము. నాయకుఁ డైన మరుత్తుఁడు ''వరిష్ఠుఁడు''. అనఁగా మారన తద్విశేషణముచే శ్రేష్ఠుఁ డనియు, విశేషించి తరుణవయస్కుఁ డనియు చెప్పుచున్నాఁడు. వృత్తపూర్వార్ధమున భవనోపరితలవిలసద్బాలికాలోచనోద్యద్ధవళాంశుశ్రేణిని సితముక్తా సమేతాక్షతలతోఁ గలిపి సహోక్త్యలంకారసుందరముల నొనర్చి తరుణవయస్కుఁ డైన ప్రభువుపైఁ జల్లినట్లు చెప్పఁబడినది. కావున హర్షోత్సాహసమన్విత మైన యీదృశ్యము నందు కించిచ్ఛృంగారస్ఫూర్తియుఁ గలిగి కించిత్‌మధురవృత్తి కాస్కారము కలిగించు చున్నది. లకారానుప్రాసశోభిత మైన యీభాగ మావృత్తిని వ్యంజింపఁజేయుచున్నది. వృత్తోత్తరార్ధమున నవనీపతి వైభవవ్యంజక మైన వివిధాలంకారశోభావిభవమైన రాజవీథి వర్ణితము. విలసద్రాజవీథి పురజనులచే రాజు వరిష్ఠుఁ డని భావింపఁబడుటకుఁ బ్రతీక. నరపతి గమనవర్ణనాత్మక మగు తృతీయచరణమును నాతిసమాసముగను, పదవిరామ బహుళముగను నిర్మించుటవలన రాజపురవీథిగమనము మందమందముగ సాగిన దనియు, నతనిచిత్తవృత్తి సుఖకరవిశ్రాంతి కాకర మైన దనియు స్పష్ట మగుచున్నది. పురవీథి వర్ణనాత్మకమైన చతుర్థపాద మేకసమాసఘటిత మగుటచేతను, ప్రాసాక్షరబహువారావృత్తి చేతను, సుదీర్ఘమును, శోభాలంకృతమును నైన రాజవీథినిఁ దలపించుచున్నది. మందీ కృతోజోగుణవిశిష్టమై, మధ్యమగతియు నైన యీవృత్తము సుష్ఠుగా హర్షోత్సాహవ్యంజక మగుచున్నది.

''పొలియింతు న్దేవి నంచు న్భుజబలపటువిస్ఫూర్తిమై దాఁకె శుంభుం
డలుకం దన్మాతృవర్గం బదరఁ గవిసె నిట్లన్నయుం దమ్ముఁడు న్నీ

శ్చలమేఘద్వంద్వలీల న్నరసముదయవర్షంబున న్గప్పిన న్దే
వి లసత్కోదండముక్తావిరతశరము లావృష్టి మ్రింగంగఁ జేసెన్". (6.192)

"వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్" అను కాత్యాయనోక్తి ననుస రించి శుంభుని భుజబలవిస్ఫూర్తిని వ్యంజింపఁజేయుట కీవృత్తము సమర్థ మగుచున్నది. నిశ్చలమేఘద్వంద్వముక్రియ శోభిల్లి శరవర్షము కురిపించిన శుంభనిశుంభులరౌద్రాతిశయ మును, కోదండముక్తావిరతశరపరంపరతో విలాసముగా ప్రతివీరశరవృష్టిని మ్రింగిన సప్తమాతృకల దివ్యప్రతాపమును వృత్తమున భాసించి, రౌద్రవిజృంభణమును శాసించిన వీరరసస్ఫూర్తి యనుగమ్యమాన మగుచున్నది. "పొలియించు న్దేవి" నంచుఁ గ్రియా ప్రధానముగా హుంకరించు దనుజవీరులయందు క్రియాబహుళ మైన రౌద్రము వ్యంగ్యము. ప్రగల్భవిరహిత మైన సప్తమాతృకలయందు గూఢవీరము వ్యంగ్యము. మధ్యమగతి యైన యీవృత్త మీరెండురసముల సంగమస్థానము.

## 9. మత్తకోకిల :

లఘ్వక్షరబహుళము లైన పాదములు గల యీవృత్తగతి యించుక ద్రుతము. మధురభావావేశచిత్తద్రుతగతి నీవృత్తము వ్యంజింపఁజేయఁగలదు. మహాభారతమున నీ వృత్త మధికముగా వాడఁబడినది. "భారతమునందలి నలుబదియేడుమత్తకోకిలములు నానావిధములైన సందర్భములందు నానారసార్థములనిర్వాహణమునం దుపయుక్తములై యున్నవి. స్తవనమున, ఉపదేశమున, కథనమున, వర్ణనమున, సంభాషణమునఁ బెక్కు తెఱఁగుల నీవృత్త ముపయుక్త మై యున్నది. క్రోధము, శోకము, ఉత్సాహము, పశ్చా త్తాపము, దైన్యము. హర్షము-మున్నగు ననేకభావములను వ్యంజించు వాక్యము లీఛంద మున నిబద్ధములై యున్నవి."[9] కవిత్రయములో నన్నయ యీఛందముల నధికముగా వాడెను. కాని, తిక్కన నిగ్రహమును బ్రకటించి యొకస్త్రీపర్వమునందే రచించెను. ఎఱ్ఱన నన్నయ ననుసరించెను. కాని, మారన తనగురువుగా రైన తిక్కనగారిసంయ మనము నలవఱచుకొని మార్కండేయపురాణమున మత్తకోకిలములను రెండింటిని మాత్రమే రచించెను.

"ఏమి చెప్పుదు మేము నీకు మునీంద్ర! యప్పుడు తండ్రి మ
మ్మామిషంబుగ నాకగంబున కామతింపఁ దలంచి తాఁ
బ్రేమవంతుఁడు వోలె క్షుద్రతఁ బిల్చి యెంతయు మాగుణ
స్తోమముం గొనియాడి యి ట్లను దుష్టనిష్ఠురభాషలన్." (1.72)

ధర్మపక్షులు శమీకమహర్షికి తమకు పూర్వజన్మమునఁ గలిగిన పితృశాపమునకుఁ గల కారణము వివరించుసందర్భమున నీపద్యము చెప్పఁబడినది. సుకృషునిసత్యదీక్షను బరీ క్షింప నెంచి యింద్రుఁ డొకసారి విహంగాకృతితో నేఁగి యతనిని నరమాంస మాహార

9. ఆం. మ. భా. ధం. శి. పుట - 846.

ముగా యాచించెను. సుకృశుఁ డందుల కంగీకరించి, పుత్త్రిలఁ బరీక్షింప నెంచి వారి నాపులుగుల కామెతలు కమ్మని కోరెను. అదియే వారి శాపవృత్తాంతమునకు నాంది యైనది. విశిష్టహేతునిరూపణసమర్థ మైన కథార్థమును వివేషవృత్తమునఁ జెప్పుట యిచ్చటివిశేషము. ఖగజన్మ మెత్తి పితృశాపాగ్నితప్తు లై ఖిన్ను లై యున్నవారు పులుగులు. పూర్వజన్మస్మరణమువలన నధికముగా నార్ద్రిములై, యుద్వేగవంతములైన వారి చిత్తములు మధురావేశచిత్తద్రుతి నొంది యుండును కావునఁ దద్వ్యంజకముగా నీ ఛందము సార్థకమగుచున్నది.

ఇది మిశ్రగతియందు విలంబితవృత్తి యైన ఛందము. అవరోహణము శోకాది భావములచే గళిత మగుచున్నచిత్తవృత్తికిఁ దగినది. ప్రకృతావస్థలో శోకించుచున్న పక్షులవాక్యము లం దుచితములుగా నున్నవి. మఱియు వారివాక్యములందు తండ్రిపట్ల గలిగినకోపము 'క్షుద్ర' 'దుష్ట' 'నిష్ఠుర' అనుపరుషాక్షరములందుమాత్రమే వ్యక్త మగుచున్నది. జగణములయందును గొంత తద్దీప్తి కలదు. కావున నిందు శోకమునందు క్రోధసంచారము వ్యంగ్యము.

మత్తకోకిల మధురభావావేశచిత్తవృత్తిని మాత్రమే కాక పరుషము లైన రౌద్రోత్సాహాదులనుగూడ వ్యంజింప సమర్థ మౌ నని మారన తనరెండవమత్తకోకిలద్వారమున నిరూపించెను.

> "కోటికోటిసహస్రసంఖ్యలు కుంజరంబులుఁ దేరులు
> స్ఫోటకంబులుఁ దోడరాఁ బటుఘోరవిక్రముఁ డై మరు
> త్కోటి నెల్ల లులాయదైత్యుఁడు దోలి శాంభవిమీఁది దోః
> పాటవం బెసఁగంగ దోమరబాణశక్తికృపాణముల్." (6.88)

రౌద్రరసప్రధాన మైన దేవీసప్తశతిలోఁ బ్రతినాయకుఁ డగు మహిషాసురుఁడు దేవిపై విజృంభించుట యిందలివస్తువు. మూర్ధన్యటకారప్రాసయుఁ, బరుషమహాప్రాణాక్షరయతులును మహిషాసురసైన్యగతియందలి పారుష్యమును, ఘోరనాదమును వ్యక్తము చేయుచున్నవి. ప్రథమపాదవిన్యస్త మైన యథాసంఖ్యము తద్రాక్షసునివెంట నడచు సైనికవ్యూహగతిని వ్యంజించుచున్నది. "సహస్ర" "లులాయ" "కృపాణ" జగణములను పాదనిజస్థానములందు నిబంధింపఁజేయక యన్యస్థలములందు భాసింపఁ జేయుటచేఁ బ్రతినాయక రౌద్రోద్రేకప్లుతి యస్థానపతిత మైన దని ఛందోవ్యంగ్యము. కృతార్థ మగు రౌద్రము ఆరోహణోత్ప్లుతిమయము కావలెను. ఇది యవరోహణమునం దీషత్ప్లుత మగుచున్నది. కనుక అకృతార్థరౌద్రవ్యక్తికిఁ దగియున్నది.

## 10. తరలము :

మత్తకోకిలావృత్తపాదప్రథమగుర్వక్షరమును రెండుహ్రస్వముల నొనరించినచో తరలావృత్త మవతరించును. కావున నిదియు మత్తకోకిలవలెనే మధురావేశచిత్తవృత్తి వ్యంజక మగును. "తరల మనఁగా చంచలము, తరంగితము, కంపితము ననియర్థములు,

తరలవృత్తగతియు నట్టిదే. హర్షాదులవల్ల హృదయగతి చంచలమైన యవస్థను వర్ణించుటకు తరలము తగియుండుము......కవిత్రయమువారి తరలవృత్తప్రయోగము నానారస భావములం దగుపడుచున్నది. రతి, విస్మయము, ప్రీతి, హర్షము, మున్నగు మధురభావములందును, క్రోధము, భీతి, దుఃఖము మున్నగు దీప్తభావములందును తరలవృత్తప్రయోగ మున్నది. ద్రుతకథనమునఁ క్రియాత్వరావర్ణనమునఁ దరలప్రయోగము కనఁబడుచున్నది. కొన్నియెడల నామముద్రముఁ గలదు. తిక్కన తరలము లన్నియు శోక తరళచిత్తవృత్తి వ్యంజకముగనే యున్న"[10] వని డా. మాధవశర్మగారి పరిశీలనము.

తిక్కనసోమయాజి తరలవృత్తముల నొక్కస్త్రీపర్వమునందుమాత్రమే వాడినట్లు మారనమహాకవియు నీఛందముల నాలుగింటిని నొక్క ద్వితీయాశ్వాసమునందే రచించెను. అందు రెండింటిని నిర్వేదచిత్తవృత్తి గల పాత్రలముఖములందు నిబంధించెను. అవి :

(1) జడుఁడు తనతండ్రితోఁ దనపూర్వజన్మవిశేషములఁగూర్చి చెప్పుట :

'' అనినఁ దండ్రికిఁ బుత్త్రుఁ డిట్లను నర్థితోఁ దొలుబామునం
దనఘ ! విప్రుఁడ బ్రహ్మవిద్యఁ బరాయణత్వముఁ బొంది పెం
పొనర నేను గురుండనై కర మొప్పుశిష్యులు తత్త్వవి
ద్ఘనులుగా నొనరించి యొక్కయుదాత్తపుణ్యవశంబునన్. (2.30)

(2) కువలయాశ్వోపాఖ్యానమున నశ్వతరుఁడు తనపుత్త్రులను మిత్రున కెట్టి యుపకృతి నొనరించి రని ప్రశ్నింప నాగకుమారులు నుడివిన వాక్యములు :

'' అనినఁ బుత్త్రులు తండ్రితోడఁ గృతార్థుఁ డాతఁడు వానికి
న్వీను ప్రియం బొనరింప శక్యమె ! వేల్పుఱేనికినైన నా
తని కిలం గలయట్టి రత్నవితానవస్తుచయంబు వా
హనము లీయురగాలయంబునయందు లే వహివల్లభా !'' (2.272)

పైసన్నివేశములందు జడుఁడు నరజన్మ మెత్తి సంసారచక్రమున గర్భదుఃఖ మరణసమితియందు బ్రుంగితి నని నిర్వేదము చెంది వికలచిత్తమున నున్నవాఁడు. నిర్వేద మాతనిచిత్తవృత్తియందు స్థాయి. తండ్రి కాతఁడు తనపూర్వజన్మవృత్తాంతము నెఱిఁగించుచు పునర్జన్మహేతువైన తనయజ్ఞానమును నిరూపించి, చెప్పుచున్నసందర్భమిది. పూర్వజన్మమున జడుఁ డొకబ్రహ్మజ్ఞాని యగు గురూత్తముఁడు. ఉదాత్త పుణ్యవశమున నతని కట్టిజ్ఞానము లభించినది. దానిని శిష్యులకు బోధించు నదృష్టము సంభవించినది. పూర్వజన్మవైభవవిశేషస్మరణమునఁ దాత్కాలికముగా నతనిచిత్తమునఁ గొంత హర్షోత్సాహము భాసించి నిర్వేదద్రుతియందు కొంత మధురావేశవృత్తి ప్రకాశించినది. దానిని మారన తరలవృత్తమున వ్యంజింపఁజేసెను.

---

10. ఆం. మహా. భార. ఛందశ్శిల్పము పుట. 348; 351.

నాగకుమారులు గుప్తముగాఁ గువలయాశ్వునిస్నేహమాధుర్యమును జూఱఁగొనిన వారు. తండ్రి వారిస్నేహమునకుఁ బ్రతిఫలముగాఁ గువలయాశ్వున కే మిచ్చినా రని ప్రశ్నించినప్పుడు తమ నిస్సహాయతకు వారు చింతిల్లినారు. మదాలసావియోగదుఃఖితుఁడై యున్న కువలయాశ్వుని కెట్టి రత్నరాసులును, వాహనాదులును బ్రీతిఁ గల్గింపఁ జాలవు కనుకను, విశేషముగా నాతఁ డైంద్రసంపదకంటె మిన్న యగు సంపద గలిగినవాఁ డగుటచేతను వారిప్రత్యుపకారసమస్య మఱియు జటిలమైనది. సుహృన్నిర్వేదము తమదిగా భావించి విషణ్ణులై యున్న నాగకుమారులు సహజముగా నిచ్చట నిర్వేద మూర్తులు. పై పెచ్చు ప్రత్యుపకారసామర్థ్యవిరహితుల మని తండ్రియెదుటఁ జెప్పవలసి వచ్చుట వారిచిత్తమును మఱింతగాఁ గుందించుచున్నది. కాని, వారియుక్తులందు కువలయాశ్వవైభవాతిశయవర్ణనస్ఫూర్తి కలదు. కావున సుహృద్వైభవస్మరణరూపమైన హర్షము వారిచిత్తముల నుత్తరంగిత మొనర్చుచున్నది. ఇట్లు నిర్వేదచిత్తమందు భాసించు హర్షవిశేషమును వ్యంజించుటకై పైవృత్తమువలె నిదియు నిచ్చటఁ బ్రయోగింపఁబడుట మారనరచనలోని ఛందస్సంవాదశిల్పమున కొకతార్కాణము !

విభిన్నకథార్థసంఘటితము లయ్యు నీవృత్తములు సమాంతరవిభావచిత్తవృత్తి వ్యంజకములుగా మారన భావించినాఁ డనుటకు పద్యములయెత్తుగడలలో "అనినఁ దండ్రికిఁ బుత్త్రి లిట్లను ........'' "అనినఁ బుత్త్రులు తండ్రితోడ"నిని యుండుటచే శబ్దార్థోభయసామ్యము గోచరించుచున్నది. వృత్తమున సహజముగా భాసింపవలసిన జగణప్లుతిని విశ్లేషణమొనర్చి, భ, ర, న, గల గణములవిస్ఫూర్తి నధికతర మొనర్చి యుండుటచే నవరోహణోన్ముఖమైన ద్రుతగతి ఛందమున భాసించి పాత్రగతమైన చిత్తద్రుతి ప్రస్ఫుటమగుచున్నది.

తిక్కన తరలమును శోకతరళచిత్తవృత్తివ్యంజకముగా స్త్రీపర్వమునందు వాడఁగా మారన తిక్కన యడుగుజాడలలో నడచి ప్రధానముగా విషాదచిత్తవృత్తివ్యంజకముగనే తరలను మార్కండేయమున వాడియుండెను. మారన వాడిన నాల్గుతరలములలో మూఁడింటికి "న''కారమే ప్రాసయై యుండుట వానిప్రయోజనసామ్యమును జాటుచున్నది.

మారన మఱియొకతరలమును నారకబాధలను వర్ణించు నవసరమునఁ బరాంగనాసక్తులును, దివాసురతమొనర్చినపాపులును అనుభవించుబాధావిశేషములను బేర్కొనుట యందు నిబంధించెను.

మారన రచించిన నాల్గవతరల మాశ్వాసాంతపద్యము. దీని నీతఁ డుద్దేశపూర్వకముగా రచించినట్లు కానఁబడుచున్నది. మారన ప్రతియాశ్వాసాంతమునందును మూఁడు పద్యములు రచించెను. అందు రెండవ, మూఁడవపద్యములుగా కందము - మాలిని అను వానినే సర్వత్ర వాడెను. మొదటిపద్యముగాఁ జంపకమును, ఉత్పలమాలను ఒకటి విడిచి యొకదానిని వాడెను. కాని, ద్వితీయాశ్వాసాంతమున మాత్రము తరలను గైకొనెను.

ఈయాశ్వాసమున బహువిధనరకవర్ణనలును, వివిధసంగ్రహోపకథాదులును జెప్పఁబడియుండుటచే విషయవైవిధ్య మేర్పడి పఠితచిత్తమునకు తరలద్రుతిని కల్పిం

చును. కావున శ్రోతృచిత్తవృత్తివ్యంజకముగా మారన యాశ్వాసాంతప్రథమవృత్తముగాఁ దరలము నెన్నుకొనియుండవచ్చును.

## 11. ఉత్సాహము:

ఈవృత్తముయొక్క రసవ్యంజకత్వమునుగూర్చి డా. పాటిబండ మాధవశర్మగారిట్లు వ్రాసిరి : "ఏడుత్రిమాత్రాకఖండములపై నొక్కగురు వుండుట ఉత్సాహలక్షణము. అనఁగా ఉత్సాహ త్ర్యస్రగతివృత్తము. ఆవృత్తియందలి మూఁడుమాత్రలు నగణముగాని హగణముగాని కావచ్చును. నగణ మావృత్త మైనచో గతి ద్రుతతర మగును. హగణ మావృత్తమైనచో గతి మధ్య మగును. నగణహగణములు పర్యాయావృత్తము లైనచో గతి ద్రుత మగును. త్ర్యస్రగతి యగుటచే లయ ద్రుతమే. గలాంశబాహుళ్యముచేఁ ద్వరాన్విత మైన చిత్తవృత్తిని వ్యంజించుటకు ఉత్సాహము యోగ్య మగు నని భావింపఁదగును ......ఉత్సాహము వీరరసస్థాయిభావము. నామసామ్యమునుబట్టి ఉత్సాహవృత్తము ఉత్సాహవ్యంజక మని విశ్వసింపఁబడుచున్నది. ద్రుతగతిచేతఁ గూడ యీవృత్తము ఉత్సాహవ్యంజకము కాఁగలదు. అవరోహణగతి యైనప్పుడు యుద్ధోత్సాహవ్యంజకముగానంత సమర్థము కాఁజాల దని చెప్పవలసియుండును"[11]

నన్నయాదు లుత్సాహవృత్తమును వీరరసవ్యంజకముగాఁ గొన్నియెడల వాడినను తిక్కనసోమయాజి తాను మహాభారతమున రచించిన నుత్సాహవృత్తనవ్తకమును గరుణరసప్రధానమైన స్త్రీపర్వమునందే రచించెను. మారనమహాకవి మార్కండేయమున నీవృత్తములను మూఁడింటిని మాత్రమే వాడెను. అందు రెండింటిని కరుణరసవ్యంజకములుగాఁ బ్రథమాశ్వాసమున బలరామతీర్థయాత్రాగమననిశ్చయావసరమున రచించెను. మఱియొండువృత్తము దయావీరవ్యంజకముగా ద్వితీయాశ్వాసమున నిబంధించెను. వీరరసభేదములలో యుద్ధాదులు పరుషదీప్తవృత్తులు. దానదయాదులు మధురద్రుతవృత్తులు. అవరోహణగతి యగుటకు వీలున్నయీవృత్తము యుద్ధోత్సాహములం దుపకారి కాకపోయినను దయావీరాదులయందు సార్థకము కాఁగలదు. కావున, మారనమహాకవి యీవృత్తరసవ్యంజకత్వశక్తిని గుర్తించి దయావీరకరుణాదులయందు వాడి తన రసజ్ఞతాసామర్థ్యమును బ్రకటించెను.

"హరికిఁ బ్రియుఁడు నరుఁడు గాన హరి దొలంగ దన్నరున్
హరిఁ దొలంగి యేను గౌరవాధినాథుఁ గూడ నె
ట్లరుగనేర్తుఁ బాండుతనయులందు నిల్చి కౌరవే
శ్వరుని శిష్యు నెట్లు వారు చంపఁజూతు నక్కటా!"

"వారు వీరు నాకు బాంధవమున నొక్కరూప యె
వ్వారిఁ గూడ నొల్ల బంధువర్గముల్ చలంబున

11. ఆం. మ. భా. ఛం. శిల్పము. పుట. - 356.

న్పోరఁ జూడఁ జాలఁ దీర్థములకుఁ బోయెద న్వేగం
గూరుచుండ నేల యని ముకుందునకుఁ బ్రియంబునన్.'' (1.129-130)

బలరామ వితర్కవర్ణనాత్మకము లీరెండువృత్తములు. తత్సమయమున బలరామ చిత్తవృత్తి కరుణార్ద్రము (1.128). కురుపాండవు లాదేవునికి సములైన బంధువులు. వారి మధ్య పోరు కలుగుటయే యాతనిచిత్తమునకు దుఃఖహేతు వైనది. విశేషించి యాతఁ డాపోరున నేకపక్షవర్తి యగుటకు చిత్తమున నంగీకరించుట లేదు. కావున నతనియందు వితర్క మంకురించినది. యుద్ధవైముఖ్య మొకవైపును, బంధునాశదుఃఖము మఱియొక వైపును జేరి యాతనిచిత్తమును గ్రుంగఁదీయుచున్నవి. కావున ద్రుతమును, నవరోహణమును నైన యతనిచిత్తము నగణహగణానుకూలముగా స్పందించుచున్నది. అది యుత్సాహవృత్త మైనది. చింత మిక్కుట మగుటచే నది వృత్తద్వయ వ్యాప్తమై దీర్ఘ మైనది. బంధువర్గములో నాతనికి హరి ముఖ్యుఁడు. ఆపైన శిష్యుఁడు కౌరవేశ్వరుఁడు ముఖ్యుఁడు. ఆతరువాత బంధువులు పాండునందనులు ముఖ్యులు. అందు హరి నరపక్షపాతి. ఆమాట యనుకొనినతోడనే చిత్తము ద్రుతిమంత మైనది. "హరికిఁ బ్రియుఁడు నరుఁడు" అను నగణత్రయసంపుటి ముమ్మాటి కది సత్య మనున ట్లతనిచిత్తమున భాసించినది. అతనిఁ దొఱంగుట దుర్భరము కావున నచ్చట ఉద్వేగము భాసించి జగణప్లుతి రేకెత్తినది. ఆపైనఁ గౌరవాధినాథుని గూడుటకుఁగాని, పాండుతనయుల పక్ష మవలంబించుటకుఁ గాని చిత్త మనుత్సాహమును దాల్చి, హగణాకృతిలో స్పందించినది. పోరు కలిగిన శిష్యుఁడు పంచప్రాణములు వదలుట తథ్య మని కాబోలు హగణపంచకమున నాతనిచిత్తము దుఃఖ మగ్న మైనది. "అక్కటా!'' యని వాపోయినది. బంధువర్గములు పోరుచుండ చూడఁజాలని యతనిచిత్తానుతాపము హగణబహువారావృత్తి యైన ద్వితీయోత్సాహపూర్వార్ధమున స్పందించినది. "ముకుందు" నకు "ప్రియంబు" సేయ నిశ్చయించు నతనిచిత్తవృత్తి హగణసంయుక్త మైన జగణస్ఫూర్తితో నవరోహణ మయ్యు నుద్వేగసహిత మై భాసించినది. హృదయకర్తనవ్యంజక మగు రకారప్రాసము వృత్తద్వయమున వ్యాపించి, చిత్తక్షోభమును వ్యంజించినది. కరుణోద్వేగ మైన బలరామచిత్తవృత్తి యి ట్లీవృత్తములందు సార్థక మగుట విశేషము.

వైదేహుఁడు నరకదుఃఖితులను గాంచి సహానుభూతితో దుఃఖమగ్న మైన చిత్తవృత్తి వహించి యుండెను. ఇంతలో ధర్మేంద్రు లతనిని బుణ్యలోకమునకుఁ గొంపోవ విమానము దెచ్చి దాని నధిరోహింపఁ గోరిరి.

అనుడు నతఁడు ధర్ముతో మహాత్మ ! మమ్ము గావవే
యనుచు శరణువేడు యాతనార్తజనుల వీడి రా
ననిన వజ్రి వీరఘాత్ము లగుట నరకవాసు లై
రనఘ ! నీవు పుణ్యపరుఁడ వమరపురికిఁ దగుదు రాన్.'' (2.137)

అనెను. ధర్మేంద్రులు విమానము తెచ్చుటతోడనే వైదేహునిచిత్తమున ద్రుతగతి

భాసించినది. నగణద్వయ మద్దానిని వ్యజించుచున్నది. వెంటనే యతఁడు "మహాత్మ !" యని సంబోధించి తనయం దుత్పన్నతిగా జనించిన యుద్వేగమును వ్యక్తీకరించెను. "మమ్ము కావవే !" యను నారకుల ప్రార్థనమును స్మరించి హగణద్వయమున నవరోహణాత్మక మైన విచారమును, అంత్యప్లుతాక్షరజన్య మైన నారకుల దయనీయావస్థను చర్వణము చేసి, "శరణు వేఁడు యాతనార్తజనుల వీడిరాన్" అని నిశ్చయించెను. అందు నగణ మిశ్రిత మైన హగణావృత్తి యతని కరుణస్మరణచే జనించిన దయాభావవేగమును సూచించుచు "కావవే" యన్న నారకులయార్తికిఁ బ్రతిధ్వనిగా "వీడిరాన్" అను ప్లుతాంత క్రియాస్ఫూర్తి భాసించుచున్నది. ఈవాక్య మతని దయావీరస్ఫోరకము. తచ్ఛ్రవణమున నిశ్చలుఁడైన ధర్ముఁడు కంపింపలేదు కాని వజ్రియయ్యు సురేంద్రుఁడు మాత్ర మను కంపఁ జెందినాఁడు. సహానుభూతిచే నతనిచిత్తముకూడ ద్రుతిమంత మైనది. కాని రాజు నకు నారకుల నిజస్థితిఁ దెలుపు బాధ్యత యొకటి సంక్రమించినది. "వీ రఘాత్ము లగుట నరకవాసులై రనఘ !" అని గుర్వక్షరములను లాగి "వీ" "ఐ" దీర్ఘ వక్రతమస్వర విహితములైన వ్యంజనములతో నెత్తిచూపించి, "అఘాత్మ" లనుచు నుక్తియందలి అధిక్షేపోత్పత్తిని జగణమున దీపింపజేసి "అనఘ !" యని సంబోధించెను. నగణపునరా వృత్తిచే ననునయత్వరను బ్రకటించెను. వైదేహుని బుణ్యపరునిగాఁ జెప్పుటయందును నగణబాహుళ్యమును బాటించి, కొంతయుత్సాహమును బ్రకటించెను పాదాంతమున "రాన్" అనుప్లుతాక్షరమును వైదేహోక్తికి ప్రతిధ్వనిగా నిబంధించి స్వర్గగమనార్హతను జాటిచెప్పెను. స్వర్గగమనార్హుఁ డయ్యు నరకబాధితుల దీనావస్థను భావించి వారిని రక్షింపఁబూనిన వైదేహునిదయావీరమే యీవృత్తమునఁ బ్రతిపాదిత మైనది. ధర్మో దాత్తుఁ డైన దయావీరునిచిత్తవృత్తి నుత్సాహవృత్తము నామసార్థక్యముచేతను సమర్థింపఁగలుగుట యిచ్చటివిశేషము !

## 12. తరువోజ :

ద్విపదపాదములను రెండింటిని గలిపినచో నొకతరువోజవృత్తపాద మగునుఁ మహాభారతమునఁ గవిత్రయ మీవృత్తమును వాడినవిధము నిట్లు డా. మాధవశర్మగారు వివరించిరి. "తరువోజ యలసము, సుకుమారము నైన ఛంద మని కవిత్రయమువా రభిప్రాయ పడినట్లు వారిప్రయోగమునుబట్టి యూహింపఁదగియున్నది. చింత, శంక. దైన్యము, గ్లాని, శోకము మున్నగు నలసచిత్తవృత్తులందే తరువోజలు తఱచుగా, బ్రయోగింపఁబడి యున్నవి. విశేషించి భారతమునందలి పందొమ్మిది తరువోజలలో నేడు తరువోజలు స్త్రీవాక్యములై యుండుటచే చిన్నకోట పెద్దన యన్నట్లు స్త్రైణమైన వృత్తముగాఁ గవిత్రయమువారు భావించి రనికూడ తలంపఁదగియున్నవి." 12

మారనమహాకవి తరువోజవృత్తమును మహాభారతకవులవలెఁ గాక వీరరౌద్రాది రసములందుఁ గూడ నుపయోగింపఁదగిన దని భావించినట్లు కానఁబడుచున్నది.

12. ఆం. మహా. భార. ఛంద. శిల్ప. పుట-368.

మార్కండేయమున రెండుతరువోజలు కలవు. అం దొకటి హరిశ్చంద్రోపాఖ్యానము నందు విఘ్నేశ్వరుఁడు రాజహృదయము నావేశించి, యతనిని వీరమూర్తిగా భాసింపఁ జేసిన వృత్తాంతమును జెప్పుచున్నది.

''ఈరాజుఁ బ్రేరించి యీమునిరాజు నెద నొవ్వఁ బలికించి యీతని క్రోధ
మారంగఁ జేసెద నంత నీవిద్య లలజడిఁబడ కేగు నని నిశ్చయించి
యారాజు మది సొచ్చె నావిఘ్నరాజు, హా యని మఱియును నాయేడ్పు చెలుఁగు
లారాజు సైఁపక యతితీవ్రకోపహాసభీషణవక్త్రుఁ డై యిట్టు లనియె''. (1.151)

ఇందు హరిశ్చంద్రుఁడు వీరరసావిష్టుఁ డగుట ప్రధానప్రతిపాద్యవిషయము. ఆరాజున కాలంబనవిభావములు ''హా'' యని తరుణీకంఠములతో విలపించువిద్యలను దపింపఁజేయు విశ్వామిత్రుఁడు. తరుణుల బాధించు ముష్కరుని క్షత్రధర్మము నాశ్రయించి శిక్షింప రాజునకు కోపము జనించినది. అది విఘ్నేశ్వరావేశముతో నుత్కటరూపముఁ దాల్చినది. దుఃఖిత లగు విద్యలయందు దయయు, తద్దుఃఖహేతు వగు ఋషియందు కోపమును రాజుచిత్తమున భాసించుటచే కరుణానుప్రాణితవీర మిందు వ్యంగ్యము.

మారన రెండవతరువోజను దృతీయాశ్వాసమున మదాలస యలర్కునకు చేయు క్షత్రధర్మప్రబోధమున రచించెను.

''అనురాగమున నోలలార్పు బాంధవుల
　　ననఘ! శైశవవిహారాలాపలీలఁ
బను లెల్లఁ జేయుచు భక్తి మీతండ్రిఁ
　　బరితుష్టుఁ గావింపు బాల్యంబుమీఁది
మనసిజసుఖకేళి మగువలఁ దేల్పు
　　మహనీయయౌవనమదవిభ్రమమున
వనమున మునివృత్తి వార్ధకమందు
　　వర్తింపు వనవాసివర్గంబు లలర! (3.126)

ఇక్ష్వాకువంశప్రభువులవలె నుదాత్తాశ్రమధర్మనిర్వహణ మొనరింపు మని యలర్కున కామాత ప్రబోధము. ఇందు ధర్మనిర్వహణరూప మైన వీరము వ్యంగ్యము. విషయప్రతిపాదనమున మదాలస మొదటిమూఁడుపాదములం దొకక్రమము పాటించి, చరమపాదమున దానిని వ్యతిక్రమ మొనరించుట యొకవిశేషము. దానివలన, బురుషార్థత్రయనిర్వహణ మొక యెత్తనియు, చతుర్థార్థనిర్వహణనానుకూల మైన వానప్రస్థ మొకయెత్తనియుఁ దెలియుటయేకాక వానప్రస్థమునందలి జీవనవిధానము, చిత్తప్రవృత్తియుఁ దత్పూర్వాశ్రమక్రమభిన్నమై శమోపలక్షకము లై యుండు ననియు స్పష్టమగుచున్నది.

## 13. మాలిని:

న-న-మ-య-య అనుగణములచే నొప్పుపాదచతుష్టయమును గలిగియుండు నీ మాలినీవృత్త మారంభమున ద్రుతగతితోడను బర్యంతమున విలంబితగతితోడను ఒప్పారు

చుండును. లాక్షణికు లీవృత్తమును సర్గపర్వాంతప్రయోగార్హముగా భావించియుండిరి. తిక్కనసోమయాజి యామతము ననుసరించి మహాభారతమున విరాటపర్వ మాదిగా నున్న 46 ఆశ్వాసముల యంతములందును నలుబదియాఱు మాలినీవృత్తములను రచించెను. సోమయాజిశిష్యుఁ డైన మారన ప్రతిఆశ్వాసాంతమునందును జివరివృతముగా మాలినిని రచించి గురుమతమును గౌరవించెను.

నన్నయభట్టారకుఁడు మాలినిని రసవత్కథార్థములను వ్యంజించునట్లు ప్రకరణము లందు వాడి హర్షభయక్రోధాది చిత్తత్వరోత్పాదకభావసంజననసమర్థముగా నిరూపించెను. విశిష్టమైన నన్నయమార్గమును మారన వదలిపెట్టక మాలినీవృత్తచతుష్టయమును గథార్థ కథనమునందును వినియోగించెను. ఇట్లు మారన నన్నయతిక్కనల సంప్రదాయములకు సంగమస్థానమై భాసించుచున్నాఁడు.

కథార్థములందు వాడిన మాలినీవృత్తములు నాలుగు.

1. ఉత్సాహవ్యంజకము :

"అసురదమనలీలాయత్త కౌతూహలుం డై
మసలకఘువిఁ గుంతీమాద్రులం దుద్భవించెన్
వసుధభరము మాన్ప న్వాసవుం డిట్లు తేజో
విసరపిహితమూర్తు ల్విస్ఫురింప న్మునీంద్రా" (1.125)

2. భక్తిభావవ్యంజకము :

"అతివికృతచరిత్రుం డత్రిపుత్త్రుండు యోగ
స్థితినిరతుఁడు దత్తాత్రేయుఁ డవ్విష్ణుమూర్తి
న్సతతము నతిభక్తి న్వత్సలుంగా భజింపుం
డతఁ డసురకులఘ్నోద్యద్వరం బిచ్చు మీకున్." (2.222)

3. హర్షభక్తిభావవ్యంజకము :

బలాకాసురుఁడు ఉత్తమునకు వినయముతో నమస్కరించుట :

"దనుజభటపరీతు న్దైత్యు నారాజు గాంచె
న్వినయనిభృతు లొప్ప న్వేగ వాఁడు న్శిరంబున్
జనపతిచరణాంభోజాతము ల్సోర్చి చిత్తం
బునఁ బ్రమదరసం బుప్పొంగ నత్యంతభక్తిన్." (5.163)

4. రౌద్రరసవ్యంజకము :

శాంభవి నిశుంభునితోఁ బోరుట.

"అలుకఁ బరశుహస్తుం డై కడు న్వేఁక ధాత్రీ
తల మద్రువఁగ నుద్యద్రౌద్రత న్వచ్చు దైత్యు
న్బలువడిఁ బడ నేసె న్భైరవాటోపలీల
న్జెలఁగి నిశితబాణశ్రేణి నద్దేవి యంతన్." (6.196)

మాలినిని బహువిధరసభావవ్యంజకముగా మారన విరచించినను పైవృత్తముల నెన్నుకొనుటలో నొక తుల్యలక్షణమును పాటించె నని భావింప వీలగుచున్నది. మాలిని యాశ్వాసాంతపద్య మైనప్పుడు కృతిపతిగుణకీర్తనము చేయుటకై వినియోగింపఁబడుట సహజము. సామాన్యముగాఁ గృతిభర్తలు ఉదాత్తవ్యక్తు లయిగాని, దేవతామూర్తు లయి గాని యుండుట సహజము. అట్టివారిగుణపరాక్రమమాహాత్మ్యాదివిశేషవర్ణనమే యీవృత్త లక్షణము కావలెను. మారన పైపద్యములలో సురేంద్రదత్తాత్రేయమహత్వములను, శాంభవీశక్తిసామర్థ్యమును, ఉత్తమునియౌదాత్యమును వర్ణించి నరదేవోదాత్తగుణవర్ణనమునం దావృత్తమున కున్న సార్థక్యమును కథార్థానుకూలముగా ననుసంధించెను. మారన ప్రదర్శించిన యిట్టి లక్షణసమన్వయదృష్టి ప్రశంసార్హము :

ఆశ్వాసాంతములందు రచింపఁబడు మాలినీవృత్తములు సాధారణముగా శబ్దాలంకారమండితము లై శ్రవణానందదాయకము లగుచుండును. తిక్కనాదు లట్టిపద్యములను వివిధానుప్రాసాలంకారబంధురము లొనర్చిరి. మారన మాలినుల నన్నింటిని ప్రతి పాదసమఖండాంతానుప్రాసవిలసితముగాఁ జిత్రించుటఁ గమనార్హము. అందును ముత్తెఁగు లైన బంధములు కానఁబడుచున్నవి. –

1. సర్వపాదసమఖండాంతానుప్రాసమున నేకాక్షరము పాటింపఁబడుటకు–ప్రథమ పంచమాష్టమాశ్వాసాంత పద్యములు : (1.288; 5.375; 8.290).
2. పూర్వాపరఖండ సమఖండాంతానుప్రాసకు–ద్వితీయసప్తమాశ్వాసాంతపద్యములు. (2.345; 7.287)
3. ప్రతిపదప్రత్యేకసమఖండాంతానుప్రాసకు–తృతీయచతుర్థషష్ఠాశ్వాసాంతపద్యములు. (3.395; 4.257; 6.264)

## సామాన్యచ్ఛందములు :

సర్వరససామాన్యములుగాఁ గావ్యములందు విస్తృతముగా వాడఁబడు చంపకమాలాది వృత్తము లిచ్చట సామాన్యచ్ఛందములుగా గ్రహింపఁబడుచున్నవి. చంపకోత్పలమాలలు, మత్తేభశార్దూలములు, తేటగీతియాటవెలఁదులు, కందసీసములు సామాన్యచ్ఛందములుగాఁ బరిగణింపఁబడి యీభాగమునఁ బరామర్శింపఁబడినవి.

మారన మార్కండేయపురాణమున నీక్రింది సామాన్యచ్ఛందముల నిట్లు వాడెను:[13]

శార్దూల విక్రీడితములు – 40, మత్తేభవిక్రీడితములు–79, ఉత్పలమాలలు –134, చంపకమాలలు – 211, ఆటవెలఁదులు – 154, తేటగీతులు – 325, సీసములు – 213, కందములు – 725. విశేషచ్ఛందములను కవులు విశేషసందర్భములందు ప్రత్యేకప్రయోజనముల నుపలక్షించి రచించుచుందురు కావున ప్రత్యంశపరిశీలన మొనరింప వీలుకలదు. కాని, బహుసంఖ్యాకము లగు నీసామన్యచ్ఛందముల నట్లు పరిశీలించుట దుర్లభము కావున తత్ప్రయోగౌచిత్యాదులను స్థాలీపులాకన్యాయమున మాత్రము పరామర్శింప వీలుకలుగు

13. వివరములకు చూడుడు : అనుబంధములు.

చున్నది. ఛందములు వస్తుపాత్రరసవ్యంజకము లగుటచే నీసామాన్యచ్ఛందములు మార్కండేయమున కథాకథనసంభాషవర్ణనాదులయం దెట్లు సార్థకముగాఁ బ్రయోగింపఁ బడినవో స్థూలముగాఁ జెప్పుట యీవ్యాసతాత్పర్యము.

## 1. శార్దూలవిక్రీడితము :

సామాన్యచ్ఛందములలో మారన తక్కువగా వాడినవృత్తము శార్దూలము. పరిశీలింప నీవృత్తము నతిమాత్రముగా వాడుట తెలుఁగుకవుల సహజలక్షణమువలెఁ గనుపట్టుచున్నది. దానికి హేతువులు విమర్శకు లిట్లు భావించుచున్నారు. "19 అక్షరముల పాదమున 12 అక్షరములవఱకు అవిచ్ఛిన్నోచ్చారణము విధింపఁబడుటచే శార్దూలవృత్తము వక్తృప్రాణశ్రాంతికరము, దుఃఖావహము, ఓజోనిర్వర్త్యము. అట్లే శ్రోతృశ్రవణోద్వేజము, ఓజోజనకము. దీర్ఘసమాసఘటనాత్మకనిర్విరామవాక్యనిర్మాణప్రవణులైన గౌడీయులకు శార్దూలవృత్తము ప్రేమపాత్ర మగుట సహజము. గుర్వక్షరబాహుళ్యమున సాడంబరమై యుండుటయు, గౌడీయాదరపాత్ర మగుట యుచితము. "గౌడే ష్వక్షరాడంబరః" అని అభియుక్తోక్తి. ఆంధ్రమున శార్దూలవృత్తప్రయోగవైరళ్యమునకుఁ గారణము దానిగుర్వక్షరబాహుళ్యము - ఓజోమయత్వము అని భావింపఁదగియున్నది. ఆంధ్రులు చతురలలితమధుర మైన వైదర్భమార్గప్రియులు. ద్విత్రిగురుకములైన పదములు ఆంధ్రమున దుర్లభములు. దుష్కరప్రాసమువలె శార్దూలవృత్తమును విశిష్టప్రయోజనాపేక్ష యున్నచోటనే అవశ్యంభావియై యుపయుక్తమగుచున్న దని చెప్పవచ్చును. సంస్కృత సాహిత్యమునందు అనాదృత మైన మత్తేభము ఆంధ్రులచే నత్యంత మాదృతమై యుండుటకు నాతిదీప్తమైనయోజస్సు కారణ మని తలఁపఁదగియున్నది."[14]

మారన యీవృత్తమును వీరరౌద్రరసములందే కాక శృంగారకరుణాదిరసములందును, స్తుతిప్రబోధాదులందును సాధారణకథాకథనమునందును వాడి బహువిధప్రయోగసామర్థ్యమును బ్రదర్శించెను.

మారన యీవృత్తమును వాడిన వివరములు :

వీరరౌద్రములందు 17, శృంగారరసమున 3, కరుణాదులందు 5, స్తుతివరములు 6, ప్రబోధములు 5, ఇతరములు 4.

క్షేమేంద్రుఁడు 'శౌర్య స్తవే నృపాదీనాం శార్దూలక్రీడితం మతమ్" అని యీవృత్తప్రయోగవిధిని సూచించెను. సహజముగా ధీరోద్ధతగతిఁ గలిగిన యీవృత్తము వీరపరాక్రమకీర్తనపర మైనచో సార్థక మగుననుట నిర్వివాదాంశము. ఇదియే వృత్తప్రయోజనపరమార్థము కాకపోవచ్చును. కాని, ప్రాథమికప్రయోజనములలో నొక్కటి యని మాత్రము గ్రహింపవచ్చును. మారన క్షేమేంద్రనియమానుసారము రచించిన పద్యములు కొన్ని కలవు. ఉదాహరణమునకు—

---

14. ఆం. మ. భా. ఛం. శిల్ప. పుట. 387 - 388.

శా. పాతాళం బవలీలఁ జొచ్చి విలసద్బాహాబలస్ఫూర్తిమై
దైతేయప్రకరంబు గీటడఁచి గంధర్వాత్మజం దెచ్చి తీ
వేతన్మాత్రుఁడవే భవత్సదృశులే యేరాజులుం బుత్ర ! నీ
చేతం బెంపు వహించె వంశము యశశ్శ్రీవృద్ధి నేఁ బొందితిన్. (2.341)

శత్రుజిన్మహారాజు ఋతధ్వజుని యనన్యశౌర్య పరాక్రమమును గీర్తించిన పద్య మిది. నాయకగుణవర్ణనమున కధికప్రాధాన్య మిచ్చిన యీయుపాఖ్యానమున ద్వితీయాశ్వాసాంతమున ప్రవర్తితకథాంశసంగ్రహనిరూపణాత్మకముగా మారన నాయకశౌర్యకీర్తన మొనర్చియుండుటచే నీపద్యము ప్రకరణౌచిత్యమును గల్గియున్నది. దీర్ఘాక్షరప్రచుర మగు నీవృత్తము వక్త యగు శత్రుజిత్తునిచిత్తమునందలి హర్షోత్సాహాదిభావములచేఁ బ్రసాద మధుర మైన వృత్తిని, పుత్రసాధిత దుష్కరకార్యార్థస్మరణముచే కించిద్దీప్తపరుష మైన చిత్తవృత్తినిఁ బ్రసాదమయ విలంబితగతిచేతను, నాతిమధురనాత్యోజోగుణసమావేశము చేతను వ్యంజించుచున్నది. మారన యీయుపాఖ్యానముననే ఋతధ్వజుఁడు రాజ్యభారము పూనుట నిట్లు వర్ణించెను:

శా. శత్రుక్షత్రలతాలవిత్రపటుదోశ్శౌర్యాఢ్యుఁ డై శత్రుజి
ద్ధాత్రీనాథుఁడు పెద్దకాల మిటు లీధాత్రీతలం బిద్ధచా
రిత్రం బొప్పఁగ నేలి నిర్జరపరశ్రీఁ జెందఁగాఁ దత్తనూ
తత్పుత్త్రుం డుత్తముఁ డాఋతధ్వజుఁడు తాఁ బూనె న్ధరాభారమున్. (3.100)

తండ్రి దివంగతుఁడు కాఁగా పుత్త్రుఁడు రాజ్యమునకు వచ్చె ననుట యిందలి తాత్పర్యము. శత్రుజిత్తుపాలనకు భరతవాక్యము పలుకఁబడినది. ఋతధ్వజుపాలనమునకు నాంది పలుకఁబడిన దిచ్చట ! తండ్రికిఁ దగిన పుత్త్రిఁ దగుట ఋతధ్వజుఁ డుత్తముఁడును రాజ్యభారయోగ్యుఁడు నయ్యె ననుట చరమపాదభావము. అదిప్రస్తుతము. కాని, మొదటి మూఁడుచరణముల కిచ్చట ప్రాధాన్యము కలదు. "తత్పుత్త్రిన"కు మార్గదర్శి యైన "తత్పిత" యొక్క సమగ్రస్వరూప మిందు కవిచే రూపకమున వర్ణితమైనది. "శత్రుక్షత్రలతాలవిత్రపటుదోశ్శౌర్యాఢ్యుఁ డాశత్రుజిత్తుఁడు". తకారరకారసంయుక్తాక్షర త్రివారావృత్తిచే శత్రులతలను శౌర్యలవిత్రముతోఁ గోయునప్పటి ధ్వని వృత్తమున వినిపింపఁగలదు. అది శత్రువీరుని రణకర్కశత్వమును వ్యంజించుచున్నది. దానిని ప్రాసాక్షరము స్ఫుటపఱచుచున్నది. తరశలవర్ణపునరావృత్తిచేతను, నాతిసమాసరచనము చేతను, నాత్యోజోగుణము భాసించి యుత్సాహోత్తేజితరౌద్రగుణస్ఫూర్తిని వ్యంజింపఁ జేయుచున్నది.

రకారసంయుక్తాక్షరములతో రౌద్రస్ఫూర్తి మెఱపించిన ఘట్టములు గలవు. ఉదా : మధుకైటభస్వరూపవర్ణనము.

శా. నిద్రాజాడ్యము దన్నుఁ బాసినఁ గడు న్వే లేచి యాచంచదు
న్నిద్రాక్షుఁ డధోక్షజుండు గనియె న్విస్ఫారదోర్వీర్యశా

రోద్ర్యాదిక్రాత్ముల రౌద్రవక్త్రుల నమర్త్యోగ్రాక్షుల న్నీలగో
త్రాద్రిప్రాంశుకరాళవిగ్రహుల బ్రహ్మధ్వంసనోద్యుక్తులన్. (6.50)

(1) ఒక్కొక్కచో మారన వీరాదులను వర్ణింపవలసినచోట దీర్ఘసమాసము ననుసంధించి భావోద్దీప్తి నొనర్చుటయుఁ గలదు- ఉదా: సుగ్రీవుఁ డను శుంభునిదూత దేవియెదుట తనప్రభుపరాక్రమము కీర్తించుట.

శా. దేవీ! శుంభునిదూత నే నతఁడు పుత్తెంచె న్నినుం గోరి బా
హావీర్యోత్కటశౌర్యనిర్జితసమస్తాదిత్యదిక్పాలచూ
డావిన్యస్తనిజైకశాసనుఁడు గాఢశ్రీశుఁ డై యొప్పు నా
దేవద్విట్పతివాక్యరీతి విను మర్థి న్జెప్పెద న్నీ కొగిన్. (6.142)

వీరరౌద్రాశ్రితమైన నృపాలురశౌర్యము శార్దూలములందు శోభించు నను క్షేమేంద్రుని శాసనమును మారన పైపద్యములందు శిరసావహించి పాలించినాఁడు. శౌర్యస్తవమే కాక శౌర్యప్రదర్శనముకూడ శార్దూలమునఁ జెప్పఁదగును. అనఁగా వీరరౌద్రవ్యంజకము లైన భావానుభావాదులయు, క్రియాకలాపాదులయు, వర్ణన మని తాత్పర్యము. అట్టివి కథార్థము లందు సందర్భశుద్ధి నెఱిఁగి ప్రయోగించుట సుకవిశిల్పము.

శా. నీ వే మిచ్చినఁ గాదన న్గానియెద న్వీరాగ్రణీ! ధర్మము
న్నీవు న్నార్యయుఁ బుత్త్రకుండు వెలిగా నీసర్వసామ్రాజ్యల
క్ష్మీవాల్లభ్యము మాకు ని మ్మనిన నిచ్చె న్నిర్వికారానన
శ్రీవిభ్రాజితమూర్తి యై సమధికప్రీతి న్హరిశ్చంద్రుఁడున్. (1.163)

వైదర్భీరీతి యగునీపద్యము దానవీరసోస్ఫూరక మగుట యౌచిత్యము. రాజ్యమును గోరుచున్న విశ్వామిత్రుఁడు విభావము. "వీరాగ్రణీ: నీ వేమిచ్చినన్" అనువాక్యములందు కాకువున నవహేళనస్ఫూర్తిని గుప్తము చేసి పలికినమాట లాపాత్రశీలవ్యంజకములు. సహజముగా నెవ్వరైన నట్లు దాన మడిగినఁ గుపితు లయ్యెదరు ; వినయముతో నైనను సర్వసామ్రాజ్యలక్ష్మీవాల్లభ్యము నభ్యర్థించినచోఁ గుప్పకూలిపోవుదురు. హరిశ్చంద్రుని యందు నిర్వికారాననశ్రీ భాసించిన హర్షము వెల్లివిరిసినది. "ఇచ్చితి" నను పలుకు అప్రయత్నముగ వెచ్చేసినది. ధృతిమంతుఁడైన దానవీరుని చేష్టావిశేషముచే రసస్ఫూర్తి నిచ్చుట మారన సాధించినాఁడు.

(2) యుద్ధములు క్రియాబహుళములు. యుద్ధవీరాదులందును రౌద్రాదులందును శార్దూల మోజోగుణ విశిష్టముగా నుండుట మారనరచనయం దెడనెడ కానవచ్చుచున్నది.

ఉదా: 1. దేవాసురయుద్ధము-వీరము :

శా. "జంభాదిప్రకటాసురప్రకరము ల్శక్రాదిదేవాళియు
న్నుంభద్విక్రమకేళిలీల లెసఁగ న్సొమ్మింంచి యేకాగ్ర ము

జ్జృంభోత్సాహము లుల్లసిల్లఁగ జయశ్రీలోలత న్బోరఁ సం
రంభం బేది నిలింపు లోడి రసురవ్రాతాస్త్రభిన్నాంగులై". (2.220)

2 కువలయాశ్వుఁ డసురులలోఁ బోరుట- రౌద్రానుప్రాణితవీరము :

శా. దైతేయప్రవిముక్తదారుణగదాదండాసినానాయుధ
వ్రాతంబు ల్విలసత్తదాభరణవర్మశ్రేణియున్ జూర్ణ మై
పాతాళైకనికేతనాంతరమునం బర్వంగఁ జేసెన్ వెసన్
జాతామర్షత నక్కుమారుఁడు రణోత్సాహంబు దీపింపఁగన్. (2.336)

3. యుద్ధవర్ణనమునందు వీరప్రతివీరసమబలసూచనకు శార్దూలము నేచరణమున కాచరణము విరుగునట్లు మారన యొకచో రచించెను :

శా. ఆదండంబు నిశాతబాణములఁ దున్మాడెం గుమారోత్తముం
డాదైత్యుం డొక భూజముం బెఱికి తీవ్రామర్షుఁడై వైచిన
న్వే దానిం దిలమాత్రఖండములు గావించె న్నరేంద్రాత్మజుం
డాదైతేయుఁడు గప్పె నావిభుని సాంద్రాశ్మోగ్రవర్షంబునన్. (8. 68)

4. కథాకథనమునందేకాక పాత్రసంభాషణాదికమునందు రౌద్రానుప్రాణిత వీరరస స్ఫూర్తి కలిగించుట కొకయుదాహరణము :

శా. ఏమీ ! యస్త్రము సంహరింపఁ దగునంటే తండ్రి ! మద్వీర్యము
న్సామర్థ్యంబు తృణీకరించి యిటు లీసప్తర్షుల న్సభ్యుల
న్సామర్షాత్మకులై యకారణమ యీవ్యాబాధముల్ గూరు లు
ద్దామక్రోధులు చంపియుండఁ గను నీ తప్పేను సైరింతునే ? (8.254)

దుష్టోరగసంహారోన్ముఖుఁడైన మరుత్తుఁడు దారుణానలాస్త్రమును సంధించెను. అందుల కామరుత్తుఁడు రోషవివశుఁడై పలికినవాక్యము లివి. "ఏమీ!...''యనుటలో నాశ్చర్యాభిమానములహతాత్ప్రాభవము సూచితము. మద్వీర్యమున్ సామర్థ్యంబు తృణీకరించి సామర్షాత్మకులై యకారణముగా ఋషిగణమున కపకార మొనరించిన వ్యాబాధముల నేరము సైరింపరాని దనుటచే నమర్షోత్సాహములు వ్యంజింపఁబడినవి. అధర్మనిరసనరూపమును, దుష్టశిక్షణాత్మకమును నైనయుదాత్తోత్సాహ మిందు భాసించుచున్నది. వక్ర మగు స్వర మాద్యంతములందు నిబంధింపఁబడి మరుత్తునివాక్యమందలి గూఢవక్రోక్తిమత్త్వమును వ్యంజించుచున్నది. సహజద్రుతగతి యైన యీవృత్తమునందలి దీర్ఘాక్షరబాహుళ్యము, రషసవ్యంజనసంయుక్తపూర్వకగురువర్ణకత్వము గురుజనధిక్కారమున ధీరోదాత్తుని చిత్తవృత్తియందు భాసించు విలంబితోద్వేగమును, శత్రుగతమైన పరుషకోపదీప్తిని వ్యంజించుచున్నవి.

ఇట్లు వీరసరాక్రమాతిశయవర్ణనాత్మకములుగా శార్దూలములను వ్రాసి మారన లాక్షణికమతము ననుసరించెను.

క్షేమేంద్రుఁడే ధీరోద్ధతవృత్తములను వాక్పాకముచేత మహాకవు లధీరముల నొనర్చి సుకుమారరసములందును బ్రయోగింపవచ్చు నని పేర్కొనియుండెను. తన్మతాను సారము మారనమహాకవి శార్దూలవిక్రీడితమును శృంగారాదిరసములయందును బ్రయోగించెను.

శృంగారమున నీవృత్తమును సంభోగశృంగారవర్ణనమునందే నిబంధించుట మారన ప్రత్యేతలక్షణము. ఇతఁడు వాడిన మూఁడువృత్తములును నిట్టివే. (1) దత్తాత్రేయుఁడు మాయావనితతో గూడి సరోవరమునుండి వెలువలుట (2.205). (2) మదాలసాకువల యాశ్వుల శృంగారవిహారవర్ణనము (3.4). (3) వరూథినీమాయాప్రవరుల ప్రణయవిహార వర్ణనము (5.18).

సాంద్రపదబంధముచే ఛందము ఉదాత్తమై భావస్ఫూర్తిని సాంద్ర మొనరింపఁ గలదు. పైఘట్టములందు నాయికానాయకులగాఢానురాగబంధమును వ్యంజింపఁదలఁచిన మారన గాఢబంధము నిబంధించెను. దీర్ఘసమానబాహుళ్యమున నోజోగుణము భాసించి రసానుకూల్యము సిద్ధింప దని మొదటిపద్యమునఁ బ్రతిచరణమునకు మూఁడునాలుగు పదవిశ్రాంతులను గల్పించి వృత్తగతిని నధీరమొనర్చెను. కాని, మిగిలినరెండుపద్యము లందును ద్వితీయతృతీయచరణము లవిశ్రాంతములై యుండునట్లు రచించెను. ఛాందసికు లుద్ధతవృత్తము ననుద్ధత మొనర్చి లలితరసములందుఁ బ్రయోగించుటకై అనుస్వారాను నాసికతవర్గాదిపరకగుర్వక్షరప్రాచుర్యము ఛందమునందుఁ గూర్పవలె నని సూచించి యుండిరి. మారన తద్రహస్యమును గుర్తెఱింగినవాఁ డగుటచేఁ బై పద్యములన్నింటను అనుస్వారపూర్వకములైన యక్షరములను, అనునాసికములను, దీర్ఘాక్షరములను, అను ప్రాసను, వృత్త్యనుప్రాసను వాడి ఛందములను సాంద్రశృంగారరసానుకూలములుగాఁ దీర్చిదిద్దెను.

మఱియుఁ గథార్థములం దున్న భేదమును బురస్కరించుకొని మొదటివృత్తమున- నవధూత యోగవిలాసకృతమాయాశృంగారమున - నధమమైన యంగాంగవర్ణనమార్గ మును అనుసరించి నాయికను మాత్రమే వర్ణించెను. ఆభాస మగు శృంగారరసస్ఫూర్తిని సమాసవిశ్రాంతుల చేత వ్యంజింపఁజేసెను. మిగిలినరెండువృత్తములందును నాయికా నాయకులు విహరించిన స్థలజలప్రదేశవిశేషములును వర్ణించి, విభావస్వభావములను వ్యంజించి యుత్తమపద్ధతి నవలంబించెను. ఈయంశములను గథాకథనశిల్పాధ్యాయమునఁ గొంతవివరించుట యైనది.

కరుణరసవ్యంజకము లైన శార్దూలముల నోజోగుణవిరహితములుగా నొనర్చి, రసానుకూల్యము నందగించుటకు 1.172; 2.77; 8.241 పద్యము లుదాహరణములు.

మారన శార్దూలములను దైవస్తుతులందును, దైవగుణకీర్తనములందును బ్రయోగించి భక్తదేవచిత్తావస్థను వ్యంజించునట్లుగా వానినిఁ జిత్రించెను, మచ్చునకు: హర్షాత్ముఁడైన గజాననునిఁ బ్రశంసించినవిధము:

శా. "రంగద్గండతటీసహస్రసమదధారాగంధలోభభ్రమ
ద్భృంగీమంజులగీతి వీనుల కతిప్రీతిం గడల్కొల్ప స
ర్వాంగంబు ల్పులకాంకితంబుగఁ గడున్హర్షాత్ముఁడై యొప్పను
త్తుంగాంగు న్గజవక్త్రు మాకు నభివక్త్రుంగాఁ బ్రశంసించెదన్". (అవ.4)

హర్షోత్సాహవిలసితుఁడైన గజాననునిఁ బ్రసన్నునిఁ గావించుకొనుట కవి తాత్పర్యము. ఉదాత్తాలంకారముచే గజాననుని యుత్తుంగాకారమును వ్యంజింపఁజేసి, తదున్నతశరీరముపై ధారావాహికముగాఁ బ్రవహించుచున్న మదధారలను దీర్ఘసమాసమున స్ఫురింపఁజేసి, భృంగీమంజులగీతిని నాదాక్షరములందు ధ్వనింపఁజేసి, బిందుపూర్వకసరళాక్షరప్రాసమున భక్తిభావమాధుర్యమును, గజాననచిత్తమార్దవమును వ్యక్తీకరించి, ఛందమును రసానుకూల మొనర్చినాఁడు మారన.

ఉద్ధతరసదీప్తి గల దేవీమాహాత్మ్యమును బఠించినవారికిఁ గలుగు శుభాతిశయములను దేవీముఖముననే పలికించి నీరసకథార్థములకు సైతము ఔదాత్యము నాపాదించినాఁడు. (8.236). ఇట్లు శార్దూలవృత్తమును మారన వీరరౌద్రాదిరసములయందే కాక శృంగారకరుణభక్త్యాదిరసములందును, కథాకథనమునందును శిల్పసుందరముగా నిర్వహించెను.

## 2. మత్తేభవిక్రీడితము :

శార్దూలవృత్తపాదప్రథమగుర్వక్షరమును రెండులఘువు లొనర్చినచో మత్తేభవృత్తపాద మగును. గురులఘుసంఖ్య సమముగాఁ గల యీవృత్తము విలంబితద్రుతగతులను సమముగాఁ గలిగియుండును. సంస్కృతమున నీవృత్తమున కధికప్రాచుర్యము లేకున్నను దెలుఁగుకవు లీవృత్తము నభినివేశముతో వాడియుండిరి. మారన మార్కండేయమున శార్దూలములకంటె రెండింత లధికముగా నీవృత్తమును వాడెను.

మారన రచించిన శార్దూలములు 40

,, మత్తేభములు 79

మారన శార్దూలవిక్రీడితమువలె నీవృత్తమును వివిధరసభావానుకూలముగాఁ బ్రయోగించెను. దాని నీక్రిందివిధముగా విభజింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. | వీరరౌద్రాదులు - తదనుబంధభావములందు వాడినవి | — | 25 |
| 2. | కరుణాదులు - ,, ,, ,, | — | 14 |
| 3. | భయానకబీభత్సాదులు ,, ,, ,, | — | 4 |
| 4. | నరదేవగుణకీర్తనాదులు-ఉదాత్తవస్తువర్ణనము | — | 14 |
| 5. | ధర్మప్రబోధము | — | 8 |
| 6. | కథాకథనము | — | 14 |

వీరరౌద్రములం దీవృత్తము ప్రయోగార్హ మగునను లాక్షణికమత మున్నను మారన దీనిలో మూఁడింట నొకవంతుమాత్రము తద్రససంబంధులుగా వ్రాసెను. కరుణశాంతాదు

లందును గంభీరద్రవ్యగుణక్రియావర్ణనములందును, కథార్థకథనమునందును విరివిగా రచించెను. ధర్మప్రబోధమున నీవృత్తమును బరిమితముగాఁ బ్రయోగించెను. భయానకాదులందు వాడిన వత్యల్పము.

వీరాదిరసములం దీవృత్తమును మారన వాడినవిధము ఈక్రింద స్థాలీపులాకన్యాయముగాఁ బరామర్శింపఁబడుచున్నది.

*వీరరసము :*

మ. ''బలుసింగంబు బహుద్విపప్రకరము న్భంజించుచందంబున
న్బలవద్వైరినృపాలపాటనకళాపారీణతం బొల్చె నీ
బలియుం డుత్కటశౌర్యవిక్రమయశోభ్రాజిష్ణుఁ డై యాజిఁ గే
వలుఁడే ? యేరికి ధర్మయుద్ధమున గెల్వన్ వచ్చునే యాతనిన్". (8.128)

వైశాలి అవేక్షితపరాక్రమకీర్తన మొనర్చుట యిందలివస్తువు. సంపూర్ణోపమాలంకారశోభితముగా నిం దాతనిపరాక్రమాతిశయ మభివర్ణితము. అవేక్షితుఁడు మత్తేభసదృశులైన వీరులను భంజించినసింహమువంటివాఁడఁట ! నాయకసింహబలమును మత్తేభవృత్తమున నిబంధించుట యొకచమత్కారము. ఈకథలో స్వయంవరమునకు వచ్చిన రాజమత్తేభములచే నీసింహబలుఁడు అధర్మముగా నోడింపఁబడినాఁడు. మత్తేభములతాత్కాలికవిజృంభణముయొక్కస్మరణ మీపద్యమునందలి వాక్కులకు ప్రేరణము. కావున మత్తేభము సార్థక (వృత్త)నామ మగుచున్నది. మఱియు సింహపరాక్రమము మత్తేభవిజృంభణమువలెఁ గర్కశము కాదని మారననిష్కర్ష. అందువలన నీవృత్తమునందలి ద్వితీయపాదమునందు భాసించిన యోజోగుణము వృత్తమందంతటను భాసింపకుండ మారన భంజించుట; నాతిదీర్ఘ సమాసఘటనముచే వృత్తమున మాధుర్యగుణవిశిష్టమైన కైశికీవృత్తిని భాసింపఁజేయుట! ఇట్లగుటకు మఱియొకకారణమును గలదు. ఇందు వక్త్రి వైశాలి. అవేక్షితవీరగుణక్రియాదివర్ణనమున నామెచిత్తవృత్తియందు హర్షోత్సాహభావములు భాసించుచున్నవి. కావున నీవృత్తమున వక్త్రిచిత్తవృత్తిగత మైన విలంబిత మధురగతి కూడ వ్యంజింపఁబడుచున్నది. "సింగంబు - భంజించు చందంబు" అనునప్పుడు బిందుపూర్వకనాదాక్షరములను వాడుటచేతను, "బహుద్విపప్రకరము—" వైరినృపాలపాటనకళాపారీణతను బేర్కొనునప్పుడు పరుషాక్షరములను బుకారరకారములను బహువారము ప్రయోగించుటచేతను నాయకగత మైన మధురవృత్తియు, శత్రుగతమైన పరుషవృత్తియు వక్త్రిముఖమున నక్షరాశ్రిత మైన శిల్పమున వ్యంజింపఁబడుచున్నవి. "ఉత్కటశౌర్యవిక్రమయశోభ్రాజిష్ణుఁ" డనునప్పుడు బలవద్వైరులభంజనమునందు నాయకుఁడు పొందిన ఊష్మలతయు నూష్మాక్షరప్రయోగమున సూచింపఁబడుచున్నది. ధర్మయుద్ధమున నతఁ డనన్యసులభుఁ డని కీర్తించుటలో నతని యమోఘవీరము వ్యంజింపఁబడుచున్నది. వీరగుణక్రియావర్ణనాశ్రితమైన యుత్సాహ మీవృత్తమున నర్థసమర్పణగౌరవ మొందుచున్న దనుటలో విప్రతిపత్తి లేదు.

మారన యుద్ధాదివీరులందు వాడినవృత్తములు చాలవఱకు క్రియాబాహుళ్యమును వర్ణించునవిగను, వీరప్రతివీరకృత ప్రతిజ్ఞాధిక్కారవాక్యస్వరూపములుగను నున్నవి. తత్తత్సమయములందు తత్తద్వీరులచిత్తవృత్తిద్రుతివికలత్వావేగోద్వేగవ్యంజకములుగా గణపదసమాక్షరశిల్పములను మారన ప్రయోగించుటఁ గాంచనగును.

రౌద్రము :

మ. అనిన న్రాజులు రాజపుత్రులు ముమూర్షామర్షసంగ్రామహ
ర్షనిరూఢాత్మకు లై మహోగ్రవివిధాంచద్దీప్తిజాలోల్లస
ద్ధనదోర్దండవిలాసు లై పటుతురంగస్యందనారూఢు లై
యనికోద్దీప్తపదాతిపాదజపరాగాక్రామితాకాశు లై. (8.99)

అవేక్షితునిచే స్వయంవరమునఁ బరాభూతులైన నరపాలు రమర్షోద్దీప్తులై సర్వ సైన్యములను సమీకరించి యొక్కమ్మడి నవేక్షితుని డీకొనుట యిందలి వర్ణ్యవస్తువు. అలఁతియలంతిపదములచే నారంభ మై దీర్ఘదీర్ఘతరసమాసములచే నోజఃపూరితమై చతుర్థపాద మంతయు వ్యాపించిన దీర్ఘతమసమాసముచే నిబిడమై యొప్పు వృత్తగతి శత్రువీరులు క్రమముగాఁ గదుపుగట్టి దుర్గశిలాప్రాకారమువలె నెదురునిలిచిన వ్యూహక్రమమును, ఓజోగుణము తద్గతరౌద్రస్ఫూర్తిని వ్యంజించుచున్నవి. వక్రతమవిశిష్టమైన యంతస్థము వృత్త్యనుప్రాసమున నిర్వహింపఁబడి శత్రుచిత్తగత కుటిలదీప్తిని బహిర్గత మొనర్చుచున్నది.

జన్యజనకరసనిరూపణమును మారన యేకవృత్తమున వ్యంజింపఁజేయు నైపుణ్యము నచ్చటచ్చటఁ బ్రదర్శించినాఁడు.

మ. చతురంగధ్వజినీపదప్రచలితక్ష్మాచక్రు లై విక్రమో
న్నతి నవ్వీటిపయి న్నిపు ల్విడిసిన న్సంక్షీణసైన్యార్థఁ డై
యతిభీతి న్మరణంబు వేఁడుచు వగ న్హస్తంబు లాస్యంబుఁ జే
ర్చి తతోచ్ఛ్వాసము లబ్బలాశ్వుఁ డొనరించె న్శోకసంవిగ్నుఁ డై. (8.84)

కరుణరౌద్రములు జన్యజనకరసములు. శత్రుకృతరౌద్రోద్రేకము బలాశ్వునియందు శోకమును జనింపఁజేసినది. పద్యపుఁబెత్తుగడలో నున్న యోజోగుణదీప్తి క్రమముగ విరిసిపోయి భయశోకముల కనుగుణముగా మందగించినది. కకారరకారషకారపునరావృత్తిచే శత్రుక్రౌర్యమును, ఊష్మాక్షరావృత్తిచే బలాశ్వునియందలి యుచ్ఛ్వాసబహుళ మైన నిర్వేదమును అక్షరవృత్తి వ్యంజించుచున్నది.

మారన రౌద్రరసానుగుణముగా రచించిన మత్తేభములు షష్ఠాశ్వాసమునం దధికముగాఁ గానఁబడుచున్నవి. దేవాసురవిజృంభణప్రధానమైన యాకథాఘట్టమున కావృత్తము సహజాలంకార మనుటలో సంశయము లేదు.

మారన దుఃఖాదిభావవ్యంజకముగా మత్తేభవృత్తమును వాడి యొప్పించెను. మత్తేభము గంభీరగతి కలది కావున నుదాత్తచిత్తవృత్తులయౌన్నత్యమును వ్యంజించుటకు వీలుపడును.

మ. పతి మూర్ఛాగతుఁ డైనఁ జూచి సతి బాష్పచ్ఛన్న వక్త్రాబ్జ యై
ధృతి యొక్కింతయు లేక వావిడిచి యార్తి న్హా ! మహారాజ ! హా
చతురంభోధిపరీతభూభవన భాస్వద్బాహుఖడ్గాగ్రచూ
ర్ణితవీరారిశరీరభూషితధరిత్రీభాగ ! హా ! వల్లభా ! (1.201)

మూర్ఛాగతుఁ డైన హరిశ్చంద్రునిఁ గాంచి శైబ్య యెలుఁగెత్తి విలపించుట యిందలి వస్తువు. మారన దుఃఖభావవ్యంజకముగా నీవృత్తమున నోజస్సును గూర్చుట యొక విశేషము ! మహావీరుఁడైన హరిశ్చంద్రుఁడు మూర్ఛనొంది భూపతితుఁ డగుటతోడనే శైబ్య కాతని పూర్వవైభవము స్మృతికి వచ్చినది. భూతవర్తమానస్థితులతుల్యాపరిశీలనముచే నామెడెందము వెల్లువయై మేరలు తప్పినది. వావిడిచి దుఃఖించినది; "హాహా" కారము లొనర్చి యనంతదుఃఖమును బ్రకటించినది. "చతురంభోధిపరీతభూభవనభాస్వద్బాహుఖడ్గాగ్రచూర్ణితవీరారిశరీరభూషితధరిత్రీభాగ !" యని వాపోయినది. ఎంతవీరున కెంతటిగతి పట్టిన దని యామెభావము. అది పరికరాలంకారముచే వ్యంజితము. పైదీర్ఘసమాసము నాయకవీరరౌద్రవ్యంజక మగుటచే సార్థకము ! శైబ్యాహృదయస్థ దుఃఖభావబృహత్స్వరూపబోధక మగుటచే సుందరము !

మహాప్రాణములైన యోష్ఠ్యములయొక్కయు అంతస్థమైన రవర్ణముయొక్కయు బహువారావృత్తి గల యాదీర్ఘ సమాసము శైబ్యాముఖవినిర్గతమహారోదనధ్వనిని హృదయగత దుర్భరబాధాతిశయమును బట్టియిచ్చుచున్నది. "హా" యను మహాప్రాణాక్షరోచ్చారణ మామెధృతిరాహిత్యమును, దుఃఖవివశత్వమును వ్యంజించుచున్నది. "బాష్పచ్ఛన్నవక్త్రాబ్జ" యనుటలో రసానుకూలవిభావవర్ణనము సామర్థ్యముతో నొనర్పఁబడినది. ఉన్నత వంశసంజాతయైన శైబ్యచిత్తమునందు మహాప్రవాహరూపముగా వెలువడిన దుఃఖభావము పద్యోత్తరార్ధమున గంభీరముగాఁ బ్రపంచించుట మారనప్రత్యేకత !

శాంతరసానుగుణమైన నిర్వేదభావమును వ్యంజింపఁజేయుటకుఁ గూడ మారన మత్తేభము నొండురెండుచోట్ల వాడియున్నాఁడు. ఉదా : జడునినిర్వేదము (2.26).

*దైవవర్ణనము :* గంభీరగతిగల మత్తేభము ఉదాత్తద్రవ్యవర్ణనమునందు మారనచే సార్థకముగాఁ బ్రయోగింపఁబడిన దనుటకుఁ గావ్యారంభమున నొనర్చిన హరవిరించివర్ణనము లుదాహరణములు. (అవ. 2,3) హరవిరించులు ఉత్తమదైవములు. హరుఁడు సముద్రునివలె గంభీరుఁ డనుట తద్వృత్తగతసావయవరూపకాలంకార ప్రయోజనము. విరించిస్వభావము ద్రవ్యస్వభావోక్త్యలంకారమునఁ బ్రగమవికాససుందరముగాఁ వర్ణింపఁబడినది. పైరెండువృత్తములందును సమముగాఁ బాటింపఁబడిన రకారప్రాసము దైవద్వయసమత్వమును వ్యంజించుచున్నది. మారన హరవర్ణనమున నుత్తరపాదద్వయమునందును, విరించివర్ణనమునఁ బూర్వపాదద్వయమునందును ద్విప్రాసను బాటించి ఛందముల నలంకరించెను.

*ఉదాత్తకవివర్ణనము :* వ్యాసవాల్మీకి స్తుతులు (అవ. 7,8) శంకరచతుర్ముఖ స్తుతులకు సదృశములై యున్నవి. పురాణప్రవక్తయైన వ్యాసుని వర్ణనమున రూపకాలం

కారము ప్రయోగించి ఛందము నర్థగంభీర మొనర్చెను. వాల్మీకి నుదాత్తముగా వర్ణించి యాదరగౌరవము ప్రకటించెను.

*ఉదాత్తవీరవర్ణనము :* శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధి యగుచున్న మరుత్తునిపు లావణ్యమునందేకాక శాస్త్రాదిపాండిత్యమునందును పరిణతి సాధించె నని 8.209వ పద్యమున మారన వర్ణించెను. తనుసౌందర్యమునకు బుద్ధివికాసము చేదోడు వాదోడగుటచే నాతనియుత్సాహము సమగ్రమై యుదాత్త మగుచున్నది. వీరరసానుగుణ మైన యేతద్వర్ణనము మత్తేభవృత్తమున నర్థగాంభీర్యము నందగించుకొనినది.

*వంశవర్ణనము :*

మ. అమలంబు ద్ద్విజరాజవర్ధనము మర్యాదాన్వితంబున్ గుణో
త్తమరత్నంబు ననంతభోగమహిమోదారంబు గాంభీర్యధు
ర్యము శ్రీజన్మగృహంబు నై శుభయుతం బై యాచతుర్థాన్వయం
బమృతాంభోనిధిమాడ్కి నుర్విఁ గడుఁ బొల్పారు న్జనస్తుత్య మై. (అవ. 29)

మారన తనకృతిపతివంశము నభినివేశముతో సాలంకారముగా మత్తేభవృత్తమునఁ గీర్తించెను. అన్వయము నంభోధితోఁ బోల్చుట కవిసమయము. అమృతాంభోధి యను టచే దానియౌదాత్త్యమును, నైర్మల్యమును, గాంభీర్యమును, శాశ్వతత్వమును వ్యంజితము లగుచున్నవి. అమలాదివిశేషములన్నియు సాభిప్రాయము లగుటచే పరికరానుప్రాణితో పమాలంకారము వృత్తమున కలంకారప్రాయ మగుచున్నది. అంతియకాక "ద్విజరాజ" "మర్యాద" "గుణోత్తమరత్నంబు" "భోగ" "గాంభీర్య" "శ్రీ" యను పదములందలి శ్లేషలు చతుర్థాన్వయాంభోధియందలి యుపమానోపమేయద్రవ్యగుణకీర్తన సమర్థములై యొప్పుచుండుటచే నిందు శ్లేషోపమ లంగాంగిసంకరము నొందినవి. వృత్తపూర్వార్ధమున నొకవిధమును, ఉత్తరార్ధమున మఱియొకవిధమును నైన యంత్యప్రాసలఁ బాటించి మారన వృత్తగతియందు విశ్రాంతిని, శ్రవణమాధుర్యమును సంతరించెను.

ఇట్లే వన, గిరి, వర్షవర్ణనాదులకు ఉదాహరణములు :

1. వన, గిరి, వర్షవర్ణనలకు 1.9; 1.22; 4.199; 205 పద్యములను క్రమముగా గైకొనవచ్చును.
2. మారన ధర్మశాస్త్రవిషయబహుళముగా నిర్మించిన మార్కండేయపురాణతృతీయా శ్వాసమునందు మత్తేభవృత్తమును ధర్మప్రబోధసాధనముగా గైకొని యుదాత్త ముగా నిర్వహించెను. తృతీయాశ్వా. 143, 146, 147, 156, 180, 237, 313 పద్యము లందుల కుదాహరణములు.

### 3. చంపకమాల :

మత్తేభశార్దూలములవలె చంపకోత్పలమాలలు తెలుఁగుకావ్యములలో జంటకవుల వలెఁ బ్రవర్తిల్లుచున్నవి. తెలుఁగుకవులు పైజంటలలో మత్తేభచంపకమాలావృత్తములను దమకావ్యములం దధికముగా రచించియుండిరి.

చంపకమాలావృత్తగతి భావవ్యక్తీకరణమున కుపయోగించు విధమునుగూర్చి డా. పాటిబండ మాధవశర్మగా రిట్లు నుడివియున్నారు : "విచ్ఛేదవశమున పాదఖండములు తుల్యప్రమాణము లగుటచేతను, పాదమునందలి గురులఘువులవిన్యాససామంజస్యము వలనను, చంపకమాలావృత్తపాదము మిక్కిలి సుఖముగఁ బ్రయోగింపఁదగియున్నది. 21 అక్షరములలో 14 లఘువు లైన దీనిగతి మిగులద్రుతము. లఘ్వక్షరప్రాయమైన యీవృత్తము చిత్తవృత్తియతనువాహియైన పట్టులందు- అనఁగా వీరరౌద్రాదులందుఁ బ్రయోగింపఁదగినది. సమాంతర వినివిష్టములైన గుర్వక్షరములు చంపకమాలాద్రుత గతియందు విలంబన మాధానము చేసి కొంతవఱకు సామ్యము భాసింపఁజేయుటచేత ద్రుత్యభిముఖ మైన సమగతి గల రత్యాదిభావములందును ఈవృత్తము ప్రయోగింపఁదగి యున్నది. లక్షణమునుబట్టి చంపకమాల జగణమయము. అనఁగా ద్రుతోత్ప్లుతగతి కలది. కాని, పదఘటనావశమున జగణములు స్థగితములై భగణములు రూపుకట్టవచ్చును. అట్టిచంపకమాల ద్రుతావరోహణగతి గలది యగును. ద్రుతియందు ఉత్ప్లుతి భాసించి నచో వీరాదులు, అవరోహణము భాసించినచో శృంగారాదులు చంపకమాల నిర్వహింపఁ గలదని భావింపవలెను.[15]

మారన మార్కండేయమున 211 చంపకమాలలు ప్రయోగించెను. అందు వీరరస వ్యంజకములుగా 30, ఉదాత్తద్రవ్యవర్ణనాత్మకములుగా 28, కరుణరసవ్యంజకములుగా 26, స్తుతిపరములుగా 21, శృంగారరసమున 16, రౌద్రరసమున 13, ప్రబోధమున 13, శాంతమున 7, అద్భుతభయానకబీభత్సములందు 7, వత్సలాదులందు 6, మిగిలినవి కథాకథనసందర్భములందును ఉపయోగింపఁబడినవి. దీనినిబట్టి మారన యీ ఛందమును వీరరౌద్రాదులందుకంటెఁ గరుణశృంగారభక్త్యాదులందే యధికముగాఁ బ్రయో గించె నని తెలియుచున్నది. మారన చంపకమాలకు సహజమైన జగణప్లుతిని సుష్ఠుగా భాసింపనీయక పదఘటనావశమున వానిస్థానములందు భగణాదులను రూపుగట్టించుట యందే యభినివేశమును బ్రకటించెను. వీరాదిరసములను వ్యంజింపఁజేయు వేళలయందును మారనరచనలో నీలక్షణము ప్రస్ఫుటముగాఁ గానవచ్చును. జగణోత్ప్లుతి లేకపోయినను గుణరీత్యాదులను రసోచితముగా ఛందమున నిబంధించి ప్రకరణమును రక్తికట్టించును :

మారన దాదాపు 80 చంపకమాలావృత్తములను ద్విత్రిప్రాసాది ఛందోఽలంకార ములచే నలంకరించెను. ఉదాహరణమునకు :

ద్విప్రాస : పాదచతుష్టయమునందు ద్విప్రాస :

చ. కర మనురాగ ముల్లమునఁ గ్రమ్మఁగ నమ్మృగిపుచ్ఛమూలము
స్సరమున నంటుచు న్నృపతి కామవికారము నొందె వీఁకఁ ద
త్పరమతి యై తనుం దివుచు పార్థివుచిత్త మెఱింగి యేల నీ
కరమునఁ బుచ్ఛమూల మిటు కాయ్యునఁ బట్టెదు మేదినీశ్వరా ! (5.232)

15. ఆం. మ. భా. ఛం. శి. పు. 419.

సురాష్ట్రుఁడు ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుఁ దన కాదరువుగా దొరికిన మృగియందు కామాసక్తుఁడైన వస్తు వీపద్యమున వర్ణితము. తామసమనూత్పత్తిహేతు వగు సురాష్ట్రుని రతిభావమును మారన యలంకృతచ్ఛందమున వినిర్మించెను. తత్త్వతః ఈకామము తామసికము, రసాభాసము. కాని, మృగీపూర్వజన్మశ్రవణానంతర మిది యుజ్జ్వలమును, జ్ఞానసమన్వితమునై భాసింపఁగలదు. కావున, మారన యొనర్చిన ఛందోలంకారము సార్థకమై ప్రరోచనప్రాయ మగుచున్నది. వృత్తమునందు సహజముగా భాసింపవలసిన పదునాలుజగములను భంజించి, భగణస్ఫూర్తిని గల్పించి ఛందమును రతిభావచిత్తవృత్త్యనుగుణముగా మధురతరము గావించెను. నృపుని కామవికారమును, మృగి పార్థివునిచిత్త మెఱుఁగుటయును దెల్పువేళ జగణద్వయప్లుతిని భాసింపఁజేసి వారిరువురియందు సమముగా స్ఫురించెడి రత్యుద్దీప్తిని కవి వ్యంజింపఁజేసెను. ఇట్లే :

(1) పాదత్రయమునందు ద్వి్ప్రాస పాటింపఁబడినవి : 2.287; 5.13; 5.112; 5.186; 5.194; ఇందు నైదు పద్యములు పంచమాశ్వాసముననే యుండుట విశేషము.

(2) వృత్తపూర్వార్ధమున ద్విప్రాస పాటింపఁబడినవి : 1.67; 1.200; 2.157; 2.231; 2.295; 3.164; 5.29; 5.124; 5.209; 8.144.

(3) వృత్తోత్తరార్ధమున ద్విప్రాస పాటింపఁబడినవి : 1.21; 1.121; 1.157; 1.254; 3.359; 5.194; 5.254; 7.214; 8.28; 8.65; 8.105.

(4) ప్రథమచతుర్థపాదములందు ద్విప్రాస పాటింపఁబడినవి : 1.162; 2.107; 2.164; 4.19; 4.104; 4.229; 5.22; 7.42; 7.166.

(5) ప్రథమ తృతీయ పాదములందు ద్విప్రాస పాటింపఁబడినవి : 1.4; 1.138; 2.258; 3.28; 3.282; 4.42: 4.197; 5.198; 6.7; 6.92; 8.214; 8.239.

(6) ద్వితీయతృతీయపాదములందు ద్విప్రాస ఘటింపఁబడినవి : అవ.10;42; 2.59; 2.120; 2.195; 3.82; 3.152; 3.231; 3.339; 4.19; 4.166; 5.81; 6.79; 7.56.

(7) ద్వితీయచతుర్థపాదములందు ద్విప్రాస ఘటింపఁబడినవి : 2.174; 2.280; 3.326; 3.381; 4.153; 5.58; 7.2:9; 7.256; 8.26.

**త్రిప్రాస :** మారన ఛందములందుఁ గూర్చిన ద్విప్రాసలు కృతకములు కాక యతిసహజములై యుండుటచే నవి యతనిరచనకు సహజాలంకారము లనియు, అతఁడు వశ్యవా క్కనియుఁ దేఁటపడుచున్నది. మారన ద్విప్రాసవలె త్రిప్రాసను విరివిగా వాడలేదు. పాదత్రయచతుష్టయములందు వాడిన త్రిప్రాసలు మార్కండేయమునఁ గానఁబడుట లేదు. మారన వృత్తపూర్వార్ధముకన్న నుత్తరార్ధముననే యలంకృత మొనర్చుటయందాసక్తి కనఁబఱచినట్లు పరిశీలనవలన స్పష్టమగుచున్నది. ఛందముయొక్క యెత్తు

గడలోని గాంభీర్యము వృత్తము సగము నడుచువఱకు శ్రోతచిత్తమును రంజించుచుండి నాపైన ఛందోలంకారముచే వృత్తమును మధురతర మొనర్చి స్వాదువుగాఁజేయుట మారన ఛందోనిర్మాణము : ఉదాహరణకు :

(1) ఉత్తరార్ధమునఁ ద్విప్రాస పాటింపఁబడినవి-

చ శివుఁ డగజాత రాఘవుఁడు సీతఁ గిరీటి సుభద్రఁ బెంపుసొం
పు వెలయఁ బ్రీతిఁ బెండ్లి యగు పోల్కిని నాగచమూవిభుండు భూ
రివిభవ ముల్లసిల్లఁగ వరించె సమంచితరూపకాంతిభా
గ్యవిభవగౌరవాదిసుగుణానుకృతాంబిక మల్లమాంబికన్ (అవ. 36)

కృతిభర్తమాతాపితరుల యుదాత్తవివాహవర్ణన మీవృత్తమునందలివస్తువు. మారన యీ వృత్తము నర్థాలంకారములతోడనే కాక శబ్దచ్ఛందోలంకారములచేతను రమణీయతర మొనరించెను. ఇందలి యుపమానమాలంకారములు సార్థకములు. ఆదిదంపతులైన శివపార్వతులు, ఆదర్శవంతులైన సీతారాములు, కూరిమిదంపతులైన కిరీటిసుభద్ర లీవృత్తమున నుపమానస్థానములు. వారిగుణవిశేషములు నాగయ మల్లమాంబికలవైవాహికవృత్తమున భాసించినవని తాత్పర్యము. మారన 'విభవ'శబ్దము నుత్తరార్ధమున త్రిప్రాసలో నిలుపుటచేఁ బై వివాహములందు లేని విభవ మీదంపతులపెండ్లియందు కలదని చమత్కారము :చమూపతియైననాగయకు మల్లమ పాణిగ్రహణమున విభవ ముల్లసిల్లినది. భాగ్యవిభవము పార్వతికివలె మల్లమకు జన్మతో వచ్చిన శుభలక్షణము : సతికి విభవము పతివాల్లభ్యము : 'సమంచిత...గుణానుకృతాంబిక' యని మారన మల్లమాంబికను గీర్తించెను. అందు పార్వతి పొందిన పతివాల్లభ్యము వంటిది వ్యంగ్యము. కృతిపతి మాతాపితరులను ఉమామహేశ్వరులని భావించుటకంటె నౌచిత్యము మఱొండు లేదు. నాగయయందు పరమేశ్వరత్వము వ్యంగ్య మొనర్చుట మారనసామర్థ్యము. ఆభిజాత్యమును సూచించు రాఘవశబ్దము కన్న జగదేకపరాక్రమత్వమును వ్యంజించు కిరీటిశబ్దముకంటె మంగళప్రద మైన 'శివ'శబ్దము నాదియందు ఉపమానస్థానమున నిలుటయు, ''అగజాత''శబ్దముచేత రత్నసంపదయు, 'సీత'శబ్దముచేత నపారభూ(నాగేటిచాళ్ళ)సంపదయు; 'సుభద్ర'శబ్దముచేత నుత్తమజాతి నాయికాత్వమును వ్యంజించి, తత్ఫలభాక్కుల కుపమేయస్థానముగా నాగయను దెలుపుటయు నర్థాలంకారసంవిధానచాతుర్యము : ఏతద్విధవైభవమును శ్రవణసుభగ మొనర్చునది త్రిప్రాస. ఇట్టివృత్తములు- 2.71; 4.157.

మఱియు (2) ప్రథమచతుర్థపాదములందు త్రిప్రాసకు- 2.164
(3) ప్రథమతృతీయ ,, ,, 3.363; 4.214; 6.162
(4) ద్వితీయతృతీయ ,, ,, 3.138; 6.110
(5) ద్వితీయచతుర్థ ,, ,, 2.165; 3.282; 7.99

(6) చరణత్రయమునందు పంచాక్షరప్రాస :

చ. అని మునిశాప మిచ్చుటయు నావనితామణి శోకతప్త యై
యినుఁ డుదయింప మత్పతికి నెగ్గు ఘటిల్లెడు నట్లయేని న

య్యనుఁ డుదయింపకుండు నిఁక నేను బతివ్రత నైన నన్న న
య్యనుఁ డుదయింప నోడె విను మిట్టివసుమ్ము సతీప్రభావముల్. (2.169)

పతివ్రతాప్రభావమునకు వెఱచి యినుఁ డుదయింపకుండుట యిందలివస్తువు. వృత్తగతి ప్రాసయతిస్థానములందును, షడక్షరస్థానమునందును విరామవంత మగుటచే చిత్తసుఖావహ మై ప్రతిపాద్యవస్తువును ప్రసన్న మొనర్చుచున్నది. ఇం దాద్యంతపాదములు పౌరాణికవాక్యములు. నడిమిరెండుచరణములు పతివ్రతవాక్యములు. ఇందు పతివ్రతవాక్యములను గతియందు బింబప్రతిబింబములుగా నిర్మించుట శిల్పము. లల,సల,భల,గల, జల,గల,గ- అగు వృత్తగతిచే శాపవాక్యాక్షరస్మరణజన్యమైన చిత్తద్రుతియు, అవరోహణరూపమైన దైన్యమును, తరంగరూపమైన యుద్వేగమును వ్యంజితమగుచున్నవి. చరణద్వయ గతిసామ్యముచే నవి స్ఫుటము లగుచున్నవి. కథార్థమున ప్రాణప్రాయమైన సూర్యోదయప్రసక్తి పంచాక్షరప్రాసగా నిబంధించుట ఛందోంగముచేఁ బతాకస్థానమును వ్యంజించుట యనెడిశిల్పవిశేషము : మార్కండేయమున నిట్టివృత్త మొకటిమాత్రమే కనఁబడుచున్నది.

(7) పూర్వార్ధమున బింబప్రతిబింబరూపములైన పాదములు గలవృత్తము :

చ. సుజనులయందు లక్ష్మి యయి సూరిజనంబులయందు బుద్ధి యై
కుజనులయం దలక్ష్మి యయి గోత్రపవిత్రులయందు లజ్జ యై
ద్విజవరులందు శాంతియయి విస్ఫురణం జెలువొందు దేవి తే
ము జయజయధ్వను ల్చెలఁగ మ్రొక్కెద మర్థిఁ ద్రిలోకరక్షకై (6.122)

సుర లొనరించిన మహిషాసురమర్దనీస్తుతిలోని యొకపద్య మిది. భక్తిభావోన్మత్తము లైన చిత్తములు దేవతాస్వరూపనిరూపణప్రవరణము లై సమానస్వరూపము లైన చరణముల నుచ్చరించుట యత్యంతసహజము. చంపకమాల కంఠమున ధరించిన దేవీమూర్తి యుదరము వఱకు సమలంకృతయై శోభిల్లునట్లు మారన ఛందమును రెండున్నర పాదముల వఱకలంకృత మొనర్చి శేషము నట్లు కావింపక వదలి చమత్కరించినాఁడు.

మారన మార్కండేయమునం దొక్కొక్కయాశ్వాసమునందు తత్తద్వస్తురససంబంధు లైన ప్రయోజనముల నుపలక్షించి చంపకమును సందర్భోచితముగా వాడినట్లు పరిశీలనము వలనఁ దెలియుచున్నది. ప్రథమాశ్వాసమునఁ గరుణరసానుగుణముగను, ద్వితీయాశ్వాసమున శృంగారవీరకరుణబీభత్సరసానుగుణముగను, తృతీయాశ్వాసమునఁ బ్రబోధమునందును, శాంతవీరకరుణాదులందును, చతుర్థాశ్వాసమున నుదాత్తవర్ణనమునందును, పంచమాశ్వాసమున నుదాత్తవర్ణమునందేకాక శృంగారకరుణములందును, షష్ఠాశ్వాసమున రౌద్రవీరములందును, స్తుతులందును, సప్తమాశ్వాసమున భక్తివీరశృంగారములందును, అష్టమాశ్వాసమున వీరరౌద్రకరుణములందును, ఉదాత్తవర్ణనమునందును బ్రయోగింపఁబడెను. ఒక్కొక్కరసమునందు వాడినవృత్తములఁ గొన్నింటి

నొక్కొక్క సముదాయముగా గ్రహించి, వానియౌచిత్యమును గొంత యిచ్చట ప్రస్తావించుట జరుగుచున్నది.

(1) కరుణరసభావసంబంధులు- (i) పశ్చాత్తాపరూపమైన బలరామనిర్వేదము. (1.138) (ii) భార్యాసుతుల నమ్మికొనినందులకు హరిశ్చంద్రునిశోకము. (1.220). (iii) విగతజీవుఁ డైన పుత్త్రునిగూర్చి హరిశ్చంద్రుఁడు విలపించుట. (1.253, 254). (iv) కువలయాశ్వుఁడు తండ్రిలేనిపుత్త్రుల దీనస్థితిని జెప్పి దీనుఁడగుట. (3.77) (v) మానిని రాజ్యవర్ధనుని తల నరయుటఁ గాంచి దుఃఖించుట. (7.139) (vi) భ్రాతృమరణమునకు ఖనిత్రుఁడు దుఃఖించుట. (8.35)

కరుణరసానుకూలము లైన భావములను వ్యంజించు వైవృత్తములలో 3.77 తప్ప మిగిలినవానియందు చపలమైన జగణస్ఫూర్తి స్థగితమై నల, సల, భ, ర, గలు అధికముగా భాసించుచు వక్తృచిత్తద్రుతిని, ఆరోహణావరోహణ గతులను, విలంబగతులను, ఛందమునఁ బ్రస్ఫుట మొనర్చుచున్నవి. 3.77 పద్యమునందు మారన చంపకమునందలి పదునాఱుజగణములకుగాను పదునాలుగింటిని పదఘటనావశమున భాసింపఁజేసి పిన్ననాఁట పితృవియోగము గలిగినసుతుఁడు నిజకుటుంబభారవహనమునఁ గాంచు తీవ్రదుఃఖవేదనమును, తత్కర్తృవక్తృచిత్తమును వ్యంజింపఁజేసెను.

(2) రతిభావోద్వేగమునందును మారన జగణములను స్ఫురింపఁజేసి విభావచిత్తవృత్తి వ్యంజించిన తరుణములును గొన్నికలవు. ఉదా: 5.13; 2.315. (3) ఉదాత్తద్రవ్యవర్ణనమునందు వాడఁబడిన చంపకమాలలు- ఉదా: (1) మహాభారతప్రశంస-1.4; 2.280; 2.290. (2) దేశవర్ణనము-4.154. (3) భారతవర్షవర్ణనము-4.182. (4) అపేక్షితభూపాలవర్ణనము-8.93. (4) స్తుతిపరములైన వృత్తములు: (1) గురుస్తుతి. మహాకవిస్తుతి-అవ.10. (2) దేవీస్తుతి-6.43. (3) పితృదేవతాస్తుతి-7.26. (4) ఆశ్వాసాంతపద్యములు-1.286; 4.255; 6.262; 8.288.

ఆశ్వాసాంతపద్యములుగా రచింపఁబడిన చంపకమాలలు—

తరలావృత్తమునందు ప్రతిపాదసమఖండానుప్రాసమును బాటించిన మారన చంపకమాలావృత్తమునందు సర్వపాదవిషమఖండానుప్రాసను ఒకపద్యమునందును (1.286), పాదత్రయమున విషమఖండానుప్రాసను మిగిలిన మూడింటియందును, వాడెను. చతుర్థషష్ఠాష్టమాశ్వాసాంతపద్యము లైన చంపకమాలలో నాల్గవచరణమునఁ అనుప్రాసను బాటించి, తద్విశేషణముల వైశిష్ట్యమును వ్యంగ్యముగాఁ బ్రదర్శించెను. కృతిభర్తయైన గన్నయను మారన గౌరవప్రపత్తులతోఁ గీర్తించుఛందములు శబ్దార్థాలంకారమంజులములై శ్రవణానందమును గల్గించుచున్నవి.

## 4. ఉత్పలమాల:

చంపకమాలావృత్తమునందలి ప్రతిచరణాది లఘుద్వయము నొక్కొక్క గురువుగా మార్చినచో నుత్పలమాలావృత్త మగును. భ-ర-న-భ-భ-ర-వ-యను గణముల

విన్యాసము ప్రతిచరణమున నుండును. తొమ్మిదవయక్షరము పైన యతి. ఈవృత్తగతి యందు భగణప్రభావ మధిక మగుటచే నవరోహణాత్మకమై మధురప్రసాదాదిగుణాను కూలమై వర్తించును. దీనియందలి భగణములను విశ్లథము చేసి జగణ సగణస్ఫూర్తి భాసింపఁ జేసినచో నుద్వేగవంతము లగు వీరరౌద్రాదులను భాసింపఁజేయవచ్చును.

మారనకవి మార్కండేయమున 134 ఉత్పలమాలావృత్తములను రచించెను. అందు స్థూలముగాఁ బదునాఱింటిని వీరమునందును, పదునాలుగేసి భక్తికరుణములందును, పదింటిని శృంగారమునందును, పదునొకండు ఉదాత్తద్రవ్యవర్ణనమునందును, తొమ్మిది రౌద్రమునందును, ఐదింటి నద్భుతమునందును, నాలుగింటిని ప్రబోధమునందును, రెండేసి శాంతవత్సలభయానకబీభత్సాదులయందును, ఆఱింటిని దయాభావమునందును, మూఁడింటిని హర్షాదులందును, మిగిలినవి కథాకథనమునందును వినియోగించెను. దీనివలన మారన యుత్పలమాలను పరుషము లైన వీరరౌద్రములందును, లలితము లైన శృంగారకరుణభక్త్యాదులందును, ఉదాత్తవర్ణనాదులయందును సమానాభినివేశముతోఁ బ్రయోగించినట్లు తెలియుచున్నది. చంపకమాలవలె నుత్పలమాలను మారన వివిధరసములందు వాడినను, ప్రబోధమునందు చంపకమును వాడినంత విరివిగా నుత్పలమును వాడ లేదు. సంస్కృతమునం దంతప్రాచుర్యము చెందని యీవృత్త మాంధ్రకవుల యభిమానమును చూఱగొని వివిధరసములందు యథోచితముగాఁ బ్రయోగింపఁబడుచున్నది. తెలుఁగునఁ జంపకమున కున్న ప్రయోగబాహుళ్య మీవృత్తమునకు లేదు కాని, చంపకమున కున్న గౌరప్రవృత్తులు ఉత్పలమునకును గలవు.

మార్కండేయమున నలంకృతోత్పలములు రమారమి 65 కనఁబడుచున్నవి. అందు ద్విప్రాసచే నలంకృత మైనవి యధికముగా నున్నవి.

ద్విప్రాస :

(1) పాదచతుష్టయమున - 1.55.
(2) వృత్తపూర్వాపరార్ధద్వయభిన్నము - అవ. 32; 3. 118; 3. 267; 7. 87
(3) పాదత్రయమునందు - 1.63; 3.368; 3.374; 3.390; 6.105; 6.195.
(4) పూర్వార్ధమున - 2.127; 2.231; 2.318: 3.185; 3.276; 4.111; 4.217; 5.63; 7.128.
(5) ఉత్తరార్ధమున - 5.77; 5.285; 7.82; 7.145; 8.170.
(6) ప్రథమచతుర్థపాదములందు - అవ.17; 4.103; 5.9; 5.184; 5,188; 5.351; 6.182; 6.193; 8.167.
(7) ప్రథమతృతీయపాదములందు - 1.237; 2.139; 2.197; 3.352; 4.144; 5.250; 5.286: 7.113; 8.124: 8.215; 8.239.
(8) ద్వితీయతృతీయపాదములందు - 4.208; 4.230; 4.232; 5.355; 6.255 7.46; 7.216; 8.115.
(9) ద్వితీయచతుర్థపాదములందు - 3.13; 3.352; 5.215; 8.66.

త్రిప్రాస :

(1) ఉత్తరార్ధమున - 2.38; 2.208.

(2) ప్రథమతృతీయచరణములందు - 1.35; 7.190.

(3) ద్వితీయ తృతీయచరణములందు - 3.390; 6.105.

కవి కావ్యమునఁ బ్రతిఛందమును లాక్షణికప్రోక్తమైన గణములను సమావేశపఱచి నిర్మించుచున్నను పదఘటనావశమున సహజగణముల నచ్చుపడునట్లు విరచించుట చాలయరుదు. భావానుగుణముగా వానిని సమావేశపఱచియు, శకలిత మొనర్చియు ఛందమును నిర్మించుట శిల్పము : మారన యిట్టిశిల్పమార్గము ననుసరించి, రసానుగుణముగా నీఛందమును అక్షరాశ్రితపదాశ్రితములైన బహువిధగతులు భాసించునట్లు నిర్మించెను. అట్టివానిని స్థాలీపులాకన్యాయముగాఁ బరిశీలించుట జరుగుచున్నది.

వృత్తచరణము లన్నింటను భరనభభరవగణములు స్వస్వరూపముతోఁ బదసంఘటనావశమును భాసించెడి యుత్పలమాలలు మార్కండేయమునఁ గనఁబడుటలేదు. అది సహజము కూడ. కాని, కొన్నివృత్తములం దవి యొకటిరెండుపాదములందు ఖండముగనో, పూర్ణముగనో లక్షణక్రమమున భాసించుచు నర్థసమర్పకములును, రసానుకూలములును నై రాణించుచుండుటయు గమనింపవచ్చును. మచ్చున కొక యుదాహరణము :

ఉ. వచ్చిన నాద్విజుం డతని వందనపూజల హృష్టచిత్తుగాఁ
జెచ్చెరఁ జేసి యిమ్మహి విశేషపుఁ జోద్యము లేవి సూచి తీ
వచ్చుగఁ జెప్పవే యనిన నౌషధసిద్ధుఁ డనేకదేశముల్
గ్రచ్చఱ నేను ద్రిమ్మరితిఁ గాంచితి నం దొగిఁ జెక్కుచోద్యముల్. (4.215)

కర్మఠుఁడైన ప్రవరుఁడు గృహస్థాశ్రమ ధర్మానుసారము అతిథిపూజను యథావిధిగా నిర్వహించెను. ఆభావమును లక్షణప్రోక్తములైన భరనభభగణక్రమమున పదఘటన మొనర్పఁబడినశిల్పము వ్యంజించుచున్నది. ర-వ గణములు "గల, గల, గ"గా భాసించుట అతిథిసత్కారకార్యమును జెచ్చెర యొనర్చుటలోని త్వరను వ్యక్తీకరించుచున్నది. "చెచ్చెర చేసి" యనుటలో నతఁడు త్వరపడుచున్నను భక్తి నడలలే దని భగణస్వరూపసాక్షాత్కారము తెలుపుచున్నది. రగణములోని యంత్యగురువు లేకుండగనే క్రియ ముగియుటలోఁ గ్రియావేగము తేటపడుటయేకాక అమ్మహాత్మునివలన నపూర్వవిషయముల నెఱుంగవలె నను ప్రవరునిత్వరకూడ స్పష్ట మగుచున్నది. ప్రవరవాక్యము గణాశ్రితమైన పదగతి నాశ్రయించినచో- 'ల, న, భ, భ, ర'గా నుండవలెను. కాని, యిందు భ, జ ల, భ, గల, గల, గ- అను గతి నాశ్రయించినది. అపూర్వవిషయశ్రవణమందలి హర్షోత్సాహత్వర లాక్రమము వ్యక్తముచేయుచున్నది. పదాశ్రితమైన "జల" మతని యుత్కటోత్సాహోద్వేగమును స్పష్టమొనర్చుచున్నది. చరణాంతగుర్వక్షరైకప్రయోగము "చెప్పవే" యనెడి ప్రార్థనార్థకక్రియకుఁ బోషకముగా జరిగినది. "అచ్చుగఁ జెప్పవే యనుట" లోని సహజగణస్ఫూర్తి వక్తవ్యాంశమున సహజోక్తి నభిలషించు

చున్న శ్రోతృచిత్తము నేర్పఱచుచున్నది. ఔషధసిద్ధుఁడు సహజ మైన దాంభికపద్ధతిలో వాక్యము నాత్రముగా నెత్తుకొని సాగదీయుచు మాటలాడెను. "సిద్ధుడఁ" ననెడిచోట భగణము పూర్తికాకపూర్వమే సిద్ధవాక్యము మొదలగుట త్వరను వ్యక్తము చేయుచుండ "అనేకదేశముల్" అనుటలోని జగణరగణములందలి గురుత్రయవిస్తారము ఉక్తిదైర్ఘ్య మును వ్యంజించుచున్నది. "క్రచ్చఱ...చోద్యముల్" అనుపాదమున "క్రచ్చఱ" "కాంచితి" అనుపదములు స్వస్వగణస్థానములందు భాసించుచు వానియాథార్థ్యమును ప్రకటించుచున్నవి. మిగిలినగణములు శకలము లై యతనివాక్యోచ్చారణవికారమును దెల్పుచు వాయపురజ్జు లను భ్రాంతిని గల్పించుచున్నవి. ఇట్లు ఛందము భావసమర్పక మగునట్లు నిర్మించుట మారనరచనాశిల్పము. మహాకవులకోవకుఁ జెందినవారు కాని యిట్టి సూక్ష్మములను ఛందములందు సాధింపఁజాలరు.

ఇట్లే మారన 1.63; 1.137; 5.331 పద్యములను పరిశీలించునది.

శత్రుమథనకార్య మొనర్చు వీరునియుద్ధాదులు వర్ణించు నవసరమునందును మారన శకలితగణములను ఛందమునఁ బ్రయోగించి విభావసాక్షాత్కారము గల్గించెను. ఉదా :

ఉ. కప్పిన నస్త్రశస్త్రముల ఖడ్గమునం దునుమాడి పీనుఁగుం
గుప్పలు గాఁగఁ గండ లొగిఁ గొండలుగా రుధిరంపుటేర్లుగా
నిప్పలు కన్నులం దొరఁగ నిర్భరబాహుపరాక్రమంబు పెం
పొప్పఁగ నక్కుమారవరుఁ డుక్కున సేనలఁ ద్రుంచెఁ ద్రుంచినన్. (7 216)

నాభాగుఁడు సైన్యములఁ దునుమాడు! యిందలివర్ణ్యాంశము. నాభాగుఁడు యుద్ధవీరము నకు విభావము. ససైన్యుఁడై యెదురు నిలిచిన తండ్రిని స్వీయభుజదండసహాయుఁడై డీకొని రణమును నిర్వహించినసాహసికుఁడు నాభాగుఁడు. అతఁడు "నిర్భరబాహుపరా క్రమంబు పెంపొప్పఁగ" "నిప్పలు కన్నులం దొరఁగ" నుక్కున సేనలఁ ద్రుంచె నఁట! ఈవృత్త తృతీయచరణపూర్వార్ధమున సాత్త్వికభావమును, ఉత్తరార్ధమున నుత్సాహ భావమును వ్యక్తమగుచు పాదము సమఖండముగా విరిగియున్నది. అందు "నిర్భరబాహు... పరాక్రమంబుపెంపు" అను సమాసము నాభాగునివీరమును వ్యంజించుచున్నది. ఇంత దీర్ఘ సమాస మావృత్తమున మారన వాడలేదు. "పెంపు" పదములోని సార్థక్య మది! వీరునికి యుద్ధమున నిప్పలు కన్నుల రాలుట సహజము కావున నవి సహజాక్షరగణ బద్ధములై జాలువారినవి. "సేనలఁ ద్రుంచె" నని చెప్పుచు మారన రగణమును ద్రుంచి చూపెను. అతఁ డంతటితో నాగక వృత్తపూర్వార్ధమున నాభాగుఁడు సేనలఁ ద్రుంచిన విధమును వర్ణించిచూపెను. అందు ఛందస్సంబంధియైన చమత్కార మొండు చేసెను. "కప్పిన-నస్త్రశస్త్రముల-ఖడ్గమునం-దునుమాడి - పీనుఁగుంగుప్పలు-గాఁగఁ-గండ-లొగిఁ-గొండలు-గా-రుధిరంపుటేర్లు-గా-" అను పాదములలోఁ "గప్పిన" బాణము లన్నియుఁ "గుప్పలు"గాఁ గ్రిందఁబడినవి. భగణసాదృశ్య మచ్చట సార్థకము. "అస్త్రశస్త్రము"లను ద్వంద్వసమాసము క్రిందిచరణమున మూఁడుముక్క లయిపోయి

నది; కండలకొండలు ఖడ్గమంతవయ్యెఁ జివరిగుఱువు విరిగి కత్తికి లోకువైనవి. ''తునుమాడు'' క్రియ 'నల' మగుటచేఁ గ్రమారోహణరూపమైన ద్రుతి నాయకచిత్త వృత్తిని వ్యంజించుచున్నది. దానికి ఫలము పీనుఁగులకుప్పలు. గణద్వయ దీర్ఘమైన "రుధిరంపుటేళ్లు'' సమాసము రక్తనదుల దైర్ఘ్యమును వ్యంజించుచున్నది. వీరవిభావము, వీరయుద్ధము, తత్ఫలము వర్ణింపఁబడిన యీవృత్తమున నోజోగుణాదులు భాసించు నవకాశ మున్నను మారన వానిఁబొంతఁ బోక యర్థానుగుణమైన పదవిరచనాశిల్పము నందే నిష్ఠ యుంచి పద్యమును నిర్మించి ఛందోమర్మజ్ఞుఁ డనిపించుకొనెను. ఛందోగతి చేతనే చిత్రముల నిర్మింపఁగలుగుట సిద్ధహస్తుఁడు చేయు జిలుగుపని!

రసభావానుగుణము లైన బహువిధగతిభేదములచే ఛందమును నడిపించియు, నెడనెడ నలంకరించియు, మారన నిపుణముగా వర్ణ్యవస్తువును రమణీయతర మొనరించు చుండును. ఇట్టివానికి నుదాహరణములు పెక్కు లున్నవి. వానిలోఁ గొన్నింటిని మాత్రము స్థాలీపులాకన్యాయమునఁ బేర్కొనుట జరుగుచున్నది.

ఉ. వీని సురూపవిభ్రమము వీని తనూద్గతచారుకాంతియు
న్వీని మృదూల్లసద్గతియు వీని వినిర్మలదృగ్విలాసము
న్వీని ముఖాంబుజద్యుతియు వేడ్కఁ గనుంగొన నింత యొప్పునే!
మానవదేవకిన్నరకుమారులఁ జూడనె? వారు నిట్టిరే? (4.232)

వరూథిని ప్రవరునిసుందరాకారమును గాంచి యబ్బురపడి పలికినమాట లివి! పాద త్రయమునందలి ఛందస్సమతాగుణ మాతనియాకారనిర్మాణసమతాగుణవ్యంజక మై విభావస్వరూపనిరూపణసమర్థమై యొప్పుచున్నది.

ఉ. కొందఱు తీవ్రశస్త్రహతిఁ గొందఱు దుస్తరరోగబాధలన్
గొందఱు నీరు ద్రావునెడఁ గొందఱు భోజనకార్యవేళలన్
గొందఱు యోగముక్తు లయి కొందఱు నిష్ఠఁ దపం బొనర్చుచున్
గొందఱు కాంతల న్గవయు కోర్కులఁ జత్తు రనేకభంగులన్. (1.55)

రణవిముఖులై పారిపోవుచున్న దానవవీరుల నుద్దేశించి శుక్రాచార్యులు పలికినవాక్యము లలో నివి కొన్ని. మరణహేతువులను నిరూపించు నీవాక్యసముదాయము పాదత్రయ మున సమతాగుణమున నొప్పారి వికలములైయున్న సైనికచిత్తములకు స్థైర్యమును, ధైర్యోత్సాహములను బ్రేరేపించు నుపదేశముగా రాణించినది.

మహిషాసురవిజృంభణమునందును మారన యిట్టిఛందమునే వాడెను.

ఉ. కొందఱఁ జండతుండహతిఁ గొందఱఁ గ్రూరఖురాగ్రఘట్టన
న్గొందఱ దీర్ఘవాలమునఁ గొందఱ దీర్ఘవిషాణలీలల
న్గొందఱఁ దీవ్రవేగమునఁ గొందఱ నుగ్రమహారవంబున
న్గొందగఁ జేయుచు న్బ్రమథమండలి నెల్లను ద్రుంచి యుద్ధతిన్. (6.105)

మొదటిమూఁడుపాదములందును ప్రథమతృతీయభగణములు తప్ప మిగిలినవన్నియు శకలితగణములే! వానిని భగణశీర్షములుగా నొనర్చి పాదగతియందు సమత్వమును బ్రకటించి షడ్విధరౌద్రవిహారసామర్థ్యమును మారన మహిషాసురునియందు వర్ణించెను. చతుర్థపాదమున "ద్రుంచి" యనువఅకును ఛందమును ద్రుంపక నడిపి, యతనియుద్ధతి యందున్న సహజత్వమును వ్యజింపఁజేసెను. వృత్తమున నిజముగా నుద్ధత మైన యారభటీ వృత్తియు, ఓజోగుణమును భాసింపవలసినది. కాని, జంతుకృతరౌద్రవిన్యాసము రస నామవాచ్యము గాక యాభాస మగుచున్నది. కావున నోజోగుణము యమకప్రయోగ మున మందీకరింపఁబడినది.

అర్థగాంభీర్యమును, శబ్దార్థాలంకారప్రాభవమును, ఛందోలంకారవైభవమును త్రివేణీసంగమమువలె నేకచ్ఛందమున భాసించి యొక వీరశృంగారవిభావవర్ణనమై యొప్పారిన యీపద్యము మారనరసశిల్పమున కుదాహరణము:

ఉ. అంత మనోహరప్రకటయౌవనలీల యలర్కుఁ బొందె న
త్యంతమదోల్లసద్విభవ మైంద్రగజేంద్రముఁ బొందినట్లు న
త్యాంతికకళావిలాసము సుధాకరుఁ బొందినయ ట్లుదాత్తవా
సంతికవిభ్రమంబు విలసత్సహకారముఁ బొందిన ట్లొగిన్. (3.267)

ప్రతిపాద్యవస్తువు ప్రథమచరణముననే చెప్పఁబడినది. కాని, యది పాదత్రయముచే నలంకృత మొనర్పఁబడినది. ప్రమదోత్సాహకళావిలాసములసంపద యలర్కునిఁ బొందిన ట్లలంకారములు వ్యంజించుచున్నవి. ఐంద్రగజేంద్రమునకు మదోల్లాసము కట ప్రదేశమున సూచితమగును గావునను, కళాపూర్ణుఁడైన చంద్రునియందు యౌవనస్ఫూర్తి భాసించును గనుకను, వాసంతిక సహకారమును బొందుటలో శృంగారలీలావిలాసము వ్యజింపఁబడును గనుకను నాయకునియందుఁ బ్రకటయౌవనలీలాశబ్దములు సార్థకము లగుచున్నవి. మనోహరత్వము తాత్పర్యమున భాసించినది. అది ఛందోలంకారముచే వృత్తమునకుఁ గలుగుచున్నది. పూర్వాపరార్ధభిన్నమైన ద్విప్రాసమునందు బిందు పూర్వక తవర్ణము ననుసరించి క్రమముగా ననునాసికాక్షరములును బరుషాక్షరములును గలవు కావున మధురపరుషవృత్తులు స్ఫురించి నాయకుని శృంగారవీరరసక్షమత్వము వ్యంజింపఁ బడుచున్నది. లాద్యక్షరవృత్త్యనుప్రాసము వృత్తమును మధురతర మొనరించుచున్నది.

ఉ. తారల లెక్కఁగాఁగ సికతాతతి లెక్క పయోధిశీకరా
సారము లెక్క భూరిబహుజంతుచయంబుల లెక్క వారియు
ద్ధారల లెక్క య ట్టగణితం బగు నీసుకృతంబు భూప! యి
న్నారకులందుఁ బుట్టిన ఘృణామతి లక్షగుణంబు లయ్యెడిన్ (2.138)

అగణితవస్తుసామ్యముచే నగణితపుణ్యసంచయము నేర్పుటచి చెప్పుట యిందలి యర్థాలం కారము. ఆవాక్యము పాదత్రయవ్యాప్తమై, అనుప్రాసయమకాదిశబ్దాలంకారశోభితమై తదర్థసమర్పక మగుచు ఛందము నలంకరించుచున్నది.

ఉ. ఆనగు మోము చెన్ను శశియందును బంకరుహంబునందు లే
దానయనప్రభాతి మదనాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనుకాంతి లతికావలియందుఁ బసిండియందు లే
దానలినాయతాక్షిలలితాకృతి నామదిఁ బాయనేర్చునే? (1.161)

త్రిభంగీనదృశమైన ఛందోగతి ప్రతిపాదమునందు వెలయఁగా వినోక్తిసుందరము లైన సంపూర్ణవాక్యములు మూఁడు పాదత్రయముగా నవతరించిన మనోహరవృత్త మిది నారీవర్ణన మగుటచేతను, వృత్త్యనుప్రాసాలంకార మండిత మగుటచేతను, లలితపద సంఘటితసమాసవిన్యాస మగుటచేతను, ఈవృత్తము చిత్తరంజక మై చెన్నారినది. 'ఆ ఏ' స్వరములను గూటముల కమర్పఁబడిన నాల్గుచంపకదామసరణులా యనునట్లు శోభిల్లు నీవృత్తము శృంగారరసోదంచితముగా నున్నది.

రసానుకూలములైన యుత్పలములు మచ్చున కిచ్చట సూచింపఁడుచున్నవి:
(1) శృంగారరసము - 1.133; 4,37; 4.230; (2) వీరరసము - 7 175; 8.115; (3) రౌద్రరసము - 1.35; (4) కరుణరసము - 1.180; 1.245; 3.19. 5.134; (5) అద్భుతరసము - 6.79. (6) భయానకము - 1.55; 2.38; (7) బీభత్సము - 2.97; 7.216. మఱియు దయాభావము - 2.127; 130; వత్సల భావము - 1.90; హర్షభావము 7.64.

ఉత్పలము ధర్మాదిప్రబోధమున నుపయోగింపఁబడినపట్టులు స్వల్పముగాఁ గలవు. వానిలో 3.6; 3.185; 3.352; 5.184 పేర్కొనఁదగినవి. ఉదాత్తద్రవ్యవర్ణనమునందు - నగరవర్ణనము - 2.153; పతివ్రతాగుణకీర్తనము - 2.180; బ్రాహ్మణవర్ణనము 2.197; అలర్కుని ధర్మపాలము - 3.276; జంబూనదీవర్ణనము. 4.144; రమ్యక వర్షవర్ణనము 4.208; ఉత్తమమనువర్ణనము - 5.215; ప్రజాతిభూపవర్ణనము 8 6; నాగవిభుజన్మము అవ. 32; అనునవి యుదాహరింపఁదగినవి. స్తుతులందు 6.118; 6.134; 6.225; 6.227; 7.82; 7.185 - రసవత్తరము లైనవి.

మారన మార్కండేయపురాణము నుత్పలమాలతో నారంభించుచు నాశీఃపురస్సరమైన రమావరుస్తుతిని నిర్వహించి యావృత్తముయొక్క యౌదాత్యమును సూచించెను, సరస్వతీస్తుతియు (అవ.5;) నన్నయభట్టారకస్తుతియు (అవ.9.) మార్కండేయ పురాణ ప్రశస్తిని (అవ. 17;) ఈవృత్తమునందే నిర్వహించి దానియం దున్నయభిమానమును ప్రకటించెను.

చంపకోత్పలము లాశ్వాసాంతపద్యములుగా పర్యాయముగా వాడఁబడినవని వెనుకఁ బేర్కొనఁబడినది. మారన వీనిని తృతీయపంచమసప్తమాశ్వాసములందు రచించెను. అందు తృతీయాశ్వాసమునఁ బ్రతిపాదవిషమఖండాంతానుప్రాసమును, పంచమసప్తమములందు పాదత్రయవిషమఖండాంతానుప్రాసమును, బ్రయోగించి ఛందము నలంకరించి కృతిపతిని భూషించెను.

## 5 కందము :

మార్కండేయమహాపురాణమున కందము ఛందములన్నిటికంటె నధికముగా నుపయోగింపఁబడినది. మాకందములవంటి మధురసూక్తులయందు మారన కున్న మక్కువ కందపద్యములు వ్యక్తము చేయుచున్నవి.

కందము నందముగాఁ జెప్పుట కవుల కొకగొప్ప యనియు, నది యొకకళ యనియు, నను భావము లోకమున కలదు. వక్తవ్య మగు నొకయంశమును సరళము గను, సంగ్రహముగను జెప్పుట కీపద్యము కవుల కెంతయో యుపకరించుచున్నది. అందుచే దీనిని కవులు బహుళముగా వాడుచు వచ్చిరి. ప్రయోగము ధారాళ మగుకొలఁది ఛందము పఠితచిత్తమునకు విసువు జనింపకుండ వాడవలసిన యగత్యము కవి కేర్పడును. అప్పు డతఁడు కందమును వివిధగతులతో నడుపవలసివచ్చును. పదగణ గుణాలంకారసంవిధానభేదములచే కవి కందమును చిత్రవిచిత్రముగా నలంకరించు చుండును. మహాభారతకవు లీమార్గమునఁ బయనించి తరువాతికవుల కెన్నియో పద్ధతు లను జూపియుండిరి. మారనయు మార్కండేయపురాణమున నీఛంధమును సర్వేతర చ్ఛందములకంటె సుందరముగా నలంకరించి వివిధభంగులలోఁ బ్రదర్శించెను !

కందము భ, స, జ, నల, గగ-యను గణములతో నిర్మింపఁబడును. పూర్వార్ధ మున జగణము ద్వితీయచతుర్థషష్ఠగణస్థానములలో నుపయోగింప వీలున్నది. అష్టమ గణముగా గగ, సగణములలో నేదైన నుండవచ్చును. ఇట్టినియమమే యుత్తరార్ధము నందును బాటింపఁబడును. కవు లీకందమున భసజాదిగణములలో భగణము నధిక ముగా వాడినచో నది యవరోహణాత్మకమై ద్రుతగతి యందు భాసించును. దానిని 'భకంద' మందురు. అట్లేసగణావృత్తిగల కందము 'సకంద' మనఁబడును; ఆరోహ ణాత్మకమైన గతి దానికి సహజము. జగణ మీఛందమున నాఱుసార్లు ప్రయోగింప వీలున్నది. అట్లు జరిగినచో నాఛందోగతి మహాచపలమై యుండును. నలకందము ద్రుతగతి గలిగి చిత్తవేగమును వ్యంజించును. గగకందము విలంబితగతి నాశ్ర యించును. కావున రసానుకూలముగా నీకందభేదములను గవులు కావ్యములందుఁ బ్రయోగించుటఁ గాంచుచున్నాము. మార్కండేయపురాణమునందలి యీకందభేదముల ప్రయోగౌచిత్యము స్థాలీపులాకన్యాయముగాఁ బరిశీలింపఁబడుచున్నది

### *1 భకందము :*

కం. ఆడుట పాడుట పదతులఁ
గూడుట యాసవరసంబు గ్రోలుట యోగ
క్రీడలు గావున యోగుల
నే డిరవులఁ జేర వఘము లేక్రియ నున్నన్. (2.310)

పండ్రెండుభగణములు ప్రయోగింప వీలైన కందమున నిచ్చట పదిభగణములు వాడఁబడి యుండుటచే భకందస్వరూపసాక్షాత్కార మగుచున్నది. యోగి లౌకికభోగములందు మగ్నుఁడైనట్లు కానఁబడినను, తామరాకుపై నీటిబిందువువలె వానితో నంటక నిలచి

యుండును. అనఁగా యోగికి భోగానుభవమునందు సాంద్రమైన యాహ్లాదభావ ముండదు. అతని చిత్తము భోగవిరక్తిచే నవరోహణగతి నాశ్రయించియుండును. కావున భగణ బహుళమైన యీకందము తచ్చిత్తవృత్తివ్యంజకము కాఁగలదు. గణవిరామశోభిత మగు నీవృత్తరచనము భోగికిని భోగములకును మధ్య గల సంబంధరాహిత్యమును వ్యంగ్యముగా సూచించుచున్నది.

శోకాశ్చర్యాది భావములను వ్యంజింపఁజేయుపట్ల మారన యిట్టి కందములను రచించియుండెను. (చూడుడు : 1.100; 2.300)

2. *నకందము :*

కం. నను నీవొండె శరానల
మున నీఱుగఁజేసి సర్పములఁ ద్రుంపు వెన
న్నిను నేనొండె శరానల
మున నీఱుగఁ జేసి సర్పములఁ గాతు వెసన్. (8.262)

తండ్రిమాట వినక ప్రజాక్షయకారులగు నురగుల సంహరించు మరుత్తునితో శరణాగతులైన యురగులను గాపాడ బద్ధకంకణుఁడైన యవేక్షితుఁడు స్వాభిమాన ముట్టిపడ పలికినమాట లివి. నగణబహుళమైన యీకంద మవేక్షితునిచిత్తమునఁ బ్రవర్ధమాన మగు క్రోధ భావముయొక్క యారోహణోద్దీపకత్వములను వ్యంజించుచు నర్థసమర్పక మగుచున్నది. అమర్షాదిభావోదయవర్ణనములందు నకందము రాణించు నని మారన యభిప్రాయము.

3. *జకందము :*

కం. తనపౌరుషంబు వదలక
మనుజుఁడు కార్యం బొనర్ప మానుగ దైవం
బునయందుఁ బౌరుషమునం
దును దత్ఫలసిద్ధి దోఁచుఁ దుల్యస్థితితోన్. (3.48)

అశ్వతరుఁడు కుమారులతోఁ బౌరుషోత్సాహమునుగూర్చి యుపన్యసించు వీరవాక్య మిది. మనసార ప్రేమించిన మిత్రున కెట్టియుపకారము చేయఁజాలకపోయిన పుత్త్రులవాక్యములు విని వారు కృతఘ్నతాదోషదూషితులై పోదు రన్న యుద్వేగముతోఁ బౌరషకార్యమును గూర్చి యశ్వతరుఁ డుపన్యసించెను. అతనిహృదయమునందు పుత్త్రుల యనుత్సాహవాక్య శ్రవణమువలన దీప్తమగుచున్న దుఃఖామర్షములు హేతువులుగా జనించిన యపూర్వకార్య సాధనోత్సాహ ముజ్జ్వలమై యాతనివాక్యములలోని జగణప్లుతియందు భాసించుచున్నది. ''దైవపౌరుషఫలసిద్ధులు తుల్యస్థితితోఁ దోచు'' నను వాక్యార్థమును బ్రకటించు నీకంద మునఁ బూర్వోత్తరార్ధములందు తుల్యస్థితితో జగణము భాసించుచుండుటయు, అకార ఉకారసహితమైన నవర్ణములు ప్రాసలుగా నర్ధద్వయమునం దుండుటయు గమనింపఁ దగినది. ఛందస్తుల్యగతిచేత ఫలసిద్ధియొక్క తుల్యస్థితిని వ్యంజింపఁజేయుట యిచ్చట చమత్కారము।

కందమున నాలుజగణములు ప్రయోగింప వీలున్నది. కాని యట్టిలక్ష్యములు సాధారణముగా లభించుట కష్టము. మారన మార్కండేయమునఁ బెక్కుచోట్ల కందములలోని జగణములను పదవ్యవస్థావశమున సహజస్థితితో ఛందమున భాసింపనీయక వానిని భంజించెను. దానిచేతఁ గందమునఁ దద్గణప్రభావమునఁ గలుగవలసిన యుత్పత్తి కొంత మందగించెను. మారన క్రోధాద్యుజ్జ్వలభావోద్దీప్తియందు కందము సమర్థవంతము కాదని భావించియుండవచ్చును.

**జగణస్ఫూర్తి కుంఠిత మైన కందము :**

కం. దైవంబు చక్కఁ జూచిన
నేవిధమునఁ గీడు వొంద దెయ్యెడ నున్నన్
దైవంబు తప్పఁ జూచిన
నేవిధమున మేలు వొంద దెయ్యెడ నున్నన్. (1.57)

భార్గవుఁడు రణవిముఖు లైన దానవులకుఁ జెప్పిన వాక్య మిది. జగత్సత్య మైన యొక విషయము నిర్మోహముగా నిచ్చటఁ బ్రతిపాదింపఁబడుచున్నది. ఇట్టిసూక్తులందు చిత్తోత్పత్తి కంటెఁ జిత్తసమత్వ మెక్కుడుగా రాణించును. కావున జగణస్ఫూర్తిని భంజించి మారన ఛందమున సమగతి భాసింపఁజేసెను. ముక్తపదగ్రస్తమును వాడి పద్యమును బఠితమనమునకు ముచ్చట మురిపెము లూరింప రచించెను.

**4. నలకందము :**

కం. మరగిన సింహము మృగముల
బొరిగొనుచును నరులఁ గాచుపోలికి నంతః
పరిచితపవనుఁడు నఘములఁ
బొరిగొనుచును నరులదేహములు రక్షించున్. (3.319)

పదినలములు భాసించుట కవకాశమున్న కందమున మారన యిచ్చట తొమ్మిదింటినిఁ బ్రకాశింపఁ జేసినాఁడు. ప్రాణాయామసాధనముచే శాసింపఁబడిన యంతఃపవనము పెంపుడుసింగము మృగములను జంపి నరులను రక్షించువిధముగా నఘములను హరించి నరులదేహములను రక్షించు నని చెప్పుట యిచ్చటి వర్ణ్యవస్తువు. నలము చిత్రద్రుతగతి వ్యంజకము. నలబహుళ మైన యీకందము అంతఃపరిచితపవనము దురితములను హరించుటయందలి ద్రుతగతిని వ్యంజించుచున్నది. కంఠీరవోపమానముచేఁ బవనశక్తిసామర్థ్యములు నిరూపింపఁబడి సత్వరకార్యదక్షత సూచింపఁబడుచున్నది. కందముయొక్క యుభయార్ధములందును ప్రథమతృతీయచతుర్థపంచమగణములందు సమముగా నలమును నిబంధించుచు, నుత్తరార్ధమున రెండవగణమును భగణమునకు బదులు నలమును నిబంధించి యుపమానమైన సింహముకంటె నుపమేయ మైన పవనుఁడు (అఘములు) పొరిగొనుటయందు సత్వరగతి కలవాఁ డని మారన వ్యంగ్యముగాఁ జమత్కరించెను.

5. *గగకందము :*

కం. నాపుత్త్రకు లెప్పుడు స
ద్వ్యాపారప్రవణు లైనవారో కారో ?
యేపగిది నున్నవారో ?
యోపార్థివ ! సుఖులొ దుఃఖులో యే నెఱుఁగన్. (6.16)

పుత్త్రులచే వెడలఁగొట్టఁబడియు వారియోగక్షేమములనుగూర్చి మోహావేశుఁడై పరితపించుచు సమాధి యన్నమాట లివి. విషాదభారముచే మందగతి నాశ్రయించిన యతని చిత్తవృత్తి 'గగ'కందమున సహజముగాఁ బ్రతిబింబించుచున్నది. ''వారో'' ''కారో'' అనుగగములచే నాతనిదుఃఖతీవ్రత వ్యంజింపఁబడుచున్నది.

(i) స్తుతులయందు గగకందము రాణింపఁగలదు : దేవీస్తుతి :

కం. దేవీ ! మహేశ్వరీ ! త్రిగు
ణావస్థలు నీవె కావె యఖిలంబునకు
న్గావింతు మహాదేవీ !
దేవేంద్రప్రముఖనిఖిలదేవస్తుత్యా ! (6.42)

భక్తిముద్రితమైనచిత్తవృత్తి మందమును, మధురమును నగుట సహజము. కావునఁ బైకంద మర్థసమర్పక మగుచున్నది.

కృతిపతిప్రశంస :

కం. శ్రీకీర్తివిజయనిత్యా !
లోకజనస్తుత్య ! మర్త్యలోకాదిత్యా !
స్వీకృతసంతతసత్యా !
శ్రీకంఠశ్రీశభృత్య ! శ్రీకరకృత్యా ! (8.389)

(ii) అమర్షాదులందు మారన గగములను సార్థకముగా నుపయోగించెను. ఉదా : మహిషాసురుని క్రోధవ్యంజకమైన భాషణము :

క. కని యాదనుజుం డేమీ !
యనిమిష లోకయాఁడుదాని నక్కట ! నాతో
నని సేయఁ దెచ్చినారే ?
యనుచుం బటురోషభీషణాకారుం డై. (6.81)

ఆఱునగణములు, మూఁడుజగణములు, ఒకనలము, ఒకభగణము - గల యాపద్యమునఁ బ్రతిపదాంతమునందును గగము నిబంధింపఁబడుటచే మహిషాసురునిచిత్తమునం దారోహణాత్మకముగా నుత్కర్షోత్ప్లుతివహించు క్రోధమును, అహంకారద్యోతక మగు వాగ్వృత్తియు వ్యంజింపఁబడుచున్నవి. ''ఏమీ'' ''నాతో'' (తెచ్చి) ''నారే'' ! అనుపదములు అమర్షభావోద్దీపకములు !

ఇట్లు మారన భజసాదికందములను రసానుకూలముగా మార్కండేయమునఁ బ్రయోగించి యౌచిత్యమును బాటించెను.

సంస్కృతమునందలి యార్యాగీతి తెలుఁగునఁ గందమైనది. పింగళముని యార్యా వృత్తమునందు పథ్య. విపుల, చపల, ముఖచపల, జఘనచపల, మహాచపల - ఇత్యాది విభాగము చేసెను. ప్రతిమూఁడుగణములకును పాదము విరిగినకందము పథ్య. అట్లు కానిది విపుల. పూర్వార్ధమున రెండవ, నాల్గవగణములుగా జగణ మున్నచో నది ముఖ చపల. అట్లుత్తరార్ధమున నున్నచో జఘనచపల. ఉభయార్ధముల నున్నచో మహాచపల. ఈభేదత్రయసాంకర్యముచే నేర్పడు పదునాఱువిధములను డా. పాటిబండ మాధవశర్మ గారు సూచించియున్నారు.[16] అవి - (1) పథ్య. (2) ఆదివిపుల. (3) అంత్యవిపుల. (4) ఉభయవిపుల. (5) ముఖచపలాపథ్య. (6) జఘనచపలాపథ్య. (7) మహాచపలా పథ్య. (8) ముఖచపలాదివిపుల. (9) జఘనచపలాదివిపుల. (10) మహాచపలాదివిపుల (11) ముఖచపలాంత్యవిపుల. (12) జఘనచపలాంత్యవిపుల. (13) మహాచపలాంత్య విపుల. (14) ముఖచపలోభయవిపుల. (15) జఘనచపలోభయవిపుల (16) మహా చపలోభయవిపుల. కందమునందును ఈభేదములను వారు పరిగణించి చూపిరి. వీని రసానుకూల్యమును వివరించుచు వా రీ విధముగాఁ జెప్పిరి. ''యథోచితవిరామములచేఁ బథ్యాకందము మాధుర్యగుణవ్యంజకము కాఁగలదు. నిర్విరామత్వముచే విపులాకందము ఓజోగుణవ్యంజకము కాఁగలదు. జగణావృత్తిచే నుత్ప్లుతగతి యగు చపలాకందము లందు విక్షిప్తచిత్తావస్థను వ్యంజింపఁగలదు. విషమస్థానజగణము కందపద్యగమనము నకు ఎంతభంజక మగునో సమస్థానజగణ మంత రంజక మగును. రసప్రసంగము లేని పట్టులందును జగణకల్పితమైన కందమున చాపల్యము చమత్కారమే యగుచున్నది''.[17] ఇట్టి కందవిభాగము మార్కండేయపురాణము నాశ్రయించి భావింపవచ్చును.

*1* పథ్యా :

క. కన్నుల బాష్పము లురలఁగ
నన్నరవరుఁ జేర నరిగి యతిదైన్యముతో
నన్నన్న : యాక లయ్యెడి
నన్నము నా కిపుడు పెట్టు మని యడుగుటయున్. (1.204)

కాశీనగరమున శైబ్యాహరిశ్చంద్రులు మూర్ఛితులు కాఁగా వారిసుతుఁడు ఆకలిబాధతోఁ దండ్రిని నన్న మిడు మని వేడు నీపద్యము మధురగుణవ్యంజకమును, కరుణారసపూరిత మును నై యొప్పుచున్నది.

*2* ఆదివిపుల :

క. అసమానసౌకుమార్యో
ల్లసితమృదుతనూలతావిలాసమదభరా

---

16. ఆం.మ.భా.ఛం.శిల్పము పుట. 441 17. ఆం. మ. భా. ఛం. శిల్పము. పుట. 441.

లస య్యె కర మమరు మదా
లసఁ గనుఁగొను నతికుతూహలం బెలరారన్. (3.35)

కపటమున్యాశ్రమమునుండి కువలయాశ్వుఁ డింటి కేతెంచుచు నపూర్వసౌందర్యవతి యగు తనభార్యను దర్శించు కుతూహలము వహించెను. కుతూహలభావోదయహేతు వైన మదాలససౌందర్యవర్ణన మాదియందు దీర్ఘసమాససంఘటితము చేసి మారన దాని యౌదాత్యమును బఠితచే భావింపఁజేసెను. వృత్త్యనుప్రాసాలంకృత మైన యీఛందము నాయకుని చిత్తమునందలి రత్యాహ్లాదములను వ్యంజించుచున్నది.

3. *అంత్యావిపుల :*
కం. నారాయణుఁ బీతాంబరు
శ్రీరమణీరమణు భక్తచింతామణి దు
ర్వారవిషద్విషకుంభవి
దారణనిపుణాభిధానదైవతసింహున్. (1.268)

హరిశ్చంద్రుఁడు చితిపై నెక్కి విష్ణువును స్మరించెను. ఆస్మరణమునందుఁ గ్రమముగా దీర్ఘవంత మైన సమాహితభక్తిభావము అంత్యవిపులాకందమున మారన వ్యంజింపఁ జేసెను.

4 *ఉభయవిపుల :*
కం. క్షీరోదధినిర్మలతర
హారకటకకుండలాంగదాంబరమణిమం
జీరార్ధచంద్రవిపుల
స్ఫూరాభరణములు ధవళపద్మము నిచ్చెన్. (6.75)

హరిహరాదులతేజఃపుంజములచే నావిర్భవించిన దేవికి క్షీరోదధి యొసంగిన వివిధ భూషణవ్రాతమును ధవళపద్మమును ఉభయవిపులాకందమునఁ జెప్పి వానిసంఖ్యాబాహుళ్యమును మారన వ్యంజింపఁ జేసెను. హస్తద్వయముతో విరివిగా నిచ్చిన బహుమానద్వితయమును ఉభయార్ధవిపులకందము సముచితముగాఁ బ్రతిపాదించుచున్నది.

5. *ముఖచపలాపథ్యా :*
కం. నరులనిజభావగుణములు
హరింతు నని పల్కి దీవు ప్రార్థింపుదు ని
న్గర మర్థిని హరియింపుము
ధరణీసురధర్మపత్నిదౌశ్శీల్యంబున్. (5.175)

బలాకుఁడు స్వీయమాయాప్రభావకథనమునందుఁ జెప్పిన వాక్యము ననుకరించి పేర్కొనుచు బ్రాహ్మణభార్యాదౌశ్శీల్యమును హరింప వేడుకొను ఉత్తమునిపలుకులు ముఖచపలాపథ్యాకందమున నిబంధించుట యత్యంతసార్థకము।

6 జఘనచపలాపథ్యా :

కం. ఇనుఁ డస్తమించెఁ జీకటి
యును మొగులును నడ్డగించె నుగ్మలి నాకుం
జన శక్తి లేదు పర్వకు
ననర్గళాస్త్రములు నెఱకు లాడెడుఁ దోడ్తోన్. (2.163)

కుష్ఠరోగియైన విప్రుఁడు వేశ్యాసంగమాసక్తుఁడై ఉద్దీపనవిభావములచే రతిభావ ముద్దీప్తము కాగా జనుటకు శక్తిలేక పోవుటను, మదనాస్త్రపీడను దలంచి దీప్తమదనాతురదుఃఖము నకుఁ బాలయ్యెను. అది జఘనచపలాపథ్యకందమునందలి జగణస్ఫూర్తిచే వ్యంజితమగు చున్నది.

7. జఘనచపలాంత్యావిపుల :

కం. అవకీర్ణి రోగిఁ బౌన
ర్భవు భృతకాధ్యాపకుని నిరాకృతి వేదా
గ్నివిహీను వైద్యు గురుపితృ
వివర్జకుని ముచ్చు సోమవిక్రయిఁ బిశునున్. (3.182)

మదాలస యలర్కునకు శ్రాద్ధమున ననిమంత్రణీయులను బేర్కొనుచు నీపద్యమును పలికెను. అయోగ్యుల నుచ్చరించుటయందు మదాలస చిత్తోద్వేగము క్రమోన్మీలితమైన దని జఘనచపలాంత్యవిపుల వ్యంజించుచున్నది.

8. జఘనచపలోభయవిపుల :

కం. చని బహుళలతుహినమహితం
బును నానారత్నరశ్మిపుంజస్ఫురితం
బును సిద్ధసాధ్యదివిజాం
గనాస్పదము నైన యన్నగమువిలసనమున్. (4.221)

ఉభయవైపుల్యము హిమనగవైశాల్యోన్నత్యములను, జఘనచాపల్యము దివిజాంగనా విహారచాపల్యమును ఈకందమున వ్యంజించుచున్నవి.

మిగిలిన కందపద్యములకు సమ్యగలక్షణాన్వితము లైన లక్ష్యములు మార్కండే యమున లభించుట లేదు. మారన మహాచపల లైన కందముల నసలు వాడనే లేదు. కొన్నింట నిర్దిష్టస్థానములన్నింటను జగణము వాడఁబడకపోవుటవలనఁ దత్తద్భేదములు సంపూర్ణముగా సాధింపఁబడలేదు.

మారన యుభయార్ధములలో నెందైనఁ జతుర్థగణమున జగణములను వాడిన కందములు మొత్త మిఱువదికంటె మించిలేవు. కావున మారన చపలాకందముపై నెక్కువ మక్కువ కలవాఁడు కాడని యూహింప వీలగుచున్నది.

మారన కందమును రసానుకూలములైన వివిధగతులలో నడిపించి తిక్కన శిష్యుఁ డనిపించుకొనెను. నన్నయతిక్కనలకువలెనే మారన వృత్తగతి రసభావవ్యంజక

ముగా నుండవలె నని నమ్మిన క్రింది కొన్నియుదాహరణములవలన స్పష్టము కాఁగలదు.

(1) కం. ఈయొడలును నావిద్దెయు
నీయదిగా నిశ్చయించి నెమ్మి ప్రసాద
శ్రీ యుల్లసిల్లఁ గైకొన
వే యిచ్చితి నేను నీకు నెంతయుఁ బ్రీతిన్. (5.65)

స్వరోచి యాయుర్వేదవిద్యాప్రభావమున విభావరీకళావతులరోగముల నపనయించినయెడ నాకళావతి తనవృత్తాంత మాతనితోఁ జెప్పి చివరకు తనను, తనపద్మినీవిద్యను అతనికి సమర్పించుచు ననిన మాట లివి. ఈమాటలచే కళావతి కృతజ్ఞతాబద్ధమైన యనురాగమును వ్యక్తముచేయుచు, తనయొడలును, విద్యను బరిగ్రహింపు మని దీనముగాఁ బ్రార్థించు చున్నది కావున రతియు, దైన్యము వ్యంజింపఁబడుచున్నవి. కందపూర్వార్ధమున రతిభావ మున కుచితమైన రచన కలదు. ఆఱేసిమాత్రలు కలిగిన నాల్గుపదములను పదద్వయమున సంధించుటచే సమతాగుణ మేర్పడి నాయికానాయకుల యానుకూల్యమును వ్యంజించినది. 'ఈ, నీ' యనుపాదదీర్ఘాక్షరములయనంతరము యడాగమసంధిగత మైన యుచ్చారణ యందలి కించిద్విరామము రతిభావపారవశ్యమున నైన చిత్తవిలంబనగతిని వ్యంజించు చున్నది. ఉత్తరార్ధమున 'శ్రీ, వే' అనుదీర్ఘాక్షరముల యనంతరము దీర్ఘకాలవిరామ మేర్పడి ప్రార్థనయందలి దైన్యమును, తద్వ్యంజకమైన విలంబితమును, పరిశ్రాంతము నైన చిత్తగతిని వ్యంజించుచు కందము నర్థసమర్పకముగాఁ జేయుచున్నది.

(2) పదారంభాక్షరానంతవిరామము శోకాదిభావములందు ప్రయోగించి మారన యొప్పించినపట్టులు గలవు. మచ్చున కొకటి:

కం. ఏ నెంతపాపకర్ముఁడ
నో నాముందఱన యింతయును నొనరింపం
గా నాకుఁ జూడవలసె
న్మానిని! యిం కేది తగవు? నడుపుము దానిన్. (3.17)

తాళకేతుఁడు ఋతధ్వజుఁడు మరణించె నని మదాలసతో ఖిన్నుఁడై పలికిన పలుకు లివి. ఇతనిమాటలలో నత్యంతవిషాదదృశ్యము చూచి వర్ణించునప్పుడు కలిగెడి విషాదవిశేషము. కించిదాశ్చర్యము రంగరించుకొని యున్నవి. పాదత్రయమునఁ బాటింపఁబడిన యీవిరా మము తత్కాలచిత్తవృత్తివ్యంజక మగుచు శోకభావవ్యక్తినిఁ దెల్పుచున్నది.

(3) ఇట్టి కందపద్యగతి క్రోధాదిదీప్తరసములందును మారన రచించియుండెను,

కం. ఏ నీమధురానవరస
మానినయందాఁక నెట్టులైనను మూఢా
త్మా! నలువునఁ జెలఁగుము నా
చే నీ వీల్గుటయు సురలు చెలఁగుదురు వెసన్. (6.113)

దేవి మహిషాసురునితోఁ బోరుచు మధుపాన మొనర్చుట కించుక విరామము ప్రకటించి, తద్విరామకాలమే మహిషునిజీవితకాల మనునట్లు రోషవిస్ఫురితలోచన యై పల్కినది. ప్రథమతృతీయపాదారంభదీర్ఘాక్షరానంత విశ్రాంతి మధుపానవిశ్రాంతిని వ్యంజించు చున్నది. అది క్రోధభావస్ఫూర్తికిఁ బోషక మగుచున్నది.

(4) శబ్దార్థములతోపాటు గణములను కదనుత్రొక్కించినఘట్టము :

క. అమరత్వ మమరేశ
త్వ మమరపూజ్యత్వ మనుపదంబులు వరుస
న్సమధికతమవిహితోద్యో
గమునన యవి తమ్ముఁ బొందఁగాంతురు మనుజుల్. (2.276)

''అమరత్వము'' ''అమరేశత్వము'' ''అమరపూజ్యత్వము'' - అనుపదములు సమధిక విహితోద్యోగమునఁ గ్రమముగాఁ బొందఁదగినవియే కాక యుచ్చరింపఁదగినవి కూడ. మారన కందమున వాని నలవోకగా ఛందమున నిమిడ్చి యపూర్వతను సాధించెను.

(5) ప్రతిపాదముయొక్క చివరియక్షరమునకుఁ బూర్వము వాక్యమున విరామ మేర్పడుటయు, పాదాంతిమాక్షరములో తరువాతిచరణమునందలి వాక్య మెత్తుకొనుటయు కందపద్యరచనమున నొకవిశిష్టమైన గతిని భాసింపఁజేయును.

కం. శతధృతివాక్యంబును నా
మతమును నీ కించుకేని మానుగ విను దీ
పిత మగు నీరూపము శో
భితమును శాంతంబు గాఁగఁ బ్రీతి నొనర్తున్. (7.114)

విశ్వకర్మ సూర్యునితో నన్నమాట లివి. ప్రచండతేజుఁడైన ప్రభాకరుని తేజశ్శాత మొనర్చుప్రతిపాదనమును విశ్వకర్మ భయవినయాదులతో నొనర్చుటయందు కానవచ్చు వాక్యరచనము నీపద్యగతి వ్యక్తము చేయుచున్నది.

యుద్ధవర్ణనమునందు వీరులయుద్ధక్రియను వర్ణించునెడ నిట్టిపద్యగతిని మారన ప్రయోగించుటయేకాక తుల్యరణసన్నివేశముల నీఛందోగతితో భాసింపఁజేయుట గమనింపఁదగినది. దేవీచక్షురులమధ్య జరిగిన యుద్ధమునఁ జక్షురుఁడు శూలముచే దేవి ధనువును దునుముటయు, నక్కాళి శరావళి నాదనుజశూలమును కాయమును దుత్తునియ లొనరించుటయు మారన తుల్యగతు లైన కందములలో వర్ణించెను.

కం. శూలంబు పుచ్చికొని య
క్కాళిధనువు దునిమె వాఁడు గ్రక్కున నది తే
జోలంకృతరవిబింబము
వోలెఁ బదలనుండి యపుడు పుడమిం బడియెన్.

వ. ఇట్లు పడుటయు వేఱొక్క విల్లెత్తి

క. కాని దేవి శరావలి న
ద్దనుజునిఘాలంబు నఱికి తనువెల్లను దు
త్తునియలుగా రయమున నే
సిన నాసేనాని విగతజీవుం డయ్యెన్. (6.99-101)

ఒక్కొక్కకంద మొక్కొక్కవాక్యము. అది యొక్కొక్కకార్యమును వ్యంజించుచున్నది. ఆవాక్యగతి ఛందమున ప్రతిపాదాంతాక్షరపూర్వమున నించుక విశ్రాంతిని బొందుచు నడచినది. ధారాళ మగు చరణగతి యిట్లు కుంఠిత మగుట శత్రుప్రయుక్తధనుశ్శూలములను చక్షురకాఘలు క్రమముగా భంజించినవిధమును వ్యంజించుచున్నది. మొదటి పద్యమున నీగతి పూర్వార్ధమునందు మాత్రము కలదు. రెండవపద్యమున పద్యవ్యాపిగాఁ గలదు. ప్రతినాయక నిరోధముకంటె కాళీవిజృంభణము సమగ్రము, సమర్థము నని ఛందోవ్యంగ్యము.

అలంకృతకందములను సార్థకముగా వాడి కందములను రసమాకందములుగా మారనఁ గల్పించినాఁడు. ఉదాహరణకుఁ గొన్నింటి నిచ్చట నిచ్చుట జరుగుచున్నది :

(1) పతిశుశ్రూషణమున నే
నతులఫలప్రాప్త నైతి నభిమతఫలముల్
పతిశుశ్రూషానియతిని
సతతముఁ బడయంగవచ్చు సతులకు సాధ్వీ ! (2.177)

పైపద్యమున ప్రథమతృతీయపాదములందు చతుష్ప్రాసము పాటింపఁబడినది. విశేషమును సామాన్యముచే సమర్థించు నర్థాంతరన్యాసాలంకారముచే భావ మలంకృత మగుచుండ తదనుగుణ మైన ఛందము సాలంకృతముగాఁ బ్రయోగింపఁబడుట యిచ్చటి సార్థక్యము.

(2) స్తుతిపరము లైన కందముల నలంకరించుట :

క. నీవ మహావిద్యవు మఱి
నీవ మహామాయ వమరనికరస్తుత్యా !
నీవ మహామేధవు మఱి
నీవ మహాస్మృతివి దేవి ! నిత్యానందా ! (6.41)

6 గగములు, 5 భగణములు ప్రధానముగాఁ గల యీకందము దేవిని గీర్తించు దేవతల భక్తిపారవశ్యమునందలి విలంబితగతిని వ్యక్తపఱచుచున్నవి. విద్యామాయామేధాస్మృతి రూపిణి యయ్యు తత్త్వమున నేకస్వరూపిణి యైన దేవిని—"నీవ" యను ఏవార్థకాంత మగు సర్వనామమును ప్రాసస్థలవిశ్రాంతముగా వాడుటచేతను, త్రిప్రాసను పాదచతుష్ట యమున నిలుపుటచేతను మారన వ్యంజింపఁజేసెను.

ఇట్టి త్రిప్రాస కృతిపతికీర్తనమునందును మారన వాడెను.

క. ధన్యునకు ధనదసదృశవ
దాన్యున కతిమాన్యునకు బుధవ్రజనుతసౌ

జన్యునకు ఘనవిభవప
ర్జన్యునకు న్సకలజగదసామాన్యునకున్. (అవ. 45)

దేవీస్తుతియందు ప్రతిపాదము గతియందు విరుగుచుండ కృతిపతి స్తవనమున నఖండితగతి భాసించుట గమనింపఁదగినది. త్రిప్రాసము మాలికవలె నాల్గుచరణములం దల్లుకొని కృతిపతిని ఛందోలంకారభూషితు నొనర్చుచున్నది.

సప్తమాశ్వాసమున నగ్నిస్తుతియందుఁ త్రిప్రాసను పాదత్రయమునఁ బాటించి విశేషగతిని కందమున వెలయించినాఁడు మారన. ఉదా: 7.51; 7.53 గ్రహింపఁదగును. మఱియు పూర్వార్ధమునఁ ద్విప్రాసను పాటించుటకు - 8.241; ప్రథమతృతీయ పాదములకు - 8.74; ఉదాహరణములుగా గ్రహింపవచ్చును.

మారన ద్విప్రాసతోఁ బెక్కుకందముల నలంకరించియుండెను. ఉదా:

(1) ఎంతెంత సేసెఁ బుణ్యం
బంతంతయె సుఖము నిచ్చునది నరునకుఁ దా
నెంతెంత సేసెఁ బాపం
బంతంతయ దుఃఖ మిచ్చునది తఱితోడన్. (2.88)

జీవి తా నెంతపుణ్యము చేసికొనిన నంతసుఖము ననుభవించును. భావములందును, తత్ప్రకటనమునందును గల సమతను కందపద్యపూర్వోత్తరార్ధములందలి సమత వ్యంజించుచున్నది. వీనియం దున్న యేకతాత్పర్యము పాదచతుష్టయమునందుఁ బాటింపఁబడిన ద్విప్రాస తెలుపుచున్నది.

(2) పాదత్రమునఁ ద్విప్రాస—

క. ఎట్టిది నీసతిరూపం
బెట్టిది ప్రాయంబు భూసురేశ్వర! శీలం
బెట్టిది నిక్కము సెపుమా
యెట్టయినను వెదకి తెచ్చి యిచ్చెద ననిన్. (5.140)

బ్రాహ్మణసతియొక్క వయోరూపశీలములఁ దెలియవలె ననెడియుత్కంఠ గల యుత్తమునివాక్కు లలంకృతము లగుటలో నౌచిత్యము కలదు. ఆయుక్తివైఖరిని బట్టి యామె యందగత్తెయు, యువతియు, శీలవతియునై యుండియుండు నని యుత్తముఁడు భావించుచుండె ననియు స్పష్టపడుచున్నది. కాని, యట్టిగుణము లామెయందు లేకున్నను ఆమెను తప్పక వెదకి యిచ్చెద నని యనుటలో నామె యాకారశీలవిక్రుతినిగూర్చిన శంక యం దున్నది కావున నావాక్య మలంకృతము కాకుండుటయు సాభిప్రాయమే యగుచున్నది. ఇట్టివి మార్కండేయమున కోకొల్లలు.

పాత్రలవాక్యోచ్చారణ కనుగుణమైన గతిలో కందమును నడిపించి కథార్థములందు సహజత్వమును పోషించుట మారనరచనలో సర్వత్ర కానవచ్చుచున్నది. విషయవిస్తర భీతిచే నొండురెం డుదాహరణము లిచ్చుట పేర్కొనఁబడుచున్నవి.

(1) క్రుద్ధయైన దేవివాక్కు—

కం. ఎవ్వఁడు జయించు నన్నని
నెవ్వఁడు మద్దర్ప మడఁచు నేడైఱమెయి నా
కెవ్వఁడు జగమునఁ బ్రతిబలుఁ
డవ్వీరుని కేను భార్య నగుదున్ బ్రీతిన్. (6.147)

స్త్రైణమైన వాక్కు అమర్షభావవ్యంజక మైనను సుందరముగ నుండు ననియు, దేవి మహిషాసురునిపైఁ గల కోపమునే కాక నవహేళనముతోఁ గూడిన నాత్మపరాక్రమమును వ్యక్తము చేయుచున్న దనియు మారన తద్వాక్యముల నతిసహజముగా ఛందమున నలంకరించి నిర్మించెను. అలంకృతములు కాకపోయినను రసోదంచితముగా వాక్యముల ననిపించునేర్పు మారనకు కరతలామలకము. ఉదాహరణకు హరిశ్చంద్రుని వాక్యములు—

కం. హితుల ననన్యశరణ్యుల
నతిభక్తుల విడిచి వచ్చునమరావతి నా
మతి రుచియింపదు గావున
శతమఖ! యే రాను నీవు సనుము మహాత్మా! (1.272)

ఇందు వాక్యగతి కొదిగిన ఛందోగతి కలదు. స్వీయప్రజయం దున్నయనురాగమును, వారు లేని యమరావతిపై నేవగింపును, చివర తననిశ్చయమును-జెప్పునప్పటివాక్యములు క్రమముగా శకలములై చిన్న వగుట హరిశ్చంద్రునిచిత్తవృత్తిలోని క్రమపరిణామును వ్యక్తపఱచుచున్నవి. ఇట్టివిశేషములుకొన్ని యాఖ్యానశిల్పాధ్యాయాదులయందును జెప్పఁబడినవి.

కందములు రచించుటలోఁ బేరుమోసిన తిక్కనగారిశిష్యత్వము మారనచే కందముల లోని యందముల నన్నింటి నమందముగ రాణింపఁజేసినది. శిల్పదృష్టులకు వానిని వివేకించుట సులభము!

## 6. తేటగీతి :

ఒకసూర్యగణము, రెండింద్రగణములు, రెండుసూర్యగణములు- అనుక్రమమున గూర్పఁబడిన నాల్గుపాదములు గలది తేటగీతి. పాదప్రథమవర్ణమునకును చతుర్థగణ ప్రథమాక్షరమునకును యతి చెల్లును. ప్రాసయతి దీనియందుఁ జెల్లును. ఈపద్యనిర్మాణమునఁ గానఁబడు వైవిధ్యమునుబట్టి దీని నీక్రిందివిధముగా విభజింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 1. | సర్వపాదములందును | సాధారణయతి | పాటింపఁబడినవి |
| 2. | ,, | ప్రాసయతి | ,, |
| 3. | విషమపాదములందు | ,, | ,, |
| 5. | సమపాదములందు | ,, | ,, |
| 5. | పూర్వార్ధమునందు | ,, | ,, |
| 6. | ఉత్తరార్ధమునందు | ,, | ,, |

7. ప్రథమచతుర్థపాదములందు ప్రాసయతి పాటింపఁబడినవి
8. ద్వితీయతృతీయపాదములందు ,, ,,
9. ప్రథమపాదమునందుమాత్రము ,, ,,
10. ద్వితీయ ,, ,, ,,
11. తృతీయ ,, ,, ,,
12. చతుర్థ ,, ,, ,,
13. ప్రథమపాదమునందుఁదప్ప మిగిలిన పాదములందు ప్రాసయతి ఉండుట.
14. ద్వితీయపాదమునందుఁదప్ప ,, ,, ,,
15. తృతీయ ,, ,, ,, ,,
16. చతుర్థ ,, ,, ,, ,,

ఇవికాక కొన్ని సంకీర్ణభేదములుకూడ కానఁబడుచున్నవి. ఉదా : $\frac{6}{1}$ భేదము అనఁగా ఉత్తరార్ధమునందు ప్రాసయతియు, సర్వపాదములందు సాధారణయతియు గల తేటగీతి— ఇట్టివానిని విశేషములుగా గ్రహింపవచ్చును. మారనరచనలో తేటగీతులందు $\frac{6}{1}$; $\frac{5}{1}$; $\frac{1}{12}$; $\frac{7}{14}$: $\frac{1}{9}$; $\frac{1}{10}$; $\frac{1}{11}$; $\frac{11}{6}$; $\frac{5}{10}$; $\frac{3}{11}$; $\frac{3}{9}$; $\frac{3}{10}$; $\frac{1}{2}$; $\frac{5}{9}$; $\frac{8}{11}$; $\frac{1}{4}$; $\frac{8}{3}$; $\frac{8}{2}$; $\frac{1}{15}$; $\frac{8}{10}$; $\frac{1}{8}$; $\frac{6}{12}$; $\frac{4}{15}$; $\frac{10}{8}$; $\frac{4}{12}$; $\frac{13}{12}$; $\frac{8}{16}$; $\frac{7}{12}$; $\frac{12}{6}$; $\frac{9}{3}$; $\frac{1}{7}$; $\frac{9}{7}$ —అను భేదములు కలవు.[18]

సర్వపాదములందును సాధారణయతి పాటింపఁబడిన తేటగీతులు రచించుట సర్వసామాన్యము. కథాకథనమునందును, రసభావములయందును తేటగీతిని మారన ధారాళముగా వాడియున్నాఁడు. అట్టివానిలోఁ గొన్నివిశేషములను మచ్చున కిచ్చుట పేర్కొనుట యగుచున్నది.

1. రసోదంచితమైన పాత్రసంభాషణమున సాభిప్రాయముగ యతినిఁ బ్రయోగించు నేర్పు మారన ప్రకటించెను. ఉదాహరణకు :

తే. నీవు నుడివిన నెల నిండె నేఁటితోడ
నేది మాసొమ్ము తెమ్ము మహీతలేశ!
యనిన నింకను దినమునం దర్ధ మున్న
యది సహింపు మునీంద్ర! నీ వంతదాఁక! (1.192)

ఇందు కౌశికహరిశ్చంద్రసంభాషణము వర్ణితము. క్రుద్ధుఁడైన కౌశికునివాక్యము ఉదాత్తములైన ఈ-ఏస్వరముల యతిమైత్రితోడను, వినయాన్వితుఁడైన హరిశ్చంద్రుని నివేదనము అనుదాత్తస్వర మైన "అ" స్వరయతిమైత్రితోడను రచింపఁబడుట సార్థకము.

2. ఉదాత్తద్రవ్యవర్ణనమునందు తేటగీతిని నడిపించినవిధమున కుదాహరణము :

తే. ఎవ్వఁ డబ్ధిపర్యంకశాయిత్వలోలుఁ
డెవ్వఁ డఖిలప్రజాసర్గహేతుభూతుఁ
డెవ్వఁ డాదిమసంయమిధ్యేయమూర్తి
యట్టిదేవుండు సకలలోకార్చితుండు. (1 109)

18. వివరములకు చూడుడు : అనుబంధములు.

పైపద్యమున మొదటిమూఁడుపాదములు సంబంధబోధకసర్వనామములతో నారంభ మై ప్రథమగణము ముగిసి, మగిలినవన్నియు నేకదీర్ఘసమాసముగా నేర్పడునట్లు రచింపఁ బడినవి. ఆదిపురుషునిగుణకీర్తన మందలివస్తువు. చతుర్థపాదమున భగవన్నిరూపణము- అనగా - గుణిప్రతిపాదనము కలదు. కావున చరణనిర్మాణమునందును, తద్గతియందును భేదము పాటింపఁబడినది. అది వస్తుస్వరూపవివేకసమర్థ మగుచున్నది.

3. తేటగీతియం దేగణమున కాగణము పదవశమున విరిగియున్నగతి :

తే. ఏమి చేయుదు తరళాక్షి ! యేను జెపుమ
నీవు నిట్లని పలికెదు నిత్య కర్మ
హాని నాకు బాటిల్లదే యైన నొకటి
నీకుఁ జెప్పెద నేర్పడ నెమ్మి వినుము. (5.16)

ఇది మాయాప్రవరుఁడు వరూథినితో నన్నవాక్యములు. వాక్యమంతయు ఛందమునందలి నిజగణస్ఫూర్తి వెలయునట్లు మాటలాడుట మాయాప్రవరుఁడు నిజప్రవరునివలె సంభాషించుటయందుఁ జూపెడి యప్రమత్తత గోచరింపఁజేయుచున్నది. ఎంతశాస్త్రోక్తముగా మాటలాడ యత్నించినను గంధర్వుఁడు "నిత్యకర్మహాని నాకు బాటిల్లదే" యనుటలో గణస్ఫూర్తి వాక్యవశమున నించుక తడబడియుండుట గమనింపఁదగినది. ఒకకపటి తన స్వభావవిరుద్ధ మగు నొకసత్యమును బలుకునెడ సహజముగాఁ గలుగు కొంతతడబాటును ఛందమున భాసింపఁజేయుట మారనశిల్పము !

సర్వపాదములందును ప్రాసయతి వేసిన తేటగీతిని మారన రచించుట కిచ్చఁజూప లేదు. మార్కండేయమున నీక్రిందిపద్య మొక్కటిమాత్రము సర్వప్రాసయతి గల దని చెప్పుటకు వీలగుచున్నది.

తే. అనిన నాతఁడు నీ వలర్కునకు నకట
పూని యుపకృతి చేసితి గాన నాకు
వలదె యుపకృతి సేయ తత్ఫలము గాక
సాధుసంగతి విఫలయె బోధనిలయ ! (3.382)

ఇందు తృతీయచరణమున యతియుఁ, బ్రాసయతియు నున్నను ప్రాసయతిగా గణించుటయే యిచ్చట సౌలభ్యము. కాశిరాజు సుబాహునితోఁ దననుగూడ నలర్కునివలె జ్ఞాని నొనర్పు మని వేడుకొనువాక్య మిది. సుబాహుఁ డలర్కున కుపకృతి యొనర్చెను. అట్టి యుపకృతి తనకుఁ జేయు మని కాశిరాజు. ఉపకృతి గొన్న అలర్కుఁడు యతిస్థానాక్షర మైనచో - నట్లే కాశీరాజుకూడ ప్రాసయతిస్థానమువలెఁ దనను భావింపు మని ప్రాసయతి గల తేటగీతమునఁ జెప్పుచుండె నని వ్యంగ్య మేర్పడుచున్నది. ఛందోధ్వని కిది చక్కని యుదాహరణము :

రెండుపాత్రలమధ్య జరుగు సంభాషణమున ప్రశ్నోత్తరములను నిబంధించునెడ పూర్వోత్తరార్థములందు యతి నొాడగూర్చుటలో భేదము పాటించుట యొకశిల్పము !

తే. అర్ఘ్యమునకు నర్హుఁడఁ గానియంతపాప
మేమి చేసితిఁ జెప్పుమా యెఱుకమాలి ?
యనిన మునియును మఱచితే మనుజనాథ
విడువవే నీవు పత్ని నట్టడవిలోన. (5.155)

ఇందు పూర్వార్ధమున నుత్తమునిప్రశ్నయు, నుత్తరార్ధమున నొకమునీంద్రునిప్రత్యుత్తరమును గలవు. నరేంద్రుఁడు సతిని వదలిన వృత్తాంతమును జెప్పువాక్యమున యతిస్థానము వీడి ప్రాసస్థానమున యతి పాటించి చెప్పుట సాభిప్రాయ మనుటలో సంశయము లేదు.

ప్రశ్నోత్తరములందు వాక్యములకంటె పదముల కధికప్రాధాన్య ముండునెడ మారన చేసెడి రచనాచమత్కారము చూడుడు :

తే. ఇచట నున్న నీభార్యకు నెంతయును శు
భంబు భూనాథ ! తక్కినభార్య లెల్లఁ
గుశలినులె ? యన్న మీకృపఁ గుశల మెపుడు
భ్రాంతిగాదు జగత్త్రయారాధ్యచరణ ! (5.280)

అనునెడ ప్రశ్న పూర్వార్ధమును దాటి మూడవపాదమున మొదటిగణమున ప్రధానాంశమును జెప్పుచు ముగియుచున్నది. ప్రాధానాంశమును సావధానముగ వినిన శ్రోత యతిమైత్రి పొదలుచోట ప్రధానప్రత్యుత్తరాంశమును బ్రతిపాదించుట యిందలిచమత్కారము. ఇట్టి విశేషములు సహృదయులు పురాణపఠనావసరమునఁ దెలియుట సులభము !

## 7. ఆటవెలఁది :

ఈఛందమునకు ప్రథమపాదమున మూఁడుసూర్యగణములును, బిమ్మట రెండింద్రగణములును, ద్వితీయపాదమున నయిదుసూర్యగణములు నుండును. దీనిని బూర్వార్ధమనవచ్చును. ఇట్లే యుత్తరార్ధ మమరియుండును. ఇందు ప్రతిపాదమునను నాల్గవ గణముయొక్క ప్రథమాక్షరముతో యతిమైత్రి చెల్లును. ప్రాసయతియు నిందుఁ గలదు. ఈలక్షణము ననుసరించి యాటవెలఁది సూర్యగణబహుళ మని స్పష్టమగుచున్నది. దీని గతి తద్గణసంవిధానముపైఁ బ్రధానముగా నాధారపడియుండును. హగణబహుళ మైన యాటవెలఁది విలంబితగతియు, నగణబహుళ మైనది ద్రుతగతియుఁ గలిగియుండుట సహజము.

**విలంబితగతిగల యాటవెలఁది :**

ఆ. చర్మమాంసశల్యసంభూత మై రక్త
పూరపూర్ణ మైన పొల్లయొడలి
యందుఁ జేయు వేడ్క యనఘ యకర్తవ్య
మట్టివేడ్క యప్పు డయ్యె మాకు. (1.86)

సుకృశమునీంద్రునియెదుట తా మొనర్చిన తప్పిదమునకు మునితనయులు పశ్చాత్తప్తులై

విషణ్ణచిత్తవృత్తితోఁ బలికినమాట లివి. కావున నిందు హగణబహుళమైన విలంబితగతి యతిసహజముగా రాణించుచున్నది.

ద్రుతగతి గల యాటవెలఁది :

ఆ. విషహరంబులైన వివిధదివ్యౌషధ
మ్ముల భుజంగవరులు మునులఁ బరమ
శాంతిఘనుల నపుడు సంజీవితులఁ జేసి
చనిరి భుజగభువనమునకు నెలమి. (8.271)

మరుత్తరాట్ప్రచండదివ్యాస్త్రశక్తికి భీతులై భుజంగవరులు మృతులైన మునిసప్తకమును పునర్జీవితుల నొనర్చుటయందలి సంభ్రమము లఘుబహుళమైన యీయాటవెలఁది వ్యంజింపఁజేయుచున్నది. చివరిపాదము సర్వలఘువై సర్పములు మరుత్తునియెదుటనుండి తప్పుకొనిపోవుటలోఁ జూపిన త్వరను గన్నులకుఁ గట్టించుచున్నది.

ఇట్టిగతిభేదముచే నాటవెలఁది బహువిధరసభావములను వ్యంజింప సమర్థ యగుచున్నది. ఆటవెలఁదియందు మారన వివిధవ్యభిచారిభావములను సమకూర్చి వర్ణించుట కాంచనగును. ఉదాహరణమునకు ప్రవరవిరహమును సహింపఁజాలక వరూథిని విలపించిన కథాఘట్టమున- నీక్రిందియాటవెలఁది కలదు :

ఆ. అకట ! మందభాగ్యనైతి నా కెమ్మెయిఁ
గలుగు నక్కుమారుఁ గలయుపుణ్య
మేమి సేయుదాన ? నీతామతాప మే
నెట్లు నిస్తరింతు ? నెందుఁ జొత్తు ? (5.5)

ఇందు విప్రలంభశృంగారరసపోషకము లగు దైన్యము, శంక, వితర్కము, చింతము. సంచారిభావములయొక్క వ్యక్తి కలదు. వాని నలఁతియలఁతివాక్యముల నిర్మించుటయందు మారన కొంత వ్యంజింపఁజేసెను. వరూథినిచిత్తవృత్తి పద్యపూర్వార్ధమునందుకంటె నుత్తరార్ధమున నుద్వేగవంతమైనట్లు మొదటిరెండుపాదములం దనుదాత్తస్వరమును, చివరిరెండుపాదములం దుదాత్తస్వరమును యతిగా నిబంధించుటచే వ్యక్తమొనర్చెను.

తేటగీతిలోవలె నాటవెలఁదియందును ప్రాసయతి పాటింపఁబడును. కావున యతిప్రాసలపాటింపును బట్టి తేటగీతిభేదములవలె నాటవెలఁదిపద్యభేదములును ఏర్పడును.[19]

## 8. సీసము :

ఆఱేసియింద్రగణములపై రెండుసూర్యగణములు గల నాల్గుపాదములు సీసమున నొప్పారుచుండును. అందు ప్రథమగణాద్యక్షరమునకును, తృతీయగణాద్యక్షరమునకు నొకయతియుఁ, బంచమగణాద్యక్షరమునకును, సప్తమగణాద్యక్షరమునకును మఱియొక యతియుఁ జెల్లును. సీసపద్యపాదమునందు మొదటినాలు గింద్రగణములు గలభాగము

19. వివరములకు చూడుడు : అనుబంధములు.

పూర్వభాగ మనియు, మిగిలినది యుత్తరార్ధ మనియు పరిగణింపవచ్చును. ఈవిధముగా నాలుగుపాదములు కూర్చిన పిమ్మట నాటవెలఁదిఁగాని, తేటగీతిగాని యుంచవలెను. ఇట్లు సీసము మొత్త మెనిమిదిపాదములు గలిగి యుండును. ఇందు యతి, ప్రాసయతులలో నేదైనఁ బాటింపవచ్చును. ప్రాసనియమము లేదు.

ఇంద్రగణబహుళ మైన సీసమున గతిలోఁ బెక్కుభేదములు కల్పింప వీలున్నది. ప్రతిపాదాంతవిరామమును బాటించుటచేతను, తద్విరామవిరహితముగాఁ దీగవలె సీసము నల్లుటచేతను గతిలో విశేషము భాసించును. సీసపాదములలో పూర్వోత్తరార్ధముల మధ్య విరామము పాటించియు, పాటింపకయు రచనము చేయవచ్చును. ఇవికాక గణవశమైన విశ్రాంతిని అర్థానుకూలముగా కవులు బహువిధములఁ గూర్చుటయు కలదు. మఱియు యతి, ప్రాసయతులను బాటించువిధములనుబట్టి సీసము పదునాఱువిధములగు నని విమర్శకులు భావించుచున్నారు. ప్రాస సీసమున నియతము కాకపోయినను నన్నయాదులు కొన్నింట ప్రాసను పాటించి యీఛందమునకు విశేషాలంకారములను సంతరించియుండిరి. ఇట్లు సీసము తెలుఁగుకవులకావ్యరంగములందు వివిధస్వరూపగతిభేదములతో నర్తించుచున్నది.

మార్కండేయపురాణమున మారన 213 సీసపద్యములను రచించెను. అందు ఆట వెలఁదితోఁ గూడినవి 56. తేటగీతితో తేజరిల్లునవి 157. సీసమున మారన తిక్కనవలె తేటగీతులనే నెక్కువగాఁ గూర్చెను.

నన్నయ రచించిన సీసపద్యభేదములను నిరూపించుచు డాక్టరు గిడుగు సీతాపతిగారు అప్పకవీయపీఠికలో- యతి, ప్రాసయతులు పాటించు విధమునుబట్టి - పదునాఱు విధములని పేర్కొని యుండిరి. వా రిచ్చిన పట్టిక యిది :

| | | | | |
|---|---|---|---|---|
| సీసము<br>గీతి | 1<br>యతి<br>యతి | 2<br>యతి<br>ప్రాసయతి | 3<br>యతి<br>యతి-ప్రా.య | 4<br>యతి<br>ప్రా.య-యతి |
| సీసము<br>గీతి | 5<br>ప్రాస<br>యతి | 6<br>ప్రాస<br>ప్రాసయతి | 7<br>ప్రాస<br>యతి-ప్రా.య | 8<br>ప్రాస<br>ప్రా.య-యతి |
| సీసము<br>గీతి | 9<br>యతి-ప్రా.య<br>యతి | 10<br>యతి-ప్రా.య<br>ప్రా.య | 11<br>యతి-ప్రా.య<br>యతి-ప్రా.య | 12<br>యతి-ప్రా.య<br>ప్రా.య-యతి |
| సీసము<br>గీత | 13<br>ప్రా.య-యతి<br>యతి | 14<br>ప్రా.య-యతి<br>ప్రాసయతి | 15<br>ప్రా.య-యతి<br>యతి-ప్రా.య | 16<br>ప్రా.య-యతి<br>ప్రా.య-యతి |

ఈపదునాఱుసీసభేదములలో నన్నయరచనమునందు 12, 14, 15 సంఖ్యలు గలభేదములు కానవచ్చుట లేదు. తిక్కన నన్నయవలె యతిప్రాసవ్యవస్థలకు సంబంధించిన యిట్టి నియమముల కెక్కువ ప్రాధాన్య మిచ్చినట్లు కానరాదు. మారనకవియు సీసపద్య రచనమున నన్నయవలెఁ బైసీసపద్యభేదములను బాటింపక తిక్కనమార్గము ననుసరించెను. మారనపైఁ గల తిక్కనప్రభావమున కిది మఱియొక నిదర్శనము.

మారన సీసపద్యరచనమునఁ దిక్కనమార్గమున నడచినను అతనిరచనలోఁ బైభేదములందలి 1వభేదమునకు 29 సీసములు, 3వభేదమునకు 1సీసమును, 13వ భేదమున 2 సీసములును గానవచ్చుచున్నవి.[20] వీనిని మారన ప్రయత్నపూర్వకముగా నిర్మించినట్లు కానరాదు. కావున వీని నయత్నకృత సీసపద్యభేదములుగా భావింపవచ్చును. మారనరచనలో నొండురెండుమార్పులు చేసినచోఁ బైసీసపద్యభేదములలో నేదియో ఒక దానిక్రింద లెక్కింప వీలగు సీసపద్యములు దాదాపు 125 కనఁబడుచున్నవి.

మారన సీసపద్యరచనమునఁ గొన్నివిశేషములను బ్రదర్శించెను. అందు మొదటిది ప్రాసపాటింపు. ప్రాసను పాటించుట సీసమున నియతముకాదు. ఐనను మారన వర్ణ్య వస్తువు నుదాత్తమొనర్చుటకు ఛందమును ప్రాసాంత్యప్రాసాదులచేతను, ద్విత్రిచతురక్షర ప్రాసాదులచేతను అలంకరించి కొన్నియెడల ప్రయోగించెను. అందు మార్కండేయము నందలి మొదటిసీసము కృతిపతివర్ణనాత్మకమై పాదాద్యంతప్రాసలచే నలంకృతమై యున్నది-

సీ. తనసముజ్జ్వలమూర్తి జనలోచనాంభోజ
ములకు మార్తాండునిమూర్తి గాఁగఁ
దననయోపార్జిత ధనమున కర్థిహ
స్తములు నిక్షేపణస్థలులు గాఁగఁ
దనభూరితరతేజ మనుపమ నిజవంశ
భవనంబునకుఁ బ్రదీపంబు గాఁగఁ
దనవినిర్మలయశంబునకు దిశాతటం
బులు దృఢశాసనశిలలు గాఁగఁ
తే. బ్రకట గుణగణసంపదఁ బరగుచున్న
ధన్యుఁ డధికపుణ్యుండు ప్రతాపరుద్ర
దేవసామ్రాజ్యవర్ధనస్థిరవినీతి
కరణకుశలుండు నాగయగన్నవిభుఁడు. (అవ. 12)

---

20. 1వభేదము : 1ఆశ్వా. 46; 106; 169; 177; 194. ద్వి.ఆ.-65; 146; 189; 213; 223; 325; 340; తృ. ఆ.-93; 113; 150; 170; 230; 232; చ.ఆ.-15; పం.ఆ.-46; 118; 368. ష.ఆ.-11; 197. సప్త.ఆ.-76; 173. అష్ట.ఆ.-164; 226; 260. 3వ భేదము : 7.74. 13వ భేదము : అవ. 12; 1.16.

ఇందు సీసపద్యపాదములలో వర్ణితమైన వస్తువు రూపకోత్ప్రేక్షాలంకారమండితమై యుండుటయు, నది పాదాద్యాంతప్రాసలచే నలంకృత మగుటయు సార్థకము. కృతిపతిగుణగణములు ప్రకట మగున ట్లాపాదములు రచింపఁబడుటయు, తేటగీతియందు గృతిపతిని బేర్కొనుటయు నుత్కంఠావహమై యౌదాత్యపోషకము లగుచున్నవి. ప్రాసయు, ప్రాసయతియు, నంత్యప్రాసయుఁ గృతిభర్తయొక్క యుజ్జ్వలనయతేజోయశస్సులసమప్రాభవమును వ్యంజించుచున్నవి.

గన్ననేనాని నభివర్ణించిన రెండవసీసమున కూడ మారన ప్రాసను బాటించి యందము నింపెను. (అవ. 39)

పంచమాశ్వాసమునఁ బద్మినీవిద్య నాశ్రయించియుండు నిధుల నెనిమిదింటినిఁ బేర్కొనుచు నందు పద్మనిధిప్రభావమును గూర్చి తెలుపు సీసమునుగూడ పాదచతుష్టయమునందు ప్రాసను బాటించి యుదాత్తద్రవ్యవర్ణనమున నలంకృతచ్ఛందమును వ్యంజకాంగముగా నిర్మించి శిల్పము వెలార్చినాఁడు మారన.

మారన కాకతిగణపతిదేవుని, హరిశ్చంద్రుని వర్ణించిన సీసములందు పాదారంభమున ద్వ్యక్షరప్రాసను పాటించి, వారి సుందరగుణౌన్నత్యమును వ్యంజించెను. ఈసీసమును వృత్తప్రాససీస మని యందురు.

సీ. ఏరాజు రాజుల నెల్ల జయించి ము
  న్నెట్టికిఁ బట్టె దోర్విక్రమముల
నేరాజు సేతుసీహార్ద్రి మధ్యోర్వి
  నేకపట్టణలీల నేలె ప్రాలె (అవ. 35)

ఇట్లు సాగెడి గణపతిదేవ వర్ణనమునకుఁ బ్రతిగా-

సీ. ఎవ్వని మాహాత్మ్య మెప్పుడు వేదము
  ల్చెలఁగి సుస్తోత్రము ల్సేయుచుండు;
నెవ్వనిశాసనం బేడుదీవులరాజు
  లకు శిరోభూషణలక్ష్మి నొందుఁ (1.142)

ఇట్టిసీసపద్యనిర్మాణశిల్పమునే మఱికొంత విస్తరించి యమకవిస్ఫూర్తియు, అంత్యప్రాసయుఁ గల్పించి మహామాయారూపిణి యగు విష్ణుయోగనిద్రను మారన యభివర్ణించెను.

సీ. ఏమహామాయచే నీచరాచరబహు
  భూతజాలంబులు పుట్టుచుండు
నేమహామాయచే నెల్లలోకంబులు
  మోహసాగరమున మునుఁగుచుండు
నేమహామాయచే నెట్టివిద్వాంసుల
  బుద్ధు లెఱుంగమి గ్రుంగుచుండు
నేమహామాయచే నింతయుఁ గ్రమ్మఱ
  నవసానవేళల నణఁగుచుండు

తే. నామహామాయసుమ్మి మహానుభావుఁ
డన సమస్తజగత్కర్త యనఁగ నాది
దేవుఁ డన వెలింగెడు విష్ణుదేవుయోగ
నిద్రయైన మహామాయ భద్రమూర్తి. (6.32)

ఇందు చతుష్ప్రాసయు, నంత్యప్రాసయే కాక సీసపద్యపాదచతుష్టయమున సమఖండగతి స్ఫుటమై నిర్మాణమున నొకయైక్యత భాసించుచున్నది. స్తుతిగర్భిత మైన వర్ణన మగుటచే యమకము భక్తిపారవశ్యసూచక మగు చున్నది; అంత్యప్రాస తద్ధర్మబోధకమై గుణ సాతత్యమును వ్యంజించుచున్నది. ఎత్తుగీతి చివరిపాదమునందలి ప్రాసయతి కర్త యైన మహామాయ ప్రత్యేకతను స్పష్టపఱచుచున్నది.

ఇంతియకాక - పాదాంతయమకమును బాటించుటచే నంత్యప్రాస వెలసిన సీసములు కొన్ని కలవు. అందు అవేక్షితవైశాలినీ గంధర్వలోకవిహారవర్ణనము పేర్కొనఁదగినది. (8.194)

ప్రాసను సందర్భోచితముగ సీసమునందుఁ బాక్షికముగా వాడినపట్టులును గొన్ని కలవు. ఉదాహరమునకు-

1. సీసపాదచతుష్టయపూర్వార్ధమున మూఁడింట ప్రాస పాటింపఁబడినవి : 1.46; 1.97; 2.340; 4.48; 5.337; 7.169; 8.204· 8.278.
2. 1,2 పాదములపూర్వార్ధమునప్రాస - 3.232; 3.362; 4.71; 7.48; 7.74; 7.96; 7.204; 7.279; 8.29.
3. 1,3 పాదములపూర్వార్ధమునప్రాస- 4.195; 7.210; 255; 8.164.
4. 1.4 ,, ,. ,, 8.285.
5. 2,3 ,, ,, ,, 5.318; 6.163; 7.45; 7.173.
6. 2,4 ,, ,, ,, 6.179; 7.251; 5.328.
7. 3,4 ,, ,, ,, 6.226; 7.142; 8.148;5.7.
8. 3, 4 ,,ఉత్తరార్ధమున ,, 3.327.
9. 3,4 పాదపూర్వార్ధమునను, 1,2 ఉత్తరార్ధమునను ప్రాస- 1.117.
10. పాదఖండాత్యప్రాస- 8.9; 1;2 పాదాలలో - 640.

జైమిని భారతాఖ్యానమునందలి సందియములనుగూర్చి ధర్మపక్షుల నడుగు కథార్థములఁ జెప్పు కథనసీసమున అన్నిపాదములందును "అ" యతిని పాటించి యొకవైశిష్ట్యమును మారన పాటించెను.

సీ. అనుపమం బగు భారతాఖ్యానమున సంది
యము లైన యర్థంబు లర్థి మిమ్ము
నడుగ నేతెంచితి ననిన నాద్విజవరు
లవి మాకు విషయంబు లై మదీయ

మగుబుద్ధిఁ దోఁచినయ ట్లెల్లఁ జెప్పెద
మడుగుము నీ వన్న నతిముదమున
నతఁడు మార్కండేయు నడిగినయట్టుల
నన్నియర్థంబులు నడుగుటయును
ఆ. నమ్మహానుభావు లలరి నారాయణు
నాదిపురుషు నిత్యు నప్రమేయు
నఖిలవేదమయుఁ జరాచరగురుఁ బర
మాత్ము వాసుదేవు నజు ననంతు. (1.106)

పురాణవక్తృశ్రోతృచిత్తసమవృత్తిని యిందలి యతిసామ్యము వ్యంజించుచున్నది. ఇట్టిది పద్యమున నాద్యంత ముండుటచే వారిచిత్తములు పురాణార్థముల శ్రవణప్రవచనములందు ఆద్యంతమత్యంతోత్సాహవంతములై యుండు నని స్ఫురించుచున్నది.

ఇట్లే "ఇ-ఏ"-యతి పాటింపఁబడిన సీసమున మారన హరిశ్చంద్రునివితర్కమును వర్ణించెను.

సీ. ఈమునీంద్రున కర్థ మీరెండుజాముల
కెక్కడ నవరింతు ? నెందుఁ జొత్తు ?
నెదరు దీర్పఁగ బంధు లెచ్చటఁ గల రిప్పు
డెవ్వరి నడుగుదు హీనవృత్తి ? (1.194)

ఇట్లు రచింపఁబడిన సీసమున సత్యవ్రతమును నిలువఁబెట్టుకొన శతధః యత్నించు హరిశ్చంద్రుని చిత్తోద్వేగమును, వితర్కవిశేషమును గన్నులకు గట్టునట్లు వర్ణింపఁబడియున్నది. ఉదాత్తస్వరములతో యతిని గల్పించి యతని దుఃఖతీవ్రతను మారన వ్యంజింపఁ జేసెను. ఇట్టివిశేషములు పురాణపఠనావసరమున విజ్ఞులు గ్రహించుట సులభము.

మారన సీసములను ప్రధానముగా నుదాత్తద్రవ్యవర్ణనమునందు వాడెను. పైఁ జెప్పిన యుదాహరణములే కాక - శ్మశానవర్ణనము. (1.236); విష్ణువర్ణనము (1.267); ఆడిబకయుద్ధవర్ణనము (2.12), నరకవర్ణనములు(ద్వి.ఆశ్వా); సూర్యోదయ వర్ణనము, (2.189); ప్రాణాయామవర్ణనము - (3.317); హిమనగవర్ణనము - (4.224); సూర్యస్తుతి - (5.354); దేవీవర్ణనము (6.82); సప్తమాతృకలవర్ణనము - (6.171); భూతిమాహాత్మ్యవర్ణనము-(7.45); మరుత్తరాడ్వర్ణనము - (8.278); యుద్ధవర్ణనలు - (2.337; 6.94; 100; 105;156; 167; 179; 181; 8.104.)

ఇవికాక కథాకథనమునందును, వివిధరసభావవ్యంజనమునందును మారన సీసమును వాడెను; స్తుతులకు, కీర్తనలకు సీసము నుపయోగించెను.

సీసములతో నలంకృతము లైనవి మొదటియాశ్వాసమునందును, అవతారికయందును అధికముగాఁ గలవు. ఆఱవయాశ్వాసమున యుద్ధవర్ణనలు స్తుతులు గల సీసములు రసోచితశైలిలోఁ గూర్పఁబడినవి. మిగిలినవానిలో రసభావవ్యంజకము లైనవాని

యందును రచనలోనో, గతిలోనో, అలంకారప్రయోగముననో, వాక్యరచనావిన్యాసముననో మారన వైశిష్ట్యమును ప్రదర్శించెను.

## 9. గద్యము :

ఉ. " అరయ నొక్కభంగిన రహస్యపుఁజోటను రాజసన్నిధిన్
సూరిసభాంతరంబులను జొప్పడి తప్పక గద్యపద్యముల్
దోరలు వేర్చినట్లు మదిఁదోఁపఁగఁ జేయుట సంతతంబు నా
భారమకాదె వీని కను భారతి మాకుఁ బ్రసన్నమయ్యెడున్."

అని భారతికి మ్రొక్కి మార్కండేయపురాణరచనమునకుఁ గడఁగిన మారనకవికి గద్యపద్యరచనలు రెండును సమప్రాధాన్యము కలవియే. "గద్యం కవీనాం నికషం వదంతి" యను వామనోక్తి ననుసరించి పద్యమువలె గద్యము నొప్పించుట కవిశక్తికి నికషోపలమే కాఁగలదు. మారన గద్యపద్యరచనలో సవ్యసాచి.

మారన మార్కండేయపురాణమున 635 గద్యములను-వచనములను-రచించెను. అందు వర్ణనాత్మకము లైన గద్యములు దాదా పొక డెబ్బది కలవు. కథాకథనాత్మకమైనవి సుమా రొక మూఁడువందలు కలవు. మిగిలినవన్నియు రెండుపద్యములమధ్య భావము నతుకుట కుపయోగింపఁబడిన వాక్యఖండము లనవచ్చును. ఇందు వర్ణనాత్మకములైనగద్యములలో నీక్రిందివి ముఖ్యములు :

1. తపోవనవర్ణనము-1.1; 2. శరీరదుర్గ వర్ణనము-1.89; 3. నారాయణ చతుర్వ్యూహవర్ణనము-1.116. 4. స్వప్నవర్ణనము-1.239. 5. జంతూత్పత్తిప్రకారము-2.51. 6. జన్మాంతరపాపకర్మలు- వానికిఁ దగిన జన్మలు-2.115; 118. 7. నాగలోకవర్ణనము-3.70. 8. ఆశ్రమధర్మములు-3.142. 9. గృహస్థధర్మములు-3.153. 10. యోగవర్ణనము-3.341. 11. ప్రాకృతసర్గవర్ణనము-4.8. 12. చతుర్యుగమన్వంతరకాలసంఖ్యలు-4.18; 21; 23. 13. సురనరతిర్యగాదినవవిధవిసర్గము-4.25; 29; 33. 14. పట్టణగ్రామఘోషాదిపరిణామవర్ణనము-4.39. 15. దక్షసర్గము-4.62. 16. నామకథనాదులు-4.108; 110; 115; 117; 123, 125; 127; 130; 138; 146; 152; 172; 176; 181; 5.104; 222; 257; 297; 327; 365; 369; 6.247; 7.4; 6; 68; 85. 17. దేవ్యావిర్భావ వర్ణనము-6.74. 18. యుద్ధవర్ణనములు-6.95; 164; 166; 174; 183; 201; 206. 19. దేవిభవిష్యదవతారవర్ణనము-6.230. 20. అగ్నిస్తుతి-7.54. అగ్నితేజము దెచ్చుట-7.119. మారన వర్ణనలను దీర్ఘవచనములలోఁ జేయలేదు. నాతిదీర్ఘములును, నాతిలఘువులును నైన వచనములనే యుపయోగించెను. నామకథనాదులు సర్గప్రతిసర్గాదులలోను, మన్వంతరదేవేంద్రాది కథనమునందును కానవచ్చుచుండును. తత్కథన మతినీరసము. వానిని వచనములలో చెప్పివైచినాఁడు మారన. అట్లే సర్గ, ప్రతిసర్గ, కాలసంఖ్యా, ఘోషాదిపరిమాణము లన్నియు గద్యములలోనే రచించినాఁడు. విషయప్రతి

పాదనప్రధానములైన యేతదంశములతోపాటు. విజ్ఞానప్రదములైన ధర్మవిషయములను గూడ గద్యములలో రచించి మారన యౌచిత్యము పాటించినాఁడు. మిగిలినవర్ణనలు-తపోవన, శరీరదుర్గ. చతుర్వ్యూహ, స్వప్న, దేవ్యావిర్భావ, యుద్ధవర్ణనములు-రసపత్రములు; ఉచితశైలీసుందరములు; అలంకారబంధురములు-మారన వచనరచనకుఁ జక్కని తార్కాణములు. మారన పద్యములవలె వచనములను గూడ ధారావాహికముగను, మధురతరముగను రచించు మధురకవితాశక్తి కలవాఁడు.

**ఛందస్సంవాదము :**

కావ్యమునఁ దుల్యము లైన చిత్తావస్థలనుగాని, రసభావములనుగాని, కథార్థములను గాని వ్యంజింపఁజేయుటకు వృత్తైక్యము పాటించుట ఛందస్సంవాదశిల్పము. మారన మహాకవి మార్కండేయపురాణమున నిట్టిశిల్పమును బహుళముగాఁ బ్రదర్శించెను.

ఇరువురువ్యక్తులమధ్య సంభాషణము నడచునెడ నుక్తిప్రత్యుక్తులయందు బింబప్రతిబింబరూపము లైన వాక్యములు వెలువడుచుండుట లోకప్రసిద్ధము. కావ్యమున నట్టిపట్టులందు వృత్తైక్యము ఘటించుట ఛందశ్శిల్పము.

(1) కౌశికహరిశ్చంద్రసంభాషణము :

తే. ఎవ్వరికి నిత్తు గాతు పీ వెట్టివారి
రాజ ! యెవ్వరితో బవరంబు సేయు ?
దనిన విప్రుల కిత్తు భయార్తజనులఁ
గాతు శత్రులతోడ సంగర మొనర్తు. (1.159)

క్రుద్ధుఁడైన విశ్వామిత్రుఁడు ధట్టించి మూఁడుముక్కలలో నడిగినప్రశ్నకు అభిమానధనుఁడును, మితహితసత్యవాక్యచతురుఁడును నైన హరిశ్చంద్రుఁడు తానును మూడు ముక్కలలో ప్రత్యుత్తర మిచ్చి, సందర్భశుద్ధినిఁ బ్రకటించెను. క్రుద్ధుఁడైనవానితో వాదు పెంచరాదు. నిపుణమైనప్రత్యుత్తరముతో నాతని వాక్కును గట్టివేయవలెను. కౌశికుఁడు హరిశ్చంద్రునివాక్యములలోని ఇచ్చు, కాచు, యుద్ధముచేయు క్రియల నుటంకించి వాని స్వభావములను దేటపఱుపు మని ప్రశ్నించుచు తేటగీతి నెత్తుకొని వచించుట యత్యంత సహజము. అది తునుకలు తునుకలుగా విరుగుచు ఛందముయొక్కపూర్వార్ధమున నాగి పోవుట కౌశికునిచిత్తోద్వేగమును వ్యంజించుచున్నది. పృచ్ఛకుని ప్రశ్నార్థములకు తగిన ప్రత్యుత్తరమును వినయాన్వితముగా నొసఁగి తనహృదయమును తేటతెల్ల మొనర్చుటయే కాక, ఆసమస్య నంతటితో ముగింప నెంచిన హరిశ్చంద్రుని వాగ్వృత్తి తేటగీతియందే వెలువడి యాపద్యోత్తరార్ధమును పూరించినట్లు వెలువడుటలో పరమౌచిత్యము కలదు. ఇష్టైకవృత్తమునఁ బ్రశ్నోత్తరరూపసంభాషణము వెలయించుట యొకశిల్పము.

(2) బకభార్గవసంవాదమున నిట్లు రెండుతేటగీతులు వాడఁబడినవి. బకుఁ డనిన మాట లివి :

తే. వినుము తండ్రి! యేర్పడఁ ద్రయీవిహితధర్మ
మరయఁ గింపాకఫలమున ట్లఘభరితము
పరమపదము మోక్షమ్ము తత్ప్రాప్తిఁ గోరు
నాకు నేటికిఁ గర్మకాననముఁ జొరఁగ.

వ. అనిన విని వెఱఁగుపడి తండ్రి యి ట్లనియె.

తే. ఏటిమాట లాడెదు కుఱ్ఱ! యెఱుక నీకు
నెక్కడిది? మున్ను జడభావ మేమి కతన
నాదవె? నీ ప్రబుద్ధత యున్నయునికి నెచటఁ
గంటి? యిది శాపవికృతియో కాక నిజమొ? (2.27-29)

పరమశమగుణనికషోపలము మొదటితేటగీతి. శాంతచిత్తమును తేటపఱచువృత్త మిది. ముముక్షువు కర్మమార్గమును గర్హించుటలోని యేవగింపామాటలలో వ్యక్తమగుచున్నది. ముక్కుపచ్చలారని ముద్దుబాలునినోట మొదటిసారిగా నీముముక్షువాక్యము వెల్వడి తండ్రి నాశ్చర్యమున ముంచియెత్తినది. అబ్బురపాటు నొందినయతనిచిత్త మబ్బాలునివాక్యగతికి ప్రతిస్పందనరూపముగా లాస్యము చేసినది. మఱల తేటగీతి వెలసినది. జడునివాక్య రచనము శక్తిమంత మైనది. మఱియు కర్మకాననప్రవేశదుఃఖభావముద్రిత మైనది. తండ్రి వాక్యము దానిఛాయ! ఇట్టివే నాభాగవైశ్యసంవాదమునను (తే.గీ.7.296;297); కరంధ మావేక్షితసంవాదమునను (8.153-154=155;156 తే.గీ;వ.) గనవచ్చుచున్నవి.

అవేక్షితవైశాలినులు వనాంతరమునఁ గలసినపుడు దృఢకేశుం జంపిన యతనికి నిజవృత్తాంత మెఱిఁగించి వైశాలిని తనను వివాహమాడు మని ప్రార్థించెను. ఆమె పలుకు లకు సుముఖుఁ డయ్యు కింకర్తవ్యతాచింతతో డోలాయమానమగు చిత్తమున నున్న నవేక్షి తునినోట తచ్చిత్తవృత్తివ్యంజకముగా నీక్రింది యాటవెలఁది యవతరించినది.

ఆ. "సానురాగహృదయ వైన ని న్నపుడు నే
రిపుజితుండ నై పరిత్యజించి
నాఁడ నిపుడు శత్రునాశావసరమునఁ
బ్రాప్త వైతి సేయుభాతి యేది?"

ఆ. "అనిన నింతి యిట్టు లనియె మత్పాణిగ్ర
హమ్ము సేయు మీవనాంతరమునఁ
గామకలితు లైన భామినీపురుషుల
సంగమంబు వొలుచు సగుణ మగుచు." (8.185-186)

డోలాయమాన మగుచిత్తము నూరటజెందునట్లు చేయుటకు ఆటవెలఁదియే యుచితమైన ఛందము. నాయికాచిత్తాహ్లాదవ్యంజక మగుటయు నం దొకవిశేషము. ధర్మాశ్రితమైన యతనిచిత్తమును - లోకధర్మముచే సమర్థింపఁబడుచున్న తనియభిమతమును బ్రతిపాదిం చుటచే వశీకరించుకొనినది వైశాలిని. ఇన్నిప్రయోజనములను సాధించు నీఛందస్సంవా దము సార్థకము!

ఉత్తముఁడు దీర్ఘవియోగానంతరము భార్య యైన బహుళను తిరిగి పొందెను. తమి మీర నామెను గౌఁగిటఁజేర్చెను. అట్టియెడ నాతనిసతి యతని నొకకోరిక కోరెను. దానిని మారన కందమున వెలయించెను.

క. 'చిత్తము నీకుఁ బ్రసాదా
యత్తం బై యున్నదేని యడిగెద విను రా
జోత్తమ ! యొక్కటి నినుఁ దలఁ
కొత్తక యది సేయు' మనుడు నుర్వీశుండున్.

క. ఏ నీకు దక్కియుండం
గా నిట్లన నేల ? యెంతకడిఁది యయిన న
బ్జానన ! చేసెద నీప్సిత
మైనది నిశ్శంక మడుగు' మనుటయు నదియున్. (5.207-208)

లజ్జావతియైన నాయిక ప్రసన్నుఁడైన భర్తముందు మనోవాంఛను వ్యక్తముచేయునెడ వాక్యములు సంగ్రహములుగా వెడలుట సహజము. కావున మారన కందమును చేపట్టుట సహజము ! ప్రియాంగనాచిత్తరంజకుఁ డైన నాయకుఁడు తచ్చిత్తవృత్త్యనుకూలముగా మాటలాడి యామెను సంతోషపెట్టును. కావున నుత్తముఁడు కందమునఁ బ్రత్యుత్తర మిచ్చుట సహజము. ఇరువురివాక్యములును కందపద్యచతుర్థపాదమధ్యమున ముగియు చుండుట సంవాదశిల్పము. బహుళాప్రోక్తకందమున ప్రాసాక్షరము ద్విత్వమగుటవలనను, నందుచే పాదాద్యక్షరము గురు వగుచుండుటవలనను నాయికాగతమైన లజ్జాశంకా భయాదులు వ్యక్తములగుచున్నవి. ఉత్తమునివాక్యమున పాదారంభదీర్ఘములు పదవశమున సహజములై రాణించుటవలనను, అనునాసికాక్షరప్రాసనిబంధనమువలనను, ప్రాసాక్షరానుప్రాసమువలనను, నాయకహృద్గతసహజోత్సాహోల్లాసమును, హర్షోత్కర్ష మును వ్యక్తము లగుచున్నవి.

కందములం దిట్టి ఛందస్సంవాదము పెక్కుచోట్ల కలదు. ఉదాహరణమునకు- నాగాధిపనాగకుమారాశ్వతరవాక్యములను (3.58;62;64), అగస్త్యగంధర్వవాక్యములను (8.189; 190), మరుత్తావేక్షితసంవాదమును (8.262; 263) గ్రహింపవచ్చును.

పతివ్రతాశాపమువలన సూర్యోదయము లేక లోకములు తల్లడమందుచుండ దేవతలు వికలచిత్తులై విరించియాజ్ఞానుసారము అనసూయ దరికిఁజేరి యిట్లు ప్రార్థించిరి:

చ. అతులితనిత్యసత్యవతి యైన పతివ్రతయాజ్ఞ నయ్యహ
ర్పతి యుదయింపమిం గడు విపద్దశఁ జేద్పడి నిన్నుఁ గాన వ
చ్చితిమి దినంబు మాకు దయసేయుము తొల్లిటియట్లకాఁగ వి
శ్రుతసుచరిత్ర యన్న ననసూయ సురావలిఁ జూచి యి ట్లనున్. (2.173)

దేవతల చిత్తత్వర లఘుబహుళ మైన చంపకమాల వ్యంజించుచున్నది. ప్రథమచరణము నందలి 'త' వర్ణావృత్తి వారివాక్యవృత్తియందలి తడబాటును, త్వరను వ్యక్తీకరించు చున్నది. దేవతలవాక్యమును సానుభూతితోడ విని సహానుభూతి నొందిన యనసూయ

సత్త్వచిత్తమున సురలవాగ్వృత్తి ప్రతిబింబించినది. ఆపన్నులకు తరణోపాయము చూపుటలో త్వరాయమానమైన యప్పతివ్రతవాక్యముకూడ తుల్యచ్ఛందమున వెలువడినట్లు రచించుట ఛందశ్శిల్పము; మారన అట్టిశిల్పమును బోషించెను! (చూడు: 2.174.)

స్వారోచిషమనుసంభవవృత్తాంతమున ప్రవరసిద్ధులసంభాషణమున "వాయుపు రజ్జు లేల మునివల్లభ!...(4.217) యను నుత్పలమాలాచ్ఛందమునఁ బ్రవరుఁడు మాట్లాడ సిద్ధుఁ డదేవృత్తము నెత్తుకొని "ఏ నొక సిద్ధుఁడన్ విను మహీసురశేఖర!" (4.218) యని మొదలిడి సమాధానము చెప్పుటలో ఛందస్సంవాదశిల్పము కలదు! ఈ యంశము వెనుక వివరింపఁబడినది.

నారకుల మొర లాలించి విదేహభూపాలుఁ డడిగినప్రశ్న మత్తేభమున మారన రచించినాఁడు. దానికి యమకింకరుఁ డిచ్చిన ప్రత్యుత్తరమును మత్తేభమున నిబంధించి ఛందస్సంవాదశిల్పము వెలయించినాఁడు. (2.124-125)

ఒకపాత్ర భిన్నసందర్భము లందొకేభావమును వ్యక్తపఱచుచున్నప్పుడు ఛంద స్సంవాదము పాటించుటయు నొకశిల్పమే. తనను ప్రార్థించు దేవతలఁ బరీక్షించుటకు దత్తాత్రేయుఁ డిట్లనెను:

శా. "మద్యాసక్తుఁడ నంగనారతుఁడఁ గర్మభ్రంశనోచ్ఛిష్టుఁడ
నా మద్యద్దైత్యవినాశశక్తి కలదే నా?" కన్న- నద్దేవతల్
"విద్యాక్షాళనశుద్ధమానసుఁడ వావిష్ణుండ వాద్యుండ వీ
యుద్యత్పుణ్యచరిత్ర యిందిర మహాయోగీంద్రచూడామణీ!" (2.226)

దత్తయోగి వాక్యచ్ఛందమున సుర లాతనిఁ బ్రతిస్తుతించి యతనిచిత్తమును కరగించిరి. ఈ యుపాఖ్యానమును మంత్రివలన కార్తవీర్యుఁడు వినెను. అతఁడు దత్తాత్రేయుని సేవించెను. అతనిని బరీక్షింప నెంచియు నయ్యోగి తనవాక్యమును శార్దూలవృత్తముననే యెత్తుకొనెను. ఆరహస్య మెఱిఁగిన కార్తవీర్యుఁడు సురలవలెనే యాయోగిని కీర్తించి యతని దయకుఁ బాత్రుఁ డయ్యెను. ఆసందర్భమున మారన రచించినపద్యము పైపద్యమునకు ఛాయ! అట్లగుట శిల్పము! చూడుడు:

శా. "కాంతాసక్తుఁడ మద్యపానరతుఁడం గష్టప్రచారుండ న
త్యంతప్రీతి భజించె దేమిటికి న" న్నన్న నమ్మహీనాయకుం
"డంతశ్శుద్ధుఁడ వీ వసంగుఁడవు విద్యావిస్ఫురన్మూర్తి వీ
కాంతారత్నము పద్మవాస త్రిజగత్కల్యాణి యోగీశ్వరా!" (2.244)

ఇంతియకాక కృతిభర్తను, కృతిని సీసములందు వర్ణించియు (అవ. 12; 22); కృతిపతివంశావళిలో కాకతి గణపతిదేవుని, గన్నసేనానిని, మేచయసేనానిని, సీసములలో వర్ణించి సామ్యమును వ్యంజింపఁజేయుటయేకాక పురాణమున హరిశ్చంద్రమరుత్త భూపాలురను, చివరకు విష్ణువునుగూడ (1.142; 2.267; 8.278) సీసములలో వర్ణించి కృతిపతియందు విష్ణ్వంశను ధ్వనింపఁజేసి మారన శిల్పి యనిపించుకొనినాఁడు! ఇట్లే మారన వ్యాసవాల్మీకుల నేకఛందమునఁ గీర్తించెను. ఇట్టిశిల్పవిశేషములు మారనరచనలో సహృదయులు గమనించుట సులభము!

# అలంకారశిల్పము

కవి కావ్యమున నలంకారములను సముచితముగా సమీక్షించి కూర్పవలె నని ఆనందవర్ధనాచార్యు లిట్లు చెప్పెను :

"వివక్షాతత్పరత్వేన నాంగిత్వేన కథంచన
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా ॥
నిర్వ్యూఢా వపి చాంగత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్
రూపకాదే రలంకార వర్గ స్యాంగత్వసాధనమ్."[1]

అనఁగా కవి కావ్యమున (1) నలంకారములను రసమున కంగముగాఁ గూర్పవలె ననియు, (2) అవసర మున్ననే వానిని స్వీకరింపవలె ననియు, (3) సమయానుకూలముగా వానిని త్యజించుచుండవలె ననియు, (4) అతినిర్వహణేచ్ఛ లేకుండ వలె ననియు, (5) అయత్న సిద్ధములైనను అంగములుగా నుండునట్లు సమీక్షింపవలె ననియు భావము. నిపుణుఁడైన కవి యీయంశముల నలంకారప్రయోగమునఁ బాటించుచుండును.

వేదవాఙ్మయమునుండియు నలంకారప్రయోగము కానవచ్చుచున్నది. అది శాస్త్ర పురాణేతిహాసములందు పరిణతి గాంచినది. లౌకికకావ్యనాటకాదులయం దది యతివిస్తృతిఁ దాల్చినది. మార్కండేయమహాపురాణమున నుపమారూపకాదిప్రధానార్థాలంకారములు నాతివిపులముగాఁ గానవచ్చుచున్నవి. పురాణకవి కావ్యకవివలె ప్రయత్నసిద్ధములైన యలంకారములను బ్రయోగింపడు. పురాణము శాస్త్రైకదృష్టి, అర్థప్రధానము, సత్యప్రతిపాదకము అగుటచే నాకవి ప్రతిపాద్యాంశసృష్టీకరణమునందును, పురాణార్థనిరూపణము నందును, సత్యాంశప్రతిపాదనమునందును ప్రత్యేకాభినివేశము చూపించును. కావున బహ్వాలంకారసంసృష్టియందుకంటె పురాణకవి కావ్యార్థశోభాహేతువులగు నుచితాలంకారముల పరిమితప్రయోగమునందే దృష్టి యుంచును. మారనమహాకవి సంస్కృతపురాణము ననుసరించుచుఁ బ్రధానముగా నిట్టిదృష్టినే ప్రదర్శించెను. మారన మూలమునందలి యలంకారములలోఁ బెక్కింటిని తెలుఁగునకుఁ దెచ్చెను. కొన్నిటి నౌచిత్య మెఱిఁగి స్వయముగాఁ గల్పించెను. కొన్నింటిని ప్రకరణౌచిత్యదృష్టితో వదలెను. ఏమైనను అతనిది ప్రబంధకవి కుండు అలంకారైకదృష్టి కాదు. పరమార్థప్రతిపాదనరమణీయ మైన పురాణ కవిదృష్టి.

1. ధ్వన్యాలోకము - ద్వితీయోద్ద్యోతము. శ్లో. 19-20.

**ఉపమాలంకారము:**

మారన మార్కండేయపురాణమున నర్థాలంకారములలో నుపమ నధికముగాఁ బ్రయోగించినాఁడు. ''ఉపమా కాళిదాసస్య'' అని కాళిదాసు ఉపమాలంకార ప్రయోగమునఁ బ్రసిద్ధిఁ గాంచియున్నాఁడు. ప్రకృతిసౌందర్యదర్శనమున సూక్ష్మేక్షిక కలవాఁడగుకవి యుపమాలంకారమును సామర్థ్యముతో నిర్వహింపఁగలఁడు. వర్ణ్యవస్తుస్వరూపస్వభావనిరూపణసమర్థమును, రమణీయోదాత్తమును నైన యుపమానద్రవ్యము నెన్నుకొనుటలోను, దాని నౌచిత్యభరితమైన వాగ్వ్యత్తిచే నావిష్కరించుటలోను కవియొక్క యుపమాలంకారప్రయోగకౌశలము వ్యక్తమగుచుండును. సామాన్యముగా నిట్టినైపుణ్యము రసవత్కవితాత్మ గల కవికి గాని యబ్బదు. మారనమహాకవి కవితాశిల్పమర్మజ్ఞుఁడు కావున 'ఉపమాశైలూషి'ని 'చిత్రభూమికలతో' 'కావ్యరంగమున నాట్యము చేయించి' రసికులమనస్సులను రంజింపఁజేయఁగలిగినాఁడు.

పురాణమున నుపదేశప్రధానము లగు పెక్కుశాస్త్రవిషయములు ప్రవర్తిల్లును. పురాణకథలయందు రసభావములు పోషింపఁబడును. మారన యుపమాలంకారముల నీ రెండంశములందును అప్రయత్నసిద్ధములుగా నిబంధించి తనసవ్యసాచిత్వమును బ్రదర్శించియున్నాఁడు. అందు ధర్మాదికథనమునందు మారన యుపమను వాడినవిధము ముందు పరిశీలింపఁదగినది. శాస్త్రము సహజముగా నీరసము. మిత్రసమ్మితముగా దాని నుపదేశింపఁ బూనెడిపురాణకర్త వానిని వలసినచోట్ల చమత్కృతము లొనర్చి పఠితకు హృదయాహ్లాద మొనర్చుటద్వారమున నాస్వాద్యమానములుగాఁ జేయవలెను. అట్టియెడ పురాణకర్త వస్తుస్వరూపస్వభావనిరూపకముగను, హృదయాహ్లాదసంజనకముగను అలంకారమును ప్రయోగించును. మార్కండేయమున ధర్మవిషయములు జడోపాఖ్యానమున నధికముగఁ జెప్పబడియుండుటచే మారన యుపమాలంకారమును బైదృష్టితో నాయుపాఖ్యానమునఁ బ్రయోగించియుండుట కాంచనగును. ఈక్రిందియుదాహరణములు గమనింపఁదగినవి :

(1) జంతూత్పత్తినిగూర్చి చెప్పుచు జడుఁడు గర్భస్థపిండవృద్ధి ని ట్లలంకృత మొనర్చి నుడివినాఁడు :

ఆ. ''సహజకఠినకోశసంవృద్ధితోడన
చాలవృద్ధి నొందు నాళికేర
ఫలముమాడ్కిఁ గోశపంజరంబున జంతు
వుండి దానితోన యొలయు వృద్ధి''. (2.55)

ఇందలి నాళికేరోపమానము ఉపమేయద్రవ్య అవస్థానిరూపణసమర్థమును, సహజసుందరమును, పూర్ణమును నై యొప్పుట యుచితముగా నున్నది.

(2) ఋతుకాలమున సతి పతిసమాగము కోరు నను నంశమును పురాణకర్త వివరించిన యుదాత్తభంగి ప్రశంసనీయము :

క. "ఋతుకాలంబున విను కుల
సతికిం బతివలన శుక్లసంప్రాప్తి ప్రజా
పతి గోరు హోమకాలా
హుతి యతిసంప్రీతిఁ గోరు హుతవహుమాడ్కిన్". (2.80)

ధర్మబద్ధమైన కామము యజ్ఞతుల్య మని వాత్స్యాయనాదిమునులు ఘోషించియుండిరి. సత్సంతానహేతుకమైన పవిత్రకామతంత్రము సకాలమును, సార్థకమును అయినచో నది మంత్రపూత మగు హవిస్సుచే హుతవహుని నర్చించుట వంటి దని భావించిన పురాణకర్తహృదయము గార్హస్థ్యధర్మబీజభూత మైనది. యజమాని కగ్నికార్య మెట్లు కర్తవ్యమో ఋతుస్నాత యైన కులసతిసమాగమ మంత కర్తవ్య మనుట యిందలి తాత్పర్యము.

(3) నరుఁడు తాను చేసిన పుణ్యాపాపఫలముల ననుభవించుట తప్ప దను నర్థము మూలమున నిట్లు కలదు.

శ్లో. పుణ్యా పుణ్యేహి పురుషః పర్యాయేణ సమశ్నుతే
భుఙ్జతశ్చ క్షయం యాతి పాపం పుణ్య మథాఽపి వా॥ (14.16)

ఈశ్లోకార్థమును మారన యలంకృత మొనర్చి యౌచిత్యము వెలార్చెను.

క. "విను తళియ నిడినయన్నం
బును బోలెం జేసిన పుణ్యము పాపం
బును మానవులకు నేవిధ
మునఁ గుడువక పోవుఁ గర్మములు ప్రబలంబుల్." (2.84)

ఇందలి యుపమానము మారన కల్పితము. సర్వజనసుబోధముగా పురాణార్థములఁ బ్రపంచించు పురాణకర్త వక్తవ్యాంశమును నిత్యజీవితసంబంధి యైన యుపమానద్రవ్యముతోఁ దేటపఱచి "భుజ్" ధాతువున కనుకూల మగు నలంకారముచేఁ బఠితను రజింపఁ జేయునేర్పు ప్రశంసనీయము

(4) భారతి పరబ్రహ్మ మను తాత్పర్యము :

కం. దారువునం దనలంబును
ధారుణిఁ బరమాణువులును దద్దయు నున్న
ట్లారాధనీయమూర్తివి
భారతి! నీయందు నుండు బ్రహ్మము జగమున్. (3.50)

యథాసంఖ్యానుప్రాణిత మైన యుపమాలంకార మిందుఁ గలదు. స్వయంజ్యోతిస్స్వరూప మైన బ్రహ్మము అనలముతోడను, సప్తధాతుస్వరూపమైనజగములు పరమాణువులతోడను బోల్పఁబడుట సాభిప్రాయము. అందు క్రమముగా నేకత్వానేకత్వములు స్ఫురింపఁజేయుట చమత్కారము.

దుర్గ్రాహ్యము లగు తాత్త్వికార్థములను నవనీతమువలె నందించి పఠిత కాస్వాద యోగ్యముల నొనర్చుటకు పురాణకర్త యలంకారములను బ్రయోగించిన విధము ప్రశంసనీయము.

ఉదాహరణమునకు ఒండురెండు :

తే. ఆకసం బొక్కటియ యెట్లనేకఘటము
లందుఁ బెక్కయి తోఁచుఁ దా నట్ల యాత్మఁ
డొకఁడు సకలంబునందును నొగి వెలుంగుఁ
గానఁ గాశీపతియు నేము గాము వేఱు. (3.297)

తే. బీజములు చేన వెదవెట్టి ప్రీతిఁ గాచి
పండుటయుఁ గోయు హాలికునిభంగి నొకఁడ
కాలములు మూటికిని దానె కర్త యగుచు
బ్రహ్మవిష్ణురుద్రాఖ్యలఁ బరగు నాత్మ. (4.15)

ఇట్టివి మఱికొన్ని :- 3.307; 3.315; 3.317; 3.318; 3.319; 3.321; 3.358; 3.359; 3.377.

మదాలస యలర్కునకు రాజనీతి నుపదేశించునెడ పురాణకర్త యుపమానాలంకారమును సారవంతముగఁ బ్రయోగించుట కీక్రిందిపద్యము లుదాహరణములు :-3.133; 3.135; 3.136.

కథాకథనావసరమునఁ బురాణకర్త యుపమాలంకారమును కథాంశస్పష్టీకరణమునకే కాక విభావానుభావరసభావవ్యంజనముకొఱకును వినియోగించెను. పురాణకర్త యెన్నుకొను ఉపమానద్రవ్యములన్నియు సర్వజనసులభగ్రాహ్యములై, నిత్యజీవితమున కతిసన్నిహితములై యుండుట గమనింపఁ దగియున్నది. అనలము, అర్కుడు, శశి, శక్రుఁడు, గరుడుఁడు, మదగజము, సింహము, లత, పుష్పమాలిక, మేఘము, పిడుగుపాటు, దీపకళిక; వారిధి- ఇట్టి యుపమానములనే యీ కవి సర్వత్ర నిబంధించినాఁడు. మచ్చునకు-

క. విశ్వామిత్రుని నుద్య
ద్వైశ్వానరసదృశమూర్తివైభవు నాధా
త్రీశ్వరుఁడు బిట్టు గని చల
దశ్వత్థదళంబుభంగి నంగము వణఁకన్." (1.155)

అనుపద్యమునందలి యుపమానాలంకారము కడుహృద్యము. హరిశ్చంద్రునకు విశ్వామిత్రుఁడు విభావము. అతనినామము మొదట నిబంధించుటచేతనే యాతని స్వరూపస్వభావములు గూఢముగా వ్యంజింపఁబడినవి. కాగా తత్కాలక్రోధభావదీప్తి నలంకృత మొనర్చుట యిచ్చట శిల్పము. ఉద్యద్వైశ్వానరసదృశమూర్తివైభవము విభావానుభావ వ్యంజకము. విశ్వామిత్రునిఁ గాంచి భయకంపితుఁ డైన హరిశ్చంద్రుని యనుభావా

ములు చలదశ్వత్థదళోపమానముచే స్ఫుటగా వ్యంజింపఁబడుచున్నవి. రసవ్యంజకముగా నలంకారము నమర్చుట శిల్పము :

అనలోపమానమును పురాణకర్త యుద్ధవర్ణనలయందు సార్థకముగా వాడినాఁడు. కందరవిద్యుద్రూపయుద్ధమున 'రక్కసు డాజ్యము వోసిన చిచ్చుక్రియం గడు మండె వెసన్' (1.36) అని వర్ణించుటయు, దేవిసింహము రాక్షసులనడుమ "పటుపావకుఁ డడవిం జరించుభంగి" (6.91) తిరిగె ననుటయు, రక్తబీజసంహారోన్ముఖ యైన దేవి 'శిఖిపోలిక' వెలింగె ననుటయు,—దీని కుదాహరణములు.

మదగజోపమానమును మదగర్వధృతిభావవ్యంజకముగా పురాణకర్త నిపుణముగా నిబంధించుట గమనార్హము. మధుపానమత్తుఁడైన బలరాముఁడు 'మదాంధగజంబు చాడ్పున' 'సమదలీల' (1.133) రైవతశైలసానువనరమ్యతలమునఁ గ్రీడ సల్పె ననుటయు, విశ్వామిత్రుఁడు శైబ్యను "ఇభము తొండ మెత్తి మదజృంభితమై లత ద్రేయు చాడ్పున" (1.184) నేసెననుటయు మదభావమును వ్యంజించుచున్నవి.[2]

ఉ. "అంత మనోహరప్రకటయౌవనలీల యలర్కుఁ బొందె న
త్యంతమదోల్లసద్విభవ మైంద్రగజేంద్రముఁ బొందినట్లు" (3.267)

అని వర్ణించుటలో నలర్కునియౌవనగర్వము వ్యంగ్యము. వైశ్యకన్య నాభాగునిచే గ్రహింపఁబడుట 'మదగజహస్తలగ్నలతమాడ్కి కుమారునిచే గృహీత' (7.214) యయ్యె ననుట నాయకధృతివ్యంజకము.

సింహోపమానమును వీరరౌద్రరసోచితముగా ననుసంధించి, అవేక్షితోపాఖ్యానమున మారన యలంకారసంవాదశిల్పము వెలార్చె నను నంశము ఇదివఱలో ప్రసక్తమై యున్నది.[3] ప్రాణాయామనియమకథనావసరమున నంతఃపవనముల విజృంభణాతిశయ వ్యంజకముగా సింహోపమానమును గ్రహించి పరిచితపవనములు పరిచితసింహములవలె నరులదేహములఁ గాపాడు ననుట ప్రకరణౌచిత్యపోషక మగుచున్నది.[4]

అర్కోపమానము దీప్తిగుణవ్యంజకము. ఇందూపమానము కాంతిగుణవ్యంజకము. వీనిని పురాణకర్త యత్యంతసహజముగను, సార్థకముగను, అప్రయత్నకృతముగను వాడినపట్టులు పెక్కులు గలవు. ఉదాహరణమునకు :

పురాణావతారికలో మారన మార్కండేయ మర్కునివలె వితతోద్యద్దీప్తిజాలంబుచే నఘాంధకారము లడంపంజాలు నని యత్యంతమనోహరముగా వర్ణించినవిధము మొదట పేర్కొనఁదగినది. అంతటితో నాగక "బహుళతరాజ్ఞానతుహిననిర్వాపణప్రౌఢి నర్క ప్రభాభాతిఁ దాల్చి" యని మఱియొక్కసారి కీర్తించి మారన తనపురాణము పుణ్యప్రద మైనదే కాక జ్ఞానభాస్కరము వంటి దని యర్కోపమానముచేఁ బేర్కొనియుండెను,

కథార్థములందు 'సముదాత్తతనుద్యుతిజాలసంపద న్సురుచిరుఁ డైన స్వారోచి స్వరుచిసముద్గమస్ఫురణ సర్వదిగంతరము ల్వెలుంగ భాసురతరమూర్తి యై వెలయు

2. మఱియును 5.62; 7.235 పద్యములు దీని కుదాహరణములు.

3. చూడుడు : 8. 103; 114; 128. 4. చూడుడు : 3.317; 3.319.

సూర్యునిమాడ్కి' (5.22) వెలుగొందె నని యలంకృతోక్తితో నభివర్ణించుట యౌచిత్యము నకు గీటురాయి.

చతురజాలఖండిత మైన దేవిధనువు తేజోలంకృతరవిబింబమువోలెఁ (6.99) జదలనుండి పుడమిపైఁ బడె నని మారన వర్ణించెను. సుపర్వతేజస్సంపన్న మైన ధనువు సూర్యసమతేజ మనుటయు, తత్పాతము రవిబింబపాతము వలె నుండె ననుటయు, విభావ స్వరూపస్ఫోరకమై రాణించుచున్నది. అర్క-దీప్తులకును, శశి-కాంతులకును నాయక నాయికాసంబంధము చెప్పుట కవిసమయము. దానిని కువలయాశ్వచరిత్రమునఁ బురాణ కర్త కుండలాముఖమున నిపుణముగా వెలువరించినాఁడు.

ఉ. "కావున నర్క దీప్తి శశిఁ గాంతి గుణాఢ్యుని భూతి వొందున
ట్లీవనజాయతాక్షి నిను నింపెసలారఁగఁ బొంది యుత్సవ
శ్రీ విలసిల్లునట్లుగ వరింపుము సద్విధిపూర్వకంబుగా" (2.318)

అనుపద్యమునందు కవి ధీరోదాత్తుఁ డగు నాయకుని కుండఁదగిన తేజస్వితయు, నౌజ్జ్వల్యమును, గుణాఢ్యత్వమును కువలయాశ్వునందు సహజసిద్ధము లనియు, మదాలస యతని కనురూప యైన భార్య యనియు, వారిదాంపత్యము విడదీయరానిదై కలకాల ముండ గల దనియు కుండల తనయలంకృతవాక్కులచే వ్యంజింపఁజేయుచున్నది.

బహువిధభూషణోజ్జ్వలుఁ డైన హరిశ్చంద్రుఁడు భూషణములను బరిత్యజించి నప్పుడు "సురుచిరకిరణంబు డించి యెంతయు మాఁగుపడిన మార్తాండుపగిది" (1.169) దీనముగా నుండె ననుట సార్థకము. మదాలస రాజనీతి బోధించునెడ రాజు పన్నులను సూర్యుఁడు జలమును గ్రహించువిధమున సేకరింపవలె నని సహజరమణీయముగాఁ బేర్కొనినది. (3.136)

ఈపురాణకర్త అర్కోపమానము వలెనే యిందూపమానమును అభినివేశముతో గ్రహించి ప్రయోగించెను. మార్కండేయపురాణము

"సారకథాసాంద్రచంద్రికాసంపదఁ
బూర్ణేందుమండలస్ఫురణ నొంది" (అవ. 22)

అని అర్కోపమానముతోపాటు శశ్యుపమానమునుగూడ సాధించుకొని గాని మారన తృప్తిపడలేదు. స్వరోచి సూర్యునిమాడ్కి తేజస్వియై యుండె నని చెప్పియు "కళ లభివృద్ధి బొందు శశికైవడిఁ దద్దయు సద్గుణంబుల న్వెలుఁగుచు నాఁడు నాఁటి కభివృద్ధి వహించె" (5.23) నని వర్ణించిగాని వదలలేదు.

శిశూదయాభ్యుదయములందును, యౌవనావిర్భావమునందును ఇందూపమానము ప్రసిద్ధము. మారన దానిని గ్రహించినవిధమున కుదాహరణము :

ఉదయము :

క. పూర్ణిమ నుదయం బగు సం
పూర్ణసుధాంశుఁడునుబోలెఁ బుత్త్రిండు దిశా

పూర్ణద్యుతి యై యావర
వర్ణనికిం బుట్టె సురలు వర్ణన సేయన్. (5.217)

ఉత్తమమనూత్పత్తి నుదాత్తముగా వర్ణించిన విధ మిది. స్వరోచియభ్యుదయమును "కళ లభివృద్ధి బొందు శశికైవడి" యని పోల్చుట జరిగినది. అలర్కునియౌవనావిర్భావమును "సత్కాంతిఁ గళావిలాసము సుధాకరుఁ బొందినయట్లు" (1౩.267) నొప్పె నని వర్ణింపఁ బడినది.

రోహిణీసుధాకరులయనురాగము పురాణప్రసిద్ధము. అనుకూలదాంపత్యవర్ణనము చేయునెడ కవులు వీరిదాంపత్యము నౌపమ్యస్థానమున నిలుపుట సర్వసాధారణము. అట్లే మారనయు ఉత్తమబహుళాదాంపత్యమును వర్ణించుచు - భర్త "ఇందుండు రోహిణి యందు సంతతనిర్భరానురాగారూఢుఁ డైనమాడ్కి" భార్యయం దనురక్తుఁ డయ్యె నని పేర్కొనియుండెను.

కాంతిపూర్ణ మైన ముఖమును పూర్ణచంద్రబింబముతోడను, వైవర్ణ్యము నొందిన ముఖమును రాహుగ్రస్తశశిబింబముతోడను బోల్చుట పూర్వకవికావ్యప్రసిద్ధమైనదే. ముఖముహర్షోత్సాహభావవ్యంజక మైనప్పుడుష్ట ఇందూపమానము సార్థకము కాఁగలదు. మారన దీనిని నిపుణముగా నిబంధించెను. శాంతి అగ్నికుండమున నంతర్హితమైన యగ్నిని అగ్నిదేవుని దయవలన మఱల పొందఁగలిగెను. అప్పు డతఁ డనుభవించినహర్షమునకు మేరలు లేవు. మారన యతని వర్ణనము నలంకృత మొనర్చెను.

ఆ. "గురుగృహంబుఁ జూచి కుండంబులోఁ దొంటి
యట్ల వెలుఁగుచున్న యనలుఁ జూచి
పూర్ణచంద్రుమాడ్కిఁ బొల్పారె నతఁడు హ
ర్షామృతంబు పొంగి యవల వెడల." (7.61)

ప్రచండుఁడైన గురువునకు ఆహ్లాదమును, అమృతతుల్య మైన సంతానలాభమును గల్పించిన శాంతి పూర్ణచంద్రుఁ డనుటయు, దతనిహర్ష మమృత మనుటయు కథార్థపోషక మగుట శిల్పము. కాంతిసుందర మైన శాంతిముఖము, అతనికన్నులవెంట పొంగిపొరలు హర్షాశ్రువులు అలంకారముచే స్ఫురించి విభావానుభావపరిపుష్టి కలిగించుచున్నవి. మారన యుపమాలంకారసార్థకప్రయోగమున కిది యొకయుత్తమోదాహరణము.

శత్రుపీడితుఁడై దుఃఖితుఁడైన కరంధముఁడు నిజకరతలమునుండి యశేషసైన్యవాహిని యుద్భవింప శత్రువిజిగీషతో విజృంభించి వీరశృంగారసుందర మైన ముఖముతో నొప్పారె నని వర్ణించుచు, మారన యతని "వక్త్రం బుదితసకలచంద్రోపమశ్రీ వహించె" నని (8.86) పేర్కొనెను. శోకవివర్ణమైన ముఖము కాంతివంతమై యుత్సాహహర్షభావవ్యంజక మైన దని పైఅలంకారము వ్యక్తము చేయుచున్నది.

సర్పదష్టుఁ డైన లోహితాస్యుని గాంచి హరిశ్చంద్రుఁడు దుఃఖించు సందర్భమున మారన రచన మిట్లు కలదు.

తే. నెఱయ నర్మిలి నెనయు నీ నెమ్మొగంబు
ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాటి
రాహుకబళితరోహిణీరమణుమాడ్కి-
నుండఁ గనుఁగొని యే నెట్లు నుందుఁ గుట్టి! (1.256)

కళాప్రపూర్ణ మైన పుత్త్రునిముఖము తండ్రికి హృదయాహ్లాదదాయకము. అది విషదుష్టమై చిన్నవోయినది. కావున నది రాహుగ్రస్తచంద్రబింబ మనుట యుచితము! ఉపమానము పసిబాలుని దీనావస్థను చక్కఁగాఁ బట్టియిచ్చుచున్నది.

నూతనవధూవరులను, పుత్త్రవంతు లగు తల్లిదండ్రులను వర్ణించునెడ పురాణకర్త శచీపురందుల నుపమానస్థానమున నిలిపిన ఘట్టము లొండురెండు కలవు. ఉత్తమబహులా వివాహవర్ణనము :

క. సురపతి శచి ననురక్తిం
బరిణయ మైనట్లు వేడ్క- బహుళ యను తలో
దరిఁ బెండ్లియై మనం బా
తరుణివిలాసంబునంద తద్ద తగిలినన్. (5.125)

కృతిపతితండ్రి యైన నాగవిభుని జననవర్ణనము :

ఉ. ఆరమణీయదంపతుల కన్వయరత్నము బంధులోకమం
దారము ధైర్యమందర ముదాత్తదయానిధి దానధర్మవి
ద్యారసికుండు నాగవిభుఁ డంచితభాగ్యపరుండు పుట్టెఁ బెం
పార శచీపురందరుల కర్థి జయంతుఁడు పుట్టినట్లుగన్. (అవ. 32)

ఇంద్రుఁ డైశ్వర్యమునకును, అధికారమునకును, కొన్నియెడల శృంగారమునకును, దానమునకును, బలమునకును ప్రతీకగా భావించి యుపమానస్థానమునందు కవులు నిలుపుచుందురు. రాజనీతిప్రబోధమున మదాలస - రాజు ఇంద్రునివలె నడుగువారికిచ్చి ప్రజను ముదమొందఁ జేయవలె నని చెప్పినది. యజ్ఞభాగభుక్కగు సురపతి భూతలవాసులకు సకాలవర్షాదుల నిచ్చి సస్యఫలదాయకుఁ డగుట ప్రసిద్ధి.

పురాణగాథలకుఁ జెందిన యంశములను, పురాణపాత్రలను ప్రకృతకథార్థస్ఫూర్తి కొఱ కుపమానద్రవ్యములుగా నీపురాణకర్త గైకొని రసవద్రచన మొనర్చిన ఘట్టములు కొన్ని కలవు.

1. కందరవిద్యుద్రూపులయద్ధము :
"ఇద్దఱకున్ గ్రన్నన శక్రసుపర్ణులకయ్యముకైవడి ఘోరరణం బొదవెన్."
(1.37)

2. "కపిలమునీశ్వరుకోపాగ్ని సాగరులు రయంబునఁ గ్రాగినట్లు-" (2.337)
కువలయాశ్వుని త్వాష్ట్రబాణప్రయోగమున నసురలు దగ్ధులై రనుట.

3. మల్లమాంబానాగచమూపతుల వివాహము :
   చ. ''శివుఁ డగజాత రాఘవుఁడు సీతఁ గిరీటి సుభద్రఁ బెంపు సొం
   పు వెలయఁ బ్రీతిఁ బెండ్లి యగు పోల్కి''...... (అవ. 36)
4. అండజపతులు......చతుర్ముఖసదృశుల్. (1.12)

ఈక్రింద నుదాహరింపఁబడిన యుపమానాలంకారములను గమనించినచో మారన నిత్యజీవితసంబంధు లైన యుపమానద్రవ్యములను గ్రహించుటలోని నైపుణ్యము తేటపడఁగలదు.

1. ''గరుఁడు డురగంబుఁ బట్టిన కరణిఁ బట్టి'' (1.38)
2. ''అండము ల్నాలు గొయ్యన సాంద్రతద్రక్త
   పంకంబుపై దూచివడువునఁ బడినతోడన్'' (1.46)
3. ''పిడుగుకంటెను దద్దయు బెడిద మైన
   యప్పలుకు కర్ణరంధ్రంబు లవియ నాత్మ
   పటియలుగఁ దాకుటయు వెఱచఱచి విభుఁడు
   చిత్రరూపమ్ము విధమునఁ జేష్ట దక్కి''. (1.167)
4. ''మీద మిన్నువిఱిగి కూలినయట్టి కరణి గుండె లవిసి కళవళింప''. (1.173)
5. ''సత్యహీనుఁ, డైన పురుషుదేహము దా శ్మశానతుల్య
   మధిప : మేటిధర్మంబు సత్యంబ యండ్రు'' (1.195)
6. ''పీనిని విలువ వయ్యె : గోవుతోడన వత్సము గొను విధమున''. (1.218)
7. ''అని చఱచుఱఁ గొఱవిం జూఁ
   డినక్రియ నతి పలుకుటయును డెంద మవిసి య
   జ్జనపతి పిడు గడిచిన విధ
   మున మేదిని మడిగి పడియె మూర్ఛాగతుఁడై''. (1.199)
8. ''నిద్ర దెలిసి వేగను మేల్కొనునట్లు లేచి కడునొప్పారెన్''. (1.271)
9. ''ప్రతిష్ఠానపురంబు వొల్చు విలసన్మహిమ న్జలరాశిచాడ్పునన్''. (2.153)
10. ''ప్రచండవాతహతపుష్పలతాకృతిఁ గూలె మేదినిన్''. (3.19)
11. ''మదాలస వజ్రాహతిఁ బడిన మణిశలాకాకృతి నేలఁ బడిన''. (3.21)
12. ''వాసంతికవిభ్రమంబు విలసత్సహకారముఁ బొందినట్లు''. (3.267)
13. ''పేరోదయం దట్లు తేలుచు''. (4.24)
14. ''రథాంగమిధునములమాడ్కి రమియింతు రొగిన్''. (4.200)
15. ''విప్రునిముందు నిలిచె రత్నపుత్రికపోలెన్''. (4.234)
16. ''కుంభనిక్షిప్తం బైన యురగంబు వోలె''. (5.132)
17. కుండ గూల్చినక్రియ వాన గురియఁ జొచ్చె'' (జాతీయము) (5.227)
18. అద్దేవి ను, గ్రనిశాతాజగవర్షధారల వడి న్గప్పె న్మహాస్త్రంబు పే
   ర్చి నిలింపాచలతుంగశృంగ మతివృష్టి న్గప్పుచందంబునన్'' (8.96)

19. "నిశ్చలమేఘదృంద్వలీల స్మరసముదయవర్షంబున స్గప్పిన". (6.192)
20. "కరువలిచే నాఱిన, ఘనదీపంబులును బోలె గ్రక్కున నంతన్". (7.20)
21. "హతదీపభంగి నంతర్థానంబునఁ బొందె". (7.60)
22. "మత్తి నూడలు దిగ్గిన మాడ్కి నర్థి" ఏవంశమునయందు
బహుసహస్రవిభేదవంశము లెన్సంభవించె". (7.71)
23. "పంచగవ్యపూర్ణభాండంబు మధుకణ
స్పర్శనమున నశుచిభావ మొందు
నట్లు దోషరహితవయ్యును దుష్టసం
గతి లతాంగి! దోషకలిత వైతి". (7.249)
24. "సమస్తజనంబు చంద్రునుదయంబునను జలధు లట్టు లుబ్బఁజెంద". (8.276)
25. "ఆచతుర్థాన్వయం, బమృతాంభోనిధిమాడ్కి నుర్విఁ గడుఁబొల్చారు జ్జన
స్తుత్యమై". (అవ. 29)

మాలోపమ కుదాహరణములు: అవ. 22; 36; 1.5; 1.169; 2.318; 3.50; 3.267; మొ॥నవి.

### రూపకాలంకారము :

మార్కండేయమున నుపమాలంకారము తరువాత సంఖ్యలో నధికముగా వాడఁబడినది రూపకము. లెక్క కవి మొత్తము సుమారు నలుబదియైదు కానవచ్చు చున్నవి. "అభేద ప్రాధాన్యే ఆరోపే ఆరోపవిషయా నపహ్నవే రూపకం"అని రుయ్యకుని నిర్వచనము. రూపకమున నభేదము ప్రధానముగా నున్న యారోప ముండును. ఆరోప విషయ మపహ్నుతము కాకుండును. ఉపమేయమును మఱుగుపఱుపకయే యుపమాన ధర్మారోపము చేయఁబడును. ఇందు విషయము విషయిచే రూపము కల దగును కావున దీనికి రూపకనామము సార్థకమగుచున్నది.

దశవిధరూపకములకును రూపకశబ్దము వాడఁబడుచున్నది. రూపకమున నటుని యందు రామత్వాదు లారోపింపఁబడుచున్నవి. నటుని ప్రాతిభాసికరూపము సామాజికుల చిత్తములను చమత్కృత మొనర్చి రంజింపఁజేయుచున్నది. "Imitation begets the pleasure" అనికదా ఆంగ్లేయాభియుక్తోక్తి. రూపకాలంకారమునందును ఉపమేయమునం దుపమానధర్మారోపము చేయఁబడుటచే నది పఠితల చిత్తరంజన మొనర్ప సమర్థమగును. కావున రూపకాలంకార ప్రయోగనిపుణుఁడైన కవి రూపకరచనామర్మజ్ఞుఁడై యుండుట సహజము. అట్టి కవి తనకావ్యమున రూపకప్రయోగము చేసి పఠిత మనోనేత్రమునకు దృశ్యకావ్యదర్శనానందమును గలిగించును.

లోకమునఁ గాననగు స్థావరజంగమాత్మకమైన ద్రవ్యసముదాయముతో పాటు కావ్యమున రసభావసముదాయమునకు నైతము వ్యక్తీకరణము సామాన్యముగా జరుగుచుండును. కావున కావ్యములందు ఉపమానోపమేయద్రవ్యములను స్థూలముగా జడ,

చైతన్య, భావరూపకములుగా వర్గీకరింప వచ్చును. రూపకమున నుపమేయమునం దుప మాన ధర్మారోపణము జరుగునెడ పైవర్గీకరణము ననుసరించి తదలంకారమును తొమ్మిది విధములుగా భావించి దర్శించుట కవకాశము కలదు.

అవి :

| ఉపమేయద్రవ్యము | ఉపమానద్రవ్యము |
|---|---|
| చైతన్యము | జడము |
| చైతన్యము | భావము |
| చైతన్యము | చైతన్యము |
| జడము | చైతన్యము |
| జడము | భావము |
| జడము | జడము |
| భావము | చైతన్యము |
| భావము | జడము |
| భావము | భావము |

లాక్షణికులు రూపకమును సావయవ నిరవయవ పరంపరితా భేదములచే విభజించి యుండిరి. కవి వీనిని రసానుకూలముగను, యథోచితముగను ప్రయోగించును. కథార్థములందు అవయవిని సావయవముగా నిరూపించినచో పఠితకు చిత్తరంజనము కలుగఁగలదు. నిరవయవముగాఁ బ్రయోగించినచో చిత్తచమత్కార హేతువు కాఁగలదు. పరంపరితముగాఁ గూర్చినచో భావబంధురమై ఆలోచనామృతము వర్షింపఁగలదు. అలంకార మప్రయత్నకృత మైనదిగా కావ్యమునం దున్నచో శోభించును గనుకను, అతి నిర్వహణేచ్ఛ కవి కుండరాదు గనుకను,అవసరము లేనిచో నలంకారమును బెంచి పెద్దది చేయక అవయవపరిపుష్టివిరహితముగా నలంకారము ప్రయోగించుట రసజ్ఞసమ్మతము కావునను, కవి కావ్యమున రూపకభేదములను యథానుకూలముగాఁ బ్రయోగించు చుండును. దానికి రసానుకూల్యమే పరమావధి ।

సావయవ నిరవయవాది రూపకాలంకారభేదములందును బైనఁ బేర్కొనఁబడిన తొమ్మిదిభేదములను మనము దర్శింపవచ్చును. మారనమహాకవి సావయవరూపకముల కంటె నిరవయవరూపకముల నెక్కువ వాడినాఁడు. చైతన్యద్రవ్యములయందు జడ ధర్మారోపణ మొనర్చుటయం దధికాభినివేశము చూపినాఁడు.

మారన వాడిన సావయవరూపకములు కొలదిగా నున్నను అవియన్నియు సాన పట్టినజాతిరత్నములవలె రాణించుచున్నవి.ఉదాహరణమున కొండు రెం డిచ్చుట పేర్కొనఁ బడుచున్నవి.

1. సావయవరూపకము - చైతన్య - జడరూపకము :

మ. " కరుణాసాంద్రపయఃప్రపూర్ణమును రంగద్దోస్తరంగంబుఁ బ్ర
స్ఫురదాకల్పభుజంగమాంబుచరమున్ శుంభజ్జటావిద్రుమో

త్కారము స్ఫాంతిసుధోదయంబు నగు నుద్యచ్ఛంకరాకారవా
ర్ధి రమావర్ధనుఁ జేయుఁగాత సుగుణున్ శ్రీగన్నసైన్యాధిపున్." (అవ. 2)

ఇచ్చట శివునియందు సాగరత్వ మారోపింపఁబడినది. అదిసావయవముగాఁ నిర్వహింపఁబడినది. ఈరూపకము సాభిప్రాయము. శంకరుఁడు గన్నసేనానిని రమావర్ధనునిగాఁ జేయవలె నని యిం దాశీస్సు! రమ క్షీరసముద్రరాజతనయ. శంకరునియందు సాగరత్వ మారోపింపఁబడినచో రమావర్ధనత్వ మతని కత్యంత సహజము కాఁగలదు. రమాసంజనన, సంవర్థన హేతుభూతమైన సాగరరూపశంకరుఁడు సంపద్వర్ధనరూపవర ప్రసాదసమర్థుఁ డగు ననుట యౌచిత్యము : సాంగముగా నీభావమును పోషించి మారన యీపద్యమును శిల్పసుందర మొనర్చినాఁడు :

2. సావయవ రూపకము :–జడ చైతన్యరూపకము.

క. జలచరలోచన ఫేనో
జ్జ్వలహాసమరాళయాన చక్రస్తనమం
డలవీచీభ్రూవిభ్రమ
పులినజఘన గంగ వనధిఁ బొలుపుగఁ గూడెన్. (4.164)

గంగాసంగమ మిందలివస్తువు. గంగాశబ్ద మాకారాంతస్త్రీలింగము వనధిశబ్ద మికారాంత పుంలింగము కావున గంగయను వనిత వనధియను నాథునిఁ గూడె ననుట పొసగు చున్నది. లింగవివక్ష్యచే గంగయందు స్త్రీత్వము ప్రసిద్ధము. కావున స్త్రీత్వారోపము, సావయవాలంకారనిర్వహణము సార్థక మగుచున్నది. జడమైన నదియందు స్త్రీత్వారోపము చేయుటచే శృంగారనాయిక నాయకునిఁ గూడువేళ వ్యక్తమొనర్చు అనుభావములను వ్యంజింపఁజేయుటకు వీలైనది. తరళదృక్కులు, మందహాసము, మందగమనము, ఉప్పొంగువక్షోజములు, లజ్జావివశమైన భ్రూవిభ్రమము, ఉపభోగక్షమమైన విపులజఘన మండలము-ఇవియన్నియు గంగయం దారోపింపఁబడుచున్న శృంగారనాయికానుభావ ములు. జడములందు సైతము చైతన్యద్రవ్యములందువలె రసభావములు వ్యంజింపఁ జేయుట అలంకారప్రయోగశిల్పము :

౩. సావయవరూపకము-జడ-జడరూపకము.

క. " జలపూరము పాండవకథ
జలరుహనివహములు విదితసరసాఖ్యానం
బులు మృదుపదములు హంసం
బులు మేదిని భారతాఖ్యఁ బొలుచుకొలనికిన్. "

తే. వ్యాసవాగ్జలపూర్ణయు నాగమప్ల
వావతీర్ణయు బహుకుతర్కావనీజ
హారిణియు నైన భారతోదారతటిని
యడరి దురితరజోరాశి నడఁచుచుండు. (1.6-7)

మహాభారతమునందు సరోవరత్వ, తటినీత్వము లారోపింపఁ బడిన విచ్చట. సావయవములుగా రూపించుట యిందు విశేషము. మహాభారతస్వరూపనిరూపణము చేయుట పురాణకర్తహృదయము. అది పఠితచిత్తమున రూపుకట్టి యాహ్లాదకారి కావలయు నని తనవాక్కు నలంకృతము చేయుట : అది నిరవయవమైనచో స్పష్టత యుండదు. కావున సావయవముగా నిర్వహించి భారతమున ప్రధానవస్తువు, ఉపాఖ్యానములు, మొదలగు వాని యొక్క సంబంధములు తేటపడునట్లు వివరించినాఁడు.

4. సావయవరూపకము : భావ - జడరూపకము.

సీ. ''విమలవిద్యాకుఠారము తత్త్వవిత్సాధు
జనసంగపాషాణమునఁ గరంబు
వాఁడి గావించి యెవ్వరు నఱకంగ నే
ర్తురు వెస నమ్మహాతరువు వారు
నిష్కంటకంబును నీరజస్కంబు నై
రాజిల్లు చల్లని బ్రహ్మవనము
చొచ్చి నిత్యానందసుఖలీల నపునరా
వృత్తి నుండుదు రందు విను నృపాల !'' (3. 306)

దీనియందు భావరూపము లైన విద్యాదులయందు కుఠారత్వాదు లారోపించుట నిరాకార వస్తుస్వరూపబోధనార్థమే. చమత్కారాశ్రిత మైన వస్తుస్వరూపసాక్షాత్కార మీయలంకార ప్రయోగఫలము ! ఇట్టివి యిట్టిశాస్త్రార్థములందే కాక కథార్థములందును గాననగును. ఉదాహరణమునకు - క ......"రాజముఖ్యుఁడు చేతో

వననిధి విండలివిండుగ
ఘనచింతామంథరంబు గలఁపఁగ మదిలోన్. (1. 193)

క. ''మాయొడళులలో నుండెడు
నాయత పితృకోపవహ్ని యంతయు నడఁగెన్
శ్రీయుత ! భవద్విలోకన
తోయంబులఁ జేసి సకలదుఃఖచ్యుతిగాన్. (1. 104)

ఇందలి క్షీరసాగరమథనోపమానధర్మారోపము హరిశ్చంద్రునిచిత్తక్షోభమును, జైమిని కుశలప్రశ్నలకు పితృశాపదుఃఖమునుండి శాంతి నొందినధర్మపక్షుల హర్షచిత్తవృత్తులను పైరూపకమువలన వ్యంజింపఁబడుచున్నవి. మిగిలిన విశ్లేషలు రసజ్ఞు లూహింపఁ గలరు.

మారన వాడిన రూపకములలో మూడింట రెండువంతులు నిరవయవములే. పురాణ కథాకథనము ప్రవాహతుల్యముగా సాగుచుండ నెడనెడ నీయలంకారము లను చిఱుతరగలను గలిపించి కథార్థముల నుత్తేజితముల నొనర్చి పఠితమనస్సును మారన రంజించుచుండును. కథార్థములస్పష్టీకరణమునకు సావయవాలంకారనిర్వహణ మనవసర మై

నప్పుడు తావన్మాత్రముగా విషయియందు విషయారోప మొనర్చి చమత్కరించుట యౌచిత్య మెఱిగిన కవి చేయుపని.

ఉదాహరణమునకు హరిశ్చంద్రోపాఖ్యాన భాగమును గమనింపుఁడు. హరిశ్చంద్రుఁ డార్తవనితానాదము విని కృద్ధుఁడై "వెలుఁగుమహాప్రతాపశిఖివేఁడిమి దిక్కులం నించు చున్న నాకొలఁది యెఱుంగ కెవ్వఁడొకో ఘోరపుఁజిచ్చిటు చీరఁ గట్టెడిన్ (1. 125) అని యెలుఁగెత్తిగర్జించినట్లు మారన వర్ణించెను. ఇందలి రూపకము సావయవమై పద్యపరివ్యాప్తము కాకుండ నిలచిపోయినది. హరిశ్చంద్రుఁడు దుష్టజనశిక్షానమర్థ మైన తన ప్రతాపమునుమాత్రము ప్రత్యేకించి చెప్పఁదలఁచెను. దానిని పెంచి ఆత్మశ్లాఘకు దొరకొనక అవికత్థనత్వము ప్రదర్శించెను. సహనశీలి, వినయపరుఁడు, ధర్మపరుఁడు, కోమలచిత్తవృత్తుఁడైన యామహారాజుచిత్తమున భగ్గుమనిమండిన క్రోధమును తావన్మాత్రరూపకప్రయోగచమత్కారముచే భాసింపఁజేయుట యిచ్చట శిల్పము: ఇట్లే మఱికొన్ని- "ఆరాజు కఠోరవాక్యశిలలు చెవిదాకిన" (1. 153) వాక్యకాఠిన్యమును, కఠోరత్వమును విశేషణమే చెప్పుచున్నను శిలాత్వము వానియం దారోపించి యతిశయత్వమును మారన నిరూపించినాఁడు. వాక్యాఘాతము శిలాఘాతము మనుటచేఁ బఠిత కావ్యార్థము నవలీలగా గ్రహింపఁగలఁ డనుట నిర్వివాదాంశము.

క. అని పురపురఁ బొక్కుచుఁ బుర
జనములు పురి వెడలి రాజసత్తము వెనుకం
జని యంతంతకునుం బై
కొను శోకానలమునందుఁ గుందుచు మఱియున్. (1. 176)

హరిశ్చంద్రవియోగదుఃఖము హృదయదాహక మగుటచే ననల మనుట యుచితము. అనలము పైకొనుటచేఁ బురజనులు పురపుర పొక్కినా రనుటలో శబ్దానుకరణరూపమైన సార్థక్యము కలిగి విభావసాక్షాత్కార మొనర్చుచున్నది. పౌరులలో నొకఁడు రాజునుద్దేశించి యిట్లనినాఁడఁట: "నీముఖాంభోరుహవిభ్రమంబు దనివోవఁగఁ గ్రోలి మదీయలోచనోదారమధువ్రతాళి ముదమందెడు నట్టులుగా నొనర్పవే" (1.130). ఈవాక్యమునందు హరిశ్చంద్రునివదన సౌందర్యాకర్షణము, ప్రజాప్రీతి వ్యంగ్యముగాఁదెలియుచున్నవి. ప్రభుభక్తిపరాయణు లైన ప్రజలభావముల నలంకరించుటవలన కథార్థములు స్ఫుటమై వారియందు గుప్తమై యున్న - రాజుతోపాటు స్వర్గారోహణ మొనర్పఁగల - యోగ్యతను వ్యంజించుచున్నవి.

హరిశ్చంద్రుఁడు ప్రజలయొక్క వాక్యనిచయ మనెడి శృంఖలలోఁ దవిలి ముందుకు పోఁజాలక పోయె ననుట కథాసందర్భపోషకము. "మాలను సేవించి మనుటకంటెఁ గౌశికోగ్రశాపాగ్నిచేఁ గ్రాగి పోవుటైన మేల"ని (1.22) భావించుటలో మునిశాపమువలనఁగలుగు బాధాతిశయము వ్యజించుట సార్థక మగుచున్నది. హరిశ్చంద్రుఁడు కౌశికునివలనఁ బడినపాట్లు వినిన వసిష్ఠునకు "నితాంతదుఃఖదవానల శిఖావళి"యు, తీవ్ర

కోపవహ్నిశిఖలును ఒక్కమాట యెగసి యుల్లంబులో నగ్గలింప మోము జేవురించిన దఁట! (2.4) ఇచ్చట దుఃఖమునందును, కోపమునందును తాపగుణసాధర్మ్యమును భావించి అగ్నిత్వ మారోపించుటలో మారన నైపుణ్యము కలదు. ఇట్టివి పురాణపఠనావసరమున గ్రహించుట సులభము.[5]

## అర్థాంతరన్యాసము

"అనుపపద్యమానతయా సంభావ్యమానస్యార్థస్యోపపాదనార్థం య దర్థాంతరస్య న్యసన ముపపాదకత్వే నోపన్యాసః సోఽర్థాంతరన్యాసః". ప్రకృతార్థ మనుపపద్యమానముగా సంభావ్యమాన మగుచున్నప్పుడు తదర్థము నుపపద్యమానముగా నొనర్చుటకై యర్థాంతరము నొకదానినిఁ దెచ్చియుంచుట యర్థాంతరన్యాస మనఁబడుచున్నది.

ఉ. "మాలఁడు వొంగి యమ్మునికి మానుగ నర్థన మిచ్చి పట్టి భూ
పాలుని నంటఁగట్టి యకృపామతిఁ గొంకక చేతికోలఁ బై
తో లెగయంగ వ్రేసి వెనఁ దోడ్కొని పల్లెకుఁ బోయె నేరికిం
గాలవశంబునం గలుగుకర్మఫలంబులు దప్ప నేర్చునే?" (1.231)

హరిశ్చంద్రభూపాలుఁడు కాశీనగరమున మాలని కమ్ముడువోయిన ఘట్టమున మారన యీపద్యమును రచించెను. రాజు చండాలదాస్యమును గర్హించెను. కౌశికుఁడు రాజును చండాలునికే అమ్మెను. మాలని కంతధనము నిచ్చికొనఁగల శక్తి వచ్చుటయు, కొని యాభూపాలుని నిష్కారణముగా నంటఁగట్టి కోలతోఁ దోలాడునట్లు కొట్టు నిర్దాక్షిణ్యము ప్రకటించుటయు నిందలివస్తువు. ధర్మమూర్తి కిట్టి యమానుషదండనము లభించుట కథార్థములందు పొసగనియంశము. అట్టి యనుపపత్తిని కథకుఁడు "ఏరికిం గాలవశంబునం గలుగు కర్మఫలంబులు దప్పనేర్చునే" అను అర్థాంతరము నుంచుటచేత తొలగించి కథార్థముల నుపపన్నముల నొనర్చినాఁడు. దానిచే పఠితచిత్తము చమత్కృతమై సరసభావబంధురమగును. "కాల" శబ్దమునందలి శ్లేషచే మారన కాలవశమనియు, యమునివశమనియు అను అర్థద్వితయమును సాధించి శబ్దప్రయోగసామర్థ్యమును, భావికథార్థ సూచనమును ప్రకటించినాఁడు.

అర్థాంతరన్యాసాలంకారమును లాక్షణికులు రెండువిధములుగా విభజించిరి. 1. విశేషముచే సామాన్యము సమర్థింపఁబడుట; 2. సామాన్యముచే విశేషము సమర్థింపఁబడుట. ఇందు విశేషము సామాన్యముచే సమర్థింపఁబడు నలంకారములనే మారన వాడియుండుట గమనింపఁదగిన యంశము. ఉదాహరణమునకు- ఈక్రిందివానిని గమనింపుఁడు.

5. చూడుడు: మారన మార్క. 1.88; 89; 1.95; 134; 176; 2.148; 153; 2.55; 2.299 2.327; 3.39; 77; 274; 276; 298; 304; 305; 363; 392; 4.156; 237; 5.18 5.20; 33; 263; 296; 6.24; 31; 67; 225; 253; 7.16; 45; 216; 8.46; 62; 104 8.239; ;284.

చ. పతిమృతి విన్నమాత్ర నిజభావము దద్గతమైనఁ దాన సు
వ్రత యిటు ప్రాణము ల్విడిచి గ్రక్కున భర్తను గూడఁగా శుభ
స్థితిమెయిఁ జన్నయీసతి విచిత్రచరిత్రము దుఃఖహేతువే?
పతిఁ గడవంగ దైవతము భామల కెందును గల్గనేర్చునే? (3.28)

మదాలసామృతి ఇందు విశేషము. అది "పతి... నేర్చునే" అనుసామాన్యముచే సమర్థింపఁబడుచున్నది.

మారన యర్థాంతరన్యాసముల నన్నింటిని యుపాఖ్యానములందు మాత్రమే వాడెను. కాని, ధర్మశాస్త్రాదికథనమునందు కూర్చలేదు. శాస్త్రార్థములం దనువపత్తి కవకాశము లేదుకావున నీయలంకారముయొక్క యావశ్యకతను మారన భావింపలేదు. అది యౌచిత్యదృష్టి. అట్లగుటచే సామాన్యముగా కథార్థములందు విశేషములు సామాన్యములచే సమర్థింపఁబడుపద్ధతియే విరివిగా వాడబడుచుండును గాన మారన యామార్గ మవలంబించెను. అర్థాంతరన్యాసాలంకారములలోఁ బెక్కింటిని మారన సంభాషణవశమున పాత్రలముఖమునఁ బలికించెను. ఒంటరెంట కథకునిముఖమున నిబంధించెను. పాత్రలయొక్క విజ్ఞత్వాదులను; స్వరూపస్వభావములను ఈయలంకారములు తేటపఱచుచున్నవి. మారన కథాకథనకౌశలమున కీయలంకారప్రయోగ మొకయలంకార మగుచున్నదనుటలో విప్రతిపత్తి లేదు.

మఱికొన్ని అర్థాంతరన్యాసములు: 1.198; 1.255; 2.304; 3.71; 4.245; 6.121; 8 186; 8 215.

ఇట్లే మఱికొన్నియర్థాలంకారములు:

1. సమాసోక్తి-1.100. 2. ఉత్ప్రేక్ష-1.97; 2.294; 5.124. 3. ఉదాత్తాలంకారము: అవ. 4; 1.24; 1.267; 2.47; 2.205; 8.275. 4. పరికరము: 1.86; 3.85. 5. సందేహము: 2.295; 2.300. 5. ఉల్లేఖము: 1.142; 6.69; 6.122. 6. యథాసంఖ్యము: అవ. 27; 1.54; 1.169. 7. విషమము: 1.51; 1.261; 1.262; 5.302. 7. కారణమాల: 3.276. 8. ప్రౌఢోక్తి: 3.93. 9. ఆక్షేపము: 3.43. 10. సముచ్చయము: 6.79. 11. లోకోక్తి: 1.166. 12. శ్లేషాలంకారము: అవ. 29. 13. స్వభావోక్తి: అవ.3; 1.1; 1.225; 1.226; 2.155; 2.554; 4.224; 5.18. ఇట్టి యలంకారప్రయోగ సార్థక్యమును గుఱించి యాఖ్యానఛందశ్శిల్పాధ్యాయములలోఁ గొంత చర్చింపఁబడినది.

మొత్తమునకు మారన యర్థాలంకారములను గడునిగ్రహముతో సార్థక్యమును దృష్టియం దుంచుకొని, అత్యంతసహజసుందరముగాఁ బురాణమున ప్రయోగించెను. పురాణపూర్వార్ధమునందు అలంకారప్రయోగమునఁ జూపిన యభినివేశము మారన యుత్తరార్థమునఁ జూపలేదు. ఆరంభమునం దలంకారసుందరము లైన భావములతో పఠితల నాకర్షించి

రానురాను అర్థగాంభీర్యము వెలార్చుచు మారన రచన సాగించె నని చెప్పవచ్చును। పురాణపురంధ్రిగుణశీలప్రధానమైనది. అట్లే రసోచితమైనగుణములును, శైలియు పురాణమునకు ప్రధానములు. అలంకారములు తద్గుణవ్యంజనమాత్రములై యామెస్వభావస్వరూప సాక్షాత్కారోపయోగులై శోభాదాయకము లగుచున్నవనుట నిర్వివాదాంశము।

**శబ్దాలంకారములు :**

నన్నయనుండియు తెలుఁగుకవులు ఆశ్వాసాంతపద్యములను సామాన్యముగా శబ్దాలంకరసుందరముగా నిర్మించుచుండుట పరిపాటియైయున్నది. స్తుతిరూపము లైన యాపద్యముల కాయలంకారములు శ్రవణసుభగత్వమును గల్పించును. మారనయు నీమార్గము ననుసరించి యాశ్వాసారంభాంతపద్యములను అంత్యప్రాసలతో నలంకరించి నిర్మించెను।[6] మారన తనపురాణమున హిమవంతమును వర్ణించు రెండుఘట్టములందు అంత్యప్రాసను వాడియు,[7] రైవతమనుమార్కండేయ కీర్తనమునందు అంత్యప్రాస ననుసంధించియు[8] నుదాత్తవస్తువర్ణనమున శబ్దాలంకారమును శోభాకరముగాఁ బ్రయోగించు నేర్పును వెలార్చెను. వనవర్ణనావసరమున వృత్త్యనుప్రాసమును వాడుట మారన ప్రత్యేకత :[9]

యమకమును సందర్భోచితముగాఁ బ్రయోగించినపట్టులు మారనరచనలోఁ బెక్కు కానఁబడుచున్నవి.[10] అవి శాస్త్రార్థములందును, కథార్థములందును, వర్ణనలయందును, సూక్తులయందును యథావకాశముగాఁ జోటుచేసికొని యెనిమిదియాశ్వాసములలోను వ్యాపించి యున్నవి. విజ్ఞులు వానిసార్థక్యము నూహించుట సులభము. కొన్నింటినిగూర్చి యిదివరలో వివరించుటయు జరిగియున్నది.

మారనకు శబ్దాలంకారములపైకన్న అర్థాలంకారములపైననే ఆదరము హెచ్చు. ఆశబ్దాలంకారములందును యమకమున కధికప్రాముఖ్య మిచ్చెను. ఎందును నిరర్థకముగా మారన యలంకారము వాడలేదు। సార్థకమైన మారనయలంకారరచన శిల్పసుందరము।

---

6. మారనమార్క. 1.286; 2.7; 288. 2. 1,343; 345. 3. 1; 393; 394; 395; 4. 1; 255; 256; 257: 5. 1; 373; 374: 375, 6. 1;262; 263; 264; 7. 1; 285; 286; 287; 8. 1;288; 289; 290. 7. మారనమార్క. 1. 22; 4. 224.
8. మారనమార్క. 5. 296; 8. 281. 9. మారనమార్క. 1. 1; 1.24; 5. 68.
10. మారనమార్క; 1. 55; 57; 63; 142. 2. 88; 139. 3. 95; 286 287; 292; 304; 335; 342; 352; 368; 392; 4. 155; 246; 5. 148; 217; 220; 6. 32; 40; 41: 68; 105; 134: 7. 53: 8. 74; 194.

# రసశిల్పము

"శమార్థం సర్వశాస్త్రాణి నిర్మితాని మనీషిభిః
తస్మాత్స సర్వశాస్త్రజ్ఞః యస్యశాంతం మనస్సదా ॥"[1]

సర్వశాస్త్రములను మనీషులు శమార్థము నిర్మించిరి. ఎవనిమనస్సు సదాశాంతముగా నుండునో అతఁడు సర్వశాస్త్రజ్ఞుఁడు. వేదార్థోపబృంహితములైన పురాణములు శాస్త్రమూర్ధన్యములు.

"పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్" (I. 60)

అను వాయుపురాణమును,

"పురాణ న్యాయ మీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రితాః
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥" (1. 3)

అను యాజ్ఞవల్క్యస్మృతియును శాస్త్రములలో పురాణమున కగ్రతాంబూల మిచ్చి యున్నవి. కావున పురాణములు శమార్థము నిర్మింపఁబడిన వనియు. పురాణతత్త్వజ్ఞులైన మనీషులు శాంతరసస్థితు లయ్యెద రనియు భావించుటలో విప్రతిపత్తి లేదు.

ఇతిహాస మనియు, పురాణ మనియు, పంచమవేద మనియుఁ బ్రసిద్ధిఁ గాంచిన సంస్కృతమహాభారతము శాంతరసప్రధాన మని ఆనందవర్ధనాచార్యులు ప్రతిపాదించి యుండిరి. "మహాభారతేపి శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయిని వృష్ణిపాండవవిరసావసాన వైమనస్యదాయినీం సమాప్తి ముపనిబధ్నతా మహామునినా వైరాగ్యజననతాత్పర్యం ప్రాధాన్యేన స్వప్రబంధస్య దర్శయతా మోక్షలక్షణః పురుషార్థః శాంతో రస శ్చ ముఖ్యతయా వివక్షావిషయత్వేన సూచితః. ఏతచ్చాంశేన వివృత మేవ అన్యైః వ్యాఖ్యావిధాయభిః స్వయమేవ చైత దుద్గీర్ణం తేన ఉదీర్ణమహామోహమగ్న ముజ్జిహీర్షతాలోకం అతివిమల జ్ఞానాలోకదాయినా లోకనాథేవ.

యథా యథా విపర్యేతి లోకతంత్ర మసారవత్
తథా తథా విరాగో ఽత్ర జాయతే నాత్ర సంశయః ॥

ఇత్యాది బహుశః కథయతా. తత శ్చ శాంతో రసో రసాంతరై ర్మోక్షలక్షణః పురుషార్థః పురుషార్థాంతరై రుపసర్జనత్వే నానుగమ్యమానః అంగిత్వేన వివక్షావిషయః ఇతి మహాభారతతాత్పర్యం సువ్యక్తమే వావభాసతే"[2] అని వారు వక్కాణించియుండిరి.

---

1. కావ్యాలంకారసంగ్రహము. (స.సూ.శాస్త్రిగారివ్యాఖ్య). పుట. 300.
2. ధ్వన్యాలోకః . 4 ఉద్యోతః. పుట. 298-299.

ఆనందవర్ధనుఁడు మహాభారతమును ముముక్షుదృక్కోణముతో దర్శించి విమర్శించెను. అతనియభిప్రాయమున మహాభారత ప్రధానవివక్షావిషయములు మూఁడు. 1. వృష్ణిపాండవవిరసావసానముచేఁ బఠితయందు వైమనస్యము కలిగి, తద్ద్వారమున వైరాగ్య ముదయించుటయే మహాభారతపరమతాత్పర్యము; వైరాగ్యము మోక్షమూలము; మోక్షసాధనాత్మక మైన పరిజ్ఞానము గీతాదులయందు ప్రధానముగా నిబంధింపఁబడి యున్నది. 2. భారతమున మోక్షపురుషార్థప్రతిపాదనము ప్రధానముగా జరిగినది గావున నందు శాంతరస మంగి యగును. 3. మహాభారతమున సనాతనుఁ డైన వాసుదేవభగవానుఁడు కీర్తింపఁబడినాఁడు. పాండవాదులచరిత మంతయు నవసానవిరసము, అవిద్యాప్రపంచరూపము కావున నిస్సారము లైన తద్విభూతులయం దభినివేశము కూడదు. అందలి దేవతీర్థతపఃప్రభావాదికము లగు కథలన్నియు పరబ్రహ్మప్రాప్త్యుపాయప్రతిపాదకము లని తెలియవలెను.

ఆనందవర్ధనాచార్యులు ఇతిహాసము శాంతరసప్రధాన మైన దని చెప్పుటలో బ్రహ్మానంద నయ మైన చిత్తవృత్త్యవస్థాసోపానక్రమము నిర్దేశించె నని స్పష్ట మగుచున్నది. అతఁడు శాస్త్రనయమున మోక్ష మొక్కటియే పరమపురుషార్థ మని పేర్కొనెనుకదా! మోక్షసాధనానుకూల మగుచిత్తవృత్తిని కావ్యము సిద్ధముచేయును. ఇతహాసమున వంశానువర్ణనము చేయఁబడును. ఆయావంశస్థుల చరిత్రలయం దాయారసప్రతీతి కలుగును. ఆవంశము చివరకు విరసావసాన మగును. తద్భావచర్వణమువలన జిజ్ఞాసువు వైరాగ్యచిత్తవృత్తి నలవఱచుకొనును. ఇతిహాసమునం దిట్లు వంశావళులు విరసావసానము లగునట్లు చిత్రించుశిల్పమే ప్రాణభూతమైన దని తాత్పర్యము. వంశస్థు లైన చక్రవర్తులచరిత్రములు పురుషార్థత్రయసాధనప్రధానము లైనవి. అట్టివానియం దహంకారైకప్రతీతము లగు శాంతేతరరసములే భాసించును. అట్టిరసములయొక్క ప్రతీతిచే నితిహాసము పఠితహృదయము నాకర్షించును. వానియం దాతనిచిత్తము మజ్జనోన్మజ్జన మొనర్చును. వంశాంతవర్ణనమునందుఁ బ్రతీయమాన మగుచున్న విరసత్వముచేఁ బఠితచిత్తము తత్త్వవిచక్షణోపేతమై తద్వంశానువర్ణనమునందు వ్యజ్యమాన మగుచున్న పరమార్థమును గూర్చి విచారించును. ఇట్టి జిజ్ఞాసావస్థయందున్న మనస్సును శాస్త్రము పక్వ మొనర్చి పరమార్థతత్త్వము నుపలక్షించుటకును, ఉపభోగించుటకును సామర్థ్యముఁ బ్రసాదించును. అభినవగుప్తపాదులు ప్రకృతిరసముగా శాంతముకు బ్రతిపాదించుచు దానికి తత్త్వజ్ఞానమే స్థాయిభావ మని చెప్పుటయందు నిట్టితత్త్వమే యిమిడియున్నది. అట్టిస్థాయి యితరస్థాయిభావములకంటె స్థాయితమ మనియు, మూలభూత మనియుఁ జెప్పినమాటచే- ఇతిహాసకథార్థవ్యంగ్యము లైన సర్వరసములు పురుషార్థత్రయనయము లగుచుఁ బర్యంతమునఁ జతుర్థపురుషార్థసాధనోపయుక్త మగు 'తత్త్వజ్ఞానము'ను గల్గించు ననియు, తత్పోషణ మొనర్చి జ్ఞానానందమును-లేక-ఆత్మానందమును సిద్ధింపఁజేయు ననియు నదియే మోక్షసిద్ధి యనియు నన్వయించుకొనుటకు నవకాశము కలుగుచున్నది.

ఇతిహాసమువలెనే రాజవంశములచరిత్ర వర్ణించుకావ్యములందును స్ఫురించునది శాంతరస మని కల్హణుని "రాజతరంగిణి" యుద్బోధించినది. దానికిని ప్రమాణము మహాభారతమే.

మహాభారతము ఇతిహాసమే కాక పురాణ మనియుఁ గీర్తింపఁబడినది కదా![3] ఐనచో నానందవర్ధనుని భారతరససమన్వయము పురాణములపట్ల ననువర్తింప వీలగుననుటలో నభ్యంతర ముండబోదు. మహాభారతము వాసుదేవభగవానుని మహిమాభివర్ణనప్రధాన మైనచో భాగవతాది మహాపురాణములును అట్టివేకదా! శివకేశవదుర్గాదిరూపభేదములచే నిరూపింపఁబడు భగవత త్త్వములు పరమార్థదృష్టిలో నొకటియే. భారతమునందలి దేవతీర్థమాహాత్మ్యాదులు భగవత్ప్రీత్యుపాయబోధకము లనెడియన్వయము పురాణకథాసముదాయమునకుఁగూడ వర్తించును. కావున నితిహాసములవలెనే పురాణములు పురాణపురుషతత్త్వప్రతిపాదకము లై సృష్టివిధానవికాసాదులను, వంశమన్వంతరవంశానుచరితములను వివరించి, బ్రహ్మాండకల్పనమంతయు మాయాసంజనితముగా నిరూపించి కల్పాంతగాథలచే విరసావసానత్వమును సంధించిన పఠితకు విరక్తినిఁ గల్పించునట్టివే యగును. అప్పుడు సర్గము మొదలు వంశానుచరితమువఱకును గల విపులకథార్థవర్ణనమంతయు నవిద్యాప్రపంచరూప మనియే ముముక్షువులకు స్ఫురింపఁగలదు. దానిచే విరక్తియు, మోక్షేచ్ఛయు, బ్రహ్మానుసంధానమును సాధ్యములై పురాణములు శాంతరసస్ఫోరకములు కాఁగలవు. ఇతిహాసమునందు శాస్త్రకావ్యచ్ఛాయలు వెలసినచో నది శాస్త్రేతిహాసకావ్యము కాఁగలదు. శాస్త్రప్రధాన మైన పురాణమునందును కావ్యచ్ఛాయలు కొన్ని యుండవచ్చును. పురాణప్రసిద్ధము లైన రసవదిహాసములును, ప్రసిద్ధోపాఖ్యానములును కావ్యకర్తలకు ప్రత్యేకకావ్యవస్తువులుగాఁ గైకొనుటకు యోగ్యములై వెలసి పురాణములకు కావ్యచ్ఛాయలను గల్పించుచుండును. కావున శాస్త్రరూపకావ్యచ్ఛాయాన్వయి యగు మహాభారతమువలె పురాణములును శాంతరసప్రధానము లనుట సమంజసమే.

మారనమహాకవి యీయంశమును వ్యంగ్యమార్గము ననుసరించి యీక్రిందిపద్యమున నిపుణముగా వ్యక్తము చేసినాఁడు.

ఎ.గీ. అఖిలవిబుధసభాపర్వ మై జగజ్జ
నావళికిఁ గర్ణపర్వ మై యధికపుణ్య
యోగిహృచ్ఛాంతిపర్వ మై యెప్పుదాని
హరిగుణోజ్జ్వలమణినిధి యైనదాని,

క. ఇమ్మార్కండేయపురా
ణ మ్మఖిలహితమ్ము గాఁగ నానేర్చుగతిన్

3. "ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా
సురై ర్బ్రహ్మర్షిభి శ్చైవ శ్రుత్వా యదభిపూజితమ్॥ — సం. ప. ఖా. 1.17.

నెమ్మి విరచించెదం బ
ద్యమ్ముల గద్యముల భవదుదాత్తానుమతిన్. (అవ. 22, 23)

ఇందు మారన సభాపర్వ, కర్ణపర్వ, శాంతిపర్వశబ్దములచే మార్కండేయపురాణమునకును, మహాభారతమునకును పరమాత్మ యగు హరియొక్క గుణకీర్తనమునందు గల సామ్యమును వ్యంగ్య మొనర్చెను. కావున భారతమువలె మార్కండేయము శాంతరసవ్యంజక మనుట మారన పరమతాత్పర్యము!

మారనమహాకవి వైపద్యమున పర్వత్రయమును, సామాజికభేదత్రయమును బేర్కొనుటలోని సార్థక్యము నరయవలసియున్నది. లోకము త్రిగుణాత్మకము. సామాన్యులు తమఃప్రధానులు. వారు పురాణరచనమునందలి యక్షరరమ్యతను గాంచి శ్రవణానంద మనుభవించెదరు. విబుధవర్గము రజఃప్రధానము. వీరు రసభావసంపదను గాంచి హర్షింతురు. యోగులు సత్త్వగుణసంపన్నులు. వారు పురాణపరమార్థమును భావించి తన్మయు లగుదురు. అట్లగుచో పురాణమున శాంతరసస్ఫూర్తి యోగిజనులకే కలుగు నని తాత్పర్య మేర్పడుచున్నది. భరతుఁడు కూడ విరాగులే శాంతరసాస్వాదసమర్థు లని పేర్కొనెను.4 మారనయు నట్లే భావించె ననుటకు వైవాక్యము ప్రమాణమగుచున్నది. లౌకికులశ్రవణానందము శబ్దమాత్రైకజన్య మైనది; అది క్షణికమైన యింద్రియానందము. విబుధులరసానందము శబ్దార్థజన్య మైనది; అది దీర్ఘకాలిక మైన మానసికానందము; యోగుల ఆత్మానందము కావ్యమహాతాత్పర్యచర్వణజన్య మైనది; శాశ్వత మైనది. యోగులును శ్రవణానంద, రసానందము లనుభవించెదరు. కాని, అంతటితో నాగక పురాణమునం దుండెడి చతుర్వర్గవ్యుత్పత్తిని శ్రవణ మొనర్చి, మననమునకుఁ దెచ్చుకొందురు. ''చతుర్వర్గవ్యుత్పత్తే రపి చ ఆనంద ఏవ పార్యంతికం ఫల'' మ్మని అభినవగుప్తుల నిర్దేశము. దానిని యోగి మోక్షమునకు సాధనముగా నుపయోగించును. అప్పు డతనికి నదసద్వివేకబుద్ధిచే వివక్షింపఁబడిన పరమార్థము స్ఫురించును. జగన్మిథ్యాత్వము భాసించును. ఇట్లు కావ్యశాస్త్రైద్యవేక్షణమువలనఁ గలిగిన వ్యుత్పత్తి అతనికి బ్రహ్మానందసిద్ధి నొదఁగూర్చును. బ్రహ్మజ్ఞానియై, బ్రహ్మైకస్థితియందు సమాధిగతుఁ డగుటయే మోక్షము. "న యత్ర దుఃఖం న సుఖం న చింతా, న ద్వేషరాగౌ న చ కాచిదిచ్ఛా - రస స్తు శాంతః'' - అను లక్షణమునకు లక్ష్య మైన రసస్థితి యప్పుడు కలుగును. అది యోగివర్యులకు సాధ్య మని మారన యభిప్రాయము!

ఒక మహాకావ్యమునందలి రసమునుగూర్చి విచారించుపద్ధతికిని పురాణమునందలి రసవిమర్శన మొనర్చువిధమునకును దప్పక భేదము కలదు. కావ్యములందును వస్తురస ప్రాధాన్యవివక్షచే రెండువిధములు ప్రధానముగాఁ గనవచ్చుచున్నవి. కావ్యశరీర మితివృత్తము; అది నాయకచరితము. కొన్నియెడల నది పంచసంధియుతము. సర్వత్ర కార్యారంభఫలాగమపర్యంత పరివ్యాప్తము. కావ్యమున నంగినాయకుఁ డొకడే. ఫలసాధనమున నాతనికి సహాయు లనేకు లుండవచ్చును. ప్రతినాయకులు నంతియ. ఇట్టిది

4. నాట్యశాస్త్రము - 27.57.

రసవత్తరముగా నిర్వహింపఁ బడినచో నది రసవత్కావ్య మనఁబడును. దీనికి భిన్నము లైనవి వస్తుకావ్యములు. వస్తునిర్మాణవైవిధ్యమును బట్టి వీనియందును అనేక భేదములు పొడగట్టుచున్నవి. పురాణము లట్టిభేదములలో నెన్నఁదగినవి. వేదప్రతిపాదితనిగూఢార్థములను ఉపాఖ్యానములద్వారమున వివరించుచు మిత్రునివలెఁ బురాణములు సామాజికునకు ధర్మప్రబోధ మొనర్చును. అం దేకనాయక నియమము లేదు; ఒకని గాథయే చెప్పఁబడదు. వ్యంగ్యప్రధానములగు రసభావములకన్న విజ్ఞానదాయకములగు ధర్మార్థములకే అందు ప్రాధాన్యము హెచ్చు. వస్తువెల్లను ఉపాఖ్యానములకూర్పు. అవియన్నియుఁ గలసి యేదైన నొకమహాధర్మమునుగాని, మహాతత్త్వమునుగాని, మహాసత్యమునుగాని, మహాప్రయోజనమునుగాని, వ్యంగ్యముగా బోధింపవచ్చును. కావ్యమున వస్త్వైక్యము భాసించుచుండగా పురాణమున నొక యేకవాక్యతయో లేక సమన్వయమో నంతరింపఁబడియుండవచ్చును. పురాణములలో కొన్ని విష్ణ్వాది దైవప్రాధాన్యప్రతిపాదనార్థము జన్మించినవి కలవు. అందలి కథలన్నియు నాదైవమాహాత్మ్యప్రతిపాదనైకసూత్రబద్ధములై యొక యేకవాక్యత నందగించుకొని యుండును. కొన్ని చతుర్వర్గవ్యుత్పత్తి ప్రతిపాదనప్రధానములు కలవు. తదర్థప్రతిపాదకాంశములు గల కథల నాదృష్టితో సమన్వయించుకొనవలెను. పరమపురుషార్థబోధ వానిధ్యేయ మగుచో త్రివర్గవ్యుత్పత్తిని చతుర్వర్గవ్యుత్పత్తి కుపాంగముగను, పోషకముగను గ్రహించి యన్వయించుకొనవలెను.

ఇట్టి దృష్టితోఁ బరిశీలించినచో మార్కండేయపురాణము చతుర్వర్గవ్యుత్పత్తి ప్రతిపాదక మని మారనయే తెల్పెను.

సీ. ''నిఖిలకల్మషపంక నిర్మోచనస్ఫూర్తి నమరసరిద్వారి ననుకరించి,
బహుళతరాజ్ఞానతుహిన నిర్వాపణప్రౌఢి నర్కప్రభాభాతిఁ దాల్చి,
వితతచతుర్వర్గవిపులఫలాలంకృతస్థితి మందారతరువుఁ బోలి,
సారకథాసాంద్రచంద్రికాసంపదఁ బూర్ణేందుమండలస్ఫురణ నొంది"

న దని మారన మార్కండేయము నభివర్ణించెను. మఱియొకచో ''పరమవిజ్ఞానాశ్రయం'' బీపురాణ మనుటచే పరమపురుషార్థవ్యుత్పత్తి ప్రాధాన్యమును ప్రతిపాదించెను. కావున మార్కండేయమునఁ బ్రతిపాదింపఁబడిన కథార్థము లీపరమపురుషార్థపోషకములై యెట్లు సమన్వయింపఁబడునో స్థాలీపులాకన్యాయమున నిచ్చట పరిశీలింపఁబడును.

పురాణకథార్థముల సమన్వయము సాధింపవలె నన్న తత్కథాస్వభావములను బరిశీలింపవలెను. కథాస్వభావము పృచ్ఛకునియొక్కయు కథకునియొక్కయు స్వభావముమీద కొంత ఆధారపడియుండును. పృచ్ఛకుని సంశయనివారణము చేయుట కథకుని కర్తవ్యము. శ్రోతచిత్తవృత్తి నెఱింగి కథలను ప్రపంచించుట యతని నైపుణ్యము.

మార్కండేయమున జైమినిమహర్షి శ్రోత; పరమజ్ఞాను లైన ద్రోణనందనులు కథకులు. జైమినిమహర్షి అధికతేజోనిధి, విద్యానిపుణుఁడు. (1.3). పక్షులు చతుర్ముఖ

సదృశులు, ప్రవిమలజ్ఞానవంతులు, పరమశాంతులు, అఖిలభాషావిశారదులు, అధికమతులు, సకలశాస్త్రపురాణనిశ్చయసమర్థులు, అమితతేజులు, సతతసమాధిరతులు(1.13). తాత్పర్యమున జైమినిమహర్షి జిజ్ఞాసువు. పక్షులు జ్ఞాననిధులు, శాంతరసమూర్తులు. పరమశాంతులైన పక్షులయొక్క ముఖవినిర్గతములైన కథార్థములు శాంతరసప్రధానము లగుట నిర్వివాదాంశము. జైమినిముని పురాణార్థములఁగూర్చి ప్రశ్నించుటలోని పరమార్థముకూడ శాంతరససిద్ధియే. ఎట్లన : జిజ్ఞాసువు పరమపురుషార్థజ్ఞానమును కోరును. దానికొఱ కతఁడు శాస్త్రపురాణేతిహాసములను బఠించి మననము చేసికొనును. తద్గ్రంథపఠనావసరమున జనించుసంశయము లాతని చిత్తమును సంక్షోభపఱచును సమన్వయము కొఱ కాతఁడు గురువు నాశ్రయించును. పూర్ణప్రజ్ఞుఁడైన గురు వాతని సంశయవిచ్ఛేద మొనర్చి సమన్వయమును ప్రసాదించును. దానితో జిజ్ఞాసువు జ్ఞానియు, జ్ఞానపూర్ణుఁడును, పరమశాంతమూర్తియు నగును. అతని చిత్తమునందలి జ్ఞానేచ్ఛాక్రియావృత్తులలో నిచ్ఛాక్రియావృత్తు లడఁగి జ్ఞానవృత్తి దీప్తమై నిలచును. అదియే శాంతరసస్థితి యనఁబడును.

జైమిని పంచమవేదమును, సకలదివ్యపురాణశ్రేష్ఠమును నైన మహాభారతమును జిజ్ఞాసువై పఠించెను. అం దతనికిఁ గొన్నిసంశయములు కలిగినవి. వాని సమన్వయమును దెలియుటకై మార్కండేయుని యాదేశానుసారము జ్ఞానపక్షుల నాశ్రయించెను. సంశయములు జ్ఞానిచిత్తమునందలి జ్ఞానవృత్తిని సంక్షోభపఱచును. తన్నివృత్తికొఱకతనిచిత్తమున నిచ్ఛ జనించును. తదిచ్ఛావృత్తిప్రేరితుఁడై యతఁడు జ్ఞానబోధకుని కొఱ కన్వేషించును. జ్ఞానసిద్ధి పడయుటతో నతని యిచ్ఛాక్రియావృత్తు లడంగి, సమాహితమైన యతనిజ్ఞానవృత్తి ఆత్మస్థితియందు నిలచును. జైమినియు మార్కండేయపురాణార్థశ్రవణానంతరము క్రోష్టుకివలె హృదయము పరమజ్ఞానదీప్తము కాగా. వినుతదివ్యబోధఘనుఁడై నిజాశ్రమమున కేగి పరమానందభరితుఁ డయ్యెనట! పరమజ్ఞానసాధనైకలక్ష్యబుద్ధి జైమిని. అతనిధ్యేయము నిస్సంశయమైన జ్ఞానసిద్ధి. అది లభించుటచే నతఁడు శాంతరససిద్ధినిఁ బొందెను. అట్టిరససిద్ధికి కారణభూతము లైనవి మార్కండేయపురాణార్థములు. కావున నవి శాంతరసప్రధానము లనుటలో విప్రతిపత్తి లేదు.

జ్ఞానపక్షులు మార్కండేయమున మార్కండేయాదిమునులచే ప్రోక్తములైన కథార్థములను సందర్భోచితముగా ననుసంధించుచు జైమినిసంశయములను దీర్చెను. అందు మార్కండేయక్రోష్టుకిసంవాదము ముఖ్యమైనది. అందు పంచలక్షణవిశిష్ట మైన పురాణార్థములు గలవు. అవి లౌకికవైదికపారమార్థికములైన యర్థజాతములతో నిండియుండి చతుర్వర్గవ్యుత్పత్తిప్రదము లగుచున్నవి. జడోపాఖ్యానము జడునిచే భార్గవునకుఁ జెప్పఁబడినది. జడుఁడు బ్రహ్మజ్ఞాని మోక్షార్థి. భార్గవునిముముక్షుభావ మీక్రిందిపద్యమున గుబాళించుచున్నది.

సీ. భవభానుత్రీవతాపంబున నెరియు న
న్బ్రహ్మబోధాంబుపూరమునఁ దేల్పు
దారుణవిద్యాహిదష్టు న న్బ్రదికింపు
మధ్యాత్మతత్త్వవాక్యామృతమున
సంసారమమతారుజాక్లిష్టు నను సుఖా
యత్తుఁ గావింపు విద్యౌషమున
మాయాంధకారనిర్మగ్ను న న్నిర్మల
జ్ఞానదీపస్ఫురచ్చక్షుఁ జేయు
తే. మిట్టికర్మబంధమ్ముల నెల్లఁ బాసి
యఖిలదుఃఖములను ద్రోచి యాత్మ మగుడఁ
బుట్టకుండెడుతెరవునఁ బెట్టునట్టి
యోగ మీవు నా కెఱిఁగింపు యోగివర్య ! (2.148)

సప్తశతీకథన మొనర్చిన మేధస్సు శ్రోత లైన సురథసమాధులకు దేవీతత్త్వము నెఱిఁగించుచు :

క. "అపరమేశ్వరి విద్యా
రూపమునఁ బ్రసన్న యై నరులబంధములం
బాపి సనాతనముక్తి
శ్రీపరిణామైక్యయుతులఁ జేయు నరేంద్రా ! (6.33)

యని యామెను ముక్తిదాత్రిగా నభివర్ణించెను. కథాంతమున సురథసమాధులకు భక్తిముక్తిప్రదము లైన వరముల నొసంగి కృతార్థుల నొనర్చిన దాతల్లి. అందు సమాధి కిచ్చిన వర మిట్టిది :

క. ''ఓవైశ్యోత్తమ ! మనమున
నీ వర్థింగోరినట్లు నిత్యజ్ఞాన
శ్రీవిభవము నీ కిచ్చితిఁ
గైవల్యానంతచిత్సుఖస్థితికొఱకున్''. (6.258)

అలఘుతరజ్ఞానసమేతు లయ్యును విజ్ఞులు మోహదుష్టమతు లై బలవదవివేకతిమిరాంధు లయ్యెడు విధమును, తత్తరణోపాయమును బోధించు నీయుపాఖ్యానము మోక్షపురుషార్థ బోధకము.

ఇట్లు పక్షు లుదాహరించిన యుపాఖ్యానము లన్నియు బ్రహ్మవేత్తలు బోధించినవి. ముముక్షువు లర్థించినవి. శాంతరసస్థితియందు బర్యవసించినవి. కావున నీపురాణము శాంతరసవ్యంజక మనుట యుక్తము.

పురాణకథానాయకుల చిత్తప్రవృత్తులను బట్టి అయ్యయికథార్థములందు ప్రతిపాదింపఁబడు పురుషార్థములను, తత్కథాస్వభావములును దెలియవచ్చును. అట్టి వివేచనము

పురాణరససమన్వయమున కుపకరింపఁగలవు. స్థూలముగాఁ బరిగణించినచో నీపురాణ కథలయం దీక్రింది పురుషార్థముల వివేకము కలదు.

1. ధర్మపురుషార్థము :

(1) పాంచాలీభర్తృపంచక విచారము. (2) హరిశ్చంద్ర చరిత్రము. (3) కువలయాశ్వచరిత్రము. (4) పతివ్రతకథ. (5) భౌత్యమను జనన వృత్తాంతము. (6) అవేక్షిత వృత్తాంతము. (7) మరుత్తరాట్చరిత్రము.

2. అర్థపురుషార్థము :

(1) బలదామునితీర్థయాత్ర. (2) ఆడిబకయుద్ధము. (3) మహిషాసుర సంహారకథ. (4) రాజ్యవర్ధనరాజచరిత్రము. (5) ప్రథమ ఖనిత్ర చరిత్రము.

3. కామపురుషార్థము :

స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, వైవస్వత, రౌచ్య మన్వంతర వృత్తాంతములు, నాభాగవత్సంధ్రచరిత్రములు.

4. మోక్షపురుషార్థము :

(1) ధర్మపక్షులవృత్తాంతము. (2) నారాయణచతుర్వ్యూహకథనము. (3) జడోపాఖ్యానము. (4) దత్తాత్రేయోపాఖ్యానము. (5) మదాలసాలర్కోపాఖ్యానము. (6) చాక్షుషమన్వంతరకథ. (7) ఖనిత్రమృగసంవాదము. (8) దేవీసప్తశతి.

ధర్మము సర్వపురుషార్థములకు మూలము. ధర్మవిరహిత మైనపురుషార్థము గర్హ్యము. కావ్యమున నట్టిది రసాభాసము. ధర్మబద్ధమైన అర్థకామములు ప్రవృత్తిధర్మము లనియు, మోక్షపురుషార్థము నివృత్తిధర్మ మనియు ప్రసిద్ధికలదు. ప్రవృత్తిధర్మము నాశ్రయించి శృంగారవీరాదులును, నివృత్తిధర్మము నాశ్రయించి శాంతమును స్ఫురించును. పురాణకథలయందు ప్రవృత్తిధర్మప్రధానము లైనకథలలో శృంగారవీరాదులు స్ఫురించుచున్నను, పురాణప్రతిపాదిత శాస్త్రార్థవివేకముచే జిజ్ఞాసువు త్రివర్గము చతుర్థవర్గసాధనమున కేర్పడిన సోపానపంక్తి యని గ్రహించి నివృత్తిధర్మకథార్థముల కుపబలకములుగా వానిని సమన్వయించుకొనును. అట్టిసమన్వయమే చతుర్వర్గవ్యుత్పత్తి.

అభినవగుప్తుఁడు రసములకును పురుషార్థములకును చక్కని సమన్వయము చేసి యుండెను. "కామము సర్వజాతిసులభము. అది అందరకును హృద్యమైనది. అందుచే శృంగారము మొదట చెప్పఁబడినది. నిరపేక్షాభావము కల హాస్యము శృంగారానుగామి; అందుచే నది రెండవది. శృంగారముయొక్క విపర్యయమే కరుణము; అందుచే అది మూఁడవది. పిమ్మట కరుణనిమిత్తమైన రౌద్రము చెప్పఁబడినది. ఇది అమర్షప్రధానము. తరువాత కామ-అర్థములు ధర్మమూలము లగుటవలన ధర్మప్రధాన మైన వీరము చెప్పఁబడినది. ఈవీరము భీతాభయప్రదాన మగుటచే తదనంతరము భయానకము చెప్పఁబడినది. భయానకబీభత్సములవిభావము లించుమించు సమానము లగుటచే బీభత్సము వీరముచేతనే ఆక్షిప్త మగుచున్నది. వీరము యొక్క అంతమునందు తత్ఫలమే

అద్భుతము. ఇవియన్నియు త్రివర్గాత్మకములు. వీనియనంతరము మోక్షఫలమైన శాంతము చెప్పఁబడినది. ఇట్లు రసములు నవసంఖ్య కలవై యొప్పుచున్నవి.[5]

మానవునకు చతుర్వర్గ మెట్లు సాధ్యమో రసముకూడ సాధ్యమే. "సాధ్యో హి రసో యథా తథం కవిభిః" అని నన్నయభట్టునిర్దేశము. త్రివర్గసాధకునకు స్వర్గ సుఖము సాధ్యము. మోక్షసాధకునకు శాశ్వతబ్రహ్మసిద్ధి ఫలము. పునర్జన్మరహిత మైన మోక్షసిద్ధి మానవునిపరమధ్యేయ మైనప్పుడు త్రివర్గసాధకునకు మోక్షము సాధ్య మగు చున్నది. శృంగారవీరాది వికృతిరసములను సాధించినకవులును, సహృదయులును అంతటితో నాగక ప్రకృతిరస మైన శాంతమును సాధించి సంపూర్ణత్వమును సాధింప వలెను. లౌకికకావ్యములను జదివినచోఁ గలుగునది శృంగారాదిరసానుభూతి. పురాణ ములను జదివినచో నట్టిరసానుభూతియు, పర్యంతమున జ్ఞానసిద్ధిచే నగు శాంతరసాను భూతియుఁ గలుగును. కావున మానవుఁడు సాధించుటకు అవకాశమున్న పురుషార్థము లును సమన్వయశక్తి గల సహృదయునకు ప్రసాదించు సంపూర్ణసాహిత్యమూర్తులు పురాణములు!

పైనఁ జెప్పఁబడిన కథలలోని నాయకు లెల్లరును వీరులే. కానిచో కార్యసిద్ధి లేదు; రససిద్ధి లేదు. అందు హరిశ్చంద్రుఁడు సత్యపాలనధర్మమును, కువల యాశ్వుఁడు ఋష్యాశ్రమరక్షణధర్మమును, అవేక్షితమరుత్తులు క్షత్రియధర్మమును అనుసరించి వీరమూర్తులై యొప్పారెడువారు. పాంచాలియు, పతివ్రతయు భర్తృసేవానిర తులై సతీధర్మమున కాలంబన మైనవారు. అట్లే మనుజన్మహేతువు లైన వారందరును వీరులే. ధీమంతు లైన వారికామపురుషార్థఫలముగా జ్ఞానధాతురూపభవు లైన మనువులు జన్మించుట. రాజ్యవర్ధనాదిచక్రవర్తులు సూర్యాదులను సకామభక్తితో సేవించి సత్ఫలి తములను సాధించినవీరులు. బలరామబ్రహ్మహత్య, అడిబకయుద్ధము నిషేధరూప ప్రబోధము చేయు వీరులగాథలు - ఈకథలన్నియు ప్రవృత్తివీరప్రధానము లైన వని చెప్పవచ్చును. ధర్మోత్సాహము లేనిది జీవప్రవృత్తియు, పురుషార్థసాధనయు లేవు కావున పైకథలయందు ప్రవృత్తివీరము కలదు.

ప్రవృత్తి లేనిది నివృత్తి లేదు. త్రివర్గసాధన లేనిది మోక్షము సాధ్యముకాదు. అలర్కోపాఖ్యాన మందులకు సాక్షి. అలర్కుఁ డెంతటివీరుఁడో అంతటి జ్ఞాని. అతని త్రివర్గసాధనమంతయు చివర కతనికి నిర్వేదమును ప్రసాదించినది. దత్తాత్రేయుని జ్ఞానభిక్ష అతనికి వైరాగ్యమును కుదిర్చినది. అతఁడు ముక్తిని సాధించినాఁడు. దత్తా త్రేయుఁడు జన్మతః సిద్ధుఁడు. అతనికి సంసారసంగ మనిన గిట్టదు. నిస్సంగుఁడుగా జీవించుట కతఁ డొనర్చినలీలలు త్రివర్గవైరాగ్యబోధకములు. జ్ఞానవంతులయ్యు శరీర వ్యామోహము వీడలేని ద్రోణనందనులకు గల్గిన శాపము, తజ్జనిత మైన నిర్వేదము, తత్ఫల మైన విమలజ్ఞానసిద్ధి త్రయీవర్గసాధకుఁడు తత్త్వజ్ఞానమువలనఁ గలిగిన నిర్వే

5. అభినవభారతి. I. సం. పు. 287. (మూలము)-అనువాదము-నాట్యశాస్త్రము (డా. పోణంగి శ్రీరామఅప్పారావు)-6వ అధ్యా. విశే. 216 పుట.

దముచే శాంతమును సాధింపవచ్చుననను సత్యముననుఁ జెప్పుచున్నవి పూర్వజన్మవిజ్ఞాన విలసితుఁడును - కారణజన్ముఁడును నగు చాక్షుషునిచరిత్రము కడుపవిత్రము. మోక్ష సాధకు లెల్లరు త్రివర్గసాధన మొనర్చి విరక్తులైనవారే; నివృత్తిపరులే. కావున గార్హ స్థ్యాశ్రమనిర్వహణానంతరము సంసారవిరక్తి నంది ముముక్షువులై బ్రహ్మానందసిద్ధి వడ యుట పురుషుని కర్తవ్య మని యీకథలు వ్యంగ్యముగా బోధించుచున్నవి. అట్టి పురు షార్థచతుష్టయసాధనక్రమము ననుసరించి తత్తదనుగుణములైన కథలయర్థములను సమన్వయించుకొని పురాణతత్త్వము నరయుటయే సహృదయునికర్తవ్యము.

పురాణకథలు స్వీయరసానుభూతి నందించుచునే శాస్త్రజ్ఞానముచే నొకసంస్కార మును పఠితయందు జాగృత మొనర్చుచుండును. రసానందముచే రక్తుఁడైన పఠిత తత్పర్యాలోచనచే విరక్తితో నైన జ్ఞానసిద్ధి సాధించును. అతనిదృష్టికి-

"భావావికారా రత్యాద్యా శ్శాంతస్తు ప్రకృతి ర్మతః
వికారః ప్రకృతే ర్జాతః పున స్తత్రైవ లీయతే
స్వం స్వం నిమిత్తమాసాద్య శాంతా ద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రతీయతే"

అనువాక్యము సత్య మనిపించు ననుటలో విప్రతిపత్తి లేదు.

పురుషార్థసాధకుఁడైన ప్రతివానికిని పఠింపఁదగినవి పురాణములు. ఎవని కెంత యధికార మున్నదో వాని కంతలాభ మున్నది వానివలన. సంసారదుఃఖములచే సంక్షు భితుఁడైన మానవుఁడు తచ్ఛాంతికొఱకు పురాణమును పఠించును. సంశయాత్ముఁడైన జ్ఞాని పురాణము నాశ్రయించును. శాస్త్రార్థ మెఱుగఁ దలచిన వివేకి పురాణమును పరిశీ లించును. రసార్ద్రకథాప్రపంచమును దర్శింపఁ దలచిన సాహిత్యవేత్త పురాణపురుషుని హృదయము దర్శించును. మోక్షార్థి పురాణతత్త్వమును అనుభవించును.

మహాకావ్యము లిన్నివిభిన్నప్రయోజనములు కల సామాజికులకు సమాధానము చెప్పలేవు. త్రివర్గవ్యుత్పత్తి వానిలక్ష్యము. మహాకావ్యపఠనము పురాణపఠనమునకు మొదటిమెట్టు. మహాకావ్యమునందలి రసదర్శనము దేవతావిగ్రహమునందు దైవత్వమును భావించుట వంటిది. పురాణమున రసదర్శనము అనంతవైవిధ్యముతోఁ గూడిన ప్రకృతిలో పరమాత్మను దర్శించుటవంటిది. ఐక్యత గల వస్తువులో నేకత్వము దర్శిం చుటకంటె వైవిధ్యము గల వస్తువులో నేకవాక్యత సాధించుట సాధనైకవేద్యము. బహు విధకథార్థములచే సముల్లాసిత మైన సహృదయునిచిత్తవృత్తి పరమార్థచింతనతో సమా హిత మై ఆనందరసమగ్న మగుటయే పురాణరససిద్ధి.

ఇట్టిసాహిత్యము మూలసంపత్తిగాఁ గల భారతీయులు ధన్యులని బ్రహ్మపురాణము చాటిచెప్పినది.

"ధన్యా స్తే భారతేవర్షే జాయన్తే యే నరోత్తమాః
ధర్మార్థకామమోక్షాణాం ప్రాప్నువన్తి మహాఫలమ్"

మార్కండేయపురాణము అట్టిమహాఫలము నొసంగెడి పురాణరత్నము! పరమ విజ్ఞానాశ్రయ మైన యీపురాణము శాంతరసార్ణవ మని పరమార్థము!!

# మారన శైలి

మారనది అచ్చమైన పురాణశైలి :

శైలి శబ్దము పాశ్చాత్యుల style అనుపదమునకు సమానార్థకముగా నేటి విమర్శకులు వాడుచున్నారు. ప్రాచీనరోమనుదేశీయులు మైనపుబట్టలపై వ్రాయుట కుపయోగించిన వాడిమొన గల యొక యినుపగంటమువంటి సాధనమునకుఁ జేరైన stylus అను పదమునుండి స్టైలనుపదము జనించినది. అది యిప్పు డర్థపరిణామమునకు గురియై ఒకకవి తనభావములను శబ్దార్థములద్వారమున వెలువరించువిధ మను నర్థమున వాడఁబడుచున్నది. అట్టిభావ వ్యక్తీకరణమునందు కవివ్యక్తిత్వమే ప్రత్యక్ష మగుచుండును. అట్టికవి వ్యక్తిత్వమే శైలి యని పాశ్చాత్యుల యభిమతము. వారిలోను శైలి యనుపదమును భిన్నదృష్టులతో నిర్వచించినవారు కలరు కాని పై అభిప్రాయము బహుజనసమ్మతముగా వెలసియున్నది. "Style is the dress of thought" అని ప్రతిపాదించిన ప్రాచీనుఁడు Pope ను కార్లైలు విమర్శించి "Style is not the coat of a writer but his skin" అని ప్రతిపాదించినాఁడు. ఆతరువాతి విమర్శకులు మఱికొంత ముందునకు నడచి - Puttenham - "Style is the image of man" అనియు, Newman "Style is the man" అనియు నిరూపించినారు. Newman నిర్వచనము బహుజనాదరణపాత్రమైనది.

మనప్రాచీనులు శైలిశబ్దమును శిల్పార్థమున వాడి రని తెలియుచున్నది. దానిని వివరించుచు డా. పాటిబండ మాధవశర్మగారు - "రసాభివ్యక్తిసమర్థ మగు కావ్యమును నిర్మించుట కవియిచ్ఛ. అంగి యైన కావ్యమునకు అంగము లయిన వాగర్థములు, ఛందోలంకారములు సుస్నిగ్ధసంధిబంధము లై యథోచితముగ సన్నివిష్టములు కావలయును. అట్టి సన్నివేశమునఁ గవియొక్క యంతరింద్రియ బహిరింద్రియముల యేకాగ్ర మైన వ్యాపారము శిల్పము. శీలధాతునిష్పన్నము లైన శీలము, శైలి, శిల్పము తరతమభావమున నేకార్థకములే. అనంతజన్మాభ్యాససంస్కారము శీలము. శీలమే స్వార్థమున శైలి యగును. ఇహజన్మాభ్యాససంస్కారము శిల్పము. మహర్షుల యందు శీల మైనది మహాకవులందు శిల్ప మగుచున్నది. అప్రయత్నఫలసిద్ధి శీలమూలకము. సప్రయత్నఫలసిద్ధి శిల్పమూలకము."[1]

---

1. ఆం. మ. భా. ఛందశ్శిల్పము - పుట. 6.

శీలమే స్వార్థమున 'శైలి' కావున కవిచిత్తసంస్కారమే శైలి. అది కవివాగ్వృత్తి యందు ప్రతిబింబించును. తత్ప్రకటనమే కావ్యశిల్పము. ఇట్టి సమన్వయము పాశ్చాత్యుల శైలినిర్వచనమునకు సన్నిహితముగాఁ గానఁబడుచున్నది. ఉదా :

"Thought and speech are inseparable from each other. Matter and expression are parts of one; Style is a thinking out into language."

—John Henry Newman.

"Style is the manner in which ideas are exprest. Style is not in the mind- it is the mind."

—George Jacob Hulyoake.

మారన రచించినది పురాణము. అతఁడు పురాణశాస్త్రకావ్యమర్మజ్ఞుఁడు; శిల్పి యైన మహాకవి. పురాణమును రచించుకవికి శాస్త్రము, కవిత్వము కరతలామలక మై యుండవలెను. మారనయం దవి సహజసిద్ధములు. పైపె చ్చాతఁడు తిక్కనయొద్ద పరతత్త్వ బోధతోపాటు సరస్వతీప్రసాదమును బొందినవాఁడు. తత్త్వశాస్త్రము లెస్సగా మననము చేసిన మనీషి. శాస్త్రార్థములను విడమఱచి సులభగ్రాహ్యము లగునట్లు తేటతెల్ల మొనర్పఁ గలడు. సాధ్యమైన రసమును గుర్తించి కథార్థముల నలంకరింపఁగలడు. మారన కాతత్త్వము ఒంటపట్టినది. పురాణము గానము చేయఁబడును. పండితపామరుల కాపురాణ శ్రవణమున వీనులవిందు కావలెను. శ్రవణసుభగత్వముతోపాటు శ్రోతలకు కథార్థములు అప్రయత్నముగాఁ దెలియుచు పోవుచుండవలెను. కాని, పౌరాణికులు ప్రవచించుటకుఁ గాని, బుధమండలి భావించుటకు గాని అం దంతస్స్వర ముండవలెను. కావున ధారాళ మైన శైలియు, నోరూరఁగ చవులు పుట్ట నాడివెడినేర్పును, విన్నతోడనే శ్రవణానంద మును భావించినకొలఁది ప్రవణానందమును కల్పించు శబ్దార్థసంపదయు పురాణకర్త వాగ్వృత్తియందు భాసింపవలెను. ప్రయత్నకృతాలంకారబంధురమైన శైలియు, వక్రోక్తి వైభవమును, దీర్ఘవర్ణనాసక్తియు, అత్యంతభావనావైదగ్ధ్యమును గల వాగ్వృత్తి పౌరాణి కున కుండరాదు. కాని, నిరలంకార మయ్యు సాలంకారసౌందర్యస్ఫూర్తి గల యొకానొక ప్రౌఢోక్తి పురాణకర్త కవసరము. ఇట్టిది మారనరచనయందు ప్రత్యక్షమగుచున్నది. కావున నతనిది అచ్చమైన పురాణశైలి యనవచ్చును.

పాశ్చాత్య విమర్శకులు కొందఱు సామాన్యముగా నాంగ్లసాహిత్యమునఁ గానవచ్చు శైలులను వర్గీకరణము చేయయత్నించిరి. అం దైదువిధములు ప్రధానముగాఁ గానవచ్చు చున్నవి. 1. Dry Style. 2. Plain Style. 3. Neat Style. 4. Elegant Style. 5. Florid Style-or (Flowery Style) అనునవి. D. D. Hugh Blair అనువిమర్శకుఁ డీవిధముల కిచ్చిన వివరణ మిట్లున్నది. డ్రై స్టైయిలు నిరలంకారమై, సులభగ్రాహ్యమై, వీనులవిందు గాక సరళమై యుండును. శాస్త్రార్థబంధురత్వము, విస్పష్టత అనులక్షణములు

గలిగి నీతిబోధకములైన కృతులలో నీశైలి ప్రయుక్తమగును. [2] ప్లైన్‌స్టైలు సాలంకారమై శ్రోతల నలంకరింపఁజేయుచు, సంగ్రహమును, స్వచ్ఛమును, ఔచిత్యవంతమును నై యొప్పును. ఈశైలి డ్రైస్టైలుకంటె కించిత్ శ్రేష్ఠమై యలరారుచుండును.[3] నీట్‌స్టైలున సార్థకాలంకారప్రయోగము, ఉచితశబ్దార్థప్రయోగము, నాతిదీర్ఘములైన వాక్యములవిన్యాసము, నిరాడంబరపదబంధము, భాసించుచుండును. [4] ఎలెగంట్‌స్టైలు నిర్దుష్టాలంకారప్రయోగ బాహుళ్యము గలిగియు చిత్తరంజన మొనర్చుచుండును.[5] ఫ్లోరిడ్‌స్టైలు శబ్దార్థాలంకార సంభృతమైన ఆడంబరశైలి. [6] వీనిని మన తెలుఁగుసాహిత్యమునకు వర్తించి యన్వయించుకొనినచో నిట్లుండును :

| | | |
|---|---|---|
| Dry Style | ... | శాస్త్రవేదాంతగ్రంథములు. |
| Plain Style | ... | లఘుకృతులు; శతకములు, మూలానుసారులగు అనువాదములు. |
| Neat Style | ... | పురాణాదులు. |
| Elegant Style | ... | మహాభారతాదులు. |
| Florid Style | ... | కావ్యప్రబంధములు. |

---

2. A Dry Style-This excludes ornaments of every kind. Aiming only to be understood, it takes no trouble to please either the fancy or the ear. Such a style is tolerable in didactic writings alone and even there only solidity of matter and perspecuity of language enable us to endure it.
3. A Plain Style rises one degree above that last described. While the plain writer is at no pains to please us with ornament he carefully avoids distinguishing us with harshness. In addition to perspecuity, which is the only aim of the dry writer, he studies precision, purity, propriety.
4. The Neat Style :- Here ornaments are employed but not those of the most elevated or sparkling kind ; they are appropriate and correct, rather, than bold and glowing. Beauty of the compsition is saught to be attained rather by a judicious selection and arrangement of words than by striking efforts of imagination. The sentences employed are at the moderate length and carefully freed from superfluities.
5. The Elegant Style :- Which possesses all the beauty that ornament can add without any of the draw backs arising from its improper or excessive use. It may be regarded as the perfection of the style. ''An elegant writer'' says Blair ''is one who pleases the fancy and the ear while he informs the understanding; and who gives us his ideas clothed with all the beauty of expression but not overcharged with any of its misplaced finery''.
6. A. Florid Style : is used in which ornament is everywhere employed. The Term is used with a two fold signification - for the ornaments

ఇది కడుస్థూలమైనవిభాగము. శాస్త్రార్థప్రధాన మయ్యు రసవత్కథాబహుళ మైన మార్కండేయమునకు Neat Style తగియున్నది. పైన పేర్కొనఁబడిన మారన వాగ్వ్యుత్పత్తిలక్షణములన్నియు నీశైలియం దన్వర్థము లగుచున్నవి. కావున Neat Style ను తెలుఁగున పురాణశైలి యని పిలుచుట యైనది.

మారన తెలుఁగున నొకవిశిష్టపురాణశైలి వెలయించెను. విష్ణుపురాణకర్త యైన వెన్నెలకంటి సూరనాదుల కది యొజ్జబంతి యై విలసిల్లెను. ప్రథమాంధ్రమహాపురాణాంధ్రీకరణ మొనర్చిన మారన కావరుసలో నగ్రతాంబూల మున్నది :

పురాణముల ననువదించుటలో నాంధ్రకవులు స్వీయస్వభావములనుబట్టియు, పురాణవస్తుస్వభావములనుబట్టియు నేర్పఱచుకొనిన దృక్పథములను నాలుగువిధములుగా భావించుటకు వీలగుచున్నవి.

1. రసవత్పురాణకథాకథన ప్రధానదృష్టి.
2. స్థలదేవతీర్థమహిమాభివర్ణనదృష్టి.
3. భక్తిరస పోషణదృష్టి.
4. మూలవిధేయ మైన అనువాదదృష్టి.

అర్థప్రధానము లైన పురాణకథలను శబ్దార్థప్రధానములుగను, రసశిల్పసమన్వితములుగను నిర్మించి పురాణము నొకరమణీయకథామంజరివలె తీర్చు పద్ధతి మొదటిది. ఇట్టిపద్ధతికి నన్నయభట్టే కొంతమార్గము వైచెను. దానిని పురాణమున కన్వయించుకొని ప్రథమాంధ్రమహాపురాణ మొనర్చినవాఁడు మారనమహాకవి : పురుషార్థవ్యుత్పత్తిరూప మైన జ్ఞానమును ప్రతిపాదించువురాణమును పఠితచిత్తమును రంజించునట్లు చేయుటకై మారన యనుసరించిన విశిష్టమార్గ మిది. సర్వసామాన్యముగా పురాణరచనమునఁ బాటింపఁ దగినది యాశైలి. వెన్నెలకంటి సూరన, నందిమల్లయ ఘంటసింగయలు, మడికిసింగన, పింగళిసూరన, దేవీభాగవతకర్తలు క్రమముగా విష్ణువరాహపురాణములను, భాగవతదశమస్కంధమును, గరుడపురాణమును, దేవీభాగవతమును అనువదించు సందర్భములందు మారన చూపిన మార్గము ననుసరించిరి. పురాణశాస్త్రార్థములందు కంటె పురాణకథారచనమునందు పైకవులందఱును విశేషాభిమానమును ప్రకటించుటయే గమనార్హ మైన అంశము :

స్థలదేవతీర్థమహిమాభివర్ణనదృష్టితో నెఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము రచించెను. అం దాకవి ప్రదర్శించిన కావ్యవర్ణనావైదగ్ధ్యమునకు ప్రబంధపరమేశ్వరబిరుదము సార్థక మగునని సాహిత్యవిమర్శకులు చెప్పుచున్నారు. వర్ణనాబహుళ మైన ప్రౌఢశైలిలో

---

spring from a luxuriant imagination and have a solid basis of thought to rest upon or is too often the case, the luxuriance may be in words alone and not in fancy, the brilliancy may be mearly superficial,a glittering tinsel, which, however much it may please the shadow-minded cannot fail to disgust the judicious.''

—Lectures on Rhetoric-by Hugh Blair D.D. Chapter VI. P.115-138.

రచించు నిట్టిపురాణముల కెఱ్ఱాప్రెగ్గడ గురుపీఠము. భీమేశ్వరకాశీమాహాత్మ్యములను పురాణములుగా సంతరించిన శ్రీనాథుఁ డీమార్గమున నడచినవాఁడు.[7] మాఘమాహాత్మ్యమును రచించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవియు, పద్మపురాణోత్తరఖండకర్త మడికి సింగనయు నిట్టిపద్ధతికిఁ జెందినవారే. ఇట్లీ శాఖ పురాణశైలీశాఖ విస్తరించినది.

ఆంధ్రభాగవతపురాణమును బమ్మెరపోతన భక్తకల్పద్రుమముగా నిర్మించి భక్తిరసపోషణపద్ధతి నావిష్కరించి కీర్తి కెక్కెను. సహజకవితాధురంధురుఁడును, మహాభక్తుఁడును నైన ఆమనీషి అనన్యసామాన్య మైన శైలీసౌభాగ్యముచే తనప్రత్యేతకను చాటుకొనుటయే కాక ఆంధ్రుల కత్యంత మాదరపాత్రుఁ డైనాఁడు. ముగ్ధభక్తులనుండి ముముక్షువుల వఱ కాకర్షించు కవితాశైలి యాతనిది భక్తిరసమున కట్టి శైలియే రాణించును. కావున పోతనయే భక్తిరసపురాణకవితకు ఏకైకనిదర్శనము. భాగవతము నెందఱో అనువదించిరి. కాని పోతనమార్గము వారి కసాధ్య మైనది.

పురాణములను మూలవిధేయ మైన అనువాదపద్ధతితో తెలుఁగున సంతరించిన మహనీయు లెందఱో కలరు. మండ కామేశ్వరకవి మార్కండేయము ననువదించిన విధ మిట్టిది. సంస్కృతపురాణతాత్పర్యసర్వస్వమును తెనుఁగునఁ దెలియుట కిట్టి యనువాదము లుపయుక్తములగును. రసదృష్టులైన పైమూఁడుతెగలకవులును మూలమున కతివిధేయులు కారు. స్వీయకల్పనల నౌచిత్య మెఱిఁగి యొనర్చుట వారియందు సర్వసామాన్యము. అట్టివారికల్పనలయం దేవైన దొసగులు దొరలియుండవచ్చును. అట్టివానిని పరిహరించి మూలహృదయమును పదిలపఱచుట నాల్గవపద్ధతికి ప్రథమలక్షణము. మూలమునందు మంత్రతంత్రశాస్త్రాదిరహస్యము లున్నచో వానిస్వరూపము తేటపడునట్లు రచించుట మఱియొకలక్షణము. ఇట్టి యీమార్గము ప్రాచీనాంధ్రపురాణకవులకంటె పదునాఱవశతాబ్దితరువాత వెలసిన కవులలో నధికప్రచార మంది, నవ్యయుగకవులలో నది సర్వసాధారణలక్షణముగా విస్తరించినది.

ఇట్లు తెలుఁగున వెలసిన చతుర్విధపురాణశైలీపద్ధతులలో మారన మొదటిశాఖకు మూలపురుషుఁడు:

మారన చేపట్టిన రచనాపద్ధతియు, ప్రపంచించినపురాణశైలియు అచ్చమైనపురాణశైలి యనుట కొకహేతువు కలదు. ఎఱ్ఱనశైలి నృసింహపురాణవస్తువున కనువైనది. పురాణఖండానువాదమున కనుకూల మైనది. పోతనశైలి భాగవతేతరపురాణరచనమున రాణింప దనుటలో విప్రతిపత్తి లేదు. మూలానుసారి యైన యనువాదశైలికి ప్రవాహవేగము, విరళబంధము, పదానువాదప్రీతి ముఖ్యలక్షణము లై యుండుటచే దాని ప్రత్యేకవ్యక్తిత్వము పరిగణింపుకు రాదు. కాని, మారనశైలి మూలాతివిధేయము కాదు; మూలభావావిష్కారమును స్వీయవ్యక్తిత్వముద్రతో నొనర్చుట యతనిప్రత్యేకత. సారళ్యము వీడని గాంభీర్యము, మార్దవము వీడని ప్రౌఢిమయు, సౌకుమార్యము వీడని సమాససంఘటన

7. "పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ, సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు" అని శ్రీనాథుఁడు కాశీఖండమునఁ జెప్పుకొనెను.

మును, సారము చెడని సంగ్రహత్వమును, రసదృష్టి వీడని కథార్థపోషణమును మారన శైలికి సహజాలంకారములు. ఇట్టిరచనము సర్వపురాణసామాన్యముగా నుండఁదగినది. కావున మారనది అచ్చమైన పురాణశైలి యంటిమి :

మారన తనశైలితో నష్టాదశమహాపురాణముల నన్నింటిని వ్రాసినను మెప్పు గడించును. భాగవతశైలి వలన నది సాధ్యముకాదు. ఎఱ్ఱనప్రబంధశైలి మహాపురాణ మునఁ జెల్లదు. కావున రసజ్ఞులైన మహాపురాణానువాదకర్తలు కొందఱు మారనమార్గము ననుసరించిరి :

మారన పురాణకథారచనమున నన్నయ నాదర్శముగాఁ గొనినట్లు వ్యంగ్యముగా సూచించినాఁడు. పీఠికలో నన్నయను స్తుతించుచు "సారకథాసుధారస మజస్రము నాగళ పూరితంబుగా నారఁగఁ గ్రోలుచు న్జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా భారతసంహిత న్మను త్రిపర్వములు" రచించె నని వర్ణించెను. మారన తాను పురాణమును "ప్రకాశిత సారకథామృతం బొగిం ద్రావి జగజ్జనంబు లలర న్వచియిం(చి) తెనుంగున న్వచశ్శ్రీవిభ వంబు పెంపు విలసిల్లఁగఁ గోవిదు లిచ్చ మెచ్చి సంభావనసేయ" విరచించె నని చెప్పు కొనెను. ఇందు నన్నయ మారనల రచనలలో సారకథాసుధారసము సమానధర్మముగాఁ గనవచ్చుచున్నది. అనఁగా రసవత్కథాకథనమున మారనకు నన్నయ యొజ్జబంతి యని భావ మేర్పడుచున్నది :

నన్నయ భారతావతారికలోఁ దనకవిత్వలక్షణములఁ దెల్పుచు నందు "సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో నారసి మేలునాన్ - ఇతరు లక్షరరమ్యత నాదరింప" నని పేర్కొనియుండుట ప్రసిద్ధము. తత్తాత్పర్యమును వివరించుచు డా. దివాకర్ల వేంకటావధానిగారిట్లు వ్రాసియున్నారు : "ప్రసన్నములైన కథలయందు గూర్పఁబడిన యర్థముయొక్క యుక్తి యని దీని కర్థము. ఇచ్చట ప్రసన్నపదమును గథలకుఁ గాని యర్థమునకుఁ గాని విశేషణముగా గ్రహింపవచ్చును. ప్రసన్న మనఁగాఁ బ్రసాదగుణముతోఁ గూడిన యని యర్థము. ఈప్రసాదగుణమును సంస్కృతలాక్షణికులు పలువురు నిర్వచించి యున్నారు. దీనిని గొందఱు శబ్దగుణముగాను, గొంద ఱర్థగుణము గాను, గొంద ఱుభయాత్మకముగాను, గొందఱు రసగుణముగాను జెప్పియున్నారు...... నన్నయ "ప్రసన్నకథాకలితార్థయుక్తి" యని చెప్పుటచేఁ బ్రసాదము నర్థగుణముగానే గ్రహించినట్లు తోఁచుచున్నది. అయాసందర్భములందు నప్రయోజనములైన విషయము లను మాత్రమే చెప్పుచు, నేకమాత్రశ్రవణముననే లోనియర్థమును వ్యక్తముచేయుట యాతనిప్రసన్నతకు లక్షణ మని చెప్పవచ్చును. ఈయర్థమునే కథలవిషయమునఁ గూడ నన్వయించినచోఁ గథాప్రసన్నత లేక ప్రసన్నకథాత్వము అనఁగా నేమో తెల్లమగును. ఏవైన కథలను రచించునప్పుడు ప్రధానకథతో వానికిఁ గల సంబంధమును, అందు వానికిఁ గల స్థానమును వివరించుచు, ప్రయోజనరహితములైన సందర్భముల నుజ్జ గించుచు విన్నంతమాత్రమున నందలితత్త్వమును స్ఫురింపఁజేయుట యాకథాప్రసన్నతకు లక్షణము."

"రసాదిరూప మగు నర్థ మంగి యగునపుడు శౌర్యధైర్యాదిగుణము లాత్మనువలె దాని నవలంబించియుండునవి గుణము లనియుఁ, గటకకుండలహారాదు లవయవములను వలె వాచ్యవాచకరూపము లగునంగముల నాశ్రయించి యుండు నవి యలంకారము లనియు ధ్వన్యాలోకమునఁ జెప్పఁబడినది. దీనినిబట్టి రస మలంకార్యముగాని గుణముగాని కాక యలంకార్యమును గుణియు నని తెలియుచున్నది. ఈ విధముగా నంగి యగు రసమే గుణవంత మని తెలియుచున్నను దద్వ్యంజకము లగుటచే శబ్దార్థములుగూడఁ బ్రసన్నములు, మధురములు అని యుపచారవశమునఁ జెప్పఁబడుచున్నవి. గుణములలో నోజో మాధుర్యములు సర్వరససాధారణములు గావు. అవి హాస్యభయానకబీభత్సశాంతము లందుఁ గలిసియుండు నవకాశమున్నను శృంగారరౌద్రాదులం దట్లుండం జాలవు. వీని వలెఁ గాక ప్రసాదము సర్వరససాధారణమై యుండును. అది సర్వరససమర్పకము. శబ్దార్థములస్వచ్ఛతయే ప్రసాదము. శబ్దార్థస్థిత మైన స్వచ్ఛతచే నది శుష్కకాష్ఠములం దగ్నివలె సామాజికులహృదయములందు స్వస్వరూపముతో వెంటనే వ్యాపించును. "ఈయకాలుష్యరూప మగు ప్రసన్నత్వ మన్నిరసముల కనుగుణము. అట్లు సర్వరసవ్యంజక మగు నర్థమును శబ్దములు సమర్పించుటయే యుపచారవశమునఁ బ్రసాద మని గ్రాహ్యము. కావ్యనాటకములందు రసస్ఫురణము శబ్దార్థముల యకాలుష్యముననే సంభవించును గావున శబ్దార్థములస్వచ్ఛతయే ప్రసాద మని పర్యవసించినది.[8] (ఆంధ్రధ్వన్యాలోకము 204). ఓజోమాధుర్యములకువలె రసశబ్దార్థముల విషయమున దీని కెట్టినియమము నను కానరాదు. ఇది సర్వరసములకు, సర్వరచనలకు సాధారణ మైనగుణము[9]. ప్రసాదము రసగుణ మగుటచేతను, అదిసర్వరససాధారణ మగుటచేతను బ్రసన్నము లైన కథ లనునప్పుడు నానారసమయము లైన కథ లని స్ఫురించుచున్నది. ఈవిధముగాఁ "బ్రసన్నకథాకలితార్థయుక్తి" యను సమాసమును నన్నయ రసదృష్టితోఁ బ్రయోగించె నని వ్యక్తమగుచున్నది. సంస్కృతభారతమందలి కథారచనలో ధార్మికదృష్టి యుత్కర్ష వహించును. అందలికథలు రసవంతము లగుట యానుషంగికము. నన్నయ కథారచనలో నట్లుగాక రసమున కధికమైన ప్రాధాన్యము. రసమునకుఁ గాక కేవలకథానిర్మాణమునకే ప్రాధాన్య మొసంగుట మహాకవిత్వలక్షణము కాదు. "ప్రబంధములను నిర్మించుకవి సర్వవిషయముల రసపరతంత్రుఁడై యుండవలయును. ఇతివృత్తమున రసానుగుణమైన స్థితి కానుపించినచో దానిని ఖండించి యైన స్వతంత్రముగా రసానుగుణమైన కథాంతరము నుత్పాదింపవలయును. ఇతివృత్తమాత్రనిర్వహణముచేఁ గవి కెట్టి ప్రయోజనమును సిద్ధింపదు. ఏలయన నది యితిహాసమువలననే కలుగుచున్నది"[10] అని ధ్వన్యాలోకము

8. "సమర్పకత్వం కావ్యస్య యత్తు సర్వరసాన్ ప్రతి - సప్రసాదో గుణో జ్ఞేయః సర్వసాధారణక్రియః"

9. "ప్రసాదస్తు స్వచ్ఛతా శబ్దార్థయోః, స చ సర్వసాధారణో గుణః సర్వరచనా సాధారణ శ్చేతి వ్యంగ్యార్థాపేక్ష యైవ ముఖ్యతయా వ్యవస్థితో మంతవ్యః"

—ధ్వన్యాలోక. 2.33 వివృతి.

10. "న హి కవే రితివృత్తమాత్ర నిర్వహణేన కించి త్ప్రయోజనమ్. ఇతిహాసా దేవ తత్సిద్ధేః."

చెప్పుచున్నది. ఈ విషయము దృష్టియం దిడుకొనియే నన్నయ తనకవిత్వమునందలి గుణముల వెల్లడించునప్పుడు "ప్రసన్న" పదమును వాడి స్వీయకథానిర్మాణము రసాను గుణముగా నుండు నని సూచించినట్లు తోఁచుచున్నది."[11]

కావున మారన నన్నయవలె తన కవిత్వమును ప్రసాదగుణభూయిష్ఠముగాఁ బ్రయోగించి సర్వరససామాన్యమైన శైలీసౌభాగ్యమును బ్రదర్శించె నని స్పష్టమగు చున్నది.

మారన తిక్కనసోమయాజిశిష్యుఁడు. తత్ప్రసాదలబ్ధసరస్వతీపాత్రుఁడు. గురు స్తుతిఁ జేయుచు మారన తిక్కనను "ఉభయకవిత్వతత్త్వ విభవోజ్జ్వలుఁ" డనియు, "భారతసంహితాకథావిభుఁ" డనియు, "పరతత్త్వబోధనుఁ" డనియు, "నవీనపరాశర సూనుఁ" డనియు విశేషముగాఁ గీర్తించెను. మారనయే వ్యాసస్తుతిఁ జేయుచు నాకవి "సాంఖ్యయోగవిదుఁ డనియు, భారతసంహితావిరచనాకల్పుఁ" డనియుఁ బ్రధానముగా వర్ణించెను. "నవీనపరాశరసూనుఁ డైన" తిక్కనయందును ఈరెండులక్షణములను మారన దర్శించియుండుటచే ఆబిరుదము సోమయాజి కన్వర్థమగుచున్నది. మారన తిక్కనను స్తుతించిన విధములు సూక్ష్మముగాఁ బరిశీలించినచో నామహాకవియొద్ద నీతఁడు కవిత్వతత్త్వమైన రసశిల్పసంపదయు, భారతసంహితాకథానిర్మాణమర్మములును, అందు ప్రపంచింపఁబడిన శాస్త్రార్థప్రపంచమును గూలంకషముగా నభ్యసించినట్లు కానఁబడు చున్నది.

నన్నయనుండి రసవత్కథానుకూలమైన శైలిని సంతరించుకొనిన మారన తిక్కన నుండి మహాపురాణకథానిర్వహణదక్షతయు, శాస్త్రార్థకావ్యార్థోచితసంయోజనవైదగ్ధ్య మును, రసభావపోషణపద్ధతియు గ్రహించె నని భావించుటకు వీలగుచున్నది.

మారనకు నన్నయవంటి శీలము సహజసిద్ధము; తిక్కనవంటిశిల్పము అభ్యస్తము! శీలధాతూత్పన్నమైన శీల, శైలి, శిల్పశబ్దముల యర్థము నిచ్చట నన్వయించుకొనినచో నన్నయవంటిశైలి మారనకు జన్మసంస్కారసిద్ధము. తిక్కననుండి గ్రహించినశిల్పము ఇహజన్మాభ్యాససంస్కారసిద్ధము. మొదటిది అప్రయత్నఫలసిద్ధిమూలకము. రెండవది సప్రయత్నఫలసిద్ధి మూలకము!

మారన "ఆంధ్రకవితాగురు నన్నయభట్టుఁ గొల్చెదన్" "తిక్కకవీంద్రునిఁ గొల్తు నర్థితోన్" అనుటలోనే పైఅర్థమును ధ్వనింపఁజేసెను.

గుణములు రసధర్మము లని లాక్షణికుల మతము. గుణములు పది యని భరతా చార్యులును, ఇరువదినాలు గని భోజుఁడును ప్రతిపాదించి యున్నను మమ్మటాచార్యుల త్రిగుణసిద్ధాంతము బహుజనామోదము నొంది యున్నది. జగన్నాథుఁడు మాధుర్యోజః ప్రసాదగుణములతోఁ గూడిన రసమును జర్వణము చేయుటవలన ద్రుతి, దీప్తి, వికాసము లను చిత్తవృత్తు లేర్పడు నని అన్వయించియుండెను. అందు ప్రసాదమునకు

11. ఆంధ్రవాఙ్మయారంభదశ. ద్వి. సం. నన్నయభారతము. పుట. 701, 703-707.

శుష్కేంధనాగ్నివలెను, స్వచ్ఛజలమువలెను జిత్తమున వ్యాపించునట్టి లక్షణము సహజము. సర్వరససాధారణమైన యీగుణముయొక్క వ్యాపకలక్షణముచే నీగుణ ప్రాధాన్యము గల శైలి కావ్యార్థములను పఠితచిత్తమున వ్యాపింపఁజేసెడుశక్తి కలిగియుండును. స్వచ్ఛజలోపమానముచే నీగుణమునకు స్వచ్ఛత-లేక-నైర్మల్య మనునది సహజసిద్ధ మని యేర్పడుచున్నది. కవి తనకావ్యమున శృంగారరసాదులను ఒప్పింపవలసి వచ్చినప్పుడీప్రసాదగుణమున మాధుర్యగుణము నాధాన మొనర్చును. రౌద్రాదిరసపోషణము చేయునెడ ఓజోగుణాధాన మొనర్చును. ప్రసాదము నిర్మల మైన చిత్రభిత్తిక వంటిది అందు శృంగారాదులు లలితవర్ణసంయోజనాత్మక మైన చిత్రములవంటివి. రౌద్రాదులు పరుషవర్ణసంయోజనాత్మక మైన చిత్రములవంటివి. నానావిధరసపోషణావసరములందు చిత్రకారునివంటి మహాకవి యుచితవర్ణసంయోజనముచే వ్యంజిత మైన మధురోజోగుణాధానాత్మక ప్రసాదగుణమును యథావసరముగా చిత్రించుట శిల్ప మనఁబడుచుండును. మారన యిట్టిశిల్పమును తిక్కనసోమయాజి ప్రసాదమున సాధించెను.

శృంగారసపోషణ మొనర్చువేళ నౌదార్యమున మాధుర్యము మేళవించి రక్తికట్టించెడు నేర్పు మారన పెక్కుచోట్ల ప్రదర్శించెను. ఉదా : (2.161). సంభోగశృంగారవర్ణన మొనర్చునెడ నాయికానాయకులరతిభావగాఢత్వమును వ్యంజించుటకో యనునట్లు మారన కించిదోజోగుణమిశ్రరూప మైన శైలిని వాడుట పరిపాటి. అది సందర్భములనుబట్టి తరతమభేదమునఁ గానవచ్చుచున్నది. ఉదా : 5. 18; 4. 153. వీరరసపోషణమునందును మారన యోజస్సును తరతమభేదమును బాటించుచు ప్రయోగించెను. ఉదా : 8.116; 8. 99. రౌద్రమున నోజోగుణప్రధాన మైన రచనము చేయుట మారనకు పరిపాటి. ఉదా : 6.78. ఉదాత్తద్రవ్యవర్ణనము నోజోగుణప్రధానముగా రచించుట మారన రచనలోఁ గానవచ్చు ప్రత్యేకలక్షణము : ఉదాహరణమునకు విజయోత్సవవర్ణనము : 8.275. కరుణరసపోషణమున మారన మాధుర్యోజోగుణపాధ్యాము గల శైలులను సందర్భోచితముగా నుపయోగించి యౌచిత్యమును బాటించెను. ఉదా : 1.253; 1.201. స్తుతులలోప్రసాద, ఓజోగుణవిశిష్టములైనవి పెక్కుకలవు. ఉదా : ప్రసాదగుణప్రధానములు : 5.355; 356; 6.32; 40; 117; 118; 120; 122; 7.26; 52; 82. ఓజోగుణప్రధానములు : 5. 354. 6.123; 7. 50; 109; 122; 123; 126. 3.53.

కథాకథనమున పాత్రోచిత సంభాషణశిల్పమును వెలార్చు మారన సందర్భోచిత గుణప్రాధాన్యముచే శైలీవైవిధ్యమును సంతరించి కావ్యార్థసౌందర్యమును పోషించును. ఉదాహరణమునకు : (1) కువలయాశ్వుఁడు పితృవాత్సల్యప్రభావమును వర్ణించుట - మాధుర్యము. 3.77. (2) వరూథినీవిరహము - ప్రసాదము. (5.9). (3) హరిశ్చంద్రునివీరోక్తులు- ఓజస్సు (1.152). ఇట్టివి కావ్యపరిశీలనావసరమునందు గ్రహించుట సులభము। పైవానిలోఁ బెక్కింటి సార్థక్యమునుగూర్చి ఆఖ్యాన ఛందోలంకార శిల్పాధ్యాయములందు విపులముగాఁ జర్చించుటయైనది.

స్థూలముగా మారనరచన కదళీపాకము అనవచ్చును. కాని, రసవదుపాఖ్యానములయందు అతనిరచన కొన్నియెడల ద్రాక్షాపాకమునఁ బడినది. ఇట్టి మధురమైన కవిత్వశైలియే ఆంధ్రమార్కండేయపురాణమున కత్యంతజనాదరము కల్పించిపెట్టినది. తెలుఁగువారికి సంస్కృతమార్కండేయమును మఱపునకుఁ దెప్పించినది; భావి ప్రబంధకవులకు చవులూరింపఁ జేసినది; తెలుఁగున పురాణశైలికి రూపురేఖలు తీర్చిదిద్దినది.

ఆంధ్రపురాణశైలికిని సంస్కృతపురాణశైలికిని భేదము కలదు. సంస్కృతభాషలోని పురాణశైలికి కావ్యశైలికివలె సాహిత్యగౌరవము లేదు. అర్థప్రధానములైన పురాణము లత్యంతసులభమైన శైలిలో నాబాలగోపాలమున కర్థమగునట్లు రచించిన విరళబంధములు. ఆశైలి సంస్కృతభాషయొక్క పరమసారళ్యమును నిరూపించుచుండును. తెలుఁగుకవులు కావ్యనిర్మాణము చేయునాటికి సంస్కృతకావ్యవాఙ్మయ మపారముగా నభివృద్ధి చెందినది. సంస్కృతప్రౌఢకావ్యరచనామర్యాదలన్నియు నాంధ్రకవులకు కరతలామలకములైనవి. వానిప్రభావము వారిరచనలపైఁ బడినది. పురాణమును సరళసుందరమైనభాషలో సర్వజనగ్రాహ్యముగాఁ జెప్పవలె నని మాత్రమే కాక తెలుఁగుకవులు కావ్యరచనాశిల్పచ్ఛాయల నందు రసోచితముగాఁ బొందింప యత్నించినారు. ఇట్టిమార్గమునకు నన్నయతిక్కనలే యాద్యులు. వారికవిత్వమర్మములను కొల్లగొట్టిన మారన పురాణము నట్టిమార్గమునఁ దెలుఁగున నిర్మించెను. కావున మారనది అచ్చమైన పురాణశైలి యనునెడ తెలుఁగున నాశైలి కున్నప్రత్యేకతను దృష్టియం దుంచుకొని యన్వయించుకొనుట యుచితమగును. అప్పుడు మారన కాశాఖయం దున్న అగ్రస్థానము మన కవలీలగాఁ గనఁబడును.

మారన కొకపురాణకవి కుండవలసిన సంభారమును గల్పించినవారు పరోక్షముగా నన్నయ; ప్రత్యక్షముగా తిక్కనసోమయాజి. వారిప్రభావము మారన స్వభావముపై, శైలిపై, పదజాలముపై, పద్యరచనపై, ఇట్లే కావ్యగతబహ్వంశములపైఁ గానఁబడుచుండును. వారి ప్రభావ మున్నంతమాత్రమున మారనకు ప్రత్యేకవ్యక్తిత్వము లేదని భావింపరాదు. అతఁడు పూర్వకవుల పెక్కుసంస్కారములను పండించుకొనిన ప్రథమాంధ్రమహాపురాణకర్త ః అతనికృతికి కీర్తిపతాక అతనిశైలి ః

## మారన పద్యరచనపై నన్నయ తిక్కనల ప్రభావము :

ఈక్రింది పద్యములను బరిశీలించినచో నన్నయ మారనపై వైచిన ప్రభావము కొంత తేటపడఁగలదు.

1. నన్నయ :

చ. అరిది తపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా
సురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి వాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

—ఆదిపర్వ. 1.106.

మారన :

ఉ. ఆరయ నొక్కభంగిగ రహస్యపుఁజోటను రాజసన్నిధిన్
సూరిసభాంతరంబులను జొప్పడి తప్పక గద్యపద్యముల్
దోరలు పేర్చినట్లు మదిఁ దోఁపఁగఁ జేయుట సంతతంబు నా
భారమకాదె వీని కనుభారతి మాకుఁ బ్రసన్న యయ్యెడున్.

మారన మార్క. అవ. 5.

2. నన్నయ :

సీ. త్రేతాగ్నులెల్లను దేజరిల్లమిఁ జేసి, క్రతుకృత్యములు వినిర్గతము లయ్యె
నగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాతరాహుతు లంత నుడిగె,
దేవతార్చనలందు దీపధూపాది సద్విధులు వర్తిల్లక విరతిఁ బొందెఁ
బితృకార్యములఁ బితృపిండయజ్ఞ క్రియ లడఁగెవిభిన్నంబులై ధరిత్రి...

(ఆదిపర్వ. 1.141)

మారన :

సీ. ఆదిత్యునుదయాస్తమయములు లేకున్కిఁ జేసి కాలంబులు సిక్కువడియె
ననుదినస్నానసంధ్యాజపహోమాది వివిధకర్మంబులు విరతిఁ బొందెఁ
వేదాధ్యయనములు విధివిహితస్వధా స్వాహాదు లొగి నిలువంగఁ బడియె
నిత్యనైమిత్తికకృత్యము ల్క్రతుసురాతిథిపూజ లడఁగె ధాత్రీతలమున...

(మా. మా. 2.171)

3. నన్నయ :

శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్......... ఆదిపర్వ. 1.112

మ. నరచాపప్రవిముక్తదారుణ బృహన్నారాచధారల్ భయం
కరదైతేయనికాయకాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ. ఆదిపర్వ. 2.23

మారన :

శా. దైతేయప్రవిముక్తదారుణగదాదండాసి నానాయుధ
వ్రాతంబు ల్విలసత్తదాభరణవర్మశ్రేణియున్ జూర్ణమై
పాతాళైకనికేతనాంతరమునం బర్వంగఁ జేసె న్వెసన్
జాతామర్షత నక్కుమారుఁడు రణోత్సాహంబు దీపింపఁగన్.

మా. మా. 2.236.

4. నన్నయ :

ఉ. దాని శరీరసౌరభము దాని విలోలవిలోకనంబులున్
దాని మనోహరాకృతియు దానిశుచిస్మితవక్త్రకాంతియున్
దాని విలాసముం గడుముదంబునఁ జూచి మనోజబాణసం
తానహతాత్ముఁడై నృపతి దానికి నిట్లనియెం బ్రియంబునన్. ఆ. వ. 4.172

మారన :

ఉ. వీని సురూపవిభ్రమము వీని తనూద్గతచారుకాంతియున్
వీని మృదూల్లసద్గతియు వీని వినిర్మలదృగ్విలాసము
న్వీనిముఖాంబుజద్యుతియు వేడ్కఁ గనుంగొన నింతయొప్పునే ?......
(మా. మా. 4.232)

5. నన్నయ :

కం. అం దమరబృందవంద్యున
కిందుకళాభరణునకు నుమేశ్వరునకు నా
నందం బొందఁగ నందఱ
నందకధరుఁ డుత్సవం బొనర్పం బంచెన్''. (ఆది. ప. 8.191)

మారన :

కం. మందరభూభృత్సుందర
కందరమందారకల్పకచ్ఛాయల నా
సుందరులతో నమందా
నందమున ననేకవిహరణములు సలుపుచున్. (మా. మా. 5.68)

ఈక్రిందిపద్యములను గమనించినచో తిక్కనప్రభావము మారనపై నెంత కలదో స్పష్టపడఁగలదు.

1. తిక్కన :

ఉ. కావున భారతామృతము గర్ణపుటంబుల నారఁగ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్.
''నానేర్చినభంగిఁ జెప్పి''—విరా. ప. 1.28. విరా. ప. 1.30.

మారన :

ఉ. "కావునఁ దత్పురాణము ప్రకాశితసారకథామృతం బొగిం
ద్రావి జగజ్జనంబు లలర న్వచియింపు''— మా. మా. అవ. 17.

క. ఇమ్మార్కండేయపురా
ణ మ్మఖిలహితమ్ము గాఁగ నానేర్చుగతిన్
నెమ్మి విరచించెదం బ
ద్యమ్ములగద్యముల భవదుదాత్తానుమతిన్. మా. మా. అవ. 23.

2. తిక్కన :

ఉ. ''...పూజ్యమూర్తి యగు భారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి... (విరా.ప. 1.27)

మారన;

మ. "...ఈదివ్యపురాణరత్నమును మార్కండేయ మేఁ జెప్పఁగాం
చితిఁ బుణ్యాత్ముఁడ నైతి జన్మము ఫలించె న్లోకసంభావ్యమై" ...
మా. మా. అవ. 18.

3. తిక్కన :

ఉ. "...నీకరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగునట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే.'...
(విరా. ప. 1.21)

మారన :

చ. "...తోన పదస్థుఁడ నైతి దుఃఖదు
స్తరగృహధర్మ మేఁ దొలఁగెద న్త్రిజగన్నుత ! మీయనుజ్ఞతోన్"...
మా. మా. 3.363.

4. తిక్కన :

సీ. నెత్తమ్మిరేకుల మెత్తందనము దెచ్చి యచ్చున బెట్టిన ట్లందమొంది
చక్రవాకంబులచందంబు గొనివచ్చి కుప్పలు నేసిన ట్లొప్పు మెఱసి
చందురునుఁగాంతి కందేర్చికూర్చి బాగునకుఁ దెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబులకప్పు గలయంతయును దెచ్చి నారు వోసినభంగి నవకమెక్కి
తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును ని ట్లున్న రుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీ్రతిప్పు లేటికిఁ గమలవదన ! (విరా. ప. 2.52)

సీ మెఱయు క్రొమ్మెఱుఁగులమించును మెలఁతగా మీనకేతనుఁడు నిర్మించినట్లు
చారుశృంగారరసము తేట నింతగా నించువిల్తుండు చిత్రించినట్లు
నవకల్పలతికలనవకంబు నాతిగా శ్రీనందనుఁడు సంతరించినట్లు
నిండారుచందురు నినుపారునునుగాంతిఁ జెలువఁగా మరుఁడు సృజించినట్లు
తే. విస్మయం బైన లావణ్యవిలసనమునఁ
బొలుచు నమ్మదాలసఁ జూచి భూపసుతుఁడు
విగతలజ్జుఁ డైననుఁ బాసి వెలఁది యెందుఁ
బోయి తనుచు నాదటఁ జేరఁ బోవుటయును. (మా. మా. 3.93)

5. తిక్కన :

సీ. తనయొ ప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన మలఁగి క్రమ్మఱఁజూడవలయువాఁడు
దనవర్తనము విన్న మునిజనంబుల కైన నలవరించుకొనంగ వలయువాఁడు
దినబంటుతన మాజిఁ గనిన మార్తుర కైనఁ బలుమాఱు నగ్గింపవలయువాఁడు
ధనవితరణకేళి వినినఁ గల్పతరువులకైనఁ దలయూఁప వలయువాఁడు

తే. నలుఁ దొరలకు నశ్వశిక్షకుఁడు గాఁగ
నగునె యాతనిదుస్థితి యనుదినంబు
గాంచి కన్నీరు డించుచుఁ గడవరాని
దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన. (విరా. 2. 208)

మారన ;

సీ. తనసుందరాకృతిఁ గని వెఱఁగందిన వనిత లంగజునొప్పుఁ దనుపుఁజేయఁ
దనకళాచతుర్వమున కద్భుతం బందు బుధులు భోజునినేర్పు పొల్లుసేయఁ
దననయాభిజ్ఞత వినిన ప్రాజ్ఞులు దివిజేశుని తద్జ్ఞత యేపుదింపఁ
దనయాశ్రయంబున మనుబంధుమిత్రవర్గము కల్పతరువు నాశ్రయముఁ దెగడ
తే. నెగడి జగమున నెంతయుఁ బొగడువడనెఁ
గాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ
డమలసితకీర్తి ధనఁలోలుఁ డన్వయాబ్జ
షండదినవల్లభుఁడు గన్నసైన్యవిభుఁడు. (మారనమార్క. అవ. 39)

6. తిక్కన :

సీ. ఎవ్వనివాకిట నిభమదపంకంబు రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు నొజ్జయై వినయంబు నొఱపుఁగఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడు చూడ్కి మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల కడపటికొండపైఁ గలయఁబ్రాకు
తే. నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకార వైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు గేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు. (విరా. పర్వ. 2.191)

మారన :

సీ. ఎవ్వనిమాహాత్మ్య మెప్పుడు వేదము ల్చెలఁగ సుస్తోత్రముల్ సేయుచుండు
నెవ్వనిశాసనం బేడుదీవులరాజులకు శిరోభూషణలక్ష్మి నొందు
నెవ్వనిరక్ష మహేంద్రాదిసురలకుఁ బెట్టనికోటయై పెంపుఁదాల్చు
నెవ్వనిసత్కీర్తి యీయజాండం బెంత యంతయుఁ దాన యై యతిశయిల్లు
తే. నట్టి మహితగుణాభరణాభిరామ
మూర్తి ప్రత్యర్థినృపసమవర్తి పరమ
పూజ్యసామ్రాజ్యవైభవస్ఫూర్తి నిత్య
సత్యవర్తి హరిశ్చంద్రచక్రవర్తి. (మారనమార్క. 1.142)

7. తిక్కన :

ఎ. గీ. అనితంబిని మక్కువ ననఁగిపెనఁగి
యింపు పొంపిరివోవ నన్నేలుకొనఁగ

దలఁచి పొందిన నది జన్మఫలముగాదె
యనుచు వలరాజుజారికి నగ్గమయ్యె. (విరాటపర్వ. 2.86)

మారన :

గీ. ఈకుమారునిమీఁద నాహృదయ మిప్పు
డధికరాగరసోద్రిక్త మైన మాడ్కి
నితని మనమును నాయందు నతులరాగ
లలిత మగునేని యది జన్మఫలము కాదె. (మారనమార్క. 4.233)

8. తిక్కన :

సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱి నునుఁగాంతి గదలిన యమృతాంశుకలయుఁబోలెఁ
బెనుమంచుమీఁదఁ బర్విన వికాసము దప్పి చెలువు గుందిన సరోజినివిధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసిన దీపకళికపగిది
ధూళిపైఁ బొరసినఁ దొంగిలించుట మాని లావణ్య మెడలిన లతికభంగి

తే. గంధకారికావేషంబుకతన మూర్తి
యుజ్జ్వలత్వంబు మఱువడియుండఁ బాండు
తనయమహిషి యుంచితగతిఁ జనఁగ రాజ
వీథిఁ బౌరజనంబు లవ్వేలఁదిఁ జూచి (విరాటపర్వ.1.294)

సీ. సురుచిరకిరణవిస్ఫురణంబు డింది యెంతయు మాఁగుపడిన మార్తాండుపగిది,
భాసురరత్నసత్ప్రభలు వాసన విన్ననౌ రోహణశిలోచ్చయంబు మాడ్కి
విలసితతారకవిభవంబు చెడి కడుఁబాడఱియున్న నభంబుకరణిఁ
బ్రవిమలకుసుమసంపదయెల్ల నుడివోయి రూపుదక్కిన మహీరుహంబుభంగి

తే. నొందఁ గోటీరహారకేయూరకంక
ణాదిమణిభూషణోత్కర మపనయించి
యొప్పు వొలివోయి దీనత నుండె బంధు
జనులచూడ్కులు కమర నజ్జనవిభుండు (మారనమార్క. 1.169)

(మఱియు తిక్కన, శల్య. 2.399 తో పోల్చిచూడుడు)

9. తిక్కన :

"నిద్రాసక్తునిఁ గొంత మేల్కనినవానిన్ ..." (సౌప్తిక. 1.173)

మారన :

"నిద్రాజాడ్యము దన్ను బాసిన......" (మారనమార్క. 6.50)

10. తిక్కన :

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె భూ
ధరముల్ పెల్లగిలెన్ దిశావలయ ముత్కంపంబు నొందెన్ దివా
కరచంద్రాగ్నుల దీప్తి మాసె సురలోకం బాకులం బయ్యె న
ప్పరమేశుం డటు తా మరుత్క్రతుపరిభ్రంశార్థి యై వచ్చినన్
(సౌప్తికపర్వ. 2.122)

మారన :

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె భూ
ధరవర్గంబు చలించె పెల్కుటి దిశాదంతావళశ్రేణి మ్రొ
గ్గె రవీందుగ్రహతారకావళులు ప్రుగ్గెన్ మ్రోసె బ్రహ్మాండము
ల్బరధుల్ పిండలివండుగాఁ గలఁగె నాశ్చర్యం బుదగ్రంబుగాన్. (6.79)

మార్కండేయపురాణావతారికలో కావ్యకరణబీజవివరణసందర్భమున రచించిన పద్యములందు (అవ. 13-23) నన్నయతిక్కనల శైలీ స్వభావములు మారనచిత్తవృత్తియం దెట్లు పరిపాక మొందినవో తెలియుట కాస్కారమున్నది. కృతిపతియైన గన్నసేనానిసభ రాజరాజనరేంద్రునిసభను స్ఫురింపఁజేయునట్లు మారన రచించుట యందును, మార్కండేయపురాణమును "సభలయం దమరుదాని" నని పేర్కొని పండిత సభలప్రసక్తిని దెచ్చుటయందును, కృతిపతి కృతి "వినం గౌతూహలం బయ్యెడిన్" అని గంభీరముగా నడిగి కృతిపతిత్వము నభ్యర్థింపకపోవుటయందును నన్నయ ప్రభావము కనవచ్చుచున్నది. పురాణము రత్న మనుటయందును, జగజ్జనంబు లలర రచింపఁ బూనుటయందును, పుణ్యాత్ముఁడ నైతి జన్మము ఫలించె నని యుబ్బిపోవుటయందును, నానేర్చు గతి పద్యములు గద్యములు రచించెద ననుటయందును తిక్కనమాటలు వినవచ్చుచున్నవి.

మారనయందు నన్నయనడత కలదు; తిక్కనమాటతీరు కలదు :

తిక్కన రసశబ్దమును లాక్షణికార్థముననేకాక భావోత్కటదశ యనునర్థమున వాడియుండుట భారతరచనమున బ్రసిద్ధి. మారనయు నట్టి పలుకుబడిని పుక్కిటపట్టినాఁడు. శృంగారాదులపట్ల రసశబ్దప్రయోగము లక్షణసమ్మతము. మారన నవరసములకే కాక రసశబ్దము నిట్లు వాడినాఁడు.

1. కథాసుధారసము- అవ. 9. 2. హర్షరసము- అవ. 9; 3.361; 5.202; 301; 8. 212; 3. దైన్యరసము- 1. 84. 4. విస్మయరసము- 1. 272. 5. హేయరసము- 2.155. 6. ప్రమదరసము- 3.69; 5.163. 7. రాగరసము- 4.233. 8. ఉత్సవరసము-7.166. ఒకభావముయొక్క యుత్కటావస్థను రసశబ్దవాచ్యమొనర్చుట మారన పరిపాటి.

రసభావానుభావసాత్త్వికభావాదులను వర్ణించి చెప్పుటయందు మారనకవి తిక్కన శిష్యుఁ డనిపించును. "లజ్జాదైన్యసమన్వితలలితాపాంగదృష్టి (2.302); "సహర్షసలజ్జసవిస్మయేక్షణంబు నిగుడ" (2.315); "ఎలనవ్వు మొగంబు నలంకరింపఁగన్" (2.318);"నగవుతోడి యలుక మోమున కొక చెలు వొనర్ప" (2.334);"ప్రమదాశ్రుకణకలిత లోచనుండును, పులకితగాత్రుండును" (2.338); "మొగముపై శోకదైన్యముల్ ముసుఁగుపడఁగ" (3.11); "హర్షవిస్మయమగ్నులు"; "హాసము మోము నలంకరింపఁగా" (3.282); "పరమహర్షరసభరితహృదయుం డగుచు" (3.361)- అను ప్రయోగము లందులకు కొన్నినిదర్శనములు :

మారన వాడిన జాతీయములవలనను, నానుడులవలనను, అతనిశైలికి చక్కని దేశీయతయు, జిగిబిగువులును, తెలుఁగుజిలుగుసొంపును అమరివచ్చినవి. నన్నయనాటి కన్న తిక్కననాటికి తెలుఁగున వ్యాప్తికెక్కియున్న తెలుఁగుదసమును మారన తనశైలిలోఁ బ్రతిబింబించుకొనెను.

## మారన ప్రయోగించిన కొన్ని జాతీయములు :

దోరలు వెట్టినట్లు-అవ. 5: నానేర్చుగతిన్-అవ. 23; తాల్మిఁజించెదన్-1.21; ఘటదాసునిఁజేయుదు-1.21; వట్టిమ్రాకులుచివుళులువెట్ట-1.26. శోకము మూర్తమైన యటులు-1.172; హేయరసము మూర్తమైనయటులు-2.155; ఆదిగర్భేశ్వరి యగు నీ మహాదేవి-1.177; పోవగఁ గాళులాడమి-1.182; పదస్థుఁడసైతి-3.363; చెవులు చిడి ముడిపడియెడుఁ దివిరి వినఁగ-4.122; ఏగతిఁ బోదు దైవమా !-1.220; కరుణ నాన్పు మనంబున్-4.245; నేచేసినపుణ్య మెవ్వరును జేయరు-4.230; మొగముపై శోకదైన్యము ల్మొనుఁగువడఁగ-3.11; దగ్గుత్తిక వెట్టుచు-3.12; సుగతివారికిఁ దంగేటిజున్ను సుమ్ము-2.179; సుఖము లెప్పుడుఁ జాబ్బనచూఱలు-4.128; నమ్మ నెద నీవలుకు-4.217; అది జన్మఫలము కాదె-4.234; కోర్థు లంతకంతకును నెడఁగొనలు నిగుడ-5.7; అడవిఁ గాచిన వెన్నెలయయ్యె-5.8; ప్రోవ దిక్కు నీవె-5.135. ఇంత యొప్పమి సేయుదే యెఱుక మాలి-5.185; నిదాఘవేళ నగ్నినల్గడమండ-5.226; విపరేతపుకొడుక వైతివి-5 302; ఇంత కీడొనరింప నెత్తికొనునె-5.346; కడువింతలు పుట్టెనీతలన్-6.150; చూడ్కుల న్మిడుంగుఱు లెసఁగంగ-6.162; హర్షామృతంబు పొంగి యవలవెడల-7.62; మట్టి యూడలు దిగ్గిన మాడ్కి-7.171; మీఁద మిన్నువిఱిగి కూలినయట్లికరణి గుండె లవిసి కళవళించి-1.172; ఘోరవుఁజిచ్చిటు చీరఁగట్టెడిన్-1.152; వాక్యశిలలు చెవులఁ దాకిన-1.143; యుదరాగ్నికొనికాల-1.69; నీపెంపు బూడ్దబొట్టయ్యేనే-1.177; చుఱచుఱఁ గొఱవిం జూఁడినక్రియపలుకుట-1.199; పిడుగడచినవిధమున మేదిని ముడిఁగిపడియె-1.199; చెవులకుంజవిఁజూపవు-1.253; కడలేనిభాగ్యంబు; తొంటిభాగ్యంబు-3.362; కల యిట్లు నిక్కలయగునె ?-1.263: సూదికి రెండుమొనలు కలవె ?-1.166.

## కొన్ని లోకోక్తులు :

"మానుగ ధాత యొనర్చిన పెందెరువు మొఱుంగ నెవ్వరికిఁ దీరునె" - 1. 53. "దైవంబుఘటన యే మనవచ్చున్" -1.51. ''దైవకృతంబు మానవహతం బగునెట్లు''-1.90. ''బొంకుకంటెను జావైనఁ బొంక మనఘ ! - 1.198. ''ఈగరానియప్పు వగల నీనకున్నె :" - 1. 205. "శ్రుతికి శూద్రుఁ డర్హుఁ డగునె ?'' - 2. 304. "పతిఁ గడవంగ దైవతము భామల కెందును గల్గనేర్చునే'' - 3.28. ''గుణవిహీనుండు సప్రాణశవము'' 3. 71. ''సంగరుజకు నౌషధంబు సద్భుజన మిలన్'' - 3. 286. ''కలవే కామవ్యాధికి ముముక్షు గడచిన మందుల్-3.286. ''దయను బోలునె యొండు ధర్మమనఘ'' - 4. 245. ''పత్నిలేనివాఁ డెంతయు హీనుఁడు'' - 5.181.

మారన 'వెసన్' అన్నమాట నధికముగా నూతనపదముక్రింద ప్రయోగించె నని ఆరుద్ర యిట్లు వ్రాసినారు. "కొందరు కవులకు కొన్నిఊతపదాలు ఉంటాయి. తిక్కన

గారు 'తగన్' ఎక్కువగా వాడాడు. భావోద్వేగంఎక్కువగాఉన్న పద్యాలలో ఈమాట ఎక్కువగా కనబడుతుంది. ఊతపదమైనా అప్పుడప్పుడు చెవి కింపుగా ఉండేటట్లు దానిని ప్రయోగించడం జరిగింది. తెలుఁగునుడికారాన్ని అక్కడక్కడ 'చలదశ్వత్థదళంబు' భంగి '(1-155) అని సంస్కృతీకరించినా మారన జాతీయాలు, సామెతలు చక్కఁగా వాడేకవి.'[12]

మారనకవిత్వము - శైలి అనునంశముపై నాంధ్రసాహిత్యచరిత్రకర్తలలో కొందఱి యభిప్రాయములు గమనింపఁదగినవి :

1. "ఇతనికవిత్వము తిక్కనసోమయాజికవిత్వ మంత మధురముగా నుండదు గాని సలక్షణ మయినదిగాను, మృదువుగాను, ఉండును"[13] - కీ. శే. కందుకూరి వీరేశలింగముపంతులుగారు.

2. "మారనకవిత్వము సలక్షణమై మృదువుగా నుండును గాని తిక్కనకవిత్వముతోఁ బోల్పఁదగదు. ఈతని కవితాదృష్టి స్పష్టమైనదే కాని యగాధమైనభావములతోఁ గూడినది కాదు. కథలను సరళముగా నడపినాఁడు కాని కవి వర్ణనలతో నింపలేదు. మారన తిక్కనశిష్యుఁడైనను నతనిసంభాషణరచనాశిల్పము మాత్ర మితనికిఁ బట్టుపడలేదు. ఉచితశబ్దప్రయోగమును, భావౌచిత్యమునందుఁ గూడ నీతఁడు కేతనకుఁ గూడ సరిరాఁడు. మారనకవి తన మితమైనశక్తిని గుర్తెఱిఁగినవాఁడువోలెఁ దనకు మించిన పోకడలకు, బ్రయత్నింపక పరిమితమైనరచనతోఁ దృప్తి నొందినాఁడు. ఈతఁడు మానవప్రవృత్తియొక్కలోఁతును గుర్తించుటకు భావనావీథియందు విహరింపఁజూడలేదు. తనశిష్యుఁ డని చెప్పుకొని తిక్కన గర్వపడఁ దగినంతవాఁడు గాఁడు మారన.[14]

—శ్రీశిష్టా రామకృష్ణశాస్త్రిగారు

"తిక్కనామాత్యునిశిష్యుఁ డగుటకు మారనకవికి సర్వదా అర్హత కలదు. ఈతఁడు కేతనవలెనే మృదుమధురమైన కవిత్వము చెప్పనేర్చినవాఁడు. ధారాశుద్ధియు, అన్వయ సౌలభ్యము నీతనికిఁ జక్కఁగా నలవడినవి. తిక్కనసోమయాజి వర్ణనారీతులను, గమనికలను, చివరకు అతనిపదజాలమును కూడ మారనకవి చక్కగా అనుకరించి గురువునకు తగినశిష్యుఁ డనిపించుకొనెను.[15] —ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు.

పంతులుగారు మారన గురువునకు మించినశిష్యుఁడు కాఁడన్నను అతనికవిత్వము నందలి గుణమును మెచ్చుకొనిరి. శాస్త్రిగారు మారన గురువునకు గర్వకారి యగుశిష్యుఁడు కాడని తేల్చివైచిరి. మారనకవిత్వము తిక్కనకవిత్వముతోఁ బోల్పఁ దగ దని వీరియభిప్రాయము. ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు మారనను గొప్ప సహృదయుని దృష్టితోఁజూచి అతని కవిత్వమును నిష్పాక్షికమైన విధమున వివరించిచెప్పిరి. శాస్త్రిగారి యభిప్రాయముల కన్నింటికిని విరుద్ధములైన భావములు వీరివి. తనకు పూర్వము రచించిన

12. సమగ్రాంధ్ర సాహిత్యం. 2 సం. పుట 236. 13. ఆంధ్రకవులచరిత్ర. ప్ర.భా. పు 27
14. ఆంధ్రవాఙ్మయచరిత్ర సర్వస్వము—పుట 476—478.
15. ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము. పుట 42.

చరిత్రకారులు మారనలో నేగుణములు లేవో చెప్పియుండ శ్రీలక్ష్మీరంజనముగారు మారనలో నేగుణము లుండవలెనో అవి యె ట్లమరియుండెనో ఔచిత్య మెఱిఁగి విమర్శించి యుండిరి. సాహిత్యచరిత్రకారుని కిట్టిసహృదయ మైన వివేకదృష్టి యవసరము: ''గురువునకు తగిన శిష్యుఁ'' డనిన వీరినిర్ణయము సర్వజనామోదకరము.

మఱికొందఱిపండితుల యభిప్రాయములు :

(1) ''ఈకవి నన్నయభట్టును, దిక్కనసోమయాజిని గ్రంథాదియందుఁ బేర్కొనె''—''ఆయిరువురకవిత్వమువలె నీయన కవనమును మృదువును, సలక్షణమును, సరసమునగు''—అని శ్రీఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారు మార్కండేయపురాణమును ప్రప్రథమముగాఁ బరిష్కరించి ప్రచురించుచు పీఠికలో నుడివియున్నారు.

(2) "మారన గొప్పలాక్షణిక కవి. కవిత్వము సరళముగ శ్రావ్యముగ దేశీయములతో నిండియుండును. రసపోషణసంవిధానమున నీకవి తనలేఖినిని మనోభావప్రకటనమునకే వినియోగించుచుండును. మొత్తముమీఁద నీకవి కథాంశములఁ గ్లుప్తము సల్పి సముచితములగు వర్ణనలకుఁ దా వొసంగి కావ్యనిర్మాణ మొనరించుటలో మిగుల నేరుపు గలవాఁడు. వర్ణనాంశములకంటె కథాంశములకే యీకవి విలువ గల తనకావ్యమునఁ దా వొసంగును. ఈయంశమునను నీతఁడు తిక్కనసోమయాజిశిష్యుఁ డని చెప్పఁ దగినవాఁడే" ''...ధారాళముగ నీకవి కవితాధార తిక్కనసోమయాజి భారతకవిత్వమునకుఁ బోలిక కలదిగఁ గన్పట్టును. వర్ణనాంశములయందు ముఖ్యముగ సోమయాజి భారతభాగములను మనసున నుంచుకొని వ్రాసినటుల నుభయ గ్రంథములు సమగ్రముగ శోధించినఁ దోపకపోదు.'' అని మార్కండేయపురాణము (వావిళ్ళవారిప్రతి) నకు పీఠిక సంతరించిన శ్రీశేషాద్రిరమణకవులు పేర్కొనిరి. మారనకవిత్వమునుగూర్చి యింత వఱకు చెప్పినవారిలోఁ జక్కని సమన్వయమును, బహ్వంశపరిశీలనమును పీఠికారచనలోఁ బ్రదర్శించిన శేషాద్రిరమణకవు లగ్రగణ్యు లనుటలో విప్రతిపత్తి లేదు. తరువాతి విమర్శకుల కందఱకును వీరిపీఠిక ప్రమాణమై వెలసినది.

ఇందఱుసహృదయులు, విమర్శకులు మారన తాను తిక్కనశిష్యుఁడ నని చెప్పుకొనుటచేతనే కాక రచనాసామర్థ్యముచేతను తనయోగ్యతను నిలుఁవబెట్టుకొనె నని భావించుచున్నారు. నన్నయతిక్కనలప్రభావ మితనిపైఁ గల దని గుర్తించినారు. వారి శైలి కంటె నితనిశైలి కొంత భిన్నమైన దని యభిప్రాయపడినారు. దానికి సారళ్యము, ప్రసాదమాధుర్యములు, ధారాశుద్ధి, మొ॥ లక్షణములు ప్రధానము లని తేటపఱచినారు. కాని, ప్రథమమహాపురాణ మైన మారనమార్కండేయమున ఒకపురాణశైలికి పట్టముకట్టఁబడిన దని వివేకించుట జరుగలేదు. ఈవ్యాసమున మారనది అచ్చమైన ఆంధ్రపురాణ శైలి యని నిరూపించుటకు యత్నము జరిగినది. మారనశైలి నన్నయకవిత్వశీలమునకును, తిక్కనశిల్పసౌందర్యమునకును సంగమక్షేత్రమై మహిమ కెక్కిన దని దర్శించుట యైనది.

తెలుఁగుకవులకు మార్కండేయపురాణకథలపై మరులు కొలిపించినది మారన రచన. దాని సారభూతమైన చైతన్యశక్తి శైలి:

# మార్కండేయము మూలమైన తెలుఁగు కావ్యములు

పురాణములలో మార్కండేయమహాపురాణము నూతనకథావిస్తార మైన దని మారన కీర్తించుటయే కాక తత్కథామృతము ప్రకాశిత మగునట్లు తెలుఁగున రచించి ప్రశంసలకుఁ బాత్రుఁడయ్యెను. మారన పురాణశైలియు, కావ్యకళాశిల్ప నైపుణ్యమును, పురాణకథలకు కావ్యవస్తువులు కాఁదగినంత మహత్వమును గలిగించినవి. కావ్యరచనా మర్మజ్ఞులైన కవివరులు కొందఱీ మహనీయునివచఃశ్రీ వైభవమునకు ముగ్ధులై, ఇతనిచే వినిర్మింపఁబడిన పురాణకథలయం దాసక్తులై, మార్కండేయపురాణము నుపాసించుటయే కాక యందలి కథలను తమతమకావ్యములందు వస్తువులుగా గ్రహించి స్వతంత్రప్రబంధములను వెలయించుకొనిరి. ఇట్లు మార్కండేయపురాణము కొన్ని తెలుఁగుకావ్యములకు కథాభిక్ష పెట్టిన పెన్నిధి యైనది!

మార్కండేయపురాణమునందలి స్వారోచిషమనుసంభవవృత్తాంతము, కువలయాశ్వచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, మరుత్తరాట్చరిత్రము, దత్తాత్రేయమహిమాభివర్ణనము - అను నైదుకథలు తరువాతికవులచే కావ్యములుగా సంతరింపఁబడినవి. పది శతాబ్దముల తెలుఁగుసాహిత్యచరిత్రలోఁ బైకథలతో వెలసినకావ్యముల నన్నింటిని పేర్కొనుటయు, వానిని బ్రత్యంశపరిశీలన మొనర్చుటయు సాధ్యము కానిపని. కావున మార్కండేయపురాణకథలను గైకొని ప్రప్రథమమున కావ్యములుగాఁ దీర్చిదిద్దినకవులకృతులను విపులముగఁ బరిశీలించుట యగుచున్నది.

ప్రాచీనాంధ్రకవులు సంస్కృతాంధ్రములందు నిష్ణాతులై యుండుటచేతను, వారి కృతు లట్టిపండితులచే మెప్పువడయవలసి యుండుటచేతను తమకృతులకు మూలములైన పురాణకథలను సంస్కృతాంధ్రపురాణములను రెండింటిని లెస్సగాఁ బరిశీలించియే గ్రహించుచుండెడివారు. కావున మార్కండేయపురాణకథలకు కావ్యమూలములుగా మనము పరిశీలించునప్పుడు సంస్కృతాంధ్రపురాణములు రెండును మూలము లనియే స్థూలముగా గ్రహింపవలసియుండును. ఆపైన సూక్ష్మేక్షితతో పరిశీలించి యాతెలుఁగుకావ్యములపై మారనప్రభావ మెంత కలదో, మూలగ్రంథప్రభావ మెంత కలదో నిశ్చయింపవలెను ఇట్టివివేక మీభాగమున పాటింపఁబడినది

**కావ్యవర్గీకరణము :**

మార్కండేయపురాణకథలు మూలములుగా వెలసిన తెలుఁగుకావ్యముల[1] వస్తుస్వభావమును పరిశీలించినచో వానిని నాల్గువిధములుగా విభజింపవచ్చును.

1. మార్కండేయపురాణము ప్రత్యక్షమూలముగాఁ గల కావ్యములు.
2. ,, ,, పరంపరామూలముగాఁ గలకావ్యములు.
3. ,, ,, పరోక్షమూలముగాఁ గలకావ్యములు.
4. ,, ,, పాక్షికమూలముగాఁ గలకావ్యములు.

1. మార్కండేయపురాణము ప్రత్యక్షమూల మైన కావ్యములలో మొదట లెక్కింపఁదగినది అల్లసాని పెద్దనకవి రచించిన స్వారోచిషమనుసంభవము. ఈమనుసంభవ వృత్తాంతము మార్కండేయపురాణమునందు మాత్రమే కలదు. దానిని అల్లసాని పెద్దన యథాతథముగా గ్రహించి వస్తుస్వరూపస్వభావములు చెడని కొన్నిస్వీయకల్పనలు చేసి రసవత్ప్రబంధముగా నిర్మించెను. మనుచరిత్ర వెలసినతరువాత మార్కండేయపురాణాంతర్గతగాథ మఱుఁగుపడినది. కావున నీప్రబంధకథామూలమునుగూర్చి విపులముగాఁ జర్చింపఁబడును.

మనుచరిత్రకువలెనే సవరము చిననారాయణకవి విరచిత కువలయాశ్వచరిత్రమునకుఁ గూడ మార్కండేయము ప్రత్యక్షమూల మగును. చిననారాయణకవి పురాణవస్తుస్వభావము తాఱుమాఱగునట్టి కల్పనలు చేసి కథను స్వీయాభిమతానుసారము తీర్చిదిద్దెను. కాని, అల్లమరాజు రామకృష్ణకవి మదాలసాపరిణయ మను కావ్యమున చిననారాయణకవి వలె నతిస్వాతంత్ర్యము వహింపక మూలమున కనుగుణ మైన కొన్ని కల్పనలు చేసి కథను రచించెను. నవ్యులు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు మదాలసావివాహ మను కావ్యము రచించి, యందు మార్కండేయపురాణాంతర్గతకథలోని కొన్నిలోపములఁ దొలఁగించి, కొన్నిటి నౌచిత్య మెఱిఁగి కల్పించి, పూరించి వస్తుసమగ్రతను సాధించిరి. కువలయాశ్వచరిత్రమునకు మార్కండేయము ప్రసిద్ధి. ఆకథకు భిన్నముగా నెట్టికల్పనలు చేసి తెలుఁగుకవులు కావ్యములు నిర్మించినను వానికిఁ బ్రశస్తి రాలేదు. కావున నవ్యులు మఱల నాపురాణకథనే కావ్యవస్తువుగ గ్రహించిరి.

తెలుఁగున మనుచరిత్రము మూలము నంటిపెట్టుకొని యేపుగఁ బెరిగినది. కువలయాశ్వచరిత్రము శాఖాచంక్రమణము చేసి చివరకు మూలము నాశ్రయించినది. మొదటిది మూలముకంటెఁ బ్రసిద్ధి కెక్కినది. రెండవది మూలకథాప్రశస్తితో గౌరవము పొందుచున్నది.

2. మార్కండేయపురాణము పరంపరామూల మైన కావ్యములు హరిశ్చంద్ర చరిత్రములు. ఋగ్వేదకాలమునుండియు హరిశ్చంద్రునికథ ప్రసిద్ధమై యున్నను, మార్కండేయపురాణాంతర్గత మైన సత్యవ్రతనిష్ఠాప్రధాన మైన కథకు లోకమున నెనలేని

1. కావ్యము లనఁగా శ్రవ్యము లనియే యిందు గ్రహింపఁబడినది.

వ్యాప్తి సిద్ధించినది. ఇప్పుడు హరిశ్చంద్రుఁ డనిన సత్యహరిశ్చంద్రుఁడే. అట్టికీర్తి ఆరాజునకు మార్కండేయపురాణకథవలనఁ గలిగినది. హరిశ్చంద్రునికథ యీయొక పురాణముతో నాగలేదు. దేవీభాగవత, శివ, వాయు, సౌర, కూర్మ, బ్రహ్మవిష్ణ్వాది పురాణములయందు కానఁబడుచున్నది. వానిలో దేవీభాగవతము ఋగ్వేదపురాణకథలను కలిపి కొన్నిక్రొత్తకల్పనలు చేసినది. ఇట్లితరపురాణములు చేసినకల్పనలుకూడ కలిసి మార్కండేయపురాణకథ సంస్కృతపురాణవాఙ్మయమునందే కొంతవిస్తృతిఁ జెందినది. ఆంధ్రకవులు సంస్కృతపురాణములందు పరంపరగా వచ్చుచున్న నీకథకు తమకావ్యము లందు స్వీయకల్పనలు కొన్ని జోడించి నిర్మించుచు వచ్చిరి. ఇట్టికవులలో మొదట నెన్నఁదగినవాఁడు గౌరన. గౌరన హరిశ్చంద్రచరిత్రము తెలుఁగున సంపూర్ణత నందు కొనిన హరిశ్చంద్రోపాఖ్యానము. అతనితరువాత నాకథను చేపట్టిన కవులందఱును గౌరన నిర్మించిన కథ నాదర్శముగాఁ గొనినవారే. గౌరన (క్రీ. శ. 1385-1445) తరువాత క్రీ.శ. 18వ శతాబ్దివఱకును వెలసిన హరిశ్చంద్రచరిత్రలను రచించిన కవులు:

1. చంద్రమౌళికవి. (క్రీ. శ. 1480 - 1530)
2. శంకరకవి. (క్రీ. శ. 1511 - 1543)
3. దేవరాజభట్టు. (క్రీ. శ. 1560 సం॥కు పూర్వము)
4. రామరాజభూషణుఁడు. (క్రీ. శ. 1580 సం॥ తరువాత)
   —హరిశ్చంద్రనలోపాఖ్యానము - ద్వ్యర్థికావ్యము.
5. కంచి వీరశరభకవి. (క్రీ. శ 16వ శతా. చివర లేక 17వ శతా. ఆరంభము)
6. కామినేని మల్లారెడ్డి. (షట్చక్రవర్తిచరిత్ర) (క్రీ. శ. 1600 ప్రాంతము)
7. వెన్నెలకంటి చంద్రశేఖరకవి. (క్రీ. శ. 1700 ప్రాంతము)
8. కనకబంటి గట్టయ్య. (క్రీ. శ. 18వ శతాబ్ది)

వీరిలో—చంద్రమౌళికవి హరిశ్చంద్రచరిత్రమును పద్యకావ్యముగా రచించినట్లు ప్రబంధరత్నావళిలో రామాప్రెగ్గడ జగ్గన యుదాహరించిన యొకపద్యమువలనఁ దెలియు చున్నది. ఇతనికాలముకాని నివాసస్థలముగాని యితరవిషయములుగాని తెలియవచ్చుట లేదు. దొరికిన యొకపద్యమునుబట్టి కావ్యకథాస్వరూపము తెలియుట లేదు. సాహిత్య చరిత్రకారు లితఁడు క్రీ. శ. 1480 - 1530 సం॥ల నడుమ నుండియుండవచ్చు నని భావించుచున్నారు.[2]

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులవారు కూర్చిన ప్రబంధరత్నావళిలో దేవరాజభట్టు రచించిన హరిశ్చంద్రచరిత్రమునుండి గ్రహింపఁబడిన రెండుపద్యము లుదాహరింపఁబడినవి. అయోధ్యాపురవర్ణన మాపద్యములందలి వస్తువు.[3] వాని నాధారముగాఁ గొని యాతఁ డాకావ్యమును స్వతంత్రముగా నిర్వహించెనో, గౌరన ననుకరించెనో, మార్కండేయ పురాణప్రభావము దానిపై నెంత కలదో చెప్పుట దుర్లభము.

2. ఆంధ్రకవితరంగిణి. 8వ సం॥ పుట 72-77. 3. ఆంధ్రకవితరంగిణి 8సం॥పుట 77-78,

వెన్నెలకంటి చంద్రశేఖరకవి హరిశ్చంద్రచరిత్రమును పద్యకావ్యముగా రెండు భాగములలో రచించె ననియు, నతనికాలము క్రీ. శ. 1700 ప్రాంత మనియు గోలకొండ కవులసంచికద్వారమునఁ దెలియుచున్నది. కనకబంటి గట్టయ్య క్రీ. శ. 18వ శతాబ్దిలో నేలకొండపల్లియందు నివసించి హరిశ్చంద్రకథను ద్విపదలో రచించె నని గోలకొండ కవులసంచికవలనఁ దెలియుచున్నది.

మిగిలినవానిలో శంకరకవి హరిశ్చంద్రకథకు ప్రసిద్ధి కలదు. రామరాజ భూష ణునికృతి ద్వ్యర్థికావ్యము క్రీ. శ. 18వశతాబ్దితరువాతి హరిశ్చంద్రచరిత్రములన్నియు గతానుగతికములే. ఆంధ్రమున వెలసిన హరిశ్చంద్రచరిత్రలు మొత్తమునకు గౌరన కావ్యకథ ననుసరించినవే కావున వాని కన్నింటికిని మార్కండేయపురాణమును మూల ముగాఁ జెప్పుటకు వీలులేదు. కావున వాని విమర్శ యిందుఁ జేయఁబడుటలేదు. కాని, ఎడనెడ వానిపైఁ బురాణప్రభావ మున్నదని తోచినయంశములను మాత్రము పేర్కొనుట జరిగినది. నవ్యులు వడ్డాది సుబ్బరాయకవి రచించిన చండకౌశికనాటకమువంటివి సంస్కృతపురాణ హరిశ్చంద్రకథావస్తువు గల సంస్కృతచండకౌశికమునకు ఆంధ్రానువాదములు. అవి రూపకము లగుటచే నిందు పరామర్శింపఁబడుటలేదు.

3. హరిశ్చంద్రాదుల పూర్వజన్మవృత్తాంతములను చిత్రించు కావ్యము ఉత్తరహరిశ్చం ద్రోపాఖ్యానము. అద్భుతావహము లైన యీకావ్యకథలన్నియు హరిశ్చంద్రవృత్తాంతము నాధారముగాఁ జేసికొని కల్పింపఁబడినవే. అందు యముఁడు కాశిలో చండాలజన్మ మెత్తు టకు హేతువైన కథాకల్పనము మార్కండేయమునందలి వైవస్వతమనుగాథకు తుల్య ముగా నుండుట గమనింపఁదగినయంశము. ఈకథనుమాత్రమే గణించినచో పురాణ మును పాక్షికమూలముగాఁ జెప్పుటకు వీలున్నను, కథాసర్వస్వదృష్టితో మార్కండేయము దీనికి పరోక్షమూల మని గ్రహింపఁబడినది. ఇట్టికృతులకు ఆద్యుఁడు తక్కెళ్లపాటి లింగనమంత్రి. తరువాతికవులు చాలమంది ఈకావ్యమును బహువిధప్రక్రియలలో నిర్మించి యుండిరి. వాని కన్నింటికిని లింగన మంత్రి కావ్యకథయే ప్రమాణము. కావున లింగన మంత్రి కావ్యమునకు పురాణ మెట్లు మూల మయ్యెనో విశదపఱచుట యగుచున్నది.

4. మార్కండేయము పాక్షికమూలముగా వెలసిన రెండుకృతులు మరుత్తరాట్ దత్తా త్రేయచరిత్రములు. శ్రీనాథుని మరుత్తరాట్చరిత్రము లభించుట లేదు. కావున శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికృతియే యీవిభాగమున సమీక్షింపఁబడుచున్నది. దత్తాత్రేయయోగి చరిత్రము జడోపాఖ్యానాంతర్గతము. ప్రాచీనులు రచించిన దత్తాత్రేయచరిత్రము లెవ్వియు లభించుటలేదు. 18వశతాబ్దిపూర్వార్ధమునఁ గల వెలగపూడి కృష్ణయ్యకవి తనభానుమ ద్విజయకావ్యమున నతనిపూర్వీకులు రచించినకృతులలో దత్తాత్రేయచరిత్రము కల దని చెప్పుకొనినట్లు కలదు. కాని, దానిస్వరూప మెట్టిదో తెలియదు. నవ్యులలో శ్రీతాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు తమ శ్రీదత్తభాగవతమున మార్కండేయపురాణమునందలి జడోపాఖ్యానకథను గ్రహించి మూఁడాశ్వాసములు రచించిరి. ద్వాదశాశ్వాసవిస్తృత మైన శ్రీదత్తభాగవతమున మార్కండేయపురాణాంతర్గతగాథ పాక్షిక మగుటచేతను, పై

మరుత్తరాట్చరిత్రమునందును ఏతత్పురాణకథ పాక్షికమై యుండుటచేతను ఈకృతులకు మార్కండేయము పాక్షికమూల మగుచున్నది.

ఇట్లు వస్తుతత్త్వమును బట్టియు, కవులు కథలను గ్రహించిన విధమును బట్టియు మార్కండేయపురాణముయొక్క కావ్యకథామూలార్హతను నిశ్చయింప వీలగుచున్నది. ఇన్నికృతులకు మూలమైన మార్కండేయము సుకృతి.

శేషాద్రిరమణకవులు తమమార్కండేయపురాణ''ప్రస్తావన"లో మట్లు అనంత భూపాలుని బహులాశ్వచరిత్రమునకుఁ గూడ మార్కండేయము మూల మనిరి. దానిని యథా తథముగా ఆరుద్రగారును ప్రస్తావించిరి. కాని, యది ప్రమాదవశమునఁ జెప్పినమాటగా గ్రహించుట లెస్స! బహులాశ్వుఁ డను భక్తు నింటికి విష్ణువు విం దారగింపవచ్చిన కథ యిందలివస్తువు. ఆకథ మార్కండేయపురాణమున లేదు. అస లిట్టి ముగ్ధభక్తులగాథ లీపురా ణమున కానరావు. శేషాద్రిరమణకవు లా' ప్రస్తావనలోనే 'ప్రౌఢకవి మల్లన తన రుక్మాం గదచరిత్రమున వర్ణించిన యమలోకవర్ణనముకూడ మార్కండేయపురాణములోని ద్వితీ యాశ్వాసమునుండి సంగ్రహింపఁబడిన దని వివిధాధారములచే స్థాపింపవచ్చు నని పేర్కొనిరి. కాని, ఆయాధారము లేవియో తెలిపి వివరించియుండలేదు. ఈయంశమున కుపబలకముగాఁ గొన్ని యుపపత్తు లిచ్చుటఁ జూపుట యగుచున్నది.

మార్కండేయపురాణము :

 మ. అతిథిం గాలసమాగతు న్ననబుభుక్షార్తుం బథిశ్రాంతు నా
తతమార్గోత్థితధూళిధూసరితగాత్రస్వేదబిందూత్కరా
న్వితు నజ్ఞాతకులాభిధానుఁ గని యవ్విప్రు న్మహాత్ముం బ్రజా
పతిగా నాత్మఁ దలంచుచు న్సుముఖుఁడై భక్తిన్ బ్రయత్నంబునన్. (3.156)

రుక్మాంగదచరిత్రము :

సీ. అధికదూరాయాతు నజ్ఞాతకులుఁ బథశ్రమసముద్భవఘర్మజలసమగ్రు
ధూళిధూసరిత గాత్రుని క్షుధామధ్యాహ్నకాలసమాగతక్ష్మాసురవ్వ
నల్లంతటనె చూచి యతనికులాచారవర్తన లరయకే మూర్తి నున్న
శ్రీవిష్ణు వని యాత్మఁ జింతించి యత్యంతభయభక్తి వినయసంభ్రమము లెసఁగ

తే. నెదురుగాఁ దోడుకొని వచ్చి యుదక మిచ్చి
యాసనం బిచ్చి యన్నపానాదు లొసఁగి
విశ్రమింపంగ ననుపు గావింపవలయుఁ
బగటివేళయు మాపు నభ్యాగతులకు. (2.67)

(మార్క. 3.157 కూడ పోల్పఁదగినదే).

మఱియు—మార్క. 2.67 నకును రుక్మాంగద. 1.66నకును, కొంతసామ్యము కలదు. కాని, మార్కండేయమే రుక్మాంగదచరిత్రమునందలి నారకబాధలవర్ణనకు మూల

మనుట కీయుపపత్తులు చాలవు. నరకవర్ణనము సర్వపురాణసహజము. మార్కండేయమున రౌరవాదినరకవర్ణనము ప్రసిద్ధము. అట్టివర్ణనప్రసక్తి యీకావ్యమున లేదు.

మార్కండేయపురాణమున సప్తశతి కలదు. దానికిని దేవీభాగవతకథకును, కొన్ని పోలికలు కలవు. ఐనను తెలుఁగున రచింపఁబడిన దేవీభాగవతములకు మూలము సంస్కృత దేవీభాగవతముగాని మార్కండేయము కాఁజాలదు. కావున ఆంధ్రదేవీభాగవతములకు మూలముగ మార్కండేయమును గ్రహింపలేదు.

ఇట్టి ప్రణాళికతో నీవిభాగమున మార్కండేయపురాణగాథలు మూలములుగా వెలసిన తెలుగుకావ్యములసమీక్ష చేయఁబడుచున్నది.

ఇన్ని తెలుఁగుకావ్యములకు మూలమైన మార్కండేయమును ప్రథమముగాఁ తెలుఁగున ననువదించిన మారనను పైనఁ బేర్కొనిన కవు లెవ్వరును స్మరింపలేదు. మారన చేసికొనిన దురదృష్ట మది ! కాని, ఆయాకవుల కావ్యములను బఠించి మననము చేసికొనుచున్న సహృదయుల హృదయరంగములందు మారనమధురమూర్తి స్ఫురింపక పోదు ! అదియే మారన చేసికొనిన యదృష్టము ! కవులమాటలలో బైటపడకుండ కవిచిత్తములను దోచుకొనిన గడుసరి మారనమహాకవి !

# మనుచరిత్రము

## శ్రీకృష్ణదేవరాయలు – అల్లసాని పెద్దన :

పదునాఱవశతాబ్ది ప్రథమపాదమున విద్యానగరసింహాసన మధిష్ఠించిన శ్రీకృష్ణదేవరాయలు సాహితీసమరాంగణసార్వభౌముఁడు; సంస్కృతాంధ్రప్రబంధనిర్మాత; రాజకవి; కవిరాజు. అతని యాస్థానకవులలో నగ్రగణ్యుఁడు - అల్లసాని పెద్దన. ఆకవిచంద్రుఁ డనిన నారాజశేఖరున కపారమైన యాదరము. ఎదురైనచో మదకరీంద్రము డిగ్గి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియు, కోకటగ్రామా ద్యనేకాగ్రహారముల నిచ్చియు, 'ఆంధ్రకవితాపితామహ' యని నోరార బిలచియు, కవిబిరుదగండపెండేరము స్వయముగా నాతనిపాదమునఁ దొడిగియు నామహాకవి నెన్నియోవిధముల గౌరవించెను. పెద్దనకవీంద్రుఁడుకూడ రాయలను స్వీయసరసప్రబంధరచనాప్రావీణ్యముతో నిర్మించిన కవితాసామ్రాజ్యమునకుఁ బట్టభద్రుని గావించి కృతజ్ఞత వెల్లడించెను.

కీర్తికాము లైన చక్రవర్తులు తటాకాది సప్తసంతానములు పుడమిపై నిలుపుట లోకపరిపాటి. సాహితీసమరాంగణసార్వభౌమునిచిత్తము అనశ్వర మైన కావ్యసంతానము నభిలషించినది. శిరీషకుసుమపేశల మైన యొకకావ్యమును రచించి యిమ్మని రాయలు పెద్దనార్యునిఁ బ్రార్థించినాఁడు. రాయలు గీర్వాణాంధ్రభాషాసుధాపయోనిధిని బుద్ధిబాహువిక్రమమునఁ దరియంగ నీదిన మనీషి; పురాణశాస్త్రాగమేతిహాసకావ్యార్థములను సంతతము మననమునం దుంచుకొనిన మనస్వి. అందువలననే యత్యంతపేశలమైన కావ్యమును సుధామధురము లైన యుక్తులను గోరుకొనినాఁడు. రసప్రవణ మైన యతనిబుద్ధికి రససిద్ధుని వాక్కుకాని యానందసిద్ధినిఁ గల్పింపదు కాబోలు !

అష్టాదశమహాపురాణములందు ధర్మశాస్త్రనిర్మాత లైన చతుర్దశమనువులచరిత్రములు కీర్తింపఁబడియున్నవి. ప్రత్యేకించి మార్కండేయమహాపురాణమున నిట్టికథ లతివిస్తృతముగాఁ జెప్పఁబడియున్నవి. ధర్మజిజ్ఞాసు వైన ప్రభువు వానినిఁ దప్పక పఠించును. అవి మిత్రసమ్మితముగాఁ జెప్పఁబడిన పురాణగాథలు. వానిలోఁ బెక్కు ధర్మరహస్యము లిమిడియుండును. వానిని సమన్వయించుకొనుటకు - అతుల పురాణాగమేతిహాసకథార్థస్మృతి కావలెను. లోకహితైకబుద్ధు లైన పురాణకర్తలు విశ్వశ్రేయోరూప మైనధర్మమును మహిమాన్వితము లైన తమవాక్కులచే నిపుణముగాఁ బ్రబోధింతురు. అట్టివారి హృదయములను వ్యాఖ్యానించుటకు సూక్ష్మబుద్ధితోఁగూడిన చతురవచోనైపుణ్యము కావలెను. అట్టిది కవితాకళాతపస్వికిఁ గాని సాధ్యము కాదు.

రాయ లిట్టి విశిష్టలక్షణము లాంధ్రకవితాపితామహునియందు దర్శించినాఁడు. రాజు ధర్మ జిజ్ఞాసువు; మహాకవి మహాపురాణతత్త్వార్థప్రవక్త : ఇది వారిరువురకును నుండిన (ఉండఁ దగిన) సంబంధము. దానిని బురస్కరించుకొని రాయలు పెద్దన నిట్లు సంభావించెను :-

కం. హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్.

కం. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసనమంచిత కథలన్
విన నింపు కలిద్వంసక
మనఘ : భవచ్చతురరచన కనుకూలంబున్. (మను. 1.15,16)

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పు - మని కర్పూర తాంబూల మిచ్చెను; కృతిపతియై కృతార్థుఁ డయ్యెను.

స్వారోచిషమనుసంభవ కావ్యరచనమునకుఁ బెద్దన నెన్నుకొనుటలో రాయ లౌచిత్యము పాటించెను. కావ్యవస్తువు పౌరాణికమైనది. కథమాత్రమే కావలయు నని నచోఁ బురాణము చదువుకొనినఁ జాలును. కాని, రాజు ఆపురాణకథనే పెద్దనగారి శిరీషకుసుమపేశలసుధామయోక్తులలోఁ బ్రబంధముగా వినఁదలఁచినాఁడు. అట్టి రస వత్తరసుకుమారవాగ్వృత్తి పెద్దనసొత్తు. స్వల్పమైన కథార్థముల నిచ్చినను వానిని స్వయంప్రతిభతో స్వాయత్తము చేసికొని, రమణీయ మగు పునస్సృష్టి చేసి, మహాకావ్య ముగా నిర్మించెడి శిల్పశక్తి యతనిప్రత్యేకత : తెలుఁగున నిట్టి కవితాకళానైపుణ్య మతని నాంధ్రకవితాపితామహు నొనర్చినది.

## స్వారోచిషమనుసంభవకథ పెద్దనగారి చతురరచన కనుకూల మైనది :

స్వారోచిషమనుసంభవకథ పెద్దనగారిచతురరచనమున కనుకూల మైనదని రాయలు పేర్కొనెను. చతురరచన మనఁగా నిపుణమైన కూర్పనియు, నేర్పరితనముతో నొనర్చు కావ్యనిర్మాణ మనియు స్థూల మగు నర్థ మేర్పడుచున్నది. రాయలు పెద్దనను జతురవచో నిధి యనియుఁ బ్రశంసించెను. అనఁగా నిపుణమైనవాక్కుల కతఁడు కాణాచి వంటివాఁ డని తాత్పర్యము. శిరీషకుసుమపేశలసుధామయోక్తులఁ గృతి రచింపు మని కోరెను. అనఁగా నతనివాక్కులు మృదుమధురము లనియు, వానియందు సహజముగా సౌకుమార్య మాధుర్యగుణములు భాసించు ననియు భావము.

పైమూఁడుసందర్భములందును రాయలు పెద్దనయొక్క ఉక్తిచాతుర్యమును గీర్తించెను. చతురపేశలశబ్దములు సమానార్థకములు. 'చతతే కాంక్షతే ప్రయోజన మితి చతురః' 'పింశతి అవయవో భవతి కార్యేషు ఇతి పేశలః' అని గురుబాలప్రబోధిక. అనఁగా నుద్దిష్టమైన యేకపరమప్రయోజనమ్మునకు సాధనభూతుఁడైన వాఁడు చతురుఁడు.

అట్టి లక్షణము కలిగినది చతురవాక్కు. అట్టివాక్కుచేత కవి సాధించునది రసము. "సాధ్యోహి రసో యథా తథం కవిభిః"- అని నన్నయగారి నిరూపణము. రససిద్ధిని గాంక్షించి తత్సాధకముగా శబ్దమును బ్రయోగించుట చాతుర్యము. అది ప్రతిభావంతుఁడైన కవి యొక్క యుక్తివైచిత్రి నాశ్రయించి యుండును. ఉక్తివైచిత్రు లనంతములు. ఉక్త మగు తాత్పర్య మొక్కటి యైనను వక్తృవ్యక్తిత్వమును బట్టి యది బహువిధములుగా భాసించును. చంద్రోదయాది వర్ణన లెందఱు కవులు పూర్వ మొనర్చియుండలేదు?" నవ్వు లెందఱు చేయుచుండుట లేదు? భావికవు లెందరు చేయరు? అవియన్నియు నిత్య నూత్నములుగా నుండి యాస్వాదనీయము లగుటకు కవుల యుక్తివైచిత్రియే ముఖ్య కారణము. అది శబ్దములందును, వాక్యములందును, ఛందము లందును, అలంకారము లందును, వర్ణనములందును, కథాకథనము నందును-ఇట్లే సమస్తకావ్యరచనాంగము లందును వ్యాపించి, వానిని రసప్రసాధనచతురముల నొనర్చును. కావున ప్రతిభాన్విత మైన యుక్తివిశేషము రసపర్యవసాయి యగుటయే కవిత్వరచనము. కవ్యుక్తి రసాస్వాదన సాధువై యుండవలె నన్నచో శిరీషకుసుమమువలెఁ బేశలమును, సుధామధురమునై యుండవలె నని రాయలహృదయము.

రాయలనిర్దేశమే కాక పెద్దనకుఁగూడ కవిత్వలక్షణములఁగూర్చి యట్టియభిప్రాయ ములే యున్న ట్లతని వని చెప్పఁబడుచున్న రెండుచాటువులవలనఁ దెలియుచున్నది. "పూతమెఱుంగులున్" అను ఉత్పలమాలికావృత్తమునందుఁ బెద్దన 'జిల్లునఁ జల్లవలెన్ మనోహరద్యోతక గోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసారాతిరసప్రసారరుచిర ప్రతి మంబుగ సారెసారెకున్"-అని ప్రతిపాదించి తనరసపక్షపాతమును బ్రకటించెను. అట్టి రససిద్ధి సాధించుట కుపకరించు కవిత్వలక్షణములఁగొన్నింటి నాపద్యముననే నిర్దేశించెను. అవి: 1. జగునిగ్గు నెనగా వలె. 2. గమ్మన గమ్మనన్ వలెను. 3. రాతిరియున్ బవల్ మరపురాని హొయల్ చెలియారజంపు నిద్రాతరితీపులం బలెను దారసిలన్వలె లోఁ దలంచి నన్. 4. సొగసు కోర్కులు రావలె నాలకించినన్. 5. చేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్నిపొన్నిమేల్మాతల చన్నుదోయివలె ముచ్చట కావలె పట్టిచూచినన్. 6. వాచవి కావలెఁ బంట నూదినన్. 7. హరువు మొల్లము గావలె. 8. చేతము చల చేయవలె. ఆతఁడే మఱియొక పద్యమునఁ గవిత్వమును గుఱించి యిట్లు చెప్పెను.

చ. "ఘనతర ఘూర్జరీకుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతి తేఁటగాక-అరచాటగు నాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుతనంబును లేకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్."

ఈలక్షణము లన్నింటినిఁ గ్రోడీకరించినచో ని ట్లేర్పడును: కవిత్వము కాంతిమంత మైన బిగువు గలిగి గుప్పున సుగంధము వలె నర్థబోధ కలిగించి హృదయతర్పణ మొనర్ప వలెను. యువతీవక్షోజములవలె నాతికఠినములును, నాతిగూఢములునైన పదభావబంధ

ములు కలిగి, శ్రవణమాత్రముననే రమణీయార్థస్ఫూర్తి కల్పించి, ప్రియురాలినిగూర్చిన విరహమువలె సంతతము నాలోచనామృతమును వర్షించి, యధికమనోజ్ఞమై, చదివిన కొలఁది చవు లూరించుచు, చిత్తశాంతి కల్పింపవలె నని పెద్దనయాశయము. "అల్లసాని వానియల్లికజిగిబిగి" యనుచాటువులోని జిగిబిగి పైనఁ జెప్పిన 'జగ్గునిగ్గు'న కెన యైనదే. రెండవచాటుపద్యమునందలి భావము మొదటిదానిలోని యైదవలక్షణమున కొకవిధముగా విస్తరణరూపమే యైనను దానియం దుండఁదగిన నాతిగూఢతయు, నాతిసారళ్యమునుఁ బ్రత్యేకముగాఁ జెప్పుచున్నది. అతిగూఢతవలన నర్థస్ఫూర్తి మంద మగును. అతి సారళ్యమువలన వ్యంగ్యవైభవము చెడును. కావున నాపాతమధురమును, ఆలోచనామృతమును నైన విశిష్టపదరచనము కవిత్వ మగు నని పెద్దన యభిప్రాయము. అతఁడు తనకావ్యరచనమున నేతల్లక్షణలక్షిత మైన యొక వినూత్నశైలిని నిర్మించు కొనెను. "ఆడంబరము లేని గాంభీర్యము, సౌమ్య మైన ప్రాభవము, ఉద్వేగము లేని శీఘ్రగమనము, పేలవత్వము లేని స్వాభావికత, వెలితి లేక నిండారి మెరుగులు దీరిన పదగుంఫనము ఈకావ్యశైలికి ముఖ్యలక్షణము" లని ఆచార్య శ్రీపింగళి లక్ష్మీకాంతము గారు చక్కఁగ నిరూపించినారు.[1] దీనినే రాయలు మృదుమధురోక్తులతోఁ గూడిన చతురరచన మని కొనియాడినాఁడు.

పెద్దనకు సుమారు రెండువందలసంవత్సరములకుఁ బూర్వమే మారన మార్కండేయపురాణము తెలుఁగు చేసెను. దానిని నాగయగన్నసేనాని కృతి యందుకొనెను. ఆకృతిభర్తయు రాయలవలెఁ గృతికర్తయొక్క వచోవైభవమును గీర్తించెను. వారిరు వురివాక్యములందును గొంతసామ్యము భాసించుచున్నది. నాగయగన్నసేనాని మారనను సత్కరించి యాతనితో నిట్లనెను :

శా. పాండిత్యం బమరం బురాణముల ము న్పౌరాణికుల్ సెప్పఁగా
వింటి న్నింతలు గావు; నూతనకథావిస్తార మై యోగ్య మై
చండాఘోత్కరహారి యై పరమవిజ్ఞానాశ్రయం బైన మా
ర్కండేయాఖ్యమహాపురాణము వినం గౌతూహలం బయ్యెడున్.

ఉ. కావునఁ దత్పురాణము ప్రకాశితసారకథామృతం బొగిం
ద్రావి జగజ్జనంబు లలర న్రచియింపు తెనుంగున న్వచః
శ్రీవిభవంబు పెంపు విలసిల్లఁగఁ, గోవిదు లిచ్చ మెచ్చి సం
భావన సేయఁ జారుగుణభాస్వర! మారయసత్కవీశ్వరా!

మా. మార్క. అవ. 14, 17

గన్నయ పూర్వము పౌరాణికులు పురాణములను దమపాండిత్యప్రకర్షను వెలార్చుచుఁ జెప్ప నెన్నియోసారులు వినెను. కాని, వానియందు నూతనత్వము గాని, యపూర్వత కాని కనుపింపలేదు. మార్కండేయము ఇతరపురాణములందు లేని పెక్కునూతనకథ

1. తెలుఁగు విజ్ఞానసర్వస్వము - సంస్కృతిసంపుటము.

లచే విస్తారమై, పాపసంహారియై, విజ్ఞానప్రద మై, శ్రోతృజనకుతూహలమున కాస్పద మై యొప్పుచున్న దని యతఁడు గుర్తించెను. వింతలు కాని పౌరాణికవచస్సులను విని విని విసిగి వేసారిన యవ్వివేకి మార్కండేయునఁ బ్రసిద్ధి కెక్కిన సారవత్కథ లనెడి యమృతమును జగజ్జనము లలరునట్లు వర్ణించి చెప్పెడి కవిరసవాక్కులకొఱ కన్వేషించినాఁడు. మారన సత్కవీంద్రునియం దవి లభించినవి. అతని కాపురాణకథలను వచశ్శ్రీవిభవంబు పెంపు విలసిల్లఁ దెనుఁగున వచియింపు మనినాఁడు. మారన వచశ్శ్రీవిభవవుఁడు. పెద్దన చతురవచోనిధి. తాత్పర్యమున నిద్దఱివాక్కులును సజాతీయములే. మారన తనవచోవైదగ్ధ్యమును వెలార్చి యుపాఖ్యానములను రసశిల్పబంధురములుగాఁ దీర్చిదిద్దెను. ఈయంశ మాఖ్యానశిల్పాధ్యాయమునఁ బ్రపంచింపఁబడినది. మారనది పౌరాణికశైలి. మహాభారతమును రచించిన నన్నయతిక్కనలరచన లతని కొఱ్జబంతులు. నన్నయగారి ప్రసన్నధారామధుర మైన సరళసంస్కృతసమాసరచనము, రుచిరార్థసూక్తిమత్త్వము, తిక్కనగారి రసానుకూల రీతీవిన్యాసము, తెలుఁగుపలుకుఁబడులసొంపు మారన గ్రహించెను. సౌకుమార్యమాధుర్యములు మారనఉక్తులకు నైజగుణము లయ్యుఁ బెద్దన వానివలె నాలంకారికోక్తిప్రౌఢిమకుఁ దావలములు కాక సరళగాంభీర్యములకు నెలవు లై భాసించినవి. కథాకథనమునకును, ధర్మప్రతిపాదనమునకును సమానప్రాతినిధ్యము నీయవలసిన నీపౌరాణికకవి యలంకారవర్ణనాబహుళమైన ప్రబంధరచనము చేయలేదు. కాని, నిరలంకారమయ్యు నలంకారరమ్యత నందగించు నుక్తిచమత్కృతిచేఁ గావ్యార్థములను రమణీయ మొనర్చెను. అట్లు చేయుటకుఁ గథావిస్తార మైన మార్కండేయపురాణవస్తు వనుకూలించినది.

ఆంధ్రసాహిత్యవిమర్శకులు నన్నయాదికవులు తమతమకావ్యములందుఁ గళాత్మకముగాఁ బ్రదర్శించిన యుక్తివిశేషములను గుర్తించియుండిరి. నన్నయ తాను నానారుచిరార్థసూక్తినిధి నని చెప్పుకొనెను. ఐతిహాసికకవిత్వము రచించు నన్నయకు వస్తునిర్వహణమున సూక్తు లవసరము లైనవి. మహాభారతము శాస్త్రకావ్యము; ఐతిహాసికకథాబంధురము, పురుషార్థతత్త్వనిరూపణప్రవణము. నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తిచే వస్తువు నార్ద్రి మొనర్చెను. అక్షరరమ్యతచే రీతివృత్త్యాదులను రసానుకూలము లొనర్చెను; రమణీయము లైన సూక్తులచేఁ గథాప్రయోజనమును కథాంగములందు నిసర్గముగాఁ బొందుపఱచెను. సూక్తు లనఁగా సుభాషితములు; అవి త్రికాలాబాధితము లైన సత్యములు; ధర్మములు. శాస్త్రకావ్యమున నిట్టివానిని మనోహరముగా బోధింపవలెను. ఆబోధించుటలోని రామణీయకత్వము నన్నయగారి ఉక్తిచమత్కృతి. అది సామెతలు; నానుడులు, జాతీయములు, నీతిబోధకవాక్యములు మొ॥వానిపై వ్యాపించియుండును. అట్టి వచశ్శిల్పమున కాతఁ డాచార్యపీఠము.

వర్ణనప్రధానమైన విస్తృతప్రబంధకవితను 'వస్తుకవిత' యనుపేర నిర్వహించిన నన్నిచోడుఁడు తనకుమారసంభవకావ్యమున సూక్తులు (1.35-36) సదుక్తులు (1.37) చతురోక్తులు (1.39)-అని మూఁడుతెఱఁగులఁ బేర్కొనెను. అందు సూక్తు లన (నన్న

యాదులందువలెనే) సుభాషితాదులు ; సదుక్తులన నిర్దుష్టశబ్దములు ; చతురోక్తులన కవి ప్రౌఢోక్తులు- అని యాయాశబ్దములు ప్రయోగించిన విధమును బట్టి యూహింప వీలగుచున్నది. నన్నిచోడుఁడు పురాణేతిహాసమార్గకవిత్వమును గాక వర్ణనాలంకారప్రధాన ప్రధానమైన ప్రౌఢప్రబంధకవిత్వమును దేశిమార్గమున నిర్వహించెను. అతఁడు సూక్తులకంటెఁ జతురోక్తులే కృతిసౌభాగ్యహేతువు లని నమ్మినవాఁడు.

క. చతురోక్తుల, నుతపదబహు
గతుల, నలంకారభావకాంతి రసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింప వలదె సౌభాగ్యమునన్. (1.39)

అని పేర్కొనుటయే దానికిఁ దార్కాణము.

ప్రబంధపరమేశ్వరుఁ డైన యెఱ్ఱాప్రెగ్గడ చతురోక్తియుక్తుం డనియుఁ బ్రశస్తిఁ గాంచెను.

ఉ. ఉన్నతసంస్కృతాది చతురోక్తిపదంబులఁ గావ్యకర్త వై
యెన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కిన భక్తిపెంపునన్. (నృ.పు. పీఠిక)

అని యతని నెఱపోతసూరి కీర్తించెను. అయనయే "మధురోక్తిగుంఫన" మనీషులు మెచ్చఁగ నహోబలనరసింహునిఁ బ్రస్తుతింపు మని యెఱ్ఱనకు నిర్దేశించినాఁడు. శ్రీనాథుఁడు తన వాగ్వైదగ్ధ్యమును వర్ణించుకొనుచు "పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని తేప సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు" అని పేర్కొనెను. ఎఱ్ఱన నన్నయతిక్కనల కవితాలక్షణముల జీర్ణించుకొని వారిరువురికావ్యజగత్తులకు వారధిఁ గట్టినట్లు అరణ్యపర్వశేషమును బూరించెను. అపై హరివంశము ననువదించెను. వీనియం దతఁడు వెలయించినది యైతిహాసికకవిత్వము. భారతారణ్యపర్వశేషమునఁ బ్రధానకథకంటె నుపాఖ్యానములు, ధర్మాదివిషయములే యతఁడు విశేషముగా వర్ణింపవలసివచ్చినది. నన్నయతిక్కనలు ప్రధానేతివృత్తము కథారసదృష్టితోఁ దీర్చిదిద్దిరి. ఎఱ్ఱన కుపాఖ్యానములందు కథారసదృష్టియు ధర్మాదివిషయప్రబోధమున నుక్తిచమత్కృతియు నలవడినది. సూక్తుల నుక్తిచమత్కృతితో మధురతర మొనర్చి సుజనోత్సవ మొనంగునట్లు రచించెను. ఇతఁ డిప్పట్టున "నన్నయభట్టతిక్కకవినాథులు చూపినత్రోవన"[2] నడచినవాఁడు. ఈలక్షణమున నెఱ్ఱన మారనకు సతీర్థ్యుఁడు. కావున మారనయొక్కయు నెఱ్ఱనయొక్కయు వాగ్వృత్తి యిందు సమముగా స్పందించినది. ఎఱ్ఱనమాత్రము నృసింహపురాణరచనమున నాలంకారికమార్గము ననుసరించి ప్రౌఢోక్తిని బ్రదర్శించెను. అందమూలక మైన వర్ణనావైశారద్యము వెలార్చి నిర్మించిన యా ప్రబంధమున నెఱ్ఱనకు చతురోక్తియే శరణ్యమైనది. భారత హరివంశములం దెఱ్ఱన యధిక

2. హరివంశము. పూర్వ. 1.42.

ముగా నిరలంకారమైన రచన చేసియు సాలంకారశోభను వెలార్చెను. నృసింహపురాణమున సాలంకారప్రౌఢవాక్చమత్కృతినిఁ బ్రకటించెను.

తరువాత వెలసిన కావ్యములందు ధర్మాదివిషయప్రతిపాదనము సన్నగిల్లి కల్పనాభాగ మధికమైనది. శ్రీనాథుని కాశీఖండభీమఖండాది పురాణఖండానువాదమునం దెట్టిన సూక్తివైచిత్రియుఁ, గావ్యములందు కవిప్రౌఢోక్తియు భాసించినది. పెద్దనకాలమున వెలసిన ప్రబంధములందు ధర్మశాస్త్రవిషయభాగ మస్తినాస్తివిచికిత్సకుఁ బాత్ర మగుటతో సూక్తివైచిత్రికంటెఁ జతురవచనరచనమున కధికప్రాముఖ్యము కలిగినది. అల్ప మైన పురాణగాథను జేపట్టి యనల్పకల్పనావైభవముతో దానినిఁ బెంచి యలంకారబంధుర మొనర్చి, ప్రబంధమును నిర్మించినవాఁడు పెద్దన. అతని రచనలందుఁ బ్రబంధపరమేశ్వరుని చతురోక్తి స్వతంత్రప్రతిపత్తి నంది సర్వత్ర లాస్య మొనర్చినది. నన్నిచోడునిలో, మారనలో, ఎఱ్ఱనలోఁ గవిప్రౌఢోక్తిగా నవతరించిన చతురోక్తి పెద్దనలో నలంకారమై వక్రోక్తి, అతిశయోక్తి, సహోక్తి, వినోక్తి, సమాసోక్తి, స్వభావోక్తి, వ్యాజోక్తి, విశేషోక్తి మొదలగు భంగ్యంతరములఁ బొంది గడుసుఁదనమును సంతరించుకొనినది. అది యతని శైలిలో, వాక్కులోఁ బొడకట్టి రాయల నాకర్షించినది.

పెద్దనవాక్కునకు సౌకుమార్యమాధుర్యములు సహజగుణములు. శృంగారశాంతాది లలితరసములం దావాక్కు రక్తికట్టును. అతనిజీవతత్త్వమును రాయలు గుర్తించి స్వారోచిషమనుసంభవకథను కావ్యవస్తువుగా నిర్దేశించి యది యతనిచతురవాక్కున కనుకూలమని పేర్కొనెను. మనుచరిత్రమున శృంగారశాంతముల కధికప్రాధాన్యము కలదు. అద్భుతవీరాదుల కుపాంగప్రతిపత్తి కలదు. అనంగసదృశుఁ డైన ప్రవరుఁడును, విద్యుల్లతాంగి యైన వరూథినియు, అంగనాసంగమాభిలాషి యైన గంధర్వకుమారుఁడును, స్వరుచిప్రభావిరాజితుఁడును, దక్షిణనాయకుఁడు నైన స్వరోచియు, విద్యావిలాససుందరు లైన మనోరమాదులును ఈకథయందు ముఖ్యపాత్రలు. అయోగవిప్రలంభసంభోగాభాసరూప మైన శృంగారరసభేదము లీకథయందు సహజముగా భాసించుచున్నవి. తత్పాత్రలవిలాసలలితవృత్తులు, తద్రసానుగుణవిభావాదివర్ణనలు గల యిట్టి యితివృత్తము పెద్దన వాగ్వృత్తి కనుకూల మైనది. సంగ్రహపురాణోపాఖ్యానమును బ్రబంధేతివృత్తముగాఁ బెంపుచేయుటయు నతనిచతురరచన కత్యంతానుకూలమే. "ఆసాదితచతుర్విధకవితామతల్లిక" యైన పెద్దనకు విస్తరకవిత్వము వెలార్చుట కీవిస్తృతప్రబంధ మొకసదవకాశము కల్పించినది. అందువలననే పెద్దన ప్రబంధగౌరవమంతయు నతఁ డం దేమికథ చెప్పెనను దానికన్న నదియెట్లు విస్తరించి చతురముగాఁ జెప్పెనను దానిపైననే యాధారపడియుండుట గమనింపఁదగినది.

ఇట్లు రాయల కుత్తమసంకల్పము జనించెను; సమర్థుఁడైన కవి లభించెను; ఉదాత్తకావ్యవస్తువు స్ఫురించెను; అది కవీంద్రునివాగ్వృత్తి కనుకూలమై భాసించెను; తెలుఁగుభారతి కొక యపూర్వప్రబంధరత్నము లభించెను.

**మనుచరిత్రము మార్కండేయపురాణోక్తప్రకారము చెప్పఁబడినది :**

రాయలు స్వారోచిషమనుసంభవమును మార్కండేయ పురాణోక్తప్రకారము చెప్పు మని పెద్దనను గోరెను. అనఁగా కథాసంవిధాన క్రమమున మార్కండేయపురాణోక్త పద్ధతిని వీడవల దని సూచించిన ట్లయినది. ఒకకథ యొకవిధముగాఁ జెప్పఁబడినప్పు డాకథ యట్లు జరుగుటకుఁ గల హేతువుల నాకథయందుఁ గథకుఁడు నిక్షేపించి, దానిని గార్యకారణ సంబద్ధ మొనర్చును. ఆకథావిధానము మార్చినచో నాకథానిర్మాణపరమ ప్రయోజనము భగ్నమగును. ఒక్కొకసారి సమర్థుఁడగుకవి స్వయంకల్పిత నవ్య మార్గానుగామియై వినూత్నసృష్టి చేయఁగలఁడు. కాని, మూలమునందలి యాబంధము గాని, యావిధముగాని యేర్పడదు. రాయలు పౌరాణికకథానిర్మాణమునకుఁ బ్రీతుఁడై దానిని రక్షించు యత్నము చేసెను. దానితోఁ బెద్దన కావ్యచిత్రమున కొక నిర్దిష్టమైన భిత్తిక లభించినది. దానిపై నొనర్పవలసిన వస్తుచిత్రలేఖనావిధానము సూచింపఁబడినది. ఇఁక రేఖలు మలచుటయు, రంగులు నింపుటయు, జీవము పోయుటయు, నతనికి వదలి పెట్టఁ బడినవి.

సంస్కృతపురాణమందలి కథ యున్నది. అది కథాఫలమున కత్యంతమూల మైన బీజమునుండి యారంభించి, కథాగతియందు జరుగు సన్నివేశములకుఁ దగిన కార్యకారణత్వము కల్పించుపద్ధతి నాశ్రయించి చెప్పఁబడినది. మారన దానిని భావాను వాదపద్ధతి ననుసరించి తెలుఁగు చేసెను. ప్రాయికముగా నిట్టి యనువాదమున మూల కథానిర్మాణము చెక్కుచెదరదు. మారన మూలమునందలి సార్థకము లైన కావ్యార్థము లేవియు లుప్తము కాకుండ జాగరూకత వహించుటతోపాటు మూలమున లేనివర్ణనలను, కావ్యశిల్పములను, ఉక్తివిశేషముచేఁ బొందుపఱచి దాని కొక సుందరస్వరూపవిలాసము నొసంగినాఁడు. ఔచిత్య మెఱిఁగి కొన్నిచిన్నిచిన్నిమార్పులను, చేర్పులను జేసినాఁడు. మార్కండేయ పురాణకథామంజరులలో స్వతంత్రకావ్యప్రతిపత్తి నందఁగలవాని నన్నింటిని మారన దూరదృష్టితో భావించి రససమంచితకథలుగా రూపొందించి వానికి విశిష్టవ్యక్తిత్వములను గల్పించి పెట్టినాఁడు. అయినను- అకథలన్నియు నొకయెత్తు; ఈస్వారోచిషమనుసంభవ మొకయెత్తు. అతనితరువాత నెవ్వ రాకథను జేపట్టినను తాను వైచిన యడుగులం దడుగులు పడకుండ నడువలేన ట్లాకవి కథామార్గములను దీర్చి దిద్దినాఁడు. రాయ లీసత్యము గుర్తించినట్లు అతనివాక్యములను సూక్ష్మముగాఁ బరిశీ లించినచోఁ దేటపడఁగలదు.

''మనువులలో స్వారోచిషమనుసంభవ మరయ రససమంచితకథలన్ వినసింపు, కలిధ్వంసకము'' - అని రాయలు నిర్దేశించి చెప్పెను. ఇ ట్లనునప్పుడు రాయలు మారన పురాణము నుద్దేశించె నని యూహించుటకు వీలున్నది. సంస్కృతపురాణకథలు లౌకిక వైదికపారమార్థికములను, వంశవంశానుచరితరూపము లైన యైతిహాసికవిషయములను జెప్పుట పరమార్థముగా నెంచి, కూర్పఁబడినవి. తత్కథనమునకుఁ బరమజ్ఞానసిద్ధి

ఫలము. మారన దాని ననువదించుచుఁ బురాణదృష్టికిఁ గథారసదృష్టిని జోడించెను. ''కావునఁ దత్పురాఁణము ప్రకాశితసారకథామృతం బొగిం ద్రావి జగజ్జనంబు లలరు'' నట్లు రచింపు మనిన కృతిపతినిర్దేశము దానికి మూలహేతువు. "కావున భారతామృతము గర్ణపుటంబుల నారఁగ్రోలిఁ యాంధ్రావలి మోదముంబొరయునట్లుగ'' మహాకవిత్వదీక్షావిధి నందిమహాభారతరచనను నిర్వహించిన తిక్కనసోమాయజి కవిత్వలక్ష్యమున కిది ప్రతిబింబమే. తెలుఁగున రసశిల్పమున కారామము కల్పించిన తిక్కనరచనాపద్ధతి ననుసరించిన మారన కథలను రసనమంచితములుగాఁ గాక మ రెట్లు నిర్మించును ?

మార్కండేయము చండాఘోత్కరహారి యని మారన యవతారికలోఁ బ్రత్యేకముగా నొకపద్యమున నిట్లు వర్ణించెను :

శా. తర్కింపంగ నశక్య మైన వితతోద్యద్దీప్తిజాలంబు చే
నర్కుం డెట్లు వెలుంగు నట్ల బహుపుణ్యశ్రేణికావ్యాప్తి సం
పర్కస్ఫూర్తి నఘాంధకారము లడంపంజాలి లోకంబున
న్మార్కండేయపురాణరత్న మమరు న్మాంగళ్యసంపాది యై. (అవ. 16)

మారన యొనర్చిన యీవిశేషవర్ణనము రాయలచేత బహుశః ''కలిధ్వంసక'' మనువిశేషణము ననిసించియుండవచ్చును ! మూలమునందలి విన సొంపైనట్టియు, కలిధ్వంసకము లైనట్టియు గథలను రసనమంచితములుగా మారన యొనర్చియుండుటచేతను, అందును స్వారోచిషమనుసంభవకథ నతఁ డుదాత్తముగా నిర్వహించియుండుటచేతను, రాయలు సంస్కృతపురాణముకంటె మారనపురాణమునే యుపలక్షించి, పైపలుకు లనియుండు నని తలంచుటలో విప్రతిపత్తి లేదు.

పురాణకర్త కీమనుజన్మకథ చతుర్దశమనుచరిత్రలపై వ్యాపించిన మన్వంతర మను పురాణలక్షణమును నిర్వహించుటలో నొకయుపాఖ్యానము మాత్రమే. ప్రబంధకర్త కీకథయే వస్తుసర్వస్వము. పెద్దన మారనవలె నీమనుచరిత్రము ననువదింపలేదు. అట్లు చేయవలె నని రాయలయభిమతమును గాదు. అనువాదమే యైనచో మారనపురాణమే చాలు నని వా రిరువురకుఁ దెలియును. కాని, అంత రసవత్తరగాథ యుపాఖ్యానముగా నొకపురాణమున నొదిగియుండి మరుగునఁ బడిపోకుండ మహాప్రబంధేతివృత్తముగా రూపొంది రాణింపవలె ననెడి వారియభిలాషయే యంతఁ జేసినది. సంగ్రహ మైన పురాణకథ ప్రబంధమున బాగుగాఁ బెంపుదల పొందక తప్పదు. అది మార్కండేయపురాణోక్తపద్ధతికి విరుద్ధము కాకుండునట్లు రచించియుండుట పెద్దనచాతుర్యము !

సంస్కృతమున సహజసుందర మైన యీకథకు మారన తెలుఁగున నొకవిశిష్టవ్యక్తిత్వమును, గాంభీర్యమును, గల్పించినాఁడు. పెద్దన దానికి విస్తృతియుఁ బ్రత్యేకప్రతిపత్తియు, నలంకారసౌభాగ్యమును, గడుసుఁదనమును, కాంతిమత్త్వమును బ్రసాదించినాఁడు. ఇట్లు క్రమవికాసరూపరమణీయపరిణామమునం దుంచుచుఁ బరాకాష్ఠ నందు కొనిన పెద్దనప్రబంధమునకు సంస్కృతాంధ్రపురాణము లెట్లు దోహదము లైన వను నంశమును బరిశీలించుటయే యీవ్యాసతాత్పర్యము :

## పరిశీలన విధానము: మనుచరిత్రకు సంస్కృతాంధ్రోభయ పురాణములు మూలములు :

కావ్యవిమర్శనమున వస్తునాయకరసపరిశీలనము చేయుట సంప్రదాయము. సత్కావ్యమునకు ఇతివృత్తము శరీరము; రస మాత్మ; నాయకచారిత్రము మహిమ. అల్లసాని పెద్దన రచించినప్రబంధమునం దీయంగములు నిర్వహింపఁబడుటకు మార్కండేయపురాణ మెట్లు మూల మైనదనువిషయము ప్రస్తుతాంశము. దీనిని స్పష్టీకరించుటకొఱకు పరిశీలన మీక్రిందివిధముగా విభజించి నిర్వహింపఁబడినది.

1. వస్తువిస్తృతి, 2. వస్తునిర్మాణము, 3. వస్త్వైక్యము, 4. పాత్రముల స్వరూపస్వభావ చిత్రీకరణము, 5. రసపోషణవిధానము, 6. పద్యరచనము.

వీనిని విశదీకరించుటకుఁ బూర్వ మొకయంశ మిచ్చట స్పష్టముచేయవలసియున్నది. కొందఱు విమర్శకులు మారనమార్కండేయపురాణమునందలికథనే పెద్దన యనుసరించి, తనప్రబంధమును రచించె నని యుగ్గడించియుండిరి.[3] అవి ప్రాధాన్యవివక్షతోఁ జెప్పినమాటలే కాని ప్రత్యంశమును గణించి చెప్పినవి కావు. మార్కండేయపురాణోక్తప్రకారము చెప్పు మను రాయలయాదేశానుసారము పెద్దన తనకుఁ బూర్వము సంస్కృతాంధ్రములందు వెలసిన మార్కండేయపురాణములను తప్పక చూచియుండును. అతఁ డఖిలపురాణేతిహాసకథార్థస్మృతియుతుఁ డనినప్పుడు రాయ లతని సంస్కృతమహాపురాణకథార్థవివేకమునే ప్రధానముగాఁ బ్రశంసించెను. 'రసనమంచితకథ' లనునప్పుడు మారనరచనమునుగూడ గుర్తించినట్లు స్పష్టమగుచున్నది. కావున పెద్దనప్రబంధముపై నుభయపురాణములప్రభావము[4] అవశ్యముగా నుండితీరినది. అందును దరతమభేదమును బరిశీలించినచో సంస్కృతపురాణముకంటె నాంధ్రపురాణప్రభావ మధిక మనుట నిస్సంశయము :

మారన తరువాతఁ బెద్దన యీకథను జేపట్టుటచే నతని కెంతయో సౌలభ్య మేర్పడినది. కథాకథనశిల్పాదికము లైన పెక్కు కావ్యార్థములలో మారన చూపించిన మెలకువలను గూఢముగాఁ బెద్దన పసికట్టి తనకావ్యమునఁ బ్రవేశపెట్టెను. మూలముతో

---

3. ఉదాహరణమున కొక్కటి : "ఈమనుచరిత్రకథ మార్కండేయపురాణమునుండి గైకొనఁబడినది. ఆపురాణమును 1330వ సంవత్సరప్రాంతమునఁ దిక్కనసోమయాజి శిష్యుఁడైన మారన తెనిగించెను. మారన రచిత మైన కథనే పెద్దనయు ననుసరించెను."
—శ్రీ వింగళి లక్ష్మీకాంతముగారు.

4. 'మనుచరిత్రమును విమర్శించిన పండితులు పలువురు తెలుఁగుమార్కండేయపురాణమును మాత్రము పెద్దన యనుసరించె నని భావించియున్నట్లు వారివ్రాతలవలనఁ దెలియుచున్నది. ఇది చాలవఱకు సత్యమె, ఐనను మనుచరిత్రమును సూక్ష్మముగాఁ బరిశీలించితిమేని సంస్కృతాంధ్రపురాణములను రెండింటిని గూడ బాగుగాఁ జదివి పెద్దన మనుచరిత్రమును రచించినట్లు స్పష్టపడును:"
—"మనుచరిత్రకు మూలము" (వ్రాతప్రతి) – డా. పల్లా దుర్గయ్యగారు.

మారనకథను బోల్చి పరిశీలించి దేనియం దౌచిత్యమండితము లైన యంశము లున్న వని యతనికిఁ దోచినవో వానిని గ్రహించెను. కొన్నిపట్ల సంస్కృతాంధ్రపురాణశిల్పసూక్ష్మ ములను రెండింటిని భావించి, వానిని విశిష్టముగా మేళవించి తనకావ్యమున సార్థకముగాఁ బ్రయోగించెను. వీని నన్నింటిని మించి పెద్దన స్వీయప్రతిభాసంజనితము లైన కవితా శిల్పకల్పనల ననంతముగాఁ జేర్చి, కథాపరిమాణమును ప్రబంధవస్తువున కనువైన విధ ముగా విస్తృత మొనర్చెను. కావున నీపరిశీలనమునం దీక్రిందియంతర్విభాగములు పాటింప నవసర మైనది. అవి :

1. సంస్కృతపురాణానుసరణము.
2. మారనయనువాదానుసరణము.
3. సంస్కృతాంధ్రోభయపురాణానుసరణము.

ఈయంతర్విభాగములం దీక్రిందియంశములు ప్రధానముగాఁ బరిశీలింపఁబడును.

1. సంస్కృతమార్కండేయపురాణమునం దున్న కథను పెద్దన యెట్లనుస రించెను ?
2. సంస్కృతమార్కండేయపురాణమునందలి కథకంటె మనుచరిత్రమునందు గల విశేషాంశము లేవి ? వానికల్పనకు మారన యెట్లు తోడ్పడెను ?
3. మనుచరిత్రమునందు సంస్కృతాంధ్రోభయపురాణకథాంశములను మేళవించి రూపొందిచినకల్పన లెవ్వి ?

పైవిభాగములం దీయంతర్విభాగాంశములను వివరించి వక్తవ్యాంశమును తేఁటపఱుపఁదగి యున్నది.

## వస్తువిస్తృతి :

సంస్కృతమార్కండేయపురాణమున 286 శ్లోకములలోఁ జెప్పఁబడిన స్వారోచిష మనుసంభవకథను మారన 145 గద్యపద్యములలో రచింపఁగా నల్లసాని పెద్దన 570 గద్యపద్యములకుఁ బెంచి యాఱాశ్వాసముల ప్రబంధముగా నిర్మించెను.

కథను పెంచుటకు పెక్కుమార్గములు కలవు. కథలోఁ గొన్నినూత్నపాత్రలను బ్రవేశపెట్టియు, సన్నివేశములఁ బెంచియు, ప్రధానకథతోపాటు పతాకకథలవంటి యుపకథలను గల్పించి, యవాంతరప్రయోజనములను జోడించియుఁ గథను బెంచ వచ్చును. మహాభారతమునందలి దుష్యంతమహారాజుచరిత్రము నాటకముగాఁ దీర్చి దిద్దిన కాళిదాసు ఈపద్ధతి ననుసరించెను. అల్లసానిపెద్దన మూలకథప్రకారము చెప్ప వలసినవాఁ డగుటచే సన్నివేశములను గాని, అవాంతరకథలనుగాని కల్పింపలేదు. వరూథినికిఁ జెలులను కొందఱఁ గల్పించి వనవిహారమునఁ బ్రవేశపెట్టెను గాని వా రప్ర ధానపాత్రలు. మూలమునందుఁ గథాకథనమునఁ బేర్కొనఁబడిన సంగ్రహాంశములలో విపులవర్ణనమున కవకాశము గలవాని నెన్నుకొని, ప్రకరణోచితము లైన వివిధకల్పి తాంశములతో వానికిఁ బుష్టియొనర్చి సహజరమణీయముగఁ బెంచి రచించుట మఱియొక

యుత్తమమార్గము. నన్నయాదులు భారతోపాఖ్యానములందుఁ బాటించిన రచనావిధాన మిట్టిదే. మారన యనుసరించిన విధమును నట్టిదే. పెద్దన యావిధానము గ్రహించి సమగ్రకావ్యప్రణాళికయందు పఱచియుంచుటచే బరిమాణమున నది విపులతరమైనది. పెద్దన మూలముకంటెఁ బెంచి రచించినయంశములలో ముఖ్యమైనవి యివి :

(1) శుకమహర్షిని మరపింపఁ గలిగిన నిర్జితేంద్రియుఁడు ప్రవరుఁడు. అతని గుణములను రేఖామాత్రముగా జెప్పి విడిచినాఁడు సంస్కృతపురాణకర్త. పెద్దన నాయక వర్ణనావకాశమును గల్పించుకొనెను. అరుణాస్పదనగరమును, ఆందలి చాతుర్వర్ణ్యమును, అందు వసించు సోమయాజి ప్రవరుని యంతర్బహిస్స్వరూపగుణములను, సంసారమును, శిష్యగణమును, అతనివైరాగ్యమును, అతిథిసేవానిరతిని, తీర్థయాత్రాభిలాషను విడమరచి నోరారఁ గీర్తించినాఁడు.

(2) ఔషధసిద్ధుని యాకృతిని నమూలకముగా వర్ణించెను.

(3) ప్రవరుఁ డౌషధసిద్ధున కొనర్చిన సపర్యలను, వారిరువురకు జరిగిన సంభాషణమును మూలాతిశయముగను, పాత్రస్వభావనిరూపణసమర్థముగను విపులముగా వర్ణించెను.

(4) సంస్కృతపురాణకర్త హిమాలయరమణీయదృశ్యముల నభినివేశముతో రచించెను. అతఁ డాగిరిని నానాప్రస్రవణాన్వితముగను, యక్షకిన్నరగంధర్వాదిదేవగణసంకులముగను, నానావిధతరుపుష్పశకుంతమృగసంభరితముగను దర్శించి నిసర్గప్రకృతిసౌందర్యపిపాసి వలె వర్ణించెను. పెద్దన పురాణకర్తహృదయమును గ్రహించి హిమగిరివిలాసమంతయుఁ దెనుఁగున బునస్సృష్టి చేయుటయే కాక దానికున్న పౌరాణిక మహత్త్వము పోషింపఁబడునట్లు బదరీనారాయణక్షేత్రమును, కాళగళురహస్యవిహారస్థలములను వర్ణించి, పుణ్యక్షేత్రసందర్శనగౌరవభావ మేర్పఱచెను. వరూథిని వసించిన కోనయొక్క వర్ణనము మూలమునందలి కొన్నిశ్లోకములయొక్క భావములను గ్రమబద్ధమొనర్చి పెద్దన రూపొందించిన ప్రకరణోచితరూపకల్పనము.

(5) పాదలేపము కరఁగిపోయిన దని తెలిసికొనిన ప్రవరుఁడు నిత్యకర్మహాని కలుగు నని వగచినట్లు మూలమునఁ బేర్కొనఁబడియున్నది. పెద్దన ప్రవరుని విషాదభావోదయాదుల క్రమోన్మీలనమును వర్ణించి బంధువులను పేరుపేరునఁ దలఁచి వెక్కివెక్కి దుఃఖించినట్లు విపులముగను, సహజముగను వర్ణించెను.

(6) వరూథినీ సౌందర్యమును, సాత్త్వికభావోదయాదులను, వరూథినీ ప్రవరుల సంభాషణమును పెద్దన తన చతురవచనరచనాపాండిత్యము సర్వము వెచ్చించి రచించి తెలుఁగున నిట్టిసన్నివేశచిత్రణము 'నభూతో నభవిష్యతి' యని కీర్తిఁగాంచెను. మారనయు నిప్పట్టున ననంతశిల్పసంపదను గుమ్మరించి పెద్దనకు మార్గదర్శి యయ్యెను. నాఁడు మనుచరిత్రము ప్రబంధ మగుటకును, నేఁడు మనుచరిత్రము బ్రతుకుచుండుటకును ఈరమణీయఘట్టమే మూలకారణ మనుటలో నెట్టిసందేహము లేదు. ఇది వైదికధర్మనిష్ఠ మగు శాంతమునకును భోగైకశీలసుందర మగు నింద్రియసుఖతృష్ణకును

జరిగిన యపూర్వసంఘర్షణము. పెద్దనగారిసుకుమారమధురోక్తి కపూర్వముగ లభించిన యామంత్రణము. 49 సంస్కృతశ్లోకముల యీఘట్టమును మారన 25 గద్యపద్యము లలో వ్రాయఁగాఁ బెద్దన 54 గద్యపద్యములలోఁ బెంచి రచించెను.

(7) వరూథినీవిరహవర్ణనము మూలమున 7 శ్లోకములు మాత్రమే. మారన దానిని రెట్టింపుచేసి 7 పద్యములలో వ్రాసెను. పెద్దన దానిని 64 గద్యపద్యములలో విస్తృతవర్ణనముగా మార్చెను. అష్టాదశవర్ణనాభిమాని యగు ప్రబంధకవి యగుటచే నీయవసరమున విప్రలంభశృంగారమునకుఁ బోషకముగా వివిధమన్మథదశాంతరములను, సూర్యాస్తమయ, సంధ్యాతమశ్చంద్రోదయతారకాసముదాయజ్యోత్స్నాదులను, అనంగ గంధవహచంద్రోపాలంభనములను, ఉదయసంధ్యావర్ణనములను, చెలులసాంత్వనవచన ములను, పుష్పోద్యానవిహరణమును, పుష్పాపచయాదులను వేర్వేర వర్ణించి యుద్దీపన విభావప్రభావశోభ కన్నులకుఁ గట్టునట్లు వర్ణించి ప్రబంధవర్ణనామర్యాదల కొకమార్గము వైచిపెట్టెను.

(8) సంభోగశృంగారరసాలంబనము లైన వరూథినీగంధర్వకుమారుల సంభా షణ విహారవిలాసాదుల వర్ణనము పెద్దన సంస్కృతపురాణముకంటె నెక్కువ విపుల ముగా రచించెను.

(9) స్వరోచిని నపరదుష్యంతునివలె రాణించునట్లు మూలాతిశయముగా నాతని బాల్యయౌవనబలగర్వవిహారములను పెద్దన వర్ణించెను.

(10) మూలమున మాటమాత్రముగా నున్న స్వరోచిమృగయావిహారవర్ణనము మనుచరిత్రమున నలుబదియైదుపద్యముల విస్తీర్ణము నాక్రమించినది. పెదన్నగారి స్వీయప్రత్యక్షానుభవమే యీఘట్టమున స్వరోచి కంటఁగట్టబడిన దని విశ్వసింపవచ్చును. 'యుగవిగమసమయసముద్భూతజీమూతపటలమువోలె' నున్న గగనరేఖయు, 'తుండము లేని యేనుఁగుల'వలె నున్న వరాహపోతములు, వివిధవన్యమృగపక్షితతులు, మృగయా వినోదయాత్రాసన్నాహములు, బహువిధములైన పేళ్లతోఁ బిలువఁబడు వేటకుక్కలు, పంతము లాడుచు పరువులు తీయు వేటకాండ్రగుంపులు, 'గూనివీపు లదుర గొణఁగి తిట్టుచు నేకుఁగఱచి నట్టి కుక్కగం ట్లనంగ మూతి నరపమీసములతో నొప్పి పందివలలు మోయు బోయముదుసళ్లు, వేటసంరంభము, విశ్రాంతి, - ఈ వరుసలో వర్ణింపవలె నన్న కవితాకళలోఁ బండిన యనుభవ ముండియుండవలెను.

(11) రాక్షసాకృతిలో నున్న ఇందీవరాక్షునితోఁ జరిగినపోరు మూలమునకంటెఁ బెద్దన ప్రబంధమునఁ బెద్దదై సంకులసమరమై వీరరసవిశ్రాంత మైనది.

(12) మనోరమాస్వరోచులవివాహవర్ణనము మూలమునఁ బ్రస్తావవశముగా నొకశ్లోకమునఁ జెప్పఁబడియుండ దాని నొక యాశ్వాసమున నాల్గింట మూఁడువంతు లుండునట్లు పెంచి రచించెను. పెద్దన తనకాలమున మహారాజులయిండ్లలో జరిగిన వివాహవైభవములను తెలుఁగువారి యాచారవ్యవహారములును అందగించునట్లు దానినిఁ జిత్రించెను. తిక్కన్నగారు భారతమున రచించిన యుత్తరాభిమన్యులవివాహవర్ణనము

వలె నమూలక మై తెలుఁగుల వైశిష్ట్యము దేఁటపఱచునట్లు పెద్దన రచించి వర్ణనాపటి మను, జాత్యభిమానమును బ్రకటించుకొనెను.

(13) ఇందీవరాక్షమనోరమావిభావసీకళావత్యాదులవృత్తాంతములు మూలమున కంటె ప్రత్యంగపరిపుష్టము లై, నాతివిపులములై స్వయంసమృద్ధము లై, యుండునట్లు పెద్దన వానినిఁ దీర్చిదిద్దెను.

(14) స్వారోచిషమనువర్ణనము మూలమునకంటె విపులముగను, గంభీరముగను నొనర్చెను.

(15) దశావతారస్తుతి యమూలక మైన విపులరచనము.

సిద్ధమైనవస్తువును బెంచి రచించుటలోఁ గవికి వస్తుస్వభావమునకు విరుద్ధముగాని కల్పనము కావలెను. పలువురు కవులు స్వీయకల్పనాశక్తిచే మూలమును బెంచుట కాంచుచుందుము. కాని, కథార్థములును, కల్పనలును అవినాభావముగ నేకమగుట కొందఱి కావ్యములందు మాత్రమే కనుపట్టుచుండును. అందులకుఁ గారణ మొకటి యై యుండ వచ్చును. కావ్యమునఁ గొన్నికల్పనలు ప్రతిభాస్ఫోరకములు నై యుండును. అందు మొదటివి కావ్యరసమును బోషించును; తరువాతివి కవిలోకజ్ఞతను జాటును. ప్రతిభాస్ఫోరకము లైనకల్పనలు కథార్థములతో నీరక్షీరన్యాయమునఁ గలసియుండును. పాండిత్యస్ఫోరకము లైనకల్పనలు తిలతండులన్యాయమునఁ గదిసియుండును. రసకావళి రచనమున మొదటిమార్గమును, వస్త్వలంకారప్రధానరచనమున రెండవపద్ధతియు నుపాదేయము లగును. ప్రకరణోచితముగా నీరెండుపద్ధతుల నొకేకావ్యమున ననుసరించిన కవివర్యులును మనసాహిత్యమునఁ బలువురు కలరు. అట్టివారిలోఁ బెద్దన ముఖ్యుఁడు. వరూథినీవృత్తాంతమునఁ బెద్దనకల్పన లన్నియు క్షీరనీరన్యాయమును దాల్చినవి. అట్టి పద్ధతికి మారనయే త్రోవచూపినవాఁడు. ఇఁక స్వరోచివృత్తాంతమునఁ బెద్దన కల్పనలు తిలతండులన్యాయమును గావించినవి. అవి పెద్దనవ్యుత్పత్తికిఁ దార్కాణములు.

## మనుచరిత్ర వస్తువిస్తృతిపై మారన రచనా ప్రభావము :

మారన స్వారోచిషమనుసంభవకథావస్తువును బెంచలేదు. కాని, పెద్దన పెంపుఁ జేయుటకు వలయుసూచనలను ఉక్తివిశేషముచే నేర్పఱచిన శిల్పనిక్షేపములందు దాచి యుంచెను. పెద్దన వానినిఁ గొల్లఁగొట్టెను. అట్టివానినిఁ గొన్నింటి నిచ్చటఁ బేర్కొనుట యగుచున్నది.

### 1. కావ్యారంభముపై మారనప్రభావము :

కావ్య ముదాత్తగంభీరముగా నారంభింపఁబడవలెను. సంస్కృతాంధ్రోభయపురాణ కథలు ప్రవరునిగుణకీర్తనముతో నారంభ మగుచున్నవి. అల్లసాని పెద్దనయు నించుమించట్లే ప్రారంభించెను. కాని, సూక్ష్మదృష్టికి- ఆముగ్గు రొనర్చిన కథారంభములందును గొంతభేదము కానరాకపోదు. సంస్కృతపురాణమున ద్విజాతిప్రవరుని పరిచయము

చేయుటతో నారంభమై, యాతనిహిమాచలయాత్రాకథనోన్ముఖమైనవేగముతోఁ గథ నడచినది. మారన మూలమునందలివేగమును తగ్గించి కథాగతియందుఁ గొంత నిలకడ కలిగించెను. అట్లు చేయుట కతఁ డుపయోగించిన సాధనములు కవితాకథాశిల్పములు.

శ్లో. కశ్చి ద్ద్విజాతిప్రవరః పురేఽభూ దరుణాస్పదే
వరుణాయా స్తటే విప్రో రూపేణాత్యశ్వినా వపి॥ (58.5)

అని సంస్కృతకథారంభము. ఇందలియంశము తెవ్వియును విడువక మారన యిట్లు రచించెను.

క. వరుణాతటినీతటమున
వరుణాస్పద మను పురమునం దతులగుణో
త్తరుఁడు గలఁ డొకధరణీ
సురవరుఁ డశ్వినులకంటె సుందరుఁ డెందున్. (మారన 4.213)

సంస్కృతమునందు ద్విజాతిప్రవర, పుర, అరుణాస్పద, వరుణాతటశబ్దములు శ్లోకమున నిలిపినక్రమమును దెలుఁగున మారన సాక్షాద్విరుద్ధముగా మార్చెను. ఈమార్పువలనఁ గథానాయకుని గుణకీర్తనము నందుకొనుచున్న కథావేగము మందగించినది. నదీతటమున నున్నదొకనగరము, దానియం దొకభూసురప్రవరుఁడు నివసించుచుండెను; అతడు గుణోత్తరుఁడు, అశ్వినులకటె సుందరుఁడు- అనుసరికి నాయకవర్ణమున కొకవాతావరణము సిద్ధముచేసిన ట్లగుచున్నది. సంస్కృతశ్లోకముయొక్క అన్వయక్రమమే తెలుఁగు పద్యముయొక్క నిర్మాణరహస్యము. కాని, ఆతెలుఁగుపద్యముయొక్కయెత్తుగడలోని మారన వైఖరి పెద్దన కెంతయో నచ్చినది. తనమహాప్రబంధము నారంభముచేయుచు మారన యడుగులో నడుగుంచి పద్యమెత్తినాడు. ''వరణాద్వీపవతీతటాంచలమునన్'' అనుసరికి మారన గుప్పున జ్ఞప్తికి రాకమానఁడు.

గుణోత్తరుఁ డైన నాయకుని నుచిత మైన వాతావరణమునఁ బ్రతిష్ఠించి ప్రదర్శించుట మారన సూచించినమార్గము. దాని ననువదించుచుఁ జిన్నయుపాఖ్యానమును రచించుచున్న మారన యామార్గమును విస్తరించి చూపలేదు. పెద్దనకుఁ దగినంతయవకాశము కలదు. అందువలన నతఁడు గుణోత్తమ మైనపురమును, జాతుర్వర్ణ్యమును సృష్టించినాఁడు.అట్టిప్రయత్నము "పురమొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తి న్విడంబించుచున్" అని పురవర్ణనము ముగించినప్పుడును, అచట పుట్టిన చిగురుకొ మ్మైనచేవ" యని పురప్రజావర్ణనము ముగించునప్పుడును స్పష్టము కాకపోదు.

పెద్దన యీవర్ణనమంతయుఁ బ్రవరునితీర్థయాత్రాభిలాషను బలపఱచుటకై చేసినాఁడు. అనఁగా నీకల్పనము కథాతాత్పర్యమునకు భిన్నము కాక పోషక మయ్యేడి దని భావము. పెద్దన మూఁడవపద్యమునఁ బ్రవరుఁ ''డాపురిఁ బాయకుండు'' నని చెప్పినాఁడు. అట్లు చెప్పుట కీవర్ణన మొక హేతువు. ఎట్లు? అతఁడు పుట్టినదాది యానగరము వీడి యెచ్చటకుఁ బోయియుండలేదు. దానికిఁ గారణములు పెక్కులు కలవు. ఆపురము నదీ

తటాంచలమున నుండుటచే సర్వకాలసమశీతలసౌఖ్య మబ్బి యాపురవాసుల కత్యంత సౌఖ్యద మగుచున్నది. అంబరము నంటు కోటగోడ లుండుటచేఁ బురము శత్రుభీతి లేకసుర క్షితమయి యున్నది. చంద్రునిలోని మచ్చలను సైతము ధవళితమొనర్చు సౌధసుధాకాంతి నిష్కల్మష మైన నగరచరిత్రమును జాటుచున్నది. ముది మదితప్పిన బ్రహ్మను మెచ్చని విప్రప్రవరుల కాపురి నివాసకేంద్ర మగుటచేఁ బ్రవరుఁడు విద్యాభ్యాసమున కెచ్చటకు నేగవలసినయగత్యము లేకపోయినది. సామాన్యముగా నొకబ్రాహ్మణుఁడు దేశాటనమునకు బయలుదేరుటకు విద్యాభ్యాసము కాని, శత్రుభీతి కాని, ధనార్జనము కాని, ఆహారసంపాద నము కాని, విషయసుఖలోలుపత్వముకాని, తీర్థయాత్రాభిలాష గాని కారణము కావచ్చును. పెద్దనతనకల్పనాచాతుర్యముచే నొక్కచివరిదానిని దప్ప మిగిలినకారణము లన్నియుఁ బ్రవరునిబ్రతుకులోఁ బొడసూపనట్లు వాతావరణము సృష్టించినాఁడు. పురచాతుర్వర్ణ్యవేశ్యా వర్ణనరహస్యము కథాప్రయోజనము సంబంధించినంతవఱ కిది. బీజప్రాయ మైన మారన సూచనము పెద్దనకావ్యమునందు సుశాఖాసంపన్న మై విస్తృతిఁ దాల్చినది.

2. ప్రవరునకు నామకరణము చేసినవాఁడు మారన :

సంస్కృతమున నామరహితుఁ డై యున్న బ్రాహ్మణ ప్రవరునకుఁ బ్రవరాఖ్య నిచ్చి ప్రసిద్ధికిఁ దెచ్చినవాఁడు మారన.[5] అతఁడు చేసిన నామకరణమును మనసార సమ ర్థించి చేతులార నదేపదమును పద్యమున గ్రథించిపెట్టుకొనినాఁడు పెద్దన.[6] మారన శ్రేష్ఠవాచకమును సంజ్ఞానామవాచకముగా మార్చుటతోపాటు తనయనువాదమున మూలాతిశాయిగా నతఁ డతులగుణోత్తరుఁ డనియు, ఉదాత్తుఁ డనియు పేర్కొనెను. నాయకస్వరూపగుణవర్ణనావసరమునఁ బెద్దన కీరెండంశములు కొన్నిసూక్ష్మము లైన మార్గములను స్ఫురింపఁజేసినవి. మారన ప్రవరాఖ్యుని వర్ణనము వృత్తమున నెత్తుకొని నాఁడు. పెద్దనయు వృత్తమే గైకొనినాఁడు. కాని, యొకవృత్తముతోఁ దనివి నొందక యెనిమిది పద్యములు నిలిచి వర్ణించినాఁడు. మారనగారిచంపకమాలలోని యాదిలఘువుల ద్రుతగతిని మార్చి యాదిగురువైన యుత్పలమాల నెత్తికొని విలంబితగతిని స్ఫురింపఁ జేయుటలోఁ బెద్దనహృదయ మదియేనేమో !

3. 'చోద్యము'లప్రసక్తి మారననుండి గ్రహించినదే :

ప్రవరుఁ డౌషధసిద్ధుని 'నిమ్మహి విశేషపుఁ జోద్యము లేవి నూచి తీ వచ్చుగఁ జెప్పవే' (4.215) యని ప్రార్థించినట్లు మారన. అద్భుతము లైన లోకవిషయములను

5. చూడుడు : విశేషములకు "ఆఖ్యానశిల్పాధ్యాయము"- పుటలు । 210; 211.

6. శ్రీ వేకుమళ్ల అచ్యుతరావుగారు- "మూలకథయందు బ్రాహ్మణప్రవరుఁ డనియే యున్నది. అనఁగా బ్రాహ్మణశ్రేష్ఠుఁ డని యర్థము. అతనిపే రెద్దియో కాన్పింపదు. కావున మను చరిత్రలో నున్న ప్రవరనామము అల్లసానిపెద్దన్న యిచ్చినదే" (ఆం.వా.చ.2భా.126పు. అధస్సూచిక) యని వ్రాసిరి. కాని, యది సరికాదు. ప్రవరునకు నామకరణము చేసిన వాఁడు మారనకవియే. మారన పెట్టినపేరునే గ్రహించి పెద్దన మనుచరిత్రమునం దతనికి ప్రత్యేకవ్యక్తిత్వము కల్పించెను. —'మనుచరిత్ర మూలము' . డా. పల్లా దుర్గయ్యగారు.

గ్రహింపలె ననెడి ప్రవరునిచిత్తవృత్తి నాకవి చోద్యములను గూర్చి యడుగుటలోఁ బ్రద ర్శించెను. సిద్ధుఁడుకూడ "అనేకదేశముల్ గ్రచ్చర నేను ద్రిమ్మరితిఁ గాంచితి నం దొగిఁ బెక్కుచోద్యముల్" అని యతనిప్రశ్నకుఁ దగినసమాధానము చెప్పినట్లు చిత్రించినాఁడు.

పెద్దన మారనకవి ప్రయోగించినశబ్దమును, తదర్థమును, తత్ప్రయోజనమును భంగ్యంతరమునఁ దనకావ్యమునఁ బ్రయోగించుకొనెను. ఉదాహరణమునకు :

శా. "ఏయేదేశములం జరించితిరి మీ రేయేగిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ గ్రుమ్మరితి రేయేతోయధుల్ డాసినా
రాయాచోటులఁ గల్గు వింతలు మహాత్మా! నా కెఱింగింపవే?

ఉ. "ఓచతురాస్యవంశకలశోధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులుఁ బుణ్యనదీనదంబులుం
జూచితి; నందు నందుఁ గల చోద్యములుం గనుగొంటి నా
పటీరాచలపశ్చిమాచలహిమాచలపూర్వదిశాచలంబులన్. (మను. 1.68, 70)

ఈప్రసిద్ధపద్యములందుఁ బ్రవరుఁడు సిద్ధుని వింతలు చెప్ప మనియడుగుటయు, సిద్ధుఁడు చోద్యములు కనుగొంటి నని పల్కుటయు మారనప్రభావమే. మారనపురాణమున సిద్ధుఁ డనేకదేశములఁ ద్రిమ్మరితి నని చెప్పుటవలనఁ బెద్దన ప్రబంధమునఁ బ్రవరుఁ "డేయేదేశములం జరించితిరి? యని ప్రశ్నించుట జరిగినది. పురాణప్రవరుఁ 'డచ్చుగఁ జెప్పవే' యని వేడఁగాఁ బ్రబంధప్రవరుఁడు 'విభజించి యడుగ'ఁ గుతూహలపడినాఁడు. విభజించి యడుగుటకు విస్తరించి చెప్పుటకు, పెద్దన ప్రబంధరచన మవకాశము కలిగించినది.

మారననుండి గ్రహించిన 'చోద్య'మనుశబ్దమును శిల్పదృష్టితోఁ బెద్దన తన కావ్యమునందుఁ గూర్చినాఁడు. ప్రవరుఁడు హిమగిరివిశేషములఁ గాంచి "తలమే బ్రహ్మకు నైన నీనగమహత్వం బెన్న? నే నియ్యెడం గల చోద్యంబులు తేపు గన్గొనియెదం గాకేమి?" యని భావించుటవలన నాపాత్రశీలపోషణసాతత్యమును, పూర్వాపరకథార్థ సమన్వయమును సిద్ధించుచున్నవి.

4. ఔషధహీనుఁ డైన ప్రవరుఁడు విచారించిన విధమును చిత్రించుటకు మారనప్రణాళిక యుపకరించినది :

హిమవారిఁ బెరసి కరఁగిపోగా పాదలేపపరమౌషధవిహీనుఁడై ప్రవరుఁడు దుఃఖ సాగరమున మునిఁగెను. ఈఘట్టము మూలమున నిట్లు కలదు :

శ్లో. విభ్రష్ట పాదలేపోఽథ చిరేణ జడితక్రమః
చింతయామాస కి మిదం మయాఽజ్ఞానా ద్ధనుష్ఠితమ్॥

శ్లో. యది ప్రలేపో నష్టో మే విలీనో హిమవారిణా
శైలోఽతిదుర్గమ శ్చాయం దూరం చాహ మిహాగతః॥

శ్లో. ప్రయాస్యామి క్రియాహాని మగ్నిశుశ్రూషణాదికమ్
కథ మత్ర కరిష్యామి సంకటం మహదాగతమ్॥......

శ్లో. ఏవంగతేతు పశ్యేయం యదికంచిత్ తపోనిధిమ్
సమమోపదిశే న్మార్గం గమనాయగృహం ప్రతి॥

మార్కండేయ ఉవాచ :

శ్లో. స ఏవం చింతయ న్విప్రో బభ్రామ చ హిమాచలే
భ్రష్టపాదౌషధిబలో వైక్లబం పరమం గతః॥[7]

మారన :

కం. అని తలఁచి నిజగృహమునకుఁ
జనఁ గడఁగుటయుం బదములు జడభావం బొం
దిన నద్ధరణీదేవుఁడు
దనమది వెఱఁగంది యవ్విధం బేమియొకో!

కం. హిమవారిఁ గరఁగి మత్పా
దములం బూసిన సదౌషధము పోవుట జో
ద్యము గదిరె నిప్పు డక్కట!
గమనరయం బుడిగె ననుచుఁ గడుదుఃఖితుఁడై.

ఆ. ఇంతదూర మైన యిగ్గిరీంద్రమునకు
నేల నన్ను దైవ మిట్లు తెచ్చె
నెవ్విధమున నింక నే నింటి కేఁగుదు
నేమి సేయువాఁడ? నేది తెరువు?

తే. నిత్యనైమిత్తికము లైన నిఖిలకర్మ
ములకు నాఁడిది యిట్టులు పుట్టె వెదఁగ
నైతి నింటికిఁ జనునుపాయంబు వేఁడి
కావఁగ నిచ్చట నొకతపోధనుఁడు లేఁడె?

వ. అని కడువంతఁ గూరుచు హిమాద్రితటంబున సంచరించు......

(మారన. 4. 225-228)

పెద్దన :

మ. అతఁ డట్లౌషధహీనుఁడై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండిన

7. మార్కం. మహాపు 58, 27-29; 33-34. (30-31. హిమవన్నగవర్ణనము).

న్మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా! నన్నిట్లు దైవంబ! తె
చ్చితె యీదూరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్.

క. ఎక్కడి యరుణాస్పదపుర
మెక్కడి తుహినాద్రి? క్రొవ్వి యే రాఁదగునే?
యక్కట మును నను దెంచిన
దిక్కిది యని యెఱుఁగ; వెడలుతెఱఁ గెయ్యదియో!

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగములు నే సేవింప కుద్దండగం
డకవేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్.

సీ. నను నిమునంబు గానక యున్న నూరెల్ల నరయుమజ్జనకుఁ డెంతడలు నొక్కొ!
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్ళనీక నన్నోమెడుతల్లి యెంతొఱలునొక్కొ!
యనుకూలగతి నాదుమనసులో వర్తించు కులకాంత మది నెంత కుందునొక్కొ!
గెడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు లింతకు నెంత చింతింతు రొక్కొ!

తే. యతిథిసంతర్పణంబు లేమయ్యె నొక్కొ
యగ్ను లేమయ్యె నొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ! కినుక నిట్లు
పాఱవైచితె మిన్నేఱువడ్డచోట!

క. నను నిలు సేరునుపాయం
బొనరింపఁగఁ జాలు సుకృతి యొకఁ డొదవఁడొకో
యనుచుం జింతాసాగర
మున మునిఁగి భయము గదురఁ బోవుచు నెదురన్. (మను. 2. 14-18)

పైమూఁడుభాగములను బోల్చిచూచినచో సంస్కృతపురాణకర్తనుండి పెద్దనవఱకీఘట్ట మును జిత్రించుటలో నొకక్రమపరిణామవికాసము కనఁబడుచున్నది. మూలమునం దున్న భావములకంటెఁ గొన్ని వినూత్నములైనవి జోడించి మారన యొకక్రమమును బ్రకటించెను. భయము - చింత - వితర్కము - ఆశ్చర్యము - దుఃఖము - భయాతిశయము - ఆత్మనింద - ఆవేగము - ప్రత్యాశ - యనెడుభావములతోఁ బోషింపఁబడినదుఃఖాతిశయము మారన కల్పించెను. ఈక్రమము మూలమునందలిదానికంటె రమణీయముగా నున్నది. పెద్దనయు నించుమించు మారనప్రణాళికనే స్వీకరించి బంధువియోగదుఃఖమునుగూడ మధ్యఁ జొప్పించెను. ఆదియం దున్న భయమును అంతమందు నిలిపెను. 'సపదిస్ఫుటార్తి' యనుసమాసముతోఁ బ్రారంభించి, 'చింతాసాగరమున మునింగె' నని చెప్పి దుఃఖభావోదయపరిణామవికాసముల్ను వ్యంజింపఁజేసెను.

మారన సన్నివేశౌచిత్యమును బోషించుచుఁ బ్రయోగించిన యమూలకము లైన కొన్నివాక్యములకు పెద్దన మురిసి, వానినే తనకావ్యమున నొకటికి రెండుసార్లు వాడుకొనినాఁడు. ఉదాహరణమునకు ''ఏల దైవ మిట్లు తెచ్చె - ఇంతదూర మైన యిగ్గిరీంద్రమునకుఁ'' - అన్నమాటలలోని విధివిలాసవైచిత్రీవితర్కరూప మైన దైవస్మరణము పెద్దనకెంతయో నచ్చెను. అందువలననే "హా! దైవంబు! తెచ్చితె యీదూరవనప్రదేశమునకున్'' - అనుమాటలతోనే ప్రవరునివాక్యములను బ్రారంభింపఁ జేసినాఁడు. అంతటితో నాగక ''దైవంబ! కినుక నిట్లు పాఱవైచితె మిన్నేఱువడ్డచోట" నని మఱియొకసారి నోరార పల్కించినాఁడు. ''ఎవ్విధమున నింక నే నింటి కేఁగుదు? నేమి సేయువాఁడ నేది తెరువు'' అను మారనవాక్యములే పెద్దన కొలదిగా మార్చి ''అక్కట! మును నను దెంచినది క్కది యని యెఱుఁగ; వెడలుతెఱఁ గెయ్యదియో?" యని తనకావ్యమున నుపయోగించుకొనినాఁడు!

ప్రవరుఁడు ''మత్పాదంబులం బూసినసదౌషధము వోవుట చోద్యము గదిరె'' నని యన్నమాట లమూలకములు. ఆమాటలలో నాయౌషధప్రభావముపై నాతని కెంత గౌరవభావ మేర్పడెనో వ్యంగ్యముగాఁ జెప్పఁబడినది. పెద్దనయు 'నకలంకౌషధసత్త్వము'ను బ్రస్తావించెను. కాని, యది కరఁగిపోయినందుల కాశ్చర్యము వ్యక్తముచేయించ లేదు. మారనరచన మిప్పట్టున నుదాత్తముగను సహజముగను నున్నది.

మూలమునఁ బ్రవరుఁడిదియంతయుఁ దనయజ్ఞానవశమునఁ గలిగిన దని వాపోవును. మారన దానిని ''వెడఁగ నైతి'' నను నాత్మనిందచే స్ఫురింపఁజేసెను. మారనవాక్యమునే పొడుగించి పెద్దన ''బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ కదా శ్రోత్రియుల్'' అని పలికించినాఁడు. పెద్దన యిప్పట్టునఁ దాను ప్రవరునియందుఁ గల్పించిన తీర్థయాత్రాభిలాషయుఁ గుటుంబసౌఖ్యమును సార్థక మగు నట్లు రెండుపద్యములను రచించి కథాకథనశిల్పమును బ్రకటించెను.

మూలమునం దీఘట్టములో నొదిగియున్న హిమవన్నగవర్ణనమును మారన వదలెను. పెద్దనయు మారనమార్గమునే యనుసరించెను.

### 5. వరూథిని మణిమయవేదికపైఁ గూర్చుండి వీణాగానముచేసె నను కల్పనకు మారన మార్కండేయపురాణము తోడుపడినది :

ఈయంశమును గూర్చి డా. పల్లా దుర్గయ్యగా రిట్లు వ్రాసియుండిరి. ''వరూథిని సహకారముక్రింద శశికాంతవేదికపై నుండి వీణాగానము చేయుట యను కల్పనమును పెద్దన మారనమార్కండేయపురాణమునుండియే గ్రహించెను. ఇందలి ప్రథమాశ్వాసమున దుర్వాసునితపోభంగము చేయుటకు హిమాచలమున నేతెంచిన ''వపు'' వను నచ్చరలేమ

క. చొచ్చి మునీశ్వరుఁ డున్నెడ
యుచ్చోటికి క్రోశమాత్ర మగుట యెఱిఁగి చం

చచ్చూతలతాంతరమున
విచ్చలవిడి చంద్రకాంతవేదికమీఁదన్ -

తే. ఎలమి గూర్చుండి యెలుఁగెత్తి యింపు మిగుల
పట్టిమాకులు చివురులు వెట్ట నతివ పాడె. (మారన. 1.25 - 26)

అను మారన ననుసరించి పెద్దనకూడ వరూథినికథలో వరూథిని సహకారతరుతలశీతల శశికాంతశిలాతలమున గూర్చుండి యింపు తొలుకాడ వీణ వాయించుచుఁ బాడినట్లు మనోహరముగఁ గల్పించెను. సంస్కృతమార్కండేయపురాణమున వరూథినికథలో గాని వపు వను నచ్చరకథలో గాని యిది లేదు. దీనిని వపువృత్తాంతమున మారన కల్పింపఁగా పెద్దన దానిని వరూథినికథలోనికి గైకొనెను." 8

మారన వపువు వీణవాయించుచు పాడె నని స్పష్టముగాఁ జెప్పలేదు. కాని, చూతలతాంతరమున శశికాంతశిలావేదికమీఁద గూర్చుండె ననియు, గాత్ర మెత్తి పాడె ననియుఁ గల్పించెను. ఇది యమూలకము. మారనసొంతము. ఇది పెద్దన కాలంబన మయ్యెను. అణువంత యాధారము దొరకినఁజాలు అంబరమున కెగఁబ్రాకఁగల దిట్టలుకదా మహాకవులు!

## 6. వరూథినిని శతపత్రేక్షణగాఁ జిత్రించుటకు మారన మార్గదర్శకుఁడయ్యెను :

ప్రవరునిప్రథమసందర్శనసమయమున వరూథిని పొందిన మారవికారమును పెద్దన హృదయంగమముగాఁ జిత్రించెను. సూక్ష్మముగాఁ బరిశీలించినచో నీఘట్టము నట్లు రచించుట క్రిందిమారనపద్యము మార్గదర్శక మై యుండవచ్చు నని యూహించుటకు వీ లగుచున్నది.

చ. ''అని కడువంతఁ గూరుచు హిమాద్రితటంబున సంచరించువి
ప్రుని మకరాంకసన్నిభు వరూథిని నాఁ జను నొక్కయప్సరోం
గన లలితాంగకాంతిజితకాంచన విభ్రమచంచదబ్జలో
చన కలహంసయాన కని సంభ్రమసంచలితాంతరంగ యై. (మారన. 4.209)

ఇందలి వర్ణనమంతయు నమూలకమైనదే. దీనికి మూలస్థానమున నున్న -

శ్లో. తం దదర్శ భ్రమన్తం చ మునిశ్రేష్ఠం వరూథినీ
వరాప్సరా మహాభాగా మౌలేయా రూపశాలినీ ॥ (58.35)

అనుశ్లోకమును గమనించినచో మారన కల్పనాప్రతిభ వ్యక్తము కాఁగలదు. మూలమునందలి 'మునిశ్రేష్ఠ' యను పదమునకు బదులు 'మకరాంకసన్నిభుఁ' డని సందర్భౌచిత్యము పాటించి వాడుట దానికిఁ దార్కాణము. పెద్దన మారన వాడిన 'మకరాంకసన్నిభ' సమానభావము నిదివఱకే గ్రహించి ప్రవరునివర్ణనమున నిబంధించియుండుటచే

8. "పెద్దనార్యునిపైఁబూర్వకవులప్రభావము" - డా. వల్లా దుర్గయ్యగారు.

నిప్పట్టున 'నలకూబరసన్నిభుఁ డని పేర్కొనెను. మారనరచనలోని "లలితాంగకాంతి జితకాంచన" పెద్దనపద్యమునందు "విద్యుల్లతావిగ్రహ" యైనది. "విభ్రమచంచదబ్జ లోచన" "శతపత్రేక్షణ" యైనది. సాత్త్వికభావవర్ణనముతో వినూత్నపద్య మావిష్కృత మైనది.

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతిపె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్ మదిలోనికోరికల్
గుబ్బతిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్. (మను. 2.28)

ఈపద్యమునందలి నయనాంబుజములు మారనలోనివే కదా! పెద్దన వరూథినికన్నులను, విలోకనప్రభలను, ప్రఫుల్లనేత్రపద్మములను, ముఖచంద్రు నాక్రమించు ,విశాలనేత్రములను, బిత్తరచూపుల నొక్కొక్కపద్యములో వర్ణించియుండెను. ఈభంగ్యంతరము లన్నియు మారన సూచించిన చంచదబ్జలోచనములవే. మారన భావించిన 'కలహంసయాన' పెద్దన కావ్యరంగమున 'ఝణంఝుణత్కటకనూచితవేగపదారవింద యై లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాఁడ నయ్యెడం బూచినయొక్కపోఁకనును బోదియఁ' జేర నరిగినది. మారన వర్ణించిన సంభ్రమసంచలితాంతరంగమే యీక్రింది పెద్దన పద్యమునం దనుభావరూపమునఁ దారసిల్లినది.

మ. మునుమున్ పుట్టెడు కొంకు లౌల్యము నిడన్ మోదంబు విస్తీర్ణతం
జొనుపన్, గోర్కులు గ్రేక్క దాట, మది మెచ్చుల్ తెప్ప లల్లార్ప, న
త్యనుషంగస్థితి ఱిచ్చపా టొదవ నొయ్యారంబునం జంద్రిక
ల్దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్. (మను. 2.30)

ఇట్లు మారనపద్యమునం దమూలకము లైన భావబీజములు పెద్దనయం దొక్కొక్కటి యొక్కొక్కపద్యమై యవతరించెను. కాని, వీనిని చెప్పుట యిచ్చట ప్రస్తుతముకాదు.

## 7. ప్రవరుని తనూద్గతచారుకాంతి మారన కల్పించినదే :

ప్రవరునిఁ గాంచి వరూథిని యంతరంగమున భావించిన విధమును మారన మూలాతిరిక్తముగా వర్ణించెను. మూలమునఁ బ్రవరుని రమణీయతమాకృతియు, రూపమాధుర్యమును, లలితగతియు, గంభీరదృష్టియుఁ గాంచి వరూథిని యబ్బురపడి యట్టియందగాఁడు తాను చూచిన దైత్యసిద్ధగంధర్వపన్నగకిన్నరకుమారులలో కానరాలే దని పేర్కొనుచు, నతఁ డామెను గ్రహించినచో జన్మ సఫలమగుననియు, నదియొక పుణ్యవిశేష మనియు భావించెను. మారన ప్రవరునిరమణీయాకృతిని-'భాసురరూపకాంతిజితభావజచంద్రుఁడు'అని కీర్తించెను. రూపమాధుర్యమును సురూపవిభ్రమత్వముచే వ్యంజింపఁజేసెను. గంభీరదృష్టులు వినిర్మలవిలాసదృక్కు లైనవి. లలితగతి మృదూల్లసద్గతి యైనది. మారన వీని నన్నింటితోపాటు ప్రవరునికి ముఖాంబుజద్యుతియు, తనూద్గతచారుకాంతియుఁ గల్పించి

యతనితేజోమయత్వమును భాసింపఁజేసినాఁడు. కథయందుఁ దత్కల్పన కున్న సార్థక్యము పెద్దనహృదయము నాకర్షించెను. దానిని దనివితీర నొకసీసపద్యమున వర్ణించెను.

సీ. వదనప్రభూతలావణ్యాంబుసంభూతకమలంబు లన వీనికన్ను లమరు;
నిక్కి వీనులతోఁడ నెక్కసెక్కము లాడుకరణి నున్నవి వీనిఘనభుజములు;
సంకల్పసంభవాస్థానపీఠికవోలె వెడఁదయై కనుపట్టు వీనియురము;
ప్రతిఘటించు చిగుళ్ళపై నెట్టువారినరీతి నున్నవి వీనిమృదుపదములు;

తే. నేరెటేటియసల్ తెచ్చి నీరజాప్త
సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదనుసుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ, గాకున్నఁ గలదె యీమేనికాంతి. (మను. 2.36)

కవితాపితామహుఁడు చేసిన పునస్సృష్టి యిది.

రూపకాంతిజితభావజచంద్రుఁ డన్న బహువ్రీహిసమానమును యక్షతనయేందు జయంతవసంతకంతులం జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువానిగాఁ బెద్దన మార్చెను. "ఇతండు రాగలీలానరసత్వ మొప్పఁ గడులాలసుఁడై ననుఁ జూచెనేని నేఁ జేసిన పుణ్య మెవ్వరును జేయరు కాముని దక్క నేలుదున్" అను మారనవాక్యమునకుఁ బ్రతిబింబముగా "నేలనిబంటుగా మరున్ దక్కఁగొనంగరాదె? యకటా! నను వీఁడు పరిగ్రహించినన్" అని పెద్దన రచించెను, "కాముని దక్క నేలుదున్" అనువాక్యము మారన సొంతము. పెద్దన దానినే గ్రహించెను. కాని, సంస్కృతమునుండి తెచ్చుకొనిన పుణ్యప్రసక్తిని వదలిపెట్టెను.

వరూథిని ప్రవరునిసౌందర్యమును గీర్తించుచు నిట్లనినట్లు పెద్దన:

క. సురగరుఁడోరగనరఖే
చరకిన్నరసిద్ధసాధ్యచారణ విద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె! పోలనేర్తురె వీనిన్. (మను. 2.37)

ఇందలి సురోరగసిద్ధగంధర్వప్రసక్తి మూలమునఁ గలదు. నరకిన్నరప్రసక్తి మారన రచనయందుఁ గలదు. మూలమున దైత్యకుమారులప్రసక్తి యుండఁగా మారన యౌచిత్యము పాటించి వదలెను. పెద్దనకు మారనచర్య నచ్చెను; మనుచరిత్రమునఁ దత్ఫలము కనవచ్చెను.

### 8. 'ఆడవిఁ గాచిన వెన్నెల' - 'శూన్యగేహమున వెత్తిన దీపిక':

వరూథినిని దిరస్కరించి ప్రవరుఁడు పోయినయనంతరము "ముక్తా తేన వరారోహా నినింద నిజయౌవనమ్" (59. 10) - అని యామె తన యౌవనమును నిందించు

కొనినట్లు సంస్కృతపురాణమునందు కలదు. కాని, ఏమని నిందించుకొన్నదో చెప్పఁబడలేదు. మారన యిక్కడ "అడవిఁగాచినవెన్నెల యయ్యె నాదు, జవ్వనం" (5.8)బని నిందించుకొనినట్లు వ్రాసెను. దీని ననుసరించియే పెద్దన "నాదు చెల్వంతము శూన్య గేహమున కెత్తిన దీపిక యయ్యె నక్కటా!" (మను. 3. 8) అని యీసందర్భమున వ్రాసినాఁడు.[9]

మారన మూలాతిరిక్తముగాఁ జెప్పిన యలంకారమునకు ముచ్చటపడి పెద్దన మారుమాటలో మనుచరిత్రము నలంకరించినాఁడు!

9. వరూథిని ప్రవరుని వేడిన దయాభిక్ష మారన వాక్యముల తాత్పర్యమే :

శ్లో. అష్టావాత్మగుణా యే హి తేషా మాదౌ దయా ద్విజ
తాం కరోషి కథం న త్వం మయి సద్ధర్మపాలక! (58.66)

అను వరూథినీవాక్యములను మారన పెంచి రచించెను.

ఆ. అఖిలధర్మవేది వైన నీసుగుణాష్ట
కంబు ముఖ్యగుణము గాదె కరుణ
దానిఁ బూనవలదె తథ్యము నాయందు
దయకు సరియె యొండుధర్మ మనఘ!

క. దయఁ బోల వధ్వరంబులు
దయఁ బోలవు వివిధభూరిదానచయంబు
ల్దయఁ బోలవు జపతపములు
దయ తలపోయఁగ విశిష్టతమధర్మ మిలన్. (4. 245-246)

ఇందు మొదటిపద్యమునందలి చతుర్థపాదమునుండియు మారన స్వీయకల్పనమే. ధర్మార్థప్రబోధరూపమును, అభ్యర్థనరూపమును నగు నీరెండుపద్యములు పురాణసూక్తుల వలె భాసించునట్లు మారన రచించెను. పెద్దన కావ్యదృష్టితో వీనినిఁ జతురవచోవిన్యాసమున మలచి కాంతాసమ్మితముగాఁ బ్రపంచించెను.

ఉ. చేసితి జన్నముల్ దపము చేసితి నంటి; దయావిహీనతం
జేసినపుణ్యముల్ ఫలము సెందునె? పుణ్యము లెన్నియేనియుం
జేసినవాని సద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధి; కో
భూసురవర్య! యింత తలపోయవు; నీచదు వేల చెప్పుమా! (2.72)

మారనవాక్యముల పిండితార్థము పెద్దనపద్దెములోని భావము.

10. స్వరోచివిభుత్వమును గుర్తించినది మారన :

స్వరోచిని గూర్చి చెప్పునపు డెల్ల 'స్వరోచి' యనిగాని, అతఁ డనుసర్వనామము గాని సంస్కృతపురాణము పేర్కొనెను. అతఁడు రాజో కాడో యది తెలుపలేదు.

---

9. "పెద్దనలోఁ బ్రతిబింబించినమారన" - డా. పల్లా దుర్గయ్యగారు.

మారన 'స్వరోచి విభుఁ' డని రెండుమార్లు చెప్పెను. (5.66,79) కాని, యతని 'విభుత్వ' మెట్టిదో వివరింపలేదు.

మారన చేసిన యీసూచనను గ్రహించి పెద్దన స్వరోచి ఆటవికచమూసేవితుఁడై మందరగిరితటమున విశ్వకర్మ నిర్మించియిచ్చిన నగరిలో వసించుచు రాజ్యపాలనము చేయుచుండినట్లు పెద్దన మనుచరిత్రలోఁ గల్పించెను. (4.10)

## 11. పారర్షితపోవన కల్పనము మారనదే :

సంస్కృతపురాణమునందు 'పారర్షి' తపోవన ప్రసక్తియే లేదు. కాని, తెలుఁగు పురాణమునందు 'అలికులకీరకోకిలకలారవరమ్యమహీజరాజిచేఁ బొలుపగు నమ్మునీశ్వరు తపోవనభూమికి వచ్చె పుంజకస్థల యను నప్సరోంగన' (5.58) యనుపద్యమునందు పుంజకస్థల యను నచ్చరలేమ పారర్షి తపోవనమునకు వచ్చినట్లు వర్ణించెను.

పెద్దన యీసూచనను గైకొని తపము నిచ్చఁ జేయఁ దలపోసి కీరభృంగాలిరమ్యమైన యాశ్రమమున పారర్షి ఘోరతపము చేయుచుండగాఁ దద్భంగము చేయుటకు పుంజకస్థల వచ్చినట్లు కల్పించి, కొంతకథ పెంచెను. (చూడు. 6.19-39)

## 12. కలహంసీచక్రవాకములసంవాదమును దీర్చిదిద్దుటలోఁ బెద్దనకు మారన తోడ్పడెను :

స్వరోచియనురాగమునుగూర్చి తమలో వాదించుకొనిన కలహంసీచక్రవాకము లెచ్చట నున్నవో సంస్కృతపురాణమునఁ జెప్పఁబడలేదు. అవి 'యొకకమలాకరంబు'లో నుండినట్లు మారన చెప్పెను. దీనినిబట్టి పెద్దన యొకపద్యమునఁ బ్రత్యేకముగా గాసారమును వర్ణించెను. (6.63) ఈ సందర్భమునందలి :

శ్లో. అభీష్టా కస్యచిత్కాంతా కాంతః కస్యాశ్చి దీప్సితః
పరస్పరానురాగాఢ్యం దాంపత్య మతిదుర్లభమ్. (62.10)

అను శ్లోకమును-

ఆ. మగడు గలసెనేని మగువ తాఁ గలియదు
మగువ గలసెనేని మగఁడు గలయఁ
డెలమి నొండొరువుల నిరువుర మనములఁ
గలుపుఁ బూర్వసుకృతఫలము సుమ్ము. (మారన 5.72)

అని మారన మూలముకంటెఁ గొంతభిన్నముగాఁ దెనిఁగించెను. 'పూర్వజన్మఫల' మను భావము శ్లోకమునందు కనరాదు. ఈ మారనపద్యము ననుసరించియే పెదనయు నీక్రింది పద్యము రచించినట్లు తోచును.

క. మెలతకుఁ బతిపైనైనను
మెలతుకపైఁ బతికి నైన మేలగు టెందున్

గలయది మెలతకుఁ బతికిన్
వలపుసమం బగుట జన్మవాసన చెలియా! (మను. 6.66)

మారన మూలమునందలి "ప్రవర్తతే నహి ప్రేమ సమం బహ్వీషు కుత్రచిత్" (62.17) శ్లోకపాదమును

క. విను కలహంసీ! యొక్కని
మన మొక్కతెయందు నొకతె మన మొక్కనియం
దు నిలుచుఁ దిరమయి యది వల
పనఁగాఁ దగుఁ బ్రియము పలువు రందుఁ గలుగునే. (మారన. 5.78)

అని తెనిగించెను. పెద్దనయు మారన ననుసరించి దీని నీక్రింది పద్యములో నిట్లే చెప్పెను.

ఆ. తగులు నెవ్వఁ డొక్కతరుణికి, నొకనికి
మెలత వలచు నదియ మే లనంగ
వచ్చుఁ; గాని పెక్కువనితలపైఁ గూర్మి
గలుగు ననుట బొంకుగాదె తరుణి. (మను. 6.64.)

18. కురంగపల్లభవర్ణనముపై మారనప్రభావము కలదు :

స్వరోచి సతీయుతుఁడై విహరించుచు నొక్కయెడ మృగీతతులు తనచుట్టు బలిసి యున్న నొక కురంగవల్లభునిఁ గాంచెను. దానివర్ణనము మూలమున నిట్లు కలదు.

శ్లో. సుస్నిగ్ధపీనావయవం మృగీహృదయహారిణమ్
ఆశ్రితాభి స్సురూపాభి ర్మృగీభిః పరివేష్టితమ్. (62.24)

ఈ శ్లోకపు మొదటిపాదమును మారన "కనకమయాంగదీప్తు లెసగంగ సమున్నత శృంగరంగదాననరచు ల్లుల్లసిల్ల నయనద్యుతిజాలము పర్వ" అని మూలాతిరక్తముగాఁ గురంగవల్లభుని వర్ణించెను. దీని ననుసరించి పెద్దన-

శా. "కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకాఖర్వప్రభామంజులా
స్యాంచన్ మేచకరత్నవిభ్రమసనాథానూనదృగ్గోచులన్" (6.77)

అని వర్ణించెను. ఇందలి కనకప్రభలు, దృగ్గోచులు సంస్కృతమున లేవు. ఇవి మారన చెప్పినవే.

దీని తరువాత నున్న "ఆకృష్టా ఘ్రాణపుటకా జిఘ్రస్తీ స్తా స్తతో మృగః"(62.25) అను శ్లోకపాదమును మారన స్వతంత్రమార్గమున ని ట్లనువదించెను.

గీ. మనము లలరఁ జూడ్కులుఁ గడు మ్రాలఁ జెవులు
వ్రాల హరిణాంగనలు రాగలోల లగుచు
జేరి హరిణేంద్రునెమ్మొము మూరుకొనుచుఁ
నఱ్ఱు నాకుచు నున్న నాహరిణవిభుఁడు. (మారన. 5.82)

ఇందలి భావ మంతయు శ్లోకమున లే దనుట స్పష్టము. ఈపద్యము ననుసరించియే పెద్దన.

క. కని సతులకుఁ జూపెడుతటి
ఘనముగఁ దమచెవుల వాలుఁగన్నులు సోలన్
మొన సెలవి యెత్తి ప్రియునా
ననమున్ మూర్కొనుచు నట్టు నాకెడువేళన్. (మను. 6.78)

అనివర్ణించెను.[10]

14. ఇష్టదేవతాస్తుతిపై మారనప్రభావము :

మారన మార్కండేయపురాణారంభమున నిష్టదేవతాస్తుతి నొనర్చుచుఁ గ్రమముగా హరిహరబ్రహ్మగజాననవాణీస్తుతుల నొనర్చియుండెను. అల్లసాని పెద్దనయు మనుచరిత్రారంభమున నీక్రమముననే యిష్టదేవతాస్తుతి యొనర్చెను.[11] ఇది యాదృచ్ఛికమే కావచ్చును ; లేక మార్కండేయపురాణోక్తప్రకారము చెప్పుటలో నొకవిలాసము కావచ్చును ; ఏమైన నేమి ; అది యొకసత్యము.

## మనుచరిత్రప్రబంధ వస్తువిస్తృతిపై సంస్కృతాంధ్రోభయ పురాణప్రభావము :

పెద్దన మారనమార్కండేయపురాణములోని కల్పనలను గ్రహించుటయేకాక సంస్కృతపురాణమునందలి కొన్నియంశములను గూడ గైకొని యారెండింటిని మేళవించి తాను విశిష్టమైక నూత్నకల్పనల నొనర్చి కథను బెంచియుండెను. కొన్నిచోట్ల మూలానుసారి యై నడచెను. అట్టివిశేషములలోఁ గొన్నింటి నుదాహరణమున కిచ్చుట పేర్కొనుట జరుగుచున్నది.

1. ప్రవరుని స్వరూపస్వభావ కల్పనమునకు బీజములు సంస్కృతాంధ్ర పురాణములందుఁ గలవు :

పెద్దన ప్రవరునిస్వరూపస్వభావాదివర్ణనము సంస్కృతాంధ్రోభయపురాణముల కంటె నత్యంతవిపులముగా నొనర్చెను. అట్లొనర్చుటకు రెండుహేతువులు కలవు. ఒకటి : మారన ప్రవరుని నమలోదాత్తునిగాఁ జిత్రింప నవకాశము కల దని సూచించుట. రెండు : వర్ణనప్రధాన మైన ప్రబంధమున నగరాదివర్ణనలతోపాటు నాయకవర్ణనము గూడ నొనర్చి కావ్యమర్యాదను బాటించుట. ఈరెండును ప్రవరునిపరిపూర్ణవ్యక్తిత్వ సృష్టికి దోహదము లైనవి. పెద్దన ప్రవరునివర్ణన మెంతవిస్తృత మొనర్చినను అందలి ప్రత్యంశమును గథార్థపోషకముగా నుపలక్షించెను. అది మహాకావ్యనిర్మాణదృష్టి ;

10. "పెద్దనలోఁ బ్రతిబింబించిన మారన" (రేడియోప్రసంగము) డా. పల్లా దుర్గయ్య.
11. ,, ,, ,, ,, ,,

ఈఘట్టమునందలి పెద్దనకల్పనావైభవమంతయు నొకవిధముగా "నాపురిఁ బాయకుండు" (1.51) నను వాక్యార్థము చుట్టును దిరుగుచున్న దని చెప్పవచ్చును. నగరాదివర్ణనముతోపాటు నాయకవర్ణనముకూడ దానిని సమర్థించుచున్నట్లు చేయఁబడినది. సమర్థుఁ డగుటచే పెద్దన దీనితోపాటు పెక్కుకావ్యార్థప్రయోజనముల నేకత్ర సాధించుకొనినాఁడు.

ప్రవరునికథయందు కథాగతికిఁ దోడ్పడు గుణ మతని తీర్థయాత్రాగమనాభిలాష. దానికి దోహదము కల్పించినది అతిథిజనార్చనాభిరతి. కథాఫలమున కనుకూలమైన హేతు వతని వైరాగ్యము ; దానికిఁ బరీక్ష కల్పించునది యతని సౌందర్యము ; పుష్టి కలిగించునది యతని నైష్ఠికజీవన విధానము. కథాగతి కథాఫలసిద్ధి కనుకూలమై వర్తింపవలెను. తత్తద్ధేతువుల సంవిధానమున నేకవాక్యత భాసింపవలెను. పెద్దన యీ పని చేసెను.

సంస్కృతాంధ్రపురాణములు ప్రవరుని సౌందర్యమున కగ్రస్థాన మిచ్చి వర్ణించెను. మారన ప్రవరుని పే రుచ్చరింపక పూర్వమే యతఁ డశ్వినులకంటె సుందరుఁ డని ప్రశంసించెను. సంస్కృతమార్కండేయ పురాణమున సౌందర్యాతిశయమును జెప్పవలసినచో దత్కర్త యశ్వినీదేవతలతో నౌపమ్యము సంధించుట సర్వసామాన్యముగాఁ గనవచ్చుచున్నది. అట్టి సంస్కృతపురాణమర్యాదనే మారన తెలుఁగునఁ బాటించెను. పెద్దన యశ్వినుల ప్రసక్తి వదలెను. కాని, మారనవలెఁ బ్రవరుని పే రుచ్చరింపక పూర్వమే యతని సౌందర్యమును గీర్తించెను. వరూథినీవిరహమునకు మూలకంద మైన ప్రవరసౌందర్యమును గీర్తించెను. వరూథినీవిరహమునకు మూలకంద మైన ప్రవరసౌందర్యము కథ కాయువుపట్టు దానిని 'మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి' యని వినూత్నోపమాలంకార విశేషముగాఁ బెద్దన యావిష్కరించినాఁడు. తెలుఁగువారీసమాసమును జదువుకొని మురిసిపోవుచుందురు. ఇచ్చట పెద్దన కీస్ఫూర్తి నిచ్చినవాఁడు మారన. అది తెలియవలె నన్నచో నాంధ్రపురాణకథలో వరూథిని ప్రవరునిఁ గాంచి వలపుగొన్న సన్నివేశము చదువవలెను. వరూథిని"మకరాంకసన్నిభుఁ"(4.229) డైన విప్రునిఁ జూచినట్లును, 'భాసురరూపకాంతిజితభావజచంద్రుఁ డితం' (4.230)దని యుబ్బిపోయినట్లును, మారన వర్ణించెను. అది యమూలక మైన కల్పన: పెద్దన దాని నిచ్చట సార్థకముగా వాడుకొనెను. కథలోఁ బ్రవరసౌందర్యము వరూథినిచే వరింపఁబడుటకే కల్పింపఁ బడుటవలన నతనిసుందరమూర్తి ప్రప్రథమమున నామెచే దర్శింపఁబడినప్పుడామెలోఁ గలిగిన యపూర్వభావజభావచైతన్యమునకువ్యంజకముగా మారన చిత్రించి యుండ పెద్దన దానిని గ్రహించి తనకావ్యమునం దా నాయకగుణవర్ణనమున స్థాపించుట శిల్పలక్షణ మెఱిఁగి చేసినపని. దీనినిబట్టి పెద్దన మారనవిరచిత మైన కథ నామూలాగ్రముగా సూక్ష్మదృష్టితోఁ బరిశీలించె నని స్పష్ట మగుచున్నది.

ప్రవరుని సౌందర్యమునకు దీప్తిఁ గలిగించినది యతని వైరాగ్యము. పెదన దాని నిట్లు వర్ణించెను:

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్షసేయు జారకామినులకు
భోగబాహ్య మయ్యెఁ బూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె. (మను. 1.52)

ఈకల్పనము సార్థకమైనది. ప్రవరుఁడు వరూథినిని నిరాకరించి గార్హపత్యాగ్నినిఁ బ్రార్థించి త్వరితగమనసిద్ధిని గోరినప్పుడు మారన రచించినమాటలు గమనించినచో నీ కల్పన కవి ప్రేరకము లని స్ఫురింపకపోవు

క. పరనారీపరధనరతి
పరత్వ మెన్నఁడును నాకుఁ బాటిల్లని యా
స్థిరసత్యమహిమ నతిస
త్వరితగమనసిద్ధి గలుగవలయు హుతవహా! (మారన. 4.253)

సంస్కృతాంధ్రపురాణకథలయందు ప్రవరుని యాస్థిరసత్యమహిమను విస్తరించి చెప్పు వర్ణనము లేదు. పెద్దన యాలోపమును దీర్చెను. వరూథినీసంగపరిత్యాగము ప్రవరుని వైరాగ్యమునకుఁ బరాకాష్ఠ : అది యొకయపూర్వసన్నివేశము : అందలి యతనివైరాగ్య సిద్ధి యొక్కసారి యాకాశమునుండి యూడిపడినది కాదు. నిత్యసాధనమున గడించినసిద్ధి. అట్టి సాధనకు నరుణాస్పదనగరవేశ్యాజనమే ప్రవరునికిఁ దోడ్పడినది. భావికథార్థము లను బ్రసన్నమొనర్చుటకును, అందు సహజత్వము భాసించుటకును పెద్దన యీవర్ణన మొనర్చెను. "ఇది అచ్చముగా కథాకథనశిల్పము. ఎలయనఁగా ప్రవరుఁడు వైరాగ్య వంతుఁడు; ఏకపత్నీవ్రతుఁడు; అగ్నిహోత్రి. ఇంతియేగాక ఆయూరివెలయాండ్ర నాట్య వైభవ మెఱిఁగినవాఁడు; అతఁడు వరూథినినిఁ గాంచినప్పుడు కోరిక యెట్లును లేదుకదా! ఆశ్చర్యము కూడ లేదు. ఈకథాకథనములో నున్నవైచిత్రి యిది : కొన్నిలక్షణములు గలిగినయొకపురుషుఁ డున్నాఁడు. అతని కొకవిధాన మేర్పడును. ఈదృగ్లక్షణసహితుఁ డైనవాఁడు ఆసంవిధానమునం దెట్లు ప్రవర్తించును ? స్వలక్షణానుసారముగనే ప్రవర్తించును. కలిగినసంవిధానము ఫలవంతము కానిలక్షణము వానిశీలమునందే కలదు. నిస్సంశయముగా ఆసంవిధానవైయర్థ్యమే ప్రాప్తించును. ఒకవేళ భిన్నముగా జరుగ వచ్చును. జరుగుటకు వీలు లేదు. అందుచేత భిన్నముగా జరుగలేదు. తనరచించినకథలో నిట్టిలక్షణములు పెట్టి కథానిర్మాణము చేసి ఆకథను సూక్ష్మాంశరమణీయముగాఁ జిత్రించి రచించుటలోనే కథాకథనశిల్ప మున్నది."–[12] అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొనియున్నారు.

ప్రవరుఁ డలేఖ్యతనూవిలాసుఁ డని పెద్దన వర్ణించుటకుఁ బురాణకర్తలు ప్రేరకు లగుచున్నారు. వరూథిని ప్రవరుని సురూపవిభ్రమమును, తనూద్గతచారుకాంతియు, మృదూల్లసద్గతియును, వినిర్మలదృగ్విలాసములను, ముఖాంబుజద్యుతియును గాంచి,

12. అల్లసానివాని అల్లిక జిగిబిగి-వ్యాసము 7. పుట 98.

యతఁడు మానవదేవకిన్నరకుమారులకంటె నందమున మిన్నయైనవాఁ డని యబ్బురపడిన దని మారన వర్ణించెను. మూలమున నిందులోఁ గొన్ని కలవు. పెద్దన యతని సురూపవిభ్రమములను ప్రత్యేకముగా నచ్చట పేర్కొనక 'యీతనూవిభవ మెచ్చటి?' య ని మాత్రమే ప్రశంసించెను. తనూవిభమునకుఁ గారణములు ''అలేఖ్యతనూవిలాసములు''. వానిని ప్రవరవర్ణనమున స్థాపించెను. ప్రవరునితనూవిలాసము లతఁడు విషయైకభోగి యను భ్రాంతిని వరూథినికిఁ గల్పించుటచే నతని సౌముఖ్యము సాధించుట కొఱకు పైఁబడి కౌఁగిలించినది. అట్టి కీలకమైన సౌందర్యలక్షణము చెప్పుట శిల్పవిశేషము.

ప్రవరుఁడు భాషాపరశేషభోగి యనినాఁడు పెద్దన! ఇచ్చట ప్రవరుని నతుల గుణోత్తరునిగా రూపొందించు కవిహృదయము సుస్పష్టము! ప్రవరుఁ డాదర్శబ్రాహ్మణుఁడు. అతని కుండవలసినశక్తులలో ముఖ్యమైనది వాక్శక్తి. అది వేదాధ్యయనము వలనను, మంత్రజపహోమతత్పరత్వము వలనను, శాస్త్రాధ్యయనాధ్యాపనాదులవలనను ఏర్పడును. శక్తిసంపన్నమైన వాక్కు దేవతలను బ్రసన్నులుగా నొనర్చును. కథలో నగ్నిదేవుని సమ్యక్ప్రసాదసిద్ధి వడసినప్రవరునివాక్కున కాశక్తి యున్న దని వ్యంజింపఁ జేయుట కేర్పడిన విశేషణ మది. శ్రీవిశ్వనాథవారు కథాఫలము నుపలక్షించి దీని సార్థక్యమును మఱియొకవిధముగాఁ గూడ సమర్థించియుండిరి. ''బ్రాహ్మణధర్మ ముత్తమమైనచో వాఁడు భాషాపరశేషభోగి, వివిధాధ్వరదీక్షాపరతంత్రుఁడు, అధ్యయనాధ్యాపననిరతుఁడు కావలెను...వానిని రాజు పోషించును. మాన్యము లిచ్చును. అతఁడు పోయి యాచించడు. ఏరా ఇచ్చినను సాలగ్రామము నైనను స్వీకరింపఁడు. ఇవి బ్రాహ్మణునకుఁ గావలసినధర్మములు, వీనిలోఁ బ్రధానమైనది. 'భాషాపరశేషభోగి' యనుట. అనఁగా వ్యాకరణశాస్త్రమును దెలిసియుండుట! అనఁగా మానవునియొక్క వాక్స్వరూపము తెలిసికొనియుండుట. ఉచితమైన వాక్కేది? ధర్మమైనవా క్కేది? శాశ్వత మైన వాక్కేది? ఇది మనువునకుఁ గావలసిన ప్రధానలక్షణము. వాగ్వ్యవహారము లేక లోకము వర్తించదు. ఆవాక్కునకుఁ బరమశాసకుఁడు పతంజలి. ఆలక్షణము ప్రవరునిజీవునియందు నిండియున్నది.''[13] ఈపరమార్థమును వ్యంజింపఁ జేయుట మఱియొకప్రధానప్రయోజనము. అంతియగాక అరుణాస్పదపురమున నంబురుహగర్భకులాభరణుఁ డంతకంటెఁ దక్కువస్థాయిలో నుండుటకే వీలులేదుకదా పెద్దన సృష్టిలో! అతనిశబ్దశాస్త్రపారగత్వము గాంచి శిష్యు లతనిచుట్టు మూగినారు. అ ట్లతని కొకజంజాటక మేర్పడినది-అతఁ డాపురి వీడకుండుటకు ఇది యవాంతరప్రయోజనము. దానికిఁ బోషకముగ 'ననారతాధ్యాపనతత్పరుఁ' డని పెద్దన ప్రవరు నాదర్శోపాధ్యాయునిగాఁ దీర్చిదిద్దినాఁడు. బ్రహ్మచారులు వెంటరాఁ బ్రజ మెచ్చి చూచుచుండ వరణాతరంగిణినుండి యింటివఱకు బ్రాహ్మణుని నడపించుట యతని యాచార్యత్వప్రదర్శన

---

13. అల్లసానివాని అల్లిక జిగిబిగి - వ్యాసము 2, పుట 27.

మునకే. ఆనుషంగికప్రయోజన మైన దైనందినిక నిష్ఠావ్రతనిరూపణము వానికిఁ బోషక మగుట పెద్దన నేర్పునకుఁ దార్కాణము!

పెద్దన ప్రవరుని వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రునిగా నొనర్చెను. సంస్కృతాంధ్రపురాణకర్త లాతని నాగమోక్తకర్మజాతనైష్ఠికునిగాఁ జిత్రించిరి కాని సోమయాజి యని స్పష్టము చేయరైరి.[14] బ్రాహ్మణధర్మములను నిరూపించు మనుధర్మశాస్త్రము-

శ్లో. అధ్యాపన మధ్యయనం యజనం యాజనం తథా
దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానా మకల్పయత్ ॥ (1.88)

అని నిర్దేశించుచున్నది. కావున బ్రాహ్మణకులశ్రేష్ఠుఁ డైన ప్రవరుఁడు యజ్ఞప్రవక్తుఁ డగుట యుచితమే. అందును వివిధమైన సవనకర్మలయందు దీక్ష వహించుటలోఁ బారతంత్ర్యము కల్గియుండుట యుదాత్తగుణమే! మూలమున -

శ్లో. సాయంప్రాతర్హుతం హవ్యం లోకా న్యచ్ఛతి శాశ్వతాన్
త్రైలోక్య మేత దఖిలం మూఢే హవ్యప్రతిష్ఠితమ్ ॥

శ్లో. అభీష్టా గార్హపత్యాద్యాః [15]సతతో మన్త్రయోఽగ్నయః
రమ్యం మమాగ్ని శరణం [16]వేదీ విష్టరిణీప్రియా ॥ (58. 62 - 63)

అనుమాటలు ప్రవరుఁడు వరూథినితో ననినట్లుండ మారన వీని నిట్లు తెలుఁగుచేసెను.

సీ. "అనలునియందు రేపును మాపు వేల్వంగఁ
బడు హవ్యములఁ జేసి పడయవచ్చు
పుణ్యలోకంబులు పొలఁతి నీ వెఱుఁగ వీ
త్రిజగంబు హవ్యప్రతిష్ఠితంబు" ............

తే. వినుము దర్భలు నగణులు వేదికలును
నగ్నులును నాకుఁ గరము ప్రియం బొనర్చు
గాని యొం డందుఁ బ్రియ మెదఁ గలుగ దనిన - (మారన. 4. 244)

పెద్దన: తరుణీ! రేపును మాపు హవ్యములచేతం దృప్తుఁడై వహ్ని న
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు; నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లైన ట్లన్యముల్ గా; వొడల్
తిరమే? చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్.
(మను. 2. 65)

పెద్దన యిచ్చట మూలముకంటె మారననే యధికముగా ననుసరించె నని స్పష్ట మగుచున్నది. పురాణకర్త ప్రవరుని సోమయాజి యని చెప్పకపోయినను, పెద్దన యతనిని వివిధాధ్వరదీక్షాపరతంత్రుఁ డని పేర్కొనినను ఇప్పట్టన నతనిమాట లొక్కటిగనే

14. చూడుడు; మారనమార్క. 4.252; మార్కం. మహాపు. 58.79
15. సతతం మే త్రయోగ్నయః - (తరం. ప్రె. ప్రతి).
16. వేదిర్విష్టరిణీప్రియా - (తరం ప్రె. ప్రతి).

యున్నవి. దీనిని బట్టి పెద్దన పురాణమున వ్యంగ్యముగా భాసించుచున్న సోమయాజిత్వము ను ప్రవరగుణవర్ణనమున స్పష్టపఱచినాఁ డనవచ్చును. వరూథినికిఁ బ్రవరునిచేత "అహితాగ్ని నేఁ; దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి! నేఁ డిలు సేరకుండినన్"(2.53) అని పెద్దన చెప్పించినాఁడు. పురాణములం దీఘట్టమున నైనను ప్రవరుఁడు సోమయాజి యనుభావము స్పష్టము చేయఁబడలేదు.

తే. నిత్యకృత్యము ల్సలుపంగ నిజగృహమున
కిపుడ యరుగంగవలయు నా కిందువదన
చనునుపాయ మేయది సెప్పు; నను సముద్ధ
రింపు; నిత్యక్రియాహాని పెంపు నడఁచు. (మారన. 4. 238)

ఇందు ప్రవరుఁ డాహితాగ్ని యని చెప్పుకొనలేదు. అగ్నిహోత్రవ్యాపారము లుంచుకొను వాఁడు ఆహితాగ్ని. నైష్ఠికుఁడైన ప్రతిగృహస్థుఁడును అగ్నికార్య మాచరింపవలె నని మనుస్మృతి.

శ్లో. అగ్నిహోత్రం చ జుహుయా దాద్యన్తే ద్యునిశోః సదా
దర్శేన చాఽర్ధమాసాన్తే పౌర్ణమాసేన చైవ హి. (4. 25)

ఆహితాగ్ని తప్పక సోమయాజి యై యుండవలసిన యవసరము లేదు. నైష్ఠికుఁడై యుండియుండవచ్చును. ఇంత చెప్పుట యెందులకనఁగాఁ బ్రవరునివలె నగ్నిప్రసాదము వడయుటకు విప్రుఁడు సోమయాజియై యుండవలసినయవసరము లే దనియు, నిత్యాగ్ని హోత్రకార్యదీక్షావ్రతుఁ డైనచోఁ జాలు ననియు నూహింప వీలగునట్లు పురాణరచనము సాగినది. పెద్దన్నయుఁ బ్రవరునిసోమయాజిత్వమువలన నీకథాసన్నివేశమున ప్రత్యేక ప్రయోజనములు సాధింపలేదు.

పైపెచ్చు వరూథినిచేతఁ 'జేసితి జన్నముల్ దపము చేసితి నంటి; దయావిహీనతం జేసిన పుణ్యముల్ ఫలము సెందునె?" (2.72) అని పెద్దన ప్రశ్నింపఁజేసినాఁడు. ఈవాక్యముపై మారనప్రభావము కల దని వెనుక చెప్పఁబడినది. "దయఁ బోల వధ్వరంబు" (4.246) లనుమారనపద్యములో సాధారణముగా నన్న 'అధ్వర' శబ్దమును గైకొని వాక్యము మార్చి పెద్దన 'జన్నము' లని యిచ్చుట సోద్దిష్టముగాఁ బొదివిచెప్పినాడే కాని నిజముగఁ జూచినచోఁ బ్రవరునిచేత నామెతో నామాట లెక్కడ చెప్పించినాఁడు పెద్దన? కవి మనకు చెప్పినచో నతఁ డామెతో నన్న ట్లగునా?- కావున ఫలితార్థ మేమనఁగాఁ బెద్దన ప్రవరునిగుణవర్ణమునందు మారన సూచించిన అతులగుణోన్నతత్వకల్పనమార్గమున గమించి, యతనిని యౌవనమందు యజ్వను జేసినాఁడు. అట్లు చేయుటవలన నతఁ డింటిపట్టును వీడకుండుటకు మఱియొక బలమైన కారణము లభించినది. దీనికిఁ దోడు ప్రవరునిజీవలక్షణమున నేర్పడియున్న సవనదీక్షానిరతి మనువుజీవనంపుటియందుఁ బ్రవేశించి యతనిని యజ్ఞధర్మప్రవర్తకునిగా నొనర్ప వీలగుచున్నది. దీనివలనఁ బెద్దన గారి కల్పనము పరమసార్థక మగుచున్నది.

పురాణకర్తలు ప్రవరునికుటుంబవివరములనుగూర్చి పట్టించుకొనలేదు. పెద్దన నతని నొక సంపన్నగృహస్థు నొనర్చెను. కూకటుల్ గొలిచి పెండ్లి చేసిన సోమిదమ్మ సౌఖ్యావహ యై భజించుచుండునఁట! అదియు నాతఁ డాపురిఁ బాయకుండుట కొక కారణమేయో! తల్లిదండ్రులు పార్వతీపరమేశ్వరులవలె సుఖులై నింటినిఁ జక్కదిద్దుచుండిరఁట! అతని కింటిపనులపట్టింపు లేదు. అతనిశిష్యులేమో! అతని యధ్యాపనమేమో! సంస్కృతమున నతఁడు వేదవేదాంగపారగుఁ డని కలదు. మారన వేదాంగములసంగతి చెప్పలేదు. ఏమైనను పురాణములందు అధ్యయనతత్పరుఁ డని చెప్పఁబడియుండగా పెద్దన యధ్యాపన తత్పరునిగా మార్చె నని భావము. వేదశాస్త్రవిద్యార్థులనిని విద్యార్థులకుఁ బంచిపెట్టినగౌరవము పెద్దనకుఁ దక్కినది.

సంస్కృతమార్కండేయ పురాణకర్త అగ్నిసన్నిభ మైన బ్రాహ్మణధర్మమునకుఁ బ్రతీకగా భూదేవప్రవరునిఁ గల్పించి యతని తేజోమయరూపము వరూథినీగర్భమునందు ప్రతిబింబించినట్లు చెప్పుటయే ప్రధానముగా భావించి తల్లక్ష్యసిద్ధికిఁ గథను నూటిగా నడిపించినాఁడు. అచ్చట ప్రతీకయే ప్రధానము కాని యభిధానము కాదు. మారన యాప్రాధాన్యమును బ్రతీకనుండి యభిధానమునకు మార్చినాఁడు; ప్రవరునకుఁ బేరు పెట్టి సగుణాకృతిఁ గల్పించినాఁడు. కాని, ధర్మముచే నతనిని నిశితముగా శాసించాఁడు. అందువలననే మారన పురాణమునఁ బ్రవరునియింట నగ్నులు, అరణులు, దర్భలు, తప్ప వేఱొండు కానరావు. అతనిచిత్తమున నుద్దీప్తబ్రాహ్మణధర్మముకంటె నన్యమునకు తావు లేదు. ఆంధ్రమార్కండేయమున వ్యక్తి నాశ్రయించిన ధర్మము తేజరిల్లినది. పెద్దన తనకావ్యమున ధర్మము నాశ్రయించిన వ్యక్తిని సృష్టించినాఁడు. అతని ప్రబంధమున ప్రవరుఁడు తనబ్రతుకు తాను బ్రతుకుచు ధర్మమును తనపంచలోఁ బెంచి పెద్దదానినిఁ జేసినాఁడు. అతనికి గంపెడంత సంసార మున్నది. అతనిచుట్టును ప్రబల మైన నాగరికత పెనవైచికొని యున్నది. ఆతఁ డెంత యలౌకికుఁడో అంత లౌకికుఁడు. అతఁ డుదాత్తుఁడు! అతులగుణోత్తరుఁడు! మారన నాటిన మొక్క పెద్దన ప్రబంధోద్యానమున మూఁడుపూవులాఱుకాయ లైనది.

## 2. ప్రవరుని అతిథిజనార్చనాభిరతి సంస్కృతాంధ్రపురాణములనుండి గైకొనఁబడినది :

ప్రవరుఁ డభ్యాగతసేవాపరతంత్రసకలజీవనుఁ డని పెద్దన వర్ణించెను. 'పెదన పారతంత్ర్య' 'తత్పర' శబ్దములు సాభిప్రాయముగా వాడెను. ప్రవరుఁ డధ్వరనిర్మలధర్మకర్మదీక్షలకును, అభ్యాగతసేవలకును పరతంత్రుఁ డైనవాఁ డనియు, అధ్యాపనమునందు తత్పరుఁ డైనవాఁ డనియు తాత్పర్యము. తత్పరత్వమున నాసక్తి ప్రధానము. పారతంత్ర్యమునఁ బరాధీనత ప్రధానము. అందు అన్యథాకరణమున కాస్కారము లేదు. కావున నాసక్తినిబట్టి యధ్యాపనమున కెప్పు డైన నభ్యంతర మేర్పడవచ్చునేమో కాని

యతిథిసేవకు మాత్ర మాటంకము లే దని చమత్కారము. "సకలజీవనుఁ" డను బహువ్రీహిసమాసప్రయోగస్వారస్య మదియే.

పెద్దన యీయంశమును రెండుపద్యములలో వర్ణించినాఁడు. అందు మొదటిపద్యమునకు సంస్కృతమార్కండేయము ప్రేరక మైనది. ''సదాఽతిథిప్రియో రాత్రా వాగతానాం సమాశ్రయః" (58.6) అని మూలము. మారన రాత్రియందు వచ్చువారికిని ఆశ్రయసత్కారముల నొనర్చువాఁ డనుభావమును వదలెను. ఈయంశము ప్రవరుని సదాఽతిథిప్రియత్వమును సమర్థించుట కేర్పడినదే కాని యట్టిసన్నివేశము కథలో నెచ్చటను కానరా దని కాబోలు మారన త్రోచిపుచ్చినాఁడు. పెద్దన దీనిని వదలక తనకావ్యమున గ్రహించి ప్రవరునిసహధర్మచారిణియందుఁ బ్రతిష్ఠించి సార్థక్యము కల్పించినాఁడు.

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతనిగృహిణి
నతిథు లేతేర నడికిరే యైనఁ బెట్టు
వలయుభోజ్యంబు లింట నవ్వారిగాఁగ. (మను. 1.56)

పేరు తెలియని యీసోమిదమ్మసౌ రెట్టిదో గాని తీరుమాత్రము చెప్పి తెలుఁగువారికి కాశి అన్నపూర్ణను మఱపునకుఁ దెప్పించినాఁడు పెద్దన! మగనిమనస్సునకు 'సౌఖ్యావహ యై భజించు' విధమున కిది వ్యాఖ్యానమేమో! వలయుభోజ్యము లింట దండిగా నుండుటకు మాన్యక్షేత్రములు పెక్కుచందాలఁ బండు ననియు, నింటియం దొకప్పుడును బాడి పంటలు తరుగ వనియు హేతుకల్పనము చేసినాఁడు.

పెద్దన "తీర్థసంవాసు లేతెంచినా రని విన్న" ననుపద్యమునఁ బ్రవరునియతిథిజనార్చనాభిరతిని, తీర్థసందర్శనాభిలాషను, వర్ణించెను. అం దారెండుగుణములకు పోష్యపోషకసంబంధము కల్పించి చమత్కరించెను. అది మారన చూపించిన మార్గముయొక్క విస్తరణము. ఎట్లనఁగా; సంస్కృతమునఁ బ్రవరుఁ డతిథిప్రియుఁ డని యున్నది. అతనికి అతిరమ్యవనోద్యాననానానగరశోభిత మైన వసుంధరను దర్శింపవలె ననెడి యభిలాష కల దని మఱియొకశ్లోకమున వర్ణింపఁబడియున్నది. (58.7). మారన దానిని ''అతిథిజనార్చనాభిరతుఁడై చరియించుచు శైలకాననాంచితసకలావనీతలవిశేషము లెల్లను బ్రీతిఁ గన్గొన న్మతిఁ గడుఁ గోరుచుండు'' (4 214) నని తెలుఁగుచేసినాఁడు పెద్దన మారనవాక్యమును గాఢముగా భావించెను. అతఁ డతిథిప్రియుని నర్చనాభిరతునిగా మార్చినాఁడు. 'చరియించుచు' ననుక్రియాప్రయోగముచే నాక్రియయందలి యాతని పారతంత్ర్యమును వ్యంజింపఁజేసెను. పెద్దన దానిని గ్రహించి ప్రవరునియతిథిజనార్చనావిధానమును విపులముగా వర్ణించెను. సంస్కృతాంధ్రపురాణములలో నతిథిశబ్దమే కలదు. పెద్దన తైర్థికు లని పేర్కొనెను. వారివలన ప్రవరుఁడు వనధిపర్వతసరిత్తీర్థమాహాత్మ్యములు తెలియ నెఱుఁగుట కవకాశము కల్పింపఁబడినది; అది తీర్థయాత్రాభిలాషను పొంగఁ జేసినది. ''ప్రీతిఁ గన్గొన న్మతిఁ గడుఁ గోరుచుండు" నను మారనకవిహృదయముకూడ నిట్టిదే! కాని, యది పెద్దనరచనలోఁ బుష్టి నొంది స్పష్టమైనది!

3. ప్రవరుని తీర్థసందర్శనాభిలాష:

ప్రవరునికిఁ దీర్థయాత్రాభిలాష కల దని పెద్దన. తీర్థ మనఁగా ఋషులచే సేవింపఁ బడిన జలాశయ మని శబ్దార్థము. కాని, యిప్పుడు పుణ్యస్థల మేది యైనను తీర్థమే యని రూఢియుం దేర్పడినది. ఆలెక్క తోఁ జూచినచోఁ బెద్దనగారి ప్రవరునకుఁ బుణ్యభావ సంవలిత మైన క్షేత్రాదిసందర్శనాభిలాష యొండు కల దని స్పష్టమగుచున్నది. మూల కర్తగాని మారన కాని యిట్లు చెప్పలేదు. వారు ప్రవరునిభూతలసౌందర్యదిదృక్షామతిగనే చిత్రించిరి. అది యాకాలమునకును, ఆపురాణపాత్రమునకును సరిపోయినది. పెద్దన నాటికి దైవక్షేత్రతీర్థాదిమహిమ లున్నప్రదేశములు దర్శించుట తీర్థాటన మనియు, నట్లు కానిచో దేశాటన మనియు నేర్పడి రెండవది నిందాపాత్ర మయి యుండును. అందువలనఁ బ్రవరుని దేశాటనాసక్తికిఁ బుణ్యార్జనానురక్తియుఁ జోడింపఁబడినది. "పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థమహిమ వినుటయు నఖిలకల్మషహరం" బనెడి ప్రవరునిమాటలం దది స్పష్టము చేయఁబడినది.

తీర్థాటనమువలనఁ బెక్కుప్రయోజనములు సాధింపఁబడును. వానిలో ముఖ్యముగాఁ బుణ్యస్థలతీర్థదేవాదిదర్శనము, ప్రకృతిసౌందర్యవీక్షణము, లోకజ్ఞతాసంపాదనము మొ॥ నవి పేర్కొనఁదగినవి. వీని నన్నింటిని ప్రవరునియభిలాషయందు భాసింపఁజేయుట పెద్దనచాతుర్యము.

సూక్ష్మముగాఁ బరిశీలించినచోఁ బెద్దన కల్పించిన తీర్థయాత్రాభిలాషకు సంస్కృత మార్కండేయపురాణము దోహద మొనర్చిన దని చెప్పవచ్చును.

శ్లో. [17] అభ్యర్థితస్తు తే నాసౌ శ్రద్ధాపూతేన చేతసా
తస్యాచఖ్యే స దేశాంశ్చ రమ్యాణి నగరాణి చ॥

శ్లో. నదీవనాని శైలాంశ్చ పుణ్యాన్యాయతనాని చ
సతతో విస్మయావిష్టః ప్రాహ తం ద్విజసత్తమమ్॥ (58.9-10)

శ్రద్ధాపూతముగా నభ్యర్థితుఁ డైన యాసిద్ధుఁడు ద్విజసత్తమునకు ననేకదేశములను గుఱించియు, రమ్యమైన నగరములను గుఱించియు, నదులు, వనములు, శైలములు, పుణ్యాయతనములగుఱించియుఁ, జెప్పె నని యందలి తాత్పర్యము. సిద్ధుఁడు చెప్పిన వానిలోఁ బుణ్యాయతనముల ప్రసక్తి కలదు. వానినిగూర్చి చెప్పు మని ప్రవరుఁ డభ్యర్థించె ననియు, స్పష్టమగుచున్నది. అనఁగా నదీవనశైలనగరదేశాదులను జూచువేడుకతో పాటు పుణ్యాయతనముల దర్శించు పుణ్యబుద్ధియు నతఁడు ప్రదర్శించె నన్నమాట। మారన పుణ్యాయతనప్రసక్తి వదలెను. మూలమునందును నీయొక్కచోటునతప్ప మఱి యెచ్చటను నిట్టి ప్రసక్తి లేదు. కావున మారనయు నీయంశము వదలియుండవచ్చును. అట్లుచేయుటకు మఱియొకటి కారణము కావచ్చును. వేంకటేశ్వరప్రెస్ప్రతిలో "అభ్యర్థిత" అని యున్నచోట తరంగిణీప్రెస్ప్రతిలో 'అభ్యర్చితః' అని కలదు. ఇందు

17. "అభ్యర్చితస్తు" అని తరం. ప్రె. ప్రతి. పాఠము.

"అభ్యర్థితః" అనుపదము ప్రవరుని తీర్థయాత్రాభిలాషను చాటుచున్నది. "అభ్యర్చితః" అనుపద్య మతని యతిథిజనార్చనాభిరతిని వ్యక్తము చేయుచున్నది. మారన యిందలి రెండవయంశమును మాత్రము గ్రహించి వివరించి వ్రాసెను. పెద్దన రెండింటిని గ్రహించి విశిష్టముగా మేళవించెను.

పెద్దన కథావసరమునందు నీరెండంశముల కుచితమైన స్థాన మిచ్చెను. కాని, ప్రవరునిహృదయమందు తాను కల్పించిన పుణ్యార్జనాసక్తినిమాత్రము కొట్టవచ్చినట్లు చిత్రింపలేదు. పాదలేపవరమౌషధము పాదములకుఁ బూసికొనినవెంటనే యతనికిఁ గలిగినది తుహినభూధరశృంగశ్యామలకోమలకాననహేమాద్యదరీఝరీనిరీక్షాపేక్షయే! హిమవత్పర్వతవిశేషములను బరికించుచు డెందమునఁ బురిగొను కౌతూహలముతోడ నాభూమీసురుఁడు కోరుకొనినది - గిరికటకతటనిరంతరతరుగహనగుహావిహారమే! పుణ్యతీర్థైకదర్శనాభిలాషి యట్లూహింపఁడు. మారన పేర్కొ నినట్లు శైలకాననాంచితసకలావనీతలవిశేషము లెల్లను బ్రీతిఁ గన్గొనన్మతిఁ గడు గోరుచుండువాఁడుమాత్రమే యట్లు భావింపఁగలఁడు. దీనినిబట్టి పెద్దన రచనాప్రణాళికపై మారన వైచిన ప్రభావము స్పష్టమగుచున్నది.

4. హిమగిరివిశేషవర్ణనమున సంస్కృతపురాణము తోడ్పడినది :

సంస్కృతపురాణమున హిమవంతము 'నానాప్రస్రవణాన్వితము'గా భావింపఁబడినది. మనోజ్ఞము లగు నాహిమభూధరసానుప్రదేశములందు విహరించు సిద్ధకిన్నరగంధర్వాప్సరోగణములు వర్ణితము లైనవి. మఱియు మూలమున హిమనగవర్ణన మిట్లున్నది;

శ్లో. [18]క్వచి త్ప్రస్రవణాదృష్ట జలపాత మనోహరమ్
ప్రనృత్య చ్ఛిఖి కేకాభి రన్యత శ్చ నినాదితమ్॥
శ్లో. [19]దాత్యూహకో యష్టికాద్యైః క్వచి చ్చాతిమనోహరైః
పుంస్కోకిలకలాలాపైః [20]శ్రుతిహారిభిరన్వితమ్॥
శ్లో. [21]ప్రఫుల్లతరుగంధేన వాసితానిలవీజితమ్
ముదాయుక్తః స దదృశే హిమవన్తం మహాగిరిమ్॥ (58. 23 - 25)

సంస్కృతపురాణకర్తవలెనే పెద్దన తనకావ్యమున నాగిరిని ప్రస్రవణాన్వితముగా నిర్మించెను. ప్రవరునియపేక్షలో ఝరీనిరీక్షణము కూడ చేర్చెను. పెద్దన చేసిన హిమవన్నగపర్వతవర్ణనమునఁ గొన్ని పద్యములు :

చ. అట చని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన

18. క్వచి త్ప్రస్రవణం దృష్ట్వా. (తరం. ప్రె. ప్ర.)
19. దాత్యూహస్తోకరావై శ్చ క్వచి చ్చాతిమనోహరమ్ (తరం. ప్రె. ప్ర.)
20. మనోహారిభి రన్వితమ్. (తరం. ప్రె. ప్ర.)
21 ప్రోత్ఫుల్లతరుగన్ధేన. (తరం. ప్రె. ప్ర.)

స్ఫుటనటనానుకూలపరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. (2. 3)

సీ. కులిశధారాహతి బోలుపునఁ బైనుండి యడుగు మోవఁగ జేసరైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరము వాలుఁ జలువయౌ నయ్యేటికెలకులందు

తే. గెరలు పికశారికాకీర కేకి భృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్షగాన
ఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె. (2. 19)

చ. నికటమహీధరాగ్రగతటనిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువ" (2.21)

క. ఉల్లలదలకాజలకణ
పల్లవితకదంబకుసుమపరిమళలహరీ
హల్లోహలమదబంభర
మల్ల ధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. (2. 6)

పెద్దనరచనలోఁ బెక్కుచోట్ల నిట్లు గిరిఝురులు వర్ణితములై యున్నవి అట్లు వర్ణించుట "ప్రస్రవణాన్వితముగా" నగ్గిరిని దర్శించిన సంస్కృతపురాణకర్త హృదయమునకు విస్తృతకల్పనము. మూలమునందలి జలపాతము, నాట్యము చేయు కలాపిజాలము, శ్రుతిసుభగము లైన పక్షులకలకలారావములు, గంధర్వయక్షగానములు, ప్రఫుల్లతరుపుష్పగంధబంధుర మైన మరుదంకురములు మొ॥ నవి సంస్కృతమునఁ గలవు. వానికి విశిష్ట మైన యాకృతులను, పరిసరములను, గల్పించి రసబంధుర మైన కవిత్వదర్పణమునఁ బ్రతిబింబించున ట్లొనర్చినాఁడు పెద్దన.

మారన మార్కండేయపురాణ ప్రథమాశ్వాసమునందలి ద్రోణచరిత్రమున హిమవంతమును వర్ణించుచు "లతాంతోల్లస, ద్ఘనరేఖాంచితసానుమంతము మరుద్దంతిస్ఫురత్ప్రాంతమున్."(1.22) అని వర్ణించెను. "కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్" అను పెద్దనకల్పన కిది ప్రేరక మై యుండవచ్చును :

## వస్తునిర్మాణము :

వస్తునిర్మాణపద్ధతి ననుసరించి స్వారోచిషమనుసంభవకథను రెండుభాగములు చేయవచ్చును. వరూథినీవృత్తాంతము పూర్వభాగము; స్వరోచివృత్తాంతము ఉత్తరభాగము. పూర్వభాగ ముత్తరభాగముకంటె నుదాత్తమైనది. అట్లగుటకు నైసర్గికము లైన పెక్కుకథార్థములే కారణములు.

1. పూర్వార్ధమందలి కథాగతి వేగవంతమును, చైతన్యసుందరమును, సన్నివేశరమణీయమును నై యుండఁగా నుత్తరార్ధము మందవేగమును, వర్ణనాబహుళమును నయి

కథానిర్వహణమునకు మాత్ర మనుకూలించు నలతియలతివృత్తాంతములకూర్పుతో నంత హృదయాహ్లాది యగుట లేదు. ఇందులకు లోకమే సాక్ష్యము. మనుచరిత్రమును జదువ నారంభించిన తెలుఁగుపఠిత మొదటిమూఁడాశ్వాసములఁ బఠించుటయందుఁ జూపిన యభిరుచి తరువాతికథపైఁ బ్రసరింపకుండుట ప్రసిద్ధమేకదా !

2. మొదటిభాగమున ముగ్గురుపురుషులు, ఒక్కస్త్రీ రంగమునఁ గానుపింతురు. ఉత్తరభాగమున ముగ్గురుపురుషులు, నలుగురువనితలు పాల్గొందురు. అందుచే నుత్తరార్ధము పాత్రబహుళమై యున్నీలనశిల్పరచనమున కంతగా నవకాశము లభింపలేదు.

3. పూర్వభాగమునందలి పాత్ర లన్నియు పరిణతములైన సంపూర్ణపాత్రలు. ఉత్తరభాగమున నాయకుఁడైన స్వరోచి యపరిణతుఁడు, అసంపూర్ణుఁడు. పరిణతి యంతఃకరణశక్తివలనను, లక్ష్యశుద్ధివలనను వ్యక్తి కేర్పడును. స్వీయసంకల్పమును స్వయంసాధనచే సఫల మొనర్చుకొనఁ గలిగినచో సంపూర్ణత యేర్పడును. పూర్వభాగమునఁబ్రవరుఁడు నిత్యాగ్నిహోత్రి; వేదవిహితమైన యగ్నికార్య మతనిశక్తి. మంత్రౌషధులశక్తికంటె నది శాశ్వత మైనది; ఆంతరమైనది. చిత్తశుద్ధితో సాధించిన యాశక్తినిఁ బ్రవరుఁడు విపత్కరపరిస్థితియందు సార్థకముగాఁ బ్రయోగించి తరించినాఁడు. ఔషధసిద్ధుఁడు పాదలేపాఖ్యపరమౌషధము సాధించి వయస్తంభనమును, వాయుగమనశక్తిని బొందిన కార్యశూరుఁడు. అతని సాయమునఁ దీర్థసందర్శనాభిలాషను దీర్చుకొనినను ప్రవరుఁడు గార్హపత్యాగ్నిప్రసాదలబ్ధితో నౌషధసిద్ధునికంటె నున్నతస్థాన మందుకొనినాఁడు. వరూథినీగంధర్వులు భోగైకశీలురు. తమకు నచ్చినయందము నందుకొని భోగించునంతవఱకు విశ్రాంతి నొందని యుద్వేలచిత్తవృత్తులు. ఇం దెవరికివారు స్వయంసంపూర్ణులే.

సంపూర్ణపాత్రలచే నిర్వహింపఁబడు సన్నివేశములందు కవి పాత్రపోషణమునందు శక్తి వెచ్చింప నవసరము లేకయే పాత్రచిత్రణమును ద్విగుణీకృతశక్తితో నిర్వహింపఁ గలఁడు. స్వరోచివంటి యపరిణతపాత్రలయం దది సాధ్యము కాదు. ప్రవరపాత్రకువలె స్వయంసంకల్పప్రేరణచే నొకకార్యసాధన కుద్యమించు చైతన్యక్రియాశక్తి అతనికి లేదు. అందువలన నాపాత్రకుఁ బరిపూర్ణత సిద్ధింపలేదు. అతఁడు తనబ్రతుకున కొక గమ్యమున్న దని గుర్తింపలేదు. అన లట్టిదానికొఱ కెన్నడును యత్నము చేయలేదు. అతఁడు జన్మతః తేజశ్శాలి,పరాక్రమవంతుఁడు, దయామయుఁడు. ఈమూఁడు గుణములును గ్రమముగాఁ దేజస్వి యైన పుత్త్రునిఁ గనుటయందును, రాక్షసాకృతితో నున్న ఇందీవరాక్షుని బారినుండి మనోరమను రక్షించుటయందును, ఆయుర్వేదప్రభావమున విభావసీకళావతుల ననామయమూర్తులుగా నొనర్చుటయందును విశ్రాంతము లగుచున్నవి. ఇట్లతని గుణగణము సఫల మగుటకుఁ బరప్రేరణమే హేతు వగుట గమనింపఁ దగిన విశేషము. మృగయాకౌతుక మతనికి నెఱుకుతేనిప్రేరణవలనఁ గలిగినదే. రాక్షసాకారుఁడైన నిందీవరాక్షునిపైఁ బావకబాణము సంధించు నేర్పునకు మనోరమాదత్తమైన అస్త్రహృదయవిద్యాస్ఫూర్తియే కారణమైనది. విభావసీ కళావతుల కొనర్చిన వైద్యసేవకు ఇందీవరాక్షుని యాయుర్వేదవిద్యాప్రదానమును, మనోరమాప్రేరణయును హేతువు

లగుచున్నవి. స్వారోచిష మనూత్పత్తికి వనదేవత హేతుభూతమైనది. హంసీచక్రవాకీ సంవాదము, మృగీమృగసంవాదము నతనికిఁ గర్తవ్యబోధ నొనర్చినను దానిని గ్రహించి జీవితలక్ష్యమును గుర్తించు నంతఃకరణశక్తియు నతనికి లేదు. కావున నుత్తరార్ధమున నాయకునికి స్వయంప్రేరకశక్తి లేకపోవుట కథాశక్తికే కొంత లోపమై తారసిల్లినది. అది యెట్టి వేటవర్ణనలు చేసినను, ఎన్నివివాహవర్ణనలు చేసినను పూరింపఁబడునది కాదు.

4. భావసంఘర్షణ మెచ్చట చిత్రింపఁబడునో యచ్చట కథకు శక్తి కలుగును. అట్టిది పూర్వార్ధమున నడుగడుగున నున్నది. ఉత్తరార్ధమున లేనేలేదు. ప్రవరుఁడు వినీతుఁడు, అవికత్థనుఁడు; ఔషధసిద్ధుడు లౌకికుఁడు, దాంభికుఁడు. కాని, ప్రాగల్భ్యమున నిరువురును సమానులే. అట్లగుటచే చతురవచోనైపుణ్యము తేటపడ నిరువురును సంభాషణ మొనర్చిరి. అందు ప్రతివాఁడును ఎదుటివాఁ డావులించినఁ బ్రేవులు లెక్కపెట్టఁగలఁడు. కావున నెదుటివానికిఁ జిక్కకుండ వచఃకవచమున నాత్మరక్షణ చేసికొనగలఁడు. ఎదుటివాఁ డాకవచమును భగ్నమొనర్చుచో నెత్తుకు పైయెత్తు వేయఁగలఁడు. స్వభావవిరుద్ధము లైన రెండు చిత్తవృత్తులు పచరించు వాగ్వ్యూత్తులమధ్య చమత్కార మైన సంఘర్షణము సిద్ధప్రవరుల సంభాషణమున వెల్లివిరిసినది. ప్రౌఢుఁడైన సిద్ధవరుని పేఁపబుట్టలో భద్రముగా దాచఁబడిన పాదలేపమును బైకిఁ దీయించిన సామర్థ్యము ప్రవరుని వాక్ప్రాగల్భ్యమునఁ గలదు. గార్హపత్యాగ్నిని స్తుతించి తత్ప్రసాదమును బొందుటయం దది సఫలమైనది.

వరూథినీప్రవరు లేకత్ర సమావేశ మగుట దేవలోకభూలోకమర్యాదలు, భోగకర్మసిద్ధాంతములు, శృంగారశాంతములు, నొక్కచోట సంఘర్షణపడుట వంటిది. దేవతలు భోగైకవృత్తులు, మానవులు కర్మైకప్రవణులు. కర్మఫలమే భోగ మని యెంచువాఁడు కర్మిష్ఠి. భోగము నాశించి కర్మను త్యజించువాఁడు కాముకుఁడు. దేవభోగములు పుణ్యకర్మఫలక్షతి కేర్పడినవి. కర్మిష్ఠి కాముకుఁ డైనచో నిహపరములందుఁ జెడును. కావున కర్మాచరణమువలనఁ జిత్తశుద్ధియు, దానివలన జ్ఞానమును సాధించి "బ్రహ్మానందాధిరాజ్యపదవీస్థితుఁడు" కావలయు నని భావించిన సోమయాజి-ప్రవరుఁడు. అప్సరోంగన యైన వరూథిని కీమార్గము తెలియదు. నిత్యయౌవను లైన దేవజాతులు వయోధర్మ మైన భోగమునే ప్రధానముగా భావించి, తత్స్వయం దాసక్తు లైన వారినే బంధుకోటిగా భావించుచుందురు. అందువలననే ప్రవరుఁడు వరూథినీ సంభోగము నొల్లక యింటి కేగెద నని పలుక వరూథిని యాశ్చర్యపడుట! ఉత్తరదక్షిణధ్రువములవలె నున్న ఈరెండు భావములకును, స్వభావములకును నేర్పడిన సంఘర్షణమే మనుచరిత్ర ద్వితీయాశ్వాసము నందలికథ.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారి పై
యంచుల్ మోవగఁ గౌఁగిలించి యధరం బాసింప 'హా శ్రీహరీ'

2. "అర్చనావిధి" మారన చూపించెను :

ఇంటికి వచ్చిన యతిథిని ప్రవరుఁడు పూజించినవిధము మూలమునఁ జెప్పఁబడ లేదు. తరంగిణి ప్రెస్‌ప్రతిలో నతఁ డతిథి నర్చించె నని మాత్రము కలదు. (58.4) మారన దానినిఁ బెంపుచేసి "అద్విజుం డతని వందన పూజల హృష్టచిత్తుఁగాఁ జెచ్చెరఁ జేసె" (4.215) నని పేర్కొనెను. పెద్దన తీర్థసంవాసు లేతెంచినచోఁ బ్రవరుఁడు వారి నర్చించువిధము నంతకుఁబూర్వము (1.57) విశద మొనర్చి యుండుటచే నిచ్చట మారన సూచన ననుసరించి - ఈక్రిందిపద్యము రచించెను.

తే. ఇట్లు చనుదెంచు పరమయోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేఁగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి. (మను. 1.60)

మారన రచనలోని వందనము - పూజనము - హృష్టచిత్తుఁగా నొనర్చుట - యనెడి క్రియాకలాపమే పెద్దన తేటగీతికి తెఱవు చూపించిన దనుట స్పష్టము.

3. సిద్ధుని 'మునీంద్రా!' యని పిలచుట మారన నేర్పినదే :

సంస్కృతపురాణమున నౌషధసిద్ధుఁడు ద్విజుఁ డనియు, బ్రాహ్మణుఁ డనియుఁ బేర్కొనఁ బడియున్నాఁడు. మారన యతనిని స్వయముగను, పాత్రముఖముననను - భూసురుఁ డనియు, మునీంద్రుఁ డనియు, మునివల్లభుఁ డనియు, మునినాయకుఁ డనియు పేర్కొనెను. పెద్దన మారన గైకొన్న స్వాతంత్ర్యమును గాంచి తానును అతనినిఁ బరమయోగీంద్రుఁ డనియు, విద్వంద్వంద్యుఁ డనియు, మౌనినాథుఁ డనియు, మహాత్మuఁ డనియు, మునిలోకగ్రామణి యనియుఁ - బ్రవరునిచే సంబోధింపఁ జేసెను.

4. ప్రవరుఁడు 'ఈషదంకురితహసనస్రగసిష్ణగండయుగళుఁ' డయ్యె నను కల్పనకు మారనరచనము దోహద మైనది :

బహుదేశనగరనదీవనశైలపుణ్యాయతనములను గాంచితి నని చెప్పిన విప్రుని వాక్యములు విని ప్రవరుఁడు విస్మయావిష్టుఁ డయ్యె నని సంస్కృతపురాణము. "అనేక దేశములను ద్రిమ్మరి క్రమముగాఁ బెక్కుచోద్యములు గంటి" నని యహంభావముతోఁ జెప్పుకొను సిద్ధునిఁ దప్పకఁ జూచి ప్రవరుఁడు నవ్వె నని మారన. అల్లసానిపెద్దన ప్రవరుని పెద్దగా నవ్వింపక నీషదంకురితహసనస్రగసిష్ణగండయుగళుం డయ్యె నని మాత్రము గడుసుగాఁ జెప్పి యతనిశీలమునకు మెఱుఁగుపెట్టెను.

ప్రవరునియందుఁ బొడకట్టవలసిన యాశ్చర్యభావమునకు బదులు అవిశ్వాస మూలక మైన దరహాసము కలుగుటకు హేతువు సిద్ధునివాక్కులలోఁ గొట్టవచ్చినట్లు కన వచ్చు దాంభికత్వము. సంస్కృతమున నట్టిలక్షణము సిద్ధునివాక్కులలోఁ గానరాదు.

కవి యతనిమాటలు కథాకథనముగాఁ జెప్పివేయుటయే దానికిఁ బ్రధానకారణము. మారన యీపల్కులను పాత్రముఖమున ననివించి సన్నివేశమును సంభాషణశిల్పసుందర మొనర్చెను. సిద్ధునిమాటలలోని "అనేకదేశముల్" "క్రచ్చర" "ద్రిమ్మరితి" "ఒగిన్ గాంచితిఁ బెక్కుచోద్యముల్" అనుపదములయొక్క యుచ్చారణలోని యూనికవలన దాంభికత్వము, ప్రాగల్భ్యము కలిగింపఁబడినవి. పెద్దన తనచమత్కారవచనరచనా ప్రావీణ్యము వెలార్చి ప్రవరసిద్ధులసంభాషణము రచించెను. సిద్ధునిదాంభికత్వ మచ్చు పడునట్లు చిత్రించుటలో పెద్దన కృతకృత్యుఁ డయ్యెను. అందు - "ఓచతురాస్యవంశ కలశోదధిపూర్ణశశాంక ! (1.70) కేదారేశు భజించితిన్" (1.61) - అనుపద్యము లొక యెత్తు. దిక్పర్వతవిశేషవర్ణనాత్మక మైన దీర్ఘవచనము (1.72) మఱియొక యెత్తు. విభజించి యడిగిన విషయమును మూకఉమ్మడిగాఁ జెప్పుట పద్యములందు కానవచ్చును. విభజించి చెప్పినవిషయమునందు శబ్దాడంబరముతప్ప విశేష మేమియు లేకుండుట వచనమునందుఁ బొడఁగట్టును. ఇది పెద్దన చేసిన విభాగము; హాసోదయమునకు విభావ మైన చక్కని వాగ్వికృతి

ప్రవరుఁడు సిద్ధునిమాటలు నమ్మజాల నని పలికిన యాక్షేపణవాక్యములను మారనకంటెఁ బెద్దన రమణీయముగా రచించెను.

మారన :

ఉ. వాయపురజ్జు లేల మునివల్లభ ! వృద్ధుఁడ వొండెఁ గావు లేఁ
బ్రాయపు వాఁడ వద్రివనరమ్యము లైన యనేకదేశము
ల్దీయుత ! యల్పకాలమునఁ ద్రిమ్మర శక్యమె ! నీకు నెమ్మెయి
న్వేయును నేల నమ్మ నెద నీపలు కన్న మునీంద్రుఁ డిట్లనున్. (4.217)

పెద్దన :

చ. వెఱవక మీ కొనర్తు నొకవిన్నప : మిట్టివి యెల్లఁ జూచిరా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జిఱుతతనంబు మీమొగము సెప్పక చెప్పెడు; నద్దిరయ్య ! మా
కెఱుఁగఁ దరంబె మీమహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్. (1.73)

మూలమునఁ బ్రవరునివాక్యము లతిసాధువు లై శంకానివారణకొఱకు మాత్రమే యడుగఁ బడినట్లు రచియింపఁబడియున్నవి. 'అయ్యా ! అనేకదేశదర్శనము చేసితి మని చెప్పు చున్నారు. కాని మీరు అలసినట్లు కానరాదు. చూచుట కతివృద్ధులు కారు. యౌవనము నుండి యెక్కువగా మరలియుండలేదు. కావున కొలదికాలములోఁ బృథివి యంతయు నెట్లు సంచరింపఁగలిగితి' రని సంస్కృతపురాణమున(58.11)నుండ వాని ననువదించుచుఁ బ్రవరుఁడు, సిద్ధుని నాక్షేపించినట్లు మలచి రచించినాఁడు మారన. అమలుపు-"వాయపు రజ్జు లేల మునివల్లభ", "అద్రివనరమ్యము లైన", "అల్పకాలమున", "నమ్మ నెద నీపలుకు" అనెడిమాటలచేత ధ్రువీకరించెను. మూలమున "నతివృద్ధుఁడవు కా" వని

యుండగా మారన "లేఁబ్రాయపువాఁడ" వని మార్చినాఁడు. వయస్సామ్యమును గమనించి, వికత్థనత్వముపై నొక్కి విసరు విసరి, అద్రివనగమనక్లేశమును నిరూపించి, అల్పకాలమున ననేకదేశములను దర్శించుట యసాధ్యమని శంకించి, నీపలుకు నమ్మజాల నని అవిశ్వాసము ప్రకటించినక్రమము మారనరచనమున గలదు. పెద్దన మారనవలెనే సిద్ధునకుఁ బ్రాయపుంజిఱుతతనంబు కల్పించినాఁడు. ప్రవరుని నోట మారనకంటె వాడి యైన మాటలను పలికించినాఁడు. "అద్దిరయ్య" "మీమహిమ లిఱ యెఱుంగుదురు" "ఏమి చెప్పుదున్" అన్నమాటలు నిజముగా "వాయపురజ్జు లేల" యనువానికంటె వ్యంగ్యార్థశక్తిచే బల మైనవి. కాని, 'వెఱవక మీ కొనర్తు నొక విన్నపము -' అను వినయముద్రిత మైన యుపక్రమణికతో వానితీవ్రతను మందగింపఁ జేసి పెదన వాక్చాతుర్యము ప్రకటించినాఁడు.

మూలమునఁ బ్రవరుఁ డతిసాధువు. మారన యతనిని సూటిగా నిర్భయముగా 'గుండబ్రద్ద లగునట్లు మాడలాడువానిగాఁ జిత్రించెను. పెద్దన యతనిని నిగూఢవాక్చైపుణ్యమును వెలార్చుప్రౌఢునిగాఁ దీర్చిదిద్దెను. మారన సరళవర్తనమునకుఁ బ్రాధాన్యమిచ్చెను. పెద్దన గడుసైన నాగరకసభ్య మర్యాదను బోషించెను. ఈభేదమే పౌరాణికప్రవరుని నవ్వులోను, మాటలలోను, ప్రబంధప్రవరుని గండయుగళములోను, వాక్యసరళిలోను గానఁబడుచున్నవి.

శ్రీ పేకుమళ్ళ అచ్యుతరావుగారు మారనకల్పనవలన ప్రవరసిద్ధుల పాత్రపోషణయోగ్య మైన దనియు, పెద్దన వారిసంభాషణము కొంత మార్చి వారిశీలములకు మెఱుఁగు పెట్టె ననియుఁ బేర్కొనియుండిరి.[23] మారనప్రవరుఁడు మునులశీలము నెఱుంగని యప్రౌఢుఁ డనియు, పెద్దనగారిప్రవరుఁడు యోగసిద్ధునితో నీచిన్నిపాపడు మాటలాడుటకే వెఱచుచున్నట్లు మాటలాడె ననియు, గురువునొద్ద శిష్యుని కుండఁదగిన వినమ్రతను భక్తిని జూపించె ననియు వివరించిరి. మనుచరిత్రలోని ప్రవరుఁడు ప్రకటించినది మూలమునందువలె నాశ్చర్యభావ మని వ్యాఖ్యానించిరి. కాని, రావుగారు పెద్దన ప్రవరపాత్రకుఁ గల్పించిన గడుసుఁదనముగాని, ఈషదంకురితహసనస్నిగ్ధగండయుగళములు వ్యంజింపఁజేయు ధ్వనిమాధుర్యమునుగాని లెక్కింపక మాటలు రాని చిన్నిపాపనిగా నిరూపించిరి. మారనరచనలోఁ బ్రవరుఁడు ప్రౌఢుఁ డయ్యెను. పెద్దనసృష్టిలోఁ బరిపూర్ణుఁ డయ్యెను. దానిని గుర్తింపనిచో కవిహృదయము గుర్తింప నట్లగును.

5. ఔషధసిద్ధుఁడు తాను సిద్ధుఁడ నని చెప్పుకొను కల్పనము మారనదే:

ప్రవరునిశంకకు సమాధాన మీయఁ బ్రారంభించిన యౌషధసిద్ధుఁడు ముందుగా "నేనొక సిద్ధుఁడ న్వినుము మహీసురశేఖర" అని స్పష్టము చేసినట్లు మారన. ఆవాక్యము నకువ్యాఖ్యానము చేసినట్లు పెద్దన "వినవయ్య! జరయు రుజయును జనకంగా వెఱచు

23. ఆంధ్రవాఙ్మయచరిత్రము - ద్వితీయభాగము పుట 149-150.

మమ్ము సిద్ధుల మగుటన్" అని విస్తరించి వ్రాసెను. అమూలక మైన యీ సంభాషణము యొక్క యుపక్రమణిక మారనకవి కల్పనయే :

6. పాదలేపము నిశలయందు పనిచేయ దని ధ్వనింపఁజేసినవాఁడు మారన :

శ్లో. మంత్రౌషధిప్రభావేన విప్రాప్రతిహతాగతిః
యోజనానాం సహస్రం హి దినార్ధేన వ్రజా మ్యహమ్". (158.12)

అని మూలమున నుండ - మారన

"దానిఁ బదంబులందుఁ దగఁ దాల్చిన నెంతయు నిర్జితశ్రముం
డై నరుఁ డేగు యోజనసహస్రము నాపగలింటిలోపలన్" (4.218)

సంస్కృతమునందలి దినార్ధమును మారన దివముగా మార్చి స్పష్టపఱచినాఁడు. చివర ఏవార్థకస్ఫూర్తిచేత రాత్రులయందు పాదలేపధారణ మయోగ్య మని వ్యంజింపఁజేసినాఁడు. తదర్థము గమనించి పరమవంగ్యముగాఁ బెద్దన యీక్రిందిపద్యమును వెలయించినాఁడు.

క. దివి బిసరుహబాంధవసైం
ధవసంఘం బెంత దవ్వు దగ లే కరుగున్
భువి నంతదవ్వు నేమును
రవరవలే కరుగుదుము హుటాహుటినడలన్. (1.76)

ఇందలి వస్తుధ్వని పరమరమణీయము.

7. పాదలేపము యొక్క మంత్రప్రాధాన్యము చెప్పకుండుటకుఁ ద్రోఁచఁ జూపినది మారన :

ప్రవరుని కతిథిగా వచ్చినవాఁడు ఔషధిప్రభావజ్ఞుఁ డనియు, మంత్రవిద్యావిశారదుఁ డనియుఁ గలదు. అతఁ డల్పకాలమున ననేకదేశములను బర్యటింపఁ గలుగుటకుఁ గారణము మంత్రౌషధిప్రభావ మని పేర్కొనెను. ప్రవరునకుఁ బాదలేప మిచ్చుచు దాని నభిమంత్రించి, దిశానిర్దేశాదిక మొనర్చెను. మూలమున నిట్లున్నది :

శ్లో. [24]ప్రాదా త్స బ్రాహ్మణ శ్చాస్మై పాదలేప ముదారధీః
అభిమన్త్ర్యామాస [25]దిశంతే నాఖ్యాతాం చ యత్నతః ॥ (58.15)

సిద్ధుఁడు పాదలేపప్రదానసందర్భమునఁ దాని నభిమంత్రించె ననుప్రసక్తి మారన గ్రహింపలేదు. దానికిఁ బూర్వరంగముగా సిద్ధునియొక్క మంత్రవిద్యావైశారద్యము నుగ్గడింపక మానెను. దానివలనఁ బూర్వాపరార్థవైరుధ్య మేర్పడలేదు. కాని, మంత్రసహిత మైన పాదలేపమును వర్ణించిన సంస్కృతపురాణకర్త కల్పనము పరమోదాత్తముగా నున్నది. మంత్రమునకు లేనిమహిమ మందున వంటఁగట్టిన మారన కల్పనము

24. సప్రాదాద్బ్రాహ్మణ శ్చాస్మై (తరం. ప్రె. ప్ర.)
25. దిశమాఖ్యాతాం తేనయత్నతః॥ (తరం. ప్రె. ప్ర.)

గారడీవలె నున్నది. మారనకు పట్టినిమంత్రము పెద్దన కసలే పట్టలేదు. పెద్దనయు సిద్ధుని మంత్రవిద్యావిశారదుఁ డని వర్ణింపలేదు.

ఆకుపసరున కేర్పడిన మహత్తున కల్లసాని పెద్దన హేతుకల్పనము చేయుచు నొక కట్టుకథ నల్లినాఁడు. "పాదలేప మనుపేరం గల్గు దివ్యౌషధంపురసం బీశ్వరసత్కృపం గలిగె" నని సిద్ధునివాక్యము. ఆయీశ్వరుఁ డాతని కెప్పు డెందుల కె ట్లిచ్చెనో ఆపర మేశ్వరునికే యెఱుక! మహాదేవునికరస్పర్శచే నాయౌషధమున కామాహాత్మ్య మేర్పడిన దని పెద్దనసమర్థన మై యుండవచ్చును! ఎట్లయిన నేమి పెద్దనమారనలు పాదలేప మంత్రప్రాధాన్యమును పేర్కొనకుండుటలో నొక్కటి యైరి. పాదలేపప్రదానానంతరము ప్రవరునితో సిద్ధుఁ డొక్కమాట యైనను మాటలాడకుండుటయందును నిట్టి సామ్యము కలదు!

8. మూలమందలి కాలయోజనపరిమాణప్రసక్తిని వదలుటకు మారనయే మార్గదర్శి:

పాదలేపమును ధరించి ప్రవరుఁడు హిమాచలమున కేగఁబోవుచు నిట్లు లోనఁ దలంచె నని సంస్కృతపురాణమునఁ గలదు.

శ్లో. సహస్రం యోజనానాం హి దినార్ధేన వ్రజామి యత్
ఆయాస్యా మీతి సంచిత్య తదర్ధేనాపరేణ హి॥ (58.17)

ఈశ్లోకము మూలకథయందే యంత పొసఁగుట లేదని మారన యనువదింపక మానె నని యాఖ్యానశిల్పాధ్యాయమునఁ జెప్పఁబడినది. పెద్దనయు నదేభావమునఁ దనప్రబంధమునఁ జేర్చుకొనలే దని యూహింప సులభ మగుచున్నది. హిమవత్పర్వతమున కేఁగిన ప్రవరుఁడు గృహోన్ముఖుఁ డగుటకు హేతువుగా మధ్యాహ్నకాలసూచనమును గల్పించు ప్రమాదమున కీశ్లోకమే దారితీసియుండవచ్చును. వరణానదీతీరమునుండి బదరీనారాయణ క్షేత్రమునకు వాయుమార్గమున వేయియోజనములదూరము లేదుకదా! అందువలన నీశ్లోకము ననుసరించి ప్రవరుఁ డుదయము పెందలకడనే హిమగిరికిఁ జేరుకొని మధ్యాహ్న మగునంతవఱకు వివిధప్రదేశములు దర్శించినట్లు మనుచరిత్రమునఁ జెప్పఁబడియుండ వచ్చును.

మూలమునఁ బ్రవరుఁ డతిథ్యభ్యాగతసమర్చన మైన తరువాత నపరాహ్ణమునఁ బయలుదేరి యనతికాలములోనే హిమగిరి చేరి అచ్చట కొంతవడి విశేషముల దర్శించి సాయంసంధ్యాకాల మాసన్న మగు సమయమున వరూథినిఁ గాంచె నని చెప్పుట కీక్రింది యాధారములు తోడుపడుచున్నవి:

(1) ప్రవరుఁడు వరూథినితో—

శ్లో. సా త్వం కిం బహు నోక్తేన తథా కురు యశస్విని
యథా నాస్తంగతే సూర్యే పశ్యామి నిజమాలయమ్॥ (58.52)

అని యడిగినట్లు కలదు. "సూర్యుఁ డస్తమింపక మున్న నన్నింటికిఁ జేర్పు" మని ప్రవరుఁడు వేడుకొనుచుండుటవలన నాసమయము సూర్యాస్తమయపూర్వభాగ మని యూహించుటకు వీలున్నది. కాని మారన యీవాక్యము ననువదింపలేదు.

(2) ప్రవరుఁడు గార్హపత్యాగ్నినిఁ బ్రార్థించుచు-

శ్లో. ఏవం త్వత్తో భవత్యేత ద్యేన సత్యేన వై జగత్
తథాహ మద్య స్వం గేహం పశ్యేయంసతి భాస్కరే॥

శ్లో. యథావై వైదికం కర్మ సకాలే నోజ్ఝితం మయా
తేన సత్యేన పశ్యేయం గృహస్థోఽద్య దివాకరమ్ ॥ (58. 77-78)

అన్నమాటలుకూడ పైవిషయమును సంపూర్ణముగా బలపఱచుచున్నవి. మారన వీని ననువదించుచు "నీప్రసాదమున నినుఁడు గ్రుంకకుండ నిపుడ యింటి కరుగువాఁడఁ గాక!" యని పేర్కొనియుండుటచే మూలానుసారముగా సమయపాలనము చేసియున్నాఁడు. పెద్దన హిమవన్నగముపై మధ్యాహ్నకాలమును సూచించి విషమసమస్య నొకదానిని మొలకెత్తించినను చివరకు ప్రవరునినోట "సన్మానముతోడ నన్ను సదనంబునఁ జేర్చి మినుండు పశ్చిమాంభోనిధియందుఁ గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా!" యని స్తుతింపఁజేసినాఁడు. సూర్యోదయాద్యస్తమయపర్యంతము కర్మ కధికార మున్నది కావున నడుగుట కదియే పరమావధి కాఁగలదు!

తాత్పర్య మేమనఁగా: మారన పురాణమున నీరంగ మపరాహ్ణమునుండి సూర్యాస్తమయమునకుఁ గించిత్పూర్వముపఱకుఁ గల కాలమున జరిగియుండగాఁ బెద్దన ప్రబంధమునఁ బూర్వాహ్ణమునుండి యారంభించినట్లు కలదు. మారనను గొంత యనుకరించి, కొంతస్వీయకల్పనము చేయుటచేఁ బెద్దనయందు క్రొత్త దైన కాలవ్యత్యాస మేర్పడినది కాని, మూలమునందలివ్యత్యాసములను పదలుటయందు మాత్ర మిరువురు నొకబాటన నడచినవారే.

9. వరూథినిఁ బ్రవరున కడ్డము నిల్పినది మారనయే:

దూరమునుండి వరూథినిని డాయంజనుచున్న ప్రవరున కామె తనంతట తాను కనఁబఱచుకొనిన దని సంస్కృతపురాణము.

శ్లో. ఏవం సంచింతయంతీ సా దివ్యమోషి త్స్మరాతురా
ఆత్మానం దర్శయామాస కమనీయతరాకృతిమ్ ॥ (58. 42)

మారన మూలకర్తకంటెఁ గొంత గడునుపోకడ పోయెను. ప్రవరునిపైఁ బడి గౌఁగిలించెడి వరూథిని స్మరాతురస్వభావమునకు నాంది పలుకుచున్నట్లు రత్నపుత్రికవోలె నామె నాతనిముందట ప్రౌఢముగా నిలిచెను.

క. అని మనమునఁ దలపోయుచు
మనసిజశరనికరదళితమానస యగుచు

జ్ఞని యవ్వనితామణి వి
ప్రునిముందట నిల్చె రత్నపుత్రిక వోలెన్. (మారన. 4. 234)

పెద్దన సంస్కృతశ్లోకమునుండి యెత్తుగడ గై కొని మారన కల్పించిన వరూథినీహృదయపమున స్థాపించి, "చనుట" యనుక్రియ కందియలచప్పుళ్ళను గల్పించి రత్నపుత్రికవోలెఁ కాక సజీవశిల్పమువలె నాయప్సరోంగనను ప్రవరున కడ్డముగా నిలువఁబెట్టెను.

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై దీపించు పెందత్తఱం
బునఁ జేచెత్తిన లజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.
(మను. 2. 38)

మారన "ముందట నిల్చె" ననఁగాఁ బెద్దన "అడ్డము నిల్చె" నని మార్చెను. పురాణమున వరూథిని మరుగునుండి బైటపడినది కాన ముందట నిల్చె ననుట భావ్యమైనది. ప్రబంధమున నాతనియెదుటనే యున్నది కావున నడ్డము నిల్చె ననుట సహజమైనది. తాత్పర్యమున నీరెండుకల్పనలు సజాతీయములే.

10. ప్రవరునిదేశాటనాభిలాషకు విరుద్ధములైన శాస్త్రవాక్యములను గ్రహింపకుండుటకు మారన మార్గదర్శి యయ్యెను :

ప్రవరుఁడు వరూథినితో నిట్లనె నని మూలమునఁ గలదు :

శ్లో. ప్రశస్య తే న ప్రవాసో బ్రాహ్మణానాం కదాచన
అపరాధ్యతి మే భీరు దేశదర్శనకౌతుకమ్ ॥
సతో గృహే ద్విజాగ్రస్య నిష్పత్తిః సర్వకర్మణామ్
నిత్యనైమిత్తికానాం చ(తు) హాని రేవం ప్రవాసినః ॥ (58. 50-51)

బ్రాహ్మణులకుఁ బ్రవాసము ధర్మవిరుద్ధమఁట ! కావునఁ బ్రవరుని దేశదర్శనకౌతుకము తగినది కాదఁట ! సర్వధర్మములకు నునికిపట్టు గృహమే కావున ద్విజులు దానిని విడిచినచో నిత్యనైమిత్తికకర్మహాని జరుగునఁట ! ఈవాక్యములు ప్రవరునిదేశాటనము నవర్థమైనదానిగాఁ జెప్పుచున్నవి. కావునఁ గథార్థముల కనుకూలములైనవికావు. మారన వీని ననువదింపక వదలెను. పెద్దనయు దీనిని గ్రహింపక విడిచెను.

11. "ఎక్కడి . . ఁడో" అనుపద్యభావముపై మారనప్రభావము కలదు :

వరూథిని ప్రవరునిరూపరేఖాసౌందర్యములఁ గాంచి సంభ్రమసంచలితాంతరంగయై యిట్లు తలపోసె నని మూలము :

శ్లో. చింతయామాస కో న్వేష రమణీయతమాకృతిః
సఫలం మే భవే జ్జన్మ యది మాం నావమన్యతే ॥ (58. 37)

మారన దీని ని ట్లనువదించెను.

ఉ ఈసుకుమారుఁ డెవ్వఁడొకొ యిందుల కెందులనుండి వచ్చెనో
భాసురరూపకాంతిజితభావజచంద్రుఁ డితండు రాగలీ
లాసరసత్వ మొప్పఁ గడు లాలసుఁడై ననుఁ జూచెనేని నేఁ
జేసిన పుణ్య మెవ్వరును జేయరు కామునిఁ దక్క నేలుదున్. (4. 230)

మూలముకంటె మారనరచనము ప్రౌఢముగా నున్నది. రమణీయతమాకృతిని భావపరిణామావస్థ కనువైన వాక్యవిన్యాసమునఁ బెంచి రచించినాఁడు. "అతఁ డవమానించినచో నాజన్మ సఫల మగు" ననెడి వాక్యములోని యవమానస్ఫూర్తిని మార్చి, యనుకూలభావస్ఫూర్తిని నిల్పినాఁడు. 'జన్మసాఫల్యము'నుగూర్చిన ప్రస్తావనమును వదలినాఁడు. కథలో నాతనిచే నవమానింపఁబడ నున్నట్టియు, స్వరోచిసంభవముతో జన్మసాఫల్యము నొందునట్టియు వరూథిని ముఖమున నీవాక్య ముచ్చరింపఁబడుట భావికథార్థముల కనుకూలము కాదని మారన భావించియుండవచ్చును. పెద్దనకు మారనకల్పనము నచ్చినది. దానిని విషమాలంకార సుందర మొనర్చి యిట్లు రచించినాఁడు :

ఉ ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడు వీని మహీసురాన్వయం
బెక్కడ? యీ తనూవిభవ మెక్కడ? యేలనిబంటుగా మరున్
డక్కగొనంగరాదె? యకటా! నను వీఁడు పరిగ్రహించినన్. (మను.2.35)

మారన 'ఈసుకుమారుఁ డెవ్వఁడొకొ!' యని పలికించి వరూథిని యాతని బ్రహ్మతేజమును గుర్తింపనట్లు రచింపఁగా పెద్దన యాలోపమును పూరించెను. 'కాముని దక్క నేలుదున్' అనుమారనవాక్యమునకు పెద్దన ముగ్ధుఁడై రెండవవాక్యము నాభావముతోడనే యెత్తుకొనెను. మారన వరూథినికిఁ గల్పించిన పుణ్యపాపఫలవిషయక మైన పురాణసంస్కారమును దొలగించి పెద్దన యచ్చ మగు మన్మథవికారము మాత్రమే ప్రపంచించెను. మారన యూష్మాక్షరప్రాసఘటిత మైన వృత్తము నెత్తుకొని ప్రవరునిఁ బొందుట దుష్కరకార్య మనుభావమును వ్యంజింపఁ జేయఁగా పెద్దన పరుషద్విత్వాక్షరప్రాసముచే నద్దానిని సాధించెను. ఛందముపై మారనప్రభావము స్పష్టము.

శేషాద్రిరమణకవు లీరెండుపద్యముల రచనములను బోల్చిచూచి 'పెద్దనకవియు మారనయందుఁ బ్రమాణభావము కలవాఁ డని యూహింపవచ్చు' నని వ్రాసిరి.[26]

## 12. మారన పంచమాశ్వాసారంభము – పెద్దన తృతీయాశ్వాసారంభము :

సంస్కృతపురాణకథ 58వ అధ్యాయమునఁ బ్రారంభ మైనది. ప్రవరుఁడు గార్హపత్యాగ్నినిఁ బ్రార్థించునంతవఱ కది సాగినది. అగ్నిదేవుఁ డవ్విప్రునిశరీరమునందు సన్నిహితుఁడగు కథాసన్నివేశముతో 59వ అధ్యాయ మారంభ మైనది. మారన

26. మారనమార్కం. పీఠిక. పుట. 7

స్వారోచిషమనుసంభవకథను చతుర్థాశ్వాసమున 213వ పద్యమునుండి యారంభించి చెప్పుచు నాయాశ్వాసమును ప్రవరుఁ డగ్నిప్రసాదమున నింటికిఁ జేరి సుఖముండె నని చెప్పి ముగించెను, ఈవిభాగము సంస్కృతమునందలి యధ్యాయవిభాగముకంటె నౌచిత్య భరితముగా నున్నది. పెద్దనకు మారన మార్గము నచ్చినది. అతఁడుకూడ ద్వితీయాశ్వాసమును మారన యెచ్చట నాపెనో యచ్చటనే యాపెను. దీనితో మారనపెద్దనలకు పంచమతృతీయాశ్వాసారంభములం దొకే కథాఘట్టము లభించినది.

మారనవలెఁ బెద్దనయు నాదిగురువైన వృత్తము గ్రహించుటయే కాక ఆద్యక్షరము కూడ సమముగా వాడినాఁడు మారన:

ఉ. ఆకమలాక్షిచిత్తమున నా ద్విజరాజకుమారు చారుది
వ్యాకృతి నిల్చి ప్రీతి వగ లంతకు నంతకు నగ్గలించి చీ
కాకుపడంగఁ జేయఁ గుసుమాయుధునేటుల కంత యోర్వఁగా
లేక నితాంతవేదనఁ జలించుచు నెంతయు వెచ్చనూర్చుచున్.

క. గిరికందరములు గలయం
దిరుగుచు దుఃఖాంబురాశిఁ దేలుచు విప్రుం
దరిగినవలనికిఁ జూడ్కులు
పొరి నిగిడించుచును బువ్వుఁబోఁడి యలంతన్. (5.3-4)

పెద్దన యీభావమునే మారుమాటలతో నిట్లు రచించెను:

మ. ఉభూదేవకుమారుఁ డేఁగినఁ దదీయానూన రమ్యాకృతిం
దా భావంబున నిల్పి యంగభవకోదండోగ్ర మౌర్వీరవ
క్షోభాకంపిత ధైర్యయై యలఁత నచ్చో నిల్వ కచ్చెల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ గానలఁబడిన్ దుఃఖాబ్ధినిర్మగ్నయై.

క. తిరుగుచు ధరణీసురవరుఁ
దరిగినచో ప్పరసి యరసి యట గానక యా
హరిణాంకముఖి సఖీజన
పరివృత యై మగిడివచ్చి భావములోనన్. (మను. 3.3-4)

వరూథినీవిరహవేదనను మూలాతిరిక్తముగా రచించిన యీయిద్దఱుకవులరచనల యందు నిట్టిసామ్యము గోచరించుట కాకతాళీయన్యాయ మని త్రోసివేయుటకు వీలులేదు. తప్పక మారన పెద్దనపై వైచినప్రభావమే కారణ మనుటలో విప్రతిపత్తి లేదు.

12. వరూథినీవిరహదుఃఖమునుగూర్చి గంధర్వకుమారుఁడు వితర్కించి నట్లు వర్ణింపకుండుటకు మారనయే మొదటివాఁడు :

వరూథిని విరహదుఃఖాతుర యై హిమగిరిసానువులపైఁ దిరుగుచుండ నామెను

పూర్వము వలచి నిరాకృతుఁడైన కలి యను గంధర్వకుమారుఁ డొకఁ డామెను గాంచి యిట్లు చింతించినట్లు సంస్కృతపురాణము :

శ్లో. న చింతయామాస తదా కిన్న్వేషా గజగామినీ
నిశ్వాసపవనమ్లానా గిరా వక్త్ర వరూథినీ ॥
శ్లో. మునిశాపక్షతా కిం ను కేన [27]చిత్కిం విమానితా
బాష్పవారిపరిక్లిన్న మియం ధత్తే యతో ముఖమ్ ॥
శ్లో. తతః స దధ్యౌ సుచిరం తమర్థం కౌతుకాత్కలిః
జ్ఞాతవాం శ్చ ప్రభావేణ సమాధేః స యథాతథమ్ ॥ (59.16-18)

మారన యీవాక్యసముదాయమును దెనిఁగింపలేదు. ''అయ్యవస్థ నున్న యయ్యంగనం గనుంగొని దివ్యజ్ఞానంబునఁ దద్వృత్తాంతంబంతయు నెఱింగె" (5.10) నని మాత్రమే మారన రచించెను. పతితకుఁ దెలిసిన యీవిషయమునుగూర్చి యీపాత్రముఖమున వితర్కింపఁజేయుటకు మారన వెనుకాడియుండవచ్చును. మూలవాక్యము లతిస్వాభావికములై వరూథినియం దతని కున్న సానుభూతిని వ్యక్తముచేయుచున్నవి. అయినను మారనవలెఁ బెద్దనకును అవి రుచింపలేదు. దేవజాతిత్వజనితవిమలజ్ఞాన పాటవంబునఁ దద్వృత్తాంతము సమస్తము నెఱింగె నని మాత్రమే చెప్పి యూరకుండెను.

## 14. మునిశాపవాక్యములను సంస్కరించినది మారనయే !

కైలాసతటిపైఁ జెలులతో విహరించుచు నొక తపోధనుని గాంచి మనోరమ యపహసించినందులకు అతఁ డామెను ''తస్మాత్త్వా మచిరే ణైవ రాక్షసో౽భిభవిష్యతి'' (60.18) అని శపించినట్లు సంస్కృతపురాణమునఁ గలదు. దీనికి ''రాక్షసో భక్షయిష్యతి'' యను పాఠాంతరము కూడ కలదు. మారన యీవాక్యములను మార్చి కథానుకూలముగా ''నన్నుఁ జూచి నీవు నవ్వితి గావున నసురకరగృహీత వగుము తరుణి'' (5.28) యని మార్చెను. పెద్దన మారనహృదయమును గ్రహించి యనురకరగృహీత యను సమాసమునందలి ''పాణిగ్రహణ'' స్ఫూర్తినిఁ దొలఁగించి''పట్టువడు మొకయసురునకు నీ'' వనుచు పలికించి యౌచిత్యమును బోషించెను.

## 15. చక్రవాకివాక్యములలోఁ గొన్నింటిని గైకొనక వదలుటకు మారన మార్గదర్శకుఁ డయ్యెను :

సతీత్రయముతో మందరనగమున విహరించు స్వరోచినిఁ గాంచి, యొకసరోవరమున నున్నకలహంసీరథాంగవనితలు భార్యాభర్తలమధ్య నుండు ననురాగమునుగూర్చిన చర్చ చేసికొందురు. అందులోఁ జక్రవాకి పలికిన కొన్నిమాటలను మారన యనువదింపక మానెను. పెద్దనయు వానిని గ్రహింపలేదు.

---

27. ఛిద్రాద్విమానితా (శరం. ప్రె. ప్ర.)

మూలమునందలి వాక్యము లివి :

శ్లో. బహువత్నీ పతి ర్లోకః శరణం పుణ్యపాపయోః
గృహాశనాసనాద్యైశ్చ భూషణైశ్చ సహాగమైః ॥
విషమైః క్రియమాణై ర్హి యుజ్యతే మహదేనసా
జ్యేష్ఠాంకనీయ భావేన కనిష్ఠాం జ్యేష్ఠతాం నయేత్ ॥
గురవేతు వరం దత్వా హుత్వా న్యాంన మిథం యథా
ఊఢయా సహకర్తవ్యా నిత్యనైమిత్తికీ క్రియా ॥
జగా దాథాన్య భావేన పాపీ యాజ్ఞాయతే నరః ॥ (62.19-22)

మారన యీవాక్యములలో సారవంతము లైన వానిని గైకొని నిస్సారములకనువదింపక వదలెను. మారన యెన్నుకొనినవాక్యములనే పెద్దనయు నెన్నుకొని పద్యమునందు నిబంధించుట గమనింపఁదగినయంశము.

మారన :

తే. ఏను కడుధన్యురాల నియ్యిల మదీయ
విభుఁడు కడుధన్యుఁ డని పల్కి విహంగిపల్కి
లఖిలభూతభాషావిదుం డైన యట్టి
యాస్వరోచివిభుఁడు విని యాత్మలోన ॥ (5.79)

పెద్దన

చ. పలుకులు వేయు నేమిటికి? భాగ్యసమన్విత నేన; మద్విభుం
డిలఁ గల ధన్యుఁ డంచు నెలుగెత్తి వరూథినిపట్టిముందటం
బలుకు రథాంగమానవతిపల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన యెఱింగి సిగ్గునన్. (6.75)

**ఉభయపురాణమూలము లైన కొన్నియంశములు :**

1. "ఎవ్వతె వీ" వను పద్యంపుటెత్తుగడకు ఉభయపురాణములందును **మూలములు కలవు :**

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి చరించెదోట లే
కివ్వనభూమి; భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచితి; నూరుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే! తెరువెద్ది శుభంబు నీకగున్॥ (మను.2.39)

ప్రవరుఁడు తొలిసారి నోరు విప్పి వరూథినితో మాటలాడినప్పటి వాక్యారంభ మీపద్యమునఁ గలదు. దీనియెత్తుగడపైనను, కొన్నిపదములపైనను ఉభయపురాణములప్రభావము కలదు. వానితోఁ బోల్చిచూచినచో నది స్పష్టము కాఁగలదు. సంస్కృతమూలము:

శ్లో. కా త్వం కమలగర్భాభే ! కస్య [28]కిం వానుతిష్ఠసి ?
బ్రాహ్మణోఽహ మిహాయాతో నగరా దరుణాస్పదాత్॥
పాదలేపోఽత్ర మే [29] ధ్వస్తో విలీనో హిమవారిణా
యస్యానుభావా దత్రాహ మాగతో మదిరేక్షణే॥ (58.44-45)

మారన :

"నీ వెవ్వతె ? ఏచట నేకతంబ యేల యున్నదాన వని యడిగి తన తెఱంగం తయు నెఱింగించిన నత్తలోదరి యిట్లనియె". (4.235)

మూలమున సర్వము వాచ్యముగాఁ జెప్పఁబడినది. "కా త్వమ్" "నీ వెవ్వతెవు" అను పురాణవచనములు "ఎవ్వతె వీవు" అని పెద్దనపద్య మెత్తుటకు దోహదము లైనవి. మారన "ఏకతంబ యేల యున్నదాన వని" వేయించినప్రశ్నయే పెద్దన "ఒంటి చరించె దోట లే కివ్వనభూమి" యనుటకును వరూథినిచేత "నేకాంతమునందు నున్నజవరాంద్ర" నని యనిపించుటకును హేతుభూత మైనది. మారన మూలమునందలి కథయంతయు మఱల చెప్పక "తెఱంగంతయు నెఱింగించిన" యని సంగ్రహరచన మొనర్చి పునరుక్తి వారిం చెను. పెద్దన మూలము ననుసరించి 'భూసురుఁడ నే' నని ప్రారంభించి చతురవచనరచన మున ప్రవరునిచేఁ గథ చెప్పించి పద్యమును ముగించెను. "భీతహరిణేక్షణ !" "త్రోవ తప్పితిన్" "క్రొవ్వన" "ఊరుజేర......శుభంబు నీకగున్" అనెడి వాక్యములయందలి వ్యంగ్యస్వారస్యముచే నీపద్య మాంధ్రసాహిత్యమునందలి మనోహరపద్యమంజరులలో నొకటియై వాసించుచున్నది

2. ప్రవరుఁడు బంధువులను స్మరించుకొనుచు దుఃఖించె నను పెద్దన కల్పనకు ఉభయపురాణములందును బీజములు కనవచ్చుచున్నవి :

పెద్దన ప్రవరునిఁ బెద్దకుటుంబికునిగాఁ దీర్చిదిద్దెను. అతఁడు హిమాచల మేఁగి పాదలేపవిహీనుఁ డై దుఃఖించెను. అందు బంధువియోగమున కధికముగాఁ గుందెను. ఉభయపురాణములందును నిప్పట్టున నీప్రసక్తి కానరాదు. కాని, వరూథినీముఖమున నీ వాక్యములను సంస్కృతపురాణకర్త యనిపించెను:

శ్లో. సత్వం సహ మయాకాన్తకాన్తేఽత్ర తుహినాచలే
రమమాణో న మర్త్యానాం బాంధవానాం స్మరిష్యసి ॥ (58. 55)

దీని ననుసరించి మారనయు "నెందుఁబోకుము సుహృద్వ్యామోహ ముప్పొంగఁగాన్" (4. 240) అని రచించెను. పూర్వాపరకథార్థస్మృతియుతుఁ డైన పెద్దన యీసూచనను గమనించి తనకావ్యమునఁ బ్రవరుని బంధయుతునిగను, వియోగావసరమున బంధు వియోగదుఃఖితునిగను జిత్రించి, చివరకు మాయాప్రవరునిఁగూడ బంధుప్రీతునిగా నటింపఁజేసెను. పురాణకర్తలకు ప్రవరునియగ్నులును, దర్భలును ముఖ్యములు. ప్రబంధ కర్తకు అతఁడు వసించిన సంఘము, సంస్కృతి ముఖ్యము. మూలమునందు సూచన

మాత్రముగా నున్న యీయల్పాంశమును సైతము గ్రహించి రచించె నన్నచో పెద్దన సూక్ష్మదృష్టిని వేఱుగాఁ బ్రశంసింప నవసరము లేదు.

### 3. పురాణప్రణాళికాంశక్రమమును సంస్కరించి వరూథినీప్రవరుల సంవాద సన్నివేశమును పెద్దన పునర్నిర్మించెను :

వరూథినీప్రవరులసంభాషణసన్నివేశము పెద్దనప్రతిభానిష్యంద మని ప్రసిద్ధి చెందినది. అందలివిశేషమంతయు నతని చతురవాగ్విభూతి నాశ్రయించినదే. ఆసన్నివేశచిత్రణమునఁ బెద్దనకు పురాణప్రణాళికాంశము లెంతయో తోడ్పడినవి. అయినను వాని నతఁడు యథాతథముగా గ్రహింపక వానిక్రమవిన్యాసమును మార్చి స్వీయకల్పనాసామర్థ్యమును జోడించి వానినిఁ బునర్నిర్మించెను. దానితో నాఘట్ట మపూర్వశిల్పారామముగా రాణించినది.

పెద్దన మార్చినక్రమము నెఱుఁగుటకుఁ బూర్వము పురాణ, ప్రబంధముల ప్రణాళికల తుల్యపరిశీలన మొనర్పవలసియున్నది.

| పురాణాంశములు | ప్రబంధాంశములు |
| --- | --- |
| 1. ప్రవరుని స్వీయవృత్తాంతకథనము. | 1. ప్రవరుని స్వీయవృత్తాంతకథనము |
| 2. వరూథిని నిజహృదయము నెఱుక చెప్పినతరువాత ప్రవరుఁడు నిత్యనైమిత్తికక్రియాప్రాముఖ్యను, ఇంటి కేగవలసిన యగత్యమును నిరూపించి యిలు సేరునుపాయము నభ్యర్థించుట. | 2. వరూథిని యతిథిసత్కారమునుండి యుక్తితోఁ దప్పుకొని యిలు సేరునుపాయమును ప్రవరుఁ డర్థించుట. |
| | 3. వరూథిని తనహృదయమును దేటపఱుపఁగా వ్రతులైన విప్రులను గామింపఁగూడ దనియు, నాదిన మిల్లుసేరనిచో సురార్చనయు, అతిథిపూజలును, సర్వకర్మలును దూలు ననియు, వృద్ధు లగు జననీజనకులు దుఃఖసముద్రమున మునుఁగుదు రనియుఁ బేర్కొనుట. |
| 3. వరూథినీపరిష్వంగమునుండి విముక్తుఁడై ఆమెకు హావ్యప్రాశస్త్యము వర్ణించి చెప్పుట. | |
| 4. వరూథిని ప్రవరునిదయాభిక్ష నర్థించి కొండొకకాలము విషయభోగము లనుభవింప వేడఁగా నాతఁడు విప్రుఁడు భోగబాహ్యుఁ డని బ్రాహ్మణధర్మమును నిరూపించి చెప్పుట. | 4. ఇంద్రియనిగ్రహము కోల్పోయి, వరూథిని తనను బొంది సశరీరస్వర్గభోగముల ననుభవింపు మని కోరగా—నాతఁడు బ్రాహ్మణధర్మమును నిరూపించి చెప్పుట. |
| 5. వరూథిని ప్రవరునిచే నిరాకృతయైనచోఁ బ్రాణములఁ బరిత్యజింతు నని | 5. "ఆనందో బ్రహ్మ" యను వేదోక్తికి కామశాస్త్రపరమైన వ్యాఖ్యానము చేసిన |

| పురాణాంశములు | ప్రబంధాంశములు |
| --- | --- |
| బెదిరింపఁగా నాతఁడు పరవనితారతి కీడని గురువులు బోధించి రని నీతి వాక్యములు చెప్పుట. | వరూథినిఁ బ్రవరుఁడు మందలించి హవ్యవాహనునిసేవలవలనఁ బడయఁ గలుగు లాభము లమోఘము లని చెప్పుట. |
| 6. ప్రవరుఁడు అగ్నిదేవు నుపాసించి తత్ప్రసాదమున నిల్లు సేరుట. | 6. తనపైఁబడి కౌఁగిలించు వరూథినినిఁ ద్రోసివైచి, ఆమె తనను దయాభిక్ష నర్థించినను నిరుత్తరుఁడై ప్రవరుఁడు మిన్నకుండుట. |
| | 7. అగ్నిదేవు నుపాసించి, తద్దత్త మగు హయము నధిరోహించి వాయువేగమున నిల్లు సేరుట. |

పైపట్టికను బరిశీలింపఁగాఁ బ్రబంధకర్త స్థూలముగా బురాణాంశముల నన్నింటిని వదలక గ్రహించె ననియు, "ఆనందోబ్రహ్మ" యను వేదోక్తిప్రసక్తియు, ప్రవరుని గృహవిషయముల ప్రస్తావనయు, ప్రవరుఁడు వరూథిని యంసద్వయ మంటి త్రోయుటయు, అగ్నిదత్త మైన హయము నధిరోహించి విప్రుఁ డింటి కరుగుటయు నను విశేషాంశములు నూతనముగాఁ గల్పించె ననియు స్పష్టము కాఁగలదు.

ప్రవరుఁడు యుక్తితో వరూథినిమందిరములోని కేఁగకుండ తప్పించుకొను ప్రసక్తి పెద్దన కల్పనవలననే యేర్పడుచున్నది, పురాణములందు వరూథినికి హిమవంతమునఁ బ్రత్యేక నివాస మున్నట్లు చెప్పఁబడలేదు. ప్రబంధమున గారుడోత్కీర్ణ మైన సౌధము కలదు. కేదారక్షేత్రములు, ద్రాక్షపందిళ్లు మొదలైన వెన్నియో దాని చుట్టును గలవు. నివాస మొకటి కలదు కావున నింటికి రమ్మని పిలచుటయు, నతఁడు నీమాటలే మాకు సత్కారము లని తప్పించుకొనుటయు జరిగినది.

పురాణములందు వరూథినీపరిష్వంగ సన్నివేశానంతరము వారిరువురి మధ్య మఱి కొంతసంభాషణము నడిచినట్లు కలదు. పెద్దన దానిని మార్చి యాసన్నివేశమునకుఁ బూర్వమే కల్పించెను. వరూథిని దయాప్రాధాన్యము నుగ్గడించుచు నన్నమాటలకు పెద్దనలో సమాధానము లేదు.

పురాణప్రవరుఁడు వరూథినిని బడఁద్రోయలేదు. చాకచక్యముగా నామె కౌఁగిలి నుండి తప్పించుకొనెను. ఈపతాకసన్నివేశమును జిత్రించుటలో ముగ్గురుకవులు పాటించిన విధానమును విచారించినచో విచిత్రముగా నుండును. ప్రవరుఁడు తనను గౌఁగిలించుకొనిన వరూథినిని బరుషసంబోధనలతో నొప్పించె నని సంస్కృతపురాణకర్త. గాఢార్థస్ఫోరకము లైన వాక్యములతో నామెను సున్నితముగా గర్హించె నని మారన. వ్రతభంగ మెక్కడ జరుగునో యని 'హా! శ్రీహరీ' యనుచు నామెను భౌతికముగా నెట్టి

వేయించినది పెద్దన. సంస్కృతమునఁ బౌరాణిక మగు నార్షమర్యాదయు, (ఋషులుగ్రులై నప్పుడు శాపోక్తులు పలుకుట సహజము), మారనపురాణమున శ్రవ్యకావ్యమర్యాదయు, (వినుటకు శ్రవణపేయమై భావించిన కొలది గంభీరార్థస్ఫూర్తి కలుగుట); పెద్దనప్రబంధమునందు దృశ్యకావ్యమర్యాదయు, (చతుర్విధాభినయప్రధానములైన పాత్రలు మనోదృష్టికి ప్రత్యక్షీకృతములై భౌతికమానసిక మైన సంఘర్షణము క్రియారూపమునఁ బ్రదర్శించుట) పాటింపఁబడె ననియు నూహింప వీలగుచున్నది. ఎట్లయినను పరిపూర్ణత పెద్దనయందే సిద్ధించినది.

"ఆనందో బ్రహ్మ" యనువేదోక్తికిఁ గాముకులు చెప్పు కువ్యాఖ్యానమును ఖండించుటయందు ప్రవరుని యనారతాధ్యాపనతత్పరత్వమును, వాదప్రతివాదకౌశలమును సార్థక మొనర్చుట పెద్దన సాధించిన యవాంతరప్రయోజనము.

4. పెద్దన రచించిన వరూథినివిరహోక్తులలోఁ గొన్నింటికి ఉభయపురాణములలో బీజములు కలవు :

ప్రవరుఁడు నిజనివాసమున కేఁగినతరువాత వరూథిని యతఁ డరిగిన త్రోవనే కొంతదూర మరిగి యతనిం గానక తిరిగి వచ్చి యిట్లు తనలో వితర్కించుకొనినదని పెద్దన రచించెను :

ఉ. అక్కట ! వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁ డై
చిక్కక త్రోచిపోయె; దరిఁ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన ? నిఁక నీకొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ ? వానికౌఁగి లది యెక్కడ ? హా విధి ! యేమి సేయుదున్ ? (3.5)

ఈవాక్యములకు బీజతుల్యము లైన భాగము లీక్రిందిపురాణవాక్యములందుఁ గలవు.

శ్లో. నిశ్వస న్త్యనవద్యాంగీ హా హేతి రుదతీ ముహుః
మందభాగ్యేతి చాత్మానం నినిన్ద మదిరేక్షణా ॥
క్వాగతాహ మిమం శైలం దుష్టదైవ బలాత్కృతా
క్వ చ ప్రాప్తః స మే దృష్టే ర్గోచరం తాదృశో నరః॥ (59.8,11)

మారన :

తే. గీ. అకట ! మందభాగ్య నైతి నా కెమ్మెయి
గలుగు నక్కుమారుఁ గలయుపుణ్య
మేమి సేయుదాన ? నీ కామతాప మే
నెట్లు నిస్తరింతు ? నెందుఁ జొత్తు ? (5.5)

మారన పెద్దన లొక్కపదముతోడనే పద్యముల నెత్తుకొనినారు. సంస్కృతమునందు వరూథిని తనను, తనవిధిని నిందించుకొనిన దనుభావమే యీపద్యవిస్తృతికి మూలము. "హా విధి!" యనుమాటకు సంస్కృతమే మూలము. పద్యములోనిభావములపై మారన

ప్రభావము స్పష్టము. కామతాపము వియోగసాగర మైనది; నిస్తరించుక్రియ యీదుటగా మారినది; మందభాగ్య యను సమానమే కొఱనోములు నోచినట్టిదాన నను తెలుఁగుసమాసముగా రూపొందినది. ''కలయుషణ్యము'' ''కౌఁగిలిసౌఖ్య'' మైనది.

మఱియు సూక్ష్మముగాఁ బరిశీలించినచో ''న మే దృష్టే ర్గోచరం తాదృశో నరః'' (59.11) అను శ్లోకపాదమే పెద్దన క్రిందిపద్యరచనకు స్ఫూర్తి కల్గించె నని చెప్ప వచ్చును.

ఉ. కమ్మనికుందనంబు కసుగందనిమే; నెలదేఁటి దాఁటులన్
బమ్మెరవోవఁ దోలుఁ దెగఁబారెఁడు వెండ్రుక; లిందుబింబముం
గిమ్మన నీదుమోము; గిరిక్రేపులు మూఁపులు; కాన గానరా;
దమ్మక చెల్ల! వాని వికచాంబుజముల్ శతపత్రజైత్రముల్. (మను. 3.6)

ప్రత్యంగవర్ణనాకౌశలము ప్రదర్శించు ప్రబంధకవి కామాత్రముసూచన యున్నచాలును! గోరంతలు కొండంతలు సేయఁగలఁడు. ప్రవరునిబహిస్సౌందర్యమూర్తి కిది యొక శిల్పకల్పనము!

మూలమున నీసందర్భముననే మఱియొకశ్లోకము కలదు.

శ్లో. చకార రమమాణే చ చక్రవాక యుగే స్పృహామ్
ముక్తా తేన వరారోహా నినింద నిజయౌవనమ్ ॥ (59.10)

ఇందు "నినింద నిజయౌవన'' మ్మను వాక్యము నాధారముగాఁ జేసుకొని —

ఉ. " చొక్కపుఁబ్రాయమున్ మిగులసోయగముం గల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతుల యేఁకట దీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియమందఁగ నోఁచనియింతి కైన యా
చక్కఁదనం బదేమిటికి? జవ్వన మేటికి? నేర్పు లేటికిన్.'' (మను. 3.7)

అని పెద్దన పెంచి రచించె నని యూహింప వీలగుచున్నది. పైశ్లోకములోని చక్రవాక పక్షులజంటనుగూర్చిన స్పృహయే పెద్దనకు సూర్యాస్తమయ కాలవర్ణనమునకు స్ఫూర్తి నిచ్చి యుండవచ్చును.

సీ. ఏవిహంగముఁ గన్న నెలుఁ గిచ్చుచును సారెకును సైకతంబులఁ గూడఁదారుఁ,
దారి కన్గొని యది తనజోడు గాకున్నమెడ యెత్తి కలయంగ మింట నరయు,
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి వదన మెండఁగ సరోవారి నద్దు,
నద్ది త్రావఁగ నైఁప కట్టిట్టు గన్గొని ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు,

తే. నుఱికి యెఱకలు దడియ వేఁపొక్కతమ్మి
కరుగు; నరిగి రవంబుతోఁ దిరుగుతేంట్లఁ
బొడుచు ముక్కున; మఱియును బోవు వెదక
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి. (మను.3.16).

పైనిచ్చిన యుదాహరణమువలనఁ బెద్దన సంస్కృతాంధ్రపురాణకథల నత్యంత దీక్షతోఁ బఠించి యందలి పెక్కుసూక్ష్మాంశములను దనకావ్యమునందుఁ జేర్చి కథానిర్మాణమును సుసంబద్ధ మొనర్చె నని తెలియును. అతఁడు తనకావ్యమునకు సంబంధించినంత వఱకు స్వారోచిషమనుసంభవకథను మాత్రమే పరిశీలించి యూరుకొనక మార్కండేయ పురాణమును సమగ్రముగా నిట్టిదృష్టిలోఁ జూచి యుండె ననుటకును ఆధారము లున్నవి. మచ్చున కొండు రెం డిచ్చట నుదాహరింపఁబడుచున్నవి :

1. పెద్దన కుతపకాలప్రసక్తి మార్కండేయపురాణాంతర్గతగార్హస్థ్య ధర్మ నిరూపణమునుండి గ్రహించెను :

ఔషధసిద్ధుఁడు ప్రవరునింటికిఁ గుతపకాలమున వచ్చె నని పెద్దన చెప్పెను. కుతపకాల మన పంచదశభాగవిభక్త మైన దివసార్ధమునందలి యష్టమభాగము - లేక పగఁటిలోఁ బదునాలుగుగడియలకు మీఁదిముహూర్తము. మార్కండేయపురాణోక్త గార్హస్థ్యధర్మములందు యజమాని యతిథుల నాహ్వానించు కాల మిట్లు వర్ణింపఁబడి యున్నది.

క. విను దివసాష్టమభాగం
బున సదనద్వారమునకుఁ బోయి కడుఁ బ్రియం
బున నతిథి నరయవలయుం
(దనయా!) తదర్చనకు నెనయె ధర్మువు లెందున్ ! (మారన. 3.154)

శ్రాద్ధాచరణవిధానము నిరూపించుచుఁ గుతపకాలసమాగతద్విజులనుండియే భోక్తల నెన్నుకొనవలె నని మార్కండేయపురాణము చెప్పుచున్నది.

క. కుతపసమాగత సద్విజ
తతియం దొగి విశ్వదేవతల కిరువురనుం
బితృదేవతలకు మువ్వుర
నతిభక్తి నొనర్పవలయు నధికశ్రద్ధన్. (3.118)

పెద్దన గార్హస్థ్యధర్మనిరూపణప్రవణుఁడై ప్రవరునిఁ జిత్రించుసమయమున నతిథ్యభ్యాగతులు సామాన్యముగా వచ్చుసమయమునకే సిద్ధుఁడు వచ్చె నని కుతపకాలము నుచ్చరించి యుండవచ్చును. మూలమునందలి కాలప్రసక్తి వదలి, స్వయముగా నీకుతప, మధ్యాహ్న కాల ప్రసక్తుల నొనర్చి కథలో కాలైక్యమును బెద్దన ప్రదర్శింపలేకపోయెను.

2. వపు వను సచ్చరలేమ వర్ణనము వరూథినీవర్ణనమున కెట్లు తోడుపడినదో వెనుక వివరింపఁబడినది.

3. ఆడుకూయి, విందవు, తంగేటిజున్ను - ప్రయోగములు.

"వేట కేగిన హరిశ్చంద్రునకు "మమ్ము రక్షింపు మని పలుమాఱు గూయు నాడుకూయి పీతెంచిన వానరపరుఁ డోడకోడకు" (1.146) డన్నట్లు మారన వ్రాసెను. దీని

ననుసరించియే కాబోలు : వేట కేగిన స్వరోచికి ''కావరె, యీపుణ్యంబున బ్రోవరె యని పలుకు నాడుమొఱ'' (4.66) వినఁబడినట్లును, స్వరోచి ''ఓడకు మజ్జానన'' యన్నట్లును పెద్దన వ్రాసెను. మారన 'అడుకూయి' యే యిందు 'అడుమొఱ' యైనది.''

"ఇట్లే 'ప్రముచుఁ' డను ముని తనయింటికి వచ్చిన దుర్దముఁ డనురాజును గౌరవించి ''అనఘ ! సమంచితార్ఘ్యమున కర్హుఁడ, వెన్నఁడు రాని విందు, వల్లునికి విశేషపూజ దగు ... (5.277)" నని పల్కినట్లు మారన వ్రాసెను. ఇచట 'విందు' వనుమాటకు 'అతిథి' యని యర్థము. తిక్కనభారతమునందును "ప్రీతిం బొందితిఁ తగియెడు విందవయితినాకు'' అనుప్రయోగము కలదు. పెద్దనకూడ యీయర్థమునందే వరూథినిచే "భూసురకైతవకుసుమశరాసన ! మాయింటివింద వైతివి'' అని పలికించుట మనకుఁ దెలిసినదే :'' (2.46).

ఇట్లే ద్వితీయాశ్వాసమునందు మారన :

తే. ''స్త్రీజనంబుల కుపవాసతీర్థదాన
దేవపూజావ్రతాదుల తెరువు కలదు
పతిసమారాధనవ్రతపరతఁ జేసి
సుగతి వారికి తంగేటిజున్ను సుమ్ము !'' (2.179)

ఇందలి యీతంగేటిజున్ను మనుచరిత్రమునందలి ''కెలకుల నున్న తంగెటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థితార్థపేటి'' (1.66) అను ప్రవరసిద్ధుల సంభాషణలోఁ బ్రవేశించినది."[30]

## పెద్దన స్వయముగాఁ జేసినకల్పనలు :

మార్కండేయపురాణోక్తప్రకారము కథను గ్రహించి, తనప్రబంధమునఁ బ్రపంచించుచు పెద్దన మారనాదులలోని కథాశిల్పములఁ గొన్ని గ్రహించినను స్వీయప్రతిభావిశేషముచే మఱికొన్నికల్పనలను, చిఱుమార్పులను జేసి మనుచరిత్రవస్తువును విస్తృతముగా నిర్మించెను. పెద్దన చేసిన కల్పనలు కథ స్వాభావికముగను, రససమంచితముగను నుండుటకుఁ దోడుపడినవి; మార్పులు కథలో నౌచిత్యము పోషింపఁబడుట కుపకరించినవి. అట్టివానిలో ముఖ్యమైనవానిని స్థాలీపులాకన్యాయమున నిచ్చుట కేర్పాటు జరుగుచున్నది.

1. పాదలేపసంప్రదానము :

ఉభయపురాణములందును విప్రుఁ డభ్యర్థింపఁగాఁ బాదలేప మతని కిచ్చినట్లును, అతఁడే తనపాదములకు లేపన మొనర్చుకొని హిమగిరిసానుభూముల కేఁగినట్లును గలదు. పెద్దన యీక్రమమును మార్చి మంత్రసిద్ధుఁడే స్వయముగా తన కకపాలనుండి రస

30. "పెద్దనలో ప్రతిబింబించిన మారన" – డా. పల్లా దుర్గయ్యగారు.

లింగము నిడు తనవ్రట్టువ్రేఁవసజ్జదంతపుబరణియం దిడిన యొకపసరు పైకిఁ దీసి యిదియది యని చెప్పక ప్రవరునిపాదయుగళికిఁ బూసెను. దీని యౌచిత్యమునుగూర్చి విచారించుచు డా. వల్లా దుర్గయ్యగా రిట్లు పేర్కొనియుండిరి. "మంత్రౌషధులు సామాన్యముగా నందఱ కిచ్చునవి కావు. ఇట్టివాని నొసఁగుటకు గురుశిష్యసంబంధ మవసరము. ఇంతేకాక ప్రవరుఁడు యాచన యెరుగనివాఁడు. ఇన్నికారణములచే పాదలేపము నడుగక ప్రవరుఁడు తనకుఁ దీర్థయాత్రాభాగ్యము కలిగించి ధన్యునిఁ జేయు మనియు, నేను మీశిష్యునివంటి వాఁడ ననియుఁ బ్రార్థించెను. పెద్దన యిట్లు రెండుమూలములందును గల పాదలేపయాచనప్రసక్తిని బొత్తుగా వదలివైచి, 'భాషాపరశేషభోగి' యని తాను మున్ను చెప్పిన ప్రవరునిమాటలయం దుక్తిచమత్కృతిని గల్పించి, యుక్తిగాఁ బలికించి, తన సమయోచితసంభాషణాసంవిధానచాతుర్యమును, స్వభావపరిజ్ఞాననైపుణిని, ఔచిత్యపోషణ కళాభిజ్ఞతను బ్రకటించుకొనుటయే కాక తాను సృష్టించిన ప్రవరునిశీలసంపదకు గించిత్తును లోపము రాకుండఁ గాపాడినవాఁ డయ్యెను. ప్రవరుఁడు పాదలేప మి మ్మని యడుగలేదు. సిద్ధుఁడు కొమ్మని యీయలేదు. ప్రవరుఁడు చేసాచి పుచ్చుకొనను లేదు. ప్రవరునకు తీర్థయాత్రాఫలమును దక్కినది. ఈకల్పనాపద్ధతి మిగుల చమత్కారము."[31]

2 ఔషధసిద్ధుని నిష్క్రమణమును స్పష్టము చేసినది పెద్దన :

సంస్కృతాంధ్రోభయపురాణములందు ప్రవరుఁడు పాదలేపప్రభావమున హిమనగమున కేఁగె నని చెప్పఁబడియున్నది. కాని, పాదలేపప్రదాత యైన సిద్ధుఁ డేమాయనో స్పష్టము చేయలేదు. "ఆమం దిడి యతఁ డరిగిన" నని యతనినిష్క్రమణమును స్పష్టము చేసినవాఁడు పెద్దన. దీనివలన అస్పష్ట మైన యొకకథార్థము స్పష్టమగుటయే కాక ప్రత్యంగపౌష్ట్యము కథ కేర్పడుచున్నది.

3. మధ్యాహ్నకాలసూచనము పెద్దన కల్పించినదే :

హిమవత్పర్వతవిశేషసందర్శనకుతూహలుఁ డైన ప్రవరుఁడు కొంతవడి సంచరించి, 'నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకందళచూత్కారపరంపరలు' మధ్యాహ్న మైనట్లు సూచింపఁగా నాటి కింటి కేఁగ నిర్ణయించె నని పెద్దన మనుచరిత్రమున వర్ణించెను. ఈకాలసూచన మమూలకము. ఇది కథలోని కాలైక్యమునకు కొంత యడ్డుతగిలెను. ప్రవరునింటి కౌషధసిద్ధుఁడు కుతపకాలమున వచ్చెను. అతఁ డిచ్చిన యౌషధముయొక్క ప్రభావముచే హిమగిరి చేరిన ప్రవరుఁడు మధ్యాహ్న మగునంతవఱకు నచ్చట విహరించె ననుట పొసగుట లేదు. కుతపకాలనిర్ణయముపైఁ బలువురు పండితు లనేకవిధములుగ విమర్శించియుండిరి. దానిని యథాతథముగా గ్రహించినచో నొక రాత్రి హిమగిరిపైఁ బ్రవరుఁ డుండె నని చెప్పినగాని కథాకాలసమన్వయము కుదురదు.

---

31. వసునాలవశతాబ్దిప్రబంధవాఙ్మయ వికాసము – మనుచరిత్రము – ఔచిత్యపోషణము - డా. వల్లా దుర్గయ్యగారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారీమార్గమును సమర్థించిరి. డా. పల్లా దుర్గయ్యగారీ వాదోపవాదముల కొక నవ్యసమన్వయమార్గము నిట్లు సూచించి యుండిరి. 'ఒకనాఁడు కుతపకాలమునం దనుదానికి' ఒకానొక దినమునందు మధ్యాహ్నానంతరమున (పదునాలుపదునేడుగడియలకాలమున) అనునట్టి యర్థమును వ్యాఖ్యాతలు తెలిపిరి. వ్యాఖ్యానములందుఁ దెలుపఁబడిన పైయర్థమే దీనినిఁ గూర్చినయాక్షేపణలకును జర్చలకును గారణము. ఒకనాఁడు కుతపకాల మను శబ్దములరూఢ్యర్థముల ననుసరించి పైయర్థము సరియైన దనుట నిస్సందేహమే కాని, యిది సందర్భమునకు సరిపోకున్నది. కావున నీవిషయమునఁ గవి హృదయము భిన్నమై యుండు నని తోఁచును. నాకుఁ జూడఁగా నీ "యొకనాఁడు కుతపకాల మనఁగా" నొక పర్యాయపు వేసవికాల మనుట కవి యుద్దేశించినట్లు తోచుచున్నది. ఈయర్థము పొసఁగునేని ప్రవరునియొద్దకు నొకసారి వేసవికాలమున సిద్ధుఁడు వచ్చియుండె నని చెప్పుటకు వీలుండును. అప్పు డిది 'తలమే బ్రహ్మకు నైన......'అనుపద్యమునందలి 'మధ్యాహ్నముం దెల్పెడిన్' అనుమాట కేవిధమునను నడ్డురా' జాలదు. కాని, దీని కీయర్థ మెట్లు చెప్పవచ్చు నను సంశయము కలుగకపోదు. "అంశోష్టమోఽహ్నః కుతపోఽస్త్రియామ్" అని అమరము. దీనినిబట్టి పగటిని పదునేనుపాళ్లు పోగా నెనిమిదవపాలు కుతప మనఁబడును. కుతపశబ్దమునకు నీయర్థమే సామాన్యముగా సర్వత్ర గ్రహింపఁబడుచున్నది. కాని, 'సూర్యోఽస్మిన్ కుం భువం తపతీతి కుతపః. అ.వ్యా. తప సంతాపే. సూర్యుఁడు దీనియందుఁ దహింపఁజేయు' నను వ్యుత్పత్త్యర్థము - అమరమునందే తెలుపఁబడినది.కావున దీనినిబట్టి సూర్యుఁడు భూమిని తపింపఁజేయుకాలము కుతపకాల మని తెలియుచున్నది. గ్రీష్మకాల మిట్టిదే కదా! కావున వ్యుత్పత్త్యర్థమునుబట్టి కుతపకాలమునకు గ్రీష్మకాల మని యర్థము చెప్పుట సుసాధ్యము."[32]

4. ప్రవరుఁడే వరూథినిని మునుముందుగాఁ జూచె నని పెద్దన :

పురాణకథయందు - హిమగిరిపై సంచరించుచున్న ప్రవరుని వరూథిని కాంచి మోహించె నని యుండఁగాఁ బెద్దన ప్రవరుఁడే వరూథినిని మొట్టమొదట చూచె నని మార్చి వర్ణించెను. అట్లు మార్చుట కతఁడు మూలాతిరిక్తముగా హిమవంతమునఁ గల్పించిన దృశ్యవర్ణనమే కారణ మైనది. పురాణకర్త కాయవసరము పడలేదు. మారన ప్రవరుఁడు చూచిన నగవిశేషములను వర్ణించుచు, సురసిద్ధసాధ్యకిన్నరమనోహరకేళివిలసితకందర విభ్రమములను, త్రిదివనితంబినీక్రీడాభిరమ్యలతాగృహమహితసౌందర్యములను గల్పించెను. అట్టి సంకుల మైన కొండకోనలయందు సురవనితలు పలువురు తిరుగుచున్నను, ప్రవరుఁడు వారివైపు దృష్టి సారించలేదు. మునివరుఁ డెవఁడైన దొరకునేమో యని మాత్రమే గవేషించెను. స్త్రీలను బల్కరించు తలం పాతనికి లేదు. కాని, వరూథినియే యతనినిఁ గాంచి, వలచి, యెదుటఁబడి, అడ్డము నిలచుటచే నతఁడు మార్గాంతరము

32. పదునాఱవ శతాబ్ది ప్రబంధవాఙ్మయవికాసము - మనుచరిత్రము - రెండు ఆక్షేపణలు.

లేక మాట్లాడవలసి వచ్చినది. అట్లు చిత్రించుటలోఁ బురాణమునం దనౌచిత్య మేమాత్ర మును లేదు. పెద్దన దానిని మార్చుట దానియం దనౌచిత్య మున్నదనియుఁ గాదు.

మూలమున వరూథిని కొండకోనలయందు విహరించు స్వేచ్ఛాజీవి. కాని, పెద్దన యామెకు హిమగిరిపై నొక కాంతారమును, కేదారక్షేత్రమును, నైందవగ్రావాకల్పిత కాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛములను,గారుడోత్కీర్ణ మగు నొక్కభవనమును గల్పించి, అమలమణిమయనిజమందిరాంగణస్థతరుసహకారవితర్ది మీఁద శీతలానిల మొలయ నాసీనయై వీణ వాయించుచున్నట్లు వర్ణించెను. పెద్దనగారి ప్రబంధమున వరూథిని హిమనగ నివాసిని. ఆమె కప్సరస్త్రీలు పలువురు చెలికత్తెలు కలరు. ప్రవరుఁ డీమె నివసించు కాంతారమును గాంచి తపోవన మని భ్రమించి యందు ప్రవేశించెను. గారుడోత్కీర్ణమై వృక్షచ్ఛాయలలో లీనమైయున్న యామె భవనమును సమీపించునంతవఱకును గుర్తింపఁ జాలక పోయెను. వీటీగంధమునుబట్టి యచ్చట చేడియ లున్నా రని గ్రహించెను. విద్యుల్లతావిగ్రహయైన వరూథినిఁ గట్టెదుటఁ బొడగాంచెను. అమె యతనినిఁ గాంచి పొందిన మదనవికారములను, తదుచితహావభావములను గన్నులారఁ గాంచుచు మందగమనమున నామెను దఱియంగ నేఁగెను. పెద్దన కల్పించిన వాతావరణమున నిట్లు జరుగుటయే సంభవము, సహజమును.

సన్నివేశము నిట్లు మార్చుటవలనఁ బెద్దన సాధించిన ప్రయోజన మొక్కటియే. అది నాయికానాయకుల పరస్పర దృక్మీలనానంతరము నాయికయందు రతిభావోదయాదులను వర్ణించుట; ప్రవరుఁడు భీతహరిణేక్షణ ! యని సంబోధించుటకుఁ దగిన పూర్వరంగము సిద్ధముచేయుట. ఇట్టి చిత్రణము పరస్పరానురాగబద్ధు లగు నాయికానాయకుల పట్ల రాణించిన ట్లేకత్రానురాగబద్ధ మైన జంటయందు రాణింపదు. ప్రవరుని కట్టెదుట శృంగారహావభావముల వెలార్చు వరూథినిఁ గాంచి ప్రవరుఁ డెట్టి వికారమును బొందఁడు. పెద్దన దీనికి జనాన్వితమిచ్చో టని చేరఁబోయి కనియెన్ (2.25) అనియు, ''అంఘ్రి కటకంబుల్ మ్రోయ నడ్డంబు నిల్చిన నయ్యచ్చరఁ జూచి (2.38) అనియు నిర్వికార సూచకము లగు క్రియాపదములను వాడి వ్యంజింపఁజేసెను.

మారన యీసన్నివేశమును మఱొకవిధముగా భావించెను. నాయికకు నాయకుని సౌందర్యము విభావముగా నిలిపి, గుప్తముగా నామెచే దానిని దర్శింపఁ జేసి, ప్రకటముగా నామెయం దభిలాష కల్పించి, మదనవికారము దోపింపఁజేసి, అతనిప్రథమ వీక్షణము కొఱకు క్రాతపడి తనంతట తా నాతని కడ్డముపోయి తమకముతో రత్నపుత్రికవోలె నిలిచెనని చిత్రించెను. శృంగారపోషణమున కుపకరించునది వరూథినిపాత్ర. ఆమెయం దంకురించెడి రతిభావబీజము నాయకునివైరాగ్యప్రేరిత మైన నిర్లిప్తతముందు వెలవెల పోరాదు. గుప్తముగా నది వర్ధిల్లి పొంగి యుప్పెనవలె నతనిపైఁ బడవలెను. ప్రవరుఁడు కా దన్నను దృఢమూల మైన రతిభావము మాయాప్రవరసందర్శనము వఱకు పెరిగి వర్ధిల్లవలెను. అందువలననే మారన భావోన్మీలనమార్గము ననుసరించి, నాయికకు నాయ

కుని పరోక్షదర్శనము, ప్రత్యక్షదర్శనము, దృఙ్మేలనము, సంభాషణము అను క్రమము కల్పించెను.

ఇప్పట్టున పెద్దన కల్పనముకన్న మారన చిత్రణమే సార్థకముగను, రసానుగుణముగను నున్నట్లు భావింప వీలగుచున్నది.

## 5. వరూథినీప్రవరుల సంభాషణశిల్పచిత్రణము పెద్దన యపూర్వప్రతిభకు నిదర్శనము :

వరూథినీప్రవరులసంభాషణమును పెద్దన ప్రతిభాన్వితముగా నిర్వహించెను. ప్రవరుని తొలిపలుకులలో నర్మస్ఫూర్తియు, వరూథినీప్రత్యుత్తరమున నర్మగర్భతయు గల్పించుట కవి యపూర్వసామర్థ్యమునకుఁ దార్కాణములు. వరూథిని స్వీయవృత్తాంత కథనములోని యాత్మప్రత్యయమును, ఆతిథ్యము నిచ్చుటకుఁ బిలుచుటలోని గడుసుఁదనమును. ప్రవరుఁ డవ్వనిత యీయఁదలఁచిన నాతిథ్యగౌరవములనుండి తప్పించుకొను నేర్పును, ఇలు సేరు నుపాయము చెప్పు మను దైన్యతయు, వరూథిని తనవిహారప్రాంతములఁ జూపి యాతని నాకట్ట యత్నించు చాకచక్యమును, 'ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో, పూవుపొదరిండ్లను గౌరవించెదో'- యని సమస్యను గల్పించుటయందలి చౌరవయును, 'నేఁ డిలు సేర కున్నచో సమస్తధర్మములు తూలు ననియు నే నాహితాగ్ని ననియు' నెలుగెత్తి చెప్పు ప్రవరునియవస్థయును, వరూథిని తనకౌఁగిలిపొందు యజ్ఞకోటుల ఫలమని చెప్పి, కస్తూరికాదిసుగంధద్రవ్యములఁ జూపి సశరీరస్వర్గము ననుభవింపు మని ప్రేరేపించుటలోని యుక్తిచాతుర్యమును, ప్రవరుఁడు బ్రహ్మానందసుఖరాజ్యము నధిరోహించు బ్రాహ్మణతత్త్వమును జెప్పి, యకాముకత్వమును దెలియజెప్పు నూఱీదనమును, వరూథిని 'ఆనందో బ్రహ్మ' యటన్న ప్రాజదువునాంతర్యము కామోపాధ్యాయునివోలె చెప్పుటయందలి వాగ్వక్రతయు, 'తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్' అవి నిరసించు ప్రవరునివైరాగ్యస్ఫూర్తియు, ''వనిత తనంత తా వలచివచ్చినఁ జుల్కనగాదె యేరికిన్'' అను వరూథినిగూఢాభిమానమును, రతిసంరంభము మీర ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ బాలిండ్లు పొంగారి పైయంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసించు ప్రౌఢియు, ప్రవరునిహృదయమునందలి దయాభావమును వెలికిఁదీయ నుపయోగించిన వాగుపాయములను, పెద్దన శృంగారశాంతముల సమసంఘర్షణముగాఁ జిత్రించెను. ప్రవరునిచే ''హాశ్రీహరీ''యనిపించి, వరూథిని నావలఁ ద్రోయించి, మఱుమాటాడకున్నట్లు చిత్రించుట కవిసన్నివేశనిర్వహణౌచిత్యమున కవధి. మూలమునఁ బ్రవరునిఁ గౌఁగిలించిన వరూథినిఁ బొమ్మంచు ద్రోచినట్లు లేదు. అది పెద్దనస్వకపోలకల్పన. "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్'' అను నర్థాంతరన్యాసమున కది సార్థకాపాదకము. మూలమునం దీఘట్టమునం దున్న నాతిప్రౌఢము లైన వాక్యములను పెద్దన యనుసరింపక యౌచిత్యము పాటించెను.

6. అమరకాంతముఖమునఁ "ప్రాణములు వీడెద" ననుమాటలు పెద్దన పలికింప లేదు :

వరూథిని ప్రవరునితో "నీచేత నిరాకృత నైతినేని పంచత్వంబు నొందుదు నీవునుం బాపంబునం బడుదు వని" యనినట్లు మారన రచించెను. సంస్కృతపురాణము నందును నట్లే కలదు. అమరకాంత యైన వరూథిని 'పంచత్వ మొందెద' నని ప్రసంగించుట సహజముగా నుండ దని భావించి కాబోలు పెద్దన యామాటను వదలివై చెను. తన యభిప్రాయమును మఱొకచోట కవి యిట్లు వరూథినీవాక్యములందు వ్యంగ్యముగా నిర్దేశించినాఁడు.

ఉ. ఎంత తపంబు సేసి జనియించిన వారొకొ మర్త్యభామినుల్ ;
కాంతుఁ దవజ్ఞ సేసినను గాయము వాయుదు, రే నమర్త్య నై
చింతలవంతలం జవికి సిగ్గఱితిన్; మృతి లేని నాదు చె
ల్వింతయు శూన్యగేహమున కెత్తిన దీపిక యయ్యె నక్కటా ! (3.8)

కనుఱెప్పలల్లార్చునట్లు చిత్రించిన దేవవనితయందు మానవత్వమును, విభుఁ డొనర్చిన యవమానమునకుఁ గుందు మానవతియందు దేవత్వమును పెద్దన దర్శించి వరూథినిని మిశ్రమపాత్రగా సృష్టించి ధన్యుఁ డయ్యెను.

పెద్దన దేవాంగనచేతనే కాక రథాంగవనితముఖమునందును (విభుఁ డన్యవధూటిని జెందినచో) కులసతి జీవములు త్యాగ మొనర్పకుండునా ? - యను వాక్యార్థముల నుచ్చరింపఁ జేయక వదలుటనుబట్టి చూడఁగా - నిట్లనుట పెద్దనకాలమునాటి కెబ్బెట్టుగాఁ దోచుచుండె నేమో యనియు భావించుట కవకాశము కలుగుచున్నది.

7. అగ్నిదత్త మైన హయము పెద్దన కల్పించినదే :

ప్రవరుఁడు గార్హపత్యాగ్నిని స్తుతించి తత్ప్రసాదమున నెప్పటియట్ల శీఘ్రగమనము వడసి నిజగృహమున కరిగె నని యుభయపురాణకథలయం దుండ పెద్దన "పావక ప్రసాదలబ్ధం బగు హయం బెక్కి పవనజవనంబున నిజమందిరంబున కరిగె" నని రచించెను. ఇందలి యగ్నిదత్త మైన హయము పెద్దన కల్పించినదే.

8. 'కలి' యను గంధర్వనామమును పేర్కొనక పెద్దన విడచెను :

మాయాప్రవరుఁడై వరూథిని నుపభోగించు గంధర్వకుమారుని పేరు 'కలి' యని యుభయపురాణములు పేర్కొనినవి. కాని, పెద్దన యానామమును గ్రహింపక వదలెను. దీనిపై శ్రీకాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగా రొనర్చిన విమర్శనమునకు సమాధానముగా శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారు ప్రకటించిన యభిప్రాయము లెంతయు సమంజసములుగా నున్నవి. వాని నిచ్చట పొందుపఱచుట యైనది.

"ఈకథను మనుచరిత్రమునఁ బెద్దన్న సరిగా నతుకలే దని శ్రీశాస్త్రిగారి యభిప్రాయము. "ఏగంధర్వుఁడు తద్విలాసముల ము న్వీక్షించి తా నెంతయున్ రాగాంధుండయి" అని యీగంధర్వునిగూర్చి హఠాత్తుగ నెత్తుకొనినాఁ డఁట! కాని, యతని పేరు, నాతనిపూర్వవృత్తాంతము, వరూథినికి నతనికిని నదివఱలో జరిగిన మోహతిరస్కార మిత్యాదివిషయములు కథారూపముగాఁ జెప్పఁబడలేదఁట! అది యొక యసందర్భ మఁట!"

"వరూథినీప్రవరసంవాదము సంపూర్ణముగా వర్ణించి, ప్రవరుఁడు వరూథినియొక్క కాముకయత్వముల నన్నింటి నుల్లంఘించి యామెను వీడిపోయె నని చెప్పి తదుపరికథను సాగించుటలో ముఖ్యముగా మఱియొకఁడు ప్రవరవేషము దాల్చి వచ్చి వరూథినిదృష్టి నాకర్షించె ననియు, నామె యాతఁడు ప్రవరుఁడే యని భ్రమపడి యాతనితో భోగించె ననియుఁ దత్కారణమున స్వరోచి పుట్టె ననియుఁ జెప్పుటయే ముఖ్యవిషయ మగును. కాని, మాయాప్రవరుని పూర్వవృత్తాంత మంతయుఁ జెప్పుట యంతముఖ్యము గాదు. పూర్వోత్తరసందర్భములనుఁ గథాప్రణాళికకొఱకుఁ గొంచెము సూచించినఁ జాలును. మాయాప్రవరుఁడు కేవలము క్రొత్తపురుషుఁడు కాఁ డనియుఁ బూర్వము వరూథినిని వరించిన యొకగంధర్వుఁ డనియుఁ గవి యొకపద్యములోఁ జెప్పవలసిదంతయుఁ గ్లుప్తముగాఁ జెప్పినాఁడు. అంతఃకథను బెంచి ముఖ్యకథ కంతరాయము గలుగఁ జేయకుండుట కథాసంవిధానమున నొకగుణ విశేషమై యుండనోపు!"

"కలి యను గంధర్వుని పే రెత్తకపోవుట యేల యని శ్రీశాస్త్రిగారు ప్రశ్నించిరి. దాని కొకకారణము నాకు స్ఫురించుచున్నది. సహృదయు లరయుదురుగాక! "కలి" యను పే రంత మనోహరమైనది కాదు. ఈనామము సమస్తదుర్గుణసమూహసూచకము. ఈ పేరిటివాఁడు స్వరోచికిఁ దండ్రి యయ్యె నని చెప్పిన నగౌరవముగ నుండ నోపు నని తలఁచి కలి పే రిట మానె నేమో! మఱియొక చిన్నసూచన! ప్రారంభములో నీస్వారోచిష మనుసంభవకథను ప్రబంధముగా రచింప వలయు నని శ్రీకృష్ణదేవరాయలు కోరి నప్పు డాచక్రవర్తి చెప్పిన ట్లీ మాటలు వ్రాయఁబడినవి. "మనువులలో స్వారోచిషమనుసంభవము...... వినవింపు కలిధ్వంసకము". కలిధ్వంసక మగుకథలో 'కలి' యను పురుషుఁడు స్వరోచికిఁ దండ్రి యగుట యెట్లు పొసఁగును? ఇది స్వవచనవ్యాఘాతముగ నెంచఁబడవచ్చును.".[33] ఈవాక్యములతో సహృదయు లేకీభవింతు రనుటలో విప్రతిపత్తి లేదు.

### 9. మనోరమాస్వీయవృత్తాంతకథనారంభము నౌచిత్య మెఱిఁగి పెద్దన నిర్వహించెను.

అనురపీడిత యైన మనోరమ స్వరోచిని శరణు వేడెను. అతఁ డభయహస్తము నిచ్చి నిజవృత్తాంత మడిగెను. ఆమె తనపుట్టుకతో నారంభించినట్లు పురాణములందుఁ

33. విజయనగరసామ్రాజ్య మందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము - శ్రీ పే. అప్పారావుగారు, II part, అనుబంధము, పుట. 6-7

గలదు. పెద్దన యట్లు చేయక మొదట నామెచే నసురబాధను జెప్పించి 'దుర్బలస్య బలం రాజా' యను నార్యోక్తి ననుసరించి యామెను రక్షించుట రాజధర్మ మని హెచ్చరించి, తద్వృత్తాంతమును మూలానుసారిగా నడిపెను. ప్రస్తుత మైన విపత్తు మొదట చెప్పుటచే రాజునకు సానుభూతియు, స్వీయవృత్తాంతము వెనుకఁ జెప్పుటచే నాదరగౌరవాదులు మనోరమపట్ల నేర్పడుట కవకాశము కలదు. కావున మనోరమాస్వీయవృత్తాంతకథ నారంభము పెద్దన సమయోచితవాక్యరచనాచాతుర్యమునకుఁ జక్కనినిదర్శనము।

10. మనోరమ మునిమోమును బాల్యచాపల్యమునఁ బట్టె నను కల్పనము పెద్దన చేసినదే :

మనోరమ విభావరీకళావతులఁ గూడి కైలాసనగమున కరిగి తదీయతటమునం దుగ్రతప మాచరించుచుఁ గృశించియున్న నొక్కమునివరునిఁ గాంచి నవ్వెను. అందుల కాతఁడు కోపించి, 'అసురకరగృహీత వగు మని' యతరుణిని శపించె నని- మూలమునఁ గలదు. పెద్దన కిం దొకయనౌచిత్యము తోచెను. ఉగ్రతప మొనర్చుచున్నముని మనోరమ నవ్వినంతమాత్రమున సమాధిని వీడి యుగ్రుఁ డగుట యంతసహజముగా నుండలేదు. కావున, పెద్దన కథను మార్చెను. మునియాకృతిని బూచివలె సృష్టించెను.

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కట బిఱ్ఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముం జడలు మే నుదరంబును వీనులున్ జరా
ధూసర మైన రోమతతితోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్న యొకజీర్ణమునిం గని కౌతుకంబునన్.

ఆ. ఇతని వదనకుహర మెద్ది? నేత్రద్వయం
బెద్ది? కర్ణయుగళ మెద్ది? యనుచు
బూచివోలె నున్న వాచంయమునిమోము
బాల్యచాపలమునఁ బట్టుటయును.

క. ధ్యానస్తిమితుం డగు న
మ్మౌని మదీయాంగుళీ విమర్శనములచే
మే నెఱిఁగి తొంటి యనుసం
ధానము చెడి కన్ను దెఱచి దారుణఫణితిన్. (మను. 4. 79-81)

వికృతమైన విభావమును వర్ణించి హాసముతోపాటు కౌతుకముఁ గల్పించి, యాముని మోమును మనోరమచేఁ బట్టించుటయు, దదీయాంగుళీవిమర్శనమువలన ముని మే నెఱిఁగె ననుటయుఁ గడుసహజముగా భాసించుచున్నవి. పెద్దనకల్పన మిచ్చట సార్థకమై వరలినది.

11. ముని మనోరమను శపించి యదయుఁడై తాడించె ననుకల్పనము పెద్దనదే :

పెద్దన మౌనిచే శాప మిప్పించుటతో నాగక యతనిచేతి నాగబెత్తముతో నాయ

బలను బసరమును గొట్టినట్లు చావ మోదించెను. ఋషిక్రోధమును, తజ్జనితయైన నిర్దయాభావమును, పెద్దన యాచర్యలయందు మూర్తి కట్టించినాఁడు. స్నిగ్ధహృదయలైన చెలులు బావనిపై నోరు చేసికొనుటకు బలవత్తరమైన కారణము సృష్టించుటయందు పెద్దన మూలాధికమైన నేర్పును ప్రకటించెను. భావపోషకమైన సన్నివేశకల్పనమునఁ బెద్దన సిద్ధహస్తుఁడు :

12. ఇందీవరాక్షుఁ డసురరూప ముజ్జగించి స్వీయవృత్తాంతము చెప్పినట్లు కథ మార్చినది పెద్దన :

స్వరోచి ప్రయోగించిన పావకబాణము తాకుటచే నిందీవరాక్షునకు శాపవిముక్తి లభించినది. వెంటనే యతఁడు నిజాకారము దాల్చి స్వరోచి నభినుతించినట్లు పెద్దన వ్రాసెను. మూలమున నాఁతడు స్వీయవృత్తాంతమంతయుఁ జెప్పి, చివరకు నిజాకృతి దాల్చె నని యున్నది. భయంకరవికారరూపమున నున్న నిందీవరాక్షునిచే నతని వృత్తాంతము చెప్పించినదానికంటె మంగళదివ్యాకృతియం దున్నప్పుడు చెప్పించుట సహజసుందర మని పెద్దన యూహ. కాని, పురాణకర్త లట్లు చిత్రించుటకును, పెద్దన యిట్లు మార్చుటకును వా రామునిముఖమునఁ బలికించిన శాపమోక్షణవాక్యములే గారణము లయి యుండవచ్చు నని యూహింప వీలగుచున్నది.

మూలమున శాపోపసంహారవాక్యము లిట్లున్నవి.

శ్లో. యన్మయోక్త మవశ్యం త ద్భావిగంధర్వ నాన్యథా
కిన్తు త్వం రాక్షసోభూత్వా పునః స్వం ప్రాప్స్యసే వపుః ॥
నష్టస్మృతి ర్యదా క్రుద్ధః స్వ మపత్యం చిఖాదిషుః
నిశాచరత్వే గన్తాసి తదస్త్రానలతాపితః ॥
పునః సంజ్ఞా మవాప్య స్వా మవాప్స్యసి నిజం వపుః
తథై వస్వ మధిష్ఠానం లోకే గన్ధర్వ సంజ్ఞితే ॥ (60 49-52)

ఈమార్గము ననుసరించియే మారన తెలుఁగుచేసెను.

సీ. వినవయ్య గంధర్వవీర ! నాపలు కవశ్యము తప్ప దిపుడు నీ వసుర వయ్యుఁ
గ్రమ్మఱ నిజమూర్తిఁ గైకొనియెదు దైత్యభావంబుచే స్మృతి బాని యెపుడు
కుపితుండవై నీదు కూతు నంగద మ్రింగ నడరి యొక్కరుని దివ్యాస్త్రవహ్ని

తే. నెరియు దప్పుడు మది నెఱుక వొడమి
నిర్మలాకృతి వగు దని యాన తిచ్చె. (5.46)

పైవాక్యములను బరిశీలింపఁగా మహర్షి మొదట రాక్షసాకృతి వోయి నిజాకారము వచ్చు నని యిందీవరాక్షునకు ధైర్యము చెప్పి, తరువాత నాతఁ డాకృతినిఁ బొందు క్రమమును నిర్దేశించి చెప్పినాఁడు. ఇందొక విశేష మున్నది, శాపగ్రస్తుఁడైన గంధర్వరాజు క్రమముగా గంధర్వభావము వీడి రాక్షసభావమునకు లోనైను. ఆపరిణామదశలో నతనియందు

సహజమైన జ్ఞానము నశించి స్మృతి విరహితుఁ డగును. స్వరోచి దివ్యాస్త్రవహ్ని సోకి నప్పుడు మొదట అతనికిఁ గలుగునది దివ్యజ్ఞానము. అది స్మృతి నిచ్చును. దివ్యాకృతి నిచ్చును. ఈక్రమదశ ఋషివాక్కులో దృశ్యమాన మగుచున్నది. అనఁగా నాకృతికి భావమే మూలము. భావమునకు జ్ఞానము మూలము. అంతఃపరిణామము లేనిదే బాహిర మైనమార్పు నిరర్థకము. ఈసూత్రమును పెద్దన గుర్తించె ననుట కిందీవరాక్షుని నాసుర భావ మావహించుటకును క్రమోన్మీలనపద్ధతిలోఁ జిత్రించిన ఘట్టమే సాక్ష్యము (మను· 5.22-24). కాని, శాపావసాన ఘట్టమున హఠాత్పరిణామమును గల్పించెను. పురాణ ములు పైక్రమమునకుఁ గట్టుపడెను. స్వరోచి బాణము సోకినంతనే మొదట కలిగినది స్మృతిరూప మైన నిజస్వరూపజ్ఞానము. నృపాలునకుఁ గథారూపమునఁ జెప్పుటచే విస్మృతి తొలఁగె నని స్ఫుట మైనది. స్మృత్యంతరమే దివ్యాకృతిసిద్ధి. అది ఋషివాక్కు. శాప వాక్యముల కతివ్యాప్తిదోషము పట్టరాదు. ఇట్టి దోషము వాటిల్లకుండ పెద్దన ఋషివాక్కునే మార్చినాఁడు.

చ. అనినఁ బ్రసన్నుఁడై మునికరాబ్జములన్ నను నెత్తి ''వత్స మ
త్సునిశితశాపశూలహతి స్రుక్కితిగా; యిఁకఁ గొన్నినాళ్ళ పైఁ
దనయను ప్రింగఁబోయి యొకధన్యుని దివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్ర '' (5.21)

మన్నట్లు రచించినాడు. 'భద్ర' శబ్దము తాత్పర్యబోధ నిచ్చు శబ్దమే కాని మూలము నందలి విశేషము దెల్పు సామర్థ్యము కలదికాదు. కావున పెద్దన యనౌచిత్యమునకు గురి కాలేదు. పై పెచ్చు మూలమునందలి "చండాస్త్రము" "నవలాస్త్రము"గాఁ బెద్దన మార్చుటచే నాయగ్నిశిఖలఁ బడిన యసురశరీరమును వీడి గంధర్వరాజు నిజశరీరమును ధరించుట తప్పనిసరి యైనది.

శాపవృత్తాంతకథనముతో పాటు రాక్షసాకృతి నుపసంహరింపఁ జేయుట పురాణ కర్తనిర్మాణశిల్పము. దివ్యాకృతి యైన గంధర్వుని ముఖమున కథ చెప్పించి కథకుని యందును, కథయందును గౌరవభావము కలిగించుట ప్రబంధకర్త నిర్మాణశిల్పము !

## 13. స్వరోచి మనోరమాసఖులయొక్క దుర్దమరోగబాధలఁ దొలఁగింపఁ బూను ప్రతినను వివాహానంతరము నిబంధించినది పెద్దన :

స్వరోచి యొనర్చిన యుపకృతికిఁ బ్రతికృతిగా నిందీవరాక్షుఁడు ఆయుర్వేద విద్యను, దనపుత్త్రికను నాతని కీయ సంకల్పించెను. అప్పుడు మనోరమ తండ్రితో ని ట్లనినట్లు పురాణములందుఁ గలదు.

చ. మన కుపకారి యైన సుకుమారుని నీతనిఁ జూచి నష్ట నా
మనమున రాగ మైనయది మానుగ నైనను తండ్రి ! నాకతం
బునఁ బటురోగదుఃఖములఁ బొందుచు నెచ్చెలు లిట్టులుండఁగా
ఘనసిజభోగలీలలకు మానస మెమ్మెయి నాకు నూల్కొనున్.

వ. అనిన వరూథినీతనయుం డయ్యింతి కిట్లనియె.

క. ఆయుర్వేదము పెంపున
నీయిద్దఱు సఖుల రోగనిర్ముక్తులఁ గాఁ
జేయుదు నమ్ముము విడువుము
తోయజదళనయన ! వగపుతో సంశయమున్. (5.50-52)

అని యనినంతనే యవ్వనిత రాగాత్మ యై యవ్విభుని వివాహమాడెను.

పెద్దన యీసన్నివేశము నిచ్చట వర్ణింపలేదు. ఇందీవరాక్షుఁడు తనపుత్త్రిక నవ్విభున కిచ్చి వివాహ మొనర్చెను. ఆయుర్వేదవిద్య నరణముగా నిచ్చెను. వివాహానంతరము శోభనముహూర్తమునఁ దొలిరేయి సతీపతు లొక్కయెడ చిక్కినప్పు డవ్వనిత కంటతడి పెట్టెను. పతి దానికి కారణ మడిగెను. ఆమె మెల్లగా నిట్లనినది :

ఉ. అక్కట ! నాయెడన్ మిగుల నక్కఱ గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ జెందిన దుర్దమరోగబాధలం
బొక్కుచు నున్నవారు వనభూములఁ; దద్దశమాన్పవేని నా
కెక్కడిసౌఖ్య - మన్నఁ దరళేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్.

క. పరితాప మింక నేటికి ?
హరిణాక్షి ! మదీయ సంచితాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద
నరు దనఁగ భవత్సఖీజనామయభరమున్. (6.10-11)

పైరెండుసందర్భములందును వాక్యతాత్పర్య మొక్కటియే. కాని, వాని నన్న సందర్భముల యౌచిత్యము విచార్య మగుచున్నది. దానిని విచారించుటకుఁ బూర్వము పురాణప్రబంధకర్తలహృదయములను బరిశీలింపవలసియున్నది. పురాణకర్త నాయిక యొక్క కర్తవ్యనిష్ఠ, త్యాగము అనెడిగుణములకు ప్రాధాన్య మిచ్చి కథను నిర్మించెను. ప్రబంధకర్త విశ్వాసము, వివేకము అనునాయికాగుణములకుఁ బ్రాధాన్య మిచ్చి కథను భావించెను. ఇందు పురాణదృష్టి యుదాత్త మైనది; ప్రబంధదృష్టి రమణీయ మైనది. విజ్ఞులకు పురాణమార్గము నచ్చును; రసికులకుఁ బెద్దనమార్గ మిష్ట మగును.

పురాణమున మనోరమ తనవృత్తాంతము చెప్పుచు తనకొఱకై దురంతరోగబాధిత లైన తనచెలుల దుర్దశనుగూడ విడువక పేర్కొనెను. ఆమె మునిపట్ల చేసిన యపరాధమునకే కాక తాను చెలుల యిక్కట్టులకు కారణ మైనందుల కెంతయో పరితపించినది. రాక్షసబాధానివృత్తితో నొకపీడ వదలినది. కాని చెలులబాధ తీరలేదు. తనను రక్షించిన వీరునకుఁ దన నిత్తు నని తనతండ్రి మాట యిచ్చెను. అది యామెకుఁ బ్రీతిదాయకమే. ఉపకారబుద్ధి యైన స్వరోచిని గాంచినప్పుడే యామెహృదయమున రాగ మంకురించినది. కాని, యది మిత్రదుఃఖముచే సంఛన్న మైనది. పెద్దనగారు తృతీయాశ్వాసమునఁ బేర్కొనినట్లు ''అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్య'' మ్మను నార్యోక్తి ననుస

రించి, సఖీజనామయదుఃఖభారమును, వివాహమంగళకౌతుకమును మనోరమహృదయ మునం దేకత్ర వసించి వర్తిల్లలేవు. అందువలననే యామెనిజహృదయము నతిచతుర ముగా విప్పి చెప్పినది. తండ్రి యాయుర్వేదము నేర్చిన ట్లాపుత్త్రికకు తెలియదు. విద్య ముగిసినవెంటనే యతఁడు గురుశాపహతుఁ డగుట దానికిఁ గారణము. ఇప్పు డావిద్య నాతఁ డారాజున కిచ్చివైచెను. తననుగూడ నతని కీయ నుపక్రమించెను. సూక్ష్మబుద్ధి యైన మనోరమ తండ్రినిఁ జూచి మన కుపకారి యైన నీనుకుమారినిఁ జూచినప్పుడే మన మున రాగ మైనయది యని చెప్పుకొనినది. అస లట్లు చెప్పవలసిన యవసరమే లేదు. ఇంగితజ్ఞుఁ డైన యిందీవరాక్షుఁ డావిషయ మెప్పుడో గుర్తించెను. కావుననే పుత్త్రికను ప్రత్యేకించి యడుగలేదు. కాని, యామె చెప్పుటలో గడుసుఁదన మున్నది. 'నీచే దత్తను గాక పూర్వమే నే నాతనికి స్వయందత్త నైతి ననియు, దానిని మరల్ప ననితరసాధ్య మనియు నందలి వ్యంగ్యము. ఇఁక నిచ్చిపుచ్చుకొనుటలు లాంఛనప్రాయము లని తాత్పర్యము. పితృకృత మగుచున్న కన్యాదానము గతార్థ మని సూచించి ప్రకృతార్థ మును బ్రతిపాదించుట యామె సాధింప నెంచిన ప్రయోజనము. ఐనను "నెచ్చెలులు నాకతమునఁ బటురోగదుఃఖములఁ బొందుచుండఁగా మనసిజభోగలీలలకు మానస మెమ్మెయి నాకు నూల్కొనున్" అని ముఖ్యవిషయమును పైట పెట్టినది. పితృదత్తయైన కన్య పతిమనోనుకూల యై వర్తింపవలెను. మనోరమ కాబోవు తన భర్త యుదారుఁ డని గమనించినది. కాని, యతనియందు తండ్రియం దున్నంతచనవు లేదు. కాని, గాఢ మైన యనురాగ మున్నది. కావున తండ్రిని సంబోధించి మాట్లాడినది. ఆమె మాటలలో వివాహ మొల్ల ననుభావము లేదు. సఖీజనామయదుఃఖభావము పోయినచోఁ బెండ్లి కంగీ కారమే. ఆమయనివారణ మాయుర్వేదమువలనఁ గలుగు నని మనోరమకుఁ దెలియును. ఆయుర్వేదసిద్ధి తండ్రినుండి యప్పుడే స్వరోచికిఁ దరలింపఁబడినది సఖీజనుల నాయు ర్వేదప్రభావమున దక్కించుకొనఁ గల్గెనా! తాను వైవాహికజీవితమును సుఖవంతముగా నడుపుకొనఁగలదు. కాబట్టి తనకర్తవ్యనిష్ఠను మరువక, సఖుల కనామయత్వము కలు గనిచో నేను వివాహమాడునది లేదని త్యాగస్ఫూర్తిని బ్రకటించి, అపైనేను వివాహ మాడినచో స్వరోచినే వివాహ మాడెద నను నిశ్చయభావమును జాకచక్యముతోఁ గాంతా సమ్మితముగాఁ బ్రకటించినది. ఆమె తండ్రిని సంబోధించి చెప్పుట స్వరోచినుండి ప్రత్యుత్తరము పొందుటకే. స్వరోచియు స్వాయత్త మై యున్న ఆయుర్వేదవిద్య నుపలక్షించి యామె పల్కుచున్న దని గమనించెను. అతనిపై నామె కున్న యచంచ లానురాగమున కతఁడుబ్బిపోయెను. మనోరథము తీర్చి మనోహరి యందించు మనో భవభోగలీల లనుభవింప నెంచెను. అందువలననే యామె వగపును, సంశయమును బోయి తనయందు నమ్మకము కుదురునట్లు ప్రతిజ్ఞ యొనర్చెను.

పెద్దన చిత్రించిన మనోరమ పురాణప్రోక్తవలె గడుసరి కాదు. తండ్రి తనను స్వరోచి కీయఁగాఁ గిమ్మనక వివాహ మాడినది. తొలిరేయి తనగుండెలో నున్న దుఃఖము నంతయుఁ బతి కెఱిఁగించినది. అశ్వాసము పొడుగున వర్ణించిన వివాహసంబంధ

మంతయు లోలోనఁ గుములుచున్న కూతురు నొక యింటిదానిని చేయుటకొఱకే; ఏకాంతమున బిగికౌఁగిటఁ జేర్చిన పతిహృదయ ముద్వేగ పూరిత మగుటచే పెద్దన కల్పన యంతయు చివరకు రసాభాస మైనది. పురాణమునఁ బతి ప్రతిజ్ఞ వడసిన మనోరమహృదయము వివాహసమయమున నుల్లాసవంత మయి యుండి రసోద్దీపక మైనది. పెండ్లి యయినదో కాలేదో భార్యాభర్తలు కర్తవ్యపాలన కుద్యుక్తు లైనారు. శృంగారము ధర్మోత్సాహము నాశ్రయించి మూలమునఁ దేజోవంత మై యుండినంతగాఁ బ్రబంధమునఁ గాలేదు. కాఁగాఁ బ్రబంధమున మనోరమ పతియం దచంచలవిశ్వాసము కలిగి యతఁడు తప్పక తనచెలుల నారోగ్యవతుల నొనర్చు నని నమ్మి సమయము చూచి తగినట్లు భర్తకు నివేదించినది. "తద్దశ మాన్పవేని నాకెక్కడి సౌఖ్యము !" అను వాక్యమునందు మూలమునందలి వ్యంగ్యవైభవము స్ఫురించుట లేదు. ఇట్లు కవులు సాధింప నెంచిన ప్రయోజన మొకటియే యయ్యెను. అనుసరించు పద్ధతులలో నేర్పడు మార్పులవలన కథాశక్తియందును తారతమ్య మేర్పడుచుండును.

14. స్వారోచిషమనుసంభవానంతరము స్వరోచి యే మయ్యెనో పెద్దన చెప్పలేదు :

పురాణములందు స్వారోచిషమనుసంభవానంతరము స్వరోచికి హంసవాక్యములవలన వివేకము కలిగె ననియు, దానిచే నతఁడు భోగములను బరిహరించి జాతోద్వేగుఁ డై భార్యా సహితముగా వనమున కేఁగి ఘోరతప మొనరించి నిష్కల్మషత్వము నొంది యమరలోకమున కరిగె ననియు వర్ణింపఁబడినది. పెద్దన మనుజననానంతరమున నతనివర్తనము చెప్పక వదలివైచెను. దానికిఁ గారణము తెలియదు. బహుశః పెద్దన స్వరోచి చరమదశను వర్ణింపక వదలి కావ్యాంతమున మంగళము వ్యంజింపఁజేయ తలంచి యుండవచ్చును. లేదా - మూలమునందును, మారన పురాణమునందును వరూథిని స్వరోచి జననానంతర మే మయ్యెనో వివరింపలేదుకదా ! వరూథినీతనయుఁడు వరూథినివలెనే దేవయోని కావున నమరుఁడై యుండియుండు నని భావించె ననియు నూహింప వీలగుచున్నది.

15. మనుచరిత్రమున షష్ఠాశ్వాసమునందలి 63వ పద్యమునుండి 58వ పద్యములవఱకు పెద్దన రచించియుండ లేదా ?

1947లో శ్రీబులుసు వేంకటరమణయ్యగారిచేఁ బరిష్కృత మైన మనుచరిత్ర కావ్యమునందు 321వ పుటలోని అధస్సూచికలోఁ బైనఁబేర్కొనఁబడినపద్యములు వ్రాత ప్రతిలో లేవని సూచింపఁబడినది. ఈ భాగమున స్వరోచిగుటించిన కలహంసీ చక్రవాకీ సంవాదమును, మృగదంపతులసంవాదమును వర్ణింపఁబడియున్నవి. స్వారోచిషమను సంభవ కథలో నీఘట్టమున కున్న ప్రాధాన్యము ఆఖ్యానశిల్పాధ్యాయమున స్పష్టము చేయఁ బడినది. వస్త్వైక్యమునుగూర్చి చర్చించునవసరమున మఱికొంత వివరింపఁబడనున్నది. మనువుగా జన్మింపనున్న స్వారోచిషుని సంస్కారసంపుటిలో జాగృతమయ్యు దీప్తముగాని

జ్ఞానతృష్ణ స్వరోచినుండి సంగృహీతము కావలెను. మనుస్వయంకృషివలన నది యుద్దీప్తముకావలెను. కావున నీకథాఘట్టమును తొలగించినచో "మార్కండేయపురాణోక్త"మైన కథాతత్త్వము కుంటువడును. అది రాయల యభిమతము కాదు. పెద్దన సంకల్పము కాదు. కావున నీభాగము పెద్దనకృత మనుటలో నెట్టిసంశయము లేదు. ఉండకూడదు!

అది యట్లుండ శ్రీబులుసు వేంకటరమణయ్యగారు వ్రాసినట్లు ఈభాగము కొన్ని వ్రాతప్రతులలోఁ గనపడకపోవుటయు సత్యమే. నే నీవిషయమును వివరింప వారి కొక లేఖ వ్రాసియుంటిని. వారు దయతో నొకప్రత్యుత్తరము వ్రాసియున్నారు.[34] దానివలన దెలియవచ్చినవారి యభిప్రాయ మిట్లున్నది: "ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము మద్రాసులోని చాల లిఖితగ్రంథములు తిరుపతికిఁ దరలింపఁబడినవి గదా! బ్రౌనుదొర గారు వ్రాయించిన ప్రతులుమాత్ర మిచ్చట కలవు. వానినుండియే నేను పాఠములను గ్రహించియుంటిని. మను. ఆ. 6లో 63నుండి83 వఱకు బ్రౌనుగారి వ్రాతప్రతిలో లేవు. నెం. D 621. paper pages 310 complete. "గంగాతరంగిణీ" అను సీసపద్యమునకు తర్వాత 'తదనంతరంబున' అనువచనమే కలదు. వ్రాయసకాఁడు ఆ-20 పద్యములను గ్రంథము చివర వేరుగా (అనుబంధముగా)వ్రాసినాఁడు. ఈప్రతి బ్రౌనుగారు వ్రాయించినదే. D 641 సటీకప్రతి. ఇందులో టీకాకారుఁడు పయిసీసపద్యము వరకు టీక వ్రాసి పిదప 'తదనంతరంబున' అనువచనమునకే టీక వ్రాయ ప్రారంభించి, కొంత వ్రాసి, తర్వాత దానిని కొట్టివేసి అధిక పాఠపద్యములను చేర్చి టీక వ్రాసినాడు. దీనింబట్టియు అనేకప్రతులలో నీయధికపాఠము మూలమునఁ జేరలేదని తెలియనగును."

"ఇది పెద్దన రచన కాదేమో యని నాసందేహము. ఈమృగహంసలవృత్తాంతము స్వరోచికి అపకర్షాధాయకము. ఉత్కర్షకు భంగకరము. దీనివృత్తాంతము విని మనస్సు మారియు, వెంటనే యతఁడు వెనుకటిరీతి నుండుట యుచితముగాఁ దోచదు. ఈభాగము అతుకుగనే ఉన్నది. ఇది లేకున్న కథ కేమాత్రము భంగము లేదు."

శ్రీవేంకటరమణయ్య గారితో నీయంశమున నే నేకీభవింపఁజాలక పోవుచున్నాను. స్వరోచివర్తనకు అపకర్షాధాయకమైన మృగహంసల వృత్తాంతము పురాణకథాతాత్పర్యమునకుఁ బోషకము. దానిని విడచుట కథార్థభంజకము. ఇఁక నది పెద్దనరచనయే యనుటకును హేతువులు కలవు. (1) పైనఁబేర్కొనఁబడిన నెం. D 621 ప్రతిలో నీయిరువది పద్యము లనుబంధముగా వ్రాయఁబడి యున్నను, D 641 ప్రతిలో జూలూరి అప్పయ్యశాస్త్రిగారు ఈయనుబంధమును ప్రబంధకథాక్రమమున నుంచి వ్యాఖ్య రచించెను. మొదటిప్రతిలో వ్రాయసకాఁడు మొదట పొరబడి తరువాత అనుబంధముగా నాపద్యములు రచించి యుండవచ్చును. లేక కొన్నిప్రతులలోఁ గనవచ్చియు, గొన్నింటఁ గానరానిదియనగు నీభాగము ననుబంధముగా వ్రాసియుండవచ్చును. ప్రస్తుతము తిరుపతిలో నున్న వ్రాతప్రతులలో మనుచరిత్రము సంపూర్ణముగా నున్నప్రతులు - ఈ క్రిందివి. వానిలోఁ గొన్నింట నీపద్యములు కలవు. కొన్నింట లేవు.

34. మద్రాసునుండి 7-8-1965 నాడు వ్రాసినది.

| గ్రంథసంఖ్య | 6. ఆశ్వా. 63-83 పద్యము లున్నవా లేవా? |
|---|---|
| 1. D. 619. | కలవు. |
| 2. D. 620. | లేవు. |
| 3 D. 623. | కలవు. |
| 4. D. 624. | లేవు. |
| 5. D. 625. | లేవు. |
| 6. D. 635. | శిథిలముగా నున్నది. |
| 7. D. 640. | లేవు. |

కలదో లేదో యని భ్రాంతినిఁ గలిగించు నీభాగము ప్రబంధమున నుండుటయే యుచిత మని శ్రీజూలూరి అప్పయ్యశాస్త్రిగారు భావించినట్లు వారివ్యాఖ్యానరచనావైఖరి తోపింపఁ జేయుచున్నది. శ్రీవెంకట రమణయ్యగారు భావించుచున్నట్లుగనే ప్రాచీనులు కొందఱు ఈభాగము స్వరోచిశీలమున కపకర్షహేతు వని భావించి యీభాగమును ప్రబంధమునుండి తొలఁగించియుండియుండవచ్చును; కొందఱు మార్కండేయపురాణాంతర్గతకథానుకూల ముగా రచించిన పైభాగమును యథాతథముగా గ్రహించి పుత్త్రికలు వ్రాసికొని యుండి వచ్చును. కొన్నిప్రతులలో నీభాగము యథాస్థలమునఁ గానవచ్చుచున్నది కాబట్టి పెద్దన రచన మని గ్రహించుటయే యుచితము.

ఈపద్యములపై మారనరచనాప్రభావము, పెద్దన కల్పనావిశేషములగూర్చి వెనుక ముచ్చటింపఁ బడినది. సరోవరవర్ణనము, మృగవల్లభునికనకదీప్తులు మారనరచనాశిల్ప ములను నేర్పుతోఁ గొల్లఁగొట్టిన పెద్దనగాని కల్పింపలేఁడు. ఈయంశము నంతఃశిల్ప దృష్టితోఁ గాంచినను స్పష్టపడఁగలదు. కథలో స్వరోచికి ముగ్గురుభార్యలవలన ఆయుర్వే దము, పద్మినీవిద్య, మృగపక్షిజాతులభాషాజ్ఞానము లభించినవి. వానివలన నాయ కునకు ప్రయోజనసిద్ధి కలుగవలయునుగదా! ఆయుర్వేదముచే విభావసీకళావతు లారో గ్యవతులైరి. పద్మినీవిద్యాప్రభావముచే నన్నపానభూషావిశేషమాల్యవస్త్రానులేపనసామగ్రి లభించినది. మఱి యీభాగము లేనిచో మృగపక్షిజ్ఞానవినియోగ మెచ్చట? కావున నీభాగమును పెద్దన వదలి యనౌచిత్యమునకుఁ బాలుకాఁడు. పైపెచ్చు - అరవిందాక్షు లతోఁ గూడి కాసారమును దర్శింపఁబోవు స్వరోచికి "మసృణబిసాహారమాంసల హంసికా సంసదాసారకాసారతటుల" విహరించుట పదిపాటియైనట్లు 6. 62 వపద్యమున వర్ణించి హంసదర్శనమున కుచితమైన పూర్వరంగమును గల్పించియుండెను. పెద్దన యీవర్ణనము నిరర్థకముగఁ జేసె నని శిల్పజ్ఞు లొప్పుకొనరు. 6. 83 వ వచనము "తదనంతరంబు" యని ప్రారంభించుచున్నది. అట్టిప్రారంభ మీ 20 పద్యముల తరువాత శోభించినట్లుగా -లేక-అతికినట్లుగా నీపద్యములు లేక కుదురుట లేదు.

కావున నెవ్విధమునఁ జూచినను పెద్దన యీపద్యములను తప్పక రచించియుండు ననియు, కథాతత్త్వమును, పురాణహృదయమును గమనింపక యీభాగమున నాయక

నింద యున్న దని భ్రమించిన వ్రాయసకాండ్రు కొంద ఱీభాగమును ప్రతిప్రతులలోని కెక్కింపక వదలి రనియు భావించుట సమంజసము :

16. స్వారోచిషమనువు విష్ణువుఁగూర్చి యొనర్చినతపస్సు పెద్దన కల్పించినది:

సంస్కృతపురాణమునందు స్వారోచిషునకు మనుత్వ మిచ్చినది భగవంతుఁ డని యుండ మారన వనజగర్భుఁ డని పేర్కొనెను. పెద్దన విష్ణు వని వర్ణించెను. పురాణములందు స్వారోచిషుని తనుద్యుతి యధికముగాఁ గీర్తింపఁబడుట కారణముగా నతఁడు ద్యుతిమన్నామవిరాజితుఁ డయ్యె నని చెప్పఁబడియుండ, పెద్దన యతని తేజోనిధి త్వమును బ్రస్ఫుటముగాఁ జెప్పలేదు. ద్యుతిమన్నామము పేర్కొనలేదు. స్వారోచిషుఁ డను ప్రసిద్ధనామమును మాత్రమే గ్రహించెను. అంతటితో నాగక -

తే. " అట్లు జనియించి స్వారోచిషాఖ్య నతఁడు
శాంతిదాంతి దయాసత్యశౌచనిరతుఁ
డై యకామత జిరతపం బాచరించె
నచ్యుతునిగూర్చి"......యని పేర్కొనెను.

పెద్దనప్రబంధమున స్వారోచిషునకు మనుపదవి తపస్సిద్ధము. పురాణములందు జన్మ సిద్ధము దైవప్రేరిత మైన వనదేవత స్వరోచివలన నతనిఁ గాంచెను. అది దైవసంకల్ప మునకు ఫలము. దైవప్రసాద మతనికి జన్మసిద్ధము. ప్రబంధమనువుకంటెఁ బురాణ మనువు పరమోదాత్తుఁడుగా సృష్టింపఁబడెను. మనువునందు మూర్తీభవించుధర్మమును వ్యాఖ్యానము చేసినట్లు దశవిధధర్మములలో ముఖ్యమైన వానిని మనుగుణములుగాఁ బెద్దన కీర్తించెను. తపస్సాధనచే విష్ణుప్రసాదమును సాధించిన ట్లతనిఁ జిత్రించి వైష్ణవప్రభు వైన రాయలను పెద్దన సంతోషపెట్టెను. లేనిచో స్వాయంభువమనువుతరువాత స్వయం సిద్ధుఁడై జన్మించిన స్వారోచిషమనువును సాధకునిగాఁ జిత్రించి పెద్దన సాధించిన విశేష ప్రయోజన మేమియు లేదు.

17. మూలమునందలి కొన్నిపాత్రలపేళ్లను పెద్దన మార్చెను :

పెద్దన సంస్కృతాంధ్రపురాణములలోఁ బాత్రల కీయఁబడిన పేళ్లను గమనించి కొన్నింటిని యథాతథముగను, కొన్నింటిని మార్పులతోడను గ్రహించి తనప్రబంధమునఁ గూర్చెను.

| | సంస్కృత మార్కం. | మారన మార్కం. | మనుచరిత్రము |
|---|---|---|---|
| 1. | — | ప్రవరుఁడు | ప్రవరుఁడు |
| 2. | వరూథిని | వరూథిని | వరూథిని |
| 3. | కలి | కలి | — |
| 4. | స్వరోచి | స్వరోచి | స్వరోచి |

| | సంస్కృత మార్కం. | మారన మార్కం. | మనుచరిత్రము |
|---|---|---|---|
| 5. | ఇందీవరుఁడు - లేక - ఇందీవరాక్షుఁడు | ఇందీవరాక్షుఁడు | ఇందీవరాక్షుఁడు |
| 6. | మరుధన్వసుతా | మరుదశ్వపుత్త్రి | మరుదశ్వపుత్త్రి |
| 7. | మనోరమ | మనోరమ | మనోరమ |
| 8. | మందారవిద్యాధరుఁడు | మందారవిద్యాధరుఁడు | మందారవిద్యాధరుఁడు |
| 9. | విభావరి | విభావరి | విభావసి |
| 10. | పారర్షి | పారర్షి | పారర్షి |
| 11. | కలావతి | కళావతి | కళావతి |
| 12. | బ్రహ్మమిత్రుఁడు | బ్రహ్మమిత్రుఁడు | బ్రహ్మమిత్రుఁడు |
| 13. | విజయుఁడు | విజయుఁడు | విజయుఁడు |
| 14. | మేరునందుఁడు | మేరునందుఁడు | మేరునందనుఁడు |
| 15. | ప్రభావుఁడు - లేక - ప్రభాసుఁడు | ప్రభాసుఁడు | విభావసుఁడు |
| 16 | ద్యుతిమంతుఁడు - లేక - స్వారోచిషుఁడు | ద్యుతిమంతుఁడు-లేక- స్వారోచిషుఁడు | స్వారోచిషుఁడు |
| 17. | వరుణానది | వరుణానది | వరణానది |
| 18. | అరుణాస్పదము | అరుణాస్పదము | అరుణాస్పదము |
| 19. | విజయనగరము | విజయనగరము | విజయనగరము |
| 20. | నందవతి | నందవతి | గంధవతి |
| 21. | తాలనగరము | తాళనగరము | ధారానగరము |
| 22. | గంధర్వనామము : దేవారి- దేవాది | దేవాది | దేవాపి |

పెద్దన కల్పించిన వేఁటవర్ణనము, వివాహవర్ణనము, దశావతారవర్ణనము మొ॥నవి వస్తువిస్తృతివిభాగమునఁ జేర్చఁబడినవి. మొత్తమునకు పెద్దన ఉభయపురాణాతిరిక్తముగాఁ గల్పించిన కల్పనలు, మార్పులు ప్రబంధరామణీయకత్వమున కాస్పదము లై కవిప్రతిభావ్యుత్పత్తులను వేనోళ్ల చాటుచున్నవి.

**వస్త్వైక్యము :**

మనుచరిత్రములోని వస్త్వైక్యమునుగూర్చి పలువురుప్రముఖు లిదివఱకే తమతమ యభిప్రాయములు వ్యక్తముచేసియుండిరి. కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు ఈవిషయమును సాకల్యముగాఁ జర్చించుచు, "అల్లసానివాని అల్లిక జిగిబిగి" యనుగ్రంథ

మున నొకవ్యాసము వ్రాసియుండిరి. ఆచార్య శ్రీపింగళి లక్ష్మీకాంతముగారు 'తెలుఁగు విజ్ఞానసర్వస్వము'న నల్లసాని పెద్దనను గూర్చి వ్రాయుచుఁ దమయభిప్రాయమును వ్యక్తపఱచియుండిరి. వీ రిరువురివాక్యములను క్రోడీకరించి వానితాత్పర్యమును జర్చించుట యీవ్యాసతాత్పర్యము.

'ఈగ్రంథము పేరు స్వారోచిషమనుసంభవము. సంస్కృతములోఁ 'గుమారసంభవ' మున్నది. కుమారస్వామిపుట్టుకకు జరిగిన పూర్వకథయే దానిలోని ప్రధానకథ. ఆపూర్వకథలోని భిన్నాంశము లనుస్యూతముగాఁ జెప్పఁబడుట మాత్రమే యందు జరిగినది. ఈస్వారోచిషమను పుదయించుటకుఁ బూర్వము జరిగినకథలే యిందును జెప్పఁబడినవి.'[35]

'కావ్యములో కథైక్యము లేదనియు కొంద రందురు. కథలో నైక్యము లేకపోవుట అసత్యము. అంతకంటె నితివృత్తము విస్తృతమైన దనుట కొంతవఱకు నిజము. అతివిస్తృతి యైనను అనావశ్యకముగా జరిగినది కాదు. స్వారోచిషమనుసంభవ మనెడి నిర్వహణమునకు ఏయేకథాంశము లు పూర్వపూర్వకారణకలాపములుగా ఆవశ్యకములో కవి వానినే సూత్రించెను గాని అనావశ్యకమైన యేసందర్భమును కూర్పలేదు ఏఘట్టమును పరిశీలించినను ఉపసంహారప్రవణముగానే యుండునుగాని తద్విరుద్ధముగా ఉండదు. అట్టి ఏకసూత్రతయే కథైక్యమును సాధించెను."

"ఈ కథావిస్తృతికి కారణము వరూథినీవృత్తాంతము, స్వరోచిచరిత్రము అనెడి రెండు స్వయంసంపూర్ణకథలు రచించుట. ఈ రెండును మనుసంభవమునకు ఆవశ్యకములే. స్వారోచిషునిపుట్టుటకు వరూథినీవృత్తాంతము వ్యవహితకారణమును, స్వరోచిచరిత్ర అవ్యవహితకారణమును అగుచున్నవి. కవి కథావిస్తృతి తగ్గింపవలె నన్నచో వ్యవహితకారణమైన వరూథినినిఁ దొలగింపవలసివచ్చును. అట్లు జరుగునేని స్వారోచిషునిజననము సంభవించును గాని అతఁడు మను వగుటమాత్రము సంభవింపదు."

"మనువు లనఁగా సకలభువనరక్షాదక్షులును, తేజోనిధులును అయిన ధర్మస్వరూపులు. వారు మానవలోకవాసు లయ్యు మానవాతీతులు, దేవాంశసంభూతులు. స్వారోచిషునకు మనుత్వము నొనఁగఁగలిగిన అట్టి అర్హతలు అతనిజనకుఁడైన స్వరోచి నుండి అతనికి సమగ్రముగా సంక్రమించుటకు తాత్త్వికముగా అవకాశము లేదు. స్వరోచి వరూథినివలె దేవాంశసంభూతుఁడే. భువనరక్షాదక్షత గల శౌర్యవంతుఁడే. అయ్యు లోకమును ధర్మమార్గమున నయింపఁదగిన ధర్మస్వరూపుఁడు కాఁడు. అతఁడు కామపరాయణుఁడైన వ్యసని. బాల్యముననే భక్తివైరాగ్యసంపన్నుఁడై చిరకాల తపశ్చర్యవలన శ్రీమహావిష్ణుని సాక్షాత్కరింపఁ జేసికొనిన స్వారోచిషుని ఆధ్యాత్మిక సంపద ఆ తండ్రివలన సంక్రమింపనపుడు మరి యెక్కడనుండి వచ్చియుండును? 'పూర్వజన్మసంస్కారమువలన' అని యొక సులభసమాధానము చెప్పవచ్చును గాని అది యేమియు తోచనప్పుడు అనవలసిన త్రోపుడుమాట!"

35. 'అల్లసానివాని అల్లికజిగిబిగి' - పుట. 7. (శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు)

"నాయుద్దేశము స్వారోచిషుని మనుపదమునకు అర్హమైన ధర్మనిష్ఠాగరిమ తలిదండ్రులనుండి కాక వారి పైతరమునుండి - స్వరోచి తలిదండ్రులనుండి సంక్రమించినది అని. స్వరోచిజననీజనకులు వరూథినీమాయాప్రవరులు గదా! ఈ జంటలో తల్లి యొక్క సౌందర్యము ప్రణయస్వభావము స్వరోచిలో అచ్చుపడి అతనిని తల్లిపోలిక కొడుకుగా పరిణమితి నొందించెను! ఇఁక మాయాప్రవరుఁడు ఇతనిపుట్టుకకు నిమిత్తమాత్రమే కాని తాత్త్వికమైన జనకత్వ మతనికి లేదు. అట్టిజనకస్థానమున నున్నవాఁడు బ్రాహ్మణప్రవరుఁడు. అనన్యమనస్కయై తదేకధ్యానముతో ఆబ్రాహ్మణకుమారుని ఆరాధించినవరూథిని గర్భధారణవేళ తాల్చినతేజము ఆబ్రాహ్మణునిది. అతని పవిత్రతయు,అతనియాధ్యాత్మికతయు స్వరోచికి సంక్రమింపవలసియుండెను. కాని ఆగుణసంపద అతనిని త్రోసిపుచ్చి అతనికుమారుఁడైన స్వారోచిషునకు సంక్రమించెను. లోకములో కొందరు తండ్రులగుణములతోడను, కొందరు తాతలగుణములతోను జనించుచుండుట స్వాభావికమే. ఈరహస్యము జీవశాస్త్రన్యాయమునకు సమ్మతమే. కావున మనుసంభవమునకు ప్రభవకారణమైన ప్రవరునిచరిత్రమే లేనిచో ఈకావ్యమునకు బీజమే యుండదు. అందుచే వరూథినీవృత్తాంతము అపరిహార్యమును, అత్యంతావశ్యకమును అయ్యెను."[36]

"మనువుయొక్కజీవసంపుటిలో వేదములు, అగ్నులు, వేదికలు, మంత్రములు, బ్రాహ్మణక్షత్రియాదులధర్మములు సర్వమును సంస్కారరూపమున నుండుటకుఁ దగిన పరిస్థితు లన్నియుఁ గల్పింపఁబడినవి. మానవునియొక్క భారతదేశగతమానవులయొక్క సర్వధర్మస్వరూపము భద్రపరుపఁబడినది. మిగిలినది శరీరవిషయము. ఈ శరీరమున రెండు ప్రధానములు. మొదటిది : వ్యాధి శరీరమునకు సహజము. దీనిని నివారించుకొనుట యెట్లు ?... అందుచేత వ్యాధినివారణోపాయమైన ''యాయుర్వేదము"ను మనోరమ తండ్రి యైన యిందీవరాక్షుఁడు స్వరోచి కుపదేశించెను. రెండవది : శరీరము పోషించుకొనవలెను, ఈశరీరమున కాహారము కావలెను... మానవజాతి యాహారముకొఱకు మానవుఁడు నేల దున్ని వచ్చెడు సస్యముమీఁద తరువాత నాధారపడసాగెను. తొలుతటిది ధారుణీసహజసస్యము. అది కాంతారజము, వనజము. ఈస్వరోచికి ఆస్వారోచిషమనువు జన్మించినది వనదేవతాగర్భమునందు. ఈసంఘటనమునం దారహస్య మిమిడింపఁబడి యున్నది. ఈరీతిగా మనువుయొక్కజీవసంపుటియం దుండవలసినలక్షణము లన్నియుఁ బ్రవరగంధర్వులనుండి సంక్రమించినలక్షణములతో స్వరోచి జీవసంపుటిలో పరిణతమై యున్నవి "

"ఇంక మిగిలిన దొక్కటే కలదు. జన్మ మెత్తినంతనే పురుషునకు బహుస్త్రీగత వాంఛ సహజముగా నున్నది. ఇచట పురుషుఁ డన్నది లక్షకశబ్దము. జీవుఁడు జీవుఁడుగా నెందు కయినాఁడు ? బ్రహ్మచైతన్య మైన తాను 'బహు స్యాం ప్రజాయై' అన్న సంకల్పముచేత నైనాఁ డని వేదాంతములు చెప్పినను, మాయావిహితుఁ డగుటచే నైనాఁడు. ఈమాయాస్వరూప మెట్టిది ? ఏకరూపుఁ డైన తాను బహురూపుఁడుగాఁ గావలె నన్నట్టిది.

36. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు. తె. వి. స. సంస్కృతి సం. పుట. 931.

తనబహురూపకల్పన పురుషుఁడు స్త్రీద్వారా చేసికొనఁగలఁడు. స్త్రీద్వారా యనఁగా స్త్రీగతమహామోహముచేత."

"ఇట్లు జీవుఁడు నిరంతరస్రవణశీలుఁడై యెచ్చటికిఁ బోవును ? ఏమి యగును ? ఈజీవునకు ముక్తి యెప్పుడు ? తా నేకరూపుఁ డని తెలిసినప్పుడు. ఆ తెలిసికొనుటకు మార్గ మేది ? నియమము. ఆ నియమము నభ్యసింపవలయును. నిత్యకామప్రవాహాలగ్నుఁడైన జీవుఁడు తన ఏకరూపకోపాసన తొలిమెట్టు ఏకస్త్రీగత వాంఛాగతుఁ డగుట. ఇది ధర్మశాస్త్రము వ్రాయు మనువు పరమోత్తమనాగరకతకు- నాగరకత యనగా నియమము. నియమముచేత దన్నుఁ దాఁ దెలిసికొనుట, నియమముచేత లోకవాంఛావాగురులనుండి తప్పించుకొనుట - పునాది వేయవలెను. ఈపునాది వేయుటకు మనువై జన్మించినగాని జీవ సంపుటియందు తల్లక్షణము సంస్కారరూపమున నుండవలయును గదా ! ఈ సంస్కారము కూడ స్వరోచికిఁ గలుగవలయును. ఇందుకై ఈమనుచరిత్రమునం దొక యుపాఖ్యానము కలదు."

"ఆయుపాఖ్యానములోఁ దనభార్యలతో విహరించుస్వరోచినిఁ జూచి ఒకహంసియు ఒకచక్రవాకియుఁ బ్రసంగించుకొన్నవి. హంసి ఆముగ్గురుస్త్రీలయు స్వరోచియు నడుమ నున్నప్రేమను ప్రశంసించెను. చక్రవాకి తిరస్కరించెను. చక్రవాకి 'తగులు నెవ్వఁ డొక్కతరుణికి; నొకనికి మెలఁత వలచు నదియు మే లనంగవచ్చుఁ గాని పెక్కువనిత లపైఁ గూర్మి కలుగు ననుట బొంకుకాదె తరుణి' మఱియు "ఇతఁ డొక లేమం దానెలమిఁ గూడునెడ నే మానిని ప్రాణేశుమీఁది మమత మెలంగున్" అనెను. పక్షిజాతులభాష యెఱిఁగిన స్వరోచి కీమాటలు తెలిసెను. సిగ్గుపడెను. "తలవాంచి యున్న రని మది తలపోసె"ను. కాని, మానరానితమకంబున నానెలంతలతో నుండెను. ఇది రహస్యము. స్వరోచిజీవసంపుటియందుఁ బుట్టఁబోవుమనువుయొక్క పరమసంస్కారమంతయు గలిగి యున్నది గాని; స్వరోచి కా పరిణతి లేదు !"

"ఇట్లు వనదేవతకు, స్వరోచికి స్వారోచిషుఁడు జన్మించెను. ఆజీవునిలక్షణము వేరు. అతఁడు పుట్టినంతనే శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుఁడై యకామతఁ జిరతపం బాచరించెను. ఆజీవుఁడు పండినవాఁడు. మను వగుటకు నీస్వరోచి ప్రవరగంధర్వుల సంస్క్రియాసంపుటియంతయు నతనిజీవసంపుటిలో నిక్షిప్తము కావలెను. అయినది. మను వైనాఁడు. అతనిపేర నొకమన్వంతరము వెలసినది. అతఁడు రచించినస్మృతి అతని మన్వంతరమునఁ బ్రకాశించినది."

"ఇది స్వారోచిషమనుసంభవకథ. ఇది ఏకవాక్యత సాధించిన శిల్పములోని పరమమైన లోతు" 37

పైవాక్యములను బరిశీలింపఁగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు కథైక్యసూత్ర మును జీవశాస్త్రసమ్మతముగా వ్యాఖ్యానించిరి. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు జీవ సంస్కారసిద్ధాంతసమ్మతముగా నన్వయించిరి. ఒకరు పాశ్చాత్యవిమర్శదృష్టితోడను,

37. "అల్లసానివాని అల్లిక జిగిబిగి" శ్రీవిశ్వనాథ, పుట 82-85

మఱియొకరు భారతీయతత్త్వదృష్టితోడను నీ వస్తునిర్మాణమర్మమును దర్శించిరి. తేలిన దేమనఁగా నేదృక్పథముతో నీవస్తువును విమర్శించినను ఐక్యతాసూత్ర మం దతర్వాహి నిగాఁ బ్రవహించుచున్న దనుట స్పష్ట మని తాత్పర్యము.

మనుచరిత్రములోని వస్త్వైక్యము పురాణకథలోనిదే:

స్వారోచిషమనుసంభవాఖ్య మగు నీప్రబంధమందలి వస్త్వైక్యమునుగూర్చిన పర్యాలోచన మొకయింత చేయఁబడినది. ఇదియంతయు పెద్దనచే కల్పిత మని కీర్తింపఁ బడినది. కాని, యీకథ మార్కండేయపురాణమున లేదా ? దాని కా పేరు లేదా ? అం దీ వస్త్వైక్యము లేదా ? అన లీకథను సృష్టి చేసినగౌరవము పురాణమునకు కాదా దక్కవలసినది ? పెద్దన మార్కండేయపురాణోక్తప్రకారము చెప్పు మనుటలో నీయంశ మిమిడి లేదా ? - అని ప్రశ్నించుకొనినచో నీవస్తుగౌరవమంతయు సంస్కృతపురాణకర్తకుఁ జెందక తప్పదు. పైఅన్వయములోఁ బ్రత్యంశము మూలమున నున్నట్టిదే. పెద్దన కల్పించిన నూతనకల్పనలవలన మూలమందలి వస్త్వైక్యసూత్రము చెడలేదు. అట్లు చెడకుండ చేయు మనియే రాయల కోరిక. కావున పెద్దనగారికి వస్త్వైక్యశిల్పము పురాణము నుండియే యందింపఁబడినది.

సంస్కృతపురాణకథాతత్త్వమును గ్రహించి యీకథను దెలుఁగున నిలిపిన మొదటికవి మారన. అతనిచేతిలో నీయుపాఖ్యానము శిల్పరమణీయమై భాసించినది. దానితత్త్వమును వివరించుచు నాఖ్యానశిల్పాధ్యాయమునఁ జెప్పిన తాత్పర్యము నిచ్చట క్రోడీకరించెదను.

మారన ఫలశ్రుతిలో "స్వారోచిషజన్మంబును వర్తనంబుల్ స్వారోచిషాద్యప్రభవంబు విన్నన్" అని పేర్కొనియుండుటచే కథను మూఁడు విభాగములుగా నాతఁడు విభజించి చెప్పుచున్నట్లు స్పష్టమగుచున్నది. మొదటిభాగము స్వరోచిజన్మమునకు హేతువైన కథాఘట్టము. రెండవభాగము స్వరోచివర్తనము వర్ణితమైనఘట్టము. మూఁడవ భాగము స్వారోచిషమనుసంభవవృత్తాంతము. ప్రథమకథాభాగమునకు ఫలము స్వరోచి సృష్టి. అతనివర్తన మాతనిజీవసంస్కారచైతన్యరూపము. అట్టి సంస్కారములందు మాతాపితరులయొక్క తత్సృష్టికాలమందలి జ్ఞానేచ్ఛాక్రియాశక్తిచైతన్యయుత మైన యంతఃకరణము ప్రతిబింబించె ననుట పూర్వకథయందలి వస్తుధ్వని. సృష్టి యిచ్ఛాధీన మైనది. అట్టి యిచ్ఛ గంధర్వునియందు లేదు. వరూథినియందు గూఢముగాఁ గల దని కవి వ్యంజింపఁజేసెను, గంధర్వుఁడు వరూథినిహృదయము నాకర్షింపలేక మాయారూపమున నామెను జేరి భోగించెను. ఆమెకు గంధర్వునినిజరూపము తెలియదు. మాయావి యైన యాతఁడు సత్యస్వరూపజ్ఞానసాధన మైన యామె దృష్టి నవరోధించెను. మోహాంధ యగు వరూథిని యట్టియాంధ్యమున కొడఁబడెను. వా రిరువురియందును బలీయ మగు భోగేచ్ఛాశక్తి మాయామోహితమై తదనుగుణక్రియాశీలమును దాల్చె నని బోధపడఁ గలదు. అది యట్లుండ వరూథినియందు భోగేచ్ఛ వెనుక గూఢమైన సృజనేచ్ఛ కలదు.

దానివలన "ధరణీదేవకుమారు" నాత్మఁ దలంచినది. శమదమాన్విత మైన ప్రవరుతేజో మూర్తిని స్మరించు వరూథినియందు జీవప్రేరితమైన జ్ఞానశక్తి గూఢమై భాసించినది. అనఁగా స్వరోచిసృష్టికిఁ గారకు లైన వరూథినీగంధర్వులయందు ఇఛ్ఛాక్రియా శక్తులు మాయామోహసమన్వితములై యుండుటచేత జ్ఞానశక్తి సంగుప్తమై పోయె నని తాత్పర్యము. అట్టి సంస్కారవిశేషమే స్వరోచి చిత్తవృత్తియందుఁ బ్రతిబింబించినట్లు చిత్రింపఁబడినది. స్వరోచి భోగైకలాలసుఁ డై మనోరమావిభావరీకళావతులతోఁ గ్రీడించుచున్నప్పుడు రథాంగవనితయు, హరిణేంద్రుఁడును, హరిణీరూపిణి యైన వన దేవతయు నాతని జ్ఞానవృత్తిని జ్ఞప్తికిఁ దెచ్చినను అది జ్ఞాపితము కాకపోవుట తత్ఫలమే!

గంధర్వ (మాయా) విముక్త యైన వరూథిని (ఇచ్ఛ) నిజప్రవరతేజోరూపమును (జ్ఞానము) నుపాసించుచు స్వరోచికి (తేజస్సుకు) జన్మ మిచ్చెను. మాయాస్వరూపమగు మృగీరూపమును వీడి దేవతారూపమును దాల్చి దైవప్రేరిత యై మనుసృజనేచ్ఛాపరా ధీన యైన వనదేవత స్వరోచియొక్క భోగదృష్టిని హరించినది. అతఁడు మోహవిము క్తుఁడై (పరమ) హంస ప్రబోధమున స్వీయజ్ఞానశక్తిని తేజోవంత మొనర్చుకొనెను. స్వరోచియందలి ప్రవరతేజోదత్త మైన జ్ఞానవృత్తి మాయావిరహితమై సత్యజ్ఞానేచ్ఛా ప్రధాన యైన వనదేవత కల్పించిన పాంచభౌతికశరీరమునందు వసించి మనుశ్రేష్ఠునిగా స్వారోచిషుని సృజించినది.

ప్రవరప్రేరిత మై, వరూథినియందు సంకల్పమాత్రముగా భాసించి, స్వరోచి యందు సాధనావస్థలో నుండి, స్వారోచిషునియందు మనుతేజము పరిపక్వత నందినది. జ్ఞానధాత్వర్థమూల మైన మనుశబ్దవాచ్యుఁ డగు స్వారోచిషుఁడు - సంపూర్ణజ్ఞానరూపుఁడై జన్మించుట యీవృత్తాంతఫలము. పరిపక్వజ్ఞానప్రభాకరోదయ సన్నాహసంభారమే ఈమూఁడు పురుషాంతరముల పురాణకథాపరమతాత్పర్యము!

ఇది పురాణప్రోక్త మైనది! ప్రబంధప్రతిష్ఠిత మైనది!

**పాత్రల స్వరూపస్వభావనిరూపణము :**

ఉదాత్తనాయకచరిత్రము కావ్యమునకు గౌరవహేతు వగును. రామాయణాదులకుఁ గలిగిన గౌరవ మట్టిదే. కలిధ్వంసక మైన స్వారోచిషమనుసంభవ వృత్తాంతముకూడ మహిమాన్విత మైనదే. దాని కామహిమ దానియందలిపాత్రలస్వరూపస్వభావములవలనను, వారి చరిత్రమువలన లోకమునకుఁ గలుగుప్రబోధము వలనను నేర్పడును.

ఈకథలోనిపాత్రలలో సర్వగుణోత్తరుఁడు ప్రవరుఁడు. అపూర్వశృంగారమూర్తి వరూథిని. కపటకాముకుఁడు గంధర్వుఁడు. తేజోబలోదారుఁడును, భోగైకశీలియు నైన వాఁడు స్వరోచి. సుహృద్స్నేహార్ద్రహృదయులు మనోరమావిభావరీకళావతులు. దేవకార్య నిర్వహణదక్షురాలు వనదేవత. సర్వలక్షణసమన్వితుఁడును, తేజస్వియు నైనవాఁడు స్వారోచిషుఁడు. జాతిసహజ మైన మహిమప్రాగల్భ్యములు గలవాఁడు ఔషధసిద్ధుఁడు. గురువుల నవహసించినగర్వి యిందీవరాక్షుఁడు. ఇందులో శుద్ధమైనచరిత్రము కలవాఁడు

ప్రవరుఁడు, స్వారోచిషుఁడు. కథకు రెండంచులయందును నిలుపఁబడిన బలమైన కంబము లీరెండుపాత్రలు. వాని నాధారముగా నిర్మించిన నడిమివంతెన యీకథ. కథలోని మిగిలినపాత్రలు మిశ్రమగుణసంయుతములు. వానిలోఁ గొన్ని ప్రవరునితోడి సంపర్కము వలన విశుద్ధములైనవి; కొన్ని స్వారోచిషసంభవమువలన సార్థకములైనవి. ఇట్లు వస్తువునకు సందీప్తియు, సార్థక్యమును గల్పించు నీమహనీయపాత్రములు తేజఃప్రధాన ములుగాఁ జిత్రించుట యీకథయందుఁ బాటింపఁబడిన సున్నితశిల్పము.

పాత్రచిత్రణమునకు స్వరూపస్వభావవర్ణనమువలన సమగ్రత యేర్పడును. స్వరూపవర్ణనము భౌతికము; స్వభావవర్ణనము మానసికము. మొదటిది కాయ ప్రధానమైనది; రెండవది వాఙ్మనఃక్రియాప్రధాన మైనది. ఒకటి పాంచభౌతికపరిణామ వర్ణనాత్మక మైనది. మఱియొకటి ప్రాణులయాంతరపరివర్తననిరూపణాత్మక మైనది. ఈరెండిటికంటె నుదాత్తమైనది ఆదర్శచిత్రణము. ఇందు సమగ్రోదాత్తగుణసన్నిపాతము గల వ్యక్తులు వర్ణింపఁబడుదురు. ఇట్టిపాత్రలకు భౌతికరూపముకంటెను పరిణామశీల మైన యాంతరపరివర్తనముకంటెను మిన్నయైన స్థిరవర్తన ముండును. ఆపాత్రలు పరిణ తికి పరమావధులు. పరిణతి యాత్మగుణములు దీపించు నంతఃకరణమున భాసించును. గుణప్రధానమైనయంతఃకరణవృత్తులను వర్ణించుటయే ఆపాత్రలఁ జిత్రించుటలోని పరమ రహస్యము. గుణవివక్షతోఁ బరిశీలించుచో భౌతికము తమఃప్రధానమైనది; అధమము. మానసికము రజఃప్రధానమైనది; మధ్యమము. ఆదర్శ మాత్మగుణప్రధాన మైనది; సాత్త్వికము. ఇందు త్తరోత్తరములు ఉదాత్తములైనవి :

సంస్కృతపురాణకర్త పాత్రలను గుణప్రధానములుగాఁ జిత్రించెను. మారన వాని స్వభావములు తేటపడున ట్లనువదించెను. పెద్దన వానికి సువుష్టములైన స్వరూపస్వభా వములు కల్పించెను. జ్ఞానైకబోధనాత్మక మగు పురాణకథకును, రసైకప్రధానముగాఁ దీర్చిదిద్దిన పెద్దనరచనమునకును మధ్యవర్తి మారన. ఈయంశము వస్తువునుగూర్చి పర్యాలోచించుచు విపులముగా నిదివరకే చర్చింపఁబడియుండెను. కావునఁ బురాణములు పాత్రచిత్రణమునఁ బెద్దన కెట్లు తోడ్పడిన వనునంశము స్థాలీపులాకన్యాయమున నిచ్చట పరిశీలింపఁబడును.

మనుచరిత్రమునందలి పాత్రలన్నియు నొకయెత్తు. ప్రవరవరూథినీపాత్రము లొకయెత్తు. కథాస్వభావమునుబట్టి యాపాత్రల కున్న ప్రాముఖ్యమును గుర్తించి యాపాత్ర లనుగూర్చి కొంతవిపులముగను మిగిలినవానినిగూర్చి దిఙ్మాత్రముగను బరిశీలించుట యిందు జరుగుచున్నది.

## ప్రవరుఁడు :

ప్రవరుఁడు ద్విజాతిప్రవరుఁ డనియు, రూపవంతుఁ డనియు, మృదుస్వభావుఁ డనియు, సద్వృత్తుఁ డనియు, వేదవేదాంగపారగుఁ డనియు, సద్ధాతిథిప్రియుఁ డనియు,

దేశసందర్శనాభిలాషి యనియు,- సంస్కృతపురాణమున వర్ణింపఁబడెను మారన యతనిని అతులగుణోత్తరుఁ డనియు, ఉదాత్తుఁ డనియు, శైలకాననాంచితసకలావనీతల విశేషదర్శనకుతూహలుఁడనియుఁ బేర్కొనెను. అతఁడు తరుణాగ్నిహోత్రి యనియు, అనారతాధ్యాపనతత్పరుఁ డనియు, శమదమాన్వితుఁ డనియు, అలేఖ్యతనూవిలాసుఁ డనియు, ఎవరినుండియు దానము గ్రహింపనివాఁ డనియు, తీర్థసందర్శనాభిలాషి యనియు పెద్దన వివరించెను. ఇట్టి పెద్దన పాత్రచిత్రణమునకుఁ బురాణము లెట్లు తోడ్పడిననో వెనుకఁ జెప్పఁబడినవి.

ప్రవరునిపాత్ర మూఁడువిభిన్నసన్నివేశములందుఁ బ్రత్యక్ష మగును. ఒకటి : ప్రవరుఁ డతిథిసత్కారపరాయణుఁడై యౌషధసిద్ధుని సేవించి పాదలేపపరమౌషధము పొందుఘట్టమున. రెండు : హిమాచలవిశేషసందర్శనమునఁ బ్రకృతిసౌందర్యదిదృక్షయు, పుణ్యార్జనయత్నము నచ్చుపడ సుసంస్కారియైన సహృదయునివలె మెలంగి, పాదలేపము కఱఁగిపోయినందులకు విచారించు ఘట్టమున. మూఁడు : వరూథినీపరిష్వంగమునుండి తప్పించుకొని యగ్నిప్రసాదమున నిల్లు సేరుఘట్టమున. మొదటిఘట్టమునఁ బ్రవరుని యందు తీర్థయాత్రాభిలాష యధికముగా నుద్దీపించునట్లు పెద్దన రచన మొనర్చినాఁడు. మఱియుఁ బ్రవరుఁ డౌషధసిద్ధి నొందెడు ఫలమును సూచించెడి కావ్యార్థసూచనతో నతని వాక్కులను జతురవచనములఁ దీర్చిదిద్దినాఁడు.

క. మీమాటలు మంత్రంబులు
మీ మెట్టినయెడ ప్రయాగ మీపాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గధురాంబుపౌనరుక్త్యము లుర్విన్. (1.62)

అను ఔపచారికవాక్యములందును బ్రయాగయు, నాకాశగంగయు ననెడి రెండు పుణ్య తీర్థము లుచ్చరింపఁబడినవి. సిద్ధప్రభావమునకు మూలములైన మంత్రముల ప్రసక్తి యందు వచ్చినది. సిద్ధునకే కాదు వినువారికిఁ గూడను బ్రవరునిసూక్ష్మబుద్ధియు, వాక్చమత్కృతియు నబ్బురపాటు కలిగింపకమానవు.

తే. మౌనినాథ ! కుటుంబజంబాలపటల
మగ్నమాదృశగృహమేధిమండలంబు
నుద్ధరింపంగ నౌషధ మొండు కలదె ?
యుష్మదంఘ్రిరజోలేశ మొకటితప్ప. (1.66)

అనుప్రవరునిపలుకులు గమనింపుఁడు. జంబాలపటలమగ్నుఁ డగు వానికి రజ మౌషధ మగుటేమి ? ఇం దౌషధశబ్దమున వాచ్యార్థము పనికిరాదు. లక్షణార్థము గ్రహింపవలెను. కాని, అప్రస్తుత మైన ఔషధశబ్దప్రయోగముచేత, పదరజోలేశశబ్దముచేత సిద్ధునకు పాదలేపౌషధప్రభావస్ఫూర్తి జ్ఞప్తికి వచ్చినది. సిద్ధుఁడు ప్రవరునకు దివ్యదృష్టి కలదేమో యని భయపడునంత శక్తిమంతము లావాక్యములు ! పెద్దన తనచతురవచోనిధిత్వమును ప్రవరునియందు నిక్షిప్తము చేసినాఁడు !

మారన ప్రవరపాత్రచిత్రణమున నుదాత్తనాయకలక్షణములలో ముఖ్యమైన దగు నవికత్థనత్వమును సర్వత్ర ప్రకటించెను. పెద్దనయు నామార్గము ననుసరించెను. కాని, ప్రవరుఁడు ఆత్మస్తుతిపరులను గాంచినచో నిక్కచ్చిగా నున్నమాట యనివైచెడి స్వభావము గలవానిగా మారన చిత్రించెను. పెద్దన చతురవచోనైపుణ్యముచేఁ గూఢముగా నవహేళనము చేయు స్వభావము కల్పించెను. పలువురు విమర్శకులు మారన పల్కించిన మాట లనౌచిత్యము లనిరి; కాని విన్నప మని మొదలుపెట్టి పెద్దన ప్రవరుఁ డౌషధసిద్ధుని ''మీ మొగము'' "అద్దిరయ్య'' ''మీమహిమ లీర యెఱుంగుదు" రని చురుకుమాట లనుచున్నను వారు వినయగుణ మనియే సరిపెట్టుకొందురు. వంగి మాట్లాడినంతమాత్రమున వాడిమాటలవేడి తగులకపోదు. కావున, కవు లాపాత్ర నేస్వభావలక్షణముపైఁ జిత్రించిరో తెలియుట యిందు ముఖ్యము. దానిమీఁదనే యౌచిత్యానౌచిత్యవిచారచర్చ యాధారపడి యుండును.

హిమవన్నగసుందరదృశ్యములను గాంచి మూలమున ప్రవరుఁడు పులకాంకురితగాత్రుఁ డైనాడు. మారనగారి ప్రవరుఁడు "తగిలి చూచిచూచి తలయూచి యూచి మెచ్చి'' నాఁడు. ప్రబంధప్రవరుఁడు ''తలమే బ్రహ్మకు నైన నీనగమహత్త్వం బెన్న ?'' అని యెలుగెత్తి కీర్తించినాఁడు. ఒకఁడు అంతస్సత్త్వానుభూతిని సాత్త్వికానుభావముతో వ్యక్తముచేయు గంభీరుఁడు. మఱియొకఁడు సుందరవస్తుసందర్శనమున రసావేశము ననుభవించు సుకుమారమూర్తి. ఇంకొకఁడు హిమవన్నగభౌతికాధ్యాత్మికమూర్తులను దర్శించి భావించి యుప్పొంగి పోవు రసికసహృదయచక్రవర్తి. పురాణమునుండి ప్రబంధమువఱకు ప్రవరుఁ డింతింతై మఱియు నింతై పెరిగినాఁడు.

పాదలేపముఁ గోల్పోయిన ప్రవరుఁడు మూలమునఁ జింతించెను; తెలుఁగు పురాణమున దుఃఖించెను; ప్రబంధమున నార్తిలోఁ జింతాసాగరమగ్నుఁ డయ్యెను. సంస్కృతాంధ్రపురాణము లిప్పట్టునఁ బ్రవరుని వరుసగా గంభీరసుకుమారచిత్తవృత్తునిగాఁ జిత్రించినవి. పెద్దన యారెండింటిని కలిపి విశిష్టచిత్తవృత్తిని సృష్టించెను.

వరూథినీసన్నిధానమునఁ బ్రవరునిపాత్రచిత్రణము పతాకస్థాయి నందుకొనినది. నంస్కృతపురాణకర్త ప్రవరుని నార్షహృదయునిగాఁ జిత్రించెను. ఋషులు జితేంద్రియులు; స్వభావముచే వారు సాదరవాగ్విభూతులు - కాని, ధర్మవైరుధ్యమునుగాని, భోగతృష్ణనుగాని యెదుర్కొనవలసివచ్చినప్పుడు వా రగ్గివలె భగ్గున మండుదురు. అట్టిచిత్తవృత్తి ప్రవరునియందు చిత్రించినాఁడు మూలపురాణకర్త. విప్రుఁడు వరూథినిని గాంచి యిలుసేరుమారము నడుగునప్పు డామె నత్యంతాదరమునఁ బలుకరించినాఁడు. 'కమలగర్భాభే', 'సుచిస్మితే', 'కల్యాణి', 'భద్రే', 'యశస్విని' '(సుమధ్యమే !)', అని యామెను సంబోధించుటలో నాతనిసాదరహృదయము తెల్లమగుచున్నది. వరూథిని రాగాతిశయమున విప్రుని గౌఁగిలించిన తరువాత నతఁడు క్రుద్ధుఁడై, యామెను ''దుష్టే'' "మూఢే'' అని మొగమువాయ తిట్టి యాపై నెట్టి గుణవాచకములను వాడక 'వరూథిని' యని పేరుపెట్టి పిలిచెను. సవ్యముగా నున్నంతసేపు ఋషులు సాధువులు. అపసవ్యమైనచో

వారే హవ్యవాహనులు ! ఇట్లు చిత్రించుట మహర్షి యైన సంస్కృతపురాణకర్తకుఁ జెల్లినది !

ఆంధ్రమార్కండేయపురాణకర్త లౌకికుఁ డైన ఋషి. అతనితత్త్వమే యతని ప్రవరునకు వచ్చినది. అతఁ డాగ్రహమునందును ఉగ్రుఁడు కాఁడు. నిగ్రహము పీడని విగ్రహ మతనివాక్కులందు సముదగ్రత సాధించును. వరూథిని తనను గాఢాలింగన మొనర్చినప్పుడు మూలప్రవరునివలె ''దుష్టే'' ''మూఢే'' అని తిట్టిపోయఁడు.

తే. అంట కంటకు నన్ను మృగాక్షి ! నీకు
సదృశుఁ డగు వాని నన్యుని వెదకుకొనుము
నిన్ను నొక్కటి యడుగంగ నీవు వేఱ
యొకటి గోరి నను నొంద నుచిత మగునె ? (మారన. 4.243)

అని నిగ్రహముతోడనే పల్కును. "మృగాక్షి" యనియే సంబోధించును. కాని, యాపలుకలలోని వాడిమి వాని వ్యంగ్యభావ మూహించినప్పుడుగాని తేటపడదు. "మృగ'' శబ్ద మన్వేషణార్థక మైనది. "మృగాక్షి" యనుటయం దిచ్చట వరూథినీనింద కలదు. కాముకు లైన పురుషులకొఱ కన్వేషించుట యామె స్వభావ మని ప్రవరునివిమర్శ. లేనిచోఁ గర్మహాని యగు నని వగచువానినిఁ బట్టి బలవత్సంగమమునకుఁ బురికొల్పునా? "నీకు సదృశుఁ" డనఁగా కాముకుఁ డై భోగినీభోగాన్వేషణాపరుఁ డైన వాఁ డనియే భావము. అనఁగా ప్రవరుఁ డిందు గూఢముగా వరూథినిపాశవికకామమును ప్రత్యక్షముగ గర్హించుచున్నాఁ డని తాత్పర్యము. ఉత్తము లడిగిన దిత్తురు. మధ్యములు ప్రత్యుపకారవాంఛతో సహాయపడుదురు. అధములు పరార్థవిఘ్నాపాదన మొనర్చి స్వార్థమును బొందయత్నింతురు. చివర దనుచితవర్తి. ప్రవరుఁడు వరూథినీచర్య నిట్టి యనుచిత మైనదిగా గర్హించెను. అతఁ డొకటి కోరెను. ఆమె యతనికోర్కె తీర్పకపోగా తిరిగి మఱియొకటి కోరెను. ఆకోర్కెవలన నతనివాంఛితము విఘ్నమగును. ఆమె యతనినిఁ బొందును. ఇందు రెండర్థములందును వరూథినియే లాభపడునది. ఆమెలోగుట్టును బట్టబయలు చేసిన వీమాటలు ! కాని, ఆమాటలయందు పారుష్యము లేదు. ఆడంబరము లేదు. అతఁడు వరూథినిని సంబోధించుటయం దిట్టిలక్షణమే ద్యోతమాన మగును.

తే. నిత్యకృత్యము లొసలుపంగ నిజగృహమున
కిపుడ యరుగంగవలయు నా యిందువదన !
చనునుపాయ మేయది చెప్పు నను సముద్ధ
రింపు; నిత్యక్రియాహాని పెంపు నడచు. (మారన. 4.208)

అనునప్పు "డిందువదన" యని సంబోధించి యామెను గాంచుటవలనఁ దన కెంతయో యాహ్లాదము గలిగిన దను భావము వ్యంగ్యము చేసినాఁడు. ఇట్టిసంబోధన మాటకు చతుర్థీపర మైనది. ప్రవరునిపని చెడుటకు దారి తీసినది. ఇట్టి మానసస్ఫూర్తిసంబోధనశిల్పము పెద్దన గ్రహించి తన ప్రబంధమున వాడుకొనెను.

తెలుఁగుపురాణమున ప్రవరుఁడు వరూథినితో మాటలాడునప్పుడు అధికముగా సంబోధింపఁడు. ప్రకృతార్థప్రతిపాదనైకలక్ష్యముతో వాక్యములు సంగ్రహముగను, సారవంతముగను ప్రయోగించును. "ఇందువదన" "మృగాక్షి" "పొలతి" యని ముచ్చటగ మూఁడు సంబోధనలు సార్థకముగాఁ జేసినట్లు రచించుటయు, ప్రవరుని వాక్యములు వచనము, తేటగీతి, సీసము, కందము అను నాలుగుచ్ఛందములందు నిబంధించుటయు మారన రచనాశిల్పము ! తెలుఁగుపురాణమునందలి సారళ్యము సంస్కృతపురాణమునం దున్నదే. కాని, అందలి సంబోధనబాహుళ్యము తెలుఁగున రాలేదు. పెద్దన సంబోధన లధికముగా వాడుటలో మూలము ననుసరించెను. కాని, ఛందమునందును, రచనాశిల్పమునందును పౌరాణికమార్గము వీడి స్వీయమార్గము నవలంబించెను.

పెద్దనగారి ప్రవరుఁడు వరూథినిని "భీతహరిణేక్షణ !" "అండజయాన" "తల్లి" "వనజేక్షణ", "తొయ్యలి" "జలజాక్షి" "తరుణీ" అని సంబోధించెను. మారన వాడిన "మృగాక్షి" పెద్దనకు "భీతహరిణేక్షణ" స్ఫూర్తి నిచ్చినది. "తల్లి" యను సంబోధము తెలుఁగుజాతీయము. "అండజయాన" సార్థకమైన సంబుద్ధి. మారనగారి "కలహంసయాన" యనుసంబుద్ధి దీనికిఁ బ్రేరణ యిచ్చియుండవచ్చును. మిగిలినవి స్త్రీమాత్ర వాచకములు; సాధారణములు. వరూథినీపరిష్వంగతిరస్కరణానంతరము ప్రవరుఁ డామెతో పల్కినదే లేదు ! అది పెద్దన శిల్పమున కవధి !

ప్రవరుఁడు వరూథినీపరిష్వంగ వైముఖ్యమును బ్రకటించిన తీరును మువ్వురు కవులు వర్ణించినవిధము చదివినచో ముప్పేటమైన యనుభూతి పఠితకుఁ గలుగును. సంస్కృతపురాణము చదివినచో వరూథిని ప్రవరుఁ డనెడిమాటలు పడఁదగినదే యనియు, శిక్షార్హయే యనియు స్ఫురించును. తెలుఁగుపురాణము చదివినపుడు ప్రవరుఁడు వరూథినిపై వాక్పారుష్యము ప్రకటింపక సౌమ్యత సూచించుటను గమనించిన పఠిత మారన రచనాపాటవమువలన వరూథినిపై నేర్పడిన సానుభూతిని వెలువరించుకొని సంతృప్తి ప్రకటించుటతోపాటు ప్రవరునిసుకుమారహృదయమును వేనోళ్ళఁ గీర్తించును. పెద్దన ప్రబంధమునఁ బ్రవరునిపాత్రఁ జదివిననాఁడు ఉప్పెనగాఁ బొంగివచ్చు భోగేచ్ఛాప్రవాహమునకు ఇంద్రియములను బిగపట్టి యెదురీది లక్ష్యము సాధించిన గజయీతగాని విజయస్ఫూర్తిని పఠిత మనసార అనుభవించును. దానికిఁ గారణము బలమైన, స్వయంసంపూర్ణ మైన మానసికభౌతికసంఘర్షణము సృష్టింపఁబడుటయే. ప్రవరుఁడు ధర్మము నాశ్రయించిన వ్యక్తిగా నీప్రబంధమున రాణించుట దానివలననే. ఆపాత్రకు సమగ్రతయు, రససిద్ధియు నేర్పడుటయు నందువలననే.

ప్రవరుఁ డగ్నిప్రసాదసిద్ధి వడసిన ఘట్ట మతనియకుంఠితనిష్ఠకు దొరకు తేజఃఫలమును వర్ణించునది. అది స్వారోచిషుని ధర్మకర్మదీప్తికి బీజ మైనది.

**వరూథిని :**

మనుచరిత్రమునఁ బ్రవరుఁడు మేఘుఁడు. వరూథిని సస్యక్షేత్రము. గంధర్వుఁడు కర్షకుఁడు. స్వారోచి ఫలము. మేఘుఁడు వర్షించిన జలము భూమియం దింకె కర్షకుఁడు

చల్లిన బీజములలోని జీవాణువులను బోషించి సస్యాంకురములను మొలకెత్తింపఁజేయును. స్వరోచిజన్మమునకుఁ బ్రవరుఁడు హేతుభూతుఁడు; వరూథిని మూలాధారము; గంధర్వుఁడు నిమిత్తమాత్రుఁడు. కావున వరూథినీపాత్రమునకు మనుచరిత్రలోఁ గీలకమైన స్థానము కలదు.

వరూథినిని మూలకర్త "వరాప్సరా మహాభాగా మౌలేయా రూపశాలినీ" అని వర్ణించెను. విప్రుని బ్రాహ్మణకులప్రవరునిగాఁ బేర్కొనెను. వరూథిని యప్సరఃకులమున శ్రేష్ఠురాలు. అతఁడు నిర్మలవర్తనుఁడు; ఆమె నిర్మలహృదయ. అతఁ డశ్వినులకంటె నందగాడు; ఆమెయు రూపశాలినియే. ఇరువురును అభిజాత్యము కలవారే. పురాణకర్త "మహాభాగా" యనులక్షణమున కధికప్రాధాన్య మిచ్చెను. ఆమె యపూర్వసుందరవిగ్రహుఁడైన ప్రవరునిఁ గాంచినపు డచ్చముగా నాతనిఁ బ్రేమించినది. ఆమె యనన్యకాంతగా నిలచిపోయినది. ఆమె ప్రవరు ననన్యచింతతోఁ బ్రేమించుటయందే యామెహృదయనైర్మల్యమును మూలకర్త ప్రస్ఫుటీకరించెను. మారనకును పెద్దనకును అతనిపాత్రచిత్రణ మొజ్జబంతి యైనది.

మారన వరూథిని మహాభాగ యని వాచ్యము చేయలేదు: కాని, కథానిర్వహణమున మూలముకంటె నధికమైన సానుభూతి పఠిత కేర్పడునట్లు పాత్రను చిత్రించి వ్యంగ్యము చేసెను. మఱియు నామెయొక్క రూపశాలిత్వమును మారన వివరించెను. తెలుఁగుపురాణమున నామె యప్సరోంగన, లలితాంగకాంతిజితకాంచన, విభ్రమచంచదబ్జలోచన, కలహంసయాన. సుకుమారమూర్తియు, తేజస్వియు నైన ప్రవరునిమూర్తి కనుగుణముగా నామెను లలితాంగిగను, జితకాంచనవర్ణగను, మారన సృష్టించెను. ప్రవరునితేజోమూర్తి కన్నులార గని మనమున ముద్రించుకొనుట కుపకరించిన యామె విశాలనేత్రములను, వానియందు పొంగిపొరలెడి భావతరంగపంక్తిని దెలియఁజెప్పు తరళచాంచల్యమును, హిమగిరిసానువులలో విరహిణియై విహరించు నామెనడకలోని యొయ్యారమును మారన కీర్తింపలేక యూరకుండఁజాలక పోయెను. మారన కల్పించిన రూపగుణవిశేషముల నన్నింటిని పెద్దన గ్రహించి సార్థకముగాఁ దనకావ్యమునఁ బ్రయోగించుకొనెను.

పెద్దన వరూథినీనిర్మలచిత్తమును అమూలకమైన సంభాషణములందు చిత్రముగా వ్యంజింపఁజేసెను. తనపనితనము తేటపడ సూర్యాస్తమయ వర్ణనావసరమున "తరుణి ననన్యకాంత" యని సూచించి యాసత్యము నాలంకారికముగా వ్యంగ్యము చేసెను. పెద్దన వర్ణించిన వరూథినీశతపత్రేక్షణములు మారన చూపించినవే. మారన వర్ణించిన బంగారు మేనిచాయను మెఱుఁగుపెట్టి మెఱుపుతీగఁగా మలచినాఁడు పెద్దన. మారన వాడిన 'ఇందువదన' యనుసంబోధనము పెద్దనలోఁ జంద్రాస్యయు, చంచరీకచికురయు నైనది. మూలములోని 'వరాప్సరా' యనువిశేషము పెద్దనలో 'మరున్నారీశిరోరత్న' మైనది. పెద్దన స్వయముగా నామెను చక్రస్తని యనియు, నతనాభ యనియు వర్ణించినాఁడు. అతని కథాకథనమున నట్టియంగాంగవర్ణన మవసర మైనది. అతఁడు వరూథినీ

పరిష్వంగఘట్టమునఁ "బాలిండ్లు హొంగారి పైయంచుల్ మోవఁగ గౌఁగిలించె ననియు, "నీవీబంధ" మూడి నతనాభి హొడగట్టె ననియు వర్ణించునెడ నీపదప్రయోగసార్థక్యమును సాధించుకొనినాఁడు. ఇట్లు వరూథినీవర్ణనము చేయుపట్ల పురాణములు పెద్దనగారికల్పన కెంతయో తోడ్పడిన వని తాత్పర్యము.

వరూథిని మన కీప్రబంధమున మూఁడుసన్నివేశములలోఁ గానఁబడును. ప్రవరునిఁ గనుఁగొని వలచి యతనితో సంభాషించి తమకముతోఁ గౌఁగిలించి యతనిచే నిరాకృత యగు సన్నివేశ మొకటి. 2. ప్రవరునిపై మనసు దగిలి విరహవేదనావశమున దుఃఖించుచు హిమవన్నగసానుప్రదేశమున విహరించుచున్నది రెండవది. 3. మాయాప్రవరునిఁ గదిసి యతని యనురాగమునకుఁ బాత్రురాలై యిష్టభోగము లనుభవించి గర్భవతి యై స్వరోచికి జన్మ మిచ్చు కథాఘట్టము మూఁడవది. ఈమూఁడుఘట్టములు మూఁడుకావ్యము లందును సమానములే. కాని, వానియందు కవులు వరూథినిఁ దీర్చిదిద్దినవిధమున మాత్రము భేదము కానవచ్చుచున్నది.

వరూథిని యప్సరోంగన యగుటచేఁ దజ్జాతిలక్షణ మైన భోగలాలసత్వ మామె జీవలక్షణ మై భాసించినది. కాని, మరున్నారీశిరోరత్న మగు వరూథినియందు భోగము బహుపురుషగతము గాక యేకపురుషగత మై ప్రవహించినది. అందుచే నామె మనూత్పత్తికి మూలస్థాన మై రాణించినది. ఆమె సమగ్రపురుషసౌందర్యమును భావింపఁ గలిగిన రసహృదయ. దేవయక్షగంధర్వనరలోకమునందున్న సుందరాకారుల నెల్లరఁ జూచినది కాని, యామె భావించినసౌందర్యము వారియందు కానరాలేదు. చివరకు ప్రవరునియందామె హొడగాంచినది. పురుషుఁ డానందస్వరూపుఁడు; తేజోమయుఁడు, సుందరుఁడు. నరుఁ డింద్రియనియతిచే స్వస్వరూపసంధాన మొనర్చుకొని ఆత్మసౌందర్యమును గ్రహించి యానందానుభూతి నొందుచున్నాఁడు. సౌందర్యము మానవునకు నియమముచే నేర్పడును. ప్రవరునకు భౌతిక మైన సౌందర్యము కలదు. దానినిఁ దేజోమయము సేయు నింద్రియనియతి కలదు. దానివలన నతఁడు తేజస్సుందరుఁ డైనాఁడు. అది సంపూర్ణపురుషసౌందర్యస్వరూపము. దానిని వరూథినిహృదయమునఁ బ్రతిష్ఠింపఁ జేయుటయే ప్రవరునిపాత్రవలన వరూథినిపాత్రకుఁ గలుగు పరమప్రయోజనము. ఇట్టి యుదాత్తసౌందర్యజిజ్ఞాసువు కనుకనే వరూథిని తనను గోరి వచ్చిన గంధర్వకుమారునిఁ గాదని త్రోసివైచినది. భోగైకజీవి యై నియతిలేని గంధర్వునియందు పురుషసౌందర్యము పరిపూర్ణత నందలేదు. జాతిలక్షణ మైన భోగవృత్తి మాని నియత యై జీవితము గడుపుచున్న వరూథిని ప్రవరుని తేజస్సౌందర్యదర్శనయోగ్యతను సాధించినది. వరూథిని యందలి యట్టినియతిని దెల్పుటకై పెద్దన పురాణములందు లేని గారుడోత్కీర్ణభవనమును సృష్టించి యామెను హిమనగముపై స్థిరనివాస ముంచినాఁడు.

వరూథిని భావించినసౌందర్యము రూపుకట్టినయట్లు ప్రవరుఁ డామెకన్నులకుఁ దోచినంతనే సంవత్సరముల తరబడి లోన బిగియింపఁబడియున్న యిచ్ఛ కట్టలు త్రెంచుకొని పైకుబికినది. ఆమె కాసౌందర్యమును భావించి దానికొఱకు బ్రదుకు నెండించుకొనుట

యందున్న నియతి తద్భోగవాంఛయందు లేదు. సౌందర్యపరిపూర్ణతను సాధించి దర్శించుట కళాతపస్విలక్షణము. దర్శించినపరిపూర్ణతను భోగింప నెంచుట భోగలక్షణము. పరిపూర్ణత తనకంటె భిన్నమైనది కాదని తెలియుట యోగిలక్షణము. జాతిసహజ మైన భోగలక్షణము కళాతపఃఫలమును భోగింపయత్నించినది. యోగిలక్షణవిశిష్టుఁ డైన ప్రవరుఁ డందులకు వశము కాలేదు. ఇది వరూథినీప్రవరులశీలసంఘర్షణమునందలి పరమ తాత్పర్యము.

భోగమున కహంకారము ప్రధానలక్షణము. కర్తృభావము లేనిదే భోగించుట కుదురదు. మదమోహాదులు దానివలన నేర్పడును. యోగికి వైరాగ్యము ముఖ్యము. అది నిరహంకారైకసాధ్యము. నిర్మోహాదులతనికిఁ గరతలామలకములు. వరూథినీ ప్రవరులపాత్రచిత్రణమున నిట్టివ్యత్యాసము పెద్దనప్రబంధమునఁ గాననగును. భోగలక్షణ సంయుత యగు వరూథినియందు జాత్యహంకారము ప్రస్ఫుటముగాఁ గానవచ్చును. నియమవ్రతనిష్ఠుఁ డైన బ్రాహ్మణునియందు నిరహంకారము సర్వత్ర భాసించును. అహంకారము ప్రతాపప్రధాన మై యుద్యోగరూపమునఁ బరిణమించును. నిరహంకారము శాంతప్రధానమై స్థిరధైర్యవృత్తిగాఁ బరిణమించును. అందువలననే వరూథిని ప్రవరునివైరాగ్య దీక్షను బహుముఖములఁ బ్రత్యాఖ్యానించి, యతనిపొందును సాధింప బహువిధముల యత్నించెను. ప్రవరుఁ డడుగడుగునకు గరుడుకట్టి స్థిరదృఢచిత్తుఁ డై భాసించెను పెద్దన యీపాత్రల నిట్లు చిత్రించుటకు బాటలు వైచినవాఁడు మారన. మూలమునందు మహాభాగగా నున్న వరూథిని నభిమానవతిగాఁ దీర్చిదిద్దినాఁడు మారన. ఆమెను జాత్యహంకారయుత యైన మానినిగా మలచి రూపొందించినాఁడు పెద్దన. సంస్కృతమున వరూథిని వాక్కులు నిసర్గమధురములు. తెలుఁగుపురాణమున చతురరమణీయములు. ప్రబంధమున ప్రౌఢాలంకారబంధురములు.

మొదటిసన్నివేశమున వరూథిని ప్రవరునిపై ననురాగ మొలకపోసెను. అతనిచే నవమానముల పాల్పడెను. ఇట్టి విరుద్ధావస్థలమధ్య వరూథినియభిమానమును తెలుఁగు పురాణము పోషింప, జాత్యహంకారమును ప్రబంధము ప్రకటించెను. దీనిని నిరూపించు కొన్నివాక్యము లిచ్చట నుదాహరింపఁబడుచున్నవి.

(1) మూలమునఁ బ్రవరుఁడు వరూథినిని బ్రశ్నించిన మాటలు:

శ్లో. కా త్వం కమలగర్భాభే? కస్య కిం వానుతిష్ఠసి?[38]
బ్రాహ్మణోఽహ మి హాయాతో నగరా దరుణాస్పదాత్. (58.44)

మారన యీవాక్యముల ననువదించుచు "నీ వెవ్వతెవు? ఇచ్చట నేకతంబ యేల యున్నదానవు?" అని ప్రవరునిచే నడిగించినాఁడు. ఏకతముగా నుంటి వేల యనిపించుట మారన చతురవాక్యము. ఇందు గూఢమైన మర్మమును అమాయకవాక్యములందుఁ బొదుగఁబడినది. పెద్దన మారన చూపించిన చతురవాక్యరచనమును విస్తృత మొనర్చి పద్యమునిండ గుప్పించి విడిచినాఁడు. ప్రబంధప్రవరుఁడు "ఎవ్వతె వీవు" అని యూరు

38. కిం వాత్ర తిష్ఠసి?

కొనక "భీతహరిణేక్షణ !" యనుసంబుద్ధి విసరినాఁడు. ఒంటిగా భయము లేక యివ్వన భూమియం దేల సంచరించుచుంటి వని లోగుట్టును గ్రుచ్చి యడిగినట్లుగను అమాయక ముగను బ్రశ్నించినాఁడు. "త్రోవ తప్పితి"ననియు, "క్రొవ్వన" నిన్నగాగ్రమమునకు వచ్చితి ననియు, ఊరు జేర నిం కెవ్విధి గాంతు ? ననియు పలికి స్థిరనివాససూచనము వ్యంగ్యముగఁ జేసినాఁడు. తెరువెద్ది సూచింపు మనియు, శుభంబు నీకగు ననియు పలికి యొకవైపు భావిలో తన బ్రతుకుబాటను దీర్చిదిద్దుభార మామెపై నుంచినట్లును, అదియామె కభీష్టదాయకము కాగల దనినట్లును – మఱియొకవైపు గృహోన్ముఖతఁ బ్రకటించినట్లును వ్యంజింపజేసినాఁడు. ఇట్లు చమత్కారగర్భితము లగు ప్రౌఢోక్తులు విటశేఖరునివలె, విప్రశేఖరునివలె ప్రవరునిచేఁ బల్కించుట పెద్దనకల్పనావిశేషము. ప్రవరుని నాగరకసంస్కారము వ్యంగ్యస్ఫూర్తి యందును భాషాపరశేషభోగిత్వము శక్తిమచ్ఛబ్దసమాహారమునందును పెద్దన నిబంధించుట యిందలిరచనాశిల్పము :

ఎదుటివాఁడు చమత్కారముగా మాటలాడినచోఁ దానును నట్లే మాట్లాడవలె నని యభిమాని భావించును. అతనికంటె మించి మాటలాడ వలె నని గూఢాహంకారి యత్నించును. మారన పురాణమున మొదటిమార్గము ననుసరించియు, పెద్దన ప్రబంధమున రెండవమార్గము ననుసరించియు వరూథిని సమాధానము చెప్పెను. పురాణమునందు అనుపమబహురత్ననితాంతకాంతిసంపద నొనరిన యిగ్గిరి నెప్పుడును చరించుచుందు నని సమాధానము చెప్పి నాఁ దొంటరిగాఁ దిరుగుచుండుట క్రొత్తగా దనియు, నది సుందర నగరత్నకాంతిదర్శనార్థమే యనియు సాభిమానముగా సూచించెను. మనుచరిత్రమున వరూథిని–సూటిగా సమాధానము చెప్పక నర్మగర్భము లైనవాక్కులతో దీర్ఘోపన్యాసము ప్రారంభించినది. "ఇంతలు కన్ను లుండ తెరు వెవ్వరి వేడెదు ?" అని యారంభించి ప్రవరునిప్రశ్నల కివ్వవలసిన ప్రత్యుత్తరక్రమమును మార్చి, యెదురుప్రశ్న వైచినది. ప్రవరునిప్రశ్నలోని చివరిపదమునకు వరూథిని మొదట సమాధాన మీయ మొదలిడినది. "తెరువు" శబ్దము నెందుల కతఁడు వాడియుండె నని యామె యూహించినదో దానిని నర్మగర్భముగా వ్యాఖ్యానించినది. వ్యంగ్యగౌరవమున నతనివాక్కుల తలఁ దన్నినది.

దానితో నామె జాత్యహంకార మూపిరి పీల్చుకొనినది. విపులతర మైన జాతివృత్తము నెత్తి నిజవృత్తమును జెప్ప మొదలిడినది.

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁబుట్టు మాకు;
రహి పుట్ట జంత్రగాత్రముల రాల్ గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు;
నవవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించుపని వెన్నతోడఁ బెట్టినది మాకు;
హయమేధరాజసూయము లనఁ బేర్వడ్డసవనతంత్రంబు లుంకువలు మాకు;
తే. గనకనగసీమఁ గల్పవృక్షముల నీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవవైకుంఠభర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర ! (2.43)

అని తనతోఁబుట్టువును, గానవిద్యాప్రావీణ్యమును, శాస్త్రవిద్యాపాండిత్యమును, అన్యదుర్లభత్వమును, త్రిమూర్తులసభలయందున్న చొరవను, పేరుపేరునఁ బేర్కొని చెప్పినది. ఆచెప్పునప్పుడు తా నెవరో ముందు తెలుపక "మాకు" "మాకు" అని మాటిమాటికినిఁ బలుకుటచే జాత్యర్థమునకు మిన్నయైన స్వీయగౌరవాతిశయముకూడ వ్యంజింపఁబడుచున్నది. అది యహంకారచిహ్నము. ఆమె ప్రాణసఖులను జెప్పుటలో నది కొంత స్పష్టమైనది; "ఇవి మత్కాంతారసంతానముల్" అని హిమనగవనసంపదను తనదిగా ముద్రవైచిన ప్రాగల్భ్యముచే నది మఱియు దృఢమైనది.

(2) వరూథిని ప్రవరుని కతిథిమర్యాదలు సేయఁ దనయింటికిఁ బిలిచినట్లు చిత్రించుట పెద్దనగారి మఱియొక చమత్కారము. అభ్యాగతసేవాపరతంత్రహృదయుఁ డగు ప్రవరునిస్వభావమున కది ప్రతి. పురాణములం దామె కిల్లువాకిళ్లు లేవు. కావున నట్లు పిలువలేదు. ప్రబంధమునం దాపిలుచుటలో నైనను ఎంత యాత్మప్రత్యయము: తనయింటిలో సేదతేఱు మని పల్కుచు 'సముదంచిత న్మణిభవనాసీనత సేద తేరు మని" తనగృహసంపదను పొగడుకొనుట మాత్రము మరచిపోలేదు. "అస్మద్గృహంబు పావనము సేసి" యను వినయోక్తికి దిగుసరికి నాల్గుపద్యపాదములు గడచిపోవలసి వచ్చినది.

ఆమెవైఖరిని గమనించిన ప్రవరుఁడు లోలోన నవ్వికొనియుండును. కాని, బయటపడలే దాగంభీరుఁడు. ఏమాత్రము తొణకక తనకు సహజమైన చతురవచోవిలాసము నొకయింత చిలుకరించి, గడుసుఁదనము ప్రకటించి, ప్రకృతమున కుపక్రమించినాఁడు. "అండజయాన" యని సంబోధించి "నీభక్తిచేతనే నీసపర్యలు మాకు ముట్టినవి. నే నింటికి వచ్చియు రాకయు నొకటియే. అదియునుగాక నే నిచ్చట నుండుటకు వీలుపడదు. సత్క్రియాకాండము నిర్వహించుటకు వేగముగా నూరి కేగవలయును—" అని పేర్కొనుచు, చివరకు నాపయి దయయుంచు మని వేడికొనినాఁడు. ఓయంచనడకదానా: లేక మందగమనా: నీ వింటికి నడచి నా కాతిథ్య మిచ్చుసరికి ప్రొద్దు కొండలో పడును. కావున నీభక్తియే పదివేలు. నన్ను బలవంతము సేయక వదలి దయచూడు మని యందలిచమత్కారము. ప్రవరుఁ డిచ్చట చూపిన గడుసుఁదనము ఔషధసిద్ధుని వాక్యములు విని యీషదంకురితహసన్రగనిష్ఠగండయుగళుం డయి యతనిని జతురోక్తుల పొల్సేయు నేర్పును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

ప్రవరుఁ డౌషధసిద్ధునివలన నొకగుణపాఠము నేర్చుకొనినాఁడు. అందుచే — దాంభికముఁగా మాటలాడు సహంకారులను జూచిన సాధువులకు నవ్వువచ్చును గాని వారిమహిమలు సర్వత్ర ప్రగల్భములు కావు కావున నేపుట్టలో నేపా ముండునో గమనించి వర్తించుట మేలని - ప్రవరుఁడు భావించినాఁడు. తీర్థయాత్రలు చేయించు మని సిద్ధుని వేడినట్లుగనే వరూథిని నిల్లు చేర్పు మని ప్రార్థించినాఁడు.

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము ? మీమహత్త్వము
ల్మానిని ! దివ్యముల్; మదిఁ దలంచిన నెందును మీ కసాధ్యము
ల్గానము; గాన తల్లి: ప్రజలన్ ననుఁ గూర్పు —

మని బ్రతిమిలాడుకొనినాఁడు. అతనివైఖరి యామెకు నవ్వు తెప్పించినది. ఏలయన : అంతలో నతఁడు చతురోక్తు లాడును; అంతలో నతఁడు బేలయై పలవరించును. అతని వైఖరిలో నవ్వు తెప్పించెడి వికృతి యది!

వరూథిని ప్రవరునివాక్యములలోని ప్రాణమును పట్టెను. ''ప్రజలన్ నను గూర్పు" మన్నది యతనివాక్కులలోని యాయువుపట్టు. అతఁడు తనవారికి దూరమై విలపించు చున్నాఁడు. వారిసంగతి నభిలషించుచున్నాఁడు. కావున వాని యాత్మీయులను మరపించి తా నాస్థానము నాక్రమింపవలెను. అందులకై వరూథిని మొదట నాతనినివాసపరిసరములపై నలసభావము కల్పింపఁజొచ్చినది; ఆపైఁ దనహృదయము నెఱుకపఱచినది. ఆమెప్రాణము లతనియరచేతఁ బెట్టినట్లు మాట్లాడినది. వ్యంగ్యముగ నీవే నాప్రాణనాథుఁడ వన్నంతవఱకు వెళ్ళినది. ఇంతకంటె మఱియెవ్వ రతనిహృదయమును సమీపింపఁగల రని యామె తలంచినది! (అగ్ని, దర్భలు, నిత్యకర్మనిరతి - అంతకుమించి యతని నాకర్షించి యున్న వని యప్పటి కామె యెఱుఁగదు.)

మారన యిప్పట్టున వేఱువిధమైన గడుసుపోకడ పోయెను. ప్రవరుఁడు పాదలేపము కరఁగి కొండనెత్తములపై దిగఁబడిపోయె ననని తనతోఁ జెప్పుకొనఁగా వరూథిని యతని విలసనములు గాంచి హృదయము కరఁగి భావజుపుష్పబాణసముద్రమున మునింగిపోయె నని ప్రతికల్పనము చేసి రక్షింప నాతని ప్రార్థించినది. ప్రవరునియిక్కట్టునకు విధి కారణము. వరూథినిబాధకు ప్రవరుఁడు కారకుఁడు. కావున నామెను రక్షించుభార మాతనిపై నున్న దని యామె హెచ్చరించినది. ఆబాధ్యత నెక్కడ గుర్తించినట్లగునో యని ప్రవరుఁ డాయూసున కెట్టిప్రత్యుత్తర మీయక గృహగమనావశ్యకతను, నిత్యక్రియాహాని భీతిని బ్రకటించి యుపాయ మర్థించెను. పెద్దన మారన ప్రణాళికలోని ప్రవరవాక్యముల ననుసరించినంతగా వరూథినిసంభాషణ ననుసరింపలేదు. దానికిఁ గారణ మూహించుట సులభము. వరూథినివలె పెద్దనయు గూఢాహంకారి యగుటయే.

(3) వరూథిని యెత్తుగడ ప్రవరుఁడు పసికట్టినాఁడు ''ప్రజ" లనుమాట వాడుట యందు తా నెంచినభావము నామెకు విశదీకరింప నెంచినాఁడు. "తల్లి'' యని తాను బిలువ నామె తనతోఁ గలుపు 'వరుస' నెత్తిపొడిచినట్లు "వనజేక్షణ! యిట్లు పలుక వరుసయె ?'' అని గ్రుచ్చి యడిగినాఁడు. ''మది విచారమువలదే'' యని యామె చేసిన విచారమునంతయు కా దని త్రోసి వైచినాఁడు. వ్రతులైన విప్రులను కామింపఁ బాడికా దని నీతి కరపినాఁడు; ఆనాఁ డిలు సేరకుండినచో ''వేలిమియున్ సురార్చనయు, విప్రసపర్యయు'' తప్పు ననియు, ''వృద్ధు లగు జననీజనకు లాకట సోలుదు" రనియుఁ బేర్కొనినాఁడు. ''నే నాహితాగ్ని" నని స్వాభిమానముగా వరూథిని కెఱుకపఱచినాఁడు. ఇన్ని చెప్పియు తనభార్యసంగతి యెత్తఁడు. ''అనుకూలగతి నాదు మనసులో వర్తించు పలకాంత మది నెంత కుందునొక్కొ!" అని యంతగా వాపోయినవాఁ డామెయూసునే యెత్తకుండె నవఁగా నది పరోక్షముగా వరూథినికిఁ బ్రోత్సాహజనకమే కావచ్చును.

ఆట్లని యతఁడసలు చెప్పలేదని త్రోసివేయుటకు వీలులేదు. "తూలు సమస్త ధర్మములు తొయ్యలి! నేఁ డిలు సేరకుండినన్" - అను చివరి వాక్యములోని యాసమస్త ధర్మములలో నాతని భర్తృధర్మము కూడ తప్పక యిమిడియుండును. దానిని వాచ్యము చేయకుండుటయే యతఁడు చూపిన గడుసుఁదనము. వరూథిని కావాక్యముల తాత్పర్యము విన్నబాటు కలిగించినది. ఎందువలన? ప్రవరుఁడు తనధర్మములే తనయాత్మీయు లని పేర్కొనెను కావున. ఆమె యతనికి దివ్యభోగముల నీయఁగలదు కాని ధర్మమార్గము నీయఁజాలదు. కావున నామె కోటమి తప్ప దయ్యెను. ఆమె యహంకారము దెబ్బ తినెను. అందుల కామె చిన్నబోయెను. మారనరచనలో వరూథిని విన్నబాటు కానరాదు. ఆమె ప్రబంధనాయికవలెఁ బెద్దగా మోమెత్తి విజ్ఞప్తి గలేదు. అందువలన దింపుట కవసరము రాలేదు.

(4) ప్రవరుఁడు ప్రత్యుత్తర మిచ్చుటలోనికౌశలము వరూథిని గుర్తించినది. దానిని గేలిచేసిన కాని యామెకుఁ దృప్తి కలుగదు. అనఁగా నతనియజ్ఞయాగాదికర్మలను, ధర్మపరత్వమును, వైరాగ్యమును తేలికపఱచి మాట్లాడవలయును. కాని, అట్లు మాట్లాడుటవలన నెదుటివాని మనస్సు పుటుక్కున విరుగరాదు. దానికిఁ గొంత మార్దవ మవసరము. అట్టి సున్నితమైన యవస్థయందు మఱల వరూథినికి తనజాత్యహంకారమే శరణ్య మైనది. అప్సరస యైన యామెకును భూసురుఁ డైన ప్రవరునకును గల యంతరము తెలియవచ్చునట్లు మృదువుగనే మాట లారంభించినది. "ఓభావజరూప! యిట్టి యెలప్రాయము వైదికకర్మనిష్ఠలం బోవఁగ నింక భోగములఁ బొందుట యెన్నఁ" డని పలికి యతని సమయోచితము కాని యవివేకవిచారము నెత్తి చూపినది. "యజ్ఞకోటుల బావను లౌటకున్ఫలము మాకవుఁగిళ్ల సుఖించుటే కదా!" అని యతనికర్మపరత్వమును గేలిచేసెను. అసంఖ్యాకము లైన యజ్ఞకర్మలకు ఫలముగా మాత్రమే తనకౌఁగిలి లభ్యమగు నని తన సంభోగదుర్లభత్వమును సూచించి స్వాతిశయమును పరలాఘవమును ప్రకటించెను. ప్రవరుని కర్మపరత నధఃకరించుటతో నాగక వరూథిని తనభోగపరతను గొప్ప చేసి చిత్తము చిగురింప సీసపద్యమునఁ జెప్పినది. పచ్చికస్తూరి, చొక్కపుజవాజి, పచ్చకప్పురపుసరము, స్వచ్ఛతుహినజలము, వివిధకుసుమకదంబము, దివ్యతరుజమ్ముదుల వసనఫలాసవామేయరత్నభూషణములు గల తనభోగ్యవస్తుసంభారమును చూపించి "భోగపరుఁడ వయి రమింపుము ననుగూడి యనుదినంబు" నని కోరినది. తన కౌఁగిలి సౌఖ్యమునకు విలువఁగట్టి చెప్పినది. తన కున్న కలిమిజాలముల నెన్ని చూపించినది. అతఁడు వానిని గన్నెత్తియైనఁ జూడలేదు. ఆమె కౌఁగిలిని మనసార వాంఛింపలేదు. సశరీరస్వర్గ మెదుట నున్నను దానిదరిఁ జేరక నిగ్రహము చూపెను. ఈమూఁడును వరూథినికి చిరాకెత్తించినవి. ఆమెవాక్కులలోఁ గొంత కఱకుదనము కనుపించినది.

క. అంధునకుఁ గొఱయె వెన్నెల?
గంధర్వాంగనల పొందు గా దని నంసా

రాంధువునఁ గూలె దకట! ది
వాంధము వెలుఁగు గని గొంది నడఁగిన భంగిన్? (మను. 2.56)

అనునది యామె మొదటివినురు. ధర్మమును తృణాచ్ఛన్న మైన బావితో రూపించుట లోకప్రసిద్ధము. కాని, దాని నవహేళనార్థమున వరూథిని వాడినది. ప్రతివస్తూపమయందు నంధునితోడను, ఉపమయందు దివాంధముతోడను ప్రవరుని బోల్చి యతని భోగాంధ్యమును గర్హించినది.

"ఎన్నిభవంబులం గలుగు..." (2.57) అను పద్యమునందలి "యలివేణులు" ఎవ్వరో కారు. "విన్నదనంబు"ను "వెన్నవలెం గరంగు" స్వభావమును గల వరూథినియే. తత్కాలమందలి స్త్రీయావస్థను జాతిసామాన్యము చేసి మాటలాడెడినే ర్పీమాటలయందుఁ గలదు. "ఎన్నిభవంబులం గలుఁగు... గౌఁగిట జేర్చు భాగ్యముల్" అని యవహేళనము చేయునప్పుడు స్త్రీయాహంకారము వరూథినిపలుకులందు తాండవమాడినది.

క. కుశలతయే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియనిరోధమునం
గృశుఁడ వయి యాత్మ నలఁచుట
సశరీరస్వర్గసుఖము సమకొనియుండన్. (మను. 2.58)

ఉపవాసవ్రతములచేఁ గృశాంగుఁ డయి చేయుసర్వకర్మనిష్ఫలకును ఫలము స్వర్గసుఖము. అందు కలుగునది దేవకాంతాభోగము. అది సశరీరముగా లభించుచున్న దనియు, దానిని. ద్రోసిరా జనుట కౌశలము కా దనియు వరూథినివాదము. "సశరీరస్వర్గసుఖము సమకొనియుండె" నను వాక్యమునందలి వ్యంగ్యార్థమున వరూథినీజాత్యహంకారము దీపించుచున్నది.

పెద్దన వర్ణించిన దివ్యభోగముల ప్రసక్తి మారనలోఁ గలదు. అచ్చటకూడ సీసపద్యమే రచింపఁబడియుండుట గమనింపఁదగిన ఛందస్సామ్యము. "ధరణీదేవకుమార!" యనుపద్యమునందలి వరూథినీహృదయము ఆఖ్యానశిల్పాధ్యాయమున వివరింపఁబడినది. అందలి మారనరచనాచమత్కారము "మనోహరకేళీగతి యెలమి స్త్రీడింపు" మని యడుగుటలోఁ గానవచ్చుచున్నది. దానిని పెద్దన వ్యంగ్యముగాఁ బెక్కువాక్యములపైఁ బఱచి రచించెను.

5. పైమాటలలో వరూథిని ప్రవరాఖ్యుని బ్రాహ్మణధర్మమునే గేలిచేయుచున్నది. యజ్ఞాదికర్మలవలన నరుఁడు సాధించెడు స్వర్గసుఖములను వేరొక్కని యవి తమ యధీనమున నున్న వని గర్వించినది. బ్రాహ్మణుఁ డామెగర్వోక్తులకుఁ బ్రత్యుక్తి చెప్పినాఁడు. ఫలకాంక్షతోఁ జేయు సవనకర్మలకు ఫలము స్వర్గసుఖము. ఫలాకాంక్షరహిత మైన కర్మాచరణమునకు ఫలము మోక్షసుఖము. స్వర్గభోగములవలన మానవుఁడు క్షీణపుణ్యుఁడై మఱల మర్త్యలోకమున బుట్టుక నెత్తుచున్నాఁడు. నిష్కామకర్మ యొనర్చువాఁడు పునర్జన్మరహిత మైన శాశ్వతమోక్షమును బొందుచున్నాఁడు. బ్రాహ్మణుఁ డింద్రియనియ

తిచే సాధించునది స్వర్గము కాదు - మోక్ష మని ప్రవరుఁడు నిరూపించినాఁడు; నిష్కాముఁడైన తన కున్న బ్రహ్మానందాధిరాజ్యపదవీవ్యామోహమును వ్యక్తము చేసినాఁడు. కామైక ప్రధాను లగు భోగజీవులు దేవయోనులు. వారి కీనిష్కామయోగము తలకెక్కదు. కావున ప్రవరుఁడు ధృతిదీప్తితో బ్రాహ్మణతత్త్వము చెప్పెడినరికి వరూథిని బెదరిపోయినది. కాని, భయముతో నొదిగి మిన్నకుండలేదు. మన్మథబాణములబాధ ఆమెకు భరింపఁజాలనిదయ్యెను. అందువలన భయపడినను రతిప్రయత్నము మానుటకు వీలులేదు. ఇట్టి సంధిసమయమున నామెకుఁ బ్రవరున కెదురుమాటాడు ధైర్యము కల్పించినది యామె 'మదము'. మనుచరిత్రద్వితీయాశ్వాసమునందలి 61వ వచనమునఁ బెద్దన యామెయొక్క మదభంగిమల నిట్లు విభజించి చెప్పెను.

1. పరిణతవివిధవిబుధతరుజనితమధురమధురసం బానుమదము.
2. అదటునన్ జిదిమిన నెఱుంగక మదనహరు నైనఁ జదురునం గదియ గమకించు తిమురునం గొమిరెప్రాయంపుమదము.
3. అనన్యకన్యాసామాన్యలావణ్యరేఖా మదము.
4. ఒంటిపాటునఁ గంటికిఁ బ్రియుఁడై తంగేటిజుంటిచందమున గొంటుఁదన మెఱుఁగక కుఱుంగట నున్న యమ్మహీసురవరకుమారుతారుణ్యమౌగ్ధ్యములం జేసి తనవైదగ్ధ్యము మెఱయఁ గలిగె నని పల్లవించు నుల్లమున నుల్లాసంబునం గదురు మదము.

మధుయౌవనలావణ్యవైదగ్ధ్యహేతుజ మైనమద మామెయందు విజృంభించినది. భయముచేఁ గదురు డెందము నామదముతో నోసడించినది. చెలికత్తెలను కనుసన్నలతో వారించి ప్రవరుని మఱియు సమీపించినది. అతనితో ని ట్లనినది :

శా. "ఎందే డెందము గందళింప రహిచే నేకాంతతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నందిందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖించఁ గను నాయింపే పరబ్రహ్మ ! 'మా
నందో బ్రహ్మ !' యటన్న ప్రాఁజదువు నాంతంబర్థ మూహింపుమా ! " (2.62)

ఇందు మహాయోగిజనగమ్యమాన మగు బ్రహ్మానందస్థితినిఁ గామశాస్త్రపరముగా నన్వయించి ప్రవరునిబ్రాహ్మణత త్త్వప్రతిపాదనము నవహేళనము చేసినది. మదనాతురయు, మదవతియు, జాత్యహంకారయు నైన వరూథిని యిట్లు ప్రవరు నొడఁబఱచుటకు తత్తరము చూపుచుండ నతనికి సిగ్గును, వెగటును గలిగినవి.

పెద్దన వరూథియందుఁ గల్పించినతత్తరము మారన చిత్రించినదే. కాని, యతఁడు మాటలయందు కన్నఁ జేతలయం దధికముగా వర్ణించెను. పెద్దన మాటకును, చేతకును వానిమధ్య నుండు కాలవ్యవధానాదివివిధాంశములకును, వీని నన్నింటిని మించిన యాంతరమైన యొకక్రమపరిణామములకును హేతువాదకల్పనమునకును సమమైన సన్నివేశమును గల్పించి రూపొందించి యుండుటచే పురాణకల్పనముకంటె ప్రబంధకల్పనము సంశ్లిష్టమును, సాలంకారము నై రాణింపఁగలిగినది.

6. ప్రవరుఁడు తనకుఁ బ్రియ మగు నవి అరణులు, దర్భలు, నగ్నులు కాని యన్యములు కావని తేల్చి చెప్పి "చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్" అని భోగవాంఛను దృణీకరించెను.

ఆమాటలతో వరూథిని యభిమానము మూఁడవసారి దెబ్బతినినది. క్షణక్షణము గడచినకొలఁది గట్టితేలుచున్నాఁడు ప్రవరుఁడు. అతనివాక్కులలో చాతుర్యము సడలి తైక్ష్ణ్యము హెచ్చినది. "చెప్పకు" మనుటచే వ్యంగ్యముగా నామెను మరుమాటాడవల దనియు, నీవు మాటాడినను నేను వినను, మాటాడను అనియు ఖండితముగా సూచించినాఁడు. ఆమాటతో నామెనోరు పడిపోయినది. గుండె చల్లబడినది. మోము వెల్లఁబారినది. కనుల నీరు క్రమ్మినది, గొంతుక జీరవోయినది. అతనిని బుల్కుపుల్లునం జూచినది. తల యూచినది. "వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్" అని తన దైన్యావస్థను మొదటిసారి గుర్తించినది. కాని, యట్టిమానిని దైన్యావస్థలో నెక్కువకాల ముండలేదు. పడగ చితికినపాము తోకతో కొట్టినట్లు మార్గాంతర మాలోచించినది. తాను వలచినట్లు బైటపడినది కాని యతఁడు బైటపడలేదు. మాటలచే లొంగనిబాపఁడు చేతలతో లొంగు నని యూహించినది. అనునయాలాపదీనాస్య యై రతిసంరంభము మీర నాతనిఁ బైపాటునఁ గౌఁగిలించినది. అణగారిన గర్వస్థానమును అతిశయించిన కామ మ్మాక్రమించినది. కామ మింద్రియతృప్తినే కోరును గాని యాత్మగౌరవము నభిలషింపదు. కామ మవమానింపఁ బడుచోఁ గలిగెడు లజ్జాశోకములు అమర్షాహంకారములను రేకెత్తించి విజృంభింపఁ జేయును. ప్రవరుఁ డామెను త్రోసివేయుటతో వరూథిని కట్టిస్థితి యేర్పడెను. "పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక :" యని యతనినిర్దయత్వము నెత్తిచూపుచున్నదో యనునట్లు నఖక్షతములను జూపించి వేదనపనెపం బిడి కలస్వనముతో నేడ్చినది. అతఁ డులుకలేదు; పలుక లేదు. అతని నిర్దయ కామెయొడలు మండినది. భూతదయావిరహిత మైన యతనిచదువులు, జన్మములు, పున్నెములు నిరర్థకము లని వేడిగా మాట్లాడినది. పరాశరాదులబండారము బైట పెట్టినది.

తే. వారికంటెను నీమహత్వంబు ఘనమె?
పవనపర్ణాంబుభక్షు లై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిమ్రుచ్చు లెల్లఁ
దామరసనేత్రలిండ్ల బందాలు గారె? (మను. 2.73)

ఏకదేశముగాఁ బ్రారంభ మైన వరూథిని వాక్శరపరంపర మునిలోకము నంతయు ముంచెత్తినది. అసమర్థ మైన యభిమానగర్వము కార్యసాధకము కానప్పుడు కారుకూతలరుచుచుండుట లోకస్వభావము. "మునిమ్రుచ్చు" లను నిష్ఠురదూషణము పరాశరాదుల నువలక్షించి పల్కినప్పటికిని తనకౌఁగిలి పగులఁగొట్టిన ప్రవరునిమీఁద పరోక్షముగాఁ బరవళ్లు త్రొక్కుచున్న వరూథిని యమర్షాహంకారముల వాగ్విలాసము లని స్పష్టమగుచున్నది. ఇంతయార్భాటము సృష్టించిన పెద్దన హాలాహలముమధ్య అమృతస్ఫూర్తి

వలె ''వారికంటెను నీమాహాత్మ్యంబు ఘనమె" యను సత్యార్థస్ఫూర్తిని కాకువునందు నిలిపి చతురవాక్కును సార్థకపఱచుకొనినాఁడు. వాక్శిల్ప మనఁగా నట్టిది!

మారనరచనమున వరూథిని ప్రవరపరిత్యక్త యైనచోఁ బ్రాణత్యాగము చేసెద నని కృతనిశ్చయము తెలిపి, యతనిని లొంగఁదీయ యత్నించినది. దానికిఁ బ్రతిగాఁ బ్రవరుఁడు పరవనితారతి క్రీడని గురువులు చెప్పెద రని బోధించి, తనయం దామెను నిరతము విరతిని భజింపు మని నీతి గరపి సౌమ్యముగా నగ్నిని భజింప నేఁగెను. పురాణమునందు వరూథినికి చివరిప్రశ్నమునకుఁగూడ ప్రవరునినుండి ప్రత్యుత్తరము లభించినది. ప్రబంధమునందు పరిష్వంగభంగ మయిన తరువాత వరూథినిరోదన మరణ్యరోదన మైనది.

రెండవఘట్టమున వరూథిని విరహార్తమూర్తి;అంగభవకోదండమౌర్వీరవక్షోభాకంపితధైర్య. ఆమె ప్రవరుని మొదట కామించినది; ఆకామము విరహవేదనచేఁ దప్తమై హార్దికమైన యనురాగముగాఁ బరిణమించినది. అతనిం బొందని బ్రతుకు నిష్ఫల మని భావించినది. విషమసాయకుతూపులవేడికి విసిగి విసిగి చివర కవ్వనజాక్షి తనువు దొఱఁగంగఁ దలఁచినది. ఇట్టియవస్థలో నున్న వరూథినికి జాత్యహంకారమును స్మృతికిఁ దెచ్చుటకు పెద్దన నెచ్చెలులను సృష్టించెను. వా రామెకు నూరిపోసిన హితవాక్యము లివి :

ఉ. పూఁతపసిండివంటి వలపుం బచరించుకులంబు నీతికిన్
లేఁతగదమ్మ యిత్తెఱఁగు; లేమ! సురాంగన లెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తు రమ్మ? దయిసేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁతురటమ్మ? యింత కనువేదుఱు సెల్లునటమ్మ యింతికిన్. (3.33)

ఉ. ఇందునిభాస్య! వాఁ డనఁగ నింద్రుఁడొ చంద్రుఁడొ యాయుపేంద్రుఁడో?
యిందులకై పగం బొగుల నేటికి? నేఁటికి నందుఁబోద; మా
నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోడు, రమ్మ; నీ
చందము నందముం గనిన జవ్వని! యెవ్వని వెఱ్ఱిఁ జేయదే? (3.64)

ఇందు మొదటిపద్యభావము వరూథినివిశిష్టచిత్తవృత్తికి విరుద్ధము కావున నది యామెపైఁ బనిచేయలేదు. రెండవపద్యభావ మామె సౌందర్యాహంకారప్రేరకము కావున నది యామెపై సత్ఫలితముల నిచ్చినది. ఇట్లు సఖీవాక్యజ్ఞాపిత మైన స్వాభిమానము మాయాప్రవరసందర్శనసమయమున సుసంపన్న మై యామెవాక్యములందుఁ బ్రతిబింబించి యాపాత్రయందుఁ బోషింపఁబడవలసిన ప్రధానగుణసాతత్యము నిర్వహింపఁజేసినది.

ఈరహస్యమును బెద్దనయే సూచించెను. కపటభూసురకుమారుని దరిఁ జేరి పలుకరింపఁబోవు వరూథినిని ''మానిని'' యని కవి పేర్కొనుటయు, మాటలలో నఖండాభిమాన ముట్టిపడ పల్కించుటయు నందులకు నిదర్శనము.

శా. రా, వైరాగ్యముఁ బూని నీవు కడునిర్దాక్షిణ్యచిత్తంబునన్
రావై తేఁ బవిగాగ్నియిందులకు ఘోర్ఘాఘోరిగాఁ బోరి యే

లా వాలాయము సేయఁగా? బ్రతుకు నీవాచారవంతుండ వై;
చావో యెక్కడొ నీయెడం బొడమువాంఛన్ భూసురగ్రామణీ!

క. కట్టిఁడితనమున కిట్లొడి
గట్టి మనసు ఱాయి సేసి కరఁగవు; మఱి నీ
పట్టినది విడువ; విఁక ని
న్నిట్టట్టన నేల? మాయదృష్టం బుండన్. (3.94-95)

కఠినుఁ డైన ప్రియుని గరఁగింపఁ దలఁచిన యువతి యతనికాళ్ళవ్రేళ్ళఁబడి దైన్యము ప్రకటించుట లోకసహజము. కాని, వరూథిని యిచ్చట లోకసామాన్యము లైన వాక్యము లాడుటలేదు. ఆక్షేపవ్యాజనిందాలంకారగర్భితము లైన వాక్యముల నెన్నుకొనినది. మొదటిఘట్టమునఁ ద్రోపుఁడువడి యవమానములకుఁ బాల్పడిన యామానిని మఱల కాళ్ళ బేరమునకు దిగలేదు. అతనికఠినచిత్తమును చట్రాతితోఁ బోల్చి యుపాలంభించినది. అతఁడు మొండిపట్టు విడువనందులకు విసువుకొనినది. బలవంతముగ నతని నొప్పించు యత్నము చేయ నని పూర్వకృతనిరాకరణము జ్ఞప్తికిఁ దెచ్చినది. మఱల తాను వేడఁబోవ నని సూచించినది. "బ్రతుకు నీ వాచారవంతుండ వై" యని యతనిజీవితము నిరర్థక మని హెచ్చరించినది. 'ఇఁక నిన్నిట్టి ట్టన నేల'' యని యాయమ నిష్ఠురోక్తు లతని యందు నిష్ఫలము లైన వని నిరాశ ప్రకటించినది. మాయదృష్ట మిట్లున్న దనుచు వరూథిని సంభాషణము ముగించుట పెద్దనగారిసంభాషణవిరచనాచాతుర్యమునకుఁ జక్కని నిదర్శనము. ''మా" యనుటలో జాత్యహంకారము కలదు. ''అదృష్ట"శబ్దమునం దామె కాతనివలనఁ జరిగిన యన్యాయమంతయు నిమిడియున్నది. అంతియగాక "నిట్టట్టన... యదృష్టంబుండన్'' అనువాక్యమునందలి తాత్పర్య ముచ్చారణవైలక్షణ్యముచే "మాయ దృష్టమే మాకు చాలును. అదియే మాయందు నీ కానుకూల్యము కలిగించును. ఇఁక వేఱుఁగా నే నేమియు నిన్నడుగవలసినపని లే'' దను నర్థాంతరస్ఫూర్తియుఁ గలుగుటకు వీలున్నది. దానిని గథార్థసూచనగాఁ బెద్దన నిబంధించియుండవచ్చును.

పెద్దన వరూథినిని జాత్యహంకారగర్వితయైన మానినిగా రూపొందించె నని పై నిచ్చినయుదాహరణమువలన స్పష్టమగుచున్నది. ద్రౌపదీసత్యభామాదుల నిట్టివైలక్ష్యముతోఁ దెలుఁగుకవులు తీర్చిదిద్దుటవలనవే వారు లోకాదరపాత్ర లగుట! ఆంధ్రప్రబంధ రంగములందు ముగ్ధ లైన శృంగారనాయికలకంటె మానిను లైన మగువలపాత్రలకే మన్ననయు, మనుగడయు నధికము!

**మిగిలినపాత్రలు :**

స్వారోచిషమనుసంభవప్రబంధమునఁ బెద్దన వరూథినీప్రవరపాత్రముల నత్యంత చాతుర్యముతోఁ బునర్నిర్మించెను. తదితరపాత్రములను సామర్థ్యముతో నిర్వహించెను. మాయాప్రవరునిపాత్రము పెద్దనచేతిలో మూలముకంటె విస్తృత మైనది. ఆవిస్తృతి

యతనిచేష్టలను, సంభాషణములను విరివిగా వర్ణించుటవలన నేర్పడినది. మారన నాలుగు పద్యములలో మాయాప్రవరుని స్వభావము చిత్రించినాఁడు. అందు మూఁడు పద్యములు సంభాషణము. ఒకపద్య మతనిచేష్టలు. పెద్దన పదునాలుగుపద్యములను రచించి, యందు తొమ్మిదిపద్యములు సంభాషణకు వెచ్చించెను. ఆపెంపుదలలోఁగూడ మారన యవలంబించిన విషయవిభాగపరిమాణనిష్పత్తిని పెద్దన సంగ్రహించుట గమనార్హము. స్వభావనిరూపణవ్యంజకముగా సంభాషణస్వభావచేష్టాదికములను వర్ణించుశిల్పమే యౌషధసిద్ధపాత్రచిత్రణమునఁ బెద్దన పాటించెను.

స్వరోచియందు సహజములైనగుణములు మూఁడు. అవి: బాహుబలము, అపారమైనదయ, అనంతమైన భోగపరాయణత్వము. ఈమూఁడంశములు కలసి యతని నుత్తమదక్షిణనాయకునిగాఁ బ్రకాశింపఁజేయుచున్నవి. పెద్దన పైయంశములలో మొదటిదానిని, మూఁడవదానిని మూలముకంటె నత్యంత విపులముగాఁ బెంచెను. స్వరోచిజీవితమున మృగయాకౌతుకము అత్యంతముకీలకమైన పాత్రను నిర్వహించినది. మొదటివేట వలన నతనికిఁ గలిగిన సద్యఃఫలము లస్త్రహృదయము, ఆయుర్వేదము, మనోరమాపాణిగ్రహణము; పర్యంతఫలములు విభావరీకళావతులతోడివివాహము, పద్మినీవిద్యాసిద్ధి, పశుపక్షిభాషాజ్ఞానసిద్ధి. రెండవవేటఫలము వనదేవతాసంగమమూలకమైన మనూత్పత్తి. అట్టే స్వరోచిభోగజీవితముకంటె నతని వైవాహికవైభవమునే యధికముగా వర్ణించెను. వర్ణనాబహుళమైన ప్రబంధనిర్మాణ మొనర్పఁబూనిన పెద్దన కట్టి పక్షపాతవైఖరి తప్పనిసరియైనది.

మనుచరిత్రమున మునిశాపపీడితములైన పాత్రములు నాలుగు. అం దిందీవరాక్షుఁడు గురుశాపహతుఁడు. కపటవేషమున విద్య నభ్యసించి గురువును గేలిచేసిన ఫలితముగా నసురరూపము నతఁడు తాల్చెను. పెద్దన గురుశిష్యసంవాదమును, రాక్షసరూపప్రాప్తిని, అసురచర్యలను, స్వరోచితో నాతఁ డొనర్చినయుద్ధమును మూలాతిరిక్తముగా వర్ణించి రచించెను. మనోరమ మునిశాపదష్ట. ఆమె బాల్యచాపల్యమున ముని నవహేళన మొనర్చుటచే రాక్షసబాధ నొందునట్లు శపింపఁబడినది. మనోరమకు వ్యక్తిత్వము కల్పించిన దామెచెలికత్తెలు. స్నేహప్రాశస్త్యము, త్యాగనిరతి వారివలన నామె నేర్చినది. తనకొఱకై మునిశాపములకుఁ బాలై విలపించు చెలుల నామయబాధనుండి రక్షించికాని యామె సుఖభోగముల నంటలేదు. ధర్మమూర్తు లయిన మహర్షుల నపహసించిన యజ్ఞానదశనుండి ధర్మముకొఱకై స్వీయసుఖత్యాగము చేయఁగలిగిన యుదాత్తస్థితి కెగఁబ్రాకిన యుత్సాహమూర్తి మనోరమ. ముగ్ధ యయ్యు స్వరోచితోఁ గడు నేర్పుగా మాటలాడి, విద్య నొసఁగి ప్రాణము రక్షించుకొనిన చతుర. విభావరీకళావతులు మూర్తీభవించిన స్నేహధర్మములు; రూపుకట్టిన కృతజ్ఞతామూర్తులు. ధర్మైకశరణ్యలైన యయ్యువిదలు తత్ఫలముగా విద్యాసంపన్నలై వీరుఁడైన భర్తను బొంది సుఖింపఁ గలిగిరి. వీరిరువురిలో కళావతీస్వీయగాథ కరుణాత్మకమైనది. పుట్టిన మరుక్షణమే తల్లిదండ్రు లామెను పరిత్యజించిరి. పెంచిన తండ్రి యామెయందమ్ము కారణముగా ముష్కరునిచేతులలో నసువులఁ గోలుపోయె

నాఁడు. అపృష్టహీన యగు నయ్యబల యాత్మహత్యకుఁ బాల్పడినది. అనాథరక్షక యైన యంబిక యామెకు స్వరోచి భర్త యగు నని చెప్పి యామెప్రాణములను రక్షించినది. ఈయుపకథను పెద్దన రసోదంచితముగాఁ జిత్రించెను.

స్వారోషునిపాత్రను పెద్దన ప్రత్యేకాభినివేశముతోఁ దీర్చిదిద్దెను. శమదమాది గుణవిశిష్టుఁడై తపోమహిమచే విష్ణుప్రసాదమును బడసి, మనువై భువనధర్మరక్షాదక్షుఁ డైన స్వారోషుఁ డుత్తమధర్మసాధకుఁడు; ఆదర్శధర్మశాసకుఁడు!

పైపాత్రలస్వభావము లన్నియుఁ బురాణప్రసిద్ధము లైనవే. వానిని వివిధ సూక్ష్మాంశవర్ణనాప్రసంగములచేఁ బుష్టిమంతము లొనర్చి పెద్దన విపులప్రబంధరచన మును నిర్వహించెను.

**రసపోషణవిధానము :**

కావ్యమున కాత్మ రసము. ఆత్మ శరీరావధియందు వాసనామయ మైన జీవసంపుటిలో వసించి ప్రారబ్ధభోగము ననుభవించుచు స్వస్వరూమున భాసించుచుండును. ఆశ్లేయానందరూప మైన రసము ఆయాకథాస్వభావములను బట్టి తత్తద్రసరూపవికారముగా భాసించుచుండును. కథాస్వభావము పాత్రస్వభావముపై నాధారపడి యుండును. నాయకాదుల చిత్తవృత్తుల ననుసరించి విభావాదుల పరిపోషణము జరుగును. నాయకుఁడు వీరుఁడై యపూర్వకార్యసాధనోత్సాహి యైనచో నతనియందు సహజముగా వీరరసము భాసించును. అతఁడు శమప్రధానుఁ డైనచో శాంతము శోభించును.

స్వారోచిషమనుసంభవకథ యేకనాయకము కాదు. అసలు పురాణకథయే ప్రవర స్వరోచివృత్తాంతముల మేలుకలయిక. అట్లగుటచే నేకనాయకగత మైన స్థాయిభావము రామాయణాదులందు వలె నిందు కానరాదు. ప్రవరుఁడు శమదమగుణాన్వితుఁడు; స్వరోచి భోగైకలాలసుఁడు. ఒకఁడు శాంతమునకును, మఱియొకఁడు శృంగారమునకును ఆలంబనము లగుచున్నారు. ఇది ప్రబంధమునందలి రసవిషయమునుగూర్చిన స్థూలమైన విభాగము.

పెద్దనప్రబంధమునుగూర్చి విచారించుటకుఁ బూర్వము మార్కండేయపురాణాంతర్గత మైన యాకథార్థములందు నిబంధింపఁబడిన రసతాత్పర్య మెయ్యది యని భావింప వలసియున్నది. పురాణము రసప్రధానము కాదు; ప్రబోధప్రధాన మైనది. పురాణోపాఖ్యానవస్తువులన్నియుఁ దత్పురాణమహాతాత్పర్యవ్యంజకములుగా నిబంధింపఁబడును. ఇట్లనుటచే బురాణకథలు రసవత్తరములుగా నుండ వని చెప్పుట కాదు. పఠిత కథారస చర్వణమునఁ దన్మయుఁడు కావలెను, తోడ్తోడనే జ్ఞాన ముపదిష్టము కావలెను. ఇది పురాణకథాతాత్పర్యము. జ్ఞానము లౌకికపారలౌకికములలో నెద్ది యైన గావచ్చును. ఏదైనను ధర్మప్రధాన మై యుండును. అది ప్రవృత్తిపర మైనచో నైహికము; నివృత్తిపర మైనచో నాధ్యాత్మికము; పారలౌకికము. జ్ఞాన మలవడవలె నన్న వివేకము కావలెను. వివేకము కలుగవలె నన్న సత్యాసత్యనిరూపణశక్తి కావలెను. అది ప్రబోధ

ప్రత్యక్షదర్శనాదులవలన నేర్పడును. విభావాదుల నుద్దిష్టవిధమున వర్ణించి, లక్ష్య సాధనోన్ముఖముగా వానికి సన్నివేశకల్పన మొనర్చి, తత్తాత్పర్యనిరూపణముగాఁ ప్రబోధము నిర్వహించుట పౌరాణికకథానిర్మాణవిధానము. మఱియు పురాణములందు పాత్ర సృష్టి గుణప్రధానముగా నుండును. వానికి రూపకల్పన మప్రధానము. కావున సంస్కృత మునఁ బ్రవరునివంటి ప్రధానపాత్రయొక్క నామమే పేర్కొనఁబడలేదు. అతఁడు విషయవైముఖ్యమునకును, కర్మదీక్షకునుఁ బ్రతీకగా నిలచియున్నాఁడు. అట్టిప్రతీకాత్మక పాత్రలద్వారమున జ్ఞానప్రతిపాదన మొనర్చుటయే పురాణపాత్రకల్పనప్రయోజనము.

ప్రబంధములం దట్లు కాదు. విభావానుభావాదులపౌష్కల్యము కొఱ కట్టిపురాణ పాత్రలకు గుణసన్నివేశములతో పాటు నామరూపాదికము లైన విశేషముల నెన్నింటినో చేర్చుట జరుగుచున్నది. దానివలన రససిద్ధి కానుకూల్యము సిద్ధించుట కవకాశ మేర్ప డును. పెద్దన పురాణకథలందు లేని విభావానుభావసాత్త్వికసంచారీభావవర్ణన మనంత ముగఁ జేసి, తన రసశిల్పచాతుర్యము వెలార్చినాఁడు!

మార్కండేయపురాణోక్తప్రకారము చెప్పఁబడిన ప్రబంధవస్తువునఁ బురాణ వస్తుతత్త్వమునే పరమతాత్పర్యముగా పెద్దన భావించియుండవలెను. స్వారోచిష మనుసంభవకథలో వర్ణింపఁబడిన కథార్థములను బరిశీలించినచో నది గార్హస్థ్యధర్మము నిర్వహించు జనుల నుద్దేశించి రచించినట్లు తెలియుచున్నది. పురుషుల కేకపత్నీవ్రత మును, స్త్రీలకు సతీవ్రతనిష్ఠయు, నుభయులకు వీరుఁడును, జ్ఞానియు నైన సత్పుత్రుని బొందునిచ్ఛయు, విషయసుఖలోలురై పరమపురుషార్థసాధనను విస్మరింపకుండుటయు నత్యంతావశ్యక మను ప్రబోధ మిందు పురాణకర్త యొనర్చుచుండె నని స్పష్టపడఁ గలదు. స్వాయంభువమనువు పరిపాలనమున నేర్పడిన దేవలోకభూలోక జీవధర్మ తారతమ్యములను నిరూపించి అందు స్వారోచిషునికాలమునఁ గలుగఁబోవు భూలోకధర్మ ప్రాముఖ్యమును వివరించుటయు నందలి యవాంతరప్రయోజనము. ఈలక్ష్యసిద్ధి కై పురాణకర్త ప్రవరునిగార్హస్థ్యజీవితమును, పరసతీగమనవిరతిని, నిత్యకర్మాభిరతిని విశే షించి వర్ణించి వరూథినీభోగదృష్టి నవమానముల పాలుచేసెను. వరూథిని ననన్యమాన సగాఁ జిత్రించి రూపాంతరమున నామె మనోభీష్టమును సిద్ధింపఁజేసి తత్పుత్త్రిలబ్ధితో నామెజీవితమును దరింపఁజేసెను. ప్రభువు పలుకాంతలను వివాహమాడి వారితో సుఖించి నచో నేకపత్నీవ్రతునివలె భార్యను బ్రేమింపలేఁ డనియు, వారిపై నాతఁడు జూపు నను రాగము భృత్యతతిపైఁ జూపు దయాభావమువంటి దనియుఁ దెలిపి బహుభార్యా సంగమదోషవాంఛను కథలోఁ బశుపక్ష్యాదులచేతనే గర్హింపఁజేసెను; సంసారి కామైక పరుఁ డై పరమపురుషార్థసాధనము విస్మరింపఁగూడ దనియు హంసప్రబోధమునఁ పురాణ కర్త బోధించియుండెను. ఇది పురుషార్థత్రయప్రధాన మైన ప్రబంధముకావున హంసప్రబో ధము మెళకువతో వదలఁబడినది. భార్యాభర్తలు భోగైకవాంఛతో కాక ఉత్తమసంతాన ప్రాప్తికొఱకు సంకల్పించి ధర్మకామము నియతితో నిర్వహించినచో ధర్మతేజోమూర్తి యైన సత్సంతానము లభించు ననియు, స్వరోచివనదేవతల మనూత్పత్తి సంకల్పము

వలన వ్యంజింపఁబడెను. పెద్దన రచనలో నివియన్నియుఁ బ్రతిబింబించినవి. కాని, భేద మెక్కడ యనఁగా- పురాణమునందు ప్రబోధదీప్తి హెచ్చు! ప్రబంధమున రసదీప్తి హెచ్చు!

స్వారోచిషమనుసంభవకథ రసదీప్తి కనుగుణ మై యున్నది. అందులకు ప్రధాన కారణము అందలిపాత్రలన్నియు నుత్సాహపూరితములై యుండుట. ఉత్సాహము సర్వ ప్రాణిచిత్తవృత్తులకు దీప్తినిఁ గలిగించు శక్తిగలభావము. అది యేపాత్రయం దుజ్జ్వలముగా భాసించునో యాపాత్రచేత వ్యక్తములయ్యెడిభావము లుజ్జ్వలములై భాసించు చుండును. మనుచరిత్రమున-ఔషధసిద్ధుఁడు పాదలేపవరసిద్ధి వడసి వసుంధరా విహారపరుఁ డైన మహీమండలవిశేషసందర్శనోత్సాహి. ప్రవరుఁ డచంచలధర్మదీక్షాపరుఁ డై, నిరంతరాభ్యాగతసత్కారశీలి యై, శైలవనరమ్యభూతలవిశేషములఁ గాంచ నుత్సహించు గృహస్థుఁడు. వరూథిని జాతిసహజ మైన భోగవృత్తిని వీడి, యాదర్శసుందరమూర్తిని వాంఛించి, యతనితోడిదే ప్రాణ మని యెంచి యత్నించిన చైతన్యమూర్తి. స్వరోచి బలోన్మత్తుఁడు, మృగయావిహారి, రాక్షససంహారి, ఆర్తజనరక్షణోద్యోగి, పరమదయాపరుఁడు, కామసాధనాయత్తచిత్తుఁడు. మనోరమాదులు మైత్రీధర్మనిర్వహణోత్సాహశీలలు. చివర కిందీవరాక్షుఁడు సైతము ఆయుర్వేదవిద్యాసాధనోత్సాహము చూపినాఁ డన యీపాత్రల యుత్సాహదీప్తినిగుఱించి వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. కావున వీనియం దేరస మైనను కాంతిమంతముగ రాణింప వీలగు నని తాత్పర్యము. మారనయు, పెద్దనయు నారహస్యమును గుర్తించి తమ కున్న కావ్యరచనావకాశపరిధులలో రసదీప్తికి సాయశక్తుల యత్నించిరి.

ప్రవరునియందు ప్రవత్తినివృత్త్యుత్సాహములు పోషింపఁబడినవి. తీర్థయాత్రాఫలసిద్ధికొఱ కతఁడు చేసినప్రయత్న మంతయు నతిథిజనార్చనాభిరతిచే కవి వ్యంజింపఁజేసి, హిమాలయయాత్రాసిద్ధిచే నాతనియుత్సాహము నద్భుతఫలదాయిగా నిబంధించెను. ఇందుఁ బ్రవృత్త్యుత్సాహదీప్తి కలదు. వరూథినీపరిష్వంగభంగ మొనర్చి యింద్రియ జయము సాధించుటలో నాతనినివృత్త్యుత్సాహము దీప్త మైనది. దానికి అగ్నిప్రసాద లబ్ధి కలిగించి యద్భుతఫలమును నిరూపించెను. కథయం దతఁడు సాధించిన నివృత్త్యుత్సాహము శమోద్దీపక మై యతనియందు శాంతమును స్ఫురింపఁ జేసినది. అతని నిత్య కర్మనిరతియు, నింద్రియనిగ్రహమును 'బ్రహ్మానందాధిరాజ్యపదవీ' సాధనైకలక్ష్యము లగుటచే నారసస్ఫూర్తి స్థిరమైనది. రసైకదృష్టి యైన పెద్దన తన్ప్రబంధమున మారన రచనయందుకంటెఁ బ్రవరుని శాంతము నత్యంతస్ఫుటతర మొనర్చెను.

వరూథిని రత్యావేశమూర్తి. ప్రవరుని ప్రథమవీక్షణముతో నారంభించి క్రమోన్మీలనవికాస మొంది, అతని వియోగమునఁ బరితప్త మై సాంద్రమధుర స్ఫూర్తి నొంది, మాయాప్రవరసమాగమఫలసిద్ధితో నామె నాశ్రయించి దీపించిన రతి ఫలవంత మైనది. నిజప్రవరుఁ డామెను నిరాకరించుటచే నాతనితోఁ గూడియున్న సన్నివేశమున శృంగారరసాభాసమును, అయోగవిప్రలంభమును, మాయాప్రవరునితో భోగించినసన్ని

వేళమున సంభోగశృంగారమును బోషింపఁబడినవి. మారన మార్కండేయపురాణమున వరూథినీశృంగారవర్ణనము మూలాతిరిక్తముగా నొనర్పఁబడినది. అది పెద్దనరచనకు బాగుగాఁ దోడుపడినది. ఈవిషయము వెనుక వివరింపఁబడియున్నది.

వరూథినీగంధర్వులశృంగారము రస మని కొందఱును, రసాభాస మని కొందఱును భావించిరి. ఉదాహరణమునకు ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగా రీఘట్టమున రసాభాసమే కల దని యభిప్రాయపడిరి. ''వరూథినీవృత్తాంతములోని ఉత్తరభాగమైన మాయాప్రవరగాథలోఁ బరస్పరానురాగముగానే నిజస్వరూపమున భాసించుచుండును. రసము సామాజికనిష్ఠమై కలదు. కథాంతర్భూతమై యున్న ఆయాభాసమును ఏకవియును పరిహరింపఁజాలడు. పరిహరింపవలసిన అవశ్యకతయు లేదు. ఈగాథలో రసాభాసమే లేదనియు, అది యుభయత్రానురాగమే యనియు వాదించువారును గలరు. అది అతివాదము.''[39] శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారు రసాభాసము కాదని సమర్థించి యుండిరి.

" ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా
యోషితో బహుసక్తి శ్చే ద్రసాభాస స్త్రిధా మతః॥''

ఈకారిక యొకశృంగార మాభాస మగు పద్ధతులనే చెప్పుచున్నది. కాని, రసాంతరములను గుఱించి యేమియు లేదు. ఆశృంగారాభాసపద్ధతులు గూడ కొన్నియే నిరూపింపఁబడినవి. ఆనిరూపించినంతవఱకైనను నస్పష్టముగానే యున్నవి. ఏ మందురా ! మొదటిపాదమున (ఏకత్రైవానురాగశ్చేత్) ''అనురాగ మొకచోటనే యున్నచో రసాభాస" మని కదా యని యర్థము. అది పొసగుట లేదు. అనురాగ మొకయెడ నుండినను నది రసాభాసముగా లక్ష్యములం దగుపడుట లేదు. మనుచరిత్రమున ద్వితీయాశ్వాసములో వరూథినిమాత్రగత మైనను రతి తృతీయాశ్వాసమునఁ బర్యాలోచనావిశేషము వలన మామనసుకు రసాభాసముగా స్ఫురించుట లేదు. ఇంకను మావంటివారు కొందరు మనుచరిత్రమున రసాభాసము స్ఫురింపని వా రున్నారు. ప్రవరునిరూపసౌందర్యాదులచే నాకృష్టమానస యై వరూథిని ప్రేమించినట్లే వరూథినీసౌందర్యాదులకై గంధర్వుఁడును బ్రేమించియున్నాఁడు. వారిరువురికిని బరస్పరాస్థాబంధరూపముననే యట రతి స్ఫురించుచున్నది. కావున నిక రసాభాసమున కవకాశ మేది ? అభిలాష లయించుటకుఁ గల కారణ మేమియు లేదు. '' నన్నీతఁడు ప్రేమించె '' నని వరూథినియు '' నే నీరూపమున వరూథినిచేఁ బ్రేమింపఁబడితి నని '' గంధర్వుఁడును బరస్పరప్రేమను గుఱుతించి యున్నారు. అదియే యీకావ్యపఠనశ్రవణాదినమయముల మనయనుభవములోనికి వచ్చుచున్నది. కావున నిట రసాభాసమునకుఁ బ్రసక్తియే లేదు. ''రూపభేదమున నున్న గంధర్వుని ప్రేమించెను గాని గంధర్వరూపమున నున్న యాతనిఁ బ్రేమింపలేదు. అనఁగా గంధర్వవిషయక మగు ప్రేమ వరూథినికి లేదు. కావున నిట రసాభాస''మని కొందరి

39. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము. సంస్కృతిసంపుటము. పుట – 980.

వాదము......యువతీయువకులలోఁ బరస్పర మేయేరూపమున నొక రొకరియం దొక రొకరికిఁ బ్రీతి యుదయించునో...అనగా వారొండొరు లేరూపవశమున నైన నొండొరులఁ బ్రేమించుకొనుచో వా రిరువురి కది పరస్పరాస్థాబంధరూప మై స్థాయి యగును. విభావముల వాస్తవికస్థితితో గాని రూపభేదములతో గాని భావమునకుఁ బని లేదు:"[40]

ఆచార్యులవారు లాక్షణికదృష్టితో నాయికానాయకాశ్రయ మైనది శృంగారరసాభాసము కా దని నిరూపించిరి. రసము సామాజికనిష్ఠ మని చెప్పి శ్రీ పింగళివారు రసాభాస మని భావించిరి. కాని, భరతాదుల సామాజికానుభూతిలక్షణ విధానమును బట్టి పాత్రలయనుభూతినే ప్రేక్షకులు తాదాత్మ్యమున ననుభవించెద రని స్పష్ట మగుచున్నది.

"య స్తుష్టౌ తుష్టి మాయాతి శోకే శోక ముపైతి చ
క్రుద్ధః క్రోధే భయే భీతః స శ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః ॥"

అను నియమునుబట్టి పాత్రలరసభావములందు లేని యాభాసము ప్రేక్షకులకు స్ఫురింప దని తాత్పర్య మేర్పడుచున్నది. అంతియకాక నాయికానాయకులలో నేకత్రానురాగము తోచినచో నేకోన్ముఖముగాఁ బఠిత నాయికానాయకులందుఁ దాదాత్మ్యము నొందఁ జాలక పోవుటయు, అట్లు కాకుండుట కచ్చటి భావవైరుధ్యము తోడుపడుచుండుటయుఁ గానఁబడుచుండును. వరూథినీగంధర్వానురాగవర్ణన ఘట్టమున నట్టి వెలితిపాటు కానరాదు. కాకపోగా నాపాత్రలయందు సానుభూతిపై నేర్పడిన తాదాత్మ్యముతోఁ బఠిత రసాస్వాదనము చేయును. రసాభాసమును గూడ రసమువలె ననుభవింపవచ్చును గదా యని సరిపెట్టుకొనినను బ్రవరవరూథినీఘట్టమునందలి శృంగారమునను, వరూథినీగంధర్వుల శృంగారఘట్టమునందును బఠిత పొందెడి యనుభూతిలోఁ దప్పక భేదము కనఁబడుచున్నది. వరూథిని కెక్కడ ప్రవరుఁడు లొంగునో యని పఠిత యుత్కంఠ వహించి యామె నతఁడు దూరముగాఁ ద్రోచివైచినప్పుడు పఠిత ప్రవరుని గర్హింపఁడు. వరూథినిని నిందింపఁడు. వరూథినియందు సానుభూతియు, ప్రవరునియందు సహానుభూతియు నొందును. ఇఁక రెండవఘట్టమున ప్రవరరూపధారి యగు గంధర్వునిచర్యను బఠిత గర్హింపఁడు. ఆపద్ధర్మముగా గ్రహించును. అతఁడు వరూథిని నారూపమునఁ బొందినందులకు నంతఃకరణమున తృప్తిపడును. దానికిఁ గారణము పఠిత ప్రవరునిశీలము రక్షింపఁబడవలె ననియు, వరూథిని మనోవాంఛితము తీరవలె ననియు కాంక్షించుచు గంధర్వుఁడు ప్రవరరూపధారి యై యామెను గవయుట జాతిధర్మవిరుద్ధము కాదనియు భావించి నాయికానాయకుల పరస్పరానురాగరసచర్వణతత్పరుఁ డగును. కథాస్వభావమునందే యిట్టి లక్షణము కలదు. లాక్షణికుల రసాభాస నిర్వచనమును మనము వస్తువున కన్వయించి నాటకీయన్యాయము (Dramatic Justice) ను దృష్టియం దుంచుకొని యాలోచింపవలెను. ఏకత్రైవానురాగ మైన రతి కథాఫలసిద్ధికి భంజక మగునట్లు ప్రయుక్త మైనచో ఆభాసము, దోషభూయిష్ఠము నగును. ఫలసిద్ధిసహాయకముగాఁ బ్రయుక్త

40. ఆంధ్రధ్వన్యాలోకము. పుట – 130.

మైనచో నాభావము పుష్టిమంత మగును. ఫలానుకూల మైన యేకపాత్రరతి లోకధర్మ విరుద్ధముగా నుండవచ్చును, కాని నాటకీయన్యాయమునకు విరుద్ధము కాకపోవచ్చును. దానిచేత కథాగతి కాస్కారము కలుగవచ్చును ! అప్పుడు పతితమనస్సు దానియందు రమించును. ఉపాయాంతరమున విశ్లథములై యున్న బీజార్థములను ఫలోన్ముఖముగా నేకత్రపఱచు నుపనాయకుఁడు కథలలోఁ బతితలసానుభూతిని, సహానుభూతిని సుష్ఠుగాఁ బొందగలఁడు. ఇది యొకనిర్మాణరహస్యము! వరూథిని విరహవేదనచే మరణించుట పతిత యంగీకరింపఁడు. అయినచో గంధర్వసాంగత్యమున కంగీరించునా ? యని ప్రశ్న. వస్తువునం దున్ననాటకీయన్యాయము పతిత నంగీకరింపఁజేయును. భోగప్రధాన మైన జాతి యందు పుట్టినది వరూథిని. కాని, యేకపురుషరతిని వాంఛించినది. ఆపురుషుఁడు ప్రవరుఁడు. అతఁ డామెను వలచుట పతిత యంగీకరింపఁడు. ఇఁక కథ యెట్లు నడువవలెను ? కథ యాగిపోవుటయుఁ బతిత యంగీకరింపఁడు. గంధర్వకుమారుఁ డామెను వలచి యొకపరి యామేచేఁ బరిత్యజింపఁబడి యుండెను. అతఁడు ప్రవరవేషమున నామెను గవసినాఁడు. కథ నడపవలయు నన్నచో నిట్లే కావలయును. ఇరువురియనురాగస్రవంతుల కడ్డంకైన యొకహేతువు నుపనాయకుఁ డుపాయాంతరమున నివారించెను. కథాగతి భంజింపఁ బడకుండ రతిసమయమునం దామె కన్నులు మూయ నియమించెను. దానివలన నామెచిత్త మునఁ బ్రవరతేజమును స్థాపించెను. వరూథిని బలవత్తర మైన స్త్రీశక్తి. అమెయందు గాఢ మైన యిచ్ఛ కలదు. అది సృజనావస్థ నందుకొన వలెను. ఆమెలక్ష్యము చెడరాదు. ఆమెయిచ్ఛయు, ఆమెశక్తియు వృథ కారాదు. ఆపద్ధర్మము న్నాశ్రయింపవలెను. ఆమె సృజనాత్మకశక్తికి భౌతికసహాయము కావలెను. ఆసహాయము నిపుణముగాఁ జేయుట నాటకీయన్యాయము ! కావున గంధర్వకుమారుఁడు వరూథినిని వలచుట పతితకు సమ్మతమే యగును. ఇట్టిసన్నివేశములు సాహిత్యములో నపూర్వము ! వీనికి లక్షణశాస్త్ర గ్రంథములలోఁ బ్రత్యేకించి సూత్రములు వ్రాయఁబడక పోవచ్చుచు. సన్నివేశమునకు సరిపడున ట్లాలోచింపవలెను. అట్లగుచో సామాజికుల కిచ్చట గంధర్వవరూథినీ సమాగమమున ఆభాసము స్ఫురించు నవకాశము లేదు. కావున, నిచ్చట రసము శృంగారము !

స్వరోచి మనోరమాదులతోఁ గ్రీడించుటయు "పుంసో౽ ప్యనేక నాయికానురాగే రసాభాసత్వ మితి కేచిత్" అను లాక్షణికోక్తివలన శృంగారరసాభాస మని భావించుటకు వీలున్నను దక్షిణనాయకత్వము లాక్షణికసమ్మత మగుటచేతను, నిట్టివి మహాకావ్యము లందు గానవచ్చుచుండుటచేతను దానిని రస మనియే పరిగణింపవచ్చును. కథలో మనోరమాదులు స్నేహసూత్రబద్ధ లై శరీరములచే మువ్వురయ్యు నాత్మ లేకరూపముగా భాసించిన యువతులు. విద్యలతోపాటు హృదయములను పతి కర్పించిన యబలలు. పండితుఁడు బహుశాస్త్రపాండిత్యము నేకధారణమున గ్రహించునట్లు స్వరోచి యాభార్య లను భరించెను. పతిత కెక్కడను వారికథలో రసాభాసస్ఫూర్తి కలుగదు. వనదేవత నిజరూపమును దాల్చిన తరువాత స్వరోచి నామెను గవయుటచే నాభాసము తొలగింపఁ బడినది. కాని, చక్రవాకీ మృగవిమర్శనమువలన స్వరోచి శృంగారదీప్తి కొంత తగ్గి

నివృత్తినిష్ఠతోఁ బ్రవృత్తిధర్మమును శాసించు స్వారోచిషమనుజననమునకుఁ బుష్టి చేకూర్చినది.

స్వరోచివేటవర్ణనమునందును, మనోరమప్రాణరక్షణమునందును వీరము, స్వరోచి యిందీవరాక్షునితో నొనర్చిన యుద్ధమున రౌద్రబీభత్సములును, ఔషధసిద్ధునిమాటలలో నద్భుతమును బోషింపఁబడినవి. ఇవి యన్నియు నంగభూతములు :

పురాణకథారసతత్త్వము ననుసరించి యీప్రబంధమునందలి యంగిరసము శాంతము కావలెను. ఈకథ యేకనాయకవృత్తము కాకపోవుటవలనను, స్వయంసమగ్రము లైన రెండుకథల సంపుటీకరణ మగుటచేతను, శమదమాన్వితుఁ డైన మనువు జన్మించుటయే కథాఫల మగుటచేతను, ఇందలి రెండుకథల రసతాత్పర్యము కథాఫలమును వ్యంజింపఁ జేయవలసి యున్నది. కావున ప్రవరునికథలో శృంగారముపై శాంతమునకుఁ గలిగిన విజయమును, స్వరోచికథలో మృగరాజహంసబోధామృతము వలన గలిగినజ్ఞానదీప్తి శృంగారమును మందీకృత మొనర్చుటయును, కుమారోదయఫల మైన కథావస్తువునందు సర్వసహజమైన శృంగారమును బరిత వివేకించి వీనిని మనుజీవలక్షణ మైన శమమున కుపష్టంభకముగా నిల్పికొని శాంతరసోన్ముఖుఁ డగును. కావున మార్కండేయపురాణోక్త ప్రకారమునఁ బ్రబంధరచన మొనర్చిన అల్లసాని పెద్దన మనుచరిత్రమునకును, - ఆరంభనిర్వహణసమన్వయ వివేకముతోఁ బరిశీలించినచో - శాంతమే యంగిరసము కాఁగలదు !

**పద్యరచన :**

సంస్కృతమార్కండేయమహాపురాణమునందలి స్వారోచిషమనుసంభవవృత్తాంతము మారన యనువదించెను; పెద్దన యాకథావిధానము ననుసరించుచు నొక ప్రబంధరాజమును నిర్మించెను. కథార్థములకు సంస్కృతపురాణము మూలమైనను అవి రచింపఁబడిన ఛందములుమాత్ర మాంధ్రకవుల స్వీయప్రతిభానిర్మితములే. మారన యీకథను దన వచశ్శ్రీ విభవము తేటపడునట్లు రచించెను, పెద్దన చతురవాగ్వైభవము వెల్లివిరియ ప్రబంధనిర్మాణ మొనర్చెను. పద్యరచనాశిల్పము ప్రధానముగా కవివాగ్వ్యక్తి నాశ్రయించియుండును. మారనపెద్దనలు తమ వాక్కులలో శిల్పసంపదలు పండించుకొనిన మహనీయులు. ఇరువురిది మధురమైన వాక్కు. కాని, యొకఁడు పురాణకర్త. మఱి యొకఁడు ప్రబంధకర్త. ఒకఁడు ప్రథమాంధ్రపురాణస్వరూపస్వభావచిత్రీకరణకుశలుఁడు మఱియొకఁడు ప్రథమాంధ్రప్రబంధనిర్మాణదక్షుఁడు ! వీరి వస్తు వొకటయ్యును లక్ష్యములు భిన్నములు. వీరివాక్కు మధుర మయ్యును తత్ప్రపంచనముచే వీరు సాధించుప్రయోజనములు భిన్నములు. పైపెచ్చు వీరు నివసించినకాలములు భిన్నములు; కావ్యనిర్మాణముల విధానములు, సాహిత్యమర్యాదలు, సిద్ధాంతములు- మొదలైనవానిలో కాలానుగుణమైన కొంతభేదము కలదు ! వీని నన్నింటిని మించిన యాయాకవిసంస్కారవిశేషము లాయా వాక్కులవెనుక లాస్యమాడుచుండును. ఒకఁడు మహాకవి; ఒకఁడు ఆంధ్రకవితాపితా

మహుఁడు. కావున నిన్ని హేతువులఁ బురస్కరించుకొని వీరిరువురిపద్యరచనాద్భుకప్రథ ములలో భేదము కనఁబడుచున్నది.

మారనయొక్క సరళ - గంభీరమైన శైలికన్న పెద్దనశైలి ప్రౌఢమైనది. అతనిది నిరలంకారమయ్యు నిసర్గమధుర మైన రచనము. ఇతనిది సాలంకార మైన సారవద్ర చనము. రసానుకూలమైన గుణరీత్యాదు లిరువురును గూర్పఁగలిగినను ఒకరిది ప్రసాద గుణప్రధానమైనమార్గము. ఒకరిది యోజఃప్రధానమై ప్రసాదగుణవిభూతి గలమార్గము.

మారన రచించినది యుపాఖ్యానముగా నయ్యును, స్వారోచిషమనుసంభవ మొక మహాకావ్యమును జదివినసంతృప్తి నిచ్చును. దాని కాతని రచనాశక్తియే కారణము. దానిని జేపట్టి పెద్దన రచించినప్రబంధము ఒకరసవత్ప్రపంచమువలె భాసించును.

ఛందమును రసభావవ్యంజకముగా నిర్వహించుటయందు మారనపెద్దనలు ప్రత్యేక శ్రద్ధను గైకొనిరి. మారన కావ్యవిస్తృతి పరిమితము కావున పరిమిత మైన ఛందోవైవిధ్య ముతో నపరిమితకావ్యార్థవ్యంజనము చేయవలసి వచ్చెను. పెద్దన ప్రబంధపరిమాణము విస్తృత మగుటచే విస్తృత మైన ఛందోవైవిధ్యముచే విపులరసార్థములను వ్యంజిం చుట యైనది.

ఒకకవి యొకకావ్యమును రచించునెడ కొన్నిసందర్భములందు కొన్నిఛందముల సభినివేశముతో నిర్మించును. అవి పండితముఖకమలయందు సతతము సువాసనవలె వసించును మఱియొకకవి తరువాత నదేవస్తువును గైకొని మఱియొకకావ్యము వ్రాయ వలసినవచ్చినచో నతఁడు తనకు పూర్వము రచింపఁబడియున్న కావ్యమునందు ప్రసిద్ధ ములైయున్న పద్యరచనాశిల్పములను లెస్సగాఁ బరిశీలించును. పూర్వకవిప్రసిద్ధపద్య ముల నధిగమింపఁగల పద్యములను రచించుట కప్పటులం దొకొక్కసారి యత్నింపక పోవచ్చును; లేక యొక్కొకసారి వానికన్న విశిష్టవిఖ్యాతినందఁ గల పద్యములను నిర్మింపఁ జాలవచ్చును: పెద్దన మారనరచన నిట్లే పరిశీలించెను. మారన రచనలోఁ ప్రసిద్ధి కెక్కిన పద్యములకు దీటైన పద్యముల నొక్కసారి రచించుటకు పెద్దన యత్నింపక యౌచిత్యము పాటించెను. ఉదాహరణమున కొండు రెండిచ్చట పేర్కొనఁబడుచున్నవి. మారనకవి విరచిత మైన యాక్రిందిపద్య మత్యంతప్రసిద్ధి కెక్కినది:

శా. ఆగంధర్వుఁడు నప్సరోంగనయు నత్యాసక్తిమైఁ గూడి హై
మాగస్ఫారదరీగృహాంతరలతాంతాగారభాస్వత్తటీ
భాగీరథ్యురుసైకతస్థలజలప్రాంతప్రదేశంబుల
నోగింపంగఁ దొడంగి రంగజసుఖాంభోరాశినిర్మగ్నులై. (మారన. 5.18)

పెద్దన యీవృత్తస్థానమున రెండుకందపద్యములను సంస్కృతపురాణానుసారముగా రచించెను. మారన పద్యముయొక్క యెత్తుగడ మనోహరముగా నున్నది. పెద్దన యా యెత్తుగడతో నట్టిపృత్తము వ్రాసి లోకమును మెప్పింపఁజాలఁడు: ఆయెత్తుగడను చేతు లార వదలుకొనలేడు. వృత్తారంభమునందలి దీర్ఘఅకారమును ఆలాపనచేసికొనుచు

లోలోన మురిసిపోయియుండవచ్చును: పెద్దనగారి గుండెగొంతుక యిట్లు కందము నాలపించినది.

క. ఆగంధర్వకుమారుఁడు
నాగజగమనయుఁ బ్రఫుల్లహల్లకతల్పా
భోగంబున రతిఁ మిగులఁగ
భోగింపంగఁ దొడంగి రాత్మఁ బొంగెడుకాంక్షన్. (మను. 3.114)

ఈపద్యమునందలి కర్తృ-క్రియాపదములు మారనరచననుండి సరాసరి గైకొనఁబడినవే. "ఫుల్లకానన"ములు మూలమునఁ బేర్కొనఁబడినవి. అవి ప్రఫుల్లహల్లకతల్పాభోగ స్ఫూర్తి నిచ్చినవి. ఈపద్యము నందలి పూర్వోత్తరార్ధములందు వేర్వేరుగాఁ బాటింపఁ బడినపాదారంభాద్యక్షరావృత్తి పెద్దనఛందోలంకారము. పెద్దన మారనహృదయమును పట్టెను. మారన గంధర్వాప్సరోంగనలు స్థలజలప్రాంతములందు విహరించినట్లు సార్థక క్రమాలంకారము స్ఫురింపఁజేసి, పాత్రతత్త్వములను వ్యంజింపఁజేసెను. అతనికి సువాసన యన్న ప్రీతి. ఆమెకు జలక్రీడయన్న ప్రీతి. పరస్పరప్రీతిదాయకములగు స్థలజలప్రాంతములను యథానుకూలముగా వా రుపయోగించుకొని రని మారన. పెద్దన మారనవతె నాజంటను గాలికి వదలలేదు. వరూథినికొఱకై యాతఁడు కల్పించినభవన మొక్కటి యున్నదికదా హిమగిరిమీఁద: వా రిరువుర నందుఁ బ్రవేశపెట్టినాఁడు. ఇఁక వారికి జల ప్రదేశప్రసక్తి యవసరము లేకపోయినది. దానితో "నప్సరోంగన" శబ్దము అనవసర మైనది. గజగమనశబ్దము సందర్భశుద్ధిని సంతరించినది. మారనపద్యముయొక్క యెత్తుగడలో నున్న యాస్వరసౌందర్యమును తనకందమున పాదద్వయారంభమున నిల్పి మారనకు జోహారు లర్పించినాఁడు. "భోగింపంగఁ దొడంగి" రను క్రియాపదమును యథాతథముగా గైకొని మారనను గౌరవించినాఁడు. పెద్దన మారనలోని జలప్రాంతములను బేర్కొనకుండుటలోఁ గొంతవ్యంగ్యవైభవము కలదు. మదనపీడిత యైన వరూథిని మాయాప్రవరునినియతి కొడంబడి యతనితోఁ గవిసినది ఇప్పు డతనిదే పైచేయి. అతఁడు సుముఖుఁడై తనయింటఁ బ్రవేశించినాఁడు. ఆగంధర్వుఁడు పుష్పసౌంగధ్య మన్ననిష్టము ప్రకటించును. కావున, నతని కాభోగము కల్పించినది. తనకు జలక్రీడ యన్న ప్రీతికావచ్చును. కాని, యది యతనికిఁ బ్రీతికరము కాదు. కావున, తనయిష్టానిష్టములను లెక్కసేయక యాతనిసుఖమే తనసుఖ మని సరిపెట్టుకొనినది. ఇది వరూథిని పర మైన దృష్టి. ఇఁక మాయాగంధర్వుఁ డా అప్పట్టున నాగృహమునుండి బయటకు వచ్చుటను హృదయమునఁ గోరుచుండడు. బయటకు వచ్చినచో నెక్కడ తనమాయా రూపము బయటపడునో యని యతనిభయము. ప్రియురాలిచిత్తము నలరించుటకు జల ప్రదేశమున విహరించెడివాఁడేమోకాని వరూథిని దానిని గోరుటలేదు; తనకు దానిపై నిచ్ఛ లేదు. అందువలన పెద్దన కాప్రసక్తి యవసరము లేకపోయినది. పెద్దన యీపద్యము రచించునప్పుడు మారనవిరచితమైన తద్వృత్తశిల్పమహత్త్వమంతయు,జిత్తమున భావించుచుఁ దా నావృత్తమహత్వము నెంచి దానికిఁ బ్రతిగా నట్టిగంభీరవృత్తరచనకుఁ బూనుకొన

లేదు. కాని, దానితరువాత "నావధూటిప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె" నను కావ్యార్థమును రమణీయరుచిరార్థబంధురమైన సీసమున వివరించి తనస్వతంత్రవర్ణనా సామర్థ్యమును ప్రదర్శించెను.

2. స్వరోచిజననాభ్యుదయములను వర్ణించుచు మారన రెండుచంపకమాలలను రచించెను. లఘ్వాది యైన చంపకము స్వరోచియొక్కసత్వరాభ్యున్నతిని వ్యంజింపఁ జేయఁగల ఛందము. అందువలన మారన దానిని గ్రహించి శిల్పపాండిత్యము ప్రకటించెను.

చ. స్వరుచిసముద్గమస్ఫురణ సర్వదిగంతరము ల్వెలుంగ భా
సురతరమూర్తి యై వెలయుసూర్యునిమాడ్కి సుతుండు ప్రీతి స
త్తరుణికి నుద్భవించి సముదాత్తతనుద్యుతిజాలసంపద
న్స్వరుచిరుఁ డై స్వరోచి యను సుందరనామము దాల్చె యెంతయున్.

చ. కళ లభివృద్ధి బొందు శశికైవడిఁ దద్దయు సద్గుణంబుల
న్వెలుఁగుచు నాఁడునాఁటి కభివృద్ధి వహించి మనోజ్ఞయౌవనో
జ్జ్వలుఁడును నస్త్రవిద్యను విశారదుఁడు న్బలభాసితుండు నై
పొలుపుగ మందరాద్రి తటభూముల నాతఁడు కేళిసల్పుచున్.
(మారన. 5.22, 23)

ఇందు మొదటిపద్యము మూలాతిరిక్తమైన యర్థసంపదచే నొప్పారియున్నది. అందలి యుపమాలంకారము మూలమం దున్నదే కాని తదావిష్కరణసౌందర్యము మారనయందు వెల్లివిరిసినది. పెద్దన మారనరచనము చదివి మురిసిపోయినాఁడు "స్వరుచిసముద్గమ స్ఫురణ సర్వదిగంతరముల్ వెలుంగ" అనుశబ్దసమాహారమునకు సంతసించినాఁడు. కాని మారన విపులకథార్థములను రెండువృత్తములలోఁ గుదించివైచినాఁడు. పట్టు మవి రెండు పద్యములు నడువలేదు. పసిబాలుఁడు ప్రౌఢుఁడై నిలచినాఁడు. ఈ వేగము ప్రబంధ కవికి నచ్చలేదు. అతఁ డావేగమును మంద మొనర్పఁదలఁచి లఘ్వాదియైన చంప కమును తాను గ్రహింప నిచ్చగింపలేదు. గుర్వక్షరారంభచరణమైన శార్దూలము నెత్తు కొని యచ్చటనుండి కథ విలంబితగతి నాశ్రయించు నని వ్యంజింపఁజేసెను. మారన మొదటిపద్యము పెద్దన ప్రబంధమున ఒకశార్దూలము, ఒకకందము - అయినది. (మను 4.5, 6) శార్దూలమున మూలమునం దున్న యుపమానమును సంస్కరించి పెద్దన ప్రవేశపెట్టెను. కందమున మారన శబ్దమాకందములను భద్రపఱచుకొనెను. చూడుడు:

క. స్వరుచిస్ఫురణను శశభా
స్కరపావకతారకాప్రకాశము లెల్లన్
విరళములు సేయ నతనికి
స్వరోచి యను నామ మిడి రచటి మునులెల్లన్. (మను. 4.6)

మారనయుపమాలంకారమును పెద్దన యతిశయోక్తి చేసెను. మారన పద్యద్వయము నందు పంచిపెట్టిన యలంకారధ్వనిని పెద్దన యొకచోట సంపుటీకరించెను. మెఱుఁగులు

కూడ దిద్దెను. అది యేమనగా: మూలమునను, మారనరచనలోను బాలస్వరోచి కుపమానముగా సూర్యుఁడును, యువస్వరోచి కుపమానముగా శశియు గ్రహింపఁబడిరి. ఇవి యన్నియు వెరసి స్వరోచియొక్క కాంతిమత్త్వసాతత్యమును వ్యంజింపఁజేయును. అప్పు డలంకారకల్పనము సార్థక మగును. కాని, తార్కికు లిచ్చట యొకసంశయమును లేవ నెత్తవచ్చును. సూర్యోపమానబలముచే స్వరోచియొక్క అహఃప్రకాశము మాత్రమే స్ఫురించును; శశ్యుపమానము రాత్రిప్రకాశమునే వ్యంజింపఁజేయును. మఱియు దానివలన స్వరుచిస్ఫురణసాతత్యము స్వరోచికి జననకాలమున లే దనియు భావించుట కవకాశము కలదు. కావున పెద్దన దీనిని మెళకువతో నివారించెను. నామకరణసమయముననే యాతనికి సూర్యచంద్రార్ధ ప్రకాశములు గల వనుట పెద్దనప్రతిభకు తార్కాణము. చంద్రుని కున్న వికాసక్షతులనుగూడ పెద్దన గూఢముగా భావించి యమావాస్యనాటిచంద్రుఁ డేమి కాంతి నిచ్చు నని యెవరైన విమర్శింతురేమో యని శంకించి మెళకువతో నర్కతారక స్ఫూర్తిని గూడ అందుఁజేర్చెను. ఉపమానము కన్న నుపమేయ ముదాత్త మని చెప్పి సర్వసంశయనివృత్తి చేసి కావ్యార్థములం దౌచిత్యము పోషించెను. ఇంత చేసినను మారనపద్యము చిత్తమునకు హత్తినంత గాఢముగా పెద్దనపద్యము హత్తుకొనదు. ఆసంగతి తెలిసిన పెద్దన మారనపద్యమునకు గౌరవ మిచ్చి తాను కందమున జిలుగు శిల్పము దిద్దుకొనినాఁడు!

పెద్దన మారనవలెనే యొకపద్యమున స్వరోచిబాల్యావస్థనుండి యౌవనారూఢుఁ డైనట్లు వర్ణించి చెప్పెను. కాని యాపైన మఱల నాతనిదశాంతరములను, వేటను విపులముగా వర్ణించియుండెను. అట్లారంభించిన మొదటిపద్యమును మారనవలె చంపకమాలగా నిర్మించుట గమనార్హము. నాయకవయఃపరిణామమందలి ద్రుతగతి చంపకమాల వ్యంజించు నని పెద్దనకు తెలియును! మారన ఛందశ్శిల్పమునకు పెద్దన యాపద్యరచనతో (మను. 4.7) వ్యంగ్యనీరాజనము నందించినాఁడు.

వరూథినీవిరహాతిశయమును స్ఫురింపఁజేయు నీక్రిందిపద్యము పెద్దనహృదయము నాకర్షించినట్లు కనఁబడుచున్నది:

ఉ "ఎక్కడినుండి వచ్చె నతఁ డీతుహినాద్రికి? వేడ్క నూని యే
నక్కట! యక్కుమారురుచిరాకృతి యాదట నేల చూచితిన్?
మక్కువ యేల నాటె మది? మన్మథుఁ డేల సహించు నన్ను? వాఁ
డెక్కడ వచ్చు నింక? నది యేల ఘొనంగు? దురాశ యేటికిన్".

(మారన. 5.9)

చింతాదిభావములందు సాధారణముగాఁ గనఁబడు చిత్తవైకల్యమథనాదులను ఛందమున వ్యంజింపఁజేయవలసివచ్చినప్పుడు మారన యుత్పలమాలలో శకలితగణములను పదఘటనావసరమున భాసింపఁజేయుచుండును. వరూథిని ప్రవరవియోగబాధ కోర్వఁజాలక చింతామగ్న యగుట యిందలి వస్తువు. ఈవృత్తమునందలి గణశకలములు చిత్తవైకల్యమును వ్యంజింపఁజేయుచున్నవి. వాక్యములయాయాక్రమము క్రమక్షీయమాణమై

వరూథినిచిత్తమునఁ గ్రమవర్ధమాన మగుచున్న కాలాక్షమత్వరూప మైన యౌత్సుక్య మును వ్యక్తముచేయుచున్నది. భ, గల బహువారావృత్తి యవరోహణాత్మక మైన చిత్త ఖేదమును, కైశికీవృత్తి శృంగారరసానుగుణమైన మాధుర్యమును స్ఫురింపఁజేయుచున్నవి. నల, జగణస్ఫూర్తి దీప్త మగు చిత్తతాపమును సూచించుచున్నది. ప్రథమతృతీయచర ణాంతములం దున్న గుర్వక్షరములు నాయికారోదనస్ఫూర్తిని భాసింపఁజేయుచు దుఃఖ తీవ్రతను వ్యంజింపఁజేయుచున్నవి. పాదద్వయద్విప్రాసఘటనము చింతాభావమును రూపింపఁజేసి ఛందము నలంకరించి యాస్వాదసౌఖ్యమును గల్పించుచున్నది. పెద్దన ఉత్పలమాలావృత్తమున కున్న ఈఛందశ్శక్తిని మనుచరిత్రమునఁ గొల్లకొట్టినాఁడు.

పెద్దన యీఘట్టమున నీభావమునే వ్యంజింపఁజేయుట కుత్పలమాలావృత్తమునే గైకొనెను.

ఉ. అక్కట! వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోచిపోయె; దరిఁ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన? నిఁక నీకొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ? వానికౌఁగి లది యెక్కడ? హా! విధి! యేమిసేయుదున్.
(మను. 3.5)

ఛందశ్శిల్ప దృష్టితోఁ గాంచినచో నీవృత్తమున మారనవృత్తనిర్మాణశిల్పముద్ర స్పష్ట ముగాఁ గనవచ్చుచున్న దనుటలో విప్రతిపత్తి లేదు. పెద్దన యీశిల్పపద్ధతిని ప్రబంధ మున సజాతీయభావవ్యంజనావసరములందు నౌచిత్య మెఱిఁగి ప్రయోగించెను. మచ్చునకు:

ఉ. ఎక్కడి యూరు? కాల్ నిలువ కింటికిఁ బోయెద నంచుఁ బల్కె దీ;
వక్కట! మీకుటీరనిలయంబులకున్ సరిరాక పోయెనే
యిక్కడిరత్నకందరము లిక్కడి నందనచందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యూలవలీనికుంజముల్. (మను. 2.50)

మారన యీసందర్భమున వరూథినీవాక్యములను "ధరణీదేవకుమార!... (4.240) యను మత్తేభవృత్తమున నిబంధించియుండెను. పెద్దన యీభాగమున నుత్పలముల నుత్కటముగా రచించియుండుట యీశిల్పమార్గమును కావ్యార్థములందు విస్తృతపఱ చుటయే కాగలదు! ఇట్లు ప్రసిద్ధములైన మారనపద్యములకు దీఁటైనపద్యములు పెద్దన వ్రాసి మెప్పించిన సందర్భములును మనుచరిత్రమునఁ బెక్కులు కలవు. ప్రవరవరూథినీ సమావేశ మత్యంతశిల్పవైభవముతో నిర్మించినపెద్దన యాభాగమునందలి యొక్కొక్కపద్య మొక్కొక్కశిల్పఖండముగాఁ దీర్చి దిద్దినాఁడు. వానితోఁ బోల్చిచూచినచో బూర్వాపరకవుల పద్యములు నిలచుటకష్టము.

వరూథినీప్రవరసంభాషణమున మారన వరూథితో తనదివ్యభోగములను వర్ణించి చెప్పునప్పుడును, దానికి ప్రత్యుత్తరముగాఁ బ్రవరుఁడు హవ్యమహిమవలనఁ గలుగుమోక్ష సుఖమును వివరించి చెప్పునప్పుడును,-సీసమును వాడియుండెను (మారన. 4.241,244)

వారిరువురును వారివారివైభవములను విపులీకరించి చెప్పుకొనెడి తుల్యచిత్తావస్థలయం దుండి యావాక్యముల ననిరి కావున తుల్యచ్ఛందములను ప్రయోగించి మారన యొక యౌచిత్యమును బాటించెను. పెద్దన యీసందర్భము నట్లు భావింపలేదు. కొలదిమార్పు చేసెను. వరూథినీవాక్యములలో సహజమైన జాత్యహంకారము స్ఫురించును కావున నామె దివ్యభోగములను సీసమున విస్తరించి చెప్పుటయే న్యాయ మని భావించి పెద్దనయు నామె పలుకులను సీసమున నిబంధించెను. (మను. 2. 55) కాని, వరూథినిచిత్తావస్థతోఁ బ్రవరునిచిత్తావస్థను తుల్య మొనర్పలేదు. మనుచరిత్రలోఁ బ్రవరుఁడు వరూథినితో మాటలాడ మొదలినదిమొదలు క్రమక్రమముగా నాతనిసమాధానములు సంగ్రహములై చివరకు మౌనముద్రకు భూషణము లైనవి. అట్టియెడ ప్రవరునిచివరి పలుకుల నతివిస్తృతముగాఁ బ్రపంచించుట పెద్దనమతము కాదు కావున, మత్తేభమున రచించుట జరిగినది. (2.62) వృత్తము వేరైనను పెద్దనమారనపద్యములోని "రేపునుమాపు' అనుతెలుఁగుసమాసమును, నోరార తనపద్యమునఁ బ్రవరునినోట పల్కించినాఁడు. మారనరచనలోని-

" వినుము దర్భలు నరణులు వేదికలును
నగ్నులును నాకుఁ గరము ప్రియం బొనర్చు
గాని యొండందుఁ బ్రియ మెదఁ గలుగ దనిన" (మారన. 4.244)

వాక్యమును మక్కువతోఁ గైకొని "నాకరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైన ట్లన్యముల్ కావు" అని ప్రబంధప్రవరునిచేత నొక్కివక్కాణింపఁజేసినాఁడు. మారనపైవాక్య మమూలకము. పెద్దనకు మార్గదర్శకము !

ప్లుతములైన స్వరములను వృత్తాదియందు నిలిపి రచించు ఉత్పలమాలాదివృత్తములను పెద్దనయు మారనవలె సన్నివేశముతో రచించెను.[41] మారన యొకటికంటె మించిన భావముల నొకేపద్యమునందు నిముడ్ప యత్నించినఘట్టములందును, ఒకపాత్ర మాట్లాడిన మాటలు వర్ణించి కథాకథనమునుగూడ నొకేపద్యమున గూర్చి రచించినపట్టులందును పెద్దన సాధ్య మైనంతవఱకు వానిని వేరువేరు వృత్తములుగా వ్రాసెను.[42] పద్యగతులలో వైశిష్ట్యమును భావానుకూలముగా మారన ప్రకటింప వానిని పెద్దన సందర్భోచితముగా వినియోగించిన పట్టులును గొన్ని కానఁబడుచున్నవి.[43]

మారనయనువాదమున గానఁబడు కొన్నిపదములును, సమాసములను, పెద్దన గ్రహించె నని కొన్ని యుదాహరణములు చూపవచ్చును.[44] భావానుకరణములకుఁ గూడ కొన్నిపట్టుల నుదాహరణములఁ జూపవచ్చును.[45]

---

41. ఉదాహరణమునకుఁ జూడుడు :- మారన. 4.218 ; మను. 1-70 మారన. 4.230 ; మను. 3.102

42. మారన. 4.214 ; మను. 1.51 ; 1 59.
,, 4·215 ; ,, 1.67 ; 68 ; 69 ; 70 : 71 ; 72.

43. మారన. 4.232 ; మను. 1.63

44. ఈ క్రిందివానిని సరిపోల్చిచూచిన శబ్దసామ్యము కొంత కానగును.
మారన. 4.218 = మను 1.76 మారన. 5.31 = మను. 4.92

ఇట్లెన్నోవిధముల పెద్దనపై మారనప్రభావము పద్యరచనమునందును గల దని చెప్పవచ్చును. కాని, అల్లసాని పెద్దన పద్యశైలిలో మారనకంటె వేయిమడుంగుల యధికమైనవాఁడు. కావున నేను మొదట మనవి చేసికొని నట్లుగా నీయంశమున వీరిరువురి లక్ష్యములు భిన్నములు, సాధనలు భిన్నములు, సాధనములు భిన్నములు ; కాని, వీరిరువురికి వస్తు వొక్కటి యైనది. మూలాతిరిక్తములైన కల్పన లిరువురును స్వశక్త్యానుసారముగాఁ జేసినారు ఇరువురును శిల్పదృష్టియు, రసదృష్టియుఁ గలవారు కావున వస్తునాయకరసశిల్పాదులందువలె పద్యరచనాశిల్పమునందును మారననుండి పెద్దన కొన్ని గుణములు గ్రహించియుండె ననుటలో విప్రతిపత్తియుండదు. కొన్నియెడల మారన ప్రకటించినశిల్పములకును, పెద్దనపోయినపోకడలకును కవిత్రయాదిమహాకవుల రచనలయందు మూలములు కనఁబడుచుండును ; కావున మహాకవుల మార్గములం దిట్టి సామ్యములు కనవచ్చుట సహజము. వా రొకరి ననుసరించి రనిగాని, అనుకరించి రనిగాని, అనువదించి రనిగాని, సంస్కరించి రనిగాని మనము పేర్కొనునప్పుడు వారిపట్ల ఎట్టి లఘ్వలఘుభావములను బ్రకటించుచున్నట్లు కాదు. కవితాశిల్పఘంటాపథమున వారు వైచిన పదముద్రలను బోల్చికొని వానిరేఖావిన్యాసములను పరిశీలించి యవ్యక్తానంద విశేషము ననుభవించుటయే పరిశోధన ఫలితము. కావున మారనమహాకవి నడచిన బాటలోని పదచిహ్నములను పెద్దన చూచెను. వీలైనచోట్ల ఆపదములపై తనపదములనుంచి యడుగు వైచెను. ప్రధానముగాఁ దనత్రోవన తానే నడచెను; ఎట్లు నడచినను, పెద్దన యొకరికిఁ ద్రోవఁ జూపింపఁగల పెద్దయే కాని యొకరి యడుగుజాడలలోఁబడి యిడుమలఁ బాలగు బడుగుమాత్రము కాఁడు ;

**ఉపసంహారము :**

ఆంధ్రకవితాపితామహుఁడు ప్రథమాంధ్రప్రబంధమును చతురవచోనైపుణ్యము నెరపి రసోదంచితముగా నిర్మించెను. అతని రచనకు సంస్కృతాంధ్రోభయ మార్కండేయ పురాణము లెంతయో యుపకరించినవి. వస్తుపాత్రరసనిర్వహణమునందు సంస్కృతము నందలి మేలిమిని, తెలుగుపురాణమునందలి నిగ్గును దీసికొని పెద్దన తన ప్రబంధమున నౌచిత్యపోషకముగా ననుసంధించి వివేకము ప్రకటించెను. అంతటితో నాగక యమూల

---

| | | | |
|---|---|---|---|
| మారన. 4.220 | = మను. 1.75 | మారన. 5.38 | = మను, 5 6 |
| ,, 4.219 | = ,, 1.77 | ,, 5.47 | = ,, 5.28,29 |
| ,, 4.238 | = ,, 2 49 | ,, 5.56 | = ,, 6.17 |
| ,, 5.26 | = ,, 4.77 | ,, 5.57 | = ,, 6.19 |
| ,, 5.93 | = ,, 6.97 | ,, 5 86 | = ,, 6.84 |
| ,, 5.32 | = ,, 4.93 | అవ. 25 | = ,, 1.79 |

45. మారన. 4.252-253 = మను. 2 74-76.
మారన. 4.254 = మను. 2.77

క్రములైన పెక్కుకల్పనములు, వర్ణనములు చేసి, స్వీయప్రతిభావ్యుత్పత్తులను బ్రదర్శించెను. మార్కండేయపురాణోక్తవిధమునఁ గావ్యజీవితమును నిర్వహించి, దాని కొక విపులరసాకృతి నందగించి, సాహిత్యరంగమున నొకయుజ్జ్వలస్థానము కల్పించి శాశ్వత కీర్తి నార్జించెను.

స్వారోచిషమనువృత్తాంతకథను సంస్కృతాంధ్రపురాణప్రబంధములుగా నిర్వహించినకవులు మువ్వురును చిరస్మరణీయులే. సంస్కృతపురాణకర్త రచించిన స్వారోచిషమనుచరిత్రము చదువుచున్నప్పుడు ప్రశాంతగంభీరసరోవరమున నిర్వాతనిర్మలరాకానిశియందు యానపాత్రముపైఁ బయనించినట్లును, ఆంధ్రపురాణకర్తరచనము పఠించునప్పుడు మందమలయానిలప్రేరితములైన తరంగపుంజములమధ్య నూయలవలె నోలలాడుచు బయనించుచున్నట్లును, ఆంధ్రప్రబంధకర్తరచనము చదువుచున్నప్పుడా సరోవరతలము నప్పుడప్పుడు స్పృశించుచు నాతిదూరముగా వాయువిహార మొనర్చు విహంగముపైఁ బయనించుచున్నట్లును తోచును. ఒకరిది సహజనిర్మలగీర్వాణవాగ్విభూతి వెల్లివిరిసినరచన ! మఱియొకరిది ఆంధ్రవచశ్శ్రీ పెంపు విలసిల్లిన శిల్పరచన ! మూఁడవవారిది చతురవచోవిలాసాలంకారగంభీరచన ! గీర్వాణపురాణకథాస్రవంతినిఁ దెలుఁగునేల కవతరింపఁజేసిన భగీరథకల్పుఁడు మారన ! దానిని ద్వీపవతిగాఁ దీర్చిదిద్ది యాంధ్రప్రబంధమండలి సస్యశ్యామల మగునట్లు చేసిన పుణ్యమూర్తి పెద్దన !

# కువలయాశ్వ చరిత్రము

పదునేడవశతాబ్దితొలియుషస్సులలో సవరము చిననారాయణకవి కువలయాశ్వ చరిత్ర మను పేర నొకప్రబంధము రచించెను. ఋతధ్వజుఁ డనురాజు కువలయాశ్వుఁ డను పేరఁ గీర్తిఁగాంచి పరమపతివ్రత యైన మదాలసకు భర్త యై, అలర్కునివంటి జ్ఞానయోగికిఁ దండ్రి యై తరించిన మహనీయగాథ మార్కండేయమహాపురాణమునఁ బ్రసిద్ధిచెందియున్నది. దానినుండి యీకవి మదాలసావివాహపర్యంతము గల కథను గ్రహించి ప్రబంధముగా వినిర్మించెను.

సవరము చిననారాయణ సూర్యవంశసంజాతుఁ డైన క్షత్రియుఁడు, కాశ్యపగోత్రుఁడు. ఇతఁడు మదనగోపాలకటాక్షవీక్షణసమాసాదితసకలకవితావైభవుఁ డనియు, శఠగోప తాపసేంద్రచరణారవిందసంచలన్మానసమిళిందుఁ డనియు, సంతతభారతభాగవతాది శ్రవణానందుఁ డనియు, గామినీమనోహరరూపరేఖావిజితచైత్రుఁ డనియు, జాతివార్తాకవి జనామోదసంధాయకుఁ డనియు నీకావ్యమందలి యాశ్వాసాంతగద్యలవలనఁ దెలియు చున్నది. ఇతఁ డీకావ్యమును తనపెంపుడుతండ్రి యైన నారాయణభూపాలున కంకిత మిచ్చెను.

ఈకవి తనకావ్యావతారికలో కువలయాశ్వచరిత్రము బహువిధకథావిచిత్ర మనియు, సరసజనసేవ్య మనియుఁ బేర్కొనియుండెను. ఈలక్షణములు పురాణకథకుఁ గూడ సమముగా వర్తించును. బహువిధము లైన పాత్రలు, వానిచిత్తవృత్తులు, చిత్ర విచిత్రము లైన సన్నివేశములు, రసభావసమంచితము లైన కథార్థములు, ఈకథయందు నైజము లై యొప్పుచున్నవి. నరగంధర్వోరగమనుజదేవజాతులకుఁ జెందిన పాత్ర లిం దుండుటచేఁ బ్రకృతివైవిధ్య మేర్పడినది. భూతలరసాతలకైలాసాదిలోకములందు సన్నివేశములు కల్పింపఁబడుటచేతను, దనుజమాయ, దైవమహిమ, స్నేహఫలము, అతిలోకాశ్వశక్తి మొదలగునద్భుతాంశము లిందుఁ జేర్పఁబడియుండుటచేతను హృదయా హ్లాదకరము లైన విచిత్రకథాసన్నివేశము లిందు వెలసినవి. వీరశృంగారాద్భుతకరుణ రౌద్రాదిరసము లిందు పోషింపఁబడినవి. కావున రసికుల కానందదాయక మగుచున్నది.

పురాణములందు కువలయాశ్వచరిత్ర జడోపాఖ్యానాంతర్గత మైన యొకకథ. అది సంస్కృతపురాణమున నైదధ్యాయములందు 380 శ్లోకములలో రచింపఁబడియుండ మారన 185 గద్యపద్యములలో నాంధ్రీకరించెను. దానిని చిననారాయణకవి గైకొని ద్రాదాపు 700 గద్యపద్యములుగల యైదాశ్వాసములప్రబంధముగా నిర్మించెను. మూలము

కంటె దాదాపు నాలుగురెట్లు పెంచి రచించిన యీప్రబంధమునఁ గవి కథయందేకాక కల్పనలయందును, వర్ణనలయందును విస్తృతి సాధించెను.

కావ్యకథారంభపద్యము పురాణమూలమును సూచించుచున్నది :

సవరము చిననారాయణకవి కువలయాశ్వచరిత్రమును మార్కండేయపురాణము నుండి గైకొనెను. కాని, యీవిషయమును గంఠోక్తిగాఁ దనకావ్యమునఁ జెప్పకొనలేదు. దానికిఁ గారణ మూహించుట సులభము. కువలయాశ్వచరిత్రము ప్రసిద్ధము కావున నది మార్కండేయపురాణమున నున్న దని ప్రత్యేకించి చెప్ప నవసరములేదు. దానికితోడుగా నీకావ్యకర్త యల్లసాని పెద్దనవలె మార్కండేయపురాణోక్తప్రకారము కథ చెప్పవలె నని యెట్టినియమము పెట్టుకొనలేదు. బహువిధకథావిస్తరముగాఁ గావ్యము నిర్మించుట యితని లక్ష్యము. ఆలక్ష్యమును సాధించుటకై మూలకథ నితఁడు పెక్కువిధములుగా మార్చెను. క్రొత్తకల్పన లెన్నింటినో యందుఁ జేర్చెను. కావ్యవస్తువును మిశ్రముగాఁ దీర్చిదిద్దెను. ప్రఖ్యాతమిశ్రేతివృత్తములకు మూలమును జెప్పకొనకుండుపరిపాటి కొన్నిప్రాచీనకావ్యము లందును గానవచ్చుచున్నది.

కవి కావ్యకథామూలమును గంఠోక్తిగాఁ జెప్పకున్నను అంతర్నిదర్శనములను బట్టి మన మూహింప వీలగుచున్నది. మార్కండేయపురాణాంతర్గతమైన కువలయాశ్వ చరిత్రము ధర్మపక్షులు జైమినిమునికిఁ జెప్పినది. చిననారాయణకావ్యమందును అవ్విహ గోత్తములే కథ చెప్పినట్లు చెప్పఁబడియున్నది.

ఉ. శ్రీమహితంబు భారతవిశేషకథావిధము న్విహంగమ
గ్రామణు లేర్పడం బలుకఁగా విని భావనిరూఢహర్షుఁడై
జైమిని యాఋతధ్వజునిచందము లందము లయ్యెఁ దెల్పర
య్యా! మఱి యాతఁడే కువలయాశ్వుఁ డనంగఁ బ్రసిద్ధిగాంచుటల్.

(కువ. 1.67)

ఇది కువలయాశ్వచరిత్రకావ్యకథారంభపద్యము. ఇందు గమనింపఁదగినయంశములు మూఁడు కలవు. 1. ధర్మపక్షులు జైమినికీకథ చెప్పెనని పురాణకథావక్తృప్రసక్తిఁ జేయుట. మూలమునం దిదియొక యుపాఖ్యానములోని యంతర్గాథ. దానిని జడుఁడు తండ్రికిఁ జెప్పెను. తజ్జడప్రోక్తమైనకథను పురాణప్రవక్తలైన ధర్మపక్షులు జైమినికిఁ జెప్పిరి. ఆవిధముగా మార్కండేయపురాణప్రోక్తమైనది. చిననారాయణవాక్యములను బట్టి యతఁడు గ్రహించినకథ మార్కండేయములోనిదే యని స్పష్టము. దీనిని ధ్రువ పఱచు మఱి రెండంశము లివి: 2. ఋతధ్వజుఁడు కువలయాశ్వుఁ డనుపేర నెట్లు ప్రసిద్ధిగాంచెనో వివరింపు మని యడుగుట. అట్లు కథ చెప్పుట మార్కండేయపురాణ ప్రసిద్ధి. దానిని నిపుణముగాఁ బ్రచ్ఛకునిచే నడిగించి చిననారాయణ తన కావ్యకథా తాత్పర్యమును సూచించెను. మూఁడవయంశము - పక్షులు భారతవిశేషకథావిధానము జైమినికిఁ జెప్పినతరువాత యాకథార్థములనుగూర్చి శ్రోత ప్రశ్నించె ననుట ఇది మార్కం

దేయపురాణమునఁ గువలయాశ్వచరిత్రము చెప్పఁబడినసందర్భమును సూటిగా సూచించుచున్నది. నిజమునకు కవి యీయంశమును జెప్పకపోయినను కావ్యకథకు లోపమేమియు లేదు. కాని, దనకావ్యకథామూలము లగు పురాణార్థలందుఁ బ్రకటించుచిత్తశుద్ధియే యతనిచే నట్లు వ్రాయించినది. 'సంతతభారతశ్రవణానంద' పారవశ్య మామాట లనిపించినది. కావున కువలయాశ్వచరిత్ర కథారంభపద్యమే యీకావ్యమునకు మార్కండేయపురాణము మూల మని స్పష్టపఱచుచున్నది.

ప్రబంధములోని ప్రధానకథాంశములు మార్కండేయపురాణోక్తము లైనవే :

నవరము చిననారాయణకవి విరచిత కువలయాశ్వప్రబంధ మపూర్వకల్పనావిశేష మహనీయ మైన దనియు, కల్పనాశక్తియం దీతఁడు కళాపూర్ణోదయకర్తనే యతిశయింపఁ గలిగెననియు పలువురువిమర్శకులు ప్రశంసించిరి. కాని,యందులోఁ గొంత యతిశయోక్తికల దనుట నిజము ! పింగళి సూరన కల్పితగాథను నిర్మించి యపూర్వప్రతిభ బ్రకటించెను. చిననారాయణ మిశ్రేతివృత్తమునఁ దన కల్పనాశిల్పమును వెలార్చెను. ఇందు సూరన మార్గము సమగ్రకల్పనామహనీయ మనుట నిర్వివాదాంశము ! అంతేకాక సూరనకల్పన లౌత్యమునకు గీటురాళ్లు ! చిననారాయణకల్పన లన్నియు నుదాత్తము లని చెప్పలేము, కావున నితఁడు సూరనవలె నుత్తమ శిల్పి కాడు.

కువలయాశ్వచరిత్రకర్త నిర్మించిన కల్పనాశిల్పమందిరమంతయు మార్కండేయ పురాణకథయందు సహజసిద్ధములై యున్న పదిమూలస్తంభములపై నాధారపడియున్నది. పునాది పురాణకర్త వైచినది. భవననిర్మాణము ప్రబంధకర్త చేసినది.

చిననారాయణకవి గైకొనిన మూలకథాంశములు :

1. ఋతధ్వజుఁడు నాగకుమారులతోఁ జెలిమి యొనర్చుట.
2 పాతాళకేతుఁడు చేయు దుండగముల కోర్వఁజాలక గాలవమహర్షి క్రుద్ధుఁ డగుట. ఆకసమునుండి కువలయాశ్వము దిగివచ్చి మునిముందు వ్రాలుట.
3. ఆకాశవాణినిర్దేశానుసారము గాలవమహర్షి కువలయాశ్వమును ఋతధ్వజున కిచ్చి తనయాశ్రమమును రక్షింప వేడుట.
4. మదాలసావృత్తాంతము కుండలతోఁ జెప్పించుట.
5. ఋతధ్వజుఁడు రణమునఁ బాతాళకేతుని వధించుట; మదాలసను బరిగ్రహించుట.
6. తాళకేతుఁడు కపటమునివృత్తిని గైకొని ఋతధ్వజుని మోసగించుట
7. నాగకుమారులు ఋతధ్వజుని విరహబాధను తండ్రి కెరిగించుట.
8. అశ్వతరుఁడు శివునిదయవలన మదాలసను బుత్త్రికగాఁ బొందఁ గలుగుట.
9. నాగకుమారులు ఋతధ్వజుని నాగపట్టణమునకుఁ దెచ్చుట.
10. ఋతధ్వజున కశ్వతరుఁడు మదాలస నిచ్చుట.

కథ పంచసంధియుతమును, సుసంబద్ధమును నగుటకు మూలమున నీపదియంశము లెంతయో తోడ్పడుచున్నవి. చిననారాయణ వీనిలో దేనిని వదలలేదు. అందుచే మూల

కథకున్న సహజమైన పొంకము ప్రబంధమునఁ జెడలేదు. అనఁగా కువలయాశ్వచరిత్ర కావ్యమునం దుపయుక్తము లైన ప్రధానకథాసూత్రము లన్నియు పురాణకథనుండి గైకొనఁబడిన వనియే భావము. రసాదిదృష్టితో నీప్రబంధమునఁ జేయఁబడిన మార్పు చేర్పు లన్నియు మౌలికము లైన పురాణకథాంశముల కుపస్కారకము లనియే తాత్పర్యము:

### పురాణప్రబంధకథల స్వరూపస్వభావములందు భేదము కలదు :

మూలమునుండి ప్రధానకథాంశములను కవి గైకొనినను వాని కపూర్వకల్పనలు జోడించి ప్రబంధికథను నిర్మించియుండుటచే నాకృతియందును, స్వభావమునందును అది మూలకథకంటెఁ బెక్కువిధముల భిన్నమై భాసించుచున్నది. మూలకథలోని కొన్ని యంశములను గైకొనకుండుటజేతను, అంగభూతములైన యంశముల నత్యంతవిపుల మొనర్చుటచేతను, నూతనకల్పనల నధికముగాఁ జొప్పించుటచేతను, అంగాంగిరస పోషణము మూలానుగుణముగా నొనర్పక పోవుటచేతను, కథయొక్క స్వరూపస్వభావములు సామాన్యముగా మారుచుండును. సవరము చిననారాయణ లక్ష్యము పురాణకర్త దృష్టికంటె భిన్నమగుటచే కథ నతఁడు తనయిచ్చవచ్చినట్లు మార్చుకొని కావ్యము రచించినాఁడు.

మార్కండేయపురాణకథయందు ప్రధానప్రతిపాద్యవిషయ మలర్కునిజననము. దానికి హేతువైనదే మదాలసాకువలయాశ్వులదాంపత్యము. వారిపవిత్రజీవనసంస్కార పరిపాకము పుత్త్రునియందు బింబప్రతిబింబరూపమున భాసించె నని చెప్పుట యాకథా తాత్పర్యము. ఋతధ్వజుఁడు మిత్రక్షాత్రాశ్రమధర్మత్రయమునకు సంగమస్థానము. అతనితండ్రి యగు శత్రుజిత్తుని సవనకర్మాచరణదీక్షయు, తపోధనసంరక్షణదక్షతయు నతనియందుఁ బూర్ణఫలరూప మందినవి. మదాలస గంధర్వాంగన. 'అత్యనుపమరూప యౌవనమదాలసమానస' యయ్యుఁ బరమపతివ్రత. భర్తృమరణవార్త చెవులసోకి నంతనే పంచప్రాణము లొక్కపరి వీడిన పరమసాధ్వి. ఆమె మూర్తీభవించిన సతీ ధర్మము. ఈకథయందు మదాలస రాక్షసమాయవలన మోసపోయి విగతప్రాణ యైనది. ఆపైఁ గొంతకాలమునకు అశ్వతరునితపోదీక్షకుఫల మైన శివానుగ్రహమువలనఁ బునరుద్భవించినది. ఆమె జాతిస్మరయు, పరమయోగినియు, యోగిమాతయు నగున ట్లశ్వతరుఁడు శివునివలన వరములు వడసెను. పితృప్రీతిగా శ్రాద్ధమునం దుంచఁబడిన మధ్యమ పిండమును భుజించి మదాలసాజననధ్యానపరుఁడై యతఁడు మదాలసను తనమధ్యమ ఫణమున సృజించెను. స్వభావతః పూర్వజన్మమున సతీధర్మమూర్తియై యున్న మదాలస పునర్జన్మమున ధర్మకర్మదీప్తితో పాటు జ్ఞానదీప్తినిగూడ పొందఁగలిగినది. ఆమె మఱల కువలయాశ్వునిఁ బొందినది. మదాలసాకువలయాశ్వుల ప్రథమసమాగమము స్త్రీపురుష విశిష్టధర్మసమావేశము. వారి పునస్సమాగమము ధర్మకర్మజ్ఞానములసంపుటీకరణము. కథలోఁ బ్రథమసమావేశమునకుఁ బుత్త్రప్రాప్తి లేదు. పునస్సమాగమానంతరము వారికి

నలుగురు పుత్త్రు లుదయించిరి. వారిలో ముగ్గురు మదాలసాప్రబోధమువలన యోగులును, జ్ఞానులును నైరి. కడపటివాఁ డలర్కుఁడు. కువలయాశ్వుఁ డతనికిఁ గర్మమార్గ ముపదేశింపు మని భార్యను కోరెను. ఆమె యట్లే చేసెను. దానివలనఁ బరంపరాగతమును, కువలయాశ్వమనఃప్రతిబింబమును నైన ధర్మకర్మదీక్షానిరతి యలర్కునకు లభించినది. కర్మము జ్ఞానఫలము నొందనిచో మోక్షము సాధ్యము కాదు. కావున మదాలస జ్ఞానసందేశము నంగుళీప్రతిష్ఠిత మొనర్చి, పుత్త్రుని కిచ్చి భర్తతోఁ గలసి తపోవనమున కేగినది. కొంతకాలముతరువాత కాశీరా జలర్కునిపై దండెత్తి వచ్చెను. అతని నెదురించు శక్తి యలర్కునకు లేకపోయినది. నిర్వేదము జనించినది. మాతృసందేశము నాతఁడు పఠించినాఁడు అతనికి వివేకము జనించినది. దత్తాత్రేయు నాశ్రయించి బోధ నందినాఁడు. అతనికి దివ్యజ్ఞానము స్ఫురించినది. అలర్కునియందు ధర్మకర్మదీక్షానిరతియు, జ్ఞానతృష్ణయుఁ బరిపక్వము చెందు జీవసంస్కారము తండ్రివలనను, తల్లివలనను సిద్ధించిన దని చెప్పుటయే పురాణ తాత్పర్యము :

నవరము చిననారాయణ కువలయాశ్వచరిత్రము నీదృష్టితో నిర్మింపలేదు. మదాలసాకువలయాశ్వుల వివాహమే యితనికావ్యకథానిర్వహణము. ఋతధ్వజుఁడు కువలయాశ్వుఁ డెట్లయ్యెనో నిరూపించుట కథాప్రయోజనము. ఋతధ్వజునకు గాలవమహర్షి కువలయ మను పేరు గలిగిన సూర్యదత్త మగు నొకయశ్వము నిచ్చి పాతాళకేతువును సంహరింపు మని వేడెను. అతఁ డాయశ్వము నెక్కి గాలవాశ్రమమున కేఁగి పాతాళకేతువును యుద్ధమున సంహరించెను. దానితోఁ గువలయాశ్వప్రదానమువలన జరుగవలసిన ప్రధానప్రయోజనము సమకూరినది. ఋతధ్వజునకుఁ గువలయాశ్వుఁ డను ప్రసిద్ధి వచ్చినది. కాని, పాతాళకేతుసంహారముతోపాటు మదాలసాప్రణయమును, దాళకేతుని తోడి విరోధమును గువలయాశ్వునకు సంప్రాప్త మైనవి. తాళకేతుఁ డాసురీమాయచే నతనిని మోసగించి, మదాలసను హరించెను. అతఁడు విషాదఖిన్నుఁ డయ్యెను. నాగకుమారుల ప్రేరణచే నశ్వతరుఁడు శివునిఁ దనగానపాండిత్యమున మెప్పించి మదాలసను సాధించెను. అతఁడు కువలయాశ్వున కామె నిచ్చి వివాహము చేసెను. కావున కువలయాశ్వప్రదానమువలనఁ గలిగిన కార్యారంభము వివాహముచేఁ బరిసమాప్తి యగునట్లు చిననారాయణకవి కథాసంవిధానమును రూపొందించుకొనినట్లు స్పష్టమగుచున్నది.

పైపురాణప్రబంధకవుల కథావిధానములను బరిశీలించినచో నీక్రిందిఫలితాంశము లేర్పడుచున్నవి :

1. పురాణమునఁ గువలయాశ్వచరిత్ర మలర్కోపాఖ్యానమునకుఁ బూర్వరంగము. అది యలర్కజన్మప్రదాననిర్వహణముచే సార్థకమగుచున్నది. ప్రబంధమున కువలయాశ్వచరిత్రము స్వయంసంపూర్ణమైన స్వతంత్రకథ. ఇది కథాబీజనిర్వహణముచే సార్థక మగుచున్నది.

2. పురాణకథానిర్మాణతాత్పర్యమును ప్రబంధకర్త గ్రహింపలేదు. దానివలన

మూలకథార్థము లన్నియు నిందు గైకొనఁబడలేదు. వానిస్థానమునందు నూతనకల్పనలు చేర్పఁ బడినవి. దానితో కథాస్వరూపస్వభావములు మారినవి.

### చిననారాయణ చేసిన కల్పనలన్నియు సార్థకములును, సారవంతములు నని చెప్పఁజాలము :

మిశ్రవస్తువునందు నూత్నకల్పనలను కడుజాగరూకతతో నిర్వహింప వలెను. మూలమునందు కొన్నిసన్నివేశము లుండును. వాని నాకవి యొకప్రయోజనమున కనువుగా ననుసంధించియుండును. వానిలో నేవైన ననౌచిత్యములు దొరలినచోఁ తరువాత నాకథను జేపట్టు మఱియొకకవి వానిని సవరించి నూత్నకల్పనలు చేసి వస్తువును సర్వాంగసుందరముగా నొనర్పవచ్చును. అట్లుకాక మూలమునందలికల్పనలు నిర్దుష్టములై యుండగాఁ దరువాతికవి తాను ప్రత్యేకము లగు కొన్నికారణములచేత కథను మఱియొక విధముగాఁ జిత్రింప నెంచి వాని నానూత్నకథావిధానమునఁ దన కనుకూలముగా నుపయోగింపఁ దలఁచుకొనినచో మఱియు నధిక మైన శ్రద్ధతీసికొని వానిని దగుమార్పులతో సార్థకముగఁ గల్పింపవలసి యుండును. అట్లుచేయనిచోఁ గల్పనలు నిరర్థకము లగును. చిననారాయణకావ్యమున నిట్లు సార్థక్యమును గోల్పోయిన కల్పనలు కొన్ని కలవు.

### 1. ప్రబంధమున కువలయాశ్వకల్పనము నిష్ప్రయోజనము :

కువలయాశ్వచరిత్రమున కువలయాశ్వమున కధికప్రాముఖ్యము కలదు. పురాణమునందు తత్కల్పనము సార్థకముగాఁ జేయఁబడినది; సామర్థ్యముతో నిర్వహింపఁబడినది. గాలవుఁడను ముని మౌనవ్రతపరుఁడై తప మాచరించుచుండెను. పాతాళకేతుఁ డను దనుజుఁ డాతనియాశ్రమమునఁ బ్రవేశించి సింహసింధురశార్దూలాది వనచరాకారములు ధరించి, యతని మనస్సమాధిని భగ్న మొనర్చుచుండెను. ముని స్వీయకోపానలమున దానవుని భస్మ మొనరింప సమర్థుఁడయ్యు, దపోవ్యయమున కోర్వక దుఃఖితుఁడై నభము వైపుచూచి నిట్టూర్పు నిగుడించెను. అవు డంబరమునుండి దిగి యొకయశ్వరాజ మాతని యెదుట నిలువఁబడెను. ఆవెంటనే యశరీరవాణి యిట్లని మ్రోసెను.

చ. రవి యొసఁగె న్మునీశ్వర ! తురంగము నీ కిది సత్త్వసంపద
న్గువలయ మెల్ల వ్రేల్మిడిన గ్రుమ్మరు నీకులఁ బర్వతంబుల
న్దివి నతలంబున న్సకలదిక్కులఁ జెక్కుసెమర్ప కెందునుం
దపు లొకయింత లేక సతతంబుఁ జరించు సముల్లసద్గతిన్. (మారన. 2.280)

ఇందు కువలయాఖ్యాశ్వముయొక్క కువలయసంచారసామర్థ్యము కీర్తింపఁబడినది. ఇంతటి మహిమగల యశ్వ మెందులకుఁ గల్పింపఁబడినది ? గాలవుఁడు వ్రతదీక్షాపరుఁడు. అతఁ డాశ్రమపదమునుండి కదలఁడు. పాతాళకేతుఁ డాసురీమాయచే నున్నచోట ఉండక యెత్తినరూప మెత్తక సంచరించుమాయావి. అతనిని దపోవ్యయము చేయక ముని చంపవలె నని సంకల్పించెను. నభమువంక చూచెను. కర్మసాక్షికి జడదారిపై

జాలి కలిగినది. మహనీయశక్తిసమన్వితమైన యశ్వము నాతఁడు సృష్టించెను. దానిని ఋతధ్వజున కిమ్మని యాదేశించెను. దాని నధిరోహించినవాఁడు భూతలరసాతలాది సర్వలోకములందు జలగిరిభేదములేక నిరాఘాటముగా ననాయాసముగా సంచరింపఁ గలడు. అతిలోకవీరుఁడైన ఋతధ్వజున కిట్టి గమనశక్తిగల యశ్వము లభించినచో నతని కెదురునిలుచు దానవుఁ డెవ్వఁడు నుండఁడు. అతఁడు భువన రక్షాదక్షుఁడై వెలయఁగలఁడు. దానివలన నమరమునిలోకములు నిష్కంటకము లగును. ఇట్లాసురీ శక్తిని దీకొనుట కేర్పడిన యశ్వశక్తి కథలో రెండుసందర్భములందు ప్రయోజనసిద్ధి వడసినది. వరాహరూపధారియై గాలవాశ్రమమునఁ బ్రవేశించిన దనుజుని వెన్నంటి సహస్రయోజనము లతిరయమునఁ గువలయాశ్వుఁ డాయశ్వసహాయమున వెడలఁగలిగెను. తిమిరపటలపరివృతమైన భూవివరమున నావరాహము పాతాళమునకుఁ దిగఁబడిపోగా దానివెంట నతఁడును అశ్వశక్తిచే నరుగఁగలిగెను మదాలసను వివాహమాడి సువర్ణ నగరమునుండి భూవివరము ద్వారమున వచ్చుసమయమున రాక్షసుఁ డెదుర్కొనెను. ఆయుద్ధమునఁ దురగ మతని కండదండ యైనది. ఆతరువాత కువలయాశ్వుఁడు తండ్రి యాజ్ఞచొప్పున నాయశ్వము నధిరోహించి నిత్యము పూర్వాహ్ణములందు లోకసంచార మొనర్చుచు మునిగణతపోరక్షణ మొనర్చుచుండెను. అట్టిదినచర్యయే తాళకేతుఁడు కపటమునివృత్తి గైకొని యతనిని మోసగించుటకు మంచియవకాశము నేర్పఱచినది చివరకు నాగలోకమునుండి మదాలసాసమేతుఁడై భూలోకమునకుఁ జేరుట కాయశ్వము తోడుపడినది. ఇట్లు పురాణకథలో నశ్వమున కున్న పాతాళలోకగమనశక్తియు, గువలయసంచారశక్తియు సద్వినియోగపఱుపఁబడినవి. కావున నశ్వసామర్థ్యకల్పనము సార్థకమైనది.

ఈప్రబంధమున నశ్వకల్పనమున కట్టి సార్థక్యము కలుగలేదు. దానికిఁ బెక్కు కారణము లున్నవి. మొట్టమొదటియు, ముఖ్యమైనదియునైన కారణము చిననారాయణకవి పౌరాణికకథాకల్పనలసార్థక్యము గుర్తింపఁజాలకపోవుట - లేదా - గుర్తించియు వానిని లక్ష్యముచేయకపోవుట. ఇం దేదియైనను విజ్ఞులమన్ననల నందుకొనఁజాలదు. రెండవ కారణము : పాతాళకేతుని నివాసము పాతాళమునుండి భూతలమునకుఁ దరలించి, క్రూరుడును, హింసాప్రవృత్తుఁడును, మాయావియు నైన యొకభూనాయకునిగా నతనినిఁ జిత్రింప యత్నించుట. దానివలన నీకథలో దనుజునికే పాతాళప్రవేశావసరము లేకపోయినది: దానితో కువలయాశ్వమున కున్నపాతాళలోకగమన శక్తి నిరుపయోగమైనది. గాలవ మహర్షి పాతాళకేతుని యాసురమాయలకు క్రుద్ధుఁడయ్యు తపోవ్యయ మొనర్పక శక్తి యుక్తుఁ డగు కువలయాశ్వుని నాతనిని సంహరింప నిర్దేశించెను. ఆతఁడు స్వీయభుజబల పరాక్రమములచేతనే దానవుని సంహరించెను. ఇం దశ్వముయొక్క యత్యంతావసరము రాజునకు కలుగనే కలుగ లేదు. ఇట్టిపరిస్థితులలో నశ్వకల్పనము నిరర్థకము. కాని, చిననారాయణకవి యశ్వకల్పన మొనర్చెను. అది యాకాశమునుండి దిగినప్పుడు దానిమొగమున కొకపత్రిక కట్టబడియున్న దనియు, దానినిఁ జదువగా నత్తురగము

సూర్యునిచే నంపఁబడిన దనియు, 'భూవలయసీమఁ దిరంబునం జుట్టివచ్చుఁ గావున'' దానికి కువలయాఖ్య కలిగె నని తెలిసెననియు వర్ణించెను. ప్రబంధమునం దశ్వమున కసాధారణశక్తులు లేవు. ఉన్నది జవశక్తి యొక్కటియే. అదియుఁ కథయందు సార్థకముగా నిర్వహింపఁబడలేదు. గాలవుఁడు ఋతధ్వజున కశ్వము నిచ్చి యాశ్రమ సంరక్షణము సేయ నర్థించెను. రాజు మునివెంట బయలుదేరలేదు సరికదా! ఒకరాత్రి నగరమున విశ్రమించి, మరునాఁడు సూర్యోదయమునఁ గాని యశ్వ మెక్కి కదలలేదు. అది యట్లుండ నశ్వవేగప్రభావమున క్షణకాలములో నాతఁ డాఋష్యాశ్రమమునకు వెళ్ళినట్లు కవి వర్ణించెను. అట్లు వెడలి సాధించిన ప్రత్యేకప్రయోజనముకూడ కానరాదు; గుడారములు పైచుకొని యొకరాత్రి నిద్రించెను. కనీసము మరునాఁడు యుద్ధమందైనను ఆవాజినైపుణ్య మిసుమంత బయలుపడునేమో యనుకొననదియును కానరాదు. అంతఃపురమున నున్న మదాలస మాయమై పోయినప్పుడు మనసున రాయిపడి రాజంతః పురమున మూగనోము పట్టి కూర్చుండక కువలయాశ్వము నెక్కి కువలయమంతయు గాలింపవచ్చును కదా! అట్లు జరుగలేదు. అద్భుతజవశక్తి గల యశ్వ మొక్కటి తన కున్నట్లు రాజునకు గుర్తు లేదు. కవి కంతకుపూర్వమే స్మృతిలేదు. ప్రభాకరుని ప్రభావమునఁ బ్రభవించిన యాకువలయాఖ్యాశ్వప్రభావము ప్రకాశించుట కవకాశ మీయక అది యంధకారమున నణగారిపోఁ జేసినాఁడు. ప్రబంధమునందలి యశ్వము జాత్యశ్వము కాని దివ్యాశ్వము కాదు. దానికి కువలయాఖ్యబిరుదము భారము; దానివలననే ఋతధ్వజునకు కువలయాశ్వనామము వచ్చెనన్నచో మనకుఁ గలుగునది విచారము! కథాప్రయోజనసిద్ధి కాయువువంటి కల్పనయే యిట్లు నిస్సారమై యుండ నిఁక యేకల్పనములు రూఢిగా రాణింపఁగలవు?

2. పాతాళకేతుని భూతలనివాసకల్పనము నిర్దుష్టము కాదు :

కువలయాశ్వచరిత్రమునఁ బాతాళకేతుఁడు కీలకమైన పాత్ర నిర్వహించెను. అతఁడు లేనిదే కథ లేదు. నిజమునకు అతఁడు రాక్షసుఁ డనియు, రసాతలవాసి యనియు, ఆసురీమాయావిశారదుఁ డనియు మార్కండేయపురాణము చెప్పుచున్నది. సవరము చిననారాయణ పాతాళకేతుని రసాతల నివాసిగాఁ గాక భూతలమున నొక దుర్గాధిపతిగాఁ గల్పించెను. కాని, యతనిరాక్షసత్వమును, మాయావిశారదత్వమును అట్లే యుంచెను. ఈ కల్పన మంత సుసంబద్ధముగా లేదు. అసలు మూలకల్పనము మార్చుటకు కథలో నెట్టి యవసరమును లేదు. పైగా మార్చుటవలనఁ గొన్ని యనౌచిత్యము లేర్పడు చున్నవి. వానిలో మొదటిది పాతాళకేతుని యాసురీమహిమ దీప్తిమంతము కాకపోవుట. ఈకవికల్పన ననుసరించి యయ్యాతుధానుఁడు "అంబుధరవ్రాతారవనీతాహవభీతానవధానసకలబృందారకుఁడఁట!.'' కువలయాశ్వుఁ డద్దనుజనగరము చూడనేగినప్పుడు రక్కసుల కూడిగములుసేయు దేవగణములు కనవచ్చిరఁట! (కువ. 3.20) ఇంతటి బలాఢ్యుఁడు ఋతధ్వజునిరాజ్యపు పొలిమేరలమీఁద నుండగా

క. చకచకితనఖరముకుర
ప్రకరముఖచ్ఛాయఁ దొంటిభంగి గనుటనో
వికట మహిపాళి తత్పద
నికటంబున వ్రాలి లేవనేరకయుండున్. (కువ. 1.90)

అనువర్ణన మాతనియం దెట్లు సార్థకమగును? అది యట్లుండఁ బాతాళకేతుఁడు కామరూపాదిరాక్షసమాయలు గాలవమహర్షియాశ్రమమునఁ బ్రదర్శించెనే కాని కువలయాశ్వుని యెదుట నావంతయుఁ జూపింపలేదు. అతనిరాయబారి కువలయాశ్వుని స్కంధావారమున మాయాజాలమును బ్రకటించెను. కాని, తత్కల్పనమువలన సిద్ధించిన ప్రయోజనము శూన్యము. కువలయాశ్వుఁడు గాలవాశ్రమమునఁ బ్రవేశించిన సమయమున గాలవుఁ డాతనిని వంశగౌరవము నిల్పితి వని బహూకరించెను.

చ "అనుచు బహూకరించు సమయంబున నూరకయుండి యుండి యం
జనరుచిపుంజమంజిమకచగ్రహమైన తమంబు పర్వె తో
డన హరిచందనప్రతిభటం బగు వెన్నెల దోఁచె వెంటనే
కనఁబడియె న్నిరస్తకనకస్తబకస్తుతులైన యెండలున్

క. అది చూచి మేదినీవర
భిదురీమృదురీతిగా దభేద్యము గంటే
యిదిసుమ్ము దనుజశాంబరి
గదిసె న్బరిపూర్తి దీని ఖండింపు మికన్ (కువ. 2. 74 - 75)

అని గాలవుఁడు నిర్దేశింపఁగాఁ గువలయాశ్వుఁ డాశాంబరి నేమియు చేయఁడు. అతఁ డొక మంత్రాస్త్రమును బ్రయోగించి దనుజశాంబరి నుపసంహరింపఁ జేసి తనసామర్థ్యమును రక్కసున కెఱుకఁబఱచునేమో యని పఠిత యుత్సాహపడును. కాని, హతాశుఁ డగును. అది యట్లుండె. అనవసరమైన సమయములం దంతగాఁ బ్రయోగింపఁబడిన శాంబరీశక్తి రణరంగమున నొక్కసారి యైనను బ్రత్యక్షము కాదు. శాంబరీవిద్యతో ఘటోత్కచుఁడు కౌరవసైన్యమును మట్టుపెట్టినట్లు పాతాళకేతువు యుద్ధమున విజృంభించునేమో యని యుత్కంఠవహించుపఠిత మఱల హతాశుఁ డగును. చేసినకల్పనకు సార్థక్యము కల్పింపఁ జాలకపోయినచో నట్టిదానినిఁ జేయకుండుట మేలు!

కువలయాశ్వపాతాళకేతులయుద్ధమునఁ బౌరాణికవాతావరణమును ప్రబంధమున కవి పాటింపఁజాలకపోయెను: పురాణమున నీయుద్ధవర్ణన మతిసహజముగను, రసవంతముగను జేయఁబడియున్నది మచ్చునకు "దైతేయప్రవిముక్తదారుణగదాదండాళి ......" (మారన. 2. 336) యను పద్యమును గైకొనుఁడు. పలువు రొక్కమ్మడి యొకపేరునిఁ జుట్టుముట్టి సల్పెడు సంకులసమర మిది. ఇందు రక్కసు లుపయోగించు నాయుధవ్రాతము పురాణప్రసిద్ధములైనవే. వానిలో కరవాలాదులను గైకొని వర్ణించుటతో

పాటు చిననారాయణ తనకాలమున వెలసియున్న ఫిరంగులను, తుపాకులను సైత మా యుద్ధమునఁ బ్రవేశపెట్టి తనమోజు తీర్చుకొనినాఁడు. (కువ.2.133;3.3;3.11) కావ్యలక్షణజ్ఞులు దీనిని దోషముగాఁ బరిగణించెదరు. ఇన్నియవకతవకలతోఁ గూడిన పాతాళకేతునిభూతలనివాసకల్పనము నిర్దుష్టము కాదనుటలో విప్రతిపత్తి లేదు. సహజవాతావరణకల్పనదృష్టితో కవి యిట్లు మార్చె నని భావించినను పాతాళకేతుఁడు పాతాళవాసి యగుట కంటె సహజ మేమి కలదు? ఈకల్పనకు బహుశః సమకాలీనవీరునిచరిత్ర యేదియో చిననారాయణచిత్తమునఁ బ్రేరణ యిచ్చియుండవచ్చును. అట్లు సరిపెట్టుకొన వలసినదే కాని యతనికల్పనను చిత్తశుద్ధితో మెచ్చుకొనఁజాలము!

3. ఋతధ్వజునియధికస్నేహప్రియత్వము నభివర్ణింపకుండుట మూలకథాశిల్పమర్మము నొకదానిని విస్మరించుటయే :

పురాణకర్తలు ఋతధ్వజుని స్నేహప్రవృత్తి నధికముగాఁ గీర్తించినారు. కథలో దాని కత్యంతసార్థక్యము కలదు. ఋతధ్వజునికి స్వభావసిద్ధ మైనది మైత్రీధర్మము. వంశపరంపరాగత మైనది క్షత్రియధర్మము. వయోవస్థానుగుణ మైనది గార్హస్థ్యాశ్రమధర్మము. ఇందు క్షత్రధర్మనిర్వహణపరాయణుఁ డయి యున్నప్పు డతనికిఁ బరమసాధ్వి యైన సతి లభించినది. మఱియు నిట్టి ధర్మనిర్వహణావసరమునందే యిల్లాలిని గోల్పోవుట తటస్థించినది. మృతురాలైన భార్యను బ్రతికించినది మైత్రీధర్మము. దానిచే ధర్మత్రయము రక్షింపఁబడినది. ఇట్టియుదాత్తధర్మమున కాలంబన మైన ఋతధ్వజుని యధికసఖ్యప్రియత్వమును మూలమున కవియు, నాగకుమారులును, అశ్వతరుఁడు నోరారఁ గీర్తించిరి. చిననారాయణ కృతప్రబంధమున నాయకుని యధికసఖ్యప్రియత్వమున కిచ్చిన పోషణ మత్యంతస్వల్పము. ఉపాఖ్యానములైన సంస్కృతాంధ్రపురాణకథలలోనే దాదాపు ముప్పదిశ్లోకములు, ఇరువదిపద్యము లాతని మైత్రీసంపత్తిని గీర్తించుటకు వినియోగింపఁ బడినవి. విపులమైన ఈప్రబంధమున నీయంశమును దెలుపుపద్యములు మొత్తము కలిపినను నైదుకంటె మించిలేవు. పుష్టిలేనిపాదమునుండి పెద్దఫలమును బలవంతమునఁ బండించినాఁడు చిననారాయణకవి!

## 4. మూలమునుండి గ్రహింపఁబడని మరికొన్నియంశములు :

ప్రబంధకర్త తన రచనాప్రణాళిక కనుకూలములు కాని కొన్నియంశములను మూలమునుండి గ్రహించుట మానివైచెను.

(1) కువలయాశ్వుని తల్లిదండ్రులపాత్రములను ప్రబంధకర్త తనకావ్యమునమున గ్రహింపలేదు. ఋతధ్వజుఁడు మూలమున తండ్రిచాటుబిడ్డ. ప్రబంధమున భూవలయాధిపతి. మూలమున లేని పరిణతిని, స్వతంత్రప్రతిపత్తిని నాయకునకుఁ గల్పించుటయే యీకల్పనయొక్క పరమప్రయోజనము. మూలమున ఋతధ్వజుఁడు మృతుఁ డయ్యెనని తాళకేతువు తెలిపినపు డా మాతాపితరులు వీరపుత్త్రుని గుణగణములను శ్లాఘించుచు

పరితపించిరి; ప్రబంధమున కువలయాశ్వమరణప్రవాదము వదలఁబడినది కావున నాపాత్రలయవసరమే లేకపోయినది.

(2) మూలమున నాగకుమారులు రసాతలమునుండి వెలువడి భూసురవేషధారులై వచ్చి ఋతధ్వజునితో గాఢమైనచెలిమి చేసి రనియు, పగలు రాజకుమారునితోఁ గాలము పుచ్చి రాత్రికి రసాతలమున కరుగుచుండి రనియుఁ జేర్కొనఁబడియుండ ప్రబంధకర్త యావివరము లన్నియుఁ జెప్పక వారు స్నేహాతిరేకాజహత్కేళీలోలత్వమువలన నుద్దీపించు ప్రేమముచేఁ నాతనిఁ గొల్చుచుండి రని సామాన్యముగాఁ జేర్కొనెను. ఈకవి భూతలరసాతలకైలాసాదిస్థలభేదముల నంతగాఁ బాటింపకుండుట యొక చమత్కారము. నాగకుమారులు రసాతలమునుండి వచ్చి రనుటయు, తాళకేతుని దూత యింద్రసభకు వెడలి వచ్చె నని చెప్పుటయు దీని కుదాహరణము.

నాగకుమారులు భూతలమునఁ జరించునపుడు విప్రకుమారరూపములఁ దాల్చి యుండి రని మూలము. ఈకవి యీరూపభేదమును జెప్పలేదు. బహుశః అహికులజులైన నాగకుమారులను నాగు లను జాతిలో జన్మించిన రాజకుమారులుగా భావించి యీకవి చిత్రించియుండవచ్చును. ఏమైనను మూలకల్పనమును బరిపుష్టముగాఁ బోషింపకపోవుట లోప మనుట నిస్సంశయము.

(3) అశ్వతరుఁడు సరస్వతీదేవిని గూర్చి యొనర్చిన తపమును, ఈశ్వరస్తుతియు, కంబళుని పునరుజ్జీవనమును చిననారాయణ వదలివైచెను. మూలమున సప్తస్వరమధుర గీత విద్యావిశారదత్వము అశ్వతరునకుఁ దపస్సిద్ధము. ప్రబంధమున నది జన్మసిద్ధము. తుంబురాదులను వాసవునిసభలో జయించినగౌరవ మతని కున్నది. అట్లగుటచే సరస్వతీ దేవినిఁ గూర్చినతపస్సును గల్పించుట కీకావ్యమున నవసరము లేకపోయినది. శివుని కతఁడు చిరపరిచితుఁడును, ఆత్మీయుఁడు నగుటచే రజతాద్రిఁ జేరుటకును, గంగాపార్వతులతో జూదమాడుచున్న పరమేశ్వరుని దర్శించుటకును సౌలభ్య మేర్పడినది.

(4) మూలమున మదాలస పరమయోగిని యనియు, యోగిమాత యనియు, శివవర పునర్జన్మ యనియు వర్ణితయై యున్నది. ప్రబంధమున న్యాప్రసక్తి వదలఁబడినది. మూలమున మదాలస పునర్జన్మ యెత్తుట అలర్కునివంటి యుత్తమకర్మజ్ఞానయోగికి జన్మ మిచ్చుటకు. ప్రబంధమున నామె బ్రతికియుండుట కువలయాశ్వుని వివాహమాడుటకు. కథానిర్వహణమునుబట్టి యీకల్పనము కవి కవసరములేక వదలియుండవచ్చును. కాని మదాలసయొక్క కులసతీత్వముకంటె యోగిమాతృత్వమునకు లోకమున నధికప్రాశస్త్య మున్నది. అది యీకవిదృష్టి నాకర్షింపలేదు.

## 5 మదాలసామరణవృత్తాంతమును మార్చుటచేత నూత్నకథాకల్పన మవసరమైనది :

మార్కండేయపురాణకథయందు మదాలస మరణించి పునరుజ్జీవించినట్లు వర్ణింపఁబడినది. ఈయంశ మాకథలోని పెక్కుకథార్థములతో ముడివడియున్నది. నవరము

చిననారాయణకవి మదాలసామరణకల్పనమును మార్చివైచెను. తీగ కదిపిన డొంక కదలినట్లు మదాలసామరణమును మార్చునరికి కువలయాశ్వమరణప్రవాదము మార్చవలసి వచ్చినది. ఇచ్చట చిననారాయణకవి చావునకుమారుగాఁ బెండ్లిని ప్రవాదమునఁ గల్పించెను. అంత విపరీతకల్పనముకూడ నిర్వహణమున కనుకూల కథార్థముగా నిర్వహించుట యతనినేర్పు!

ప్రవాదము మారునరికి తాళకేతునిప్రణాళికయే మారిపోయినది. బ్రతికియున్న మదాలసను మోసగించి తెచ్చుట కొక విమానమును, దాచుటకు మేరుపర్వతాంతరమున నొకభూగర్భగృహమును గల్పింపవలసివచ్చినది. మూలమునందువలె మదాలసాకువలయాశ్వులవివాహము కథామధ్యమున జరిగినట్లికవి వర్ణింపకపోవుటచే వివాహపర్యంతము కుండల యామెవెంట నుండవలని వచ్చినది. అశ్వతరుఁడు పార్వతీదేవిని గోరిన వరములలో మదాలసతోపాటు కుండలనుగూడ దనుజునిబారినుండి విడిపింప నడుగవలసివచ్చినది. అచ్చట చిననారాయణకవి కల్పనాప్రతిభ యనంతముఖములఁ బ్రసరించినది. గంగాపార్వతీసంవాదము, జయంతనలకూబరవివాదము, మొదలైన యవాంతరకథాకల్పన లన్నియు నొక్క-కుండలావిమోచనము నాశ్రయించి వర్ధిల్లినవే. ఇట్లు ఉత్తరకథయందుఁ బ్రబంధకవి భావించిన నూత్నకల్పనల కన్నింటికిని మదాలసామరణవృత్తాంతము మార్చుటయే మూలకారణ మైనది. ఈమార్పువలన చిననారాయణకవి మూలమునందలి పౌరాణికప్రతీకాత్మకతకంటె ప్రాపంచికమును, ప్రాబంధికము నైన వాస్తవికత నధికముగా సాధించె నని స్పష్టమగుచున్నది. ఇది చిననారాయణకవి కల్పనాప్రతిభకుత్తమోదాహరణము!

6. మదాలసాచరిత్రమునఁ గల్పించిన మార్పులు రసానుకూలములు :

మూలమునుండి యీకవి మదాలసావృత్తాంతమును గుండల కువలయాశ్వునకుఁ జెప్పె నను కల్పనను మాత్రమే గైకొనెను. కాని, మిగిలిన కథార్థముల నన్నిటిని స్వీయకల్పనాశక్తితో మార్చి రచించెను. వీని నన్నిటిని శృంగారరసానుకూలములుగాఁ దీర్చిదిద్దుటయందు కవి కృతకృత్యుఁ డయ్యె నని చెప్పవచ్చును.

హరిణీవిశ్వావసులు గంధర్వపుణ్యదంపతులు. వారికిఁ బుత్త్రసంతానము కలదు కాని పుత్త్రికాప్రాప్తి కలుగ దయ్యెను. హరిణి కూతుకూనకొఱకు మ్రొక్కని జాయి లేదు; పట్టని వ్రతము లేదు. ఎట్టకేల కేదైవముదయవలననో యొకయాడునలుసు కలిగినది. అది పుట్టినతోడనే సద్యోయౌవనయు, జగదేకసుందరియు నైనది. విశ్వావసుఁ డక్కన్య యొక్క "అసమానవయోమదము నలసమానకలాదులం జెలఁగఁ జూచి మదాలస యనుపే" రిడెను (1.68); అతిగారాబమునఁ బెంచెను. తద్రూపకాంతివిశేషసంపదఁ గాంచిన సుపర్వదంపతులకు మనసునఁ గలకలు కలిగెడి వఁట! ఇట్టిమదాలస యొకసారి సఖీసమేత యై వసుంధరావిశేషదర్శనాపేక్షచే ధరపై డిగ్గి నందనముబోలు నొకవనమున

విహరించుచుండెను. కువలయాశ్వుఁడు సైన్యసమేతుఁడై యామార్గమున నప్పు డరుదెంచెను. అతనితనూవిలాసములఁ గాంచి యామె ముగ్ధురాలయి యాతనినే మనసార వలచెను. అది విరహముగఁ బరిణమించెను. దానికి వసంతము తోడయ్యెను. విరహబాధ దశాంతరములఁ గ్రమముగా దాటినది. మదాలస ప్రాణములు త్యజింప నుద్యమించినది. చెలులామెను వారించి వనవిహారములచేతను, సరససల్లాపములచేతను, పుష్పాపచయముచేతను, జలక్రీడలచేతను హృదయ మలరించిరి. మనోరథసిద్ధికై మన్మథారాధన మొనరింపఁజేసిరి. ఆమె మదనబాధాతిశయమున కోర్వఁజాలక మూర్ఛ నొందినది. చెలులామెను గుడారమునకుఁ జేర్చి శీతలోపచారము లొనర్చిరి. ఇంతలో శీతలకిరణుఁ డుదయించెను. ఆమెకు చంద్రకిరణము లత్యంతతాపము కల్గించినవి. ఆమె చంద్రు నుపాలంభించెను. మలయపవను నుపాలంభించెను. చివరకు సొమ్మసిల్లి పడిపోయెను. అంతలోఁ బాతాళకేతు వామెను గాంచి, మోహించి, హరింప నెంచి మాయాబలముతో నామెను సఖీసమేతముగా నిద్రలో ముంచి తనయంతఃపురమునకుఁ జేర్చెను. అతఁడామెను కరగ్రహణ మొనర్పఁ దలఁచెను. కాని, మరునాఁడే కువలయాశ్వునితో యుద్ధము వచ్చిపడెను. దురదృష్టవశమున నాతఁ డారణరంగమున మృతుఁ డయ్యెను. రాక్షసాంతఃపురమునం దున్న మదాలసకు కువలయాశ్వునివలనివిరహ మధికమయ్యెను. క్రమముగా కువలయాశ్వుఁడు తనకు దక్కఁడను ధైర్యము నామె కోల్పోవసాగెను. కుండల యామె నోదార్చుచుండెను. ఇంతలో నచ్చటకు కువలయాశ్వుఁ డరుదెంచెను. మదాలస లజ్జాతిశయమున లేచి తెరవెనుక కొదిగి నిలచెను. కుండల యామెకథయంతయుఁ జెప్పెను. రాజు సంతసించి యామెను దనకుఁ గూర్పుమని కుండలను వేడెను. విధి విధానముప్రకారము వివాహమాడి యామెను బొందుట ధర్మ మని సూచించెను. అతఁ డందుల కంగీకరించి వారిరువురను దనయశ్వముపై నుంచుకొని నిజనివాసమునకుఁ జేరెను. అతరువాత తాళకేతుని కాపట్యమువలనఁ గలిగినవియోగము నామెను బాధించినను చివర కామెకోర్కె ఫలవంత మై కథ మంగళాంత మయ్యెను.

పురాణమునందు పాతాళకేతునగరమున నుంచఁబడిన మదాలస రక్కసునిబారిఁ బడుట వలన ప్రాణములు తీసికొన యత్నించెను. కాని 'సురభి' యామె నాప్రయత్నము నుండి మాన్పి, పాతాళకేతుని భూతలమున నెదిరించి బాణముచే నొంపఁగలిగిన వీరుఁ డామెకు భర్త యగు నని తెల్పి యంతర్ధాన మయ్యెను. కువలయాశ్వునిఁ జూడక పూర్వమే ఆమెయం దాతనిపట్ల అనురాగ మంకురించినది. వినుకలి పైఁ గనుకలి కలిగించి రస మొప్పించినవాఁడు పురాణకర్త. కనుకలిపై వినుకలి కలిగించి మెప్పించినవాఁడు ప్రబంధకర్త; చిననారాయణకవి యొనర్చినమార్పు లన్నియు నిచ్చట సుసంబద్ధములును, విపులములును, ప్రాబంధికములును, లక్షణశాస్త్రలక్షితములును, అమోఘవిప్రలంభశృంగారపరిణామవిస్ఫురణములు నై రసవ్యంజకములుగా నున్నవి.

7. కుండలాచరిత్రమున కొనసర్చిన మార్పులకు తాళకేతుసంహారము పరమ ప్రయోజనము :

నవరము చిననారాయణకవి కుండలను మదాలస కనుంగుచెలిగా నొనర్చెను. కాని యామె వివాహిత యనియు, మృతభర్తృక యనియు, వయోధికయు నైనట్లు స్పష్ట పఱచవలెను. వివాహపర్యంతము కుండల మదాలసను వీడరాదు. వివాహమే యితని కావ్యమున చివరిఘట్టము. ఆపైన కుండలజీవిత మేమైనదో తెలియదు. కావున యీకవి కుండలను నిపుణ యైన చెలివలెనే కల్పించి యూరకుండెను. పరిశీలించి చూచినచో మదాలస కువలయాశ్వుని గృహమునఁ జేరినతరువాత కుండలపాత్రకు పూర్వ మున్న ప్రాధాన్యము తొలఁగిపోయినది. కుండల మదాలసప్రక్కన లేకున్నను అశ్వతరునియింట నామెకుఁ గలిగిన కొఱత యేమియు లేదు. చిననారాయణకవి యాపాత కేర్పడిన యిట్టి యాపత్ప్లవత్వమును దొలఁగింప నెంచి యామెమూలముగాఁ దాళకేతువు సంహరింపఁబడె నను కల్పనము చేసి కృతార్థుఁ డయ్యెను. మూలకథయందు మదాలసామరణమునకు సంతృప్తుఁడై తాళకేతుఁడు కువలయాశ్వునిపైఁ గల పగను మరచిపోయెను. అందువలన నాతనిమరణము కథలో నిబంధింపఁబడలేదు. ప్రబంధమున మదాలస మృతి చెందలేదు; తాళకేతుని గృహమున నిర్బంధింపఁబడియుండెను. శివుని మాయచే మదాలస యశ్వతరునింటికిఁ జేరినది. ఆమెవెంట కుండలయు నరిగినట్లు చిత్రించినచో కథకు పాటవము చేకూరదు. ఉన్నవా రున్నట్లు మాయ మగుట యెఱింగిన నయ్యసురుఁడు తోకత్రొక్కినత్రాచు కాఁగలఁడు. వారిని మఱల సాధించుటకు ద్విగుణీకృతయత్నము చేయఁగలఁడు. మాయావిశారదుఁడైన యతనిపగ మదాలసాకువలయాశ్వుల పునస్సమాగమున కొకయరిష్టమే కాఁగలదు. కావున, శత్రుశేషము నిశ్శేష మొనర్చుకల్పనము చేయుట చిననారాయణకవి కవశ్య మైనది. మదాలస తాళకేతునియంతఃపురమునుండి యంతర్ధాన మైనది. అతఁడు క్రుద్ధుఁడైనాడు. కుండల నామెనుగూర్చి పృచ్ఛించినాఁడు. ఆమె తనకుఁ దెలియ దని నిజము చెప్పినది. ఆమాట లతని కనుమానము కలిగించినవి. ముందు మదాలసను గపటోపాయమునఁ దప్పించి తరువాత కుండల తానును దప్పించుకొన యత్నించుచున్న దని యతఁడు శంకించెను. ఆమెను స్థలాంతరమునకుఁ జేర్చుటకు మూపురము పై నుంచుకొని పయన మయ్యెను. మార్గ మధ్యమున నాతఁడు జయంతనలకూబరులతో యుద్ధమునకు దిగి వారిచే సంహరింపఁబడెను. రాక్షసునిబారినుండి విడివడిన కుండల తారతోఁ జెలిమి యొనర్చి యామె మనసున కెక్కి చివరకు మదాలసను జేరఁ గలిగెను. ఇట్లు కుండలపాత్ర కువలయాశ్వచరిత్రమున మదాలసాకువలయాశ్వుల సమాగమసిద్ధికే కాక, శత్రుశేషవినాశమునకును గారకురాలై కార్యనిర్వహణమునకు భద్రత చేకూర్చి పెట్టినది. ఈకవి చేసిన సార్థకశిల్పములలో నిది శక్తిమంత మైనది.

8. కథావసరమునఁ గావించిన మఱికొన్ని చిన్ని మార్పులు :

(1) పాతాళకేతుఁడు గాలవాశ్రమమునఁ బ్రవేశించి సింహశార్దూలాదివనచరాకారములు ధరించి మునితపమునకు విఘ్న మాచరించెడి వాఁ డని మూలమున నుండెను.

ఈకవి పాతాళకేతుఁడు బృందారకబృందభయంకరుఁ డయ్యు మొదట ఫలకునుమబిసాదులు గంపల కొలఁదులు దెచ్చుకతన మాలిమికాఁడై గాలవముని తపోవనమున మెలఁగుచుండినాఁ డనియు, క్రమముగ నాతఁడే గర్వాంధుఁ డై తాపసానూనజపహోమమౌనసంవిధానముఖమైన నియమసంతాన మనెడి పద్మవనవైరికళ మాటుపఱచు రాహువైనాఁ డనియు వర్ణించెను.

ఒకసారి యొక హరిణాంగన కీతపొద్దులు కాగా మునివనితలు దాని నొక లతామంటపమునఁ జేర్చి పరిచర్యలు చేయుచుండిరి. పాతాళకేతుఁ డతిదుర్మదుఁడై కపట వనితాకృతిఁ దాల్చి యచ్చటి కేఁగి వారిమధ్య వర్తించుచు నున్న ట్లుండి యొక సింహముగా మారి వారిని భయపెట్టెను. వారు గగ్గోలుపడిరి. గాలవమహర్షి పాతాళకేతునిదుండగమును యోగదృష్టితో గమనించి క్రుద్ధుఁ డయ్యెను. ప్రబంధకర్త యొనర్చిన యీ కల్పన యంతయు క్రొత్తదే. కాని, మూలమున దానవుఁడు సింహాది వనచరాకృతులఁ దాల్చె నని చెప్పిన విశేషమున కొక భౌతిక సన్నివేశము కల్పింపఁ బడినది. సింహాకృతితోపాటు సింహమధ్యమాకృతినిగూడ నతనిచే నీకవి ధరింపఁజేసెను. ఆశ్రమవనితామండలిమధ్య చేరి చేసిన యీదుండగమున కొకప్రత్యేకత కలదు. అతనియందంకురావస్థలో నున్న స్త్రీవాంఛ కది యొకనిదర్శనము. అది మదాలాపాపహరణము నాటికిఁ బరిణతి చెందినట్లు కల్పించుట కవిచాతుర్యము.

మూలకథయందు పాతాళకేతుఁడు జాతివైరము ననుసరించి ఋషులతపస్సునకు భగ్న మొనర్చి, భూతలమున ధర్మగ్లాని నేర్పఱచుస్వభావము గల అచ్చమైనరాక్షసుఁడు. ప్రబంధకథలో నాతఁడు తిన్న యింటివాసములు లెక్కించి, నమ్మినవారినే నానాహింసలు పెట్టిన నరరూప రాక్షసుఁడు!

(౨) గాలవుఁడు వేడినవెంటనే ఋతధ్వజుఁడు తండ్రియానతిని శిరసావహించి యతనివెంట నాశ్రమరక్షణార్థమై యరిగె నని మూలమునఁ జెప్పఁబడియుండ ప్రబంధమున మునివెంట సైన్యము నిచ్చి ముందు పంపి మరునాఁ డుదయమున ఋతధ్వజుఁ డాశ్రమమునకు జేరె నని మార్చి రచింపఁబడియున్నది. మూలమున లేని సైన్యప్రసక్తి కల్పించి యీకవి యింత యార్భాటమును జేసెనుతప్ప గడించిన లాభ మేదియును లేదు; మహర్షి తలవాకిట నిలచి యభయహస్త మర్థింప గంభీరముగ నిచ్చియు నొకరాత్రి యంతిపురమున ఋతధ్వజుఁ డెట్లు నిద్రింపఁగలిగెనో చెప్పుట దుష్కరము. రాజుగారి ముస్తాబున కిచ్చిన విలువ యీప్రబంధకర్త మహాముని మనస్సంక్షోభమున కీయలేదు. మూలమున నొంటిగా దానవునితోఁ బోరి విజయము సాధించిన పరాక్రమస్ఫూర్తి ప్రబంధమందలి సంకులయుద్ధమువలన రాలేదు; కావ్యమునఁ గల్పించిన భూతలసమతలదుర్గయుద్ధములు కథావిస్తృతికిఁ తోడుపడినవే కాని కథాప్రయోజనసిద్ధికిఁ దోడ్పడుటలేదు. కాగా - మూలమున కువలయాశ్వుఁడు రసాతలమున నసమయుద్ధమున రాక్షసులనందఱను భస్మమొనర్చెనను వర్ణనమే నాయకయుద్ధచాతుర్యమున కత్యంతదీప్తినిఁ గల్గించినది.

(౮) మదాలసాకువలయాశ్వుల ప్రథమసమావేశము మూలమున కన్న రమణీయ ముగను, విస్తారముగను వర్ణించి, విశిష్టమైనమార్పులను చినసారాయణకవి ప్రవేశ పెట్టెను. పురాణమునందు కువలయాశ్వుఁడు రసాతలమునకు భూవివరమునుండి దిగి నిర్మానుష్య మగు నొక సువర్ణనగరమును గాంచెను. అందు కుండల మొదట కానవచ్చి నది. అమె నతఁడు పలుకరించినను జావాబీయలేదు. అతని కాశ్చర్యము వైచినది. కుతూహలము హెచ్చినది. అశ్వము నవరోహించి యామె ననుసరించి యొక హర్మ్యము పై నెక్కెను; ఆభవనోపరితలమున నొక మణిమయకాంచన పర్యంకమున నున్న నొక చంద్రనిభాస్యను గాంచెను. ఆమెయు నాతనిఁ జెట్టు గాంచి సంభ్రమభయవిస్మయరాగా దులను, లజ్జయుఁ బొడమ తల్పము డిగ్గి సఖిమాటునఁ బ్రకంపితాంగి యై నిలచెను. అతని యపూర్వసౌందర్యమును గాంచి యతిశయముగ మోహించి, యాతాకున కోర్వఁ జాలక మూర్ఛిల్లెను. కుండల యామెకు సేదఁ దీర్చినది. కువలయాశ్వుఁడే మొట్టమొదట సంభాషణ కుపక్రమించి యాకన్య యట్లేందులకు మూర్ఛిల్లె నని కుండలను బ్రశ్నించెను. కుండల యతనిఁ జూచి పారవశ్యము నొందుటవలన నట్లయ్యె నని యామెయొక్క గత వృత్తాంతమంతయు చెప్పెను.

ప్రబంధమునఁ గువలయాశ్వుఁడు పాతాళకేతుని సంహరించి సేనలను కోటవెలుపలి భాగమున నుంచి యశ్వారూఢుఁడై నగరవైభవముఁ జూడ నేకాంతముగ నేఁగెను. నగర విశేషములఁ గాంచి యంతఃపురమును సమీపించెను. అచ్చట లోన నెవ్వరోయువతి "వనితా! యెంతటి బేల? వేసెలఁతయైనం జింతనే చింత గుందునటే? యందనిమ్రాని పండులకుఁ జేతుల్ చాతురే యైన నద్దనుజోదంతమెఱుంగునంతకును గాంతా తాళుము" అనువాక్యము లనుచుండుట యతని కర్ణపుటముల సోకెను. ఆమాటలు రాజున కుత్కంఠ కల్గించినవి. అది యేమో చూత మని లోనికిఁ జూచినాఁడు. కన్నులయెదుట

సీ. పలుచనిపావడపై నొంటికట్టుగాఁ గట్టిన వలిపెపెంగావికడమ
పొన్నపైఁ బొరల నిబ్బరపుగుబ్బల హొరపటలి పెటిల్లునఁ జిటిలి రాల
కెరలు నిట్టూర్పులఁ గెమ్మోవి బగులంగ గోరునఁ జిమ్ము కన్నీరువడిన
బంగారుగోడ కరంగిపోవఁ దలాట బటువు లల్లంతటఁ బడగనేమొ

గీ. పనికి దిగ్గున లేచి పూపాన్పుమీఁద
వ్రాసి కూర్చుండి ముక్కుపై వ్రేలు నిలిపి
యొక్క చెలికత్తె యూరార్పఁ బెక్కుతలపు
లన్నుకొన నున్న యొకవన్నెలాడిఁ గాంచి. (3.27)

యతనిమనస్సు మన్మథాయత్త మయ్యెను. ఆమెశరీరసౌందర్యమును ముగ్ధుఁడై వర్ణించెను. ఆమె వైఖరిని గాంచి యామె వలపుకాకకు గురియయ్యె నని యూహించెను. ఆమె వలచిన యదృష్టవంతుని లోన సభినందించెను. అతఁ డామె నట్లు తాపాగ్ని కెరవైచుట కతినత్వ మని గర్హించెను. ఆమె వృత్తాంతము సర్వము నెఱుఁగ నిచ్చగించి యచ్చటకుఁ దొలఁగి యొకలోమఱుఁగున నిలిచి వారిద్దఱులసంభాషణము వినుటకు మొదలుపెట్టెను.

క. అక్కా! ఋతధ్వజభూవరుఁ
డెక్కడ నీ వెక్కడే యిదేమిటికే నీ
చొక్కపుఁజక్కనినెమ్మె
నిక్కాకురియకోర్వనేరదే వగయేలే? (3. 42)

అను చెలికత్తెమాటలు వినుసరి కాతనికి వెదుకఁబోయినతీఁగ కాళ్లకుఁ దగిలినట్లైనది. అతనియదృష్టమున కతఁ డెంతయో యుబ్బిపోయెను ఆమె తనను గూర్చియే విరహము ననుభవించుచున్న దని దృఢపడినతరువాత

ఉ. తోవమరుంగు వాని జనలోకరసాకరపాకశాసని మై
తావులకంటె మున్న రుచిధారలు జారులు దీర్పఁగా రతి
శ్రీవిభు రంభచుట్టమును జెక్కిలి గొట్టునొయార మొల్కఁగా
నావనజాక్షు లున్నయెడ కద్దరిపాటున వచ్చి నిల్చినన్. (3. 57)

నాయకప్రవేశము రంగోచితముగా జరిగినది. వసుచరిత్రలో వసురాజు గిరికన్యయెదుటకు వచ్చినప్పటి నాటకీయతను బాటింప నీకవి యిందు యత్నించెను. దబ్బాటున వచ్చిన కువలయాశ్వుని గాంచిన మదాలసకు హృదయము ఝల్లు మనినది. పదాంగదములు ఘల్లుమన దిగ్గన లేచి యొయారపునడకలతోఁ దెరవెనుకకు వెళ్లినది. కుండల తత్తరపాటుతో బంగారుగద్దె తెచ్చియుంచినది. రాజం దుపవిష్టుఁ డయ్యెను. పూర్వపరిచితమైన యతనిముఖమును గుర్తించియు నిశ్చయింపలేక కుండలయే సంభాషణ మొదలుపెట్టినది సవరము చిననారాయణకవి యీసన్నివేశమున నాటకీయకల్పనతో పాటు పూర్వరంగపోషణము సుష్ఠుగాఁ జేసెను. మూలమున మదాలసకు వినుకలిమీఁదనే కువలయాశ్వునిపై వలపు గలిగించి, యనిశ్చయజ్ఞానముతోఁ గనుకలి కల్పించి యటుపై దానిని స్థిరీకరించుట జరిగెను. ప్రబంధమున మదాలసకుఁ గనుకలి ముందు కల్పించి, వినుకలిచేత దాని నుత్తేజపఱచి వలపును గలిగించి, దుర్లభభీతిచే నుత్కృట మొనర్చి, ప్రత్యక్షదర్శనముచే కృతార్థత కల్పింపఁబడినది. రసదృష్టికిఁ బ్రబంధమార్గమే రమణీయమైనది.

4. తాళకేతుఁడు వారుణమంత్రములు జపింతు నని యమునాజలములందు మునిఁగి యసురమాయాబలమున శత్రుజిన్నగరమున కేఁగి కపటమునివేషమున రాజమందిరము చొచ్చె నని పురాణమునఁ గలదు. దాని నీకవి మార్చి కపటతాపసాకారుఁడైన తాళకేతుఁడు తనయాశ్రమప్రాంతమున నున్నయొకసరోవరమున మునిఁగి మదాలస యంతిపురమున నొకదిగ్గియలోఁ దేలె ననియు, నచ్చట కుండలాసమేతయైన మదాలసను గాంచె ననియు, వారికి సుపరిచితుఁడైన మంత్రిరూపముఁ దాల్చి సమీపించె ననియు మార్చెను. బాహాటముగా కువలయాశ్వునివృత్తాంతమును జెప్ప నేగిన తాళకేతుఁడు పురాణమున నట్లు వర్తించుటయు, రహస్యముగాఁ గపటోపాయము పన్ని పెండ్లినెపమున మదాలసను గైకొనిపోవ నెంచిన దానవుఁడు ప్రబంధమున నట్లు వ్యవహరించుటయు నన్నివేశప్రయోజనములఁబట్టి యతిసహజములై యొప్పుచున్నవి.

(5) నాగకుమారులు తండ్రికోర్కెపైఁ గువలయాశ్వుని భూతలమునుండి రసాతల

మున కాహ్వానించి రాజలాంఛనములతో సరాసరి యశ్వతరు నింటికిఁ దెచ్చినట్లు మూలమునఁ గలదు. ప్రబంధమున నాగకుమారు లారాజకుమారుని రసాతలమునకుఁ దెచ్చి యొకవనమున దింపి; యొకసరోవరతీరమున నొకపొదరింట నాతని నుంచి, మంగళవాద్యగౌరవములతో నతనిని దండ్రియింటికిఁ గొంపోవుసంభారము లొనర్చ నగరులోనికిఁ బోయి రని వర్ణింపఁబడెను. ఇట్టిసన్నివేశమువలన నేకాంతమున నున్న కువలయాశ్వుఁడు సమీపమున నున్న మదాలసను జూచు నవకాశము కలిగింపఁబడినది. దానివలనఁ గథకు గౌరముకంటె ననౌచిత్యమే యధికముగా గలిగినది. ఎట్లన: రసాతలాధిపతి అశ్వతరుఁడు. అతఁడే స్వయముగాఁ బ్రత్యేకప్రయోజనముతోఁ గువలయాశ్వునిఁ దన పుత్రులచేతఁ బిలిపించెను, వారు వత్తు రని యతనికిఁ దెలియును. తెలియకపోయినచో దెలిపెడి బలగ మున్నది; నాగకుమారులే స్వయముగాఁ బోయి తండ్రికిఁ జెప్పుకొనవలసిన దైన్య మేల కలుగవలెను? ఇంద్రతుల్యుఁ డైన ఋతధ్వజుఁడు లతామంటపమున నొంటిగఁ గూర్చుండవలసిన యగత్య మెందులకు రావలెను? ఇరువురు నాగకుమారులలో నొకఁ డతని పజ్జ నుండి యొకఁడు నగరునకుఁ బోయిన చాలదా? అతిథినిఁ జూచి యంగడికి పోయిన ట్లుండలేదా యీచందము? భూతలేశ్వరుని గౌరవించువిధ మిదియేనా? ఇన్నియంశము లిచ్చట సమర్థనీయములు కావు. మదాలస యచ్చట నున్న దని ముందు తెలియుటవలన నధికప్రయోజన మేమి కల్గినది? కథాంతమున మూలమందలి రమణీయ సన్నివేశము లుప్తమైనది. మదాలసను కువలయాశ్వున కిచ్చు ఘట్ట మొక్కచెచ్చుపద్యములో తేలిపోయినది. తార యను దేవవేశ్యయొక్కకథను జెప్పింపలె ననెడి కవియొక్క యుబలాటమే కథ కింత కీడు తెచ్చినది.

## 9. గంగాగౌరీసంవాదకల్పనమునం దున్న యౌచిత్యము తారావృత్తాంత కల్పమునఁ గానరాదు :

ఈప్రబంధమున జయంతనలకూబరవివాదమును - లేక - తారావృత్తాంతమును, గంగాగౌరీసంవాదమును గార్యకారణరూపము లైన విశిష్టకల్పనలు. వీనివలనఁ దాళకేతు సంహారము ఫలము. వీనియావశ్యకతను గూర్చి వెనుక నుగ్గడింపఁబడినది. వాని యౌచిత్యమునుగూర్చి యిచ్చట ముచ్చటింపఁబడుచున్నది. గంగాగౌరీసంవాదము మదాలసాకుండలలకుఁ గొన్ని దినములు వియోగము కల్పించినది. దానితో నది సార్థకమైనది. పదునైదు పద్యములలో రచింపఁబడిన యీసన్నివేశము కథయందు చక్కగా నమరి యలంకారప్రాయమైనది. జయంతనలకూబరవివాద మీప్రబంధమున నతివిస్తృతముగా వర్ణింపఁబడినది. 120 గద్యపద్యములపై వ్యాపించియున్న యీకథవలన నితివృత్తమున కధిక లాభము లేదు. మదాలసవంటి మహాపతివ్రతప్రక్కన తారవంటి భోగవనితను గూర్చుండఁ బెట్టుట వలన నామెకుఁ గలిగెడు గౌరవ మినుమంతయు లేకపోగా నామె స్వయముగా వివరించిచెప్పుకొనిన స్వీయశృంగారరసాభాసగాథ నంత యోపికగాఁ గూర్చుండి వినుటవలన కులసతీజీవితము నిర్వహింపఁబోవు మదాలస గడించిన దేమియు లేదు. ఇది నిజముగా

కవి వసించిన కాలమహిమయే కావచ్చును. లేనిచో తార స్వీయవృత్తాంతము సాటిస్త్రీకి వివరించి చెప్పుటకు కొంచెము లజ్జనైనఁ బ్రకటింపదా? ఆకథ రహస్యముగా వినుచున్న కువలయాశ్వునికైన నినుమంత రోత జనింపదా? కాబోవు నూతనవధూవరులు వినఁదగిన పుణ్యవృత్త మిదియేనా? తాళకేతుని సంహరించుటకు గల్పించినదైనను పరిమితిని మించి, యౌచిత్యమును ద్రెంచి, యింతగా సాగఁదీయవలసిన యవసరము లేదు. కావున గంగా గౌరీసంవాదకల్పనమున కవి యెంత యౌచిత్యము పాటించెనో తారావృత్తాంత కథనమున నంత కోల్పోయెను.

10. తాళకేతుఁడు పాతాళకేతుని మరణవార్త నెఱిఁగినవిధము తెల్పు కల్పన మతి విచిత్రమైనది :

భయంకరాకారవిస్ఫూర్తిలోఁ బాతాళకేతునితమ్ముఁడే తాళకేతుఁడు. తారారంభలను దాను భోగించుట కుపాయనముగాఁ బంపు మని యతఁ డింద్రునకు వర్తమాన మంపెను. దుష్టుఁ డగువాఁడు ప్రభువై యున్నచో వారిబంధువు లతనియధికారగౌరవములను దుర్వి నియోగపఱచుకొనుచుండుట కాంచుచుందుము. అట్టివాఁ డీ తాళకేతుఁడు. బానిసయై బ్రతుకు దేవేంద్రుఁ డొక్కసారిగా బలగర్వములు ప్రకటించి రాక్షసదూత నవమానించి నాఁడు. కారణము తెలియక వింతపడినారు రాక్షసులు! పఠితకు పాతాళకేతుమరణవృత్తాంతము తెలియునుగాని యిదియే వారివింతకుఁ గారణ మని మాత్రము తెలియదు. వారి సంభాషణము తుదివఱకు సాగినతరువాతఁ గాని యసలువిషయము స్పష్టముకాదు. ఇట్టి చమత్కారము కవి సన్నివేశరచనాసామర్థ్యమువలనఁ గాని యేర్పడదు. దేవేంద్రుఁడు తాళకేతునిఁ బరిహసించుచు దూతతో

క. "ఓరి! మీదొర గోరిన
తారారంభల విటావతంసులచేతన్
మీరజనీచరుఁ డగ్రజుఁ
జేరం జనుఁగాక యని వచించుచు...."

నలుకతో నాతనిఁ గోట వెడలఁద్రోయుఁ డని భటులకు నాజ్ఞ యిచ్చెను. దేవేంద్రుని వాక్యములలోని వ్యంగ్యమే రాక్షసదూత కొకమృత్యువార్త యైనది. అన్న చనిపోయినవార్త తమ్మున కెఱిఁగించుటకుఁ బాతాళకేతుని నగరమున దనుజుఁ డొక్కఁడైనను మిగిలి యుండలే దని వస్తుధ్వని. అన్న యంత దీనమైనచావు చచ్చినందులకే తాళకేతున కంత కడుపుమండినది. పాతాళకేతుఁడు బృందారకబృందభయంకరుఁ డనియు, సురలను జయించి వారిని బానిసలుగాఁ గొని బాధించుచుండె ననియుఁ, గల్పించినది చిననారాయణయే. దానికి నిదర్శనము పాతాళకేతునగరవర్ణనము. అందు దేవగణములు దీన ములై వెట్టిచాకిరి చేయుచున్నట్లు వర్ణింపఁబడియున్నది. దానవసంహారానంతరము వారి విముక్తియు, దేవేంద్రభయనివారణమ్మును వర్ణించిన గాని కావ్యార్థముల కొకసామ్యత

యేర్పడదు. కావున నీకవి యీకల్పనము చేసి కావ్యమున నిబంధించి కథనత్యంత మాహ్లాద దాయకముగాఁ దీర్చిదిద్దెను.

**ఉభయపురాణములు కువలయాశ్వచరిత్రపై వైచిన ప్రభావము :**

నవరము చిననారాయణకవి కువలయాశ్వచరిత్రమున మార్కండేయపురాణోక్తమైన కథలోని ముఖ్యాంశములను గైకొనియుండె నని వెనుక చెప్పఁబడియున్నది. అతఁడు సంస్కృతాంధ్రోభయపురాణములను జదివి తనరచనము తీర్చిదిద్దె ననిఁ బరిశీలనమువలన స్పష్టము కాఁగలదు.

1. ఋతధ్వజవర్ణనము :

కావ్యనాయకుఁ డైన కువలయాశ్వుని వర్ణించునెడ సంస్కృతాంధ్రపురాణవర్ణనములను దృష్టియం దుంచుకొనినట్లు భావింప వీలగుచున్నది. సంస్కృతమున నతఁడు 'మహావీరుఁ డనియు, అరివిదారుణుఁ డనియు బుద్ధివిక్రమభావములందు గురుశుక్రాశ్వినులలోఁ దుల్యుఁ డనియు' వర్ణింపఁ బడెను. మారన యనువాదమున సద్గుణయుతుఁ డనియు, విశ్రుతయశుఁ డనియు, లావణ్యాశ్వినసమానుఁ డనియు, ధీవిభవామరగురుఁ డనియు, దీపితభుజవీర్యావష్టంభసురేంద్రుఁ డనియు, శ్రీవిలసితమూర్తి యనియు, పుణ్యశీలుఁ డనియుఁ గీర్తింపఁబడెను. చిననారాయణకవి పైవానిలోఁ గొన్నింటితాత్పర్యమును గ్రహించి యీషద్విపులముగఁ బెంచి రచించెను. సంస్కృతపురాణము కువలయాశ్వుని పరాక్రమ బుద్ధివైభవములనుఁ గీర్తించెను. మారన యతని గుణములకును, యశస్సునకును, లావణ్యధీశ్రీవిలసనములకును, పుణ్యశీలములనకును స్థానము కల్పించి భుజవీర్యపరాక్రమాదులనుగూడ కీర్తించి ధీరోదాత్తనాయకస్వభావసిద్ధికిఁ బాటుపడెను. ప్రబంధకర్త మారన చూపించిన మార్గమున వర్ణనము నారంభించి మొదట నాయకుని కీర్తిప్రతాపసుభగత్వమును మహావీర్యసంపదను బేర్కొనెను. నాతనివివిధాస్త్రశస్త్రపాండిత్య మచ్చుపడ నొకసీసపద్యమును గూడ రచించెను (1.91). మారన సూచించిన శ్రీవిలసితత్వము నగరవర్ణనమున వ్యంజింపఁజేసెను. 'కువలయ' శాసనకర్తయు, పాతాళకేతుసంహర్తయు, దుష్టజనశిక్షకుఁడును, శిష్టజనరక్షకుఁడును నైన ఋతధ్వజునిఁ జిత్రించుట యందు ప్రతాపప్రాభవముల కధికప్రాధాన్య మిచ్చి వర్ణించి కవి ప్రబంధవర్ణనము నిర్వహించినాఁడు.

2. మదాలసాసౌందర్యవర్ణనము :

కువలయాశ్వుఁడు మదాలసను బాతాళకేతునియంతిపురమునఁ గాంచినప్పు డామె మేనిసొగసుల నభివర్ణించినకల్పనకుఁ బురాణములం దాధారము లున్నవి. సంస్కృతపురాణమున మదాలసాముగ్ధమోహనమూర్తి యి ట్లభివర్ణింపఁబడినది.

శ్లో. తతో పశ్య త్సువిస్తీర్ణే పర్యఙ్కే సర్వకాఞ్చనే
నిషణ్ణాం కన్యకా మేకాం కామహీన రతీ మివ ॥

శ్లో. విస్పష్టేన్దుముఖీం, సుభ్రూం, పీనశ్రోణిపయోధరామ్
బిమ్బాధరోష్ఠీం, తన్వంగీం, నీలోత్పలవిలోచనామ్ ॥
రక్తతుంగనఖీం శ్యామాం మృదుతామ్రకరాంఘ్రికామ్
కరభోరూం సుదశనాం నీలసూక్ష్మస్థిరాలకామ్ ॥
తాం దృష్ట్వా చారుసర్వాంగీ మనంగాంగలతా మివ
సో మన్యత తదా రాజా తాం రసాతలదేవతామ్॥ (19.16-19)

మారన పురాణమందలి "కామహీన రతీ మివ" యను నుపమానమును గ్రహించి, 'రసాతలదేవత' యను రూపకము నెంచి, యట్టివే మరికొన్నింటిని గల్పించి, యామెశరీరాంగ ప్రశంస యొనర్చుచు నొక సీసము నిట్లు రచించెను :

సీ. ఏకాంతమునఁ దనయిచ్ఛ గ్రీడింప దర్పకుఁ బాసి వచ్చిన రతియనంగఁ
బాతాళవిహరణ కౌతూహలమున నేతెంచిన జలధీశదేవియనఁగ,
భాసురాకారసంపదసొంపు దాల్చిన లలితోరగాలయలక్ష్మి యనఁగ,
రుచిరతరాంగనారూపంబు గైకొన్న శృంగారరసమయశ్రీ యనంగ,
తే. నసమలావణ్యఖ్యాతిఁ బొల్పారు కుసుమ
కోమలాంగి కున్నతకుచకుంభలలిత
నసితవికసోత్పలతులితాక్షి నొక్క
కన్యకామణి నృపసూతి గాంచె నెలమి. (2.294)

పద్యపూర్వభాగమునందలి యుత్ప్రేక్షాలంకారమాలికచేత నపూర్వసౌందర్యస్ఫూర్తిని గల్పించి, యట్టి యందమును వ్యంజించు నవయవసామగ్రిని యుత్తరార్ధమునఁ జేర్కొనుట పైపద్య నిర్మాణశిల్పము.

పురాణములందలి రసాతలము ప్రబంధమున లేదు. అచ్చటిపాత్రల యుదాత్త సంస్కారము లిచ్చట కానరావు. కాని, మూలమున నీషత్ప్రసక్తములైన నాయికాశరీర విలాసము లీ కావ్యరంగమునఁ గడు విస్తృతములై విలసిల్లినవి.

మ. భళిరా కన్నులు మీలలౌ సొగసురూపౌ చాల సేబాసు రా
కళ లందిచ్చు మెఱుంగు ముద్దుమొగ మింకం జంద్రుఁడౌ దీవిముం
గళ నౌరా బలితంపుగుబ్బ లివియే కాటోలుఁ బూచెండ్ల మిం
డలు మేలే కురు లింద్రనీలముల కన్నన్ మిన్నలౌనే కదా!

ఉ. జక్కవ పిట్టకున్ గలికి చన్నుల మిట్టకు నేమిపుట్టువో
చక్కెరదీవికిన్ వనిత సన్నపుమోవికి నేమివావియో
నిక్కవ దానికిం జెలువ నిద్దఁపుమేనికి నేమి నేస్తమో
చొక్కులకోటికి న్నగువసొంపులగోటికి నేమి కూర్మియో! (3.28, 33)

అనుపద్యపంక్తులు వెలువడుటకు మూలశ్లోకపద్యములందలి శబ్దార్థపంక్తులు బీజతుల్యము లైనవి.

### 3. అశ్వతరునింట మదాలస విరహార్త యైనట్లు చిత్రింపకుండుట పురాణ ప్రభావమే :

పురాణములందు మదాలస పునర్జన్మ నెత్తియు, ప్రబంధమున శివునిమాయచేఁ దెప్పింపఁ బడియు నశ్వతరునింట నివసించుట తటస్థించినది. మూలమున నామెకు జాతి స్మరణము కలదు. ప్రబంధమునఁ బూర్వస్మృతి కలదు. కాని, భర్తృవిరహము ననుభ వించిన ట్లచ్చటను వర్ణింపఁబడలేదు. నిజమున కిది మూలకథలో నొకలోపముగా గ్రహింపవచ్చును. చిననారాయణ తనప్రబంధమున దానినిఁ దొలఁగించుటకుఁ జక్కని యవకాశము లభించినది. కాని, యతఁడు దానిని సద్వినియోగము చేసికొనలేదు. నాగ కుమారులు కువలయాశ్వుని నుద్యానవనమున దించి నగరు కేగినప్పుడు సమీపమున నున్న నొకగృహారామమున సఖీజనపరివృత యైన మదాలసను చూచినట్లు కవి కల్పించెను. కాని యామె నచ్చట పతివిరహదుఃఖవివశయై యున్నట్లు గనో లేక అద్యతనభావిలో సిద్ధింప నున్న భర్తృసమాగమసిద్ధినిగూర్చి సాభిలాషయై యున్నట్లుగనో చిత్రింపక ''చెలువైన పసిడిగద్దియఁ గొలువై నలువంకఁ జెలువగుంపులు గొలువన్, బలువైఖరి పావడ నెలతలు వీవఁగఁ గన్నె'' తీవి మెరయఁ గాలముపుచ్చుచున్నట్లు వర్ణించెను. పైపెచ్చు కొండవీటి చేత్రాడంతపొడవైన తారాపుంశ్చలీవృత్తాంతము నొపికతో వినఁ గలిగినట్లు కథ నడపినాఁడు.

మదాలస పునర్జన్మమున యోగిమాత కా నున్నది కావున నామెయందు మదన విరహమును వర్ణించుట తత్కాలచిత్తావస్థ కనుగుణము కాదేమో యని మూలకర్త యట్టి వర్ణనము చేయలే దని మనము సమాధానపడుట కవకాశమున్న దచ్చట. కాని, యిచ్చట శృంగారనాయిక మదాలస. ఆమెయందు విరహదీప్తి భాసింపక పోవుట పూవునుండి తావిని తొలగించినట్లే కాఁ గలదు. కావున, నిది మూలమును గ్రుడ్డిగా ననుసరించి చేసిన కల్పన మని భావించుటలో విప్రతిపత్తి లేదు.

### 4. మూలములోని చిన్నచిన్న లోపములఁ గొన్నింటి నౌచిత్య మెఱిఁగి సరిదిద్దుటచేఁ బురాణకథలను సూక్ష్మదృష్టితోఁ బ్రబంధకర్త పరిశీలించె నని స్పష్టము కాఁగలదు :

(1) మూలకథలో మదాలసాద్వితీయుఁడైన కువలయాశ్వుఁడు రసాతలమునుండి సరాసరి నిజనగరమున కేగినట్లు కలదు. ప్రబంధమున గాలవమహర్షియాశ్రమున కేఁగి యతని కావృత్తాంతము చెప్పి, నమస్కరించి, దీవెనలు వడసి నగరమున కేఁగినట్లు చెప్పఁ బడినది. మునిజనవిధేయుఁడైన కువలయాశ్వుని శీలమునకు ప్రబంధకల్పనము పోషక మగుచున్నది. సహజకథాగతి కిదియొకనిదర్శన మగుచున్నది.

(2) పాతాళకేతునిసంహారము మూలమున వదలఁబడినది. ప్రబంధమున శత్రు శేష ముంచకూడ దను న్యాయమున నతనిసంహారము జరిగినది. ఇదియు నౌచిత్య మెఱిఁగి చేసిన మార్పే.

(౩) మదాలస కువలయాశ్వునిఁ గాంచి వలచి, సురభి నిర్దేశించిన వీరుఁ డాతఁడే యని తెలియఁజాలక దైవనిర్ణయ వైరుధ్యమునకు వెరచి మూర్ఛలో మునిఁగె నని మూలమున నుండ దానిని మార్చి తత్పూర్వమే విరహదుఃఖార్తి వహింపఁజాలక మూర్ఛనొందెనని కుండల చెప్పినకథలోఁ బ్రబంధకర్త వర్ణించిచెప్పెను. మూలకల్పనము లోపభూయిష్టము కాదు కాని గడుసైన కల్పనము. దానిని మార్చుటచే కథార్థములకుఁ బ్రసన్నత యేర్పడినది.

### 5. సమానాంతర సన్నివేశసంవిధానకథాశిల్పమునకు పురాణములే మార్గదర్శకములు :

పురాణకర్తలు కువలయాశ్వునికథయందు సారూప్యసుందములైన రెండుసన్నివేశములను గల్పించి కథనశిల్పమును బోషించిరి. మదాలసాకువలయాశ్వుల సమాగమద్వయచిత్రణ మందులకు చక్కని యుదాహరణము. ప్రథమసమావేశమునఁ గువలయాశ్వుఁడు సురభిచే సూచింపఁబడి, కుండలచే నాకర్షింపఁబడి రంగమునఁ బ్రవేశించి మదాలసను బొందును. అట్లే పునస్సమాగమున నాగకుమారులచే సూచింపఁబడి, అశ్వతరునిచే నాకర్షింపఁబడి రసాతలమునఁ బ్రవేశించి మదాలసను బొందును. సన్నివేశస్వారస్యము నెంచినచో నొకసారూప్యము పైవానియందు తెలియుట సులభము.

సవరము చిననారాయణకవియు నిట్టిసారూప్యము నాయికానాయకుల ప్రథమద్వితీయసమాగమములందుఁ బాటించినాఁడు. నాయకుఁడు నాయికను జూచుటయు, ముగ్ధుఁ డగుటయు, మాటున నిలిచి విశేషముల గమనించుటయు, స్వీయానుకూలవార్తలఁ దెలియుటయుఁ జివరకు నిశ్చయజ్ఞానముతో నామెను గ్రహించుటయు ననునంశములు పైరెండు సన్నివేశములందును సమముగాఁ బాటింపఁబడినవి. మూలకథలోని రచనాశిల్పమర్మములను నిశితబుద్ధితో గమనించి, వాని నీషద్రూపభేదముతో స్వీయకల్పనానుకూలముగా ననుసంధించు ప్రజ్ఞ నీకవి ప్రదర్శించె ననుటకు సందేహము లేదు.

### 6. మదాలస ముందుగా కువలయాశ్వునిఁ జూచెనను కల్పనకు పురాణములందు బీజములు కలవు :

కువలయాశ్వుఁడు పాతాళకేతునిపై శరము సంధించి వెన్నంటి తరుముచున్నప్పుడు దివ్యగమనశక్తి గల కుండల తీర్థయాత్రలనుండి తిరిగివచ్చుచు నాతనిఁ గాంచె ననియు మూలమునఁ గల్పింపఁబడియున్నది. ప్రబంధకర్త యీకల్పనను దనప్రబంధమున విచిత్రముగాఁ బెంచి యనుసంధింధించెను; ప్రబంధమునఁ గుండలకు దివ్యగమనశక్తి లేదు. ఆమె మదాలసను వీడి యెన్నఁడు నెచ్చటకు వెళ్ళవలసిన పనియు లేదు. కావున చిననారాయణ కుండలా మదాలసలను భూలోకమున నొకయుద్యానవనమున దింపెను. పాతాళకేతుసంహారోద్యోగమున వెడలు కువలయాశ్వునిఁ జూపించెను. మదనబీజమును నాయికా హృదయక్షేత్రమున నాటెను. పురాణకల్పనమును ప్రబంధకథాసందర్భములకుచితమైన విధమున మలచుకొను నేర్పున కీకల్పన మొక యుదాహరణము.

7. పాతాళకేతుసంహారఘట్టమున మారన చూపించిన కాలైక్యసూత్రమును ప్రబంధకర్త యనుసరించెను :

సంస్కృతపురాణమునఁ బాతాళకేతుఁడు మదాలసను దెచ్చి సువర్ణనగరమునఁ బెట్టి రాబోవు త్రయోదశినాఁడు వివాహమాడ నిశ్చయించె నని కుండల కువలయాశ్వునకుఁ జెప్పినట్లు కలదు. కాని, యా దానవుఁ డక్కన్య నేనాడు తెచ్చి యాపురియం దుంచెనో, త్రయోదశి యెన్నాళ్ళకు వచ్చునో స్పష్టము చేయఁబడలేదు. కువలయాశ్వుఁడు మదాలసఁ జూడఁగల్గునాటికి వెనుకటిదినము మదాలసవిరహార్తిని భరింపఁజాలక ప్రాణత్యాగమున కుద్యమించెను. 'సురభి' ప్రత్యక్షమై యామెను వారించి పాతాళకేతునిపై శరసంధాన మొనర్పఁగలిగిన వీరుఁ డక్కన్యను వివాహమాడ గలఁ డని వర మిచ్చియుండెను. మరునాఁడే కువలయాశ్వుఁ డామెను వివాహమాడెను. అయినచో-ఆరోజు త్రయోదశియా ? కాదా ? యను సంశము మూలకర్త స్పష్టముచేయలేదు. ఎట్లయినను మూలకథకు లోపము లేదు.

మారన యీఘట్టము ననువదించుచు పాతాళకేతుఁడు ''మాయాబలమున నిమ్మానినిఁ గొని వచ్చి యిచ్చట నునిచి యావచ్చు'రేయి'తా వరియింతు నని నిశ్చయము చేసె" నని కుండల చెప్పినట్లు వ్రాసెను. 'త్రయోదశి' యిచ్చట 'రేయి' యైనది. దీనివలన కథలో నొకశక్తివంతమైన కాలైక్య మేర్పడెను. కార్యకారణసమన్వయము కథాశక్తి. ఇందు కార్యము మదాలసావివాహము. అది యానాఁడు ప్రొద్దుక్రుంగులోన జరుగవలెను. వరుఁడు పాతాళకేతునిపై శరసంధాన మొనర్చిన యోధుఁ డని సురభివాక్యము. కాని, వివాహముహూర్తము పాతాళకేతుఁడు ముందు నిర్ణయించెను. అనఁగా నాదనుజుఁ డానాటి రేయిలోపుగనే శరవిద్ధుఁడు కావలెను. అట్లగుటకు ఋతధ్వజుఁడు కువలయాశ్వ మెక్కి సిద్ధముగ నుండవలెను. పాతాళకేతుఁ డాతని శరపాతమునకు లక్ష్యము కావలెను. అనఁగా నంతవఱకు జరిగినకథయంతయు దానవుఁడు నిశ్చయించిన యీముహూర్తమును లక్షించి నడచిన దని భావము. ఆరోజు త్రయోదశి కావచ్చును కాకపోవచ్చును. కాని, యారోజు అది జరుగనిచో కథ లేదు. కావున మారన త్రయోదశీతిథిని పేర్కొనుట యందుకన్న ఆనాటిరేయి పాతాళకేతుఁ డామెను వరించుసమయ మని నిర్దేశించి కథార్థములకు శక్తిమంత మైన సమన్వయమును సాధించెను.

మారన చేసిన యీమార్పులవలన ఋతధ్వజుఁడు కువలయాశ్వమును బొందిన మరునా డీఘట్టము జరిగె నని యూహింప వీలగుచున్నది. చిననారాయణ యీకాలనిర్దేశమునే ప్రమాణముగా గైకొని కువలయాశ్వుఁడు గాలవాశ్రమమున కేఁగునపుడు మదాలస యాతనినిఁ గాంచి వలపుచెందె ననియు, నానాఁడే పాతాళకేతుఁ డామెను హరించి యామెను బలాత్కరింపఁబోగా, కువలయాశ్వుఁడు దండువిడిసిన వార్త చెవి కందె ననియు, తత్కారణముగా నాతఁ డామెను వదలిపోయె ననియు, నారాత్రి రాయబారి నంపె ననియు, మఱునాఁడు యుద్ధముచేసి మరణించె ననియు వర్ణించెను. ఇట్లు మారన చూపిన కాలైక్యసూత్రము ప్రబంధకల్పనల సమన్వయమాత్ర మైనది.

8. రసపోషణము :

పురాణకథయందలి యంగిరసము ధర్మవీరము. అది యాఖ్యానశిల్పాధ్యాయమున వివరింపఁబడినది. ప్రబంధకర్త కథను శృంగారరసప్రధానముగాఁ దీర్చిదిద్దెను. నాయకుఁ డగు కువలయాశ్వునియందును, పతాకనాయకుఁ డగు నశ్వతరునియందును మూలమునఁ గల మిత్రధర్మోత్సాహమును మందీకృత మొనర్చుటచేతను, శత్రుజిన్మహారాజ పాత్రము నాశ్రయించియున్న ధర్మోత్సాహమునకు కథయందు ప్రవేశమునే కల్పింపకుండుటచేతను, కథాగతమైన వీరరసదీప్తిని నీకవి తగ్గించెను. కుండలచేఁ జెప్పించిన మదాలసాచరిత్రమునఁ దద్విరహాతిశయమును వర్ణించుటచేతను పాతాళకేతుభవనమున నాయికానాయకుల కేర్పడిచిన ప్రథమసమావేశమున వారిరువురియాంతరంగికభావ చిత్రణము నతివిస్తృత మొనర్చుటచేతను, మదాలసావియోగమువలనఁ గువలయాశ్వుఁడు విచారించినవిధము వర్ణించుటచేతను, నాగలోకమునందలి యుద్యానవనమున నాయకుఁడు చాటుననుండి నాయికనుఁ జూచుసన్నివేశమును గల్పించుటచేతను, శృంగారరసమునకు మూలమున లేని యత్యంతవిస్తృతి లభించెను. తారావృత్తాంతమువలన శృంగారరసాభాసమును గల్పించి, రసవైవిధ్యమును సృష్టించెను. శృంగారమునకు రంగ మధికముగా లభించుటచే నీకవి దానిని నిర్వహించుటయందు కొంత నిగ్రహమును గోల్పోయినమాట వాస్తవము. కాని, యతనిపై సమకాలీనసాహిత్యము వైచిన ప్రభావమును బరిశీలించినచో నట్లు రచింపకపోవుటయే యొకదోషమేమో యను ననుమానము కలుగును. ఏమైనను వర్ణన మతివిస్తృత మగు సరికి యీప్రబంధమున నౌచిత్యము కొన్నియెడల భంగమైనది. ఇట్లే ఈకావ్యమున ఆశ్రమవాసులందు దైన్యమును, దనుజమాయాదులం దద్భుతమును, యుద్ధవర్ణనలయందు వీరరౌద్రభయానకబీభత్సములను, ప్రతినాయకులయందు మదగర్వావేగచాపలామర్షదైన్యాదులను, కవి విపులముగా వర్ణించెను. ఇట్టి రసభావము లంగములుగాఁ బరిపుష్టమైన శృంగారరస మిందు అంగి.

# మదాలసా పరిణయము

19 వ శతాబ్దిపూర్వార్ధమున వసించియున్న అల్లమరాజు రామకృష్ణకవి మదాలసా పరిణము మను ప్రబంధమును రచించెను. దానిని సోమయప్రభు ప్రేరణచేఁ బీఠికాపురమున వెలసియున్న కుంతిమాధవస్వామి కంకిత మొనర్చియుండెను. అతఁడు భీమేశ్వరకరుణా ప్రసాదలబ్ధకవిత్వమహనీయుఁ డనియు, రంగధామార్యతనయుఁ డనియు నీకావ్యపీఠిక వలనను, ఆశ్వాసాంతగద్యవలనను దెలియుచున్నది.[1] మదాలసాపరిణయకావ్యము మన కిప్పుడు సంపూర్ణముగా లభించుటలేదు. మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగార గ్రంథసూచిక లోని R. 268 నం. గల తాళపత్త్రప్రతి మాత్రము లభించుచున్నది. ఈప్రతి యిప్పుడు తిరుపతి ప్రాచ్యలిఖితభాండాగారమునఁ గలదు.

పైతాళపత్త్రప్రతి శిథిల మై యుండుటచేఁ గావ్యసమగ్రస్వరూపము తేటపడుట లేదు. ప్రస్తుతప్రతిలో నీకావ్యమునందలి మూఁడాశ్వాసములు కనవచ్చుచున్నవి. అందు ప్రథమా శ్వాసము సంపూర్ణముగా నున్నది. దానిలో 27 పద్యము లవతారికలోను, 51 పద్యములు కథాకథనమునందునుఁ గలవు. ద్వితీయ తృతీయాశ్వాసము లసంపూర్ణములే. కాని ద్వితీ యాశ్వాసమున శిథిలమై యున్నవి ఆశ్వాసాంతపద్యములలో చివరిది, గద్యమును. అవి యాప్రతివ్రాయునాటికే శిథిల మైనట్లున్నవి. 32వ పుట యగు నాకున నేమియు వ్రాయక వదలఁబడియున్నది. కావున ద్వితీయాశ్వాస కథావిధాన మెఱుఁగుట కెట్టి యడ్డంకియు లేదు. ఈయాశ్వాసమున 138 పద్యములు కలవు. మూఁడవయాశ్వాసమున 113వ పద్య మగు లయగ్రాహి వృత్తమునుండి తాళపత్త్రములు లేవు. కావున కావ్యసమగ్రవిమర్శ సాధ్యము కాదు. ఐనను దొరికినంతవఱ కీకావ్యమునకు మార్కండేయ మెట్లు మూలమగు చున్నదో పరిశీలింపఁబడుచున్నది.

---

1. మ. నను శ్రీదక్షపురీశభీమపదసన్నాళీకపూజాఖిలా
ఘుని తద్దివ్యదయాప్రలబ్ధకవితాశుంభత్ప్రభావోదయున్
ఘనఖారోష్ఠనిరోష్ఠ్యనిర్గతపదగ్రస్తోరుసింహావళో
కనసమ్యక్పదకృద్విలాసుఁ బిలువంగాఁ బంచి దా నిట్లనెన్. (1.17)

గద్యము : ఇది శ్రీమదల్లమరాజాన్వయ మాలికారంగధామార్యపర్యతనూభవ శ్రీమద్భీమేశ్వర వరప్రసాదలబ్ధసరసకవిత్వపటిమాసామ్రాజ్యధురంధర హరితసగోత్రపవిత్ర ఘటికాహోరాత్రశతగ్రంథకల్పనావిచిత్ర సకలసజ్జనవిధేయ రామకృష్ణకవినామధేయ ప్రణీతంబైన మదాలసాపరిణయం బను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.

(ఈతాళపత్త్రప్రతిలో శిథిలము కాకుండ నున్నది ప్రథమాశ్వాసాంతగద్యమాత్రమే. మిగిలినవి శిథిలము లైనవి.)

మార్కండేయపురాణోక్తక్రమమున నీప్రబంధమును జెప్పఁబూనినను కవి కథలో మార్పులు చేసెను :

రామకృష్ణకవి "మార్కండేయపురాణోక్తక్రమంబున నాయొనర్పంబూనిన మదాలసాపరిణయం బను శృంగారరసప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన" అని ప్రబంధము నారంభించెను. ఇందు పురాణోక్తక్రమ మనఁగాఁ బురాణమునందు వర్ణితములైన కథాసన్నివేశములయొక్క క్రమ మని భావింప వీలగుచున్నది. అదియే కథాక్రమము కాఁగలదు. ఇట్లీకవి కథాక్రమమునందును, ప్రధానపాత్రసంభాషణములందును పురాణము ననుసరించినను ఇతఁ డీకథలోఁ జేసికమార్పులుకూడ కానఁబడుచున్నవి. అవి పురాణవస్తుస్వభావమునే మార్చునంతటి వైశిష్ట్యముతో నొప్పారుచున్నవి. అట్టివానినిఁ గొన్నింటి నిచ్చట పేర్కొనుట జరుగుచున్నది.

1. మదాలసాపరిణయము శృంగారరసప్రబంధము :

మార్కండేయమునందలి కువలయాశ్వోపాఖ్యానము ధర్మవీరరసప్రధాన మైనది. చిననారాయణకవి దానిని శృంగారరసప్రధాన మొనర్చెను. రామకృష్ణకవియు నట్లే చేసెను. ఇది పురాణకథాస్వభావమునకు విరుద్ధము. ప్రబంధమును నిర్మింపఁదలచిన యీకవి శృంగారము నెన్నుకొనుట యుగప్రభావము. రసప్రతీతి కనుకూలము లైన సన్నివేశములను, తదనుకూలచిత్తవృత్తియును, రసభావములును కావ్యమునందు సంతరించుట యవసరము. కావున నీకావ్యమున రసానుకూలములైన కొన్ని మార్పులు కావలసివచ్చినవి. అవి శృంగారరసపోషకము లని తాత్పర్యము.

2. కువలయాశ్వుని క్రీడలు వనవిహారములే :

పురాణములందు కువలయాశ్వుఁడు మిత్రులతోఁగూడి యొనర్చు బహువిధవిహరణములలో శృంగారవీరరసానుకూలములైనవి పేర్కొనఁబడియున్నవి. రామకృష్ణకవి కువలయాశ్వుని "కుమారసదృశమానితవీర్యోదారుఁ" డని పేర్కొనెను. అతఁ డొనర్చు విహారములలో వీరప్రధానములైన 'వివిధాస్త్రశస్త్రనయశాస్త్రపరిశ్రమనైపుణ్యములు' కానరావు. కాని వనవిభ్రమములు మాత్రము విపులముగాఁ గానవచ్చును. పూవు పుట్టగనే వాసన విరజిమ్మునట్లు ఈరాజకుమారుఁడు యుక్తవయస్కుఁ డగునప్పటికి వనవిలాసములం దాసక్తుఁ డయినట్లు చిత్రింపఁబడినాఁడు. భావిశృంగారకథ కనుకూల మగు చిత్తవృత్తి నాయకునియందు సూచించుట కవితాత్పర్య మిచ్చట !

3. వసంతర్తువర్ణనము రసానుకూలకల్పనము :

కువలయాశ్వుఁడు గాలవాశ్రమమునకు యాగసంరక్షణార్థ మరుదెంచినప్పుడు వసంతాగమ మైన దని రామకృష్ణకవి 4 పద్యములలో నాఋతువిలాసవర్ణన మొన

ర్చెను; (1.19-23) అందు 'లయగ్రాహి' వృత్తములను రెండింటిని, సీసములను రెండిం టిని వాడి వసంతవిపులప్రభావమును విపులవిశేషవృత్తరచనమున వ్యంజింపఁజేసెను.

పురాణములందు ఋతువర్ణనము లేదు. చిననారాయణకవి గ్రీష్మర్తువర్ణనము చేసెను. ఈకవి దానిని వసంతముగా మార్చెను. కావ్యనామము మదాలసాపరిణయము కావ్యఫల మని సూచించుచున్నది కావునను, గాలవాశ్రమప్రవేశము నాయకునకు నాయికా ప్రాప్తికి హేతు వగుచున్నది కావునను, ఉచితసమయమున నుచితఋతువర్ణన మొనర్చి రసవ్యంజనము చేయుట యిచ్చట కవిశిల్పము। గ్రీష్మవసంతములవర్ణనయందు భేదము కొంత భావించుటకు వీలున్నది. వీరరసముచేఁ దీప్తమైనట్టియు,- లేక - కరుణవిప్రలంభాది రసములచే తప్తమైనట్టియు శృంగారము కావ్యమునం దంగి యైనచో దద్వ్యంజకముగా గ్రీష్మమును వర్ణించుట శిల్పము. శృంగారైకప్రధాన మైన వస్తువును వ్యంజింపఁ గల శక్తి వసంతర్తువునకు కలదు. కువలయాశ్వచరిత్రమును శృంగారరసప్రధాన మొనర్చినను, వీర రసాంగత్వమును వర్ణించి తీరవలెను కావున ఋతువర్ణనమున చిననారాయణ కల్పనము రామకృష్ణకవికల్పనముకంటె శిల్పసార్థక్యము కలది యనవచ్చును। ఈకవికి నాయ కుని పరిణయము నందున్న యనురక్తి పరాక్రమునఁ గానరాదు।

### 4. మదాలసాకువలయాశ్వుల ప్రథమసమావేశము మూలకల్పనముకంటె విలక్షణమైనది :

మదాలసాపరిణయమున మదాలసాకువలయాశ్వుల ప్రథమసమావేశము విలక్షణ ముగా వర్ణింపఁబడినది. కువలయాశ్వుఁడు పాతాళవివరమునఁ బ్రవేశించి ఘోరాంధకార నిర్మగ్నమైన మార్గమునఁ గొంత దవ్వేగి కోటిసూర్యప్రభావిభవ మైన యొకపురిని గాంచి యం దొకచోట దివ్యసుందరి యైన మదాలసను గాంచి, యామె సౌందర్యవిలాసములకు ముగ్ధుఁడై, మదనబాణపరవశుఁడై యామెను పరిణయమాడ వేడుకొనును. ఆమెను గౌఁగిలి నిమ్మని ప్రార్థించును. మదాలసకు సిగ్గు ముంచుకొనివచ్చును. గిరుక్కున తిరిగి చెలులు వేచియున్న యంతర్భవనములోనికిఁ బోవును. మూర్ఛపోయి చెలులశీతలోపచార ములచే మేల్కాంచి శయ్యాతలమున నున్న మదాలసను కువలయాశ్వుఁడు చూడఁబోవును. కుండల మదాలసాజనకుఁ డగు విశ్వావసుని రప్పించి కన్య నిచ్చి పరిణయము చేయించెను. మదాలసాకువలయాశ్వుల శోభన మారాత్రి జరిగెను. మరునాఁ డుదయమున మామగా రిచ్చిన యొక దివ్యరథ మెక్కి కువలయాశ్వుఁడు మదాలసాద్వితీయుఁడై గుహామార్గము వెలువడుచుండ రాక్షససైన్య మాతనిఁ జుట్టుముట్టును. కథ యిట్లు సాగును.

పురాణములందు కువలయాశ్వుఁడు మొదట చూచునది కుండలను. ఆపైన విర హార్త యయి యున్న మదాలసను. నాయికానాయకులకు ప్రథమవీక్షణము కలుగక పూర్వమే నాయకుని నాయికనిగూర్చిన పరిచయము కలదు. "సురభి" కువలయాశ్వుఁడు భర్త యగు నని సూచించెను. పురాణములందు లేని కనుకలిని చిననారాయణకవి కల్పించి నాడు. ఇవి యిట్లుండ పురాణప్రబంధకల్పనలన్నియు నాయకుఁడు విరహార్తయై యున్న

నాయికను జూచినట్లే చెప్పుచున్నవి. వానిలో రసపుష్టి కాస్కార మున్నది. రామకృష్ణ కవి కల్పనలో నాయకుఁడు నాయికను గాంచి నప్పు డామెకు విరహ మను ప్రసక్తియే లేదు. కనీసము రాక్షసునిచేఁ గ్రహింపఁబడినందులకు చింతయైనను గానరాదు. చెలు లింటిలో నుండ తా నొంటరిగా నేలనో బయట తిరుగుచున్నది! ఏమైనను నాయకుఁ డామె నొంటిగా ముందు చూడఁగలిగినాఁడు! తనమనోవేదనను వెళ్ళఁబోసుకొనినాఁడు. సిగ్గుతోఁ దనను కా దని లోని కేఁగిన నాయికచిత్తవృత్తి కుత్తలపడినాఁడు. లోని కేఁగి మఱల మదనపాఠమును వల్లెవైచినాఁడు.

మదాలసామదనావస్థలను ఈకవి విపులముగా వర్ణించి ప్రబంధమర్యాదను నిలువఁ బెట్టుకొనెను. కాని ఆపాత్ర కాభావము లన్నియు ప్రభవిల్లి, ప్రవృద్ధిఁ గాంచుటకుఁ దగిన వ్యవధానము మాత్ర మీయలేదు. అందువలన నావర్ణనమంతయు ననహజముగా భాసించు చున్నది. సమయము లేనప్పుడు వర్ణనాంశములు తగ్గించుకొనరాదా! ఈకవి కది నచ్చదు. ఆకాసంతకాలములోనే 'అపరిమితవిరహతాపమునకుఁ' బాలయ్యె నని మన్మథ దశావస్థలను వర్ణింపవలెనా![2] మన్మథోపాలంభనాదులు చేయింపవలెనా![3] ప్రాణహననో ద్యోగమున కుపక్రమింపఁజేయవలెనా?[4] ఇంత చేయుటయు నాయకుని ముంగిలిలోఁ బెట్టు కొనియే. అతఁడు లోనికి వచ్చునరగడియలోపలనే శృంగారలాంఛనములన్నియుఁ జెల్లిన వని కవి సంతోషించినాఁడుకాని వానిప్రయోగలాఘవమునుగూర్చి యినుమంత ఆలో చింపలేదు! ఏమైనను ఈవర్ణనము రసానుకూల మనుటలో విప్రతిపత్తి లేదు!

5. మదాలసామనోవాంఛాకల్పనము రసోద్దీపకము :

పురాణములందు పాతాళకేతునిపై బాణము నిగుడించిన వీరుఁడు మదాలసకు పతి యగు నని సురభి నిర్దేశించెను. చిననారాయణ దానిని తొలగించి కనుకలిని ప్రవేశ పెట్టెను. ఈకవి మదాలసాచిత్తమున నొకయభిలాష కల దనియు కుండలచేత నిట్లు చెప్పించెను!

"అధిప! మాసతి సర్వజ్ఞుఁ డగుచు మరుని
గేరి కడకంటిలీలనే గీటణంచు
నట్టి ఘను రాజశేఖరు నాత్మఁ గోరు
నీశ్వరేచ్ఛ యెటు లున్నదో యెరుఁగరాదు! (3.12)

శ్లేషచమత్కృత మీవాక్కు. రాజశ్రేష్ఠుఁ డను నర్థము ప్రకృతము. పరమేశ్వరార్థ మప్రకృతము. కాని ఆరాజశేఖరుఁడు రాజశేఖరునంతటివాఁ డని నాయికాచిత్తము. ఇది పూర్వకల్పనలకన్న విలక్షణము. నాయిక యొకయాదర్శసుందరమూర్తిని లక్ష్యమునం దుంచుకొని తచ్చిద్ధికొఱకు ప్రతీక్షించుచుండెను. ఆప్రతీక్ష కువలయాశ్వదర్శనమున ఫలించె ననుట వస్తుధ్వని. నాయిక కోరినది యందము. నాయకుఁ డందగాఁడుగాఁ

2. మదాలసా పరి. 2. 49-55; 85-95. 3, మదాలసా పరి. 2. 102-124.

4. మదాలసాపరి. 2. 125-128.

జితింపఁబడెను. మనోహరాకృతివీక్షణముచేఁ బ్రేరేపింపఁబడిన రతి తచ్చింతతోఁ బరిపుష్ట మైనది నాయికయందు.

6. మదాలసాకువలయాశ్వుల శోభనకల్పనము రసాకూల మనియే కల్పింపఁ బడినది.

మదాలసాకువలయాశ్వులవివాహము పాతాళమునఁ జరిగినట్లు పురాణములును, ప్రబంధములును గల్పించినవి. రామకృష్ణకవి మఱియొక మెట్టు ముందుకు వైచి అచ్చటనే యారాత్రి శోభనముహూర్తముకూడ పెట్టించి తంతు నడిపించినాఁడు! ఈఘట్టమును దృతీయాశ్వాసమున నేఁబదిగద్యపద్యములలో కవి వర్ణించెను. మదాలసాపరిణయ మని ప్రబంధమునకు పేరుపెట్టి పరిణయఘట్టము నొక చిన్నవచనమునఁ దేలగొట్టిన యీకవి యౌచిత్యము నేమనవచ్చును! పరిణయముకంటె శోభనము రసహేతు వని యీతని కమ్మకము కాఁబోలు! పాతాళకేతుసంహార మొనర్పఁబోవు నాయకుఁడు నాయికాసమాగమాసక్తుఁ డైనట్లు వర్ణించుట ధర్మవీరపోషకము కాదని విజ్ఞు లిచ్చట తలంచుట కవకాశమున్నది. ప్రళయమునకు ముందు ప్రణయము రసాభాస మగును. పాతాళమున రాత్రి వేగించుట యర్థపుష్టిలేనికల్పనము. పరమశత్రుగృహమునం దైనను భయమన్నది లేక వివాహశోభనసంభారముల నిర్వహించిన విశ్వావసునిగొత్పతనమే గొప్పతనము! దానవునికి జంకి తనూజను దెచ్చుకొనలేని యావీరుఁడు కన్యాదానఫల మైనను దక్కించుకొనినాఁడు! ఇంత జరుగుచున్నను పసికట్టలేని యాపాతాళకేతుపరిపాలనమును మెచ్చుకొనవలెను! మూలమునఁ దల్లిదండ్రుల చాటుబిడ్డ కువలయాశ్వుఁడు. అందువలన భార్యను వారికిఁ జూపి గాని ప్రక్కనఁ జేర్పలేదు. కాని యీకవి మూలము ననుసరించుచునే శత్రుజిన్మహారాజును విస్మరించెను. ఉత్తమశిల్పి యైనవాఁ డీకల్పన నిచ్చట మెచ్చుకొనఁడు! కాని దానివర్ణనమునకు ముచ్చటపడక మానఁడు! సంవిధానకౌశలము నటుంచినచో నిది సరసమైనవర్ణన మనుటలో సంశయము లేదు!

7. సూకరాకారుఁ డైన రక్కసుఁడు పాతాళకేతుఁడు కాఁడు:

గాలవాశ్రమసంరక్షణోద్యోగుఁ డైన కువలయాశ్వుని సూకరాకారుఁడైన పాతాళకేతుఁ డెదిరించె నని పూర్వకావ్యములం దుండ యీకవి యట్లు డీకొనిన వాఁడు పాతాళకేతుసేనానులలో నొకఁ డగు సూకరాస్యుఁడని పేర్కొనెను. పురాణములందలి సురభివాక్యకల్పన మిందు లేదు కావున నీకల్పనకు భంగము లేదు. పాతాళకేతుఁడు పాతాళపతి యనియు, నాతఁడు తన సేనానులను భూతలమున కంపి ఋష్యాశ్రమములఁ బీడించుచుండె ననియు, నాతని సేనానులంద ఱాకువలయాశ్వునిధాటికి వీగిపోగా చివరకు తానే కదలివచ్చి యతనిని డీకొనె ననియు నర్థ మేర్పడి ప్రతినాయకపాత్రపోషణమున కీకల్పనము సహాయక మగుచున్నది. పురాణాదులందు ఒకసారి వీగినవీరునిపై విజయము సాధించెనే గాని వేఱుకా దను విమర్శ నాయకునిపై రాకుండ రామకృష్ణకవి రక్షించెను.

8. రథకల్పనము చేయుట కువలయాశ్వకల్పనమును విస్మరించుటయే :

మదాలసాకువలయాశ్వులవివాహశోభనానంతరము విశ్వావసుఁడు ఒకతే రాయితం బొనరించి మదాలసాసహితంబుగా నాఋతధ్వజుని నం దుంచి యింటి కంపినట్లు కల దీకావ్యమున. ఈకవి యిచ్చట పెద్దతప్పు చేసినాఁడు. పూర్వాపరకథార్థసంవిధానము కథాకథనశిల్పప్రాణము. ఇక్కడ మామ యిచ్చెను కదా యని రథ మెక్కినాఁడు పెండ్లికొడుకు ! మఱి గాలవమహర్షిదత్త మైన యాతని కువలయాశ్వ మే మైనది ? సూకరాస్యునిఁ దరుముకొని వచ్చునవసరమున "బంధురహయమే సహాయముగ" బయలుదేరినవాఁడుకదా ! పాతాళమునఁ బడతినిఁ జూచినాఁడు పడుచువాని కశ్వము మఱుపునఁ బడినది. కవిగారి కంతకుపూర్వమే విస్మృతి వ్యాపించినది. మామగా రా వివాహమహోత్సవంబున రుచిరనవరత్నఖచితప్రభాకందళంబులగు స్యందనంబులను, నీలగిరిసన్నిభంబులగు నిభంబులను, జవహసితసైంధవంబులగు సైంధవంబులను, రణోదంచితవిస్ఫూర్తార్భటు లగు భటులను, దాసదాసీజనంబులను, నమ్మేదినీకాంతునకుఁ గట్నంబులు చదివించె నని చెప్పుట యందు నత్యంతశ్రద్ధ వహించెనుగాని కువలయాశ్వము నాతఁడు దిగెనా?లేదా! దానిగతి యే మైన దన్న యంశమును మాత్రము కవిపట్టించుకొనఁడు. బుట్టెడుగాజుపూసలు ప్రోగుచేసి మూటగట్టి యివ్వగా నాపెండ్లికొడుకు పొంగిపోయెదే గాని రత్నము నొకదానిని పారవైచుకొంటి నని మాత్ర మాలోచింపఁడు. కవిగారి కల్పనాశక్తి యిక్కడ కలతపడినది. మిశ్రవస్తువులోఁ బ్రాతక్రొత్తల మేలుకలయిక జరుగవలెఁ గాని, క్రొత్తనీరు వచ్చి ప్రాతనీటిని నెట్టివైవరాదు కదా !

9. వస్తువిస్తృతి-వర్ణనలు :

కువలయాశ్వోపాఖ్యానము నీకవి ప్రబంధముగా నిర్మింపఁబూనుటచే వస్తువిస్తృతికై వర్ణనాదుల నీతఁడు బహుళముగా నొనర్చెను ఈ ప్రబంధవస్తువున కస్తిపంజరము పురాణవస్తువు. ఆకారపుష్టి కేర్పఱచిన కండరాదులు వర్ణనలు. స్థూలముగాఁ బరిశీలించినచో నవి యిట్లుండును :

1. ప్రతిష్ఠానపురవర్ణనము (1.29-49); 2. శత్రుజిన్మహారాజవర్ణనము (1.50-53); 3. ఋతధ్వజవిహారవర్ణనము (1.54-59); 4. ఋతధ్వజుఁడశ్వారోహణము సేయుట (2.7-9); 5. గాలవాశ్రమతపోవనవర్ణనము (2.10-18); 6. వసంతర్తువర్ణనము (2.19-23); 7. మదాలసావర్ణనము (2.36-47); 8. ఋతధ్వజవర్ణనము (2.49-55); 9. మదాలసావిరహవర్ణనము (2.85-94; 2.102-128); 10. సౌధవర్ణనము (3.5); 11. వివాహవర్ణనము (3.24); 12. రాత్రివర్ణనము (2.26-31); 13. నాయికానాయకులశోభనవర్ణనము (3.32-82); 14. యుద్ధవర్ణనము (3.87-113).

10. మూలమునుండి గ్రహింపని కొన్నికథార్థములు :

మూలమున నశ్వతరునిపాత్ర యుదాత్తముగాఁ బోషింపఁబడియున్నది. ఆతని యుత్సాహదీప్తి యనంతమైనది అది యతనిమాటలలో, చేష్టలలో వ్యక్తింపఁబడుచుండెను.

రామకృష్ణకవి యేలనో యాతని బిగువైనసంభాషణలను గ్రహింపక పాత్రయొక్క జిగిని బలిపెట్టెను. పురాణములందు- పరోక్షమునఁ గీర్తింపఁబడుపుత్త్రినిఁ గన్నతండ్రిజీవితము ధన్య మనియు, మిత్రున కుపకారము చేయని వానిజీవితము కుచ్చిత మనియుఁ జెప్పువాక్యములను, సమధికతమవిహితోద్యోగునకు సాధ్యము కాని దేదియు లేదని పల్కువాక్యములను- ఈకవి గ్రహింపలేదు. నాగకుమారులు తండ్రితో చెప్పువాక్యములందును మూలమున నున్న యాప్యాయతకాని, గాఢస్నేహశీలము గాని కానరాదు.

కుండలాపాత్ర కీప్రబంధమునఁ బురాణము లందున్నంత ప్రాముఖ్యము లేదు. ఈమె చెలికత్తెలలో నగ్రగణ్య; సమర్థురాలు. అంతియ. అంతకంటె మఱివివరములు తెలియవు. వివాహానంతర మీమె యీయవలసిన సందేశము మామగా రిచ్చుటచే నీమెస్థితి మఱియు నిస్సారమైనది. కువలయాశ్వమే యీకథాగర్భమున కంటికి కనఁబడకుండ పోయినది. ఇక కుండల యెక్కడ నిలచును!

మొత్తమున కీకవి కావ్యనాయికానాయకుల శృంగారవర్ణనములందుఁ జూపిన యాసక్తి కథాప్రత్యంగపోషణమునఁ జూపలేదు. అందువలన పురాణకథలో నున్నసమతాగుణము కొంత శిథిలమైనది. వస్తు వసమగ్రమై యుండుటచే సమగ్రపరిశీలనమున కవకాశము లేకున్నది.

### మదాలసాపరిణయముపై పురాణప్రభావము :

రామకృష్ణకవి పురాణకథాక్రమము ఉత్తమపద్ధతికిఁ జెందిన దనియు, కార్యకారణసంబంధక్రమమునఁ జెప్పినకథ శిల్పసుందర మగు ననియు తలంచి తనకావ్యమును మొదలుపెట్టియుండును. పురాణకథలోని సన్నివేశసంవిధానక్రమమే ప్రబంధసన్నివేశ రచన కాదర్శప్రాయమై యున్నది. కథ నడచినతీరు పురాణసంబంధి; కథ యెదిగినతీరు ప్రబంధసంబంధి.

మారనకవి వరాహరూప మెత్తిన రక్కసుని విజృంభణమును సీసమున నెత్తుకొని, శబ్దానుకరణములైన "ఘురఘుర" నాదముల నందు మ్రోయింపఁ జేసెను.[5] ఉపాఖ్యానమున రెండు చరణములు వ్యాపించి నడచిన యీవృత్తగతిని రామకృష్ణకవి గ్రహించి, వృత్తవ్యాప్తిగాఁ దనప్రబంధమున నావరాహ వర్ణనమున నిబంధించుకొనెను.[6] ఋతధ్వజుఁడు ప్రవేశింప మందిరాంతర్గత మైన శయ్యనుండి మదాలస దిగ్గన డిగ్గి నెచ్చెలులచాటున నిల్చె మూలము. చిననారాయణకవియామెతెరచాటున నిల్చె నని వ్రాసెను కాని, రామకృష్ణకవి మారన చేపట్టిన ఛందము నేగైకొని పురాణభావమునే వర్ణించెను.[7] ఇట్లు వర్ణనావిశేషములందు స్వీయప్రతిభావిశేషములను బ్రకటించుకొనినను కథార్థములనుమాత్రము మూలమునుండియే గ్రహించుచు నీకవి తన ప్రబంధమును నిర్వహించెను.

5. మారనమార్క, 2.288. 6. మదాలసా పరి. -2.28.

7 మారన మార్క. 2.297 = మదాలసా పరి. 3.7.

# మదాలసా విలాసము

సంస్కృతాంధ్రమార్కండేయపురాణములందలి కువలయాశ్వోపాఖ్యానములను, నవరము చిననారాయణకవి విరచిత కువలయాశ్వచరిత్రమును బరిశీలించి తత్కథను సర్వాంగసంపూర్ణ మొనర్చి యొకప్రబంధముగా నిర్మించిన గౌరవము శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికి దక్కుచున్నది. వీరిచే రచింపఁబడిన మదాలసావిలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. అవతారికలోని 160 పద్యగద్యములను వదలినచో కథా భాగమంతయు 686 పద్యగద్యములందు రచింపఁబడినది. మునిత్రయచరిత్ర శంకరవిజయాది కావ్యనిర్మాత యైన శ్రీశాస్త్రిగారు విద్వత్కవి. వారియీకావ్యము కవిపండితుల మన్ననల నందుకొని యున్నది.

శా. మార్కండేయపురాణ మెల్ల బుధసమ్యగ్బోధనన్ వింటి నా
లర్కాంబాపద మౌ మదాలసకథాలాపంబు తాపాంధకా
రార్కద్యోతము నై పుమర్థఫలదంబై యందుఁ దోచెన్ శుభో
దర్కప్రక్రియఁ దత్సతీచరిత సంధానింపు కావ్యంబుగన్. (మ. వి. అవ. 12)

అను కృతిపతియాదేశము ననుసరించి శ్రీశాస్త్రిగారు మార్కండేయపురాణాంతర్గత మైన మదాలసాచరిత్రమును ఋతధ్వజునస్సమాగమ పర్యంతముగాఁ గైకొని నిర్మించిరి. పురాణ కథలో సంగ్రహముగాఁ జెప్పఁబడియున్నట్టియు, విడువఁబడియున్నట్టియు నైన కథాంశము లను వీరు పెంచియు, కల్పించియు కథను సమగ్రముగను రసవంతముగను నొనర్చి ధన్యులైరి.

పురాణమున నీకథ జడోపాఖ్యానాంతర్గత మైనది. కథకుఁడు జడుడు; శ్రోత భార్గవుఁ డను విప్రుఁడు. జడోపాఖ్యానమును ధర్మపక్షులు జైమినిమునికిఁ జెప్పెను. శాస్త్రిగారికి ఉపాఖ్యానాంతర్గతకథయే ప్రస్తుత మగుటచే జడుఁడు భార్గవునకుఁ జెప్పినట్లు గ్రహించుట యుచిత మగుచున్నది.

శత్రుజిద్భూపాలుఁ డేలునగరము రత్నపుర మని శాస్త్రిగారు కల్పించిరి.[1] ఆరాజు సార్థకనామధేయుఁ డని నిరూపిత మగునట్లతని వర్ణనము నిర్వహించిరి.[2] ఋతధ్వజుఁడు మిత్రులతోఁ జరుపు క్రీడలను సంస్కృతపురాణానుసారము వివరించిరి.[3] అతఁడు నగరబహిస్సుందరనందనమున సరసజలపూరితాంబుజాకరముతటిని నుల్లసిలు పైడిమేడయందు ఆప్తమిత్రానపాయి యగుచు నివసించె నని వివేకించి చెప్పిరి.[4] అశ్వ

1. మదాలసా విలాసము 1.1 2. మదాలసా విలాసము 1.2–4.
3 ,, ,, 1.9 4. ,, ,, 1.8.

తరుఁడు తనపుత్త్రులు పగటివేళల రసాతలమునందు వసింపక విచ్చలవిడిగా తిరుగుచున్నందులకు వారిని మందలించి యుక్తవయస్సులో విద్యాభ్యాసము చేయమి కల్గుకష్టనష్టములు వివరించినట్లు సందర్భోచితముగాఁ గల్పించి యుపదేశమును నిర్వహించిరి.[5] నాగకుమారులు తండ్రితో ఋతధ్వజవృత్తాంతము చెప్ప నారంభించునెడ నగరభూపాలయువరాజవర్ణనములను నాతివిపులముగాఁ జొప్పించి యౌచిత్యము వీడని ప్రబంధమార్గము ననుసరించిరి.[6] గాలవమహర్షి కువలయాశ్వసహితుఁడై శత్రుజిద్భూపాలుఁడు సభాప్రవేశ మొనర్చినఘట్టమును, పాతాలకేతుదురంతకథనమును, సవివరముగను స్వాభావికముగను వివరించిరి.[7] ఋతధ్వజుఁడు పాతాళమునఁ గాంచననగరప్రవేశ మొనర్చుఘట్టమున మారన చూపిన మార్గము ననుసరించి నగరవర్ణన మొనర్చిరి.[8] మదాలసాకువలయాశ్వుల ప్రథమవీక్షణఘట్టమున మూలముకంటెఁ గొంతవైశిష్ట్యము గల కల్పనము చేసి శాస్త్రిగారు సన్నివేశసంవిధానశిల్పమును వెలార్చిరి. పురాణములందు కువలయాశ్వుఁడు సువర్ణభవన మెక్కి హుటాహుటి మదాలసాశయనమందిరమునకు వెడలినట్లు కలదు. ఈప్రబంధమున- 'రాజపుత్త్రుఁడు ప్రాకారద్వారమునొద్ద నశ్వము దిగి లోని కరుగవచ్చునో లేదో యని కొంచెము సందేహించి యొకటిరెండుకక్ష్య లతిక్రమించి సాహసింపలేక నాల్గవకక్ష్యయందు గల వృక్షవాటిక న్నిలిచి, తలయెత్తి మేడవంకఁ గనుఁగొన దొలకరిమెఱుపువంటి యొకయువతి గనఁబడెను. ఆయతివచూపులో నేదియో భావమున్నట్లు గ్రహించి యాతఁడు కలఁగుచుండెను. అమగువయుఁ గొంచెముసేపు చూచి తటుక్కున గవాక్షమునొద్ద కేఁగి తనవంకఁజూచుట యరసి తనయందాసుందరికి వలపు గలదో లేదో యని యతఁడు తత్తఱపడుచుండెను. తనయూహ తప్పేమో యని సంశయించెను. చెలియ గవాక్షమునొద్దను గనఁబడకుండెను. ఆసమయమున కుండల వేగముగా వచ్చి "యార్యా! యీమేడయందున్న మావయస్య కారణ మేమియు లేకయే మూర్ఛపోయినది. ఏదియే నుపాయముచే నామెమూర్ఛ తొలగించి రక్షింపు" మని కోరుచు నతనిఁ దోడ్కొని చని శయ్యపై మూర్ఛిల్లియున్న నెలతఁ జూపింప రాజకుమారుఁడు చెంగటి కేఁగి "కాంతా భయపడకుము కన్ను విచ్చి నన్నుఁ జూడు" మని పలుకరింప, నమ్మగువ కన్ను దెఱచి చూచి సిగ్గున శయ్య డిగ్గి తెరచాటున కరిగెను"- అని కల్పింపఁబడెను. పురాణమునందువలె నీకావ్యమునందును కనుకలి ముందుగను, వినుకలి యాపైనను కల్పింపఁబడినను, ప్రథమసమావేశమున నాయకప్రవేశమున కొకరమణీయహేతువు సృజింపఁబడుటచే సన్నివేశము సార్థకమును, సహజమును నై శోభిల్లుచున్నది. మదాలసాకుండలలవృత్తాంతకథనమును మూలాతిశయముగా వివరించియు, మదాలసాశృంగారహావభావములను రసోదంచితముగా వర్ణించియు, నూతనవధూవరులకు కుండల యొనర్చిన సతీపతిధర్మబోధను పురాణతాత్పర్యము తేటఁబడ విపులీకరించియు శ్రీశాస్త్రి

5. మదాలసా విలాసము 1.13-19. 6. మదాలసా విలాసము 1.22-30.
7. ,, ,, 1.47-61; 62-78. 8. ,, ,, 1.108-115.

గారు నాయికానాయకుల వివాహఘట్టమును నిపుణముగా నిర్వహించిరి. ఇచ్చట కావ్యమునఁ బ్రథమాశ్వాసము ముగింపఁబడినది.

ద్వితీయాశ్వాసమున కువలయాశ్వుఁడు పాతాళకేతుసంహారఘట్టమున మారన రచనము ననుసరించి శ్రీశాస్త్రిగారు యుద్ధవర్ణన మొనర్చియుండిరి. ఇచ్చట కువలయాశ్వుఁడు మదాలసాద్వితీయుఁడై గాలవమహర్షిని దర్శించి, రాక్షసపీడానివృత్తి నాతని కెఱిఁగించి, యతని యాశీస్సుల నంది నిజపురమున కేఁగినట్లు వర్ణించి పురాణకథయందు లేని యౌచిత్యమును బోషించిరి. మదాలసాకువలయాశ్వులు నగరప్రవేశ మొనర్చునెడ పురజనులు నవవధూసౌందర్యమును వేనోళ్ళ కీర్తించినట్లు వర్ణించి సందర్భశుద్ధినిఁ బ్రకటించిరి.[9] శత్రుజిత్తు పుత్త్రుని ధీరోదాత్తగుణములను గీర్తించుటయు,[10] మదాలసా కువలయాశ్వుల శృంగారవిలాసములను [11] శ్రీశాస్త్రిగారు మారనకృతి ననుసరించి రసోదంచితముగా విస్తరించిరి. శత్రుజిత్తు పుత్త్రునకు ఋష్యాశ్రమరక్షణ విధి యవశ్య కర్తవ్య మని బోధించినవిధమును విపులీకరించిరి.[12]

తాళకేతుఁడు కపటమునిరూపము దాల్చి కువలయాశ్వుని మోసగించిన ఘట్టము పురాణకథకంటె వివిధకథాంశవిస్తారముగను, సమయోచిత రసభావపోషకముగను శ్రీ శాస్త్రిగారు నిర్వహించిన విధము గణనీయము[13]. మదాలస భర్తృపరాక్రమము నందుఁ గలవిశ్వాసము ప్రకటించిన విధమును, తాళకేతుఁడు కువలయాశ్వుఁడు నమ్మునట్లు వర్తించినతీరును కవిగారు నేర్పుగా విశదీకరించిరి. తాళకేతు కపటవర్తనమువలన రాచనగరులో నుత్పన్నమైన యిక్కట్టులను కవి తనకుఁ దానుగాఁ జెప్పినట్లు కాక మంత్రులచేఁ గువలయాశ్వునకుఁ జెప్పించి కథాకథనశిల్పమును బ్రకటించిరి. కపటముని కువలయాశ్వమరణవృత్తాంతమును మదాలసతో మాత్రమే చెప్పినట్లు పురాణములం దుండ, దానిని మార్చి శత్రుజిన్మహారాజు కొలువుకూటమున నెలుగెత్తి యేడ్చుచు విన్నవించె నని వర్ణించి మూలమునందుకంటె కథను బ్రసన్న మొనర్చిరి. మదాలసామరణ వృత్తాంతమును విని కువలయాశ్వుఁడు దుఃఖించిన విధమును మూలాతిరిక్తముగా వర్ణించి కరుణరస పోషణము గావించిరి.[14]

అశ్వతరుఁడు సరస్వతీదేవినిగూర్చి తపము చేయుటయు, నామెను ఉపనిషదర్థ యుక్తముగా స్తుతించుటయు నీకవి సంస్కృతపురాణార్థముల ననుసరించి విస్తరించెను.[15] మారన చూపిన సూచనము ననుసరించి కంబళాశ్వతరులు శివుని గానముచే సేవించిన ఘట్టమును పెంచి రచించుటయే కాక [16] వారి గానపాండిత్యము తేటపడునట్లు కావ్యరచనము నిర్వహించి[17] శ్రీశాస్త్రిగారుసార్థకకథార్థపోషణశిల్పమును బ్రకటించిరి. పరమేశ్వ

9. మదా. విలా. 2.24-27.
10. మదా. విలా 2.29-32
11. ,, ,, 2.37-41.
12. ,, ,, 2.48-49
13. ,, ,, 2.52-149.
14. ,, ,, 2.150-169
15. ,, ,, 2.184-194.
16. ,, ,, 2.196-204
17. ,, ,, 2.207; 208-214.

రాశ్వతరుల మధ్య జరిగిన సంభాషణము శ్రీశాస్త్రిగారి సన్నివేశనిర్వహణసామర్థ్యమునకుఁ జక్కని యుదాహరణము.[18]

తాళకేతుసంహారఘట్టకల్పనము శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి యపూర్వ కల్పనాశక్తి కద్భుతోదాహరణము![19] పురాణకథలో యజ్ఞసంరక్షణ మొనర్చి తన కుపకారి యైన కువలయాశ్వుని భార్యావియోగానంతరము గాలవమహర్షి యాతని దర్శించి యోదార్చి నట్లు లేదు. మదాలసామృతికి తాళకేతువు కారకుఁడని కువలయాశ్వునకుఁ దెల్పినట్లు చెప్పఁబడలేదు. అందుచేత కువలయాశ్వుఁడు తన కపకారి యైన శత్రువును సంహరింప లేదు. మదాలసావియోగదుఃఖసాగరమగ్నుఁ డైకపటముని యెవ్వరా? యని సంశయించి, తెలిసికొనయత్నింపలేదు. ధీరోదాత్తుఁ డైన కువలయాశ్వుని చరిత్ర కిది యొక లోప మనక తీరదు. శ్రీశాస్త్రిగారు గాలవమహర్షినిఁ బ్రవేశపెట్టి యతనిచే కువలయాశ్వునకు తాళకేతుదురంతమును చెప్పించిరి. దివ్యదృష్టి కల ఋషినోట తత్కథనము చెప్పించుట శిల్పము. ఇందు శ్రీశాస్త్రిగారు కల్పించిన మఱొందు విచిత్రాంశము కలదు. తాళకేతుఁడు వరప్రభావుఁడు. రెండుకాళ్లు గల యేప్రాణియైనను అతనిని సంహరింపఁ జాలదు. కావున తాళకేతుసంహారము కువలయాశ్వున కసాధ్యము. కాని, అసాధ్యసాధనకై ఆవీరుఁ డుపక్రమించి ధీరుఁ డనిపించుకొనినాఁడు. అయినను అతనివలన నాకార్యము సాధింపఁబడుటకు వీలులేదు. శ్రీశాస్త్రిగారు ఈఘట్టమున కువలయాశ్వముయొక్కయు నాగకుమారులయొక్కయు సహాయ మాతని కందగా నిలిపినారు. నాగకుమారులు గూఢపాత్రులు, అశ్వము చతుష్పాత్తు - అగుటచే నసురసంహారదక్షత వారియందు సార్థకమైనది. దానితో మిత్రున కుపకృతి చేయు భాగ్యము నాగకుమారులకు లభించి నది. మార్కండేయమున నాగకుమారపాత్రల కిట్టి సార్థక్యము లేదు. అందు అశ్వతరున కున్న ప్రాధాన్యము తత్కుమారులకు లేదు. శాస్త్రిగారికావ్యమున వారు వట్టిమాటలవస గలవా రను అపవాదును తొలగించుకొని కార్యశూరులును, మిత్రఋణవిముక్తులును నై ప్రకాశింపఁగలిగినారు. శాస్త్రిగారి యీకల్పనచే కథ సమగ్ర మగుచున్నది. కథలోని పాత్రల కన్నింటికిని సార్థక్య మేర్పడుచున్నది.

మదాలసాకువలయాశ్వుల పునస్సమాగమఘట్టమును శ్రీశాస్త్రిగారు పురాణకథాను సారముగా నిర్వహించి కథాంతమున నద్భుతరసమును బోషించిరి. పురాణకథలో నశ్వతరమదాలసల మధ్య నెట్టిసంభాషణము జరిగినట్లు చిత్రింపఁబడ లేదు. శ్రీశాస్త్రిగారు మదాలసాపునర్భవసందర్భమున నామె జాతిస్మృతి వ్యంగ్యమగునట్లును, మాయామదా లస యని భ్రమించి కువలయాశ్వుఁడు మృతినొందినప్పుడు పతియనురాగవ్యంజకముగను వారివురిమధ్యసంభాషణలను రసోదంచితముగా నిర్వహించి యౌచిత్యపరమావధిని సాధించిరి.

మార్కండేయపురాణాంతర్గత మైన కువలయాశ్వచరిత్రమున నాయికానాయకుల పునస్సమాగమపర్యంతము గల కథ తెలుఁగున ప్రబంధములుగా నవతరించినది. అది మదాలసావిలాసకావ్యమున సమగ్రస్ఫూర్తి సంతరించుకొనినది.

---

18. మదా. విలా. 2.215-234 19. మదా. విలా. 3.17-77

# హరిశ్చంద్ర చరిత్రము

ఋగ్వేదమునందును, మార్కండేయాదిమహాపురాణములందును బ్రసిద్ధిఁ గన్న హరిశ్చంద్రోపాఖ్యానకథకు స్వతంత్రాంధ్రకావ్యవస్తుగౌరవము బ్రప్రథమమునఁ గల్పించిన మహాకవి గౌరన.

శ్రీనాథమహాకవికి సమకాలీనుఁడైన యీకవి సరసలక్షణచక్రవర్తి బిరుదాంచితుఁడు, శంకరపాదపూజాభిరతుఁడు. ఇతఁడు హరిశ్చంద్రచక్రవర్తిచరిత్రమును ద్విపదకావ్యముగా సంతరించి దేశికవితాభినివేశమును బ్రకటించెను. శివకవుల కున్నంత మతాభినివేశ మితనికి లేకపోవుటచే నితఁడు తనకవిత్వమును రసైకశిల్పరమణీయముగా రచింపఁగలిగెను. ఇతని కపూర్వకల్పనాశక్తి వెన్నతోఁ బెట్టినవిద్య. ఇతనిశైలి జీవశక్తి గలిగి యిటు కథాకల్పనాచమత్కారమును, అటు రసభావపరిపోషణమును వ్యక్తీకరించుచు ద్విపద చ్ఛందస్వీకారసార్థక్యమును జాటుచున్నది.

## గౌరనకావ్యకథామూలము :

ఋగ్వేదమున హరిశ్చంద్రుని నరమేధవృత్తాంతము చెప్పఁబడియున్నది.[1] పుత్రార్థియై హరిశ్చంద్రుఁడు వరుణునిఁ బూజించి యతనివరముచేఁ బుత్త్రునిఁ బొంది యతనినే నరమేధమున వరుణుని కర్పింతు నని మాట యిచ్చెను. పుత్త్రోదయానంతరము పుత్త్రవ్యామోహమున వరుణున కిచ్చినమాట పాటింపఁజాలక వరుణశాపమునకు గుఱియై జలోదరరోగపీడితుఁ డయ్యెను. తద్బాధానివృత్తికై క్రీతుఁడైన బ్రాహ్మణబాలుని, శునఃశేఫనామధేయుని, నరమేధమున యజ్ఞపశువుగా నుపయోగింప యత్నించెను. శునఃశేఫుఁడు చూచువారలగుండెలు కరఁగునట్లు దీనుఁడై విలపించి, విశ్వామిత్రునిదయకుఁ బాత్రుఁడై వరుణమంత్రము వడసి, దానిని పునశ్చరణము చేసి వరుణప్రసాదము పొంది తనప్రాణములను దక్కించుకొనెను. ఈకథలో హరిశ్చంద్రచక్రవర్తి సత్యవ్రతనిష్ఠాగరిష్ఠుఁడు కాఁడు. ఆడినమాట తప్పి, దుర్భరరోగబాధ నొందిన దురదృష్టవంతుఁడు. స్వీయపుత్త్రరక్షణార్థమై బ్రాహ్మణబాలకహననోద్యోగ మొనర్చిన కఠినహృదయుఁడు. ఉగ్రస్వభావుఁడైన విశ్వామిత్రునియందు గోచరించు జీవకారుణ్యభావ మైనను హరిశ్చంద్రునియందున్నట్లు ఋగ్వేదమునఁ జిత్రింపఁబడలేదు. అందువలన వేదహరిశ్చంద్రున కుత్తమనాయకత్వసిద్ధి లేదు.

---

1. ఐతరేయబ్రాహ్మణము, 33 వ అధ్యా. 1వ ఖండము నుండి 4వ ఖండము వఱకు.

మార్కండేయపురాణాంతర్గత మైన హరిశ్చంద్రోపాఖ్యానమునకును, ఋగ్వేదకథకును ఎట్టిసంబంధమును లేదు. పురాణకథ ప్రత్యేకప్రయోజనసిద్ధికొఱకై కల్పింపఁబడిన విశిష్టసృష్టి. ఇందు హరిశ్చంద్రుని నిర్మలసత్యధర్మనియతిని ప్రతిపాదించుటయే ప్రధాన తాత్పర్యము; ఉపపాండవజన్మమూలము నెఱిఁగించుట యవాంతరప్రయోజనము. హరిశ్చంద్రుఁడు నిర్మలధర్మాచరణప్రవణుఁడయ్యుఁ గౌశికుని కుటిలకోపాగ్నికి గుఱియై రాజ్యమును గోల్పోయి, భార్యాపుత్రుల నమ్ముకొని, తా నమ్ముడుపోయి చండాలదాస్య మొనర్చి, కాటికాపరియై పెక్కిడుములఁ బాల్పడినను సత్యవ్రతమును వీడక చివరకు సశరీరస్వర్గమును సాకేతపురీవాసులతోఁ గూడి యనుభవింపఁగలిగెను. ఈ కథాకల్పన మపూర్వము; మార్కండేయపురాణకర్తకల్పనాప్రతిభానిష్యందము; హరిశ్చంద్రనరవర ధర్మవీరచరిత్రప్రతిష్ఠాపనాచార్యకము; పుణ్యప్రదము. మార్కండేయము ప్రతిపాదించిన హరిశ్చంద్రసత్యవ్రతదీప్తిని నితరపురాణములు మక్కువతోఁ గీర్తించినవి. కాని, ఋగ్వేదకథాభాగమును గూడ పురాణకథకుఁ బూర్వభాగమున నిబంధించి వర్ణించినవి భాగవతదేవీభాగవతము లీమార్గము ననుసరించి శ్రుతిపురాణకథావిశిష్టమిశ్రవస్తువును సృజింప యత్నించుట దీనికిఁ బ్రబలతార్కాణము! విరుద్ధలక్షణములు కల యాకథా ద్వయము నెంతదగ్గఱకుఁ జేర్చి ముడివైచినను తిలతండులన్యాయము ననుసరించినవే కాని క్షీరనీరన్యాయము నలవరచుకొనలేక పోయినవి. కాని, మార్కండేయము ననుసరించిన తరువాతిపురాణము లాకథకు సర్వాంగసమృద్ధి యొనర్ప యత్నించి వినూత్న కల్పనలతోఁ బెంచి విశేషఖ్యాతిఁ గల్పింపఁ గలిగినవి. కథ క్రమముగా విస్తృతమై విలసిల్లినకొలఁది సత్యధర్మప్రబోధరూపమైన పురాణకథాతాత్పర్యమే పుష్టిమంత మగు చుండుటచే నానంతరకథల కెల్లను మార్కండేయము మూలకంద మగుచున్నది.

స్కాందపురాణమునందును హరిశ్చంద్రోపాఖ్యానము కల దను ప్రసిద్ధి కలదు. అది యచ్చముగా మార్కండేయపురాణాంతర్గతకథనే గైకొన్నను దేవీభాగవతమునందలి కొన్నికల్పనలుకూడ కలుపుకొని వెలసిన యొక సంపూర్ణకథాసృష్టి. అది పేరున కుపాఖ్యాన మైనను విస్తృతియం దొక కావ్యమువలెఁ గనవచ్చుచున్నది. పలువురు విమర్శకులును, సాహిత్యచరిత్రకర్తలును గౌరనాదులు రచించిన హరిశ్చంద్రకథలకు మూలము స్కాందపురాణాంతర్గతమైనకథ యనియే తలంచియుండిరి. కాని, శ్రీవజ్ఝల చినసీతారామ స్వామిశాస్త్రిగారు వారందఱియభిప్రాయములు సరిగా వని హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠిక యందు నిరూపించియుండిరి.

"మ.రా.రా.శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు మన యాంధ్రకవులు వర్ణించిన హరిశ్చంద్రకథ మార్కండేయపురాణమునుండి గ్రహింపఁబడిన దని యాంధ్ర కవుల చరిత్రము మొదటిముద్రణమున వ్రాయఁగా మ.రా.రా.శ్రీ పూండ్ల రామకృష్ణయ్య పంతులవా రామాటను నిరసించి యాంధ్రకవులహరిశ్చంద్రకథకు మూలము స్కాంద పురాణముగాని మార్కండేయపురాణము కాదని వ్రాసియున్నారు.

''స్కాందపురాణమునుండి పూర్వహరిశ్చంద్రకథకు మూల మగు సంస్కృతభాగము నంతయు బెంగుళూరుపట్టణమునందు 1882వ సం॥ మార్చి 27వ తేదీన ముద్రింపఁబడి యున్నది. శంకరకవి విరచితమగు తెలుగుకావ్యములో నగపడుచున్న కథయంతయు నం దగపడుచున్నది. మార్కండేయపురాణమునందలి హరిశ్చంద్రకథయు నందలి పేరులును సొంతముగాఁ జదివిన స్కాందమునందలి హరిశ్చంద్రకథంబోలి జనానురంజకమై యుండ లేదు. కాన మనదేశమున వాడఁబడు హరిశ్చంద్రకథ శ్రీ వీరేశలింగముగారు ప్రకటించినరీతిని మార్కండేయపురాణాంతర్గతము కా దనియు, స్కాందపురాణాంతర్గత మనియు, నొక్కివక్కాణించుచున్నారము. ''

" పైవాక్యములలో "తేదీన" అనుచో నన్న యవధారణార్థకాకారము వారు చూచినగ్రంథములలోఁ దేదీసంఖ్య వ్రాయఁబడ లేదనియు భోగటా చేసి వారు వ్రాసిరనియు సూచించుచున్నది. అందులకు సరిగా నిపు డొకనిర్మూలహరిశ్చంద్రోపాఖ్యానము సంస్కృతభాషామయ మగపడుచున్నది. అం దది యేతేదీని ముద్రింపఁబడినదో యే ముద్రాలయమున ముద్రితమైనదో వ్రాయఁబడలే దని వేఱ చెప్పనేల? దానికి ముఖపత్రమే లేదు. కాని పంతులవారు చెప్పినట్లు మనయాంధ్రకవులు వర్ణించిన హరిశ్చంద్రకథ యెల్ల వెలయుచున్నది. గ్రంథమునుబట్టి సైత మది యేపురాణమునుండి తీసి వ్రాయఁబడినదియు తెలియుట కాధారములు లేవు. బ్రహ్మనారదసంవాద మని మాత్రము దానివలనఁ దెలియవచ్చుచున్నది. దాని కాల మిది యని తెలియకున్నందున నద్దానిని మూలముగా గ్రహించుట సరికాదని తోచుచున్నది. రామకృష్ణయ్యపంతులవారు చిత్తగించినగ్రంథ మదియే యని సందేహము పొడముచున్నది. నిజముగా వీరు స్కాందపురాణభాగమునే చిత్తగించియున్నయెడల నక్కథ యాపురాణమునం దేఖండములోనిదో యేసందర్భమున నేయధ్యాయమున నున్నదో వ్రాయఁజాలకుందురా ? కావున వీరు చిత్తగించినది నిజముగా స్కాందపురాణభాగము కా దని తోచుచున్నది. ఈవఱకు నాకు లభించిన స్కాంద పురాణభాగములయందు హరిశ్చంద్రకథ యగపడనందున నం దాకథ యున్న దని కాని, లేదని కాని, యీరీతిగా నున్న దని కాని చెప్పఁజాలను. ఒకప్పు డట్లు స్కాందమున నున్నప్పు డదియే రామరాజభూషణుని గ్రంథమునకు మూల మనక గౌరనకవిగ్రంథమునకు మూల మనక శంకరకవిగ్రంథమునకు మూల మనుట కేమి యాధార మున్నదో తెలియకున్నది. మఱియు నిట్టియీదుర్బలమగు విమర్శనమును జూచి మ.రా. రా.శ్రీ.కందుకూరి వీరేశలింగముపంతులవారు సైతము తమయాంధ్రకవులచరిత్రము ద్వితీయముద్రణమునఁ దమ తొంటియభిప్రాయమును మార్చుకొనుట మిక్కిలి వింతగా నున్నది. మ.రా.శ్రీపూండ్ల రామకృష్ణయ్యపంతులు గారు స్కాందపురాణభాగ మనుకొనిరని వెనుక నుదాహరించిన బ్రహ్మనారదసంవాదరూప మగు గీర్వాణభాషామయనిర్మూల హరిశ్చంద్రోపాఖ్యానమునుండియే సంగ్రహించి వీరును గౌరనకవి చరిత్రమునఁ గొన్ని శ్లోకములను వ్రాసిరనుట సాహసము కాదు. వీరు నిజముగా స్కాందపురాణమునుండియే

యె త్తివ్రాసిన యెడల నాయా శ్లోకముల దిగువ నవి యేఖండములోని యేయధ్యాయము లోనివో స్పష్టముగా వ్రాయక స్కాందము అనిమాత్రము వ్రాసియుందురా ?*

''ఈవఱకు నాకు లభించిన పురాణములలో మార్కండేయపురాణ దేవీభాగవత ములలోని కథయే మనయాంధ్రకవులు చెప్పిన హరిశ్చంద్రకథకు సంబంధించియున్నది. కావున నదియే దీనికి మూల మని నేను తలంచుచున్నాఁడను: అందును మార్కండేయ పురాణస్థ హరిశ్చంద్రకథాభాగమే సవరింపఁబడి దేవీభాగవతమున వ్రాయఁబడినది. కావున దేవీభాగవతము దీనికి మూల మైనపుడు దానికి మూల మగు మార్కండేయ పురాణము దీనికి మూల మగుట విరుద్ధము కానేరదు. కావున శ్రీవీరేశలింగముపంతులవా రాంధ్రకవులచరిత్రము ప్రథమముద్రణమున వ్రాసినవ్రాతయే సరి యైనదని చెప్పవలసి యున్నది".[2]

వజ్ఝలవారివాదము సహేతుకముగా నుండుటచే గౌరన స్కాందపురాణకథ ననుస రించె నను వాదము పరాస్త మయినది. గౌరనకవి స్వతంత్రకల్పనాశక్తికి గౌరవము దక్కినది. అత్యుత్త మాంధ్రకావ్యేతివృత్తము సంస్కృతపురాణోపాఖ్యానముగాఁ బరివ ర్తింపఁబడి స్కాందమునందలి దని చెప్పఁబడిన దను నూహకు తావు కల్పించినది. అట్లగుటచే గౌరన హరిశ్చంద్రచరిత్రకథామూలము మార్కండేయమునఁ గల దనియు, కథాంగకల్పనలకు దేవీభాగవతము కొంత తోడ్పడిన దనియు నేర్పడుచున్నది.

కల్పనలు రెండు విధములు. అవి: 1. మూలమునందలి వస్తుతత్త్వమును, పాత్రల స్వభావములను మార్చుట కుపయోగించునవి 2. మూలకథయందలి ప్రధానప్రతిపాద్య వస్తువునకు సర్వాంగశక్తినిఁ గల్పించునవి. ఇందు నవరము చిననారాయణకవి కువల యాశ్వచరిత్రకథాకల్పనలు మొదటి విధమునకును, గౌరనకవి హరిశ్చంద్రచరిత్రకథా కల్పనలు రెండవవిధమునకును ఉదాహరణములు. మార్కండేయపురాణమునందలి కథకు సత్యధర్మమాహాత్మ్యము ప్రధానప్రతిపాద్యాంశము. దానిని బ్రతిపాదించుటకుఁ బురాణకర్త యెన్నుకొనిన కథాంగసోపానపంక్తి యిట్టిది :

1. భార్యాపుత్త్ర సహితుఁడైన హరిశ్చంద్రచక్రవర్తి కల్పనము.
2. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని సత్యధర్మాచరణనిష్ఠను బరీక్షింపఁబూనుట.
3. యజ్ఞదక్షిణను ముం దడిగి దానిని గైకొనక తరువాత రాజ్యదానమును స్వీకరించి హరిశ్చంద్రుని రాజ్యమునుండి బహిష్కరించి, అతఁడు పురము వీడి చనునప్పుడు పూర్వదత్త మగు యజ్ఞదక్షిణ నడిగి దాని నిచ్చుటకు రా జడిగిన నెలరోజుల గడువునకు విశ్వామిత్రుఁ డంగీకరించుట.

---

* శ్రీ వీరేశలింగముపంతులవా రొకవేళ స్కాందపురాణభాగమును జిత్తగించిరేమో యని శంకించుకొని వారిపేర రెండుజాబులు వ్రాసికొంటిని గాని వా రందులకు జబాబును బ్రసా దింప రైరి. నా మొదటియుత్తరమునకు జబాబుగా వారికవులచరిత్ర పూర్వభాగము ద్వితీయముద్రణము నాకు దయతోఁ బంపిరి. —హ.న.పా.పీఠిక. అథసూచిక. పుట.50.

2. హరిశ్చంద్ర నలోపాఖ్యాన పీఠిక. పుట. 48–50.

4. నిర్ణీతమైన గడు వొక్క యర్ధదివసమునకు ముగియు ననఁగా హరిశ్చంద్రుఁడు కాశీనగరము చేరుట.
5. హరిశ్చంద్రుఁడు కౌశికఋణవిముక్తికై భార్యాప్రబోధమునకు లోఁగి భార్యాపుత్త్రులను బ్రాహ్మణున కమ్ముట. ఋణశేషమును దీర్చుటకొఱకై తాను చండాలున కమ్ముడువోవుట.
6. హరిశ్చంద్రుఁడు చండాలదాస్యమును, కాటికాపరితనమును నిర్వహించుట.
7. హరిశ్చంద్రునిపుత్త్రుఁడు సర్పదష్టుఁడై మృతి నొందుట.
8. హరిశ్చంద్రునిభార్య మృతపుత్త్రుని శ్మశానభూమికిఁ గొనిపోయి శవదహనము చేయ యత్నించు సమయమున భార్యాభర్తలకు పునస్సమాగమ మేర్పడుట.
9. ఇంద్రాదులు హరిశ్చంద్రునకుఁ బ్రత్యక్షమై యతని సత్యధర్మ నిరతినిఁ గీర్తించుట.
10. ఆడిబక యుద్ధవృత్తాంతము.

హరిశ్చంద్రునికథ కెన్ని చిలువలుపలువలు కల్పించినను బైని పేర్కొనిన యంశములందు మాత్ర మెట్టిమార్పును కల్పించుట జరుగలేదు. దానివలన మార్కండేయ పురాణోక్తకథానిర్మాణక్రమము శిథిలము గాకుండ యథామూలముగా నిలువఁగలిగినది. కావున లోకమున వెలసిన హరిశ్చంద్రకథాకావ్యము లన్నిటికిని మార్కండేయమహాపురాణము మూల మనుటలో విప్రతిపత్తి లేదు.

ఇదియొక ఆంధ్రకావ్యములకు మాత్రమే వర్తించు మాట కాదు. భారతీయభాషలలో నెందైనను హరిశ్చంద్రచరిత్రము వెలసిన దనఁగా నది మార్కండేయకథామూలమై యుండక తప్పదు. మార్కండేయమునందలి యీకథ భారతీయులపై నట్టి ప్రభావము వైచినది :

## ప్రబంధకల్పనలపై పురాణప్రభావము :

గౌరన రసవత్కావ్యనిర్మాణదక్షుఁడు. మార్కండేయమునందలి సత్యధర్మవీరరస ప్రధాన మైన కథ నాతఁడు చేపట్టెను. పరిమితపరిమాణమున నొదిగియున్న యుపాఖ్యానమునందలి యదనుపదనులను గమనించి రసపోషకాంశములను బోషించియుఁ, గల్పించియు, కథను రమణీయముగాఁ దీర్చిదిద్దెను. ఈకథలోఁ బ్రతినాయకుఁ డైన విశ్వామిత్రుని కౌటిల్యమును, రౌద్రార్భటియు నధికముగా భాసించును. అందు అర్థప్రధానమైన రౌద్రము స్ఫురించును. కౌశికుని రౌద్రాగ్నియందు హరిశ్చంద్రుని శుద్ధసత్యధర్మనిష్ఠ బంగారమువలెఁ బుటము పెట్టఁబడును. ధీరోదాత్తుఁడైన యానృపతి సత్యధర్మోత్సాహి యై, కష్టసహిష్ణుత నలవఱచుకొని, ధర్మావరోధములను అంతర్బహిశ్శత్రులతో నిర్జించి వీరరసావతారమూర్తి యై వెలుగొందును. ధర్మబద్ధమైన వీరము రౌద్రముతో డీకొని దాని ధాటిని సహనదీప్తితోడను, అనుష్ఠితసమాహితముతోడను, జయించి మించి తనయంగిత్వమును స్థాపించుకొనుటయే యిందలి రసరహస్యము. కావునఁ బ్రతినాయక

మాయాకల్పిత బహువిధక్లేశసంఘాతసంఘట్టనవిపులకల్పనముచే గౌరన నాయకవీరరస ప్రదీప్తినిఁ బోషింప యత్నించి కల్పనాశిల్పమును గావ్యమున నిర్వహించెను.

మార్కండేయపురాణాంతర్గత మైన హరిశ్చంద్రోపాఖ్యానము గౌరనకావ్యమున నొకసంపూర్ణస్వరూపమును సంతరించుకొనినది. తరువాత వచ్చినకథలలో దానిని మించి యొనర్చినకల్పన లతిస్వల్పము. అట్లని మార్కండేయపురాణమందలి కథ యసంపూర్ణ మని కాదు. దానియందు ఔపాఖ్యానక మైన స్వయంసమగ్రత కలదు. కాని, గౌరనకథయం దున్న ప్రాబంధికసర్వాంగపుష్టి లేదు. ఉండునని మన మనుకొనుటయుఁ దప్పే. వస్తువిస్తృతిని దృష్టియం దుంచుకొని గౌరన మార్కండేయమునందలి కల్పనలను గొన్నిటిని మార్చెను; కొన్నిటిని వదలెను. అట్టి పట్టులందు సర్వత్ర గౌరన మార్కండేయమునందలి సార్థకతను సాధించినాఁడని చెప్పలేము. పౌరాణికకల్పనలయందలి తాత్త్విక దృష్టి ప్రబంధనిర్మాత గ్రహించి ప్రవచించకపోవుటయే దానికిఁ గారణము. పురాణమునం దుపాఖ్యానపరమప్రయోజనమునకు రస మంగభూత మగును ; అందలి సర్వకల్పనలు రసపోషకము లైనను కథాప్రయోజనసమర్థనశీలములై ప్రవర్తిల్లును. కావ్యమునందు రసమే పరమప్రయోజనము. ఇందు సర్వము రసాభిముఖమై ప్రసరించును. ఇట్టి సమన్వయముతో గౌరన కల్పించిన కల్పనలలో మార్కండేయమూలము లైన వాని స్వరూపస్వభావములను బరిశీలించుట యగుచున్నది.

### 1. గౌరనకావ్యకథారంభశిల్పముపై మార్కండేయపురాణప్రభావము కలదు:

భాగవతదేవీభాగవతాదిపురాణములందు సామాన్యముగా సూర్యవంశచక్రవర్తుల వంశానుక్రమము వర్ణించుసందర్భమున హరిశ్చంద్రచరిత్రము వర్ణింపఁబడియున్నది. కాని, మార్కండేయపురాణమున నుపపాండవజన్మహేతువును నిరూపించు నవసరమునఁ జెప్పఁబడియున్నది. కావున నీపురాణమున నీయుపాఖ్యానము స్వతంత్రప్రతిపత్తితో భాసింపఁ గలిగినది. అట్లగుటచే నాపురాణకర్త దానికి స్వయంసంపూర్ణత సాధించుట కై హరిశ్చంద్రగుణకీర్తనముతో నారంభించి యుత్తమచారిత్రప్రశస్తితో కథను ముగించినాఁడు. ఇవ్విధము స్వతంత్రకావ్యరచనోద్యోగి యైన గౌరనకు హిత మైనది. అతఁడును నాయకవర్ణనముతోడనే కథ నారంభించినాఁడు.

నిజమునకు గౌరనకథాప్రణాళికనుబట్టి కావ్యము దేవేంద్రసభావర్ణనముతోఁ బ్రారంభ మైనను దోషము లేదు. కాని, గౌరన కావ్యారంభమున హరిశ్చంద్రవర్ణనము చేయ నుద్యోగించుట మార్కండేయపురాణకథాకథనప్రభావమే యనక తప్పదు. మఱియుఁ బరిశీలించిచూడ సంస్కృతపురాణముకన్న మారనపురాణమే గౌరన కీయంశమున మార్గదర్శక మైన దనియు స్పష్టము కాఁగలదు. ఎట్లనఁగా గౌరన తన కావ్యావతారికలో—

" చెలఁగి ఋగ్వేదప్రసిద్ధుఁడై జగతి- వెలయు హరిశ్చంద్రవిభుపుణ్యచరితఁ
గవితాచమత్కృతిఁ గాంచి హర్షించి- కవులందఱును శిరఃకంపంబుసేయఁ
బచరించి వీనుల పండువు గాఁగ- రచియింతు "...... (గౌ.హ.అవ. 28-33)

నని శపథము చేసియుండెను. ఇందు హరిశ్చంద్రుఁడు ఋగ్వేదప్రసిద్ధుఁ డని కవి పేర్కొనెను. ఋగ్వేదకథ నిసుమంతయు ననుసరింపక పోగా మార్కండేయకథను యథాక్రమముగ ననుసరించిన గౌరన యిట్లు కీర్తించుట యెందులకు? సంస్కృతమార్కండేయము హరిశ్చంద్రుఁడు ఋగ్వేదప్రసిద్ధుఁ డని పేర్కొనలేదు మారనమాత్రము "ఎవ్వని మహాత్మ్యః మెప్పుడు వేదము ల్చెలఁగి సుస్తోత్రము ల్సేయుచుండు" నని సీసపద్యము నెత్తుకొని హరిశ్చంద్రుని వేదప్రశస్తిని వర్ణించెను. బహుశః ఈయుపక్రమణమే గౌరన యిట్లు రచించుట కుపస్కారక మయ్యె నని భావింప వీలగుచున్నది.

సంస్కృతమార్కండేయపురాణము హరిశ్చంద్రుని వర్ణించుచు నాతని సత్యవ్రతపరాయణత్వమును బ్రత్యేకముగాఁ బేర్కొని చెప్పలేదు. మారన యుపాఖ్యానారంభమున నాల్గుపద్యములందు దానినిఁ బ్రత్యేకించి నాలుగుసార్లు పేర్కొనెను.[3] కథయందలి ప్రధాన ప్రతిపాద్యవస్తువును వ్యంజింపఁజేసెడి కథాకథనశిల్ప మది. ఆతాత్పర్యమును గ్రహించి గౌరన - "హరిహరబ్రహ్మదు లచ్చెరువంద - జరపె సన్నుతి కెక్క సత్యవ్రతంబు" అని యాదియందే నిబంధించి కథార్థసూచన మొనర్చెను.

హరిశ్చంద్రుని పరాక్రమాతిశయమును, సామ్రాజ్యవైభవమును గీర్తించుచు మారన మూలాతిశాయిగా వర్ణించిన యీక్రింది పద్యపాదములు గౌరనవర్ణనకుఁ బ్రాతిపదిక లైనవి.

మారన :

సీ. "ఎవ్వనిశాసనం బేడుదీవుల రాజులకు శిరోభూషణ లక్ష్మి నొందు,
ఎవ్వనిసత్కీర్తి యీయజాండం బెంత యంతయుఁ దానయై యతిశయిల్లు
తే. నట్టి మహితగుణాభరణాభిరామ
మూర్తి ప్రత్యర్థినృపసమవర్తి." (1.142)

గౌరన :

"ఆజులఁ దన కెదురై పేర్చుకరులఁ - వాజుల సుభటుల వడిఁ దునుమాడి
రాజుల నుదయమార్తాండ ప్రచండ - తేజులఁ బఱపి మర్దించి కప్పంబు
లేర్పడఁ గైకొని యెల్ల దీవులను - దర్పించి నిజజయస్తంభముల్ నిలిపి
యెన్నిక కెక్క నీరేడులోకముల - వెన్నెలగతిఁ గీర్తి వెలిఁగించె"
(గౌ. హ. I. 51-53)

ఇందలి యరిమర్దనము, సర్వద్వీపములపై నెగడిన ప్రభుత్వము పదునాల్గులోకముల వ్యాపించిన కీర్తి మారన భావించినవే యని గుర్తించుట సులభము!

మార్కండేయపురాణమున నతనిసత్యధర్మశాసనమహిమవలన ధనరూపబలములును, అత్యనుపమవిద్యాతపోమహత్త్వములును బ్రజలు కలిగియుండియు మదమును

3. మారనమార్క. 1.142-145; "నిత్యసత్యవర్తి" (1.142) "నిర్మలసత్యధర్మనియతిం బాలించె (1.143); సత్యధర్మశాసన మహిమన్ (1.144); "సత్యవ్రతగరిష్ఠుండు"(1.145).

బొందియుండ లేదని వర్ణింపఁబడియున్నది. ఇందు పాలకపాలితుల మధ్య నున్న విశిష్ట సామ్యము వ్యంగ్యమై హరిశ్చంద్రుఁడు ప్రజాజీవితమార్గమును దీర్చిదిద్దిన మహనీయుఁ డని తేటపడుచున్నది. పురాణకథానిర్వహణమున హరిశ్చంద్రునితోపాటు సశరీర స్వర్గము నధిరోహించు నర్హతను బ్రజలయందు బీజతుల్యముగా సూచించుట యచ్చటి సార్థక్యము. గౌరనకథయందు ప్రజలకు స్వర్గప్రాప్తి లేదు. పురాణహరిశ్చంద్రునివలెఁ బ్రబంధహరిశ్చంద్రుఁడు స్వీయసామ్రాజ్యప్రజాకుటుంబముపై నంత మక్కువ చూపింప లేదు. పురాణమునందలి ప్రజలవలె ప్రబంధప్రజలు నిర్మదశీలురు కారు. మార్కండేయమున హరిశ్చంద్రుఁడు నగరు వెడలి, పురము దాటి వెడలుసమయమునఁ బురజనులు, బంధుమిత్రాదులు దుఃఖించిన విధ మత్యంతకరుణరసస్ఫోరకము. ''కరుణంబుగాఁ బురజనావళి పల్కుచు రాఁ దదీయ వాక్యనిచయశృంఖలం దవిలి యెమ్మెయిఁ బోవఁగఁ గాకలాడమి న్మనుజవిభుండు శోకరసమగ్నత మార్గము ద్రేవ నిల్చిన'' దృశ్యము గౌరన కావ్యరంగమునఁ గానరాదు. కాగాఁ దనను విడఁజాలలేక దుఃఖించు ప్రజలను గాంచి, నిండుకొలువులో రాజు విశ్వామిత్రుని రుద్రాంశను జేర్కొని వారిని శాపభయగ్రస్తుల నొనర్చి వారిని వారివారి యిండ్లయందే యుండి తనమేలు కోరుచుండుఁ డని మనవి చేసెను. ఆతరువాత రాజు భార్యాపుత్రులను వెంటఁగొని పురవీథులవెంటఁ బోయినట్లు కథ కలదుగాని ప్రజావాహినిప్రసక్తిమాత్రము కానరాదు. అంతేకాక పురాణములందు ప్రజలు రాజవియోగమునకు దుఃఖించిరే కాని విశ్వామిత్రమహర్షి నొక్కమాట పల్లెత్తియైన ననలేదు. వారికి రా జిచ్చిన శిక్షణ యట్టిది. గౌరనప్రబంధములో నట్లు కాదు. కౌశికుఁడు సింగపుగద్దెపైఁ గూర్చుండి యున్న నిండుసభలోఁ బ్రజ లన్నమాట లివి :-

" ఈనేల తపసికి నీ నేల ? నేలఁ - గడఁగి పేరడవులఁ గాయపండేటి,
కుడిచి వర్తించు పెక్కురు తాపసులకు - బొదలకళాసంబొ బూతిబొక్కణమొ,
జడలొ రుద్రాక్షలొ సంపద లేల - తొలుత వేఁదుఱు గన్న దుష్టమర్కటము
సొలవక భూతంబు సోకినరీతిఁ . జెనఁటి మూర్ఖున కిట్టి సిరి వచ్చెనింకఁ
జెనకి యెవ్వరి నేమి సేయునో రేఁగి..." (గౌ. హ. I. 1381-1388)

యని తాపసదూషణ మొనర్చిరి. అందులకు వారిని హరిశ్చంద్రుఁడు ముని యెదుటనే ''బ్రతికెదరేని దుర్భాషలు మాని - సేవింపుఁ డితని స్థిరబుద్ధి...'' తో నని మందలింప వలసి వచ్చినది. పీస మెత్తు మాటపడని విశ్వామిత్రుఁడు సైతము వారిమాటలకు కిమ్మనకుండఁ గూర్చుండినాఁడు గౌరన కల్పించిన మహాసభలో. అట్లు మిన్నకుండుట కౌశిక స్వభావమునకు విరుద్ధము. కావున గౌరన మార్కండేయపురాణమునందలి ''మదవిరహిత మైన ప్రజాప్రవృత్తి కల్పనము గై కొనకపోవుట పురాణవస్తుతత్త్వమును గమనింపక పోవుటయే.

మార్కండేయ పురాణమున హరిశ్చంద్రునకు శైబ్యయను భార్యయు, లోహితాశ్వుఁడను పుత్రుఁడును నున్నట్లు కథాకథనక్రమమును బట్టి మనము గ్రహింపఁగలుగు

దుము. గౌరన భార్యాపుత్రులనే కాక హరిశ్చంద్రుని సచివోత్తమునిఁ గూడ నామనిర్దేశ మొనర్చి కల్పించియుండెను. చంద్రమతి భార్య; లోహితాస్యుడు పుత్త్రుఁడు; సత్యకీర్తి మంత్రి.

2. యజ్ఞదక్షిణారూప మగు ధనమును విశ్వామిత్రుఁ డభ్యర్థించు కల్పనము మార్కండేయమునుండి గ్రహించినదే :

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని సత్యధర్మనియతినిఁ బరీక్షించుటకుఁ గల్పించిన ప్రథమోపాయము యజ్ఞదక్షిణార్థ మగు ధనమును యాచించుట. ఇది మార్కండేయపురాణ దేవీభాగవతములందును గౌరనకావ్యమునందును గలదు. కాని, మూఁడింటియందును మూఁడు విధములుగాఁ జెప్పఁబడినది. అందు మార్కండేయమునందలి కల్పనము కడు ప్రౌఢము. దేవీభాగవతకల్పన మతిసామాన్యము. గౌరనకల్పన మతిశయోక్తి కల్పము. మార్కండేయమున హరిశ్చంద్రుఁడు "విప్రుల కిచ్చుట" రాజధర్మ మని యనుటచే నాతని ధర్మాచరణనిష్ఠను బరీక్షించుటకై విశ్వామిత్రుఁడు "ఏను బ్రాహ్మణుఁడను గానే ?" అని ప్రశ్నించి, రాజసూయాధ్వరమున భూదేవతాకోటికి దక్షిణ లిచ్చుటకై చాలినంత ధనమును కోరెను. విశ్వామిత్రుని కోర్కెను హరిశ్చంద్రునిధర్మోత్సాహపూరితమైన వాక్యమే హేతు వగునట్లు కల్పించుట యిందలి ప్రౌఢిమ. కథాసిద్ధము లైన యర్థసముదాయమునకుఁ గార్యకారణసంబంధము గల్పించి కథకు సహజమైన యభివృద్ధిని సాధించు నైపుణ్య మిది.

దేవీభాగవతమున విశ్వామిత్రకల్పితమాయాసూకరమును వెన్నంటి గహనమైన యొకవనమును జొచ్చి, హరిశ్చంద్రుఁ డొకసరోవరతటమున విశ్రాంతి గైకొనుచుండఁగాఁ గౌశికుఁడు కపటవృద్ధబ్రాహ్మణవేషమున నారాజును సమీపించెను. రా జాతనిని బూజించి తనవృత్తాంతముఁ జెప్పి పురమార్గము చూపించినచో నతనికి యజ్ఞమునకై వలసిన ధన మిత్తు నని ప్రార్థించెను. గౌరనకావ్యమునఁ గౌశికుఁడు నాకమునుండి హరిశ్చంద్రునియొద్ద కేతెంచి రా జొనర్చుయజ్ఞమున భూదేవదక్షిణగాఁ బురుషుఁ డేనుఁగుపై నెక్కి పొడువుగా నిక్కి వరరత్న మెగసి పోవైచినపొడవు ధనము రాశిగాఁ బోసి దాన మీయు మని కోరెను. రాజు తథ్య మనెను. కౌశికుఁడు ప్రీతుఁడై యప్పు డాధనము వల దనియు, తనకుఁ గావలసినప్పుడు గైకొందు ననియుఁ జెప్పి, మరుమాటాడినచో శంకరు నాన, త్రిశంకునియాన యని యొట్టుపెట్టి వెడలిపోయెను. మార్కండేయమున ముని కోరిన మీదట రాజు దాన మిచ్చినట్లు కలదు. దానిని గౌరన యనుసరించెను. దేవీభాగవతమునఁ ద్రోవ తెలియక బాధపడుచున్నరాజు త్రోవఁ జూపించిన యుపకారమునకు యజ్ఞధనమును బహుమానముగ నీయ సమకట్టెను. అయాచితార్థదానమున కంత గౌరవ ముండ దని కాబోలు గౌరన దేవీభాగవతకల్పనము వీడి మార్కండేయము ననుసరించెను. కాని మార్కండేయమునందలి ప్రౌఢిమను మాత్రము పట్టుకొనఁజాలక పోయెను.

3 హరిశ్చంద్రుని మృగయాయాత్రకల్పనము మార్కండేయపురాణము నుండి గ్రహించినదే :

మార్కండేయపురాణమునందలి హరిశ్చంద్రోపాఖ్యాన కథారంభమున గల నిర్హేతుకమైన మృగయావినోదకల్పనకు సహేతుకత్వము సాధింప విశ్వామిత్రకల్పిత మాయావరాహవృత్తాంతకల్పనమును దేవీభాగవతము చేసెను. మాయాసూకరము రాజనగరమున నలజడి గలిగించెను. ప్రజ లాయుపద్రవమును రాజున కెఱిఁగించిరి. రాజు హయాధిరూఢుఁడై దానిని వెన్నంటెను. సూకర మతివేగమునఁ బరుగెత్తి యొకవనము సొచ్చి యదృశ్య మయ్యెను. రా జావనమునఁ బ్రవేశించి సూకరమును గానక మధ్యాహ్నమగుసరికి యొకసరోవరమును జేరెను. గౌరన దేవీభాగవతమాయావరాహకల్పనను యథాతథముగా గ్రహింపక నామహర్షి బహువిధమాయామృగపక్షితతులను గల్పించి, దేశమును హల్లకల్లోలమొనర్చె నని వర్ణించెను. హరిశ్చంద్రుఁడు వేటకు భార్యాపుత్త్ర సహితుఁడై వెడలె నని కల్పించెను. ఇచ్చట గమనింపవలసినయంశ మొండు కలదు. మూలమున హరిశ్చంద్రుఁడు మృగయావినోదమునకై వనమున కేగెను. దేవీభాగవతమున మాయాసూకరసంహారార్థము వనమున కేగెను. కాని, దాని నారాజు సంహరింపలేదు. గౌరనకావ్యమున బహుమాయామృగసంహారార్థము వేట కేగెను. సాధారణముగా సహజవన్యమృగములను సంహరించుటయందు కన్న మాయామృగసంహారమునందు కొంత వైలక్షణ్యము కానఁబడవలెను. అట్టిదానిని గౌరన తనకావ్యమునఁ బ్రదర్శింపకుండుట చోద్యము. అతఁడును మార్కండేయము ననుసరించి మృగయావినోదముగా భావించెనేగాని యంతకన్న విశిష్టముగా దానిని వివేకింపలేదు. మొత్తమునకు మృగయావినోదము పురాణమునఁ గథారంభమునకు ప్రాతిపదిక యగుచుండ ప్రబంధమున కథాగతికి దోహదకారి యగునట్లు రూపొందింపఁ బడినది.

4. యాగదక్షిణాదానమునకును, రాజ్యదానమునకును కొంత వ్యవధానము గల్పించుటకై గౌరన తనకావ్యమునఁ గొన్ని నూత్నకల్పనలు చేసి కథను బెంచెను :

మార్కండేయపురాణమున విశ్వామిత్రునికి రాజు రాజసూయదక్షిణాధనప్రదాన మొనర్చువాక్యములమీఁదనే రాజ్యదానప్రసక్తి వచ్చినది. దేవీభాగవతమునఁ గూడ నించుమించు వారెండుదానములు స్వల్పవ్యవధిలో జరిగినవి. గౌరనకావ్యమున మాత్ర మీరెండు దానములమధ్య కాలవ్యవధి యధికము చేయఁబడినది. దానితో నూత్నకల్పనలు కొన్ని తావు చేసికొనినవి. వసిష్ఠదర్శనఘట్టము భావికథార్థసూచనకై కల్పింపఁబడినది. విశ్వామిత్రమాయామృగకల్పనము హరిశ్చంద్రునిఁ గౌశికతపోవనమునకుఁ జేర్చుట కేర్పడినది. సరోవరకల్పనము దేవీభాగవతమునుండి గ్రహింపఁబడినది. స్వప్నకల్పనమునకు మూలము మార్కండేయముననే మఱొకచోట కలదు. మాతంగకన్యాసృష్టి హరిశ్చంద్రుని య్యేకపత్నీవ్రతమును, వర్ణసంకరభీతినిఁ బ్రకాశింపఁజేయుట కేర్పడినది. స్వీయప్రయత్న

వైఫల్యముచే నుగ్రుఁడైన విశ్వామిత్రుని హరిశ్చంద్రునిముందు నిలువఁబెట్టి రాజ్యదానము గొనుటకుఁ దగినయుద్వేగవాతావరణము కల్పించుట కుపకరించుటయే యీకల్పనల సార్థక్యము :

5. హరిశ్చంద్రరాజ్యప్రదానఘట్ట నిర్వాహణమున గౌరనపై మార్కండేయ పురాణప్రభావము కలదు :

మార్కండేయపురాణమున హరిశ్చంద్రరాజ్యప్రదానఘట్టము అత్యంతప్రౌఢముగా నిర్వహింపఁబడెను. యాగదక్షిణ నడిగిన విశ్వామిత్రునిఁ గాంచి హరిశ్చంద్రుఁ డిట్లనెను :

చ. వినుము మునీంద్ర ! దక్షిణకు విత్తము చాలినయంత మున్న యి
చ్చినయదిగా నెఱుంగు మెద శ్రీయును రాజ్యము ధాత్రియుం బురం
బును ధనరాసులు న్సతియుఁ బుత్త్రుఁడు ధర్మచయంబు నేను నీ
ధనములె యిందు నీయభిమతం బగు నెయ్యది వేడు నావుడున్.

శా. నీ వే మిచ్చినఁ గాదన న్గానియెద న్వీరాగ్రణీ ! ధర్మము
న్నీవు న్భార్యయుఁ బుత్త్రికుండు వెలిగా నీసర్వసామ్రాజ్యల
క్ష్మీవాల్లభ్యము మాకు ని మ్మనిన నిచ్చె న్నిర్వికారానన
శ్రీవిభ్రాజితమూర్తి యై సమధికప్రీతి న్హరిశ్చంద్రుఁడున్.

(మారన. 162-163)

హరిశ్చంద్రుడు "దక్షిణకు విత్తము చాలినయంత మున్న యిచ్చినదిగా నెఱుంగు మెదన్" అనువాక్యములోని "మున్న" అనుపదముయొక్క అర్థశక్తివలన నావాక్య తాత్పర్యమును రెండువిధములుగ నన్వయించుకొనవచ్చును. నుడికారపుశక్తివలన "దక్షిణ నిచ్చుటయందు శంకవలదు. మీ రడుగకపూర్వమే నే నిచ్చినట్లు భావింపుఁడు; అయినను నాయొద్ద నున్న రాజ్యాదిధనములలో నేదైనను దానికిఁ దుల్యముగాఁ గొనుఁడు" అను నర్థ మేర్పడును. తార్కికముగా గ్రహించినచో "దక్షిణార్థమైన ధనము పూర్వమే దత్తమైనది. అదిగాక నాయొద్ద రాజ్యాదిధనము లున్నవి. వానిలో నెయ్యది ప్రీతికరమో దాని నెన్నుకొనుఁడు" అనుతాత్పర్య మేర్పడఁగలదు. హరిశ్చంద్రునిడెందమున మొదటి భావమును విశ్వామిత్రునిహృదయమున రెండవతాత్పర్యమును నిబంధించి రచించుటయే యీసంభాషణరచనానిర్వహణలోని ప్రౌఢత్వము.

గౌరన రెండుదానములను రెండుఘట్టములందు పంచి నిర్వహించుటచే నిట్టి సంశ్లిష్ట కథార్థసృష్టి జరుపుటకు వీలులేకపోయినది. అయినను మార్కండేయపురాణమున "విపుల కీర్తు" ననుమాటపై దానప్రసక్తి నిబంధించిన కల్పన ననుసరించి గౌరన మాతంగకన్యలను వివాహమాడ నిచ్చగింపని హరిశ్చంద్రునిముఖమున

"వేయుఁ జెప్పినఁ జెప్ప విడువగులంబు
నాయేలురాజ్య మైనను విడ్తుఁగాని." (గౌ. హ. I. 1291-92)

యనుమాట లనిపించి కౌశికునిచే

"తథాస్తు మా కంతియ చాలు - జననాథ విడువు నీసకలరాజ్యముల
నిల నేడుదీవులు నేలెడువేడ్క - గల దది మాకు నీకతన సిద్ధించె."
(గౌ. హ. I. 1293-96)

నని రాజ్యదాన మడిగించెను. ఇట్టి సన్నివేశనిర్వహణశిల్పము గౌరనకు మార్కండేయ పురాణము ప్రసాదించినదే.

దేవీభాగవతమునఁ గపటబ్రాహ్మణాకృతియం దున్న కౌశికుఁడు హరిశ్చంద్రుని నాసరోవరమున స్నానము చేయించి, పితృతర్పణ లిప్పించి, కపటవధూవరుల సృజించి, వారివివాహవేదీమధ్యమున రాజుచే సర్వరాజ్యమును వారికి ధారాదత్త మొనర్పఁజేసెను. ఈకల్పనమున నూటిదనమును సహజత్వమును లోపించుటవలనను, మార్గనిర్దేశనార్థము రా జంతగా నాబ్రాహ్మణునకు లొంగిపోయె ననుట యౌచిత్యపోషకము కాకపోవుటవల నను గౌరన దీనిని వదలియుండు నని యూహింప వీ లగుచున్నది.

6. క్రతుదక్షిణకుఁ బ్రతిశ్రుత మైన యర్థ మిచ్చుటకు నెలరోజులు గడువు కల్పించుట మార్కండేయకథాప్రభావమే :

రాజ్యదానము చేసి నగరము విడిచిపోవుచున్న హరిశ్చంద్రచక్రవర్తిని నిర్దయుఁ డైన కౌశికుఁడు క్రతుదక్షిణకుఁ బ్రతిశ్రుత మైన యర్థ మి మ్మనియు, నెన్నాళ్ల కిచ్చెదవో చెప్పు మనియు బలవంతపెట్టెను. గడువులో నీయనిచో శాప మిత్తు నని భయపెట్టెను. రాజు చేయునది లేక యొకనెలరోజులు గడువు కోరుకొనెను. ముని సంతసించి యతనిని దీవించి పంపెను. ఈయంశమును దేవీభాగవతకర్తయు, గౌరనయు గ్రహించిరి

7. విశ్వామిత్రుఁడు శైబ్యకు బదులు హరిశ్చంద్రునిఁ జేతికోలతోఁ దాడించె నని గౌరన కల్పించెను :

మార్కండేయమున విశ్వామిత్రుఁడు శైబ్యను తాడించె నను కల్పన ముండగా గౌరన స్త్రీహింసను వదలి కౌశికుఁడు చేతికోలతో హరిశ్చంద్రు నేసె నని వర్ణించెను. మూలమునం దీఘట్టమునఁ గల విశ్వాఖ్యదేవతలవృత్తాంతమును మాత్ర మప్రకృత మని వదలివైచెను.

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిఁ గోలతో వేయుటకుఁ గల హేతువును గౌరన చమత్కారముగా సృష్టించెను. కౌశికుఁడు రాజుచేఁ బ్రతిశ్రుత మైన యర్థము నడుగు తెఱఁగు నతికర్కశముగఁ గల్పించెను.

"మును మఖార్థంబుగా ముదమున నిచ్చి - కొనుఁ దన్న నాఁటికిఁ గొనిపోవలేక
యిల్లడ నీయింట నిడిన నావిత్త - మెల్ల నిప్పింపక నెందుఁ బోయెదవు?
మఱచిన నెఱిఁగింప మనుజేశ కలదె - మొఱఁగి పోఁజూచితే మోసపోఁ గాని

యెనయ విప్రులసొమ్ము లెన్నెన్ని యిట్లు - కనుఁ(బ్రామి కొంటివో కాక వంచించి
వేవేలు వచ్చె నీవిశ్వాస మెల్ల - దైవ మెఱుంగ మాధనమును తెమ్ము"

(గౌ. హ. I. 1435 - 1444)

అనినమాటలు రాజునకు పిడుగుపాటువలెఁ దాకినవి. పూర్వదత్తమైన ధనమునుగూర్చి జ్ఞప్తి చేయనిది రాజుదోష మని ప్రవాదము కల్పించుటతోపాటు విప్రులసొమ్ము నపహరించెడివాఁ డనుశంకను ప్రకటించుట రాజునకుఁ దాపము గల్గించినది. అతఁడును స్వాభిమానమును జంపుకొనలేక తపసిని కొన్నివేడిమాట లనెను.

"అలుగక చిల్లపెంచాదిగా నాకుఁ - గలధనంబంతయుఁ గపటంబు లేక
నీకె యిచ్చితిఁ దొంటి నేఁటిధనంబు - నేకమైఁ జెల్లె నీ కేలమోసంబు
ఎంతటి కెంత నీ కీధనకాంక్ష - సంతోషమునఁ బొంది చనుమింక"

(గౌ. హ. I. 1447 - 1452)

యని మందలించెను. "అలుగక" యనుటలోఁ దనయౌదార్యమును, సాధుభావమును, "కటంబు లేక" యనుటలోఁ దనఋజువర్తనమును, "నీ కేల మోసంబు" అనుటలో ముని వక్రమార్గమును, 'ఎంతటి కెంత కీధనకాంక్ష' యనుటలో మునియొక్క యర్థలోభమును హరిశ్చంద్రుఁడు స్పష్టపఱచినాఁడు. రాజు పల్లెత్తిమాటాడుట మునిరాజున కాగ్రహము కల్పించినది. అతఁడు తోకఁద్రొక్కిన త్రాచయి బుసలుకొట్టినాఁడు. చేతికోల నెత్తి రాజును నిర్దయతోఁ దాడించినాఁడు. మార్కండేయపురాణమున హరిశ్చంద్రపాత్ర యిట్టిమాట లనఁజాలదు. పురాణమున నారాజు శుద్ధసాత్త్వికుఁడు; ప్రబంధమున నాతఁడు సత్త్వరజోగుణమిశ్రమూర్తి. ఆదర్శపురాణపాత్రచిత్రణమును గైకొని గౌరన లౌకికస్వభావసహజచిత్రణము చేసి కథలో నూతనచైతన్యమును గల్పింపయత్నించెను.

8. హరిశ్చంద్రుని కాశీగమనము - నూత్నకల్పనలు :

మార్కండేయపురాణమున హరిశ్చంద్రుఁడు తనపురము వీడి నెలదినములకుఁ గాశీనగరముఁ జేరె నని మాత్రము చెప్పఁబడియుండ గౌరన యీభాగమును బెంచి 450ద్విపదలలో వివరించి వర్ణించియుండెను. ఇదియంతయు గౌరనకవిప్రతిభాజనితమే. ఈఘట్టమునం దీకవి చేసిన నూత్నకల్పన లివి :

(1) నక్షత్రపాత్రకల్పనము. (2) దంతఘాతుకదైత్యకల్పనము (3) విశ్వామిత్ర మాయాకల్పనము. (4) కౌశికభేదోపాయకల్పనము. వీనివలన విపులముగా హరిశ్చంద్రుని సహనశక్తియు, భుజశక్తియు, మంత్రశక్తియు, ధర్మశక్తియు దీప్తమగుటయే గాక యతని సహధర్మచారిణియైన చంద్రమతియొక్క బుద్ధికౌశలమును, పాతివ్రత్యమహిమయు, పతిహితచారిత్రమును వ్యక్తములగుచున్నవి. ఇందు నక్షత్రకునిపాత్ర తెలుఁగువారి యభిమానమును జూఱగొని శాశ్వతముగా నీహరిశ్చంద్రకథలో నిలిచి పోయినది

9. హరిశ్చంద్రుఁడు భార్యాపుత్త్రుల నమ్ముకొనుట :

కాశీనగరమున హరిశ్చంద్రుఁ డనుభవించిన క్లేశములన్నియు దాదాపు మార్కండేయపురాణమున నభివర్ణింపఁబడినవే. వానిలో భార్యాపుత్త్రుల నమ్ముకొనుకల్పనము మొట్టమొదటిది. హరిశ్చంద్రుఁడు కాశీనగరమునఁ బ్రవేశింపఁగనే యుగ్రుఁడైన కౌశికుఁ డతనిముందు ప్రత్యక్ష మయ్యెను. రా జాతనిపాదములకు మ్రొక్కెను. 'నీవు నుడివిన నెలగడవు నేటితో నిండినది. మాసొమ్ము మాకు తె' మ్మని విశ్వామిత్రుఁ డడిగెను. "మునీంద్ర ! యింకను దినమునం దర్ధము మిగిలియున్నది. అంతదాక సహింపు" మని రాజు ప్రార్థించెను. 'ఔఁగాక !' యని ముని వెడలిపోయెను. గడువు సమీపించిన కొలఁది రాజుహృదయసముద్రమును జింతామంథరనగము సంక్షోభపెట్టఁ దొడఁగెను. 'రెండుజాములలో నంత ధన మెట్లు సమకూరును ? ఇచ్చుటకు బంధువులైన నచ్చట లేరుకదా ! విప్రుల కిచ్చెద నని పలికి యీకున్నఁ గ్రిమిజన్మము వచ్చునుగదా !' యని లోలోనఁ జింతించుచు మోము వాల్చి ఖిన్నుఁడై యుండెను.

సంస్కృతమార్కండేయమున మాటఁదప్పినచో శాప మిచ్చెద నని కౌశికుఁడు హరిశ్చంద్రుని బెదరించినట్లు చెప్పఁబడియున్నది. దేవీభాగవతము దాని ననుకరించెను. గౌరన యీశాపప్రసక్తిని వదలెను.

గౌరన తనకావ్యమునఁ గౌశికుని బ్రవేశపెట్టకుండగనే యాతనిపాత్రను నక్షత్రకునిచే నాడించెను. కాశీనగరమునఁ బ్రవేశించి, విశ్వేశు సేవించి, యొకమఠమున విశ్రమించిన హరిశ్చంద్రునిఁ గాంచి, నక్షత్రకుఁ డతని యంతరంగము చిల్లులు వోవ నాడినాఁడు.

"అచ్చుగా మాగురుం డవనీశ నీకు- నిచ్చిన మతి నేఁడు నెల్లియుఁ జిక్కెఁ
బచ్చపైకము గూడఁ బడినది లేదు- తచ్చలు పచరించి తటమటించెదవొ
యిప్పు డేమటిపాట నిటకు నేతెంచి- ముప్పిరిగొను కోపమునఁ గౌశికుండు
నన్ను వీక్షించి యీనరనాథు మీఁద- మిన్నక తరువుండి మితి వోక మున్నె
పన్నుగాఁ దెమ్మన్న పసిడిచౌకములు- నెన్నుము నీ వన్న నెచట నేఁ దెత్తుఁ
బసిడిఁ దెమ్మనుచు నేఁ బలుమాఱు వేఁడ- మిసుగ వెనుఁగు గవ్వ మీటిన యట్లు
చదువు నంతర మాయె జాలు నీ జాగు- తుద లేదు పీనుఁగుతోడి జాగరము
బోయబొంకులు బొంకి పోయెనో లేక- మాయప్పు నేఁటితో మాన్పి పుచ్చెదవొ
నిను నేఁడు ముఖమున నెత్తురు బ్రామి - కొని గుల్లపఱుపక కొలికికి రావు
వట్టి గుత్తని నిన్నుఁ బ్రజలు వీక్షింపఁ- ఁట్టు మోఁయించెద సర్వథా చూడు"

(గౌ.హ. II. 151-170)

మనునవి నక్షత్రకుని పరుషవాక్యములు. ఈకథలో హరిశ్చంద్ర విశ్వామిత్రు లుత్తమపాత్రలు. నక్షత్రకుఁడు మధ్యమపాత్ర. పురాణమున రెం డుత్తమపాత్రలమధ్య సంభాషణము నడచినది. గౌరనకావ్యమున నొక్కమధ్యమపాత్ర విస్తారముగా మాట్లాడినది. ఉత్తములవాక్యము లతిసంగ్రహములు లయ్యు నత్యంతగంభీరము లై యొప్పారుచుండును.

మధ్యములవాక్కులం దంతటి యంతస్సార ముండదు. ''పీనుఁగుతోడి జాగరము" వంటి మాటలు నిష్ఠురత్వమును బ్రకటించి యుత్తముల బాధించుట కుపయోగించును గాని యౌచిత్యమును బోషింపవు. కావుననే హరిశ్చంద్రుఁడు మారుపల్కినట్లు గౌరన వచింప లేదు. నాయకప్రతినాయకప్రత్యక్షసంఘర్షణము పురాణకథాచిత్రణమునం దుండ, నాయక ప్రత్యవనాయక సంఘర్షణము గౌరనకావ్యమునందుఁ గల్పింపఁబడినది.

10. చంద్రమతి తనను విక్రయించి సత్యవ్రతమును గాపాడుకొనుము మని హరిశ్చంద్రుని వేడుకల్పనము మార్కండేయపురాణమునుండి గైకొనినదే:

కౌశికుఋణము దీర్పుమార్గముఁ గానక హరిశ్చంద్రుఁడు ఖిన్నుఁడై శైబ్య కన్నుఁగవ నశ్రు లొలుక నేడ్పుటెలుఁగుతో భర్త కిట్లనెను.

తే. ధీరమతి వీవు నిట్లు చింతింపఁ దగునె?
సత్యపాలన మొనరింపు సత్యహీనుఁ
డైనపురుషుదేహము దా శ్మశానతుల్య
మధిప! మేటిధర్మంబు సత్యంబ యండ్రు!

క. ఒనరఁగ హయమేధము లే
డొనరించితి రాజసూయ ముజ్జ్వలవిభవ
మ్మునఁ జేసితి సంతాన
మ్మును బడసితి సుకృతి వీవు పుణ్యచరిత్రా!

తే. పుత్రలబ్ధిఁ గృతార్థులు పొలతు రుర్విఁ
గాన న న్నిప్పు డమ్మి యక్కౌశికునకు
ధనము వెట్టి సత్యమ్మును మనిపికొనుము
బొంకుకంటెను జావైనఁ బొంక మనఘ!

(మారన మార్క. 1.195, 196, 198)

దేవీభాగవత మీవాక్యములలోఁ గొన్నింటిని యథాతథముగ ననుకరించినది. గౌరనకావ్యమునఁ జంద్రమతి నక్షత్రకుని పరుషవాక్యములవలనఁ గలిగిన హృదయతాప ముపశమించునట్లు ముందు మాట్లాడి, యాపైన సత్యవాక్యప్రాశస్త్యము నుగ్గడించి, చివరకుఁ దన నమ్మియైనను మునిఋణము దీర్చికొమ్మని ప్రబోధించెను. గౌరన ప్రాబంధిక మర్యాద ననుసరించి ధర్మప్రతిపాదనమునకు రసభావప్రతీతికిని సమప్రాధాన్య మిచ్చి రచన సాగించి పురాణముకన్న వైలక్షణ్యముఁ బ్రదర్శించినాఁడు.

11. తల్లిదండ్రులు మూర్ఛలో మునుఁగ దీనుఁడై లోహితాస్యుఁడు విలపించిన మార్కండేయపురాణమునందలి సన్నివేశము గౌరన గ్రహింపలేదు :

శైబ్య యొనర్చిన ప్రతిపాదనకు హరిశ్చంద్రునిడెంద మవిసిపోయెను. అతఁడు మూర్ఛిల్లెను. కొంతవడికిఁ దేరుకొని యవాచ్యములు పలుకవల దని భార్యను వారించి,

పటువేదనతో మఱల మూర్ఛిల్లెను. పతియొక్క దీనదశను గాంచి దుఃఖించి శైబ్యయు మూర్ఛలో మునిఁగెను అట్లు తల్లియుఁదండ్రియు నెవ్వరు దిక్కులేక నిశ్చేష్టితులై పడి యుండఁగాఁ గనుగొని తదీయనందనుఁ డగు బాలుఁడు - కన్నులబాష్పము లురలఁగ నన్నరవరుఁ జేర నరిగి యతిదైన్యముతో నన్నన్న ! యాకలయ్యెడి, నన్నము నాకిపుడు పెట్టు మని యడిగెను. కాలకల్పుఁ డైన కౌశికునికే యాదృశ్యము డెందము కరఁగించి నది. అతఁ డారాజదంపతులను శిశిరవారితో సేదఁదేర్చి "ఈగరాని యప్పు వగల నీనకున్నె ?" యని యవహేళనము చేసి, 'ధర్మతాత్పర్యము నీమనమునఁ గలదేని రయ యున ధనము నిచ్చి సత్యనిష్ఠఁ బొందు' మని రాజును బురికొల్పి, సత్యవాక్యప్రాధాన్యము నుగ్గడించి

ఉ. క్రూరుఁడ వీ వనార్యుఁడవు కొంకవు బొంకఁగ నిట్టి నీ యెడం
గారణమేమి మాకు నధికప్రియవాక్యము లాడుచుండ నం
ఘోరుహమిత్రుఁ డస్తగిరిఁ బొందెడుఁ బైకము చక్కఁబెట్టకి
ట్లూరక యున్న నిత్తుఁ గడు నుగ్రపుశాపము నీకు భూవరా !

(మారన. I.209)

యని శాపభీతిని గల్పించి నిష్క్రమించెను. రాజహృదయము నన్నృతభయమును, ముని శాపభయమును వికల మొనర్చెను. తనను నెడసేయక అమ్మి ఋషిఋణమును దీర్ప శైబ్య త్వరపెట్టినది. గత్యంతరము లేక రాజు పత్నిని కాశీనగరవీథులవెంట నమ్మెను.

ఇందు తల్లిదండ్రులు మూర్ఛలో మునిఁగియుండ నాకొన్న బాలుఁడు అన్నముకొఱ కలమటించునన్నివేళ మత్యంతకరుణారసముద్రితము. దేవీభాగవతకర్తయు గౌరనయు దీనిని వర్ణింపక వదలి రమణీయకల్పన కొకదానిని విస్మరించినవారైరి.

శైబ్యప్రోత్సాహమునకు లోగి హరిశ్చంద్రుఁడు తానే భార్య నమ్ముకొనుటకు సిద్ధ మయ్యె నని మార్కండేయమున నుండ గౌరన యించుక మార్చి, నక్షత్రకుఁడు :

"భూమీశ మాటలఁ బ్రొద్దుఁ బుచ్చెదవు - తామసం బేల నిత్తరి వెర వేది ?
తరుణిఁ బాయఁగ లేక తల్లడించినను - మరి యుపాయముఁ జెప్పుమా ధనంబునకు
జాగుసేయక పత్ని జట్టిగా నిచ్చి - నాగురునాథు ధనంబుఁ జెల్లింపఁ
జెచ్చెర లేచి వచ్చెదొ మౌనికడకు - వచ్చెదవో రావొ వైళంబె" యనుచు
నానల బెట్టి నన్నడగింప పలదు - వేసాలు సేయక వేగ లె" మ్మనుచుఁ
జేపట్టి తివియ వచ్చిన వానితెగువ - కావసుధాధీశుఁ డాత్మలో రోసి
నిమిషంబు నచ్చోట నిలువక కదలి - రమణి నమ్ముటకునై రాజమార్గమున"

(గౌ. హ. II. 291-304)

జనుదెంచె నని రచించుటవలన కథ శక్తిమంతముగ నడచినది. మార్కండేయమున నక్షత్రపాత్రకల్పనము లేదు. అందువలన నిట్టికల్పన లేదు. పురాణము అంతస్సంఘర్ష ణము దానికిఁ బోషకముగా ననుసంధించి కథాగతినిఁ దీర్చిదిద్దెను.

## 12. కాలకౌశికపాత్రకల్పనకు మార్కండేయమునందలి వృద్ధబ్రాహ్మణ పాత్రయే మూలము :

హరిశ్చంద్రుఁడు శైబ్యను గాశీనగరవీథియం దమ్ముచుండఁగా నొకబ్రాహ్మణ వృద్ధుఁడు చనుదెంచి యామెను విలువ నిశ్చయించి, వెల చెప్పు మని యడిగెను. రాజునకు విపులదుఃఖవేదనవలనఁ బలుక నోరాడలేదు. అంత నాద్విజుఁడు తగినంతధనము నానరనాథుని వల్కలముల ముడివైచి యాలతాంగిశిరోజముల నొడిసిపట్టి పెడఁబాయ నీడ్చెను. శైబ్య దుఃఖించుచుఁ దనను గాంచి వెగడుపడి యేడ్చుపుత్త్రుని బుజ్జగింప నాద్విజుని యనుమతి వేడుకొనెను. ఆబాలుఁ డెంత యోదార్చినను తల్లి కొంగునుబట్టి వీడక యేడ్వఁదొడఁగెను. అప్పుడు శైబ్య దీనానన యై గోవుతోడన వత్సముఁ గొను విధమున నాబాలునిఁగూడ విలువు మని యాబ్రాహ్మణుని వేడుకొనెను. అతఁడును గరుణించి శాస్త్రోక్తప్రకారము బాలునివెల వేనవేలమాడ లని నిశ్చయించి వాని నానరపతికిఁ జెల్లించి శైబ్యను, బాలుని నీడ్చుకొనిపోయెను. ఆదృశ్యమును నోటమాట లేక నిశ్చేష్టుఁడై కనుఁగొనుచున్న హరిశ్చంద్రుఁడు నిట్టూర్పు లందంద సందడింప విపులవేదనాదోదూయమానమానసుఁ డయ్యెను.

మార్కండేయమున శైబ్యను విలిచిన బ్రాహ్మణునిపేరు చెప్పఁబడలేదు. అతనికిని విశ్వామిత్రునకు నెట్టిసంబంధ మున్నదో స్పష్టము చేయఁబడలేదు. దేవీభాగవతము కౌశికుఁడే విప్రరూపము దాల్చె నని కల్పించెను. గౌరన విశ్వామిత్రప్రేరితుఁ డైన కలి కాలకౌశికనామధేయుఁ డై కాశియందు వసించి, చంద్రమతిని, లోహితాస్యుని విలిచె నని స్పష్టము చేసెను. గౌరన యంతటితో నాగక కాలకౌశికునకుఁ గలహకంఠి యను సార్థకనామధేయను భార్యగను, కర్కోటకుఁ డను వానిని శిష్యునిగను గల్పించి హాస్యరసానుకూల విభావకల్పన మొనర్చెను.

మార్కండేయమున వృద్ధబ్రాహ్మణుఁడు శైబ్యను, లోహితాస్యుని వెలఁగట్టుటయందు శాస్త్రము ప్రమాణముగా గైకొనఁబడినది. గోవువెంట వత్సమును విలుచుట ధర్మముగా నంగీకరింపఁబడినది. సన్నివేశము సూటిగను, ప్రశాంతముగను, ముగిసినది. గౌరనకావ్యమునఁ గల్పింపఁబడిన కాలకౌశికుఁడు కలిరూపుఁడు కావున ధర్మప్రాధాన్యము, ఋజువర్తనము సన్నివేశమునఁ గల్పింపవలనుపడదు. అందువలనఁ గాలకౌశికనక్షత్రకపాత్రలవర్తనములను గుటిలములుగను, ధర్మవిరహితములుగను కవి చిత్రించెను. అందులకై యొకనూత్నసన్నివేశకల్పన మొనర్చెను. గోవువెంట వత్సమును గొనునట్లు తల్లివెంటఁ బుత్త్రునిఁ గొను మని హరిశ్చంద్రుఁడు కాలకౌశికునిఁ బ్రార్థించెను. కాలకౌశికుఁడు గోవునుఁ గొన్నచో వత్సము దానివెంట వచ్చునట్లు చంద్రమతివెంట లోహితాస్యుఁడు విలవఁబడకుండఁగనే రావలయు నని వాదించెను. ఇరువురకును వాదముపెద్ద దయ్యెను. కాలకౌశికుఁడు త న్నెదురించువాఁడు కాశియందు లేఁడని విఱ్ఱవీగెను. హరిశ్చంద్రుఁ డలుకతో రోషవచనము లాడెను. కాలకౌశికుఁడు రాజును

పరుషోక్తులాడెను. ఇంతలోఁ జెంత నున్న నక్షత్రకుఁడు వారివాదు మాన్పి తనకుఁ దానే మధ్యవర్తిగా నుందు నని ప్రతిపాదించుకొని వారిసమ్మతిఁ బడసి కాలకౌశికున కనుకూలముగాఁ దీర్పుచెప్పెను. దానితోఁ జంద్రమతివెంట లోహితాస్యుఁడు వెలలేకయే వెంటఁ బోవుట న్యాయ మని స్థిరమైనది. చంద్రమతి రాజునకు ధైర్యము చెప్పి సత్యధర్మనిరతినిఁ గాపాడుకొను మని ప్రబోధించి కాలకౌశికునివెంటఁ బుత్త్రినితో నరిగెను.

గౌరన కల్పించినసన్నివేశము కాలకౌశికనక్షత్రకులకుటిలవర్తనమును దెలుపుట కేర్పడినను, హరిశ్చంద్రకాలకౌశికులమధ్య నడచిన సంభాషణము మాత్ర మంతయుదాత్తస్థాయిలో లేదు. ''ప్రొద్దునలేచి నీమొగముఁ గన్గొనిన - యద్దినంబున వచ్చు నాపదలెల్ల'' ఇట్టివాక్యములు పురాణహరిశ్చంద్రుఁడు ప్రాణము పోవుసమయమం దైనను అనఁజాలఁడు. పురాణమునందలి హరిశ్చంద్రుని నిశ్చలగంభీరనిర్వేదమూర్తి- గౌరనకావ్యమునఁ గ్రోధమంథరసంక్షుభితసాగరమూర్తి యైనది. ఆయఖండనిశ్శబ్దతాకల్పనలోని యనంతవ్యంగ్యశక్తి యిచ్చట హరిశ్చంద్రవాక్యపరంపరలయందు వాచ్యమై వ్యంగ్యము పల్చఁబారినది. రచనలో నిగ్రహ ముండవలసినచోట ఆవేశము పరవళ్లు త్రొక్కినది.

## 13. కాశిలో హరిశ్చంద్రుఁడు కాటికాపరి యగుట :

సర్వహరిశ్చంద్రచరిత్రకథాకావ్యములయందు సర్వసామాన్యముగా నున్న యీ కల్పనము మార్కండేయపురాణాంతర్గత మైనదే. ఇది కథయందలి యితరసన్నివేశకల్పనల కన్నిటికన్న నత్యంతశక్తిమంతమైనది. రూపకప్రయోగమునందును హరిశ్చంద్రపాత్రధారులు నాటకమంతయు నొకయెత్తుగను, ఈదృశ్య మొక్కటి యొకయెత్తుగను భావించి విశేషకృషి యొనర్చుట గమనించుచో దీనిప్రాధాన్యము చెప్పకయ తెలియఁగలదు.

భార్యాపుత్త్రులను విక్రయించి దుఃఖవివశుఁడై యున్న హరిశ్చంద్రుని దరికి విశ్వామిత్రుఁ డరుదెంచి యతఁ డిచ్చినధనముఁ గైకొని యది స్వల్పార్థ యని యసంతృప్తిని దెలిపి, దక్షిణాసంపన్నత నొనర్చు మని రాజును బలవంతపెట్టి, అట్లుచేయనిచో శాపమిత్తు నని భయపెట్టెను. జాముప్రొద్దులో తిరిగివత్తు నని గడువుపెట్టి వెడలిపోయెను.

ఉ. ఆనరనాథుఁ డప్పుడు భయమ్మును శోకము నగ్గలింపఁగాఁ
దా నెద నాత్మవిక్రయము దక్క ధనంబున కేయుపాయముం
గానక నిశ్చయించి యధికధ్వని నిట్లను నన్ను నమ్మెద
న్మానుగ నెవ్వ రైనను ధనం బిటు దెండు గొనుండు నావుడున్.

(మార. 1. 223)

అయ్యవసరమున ధర్ముఁడు చండాలవేషమును ధరించి వచ్చి యెంతయర్థ మైనను నిచ్చి కొనుటకు సిద్ధమయ్యెను. రాజు ''మాలను సేవించి మనుటకంటెఁ గౌశికశాపాగ్నిచేఁ గ్రాగుట యైన మేలని'' భావించుచుండునంతలోఁ గౌశికుఁ డచ్చటి కరుదెంచి యధికధన మాతఁ డిచ్చుచుండఁ గైకొని నాయప్పు తీర్పరాదా! యని బలవంత పెట్టెను. హరిశ్చంద్రుఁడు దైన్య ముట్టిపడఁ గౌశికుని నిట్లని ప్రార్థించెను :

క. ఇనవంశంబునఁ బుట్టిన
మనుజేంద్రుఁడ నఖిలలోకమాన్యుఁడ, గొలమా
లినమాలని నకట! తపో
ధనసత్తమ! యేను గొలువఁ దగునే? చెపుమా!

మ. కరుణం జూడుము కావు మిప్పుడు త్రిలోకస్తుత్య! చండాలసం
కరదోషంబును బొందకుండఁగ నన్నుం గైకొమ్ము నీబంటుగాఁ
బరిశిష్టం బగు సొమ్ము నాకు వెలగా భావింపు మంచు న్మునీ
శ్వరుపాదంబులు వట్టెఁ జేతుల హరిశ్చంద్రుండు దైన్యంబునన్.

కఠినాత్ముఁ డగు నక్కౌశికుఁడు హరిశ్చంద్రునిబంటుగా గైకొని యతనిని చండాలున కమ్మి యొక యర్బుదవిత్తము గొని యథేచ్ఛగా వెడలిపోయెను.

దేవీభాగవతము ఈమార్కండేయపురాణకథను చాలవఱ కనుకరించెను. కాని హరిశ్చంద్రుఁడు శేషధనమునకు బదులు తనను దాసునిగా నేలుకొను మని కౌశికునిఁ బ్రార్థింప నతఁ డారాజును చండాలవాటికకుఁ గొంపోయి చండాలరూపుఁ డగు ధర్ముని కమ్మె నని కొద్దిగ మార్చి రచించెను.

గౌరనకావ్యమునఁ గౌశికునిప్రవేశము లేదు. నక్షత్రకుఁడే కథ నడిపించెను. భార్యాపుత్త్రులను విలువగా వచ్చినసొమ్ము రాజు నక్షత్రకున కిచ్చెను. అది యతని దారి బత్తెమునకే చెల్లు ననియుఁ గౌశికునిఋణధనము వేరుగా నీయవలయుఁ ననియు బేచీ పెట్టెను. హరిశ్చంద్రుఁడు నక్షత్రకునివర్తనము న్యాయము కాదని వాదించెను.

"గురుకార్య మొనరింపఁ గోరి నావెంట - నరుదెంచి తిరిగితి వది నాకు సెలవె
పరదేశులకు గుళ్లపంచలు గాక - యిరవైన సున్నపుటిం డ్లేడఁ గలుదుఁ
బలుకూడు గాక యేపట్టున నైనఁ - గలదె పాయసము భిక్షాం దేహి యనిన
నెవ్వగఁ గుందుచు నీరసాన్నములఁ - గ్రొవ్వి బల్తురె గువ్వ గుత్తుక పడక
నివి యెల్లఁ దప్పులు నెగ్గులుఁ జేసి - తివిరి రేఁగెద నన్నుఁ దెలువ నావశమె
తీపారు చక్కెర దిన్న యానోర - వేపాకు మేసిన విధమున నీవె
చేసినంతయు మేలు చేసి మఱేల - చేసితి విట్టి కుచ్చిత మింక నైనఁ
గుదుకనగోలు గైకొనక నాధనము - వగలుము మున్ను విశ్వామిత్రుఋణము
మతితోడఁ జెల్లించి మీఁద నెట్లయిన - ధృతిఁ దీర్తు నీబత్తెదినముల లెక్క
నావుడు విని నవ్వి నక్షత్రకుండు - భూవర నీకంటె బుద్ధిమంతుఁడను
దొడిబడఁజేసితి దొరికినధనము - విడిచి మీఁదటఁ గొను వెంగలి గలఁడె
చదువు మీఁదిది దెబ్బ నంగతి గాక - పిదప నొప్పునె మఱి పెక్కు లేమిటికి
విడుపు మింతటనుండి విత్తంబుమీఁది - యడియాస పైఁడికి బ్రాణముల్ లంకె
విడుతుఁ బ్రాణము లైన విడువ ధనంబు - మెడ మెండుకొని త్రెంపు మీచేతి హేతిఁ
దల ద్రెవ్వ మొత్తి యీధనముఁ గైకొనుము -
వెలయంగ నాచావు వెదకుఁ గౌశికుఁడు"

అనిపలుకు ధూర్తవిప్రుని వాక్యములు విని హరిశ్చంద్రుఁడు హరహరా యని చెవులు మూసికొని యాధనముపై నాశలు వదలుకొని కౌశికుఋణ మెట్లు తీర్తు నని తలపోయు చుండ నక్షత్రకుఁ డాతనిని దుర్భాషలాడి మనసు నొప్పించెను. ఋణము దీర్ప బలవంత పెట్టెను. అప్పు డారాజచంద్రుఁడు-

" మునిశిఖామణితోడ మొఱఁగిన మితికి- ధనముఁ జెల్లించుచందము డెందమునకుఁ
దలపోసి చూచితిఁ దక్కొండు గాన- నలవడ దిటుగాన నాలస్య ముడిగి
నామీఁది వచ్చు ధనం బెల్ల నీకు- నేమానవుం డిచ్చు డీమితిలోన
నతనికి బంటుగా నమ్ముకో- నన్ను- మతిలోన వల దనుమానింప"

నని యతని వశ మయ్యెను. అతఁడు వీరబాహుఁడను చండాలరూపధారి యగు ధర్మునకు నేనుఁగు నెక్కి మానవుఁడు మేటిరత్నము విసర నెంతపొడ వగు నంతరాశి పోసిన ధనమునకు నమ్మి వెడలిపోయెను. పురాణమునందలి కౌశికుని స్థానమున గౌరనకావ్య మున నక్షత్రకుఁడు నిలచెను. పాత్రౌచితిని బట్టి సంభాషణలు, సన్నివేశములు చిత్రింపఁ బడినవి. అంతియగాని కథాగతియందు గాని, తాత్పర్యమునందు గాని పురాణప్రబంధ ములమధ్య భేదము కానవచ్చుట లేదు.

గౌరన పాత్రౌచిత్యము నెఱిఁగి కొన్నినూత్నకల్పనను చేసెను. హరిశ్చంద్రుఁడు ధర్మునకుఁ గట్టుబడి చండాలున కమ్ముడువోయి యతనివెంట వెడలునప్పుడు దేవతలు సంతుష్టులై యతని కాకలిదప్పులు లేకుండునట్లు వరము ప్రసాదించి రని గౌరన కల్పిం చెను. వీరబాహుఁడు హరిశ్చంద్రునిసేవానిరతినిఁ బరీక్షించుట కొకనాటిరాత్రి యతని తొడలపైఁ బాదము లుంచి యట్లే నిదురించెను. హరిశ్చంద్రుఁ డారేయి నిదురఁ బోక యజమానిసేవలయం దప్రమత్తుఁడై మెలఁగెను. వీరబాహుఁ డతనినిష్ఠకు మెచ్చి కాశీనగరదక్షిణశ్మశాన పాలనోద్యోగిగా నియమించి వీరదాసుఁ డను వ్యవహారనామమున మెలఁగు మని నిర్దేశించెను. ఈరెండు కల్పనలవలనను హరిశ్చంద్రునకు చండాలగృహ భోజనదోషము కలుగకుండుటయు, ధర్మదీక్ష చెదరకుండుటయు నేర్పడినవి. గౌరన చేసిన మొదటికల్పనకు దేవీభాగవతము దోహద మొనర్చినది. అందు హరిశ్చంద్రుఁడు చండాలు నింట నన్నపానములు విసర్జించె నని యున్నది. అది యసాధారణ మని తోచి గౌరన వరప్రసాదము పేర నతని కాకలిదప్పులనే మాన్పించెను. దేవీభాగవతమునఁ జండాలుఁడు వీరబాహుఁ డను నామము హరిశ్చంద్రున కుంచె నని యుండ గౌరన వీర బాహునామము చండాలునకే పెట్టి రాజునకు వీరదాసుఁ డను పే రన్వర్థముగఁ గల్పించెను.

## 14. హరిశ్చంద్రుఁడు శ్మశానమునఁ గాంచిన స్వప్నవృత్తాంతమును గౌరన గ్రహింపలేదు :

మార్కండేయపురాణకథయందు హరిశ్చంద్రుఁడు శ్మశానపాలనము సేయుచుండ నొక నాఁ డత్యద్భుతమైన కలఁ గాంచె నని వర్ణింపఁబడియున్నది. అం దామహారాజు

చండాలికాగర్భమున నుదయించి, శ్మశానమున మృతసంస్కారమాల్యాహరణోద్యోగమున నుండి విప్రశాపమునకుఁ బాలై వత్సరద్వయము నొక్కొక్కదిన మొక్కొక్క శతవర్షములుగా వివిధనరకబాధ లనుభవించి, యాపై భూతలమున వివిధజంతుజన్మల నెత్తి తీవ్రవేదనలఁ బాల్పడి, చివరకు నెప్పటి రాజస్థితినిఁ బొంది భార్యాపుత్త్రులను రాజ్యమును గోల్పోయి, యేకాకి యై యడవుల కరిగి, సింహముబారిఁ బడి, శరభముచేత రక్షితుఁడై, దానిచే నతిపీడితుఁ డగుచు భార్యానందనులఁ దలఁచి, వందురి తిరుగుచు నొక్క యెడ నయ్యిరువురుఁ దమ్ము రక్షింపు మని తన్నుం బేర్కొని పిలుచు నెలుంగులు విని డాయంబోయి, వారలఁ గానక పరిభ్రమించుచుండఁ బదియేను దినములు కొఱఁతగా బండ్రెండేడులు నిండిన తఱి విశ్వామిత్రుచే వృత్తాంతము నంతయు నెఱిఁగి జముఁడు తనకడకు రప్పించి, యిది యెల్లఁ గౌశికరోషమున నయ్యె దానంజేసి భవన్నందనుఁడు మృతుఁ డగునుఁ బదంపడి పరమశుభములు గలుగు; దుఃఖశేషము ననుభవింప మనుష్యలోకమునకుఁ బొమ్మని త్రోపించిన నంతరిక్షమునుండి నేలఁ గూలె నని స్వప్నతాత్పర్యము.

స్వప్నానుభూతి సత్య మైన ట్లతనికి భాసించుటయు, భావికథార్థములు దానియందు సంగుప్తములై యుండుటయు స్వప్నకథానిర్మాణశిల్పము. హరిశ్చంద్రుఁడు కథాంతమున శాశ్వతదివ్యభోగము లనుభవింపఁబోవుచున్నాఁడు. అతఁ డనంతసంసారయాత్రలో నాచరించినకర్మలకు ఫలరూప మైన సుఖదుఃఖము లనుభవించుట తప్పదు. అల్పదుష్కృతుఁడు దుఃఖముల నిహమున భోగించి పాపకర్మభోగనివృత్తుఁడై పర్యంతమున శాశ్వతానందసిద్ధిని బడయఁగలఁడు. రాజు లైనవారికి నరక మవశ్యభోక్తవ్య మగుటయుఁ బ్రసిద్ధము. కావున హరిశ్చంద్రుఁ డిహమున ననుభవించుదుఃఖమును, జన్మపరంపరాగతమైన దుఃఖమున కనుబంధమే యను సత్యము స్వప్నము వ్యాఖ్యానించుచున్నది. ఇది హరిశ్చంద్రకథాజీవితరహస్యము. దీనివలన నొకపౌరాణికసహజమైన యాధ్యాత్మికపరివేషము కథ నావరించి దానిని తత్త్వగంభీర మొనర్చుచున్నది. లౌకికుఁ డైన గౌరన యీకల్పనను గైకొనక వదలెను.

హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రతపోవనమున విశ్రాంతి గొనినప్పు డొకస్వప్నము వచ్చినట్లు గౌరనాదులు కల్పించిరి. అది భావికథార్థసూచక మగు గండముగాఁ బనికివచ్చినది. కాని, మార్కండేయపురాణస్థ స్వప్నకల్పనమువలె బహుళార్థసాధకముగను, కథాపరమతత్త్వవ్యంజకముగను భాసింపలేకపోయినది.

## 15. లోహితాశ్వుఁ డురగముచేత మృతినొందు కల్పనము మార్కండేయ పురాణస్థ మైనది :

సంస్కృతమార్కండేయపురాణమున నొకశ్లోకమునందును, ఆంధ్రమార్కండేయమున నొకపద్యమునందుసు పేర్కొనఁబడిన లోహితాశ్వమరణవృత్తాంతము గౌరనకావ్యమున ౨00 ద్విపదలకు మించి వర్ణింపఁబడినది.

మార్కండేయము లోహితాశ్వుఁ డురగముచే నెట్లు మృతినందెనో వివరించి చెప్ప లేదు. దేవీభాగవత మీయంశమును స్పష్టమొనర్ప యత్నించినది. రోహితుఁడు విప్ర బాలురతోఁ గూడి కుశగ్రహణార్థము వనమున కేగి సర్పదష్టుఁడై మృతినొందెను. చంద్ర మతి దుఃఖార్తయై మృతపుత్రుని స్మరించుచు నతనికడ కేగుటకు యజమాని ననుజ్ఞ వేడెను. కాని యతఁడు గృహకృత్యము లన్నియు నొనర్చి రాత్రివేళ నచ్చటి కరిగి మఱల తెల్లవారుసరికి రావలె నని నిర్దేశించెను. అట్లే చంద్రమతి ప్రొద్దుపోవువఱకు యజ మానిసేవ లొనర్చి, రాత్రివేళ నొంటిగ నడవి కేగి మృతబాలునిఁ గాంచి, కొంతవడి యపారదుఃఖ వారినిధియందు మునిఁగెను. అటుపై నాసాధ్వి మృతబాలుని మూపున నిడు కొని శ్మశానమునకుఁ గొంపోవసాగెను. మార్గమధ్యమున రాజభటు లామెను గాంచి, శంకించి, యామెవృత్తాంతమును గూర్చి ప్రశ్నించిరి. చంద్రమతి పుత్త్రదుఃఖవివశయై వారి కెట్టిసమాధాన మీయఁజాలకపోయెను. ఎన్నిసారు లడిగినను నెట్టిసమాధాన మీయక పోవుటచే వా రామెను శిశుహంతగా నిర్ణయించి శ్మశానపాలకుఁడైన చండాలున కామెను వధింప నప్పగించిరి. చండాలుఁ డామెను నిర్దాక్షిణ్యముగా నిందించెను. అప్పటికిని నామె తన వృత్తాంతము చెప్పదయ్యెను. చండాలుఁడు విసిగి యామెను వీరబాహునొద్దకుఁ బంపి యతఁ డామెను జంపున ట్లాజ్ఞాపించెను.

వీరబాహుఁడు స్త్రీవధ నరకహేతు వని చెప్పి, యామెను వధించుట కంగీకరింపలేదు. యజమానియాజ్ఞను శిరసావహించుట ధర్మ మని చండాలుఁడు కఠినముగా శాసించెను. వీరబాహుఁడు ఆకార్యముతప్ప నన్యకార్య మేదైనఁ గోరినచో నొనర్చెద ననియు, కావలయునన్నచో నింద్రు నైన జయించి యతనికి దాసు నొనర్చెద ననియు బ్రతిమిలాడు కొనెను. అందుల కాచండాలపతి యాగ్రహించి "దాసత్వమున కంగీకరించియు శూరుని వలెఁ బల్కుచుంటివేల ? ఇట్టిపాపభీతికలవాఁడవు లజ్జ వీడి నాయింట దాసుఁడ వైతివి" యని పల్కి యామెశిరము ఖండింప ఖడ్గము నందించెను.

చేయునదిలేక విధివైపరీత్యమున కచ్చెరువుపడుచు వీరబాహుఁ డామెను బలిపీఠ మెక్కు మనెను. ఆమె యట్లే చేసెను. భార్యాభర్తలిరువురు పరస్పరము గుర్తించుకొన లేదు. అతఁడు ఖడ్గము నెత్తెను. చంద్రమతి వీరబాహు నొక్కకోర్కె కోరెను. మృత బాలుఁనిఁ దెచ్చి దహనసంస్కార మొనర్చుటకు సమయ మిమ్మని ప్రార్థించెను. అతఁ డందుల కనుమతించెను. ఆమె మృతబాలునిఁ దెచ్చి చండాలునిపాదములముం దుంచెను.- ఇట్లు దేవీభాగవతకర్త బాలునిమరణహేతువును గల్పించి వర్ణించుటతోపాటు చంద్రమతీ వధను హరిశ్చంద్రుఁ డొనర్పవలసివచ్చినట్టి విచిత్రకల్పనము చేసి కథను బెంచెను. కాని రాజభటులు, చండాలుఁడును ఎన్నిప్రశ్న లడిగినను చంద్రమతి మూగనోముపట్టియుండుట కొంత యసహజముగా నున్నది. దానితోఁ గథ కృత్రిమముగా వృద్ధిచెందినది. ఇది యిట్లుండ కథాంతమున హరిశ్చంద్రుఁడు పుత్త్రవ్యామోహమున మృతబాలునిచితిపై కెక్కి మర ణింప నుద్యుక్తుఁ డగును. చంద్రమతీ శిరఃఖండనరూప మైన స్వీయధర్మమును విస్మ

రించును. మార్కండేయమునందువలెనే తనతోపాటు తనపత్నిని వహ్నియందుఁ బడుట కారాజు అంగీకరించును. కావున నీకల్పనములకుఁ బర్యంతమున సార్థక్యము లేదు. ప్రస్తుతమునఁ బుష్టి లేదు.

గౌరనాదులును దేవీభాగవతమువలెనే లోహితాశ్వమరణహేతువును విపులముగా వర్ణించిరి. గౌరన మఱియును విశ్వామిత్రమాయాకల్పనము నిచ్చట జోడించెను. విశ్వామిత్రప్రేరితుఁడైన తక్షకుఁడు నిర్దిష్టమైన యొకవృక్షమూలమున వల్మీకము నిర్మించుకొని యుండె ననియు, కౌశికప్రేరితులైన వటువులు లోహితాశ్వుని నచ్చటకుఁ గొంపోయి రనియు, తక్షకుఁడు చంద్రమతీ పాతివ్రత్యమహిమ నెఱిఁగియుండుటచే నాకుమారుని ప్రాణములు గొనక మరణతుల్యమైన మూర్ఛలో ముంచె ననియుఁ గల్పించి దేవీభాగవత కల్పనకన్న నొకయడుగు ముందుకు వైచెను. కాని, తరువాత రాజభటులు చంద్రమతిని శిశుహంతగా శంకించుకల్పనము నిచ్చట పొందుపఱచుట మాని స్థలాంతరమున దానిని సంస్కరించి నిబంధించెను. మార్కండేయపురాణకథానుసారముగాఁ జంద్రమతి మృత బాలుని శ్మశానమునకు సూటిగాఁ దెచ్చినట్లుగనే వర్ణించెను.

### 16. చంద్రమతి చండాలరూపుఁడై యున్న భర్తను గుర్తించిన దనుకల్పనకు మార్కండేయపురాణము మార్గము చూపినది :

శైబ్య మృతపుత్త్రుని శ్మశానమునకుఁ జేర్చి శవముపైఁ బడి పెక్కువిధముల దుఃఖించుచుండఁ గాటికాపరి యైన హరిశ్చంద్రుఁ డచ్చోటి కరుదెంచి కార్చిచ్చువేఁడికి వాడివత్తయైన వనలతవలె మ్లానత్వము నొందినవనితను, విషవ్యపగతప్రాణుఁడైన బాలునిఁ గాంచి, యబ్బాలుని శుభలక్షణావళిని గుర్తించి చోద్య మంది యతఁడు తనపుత్త్రుఁ డని తెలియక లోహితాశ్వునివయస్సున నున్నవాఁ డని తలంచి యతనియకాలమృత్యువు నకుఁ జింతించుచుండెను. అప్పుడు శైబ్య యిట్లు దుఃఖించె నని సంస్కృతమార్కండేయ పురాణము :

శ్లో. హా ! వత్స ! కస్యపాపస్య హ్యపథ్యానా దిదం మహత్
దుఃఖ మాపతితం ఘోరం యస్యాన్తో నోపలభ్యతే॥
హా ! నాథ ! రాజన్ భవతా మా మనాశ్వాస్య దుఃఖితామ్
క్వాపి స న్తిష్ఠతా స్థానే విస్రబ్ధం స్థీయతే కథమ్॥
రాజ్యనాశః సుహృత్త్యాగో భార్యాతనయవిక్రయః
హరిశ్చంద్రస్య రాజర్షే ర్దుర్విధే కిం కృతం త్వయా ? (8.187-189)

ఇందు మొదటిశ్లోకమువలన నామృతబాలుఁ డామెపుత్త్రుఁ డనియు, రెండవశ్లోకమువలన నామెనాథుఁ డామెకు దూరమై యుండె ననియు, మూఁడవశ్లోకమువలన నాతఁడు హరిశ్చంద్రుఁడే యనియు నొకక్రమాగతమైన జ్ఞానస్ఫూర్తి కలుగునట్లు రచన మొన ర్చుట చమత్కారము ! మారన దీని ననువదించుచు మఱియొకచమత్కారము చేసెను.

క. అక్కట ! దైవము రాజ్యము
త్రెక్కొని యాలిం దనూజుఁ దెగ నమ్మంగా

నెక్కొలిపి హరిశ్చంద్రుని
నిక్కడఁ గాడ్పఱిచె నింక నేగతిఁ బోదున్;"

చ. అని పలుక న్విభుండు విని యప్పుడు దా మది వారల న్నిజాం
గనయు సుతుండుగా నెఱిఁగి గ్రక్కునఁ జేష్ట యడంగి కూలె నే
ల నతని నాథుఁగా నెఱిఁగి లాలలు వాపోరఁగంగఁ దీవ్ర రో
దన మొనరించుచుం బడియెఁ దామరసానన మూర్ఛఁ గప్పినన్.
(మారన. 1.250-251)

పైకందమున "నిక్కడఁ గాడ్పఱిచె" ననుటలో సద్యఃస్ఫూర్తిగా నీశ్మశానమున నాతని నుంచి పీడించె ననియు. నాలోచించినచో నీపుత్రమరణ మనుచోట నతనిని దైవము క్షోభ పెట్టె ననియు భావ మేర్పడుచున్నది. ఇది మూలార్థముకన్న విలక్షణమైనది. ఇట్లు గడుసుగాఁ జెప్పించుటవలన శైబ్య హరిశ్చంద్రుని తత్కాలదైన్యస్థితిని గుర్తించియే మాట్లాడినట్లు స్ఫురించుచున్నది. హరిశ్చంద్రుఁ డావాక్యము విని యామె తనభార్య యనియు నతఁడు తనపుత్త్రుఁ డనియు గ్రహించుటతోపాటు తనభార్య తనను గుర్తించె ననియుఁ, బఠితవలె భ్రమించియుండును. కాని, కవి తరువాతిపద్యమునఁ జంద్రమతి మూర్ఛితుఁ డైన హరిశ్చంద్రునిఁ దనభర్తగా గుర్తించె నని చెప్పి, తనవాక్యరచనా చమత్కారమును జూపి మనల నాశ్చర్య ముగ్ధుల నొనర్చును. పైకందములోని "ఇక్కడ"ను "ఎక్కడ" అని మార్చినచో మూలమున కతిసన్నిహిత మైన యనువాద మగును. కాని పైచమత్కారము సమసిపోవును.

దేవీభాగవతకర్త సంస్కృతమార్కండేయము ననుసరించెను. గౌరన తనకావ్యమున హరిశ్చంద్రునకుఁ జంద్రమతిమెడలోని తాళి కనుపడినట్లును, కాటిసుంకముగా నద్దానిని గోరినట్లును వర్ణించి పతివ్రత యగు నామెచే నతనిని భర్తగా గుర్తింపఁజేసెను. తదనుగుణముగా కథాకల్పనము చేసెను. మృతపుత్తునిఁ జితిపై నుంచి దుఃఖించుచున్న చంద్రమతిని సమీపించి హరిశ్చంద్రుఁడు "నివ్వెఱపాటుఁ గళవళంబును మదిఁ గదలు కొనంగఁ దొలఁగినపయ్యెద తుంగస్తనముల, నలవడగప్పు నయ్యబ్జాక్షిఁ జూచె" నని వర్ణించుటలో సందర్భశుద్ధిమాట యటుంచి సతిని పతి చూచినవిధముతోపాటు, మెడలోని మినుకును గూడ నాతఁడు చూచియుండుట కవకాశము కల్పించినాఁడు. పురాణహరిశ్చంద్రుఁడు మొగమెత్తి పరవనితాముఖమే చూడఁడు. ఇక పయ్యెద కప్పుకొను చోటు కలలోఁ గూడ చూడఁజాలఁడు. అది ప్రబంధహరిశ్చంద్రునకుఁ జెల్లినది; కాని, యామె భార్య యగుటచేఁ గల్పనయందు దోషము కానరాదు; చంద్రమతినోట నామెమగఁడు హరిశ్చంద్రుఁ డని తెలియఁ జెప్పించినవిధ మొక క్రమోన్మీలన పద్ధతి ననుసరించి చిత్రింపఁబడినది. హరిశ్చంద్రుఁడు మొదట నామెను "మగువ నీపే రేమి మగని పే రేమి? - యెచ్చట నుండుదు నీబాలుఁ డెట్లు - చచ్చె:" నని ప్రశ్నించెను. ఆప్రశ్నలకు సమాధానముగా నమ్మగువ —

" పురుషవరేణ్య ! యీపురి నొక్కవిప్ర - వరునింట దాసినై వర్తించుచుందు
నప్పు దీర్పఁగ నుపాయము మఱిలేక - తప్ప నాడక పతి దన్నమ్ముకొనియె
నాసుతుఁ డితఁ డంసనారి నాపేరు'' -

అని మగనిపేరు తప్పఁ దక్కిన వివరముల నన్నిటిని జెప్పి యూరకుండెను. హరిశ్చంద్రుఁ డాసతివాక్యసరణిచే నామె తనకులసతి యని నిక్కువముగా నాత్మఁ దెలియఁ జాలలేక కాటిసుంక మగు నొక్కమాడను చెల్లింప నడిగెను. అప్పు డవ్వేలఁది

'' పరహితచరిత నాపై నొకకొంత - కరుణసేయక సిరిగలదానివలెనె
యడిగెదవేల నన్నదలించి యిపుడు - యెడపక దీన నీ కేమి గూడెడిని
సకలదీవుల నేలు జనపతి పుత్త్రుఁ - డకట ! చేరెడునేల కర్హుండుగాఁడె
నీ వేమి సేతు పన్నినమునిమాయ - నావెంటఁ దతిగొని నలఁచి పోనీక
పట్టి యీగతి నేలపై నిడి కాలఁ - బెట్టి ప్రాముచు బుసవెట్టుచుండంగ''

నని మునిమాయాప్రసక్తిఁ దెచ్చి ఛాయగా హరిశ్చంద్రస్ఫూర్తి కలుగునట్లు మాటలాడఁగా విని యారాజు వితర్కించి "యాతరుణి నాపత్ని యగు" నని భావించి, చయ్యన మనస్సు మరలించి "గట్టిగా నెఱుఁగ కీగతిఁ దలంపేలపుట్టె విశ్వేశ నాబుద్ధిలో'' ననుచుఁ బరితాపమంది యప్పడతిని వీక్షించి మఱియు నిట్లు పలికెను:

"...జోద్యంపు మాటలాడెదవు - నట్టేడు దీవుల నడుమెల్ల నేలు
పట్టభద్రునికూర్మిప ట్టఁట బాలుఁ - డామహీశుని దేవి వఁట నీకు విత్త
మేమియు లే దన్న నెటు నమ్మవచ్చు - నీ కెంతఁ గలిగిన నిన్నదలించి
మాకు గైకొనరాదు మాడకు మిగులఁ - జేకొని యేలిక చెప్పినచొప్పు
గాక నీపేదఱికము నాకుఁ బోత్రై - పాటలగంధి నీపలు కియ్యకొనఁగఁ
గాటిపాపని కేల కరుణ నీమీఁద - లేకున్న నా కిచ్చులెక్కకుఁ జెల్లు
గైకొందు నిమ్ము నీకట్టిన మినుకు -''

నని యడిగినాఁడు. చంద్రమతీపతిభక్తిపెంపున నామెమెడయం దున్న మిను కన్యపురుషులకుఁ గానరాదు కావున నామె యాతఁడు తనభర్త యని నిశ్చయించినది. అతని దుస్థితిఁ గాంచి మూర్ఛపోయినది; కొంతవడికి తెప్పరిల్లినది. కన్నులు తెరచుటతోడనే "హానాథ ! సతతదయాలోల, సత్యసంశీల ! హా ! హరిశ్చంద్ర !" అని నోరారఁ బిలిచి "రావయ్య నీపుత్త్రు లోహితాస్యునిఁ బద్మలోచనుఁ జూడు'' మని పుత్త్రుని నతనికిఁ జూపినది. అంతటితో నాగక —

'' ముందు నీతొడలపై ముదమున నిద్ర-నున్నాఁడు మేల్కొనఁ డొకమరి యైన
నాపుత్త్రిరత్నంబు నాపాటుఁ జూడ-నోపక వచ్చి లా నున్నవాఁ డిచటఁ
గాటిలోఁ గాననికన్నుల నున్న - చోట నిన్నిబ్బంగి శోకాబ్ధి ముంపఁ
దలఁచి మమ్మిటుఁ దెచ్చి దైవంబు నీకుఁ-దెలిపెనే" యనుచు నర్థినకరకుల తిలకుని పాదములపైఁ బడి శోకిల్లెను.

గౌరనరచనాప్రణాళికను సూక్ష్మముగాఁ బరిశీలించినచో మూలశ్లోకములం దత్యంత సూక్ష్మముగా నిబంధింపఁబడిన హరిశ్చంద్రబాంధవ్యజ్ఞానక్రమావిష్కారవిధానము నాతఁడు గ్రహించి సంభాషణలలో దానిని బెంచి, మాంగళ్యదర్శనకల్పనము చిత్రించి సన్నివేశమును దీర్చి దిద్దె నని స్పష్టము కాఁగలదు. దానిని "హానాథ! హా! హరిశ్చంద్ర!" యను సంబోధనములే వ్యక్తముచేయుచున్నవి. గౌరన మారనరచనాచమత్కారమును గాఢముగా భావించి, దానిని విస్తరించి కల్పనాచమత్కారముగాఁ బ్రపంచించెను. ''హరిశ్చంద్రుని నిక్కడఁ గాఢ్పటిచె" ననుటలో శైబ్య హరిశ్చంద్రుని గుర్తించె నను భ్రాంతిని గౌరన స్థిరీకరించి చంద్రమతియే హరిశ్చంద్రుని ముందుగా గుర్తించె నని కల్పించెను. హరిశ్చంద్రుని హృదయమున ధర్మభీతిచే సంశయముఁ గల్పించిచంద్రమతి యతని యడుగులపైఁ బడి దుఃఖించినతరువాత నాతఁడు నిజముతెలిసి దుఃఖాతిశయమున మూర్ఛిల్లె నని వర్ణించెను. మారనచమత్కారము నీతఁడు గమనించె ననుట కతనిరచనమే కొంత సాక్ష్య మిచ్చుచున్నది. ''ఇక్కడ" అనుమాటకు "కాటిలోఁ గాననికన్నుల నున్నచోట'' ననియుఁ "గాఢ్పఅచె'' ననుమాటకు ''నిన్నిబ్భంగి శోకాబ్ధి ముంపఁ'' ననియు వ్యాఖ్యానములు చేసినట్లు గౌరన రచించెను. మూలమునందలి దుర్విధిశబ్దమును దైవముగా మార్చిన మారనశిల్పమును గైకొని ''దైవంబు నీకుఁ దెలిపెనే'' యని గౌరన రచించినాఁడు :

లోహితాశ్వుఁడు మరణించినతఱి హరిశ్చంద్రుఁడు భార్యాపుత్త్రులను గాంచుట నిజముగా 'దుర్విధి' యొక్క విలాసముగనే పైకిఁ జూడఁ గనుపట్టును. కాని, హరిశ్చంద్ర స్వప్నచర్వణమనస్కులైన పఠితల కది "దైవసంఘటన'' వలెనే తోచును. ఇట్లు దైవశబ్దము భావికథానిర్వహణమున కున్ముఖమైన యవిమర్శసంధిని సూచించుచున్నది. ఆయువుపట్టైన పురాణకల్పనమును ప్రబంధోచితముగా గౌరన వాడుకొనినాఁడు. పురాణమునఁ జంద్రమతిమాటలు విన్న హరిశ్చంద్రుఁడు మూర్ఛిల్లును. గౌరన కావ్యమునందును అట్లే యగును. కావునఁ జండాలరూపధారియై యున్న హరిశ్చంద్రునిఁ దనభర్తగాఁ జంద్రమతి ముందుగా గుర్తించె ననుకల్పనకు సూచనలు సంస్కృతాంధ్రోభయమార్కండేయములందే కల వనుట తథ్యము :

## 17. కథానిర్వహణమున గౌరన హరిశ్చంద్రుని ధర్మవీరునిగా నిరూపించెను :

మార్కండేయపురాణకథానిర్వహణమున హరిశ్చంద్రుని యొక్కయు, శైబ్యయొక్కయు పుత్త్రవ్యామోహము ప్రతిపాదింపఁబడినది. మృతబాలుఁడు తనసుతుఁ డని తెలిసిన హరిశ్చంద్రుఁడు అపారశోకాగ్నిసంతప్తుఁ డయ్యెను. మూలకర్త యాతని శోకమును ఆఱుశ్లోకములందును, మారన నాల్గుపద్యములందును వర్ణించియుండిరి. దేవీభాగవతము మార్కండేయము ననుసరించెను. కాని, చంద్రమతి శోకము నత్యావేశముతో రచించిన గౌరన హరిశ్చంద్రునిశోకము నతిశయముగ వర్ణింపక :

''విప్పారుకన్నుల వెన న్నశు లొలుకఁ - గొడుకురూపంబును గుణవిశేషంబు
నడుపును ముద్దును నగవుఁదేజంబుఁ - బల్లుమాఱు నంకించి పల్లవించువిభుఁ"

డని మాత్రమే పేర్కొనియున్నాఁడు. దీనివలన నతని ధీరోదాత్తగుణము పోషింపఁబడినది.

మార్కండేయమున హరిశ్చంద్రుఁడు సుతుమరణానంతరము శుభములు కలుగునని తెలిసియుఁ పుత్త్రవ్యామోహమున "వంశకరుం డైన యీయొక్కశిశువును దైవగతిఁ బోవ వగలకుం గొలు వగుచుఁ గుందంజాల పీనియొడలితోడన యనలంబునం బడియెద న న్నేలిన చండాలుని యనుజ్ఞ లేకున్న నింకొక్కపుట్టువున నైన వానికి బంట నయ్యెద, నీదుర్మరణంబునంజేసి యనేకఘోరనరకంబులైనను ననుభవించెద దాన యజనయాజన గురుపూజనంబు లొనరించినవాఁడ నైతినేని పరలోకంబున నైన మన మెప్పటియట్ల కూడి యుండెదము వినుము నగియును నే నెన్నండును బొంకుపలుక నాకిదియ నిశ్చయంబు" అని సుతునిచితిపైఁ బడి మరణింప నుద్యుక్తుఁ డయ్యెను. పైవాక్యములలోఁ జండాలయజమాని యనుమతిలేనిది తాను మరణించుట ధర్మవిరుద్ధ మని హరిశ్చంద్రుఁడు గుర్తించెను. అధర్మలుప్తి కెన్నినరకము లైన ననుభవించుటకు సిద్ధ మయ్యెను. చివరకు తనసత్యనిష్ఠయందుమాత్ర మెట్టిలోపము కలుగలే దని సంతృప్తిపడెను. మోహస్వరూప మట్టిది. దానిని మారన హరిశ్చంద్రునిముఖముననే :

క. నీవిటుగాఁ జూచియు నా
జీవ మెడల దున్నయపుడ చిత్తమ్మున మో
హావేశము తండ్రులకు స్వ
భావము సు మ్మిట్లు సుతులపై సుగుణనిధీ! (1.255)

అని యమూలకవాక్యనిర్మాణమునఁ బ్రతిపాదించినాఁడు.

హరిశ్చంద్రుఁడు చండాలుననుమతి లేని దుర్మరణమునకు బాలగుచుఁ దనపత్ని నరిగి యమ్మహీదేవుని దేవునింబోలె నారాధింపు మని సేవాధర్మము నుపదేశించెను. అయ్యింతి యప్పుడు కరం బలిగి

తే. కొడుకు నీవును జిచ్చునఁ బడఁగఁ జూచి
యేను జీవంబుతో నుందునే నరేంద్ర!
నాకలోకసుఖం బైన నరక మైన
ననుభవింతును నీతోడ నరుగుదెంతు. (1.265)

నని పలికినది. పతి దాని కొడఁబడినాఁడు. యజమానులయెడ సేవావిధిని పుత్త్రవ్యామోమున నిట్లు భార్యాభర్తలు విస్మరించి పుత్తునిచితిపైఁ బడి మరణింప నుద్యుక్తులగుట సత్యముతోపాటు ధర్మము బోషించినట్టి హరిశ్చంద్రునిచరిత్రమున కుదాత్త మైన నిర్వహణము కాఁజాల దని గౌరనాదులు భావించినట్లు తోచుచున్నది. పురాణకర్త యిట్లు చిత్రించుటలోని పరమరహస్యము కథానిర్వహణమునఁ బ్రాప్త్యాశాంకురానంతరము ఫలానుగమప్రాప్తికి మార్గ మాశ్చర్యకరముగాఁ దోపించుట కత్యంతోద్వేగవంతమైన సన్నివేశమును గల్పించుటకే. గౌరనాదు లీరహస్యమును గుర్తించి పైసన్నివేశమునందలి పుత్త్ర

వ్యామోహము నాయికానాయకులకుఁ దొలఁగించి ధర్మదీక్షను వ్యంజింపఁజేసెడి సమాంతర నూత్నసన్నివేశకల్పన మొనర్చిరి.

దేవీభాగవతమునఁ జంద్రమతి పుత్త్రవియోగదుఃఖమగ్నుఁడైన హరిశ్చంద్రునకు ధైర్యము చెప్పి కర్తవ్యోన్ముఖునిఁ గమ్మని ప్రబోధించినది. తనకు విధించిన మరణదండనము నమలుపఱుపఁ ద్వరపెట్టినది. హరిశ్చంద్రుఁ డాబెట్టిదపుమాటలు విని మూర్ఛిల్లి, కొంతవడికిఁ దేరి, పుత్త్రునిచితిపైఁ బడి మరణింప నుద్యుక్తుఁ డయ్యెను. అచ్చటినుండి మార్కండేయమునందలికథయే కలదు. చంద్రమతీమరణదండనకల్పనము దేవీభాగవతమున సాధించిన ప్రయోజన మంతఁగా లేకపోయినను గౌరనాదుల నూత్నకల్పనకొకస్వరూపరేఖ నందించినది.

గౌరన యీచివరిఘట్టమునందును గౌశికునిమాయాకల్పనము నొకదానిని సృష్టించెను. కౌశికప్రేరితుఁడైన చోరుఁడు కాశీరాజపుత్త్రునిఁ జంపి యతనివస్త్రములమూట రాజవీథిని యజమానియింటి కరుగుచున్న చంద్రమతి కిచ్చెను. ఆరెకు లామెను నేరస్థురాలని బంధించిరి. ఆమె రాజునెదుటకుఁ గొంపోఁబడెను. రా జామెను విచారించి శిరఃఖండన శిక్ష విధించెను. ఆమెతల నఱకుటకు వీరబాహుఁ డాజ్ఞాపింపఁ బడెను. వీరబాహుఁ డాపనిని వీరదాసున కప్పగించెను. హరిశ్చంద్రుఁడు తనదుర్విధి కెంతయో విచారించెను. చంద్రమతి నాథుని సత్యధర్మదీక్ష నిలుపుకొను మని ప్రబోధించెను. అతఁడు గుండె దిటవు చేసికొని చంద్రమతిశిరము నఱుక ఖడ్గ మెత్తెను. విశ్వామిత్రుఁ డప్పు డచ్చటి కబ్బురముగ వచ్చి రాజుకరము వట్టి భార్యాహత్య మహాపాతక మనియు, దాని నుడుగు మనియు బోధించెను. రాజు మునిమాటలు త్రోసిరాజని సత్యధర్మదీక్షాబద్ధకంకణుఁ డయి చంద్రమతీశిరఃఖండన కుద్యుఁ డయ్యె నని గౌరనకల్పనము.

గౌరనకల్పనమువలన హరిశ్చంద్రుని ధర్మనిరతి యకుంఠితమై భాసిల్లినది. ఆరాజు స్వీయపుత్త్రశవదహనవిషయమునందును కానంత వ్యామోహము చూపక యజమాని నడిగి మాడను దెచ్చి కాటిసుంకము చెల్లింపవలసినదిగా భార్యను నిర్దేశించెను. యజమాని యాజ్ఞను శిరసావహించి, కౌశికునివిఘ్నము నధిరోహించి చంద్రమతిశిరఃఖండనమున కుద్యోగించెను. భార్యాపుత్త్రులవ్యామోహ మాతనికి లేకపోలేదు. కాని, యదిధర్మనిర్వాహణమునకు మాత్ర మడ్డురాలేదు. ధర్మమునకై దానిని దిగమ్రింగుట ధీరులలక్షణము. ఈకల్పనతో గౌరన తనహరిశ్చంద్రునకు శ్రీరామునంతటి గౌరవము కల్పించిపెట్టినాఁడు. అతనిని సమగ్రసత్యవీరునిగా రూపొందింపఁ గలిగినాఁడు. అందులకే గౌరన చిరస్మరణీయుఁడైనాఁడు; అతనికల్పనమునకు లోకమున నెనలేనివ్యాప్తి కలిగినది.

హరిశ్చంద్రుఁడు చితిపై నెక్కి విష్ణువును స్తుతించినట్లు మార్కండేయము వర్ణింప, జగదీశ్వరి యైన శతాక్షిని స్తుతించె నని దేవీభాగవతకర్త తత్పురాణదైవతమున కుచితమైనరీతిని మార్చి రచించుకొనెను. భూతనాయకపాదపూజాభిరతుఁడైన గౌరనమంత్రి పరమేశ్వరుని పరమదయాళుత్వమును వ్యంజించుటకో యనునట్లు హరిశ్చంద్రుఁ డాయింతిని శిరఃఖండన మొనర్పఁబోవుసమయమున సాంబశివుఁడు ప్రత్యక్ష మైనట్లు రచించెను.

హరిశ్చంద్రుఁ డాదయాసాగరుని వేనోళ్ళఁ గీర్తించెను. కావ్యకర్తలచిత్తముల కెక్కిన దైవము లాయాగ్రంథములందు గల్పింపఁబడుట జరిగినది. దైవ మెవరైనను ఫల మొక్కటియే. గౌరన విశ్వామిత్రపశ్చాత్తాపము, వరప్రదానము, ఇంద్రవసిష్ఠాగమనము, హరిశ్చంద్రపట్టాభిషేకమును వర్ణించి కథానిర్వహణ మొనర్చెను. ప్రతినాయకపశ్చాత్తాపకల్పనమువలన నాయకాశ్రితధర్మమునకు విజయము సిద్ధించి కథ కొక సమగ్రత సిద్ధించినది.

## 18. ఆడిబకయుద్ధకల్పనము మార్కండేయపురాణమునందలిదే :

ఆడిబకయుద్ధవృత్తాంతము మార్కండేయమున హరిశ్చంద్రవృత్తాంతము ముగిసిన పిదపఁ బ్రత్యేకముగా నొకయుపాఖ్యానముగాఁ జెప్పఁబడినది. దానికి నొక ప్రత్యేకఫలశ్రుతి చెప్పఁబడినది. గౌరన హరిశ్చంద్రపట్టాభిషేకానంతర మతఁ డయోధ్య చేరులోపల నీ వృత్తాంతమును సంఘటింపఁజేసెను. గౌరనకథాప్రణాళిక ననుసరించి వసిష్ఠుఁడు విశ్వామిత్రునిపైఁ గోపగించుటకు బలమైనకారణము లేదు. ఇట్టుండ నీవృత్తాంతము ప్రక్షిప్తమనియు భావింపఁబడుచున్నది. అదియే నిజమైనచో నీయుద్ధవృత్తాంతము మార్కండేయపురాణప్రత్యేకకల్పన మని భావించి, మునుల కీజంతురూపకల్పనము తొలగించుటకే దేవీభాగవతాదు లింద్రసభలో వసిష్ఠవిశ్వామిత్రులవాగ్వివాదమును సృజించె ననియు భావింప వీలగుచున్నది.

కావ్యనిర్వహణమున నాయకుఁ డగు హరిశ్చంద్రునకు సశరీరస్వర్గగమనమును, లోహితాశ్వునకు రాజ్యపట్టాభిషేకమును మార్కండేయయమునఁ గల్పింపఁబడియుండ గౌరన కావ్యమున నాయకస్వర్గగమనము నానంతరఫలముగను, బట్టాభిషేకమును, సద్యః ఫలముగను నిబంధింపఁబడెను.

ఇచ్చట గౌరన యొకశంకఁ గల్పించుకొని దానికి సమాధానముగా నొకకల్పనము చేసెను. హరిశ్చంద్రుఁ డొకసారి తానే విశ్వామిత్రునకు దత్త మొనర్చి, ఆరాజ్యమునే మఱల స్వీకరించుట న్యాయమా ? యనుప్రశ్న మార్కండేయపురాణకథాపరిశీలనమువలన నేర్పడును. గౌరనకావ్యమున హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునితో –

> " మఱచియు రాజ్యంబు మళ్లి కొమ్మనను – మెలమితో మున్నొక్కక్క డిచ్చినదైనఁ
> బొలుపొందఁ దా ధారపోసిన దైన – నూదిమోపెడు నంతచోటు నాభూమి
> లేదని కడపిన లెక్కింప వాఁడు– ఘనతర మగు నరకమున వేయేండ్లు
> మునుఁగుచుఁ గ్రిమిరూపమున వసియించు – నను ధర్మశాస్త్రవాక్యార్థంబు కొంత
> మనమునఁ దలపోయుమా మునినాథ–యేకాతపత్రమై యెసఁగు నీవసుధ
> నీయిష్ట మగు వారి నిలిపి యేలింపు'' –

మనిపల్కినట్లును, దాని కా ముని–

> "జననాథ ! నాకు నీసకలరాజ్యంబు – నీచేత నేలింప నిక్కంబు వేడ్క–
> నాచిత్తమునఁ జూల్ల ననిఁచిన దిపుడు – భొంకితి నని పొమ్ము పోకున్న వట్టి

శంకలు మాని నాజాడనే రమ్ము – దేవేంద్రుఁ డాదిగా దేవసంఘములు
సెవులార విన మున్ను నేసిన ప్రతిన – శివశివ తప్పునే చెచ్చెర నిన్నుఁ
నిల నెంత కాలంబు నేలింతు ననుచుఁ – బలికితి నందాకఁ బాలింపు వసుధ
మఱి మీఁద దేవేంద్రు మాఱట గద్దె – నెఱి నెంత కాలంబు నిలుపుదు నంటి
నంతకాలము నుండు మమరలోకమున – వింతగా దీమాట విశ్వేశునాన."

(గౌ. హ. II. 2793-2819)

అని సమాధానము చెప్పినట్లును గలదు. తాను సత్యవాక్యపాలనము చేసి, విశ్వామిత్రునిఁ గూడ సత్యపాలకునిగా వర్తింపఁ జేసినఘనత హరిశ్చంద్రున కీఘట్టమునఁ గలిగినది. విశ్వామిత్రునాజ్ఞపై నతనిప్రతినిధిగా భూపతి రాజ్యపాలనభారము స్వీకరించిన దైనది.

నారదప్రబోధితుఁడై సత్యకీర్తి హరిశ్చంద్రుని నాదరముతో నెదురేఁగి యాదరించి యయోధ్యానగరప్రవేశ మొనరింపఁజేసిన ఘట్టము కావ్యోపసంహారమున శోభఁ జేకూర్చినది. నాయకునిస్వస్థానప్రతిష్ఠునిఁ జేయుటవలన ధర్మమునకుఁ బునఃప్రతిష్ఠాపనము జరిగినది.

## పురాణప్రబంధకథాతారతమ్యములు :

పైపరిశీలనమువలన మార్కండేయపురాణగాథకును గౌరన కావ్యేతివృత్తమునకును ఈక్రింది ప్రధానతారతమ్యములు కల వని స్పష్టమగుచున్నది.

(1) మార్కండేయమునందలి హరిశ్చంద్రోపాఖ్యానమును ధర్మపక్షులు జైమిని మునికిఁ జెప్పినవి. గౌరనకావ్యమున మార్కండేయమహర్షి ధర్మరాజునకుఁ జెప్పెను. పురాణమున నుపపాండవజన్మహేతునిరూపణార్థము హరిశ్చంద్రకథ ప్రారంభమై జైమిని ప్రార్థనపై కథ సాంతము సాగినది. కావ్యమున

"ముందు మీ రెఱిఁగిన భూతలాధీశు – లందు రాజ్యంబు వోనాడి క్రమ్మఱను
భుజవిక్రమంబున భూచక్ర మెల్లఁ – బ్రజలు సన్నుతిసేయఁ బాలించినట్టి
మనుజేశతిలకుని మహితచారిత్రు – ననురాగ మిగురొత్త నానతీయవలయు"

నని ధర్మజుఁ డడుగఁగా మార్కండేయమునీంద్రుఁ డీకథ చెప్పెను.

గౌరన కథకుని, శ్రోతను మార్చెను. దానికిఁ గారణ మూహింపవలెను. హరిశ్చంద్రునికథ మార్కండేయమునఁ గలదు. ఆపురాణమున సర్గాదిలక్షణోపేత మగు పురాణవస్తువు మార్కండేయప్రోక్తమే. కాని, మహాభారతకథార్థశంకానివారణ ప్రధాన మైన పూర్వభాగము జ్ఞానపక్షులచే స్వయముగాఁ జెప్పఁబడినది. అందీ యుపాఖ్యానము కలదు. గౌరన తనకావ్యకథకుఁ బక్షులు కథకు లని చెప్పిన దాని కంటె మహిమాన్వితుఁడైన మార్కండేయమహర్షియే కథకుఁ డని మార్చినచోఁ బ్రామాణికత్వమును, బ్రాశస్త్యమును, బ్రాచుర్యమును వచ్చునని భావించి యుండ వచ్చును. మార్కండేయుఁడు ధర్మజునకు వివిధకథార్థము లరణ్యవాసకాలమునఁ

జెప్పినట్లు మహాభారతప్రసిద్ధి కలదు. మార్కండేయము మహాభారతకథలోని కొన్నిసంశయములను నివారించుటతో నారంభింపఁబడుచున్నది. ఈసంబంధమును బట్టి భారతమునందలి ధర్మజశ్రోతృభావమును గ్రహించి గౌరన తనకావ్యమునఁ బ్రతిష్ఠించియుండవచ్చును. సంస్కృతమహాభారతమున వనపర్వమునందు మార్కండేయోక్తమైన హరిశ్చంద్రోపాఖ్యాన మతిసంగ్రహముగాఁ గలదు. అది ప్రక్షిప్త మని విమర్శకులు భావించుచున్నారు.[4] నన్నయాదు లాకథ ననువదింపక పోవుటచే నాభావమునకు బల మేర్పడుచున్నది. కాని, మార్కండేయుఁడు ధర్మజున కీయుపాఖ్యానము చెప్పెనను ప్రతీతిమాత్ర మాప్రక్షిప్తభారతకథ లోకమునఁ గల్పించినది. అది గౌరనకు మూలమై యుండవచ్చును.

గౌరన శ్రోతృ ప్రశ్నమును మార్చెను. ధర్మజుఁడు తనవలె రాజ్యమును బోనాడి క్రమ్మఱ భుజవిక్రమమున భూచక్ర మెల్ల సాధించిన రా జెవ్వఁడైన కలఁడా ? యని ప్రశ్నించె నని కల్పించెను. దానికి సమాధానముగా మునిచే హరిశ్చంద్రునికథ చెప్పించెను. ఇచ్చట నొకయనుమానము కలుగకపోదు. హరిశ్చంద్రుఁడు కౌశికునికపటోపాయము వలన రాజ్యము కోల్పోయి మఱల తనసత్యధర్మదీక్షావ్రతప్రభావమువలన దానిని బొందెను. రాజ్యపునర్లబ్ధియందు భుజవిక్రమమున కంతగా ప్రాధాన్యము కానరాదు. ధర్మజునిప్రశ్నమున కందువలన నవ్యాప్తిదోషము కలిగె నని చెప్పవచ్చును. కావున తాత్పర్యదృష్టితో నావాక్యములను గ్రహించి సరిపెట్టుకొనవలసివచ్చుచున్నది. ఏమైనను గౌరన కావ్యావతారికాకల్పనను స్వతంత్రముగ నొనర్చి మార్కండేయమహర్షిని కథాప్రవక్తగా నిబంధించి పరోక్షముగా మార్కండేయపురాణమునకుఁ గృతజ్ఞతను వెల్లడించెను. తనవాక్కులకు మహర్షివాక్కుల గౌరవము నాపాదించుకొనెను.

---

4. " కామ్యకవనములో నున్న ధర్మరాజుతో బృహదశ్వుఁడు హరిశ్చంద్రనలకథలను జెప్పినట్లు కొన్నిసంస్కృతభారతపుఁబ్రతులం దగపడుచున్నది. ఒక్కనలకథమాత్రమే చెప్పఁబడిన ట్లనేకములగు భారతపుఁబ్రతులయందు వెలయుచున్నది. కాన నన్నయభట్టువలెనే తక్కినయాంధ్రప్రబంధకర్తలును భారతములోని యాహరిశ్చంద్రకథను జూచియుండలేదనియే తోఁచుచున్నది. అట్లు చూచియే యున్నయెడల నందలివక్తృశ్రోతల నుగ్గడింపకుండుటకుఁగాని కామ్యకవనములోఁ జెప్పఁబడినట్లు చెప్పక ద్వైతవనములో నని చెప్పుటకుఁ గాని కారణములేదుగదా ! మఱియును నెల్లప్రతులయందును నిక్కథ యగపడకుండుట చేతను, నున్నసంస్కృతభారతపుఁ బ్రతులయందు సయితము మిక్కథ పూర్తిగా లేక యతిసంక్షిప్తముగా నుండుటచేతను; నిది యందుఁ బ్రక్షిప్త మని కొందఱభిప్రాయపడుచున్నారు. వసిష్ఠుఁ డింద్రసభలో హరిశ్చంద్రుని స్తుతింపఁగా విశ్వామిత్రుఁడు ప్రతిఘటించి యాతని నసత్యవాదినిఁ జేసెద నని ప్రతిజ్ఞచేసి పలుబాధలు బెట్టినను హరిశ్చంద్రుఁడు చలింపఁడయ్యె నని యిట్లతి సంక్షిప్తముగా నలోపాఖ్యానాంతమున నొక్కయరపేజీలోఁ జెప్పఁబడి యున్నది. విశ్వామిత్రుఁ డెట్లు రాజ్య మపహరించెనో ? ఏరీతుల బాధల నందించెనో యను మొదలగు విషయము లెవ్వియు నందు లేవు. "

—హరిశ్చంద్రనలోపాఖ్యాన పీఠిక – (శ్రీ వజ్ఝలవారు) అథస్సూచిక – పుట 54.

(2) మార్కండేయపురాణమున హరిశ్చంద్రునిపైఁ గౌశికున కేర్పడిన మత్సరమునకు దైవప్రేరణము హేతువు. మారనకావ్యమున వసిష్ఠునిపైఁ గౌశికున కున్న వ్యక్తిగత ద్వేషము కారణము. హరిశ్చంద్రవిశ్వామిత్రసంఘర్షణము పురాణమున మార్మిక (Mystical) మూలమైనది. కావ్యమున భౌతిక (Material) మైనది.

(3) మార్కండేయము విశ్వామిత్రుని మాయాప్రభావమును విరివిగా వర్ణింపలేదు. గౌరన కథావిస్తృతికి దానినే ప్రధానాధారముగా గైకొనెను. దానివలనఁ బురాణమున లేని యద్భుతభయంకరసన్నివేశములు గౌరనకృతిలో తావు చేసికొనినవి. వానివలనఁ బ్రతినాయకధీరోద్ధతలక్షణములకుఁ బోషణ జరిగినది. వానిని నిర్జించిననాయకున కాధిక్యము హెచ్చినది.

(4) హరిశ్చంద్రుఁడు ప్రజలపై వైచిన ప్రభావమును, ప్రజ లాతనిపైఁ జూపిన యనురాగమును, అతఁడు వారికిఁ దనతో పాటు దివ్యభోగములఁ గల్పించిన యభిమానమును బురాణము ప్రాచుర్యముగ వర్ణించినది. ప్రబంధమున నీయంశమున కంత ప్రాధాన్యము లేదు.

(5) మార్కండేయమున శైబ్య తనపతి సత్యధర్మదీక్షావిధినిర్వహణమునునకుఁ దనసర్వస్వము నర్పింపసిద్ధమైన సాధ్విగాఁ జిత్రింపఁబడినది. గౌరనకావ్యమున నామె యుచితోపదేశము లొనర్చెడి మంత్రిగను, పతిసేవాపరాయణ యగు పత్నిగను, పతివ్రతా ప్రభావమును ప్రదర్శించు ధీరురాలుగను జిత్రింపఁబడినది. గౌరన హరిశ్చంద్రునికి సత్యకీర్తి యను మంత్రిని గూడ కల్పించెను. రాజ్యభ్రష్టు లగునంతవఱకు ఆరాజదంపతుల నతఁ డెల్లప్పుడును వెన్నంటియుండెడివాఁడు. మంత్రి నీతికుశలుఁడు, భార్య ధర్మకుశల. అతఁ డద నెఱిఁగి రాజునకు సమయోచితకార్యనిర్వహణవిధిని బోధించును. ఆమెయు వలయునెడ నతనిజన్మవ్రతనిష్ఠనుగూర్చి ప్రబోధించుచుండును. గౌరనకథలో సత్యకీర్తియూహలు, యుక్తులు రాజునకు కార్యానుకూలములు కావు. చంద్రమతీవాక్యములు కౌశికునిమాయమర్మములను బట్టబయ లొనర్చుటకు తోడ్పడినవి. సత్యకీర్తి హరిశ్చంద్రుని ప్రభుధర్మమునకు బాహిరమైన ప్రతీక. చంద్రమతి యతనియాత్మధర్మమునకుఁ బ్రత్యక్ష మగు నూత. ఇట్టివిభాగము గౌరన కథను బెంచుటకుఁ గల్పించుకొనెను.

(6) మార్కండేయమున లేని నక్షత్రపాత్రకల్పన మొనర్చి గౌరన కౌటిల్యమునకు బ్రత్యేకరూపకల్పన మొనర్చెను. విశ్వామిత్రుఁడు మాయలుపన్నియుఁ, గుటిలనీతితోఁ బ్రయోగించి హరిశ్చంద్రుని బాధించె నని పురాణమునఁ గలదు. మారన యీరెండు విధములను గ్రహించి మాయను కౌశికునియందును కౌటిల్యమును నక్షత్రకునియందును బంచి ప్రతినాయకశక్తిని ద్విముఖముగాఁ బ్రయోగించెను.

(7) కాలకౌశికునిఁ గ్రూరునిగను, పిసినిగొట్టుగను, వికారరూపముగను జిత్రించుటయు, కలహకంఠిని గయ్యాళిగ రూపొందించుటయుఁ గథయందుఁ గొంత సహజమైన హాస్యముకల్పింప గౌరనచేసిన కల్పనమే. దీనివలన పఠిత యొకవిధమైన మనోవిశ్రాంతి

(Comic relief) ననుభవింప వీలగుచున్నది. విస్తృత మైన కథాభిత్తిక యుండుటచే గౌరన కీకల్పనలఁ జిత్రించుట కవకాశము లభించినది.

(8) ఉపాఖ్యానారంభమునుండియు మార్కండేయము హరిశ్చంద్రునిసత్యధర్మాభి నిరతిని బోషించుకొనుచు వచ్చి, కథావసానమున నతఁడు పుత్త్రవ్యామోహరూప మైన తాత్కాలికావేశమునకు లోఁగి ధర్మవిరుద్ధ మైన ఆత్మహత్యకుఁ బూనుకొనినట్లు వర్ణింపఁ బడినది. గౌరన యీలోపమును సవరించి చంద్రమతీహరిశ్చంద్రులయం దకుంఠిత ధర్మనిష్ఠ ప్రపంచిత మగునట్లు కథాకల్పనలను దీర్చిదిద్దెను.

మార్కండేయపురాణకథకును, గౌరనకావ్యకథకును తారతమ్యము లెన్ని యున్నను తాత్పర్యమున మాత్రము భేదము లేదు. మార్కండేయపురాణాంతర్గత హరి శ్చంద్రసత్యదీక్షావ్రతప్రభావప్రతిపాదనాత్మకకథావస్తువును కావ్యముగా నాంధ్రమున నిర్మించిన ప్రప్రథమగౌరవము గౌరనకు దక్కుచున్నది.

గౌరన తరువాత వెలసిన హరిశ్చంద్రచరిత్ర లన్నియు నామహాకవికల్పములయం దుపజీవించినవే. హరిశ్చంద్రకథకు సమగ్రతను సాధించిన గౌరన కాంధ్రసాహిత్యమున నెనలేని గౌరవప్రపత్తు లేర్పడినవి.

## శంకరకవి హరిశ్చంద్రచరిత్రము :

శంకరకవి హరిశ్చంద్రచరిత్రము నైదాశ్వాసముల కావ్యముగా రచించెను. ఈడూరి యెల్లయామాత్యుఁ డీతని కృతిపతి.

శంకరకవి గౌరనకావ్యేతివృత్తము నతిసన్నిహితముగా ననుకరించెను. కథా సంవిధానమునందును, పాత్రలసంభాషణములయందును నీరెండుకావ్యములకును బోలిక లధికముగఁ గానఁబడుచున్నవి. ఛందస్సును గ్రహించుటలో నిరువురు భేదించినను గౌరనప్రభావము శంకరకవిపై బాగుగాఁ గానవచ్చుచున్నది.

గౌరనభావములను, శబ్దములను వాడుకొని పద్యరచన మొనర్చినచోట్లు శంకరకవి కావ్యమునఁ గుప్పలుతిప్పలుగాఁ గలవు. గౌరనకవి యచ్చమైన తెలుఁగుపలుకుబడి నధికముగ వాడియుండుటచే వక్తవ్యాంశము నతిసంగ్రహముగను, సరసగంభీరముగను జెప్పఁగలిగెను. శంకరకవికి సంస్కృతసమాసాడంబరముపై మక్కువ యెక్కువ. గౌరనలోని రమణీయభావము నొకదానిని గైకొని, దాని కొకశయ్యాసౌభాగ్యము కల్పించి యొక యుపక్రమణోపసంహారముల ననుసంధించి పద్యమున దానిని బఱచి రచించుట శంకరకవి ప్రత్యేకత. ఇది కావ్యమంతటను గొట్టవచ్చినట్లు కనఁబడు లక్షణము.

గౌరనకావ్యమునఁ బ్రక్షిప్తము లని విమర్శకులు భావించుచున్న కపటవసిష్ఠ దర్శ నము, విషజంతుసంహారము, పతివ్రతకథ, ఆడిబకయుద్ధవృత్తాంతము శంకరకవి గైకొనలేదు. కావున నవి యతనికాలమునాటికి గౌరనకృతిలోని కెక్కియుండకపోయి యుండవచ్చును!

శంకరకవి మారనరచనమునుగూడ చూచియుండెను :

శంకరకవి మారనమార్కండేయపురాణమునందలి హరిశ్చంద్రోపాఖ్యానమును గూడ చూచియున్నట్లు కొన్నినిదర్శనములు కానవచ్చుచున్నవి.

(1) కథారంభమున హరిశ్చంద్రప్రభువర్ణనము చేయుట మార్కండేయపురాణానుకరణమే. అంతియగాక మారన మొదటియెత్తుగీతమున వాడిన "పూజ్యసామ్రాజ్య వైభవస్ఫూర్తి నిత్యసత్యవర్తి హరిశ్చంద్రచక్రవర్తి" అనుపదములలోని "ర్తి" యక్షరానుప్రాసయు, పూజ్యసామ్రాజ్య మనుసమాసమును శంకరకవి నాకర్షించినవి.

" పూజ్యసామ్రాజ్యపదవివిభూతి నెగడె
సకలకకుబంతరాళ ప్రశస్తకీర్తి
చంద్రమూర్తి హరిశ్చంద్రచక్రవర్తి. (శం. హ. 1.109)

ఈపద్యమును "హరిశ్చంద్రచక్రవర్తి" యను నిర్దేశముతో ముగించుట యొక పద్యరచనాపద్ధతి. అది మారన శంకరకవికి ప్రసాదించెను. "పూజ్యసామ్రాజ్య" సమాసము నీకవికావ్యమునందును మఱికొన్నిచోట్ల వాడినాఁడు. తే. ఈశ్వరానుగ్రహంబున నేచి పిదపఁ బూజ్యసామ్రాజ్యవైభవస్ఫురణ గంటి. (2-84); తే. పూజ్యసామ్రాజ్య సౌఖ్య సంభోగమహిమ చెందుటయ బుద్ధి దీనికిఁ జింత యేల, (2-178); వ. నయమార్గంబునం బ్రజాపరిపాలనశీలుండై పూజ్యం బగు రాజ్యంబు సేయుచుండె" (5.240).

(2) లోహితాస్యుఁడు పునరుజ్జీవితుఁ డయ్యేడిసందర్భమున మారన "అరాకామరుఁడు దొల్లిటికంటెఁ గౌమరై తనుకాంతి మెఱయ నిద్ర తెలిసి వేగమ మేల్కొనునట్లు లేచె" నని వర్ణించెను. గౌరనకావ్యమున నిట్లుత్థితుఁ డైనట్లు వర్ణితము కాలేదు. కాని చరణమంజీరాదులు గల్లని మ్రోయ నడచినట్లు వర్ణింపఁబడి యుండెను. శంకరకవి మారన యౌపమ్యమును, గౌరనవర్ణనమును గలిపి యొకపద్యము నల్లెను

చ. పొలుపుగ నిద్ర మేల్కొనిన పోలిక నల్లన లేచి వచ్చెఁ గో
మలపదపద్మసంఘటితమంజులనూపురకింకిణీరవం
బులు గడుఁ బర్వ లేనగవు ముద్దులచెక్కులఁ దొంగలింప ను
జ్జ్వలమతి లోహితాస్యుఁడు నిశాకరతుల్యుఁడు సంభ్రమంబునన్.
(శం. హ. 5. 194)

రాజరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమున నేకకాలమున కావ్యద్వయార్థములను సంధింపవలసివచ్చుటచే గౌరనకథాకల్పనలకు స్వల్పమైనమార్పు లొనర్పవలసి వచ్చెను. శ్రీవఝలవా రాకావ్యపీఠికలో వానిని వివరించియున్నారు.

కామినేని మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలోని ఆఱుకథలలో హరిశ్చంద్రునికథ యొకటి. అతనికావ్యమున నాకథ దాదాపు మూఁడవవంతు నాక్రమించి, మిగిలినకథలన్నింటికంటె ప్రౌఢప్రాచుర్యములను బొందియున్నది. మల్లారెడ్డికావ్యకథకు మారన కావ్యమే ఆధారము. ఈకవి కథాకథనమునం దష్టాదశవర్ణనలకును, శ్లేషాద్యలంకార

ప్రయోగమునకును, బంధాదిచిత్రకవిత్వమునకును, యమకాదిశబ్దాలంకారములకు నిచ్చినంత గౌరవము రసభావముల కీయలేదు. తక్షకాదిపాత్రకల్పన లేకవి చేపట్టక లోహితాస్యుఁడు 'దైవయత్నంబున' సర్పదష్టుఁ డయ్యె నని చెప్పి మార్కండేయపురాణకర్తవలె నతిసంగ్రహముగా నాసన్నివేశమును రచించెను. మల్లారెడ్డి నిర్మించినకథ శబ్దచమత్కారములచే మల్లయుద్ధప్రదర్శనమువలె నుద్వేగమును గల్పించునే గాని తన్మయత్వము కలిగింపదు.

హరిశ్చంద్రచక్రవర్తిపుణ్యచరిత్రము నాంధ్రచంపూప్రబంధముగ నిర్మించిన మఱియొకకవి కంచి వీరశరభకవి. ఇతఁడు క్రీ.శ. 16వశతాబ్ది చివరిభాగముననో లేక 17వ శతాబ్ది ప్రథమపాదముననో జీవించియుండు నని చారిత్రకుల యభిప్రాయము. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానము నైదాశ్వాసముల కావ్యముగా సంతరించెను. దానికి 'కంచికావ్య' మనియుఁ బ్రసిద్ధి కలదు. బహుశః ఈకవి గృహనామమునుబట్టి యతఁడు కంచికవి యనియు, అతనికావ్యము కంచికావ్య మనియు లోకమున వాసి వచ్చి యుండును. ఈప్రబంధ మింకను వెలుఁగుచూడ లేదు. మదరాసుప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నీకావ్యముయొక్క తాళపత్రప్రతులును, లిఖితప్రతులును, అసంపూర్ణవ్యాఖ్యయు లభించుచున్నవి. వ్యాఖ్యాతృ నామధేయాదు లెఱుక వచ్చుటలేదు. శరభకవి తనకావ్యమును శ్రీశైలమల్లికార్జునస్వామికి ఆరాధనావిశేషముగా నంకిత మొనర్చెను.

శంకరాదికవుల వలెనే వీరశరభకవియుఁ బ్రథమాంధ్రహరిశ్చంద్రకథాప్రబంధ నిర్మాత యైన గౌరన మహాకవిని ఆదర్శముగాఁ గొనినాఁడు. అతని యడుగుజాడలలో నడచినాఁడు. తరువాత వెలసిన శంకరాదుల కృతులను గూడ పరీక్షించినాఁడు. ఆయా మహాకవులు చేసిన అందములను మూలముతోఁ బోల్చిచూచుకొనినాఁడు. తనకు నచ్చిన వానిని గ్రహించినాఁడు. తక్కినవానిని వదలి తనకు నచ్చిన త్రోవ త్రొక్కినాఁడు.

## శరభకవిపై పురాణప్రభావము :

శరభకవి గౌరనశంకరాదులవలె నయోధ్యానగరపౌరులు విశ్వామిత్రు ననరాని మాట లనినట్లు రచింపక నిగ్రహమును బ్రకటించెను. ఇది యౌచిత్య మెఱిఁగి పురాణ హృదయమున కనుగుణముగా నొనర్చినమార్పు. మార్కండేయమునందువలె హరిశ్చంద్ర వియోగ మోర్వఁజాలని యొకపరితాపము ప్రజలయందు స్ఫుటముగా భాసించునట్లు శరభకవి చిత్రించెను.

చ. ఉరుతరవహ్నితప్తకుటిలోద్ధతలోహశలాక లొక్కపె
ట్టరుదుగ కర్ణరంధ్రముల నానినరీతి మహోగ్రవేదనా
భరమునఁ గొంత రిచ్చబడి పైకొని సయ్యన నేద దేరి ని
ర్భర మగు ధైర్య ముప్పతిల భానుకులాగ్రణిఁ జూచి నమ్రులై.

మ. అలఘుప్రాభవ మమ్ము మీర లిది పర్యంతంబు సత్ప్రేమచే
తలిదండ్రిన్ మరిపించి పెంచి చతురోద్యత్కోర్కెధి వై నేడు బె
బ్బులిబారిం బడఁద్రోచి పోవఁ దగునే భూనాథ ! మానేర మే
వలనం జూచితి రైన కావగదరే వర్ణింప మా కేటికిన్.

చ. కొలవగలేము భూరితరకోపసమాహితరోషభీషణో
జ్జ్వలనసమానమూర్తి యగు సంయమినాథు నరేంద్రచంద్ర ! మా
కొలదులు లెక్క సేయ కనుకూలమతిం జనుదేరనిమ్ము ని
ర్మల కరుణావిధేయ గరిమంబున నీవెనువెంట గొల్చుచున్.

(శ. హ. 1.10-12)

చంద్రునివలెఁ జల్లనై నరాజునేలుబడిలోఁ గలకాలమును సుఖించిన నయ్యోమాయక ప్రజలు బెబ్బులివలె హుంకరించుచు, రాహువువలె రాజు నొడిచి రాజ్యము కబళించి భీషణహుతా శనునివలె భయంకరుఁడైన కౌశికునియేలుబడిలో మనజాల మని విన్నవించుకొనుచు మీతోడిదే లోక మని తన ప్రభువువెంట వెడలుటకు సిద్ధమైరి. అంతియగాని నిర్దయాకృతి యైన యామునిని నిందించి కాని అవహేళనము చేసిగాని యెఱుఁగరు. గౌరనకావ్యము నందువలెఁ గౌశికుని తూలనాడలేదు. గౌరనకవి చిత్రించినది యన్యాయమున కాగ్రహము వహించి, వెనుకముందులు చూడక కాఱు లరచినప్రజ. అందువలననే హరిశ్చంద్రుఁడు 'బ్రతికెదరేని దుర్భాషలు మాని సేవింపుఁ డీతని స్థిరబుద్ధి' అని హెచ్చరింపవలసివచ్చి నది. శరభకవి సృష్టించినది - మునిపతిభీషణవృత్తికి బెదరి చల్లనిరాజునకు వచ్చిన యిక్కట్టునకు గొల్లున దుఃఖించి యతినితో నేఁగ నుద్యుక్తమైన ఉద్విగ్నప్రజావాహిని. ఈకావ్యమునందలిప్రజలలో గౌరన సృజించిన ప్రజలలో లేని వినయము, వివేకము, మార్దవము, నిగ్రహము కానవచుచ్చుచున్నవి. అందువలననే యీకావ్యమున హరిశ్చం ద్రుఁడు గౌరనకావ్యమునందువలె ప్రజలను ప్రత్యేకించి హెచ్చరింపఁడు. దానికిఁ గార ణము వారిమాటలలో నసత్యము లేకపోవుటయే యయి యుండవచ్చును. హరిశ్చంద్రుఁడు రాజ్యము పీడిపోవగనే కౌశికుఁడు పాలనాభారమంతయుఁ బ్రధానులపై నుంచి తానుగూడ నొక్క క్షణ మయోధ్యలో నుండకుండునట్లుచేసినది బహుశః ఆప్రజాహృదయమేకావచ్చును. మార్కండేయపురాణప్రజలు నిర్మదులు; నిర్మలజ్ఞాననిధులు; కథాపర్యంతమున నశరీర స్వర్గగమనమునకు యోగ్యులు. శరభకవి వర్ణించినప్రజలు కూడ నిర్మదులు, వివేక వంతులు, కథాపర్యంతమునఁ జల్లనిహరిశ్చంద్రపాలనఁ బొంద నర్హులు. గౌరనకన్న నీయంశమును గల్పించుటయందు శరభకవి ముందంజవైచెను. దానికి మూలకారణము మార్కండేయపురాణకథాప్రభావము.

ఇట్లు వివేకించుచుఁ బోయినచో ననంతహరిశ్చంద్రకథాకావ్య ప్రపంచమున పురాణ కథాంశముల ప్రభావ మెంతోకొంత కానఁబడక యుండబోదు. కాని, గౌరనకావ్య మాజగత్తు నేలినట్లుగా పురాణము లేలుటలేదు. కావున నీచర్చ యింతటితో ముగింపఁబడుచున్నది.

# ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము

**తక్కెళ్లపాటి లింగనకవి : ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము :**

క్రీ. శ. 18వ శతాబ్దియం దున్నవాఁ డని భావింపఁబడుచున్న తక్కెళ్ళపాటి లింగనమంత్రి రచించిన ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యాన మొకవిచిత్రమిశ్రప్రబంధము. అది నాలుగాశ్వాసముల కావ్యము. లింగన శ్రీమద్వేంకటేశ్వరవరప్రసాదలబ్ధసారస్వత విచిత్రప్రభావుఁ డనియు, హరితసగోత్రుఁ డనియు, ఆపస్తంబగోత్రుఁ డనియు శృంగార కవిత్వవైభవుఁ డనియు, సూరమాంబావేంకటపతులతనూభవుఁ డనియు నతని కావ్యా శ్వాసాంతగద్యలవలనఁ దెలియవచ్చుచున్నది. అతఁడు యౌవనమునందు "మదనమోహినీ విలాస" మును, ప్రౌఢవయస్సునందు "సూర్యతనయాపరిణయ" మును, నాపైన విద్యు త్ప్రభావిలాస మను యక్షగానమును రచించి, యఱువదియేండ్లప్రాయమున నుత్తర హరిశ్చంద్రకథాకావ్యమును నిర్మించెను. ఆకావ్యమును శ్రీకృష్ణున కంకిత మిచ్చెను. అది అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతులచే క్రీ. శ. 1891 లోఁ బ్రచురింపఁ బడినది.

పేరున కుత్తరహరిశ్చంద్రోపాఖ్యాన మయ్యును ఆకావ్యము హరిశ్చంద్రుని పూర్వ జన్మకు సంబంధించినకథను జెప్పుచున్నది. కాని, యిట్టిలక్షణము "ఉత్తర" విశేషణ విశిష్టములైన కావ్యములకు సహజముగాఁ గొంత యున్నట్లు భావించుటకు వీలున్నది. ఉత్తరరామాయణాదులలో శ్రీరామపట్టాభిషేకానంతరగాథ చెప్పఁబడినను, రావణాదుల పూర్వజన్మవృత్తాంతాదులు చెప్పఁబడియుండుటయు గమనించుచున్నాము. అట్లే యుత్తర హరిశ్చంద్రోపాఖ్యానమున హరిశ్చంద్రుఁడు సింహాసనమునఁ గౌశికునిచేఁ బునఃప్రతిష్ఠుఁ డైన తరువాతికథ కొంత చెప్పఁబడవలసియున్నది. లింగనకవి ఆకావ్యప్రథమాశ్వాస మంతయు హరిశ్చంద్రపునఃపట్టాభిషేకకథావిధానమును వర్ణించెను. చతుర్థాశ్వాసాంత మునఁ గౌశికుఁడు హరిశ్చంద్రుని నిడుమలఁ బాలుచేసినందులకు మనఃఖేదమును బొంద నతని శిష్యుఁ డగు సుయజ్ఞుఁ డాతని నోదార్చిన ఘట్టమును వర్ణించెను. గౌరనాదికవులు వర్ణించిన హరిశ్చంద్రవృత్తాంతము పూర్వహరిశ్చంద్రవృత్తాంత మైనచో దానితరువాత జరిగినకథ కౌశికమనఃఖేదోపశాంతియే కాఁగలదు. కావున నుత్తరకథయందు చెప్ప కొనఁదగిన విశేషము లేకపోవును. అందువలన లింగనకవి కౌశికశిష్యుఁ డైన సుయజ్ఞుఁ డడుగఁగా వసిష్ఠమహర్షి చెప్పినట్లు హరిశ్చంద్ర, చంద్రమతి, లోహితాస్య, కాలకౌశిక,

వీరబాహు, తక్షకాదుల పూర్వజన్మవృత్తాంతముల నిందు పొందుపఱచి దాదాపు మూఁడా శ్వాసముల కావ్యమును బెంచి వస్తువును రమణీయతర మొనరించెను. కావున 'నుత్తర కావ్య' మయ్యు నుత్తరకథ కంతప్రాధాన్యము లేక పూర్వజన్మవృత్తాంతములకే యత్యంత ప్రాముఖ్యము గల కావ్యముగా దీనిని గ్రహింప వీలగుచున్నది.

**వస్తువిభాగము :**

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానమునందలి కథను ప్రధానముగా రెండు విభాగములు చేయవచ్చును.

1. ధర్మజునకు మార్కండేయమహర్షి తనకుఁ దానుగాఁ జెప్పినకథ.
2. సుయజ్ఞుఁ డడిగినప్రశ్నలకు సమాధానములుగా వసిష్ఠమహర్షి చెప్పినకథలు.

(ఇవియును మార్కండేయునిచే ధర్మజునకుఁ జెప్పఁబడినవే).

ఇందు మొదటి భాగమున వచ్చు కథ :

(1) కౌశికుని యానతిచొప్పున హరిశ్చంద్రభూపాలుని రాజ్యము నేలుచున్న సుయజ్ఞుఁడు మునియాజ్ఞ ననుసరించి రాజ్యమును, కోశాగారపు లెక్కలను అర్పించి రాజును సింహాసనమునఁ బ్రతిష్ఠించుట.

(2) రాజు నిండుకొలువు తీర్చి ప్రజలను పరామర్శించుట; సత్యకీర్తి యనుమంత్రికి రాజు తనయిడుములన్నియుఁ బూర్వకర్మఫలము లనియుఁ గౌశికుఁడు నిమిత్తమాత్రుఁ డగుటచే నాతనివలన నతనికి మేలే జరిగిన దనియుఁ జెప్పి కౌశికునిఁ బ్రశంసించుట.

(3) సుయజ్ఞునిఁ గొన్నినాళ్లు సాకేతమున నుండు మని హరిశ్చంద్రుఁడు ప్రార్థించుట. అతఁ డందుల కంగీకరించుట, వసిష్ఠమహర్షి యాగమనము.

(4) విశ్వామిత్రుని మనఃఖేదమును సుయజ్ఞుఁ డుడుపుట.

రెండవభాగమునందలి కథ :

హరిశ్చంద్రుని కొలువునకు విచ్చేసిన వసిష్ఠమహర్షిని సుయజ్ఞుఁ డడిగిన ప్రశ్నలు, వాని కా ముని యిచ్చిన యుత్తరము లీభాగమునఁ గలవు.

(1) చ. పరమమునీంద్ర యే నొకటి బల్కఁ దలంచెద నానతీవలెన్
గరుణ నిజాధినాథునకె గాని నిజంబుగ నీజగంబునన్
మరుగయి యీశుభాంగి గళమంగళసూత్రము చిత్రవైఖరిన్
బరులకు నేరికైనఁ గనుపట్టకనుండుట కేమి హేతువో? (2.17)

యని యడిగినప్రశ్నకు వసిష్ఠమహర్షి చంద్రమతి పూర్వవృత్తాంతమును వివరించి చెప్పెను. కోసలదేశాధిపతి యగు జ్యోతిష్మంతున కుదయించినది మొదలు చంద్రమతి హరిశ్చంద్రుని వివాహమాడునంతవఱకుఁ గల కథ యిందుఁ గలదు. ఇది ద్వితీయతృతీయాశ్వాసములలో వ్యాపించియున్నది. ఇందు 'మణిమాలికావృత్తాంత' మను నంతర్గాథ యొండు కలదు.

(2) "సతియుఁ బతియు నిలను న ష్టార్తిఁ జెందఁగ హేతు వేమి ?" (3. 159) యను ప్రశ్న కాఋషి చంద్రమతిపూర్వజన్మవృత్తాంత మగు కలకంధరానీలలోహితుల కథను జెప్పెను. కలకంధర యనుకాపుకన్నె భర్తను త్యజించి, రా జగు నీలలోహితునిఁ గామించి, యతనియంతిపురముఁ జేరి, శ్వశురవంశమున చేసిన దోసమున మరుజన్మమునఁ జంద్రమతియై దుష్టలగ్నమున జన్మించి, రజస్వలయై నిందకు లోనయ్యెను. తద్దుష్ట లగ్నఫలముగా నామె జనకవంశనాశని యగు ననియు, బతిరహిత యగు ననియుఁ, జిచ్చునఁ బ్రవేశించు ననియు, దాసిగా నమ్ముడు వోవు ననియుఁ, బుత్త్రశోకము వహించు ననియు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చెప్పఁ దండ్రిచేతఁ ద్యజింపఁబడెను. అపైన నామె మయుని కటాక్షము వడసి వాని నవలీలగా నేకాబ్దమునఁ దరింపఁగలిగెను. దానికిఁ గారణము కల కంధరాజన్మమునఁ జంద్రమతి భక్తిప్రపత్తులతో కేదారగౌరీవ్రత మాచరించియుండుటయే. ఈకథార్థము లీకథాభాగమున వర్ణింపఁబడినవి.

(3) గీ. "చాల భువి రట్టుపడి హరిశ్చంద్రుచేత
లీల భూచక్ర మెల్ల నేలించుటకును
నిలఁ దనదుపుణ్య మటుఁ బంచియిచ్చుటకునుఁ
గారణం బేమి గాధికుమారునకును ?" (4. 78)

అని యడుగగా నాసంయమి సుయజ్ఞునకు - హరిశ్చంద్రుని పూర్వజన్మవృత్తాంతము (నీల లోహితునికథ) ను వివరించుచు నందు గాధేయుఁడు అతనికి మరుజన్మలో తనపుణ్యార్ధ మును బంచి కువలయమునంతటి నేలింప వర మిచ్చు నంశములను వర్ణించినాఁడు.

(4) క. "రక్షింపఁగఁ దగు బాలుని
నక్షయలక్షణుని లోహితాస్యు నదేలా
తక్షకుఁడు గఱచె నాశిశు
వీక్షితి ని ష్టార్తిఁ బొందు టేమి మునీంద్రా !" (4. 104)

అని యడిగిన సుయజ్ఞునిప్రశ్నకు వసిష్ఠుఁడు లోహితాస్యుని పూర్వజన్మవృత్తాంతమును వివరించి చెప్పెను. తక్షకశాపహతుఁ డై నలకూబరుఁడు లోహితాస్యుఁ డై పుట్టుటయు, కౌశికవరప్రదానముచే నతఁడు తక్షకదష్టుఁ డయ్యుఁ బునర్జీవితుఁ డయ్యెడు కథ యిందు వర్ణితము.

(5) "అంతకునకుఁ జండాలత్వము ప్రాప్తమైన కారణము నెఱిఁగింప" వేడిన సుయజ్ఞునకు ఋషి వీరబాహునిపూర్వజన్మవృత్తాంతమును జెప్పెను. త్రిశంకస్వర్గప్రవేశ మును వల దని యడ్డగించిన యమునికిఁ గౌశికుఁ డిచ్చిన శాపమే వీరబాహుజన్మమునకు హేతువు. హరిశ్చంద్రుని విలుచుటతో శాపావసానము.

(6) "శనైశ్చరుండు కాలకౌశికుం డగుటకుఁ గారణం బేమొకో" యనిన వసిష్ఠుఁడు సుయజ్ఞునకు ఛాయాపుత్రుఁ డగు శని సంజ్ఞాక్రోధమునకు గుఱియై వనములఁ బడి కౌశి కునిచే సంవర్ధితుఁ డైన కథయుఁ, గౌశికుఁడు చంద్రమతీలోహితులను గొని తనయింట

నిడుములఁ బెట్టుటకై శనిని కాలకౌశిక వేషము ధరించి యుండు మచి కోరిన విధమును నిందు వర్ణితములు.

ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానకావ్యకల్పనలపై మార్కండేయపురాణ ప్రభావము :

పైనఁ బేర్కొనఁబడిన వస్త్వంశములను బరిశీలించినచో లింగనకవి పూర్వజన్మ వృత్తాంతకథనముల కన్నింటికిని గౌరనాదుల కావ్యకల్పనలనే ప్రమాణముగా గ్రహించి నట్లు స్పష్టమగుచున్నది. మొదట నామనిర్దేశమును గైకొందము. చంద్రమతి, కాలకౌశికుఁడు, వీరబాహుఁడు, తక్షకుఁడు - అనుపాత్రనామములు మార్కండేయమున లేవు. వసిష్ఠవిశ్వామిత్రవాగ్వివాదము, చంద్రమతి చిచ్చునఁ బడుట, మంగళసూత్రప్రసక్తి, రాజ్యము శిష్యుని కొప్పఁజెప్పట-మార్కండేయమున కానరావు. సుయజ్ఞనామ మపూర్వము; లింగన కల్పితము. దేవీభాగవతమునఁ గౌశికుఁడు శిష్యులపై రాజ్యభార ముంచె నని యున్నది కాని, శిష్యనామనిర్దేశము లేదు; జమాఖర్చుల లెక్కలపేచీలు లేవు. కాశీనగర వాసి యగు చండాలుఁడు యమావతార మని మాత్రము మార్కండేయము చెప్పుచున్నది. బ్రాహ్మణుఁడు శనియొక్కయవతార మనియు, లోహితాస్యునిఁ గఱచి మృత్యుసదృశ మైన విషమూర్ఛలో ముంచినది తక్షకుఁ డనియు మార్కండేయమునఁ జెప్పఁబడలేదు. ఇవి యన్నియు గౌరనలో కలవు. పురాణహరిశ్చంద్రకథాపరిణామచరిత్రలో గౌరనకావ్య మొకపరిణితస్థాయి. దానిని మించి ముందు కడుగు వేయుట తెలుఁగులో నింతవఱకు లేదు. దానికి మార్కండేయ మెట్లు మూల మైనచో వెనుక చెప్పఁబడినది. గౌరనలోని పురాణకథార్థముల నేకావ్యకర్త యనుసరించినను పరోక్షమూలమున కిచ్చుగౌరవము మార్కండేయమునకు దక్కఁగలదు :

(1) **నక్షత్రపాత్ర:** గౌరన తనకృతిలో సగర్వముగాఁ జెప్పుకొనఁగల పాత్ర యిది. నక్షత్రకుఁడు కౌశికశిష్యుఁడు. కౌటిల్యమునకును, పారుష్యమునకును అతనిది పెట్టినది పేరు. కౌశికునికుడిభుజమగు నతఁడు పూర్వజన్మలో నెవఁడు? అతఁడు కారణజన్ముఁడా? కాఁడా? కాకపోయినచో గౌరనకథలో నంతప్రధానపాత్ర నిర్వహింపవలసిన యవసరము లేదు. కౌశికుని కన్న నక్షత్రకుఁ డెందును దీసిపోఁడు. లింగనకవి నక్షత్రకుని పూర్వజన్మవృత్తాంతము చెప్పలేదు. గౌరనలోని యాకల్పన నాతఁడు గ్రహించినట్లు లేదు. ఇది గమనింపఁదగిన యంశము. అట్లని లింగనకవి దేవీభాగవతాదికథల ననుసరింపలేదు. కావున నతఁ డీకల్పనను గ్రహింపకపోవుటకుఁ గారణ మేమి యని తలంపవలసి యుండును. బహుశః - ఇదివఱలోఁ జెప్పబడినట్లు - పురాణకౌశికునిలోని రెండుగుణములను కౌశికనక్షత్రపాత్రలుగా గౌరన చిత్రించియున్నసూక్ష్మాంశమును లింగనకవికూడ గమనించియుండవచ్చును. లేక పురాణప్రోక్తముగాని ఈపాత్రకు పూర్వజన్మగాథను వెదుక నాతఁడు యత్నింపకపోయియుండవచ్చును. ఏమైనను ఇది పురాణప్రభావ మన్నుటలో సంశయము లేదు.

(2) సుయజ్ఞుఁ డడిగిన యాఱుప్రశ్నలలో నైదింటికి మార్కండేయపురాణకథా కల్పనలే మౌలికములై యున్నవి. రూఢములైన నామములను గైకొనినను లింగన మంత్రి పౌరాణికకల్పనలను కాదనలేదు.

(3) మార్కండేయమున హరిశ్చంద్రకథాకల్పనము ఉపపాండవుల జన్మహేతుక మైనదిగాఁ జిత్రింపఁబడినది. విశ్వేదేవతలు విశ్వామిత్రునిశాపము వలన నుపపాండవులుగాఁ జన్మించి రని చెప్పుట పురాణప్రయోజనము. మఱియు కర్మఫలరూపములైన యర్థములను బ్రసంగించుపురాణము పూర్వాపూర్వజన్మలకథలను వివరించి చెప్పుచుండును. తల్లక్షణమును వ్యంగ్యముగా గ్రహించి లింగనమంత్రి తనకావ్యమున నిబంధించినాఁడు. చంద్రమతీహరిశ్చంద్రులు సతీపతు లగుటకు హేతువు- వారిడుములు పడుటకు హేతువు- వారి నట్లు దుఃఖవార్థిలో ముంచుటకు తోడుపడిన పాత్రల కట్టి యవస్థ లేర్పడుటకుఁగల హేతువులు- ఇట్లు చిత్రించుచు పోయినాఁడు లింగనకవి. ఈవిశ్వామిత్రసృష్టి కంతటికి కేంద్రము విశ్వామిత్రుఁడే యనుట యొకవిశేషము. పూర్వాపరజన్మవ్యాప్త మైన హరిశ్చంద్రుని జీవితచరిత్రకు భిత్తికయొక్కటియే! తచ్చిత్రమునకుఁ జిత్రకారుఁ డొక్కడే! 'దేవతలయ్యు దివ్యరహస్యము లెఱుఁగక నరపక్షపాతులై నన్ను నిందించెదరా?'' యని విశ్వేదేవతలపై శాపజలము చల్లు విశ్వామిత్రపాత్రలో లింగనకవి భావించిన కల్పనా జగత్తంతయు నిమిడిపోఁగల వైశాల్య మున్నది. భావించినకొలఁది భావనాపరిధి నపారముగఁ జేయు పౌరాణికకల్పన మది!

(4) ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానమున శనైశ్చరునిజన్మవృత్తాంతము మార్కండేయమున వైవస్వతమనుమహిమాభివర్ణన మొనరించు సందర్భమునఁ జెప్పఁబడి యున్నది. లింగనకవి దానికి కొన్నిమార్పులును, చేర్పులును జేసి తనకావ్యకథ కనుకూలముగా మార్చి యిమిడ్చుకొనెను.

## పురాణ-ప్రబంధకల్పనలలోఁ గల తారతమ్యములు :

(1) సంజ్ఞాదేవి మగనికిఁ జెప్పకయే పుట్టినింటి కరుదెంచినసంగతి త్వష్టృప్రజాపతి యెఱింగి తనకుమార్తెను తురగివి కమ్మని శపించినట్లు ప్రబంధకల్పనము.

చ. తురగివి గమ్ము పొమ్మనిన దుఃఖము నాచఁగ లేక కాళ్ళపై
నొఱగి యయో కడున్మమత నొంది యెఱుంగక మందబుద్ధినై
త్వరపడి పుట్టినిల్లనుచు వచ్చినచో జనకుండ వయ్యు నన్
గఱకఱతో శపించితివిగా నిఁక దిక్కెవ రంచు నేడ్చినన్.

ఉ. పుత్త్రిని నేత్రివే మనసు బొర్లి దయ న్వెతఁ జెందకే తటి
ద్గాత్రి! వితా శపించితిని తప్పదు గోడిగవై సదా కురు
క్షేత్రవనాంతరంబుల వసింపుము నారసికొంచు వచ్చి నిన్
మిత్రుఁడు ఘోటకంబయి రమించును శాపము దీరు నంతటన్.
(ఉ.హ.పా. 4.181-182)

అని శాపవిమోచనమును బ్రసాదించినట్లును గలదు. సంజ్ఞకు తురగిరూపము శాపము వలనఁ గలిగిన దని పురాణము చెప్పుట లేదు. ఈశాపవృత్తాంతము ప్రబంధకర్తకల్పనము. దీనివలనఁ బురాణకథాతాత్పర్యమున కెట్టిలోపము కలుగకపోగా, పురాణకథా కార్యమునకు చక్కనిహేతువు చూపింపఁబడుచున్నది. అత్తవారింటినుండి చెప్పక లేచి వచ్చిన కూతుపైఁ దండ్రికి కోపము వచ్చుట సహజము. ప్రజాపతి తనవంశమునకుఁ గళంకము రాకుండ పుత్త్రికను మందలించుట యుచితము. కోపోద్రేకమునఁ బుత్త్రికకు శాప మిచ్చి, ఆమెకన్నీటినిఁ జూచి జాలిపడి శాపవిమోచనమును సూచించుట యతని యార్ద్రహృదయమును, ధర్మైకచిత్తవృత్తిని వ్యంజింపఁ జేయుచున్నది.

(2) పురాణమున నాదిత్యునకు సంజ్ఞవలన వైవస్వతమనువు, యముఁడు, యమున యనువారలును, అశ్వినులును, రేవంతుఁడును, ఛాయవలన సావర్ణి యనుమనువును, శనైశ్చరుఁడును, దపతియును జన్మించినట్లు చెప్పఁబడియుండ నీప్రబంధమున ధర్ముఁడును, కవలును సంజ్ఞయందును, శనైశ్చరుఁడు ఛాయయందును గల్గినట్లు వర్ణింపఁబడి యున్నది. పురాణమున మనువులచరిత్రము ప్రధానము కావున వారిచరిత్రలు వివరింపఁబడి మిగిలినవారిపేళ్లమాత్రము పేర్కొనఁబడినవి. ప్రబంధమున కథ కవసరము లేని పాత్రలు వదలఁబడినవి.

3. శనైశ్చరునకుఁ గాలువిఱిగినట్లుచేసిన కల్పనము ప్రబంధకర్తదే:

ఛాయాదేవి సంజ్ఞాసుతునిఁ దనసుతునివలె లాలింపక నసూయ చూపుచుండెడిది.

చ. "అనిశము ఛాయయున్ దనయుఁ డైన శనైశ్చరుఁ జూచినట్ల ధ
ర్మునియెడ ప్రేమఁ జూడదు యముండును నత్తెఱఁ గెంచి యొక్కనాఁ
డనువుగ నంకమం దిడుక నాత్మజుఁ దన్ను నిరాకరింపఁగాఁ
గనలుచు వ్రేసె నయ్యనుజుకాల్వెఱుగఁన్ బడఁ దన్నె నాయమున్.

చ. ఇనుఁ డది గాంచి తా జననియే యగునేని నసూయ నగ్రనం
దనునెడఁ జూచునా యముఁడు దల్లిదియే యగునేని తన్ను నా
యనుజుని కాలుఁబో విఱుచునా తనభామిని గా దటంచు నె
మ్మనమున నిశ్చయింపుచును మానినిఁ గన్గొని పల్కె నుగ్రుఁ డై."
(ఉ.హ.పా. 4.184-185)

అని చెప్పఁబడిన ప్రబంధకథలో యముఁడు శని కాలు విఱుగవైచె ననుకల్పన మమూలకము. పురాణమునఁ బక్షపాతబుద్ధి యైన తల్లిని కాలెత్తి తన్నఁబోయినది యముఁడు. తచ్చరణము తెగి ధరఁ బడునట్లు శపించినది ఛాయ. యముఁడు ఛాయాశాపవృత్తాంతము నెఱిగించి, ఛాయ తనతల్లి కాదని మనువు చెప్పుచున్నాఁ డని తెలుప నాదిత్యుఁ డుగ్రుఁడై సత్యాన్వేషణమునకుఁ గడంగెను ప్రబంధకల్పనము దీనికి విరుద్ధముగా నున్నది. ప్రబంధమున సహజజ్ఞాని యగు వైవస్వతమనువు లేఁడు. కావున

ఛాయ తనతల్లి కాదని యమునకుఁ దెలియదు. యముఁడు ఛాయను తనతల్లి యనియే తలంచి మాతృవాత్సల్యము తనపైఁ బ్రసరింపకుండ శనైశ్చరుఁ డడ్డపడుచున్నాఁ డని తలంచి యతనిని వికలాంగునిఁ జేసెను. ఈకల్పన మీవాతావరణమున నత్యంత సహజము. ఒకరు చెప్పకయే స్వయముగ వివేకించి విషయమును గ్రహించిన యాదిత్యునిప్రతిభ యిచ్చట ప్రశంసనీయము!

(4) సంజ్ఞాదివాకరులు తురగీతురగరూపము లుజ్జగించి నిజనివాసమున కరుదెంచిన తరువాత

కం. మును లేని సవతి నేనే
పనివడి గల్పించుకొంటి పాటించఁగ రా
దని సంజ్ఞాసతి ఛాయన్
దనలో నిముడుకొనె నద్భుతంబున నంతన్. (4.191)

అను కల్పనము పురాణమునఁ గానరాదు.

(5) పురాణమున శనైశ్చరునికి గ్రహాధికారము సూర్యదత్త మని చెప్పఁబడి యుండఁ బ్రబంధమున శనైశ్చరతపఃఫలరూప మని వర్ణింపఁబడినది. యీకల్పనము నతివిచిత్రముగా నొనర్చెను. సంజ్ఞాదేవి సవతికొడు కైన శనైశ్చరుని నైమిశాటవిలోఁ బడవైచె నఁట! ఆపడవేయుటలో మును సమవర్తిచేత విఱిగినయతని కాలు విడిపడి పోయినది. అత్యంతవేదనచేఁ బీడితుఁ డైన శనైశ్చరుని నచ్చటి మృగద్విజసంతతులు కరుణతోఁ బ్రోచుచుండెను. అప్పు డతఁడు గాధిసుతుని కంటపడెను. కౌశికుఁ డతనిని గరుణ పొంపిరివోవ దరికిఁ జేర్చి, పోషించి సమస్తవిద్యలు నేర్పి, సర్వకళాప్రవీణునిఁ జేసెను. శనైశ్చరుఁడును గురూపదిష్టమంత్రమును నిరాహారుఁడై బహువత్సరములు జపించుచు నుగ్రతప మాచరింప త్రిమూర్తులు ప్రత్యక్షమై యాతనిని గ్రహములలో మేటిగ్రహము గాఁగ నక్షత్రమండలోన్నతపదవి నాతనికిఁ బ్రసాదించిరి. ప్రబంధకల్పనావిధానమునుబట్టి యీకల్పన మీకథ కత్యంతశోభను జేకూర్చుచున్నది. పురాణమునందు వనమునఁ గాలు విఱిగి పడినవాఁడు యముఁడు! అతఁడు సూర్యానుగ్రహమున కాలును మఱల పొందును. ప్రబంధమున శనైశ్చరుని విఱిగినకాలు కౌశికుని తపోమహిమవలన తిరిగివచ్చినట్లు స్పష్టము చేయఁబడినది.

(6) గాధిసుతుఁడు శనైశ్చరున కొనర్చిన సహాయమునకు ప్రత్యుపకారముగా నాగ్రహవరుఁడు కాశీక్షేత్రమున కాలకౌశికునివేషమున వసించుట కంగీకరించెను. కౌశికుఁడు శనిని బిల్చి-

మ. "వనితన్ దత్సుతుఁ బాయునట్టి తఱిఁ దా వాధింపఁడే బొంకగా
జననాథాగ్రణి గావునన్ ద్విజుని నోజన్ గాశిలో నుండి నీ
వనుమానింపక రాజుచేత వెలగా నజ్ఞాక్షినిం బుత్తుఁ గై
కొని యేలన్వలెఁ గాసిఁబెట్టి కఠినోక్తుల్ మీఱఁగా నిత్యమున్." (4.197)

అని శాసించినాఁడు. శని యాతని యానతి శిరసా వహించినాఁడు.

ఇ ట్టియుత్తరహరిశ్చంద్రోపాఖ్యానము పురాణప్రతిపాదితములును, ప్రబంధ ప్రసిద్ధములు నైన పాత్రలపూర్వజన్మచరిత్రములను జెప్పిన "ఉత్తర" విశేషణవిశిష్టమైన తెలుఁగుకావ్యములలో నుజ్జ్వలమై రాణించుచున్నది. శనైశ్చరకథాకల్పనలో పురాణ సిద్ధమైన వైవస్వతమనుజన్మగాథ చోటుచేసికొనినది. ఇట్టికావ్యముపై మార్కండేయము పరోక్షముగను, ప్రత్యక్షముగను తనప్రభావమును వైచినదని చెప్పుటకు వీలగుచున్నది.

పూర్వజన్మకథలన్నియు కర్మఫలసిద్ధాంతముపై నాధారపడియుండును. పురాణ కథలన్నియు నీసిద్ధాంతమును వ్యంగ్యముగానో వాచ్యముగానో బోధించుచుండును. అట్టి తత్త్వ మీప్రబంధకల్పనకు మూలము ! ఇందు-

ఉ. "ఎంచఁగఁ గౌశికుండు ఇల నీగఁగరాని ఋణంబు దీర్ప నన్
బంచి కలంచు పెల్ల యది బాలునిఁ జెక్కిలి గొట్టి పాలు ద్రా
గించిన లీలగాఁ దలఁతు కీడని తోచదు నేఁడు మాకు నా
సంచితపుణ్యుచేఁ గలిగెఁ జారుతరోభయలోకసౌఖ్యముల్" (1.63)

అని సత్యకీర్తితో నుడివిన యేతత్కావ్యహరిశ్చంద్రునివాక్కులందు పురాణకథాతాత్పర్య వాసన గుబాళించుచున్నది.

## చంద్రశేఖరకవి—ఉత్తరహరిశ్చంద్రచరిత్ర :

లింగనకవి రచించిన యుత్తరహరిశ్చంద్రచరిత్రయు, నీచంద్రశేఖరకవి రచించిన యుత్తరహరిశ్చంద్రచరిత్రయుఁ జాలవఱకు నొకేవిధమైన వస్తువును గలిగియున్నవి. పదప్రయోగాదులయందును రెండింటికి పోలిక లున్నవి. కావున నీరెండింటిలో నేదియో యొకటి మఱియొకదాని మూలమై యుండవలెను. సామర్థ్యమున చంద్రశేఖరకవికంటె లింగనకవి మిన్న. చంద్రశేఖరకవికాలము విస్పష్టముగాఁ దెలియదు కావున వివరములు బైటపడునంతవఱకు లింగనమంత్రినే చంద్రశేఖరకవి యనుకరించె ననుట యుచిత ముగాఁ దోచుచున్నది.

చంద్రశేఖరకవి కృతి సమగ్రముముగా లభించుటలేదు. మదరాసుప్రభుత్వప్రాచ్య లిఖితపుస్తకభాండారమునఁ దాళపత్రప్రతి యొండును, కాగితపుప్రతి యొండును గలవు. అందు కావ్యాంతగద్యవలె నున్న ద్విపదపాదములనుబట్టి యీకవి శ్రీకాళహస్తీశచరణ పంకజసౌరభభ్రమరాయమానుఁ డనియు, వీరశైవాచారుఁ డనియు, వీరభద్రాచార్యవిభు తనూజుఁ డనియు, సాహిత్యరసపోషణబిరుదాంచితుఁ డనియు, నీకావ్యమును చంగల్వ రాయనిపేర నంకిత మిచ్చినాఁ డనియుఁ దెలియుచున్నది.

చంద్రశేఖరకవి యీకావ్యమును ద్విపదలో రచించెను. లింగనకవికావ్యములో నున్న ట్లాశ్వాసవిభాగ మిందు కానరాదు. కావ్యమంతయు నేకాశ్వాసముగా రమారమి 2077 ద్విపదపంక్తులలో రచింపఁబడియున్నది.

లింగనకవికావ్యముతోఁ బోల్చిచూచినచో నీ క్రిందియంశములు స్పష్టపడఁగలవు.

(1) చంద్రశేఖరకవి ప్రత్యంశమునందును లింగనకవి ననుసరించి కావ్యమును నిర్మించెను.

(2) లింగనకవి విస్తృతముగా రచించిన కొన్నికథాఘట్టములను చంద్రశేఖరకవి సంగ్రహముగాఁ గుదించి రచించెను.

(3) లింగనమంత్రిరచనముకన్న విపులముగా రచించినకథాంశములు కొన్ని కనఁబడుచున్నవి :

(4) లింగనకవి కల్పనలను గొన్నింటిని చంద్రశేఖరకవి మార్చి రచించినాఁడు. ఉదాహరణమునకు - మణిమాలావృత్తాంతమున నాకన్య ముందుగా శ్రీపతిరాజును జూచి వలచినట్లును, ఆమెవలననామెవలపుకోరికను దెలిసి యామెతండ్రి రాజును కొలువుకూటమునకుఁ బిలిపించినట్లు లింగనకవి వ్రాయగా చంద్రశేఖరకవి నాయిక నాయకుని జూచిన కల్పనమును వదలి, శ్రీపతిరాజే స్వయముగా రాజసభకు వచ్చినట్లు వర్ణించెను. కావున లింగనకవికల్పనలోని యంద మీతనికావ్యమున రాలేదు. ఇట్లే మణిమాలామందసమును చక్రి తెప్పించుకొనిన ఘట్టమునందును లింగనకవికల్పననుమార్చి చంద్రశేఖరకవి కథాగాంభీర్యమును బోషింపలేకపోయెను.

(5) లింగనకవి తనకావ్యమున సంధించిన కథాంశములయొక్క క్రమమును చంద్రశేఖరకవి తన కథాకథనపద్ధతి కనువుగా మార్చుకొనెను. చంద్రమతిని మయుఁడు చేరదీసి, వరము లొసంగి పుత్త్రికగా మన్నించి, ఒకభవనమును నిర్మించి యందుంచెనని చెప్పిన తరువాత వీరబాహునిపూర్వజన్మవృత్తాంతమును జెప్పి, హరిశ్చంద్రపూర్వజన్మవృత్తాంతకథనానంతము చంద్రమతీహరిశ్చంద్రులవివాహవర్ణన మొనర్చెను.

## చంద్రశేఖరకవికల్పనలపై మార్కండేయపురాణప్రభావము :

చంద్రశేఖరకవి శనైశ్చరవృత్తాంతకల్పనమునందు లింగనకవివలెఁగాక కొన్నియెడల మార్కండేయపురాణానుసారియై కథ నడిపించెను. ముఖ్యముగా మార్కండేయము ఛాయాశాపమువలన యమునిపాద మూడిపడిపోయినట్లు వర్ణించియుండ, లింగనకవి యమునితాకునకు శకునిపాదము విఱిగెనని కల్పించెను. చంద్రశేఖరకవి మార్కండేయము ననుసరించి యిట్లు వ్రాసెను :

"తన్నెగా లెత్తి యంతకుఁ డొక్కనాఁడు - మిన్నక పినతల్లిమీద కోపించి
అందుల కలిగి యత్యాగ్రహం బొప్ప - సుందరీమణి వాని జురజురఁ జూచి
కట్టిడియై యొక్కకాలు బోవంగ - తిట్టె తిట్టిన యంత తెగిపడె చరణ
మత్తరి యముఁడు మహాశోక మొదవ - వృత్తాంతమంతయు విని వచ్చి భానుఁ
డావనజాక్షి కిట్లనియె"......(1835-1843)

ఈకల్పన ననుసరించి కౌశికుఁడు శనికి పాదదానము చేయవలసినయవసరము లేకపోయినది. కాని, చంద్రశేఖరకవి విఱిగినయమునికాలు తిరిగివచ్చినవివరమును మాత్రము చెప్పక వదలివైచెను.

కథాకథనవిధానమును సూక్ష్మముగాఁ బరిశీలించినచో చంద్రశేఖరకవి విరచిత మైనకథయే ప్రాథమికావస్థలో నున్న దని యనిపించుచున్నది. గౌరనకవి ద్విపదలో హరిశ్చంద్రచరిత్రము వ్రాయగా దాని ననుసరించి యీకవి తచ్ఛందముననే ఉత్తరహరి శ్చంద్ర చరిత్రమును రచియించియుండవచ్చును. ఆపైన గౌరనను శంకరాదికవు లనుస రించి చంపూకావ్యములు నిర్మించి నట్లు లింగనకవి తనకావ్యమును ప్రౌఢరచనాసమగ్రముగా రచించియుండవచ్చును ! లేక లింగనకవి సమర్థుఁడై యుత్తమకావ్యమును వెలయింప చంద్రశేఖరకవి యనుకరింప యత్నించె ననవచ్చును. వీరిరువురికాలములు నిశ్చితముగా నిర్ణయింపఁబడునంత సఱకీయంశము తేటతెల్లముకాదు !

ఉత్తరహరిశ్చంద్రచరిత్రలు తెలుఁగులో నెన్నియో వచ్చినవి. హరిశ్చంద్రచరిత్ర ములకు గౌరన యెట్లు ఆదర్శప్రాయుఁ డయ్యెనో ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానమునకు లింగనమంత్రి యట్లు మూలకర్త యయ్యెను. మార్కండేయము పాక్షికమూల మైన యీకావ్యసంతానములఁగూర్చి యింతకంటెఁ జర్చింపక నామభేదముతో 'పూర్వహరి శ్చంద్రచరిత్ర' మని వెలసిన కృతులలో మిన్నయైన తిరుపతివేంకటకవులకావ్యము నొక దానిని ప్రస్తావించి యీయధ్యాయమును ముగించుట యగుచున్నది.

## తిరుపతివేంకటకవుల - పూర్వహరిశ్చంద్రచరిత్రము :

నవ్యులలో నుత్తరహరిశ్చంద్రచరిత్రమును నుత్తమపద్యకావ్యముగా రచించిన గౌరవము తిరుపతివేంకటకవులకే దక్కుచున్నది. ఏతత్కావ్యకర్త చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారైనను "ఒక్కరు రచియించిరేనియును గాఁదగు తిర్పతివేంకటకటీయమై" యను వారి యభిమతము ననుసరించి యిదియును దిర్పతివేంకటీయమే. వీరు దీనిని మొదటి సారి క్రీ. శ. 1946 లోఁ బ్రచురించిరి.

ఈకావ్యమూలమును గూర్చి గ్రంథకర్తయే చెప్పుకొనిన మాట లివి : "ఈపూర్వ హరిశ్చంద్రచరిత్ర శ్రీకొమాండూరి అనంతాచార్యులవారి గద్యప్రబంధమునందలి కథ ననుసరించి నాకుఁ దోచినంతలోఁ గొన్నిమార్పు లొనర్చి దీనిని ముగించితిని... ఆయీకథ గల గద్యము 1935 సం॥ స్కూలుఫైనలు పరీక్షకుఁ బాఠ్యము లైన తెలుఁగుపొత్తములలో నొకటి"[1] ఈవాక్యములనుబట్టి శాస్త్రిగారు అనంతాచార్యులవచనగ్రంథమే చూచిరిగానిఁ, లింగనకవికృతినిగాని, చంద్రశేఖరకవి కావ్యమునుగాని చూడలే దని స్పష్టమగుచున్నది. అట్లగుటయుఁ గొంత మేలైనది. వేంకటశాస్త్రిగారు స్వయంకపోలకల్పితమైన భావముల చేతను, కల్పనలచేతను ఈకావ్యము నలంకరింపఁ గలిగినారు: లేనిచో గతానుగతిక ముగా కథ వెలసియుండెడిదేమో !

పూర్వకవులచే నుత్తరహరిశ్చంద్రోపాఖ్యాన మని పిలువబడు నీకావ్యమునకుఁ బూర్వహరిశ్చంద్రచరిత్ర మని పేరుపెట్టి తమ స్వాతంత్ర్యమును వేంకటశాస్త్రిగారు చాటు

---

1. పూ. హ. చ. పీఠిక పుట - 1.

కొనిరి. కాలక్రమమునుబట్టి యీకావ్యకథను గణించినచో నిది "పూర్వకథ" యనుటలో దోసము లేదు. కాని హరిశ్చంద్రపట్టాభిషేకము, సుయజ్ఞుఁడు రాజ్యమప్పగించుట మొదలగునంశములచే నుత్తరహరిశ్చంద్రకథ ముందునకు సాగుచున్నది. కావున వేంకటశాస్త్రిగారు హరిశ్చంద్రునియొక్కకథగా గాక, హరిశ్చంద్రునిగూర్చిన కథగా నీకావ్యమును నిర్వహించిరి.

లింగనాదులకావ్యములందు ప్రధానకథకుఁడు మార్కండేయమహర్షి. శ్రోత ధర్మరాజు. కథకుఁడు చెప్పినకథలు వసిష్ఠుఁడు సుయజ్ఞునకుఁ జెప్పినట్టివి. తి. వేం. కవులు ఆకల్పనను గ్రహింపక పురాణప్రసిద్ధమైన నైమిశారణ్యమున శౌనకాదులకు సూతుఁడు బోధించినట్లు వర్ణించిరి. కావ్యకథారంభమునకుఁ బూర్వరంగముగా నైమిశారణ్య మేర్పడిన విధమును, అందు ఋషులు నివాస మొనరించుహేతువును కథగా వర్ణించిరి. వా రచ్చట నివసించుట భావికలియుగదురాచారములనుండి దూరముగ నుండుటకే నఁట! నైమిశారణ్యవాసులయభిమత మేదైనను కవులు తమసమకాలీన సంఘమునఁ బ్రవర్తిల్లెడు పాశ్చాత్యాచారములఁ గొన్నింటికి రోసి, ప్రాచీనసదాచారవర్తుల కుచితమైన గౌరవమర్యాదలు జరుగుట లేదని చింతించి, భావనామయమై స్వీయాదర్శసమగ్రప్రబోధాత్మకమై యొప్పు నొకసంఘమును సృష్టించి సంతృప్తిపడిరేమో యనునట్లినైమిశారణ్యమునిసంఘసృష్టి గోచరమగుచున్నది. కవులమనఃప్రవృత్తులయొక్కయు, నమ్మకములయొక్కయు, అభిరుచులయొక్కయు సమిష్టిసృష్టి యీనైమిశారణ్యసంఘసృష్టి. ఇది ఈకావ్యములో నున్న ప్రథమవిశేషము!

ఈకావ్య మాఱాశ్వాసములలో రచింపఁబడినది. అందలికథ స్థూలముగా నిట్లు విభజింపఁబడియున్నది.

1. ప్రథమాశ్వాసము :
   (1) నైమిశారణ్యమునిసంఘవర్ణనము-సత్రయాగసంభారము. (1.1-72)
   (2) చంద్రమతీహరిశ్చంద్రులు వెతలు గుడుచుటకు హేతు వగు పూర్వజన్మకథ సూతుఁడు చెప్పుట. కలకంధరానీలలోహితుల వృత్తాంతము. (1.73-139)
2. ద్వితీయాశ్వాసము :
   (1) కలకంధరానీలలోహితులవృత్తాంతము. (2.2-135)
3. తృతీయాశ్వాసము :
   (1) చంద్రమతిపూర్వగాథ - (చంద్రమతీహరిశ్చంద్రులవివాహగాథ)
4. చతుర్థాశ్వాసము :
   (1) చంద్రమతీహరిశ్చంద్రు లాజన్మమునఁ బడినకొన్నిబాములు (ఋగ్వేదకథ నాధారముగా వర్ణింపఁబడిన శునశ్శేఫవృత్తాంతము) (4.2-151)

5. పంచమాశ్వాసము :

(1) విశ్వామిత్రుఁడు తనతపఃపుణ్యార్ధమును హరిశ్చంద్రున కిచ్చుటకు వర మిచ్చినకథ, సర్వజిత్సంహారకథ. (5.2-102)

6. షష్ఠాశ్వాసము :

(1) లోహితుండు సర్పదష్టుఁ డగుటకుఁ గలపూర్వగాథ (6.2-70)
(2) వీరబాహుని పూర్వజన్మవృత్తాంతము (6.71-92)
(3) కాలకౌశికుని పూర్వజన్మవృత్తాంతము (6.93-99)
(4) హరిశ్చంద్రప్రశంస. (6.100-106)

ఈకావ్యమున సుయజ్ఞప్రసక్తి లేదు. మణిమాలికావృత్తాంతము లేదు. లింగనకృతియందు లేనివి నైమిశారణ్యకథ, ఋగ్వేదహరిశ్చంద్రకథ. మిగిలినకథలు ఉత్తరహరిశ్చంద్రకథాసంబంధు లైనను వేంకటశాస్త్రిగారు కథనుమాత్ర మాలంబనముగాఁ గొని స్వీయప్రతిభావైదుష్యముల వెలార్చి దీని నొక స్వతంత్రప్రబంధముగాఁ దీర్చిదిద్దిరి. వీ రీకావ్యమున ప్రధానపాత్రలకథలకు అధికప్రాధాన్య మిచ్చిరి. మిగిలినవాని కత్యంత లఘుప్రాధాన్య మిచ్చి యౌచిత్యమును పాటించిరి. తి. వేం. కవులపై మార్కండేయాదుల ప్రభావమును వెదకఁబూనుట హాస్యాస్పదము. శనైశ్చరకథయందు వీరు లింగనకవి కల్పననే గ్రహించియుండిరి.

ఇట్లీ ఉత్తరహరిశ్చంద్రకథ లింగనకవినుండి తిరుపతి వేంకటకవులవఱకు పై తెలుఁగుకవుల కావ్యసృష్టికి వస్తుప్రదాత యై విలసిల్లినది. దీనికి మూలము కానరామిచే నాంధ్రకవికల్పిత మనియే భావింపఁదగియున్నది. ఇందలి ప్రధానపాత్రలు మార్కండేయ పురాణాతర్గత మైనవి. నామములు కొన్నిపురాణము లందున్నను ప్రబంధములందు ప్రసిద్ధమైనవి. ఇందలి యొకకథకు మార్కండేయమే మూలమగు చున్నది. కావున నా యంశము లిచ్చట పరామర్శింపఁబడినవి.

# మరుత్తరాట్చరిత్రము

శ్రీనాథమహాకవి చిన్నారి పొన్నారి చిఱుతప్రాయము నాఁడు తెలుఁగుభారతి కర్పించిన తొలికావ్యము మరుత్తరాట్చరిత్రము. ఆంధ్రుల దురదృష్టమువలన నాకావ్యము నేటివఱకును లభింపలేదు. అందువలన నాకావ్యమునకు మూల మేదియో ఇదమిత్థముగాఁ జెప్పలేము.

మహాభారతాదులందు షోడశమహారాజచరిత్రలను వర్ణించునవసరమున మరుత్తరాట్చరిత్రము వినవచ్చుచుండును. మార్కండేయ, భాగవత, బ్రహ్మాండపురాణాదులయందు వైవస్వతమనువంశకథనమునఁ బొడగట్టుచుండును. శ్రీనాథుడు పురాణఖండములను, పురాణప్రసిద్ధకథలను కావ్యేతివృత్తములుగా గ్రహించి కావ్యములు నిర్మించుటచే నాతఁడామహారాజుచరిత్రమును పురాణేతిహాసములనుండి గ్రహించి కావ్యముగా సంతరించి యుండవచ్చు నని భావించుటకు వీలున్నది.

శ్రీనాథుని తరువాతఁ బ్రాచీనకవులలో నీరాజచరిత్రమును కావ్యముగా రచించినవాఁడు వేరొకఁడు కానరాఁడు. ఆలోపమును దీర్చుటకై నవ్యులగు కీ.శే.శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మరుత్తరాట్చరిత్రము నైదాశ్వాసముల ప్రబంధముగా రచించి యాంధ్రుల మన్ననలకుఁ బాత్రులైనారు. డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారి కంకిత మీయఁబడిన యీగ్రంథమును శ్రీశాస్త్రిగా రాంధ్రప్రదేశరాష్ట్రావతరణమునాటికే రచించియున్నట్లు కావ్యావతారికవలనఁ దెలియుచున్నది. శ్రీశాస్త్రిగారు తమకృతికి మూలము నిట్లు సూచించిరి-

క. షోడశరాజచరిత్రలఁ
జూడంబడు తచ్చరిత్రనుం దగ దానిన్
వేడుక గ్రహించి మఱియుం
గూడినగ్రంథముల వెదకుకొనుచున్నంతన్.

క. మార్కండేయపురాణము
పేర్కొను నారాజుచరిత విరివిగఁ దత్సం
పర్కము గలుగం బ్రకృతిని
దర్కించుచు నుచితరీతిఁ దనరి తుఁ గృతిన్. (అవ. 15-16)

1. "చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటినాఁడె రచియించితి మరుత్తరాట్చరిత్ర" - యను పాఠాంతరము కలదు.

ఉ. వ్రాసెను దానినిం జెలుతప్రాయమునం గవిసార్వభౌముఁ డా
భాసురకావ్యకౌస్తుభ కుపాంపతిమేఖల నెందు డాగెనో
రోసియు రోసి రోసియు నెఱుంగనివా రయి తెల్గుభూజనుల్
వేసరిపోయి రాకృతిని వెండియు నిర్మితిసేయ నెంచితిన్.

తే. ఆతఁ డింద్రునితో నొడ్డి ఖ్యాతి మెఱయ
నూఱుయజ్ఞము లొనరించె నోరుగలఁ డ
టంచు నింద్రుఁడు వానికి నడలుగుడుచు
నట్టివాఁ డయ్యె సామాన్యుఁ డట్టె యతఁడు.

శా. సంవర్తుం డుపదేష్టగా సవన మాష్మాజాని సాగించుచో
సంవేగంబున వజ్రి వజ్రమును బెల్చన్ వైచె నాశాలపై
సంవర్తంబన మండుచుం దరియ రా సామర్థ్యముం బాసి యే
సంవాదంబును లేక చల్లఁబడె నాశంబంబు నిర్వీర్యమై.

క. ఆతనిపూతచరిత్రము
నాతలఁపున కేగుదెంచినన్ నే దానిన్
నీతులు రీతులు గూడం
బ్రాతిగఁ గృతి చేసినాఁడ మఱియు న్వింటే. (అవ. 27-30)

పై వాక్యములవలన నీకావ్యమునకు భారతమునందును, మార్కండేయమునందును గల మరుత్తరాట్చరిత్రము మూల మని తెలియుచున్నది. భారతాదులందు షోడశచక్రవర్తులలో మరుత్తుఁ డాద్యుఁడుగా వర్ణింపఁబడినాఁడు. సంవర్తుఁ డుపదేష్టగా నాతఁ డొనర్చిన యాగవృత్తాంత మందు ప్రసిద్ధము. శ్రీశాస్త్రిగారికావ్యమునందును అదియే ప్రధానవృత్తాంతము. భారతమున నీచరిత్ర మొకసీసపద్యమున మాత్రము చెప్పఁబడియున్నది. శాస్త్రిగారు దానిని స్వీయప్రతిభతో నుచితకల్పనలతోఁ బెంచి మూఁడున్నరఆశ్వాసములు రచించినారు.

మార్కండేయపురాణము భారతమునందలి ఈరాజుకథను సంగ్రహముగాఁ జెప్పియు, నాగకులగర్వభంగకథను తాను కల్పించి చెప్పి తన ప్రత్యేకతను నిలుపుకొనినది. శ్రీశాస్త్రిగారి కాకథయు నచ్చినది. దానిని స్వీకరించి విస్తరించినచో వారిప్రధాన కథాప్రయోజనము దెబ్బతినును. అందువలన సంగ్రహముగా మొదటిరెండాశ్వాసములలో దీనిని ముగించివైచినారు. కాని, "మార్కండేయపురాణము పేర్కొను నారాజుచరిత విరివిగఁ దత్సంపర్కము గలుగ" రచించినట్లు శ్రీశాస్త్రి గా రనుట గమనింపఁదగినది. మార్కండేయము సూర్యవంశక్రమవర్ణనము చేసినది. ఆక్రమము నీ కవి గ్రహించి మరుత్తునితాతతండ్రులచరిత్రను ప్రసంగించినారు. పురాణము భారతమునందలి మరుత్తరాట్చరిత్రమును గ్రహించి స్వీయనూత్నకల్పనలు జోడించి చెప్పినది. శ్రీశాస్త్రిగారు మార్కండేయకల్పనలు గ్రహించి పరంపరాప్రసిద్ధ మైన కథను నూత్నకల్పనలతో

పెంచి చెప్పినారు. పురాణకల్పనలకంటె స్వీయకల్పనల కధికప్రాధాన్య మిచ్చినారు. మొత్తమునకు కవిగారి కావ్యవస్తువునకు సమగ్రబీజభూత మగునది మార్కండేయ పురాణ మనుటలో విప్రతిపత్తి లేదు.

రావణుఁడు మరుత్తభూపాలుని యజ్ఞభాగము కోరె నను వృత్తాంత మత్యంత నవీన కల్పనముగా కానవచ్చును. ఇక్ష్వాకువే పుట్టని మరుత్తరాట్కాలమున రావణుఁ డుండుట యసంభ మని భారతమార్కండేయాదులు ఆకల్పనము తలపెట్టలేదు. కాని, శ్రీశాస్త్రిగా రాపురాణకల్పనమునుగూడ గ్రహించి తమకావ్యనిర్వహణఘట్టముగా నిబంధించిరి. ఔచిత్యముకంటె కథ కాఘట్ట మౌత్సుక్యము కల్పించి రాణించుచున్నది.

మరుత్తసంవర్తులపాత్రలు శ్రీశాస్త్రిగారు కడుసామర్థ్యముతో నిర్వహించిరి. ప్రతి నాయకునిగా నింద్రుని ధీరోద్ధతునివలెఁ జిత్రించి రసపోషణము గావించిరి. వరుణాదులను ఇంద్రసహాయులుగాఁ జిత్రించి ఉపనాయకపాత్రనిర్వహణనైపుణ్యమును ప్రదర్శించిరి. బృహస్పతిసంవర్తులవైరము నారదతుంబురమాత్సర్యమువలె రక్తికట్టించిరి. వీని మధ్య కవిగారు సమకాలీనసాంఘికవ్యవస్థలను, సిద్ధాంతములను, వాతావరణమును యథానుకూలముగాఁ బ్రవేశపెట్ట యత్నించిరి. కాని, పురాణకథకు అవి యంతగా శోభనీయలేదు.

మార్కండేయము నింతగా ననుసరించితి నని చెప్పుకొనినశాస్త్రిగారు మరుత్తావేక్షితసంవాదఘట్టము నతిక్షిప్తముగను నిస్తేజముగను రచించి యూరకుండిరి. (ద్వి. పుట. 48 - 50). పురాణమున యజ్ఞనిర్వహణానంతరము మరుత్తుఁడు నాగకులగర్వహరణ మొనర్చె నని యుండ కవిగా రాక్రమమును వ్యత్యస్త మొనర్చిరి.

కవిసార్వభౌము లైన శ్రీపాదవారికావ్యమును చదివి కవిసార్వభౌముఁ డైన శ్రీనాథునికావ్యస్వరూపము నూహించుట దుర్లభము. కాని, ఆకవి మార్కండేయపురాణ కథను గైకొనియుండినచో నింత పేలవముగ మాత్రము రచింపకుండెడివాఁ డని మాత్ర మూహింపవచ్చును. యజ్ఞప్రవర్తనకథలయందు శ్రీనాథునివలె శ్రీశాస్త్రిగారును కథానిర్వహణసామర్థ్యము ప్రదర్శించినారు. శ్రీనాథునికావ్యము లభింపలే దను లోపము తీర్చి తెలుఁగువారి యభినందలకుఁ బాత్రులైనారు!

# శ్రీదత్తభాగవతము

శ్రీదత్తాత్రేయస్వామి విష్ణ్వంశసంభూతుఁడు; అనసూయాత్రిసుతుఁడు. ఇతని దైవాంశయు, అవధూతచర్యయు, మహిమాతిశయమును, జ్ఞానబోధశక్తియు తేటపడునట్లు వర్ణించిన మహాపురాణము మార్కండేయమహాపురాణము! అట్టిదేవునిమహిమ మారన వాక్కున మరందధారామాధుర్యమును వహించినది. జడోపాఖ్యానాంతర్గతమైన యీదేవుని గాథ యిహపరసాధకము, జ్ఞానఫలప్రదము. దత్తదేవునిమహిమను భాగవతాదిమహాపురాణములు కూడ కీర్తించియున్నవి. దత్తాత్రేయసంప్రదాయము తెలుఁగునాఁట ప్రసిద్ధి గాంచమిచే నీవాఙ్మయము మహారాష్ట్రమున వెలసినంతగా నిచ్చట వెలయలేదు. మహారాష్ట్రమునందలి మాహురిక్షేత్రము గొప్పదత్తక్షేత్రము. అనంతుఁడు భోజరాజీయములోనను, పింగళిసూరన కళాపూర్ణోదయమునందును, తరిగొప్పుల మల్లన చంద్రభానుచరిత్రయందును, ముడియము వేంకటరమణకవి కళాధరోపాఖ్యానమునందును, మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రమునందును, దత్తాత్రేయునిఁ గీర్తించియున్నారు.[1] కాని, మహారాష్ట్రమునందువలె దత్తపురాణముగాని, దత్తభాగవతమువంటిగ్రంథముగాని యీకవు లెవ్వరును వ్రాయలేదు. తెలుఁగునాట యీదేవునిసంప్రదాయము బహుళవ్యాప్తి చెందకపోవుటయే యందులకుఁ గారణము కావచ్చును; ఏమైనను దత్తాత్రేయుఁ డన బ్రహ్మవిష్ణుశివతత్త్వముల కేర్పుఅచిన యొకఅద్వైతమూర్తిగా నాంధ్రులు భావించెదరు!

తెలుఁగున దత్తదేవునిమహిమను స్తుతించినవాఁడు మారనయే. పోతనాదులు నట్టే పురాణరచనావసరమున నాదేవునిమహిమ వర్ణించిరి. క్రీ.శ. 18వ శతాబ్దపు పూర్వార్ధమున నున్న వెలగపూడి కృష్ణయ్యకవి తనపూర్వీకు లెవరో దత్తాత్రేయచరిత్రము రచించియుండిరని చెప్పుకొనెను. కాని, యాగ్రంథము దొరుకుట లేదు. కావునఁ బ్రాచీనులలో దత్తదేవునిగాథను కావ్యముగా నంతరించినవారు కానవచ్చుటలేదు.

నవ్యులలో శ్రీతాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు రచించిన శ్రీదత్తభాగవత మను కావ్యము మార్కండేయపురాణకథ పాక్షికమూలముగా వెలసినగ్రంథము. జడోపాఖ్యానమునందలి దత్తాత్రేయమహిమను ప్రతిపాదించు ఘట్టముల నీకవి తృతీయచతుర్థ దశములలో నభివర్ణించెను. సుమతిచరిత్రము, దత్తజననము, కువలయాశ్వునికథయు. అలర్కోపాఖ్యానము, కార్తవీర్యమహారాజు దత్తుని సేవించుటయు అనుప్రథానాంశములతో నీకథాభాగము కలదు. దత్తునిమహిమకును, తత్త్వబోధకును సంబంధించిన యంశముల

1. వివరములకు దత్తాత్రేయవాఙ్మయము (వ్యా.) శ్రీనిడదవోలు వేంకట రావుగారు; ఆంధ్ర పత్రిక. క్రోధి. ఉగాదిసంపు. పు. 16-22.

తోడను, కథలతోడను ఈపురాణము ద్వాదశాధ్యాయపరివ్యాప్తమై యున్నది. అందు జడోపాఖ్యానమునకు మూలము మార్కండేయము. మిగిలినదానికి భాగవతాది పురాణములు మూలములు.

శ్రీశాస్త్రిగారు సంస్కృతమార్కండేయపురాణతాత్పర్యమునే గైకొని జడోపాఖ్యానమును సరళమును, ధారాళమును నైనతమశైలితో స్వతంత్రరచనమువలె సంతరించిరి. కొన్నియెడల వీరిపద్యములు మూలమున లేని శబ్దార్థచమత్కృతులతోఁ బఠిత నలరింపఁ జేయుచున్నవి. జడునివైరాగ్యమును దెల్పు వాక్యములు - (వృత్తనామప్రయోగ చమత్కారము).

మ. పరమంబౌ సుఖ మొండు నిర్గుణపరబ్రహ్మంబె దుఃఖాతిగం
బిర నిస్సంగుఁడ నై చరింతు నిక మత్తేభంబువృత్తంబునం
బరమానందమునందు నాప్లుతుఁడ నై వర్ధించి రాగాదులం
బరిశాంతిం గనినాఁడ నంటుదునె మర్మావిత్త్యాధర్మముల్. (3.17)

మూలమునందలి పతివ్రతకు సుమతి యను పే రుంచుట యిందొక విశేషము. సుమతీ - అనసూయల సంవాదము విపులముగను సరసముగను కవి చిత్రించెను. అనసూయాగర్భమున త్రిమూర్తు లుదయించిన ఘట్టము మూలాతిశయముగా వర్ణింపఁబడినది. దత్తాత్రేయుని అవధూతలీలలను కవి మూలము కంటె సంగ్రహముగా రచించెను. ఉదా : మారన మార్క. 2.208, 209, 210, 211 పద్యములలోనిభావము శ్రీదత్తభాగవతమున 5.98 పద్యమునఁ గుదింపఁబడినది. జంభాసురవిజయవృత్తాంతము, కువలయాశ్వచరిత్రము ప్రసన్నశైలిలో నడచినవి. మదాలసాకువలయాశ్వుల ప్రథమసమావేశమునకు ఈకవి మారనవలె రసభాగవపుష్టి చేకూర్పఁజాలక పోయెను. అశ్వతరుఁడు చేసిన సరస్వతీస్తుతిని యథామూలముగా నితఁ డనువదించెను; మదాలస యలర్కునకు బోధించిన కర్మపదతిని సంగ్రహించెను. దత్తదేవుఁ డలర్కునకు దుఃఖాపహార మొనర్చుటయు, దత్తదేవుఁ డలర్కునకు జ్ఞానోపదేశ మొనర్చుటయును నీకవి యభినివేశముతో రచించెను.

నారాయణశాస్త్రిగారిది మొత్తముమీద సరళమైన రచన మైయున్నను మారన రచనలోని శిల్పవైభవము కానరాదు. భగవదవతారలీలగా భావింపఁబడిన దత్తదేవునికథ భక్తులు చదివి తరించుట కుచితమైన పద్యప్రబంధ మీ శ్రీదత్తభాగవతము.

◆ ◆ ◆

ఇట్లు మార్కండేయము ప్రత్యక్షమూలముగా వెలిసిన మనుచరిత్ర, కువలయాశ్వచరిత్రాదులు, పరంపరామూలముగా నవతరించిన హరిశ్చంద్రచరిత్రాదులు, పరోక్షమూలముగాఁ బుట్టు వందిన ఉత్తరహరిశ్చంద్రచరిత్రాదులు, పాక్షికమూలముగాఁ బ్రభవించిన మరుత్తదత్తాత్రేయచరిత్రములు-ఈవిభాగమున స్థాలీపులాకన్యాయమున సమీక్షింపఁబడినవి. మార్కండేయమునకు మాతృత్వమును గల్పించి, సాహిత్యలోకమున నాపురాణమునకు శాశ్వతయశమును సంపాదించిపెట్టిన వీకావ్యసంతానములు!

# చతుర్థసర్గము

# మార్కండేయపురాణము మఱికొన్ని ఆంధ్రానువాదములు

# మార్కండేయపురాణము మఱికొన్ని ఆంధ్రానువాదములు

కవిత్రయమువారి భారతరచన కున్నంత ప్రాభవము తరువాతికవుల ఆంధ్రమహాభారతరచనల కెట్లు కలుగలేదో మారనమహాకవి మార్కండేయపురాణము తరువాత వెలసిన తత్పురాణాంధ్రానువాదముల కంత ప్రసిద్ధి కలుగలేదు. దానికిఁ గారణము కవిత్రయము వారివలెనే చేపట్టిన కృతిని నాన్యతోసాధ్యముగాఁ దీర్చిదిద్దిన మారనకవితా శక్తి యనకతప్పదు.

## 1. పొన్నతోట బొబళకవియనువాదము :

మారన తరువాత మార్కండేయమును నాంధ్రీకరించినవాఁడు పొన్నతోట బొబళ కవి. ఇతఁడు క్రీ. శ. 1540 ప్రాంతమువాఁ డని ఆంధ్రకవితరంగిణికర్త భావించుచున్నారు.[1] ఇతని తండ్రిపేరుకూడ బొబళుఁడే యని తెలియుచున్నది. ఇతని కులగోత్రాదులును, నివాసస్థలమును స్పష్టముగ నెఱుకవచ్చుటలేదు. ఇతఁడు మార్కండేయవామన పురాణములను రచించి మైసూరుమండలమందలి చెన్నపట్టణమునకుఁ బాలకుఁడైన రాణా జగదేకభూపతి కంకిత మొసంగెను. ఇతని వామనపురాణప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ గలదు; మార్కండేయపురాణ మిప్పటివఱకు లభింపలేదు. వామనపురాణావతారికలోని యీక్రింది పద్యమువలన వామనపురాణము కంటె మార్కండేయపురాణమునే యాతఁడు ముందు రచించె నని స్పష్టమగుచున్నది.

సీ. "ఊహ గావింపుచు నున్నచో రాణవంశాగ్రణి యై తేజమంది వెలయు
జగదేవరాయ భూజానిచంద్రుఁడు నన్నుఁ జేరంగఁ బిలిచి గంభీరభణితి
నో పొన్నతోటాన్వయోజ్జ్వల......కవివర్య ! నీవు ము న్గడఁగి మాకు
నంకితంబుగఁ జేసినట్టి మార్కండేయ మను పురాణంబు............
వెసఁగుచున్నవి గాన నీవిపు డొనర్చు
వామనపురాణమును జగద్వర్ణితముగ
మాకె యంకిత మొనరింపు మధురరసని
గుంభజృంభితకవనసంరంభమునను.

---

1. ఆంధ్రకవితరంగిణి. 9వ సం. పుట 125.

ఇతని మార్కండేయపురాణము మహాపురాణములలోనిదే యని భావించుట కతని వామన పురాణానువాదమే యాధార మగుచున్నది. మొదటికావ్యము నంకితముగా గ్రహించి రెండవగ్రంథమునుగూడ కృతిపతి వైపద్యములో నర్థించుటను గాంచినచో బొబళకవి మార్కండేయమును సామర్థ్యముతో నిర్వహించియుండు ననుటకు సందేహము లేదు.

## 2. మండ కామేశ్వరకవి యనువాదము :

క్రీ. శ. 19వ శతాబ్దపు చరమపాదమున నివసించియున్న మండ కామేశ్వరకవి ప్రణీత మైన మార్కండేయపురాణ మొండు ముద్రింపఁబడి తెలుగునాట వెలసియున్నది. బొబళకవి తరువాత నీకవివఱకు మార్కండేయమును గద్యపద్యాత్మకముగా నిర్మించిన కవి యెవ్వరును తెలియవచ్చుటలేదు.

కామేశ్వరకవి మారనమహాకవివలెనే పురాణమును అష్టాశ్వాసగ్రంథముగా నిర్మించెను. కాని, యతనివలె భావానువాదపద్ధతి నాశ్రయింపక మూలమున కతివిధేయ మైన యనువాదము గావించెను. మారనవలె నితఁడు పురాణమును సారవంతముగను, సంగ్రహముగను, శిల్పబంధురముగను తీర్చిదిద్దవలె నను నుత్సాహమును బ్రకటింపక శ్లోకములకు సమాంతరముగాఁ బద్యములు నడచునట్లు మూలమునందలి స్వల్పాంశ మైనను విడువకుండ భద్రపఱచుచు ప్రవాహతుల్యమైన కవితాశక్తితో శ్రవణానందముగ నీపురాణమును రచించెను. తాను యథామాతృకముగా ననువదించితి నని కాబోలు కామేశ్వరకవి తనకంటె ముందు తెలుఁగున మార్కండేయమును వెలయించిన ప్రాచీనకవులను స్మరింపలేదు ।

కామేశ్వరకవి ఆశ్వాసవిభాగమున కొంతస్వాతంత్ర్యము ప్రకటించెను. మారన వదలిన నరిష్యంతదమచరిత్రములను యథామూలముగా ననువదించెను

ఆశ్వాసవిభాగము

| మారన మార్కండేయపురాణము | కామేశ్వరకవి మార్కండేయపురాణము |
|---|---|
| 1) ప్రథమాశ్వాసము ।<br>ఆరంభమునుండి హరిశ్చంద్ర స్వర్గ గమనవృత్తాంతమువఱకు. | 1) ప్రథమాశ్వాసము :<br>ఆరంభమునుండి బలరామతీర్థయాత్రా గమనకథాంతమువఱకు. |
| 2. ద్వితీయాశ్వాసము :<br>ఆడిబకయుద్ధవృత్తాంతము మొదలు కువలయాశ్వుఁడు మదాలసాద్వితీయుఁడై నిజపురమునకు వచ్చునంతవఱకు. | 2. ద్వితీయాశ్వాసము :<br>హరిశ్చంద్రోపాఖ్యానము మొదలు నారకోద్ధారవర్ణనమువఱకు. |
| 3. తృతీయాశ్వాసము :<br>మదాలస అత్తమామలను సేవించుట మొదలుకొని జడోపాఖ్యానము ముగియు నంతవఱకు. | 3. తృతీయాశ్వాసము :<br>పతివ్రతకథారంభముతో మొదలయి మదాలస అలర్కునకు రాజధర్మము నుపదేశించినంతవఱకు గలదు. |

| మారన మార్కండేయపురాణము | కామేశ్వరకవి మార్కండేయపురాణము |
|---|---|
| 4. చతుర్థాశ్వాసము : క్రోష్టుకి మార్కండేయసంవాదకథనముతో నారంభించి ప్రవరుఁడగ్ని ప్రసాదమున నింటికేగు నంతవఱకు. | 4. చతుర్థాశ్వాసము : వర్ణాశ్రమధర్మకథనము మొదలు జడోపాఖ్యానాంతము వఱకు. |
| 5. పంచమాశ్వాసము : వరూథినీవిరహవేదనవర్ణనము మొదలు సావర్ణిమన్వంతరమహిమాభివర్ణనము వఱకు. | 5. పంచమాశ్వాసము : క్రోష్టుకి మార్కండేయసంవాదకథనారంభమునుండి స్వరోచి యిందీవరాక్షునిపై శరసంధానముచేయునంతవఱకు. |
| 6. షష్ఠాశ్వాసము : సప్తశతికథనము. | 6. షష్ఠాశ్వాసము : ఇందీవరాక్షుఁడు శాపకారణము చెప్పుటమొదలు సప్తమాతృకావిర్భావము వఱకు |
| 7. సప్తమాశ్వాసము : దక్షసావర్ణిమన్వాదివర్ణనము మొదలు వత్సంధ్రపట్టాభిషేకమువఱకు. | 7. సప్తమాశ్వాసము : సప్తమాతృకల విజృంభణము మొదలు వృషధ్రుఁడు బ్రాహ్మణశాపమునకు గుఱియగునంతవఱకు. |
| 8. అష్టమాశ్వాసము : వత్సంధ్రసంతతికథనము మొదలు ఫలశ్రుతివఱకు. | 8. అష్టమాశ్వాసము : నాభాగచరితము మొదలు ఫలశ్రుతి వఱకు. |

కామేశ్వరకవి యొనర్చిన ఆశ్వాసవిభాగము మారనవిభాగముకంటె నుదాత్తముగా నున్నదని చెప్పఁజాలము. తృతీయ, పంచమ, సప్తమాశ్వాసములముగింపులు పఠిత కంత సంతృప్తితోఁ గూడిన విశ్రాంతులు కావు. మార్కండేయమును 'అంబికాచరితభాసుర' మనియు, 'అంబావతార ముఖ్యచరిత' మనియు విశేషించి కీర్తించిన కామేశ్వరకవి సప్తశతికిఁ బ్రత్యేకప్రతిపత్తి గల యొకయాశ్వాసమును - మారనవలె - కేటాయింప లేదు. జడోపాఖ్యానాంతమువఱకు మారన మూఁడాశ్వాసములలో ముగింప, కామేశ్వరకవి నాలుగాశ్వాసములు నడిపినాఁడు. మిగిలిననాల్గాశ్వాసములను పరిమాణమున నధికముగాఁ బెంచినాఁడు. మారనపురాణము రెండున్నరవేలపద్యగద్యములలో నొదిగియుండ కామేశ్వరకవి గ్రంథము మూడున్నరవేలపద్యగద్యములకు మించి విస్తరించినది.

క. "మార్కండేయపురాణం
బర్కనిభం బఖిలతమము లణఁచు నతిశుభ్రో

దర్కం బిది దెనిగింపు మ
లర్కాంబాసుచరితాద్యలంకృత మగుటన్."

ఆ. ఆంధ్రదేశమందు నఖిలజనోపయో
గంబు గాగ మృదుపదంబు లలర
రచనఁ జేయు మిది నిరంజనుఁ డగు సర్వ
కారణునకుఁ బ్రీతిగాఁ దనర్చ. (అవ. పుట. 6)

అను కృతిపతి యాదేశము ననుసరించి కామేశ్వరకవి యీమహాపురాణమును దెనిఁగించె నని యవతారికవలన తెలియుచున్నది. ఇందు మార్కండేయమును అర్కనిభ మని వర్ణించుట మారనచూపిన మార్గమే. (చూడు: మారన. అవతారిక. 16.) కామేశ్వరకవి యీపురాణ మఖిలజనోపయోగార్థముగా రచింపఁబూనుట మారన 'కోవిదు లిచ్చ మెచ్చి సంభావన సేయ' రచించె నని కాబోలు! పైమాటలనుబట్టి ఇరువురికిని మార్కండేయ మన్న సమానభక్తిగౌరవములు కల వన్నమాట సత్యము! కాగా రచనాపద్ధతిలోను, రచనా ప్రయోజనములోను కొంత వ్యత్యాసము కలదు. మారన కున్న కావ్యకళాశిల్పతత్త్వ పాండిత్యము కామేశ్వరకవి కున్నట్లు కానరాదు. సారకథామృతప్రకాశము చేయవలె నని గాని, వచఃశ్రీవిభవము ప్రదర్శింపవలె నని గాని, కామేశ్వరకవి భావింపలేదు. కాని, "ఈమహాపావనమౌ పురాణమునుబట్టి తెనుంగునఁ గూర్తు నంతయున్" అని మాత్రము చెప్పుకొనినాఁడు. సారవంతము లైన కథార్థములను శిల్పసుందరముగాఁ జెప్పుట ఒకరి మతము; పవిత్రము లైన మహాపురాణార్థములను జెక్కుచెదరకుండ తెలుగుఛందములలో భద్రపఱచి సర్వజనసులభముగా సంతరించుట యొకరియభిమతము. ఈభేదము కావ్య నిర్మాణపద్ధతిలో కొట్టవచ్చినట్లు కనఁబడుచున్నది.

కామేశ్వరకవి మారనకృతినిఁ జూచి, చదివియుండె ననుటకు పైకందపద్య మొకటి చాలును. కాని, మారన తనయనువాదమునఁ జూపించిన జిలుగుశిల్పముగాని, కావ్యమర్యాదలుగాని, కథాకథనమర్మములు గాని, ప్రకృతివర్ణనానైపుణ్యము గాని, రస భావవ్యక్తీకరణముగాని రమణీయాలంకారసౌభాగ్యముగాని, కామేశ్వరకవి చూడనట్లే వదలివైచెను. మూలానుసరణము వ్రత మైనను మారనలోని మేలిమిని గ్రహించుట దోషముకాదు కదా!

పురాణారంభమున నిష్టదేవతాస్తుతి యొనర్చు మర్యాదను పాటించిన మారన కథా రంభమున మూలమునఁ గల నారాయణప్రార్థనమును వదలి తపోవనవర్ణనము నుదాత్త ముగా నొనరించెను. మూలానుసారి యైన కామేశ్వరకవి నారాయణస్తుతి యొనర్చి, తపోవనమును దలంపనైన లేదు. జైమినిమహర్షి మార్కండేయుని భారతసంశయార్థ ముల గూర్చి ప్రశ్నించినట్లు చెప్పిన కథాభాగము (సీసపద్యము) కామేశ్వరకవి ధర్మ పక్షులముందు పునరావృత్తి చేసెను. మారన యీపునరుక్తిని తొలగించినను ఈకవి దానిని గమనింపలేదు. ధర్మపక్షులనివాసస్థల మైన వింధ్యమును మారన విశేషముగా

వర్ణించెను. ఈకవి దానిని గుర్తింపలేదు. ద్రౌపది యింద్రాణి అంశమున నగ్నిగుండమున జన్మించె నను వివరము మారన చెప్ప లేదు. అది ఉత్తరాదిప్రతులలో లేదు. తరంగిణీ ప్రెస్‌ప్రతిలో కలదు. దాని నీకవి గ్రహించెను. బలరాముఁడు ప్రవేశించిన రైవతాద్రిని కథానుకూలముగా మారన రచించియుండ మూలానుసారియై దీర్ఘవచనమున కామేశ్వర కవి వర్ణించెను.

హరిశ్చంద్రోపాఖ్యానమును మారనవలె నితఁ డుదాత్తమైన యారంభముతో నెత్తుకొనలేదు. కాని, అచ్చట మారనకు దీటగు పద్యములను వ్రాయవలె నను యత్నము చేసినట్లు కనఁబడుచున్నది. ఉదాహరణకు :

మారన :

చ. వెలుగు మహాప్రతాపశిఖివేడిమి దిక్కుల నించుచున్న నా
కొలఁది యెఱుంగ కెవ్వఁడొకొ ఘోరపుఁజిచ్చుటు చీరఁ గట్టెడి
న్దలరక యిట్టి దుర్మదు నధర్మపరు న్దురితాత్ముఁ జండదో౹
కలితధనుర్విముక్తపటుకాండవిఖండితగాత్రుఁ జేసెదన్." (1.152)

కామేశ్వరకవి :

చ. బలమును తేజముం గలిగి పాలన మే నొనరించుచుండఁ గా
ఖలుఁ డెవఁడొక్కొ వహ్ని నొడిగట్టుకొనంగ గడంగె మద్దను
ర్వలయవినిర్గళత్పటునిరంతరదీపితదిక్తటేషుని
ర్దళితశరీరుఁడై యెవఁడు ధారుణిఁ గూలఁగ నిచ్చగిం(యిం?) చెనో?
(పుట.59).

వృత్తము, ప్రాసము, గతి మారనకృతి కనుకృతిగా వెలసినను అతనిపద్యమునందలి యెత్తుగడ, ముగింపులలో నున్న సార్థక్యము కానరాదు. మారన కౌశికునివాక్కులలోఁ బదర్శించిన యొడుపును గడుసుఁదనమును ఈకవి గ్రహింపలేదు. ఉదాహరణమునకు-

మారన :

క. పుడమియు నొడమియు రాజ్యముఁ
గడువేడుక నిచ్చితేనిఁ గైకొంటిమి పెం
పడరంగను స్వామ్యం బల
వడునే నీ వున్న మాకుఁ బార్థివముఖ్యా!

తే. వెడలిపో మ్మేల మాటలు వేయు? రాజ్య
మేకముఖము గాకున్న మాకెట్లు చెల్లు?
వినుము రాజ! సూదికి రెండుమొనలు గలవె?
యింకఁ దడసిన నిన్ను సహింప నవని. (1.165-166)

కామేశ్వరకవి :

ఎ.గీ. "సర్వభూమండలంబు నొసంగఁ బడియె
నేని యీరాజ్యమున కెల్ల నేన స్వామి

నేని నావిషయంబునం దీవు నిలువ
వలవ దలవకు బోవంగ వలదె నీకు." (పుట. 60)

మారనవాక్కులలోని ప్రౌఢత్వము, వాక్యనిర్మాణవైశిష్ట్య మిందు కానరాదు. క్రుద్ధుఁడగు కౌశికుఁడు "పోవంగవలదె" అని అనునయించున ట్లనఁడుకదా!

అమరేంద్రుఁడు హరిశ్చంద్రునిఁ గీర్తించువిధమును కామేశ్వరకవి :-

కం॥ అపు డింద్రుఁడు వచియించెన్
నృపభార్యయు సుతుఁడు నీవు నిజసత్కర్మా
ఖ్యుపగతసద్గతి గాంతురు
విపులసుకృతఫలము గుడువ వెడలుం డనినన్. (పుట. 82)

అని మూలతాత్పర్యము వెలువడునట్లు రచించినను మారన రచించిన

చ. "నరుల గమ్యమై వెలుఁగునాకము నీ కభిగమ్య మయ్యె నీ
నిరుపమసత్యధర్మమహనీయత శాశ్వతదివ్యభోగముల్
దొరకొనియె న్నరేశ్వర! సుతుండును భార్యయు నీవు నూత్నర
త్నరుచిరసద్విమానము ముదమ్మున నెక్కుడు రండు నావుడున్. (1.274)

అనుపద్యములోని నిర్భరభావగాంభీర్యము, నాయకసత్యధర్మకీర్తనరూపమైన వాక్శిల్పము కామేశ్వరకవి వాక్కున కబ్బలేదు! ఆడిబకయుద్ధము నీకవియు నాకసీసమున వర్ణించినను (పుట 86) మారనపద్యములోని (2.12) జిగి రాలేదు.

తాళకేతుతపోవనమునుండి నిజపురి కేఁగ నెంచిన ఋతధ్వజుఁడు "క.పితృమాతృ వందనేచ్ఛయు, సతిని మదాలసను జూచు సంభ్రమును" ప్రకటించె నని అత్యంత వాచ్య మొనర్చెనేగాని మారనవలె "అసమానసౌకుమార్యోల్లసితమృదుతనూలతావిలాసమదభ రాలసయై కర మమరు మదాలసఁ గనుగొను నతికుతూహలం బలరార" నిరూపింప లేదు.

స్వారోచిష మనుసంభవమున నీకవి ద్విజప్రవరునకు ప్రవరాఖ్య నిచ్చి కథ చెప్పెను. ఇది మారనప్రభావ మనక తప్పదు! మారనరచనతో నీభాగమును పోల్చి చూచినచో రసికులను మెప్పింపఁగలదనుట కష్టము! ప్రవరసిద్ధులసంభాషణములో గాంభీర్యము కానరాదు. వరూథిని ప్రవరదర్శనమునఁ బొందిన వికారములను వర్ణించుపట్ల గాని, ప్రవరవరూథినీసంభాషణము నడపు పట్లగాని, మూలముకంటె మారన గైకొన్న చొఱవను కామేశ్వరకవి స్వీకరింపలేదు వరూథినీవిహరము, స్వరోచిపరాక్రమము, కలహంసీచక్రవాకీసంవాదము మొదలగుఘట్టములు యథామూలముగా సాగినవి. ఇట్లే పురాణమంతయు నన్వయించుకొనుట సులభము.

సంస్కృతమార్కండేయమునుండి మారన గ్రహింపక వదలిన శాస్త్రవిషయము లిందు సమగ్రముగఁ గలవు. ఔచిత్యము కొఱకు కథలలో మారన చేసిన మార్పు లిందు గైకొనఁ బడలేదు.

మారనతో పోల్చి చూచునప్పు డీకవి యతనికిఁ దీటు రాకపోవచ్చును గాని యథామూలముగాఁ దెనుగున సలలితమైన శైలిలో మార్కండేయపురాణమును నిర్మించి

సత్కృపులలో కామేశ్వరకవి శాశ్వతస్థానమును సంపాదించుకొనియున్నాఁడు. మార్కండేయ మీమహాకవిచేతఁ బడి సమగ్రముగాఁ దెలుగునకు వచ్చినది. అందుల కీతఁ డాంధ్రులచే అభినందనీయుఁ డగుచున్నాఁడు.

## వచన మార్కండేయపురాణములు :

పందొమ్మిదవశతాబ్దమునుండి పలువురు మహనీయులు తెలుఁగున సంస్కృతమహాపురాణముల ననువదించి తెలుఁగుసాహిత్యమును సుసంపన్న మొనర్చుచుండిరి. అందు చంపువులతో పాటు వచనకృతులును బెక్కు కలవు. చంపూరూపములు మూలానుసారు లగు అనువాదము లగుచుండగా వచనకృతులు పురాణసారరూపములై యుండుట గమనింపఁదగినయంశము. మార్కండేయపురాణసారమును వచనకృతులుగా వెయించిన వారిలోఁ బ్రసిద్ధులు- తిమ్మరాజు లక్ష్మణార్యుడు, నోరి గురులింగశాస్త్రి, కల్లూరి వెంకట సుబ్రహ్మణ్యదీక్షితులు, వేమూరి జగన్నాథశర్మగారలు

పువ్వాడ వెంకటరాయ వర్తమాన తరంగిణీముద్రాక్షరశాలయందు ధాతృనామ సంవత్సర - ఆషాఢశుద్ధ చతుర్దశీసౌమ్యవాసరమున (5-7-1876) ప్రచురిత మైన సంస్కృతమార్కండేయపురాణమున కనుబంధముగా తిమ్మరాజు లక్ష్మణరాయార్యకృత మగు శ్రీమార్కండేయపురాణసారసంగ్రహ మను వచనగ్రంథము చేర్పఁబడి యున్నది. తెలుఁగుపాఠకులకు సౌలభ్య మేర్పఱచుటకై ఇది యుద్దేశింపఁబడిన దనుట స్పష్టము. ఈతని వచనశైలి సమాసబంధురము కాకున్నను జిగిబిగిని సరళమార్గమున ధారాళముగా నడచుచు పఠితలకు చవు లూరించుచున్నది.

క్రీ. శ. 1891 సం॥ డిసెంబరునెలలో అమెరికన్ ముద్రాక్షరశాల - (మదరాసు) - యందు నోరి గురులింగశాస్త్రిగారి వచనమార్కండేయపురాణము ప్రచురితమై యున్నది. ముఖపత్రికపై "శ్రీహరితస గోత్రార్ణవరాకాసుధాకరాథర్వణవేదోపాధ్యాయు లగు నోరి గోపాలకృష్ణ విద్వచ్ఛిరోమణులకుఁ జతుర్థతనయుండును, యజ్ఞోపవీతాన్వయాంబుధి ముక్తాఫలంబు లగు లక్ష్మీకాంతకృతీంద్రులకుఁ బ్రియశిష్యుండును, నాంధ్రగీర్వాణభాషా ధురీణుండును నగు నోరి గురులింగశాస్త్రులచేత సర్వజనాహ్లాదంబుగ సులభశైలిలో నాన్ధ్రంబున వచనరూపంబుగాఁ వ్రాయఁబడి" న దని ముద్రింపఁబడియున్నది. స్థూలముగా నిది మార్కండేయపురాణ మని పిలువఁబడుచున్నను "నాయొనర్పం బూనిన 'మార్కండేయపురాణేతిహాసమంజరి' నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొంద" వలయునని శాస్త్రిగారు గ్రంథారంభమున వాకొనియుండుటచే దాని కావేరే యుచిత మని తోచుచున్నది. పురాణమునఁ గల ధర్మశాస్త్రాదివివిధార్థములను సంగ్రహపఱచి యీరచయిత యుపాఖ్యానతాత్పర్యమును రమణీయముగ నావిష్కరింపఁగలిగెను. శైలియం దీ కవి తనలక్ష్యమును సాధించి కృతకృత్యుఁ డయ్యెను.

శ్రీకంచి కామకోటిపీఠాధీశ్వరు లగు జగద్గురు శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతీ స్వాములవారి కంకితముగా విద్వాన్ శ్రీకల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులుగారు

మార్కండేయపురాణమును వచనమున వెలయించి యుండిరి. (1939). మహాపురాణముల కన్నింటి నీవిద్వత్కవి సంగ్రహరూపముగాఁ దెలుగువచనమున నిర్మించుచు మంచి సాహిత్యసేవ చేయుచున్నారు. సంగ్రహము సరళము నైన వీరిశైలి ఆకర్షణీయముగ నున్నది.

శ్రీవేమూరు జగన్నాథశర్మగారు 'అష్టాదశపురాణసార'మను పేర నొకవచనగ్రంథ మును వెలయించిరి. ఇది నాల్గుభాగములలోఁ గలదు. చివరిభాగమున మొదట మార్కండేయపురాణసారమును వీరు రచించిరి. ఇంతవఱకు వెలసిన యేతత్పురాణసారములో కెల్ల నిదియే చిన్న దని చెప్పవచ్చును. ఆబాలగోపాలము సులభముగా చదివి యానందించువిధముగా పురాణమునందలి ప్రధానకథలు సంగ్రహముగా నిందు చెప్పఁబడి యున్నవి.

ప్రసిద్ధి వహింపకపోయినను ఎందఱో యిట్లు పురాణములను వచనలఘుకృతులుగా నిర్మించి యుండవచ్చును. భారతీయాస్తికతాపోషణము, ప్రాచీనసంస్కృతిపునరుజ్జీవనము అనుమహదాశయము లీకృతులవెనుక కల వను సత్యము మాత్రము విస్మరింపరానిది. అందువలన నేతత్కవులందరును గౌరవార్హు లగుచున్నారు.

ఇఁక మార్కండేయపురాణము నొక మహాపురాణముగాఁ దెలుఁగువారి హృదయములందు చిరస్థాయిగా నిలచునట్లు శిల్పరమణీయముగా రచించిన కవివతంసుఁడు మారన యనుటలో విప్రపత్తిలేదు. అందువలననే ఆంధ్రపురాణకవులలో నతఁ డొక మహాకవి।

# మహాపురాణము కాని మార్కండేయము

తిరుపతిలోని ప్రాచీనలిఖితపుస్తకభాండాగారమున ఎల్లకర నృసింహకవియు, పర్వతమంత్రి లింగనామాత్యుఁడును ద్విపదలో రచించిన రెండుమార్కండేయపురాణములు కలవు. మహాపురాణ మైన మార్కండేయమునకును వీనికిని సంబంధము లేదు. పురాణముల వలె నివి సర్గవర్ణనముతో నారంభ మగుచున్నను, పద్మసాలీల వంశోద్భవ వికాసక్రమ వర్ణనైకలక్షితములై, భృగుమార్కండేయభావనాఋషుల మహత్వచరిత్రల నత్యంతవిస్తారముగాఁ జెప్పుట కేర్పడియున్నవి. ఈకవులు మార్కండేయపురాణమును మార్కండేయమునిచరిత్ర మనియు, మార్కండేయుఁడు వంశకర్తగా వెలసిన మార్కండేయుల (పద్మసాలీల) వంశక్రమమును దెల్పు గ్రంథమనియుఁ దద్వంశము పురాణమూల మగుటచే తచ్చరిత్రము పురాణ మనఁ దగు ననియు భావించినట్లు కనఁబడుచున్నది. దీనికి సంస్కృతమూల మున్నట్లు నృసింహకవి చెప్పుకొనెను గాని అది యిప్పు డలభ్యము. లభించినను అది మహాపురాణము కాదని స్పష్టము. పురాణగౌరవ మర్థించి పురాణాఖ్య నుంచుకొనిన పురాణము ; పురాణము కాని పురాణము.

పైకవిద్వయములో నెల్లకర నృసింహకవి క్రీ. శ. 1511-1568 ప్రాంతమువాఁడని సాహిత్యచరిత్రకర్తలు భావించుచున్నారు. లింగనామాత్యునికాల మస్పష్టముగా నున్నది. అతఁ డాశ్వాసాంతగద్యలలో

''పండితారాధ్యశ్రీపాదాబ్జభృంగ - ఖండేందుధరభక్తి కామ్యాంతరంగ
శివకృపాంచితగాత్ర శ్రీవత్సగోత్ర - ప్రవిమల నిగమోక్తిభవ్యచారిత్ర
శైలజేశ్వరభృత్యజనభృత్యభృత్య - లీల పర్వతమంత్రి లింగనామాత్య"

అని చెప్పుకొనిన దానిని బట్టి పండితారాధ్యులు నివసించియున్న 12వ శతాబ్దికిఁ జెందినవాఁ డనుటకు వీలున్నను అతనికావ్యనిర్మాణపద్ధతి నృసింహకవికి తరువాతివానిగా నూహించుట కనువుగా నున్నది.

## ఎల్లకర నృసింహకవి మార్కండేయపురాణము :

నృసింహకవి మార్కండేయపురాణము తొమ్మిదాశ్వాసముల ద్విపదకావ్యము. కృష్ణయామాత్యసుతుఁడును, తిరుమల లక్ష్మణాచార్యశిష్యుఁడును, నగు నీకవి వైష్ణవుఁడు. కావ్యారంభమున శ్రీవిష్ణువును విస్తారముగా వర్ణించి దైవప్రార్థన మొనర్చెను. ఆపైనఁ గ్రమముగా లక్ష్మిని, శివుని, కాళిని, ధాతను, వాణిని, "లింగణసామిని," గీర్తించెను.

భోజ, వ్యాస, పరాశర, వామదేవాత్రికౌశికాదిబ్రహ్మర్షిరాజర్షులను, ప్రహ్లాదానంతహను మంతగాంగేయాక్రూరాది ఘనభాగవతులను, గురువగు లక్ష్మణాచార్యుని, స్మరించెను. కాళిదాసు, భీమకవి, రంగనాథుఁడు, నన్నయ, తిక్కన, సోమన, శ్రీనాథుఁడు, అయ్యల రాజు రామభద్రుఁడు, పెద్దన, తిమ్మన - మొదలగు ప్రాచీనకవులకు నమస్కరించెను.

ఇతని కావ్యావతారికలోని యీక్రిందిపంక్తులవలన నాతఁడు పద్మసాలీలప్రేరణచే నీకావ్యరచనము చేపట్టె ననియు, గీర్వాణమార్కండేయముయొక్క అర్థతాత్పర్య మేర్పడు నట్లు తెలుగున నిర్మింపఁబూనె ననియుఁ దెలియుచున్నది.

''సకలకావ్యకళాప్రశంస సంఘటిత - మకలంకముగను శబ్దార్థసంగతుల
ప్రకటవిద్వజ్జనప్రావీణ్యముగను - నొకప్రబంధము సేయ నూహించునెడను
శ్రీమల్లికార్జునశీలంబువారు - తామరసాక్షుని దయగలవారు
పట్టైనసిరులచేఁ బఱఁగు మోకాలి - పట్టవర్ధనులన న్బరగెడువారు
బహుతరగుణగణుల్ భండారువాండ్రు - బహుపుణ్యమూర్తులు భండారువాడ
విహితకులాచారవిఖ్యాతయశులు...కంటకులను వొంచి ఘనత వహించి
ఒంటికంభముమేడ యొనరసాధించి - పట్టైన ధర్మంబు పాలించి విభుని
నిట్టన సిరులచే నెగడెడువారు - హరికి నత్తిల్లన నమరినవారు...
భావనఋషివంశ (సం)భవులగువారు - వావిరిముల్లోకవాసుల కెల్ల
నెనరొప్ప పంచవన్నెలవస్త్రసమితి - నినచంద్రసాక్షిగా నిచ్చినవారు
కాలువసేనుని కదనరంగమున - నేలఁ గూల్చిన రణనిపుణు లన్వారు
ఆడితప్పనివారు నర్థికోటులకు - పోడిమి నొసగు సద్భూరివర్తనలు
నలరాజసంస్థాపనాచార్యబిరుదు- లలరుశేఖరులు నుద్యత్ప్రతాపకులు
పులివాహనంబు సొంపునఁ గాంచి మించి- బలియురై కంచిలోఁ బ్రబలినవారు
పద్మాక్షు వరశక్తి వడసినవారు- పద్మకటాక్షసంభరితు లౌ వారు
పద్మతంతువుచేతఁ బ్రబలి లోకముల- పద్మసాలాఖ్యు లనఁ బరగెడువారు
మమతతో నొకనాడు మమ్ము రావించి- కొమరు పీఠంబునఁ గూర్చుండ నునిచి
జనసమ్మతంబుగ సౌజన్య మెసగ- ఘనతరవస్త్రముల్ కట్టంబు మెసగి
వినయంబు లొప్ప నవ్విభు లిట్టు లనిరి- ననఘాత్మ యల్లకరాన్వయాంబోధి
పరిపూర్ణచంద్రశోభనగుణసాంద్ర-నరసింహకవివర్య న(గసమ) ధైర్య
లలిమీర తిరుమల లక్ష్మణాచార్యు- చెలఁగు పాదాంభోజసేవాధురీణ
ప్రచురవాక్యములచే భరతసావిత్రి- రచియించితివి కవిరాజు లౌ ననఁగ
విను మనఘాత్మ మావిన్నపం బొకటి-మనవి చెసెదము భూమండలమందు
ననుపమశబ్దశబ్దార్థసంగతుల- ఘను లెన్నఁ దగిన మార్కండేయమౌని
వరపురాణంబు గీర్వాణ మెవ్వరికి- తరము గా దిది యర్థతాత్పర్య మరయ
విను మిది కావున విహితశబ్దముల-పని బూని యిది యాంధ్రభాషను ద్విపద

గా రచియింప శృంగారమై యర్థ- పూరమై శబ్దసంపూర్ణ మై యమృత
సారమై కావ్యవిచారమై సిరుల- తోరమై దురితవిదూరమై కీర్తి
హారమై రుచులవిహారమై విన్న- వారికి చదివినవారికిఁ గన్న
వారికి బుధు లగువారికి నాడు- వారికిఁ దేటగా వాక్యోపమాన
చారుశబ్దపటుత్వ చాతుర్యధుర్య- మైన సాలంకారమై భువిం బఱగు
నని బహుత్వమువారు నతిసంభ్రమముల- బనివడ నను నొడం బరచి పంపుటయు''

పైవాక్యములవలన నాంధ్రభాషలో నిట్టి పురాణము సర్వజనసులభముగా ద్విపదలో మొదటిసారి నృసింహకవి రచింపఁ బూనె నని యూహించుటకు వీలగుచున్నది. అట్లైనచో నిట్టి మార్కండేయపురాణరచనమున కాద్యుఁ డతఁ డనియే గ్రహించుటకు విప్రతిపత్తి యుండదు. రచనాప్రణాళికను, రచనాభినివేశమును బట్టి చూచినను ఈయూహ సత్య మనిపించుచున్నది.

నృసింహకవి తిక్కనసోమయాజివలె నవతారికలో స్వప్నవృత్తాంతము నభివర్ణించెను. మార్కండేయపురాణరచనాకుతూహలుఁడై కవి యొకనాఁడు లక్ష్మీశునిఁ దలఁచి శయనింప స్వప్నమున నాదేవుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁ డాభగవంతుని స్తుతించెను. ఆదేవుఁ డతనితో నిట్లనెనఁట !..........." మనమున నన్ను ప్రేమను సన్నుతింప
తెలిసి నీపై దయాదృష్టి సంధిల్లఁ- జెలు వొప్ప విజయంబు సేయుట వలసె
నీవు మార్కండేయనిజపురాణంబు- గావించి శబ్దగుంభన సద్విహారి
......(గ్రంథపాతము)...............రుతరాంధ్రభాషాచమత్కార
కవితావిజృంభణ గాంభీర్యపదము- లవిరళముగఁ గూర్చినవి విశ్రమములు
నిలిపి పురాణంబు నిర్మించు నీకు- తలఁపు నెఱింగి గ్రంథము మదీయాంకి
............................——య్యముగఁ దెల్పఁగా వచ్చినట్టి
కొమరవోల్ నిలయుఁడ గురుబలాధికుఁడ- రమణీయ గోపాలరాయాహ్వయుఁడను
నని యానతిచ్చి మహామహుం డెలమి- చనిన మేల్కాంచి యాసామిని మదిని
నిజభక్తి సేవించి.........................ద్వార్థసిద్ధి వహింప
పని బూని పూర్వప్రబంధమార్గంబు- తెనుఁగున రచియింతు ద్విపదకావ్యమును ''

ఇట్లు - దైవముచే నడిగించుకొని కృతియిచ్చిన సుకృతి ఈకవి. నృసింహకవి కావ్యవస్తువు నిట్లు తొమ్మిదాశ్వాసములలో వినిర్మించెను -

(1) ప్రథమాశ్వాసము : ఇందు బ్రహ్మసృష్టి యైనవిధము వర్ణితము. నైమిశారణ్యమున శౌనకులు హరిసమర్పణముగా నొకయజ్ఞము చేయుచు నం దుత్తమ మైన గోష్ఠులను సల్పుచు సూతమహర్షిని గాంచి యిట్లనిరి :

'' వినవయ్య మునినాథ విన్నపం బొకటి- యనుపమశాస్త్రేతిహాసపురాణ
నిగమాంతవిహరిత నిజమహద్ఘటిత- భగవదనుభవపరంపర లెల్ల తేట
పరచగా వింటిమి ప్రకటితస్ఫూర్తి- గరిమఁ జెన్నొందు మార్కండేయమౌని

వరపురాణప్రభావైభవం బెల్ల - విరచింపు మమ్మని విభుచరితంబు
భృగువంశవిధ మెట్లు భృగు వెవ్వఁ డందు - తగ జనించెను వాని తండ్రి పేరేమి?
యతని పితామహు(ల) యంశాంశ మెల్ల - చతురాత్ములౌ వారి చారిత్రములును
విశ్వజన్మస్థితి విలయంబులకును - విశ్వాత్ముఁ డెవ్వఁడు విభజించె నెట్లు
వివరణ చేసి సవిస్తరంబుగను - వివరింపు మన మునివిభుఁ డిట్టు లనియె"

నని వ్యాసుఁ డంతకుఁ బూర్వము శుకమహర్షిచే తాను విన్నవిధముగా విశ్వప్రకార మంతము వివరించినవిధమును కవి చెప్పెను. ఇదియును మార్కండేయమున కనుకృతి కాదు. పెక్కంశము లాపురాణముతో నేకీభవించుట లేదు.

(2) ద్వితీయాశ్వాసము : దక్షుఁడు మొదలు మృకండుమునివఱకైన ఉత్పత్తి క్రమ మిందు వర్ణితము. ఇందును మార్కండేయమహాపురాణమునఁ జేర్పఁబడని యంశములు కొన్ని కలవు. ఉదాహరణమునకు -

(అ) " విను(డిక) సురలార (స)విస్తరంబుగను - వనరుహగర్భుని వలన మొదటను
అంగుష్ఠమున దక్షుఁ డజుని యూరువుల - క్రం గలరంగ నారదుఁ డుద్భవించె
నిర్ణయింపగ నాభినెలవున పులహు - కర్ణేంద్రియంబుల ఘన పులస్త్యుండు
త్వక్కున భృగువు హస్తంబున క్రతువు - నక్కమలజుమోము నాంగిరసుండు
ఘ్రాణేంద్రియంబులఁ గలిగె వసిష్ఠు - ప్రాణమనోవీథి ప్రబలె మరీచి
తనుకాంతివలన గర్దమప్రజాపతియుఁ - దనరు నత్రియు నేత్రంబుల రసన
మున వాణి గలిగె నిమ్ముల చతురాస్యు - ఘనుని ప్రజాసృష్టికారణంబునను."

ఇట్టి యుత్పత్తిక్రమము మార్కండేయమునఁ గానము. (చూడు. మారసమార్క. 4.57)

(ఆ) కర్దమప్రజాపతివృత్తాంతము మార్కండేయమున వివరింపఁబడి లేదు. నృసింహకవి కావ్యమున విపులముగఁ జెప్పఁబడినది. బ్రహ్మయనుమతిని కర్దమప్రజాపతి ప్రజాసృష్టి యొనర్పఁదలఁచి తపోవనమున కరిగి బ్రహ్మతపోవిధి సుగ్రముగ నుండ పరబ్రహ్మస్వరూపుఁ డైన విష్ణువు ప్రత్యక్షమై వరము వేడుకొను మనెను.

"వరమునీశ్వర! భవద్వాంఛితం బెల్ల - నెఱుఁగుదు మనమున నిదె వరం బిడెద
మను తనపుత్రికామణి నీ కొసంగు - ననఘాత్మ తొమ్మండ్రు అతివలు నీకు
గలిగెద రట మీఁద గపిలాఖ్య నేను - నలరి నీగర్భమం దవతరించెదను
కడపట నీకు నీకాంతకు మోక్ష - మిచ్చెద నమ్ముము సత్య మిది నిశ్చయంబు
చింతింపవల దని చెప్పి రమేశు - డంత తిరోహితుం డయ్యె నక్కడను - "

ఇట్టి కథావివరణముల నీకవి భాగవతాదులనుండి గ్రహించియుండవచ్చును.

(ఇ) భృగుమహర్షిమహత్త్వవర్ణనము నీకవి యభినివేశముతో వర్ణించెను. మార్కండేయమున నాతనిప్రవృత్తము వివరింపఁబడలేదు.

(3) తృతీయాశ్వాసము : ఇందు మృకండుఁడు మార్కండేయునిఁ గాంచుటయు, మార్కండేయుఁడు పరమేశ్వరప్రసాదమున చిరంజీవి యగుటయు వివరింపఁబడి యున్నది.

(4) చతుర్థాశ్వాసము : ఇందు మార్కండేయునిశేషజీవితచరిత్రము చెప్పఁబడినది.

"అనఘమార్కండేయ దటుతరుపాత-మనె నెన్నికల్పముల్ మహిమీద నతఁడు
ఏతపం బొనరించె నేదేవుఁ గొలిచె - నాతఁడు ప్రళయకాలాంతంబునందు
లోకసంఘంబు లలోక మైనపుడు - ఏక్రియఁ జరియించె నెచ్చోట నుండె
జలజసంభవునిద్ర శయన మేరీతి - విలయకాలం బిది విలసిల్లు టెట్లు ?"

అను శ్రోతలప్రశ్నలకు కథకుఁడు - మార్కండేయుఁడు దశసహస్రాబ్దములు ఘోరతప మొనర్చుట - తపోవిఘ్నార్థ మాతనిదరి కింద్రుఁడు రంభాదుల నంపుట - వారు విఫలలగుట - యోగాగ్ని లోకములను దహించుట-దేవతలు విష్ణువునకు మొఱపెట్టుకొనుట - ఆవిష్ణువు మార్కండేయునకుఁ బ్రత్యక్షమగుట-త్రికాలములయందును చలింపని విష్ణునామ చింతన మాతనికిఁ బ్రసాదించుట - మార్కండేయునితీర్థయాత్రలు - బదరికాశ్రమమున విడిపి యోగవిహారుఁడై యుండుట-ప్రళయము వచ్చుట - లోకములు జలమయ మగుట - విష్ణువు వటపత్రము నాశ్రయించి యుండుట-మార్కండేయుఁడు వటపత్రశాయిని దర్శించి కీర్తించుట-విష్ణునాసాపుటమునఁ బ్రవేశించి తద్గర్భస్థ అఖిలాండభాండమును దర్శించుట - పంచమహామౌనియు, భావనఋషియు జన్మించుట - మొదలగునంశము లీకథాభాగమున వర్ణితము లై యున్నవి.

(5) పంచమాశ్వాసమున : ఋషులు అస్ఖలితబ్రహ్మచారి యైన మార్కండేయునకు భావనాఋషి యెట్లు జన్మించె ననియు, అతఁడు ముల్లోకవాసులకు వస్త్రము లెట్లు కల్పించె ననియు ప్రశ్నించిరి. కథకుఁడు తత్తత్కథార్థములను వివరించి చెప్పెను.

పూర్వము దేవతలు రుద్రులు యక్షకిన్నరాదులు -

" ఘనతరమానముల్ గాచువస్త్రములు-దమకు లేమిఁ దలంచి తగినపత్రములు
తమతమంతటను ముదంబున దాల్చి - అరూఢి వర్తించి రట కొన్నినాళ్ల
చీరలు లేమికి చింతించి వారు - మానహీనులె యభిమానహీనులును
మానరక్షకు లభిమానరక్షకులు - గావున మానముల్ గావు మటంచు
దేవదేవుని వామదేవుఁ బ్రార్థించి - మనవర్తమానముల్ మదనారితోడ"

వినిపింపవలె నని విబుధులందఱు కూడి కైలాసమున కేగి దేవగణసహితుఁ డై యున్న శివునిఁ గాంచి -

" కులహీనమున కన్న గురుతరంబుగను-యిల వస్త్రహీనమే హీనంబునండ్రు
గౌరీశ సర్వశృంగారంబులన్ని-చీరెతోడివి గావె సిద్ధ మూహింప
మారున కైన కుమారునకైన - శౌరి కైనను నబ్జసంభవు కైన
జంభారికైన నిశాపతికైన - రంభాదియూర్వశీరమణులకైన
చీరె యలంకారశేఖరం బరయ - చీరెలు లేమిచేఁ జెలువంబుఁ గలదె
చీరెలు సొగసులు చీరెలె ఘనము-చీరెలె గాంభీర్యశేఖరం బెచట
మానరక్షణకన్న మర్యాద కలదె-నానావిధంబుల నాగకేయూర
దేవరమనమున దెలియని దొకటి-భావింపఁ గలదె శోభనగుణాఢ్యక్ష

గావున వస్త్రముల్ గలుగువిధంబు - భావమం దూహించు పార్వతీరమణ"
అని ప్రార్థింపగా నాదేవదేవుఁడు మార్కండేయమహర్షిని కొలువునకు రప్పించి, వస్త్రాలంకార సృష్టికై అతని నొక హోమము చేయు మని యానతిచ్చెను.

‘‘ భృగువంశపావన పృథ్వీసురేంద్ర :-తగవస్త్రనిర్మాణ తాత్పర్యమునకు
నొకట యుపాయంబు నొసఁగెద వేడ్క - నకలంకముగ చేయు మది యెట్టు లనిన
మరువక వేదోక్తమార్గ మూహించి - కరమర్థి హోమంబు గావింపు మీవు
కొమరొప్ప నాహోమగుండమధ్యమున- కమలాప్తతేజులు ఘనబాహుబలులు
వలనొప్ప ముల్లోకవాసుల మాన - ములు గాచి రక్షించు ముఖ్యవర్తనులు
భావజాకారులు పరమసాత్త్వికులు - నసఘసమ్మతులు మదంశసంభవులు
తనయులు ఇరువురు తగ జనించెదరు - నెన రొప్ప నటమీద నీకడగొట్టు
తనయందు హరిగూర్చి తపమాచరించి - శ్రీవల్లభునిదయచే వస్త్రసమితి
వేవేగఁ గల్పించి విబుధుల కొసఁగు - జని హోమ మొనరింపు సన్మునివర్య !''-

అను శివునానతిని గైకొని మార్కండేయర్షి యాగ మాచరించుటయు, భావనాఋషి వస్త్రములు కల్పించుటయు నిందు వర్ణింపఁబడినవి.

(6) షష్ఠాశ్వాసమున :

‘‘పరమపావన ! విను భా(వనఋషియు)- సరసిజాలయకు నిశ్చయముగా నతఁడు
తోబుట్టు వగు టెట్లు ? తోయధికన్య - యాబాహుబలు నింట......
లలిమీర లక్ష్మీవిలాసపట్టంబు- కలుముల జవరాలు గైకొను టెట్లు ?
వినవలె సర్వంబు నినిపింపు మనిన''-

కథకుఁడు వివరించిన కథాంశము లిందుఁగలవు.

చాక్షుష మన్వంతరమున క్షీరసాగరమథనము జరిగినది. అందు లక్ష్మి జనించినది. ఆమెను గాంచి యంద ఱాశ్చర్యపడిరి. సముద్రుఁడు భావనుని నిందిరాదేవికి దేదీప్యమానములగు దివ్యాంబరము లిమ్మని కోరెను. అతఁ డట్లే దివ్యాంబరములను, పసుపుకుంకుమలను పద్మాలయకు సమర్పించి యిట్లు ప్రార్థించెను.

‘‘కారుణ్యమున నన్ను కావుమో జనని - మనవి గైకొని నీవు మాయింట వెలసి,
యనురక్తి సిరులీను'' మని సన్నుతింప - కరముసంతోషించి కలుములనెలఁత
వరగుణాఢ్యునకు భావనునకు ననియె - భావనాహ్వాయ జగత్పావనచరిత
కోవిదస్తుత నిన్ను కొనియాడఁ దరమె - పత్రముల్ గట్టిన ప్రజలమానములు
మైత్రిమై బ్రోచిన మానరక్షకుఁడ - భావనమునివర్య, పావనచర్య
నీవంటి సద్గుణనిధి సహోదరుఁడు - గలడె లోకమునందు కారుణ్యమూర్తి
తలప చంద్రునిక్రియఁ దమ్ముఁడవు నీవు - మఱి సుగుణాత్మ తామరవైరికంటె

''నరలేని యనుజుగా నాత్మ గైగొంటి - ధర నెన్న మత్సహోదరుఁడు చంద్రుండు
నిరవొంద నీతోడ నిరువురై రిపుడు - నది యెట్టు లనిన నీకాన తిచ్చెదను
ముదితాత్మభావనమునివర్య వినుము - పద్మంబు మత్ప్రియభవనంబు గాన
పద్మాలయాఖ్యతఁ బరగితి నేను - నీవు తపంబున నీరజనాభు
వావిరి మెప్పించి వైకుంఠువలన - పద్మతంతువులు సంభ్రమమున బడసి
పద్మసాలాఖ్యతఁ బరగుటఁ జేసి - విదితంబు గాగ జగద్విఖ్యాతం బయ్యె
సదమలాత్మక ధరాచక్రంబునందు - గల తిరుపతులందు ఘనత వహించి
వెలయు మహోత్సవ విభవంబులందు - పొలుపొందు శ్రీలక్ష్మి పుట్టినిల్లనఁగఁ
జెలువొంది సుతులఁ బ్రసిద్ధి వహించి - నడిపింపు నడవళ్లు నరు లుత్సహింప
కడువేడ్క వడ్రాలు, కనకాంబరములు - పొంకమౌ పసుపును పునుఁగు జవ్వాజి
కుంకుమ విడియముల్ గురువైభవములు - మంగళసూత్రము మఱియు మట్టెలును
ముంగల నడిపించు ముదము రెట్టింప - మరి పాలకడలిని మరపించి మీరు
సిరికి పుట్టిల్లనఁ జెన్నొందవలయు - నది గారణమున మీయాడుబిడ్డనఁగ
విదితంబుగా జగద్విఖ్యతంబుగను - బరగెద మీయింట భావనవర్య
సరవితో నను గొల్వ సంపద లిత్తు'' నని కరుణించెను.

భావనుఁడు దేవతల కందఱకును దివ్యాంబరము లిచ్చుచుండ, నతఁ డెవ్వరికిని నుత్తమచేల మొకటియు సమర్పించుట లేదని తలఁచి భైరవుఁడు వస్త్రములకెల్ల నాదియైన వస్త్ర మిమ్మని కోరెను. అతఁడు ''వదలక నిర్మించు వలువల కెందు మొదలు బద్దియ కాదె మొనసి యూహింప" నని దాని నిచ్చెను. భైరవుఁ డందులకు కోపించి ''ఈవర నుండి నీవిచ్చువస్త్రములు ఘోరున షాణ్మాసపూరితం బగుట నవి ప్రాతచేలంబులై పోవు నంచు'' శపించెను. అందులకు ప్రతిగా భావనుఁడు భైరవుని దిగంబరుఁడై శూలధారియై తిరుగునట్లు శపించెను.

గజాననుఁడు తనపెండ్లినిగూర్చి తండ్రి నడిగెను. శివుఁడు ''నీపెండ్లి రేప''ని చెప్పి భావనాఋషియొద్ద నంబరాదులు తెచ్చుకొను మని యాదేశించెను. వినాయకుఁడు భావనుని యొద్దకు వెళ్లెను. విఘ్నదేవుని నాతఁడు భక్తితోఁ బూజించి, 'రేపు నీపెండ్లి కావున నంత వఱకు మాయింట నుండు' మని ప్రార్థించెను. ఆ'రేపు' ఎన్నాళ్లకును నేడు కాదయ్యెను. అది కారణముగా గజాననునిపెండ్లి రే పను లోకోక్తి వాడుకలోనికి వచ్చినది.

పైమూఁడు కథాంశములతో షష్ఠాశ్వాసము ముగిసినది.

(7) సప్తమాశ్వాసము : ఇందు భావనాముని సుతశతకము నెట్లు పొందెనో, అతని సుతాన్వయ మెట్టు లయ్యెనో వివరింపఁబడినది.

సూర్యునకు సంజ్ఞ, ఛాయ, బడబ -అను ముప్వురు భార్యలు కలరు. అందు బడబ యందు అశ్వినులును, భద్రావతి యను కన్యయుఁ బుట్టిరి. భద్రావతి యపూర్వసౌందర్య వతియు యౌవనవతియు నయ్యెను. ఒకనా డామె వనమున విహరించుచుండ నారదుఁ డేతెంచి, సత్యలోకమున బ్రహ్మ 'భద్రావతికి భర్త మార్కండేయసుతుఁ డైన భావనుఁ

దగు' నని తెల్పె నని చెప్పి అతనిరూపగుణగణాదులను కీర్తించి వెళ్లెను. ఆమె భావను నికై విరహబాధ నొందుచు తనభర్తతోఁ దనను గూర్చుటకై కాత్యాయనీదేవినిఁ బూజించు చుండెను. పార్వతియు నాజవరాలిని దయచూడు మని శివుని ప్రార్థించెను. పరమేశ్వ రుఁడు భావనునిఁ బిలిచి "మా కిదివరలో వసనముల నిచ్చితివి కాని మా కిప్పుడు వ్యాఘ్రచర్మము కావలెఁ దె"మ్మని యాజ్ఞాపించెను. భావనుఁడు శరాసనములు గ్రహించి వేటకు వెళ్లెను. బ్రహ్మాండమంతయుఁ దిరిగెను గాని శివమహిమవలన నాతని కొకవ్యాఘ్రము కూడ కానరాదయ్యెను. అతఁడు విసిగివేసారి యుండ నారదుఁ డతనికిఁ బొడకట్టెను. అతఁ డా మౌనిని బూజించి శార్దూలములు కానరామికి కారణ మడిగెను. భద్రావతి వృత్తాంతము చెప్పి, మేరుపర్వతసిద్ధాశ్రమ ప్రాంతమున నున్న కీకారణ్యప్రాంతమునకు వెళ్ళినచోఁ గార్యఫల మగు నని బోధించెను.

(8) అష్టమాశ్వాసమున ఈక్రిందికథ కలదు : అట్లు నారదునిచే నుప దిష్టుఁడై భావనుఁడు మేరువు నెక్కి తద్ద్వైభవమున కచెర్చు వంది పూర్వదిగ్భాగమున నదియందు స్నాన మాచరించి యుండ, భద్రావతి చెలులతోఁ గూడి యచ్చటకు వచ్చి యతనిని గాంచి, మున్ను నారదునిచే నిర్దేశింపఁబడిన వాఁ డతఁ డని అతని నడిగి తెలిసికొని, తండ్రియొద్ద కేగి తన నిశ్చయము తెల్పెను. సూర్యుఁ డతనిని బిలిపించెను. అతఁడు శివునికై వ్యాఘ్రచర్మము గైకొనుటకు వచ్చితినని చెప్పెను. సూర్యుఁడు తాపసు లకు హింస కూడదుకదా! యని ప్రశ్నింప నది దేవదేవుని యానతి కాని తనయిచ్ఛా ప్రేరితమైన హింస కా దని యుచితముగా సమాధానము చెప్పెను. సూర్యుఁ డందుల కలరి తనకూతుఁ బెండ్లాడ కోరెను. భావనామునియుఁ దనకు పూర్వ మట్లే విష్ణువు నిర్దేశించి యుండెనని చెప్పి, వివాహమున కంగీకరించి, ముందు శివునానతి చెల్లవలె నని తన రత్నాంగుళీయకము భామకుఁ దొడిగి ఆమె నోదార్చి, సూర్యునికి నమస్కరించి నిలచెను. అంతలో బడబ అల్లునిఁ బిలిచి కవచశంఖకిరీటాది వివిధాస్త్రముల నిచ్చెను.

నారదుఁడు కాలువసేనునిఁ బ్రేరేచి యతనిపై యుద్ధమునకుఁ బంపెను. భావనుఁడు విశ్వామిత్రునినుండి పొందిన తనుత్రాణంబు తొడిగి కవదొనలు మూపున దాల్చి మహా యుద్ధము చేసెను. (ఇచ్చట గ్రంథపాతము కలదు).

(9) నవమాశ్వాసమున : భద్రావతీభావనుల వివాహము మూఁడురోజు లతి వైభవముగా జరిగెను. అతనివలన పద్మసాలీలవంశ మత్యంతవిస్తార మొందెను. వారంద ఱును శాస్త్రాదిపాండిత్యగరిమను సాధించియు, భావనాఋషివలన వస్త్రనిర్మాణవృత్తి గైకొని శ్రీహరిస్మరణ గావించి, ప్రత్తిగింజలు భూమికి తెచ్చి దానిదారములతో పంచ వన్నె వస్త్రములు నిర్మించిరి. సూర్యు నానతితో నాశ్వినులు తమతనయలను భావనాముని సుతుల కిచ్చి పెండ్లిచేసిరి.

కావ్యము భావనాఋషి మంగళహారతితో శుభాంత మగుచున్నది.

**పర్వతమంత్రి లింగనామాత్యుని మార్కండేయము :**

పర్వతమంత్రి లింగనామాత్యకృత మైన మార్కండేయపురాణము ఎనిమిదాశ్వాసముల ద్విపదకావ్యము. గార్గేయముని వాలఖిల్యాదులకు కథ చెప్పిన ట్లందు కలదు. ప్రథమాశ్వాసమున వటపత్రశాయి యైన విష్ణుదేవుని యుదరపద్మమునుండి బ్రహ్మ యుదయించుటయు, పుండరీకాక్షుఁడు మధుకైటభుల సంహరించుటయు, అజుఁడు పరమేశ్వరాజ్ఞచే సృష్టికార్యము నిర్వహించుటయు, మనూత్పత్తియు, కాలవిభాగవర్ణనమును, చాతుర్వర్ణ్యసృష్టి మొదలైన యంశములు వర్ణింపఁబడుటతోపాటు మృకండమునికి మార్కండేయుఁడు బ్రహ్మప్రసాదమునఁ గలుగుట మొదలుకొని భావనాఋషి శివప్రసాదమున పంచవన్నెలవస్త్రములను నిర్మించునేర్పు గడించునంతవఱకు కథ చెప్పఁబడియున్నది. ద్వితీయాశ్వాసమున సురలెల్లరు వస్త్రములు కట్టియుండ నీలకంఠుఁడు వ్యాఘ్రచర్మమును ధరించుటకుఁ గల కారణమును వివరించుకథ చెప్పఁబడినది. తృతీయాశ్వాసమున భానుకన్య యైన భద్రావతికిని భావనాఋషికిని నైన వివాహవృత్తాంత మభివర్ణిత మైనది. చతుర్థాశ్వాసమున భావనాఋషి కాళవసేనుని సంహరించినవిధమును, పంచమాశ్వాసమున నతఁడు తనవంశజులకు ప్రతిదారములతో వస్త్రములు నేయుట నిర్దేశించినకథయు, అటకర మరణవృత్తాంతమును, షష్ఠాశ్వాసమున కృష్ణకంధరుని యేపు మాసిన కథయు, సప్తమాశ్వాసమున వేగీశుని సంహరించినకథయు, అష్టమాశ్వాసమున నీశ్వరుఁడు మార్కండేయమునికి మరణము లేకుండ నిచ్చిన వర వృత్తాంతమును వివరింపఁబడియున్నవి.

ఈ కావ్యమున కవి శివమహత్త్వప్రతిపాదన మభినివేశముతో నిర్వహించెను. మార్కండేయునివంశక్రమము నీక్రిందివిధముగఁ జెప్పెను. అది విష్ణుకుమారుఁడు ⟶ రఘుమహాముని ⟶ అతనిపుత్త్రుఁడు భృగుమహాముని ⟶ అతనిసుతుఁడు భృగుంటిమహాముని ⟶ అతనితనూజుఁడు మార్కండేయమహాముని ⟶ అతనికుమాళ్లు పంచమహాముని భావనాఋషి - భావనతనూభవుఁడు ఆత్రేయమహాముని, అతనికుమారుఁడు భానుఁడు - అతనిసంతతి పద్మసాలీలు.

**పోచిరాజు వీరనామాత్యుని భావనాఋషిమాహాత్మ్యము :**

పద్మసాలీలవంశచరిత్ర మైన మార్కండేయపురాణమునందలి సర్గప్రతిసర్గాది లక్షణవిశిష్ట మైన సృష్టివర్ణనము గ్రహింపక మార్కండేయమునిచరిత్రము నెత్తుకొని భద్రావతీకల్యాణమువఱకు గలకథను ప్రత్యేకప్రబంధముగా నిర్మించి, అందు భావనాఋషి చరిత్రమునకు విస్తృతి కల్పించి తన్మాహాత్మ్య మను పేర చంపూకావ్యముగా నిర్మించినవాఁడు పోచిరాజు వీరనామాత్యుఁడు. ఇతఁడు క్రీ.శ.17వ శతాబ్దికిఁ జెందినవాఁడని విమర్శకులు భావించుచున్నారు. తన వంశమునుగూర్చియు, తనకృతినిగూర్చియు కావ్యావతారికలో నిట్లు చెప్పుకొనెను:

సీ. శాండిల్యగోత్రసంజాతుఁ డాబ స్తంబసూత్రుండు పరమపవిత్రుఁ డవని
పోచిరాజాన్వయోద్భూతుఁడు భద్రమంత్రీశుఁ డాతనిపత్ని యెల్లమాంబ
యాదంపతులకు వీరాహ్వయుం డుదయించె నమ్మేటిసతి కొండమాంబ యలరె
వారి కార్వురుసుతుల్ వీరభద్రన భద్రనాఖ్యులు గల్గి రందగ్రజుండు
గీ. వీరభద్రుండు తనభార్య విమలచర్య
మూర్తిమాంబ గుణాలంబ ముదమునొందె
నమ్మహాత్ముల కే నుద్భవము జెంది
యిది రచించితి వీరకవీంద్రుఁ డనఁగ.

క. అభవప్రసాదకరుణా
విభవమ్మున తెనుఁగు గాఁగ విరచించితి సౌ
రభయుక్తి పంచకావ్యము
లుభయకవీశ్వరులు మెచ్చ నుచితస్ఫూర్తిన్.

క. వ్యాసప్రోక్తము నయ్యతి
భాసుర మగు భావనర్షి పరమమహత్వం
బాసంస్కృతంబు తెనుఁగున
జేసెద పద్యప్రబన్ధశ్రేష్ఠాకలితున్.''

ఈకవి తనకృతికి మూలమగు గ్రంథము సంస్కృతమున వ్యాసప్రోక్త మని చెప్పి యున్నాఁడు. అది పైమార్కండేయపురాణకర్తలు చెప్పుకొనిన పురాణమూల మని భావించుటలో సంశయము లేదు. అది ఇప్పటి మహాపురాణము కాదనుటలో విప్రతి పత్తియు లేదు.

దేశిచ్ఛందములందు పురాణనిర్మాణము చేయుపద్ధతిని ప్రవేశపెట్టిన సోమనాథా దుల ననుసరించి పైమార్కండేయపురాణకర్తలు ద్విపదలో తమకృతులను పురాణ మను పేర నిర్మింప విడవర్తి సోమనాదులవలె దేశిపురాణములను చంపూబద్ధ మొనర్చు పద్ధతి ననుసరించి వీరనామాత్యుఁ డీభావనాఋషిమాహాత్మ్యము నిర్మించినట్లు కానఁబడు చున్నది. ఇం దాశ్వాసములు మూఁడు. మొదటియాశ్వాసమున మృగశృంగజననమాది మృకండుతనయచిరాయుఃప్రాప్త్యంతముగఁ గల్గు వృత్తాంతమును, ద్వితీయాశ్వాసమునను తృతీయాశ్వాసమునను భద్రావతీభావనర్షులవృత్తాంతమును, నిశాటకులహరణకథయు వివరింపఁబడియున్నవి. ఇది ముద్రితమైనది.

పైకృతులలో నెల్లకర నృసింహకవి కృత మార్కండేయపురాణము పద్మశాలీ వంశకథాసర్వస్వమువలె విస్తారమై విలసిల్లియున్నది. అతఁడు సృష్టివృత్తాంతమునకును, వంశవిస్తారవర్ణనమునకును, మార్కండేయఋషిమాహాత్మ్యమునకును, వస్త్రకల్పనసంబ ధులగు కథాకల్పనలకును, భావనాఋషిచరిత్రమునకును సమప్రాధాన్యము నిచ్చి పరమౌ చిత్యమును పాటించెను. అతనికావ్యసమగ్రత మఱియొక్కదానికి లేదు. కాగా, లింగవా

మాత్యుఁడు పైపురాణాంశములలోని సృష్టివర్ణనమును పురాణనామసార్థక్యముకొఱకు నిర్వహించినను, భావనాఋషిచరిత్రమును విస్తరించి రచించి భావిభావనాఋషి మాహాత్మ్య కర్తలకు దారి చూపినాఁడు. వీరనామాత్యుఁడు తనకావ్యమున ''నాయొనర్పంబూనిన మార్కండేయోపాఖ్యానంబునకు కథాక్రమం బెట్టి దనిన'' అనియు, ఆశ్వాసాంతగద్య లందు "మార్కండేయమహాపురాణమునందు ... ఆశ్వాసము" అనియు చెప్పుకొనియు భావనాఋషిమాహాత్మ్య మనుపేర దానిని వెలయించెను. ఇతనికాలమునాటికి పురాణ చిహ్న మైన సృష్టివిద్యావర్ణనము వెనుకపడుటయేకాక ఉపాఖ్యానము - మహాపురాణము - మాహాత్మ్యము - అనుమాటలలోని భేదముకూడ పాటింపఁబడక పోయినది. మొత్తము నకు ఒక కులముయొక్క చరిత్రము పురాణమై, వంశకర్తలచరిత్రమై, వంశోద్ధారకుని మాహాత్మ్యమై పరిణమించిన దీపురాణము.

మార్కండేయమహర్షి చరిత్రతో ముడివడియున్న పై పురాణమునకు నారదీయ పురాణము మార్కండేమహాపురాణాంశముగాఁ జెప్పిన "మార్కండేయస్యచరితమ్'' మూలమై యుండవచ్చునా ? యని భావించుట కవకాశము లేకపోలేదు. ప్రస్తుతము లభించుచున్న మార్కండేయము మహాపురాణపూర్వభాగ మను వాద మొండు గలదనియు గమనించియుంటిమి. ఖిల మైన ఉత్తరభాగమునఁ జట్టచివరి యంశముగా నామహర్షి చరిత్ర ముండియుండవలెను. నారదీయము మార్కండేయమహర్షిచరిత్ర మని మాత్రమే పేర్కొనినది కాని భావనాఋషిచరిత్రమును, పద్మసాలీలయుత్పత్తిక్రమమును మార్కండేయమహాపురాణము విషయానుక్రమణికలోఁ జేర్చి చెప్పలేదు. కావున సంస్కృత మార్కండేయము వీనికి మూల మనుటకు బలము చాలకున్నది. దానికిఁదోడు సర్గాది వర్ణనానంతరము మార్కండేయచరిత్రము చెప్పఁబడియుండుట ఈద్విపద పురాణముల ప్రత్యేకత ! మహాపురాణమునందలి వస్తువునకును వీనికిని తదంశమునందు సామ్యము కానవచ్చుటలేదు. వస్త్రకారకులజులు బ్రహ్మవంశసంజాతు లనియు, మార్కండేయు లనియు పిలువఁబడుటలోని ప్రాచీనత్వమును ప్రతిష్ఠాపించుటకు వెలువడిన ఏనవీన పురాణమో ఈద్విపదకావ్యములకు మూలమై యుండవచ్చు నని యూహించుట కవకాశము కలుగుచున్నది !

**వీక్షారణ్యమాహాత్మ్యము :**

మార్కండేయపురాణము తనకు మూల మని చెప్పుకొని వెలసిన మఱియొక కావ్యము వీక్షారణ్యమాహాత్మ్యము. ఇది తిరుపతిలోని ప్రాచీనలిఖితపుస్తకగ్రంథభాండా రమునందు (R. 301 నం.) కలదు. ఈకావ్యకర్త శిష్టు కృష్ణమూర్తి. ఈతనితండ్రి సర్వశాస్త్రి. ఈమాహాత్మ్యము గోదావరీమండలాధికారిగా నుండిన సూరతుళసింగసెట్టి కంకిత మీయఁబడినది. కృతిపతి తాత కృష్ణమసెట్టి. గంగమవీరాసామిసెట్టు లీతని తల్లిదండ్రులు.

క. ''క్షమ మార్కండేయపురా
ణమునం గల కథలలో జనస్తుత మత్యు

త్రమ మగు వీక్షారణ్యమ
హిమఁ దెనుఁగునఁ గృతి యొనర్చి యిమ్మది మాకున్."

అను కృతిపతికోరికపై కవి కృతిని రచించిన ట్లవతారిక చెప్పుచున్నది. వైపర్యమున మార్కండేయపురాణోక్తకథలలో జనస్తుత మత్యుత్తమము నైనది వీక్షారణ్యమహిమ యని చెప్పఁబడియున్నది. కాని, మనకు లభించుచున్న మార్కండేయమహాపురాణమున నీయరణ్యమహాత్మ్యము కానరాదు! నారదీయపురాణోక్త విషయానుక్రమణికయందును నీకథ యున్నట్లు చెప్పఁబడలేదు. ఇప్పటికి మనకుఁ దెలియుచున్నంతవఱకు - ఈకథకు మార్కండేయమహాపురాణము మూల మనుట పొసగకున్నది.

కురువంశసంజాతుఁ డైన సహస్రానీకజనపతికి మార్కండేయమహర్షి - మున్ను బదరికావనమున శాలిహోత్రుఁ డను ముని దేవభాగున కెఱింగించిన విధముగా - వీక్షారణ్యమాహాత్మ్యమును జెప్పిన ట్లీకావ్యమున వర్ణింపఁబడియున్నది. అగస్త్యాశ్రమమున హృత్తాపనాశన మను సరోవరమును, పుణ్యావర్త మను క్షేత్రమును, శేషతల్పశాయి యగు దేవుఁడును, విజయవాటి విమానమున వీరరాఘవదేవుఁడును ప్రసిద్ధులు. వనజనాభుం డెప్పుడుం దనలోనఁ దప్పక వీక్ష్యమాణుం డగుటచే నగస్త్యాశ్రమమందలి క్షీరవహానదీ ప్రాంతమున నున్న యీయరణ్యము వీక్షారణ్య మనఁబడిన దని కవి నామసార్థక్యమును నిరూపించినాఁడు.

ఈకావ్యప్రథమాశ్వాసమున వీక్షారణ్యనిరూపణమును, వర్ణనమును, వీక్షారణ్యమాహాత్మ్యమును వర్ణింపఁబడినవి. ఇందు హరిమధుకైటభసంహార మొనర్చి శాలిహోత్రుని యాశ్రమమున శయనించుటయు, శాలిహోత్రుఁడు విష్ణువును సేవించుటయు, నద్దేవుఁ డాతనిని యమదూతలనుండి రక్షించుటయు, తత్క్షేత్రవాసులకు శాశ్వతమోక్షప్రాప్తి యగునట్లు వర మనుగ్రహించుటయు, దుర్దముఁ డను దైతేయుని దుష్టచేష్టల నణచుటయు నను కథార్థములు చెప్పఁబడియున్నవి. ద్వితీయాశ్వాసమున కల్యాణపురప్రభు వైన ధర్మసేనుని పుత్త్రిక వసుమతి యనుకన్యను హరి వలచి వివాహమాడిన వృత్తాంతము కలదు. ఇది ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానమునందలి మణిమాలావృత్తాంతమువంటిది. హృత్తాపనాశనసరోవరమహిమను ప్రతిపాదించు కౌశికోపాఖ్యానము నిందుఁ జెప్పఁబడినది. కౌశికుఁ డొక బ్రాహ్మణుఁడు. అతఁడు తీర్థయాత్రార్థియై దండకారణ్యమున కేఁగి భీతుఁడై యొకవృక్షాగ్రమున వసించి, యొక చండాలునిచే రక్షింపఁబడి, అతని యిల్లు సేర్చి, చండాలపుత్త్రికను వలచి, పెండ్లాడి, భార్యతోఁ గలసి హృత్తాపనాశనతీర్థమునఁ గ్రుంకు అనంతరమున మోక్షము పొందె నను కథ యీయుపాఖ్యానమునఁ గలదు. క్షేత్రమాహాత్మ్యప్రతిపాదకముగా నిందు దక్షాధ్వరధ్వంసవృత్తాంతముకూడ చెప్పఁబడినది. ఇట్లీ ద్వితీయాశ్వాసమంతయు దేవతీర్థక్షేత్రమాహాత్మ్యాభివర్ణనాత్మకము లగు కథాత్రయముతో కళకళలాడుచున్నది. తృతీయాశ్వాసమున జగత్సృష్టికథావర్ణనమును, అంబరీషోపాఖ్యానమును, విమలవిజ్ఞానప్రబోధమును, వీక్షారణ్య, పుణ్యావర్త, హృత్తాపనాశన మహత్వ

ములును, శాలిహోత్రునిజన్మవృత్తాంతమును, తన్మహిమయు, నతఁడు ముక్తిఁబొందిన విధమును వర్ణింపఁబడియున్నవి.

పీఠారణ్యమాహాత్మ్యము మార్కండేయమున లేకున్నను ఈకావ్యమునందలి ప్రథమసృష్టివర్ణనముపై మహాపురాణప్రభావము కానవచ్చుచున్నది. మారన. మార్క. 4.8 వచనములతో నీకవి రచించిన ఈక్రిందిగద్యను పోల్చిచూచినచో నాయంశము స్పష్టము కాఁగలదు. ఇంతకు తప్ప మార్కండేయ మీకావ్యమునకు మూల మనుట కెట్టియాధారము కానరాదు.

వ. "......జగత్కారణంబై యకారణుం డగు నప్పుండరీకాక్షుండు నిరంజనుండై యుండియు లీలాపరుండై మూలప్రకృతిం గలసి కలంచుటయు, దానివలన మహత్త్వంబు జనించె నమ్మహత్తువలన నహంకారం బుదయించె నది వైకారికంబునుం దైజసంబునుం దామసంబును నన త్రివిధంబయ్యె నందు సాత్త్వికం బగు వైకారికంబువలన దిగాది దేవతాకంబు లగు శ్రోత్రేంద్రియంబు లయ్యె శ్రోత్రనేత్రత్వ ఘ్రాణరసనవాక్పాణిపాదపాయూపస్థంబు లగు విషయంబులు శబ్దరూపస్పర్శగంధ రసనవచనాదానగమనానందవిసర్గంబుల యింద్రియంబులకు మనస్సాహాయకం బొనర్చుట నైసర్గికం బమ్మనంబు పదునొకండవయింద్రియం బని సమ్మునిజనంబు వచియించుం దామసాహంకారంబువలన గంధరసరూపవస్పర్శశబ్దగుణంబు లగు పృథివీజలతేజోవాయునభంబు లను పంచభూతంబులు గలిగెం దైజసాహంకారం బీవైకారిక తామసాహంకారంబులకు సహాయకం బొనర్చు నిట్టిప్రాకృతంబులం జతుర్విధభూతసృష్టి యయ్యె......"

సృష్టివర్ణనావసరమునం దిట్టిసామ్యము సామాన్యముగాఁ బురాణములమధ్య కానఁబడుచుండును. అట్టివర్ణనము చేయు నీకావ్య మీసృష్టివర్ణనమున మార్కండేయమునే ముమ్మూర్తుల ననుసరింపక పంచేంద్రియ, పంచభూతసృష్టిని తత్సామ్యము తేటఁబడ రచించినది. ఒకకావ్యమునకు స్పష్టముగ మూల మనుట కీయాధారము చాలకున్నను తత్ప్రభావము కొంత యున్నదనుటలో విప్రతిపత్తి కానరాదు!

ఇట్లు మహాపురాణము గాని మార్కండేయపురాణము, తజ్జన్యములైన కావ్యసముదాయములు లోకమున వెలసియున్నవి! వానిని వేఱుపఱచి వివేకించుటయే యీవ్యాస తాత్పర్యము.

# ఉపసంహృతి

అష్టాదశమహాపురాణములలో సప్తమ మైన సంస్కృతమార్కండేయమహాపురాణము మహాభారతకథాపర్యాలోచనాత్మకమై ప్రభవిల్లి, మనుసంభవకథావిస్తారమై యొప్పుచున్నది. దానిని మారనమహాకవి ప్రథమాంధ్రమహాపురాణ మని ప్రసిద్ధివడయునట్లనువదించెను. తిక్కనశిష్యుఁ డైన మారన ధర్మనీతిప్రధాన మైన పురాణరచనమునందును అపూర్వకావ్యకళాశిల్పములను వెలయించి తనప్రత్యేకతను చాటుకొనెను. ఆఖ్యానకథనమునందును, ఛందఃప్రయోగమునందును, అలంకారరసపోషణమునందును, రసోచితశైలీసౌభాగ్యమునందును మారన చూపిన వైశిష్ట్యము కడుప్రశంసనీయము. ప్రథమాంధ్రమహాపురాణకర్తయగు మారన తనపురాణశైలీ రచనాసామర్థ్యముచే మహాకవిశబ్దవాచ్యుఁడగుచున్నాఁడు బసవపురాణమువంటి దేశిపురాణములకుఁ బ్రతిగా మార్కండేయమును రచించి మహాపురాణవాఙ్మయము నాంధ్రమున ననువదింప నారంభించి, వేదతాత్పర్యమును వెల్లడించి, తిక్కన జ్ఞానభక్తిమార్గమునకు వ్యాప్తి గల్పించి, గురువునకుఁ దగిన శిష్యుఁడనిపించుకొనినవాఁడు మారన మహాకవి !

మార్కండేయపురాణము రసవత్తరకథాసుధాంబుధి. అందలి కథారత్నములను గ్రహించి పలువురుకవులు తమకావ్యవస్తువుల నలంకరించుకొనిరి. తెలుఁగుకావ్యములకు మూల మైన మార్కండేయమహాపురాణముయొక్క సాహిత్యమూర్తిని భావించి, నిరూపించిన ప్రయత్న మీసిద్ధాంతవ్యాసము.

పురాణములు ధర్మనీతిప్రధానము లయ్యు తెలుఁగుకవుల ప్రతిభాసామర్థ్యములచే రసబంధురములై వెలసినవి. అట్టి పురాణరచనామార్గమున కాద్యుఁడు మారన ! అతని మహోదాత్తకావ్యశిల్పాకృతికి ఈకృతి యొక సాహిత్యనీరాజనము !

ఓమ్ తత్సత్.

# ప్రసక్తగ్రంథసూచిక

**సంస్కృతగ్రంథములు :**


1. అగ్నిమహాపురాణము.
2. అథర్వవేదము.
3. అమరకోశము - అమరుఁడు.
4. అర్థశాస్త్రము - కౌటిల్యుఁడు.
5. అలంకారశేఖరము-కేశవమిశ్రుఁడు.
6. కావ్యమీమాంస - రాజశేఖరుఁడు.
7. కావ్యాదర్శము - దండి.
8. కావ్యాలంకారసూత్రవృత్తి - వామనుఁడు.
9. కూర్మమహాపురాణము.
10. గురుబాలప్రబోధిక.
11. ఛాందోగ్యోపనిషత్తు.
12. తంత్రవార్తికము.
13. తైత్తిరీయబ్రాహ్మణము.
14. దేవీభాగవతము.
15. దేవీభాగవతము - నీలకంఠకృత తిలకవ్యాఖ్య.
16. ధ్వన్యాలోకము-ఆనందవర్ధనుఁడు.
17. నాట్యశాస్త్రము - భరతమహర్షి.
18. నాట్యశాస్త్రము - అభినవభారతీ వ్యాఖ్య - అభినవగుప్తుఁడు.
19. నారదీయమహాపురాణము.
20. పద్మమహాపురాణము.
21. బ్రహ్మమహాపురాణము.
22. బ్రహ్మవైవర్తమహాపురాణము.
23. బ్రహ్మాండమహాపురాణము.
24. భవిష్యన్మహాపురాణము.
25. భాగవతమహాపురాణము.
26. మత్స్యమహాపురాణము.
27. మనుస్మృతి - శ్రీ కుల్లూకభట్టవిరచిత మన్వర్థముక్తావళీ వ్యాఖ్యానసహితము.
28. మార్కండేయ మహాపురాణము (మదరాసు, బొంబాయి, కలకత్తా ప్రతులు).
29. మీమాంసాపరిభాష-కృష్ణయజ్వ.
30. యాజ్ఞవల్క్యస్మృతి.
31. యాస్కనిరుక్తము.
32. వరాహమహాపురాణము.
33. వాచస్పత్యము.
34. విష్ణుమహాపురాణము.
35. వాయుమహాపురాణము.
36. శతపథబ్రాహ్మణము.
37. శబ్దకల్పద్రుమము.
38. శివపురాణము.
39. సంస్కృతమహాభారతము-వ్యాసమహర్షి.
40. సరస్వతీకంఠాభరణము - భోజుఁడు
41. సాహిత్యదర్పణము - విశ్వనాథుఁడు
42. సాహిత్యసారము - అచ్యుతరాయలు
43. సౌరపురాణము.
44. స్కాందపురాణము - కేదారప్రభాస ఖండములు.

**ఆంధ్రగ్రంథములు :**

1. అల్లసానివాని అల్లిక జిగిబిగి - కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.
2. అష్టాదశపురాణసారము - శ్రీ వేమూరి జగన్నాథశర్మగారు.
3. ఆంధ్రకవితరంగిణి సంపు. 3, 4, 9, 10, 11 - శ్రీ చాగంటి శేషయ్యగారు.
4. ఆంధ్రకవులచరిత్ర - కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు.
5. ఆంధ్రధ్వన్యాలోకము - శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు.
6. ఆంధ్రమహాభారతము - కవిత్రయము.
7. ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము - శ్రీ శిష్ట్లా రామకృష్ణశర్మగారు.
8. ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము - శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు.
9. ఉత్తరహరివంశము - నాచన సోముఁడు.
10. ఉత్తరహరిశ్చంద్రచరిత్ర (ద్విపద) - చంద్రశేఖరకవి.
11. ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము - తక్కెళ్లపాటి లింగనమంత్రి.
12. కాకతీయసంచిక - సంపా. డా. మారేమండ రామారావుగారు.
13. కావ్యాలంకారసంగ్రహము - (వ్యాఖ్యాకర్త) శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు.
14. కాశీఖండము - శ్రీనాథుఁడు.
15. కుమారసంభవము - నన్నెచోడుఁడు.
16. కువలయాశ్వచరిత్ర - నవరము చిననారాయణకవి.
17. ఆంధ్రమహాభారతము ఛందఃశిల్పము - డా. పాటిబండ మాధవశర్మగారు.
18. తెలుఁగువిజ్ఞానసర్వస్వము - సంస్కృతి, విశ్వసాహితి - సంపుటములు.
19. దశకుమారచరిత్ర - కేతన.
20. నన్నయభారతము - డా. దివాకర్ల వేంకటావధానిగారు.
21. నాట్యశాస్త్రము - డా. పోణంగి శ్రీరామ అప్పారావుగారు.
22. నృసింహపురాణము - ఎఱ్ఱాప్రెగ్గడ.
23. పదునాఱవశతాబ్ది ప్రబంధవాఙ్మయవికాసము - డా. పల్లా దుర్గయ్యగారు.
24. పురాణములు - శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు.
25. పూర్వహరిశ్చంద్రచరిత్ర - తిరుపతి వేంకట కవులు.
26. పెద్దనలో ప్రతిబింబించిన మారన (రేడియో ప్రసంగము)-డా. పల్లా దుర్గయ్యగారు.
27. బసవపురాణము - పిడపర్తి సోమనాథుఁడు.
28. భావనాఋషిమాహాత్మ్యము - పోచిరాజు వీరనామాత్యుఁడు.
29. భారతి - సాహిత్యమాసపత్రిక - సంపుటములు.
30. మదాలసాపరిణయము - అల్లమరాజు రామకృష్ణకవి.
31. మదాలసావిలాసము - శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.
32. మనుచరిత్ర - అల్లసాని పెద్దన.

33. మరుత్తరాట్చరిత్ర - శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు
34. మార్కండేయపురాణము - మారనమహాకవి.
35. మార్కండేయపురాణము - మండ కామేశ్వరకవి.
36. మార్కండేయపురాణము (ద్విపద) - ఎల్లకర నృసింహకవి.
37. మార్కండేయపురాణము (ద్విపద) - పర్వతమంత్రి లింగనామాత్యుఁడు.
38. మార్కండేయపురాణము (వచనము) - శ్రీ క.వేం.సు. దీక్షితులుగారు.
39. మార్కండేయపురాణసారసంగ్రహము - తిమ్మరాజు లక్ష్మణార్యుఁడు.
40. మార్కండేయపురాణేతిహాసమంజరి - శ్రీ నోరి గురులింగశాస్త్రి.
41. విజయనగరసామ్రాజ్యమునందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము - 2వ భాగము - శ్రీ టేకుమళ్ల అచ్యుతరావుగారు.
42. పీఠారణ్యమాహాత్మ్యము - శిష్టు కృష్ణమూర్తికవి.
43. వీరరసము - డా. జి. వి. సుబ్రహ్మణ్యం.
44: రుక్మాంగదచరిత్రము - ప్రౌఢకవి మల్లన.
45. షట్చక్రవర్తిచరిత్రము - కామినేని మల్లారెడ్డి.
46. సంస్కృతవాఙ్మయచరిత్ర - లౌకికవాఙ్మయము - శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు.
47. సమగ్ర ఆంధ్ర సాహిత్యం - ఆరుద్ర. సం. 2
48. హరివంశము - ఎఱ్ఱాప్రెగ్గడ.
49. హరిశ్చంద్రచరిత్రము - గౌరనకవి.
50. హరిశ్చంద్రచరిత్రము - కంచి వీరశరభకవి.
51. హరిశ్చంద్రోపాఖ్యానము - శంకరకవి.
52. హరిశ్చంద్రనలోపాఖ్యానము - పీఠిక - శ్రీవజ్ఝల చినసీతారామశాస్త్రిగారు.
53. శ్రీదత్తభాగవతము - శ్రీ తాదేపల్లి రాఘవనారాయణశాస్త్రి.
54. ఆంధ్రపత్రిక - ఉగాదిసంచిక (క్రోధినామ సం.)
55. తెలుఁగులో ఛందోరీతులు - డా. గిడుగు సీతాపతిగారు.


**హిందీ గ్రంథములు :**


1. పురాణతత్త్వమీమాంస్ - శ్రీకృష్ణమణి త్రిపాఠీ.
2. మార్కండేయపురాణ్ ఏక్ సాంస్కృతిక్ అధ్యయన్ - డాక్టర్ వాసుదేవశరణ్ అగర్వాల్.


**ఆంగ్లగ్రంథములు :**


1. An outline of the Religious Literature of India — Farquhar.
2. From Virgil to Milton.—C. M. Bowra.
3. History of Dharma Sastra.—Dr. P. V. Kane.

4. Lectures on Rhetoric — Hugh Blair, D. D. Condensed by Grenville Kleiser.
5. Myth in Primitive Psychology — Malinowski.
6. Markandeya Purana (English Translation) — Introduction — F. G. Pargiter.
7. Studies in Puranic Records on Hindu Rites and Customs — Dr. R. C. Hazra.
8. Studies in Epics and Puranas of India — A. D. Pusalkar.
9. Studies in Upapuranas — Dr. R. C. Hazra.
10. The Classic Myth — C. M. Gayley.
11. The Epic — L. Eber Crombe.
12. The Matsya Purana — A Study - Prof. V. R. Ramachandra Diskshitar.
13. The outlines of Mythology — Lewis Spence.
14. The Vishnu Purana - (A System of Hindu Mythology and Tradition) — Prof. H. H. Wilson.
15. Opte's -- Sanskrit - English Dictionary.

**అనుషక్త గ్రంథ సూచిక :**

1. నన్నయ్యగారి ప్రసన్నకథాకలితార్థయుక్తి—శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు.
2. ఆంధ్రభారత కవితా విమర్శనము—శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు.
3. భారతము - తిక్కనరచన—శ్రీ భూపతి లక్ష్మీనారాయణగారు.
4. తిక్కన—డా. కేతవరపు రామకోటిశాస్త్రిగారు.
5. తెలుగుభాషలో ఛందోరీతులు—శ్రీ రావూరి దొరస్వామిగారు.
6. ఆంధ్రభాషావికాసము—ఆచార్య శ్రీ గంటి జోగి సోమయాజిగారు.
7. దర్శనములు—డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారు.
8. మనుచరిత్రహృదయావిష్కరణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు.
9. కవిత్రయకవితారీతులు —శ్రీమతి దేవరాజు భారతీదేవిగారు.
10. ఆంధ్రవాఙ్మయసూచి —శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు.
11. ఆంధ్రవచనవాఙ్మయము—శ్రీ నిడదవోలు వేంకటరావుగారు.
12. ఆంధ్రవిజ్ఞానసర్వస్వము - ప్రథమభాగము—శ్రీ శిలప్ప రామకృష్ణశాస్త్రిగారు.
13. మదరాసు, తిరుపతి, తంజాపురప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార గ్రంథసూచికలు.
14. Ancient Historical Tradition - F. G. Pargiter.
15. Hinduism through the ages - D. S Sarma.
16. Cultural History from the Vayu Purana - D. K. R. Patil.
17. Some Mythicnl elements in English Literature - E. M. W. Tilliard.
18. Telugu Version of Puranas, (Essay) -- Dr. K. V. Ramakoti Sastri (Purana Vol. IV No. 2)
19. Encyclopaedia Britanica.
20. The Sense of Beauty - George Santayana.

# అనుబంధము

## సంస్కృతాంధ్ర మార్కండేయపురాణములు

## అనువర్తితాంశ సూచిక

| వరుస సం. | విషయసూచిక | | [illegible] ప్రతి | [illegible] ప్రతి | మారన ఆశ్వా. | మార్కం. పద్యాలు |
|---|---|---|---|---|---|---|
| 1. | వపుశ్శాపకథనము | అధ్యా. | 1 | 1 | 1 | 1– 30 |
| 2. | పక్షోత్పత్తికథనము | | 2 | 2 | 1 | 31– 51 |
| 3. | ధర్మపక్షులవింధ్యప్రాప్తి కథనము | | 3 | 3 | 1 | 52– 87 |
| 4. | చతుర్వ్యూహావతారము | | 4 | 4 | 1 | 88–116 |
| 5. | ఇంద్రవిక్రియ | | 5 | 5 | 1 | 117–1[illegible] |
| 6. | బలదేవబ్రహ్మహత్యాకథనము | | 6 | 6 | 1 | 1[illegible]–141 |
| 7. | ద్రౌపదేయోత్పత్తికథనము | | 7 | 7 | 1 | 142–157 |
| 8. | హరిశ్చంద్రోపాఖ్యానము | | 8 | 8 | 1 | 158–255 |
| 9. | ఆడిబకయుద్ధకథనము | | 9 | 9 | 2 | 1– 21 |
| 10. | జడోపాఖ్యానము – మృత్యుదశావర్ణనము | | 10 | 10 | 2 | 22– 51 |
| 11. | గర్భస్థితివర్ణనము | | 11 | 11 | 2 | 52– 62 |
| 12. | మహారౌరవాదినరకాఖ్యానకథనము | | 12 | 12 | 2 | 63– 72 |
| 13. | కర్మవిపాకవర్ణనము | | 13;14 | 13 | 2 | 73–111 |
| 14. | నరకస్థోద్ధారవర్ణనము | | 15 | 14 | 2 | 112–143 |
| 15. | దత్తాత్రేయమాహాత్మ్యవర్ణనము | | 16;17 | 15;16;17 | 2 | 144–253 |
| 16. | కువలయాశ్వచరిత్రము | | 18–22 | 18–22 | 2<br>3 | 254–342<br>1– 97 |
| 17. | మదాలసోపాఖ్యానము | | 23–33 | 23–31 | 3 | 97–175 |
| | (1) ప్రవృత్తిమార్గానుశాసనము | | (23) | (23) | | (97–126) |
| | (2) రాజనీతి | | (24) | (24) | | (127–140) |
| | (3) వర్ణాశ్రమధర్మములు | | (25) | (25) | | (141–150) |
| | (4) గృహస్థాశ్రమధర్మములు | | (26) | (26) | | (151–169) |
| | (5) నిత్యనైమిత్తికశ్రాద్ధకల్పము | | (27) | (27) | | (170–175) |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | (6) శ్రాద్ధవిధి | అధ్యా. (28-30) | (28-30) | 3 | (176-220) |
| | (7) సదాచారవర్ణనము | (31) | (31) | | (220-252) |
| | (8) ధర్మాధర్మనిరూపణము | (32-33) | (31) | | (253-273) |
| 18. | దత్తాత్రేయాలర్కసంవాదము | 34-41 | 32-39 | 3 | 274-392 |
| | (1) యోగనిరూపణము | (36) | (34) | | (309-313) |
| | (2) యోగసిద్ధి | (37) | (35) | | (314-334) |
| | (3) యోగిచర్య | (38) | (36) | | (335-341) |
| | (4) ఓంకారవర్ణనము | (39) | (37) | | (342-351) |
| | (5) అలర్కనిర్వేదము | (40-41) | (38-39) | | (358-392) |
| 19. | బ్రహ్మోత్పత్తి | 42 | 40 | 4 | 1- 17 |
| 20. | బ్రహ్మాయుఃప్రమాణము | 43 | 41 | 4 | 18- 24 |
| 21. | ప్రాకృతవైకృతసర్గవర్ణనము | 44 | 42 | 4 | 25 |
| 22. | సృష్టిప్రకరణము | 45;46 | 43;44 | 4 | 26- 64 |
| 23. | యక్ష్మానుశాసనము | 47 | 46 | | |
| 24. | దుస్సహసంతతికథనము | 48 | 46 | 4 | 65-108 |
| 25. | రుద్రసర్గకథనము | 49 | 47 | 4 | 109-120 |
| 26. | భువనకోశము - స్వాయంభువమన్వంతరము | 50 | 48 | 4 | 121-130 |
| 27. | భువనకోశము - జంబూద్వీపాదివర్ణనము | 51-52 | 49-50 | 4 | 131-158 |
| 28. | గంగావతరణవర్ణనము | 53 | 51 | 4 | 159-168 |
| 29. | భారతవర్షాదివర్ణనము | 54 | 52 | 4 | 169-182 |
| 30. | భారతీయకూర్మనివేశము | 55 | 53 | 4 | 183-192 |
| 31. | భద్రాశ్వాది వర్ణనము | 56 | 54 | 4 | 193-202 |
| 32. | కింపురుషవర్షాది వర్ణనము | 57 | 55 | 4 | 203-210 |
| 33. | స్వారోచిషమనుసంభవము | 58-64 | 56-62 | 4<br>5 | 211-254<br>1-105 |
| | (a) ప్రవరరూథినీ సంవాదము | (58) | (56) | (4) | (211-254) |
| | (b) కలిపరూథినీ సంవాదము | (59) | (57) | (5) | (1- 23) |
| | (c) మనోరమా పరిణయము | (60) | (58) | | (24- 54) |
| | (d) విభావరీకలావతీ పరిణయము | (61) | (59) | | (55- 69) |
| | (e) హంసి - చక్రవాకి సంవాదము | (62) | (60) | | (70- 80) |
| | (f) స్వారోచి విరాగియై తపోవనమున చేరుట | (63) | (61) | | (81-103) |

| | | | | |
|---|---|---|---|---|
| (g) మన్వంతర దేవేంద్రాదికథనము | (64) | (62) | 5 | (103-105) |
| 34. నిధివర్ణనము | 65 | 63 | 5 | 106-122 |
| 35. ఉత్తమమన్వంతరము (3వ మనువు) | 66-70 | 64-68 | 5 | 123-222 |
| 36. తామస ,, (4 ,, ) | 71 | 69 | 5 | 223-257 |
| 37. రైవత ,, (5 ,, ) | 72 | 70 | 5 | 258-297 |
| 38. చాక్షుష ,, (6 ,, ) | 73 | 71 | 5 | 298-327 |
| 39. వైవస్వత ,, (7 ,, ) | 74-76 | 72-74 | 5 | 328-367 |
| 40. సావర్ణిమన్వంతరము (8 ,, ) | 77-90 | 75-99 | 5<br>6<br>7 | 367-372<br>1-264<br>1-7 |
| (1) దేవేంద్రాదికథనము | (77) | (75) | 5 | (367-372) |
| (2) దేవీమాహాత్మ్యము | (78-90) | (76-99) | 6<br>7 | (1-264)<br>(1-7) |
| 41. రౌచ్యమన్వంతర వర్ణనము | 91- 95 | 100-102 | 7 | 7-43 |
| 42. భౌత్యమన్వంతర వర్ణనము | 96- 97 | 103-104 | 7 | 44-68 |
| 43. వంశానువర్ణనము | 98-133 | 105-138 | 7-8 | 2 ఆశ్వా. |
| ( 1) దక్షసృష్ట్యాదికథనము | అధ్యా. 98 | 105 | 7 | 69- 75 |
| ( 2) వేదోత్పత్తి | 99 | 106 | 7 | 76- 78 |
| ( 3) ఆదిత్యస్తవము;దివాకరస్తుతి | 100-101 | 107 | 7 | 79-101 |
| ( 4) మార్తాండోత్పత్తి | 102 | 108 | 7 | 102-114 |
| ( 5) భానుతేజశ్శాతనము | 103 | 109 | 7 | 115-119 |
| ( 6) విశ్వకర్మ వివస్వద్వినుతి | 104 | 110 | 7 | 120-126 |
| ( 7) రవిమాహాత్మ్యవర్ణనము. | 105 | 111 | 7 | 127-155 |
| ( 8) భాను స్తవము, భానుమాహాత్మ్యము | 106-107 | 112-113 | 7 | 156-183 |
| ( 9) వైవస్వతమనుతనయాది కథనము | 108 | 114 | 7 | 184-192 |
| (10) వృషధ్రోపాఖ్యానము | 109 | 115 | 7 | 193-204 |
| (11) నాభాగచరిత్రము | 110-112 | 116-118 | 7 | 205-266 |
| (12) వత్సంధ్రచరిత్రము | 113 | 119 | 7 | 267-288 |
| (13) ఖనిత్ర చరిత్రము | 114-115 | 120-121 | 8 | 1- 49 |
| (14) వివింశ చరిత్రము | 116-117 | 122-123 | 8 | 50- 80 |
| (15) కరంధమ చరిత్రము | 118 | 124 | 8 | 81- [illegible] |
| (16) అవేక్షిచ్చరిత్రము | 119-124 | 125-131 | 8 | 92-1[illegible] |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | (17) మరుత్తచరిత్రము | 125-128 | 132-134 | 8 | 198-279 |
| | (18) నరిష్యంతచరిత్రము | 129 | 135 | | వదలఁబడినది |
| | (19) దమచరిత్రము | 130-133 | 136-138 | | ,, |
| 44. | మార్కండేయపురాణమాహాత్మ్యము | 133 | 139 | 8 | 280-287 |

1. బొంబాయి ప్రతి — "వేంకటేశ్వర ప్రెస్" బొంబాయి యందు నాగరలిపిలో వ్యాఖ్యా (హిందీ) సహితముగా ముద్రితము.
2. మదరాసు ప్రతి — తరంగిణీ ముద్రాక్షరశాల — మదరాసులో నాంధ్రలిపి యందు ముద్రితము.
3. మార్కండేయపురాణము - మారనకవి - వావిళ్లవారి ప్రతి.

*

**ప్రకటితసంస్కృత మార్కండేయపురాణప్రతులు :**

1. కలకత్తాలోని సరస్వతీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది - నాగరలిపి ప్రతి - జీవానంద విద్యాసాగరభట్టాచార్యులు దీని సంపాదకులు. (క్రీ.శ. 1879)
2. బొంబాయి వేంకటేశ్వరప్రెస్‌లో మూలపాఠముతో ముద్రితము.
3. బొంబాయి వేంకటేశ్వరప్రెస్‌లో కన్హయ్యాలాల్‌మిశ్రా హిందీ తాత్పర్యసహితముగా నాగరలిపిలో ముద్రితమైనది.
4. లక్నోలో రఘురాజ్ దూబే టీకతో వెలువడినప్రతి.
5. Bibliotheca Indica లో ప్రచురితమైన K. M. బెనర్జీప్రతి.
6. ఏషియాటిక్ సొసైటీ-కలకత్తావారిపక్షమున బిబ్లియోథికా ఇండికాలో 1904సం.న ప్రకటితమైన F.G. పర్గిటర్ ఆంగ్లానువాదము.
7. మద్రాసు తరంగిణీముద్రాక్షరశాలయందు ముంజూర్పట్టు రామచంద్రశాస్త్రి, ములుకుట్ల విశ్వనాథశాస్త్రిగారలచే సంపాదింపఁబడి 1876 లో తెలుఁగులిపిలో ముద్రితమైనప్రతి.
8. యం. యన్. దత్తా ఆంగ్లేయానువాదప్రతి.

పైసంస్కృతప్రతులలో 1, 3, 7, 6 సంఖ్యలుగల వాని నీసిద్ధాంత వ్యాసమున నుపయోగించుట జరిగినది. మిగిలినవి లభింపలేదు.

## మారన మార్కండేయపురాణము – ఛందస్సూచిక

| ఆశ్వాసము | ఉత్పలమాల | చంపకమాల | శార్దూలము | మత్తేభము | సీసము | సీసము/ఆ. వె. | సీసము/తే.గీ. | తేటగీతి | ఆటవెలది | కందము | వచనము | కవిరాజ విరాజితము | మానిని | మహాస్రగ్ధర | మత్తకోకిల | మాలిని | ఉత్సాహ | తరువోజ | స్రగ్ధర | తరల | స్రగ్విణి | ఉపజాతి | దండకము | లయగ్రాహి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమ | 15 | 23 | 3 | 13 | 22 | 3 | 19 | 47 | 13 | 80 | 63 | 1 | 1 | 1 | 1 | 2 | 2 | 1 | — | — | — | — | — | — |
| ద్వితీయ | 14 | 35 | 10 | 10 | 31 | 8 | 23 | 38 | 22 | 84 | 92 | — | 1 | — | — | 2 | 1 | — | 1 | 4 | — | — | — | — |
| తృతీయ | 21 | 31 | 6 | 11 | 36 | 8 | 28 | 51 | 21 | 119 | 104 | — | 1 | 1 | — | 1 | — | 1 | — | — | 1 | — | — | — |
| చతుర్థ | 12 | 18 | 2 | 4 | 21 | 5 | 16 | 40 | 10 | 78 | 71 | — | — | — | — | 1 | — | — | — | — | — | — | — | — |
| పంచమ | 16 | 30 | 1 | 4 | 26 | 9 | 17 | 57 | 30 | 108 | 99 | — | — | — | — | 2 | — | — | — | — | 1 | 1 | — | — |
| షష్ఠ | 21 | 16 | 6 | 13 | 27 | 6 | 21 | 32 | 11 | 77 | 55 | — | — | 1 | 1 | 2 | — | — | — | — | — | — | 1 | 1 |
| సప్తమ | 18 | 25 | 5 | 8 | 27 | 7 | 20 | 29 | 23 | 73 | 75 | — | — | 2 | — | 1 | — | — | 1 | — | — | — | — | — |
| అష్టమ | 12 | 28 | 3 | 10 | 18 | 5 | 13 | 28 | 23 | 97 | 68 | — | — | 1 | — | 1 | — | — | 1 | — | — | — | — | — |
| [illegible] | 5 | 5 | 4 | 6 | 5 | 5 | — | 3 | 1 | 9 | 8 | — | — | — | — | — | — | — | — | — | — | — | — | — |
| | [illegible] | 211 | 40 | 79 | 213 | 56 | 157 | 325 | 154 | 725 | 635 | 1 | 3 | 6 | 2 | 12 | 3 | 2 | 3 | 4 | 2 | 1 | 1 | 1 |

# మారన రచించిన తేటగీతి పద్యభేదములు

| తే. గీ. భేదములు | 1 ఆశ్వా. | 2 ఆశ్వా. | 3 ఆశ్వా. | 4 ఆశ్వా. | 5 ఆశ్వా. | 6 ఆశ్వా. | 7 ఆశ్వా. | 8 ఆశ్వా. | పీఠిక | | సంఖ్య | విభాగ స్థానము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 22 | 16 | 19 | 15 | 29 | 10 | 8 | 17 | 2 | = | 128 | I |
| 2 | | | 1 | | | | | | | = | 1 | XIV |
| 3 | | | | 1 | 4 | | | | | = | 5 | X |
| 4 | 2 | | 1 | 2 | 1 | | 1 | 1 | | = | 8 | VII |
| 5 | 3 | | | 1 | | | 2 | | | = | 6 | IX |
| 6 | | 3 | 1 | 2 | 2 | | 2 | | | = | 10 | VI |
| 7 | | 1 | 2 | | | 1 | 1 | 1 | 1 | = | 7 | VIII |
| 8 | | | 2 | | 2 | 2 | | 1 | | = | 7 | VIII |
| 9 | 2 | 1 | 3 | 2 | 3 | 3 | | 2 | | = | 16 | V |
| 10 | 1 | 3 | 5 | 4 | 4 | 5 | 2 | 2 | | = | 26 | II |
| 11 | 4 | 2 | 7 | 1 | 4 | 1 | 3 | | | = | 22 | III |
| 12 | 2 | 2 | 5 | 3 | 2 | | 5 | 2 | | = | 21 | IV |
| 13 | 2 | 2 | | | | | | | | = | 4 | XI |
| 14 | | 1 | | | | | | | | = | 1 | XIV |
| 15 | | 1 | | | | | | | | = | 1 | XIV |
| 16 | | 1 | | | | | | | | = | 1 | XIV |
| $\frac{1}{2}$ | | | 1 | | | | | | | = | 1 | XIV |
| $\frac{1}{4}$ | | | | | | 1 | | | | = | 1 | XIV |
| $\frac{1}{5}$ | 1 | | | | | | | | | = | 1 | XIV |
| $\frac{1}{6}$ | 1 | | | | | | 1 | | | = | 2 | XIII |
| $\frac{1}{8}$ | | | | | 1 | | | | | = | 1 | XIV |
| $\frac{1}{9}$ | 2 | 1 | 1 | 2 | | 1 | | | | = | 7 | VIII |
| $\frac{1}{10}$ | | | 1 | 1 | | 2 | 1 | | | = | 5 | X |
| $\frac{1}{11}$ | 1 | | 1 | 1 | 1 | | | | | = | 4 | XI |

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | పీ. | | మొ. | విభా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| $\frac{1}{12}$ | 2 | | | 2 | 2 | | 2 | | | = | 8 | VII |
| $\frac{1}{7}$ | | | | | | | 1 | | | = | 1 | XIV |
| $\frac{3}{9}$ | | 1 | | | | | | | | = | 1 | ,, |
| $\frac{3}{10}$ | | 1 | | | | | | | | = | 1 | ,, |
| $\frac{3}{11}$ | | 1 | | 2 | | 1 | | | | = | 4 | XI |
| $\frac{4}{12}$ | | | | | | | 1 | | | = | 1 | XIV |
| $\frac{4}{15}$ | | | | | 1 | | | | | = | 1 | ,, |
| $\frac{5}{9}$ | | | 1 | | 1 | 1 | | | | = | 3 | XII |
| $\frac{5}{10}$ | | 1 | | | 1 | | | | | = | 1 | XIV |
| $\frac{6}{12}$ | | | | | | | | 1 | | = | 2 | XIII |
| $\frac{8}{12}$ | | | | | 1 | | | | | = | 1 | XIV |
| $\frac{8}{11}$ | | | | | | 1 | | | | = | 1 | ,, |
| $\frac{8}{16}$ | | | | | | 1 | | | | = | 1 | ,, |
| $\frac{7}{14}$ | 1 | | | | | | | | | = | 1 | ,, |
| $\frac{9}{3}$ | | | | | | 1 | | | | = | 1 | ,, |
| $\frac{10}{8}$ | | | | | 1 | | 1 | | | = | 2 | XIII |
| $\frac{11}{8}$ | 1 | | | | | | | | | = | 1 | XIV |

విశేషభేదములలో నిందుఁ బేర్కొనినవి కాక మిగిలిన విభాగములు సీసముల యెత్తుగీతలలోఁ గానఁబడుచున్నవి

## మారన రచించిన ఆటవెలఁదులు

| ఆ.వె. భేదములు | పీఠిక | 1 ఆశ్వా. | 2 ఆశ్వా. | 3 ఆశ్వా. | 4 ఆశ్వా. | 5 ఆశ్వా. | 6 ఆశ్వా. | 7 ఆశ్వా. | 8 ఆశ్వా. | | మొత్తము | విభాగము స్థానము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 6 | 7 | 6 | 4 | 14 | 3 | 15 | 14 | = | 70 | I |
| 2 | | | | | | | | | | = | 0 | — |
| 3 | | | 1 | | 1 | | | | | = | 2 | X |
| 4 | | | 1 | 1 | | 2 | 1 | | | = | [illegible] | VII |
| 5 | | | 1 | 2 | | 1 | | | | = | 4 | VIII |
| 6 | | 1 | | 1 | | | 1 | | | = | 3 | IX |
| 7 | | | 2 | | | | 1 | 3 | 1 | = | 7 | V |

| వీ. | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | | మొ. | విభా. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 8 | | 1 | | | | | | 1 | = | 2 | X |
| 9 | | 1 | 1 | | 3 | | | 1 | = | 6 | VI |
| 10 | 1 | 3 | 2 | | 2 | 1 | | | = | 9 | III |
| 11 | 4 | 1 | 1 | | 1 | | 2 | 1 | = | 10 | II |
| 12 | | | 2 | 1 | 1 | | 1 | 3 | = | 8 | IV |
| 13 | | | | 1 | | | | | = | 1 | XI |
| 14 | | | | | | 1 | | | = | 1 | ,, |
| 15 | | 1 | | | 1 | | 1 | | = | 3 | IX |
| 16 | | | 1 | | | | | | = | 1 | XI |
| $\frac{1}{4}$ | | | 1 | 1 | | | | | = | 2 | X |
| $\frac{1}{9}$ | | 1 | | | | | | | = | 1 | XI |
| $\frac{1}{10}$ | | | | 1 | 1 | | 1 | | = | 3 | IX |
| $\frac{1}{11}$ | | | | | | 1 | | | = | 1 | XI |
| $\frac{1}{12}$ | | 1 | | | | | | 1 | = | 2 | X |
| $\frac{4}{12}$ | | | 1 | | | | | | = | 1 | XI |
| $\frac{5}{9}$ | | 1 | | | | | | | = | 1 | XI |
| $\frac{5}{10}$ | | | 1 | | | | | | = | 1 | ,, |
| $\frac{6}{12}$ | | | | 1 | | | | | = | 1 | ,, |
| $\frac{7}{14}$ | | | 1 | | | | | | = | 1 | ,, |
| $\frac{9}{7}$ | 1 | | | | | | | | = | 1 | ,, |
| $\frac{10}{4}$ | | 1 | | | | | | | = | 1 | ,, |
| $\frac{12}{15}$ | | | | | 1 | | | | = | 1 | ,, |
| $\frac{4}{11}$ | | | | | 1 | | | | = | 1 | ,, |
| $\frac{3}{2}$ | | | | | | | | 1 | = | 1 | ,, |

# స్వారోచిష మనుసంభవకథ

## పురాణ - ప్రబంధ కథాకథనవిధానము

| సంస్కృతపురాణము | మారనఅనువాదము | పెద్దన మనుచరిత్రము |
|---|---|---|
| 1. ద్విజాతిప్రవరుని వర్ణనము. 3 శ్లో. (58. 5-7) | 1. ప్రవరాఖ్య వర్ణనము 2 ప. (4.213-214) | 1. నగరవర్ణనము (1); చాతుర్వర్ణ్యవర్ణనము (1) ప్రవరాఖ్యవర్ణనము (8) 10 ప. (1. 49-58) |
| 2. మంత్రౌషధిప్రభావజ్ఞుఁడైన ద్విజునితో విప్రుఁడు సంభాషించుట. 9 శ్లో. (58.8-16) | 2. ఔషధసిద్ధునితోఁ బ్రవరుఁడొనర్చిన సంభాషణము. 6 ప. (4.215-220) | 2. ఔషధసిద్ధునివర్ణనము (1); ప్రవరునకు నాతనికిఁ జరిగిన సంభాషణము (21) = 22 ప. (1. 59-80) |
| 3. విప్రుఁడు యోజనకాల పరిమాణము నెంచుట. శ్లో. (58. 17) | 3. — | 3. — |
| 4. — | 4. హిమవత్పర్వత వర్ణనము. 1 ప. (4.221) | 4. హిమనగవిశేషవర్ణనము 10 ప. (2. 3-12) |
| 5. పాదలేపము కరఁగుట. 2 శ్లో. (58. 18 - 19) | 5. పాదలేపము కరఁగిపోవుట. 1 ప. (4.222) | 5. పాదలేపము కరఁగిపోవుట 1 ప. (2.13) |
| 6. పాదలేపము కరఁగిన విషయము గమనింపక దర్శించినహిమనగవిశేషములు. 7 శ్లో. (58. 20 - 26) | 6. పాదలేపము కరఁగిన విషయము తెలియక ప్రవరుఁడు దర్శించిన హిమనగవిశేషములు 2 ప. (4.223-224) | 6 — |
| 7. ఔషధహీనుఁడై విప్రుఁడు విచారించుట. 3 శ్లో. (58. 27 - 29) | 7. ఔషధవిహీనుఁడైన ప్రవరుఁడు దుఃఖించుట. 4 ప. (4.225-228) | 7. ఔషధహీనుఁడైన ప్రవరుఁడు దుఃఖించుట. 5 ప. (2. 14-18) |

| | | |
|---|---|---|
| 8. వంత(జెందుచు( గాంచిన హిమగిరి సుందరదృశ్యములు 5 శ్లో. (58. 30-34) | 8. — | 8. వంత(గూరుచు( బ్రవరు(డు కాంచిన యొక కోన వర్ణనము-(1), వరూథినీ నివాసమును బ్రవరు(డు సమీపించుట (4)=5 ప. (2. 19-23) |
| 9. వరూథిని విప్రుని( గాంచుట 2 శ్లో. (58.35-36) | 9. ప్రవరుని( గాంచిన వరూథినివర్ణనము. 1ప. (4.229) | 9. ప్రవరు(డు వరూథినిని గాంచుట-వరుథినీవర్ణనము. 4 ప. (2. 24-27) వరూథినీ సాత్త్వికభావాదివర్ణ 7 ప. (2. 28-34) |
| 10. విప్రునియందము( గాంచి యబ్బుర పడి, వలపుగొనుట. 5 శ్లో. (88. 37-41) | 10. ప్రవరుని సౌందర్యము( గాంచి యబ్బురపాటు నొంది వలపుతో వితర్కించుకొనుట. 4 ప. (4.230-233) | 10. వరూథిని ప్రవరుని యందచందముల కచ్చెరువంది లోన వితర్కించుకొనుట. 3 ప. (2. 35-37) |
| 11. వరూథిని విప్రునకు( దనను( గన( బఱచుకొనుట- 1 శ్లో. (58.42) | 11. వరూథిని ప్రవరునిముందు నిలుచుట. 1 ప. (4.234) | 11. వరూథిని ప్రవరుని కడ్డము నిల్చుట. 1ప. (2. 38) |
| 12. వరూథినీ విప్రుల సంభాషణ I - 17 శ్లో. (58.43-59) | 12. వరూథినీ ప్రవరుల సంభాషణము I. 7ప. (4.235-241) | 12 వరూథినీప్రవరుల సంభాషణము i. 28 ప. (2. 39-66) |
| 13. వరూథిని విప్రుని( గౌ(గిలించుకొనుట. 1 శ్లో. (58.60) | 13. వరూథిని ప్రవరుని( గౌ(గిలించుట. 1 ప. (4.241-242) | 13. వరూథిని ప్రవరుని( గౌ(గిలించుట 2 ప. (2. 67-68) |
| 14. విప్రు(డు వరూథినిని వారించి, సమాధానము చెప్పుట. 5 శ్లో. (58. 61-65) | 14. ప్రవరు(డు వరూథినిని వారించి సమాధానము చెప్పుట, 2 ప. (4.243-244) | 14. ప్రవరు(డు 'శ్రీహరీ' యని వరూథినియంసద్వయం బంటి పొమ్మంచుం ద్రోచి, మరి మాట్లాడకుండుట. ఈయంశమున నున్న మూలవాక్యములు 12 వ అంశముననే గతార్థములైనవి. |
| 15. వరూథిని విప్రునిదయాభిక్ష నభ్యర్థించుట. విప్రునిసమాధానము. 8శ్లో. (58. 66 - 73) | 15. వరూథిని ప్రవరుని దయాభిక్ష నభ్యర్థించుట. 7 ప. (4.245-251) | 15. వరూథిని ప్రవరుని దయాభిక్షను గోరుట. 5 ప. (2.69-73) |

| | | |
|---|---|---|
| 16 విప్రుఁడు గార్హపత్యాగ్నిని స్తుతించి యతనిదయవలన నిజగృహమున కరుగుట. 12శ్లో. (58. 74 - 79; 59. 1 - 6) | 16. ప్రవరుఁడు గార్హపత్యాగ్ని నుపాసించి తత్ప్రసాదమున గృహమున కేగుట. 3ప. (4.252-254) | 16. ప్రవరుఁడు గార్హపత్యాగ్నిని స్తుతించి, తద్దత్తమైన హయము నధిరోహించి యింటి కేగుట. 4 ప. (2. 74-77) |
| 17. వరూథినీవిరహము. 7శ్లో. (59. 7 - 13) | 17. వరూథినీ విరహము. 7ప.(5.3-9) | 17. వరూథినీ విరహవర్ణనము. 64 ప. (3. 3-66) |
| 18. గంధర్వుఁడు (కలి) విప్రునివేషమున నుద్యానవనమున విహరించుట. 9శ్లో. (59. 14 - 22) | 18. కలి యను గంధర్వకుమారుఁడు ప్రవరరూపము దాల్చి యుద్యానవనమున విహరించుట. 3ప. (5. 10-12) | 18. గంధర్వకుమారుఁడు ప్రవరునిరూపము ధరించి యుద్యానవనమున విహరించుట 5 ప. (3.67-71) |
| 19. వరూథిని కపటవిప్రుని నొడంబఱచుట 9శ్లో. (59. 23 - 31) | 19. మాయాప్రవరుని వరూథిని యొడంబఱచుట. 5ప. (5.13-17) | 19. వరూథిని చెలులతోఁగూడి వనమున విహరించుట 16, వరూథినీ మాయాప్రవరుల సంభాషణము; అతని నామె యొప్పించుట (23)=39. (3.72-110) |
| 20. వరూథినిగర్భముదాల్చుట, మాయావిప్రుఁ డరుగుట. 5శ్లో. (60. 1-5) | 20. వరూథిని గర్భవతియగుట; మాయాప్రవరుఁ డరుగుట. 4 ప. (5.19-21) | 20. వరూథిని గర్భవతి యగుట; మాయాప్రవరుఁ డరుగుట 31 ప. (3. 111-140; 4.3) |
| 21. స్వారోచిజననాభ్యుదయములు 4శ్లో. (60. 6 - 9) | 21. స్వారోచి జననాభ్యుదయములు. 2ప. (5.22-23) | 21. స్వారోచి జన్మించి, వీరుఁడై, మందరపర్వతమున నొక నగరమును నిర్మించుకొని యుండుట. 7 ప. (4. 4-10) |
| 22. స్వారోచి వేట కేగి భయాతురయైన మనోరమం గాంచుట 2శ్లో. (60. 10 - 11) | 22. స్వారోచి వేట కేగి భయాతురయైన మనోరమం గాంచుట. 1ప. (5.24) | 22. స్వారోచి వేటవర్ణనము (55 ప.) మనోరమం గాంచుట (4)=59 ప. (4. 11-69) |

| | | |
|---|---|---|
| 23. మనోరమా శాపవృత్తాంతము అస్త్రహృదయవిద్యాదానము. 18 శ్లో. (60. 12 - 29) | 23. మనోరమాశాపవృత్తాంతము అస్త్రహృదయవిద్యాదానము. 8 ప. (5.25-32) | 23. మనోరమాశాపవృత్తాంతము – అస్త్రహృదయ విద్యాప్రదానము. 25 ప. (4. 70-94) |
| 24. స్వరోచి యిందీవరాక్షునితోఁ బోరుట. 6 శ్లో. (60. 30 - 35) | 24. స్వరోచి యిందీవరాక్షునితోఁ బోరుట. 4 ప. (5.33-36) | 24. స్వరోచి యిందీవరాక్షునితోఁ బోరుట 22 ప. (4. 95-116) |
| 25. — | 25. — | 25. ఇందీవరాక్షుఁడు నిజరూపము దాల్చుట 2 ప. (4. 117-118) |
| 26. ఇందీవరాక్షుని శాపవృత్తాంతము. 18శ్లో. (60. 36 - 53) | 26. ఇందీవరాక్షుని శాపవృత్తాంతము. 11 ప. (5.37-47) | 26. ఇందీవరాక్షుని శాపవృత్తాంతము 25 ప. (5.3-27) |
| 27. ఇందీవరాక్షుఁడు నిజరూపము దాల్చుట. 1శ్లో. (60. 54) | 27. ఇందీవరాక్షుఁడు నిజరూపము తాల్చుట. 1 ప. (5.48) | 27. (దీనిని 25వ అంశమున చెప్పెను) — |
| 28. మనోరమచెలుల నారోగ్యవతుల నొనర్ప స్వరోచి ప్రతినబట్టుట 6 శ్లో. (60. 55 - 60) | 28. మనోరమ చెలులను ఆరోగ్యవతుల నొనర్ప ప్రతినపట్టుట. 4 ప. (5.49-52) | 28. — |
| 29. స్వరోచిమనోరమల వివాహము. 2 శ్లో. (60. 61 - 62) | 29. స్వరోచి మనోరమల వివాహము. 2 ప. (5.53-54) | 29. మనోరమాస్వరోచుల వివాహము 76 ప. (5. 28-103) |
| 30. — | 30. — | 30. మనోరమ స్వరోచికి తన చెలుల విషయము చెప్పి వారి నారోగ్యవతుల నొనర్ప నాతనిచే వరముపడయుట 9 ప. (6. 3-12) |
| 31. విభావరి సర్వభూతభాష నెఱుంగు విద్యను స్వరోచి కిచ్చుట. 6 శ్లో. (60.63-65 ; 61.1-3) | 31. విభావరి సర్వభూతభాష నెఱుంగు విద్యను స్వరోచికి నొసంగుట. 2 ప. (5.55-56) | 31. విభావసి మృగపక్షి జాతులభాష నెఱుంగు విద్య నిచ్చుట. 6 ప. (6. 13-18) |

| | | |
|---|---|---|
| 32. కళావతి వృత్తాంతము. 14 శ్లో. (61. 4-17) | 32. కళావతికథ. 9 ప. (5.57-65) | 32. కళావతివృత్తాంతము. 40 ప. (6. 19-58) |
| 33. స్వరోచి కళావతీ విభావరులఁ బెండ్లియాడి, మువ్వురుభార్యలతో విహరించుట. 9 శ్లో. (61.18-19) (62.1-7) | 33. స్వరోచి కళావతీ విభావరుల పెండ్లాడుట-సతులతో విహరించుట. 4 ప. (5.66-69) | 33. స్వరోచి వారిరువురఁ బెండ్లాడుట - సతులతోఁ గలసి క్రీడించుట. 4 ప. (6. 59-62) |
| 34. కలహంసీ చక్రవాకుల సంవాదము 15 శ్లో. (62. 8-23) | 34. కలహంసీ చక్రవాకుల సంవాదము. 11ప. (5.70-80) | 34. కలహంసీచక్రవాకుల సంభాషణము. 14 ప. (6. 63-76) |
| 35. మృగీమృగసంవాదము. 6 శ్లో (62. 24-29) | 35. మృగీమృగసంవాదము. 5 ప. (5.81-85) | 35. మృగీమృగ సంవాదము 7 ప. (6. 77-83) |
| 36. స్వరోచి పుత్త్రుల బడసి వారికి వేర్వేరు నగరముల నిర్మించి యిచ్చుట. 11 శ్లో. (63. 1-11) | 36. స్వరోచి పుత్త్రులకు నగరములను గట్టించి యిచ్చుట. 1 వచ. (5.86) | 36. స్వరోచి స్వీయపుత్త్రులకు నగరములఁ గట్టించి యిచ్చుట. 1వ (6.84) |
| 37. స్వరోచివనదేవతలకు స్వారోచిషుఁడు పుట్టుట. 19 శ్లో. (63. 12-30) | 37. స్వారోచిష సంభవము. 10 ప. (5.87-96) | 37. స్వారోచిషసంభవము 16 ప. (6. 85-100) |
| 38. హంసమిధున సంవాదము. 12 శ్లో (63. 31-42). | 38. హంసమిధున సంవాదము. 6 ప. (5.97-102) | 38. — |
| 39. — | 39. — | 39. స్వారోచిషుఁడు విష్ణుప్రసాదమున మనుత్వము వడయుట. 18 ప. (6. 101-118) |
| 40. స్వారోచిషుఁడు మనువగుట. 2 శ్లో (64. 1-2) | 40. స్వారోచిషుఁడు మనువగుట. 1 ప. (5.103) | 40. స్వారోచిషుఁడు మను వగుట 2 ప. (6. 119-120) |
| 41. ఫలశ్రుతి. 1 శ్లో (64.7) | 41. ఫలశ్రుతి 1 ప. (5.105) | 41. ఫలశ్రుతి 1 ప. (6. 121) |

## స్వారోచిష మనుసంభవము - శ్లోక - పద్య సంఖ్యావివరణము

| అంశము | సంస్కృ. పురా. శ్లోక. | మారన. పద్య. గద్య. | పెద్దన పద్య. గద్య. |
| --- | --- | --- | --- |
| 1. ప్రవరుని కథ | 81 | 42 | 107 |
| 2. మాయాప్రవరుని కథ | 30 | 19 | 139 |
| 3. స్వరోచి వృత్తాంతము | 150 | 82 | 303 |
| 4. స్వారోచిష మనుచరిత్రము | 2 | 1 | 20 |
| 5. ఫలశ్రుతి | 1 | 1 | 1 |
| మొత్తము | 264 | 145 | 570 |

**ఆంధ్రమార్కండేయపురాణ ముద్రిత ప్రతులు :**

1. సరస్వతీపత్రికాముఖమున రాజమహేంద్రవరపుర బోధనకళాశాలా సంస్కృతోపాధ్యాయుఁ డగు ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారిచే పరిష్కృతమై ప్రచురితమైనది. (క్రీ. శ. 1900)
2. కందుకూరి వీరేశలింగము పంతులుగారు పరిష్కరించినది. క్రీ. శ. 1903 లో చెన్నపురి శ్రీచింతామణిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి ప్రచురింపఁబడినది.
3. చెన్నపురి - వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రచురింపఁబడిన ప్రతి. పరిష్కర్తలు శేషాద్రిరమణకవులు-శతావధానులు. వీరు 1927 లో పరిష్కరించిన యీప్రతిని పైప్రచురణకర్తలు ఎట్టిమార్పులు లేకుండ ముమ్మారు ప్రకటించిరి. (ప్రథమముద్రణము 1927; ద్వితీయ ముద్రణము 1939; తృతీయ ముద్రణము : 1955.)

పైఆంధ్రప్రతులలో 3 వసంఖ్యగల ప్రతియే గ్రహింపఁబడినది. ఇం దుదాహరించిన అన్నిపద్యములును దానినుండి గ్రహించినవే.

# ముఖ్యమైన సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 29 | 24 | ఇతిహాసం | ఇతిహాసః |
| 32 | 32 | పరాకల్ప | పురాకల్ప |
| 33 | 15 | కావ్యచ్ఛాయాన్వయిని | కావ్యచ్ఛాయాన్వయి |
| 43 | 31 | నిరజ | నీరజ |
| 59 | 5 | దేవాతాస్తులెడనెడ | దేవతాస్తుతు లెడనెడ |
| 62 | 31 | కూరత్ని | కూర్మ |
| 75 | 8 | రాయబంబీవిమోచక | రాయబందీవిమోచక |
| 76 | 7 | శ్రీకంతాకుంతిక | శ్రీకంతాకుంతిత |
| 104 | 3 | ఋణప్రతాతా | ఋణప్రదాతా |
| 106 | 15 | సదసన్న | సదసన్నః |
| 112 | 29 | కర్తన్యో, మాపన్నా | కర్తవ్యో, మాపన్నాః |
| 115 | 8 | మవాప్స్యసి | మవాప్స్యతి |
| 119 | 14 | వర్ధిస్వేత్యాహ | వర్ధస్వేత్యాహ |
| 131 | 12 | సజ్ఝట్టభీషణే | సఝ్ఝట్టభీషణే |
| | 16 | చరత్వ | చరత్య |
| 834 | 11 | నైవ | నైవ |
| 141 | 12 | ఋతౌ | ఋతౌ |
| 143 | 4 | అనృశంస్య | ఆనృశంస్య |
| | 6 | ననసూయయుము,నాశంస్యము | నవసూయయును, నానృశంస్యము |
| | 8 | జనములకున్ | జనులకున్ |
| 171 | 28 | యౌవనః | యౌవనాః |
| 174 | 33 | స్నేవిత | స్నేవితః |
| 175 | 32 | ధర్మప్రవృత్తి | ధర్మఃప్రవృత్తి |
| 187 | 15 | మూలమందున్నక్లుప్తీకరించి | మూలముకన్నక్లుప్తీకరించి |
| 272 | 22,23 | అవేష్టిత | అవేక్షిత |
| 274 | 26 | తల్లి | భార్య |
| 372 | 21 | లోకనాథేవ | లోకనాథేన |
| 373 | 27 | శాంతరసముకు | శాంతరసమును |
| 376 | 16 | చతుర్వర్గ | చతుర్థపురుషార్థ |
| 381 | 14 | ప్రతీయతే | ప్రలీయతే |
| 389 | 28 | మమ్మటాచార్యుల | భామహాదుల |
| 439 | 7 | ప్రతిగృహం | ప్రతిగ్రహం |
| 454 | 16 | సంచిత్య | సంచింత్య |
| 541 | 31 | తతోపశ్య | తతోఽపశ్య |
| 542 | 2 | నిలోత్పల | నీలోత్పల |
| | 6 | సోమన్యత | సోఽమన్యత |

పరమోదార పురాణసారరచనా ప్రాగల్భ్య శిల్పార్థముల్
తరమే బ్రహ్మకు నైన వాకొనఁగ నాన్ ; దచ్ఛుద్ధి నా కబ్బునే ?
కరుణాపూర్ణకటాక్షు లౌ విబుధు లీ గ్రంథంబు నీక్షించుచో
పరమార్థంబు గ్రహించి దోషముల నైపంగోరి ప్రార్థించెదన్.